# విషయసూచిక

---

## ఆనుశాసనికపర్వము.

శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర

# వచనమహాభారతము

## ఆనుశాసనికపర్వము.

శ్లో. "నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్,
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయముదీరయేత్."

గౌతమీలుబ్ధకవ్యాళమృత్యుకాలసంవాదము

"ఓపితామహా! సూక్ష్మమైనదియు, బహువిధాకారములు గలదియు నగు శమప్రకార మెఱింగించితివి. ఇట్టివిధముగల దీనిని వినియు, నాహృదయమునకు శాంతి యలవడకున్నయది. ఈవిషయమున బహువిధములగు శాంతిమార్గము నీవు చెప్పక పోలేదు. కాని నీవెట్టి శమపద్ధతి బోధించినను నేను జేతులారఁ జేసికొన్నదానికి శాంతి యెట్లు గల్గెడిని? ఓవీరాగ్రణీ! శరాచితమై తీవ్రప్రణపీడితమగు నీశరీరమును గన్నులారఁ జూచి, నాచేసిన పాపకృత్యములను దలంచుకొనిన, నాకుఁ జిత్తస్వాస్థ్య మెుదవకున్నది. అయ్యయో! రక్తసిక్తాంగుఁడవై గైరికాదిధాతువుల స్రవించు పర్వతమునాఁ జూపట్టుచున్న నిన్నుఁ గాంచిన నాయవస్థ వర్షకాలపద్మము ననుకరించుచున్నది. ఓమహాత్మా! నాకై గదా! నీవిట్టిదురవస్థ నొందితివి. కానిచో రణరంగమున నిన్ను వైరులు తేఱిచూడఁ గలుగుదురా? మఱియు నామూలముననే బహుబంధుపుత్రసహితముగా క్షత్రియులనేకులు నిధన మొందిరి గదా! ఇంతకు మించిన కష్ట మేమున్నది? ఓ రాజా! ఆధార్తరాష్ట్రులును మేమును, గాలమన్యువశగతులమై యిట్టి నిందితకర్మ మొనర్చితిమి. మే మెట్టిగతికిఁ

బోవుదుమో? ఓజనాధిపా! ఆసుయోధనుఁ డిట్టిదశ నొందియున్న నిన్నుఁ గాంచకుండుటయు, వానికొక భాగ్యమనక తప్పదు. నీకు నేనంతకరుఁడ నైతిని. మిత్రవధకరుఁడ నైతిని. ఇట్లు పుడమిఁ బడి యున్న నిన్నుఁ జూచుచున్న నాకు శాంతి యెట్లొదవెడిని? ఓతాతా! పాతకుఁడును, గులపాంసనుఁడునగు, సుయోధనుఁ డీసమరమున క్షత్రియధర్మము ననుసరించి సోదరసైన్యసమేతముగా, నిహతుఁడగుటచే, నీవిట్లు పుడమిఁ బడుటను గాంచవలసిన ప్రసక్తి వానికిఁ గలుగలేదు. అటులగుట బ్రతుకుటకన్న మృతియే శ్రేయమని తలంచెదను. ఓమహానీయా! నేను నాత్ములతోఁ గూడ నింతకుమున్నే వైరులకు వశుఁడనై క్షయమొందియుంటినేని, సాయకపీడితుఁడ వైయున్న నిన్నుఁ జూడవలసినకష్టము సంభవింప కుండెడిదిగదా? మహాత్మా! మే మావిధిచేఁ బాపకర్ములముగా సృజింపఁబడుట నిశ్చయము. నీవు మాకుఁ బ్రియము చేయఁ దలంతువేని, మే మిఁకఁ బరలోకమునఁ గల్మషరహితుల మెట్లగుదుమో యట్టిమార్గమునఁ బ్రవర్తించునట్లు శాసింపుము" అని పలికెను.

అది విని గాంగేయుఁడు "ఓయుధిష్ఠిరా! అస్వతంత్రుఁడవగు నిన్నిందులకు నిమిత్తమునుగాఁ దలంతువేల? ఓమహాభాగా! అతీంద్రియమగు నిది కర్మసూక్ష్మము గాదే? ఈవిషయమున నొకపురాతనేతిహాసమును దెలుపుదురు. అయ్యది గౌతమీమృత్యుకాలలుబ్ధకపన్నగములకు జరిగినసంవాదము. దానిం దెలిపెదను వినుము. ఓకౌంతేయా! శాంతియుక్తయగు గౌతమి యను నొకముదుసలి, సర్పదష్టుఁడై గతచేతనుఁడగు తనపుత్రునిఁ గాంచెను. అపు డర్జునకుఁ డను నొక లుబ్ధకుఁడు కుపితుఁడై యాబాలునిఁ గఱచినపాము నొకస్నాయు పాశమున బంధించి యామెకడకుఁ దెచ్చి 'ఓమహాభాగురాలా! నీ తనయునిఁ గఱచిన యీపన్నగాధమము నిదె తెచ్చితిని. దీనిని నేనెట్లు వధింపవలయునో వడిగా శాసింపుము. అగ్నిలోఁ బడవైతునా? ముక్కలుగాఁ గోసి వేయవలయునా? బాలునిఁ జంపినయీపాపజంతువు నిఁక నెంతకాలమో బ్రతుకనీను' అని పలికెను.

గౌతమి:—ఓయర్జునకా! నీవు తెలియనివాఁడవు. దీనిని విడువుము. ఇది చంపఁదగినది గాదు. ప్రాప్తవ్యమును జింతింప కెవ్వఁ

డాత్మను మార్గదర్శకముగా నొనర్చును? నీటిపైఁ దెప్పలట్లు లోకమున ధర్మపరులగువారు చులుకగా సంసారసాగరమునఁ దేలి తరింతురు. పాపభారులగువారు నీటజాఱిన శస్త్రమట్లు సంసారసాగరమున మునుఁ గుదురు. ఈసర్పమును జంపినను, నా యాతనయుండు జీవింపఁడు గదా! ఇది జీవించినచో నీ కేమి హాని వాటిల్లెడిని? ప్రాణయుక్త మగు నీజంతువు ప్రాణము లెడలించిన మన కేమి లాభము? అనంత మగు నీలోకమున మృత్యువశుఁడు గానివాఁ డెవ్వఁడు?

అర్జునకుఁడు:—దేవీ! నే నెఱుంగనివాఁడను గాను. గుణా గుణజ్ఞులగు మీయట్టిపూజ్యు లిట్టి విషయములకుఁ దగరు. స్వాస్థ్యము గలవానికి మీయీ తెలిపినసదుపదేశములు తగియుండును. కావున నేనీక్షుద్రసర్పమును వధింపకమానను. శాంతిపరులగువారు కాలగతిని బలుకుదురు. అర్థవేత్తలన్నో తాత్కాలికదుఃఖమును దొలఁగించు కొందురు. నిత్యమును దుఃఖించువానికి శ్రేయోభంగము గలుగక మానదు. కావున భుజంగహానికి పగవకుము.

గౌతమి:—మాయట్టివారి కార్తియన నెట్టిది? సజ్జనులు సర్వా వస్థలందును ధర్మపరులై యుందురు. నిత్యాపాయముగల బాలకుఁడు మృతియే చెందెను. కావునఁ బన్నగనాశమున కోగువఁజాలను. బ్రాహ్మణు లెన్నఁడును గుపితులు కాఁదగరు. కోపమువలన నగు తీవ్రవేదనకుఁ బాలగుటేల? ఓసజ్జనుఁడా! మార్దవమూని దీనిని క్షమింపుము. ఈసర్పము నీచే విడువఁబడుఁగాక.

అర్జునకుఁడు:—ఓపావనీ! శత్రువధముచే నద్యయమై పరలోక హితకరమగు శ్రేయమే గల్గును. తాత్కాలికలాభము సర్వలాభ ములకన్నఁ బ్రశస్తమైనది. ఎపుడో గలుగవలసినలాభ మపుడే గల్గునే నకార్యము కుత్సితమయ్యు శ్రేయస్కరము గాక పోదు.

గౌతమి:—శత్రునిఁ బట్టికొని చంపుటచేఁ గలిగిన సంతోష మెట్టిది? దానిని విడువక సంభవించిన లాభమేమి? ఓసౌమ్యుఁడా! ఈసర్పమునెడ శాంతి యేల వహింపఁగూడదు? దీనినేల విడువరాదు?

అర్జునకుఁడు:—ఓగౌతమీ! ఈయొకదుష్టసర్పమునుండి పెక్కురు రక్షింపఁ దగియున్నవారు. పెక్కురకు హాని గలిగించునొక్కఁడు

రక్షింపఁదగఁడు గదా! ధర్మవేత్త లపరాధిని వధింతురు గాదే? కావునఁ బాపకారియగు నీపామును వధింపుము.

గౌతమి:—ఓలుబ్ధకా! ఈసర్పమును నేను జంపినను నాతనయుఁడు జీవింపఁడు గదా! కావున దీనిని వధించుటలో నాకు వేఱొకసుగుణ మగపడలేదు. అటులగుట దీనిని జీవముతో విడువుము.

అర్జునకుఁడు:—వృత్రునిఁ జంపి దేవరా జుత్తముఁ డయ్యెను. యజ్ఞమును జెఱిచి మహాదేవుఁడు యాగభాగమునొందెను. కావున దేవతలవృత్తము నేల యనుసరింపగాదు? వడిగా దీనిని వధింపుము. ఇందు నీవు శంకింపఁబనిలేదు. అని ప్రసంగించి'' రని తెలిపి మఱియు భీష్ముఁ డిట్లనియె.

“ఓయుధిష్ఠిరా! లుబ్ధకుఁ డాసర్పమునుగుఱించి యెంత చెప్పినను గౌతమి, పాపకర్మమునెడఁ దలంపు వెట్టదయ్యెను. అంత నప్పాశబద్ధమై యున్న యాపన్నగ మతికష్టముగా మనసు గట్టి చేసికొని మెల్లగా నూర్పువిడుచుచు మెల్లగామానుషభాషతో నిట్లు పలుకందొడంగెను.

సర్పము:—ఓమూర్ఖుఁడా! అర్జునకా! ఇందు నాతప్పేమి గలదు? అస్వతంత్రుఁడనై వశము తప్పియున్న నన్నామృత్యువు ప్రేరించెను. దానివచనముచొప్పునఁ గఱచితిని గాని బాలునిపైఁ గోపముచేఁ గాని, యొకకోర్కిచేఁ గాని కఱవలేదు. ఓలుబ్ధకా! ఒకప్పుడీకార్యమున; బాపమగునే, నది యామృత్యువు చేసినదియేగాని నాది గాదు.

లుబ్ధకుఁడు:—ఓపన్నగా! నీవీయకార్యమును వశము తప్పి చేసినను నిందులకు నిమిత్తమ వైతివిగాదే? అటులగుటఁ బాపుఁడవు గాక తప్పదు. ఓసర్పమా! మట్టిపాత్రములు జేయుటలో దండచక్రాదులు కారణములైనట్లు నీవును నిందులకుఁ గారణము గాక తప్పదు. కావున నీవు పాపుఁడవే. పాపుఁ డగువాఁడు నాకు వధ్యుఁడు. ఓ భుజంగమాధమా! ఇప్పనిలోఁ గారణముగా నీవు నిన్నుఁ దెలిపికొంటివి గాదే?

సర్పము:—ఓలుబ్ధకా! నీవు తెలిపినదండచక్రాదు లెట్లు లస్వతంత్రములై పనిచేసెనో యట్టులే నేనును నస్వతంత్రుఁడను. కావున

నిందు నాదోష మేమియు లేదని నాయభిప్రాయము. లేక యాదండ చక్రాదులు పరస్పర ప్రయోజకములని తలంతువేని, వినుము. వానికిఁ బరస్పరప్రేరణ ముండుటంబట్టి యందుఁ గార్యకారణసందేహము గలుగక పోలేదు. ఇటులగుట నాయెడ దోషనిశ్చయమును లేదు. నేను బాపుఁడను గాను. వధ్యుఁడను గాను. పాపము గల్గునందువేని సమవాయమునఁ గల్గును.

లుబ్ధకుఁడు:—నీవు కారణము గానందువేని కర్తవు గాక పోవలసి వచ్చును. ఈవినాశమునకుఁ గారణ మగుచున్నాఁడవు గాదే? కావున నీవు నాకు వధ్యుఁడవు. మఱియు దుష్టకార్యము చేయఁబడి నపుడును హేతుకర్త దోషభాజనుఁడు కాఁడందువేని చోరాదులును రాజులకు శిక్షార్హులు కాకపోవలసి వచ్చును. పెక్కు లేల పలికెదు? వధ్యుఁడవు గాక తప్పదు.

సర్పము:—కారణ మున్నను, ఖడ్గాదర్శనకార్యముచే ఛేదనక్రియ జనించుచున్నది. కారణము లేకున్నను దరుశాఖాసంఘర్షణ జనితమగునగ్నిరూపకార్యముచే వనదహనక్రియ గలుగుచున్నది. కావునఁ దరుశాఖవలె సప్రయోజకుఁడ నగుట నేనిందు దోష భాజనుఁడఁ గాను. ఓలుబ్ధకా! నిజముగా నే నీవినాశమునకుఁ గారణము గాక తప్పదందువేని యజ్ఞజంతువినాశమున ఋత్విజులును దోషభాక్కులు గాక తప్పదు గదా!

లుబ్ధకుఁడు:—ఓదుర్మతీ! బాలఘాతివిని క్రూరకర్ముఁడవు నగు నీవు నాకు వధ్యుఁడవు గాక తప్పదు. పన్నగాధమా! పలుమాటలతోఁ బనియేమి?

సర్పము:—ఓలుబ్ధకా! యాగమున హవిస్సులను వేల్చునట్టి ఋత్విజు లెట్టులు యాగఫలభాక్కులు గాఁజాలరో యటులే నేనును ఫలభాజనుఁడను గాను. అని ప్రసంగించి" రని తెలిపి మఱియు గాఁగేయుఁ డిట్లనియె.

"ఓయుధిష్ఠిరా! మృత్యుచోదితముగు పన్నగ మట్లు పలుకుచు నుండ నందులకు మృత్యువరుదెంచి యాహామునతో 'ఓసర్పమా! నే నాయీశ్వరునిచేఁ బ్రేరితనై నిన్నిట్లు ప్రేరించితిని. కావున నీకిందు

వధమునకు నీవును నేనును నిమిత్తభూతులము గాము. మేఘ మెట్లు గాలిచేఁ గదల్పఁబడి తద్వశమై యటునిటు చరించునో, యటులే నేను నాయీశ్వరునకు వశపడి వర్తించుదానను. సాత్త్వికరాజసతామస భావము లెల్లఁ గాలాత్మకములై జంతువులయెడఁ బ్రవర్తించుచుండును. భూమ్యాకాశములంగల జంగమస్థావరము లెల్లఁ గాలాత్మకములే. ఇంత యేల! ఈజగమంతయుఁ గాలాత్మక మనక తప్పదు. లోకమునఁ గల ప్రవృత్తినివృత్తులును, వాని వికారములును గాలాత్మకము లై స్మరింపఁబడుచున్నవి. సూర్యచంద్రులును, విష్ణువు, జలము, భూమియు, నింద్రుఁడు, నగ్నియు, నాకసము, గాలి, మిత్రుఁడు, పర్జన్యుఁడు, వసువులు, నదితి, నదులు, సాగరములు, భావాభావములును, మఱిమఱియు నీశ్వరునిచే సృజింపఁబడుచు హరింపఁబడుచుండును. ఓసర్పమా! ఇట్టివిధ మెఱిఁగియు నన్ను దోషయుక్తునిఁగాఁ దలంచుచున్నదానవు. నాకిందు దోషమగు నేని నీవును దోషభాజనమ వగుచున్నదానవు.'

సర్పము:—'ఓదేవీ! నీయెడ దోషమున్నను లేకున్నను నిన్నేమియు ననలేదు. నీవు నన్నుఁ బ్రేరించితివనుమాట మాత్రమ చెప్పుచున్నదానను. ఒకపుడు కాలునియందు దోషమున్న నుండవచ్చును. లేకయు నుండవచ్చును. నాకాదోషపరీక్షతోఁ బనిలేదు. ఇందు మేమధికారులము గాము. ఎటులేని యీదోషమును దప్పించుకొనుట నాకుఁ గార్యము. మృత్యువునకు నిందుదోషము లేదు. ఇదియే నా ప్రయోజనము.' అని పలికె" నని తెలిపి మఱియు నిట్లనియె.

"ఓయుధిష్ఠిరా! అనంతర, మా పాము లుబ్ధకునితో 'ఓయర్జునకా! మృత్యువచనము వింటివిగదా! అపరాధరహితుఁడనగు నన్నింకను నీపాశముచేఁ బీడింతువా? విడువుము' అని పలికెను. అది విని యాలుబ్ధకుఁ డాసర్పమునారసి, 'ఓపన్నగాధమా! మృత్యువచనమును నీవచనమును వింటిని కాని యింతటా నీయెడ దోషము లేకుండుట లేదు. ఈబాలునివినాశమున నీవును మృత్యుదేవతయును హేతువులే. మీరుభయులును గారణభూతులనియే నానిశ్చయము. కారణమగునది, యకారణ మెన్నఁడును గాదుగదా!' అని పలికెను. అది విని మృత్యువు లుబ్ధకునితో 'ఓయీ! కాలవశులమై యవశులమైన మేమా కాలనిర్దేశమును జేసినవారము. నీవు యథార్థ మాలోచించినచో

మేమిందు దోషము నొందువారముగాము' అని పలుకుటయు, నతఁ డామృత్యువు నాకని 'ఓమృత్యువా! ఓపన్నగమా! మీ రిరువురును గాలవశగులై వర్తించువారేని, తటస్థుఁడనగు నా కుపకర్తయందు హర్షమును, నపకర్తలగు మీయెడ ద్వేషమును నేల కలుగవలయునో తెలియఁ గోరుచున్నాఁడను.' అని పలికెను. అది విని యామృత్యువు 'ఓలుబ్ధకా! సకలవిధమగు చేష్టయుఁ, గాలప్రేరితమై ప్రవర్తిలుచుండునని యథార్థముగా నింతకుమున్నే తెలిపితినిగాదే? కావునఁ గాలనిర్దేశకారులమగు మేమిరువురమును నిర్దుష్టులమని నీవు తలంపక తప్పదు.' అని పలికె" నని తెలిపి మఱియు నాగాంగేయుఁ డిట్లనియె.

"ఓయుధిష్ఠిరా! అపుడు ధర్మార్థసంశయము గలుగఁగా, నీశ్వరుఁ డందులకు వచ్చి యాలుబ్ధకపన్నగమృత్యువులతో 'ఓలుబ్ధకుఁడా! ఓపన్నగమా! ఓమృత్యువా! నే నిందు దోషిని గాను. ఓయర్జునకా! ఈమృత్యుపన్నగములును దోషఫలభాక్కులన వలనుపడదు. జంతువినాశమున మేము ప్రయోజకులము గాము. ఓలుబ్ధకా! ఈసర్పమిప్పని చేయుటలోఁ బ్రేరక మగు నీబాలునికర్మము హేతువు. ఈబాలునివినాశమునకు మఱొకఁడు నిమిత్తము గాఁజాలఁడు. వీఁడు నిజకర్మముచే బద్ధుఁ డగుచున్నాఁడు. వీఁ డొనర్చినకర్మము చేతనే వీఁడు నిధన మొందెను. వీనివినాశమునకు వీనికర్మమే నిమిత్తము. మన మెల్లఁ గర్మవశులమే. కర్మమే పుత్త్రునివలెఁ దరింపఁజేయునది. కర్మఫలయోగమే పుణ్యపాపవత్త్వజ్ఞాపక మగుచున్నది. కర్మము లెట్లు ప్రేరించుచుండునో యట్లు మనము పరస్పరము ప్రవర్తించుచుందుము. కర్త మృత్పిండమును బట్టి తా నేదేది కోరుచుండునో దాని నెల్లఁ జేయునట్టులు, మానవుఁడు కర్మమునుబట్టి ఫలము నొందుచుండును. ఛాయాతపము లెట్లు నిత్యము నెడఁబాయక సుసంబద్ధము లై యుండునో యటులే కర్మమును గర్తయును, నిజకర్మముల సంబంధము గల్గి యుండక తప్పదు. ఇటు లగుట నిందుల కేను గాని, యీమృత్యుసర్పములు గాని హేతువులు గాము. అటులే నీవు గాని యీవృద్ధబ్రాహ్మణి గాని నిమిత్తములు గారు. ఈబాలుఁడే యిందులకుఁ గారణము.' అని యా యీశ్వరుఁడు పలుక విని యాగౌతమి, కర్మమే కారణముగాఁగల స్వార్థ

నరకాదిలోకములను దలంచి యాలుబ్ధకునితో 'ఓయీ! ఈబాలుని నిధనమున కీకాలమృత్యుసర్పములు నిమిత్తము లనవలసినది లేదు. వీఁడు నిజకర్మములచేఁ గాలునివలన నిధనమందెను. ఏనాకర్మముచే నాపుత్రుఁడు మరణించెనో యట్టికర్మమే నొనర్చితిని. కావున నీకాలమృత్యువులు వెడలవచ్చును, ఈసర్పమును విడువుము' అని తెలిపెను.

ఓధర్మజా! పిమ్మట నకాలుఁడు వెడలెను. మృత్యువును జనియెను. పన్నగమును బ్రయాణమై పోయెను. అంత నాలుబ్ధకుఁడును శోకమును విడిచెను. గౌతమియు శోకరహితయై యుండెను. కావున నాయీ తెలిపినవచనమును బట్టి శోకరహితుఁడవై శాంతి వహింపుము. ఓయుధిష్ఠిరా! మూఁడులోకములును నిజకర్మ కారణకములుగా నెఱుంగుము. ఇప్పని నీవుగాని సుయోధనుఁడుగాని చేసినది గాదు. ఈపార్థివులెల్ల నిహతులగుట కాలునిచే నైనదిగాఁ దెలియుము." అని తెలిపెను.

ఓజనమేజయా! భీష్ముని యావచన మాలించి ధర్మజుఁడు సంతాపరహితుఁడై ధర్మము దెలియువాఁడై మఱియు నిట్లు ప్రశ్నించెను.

### సుదర్శనోపాఖ్యానము

"ఓపితామహా! మహాప్రాజ్ఞా! సకలశాస్త్రవిశారదా! నీవలన గొప్పచరిత్రము వింటిని. మఱియు ధర్మార్థసహిత మగుదానిని వినఁ గోరుచున్నాఁడను. కావున నిపు డేదేని మఱియొకటి తెలుపుము. ధర్మము నాశ్రయించి యెవ్వఁడేని గృహస్థు మృత్యువును జయించెనా? అట్టిధర్మము నొకదానిని యథార్థముగాఁ దెలుపుము."

అది విని గాంగేయుఁ డప్పాండవాగ్రజు నారసి, "ఓధర్మజా! ఒకగృహస్థు ధర్మమూని మృత్యువును జయించినవిధము నెఱిఁగించు నొకపురాతనేతిహాస మీవిషయమునఁ దెలుపుదురు. దాని నెఱింగించెదను వినుము. ప్రజాపతియగు మనువున కిక్ష్వాకుఁ డను పుత్రుఁ డుదయించెను. సూర్యతేజుఁడగు నాతనికి నూర్వురు పుత్రు లుదయించిరి. వారిలోఁ బదియవవాఁడు దశాశ్వుఁడు. ధర్మాత్ముఁడును సత్యవిక్రముఁడు నగునాతఁడు మాహిష్మతికిఁ బాలకుఁడై యుండెను. ఆదశాశ్వునకుఁ బరమధార్మికుఁడగు మదిరాశ్వుఁ డనునొక పుత్రుఁ

డుండెను. అతఁడు, నిత్యము సత్యతపోదాననిరతుఁడై పుడమిఁ బ్రసిద్ధి
వడసెను. మఱియు ధనుర్వేదమందును వేదమందును సక్తి గలిగి
వర్తించుచుండెను. ఆమదిరాశ్వునకు ద్యుతిమంతుఁడు పుత్రుఁడై
యుండెను. ఆద్యుతిమంతునకు మహాభాగుఁడును మహాతేజుఁడును
మహాసత్త్వుఁడును మహాబలుఁడును బరమధార్మికుఁడు నై సువీరుఁ
డనువాఁడు పుత్రుఁడై యుదయించెను. ఆసువీరుఁడు కోశవంతుఁడై
రెండవ యింద్రునివలె విరాజిల్లెను. ఆతనికి సకలవిధసంగ్రామదుర్జ
యుఁడును సర్వశాస్త్రవేత్తయు ననియెడి ప్రసిద్ధితో దుర్జయుఁడను
వాఁడు పుత్రుఁడై యుండెను. ఇంద్రసమశరీరుఁడును, నగ్నితుల్య
ద్యుతియు నగు నాదుర్జయునకు దుర్యోధనుఁ డను రాజసత్తముఁడు
పుత్రుఁ డయ్యెను. ఇంద్రసమవిక్రముఁడు, సమరోత్సాహియు నగు
నాతనిదేశమున నవ్వాసవుఁడు సస్యానుకూలముగా వర్షించుచు
వచ్చెను. అప్పు డాతనినగరమె గాక దేశము నైతము ధనరత్నరాశు
లతో నిండి పలువిధములగు పశువర్గములు గలిగి సస్యపరిపూర్ణమై
యలరారుచు వచ్చెను. అటులగుట నందొక యాచకుఁడు గాని దరి
ద్రుఁడు గాని చూపట్టుట లేదు. మఱియు నందు మానవుఁడు వ్యాధి
పీడితుఁ డగుట గాని, కృశుఁ డగుట గాని సంభవింపకుండెను. ఆదుర్యో
ధనుఁడు మిగుల దాక్షిణ్యము గలవాఁడును మధురాలాపుఁడును
నసూయారహితుఁడును జితేంద్రియుఁడును ధర్మాత్ముఁడును విక్రమ
శాలియు నక్రూరుఁడును గర్వరహితుఁడును యజ్వయు దాంతుఁడును,
మేధావియు బ్రహ్మజ్ఞానసంపన్నుఁడును సత్యవంతుఁడును నై వెల
యుచు, నెవ్వరిని నవమానింపక, దాతయై వేదవేదాంగపారగుఁడై
యుండ, నాతనిఁ, బరమపవిత్రయు, శీతజలోపేతయు, శుభప్రదయు,
దేవనదియు నగు నర్మద, నిజరూపముతోఁ గామించెను. అప్పు డామెకుఁ
బద్మపత్రాక్షియైన సుదర్శన యను నొక కన్నియ జనించెను. ఆకన్నియ
నిజరూపముచే సుదర్శన యై యుండెను. ఓయుధిష్ఠిరా! అట్టిరూపము
గల కాంత, యంతకుమున్నెన్నఁడును బుడమిఁ బుట్టియుండ లేదన
సందియము లేదు. అటులుండ నొకప్పు డగ్ని దేవుఁడు బ్రాహ్మణరూప
ధారియై వచ్చి యాకన్నియను దన కిమ్మని యప్పార్థివునిఁ బ్రార్థించెను.
అప్పు డాపుడమిఱేఁడు తనకా బ్రాహ్మణుఁ డసవర్ణుఁ డనియు దరిద్రుఁ

డనియుఁ దలంచి యాసుదర్శన నాతనికొసంగ సమ్మతింపఁ డయ్యెను. అందుల కలిగి యాయగ్ని దేవుఁ డాపార్థివుయజ్ఞమునఁ బ్రత్యక్షము గాకుండెను. అంత నాధరాకాంతుఁడు చింతాక్రాంతుఁడై యందున్న ద్విజులఁ గాంచి వారితో "ఓబ్రాహ్మణోత్తములారా! ఈదోషము నాయదియా? లేక మీయందేమేనిఁ గలదా? దుర్జనులయజ్ఞమందు వలె నాయీయాగమున నగ్ని నశించుటేమి? ఈయగ్ని యిట్లు గాన రాకుండుట నరయఁగా మన దుష్కృత మల్పమై యుండదు. కావున మనలో నెవ్వరిదోషమో చక్కఁగా విమర్శింపుఁడు." అని పలికెను. అప్పార్థివువచనము లాలించి యావిప్రు లపుడు, మౌనమూని నియ తులై యాదేవునిశరణు చొచ్చుటయు నతఁడు వారికి దర్శనమొసంగి, శరత్కాలార్కసమద్యుతియై తనరూపమును దీప్తిమంతముగా నొనర్చి మహాత్ముఁడగునాతఁడు వారితో "ఓబ్రాహ్మణులారా! తనకార్యమునకుఁగా నేనామరోర్యధనపుత్రికను గోరుచున్నాఁడ"నని పలికెను. పిమ్మట నమ్మ హీసురు లమ్మఱునాఁటి యుదయమున లేచి యమ్మహీపాలున కవ్విధ మెఱింగించిరి. మఱియు నాచిత్రభానునిపలుకు లాబ్రాహ్మణుల కెంతయు నచ్చెరువొదవించెను. పిదప బ్రహ్మవాదులగు వారివచనములు విని యజ్ఞనపాలుఁడు బుద్ధి తెచ్చికొని యటుందానంద మొదవ నటులే తప్పక నాకన్నియ నాయగ్ని దేవున కొసంగెదనని పలికి, పిమ్మటఁ దన యాగశాలలో నిత్య మాయగ్ని దేవుఁడు సాన్నిధ్య మొసంగుటయే తనకన్నియకు శుల్కముగా నుండవలయు నని కోరెను. అపు డా భగవానుఁడగు హవ్యవాహనుఁడు తప్పక యటులే యొనర్తు నని సెలవొసంగెను. ఓయుధిష్ఠిరా! ఆమాహిష్మతియం దిప్పటికిని నాయగ్ని దేవునిసాన్నిధ్య మగపడుచునే యున్నది సుమీ! ఆదెసకు, జయింపఁ బోయిన సహదేవుఁ డది యెఱుంగును. పిమ్మట నమ్మహీనాథుఁడగు దుర్యోధనుఁడు తనకన్నియ నలంకరించి తెచ్చి మహాత్ముఁడగు నప్పావ కున కొసంగెను. రాజకన్యకయగు నాసుదర్శన నాయగ్ని దేవుఁ డధ్వర మున వసుధారనుబోలెఁ బరిగ్రహించి యామెకులశీలసౌందర్యముల కును లావణ్యమునకును నెంతయు నలరి యామెకు గర్భ మొసంగెను. అపు డామెకు నాయగ్ని వలన సుదర్శనుఁడనునొకపుత్త్రుఁ డుదయించెను. ఆసుదర్శనుఁడు నిజరూపముచేఁ బూర్ణచంద్రతుల్యుఁడు యర్కుఁడై

యుండునపుడే సనాతనమగు పరమవేదమునెల్ల నధ్యయన మొనర్చెను. ఆకాలమున నృగపితామహుఁడగు నోఘవంతుఁ డను నొక రాజోత్తముఁ డుండెను. ఆతని కోఘవతియను నొక కన్యకయు, నోఘరథుఁ డను నొక పుత్త్రుఁడును నుండిరి. అప్పు డా యోఘవంతుఁడు తన పుత్త్రికయగు నోఘవతి నాసుదర్శనునకు భార్యగా నొసంగుటయు నా సుదర్శనుఁ డామెను బరిగ్రహించి గృహస్థాశ్రమరతుఁడై యామెను గూడి కురుక్షేత్రమున నివసించియుండెను. అటు లతఁ డందుండి గృహస్థధర్మమాశ్రయించియే మృత్యువును జయింతునని ప్రతిన యొనర్చెను. ఓయుధిష్ఠిరా! అప్పు డతఁ డటులు ప్రతినయొనర్చినవాఁ డగుట నా యోఘవతితో "ఓ ప్రియురాలా! నీవతిథుల కెన్నఁడును నెట్టులును బ్రతికూలముగాఁ బ్రవర్తింపకుము. నీవు నిత్యము నతిథులే యేవిధముగా సంతసింతురో యాయామార్గములఁ బట్టి ప్రవర్తింప వలయును. ఇందు విచారింపఁ బనిలేదు సుమీ! ఈ వ్రత మొనర్ప నాచిత్తము చిరకాలమునుండియు వాంఛించుచున్నది. ఓసుశ్రోణీ! గృహస్థుల కతిథిసత్కారమును మించినధర్మము వేఱొకటి లేదు సుమీ! నామాట నీకుఁ బ్రమాణమేని నాయీవచనము, నేమఱక నీ వెల్లపుడును నీచిత్తమునందు నిలుపుము. ఓకళ్యాణీ! నేను నీకు విశ్వసనీయుఁడ నేని, యీయాశ్రమమున నేనున్నపుడుగాని, యెందులకే నేఁగినపుడుగాని యతిథియగువాఁ డవమానింపఁబడరాదు సుమీ!" అని తెలిపెను.

అది విని యా యోఘవతి యతనియానతి శిరసావహించి కృతాంజలి యై "నాథా! నీయానతిని మించినకర్తవ్యము నా కేమి గలదు?" అని ప్రత్యుత్తరమిచ్చెను. అంత నటులు గృహస్థధర్మమూనియే మృత్యువును జయింపనున్న యాసుదర్శనుని వెనుకభాగమున మృత్యువనుసరించి చరించుచు సమయము నిరీక్షించుచుండా, నొకప్పు డాసుదర్శనుఁడు సమిధలను దెచ్చుటకై సమీపారణ్యమునకుఁ బోయెను. అప్పు డొకయతిథియగు బ్రాహ్మణుఁ డామెతో "ఓపతివ్రతామణీ! నిన్నిపు డాతిథ్యమును గోరుచు వచ్చితిని. గృహస్థాశ్రమసమ్మతమగుధర్మము నీకుఁ బ్రమాణమేని నా కాతిథ్య మిప్పింపుమని పలికెను. ఆతనిపలుకు లాలించి యాశీలవతియగు రాజపుత్త్రి, వేదోక్త

విధిచే నాసనమును బాద్యమును బరిగ్రహించి యాబ్రాహ్మణున కర్పించి, మఱియు నాతనితో "ఓద్విజోత్తమా! నీ కేమి గావలయునో తెలుపుమని పలికెను. అంత నావిప్రుఁ డారాజపుత్రియగు సుదర్శనను గాంచి "ఓకళ్యాణీ! నీవు నా కీయర్ధమును నిశ్శంకముగా నొసంగ వలసియున్నది. నీకు గృహస్థాశ్రమసమ్మతమగుధర్మము ప్రమాణమేని నాయీచెప్పినచొప్పునఁ జేయుక తప్పదు. ఇపుడు నీవు నీశరీర ప్రదానముచే నాకుఁ బ్రియమొనర్పవలయును" అని కోరెను. పిమ్మట నారాజపుత్రి వేఱుకోరిక లేవేని కోరుకొమ్మని వేఁడినను, నతఁడు సమ్మతింపక యాత్మప్రదానమే తనకు వాంఛితమని కోరెను. అనంతర మారాజపుత్రి తనభర్త పలికినపలుకులు తొలుతనుండియు స్మృతికిఁ దెచ్చికొని, సిగ్గుపడుచు నటులే యొనర్తునని యావిప్రునితోఁ పలికెను. అంత నాబ్రాహ్మణుఁడు నగుచు సమీపింప నామెయు గృహస్థాశ్రమ ధర్మకాంక్షియగు తనభర్తవచనము ననుసరించి యాతనిచేరువఁ గూచుచుండెను. పిదప నాయగ్నిపుత్త్రుఁడగు సుదర్శనుఁడు సమిధలను బట్టుకొని యింటికి మరలెను. అటులు మరలి, బంధువట్లు తన్ను మృత్యువు నిత్యము విడువక వెంబడించి రా, నతఁడు తనయింటికి వచ్చి, ప్రియాంగనయగునోఘవతిని బిలిచి, యెందుల కేఁగితివి? పలుక వేమి? అని మఱిమఱియుఁ బిలువసాగెను. కాని, యామె యాబ్రాహ్మణుని హస్తస్పర్శ మొందినదగుట నెంగిలివడ్డదానవని తలంచి సిగ్గుపడుచు భర్తకుఁ బ్రత్యుత్తరమీయఁ జాలదయ్యెను. అటులు సిగ్గుచే మాఱుపలుక నేరకూరకున్న యానారీమణినుద్దేశించి యాసుదర్శనుఁడు "ఆహా! సాధ్వీమణియగునాయోఘవతి యెందుల కేఁగెనో? నాకన్న దాని కధిక మేమి గలదు? అది పతివ్రతయు, సత్యశీలయు, వినయవతియుఁగదా! ఎప్పటిచొప్పున నన్నెదుర్కొన రాదేమి? చిఱునగవు వెలయ వచ్చి నన్నాదరింపదేమి?" అని చింతించుచుండెను. అంత నయ్యాశ్రమమునందున్న యాబ్రాహ్మణుఁడు సుదర్శనునితో "ఓయగ్నితనయా! నేనొక బ్రాహ్మణుఁడను. అతిథిగా వచ్చితినని తెలియుము. ఓసత్తమా! ఈమె నాకాయాసత్కారములొనర్తునని ప్రార్థించి యెంత వేఁడినను వాని నొల్లక నేనీమెనే కోరితిని. ఈవిధముగా నన్నిపు డీమె యతిథిసత్కార సత్కృతునిఁ జేయుచున్నది. దీనికిఁ దగువిధముగా నీవును బ్రవర్తిం

ధ్రువము." అని పలికెను. అప్పుడు మృత్యువు, కూటముద్గరహస్తుఁడై యాపార్థివుని వెంబడించియే యుండెను. అప్పుడా రాజు తన ప్రతిజ్ఞను జెఱుచుకొనునేని యదె సమయముగా నాతని వధింపవలయునని యామృత్యువు నిశ్చయము. ఓయుధిష్ఠిరా! అంత నాసుదర్శనుఁడు తన మనోవాక్కర్మదృష్టులలో దేనియందును నీర్ష్య గానరాకుండ నిశ్చలుఁడై నిశ్చింతుఁడై నవ్వుచు "ఓబ్రాహ్మణోత్తమా! నీవు సంభోగింప వచ్చును. నా కది యెంతయుఁ బ్రీతికరము. గృహస్థధర్మ ముత్తమమైనది గదా. ఇప్పుడు మాకతిథిపూజనము సంప్రాప్తించెను. ఏగృహస్థునతిథిపూజ వడసి బ్రాహ్మణుఁడు సంతుష్టుఁడై పోవునో యట్టిగృహస్థుధర్మమును మించినధర్మము లేదని పెద్దలు చెలుపుదురుగదా! మఱియు నాప్రాణములుగాని, దారయుఁగాని, ధనముగాని, యింకేమిగాని నాకుఁ గలదో యది యెల్ల నతిథులకొసంగఁదగిన దనియే నాపూనిన వ్రతము నాయీవచనము నిశ్శంకముగనే తెలుపఁబడినది. అటులగుట, నోబ్రాహ్మణోత్తమా! నిజముగా నాశరీరమేని గోసి నీకిచ్చెదను. పృథివ్యప్తేజోవాయ్వాకాశములును, బుద్ధియు, నాత్మయు, మనము, కాలము, దశదిశలును, దేహులదేహములనాశ్రయించి నిత్యమును, వారిసుకృతదుష్కృతముల నరయుచుండును. నాయీవచన మసత్యము గాదు. కావున నాయీసత్యవచనముచే దేవతలు నన్నుఁ బాలింపనిమ్ము. లేదా కాల్పనిమ్ము" అని పలికెను. ఓధర్మజా! పిమ్మట నెల్ల దెసల మహానాద ముదయించెను, ఇది సత్యముగాని యనృతము గాదని యెల్లదెసల నుండి మఱిమఱియు వినవచ్చెను. పిమ్మట నయ్యుటజమునుండి యాబ్రాహ్మణుఁడు వెడలి, తనయాకృతిచే నాకసమును బుడమిని వాయువట్లు నిండి యతఁడు శైక్షస్వరముచే మూఁడులోకములను బ్రతిధ్వనింపఁ జేయుచు, ముందుగా నాతనికడ సెలవుగొని "ఓయనఘా! నేను ధర్ముఁడను. నీకు శుభమగుఁగాక. నిన్నుఁ బరీక్షించుట కిందులకు వచ్చితిని. నీదగుదృఢసత్యముఁ దెలియుటచే నాకెంతయుఁ బ్రీతి గల్గుచున్నది. నిన్ను వెంబడించివచ్చుచున్న యీమృత్యువు నీచే జయింపఁబడినది. నీలోపములను వెదకుచున్న యీమృత్యువు నీధైర్యముచే నీకు వశపడినది. ఈమూఁడులోకములలో నెవ్వరేని పతివ్రతయగు నీసాధ్విని దేఱిచూడనైనఁజాలరు. ఈమె నీగుణములచేతను బాతివ్రత్యగుణముల

చేతను రక్షింపఁబడినది. సర్వాధికయగు నీమె యేమి పలికినను నది వేఱొకవిధముగఁ గానేరదు. బ్రహ్మవాదినియగు నీమె నిజతపస్సంయుక్తయైలోకమును బావనముగాఁ జేయుటకై యుత్తమనదియై యవతరించెడిని. నీవీదేహముతోడనే యుత్తమలోకముల నొందెదవు. నీచే మృత్యువు జయింపఁబడి నీవుత్తమైశ్వర్యము గాంచితివి. ఈ యోఘవతి పేరు సార్థకముగా, సగము ప్రవాహమై సగము శరీరమున నిన్ననుసరించి యుండును. ఈమెకు యోగము వశమై యుండును. ఈమెతోఁ గూడఁ దపోనిర్జితములగు నుత్తమలోకములకుఁ బోఁగల వాఁడవు. ఆవృత్తిరహితములై సనాతనములైన శాశ్వతలోకముల నీ వీదేహముతో నొందఁగల్గుదువు. నీవు మృత్యువును జయించితివి. ఉత్తమైశ్వర్యము వహించితివి. మనోజవుఁడవై నిజశక్తిచేఁ బంచభూతములను నతిక్రమించితివి. ఈనీగృహస్థధర్మముచేఁ గామక్రోధములు జయింపఁబడినవి. అటులే స్నేహరాగమోహమాంద్యముల నెల్ల నీ రాజపుత్రి నీమూలమున జయించినది.” అని తెలిపెను.

ఓయుధిష్ఠిరా! పిమ్మట నాసుదర్శనుని చెంత కాయింద్రుఁడు శ్వేతాశ్వసహస్రముతోఁ బూన్పఁబడినయుత్తమరథమును దీసికొని వచ్చి “ఓరాజోత్తమా! మృత్యువు, లోకములు, నాత్మయుఁ బంచభూతములును, బుద్ధియుఁ, గాలము, మనసు, నాకసము, కామక్రోధములును నీచే జయింపఁబడియెఁ గాదే! కావున గృహస్థాశ్రమమందున్నవాని కతిథికంటె వేఱగు దైవతము లేదు గదా! ఇది నీచిత్తమునఁ జింతింపుము. అతిథిని బూజించినను, వానియెడ శ్రేయ మాలోచించినను నది క్రతుశతమున కీడైనదని పెద్దలు దెలుపుదురు. శీలసంపన్నుఁడై పాత్రుఁడైన యతిథి లభించినను నెవ్వఁడు పూజింపఁడో, యట్టివాని కాయతిథి తనదుష్కృత మొసఁగి వానిపుణ్యమును దీసికొని పోవుచున్నాఁడు.” అని తెలిపెను. ఓపుత్రకా! ఈయుత్తమాఖ్యానము నెఱిఁగించితిని. గృహస్థు మృత్యువు నెట్లు జయించెనో వింటివిగదా? అయుర్ధనయశస్కరమగు నియ్యుత్తమాఖ్యానము సకలపాపాపనోదక మగుట నభివృద్ధి నొందఁదలంచినవాఁ డెంతయు నాదరింపవలయును. విద్వాంసుఁడు దీనిని బ్రతిదినము చెప్పికొనినచోఁ

పుణ్యలోకముల నొందఁగల్గును." అని తెలుప విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె.

విశ్వామిత్రోపాఖ్యానము

"ఓతాతా! క్షత్త్రియవైశ్యశూద్రులకు బ్రాహ్మణ్యము లభింప రానిది గదా! క్షత్త్రియుఁడును మహాత్ముఁడు నగు విశ్వామిత్రుఁ డెట్లు బ్రాహ్మణ్యము వడసెను? ఓపితామహా! అది విననఁగోరుచున్నాఁడను. యథార్థముగాఁ దెలుపుము. అమేయవిక్రముఁడగు నవ్విశ్వామిత్రుఁడు, మహాత్ముఁడగు వసిష్ఠునికొడుకులు నూర్వురను దనసద్యస్తపముచే నంతమొందించెను గాదే? మఱియుఁ దీవ్రతేజులగు రక్కసులు పెక్కురు, కాలాంతకతుల్యులై క్రోధావిష్టుఁడైన యీతని దేహమున జనించి వెడలిరి గాదే? మఱియు నతనిచే బ్రహ్మర్షిశతసంకులమైన గొప్పకుశికవంశ మీలోకమున బ్రాహ్మణసంస్తుతమైనట్లు నిలుపఁబడియెఁ గాదే? మహాసత్త్రమునఁ బశువుగా నియమింపఁబడియు, మహాతపుఁడగు ఋచీకపుత్త్రుఁడు శునశ్శేపుఁడు నిజతేజమున దేవతల సంతోషపెట్టి విడువంబడి యీవిశ్వామిత్రునకుఁ బుత్త్రత్వముండుట నీతనిమహిమచేఁ గాదే? ఇతఁడు దేవరాతుని జ్యేష్ఠునిఁ జేయ నా దేవరాతునకు నమస్కరింపని తనయేఁబదుగురు పుత్త్రులను జండాలురఁగా శపించెను గాదే? వసిష్ఠశప్తుఁడై బంధుపరిత్యక్తుఁడగు త్రిశంకునిఁ బ్రీతిపూర్వకముగా నీతఁడు స్వర్గమును గల్పించి యందుంచెను గాదే? మఱియు నీతని చెల్లెలగు కౌశికి దేవర్షిసురసేవిత యైన పవిత్రనదిగాఁ బ్రవర్తిల్లుచున్నయది. ఇతఁ డొకపుడు తపము చేయుచుండఁగాఁ దన, యాతపమునకు విఘ్నమొనర్ప వచ్చిన రంభను బాషాణముగా శపించెనఁట. ఒకపు డీతని భయముచే వసిష్ఠుఁడు సలిలమగ్నుఁడై పాశముల బంధించికొని యుండి తుదికి విపాశుఁడై మరల నందుండి లేచుటచే నది మొదలా నది యమ్మహాత్మునికృత్యమును బట్టి విపాశ యను ప్రసిద్ధి వడసెనఁట. భగవానుఁడగు నింద్రుఁ డెవ్వని స్తుతివచనములకుఁ బ్రీతచిత్తుఁడై శాపమునుండి విడిపించెనో, యట్టి విశ్వామిత్రుఁడు సామాన్యుఁడే? ఇతఁ డుత్తరపుదెస నాశ్రయించి, యౌత్తానపాదుఁడగు ధ్రువుఁడు బ్రహ్మర్షులు మున్నగువారిమధ్యమునఁ

బ్రజ్వరిల్లుచుండునఁట. అట్టియీవిశ్వామిత్రుని యాకృత్యములే గాక మఱియుఁ గలవు గాదే? క్షత్రియుఁడగు నాతని యుత్పత్తి మిగులఁ గుతూహలమొదవించెడిని. అది యెట్టిదో దానితత్త్వమును దెలుపుము. అతఁడు దేహాంతర మొందకయే యెట్లు బ్రాహ్మణుఁ డయ్యెను? ఓపితామహా! అదియెల్ల యథార్థముగా నెఱిఁగింపుము. మతంగుని తత్త్వమట్టు లీతనితత్త్వమును దెలుపుము. చండాలయోనిజాతుఁడగు మతంగుఁడు బ్రహ్మర్షి గాలేదు గదా! విశ్వామిత్రుఁ డెట్లు బ్రహ్మర్షి యయ్యెను?" అని యడుగ గాంగేయుం డిట్లనియె.

## విశ్వామిత్రుని యుత్పత్తికథనము

"ఓయుధిష్ఠిరా! మున్ను విశ్వామిత్రుఁడు బ్రాహ్మణ్య మెట్లొందెనో! బ్రహ్మర్షి యెట్లయ్యెనో తెలిపెదను వినుము. భరతునివంశమున నాజమీఢుఁ డనియెడిరాజు యజ్వయు ధర్మవేత్తయు నై యుండెను. వానికి జహ్నువు పుత్రుఁడై మహాత్ముఁ డనిపించికొనియెను. అమ్మహాత్మునకుఁ గాదే, గంగ కూఁతు రయ్యెను. ఆజహ్నువునకుఁ దుల్యగుణుఁ డై సింధుద్వీపుఁడను కీర్తినిధి యుదయించెను. ఆసింధుద్వీపునకు బలాకాశ్వుఁ డనువాఁడు పుత్రుఁడై యుద్భవించెను. ఆ రాజర్షికి, రెండవధర్మమునాఁదగు వల్లభుఁడనువాఁ డుదయించెను. ఇంద్రతుల్యుఁడై నకుశికుఁ డావల్లభునకుఁ బుత్రుఁడుగా జనించెను. అక్కుశికునకు గాధియనువాఁడు గల్గెను. అతఁ డపుత్రకుఁ డై సంతానము గోరి వనమునఁ దపోనిష్ఠుఁడై చరింప నాతని కొక కన్నియ జనించెను. ఆమె నిరుపమాన రూపయై సత్యవతి యను నామమున వెలయుచుండెను. ఇటులుండ నొకపుడు, చ్యవనపుత్రుఁడును భృగువంశసంభవుఁడును, విపులతపోనిష్ఠుఁడునగు ఋచీకుఁడు గాధికడ కరుగుదెంచి యాసత్యవతిని దనకిమ్మని కోరెను. కాని యాఋచీకుఁడు దరిద్రుఁడని తలంచి యాగాధి యాతనికిఁ దనకన్నియ నొసంగ నంగీకరింపక పొమ్మని పంపియు మరల నతఁడు వచ్చి తన్ను యాచింపఁ బొమ్మన లేక తనపుత్రికకుఁ దగుశుల్క మిమ్మని కోరెను. అపు డాఋచీకుఁడు "ఓరాజేంద్రా! నీపుత్రికకు నేనేమి శుల్కమీయవలయునో తెలుపుము. నీపుత్రికనడుగుదును. సంశయము వలదు." అని పలుక నాగాధి

"ఓఋచీకా! పడిగలవియుఁ దెల్లనివియు నై యొకవైపు నల్లని చెవులు
గల వేయిగుఱ్ఱములను శుల్కముగా నొసంగుము" అని కోరెను.

ఓయుధిష్ఠిరా! పిమ్మట నాభృగుశార్దూలుఁడగు ఋచీకుఁడు
జలాధిదేవతయు, నాదిత్యుఁడునగు వరుణునికడకు వెడలి "యొకవైపు
నల్లనిచెవులు గలిగి చంద్రసమవర్ణములై పడిగల్గిన వేయిగుఱ్ఱములను
యాచింప వచ్చితిని. వానిని నాకు దయసేయుము" అని తెలుప నవ్వా
రుణదేవుఁ డటులే యని మఱియు నాతనితో "ఓభృగుసత్తమా!
నీవెందు వానిని గోరెదో యందవి యుదయించును." అని పలికెను.
అంత నాఋచీకుఁడు ధ్యానింపఁగనే చంద్రసమవర్ణములై విపులతేజ
ముగల వేయిగుఱ్ఱములు గంగాజలమునుండి యుదయించెను. కాన్య
కుబ్జమునకుఁ జేరువగా, గంగాతీరమున, నదియే యశ్వతీర్థమని వెలసి
యిప్పటికిని దెలుపఁబడుచున్నది. ఓధర్మజా! పిమ్మట నాఋచీకుఁడు
శుభప్రదములగు నావేయిగుఱ్ఱములను నాగాధికి శుల్కముగా
నొసంగెను. అంత నాగాధి యందులకు విస్మయావిష్టుఁడై, యిఁకఁ
దనపుత్రిక నీయకున్నఁ దన్నతఁడు శపించునేమో యని జడిసి తన
తనయ నలంకరించి యాఋచీకున కొసంగ నాబ్రహ్మర్షి యామెను
విధ్యుక్తముగాఁ బరిణయమయ్యెను. ఆసత్యవతియు నప్పతిని బడసి పర
మానందభరితయై యుండెను. ఆబ్రహ్మర్షియు నాపతివ్రతామణి సచ్చ
రిత్రమున కెంతయు సంతసింపసాగెను. అటులు సంతుష్టుఁడై యతఁ
డామెకనుకూలుఁడై ప్రవర్తించుచు నేదేనొకవరము కోరికొమ్మని తెలి
పెను. అపుడు సత్యవతి తనభర్త తన కనుకూలుఁడై వరదానము
సేయుటఁ దనతల్లి కెఱిఁగించి యవాఙ్ముఖియై యుండెను. అంత నామె
తల్లి "ఓపుత్రీ! సమర్థుఁడును మహాతపుఁడునగు నీభర్త సంతానప్రదా
నముచే నన్నును ననుగ్రహింపవలయును జామీ!" అని కోరెను.
ఓధర్మజా! అది విని యాసత్యవతి భర్తకడకు వడిగాఁ బోయి తన
తల్లియభిప్రాయము నెల్ల నాఋచీకునకుఁ దెలుప విని యతఁడు
"ఓసత్యవతీ! నాయనుగ్రహముచే నీతల్లికి గుణవంతుఁడగుపుత్త్రుఁ
డచిరకాలమునఁ గల్గెడిని. ఓకళ్యాణీ! నీమాట మన్నింపకుందునా?
నీకును సుగుణవంతుఁడగు పుత్త్రుఁ డుదయింపఁగలఁడు. వాఁడె నాకు
వంశకరుఁ డయ్యెడిని. ఈనావచనము సత్యమని నమ్ముము. ఋతుస్నాత

గ్గాయె నీతల్లి యశ్వత్థమును, నటులే, నీవుదుంబరవృక్షమును గౌఁగిలించికొనుఁడు. పిదప మీయిరువురకోర్కులును దీఱెడిని. మఱియు మంత్రపూతమగు నాయీయొసంగిన చరుద్వయమును భుజింతురేని తప్పక మీయిరువురకును బుత్త్రులు గల్గుదురు." అని తెలిపెను. పిదప సత్యవతి సంతసించి తల్లితోఁ దనభర్త పలికినపలుకులెల్ల విసరించి తెలిపెను. పిమ్మటనామె, సత్యవతితో "ఓపుత్త్రీ! నీకు నీభర్త సంబంధముకన్న నాసంబంధము మొదటిదగుట నేను నీకు మన్నింపఁదగినదానను గదా! కావున నాయీవచనము నాదరింపుము. నీకు నీభర్త మంత్రపురస్కృతముగాఁ జరువొసంగెను గదా! అందు నీకొసంగిన చరువు నాకిచ్చి, నాది నీవు తీసికొనుము. అటులే వృక్షపరిష్వంగవ్యత్యాసములను సైతము మన మొనర్చుకొనవలసియున్నది. ఓసుశీలా! తల్లినగునామాట నీకుఁ బ్రమాణమేని, యిటులొనర్పవలయును. తనసంతాన ముత్తమమైయుండవలయునని యందఱును గోరుట వింతకాదు గదా! అటులగుట నీభర్త తప్పక యటులే యొనర్చి యుండును. కావున నీకొసంగిన చరువునందును, వృక్షమందును, నాకు భావము గలదు. నీభ్రాత యెటులధికుఁ డగునో యటు లాలోచింపుము." అని యామె తనపుత్త్రికను గోరెను. పిదప వారిరువురును ఋచీకుని నియోగమును వ్యత్యాసముగా నొనర్చిరి. ఓయుధిష్ఠిరా! పిమ్మట వారిరువురును గర్భములను ధరించిరి. అపుడమ్మహర్షి గర్భధారిణియగు తనభార్యను గాంచి కుపితుఁడై 'ఓసత్యవతీ! నీవు చరువ్యత్యాసము చేసినట్లున్నది. అటులే పాదపాలింగనముసైతము వ్యత్యస్తముగా నొనర్చుట స్పష్టమే. బ్రహ్మతేజమంతయు నీకొసంగిన చరువునం దుంపఁబడినది. నీతల్లి చరువున క్షత్త్రతేజము నుంచితిని. త్రిలోకవిఖ్యాతుఁడగు విప్రుఁడు నీకును, సుత్తమక్షత్త్రియుఁ డామెకును జనింపవలయునని నే నటులొనర్చితిని. కాని, నీవును నీతల్లియు, నానియోగమును వ్యత్యాసముగ నొనర్చుటచే నీ తల్లికి బ్రాహ్మణోత్తముఁడును, నీకు గ్రకర్ముఁడగు క్షత్త్రియుఁడును దప్పక జనింతురు. ఓభామినీ! నీవు మాతృస్నేహముచే నాచెప్పిన చొప్పునఁ జేయమి నిట్లు గాక తప్పదు." అని పలికెను. ఆతని పలుకు లాలించి యాసత్యవతి శోకసంతప్తయై, తెగినతీగవలెఁ బుడమిఁబడి, కొంత తడవునకుఁ దెలివొంది, సవినయముగా నమస్కరించి యాగాధిపుత్త్రి

తన భర్తతో "ఓ బ్రహ్మవిద్వరా! ఇట్లు ప్రతిమాలుచున్న నన్నను గ్రహింపుము. నాకు క్షత్రియుఁడు పుత్రుఁడుగా వలదు. నీమాట తప్ప దేని నాపౌత్రుఁడు క్షత్రియుఁడగునట్లు లనుగ్రహింపుము. కాని నా తనయుఁడు మాత్రము క్షత్రియుఁడు కాఁదగదు. నా కిట్టివర మొసంగుము" అని ప్రార్థించెను. అది విని యమ్మహాతపుఁ డట్లేయగునని పలికెను. పిమ్మట నాసత్యవతి జమదగ్నియను పుత్రునిఁ గనియెను. ఆగాధిపత్ని విశ్వామిత్రునిఁ గనియెను. ఆబుుషి యనుగ్రహముచే నావిశ్వామిత్రుఁడు బ్రహ్మవాదియగు బ్రహ్మర్షి యయ్యెను. బ్రాహ్మణత్వము నొందిన యా విశ్వామిత్రుఁడు క్షత్రియుఁ డయ్యు బ్రహ్మవంశకారకుఁ డయ్యెను. ఆతనిపుత్రులును, మహాత్మ్యము గలిగి బ్రహ్మవంశవివర్ధను లై తపోనిష్ఠులును, బ్రహ్మవేత్తలును, వంశకర్తలు నయిరి. మధుచ్ఛందుఁడును, దేవరాతుఁడును, శకుంతుఁడు, బభ్రువు, కాలపథుఁడు, యాజ్ఞవల్క్యుఁడు, స్థూణుఁడు. ఉలూకుఁడు, ముద్గలుఁడు, సైంధవాయనుఁడు, వల్గుజంఘుఁడు, గాలవుఁడు, రుచి, వజ్రుఁడు, సాలంకాయనుఁడు, లీలాఢ్యుఁడు, నారదుఁడు, కూర్చాముఖుఁడు, వాహులి, ముసలుఁడు, వక్షోగ్రీవుఁడు, ఆంఘ్రికుఁడు, నైకదృక్కు, శిలాయూపుఁడు, శితుఁడు, శుచి, చక్రకుఁడు, మారుతంతవ్యుఁడు, వాతఘ్నుఁడు, ఆశ్వలాయనుఁడు, శ్యామాయనుఁడు, గార్గ్యుఁడు, జాబాలి, సుశ్రుతుఁడు, కారీషి, సంశ్రుత్యుఁడు, పరుఁడు, పౌరవుఁడు, తంతువు, కపిలుఁడు, తాడకాయనుఁడు, ఉపగహనుఁడు, అసురాయణి, మార్గమర్షి, హిరణ్యాక్షుఁడు, జంఘారి, బాభ్రవాయణి, సూతి, విభూతి, సూతుఁడు, సూరకృత్తు, అరాణి, నాచికుఁడు, చాంపేయుఁడు, ఉజ్జయనుఁడు, నవతంతువు, బకనఖుఁడు, సయనుఁడు, యతి, అంభోరుహుఁడు, అమత్స్యశి, శిరీషి, గర్దభి, ఊర్జయోని, ఉదాపేక్షి, నారది అను వీరెల్లరును బ్రహ్మవాదులైన విశ్వామిత్రుని పుత్రులే. ఓ రాజా! అటులు విశ్వామిత్రుఁడు క్షత్రియపుత్రుఁడయ్యు బుుచీకునిచే నుంపఁబడిన బ్రహ్మతేజమని తెలియుము. సోమసూర్యాగ్ని తేజుఁడగు విశ్వామిత్రుని యుత్పత్తివిధమెల్లఁ దెలిపితిని గాదే! నా తెలిపినవిషయములలో నెందెందు సందియమొదవునో, యందెల్ల నడిగి యాసంశయములను దీర్చుకొనుము" అని తెలుప విని యుధిష్ఠిరుఁ డిట్లనియె.

## శుకవాసవసంవాదము

"ఓపితామహా! క్రౌర్యరహితముగు ధర్మముగల భక్తజనుని గుణముల వినఁ గోరుచున్నాఁడను. నా కెఱిఁగింపుము."

అది విని భీష్ముఁడు "ఓధర్మజా! నీవడిగినయర్థమున కుదాహరణముగా, నొక పురాతనేతిహాసము గలదు. అయ్యది శుకవాసవులకు జరిగిన సంవాదము. దానిం దెలిపెదను వినుము. కాశిరాజు దేశమున నొక గ్రామమునుండి వెడలి యొకవేఁటకాఁడు విషయుక్తమగు బాణముచే నొకమృగమును వేఁటాడ నారంభించి చరింపఁ దొడంగుటయు, నామిషలుబ్ధకుఁడగు నాలుబ్ధకున కొక వనమునఁ జేరవగాఁ గొన్నిమృగములు గానవచ్చెను. అపు డాలుబ్ధకుఁ డామృగములపై విడిచినసాయకము గుఱితప్పి యందొక వనవృక్షమునకుఁ దగిలెను. ఆసాయక మతితీవ్రవిషదిగ్ధ మగుటచే దానిప్రహారమున నత్తరువుఫలపత్రాదులు దుల్ల నెండసాగెను. అత్తరువట్లు శుష్కించినను దానితొఱ్ఱలోఁ జిరకాలము నుండి నివసించియున్న యొకశుకము తద్వృక్షమునెడఁగల భక్తిచే దానిని విడువకుండెను. అటు లాశుక మావృక్షమును విడిచి పోక, యాహారమునకెందులకును బోకుండుటఁ గృశించి, మాటాడనైనఁజాలకుండియుఁ గృతజ్ఞతగలదగుట నావృక్షముతోఁగూడ దానును శుష్కింప నారంభించెను. అటు లామానుషచేష్ట వెలయ నుదారబుద్ధియై సమసుఖదుఃఖమై మహాసత్త్వముగల యాచిలుకవిధముఁ జూచి విస్మయావిష్టుఁడై యింద్రుఁడు "ఆహా! ఈపక్షి తిర్యగ్యోనులకు సంభావింపరాని కృత్యము నెట్లవలంబించెను? దీని యానృశంస్య మెన్నఁదగినది గదా! అవును. ఇందుఁ జిత్రమేమియు లేదు. ఇట్టిబుద్ధి యన్నిప్రాణులకు నన్నిటియందును గలుగవచ్చును." అని తలంచి, యతఁడు మానుషమగు బ్రాహ్మణరూపమూని పుడమికి డిగి, యాపక్షిని సమీపించి "ఓపక్షీంద్రా! శుకమా! నిన్నొకటి ప్రశ్నించుచున్నాఁడను. ఈ వృక్షమునేల విడువవు?" అని ప్రశ్నించెను. అంత నాచిలుక తల వాంచి నమస్కరించి "ఓదేవరాజా! నాతపముచే నిన్నెఱింగితిని. నీకు స్వాగతమా!" అని పలికెను. పిమ్మట నాయింద్రుఁడు మేలు మేలని పలికి 'ఆహా! ఏమి? దీని విజ్ఞానము!' అని తన మనమ్మున నతఁడు

దాని గౌరవించి పరమధార్మికమును, శుభారంభమునగు నాచిలుకవిధ మెఱింగియు నది పడుచున్నకష్టమును బ్రశ్నించుచు "ఓశుకరాజమా! ఈవృక్షము పత్రశూన్యము, ఫలరహితమునై శుష్కించి పక్షులకు నివాసస్థానము గాక యున్నది గదా! ఈమహారణ్యమున దీని నింకను నాశ్రయించి యుంటివేల? పత్రసంఛన్నకోటరములగు పెక్కువృక్షము లిందుఁ గలవు గదా! స్వేచ్ఛాసంచారము జేయుటకుఁ దగు నెన్నేని వృక్షము లిందున్నవి ఈవృక్షమన్ననో సారము చెడినదియు, నాయువు చెల్లినదియు, సామర్థ్యము లేనిదియు నై శోభచెడి యున్నది. కావున నీబుద్ధిచే విమర్శించి యీముదుసలి చెట్టును విడువుము." అని బోధించెను.

ఓయుధిష్ఠిరా! ఆయింద్రునివచనమును విని ధర్మాత్ముఁడగు నాశుకరాజు దీనమానసుఁడై నిట్టూర్పులు విడిచి యాయింద్రునితో "ఓశచీనాథా! దైవతము లనతిక్రమణీయములు గదా! ఓసురోత్తమా! నీయడిగినప్రశ్నమున కుత్తర మొసంగెదను వినుము. నే నీవృక్షము నందుఁ బుట్టి, దీనియందే పెరిగి వైరులయొట్టిబాధలను బొందక సుఖముగా నిన్నినాళు లుంటిని నీవు నాచిత్తమున కిపు డిట్లు కలఁత గలిగించి వైఫల్యము పుట్టించెదు! పరదుఃఖదుఃఖితుఁడును నభియుక్తుఁడును ననన్యభక్తుఁడునగు నాకిట్టివిధము సమ్మతము గాదు. సాధులగు వారి కనుక్రోశమే గొప్ప ధర్మలక్షణము. సాధువులయనుక్రోశ మెంతయుఁ బ్రీతి గల్గించెడిని. ధర్మసంశయములు గల్గినపుడు వానిని నీవలనఁగదా సకలదేవతలును దీర్చికొందురు! అటులగుటనే నీవు దేవతలకెల్ల నధిపతిగాఁ బ్రతిష్ఠింపఁబడితివి. కావున నోసహస్రాక్షా! ఎప్పటికేని నన్నీవృక్షమునుండి విడిపింపరాదు. మున్ను సమర్థమై యున్న దీనివలన జీవించి యిపు డెట్లు విడువఁగలను?" అని తెలిపెను.

సౌమ్యమగు నాపక్షివచనముల కెంతయు నాదేవరాజుసంతసిల్లి, దానియానృశంస్యమును మెచ్చికొనుచు, దాని నొకవరము గోరికొమ్మని పలికెను. అపు డది తద్వృక్షసంభవమును గోరెను. అపు డాయింద్రుఁడు దానిదృఢభక్తిని, దానిసౌశీల్యమును, దెలిసికొని ప్రీతుఁడై వడిగా నావృక్షము నమృతముచేఁ దడిపెను. పిమ్మట నమ్మహాతరువు, మనోహరములగు శాఖలును పత్రములును ఫలములును గలిగి,

యాచిలుకదృఢభక్తివలన నెప్పటివలె నలరారఁ జొచ్చెను. ఆచిలుకయు నాయానృశంస్యకర్మముచేఁ దనయాయువుతుదిని శక్రసాలోక్యమును బొందెను. ఓరాజా! ఇటులే భక్తిగలవాని నాశ్రయించినచో మానవుఁ డాచిలుకగలవృక్షమువలె సకలార్థసిద్ధులను బొందఁ గలుగుచున్నాఁడు." అని తెలుప విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె.

దైవపురుషకార తారతమ్యకథనము

"ఓసకలశాస్త్రవిశారదా! మహాప్రాజ్ఞా! పితామహా! దైవపురుషకారములలో నెయ్యది శ్రేష్ఠతరమైనదో తెలుపుము."

అది విని గాంగేయుఁడు, "ఓధర్మజా! నీవడిగినయర్థమున కుదాహరణముగా, నొకపురాతనేతిహాసము గలదు. అయ్యది వసిష్ఠబ్రహ్మలకు జరిగినసంవాదము. దానిం దెలిపెదను వినుము. దైవమానుషములలో నెయ్యది యుత్తమమో యెఱిఁగించెదను. మున్నొకపుడు భగవానుఁడగు వసిష్ఠుఁడు పరమేష్ఠిని బ్రశ్నింప, నప్పద్మోద్భవుఁడు, హేతుయుక్తమై యర్థవంతమగు నొకవాక్యము మధురముగా నిట్లనియె.

"ఓవసిష్ఠా! ఏదియు బీజములేక జనింపదు. బీజములేక ఫలము గల్గదు. బీజమునుండియే బీజము పొడముచున్నది. బీజమునుండియే ఫలము గల్గుచున్నది. కర్షకుఁడు క్షేత్రమున నెట్టిబీజ ముంచునో యట్టిఫలమందును. అటులే సుకృతదుష్కృతములందును ఫలము గల్గుచున్నది. ఆక్షేత్రముననుంచిన బీజ మెట్లు నిష్ఫలమగునో యటులే పురుషకారము లేక కార్యము సిద్ధింపదు. పురుషకారము క్షేత్రముగను, దైవము బీజముగను నుదాహరింపఁబడును. ఆక్షేత్రబీజముల సంయోగముచే సస్యము సమృద్ధమగుచున్నది. కర్త, కర్మఫలనిర్వృతిని దానే యనుభవించుచున్నాఁడు. ఉపకారాపకారములకు లోకమున బ్రత్యక్షముగా ఫల మగపడుచుండును. శుభకర్మముచే సౌఖ్యమును బాపకర్మముచే దుఃఖమును గల్గుచున్నవి. ఎల్లవారికిని గృతమే ఫలించునుగాని యకృత మెుకపుడును ఫలింపదు. కర్మసమర్థుఁడగువాఁడు భాగ్యయుక్తుఁడగు ప్రతిష్ఠ నెల్లెడలఁ బొందుచున్నాఁడు. సరిగాఁ గర్మ మొనర్పనివాఁడు భ్రష్టుఁడై క్షతక్షారావసేచన మొందుచున్నాఁడు. తపముచే రూపసౌభాగ్యమును వివిధరత్నములును లభ్య

ములగును. కర్మము చేతనే సకలమును లభించునుగాని యకృతాత్మునకు దైవము తోడ్పడుట కల్ల. అటులే స్వర్గము భోగములు స్థిరత్వము పాండిత్యము సర్వమును బురుషకారముచేతనే లభించుచున్నవి. నక్షత్రములు చంద్రార్కమారుతములు, త్రిదశులు, నాగులు, యక్షులు, మున్నగువారందఱును బురుషకారముచేతనే దేవత్వము నొందిరి. అర్థముగాని, మిత్రవర్గముగాని, యైశ్వర్యముగాని, సత్కులముగాని, సిరియుఁగాని, యేదియేని యకృతకర్ములగువారి కనుభవార్హము గాదు. బ్రాహ్మణుఁడు శౌచముచేతను, క్షత్రియుఁడు విక్రమము చేతను, వైశ్యుఁడు ప్రయత్నముచేతను, శూద్రుఁడు శుశ్రూషచేతను సిరుల నందుచున్నాఁడు. దానము చేయనివానిని, విక్రమము లేనివానిని, క్రియాశూన్యుని, కర్మరతుఁడుగానివానిని, శౌర్యరహితుని, దపోవిముఖుని, నర్థములు సేవింపవు. మూఁడులోకముల నెవ్వఁడు సృజించెనో దేవదానవుల నెవ్వఁడు సృజించెనోయట్టి భగవానుఁడగు విష్ణువును సముద్రమునఁ దపముచేయుచున్నాఁడు. నిజకర్మము ఫలముగాకుండెనేని సర్వము నిష్ఫలమే యగుచున్నది. మఱియు నటులేని, లోకము దైవమునే నిశ్చయించుకొని కర్మోదాసీనుఁడు కావచ్చునుగదా? ఎవ్వఁడు మానుషకర్మమును బరిత్యజించి దైవమునే నమ్మి యనువర్తించునో, వాఁడు, నపుంసకుని భర్తగాఁ బడసిన పడఁతివలె వ్యర్థశ్రమము నొందుచున్నాఁడు. ఊర్ధ్వలోకములందెట్లు లల్పకర్మముచే ఫలము గల్గుచున్నదో యట్లు మానుషలోకమున శుభాశుభ ఫలము గల్గుట గానరాదు. ఇఁకఁ బురుషకారమన్ననో దైవమునే యనువర్తించును. కర్మ మొనర్పనివాని కెవ్వనికిని దైవము ఫల మొసంగఁడు. దైవతములకును వారివారిస్థానము లనిత్యములుగాఁ గానవచ్చుచున్నవిగదా! కర్మము లేక దైవ మెట్లుండును? ఎట్లు నిలువఁ గలఁడు? ఈలోకమున నెవ్వనిపుణ్యరూపవ్యాపారమును దైవతము లనుమోదింపరు. మఱియు నాత్మాభిభవశంకచే మానవులపుణ్య వ్యాపారమునకు విఘ్నకరముగు ప్రయత్న మొనరింతురు. ఇట్లు దేవతలకును మహర్షులకును గర్మపరత్వము లేకపోలేదు. కాని దైవాభావమును జెప్పుటకు వలనుపడదు. దేనివలన దైవము ప్రవర్తించునో యట్టికర్మము దైవములేక జనించుటెట్లు? ఇట్లు స్వర్గమందును బరము

సుఖము నొందనగుచున్నది. తనయాత్మయే తనకు బంధువు. తన యాత్మయే తనకు శత్రువు. కృతాకృతముల కాత్మ కాత్మయే సాక్షి. కర్మ మొనర్పఁబడినపుడే కృతాకృతములలో నేదేని సిద్ధించును. సుకృతదుష్కృతములు, కృతార్థుఁడు గానివానిని బొందనేరవు. దేవతలకును బుణ్యమే శరణము. సమస్తమును బుణ్యముచేఁ బొందనగుచున్నది. పుణ్యశీలుఁడగు మానవునొంది దైవమేమి చేయఁగలుగును? మున్ను యయాతి విభ్రష్టుఁడై పుడమిఁ బడఁద్రోయంబడియెనుగాదే? పిదప నాతనిమనుమలు పుణ్యకర్ములై మఱియు నాతని స్వర్గము నొందింపలేదా? మున్ను పురూరవుఁడను రాజర్షి బ్రాహ్మణులచే నెన్నంబడి యైలుఁడను ప్రసిద్ధివడసి స్వర్గము నొందెను. అశ్వమేధాదియాగములచే సత్కారార్హుఁడైన కోసలాధీశుఁడగు సౌదాసుఁడు మహర్షిశాపమువలనఁ బురుషాదిత్వమొందెను. అశ్వత్థాముఁడు, రాముఁడు అనుమునిపుత్రులు, నిజకర్మవశముచే స్వర్గమునకుఁ బోఁజాలరైరి. వసువు రెండవవాసవునట్లు నూఱుయజ్ఞము లొనర్చి యొకమిథ్యోక్తిచేఁ బాతాళమున నడఁగియుండెను. వైరోచనుఁడగుబలి దైవతములచే ధర్మపాశబద్ధుఁడై విష్ణుని పురుషకారముచేఁ బాతాళవాసి గావలసివచ్చెను. ఇంద్రు నిరథోపస్థమునఁ బురీషము విడిచియు, ద్విజస్త్రీవధ మొనర్చియు, జనమేజయుఁడు దైవానుగ్రహముచే దోషమునుండి నివారింపఁబడలేదా? తెలియక బ్రాహ్మణునిఁ జంపి బాలవధ మొనర్చినవైశంపాయనుఁడు, దైవముచే నివారింపఁబడలేదా! మున్ను నృగమహారాజునకు గోప్పయజ్ఞమున నొనర్పఁబడిన గోప్రదానముచే నసత్యదోషము సంభవించి కృకలాసత్వ మొందవలసి వచ్చెను. దుంధుమారుఁడను రాజర్షి సత్రకర్మములందే ముసలితన మొంది దేవదత్తమగువరమును బరిత్యజించి గిరివ్రజమున నిద్రింపవలసివచ్చెను. కావునఁ బుణ్యము నొకపుడు ఫలింపకుండుట తటస్థించును. మహాబలులగు ధార్తరాష్ట్రులచే నపహృతమగు పాండవుల రాజ్యము కేవలభుజపరాక్రమముచే మరల సంపాదింపఁబడియెనుగాని దైవముచే సిద్ధించెనా! సంశితవ్రతులై తపోనియమసమన్వితులైన మునులు దైవబలముచే శాపమును విడుచుచున్నవారా? కర్మముచేతనే విడుచుచున్నారు! లోకమునఁ బాపాత్మునకు దుర్లభమగు

నైశ్వర్యాదికము గల్గియుఁ దోఁగుచున్నది. లోభమోహాసమా పన్నుఁడగువానిని దైవము రక్షింపఁడుగదా! అగ్ని సూక్ష్మమయ్యు నెట్లు గాలిచేఁ గదల్పఁబడి వృద్ధినొందునో, యటులే సత్కర్మాచరణ శీలుఁడగువాఁడు దైవబలముచే వృద్ధినొందుచున్నాఁడు. తైలము తగ్గినకొలఁదిని దీప మెట్లు తగ్గుచుండునో యటులే కర్మక్షయమునుబట్టి దైవానుకూల్యమును దరుగుచుండును. విస్తారమగుధనముగాని, భోగములుగాని, కాంతలుగాని గల్గియు సత్కర్మహీనుఁడు వాని ననుభవింపఁజాలఁడు. సరిగా నార్జింపఁబడి దైవతములచే రక్షింపఁబడినయర్థమును మహాత్ముఁడగుపురుషుఁడు శాశ్వతముగా ననుభవించును. కర్మముచే సాధువగువాఁడు ధనాదిగుణహీనుఁడయ్యు వానిని దేవతలాశ్రయింతురు. మఱియు వాఁడు మనుజలోకమందును దేవలోకమందును విశిష్టుఁడగుచున్నాఁడు. శ్మశానతుల్యమగు మానవుని గృహమునైన, దేవత లనుగ్రహింతురేని మిక్కిలి సమృద్ధి గల్గునట్లు గాఁ జూతురు. కర్మహీనునకుఁ దృప్తి యుండదు. మఱియు నట్లు వాని నపమార్గమునుండి దేవతలును దప్పింపఁజాలరు. కావున దైవమునకును బ్రభుత్వము లేదు. గురుని శిష్యుఁ డట్లు దైవ ముత్తమకర్మమునే యనుసరించుచుండును. ఎందెందుఁ బురుషకారము చేయఁబడునో యందందు దైవ మాపురుషకారముగలవానిని దీసికొనిపోవుచుండును. ఓమునిసత్తమా! ఇదియెల్ల నీకు నేఁ దెలిపితిని గదా! కావున నెల్లవుడును యథార్థముగాఁ బురుషకారమున ఫలమును గాంచి దైవానుకూల్యమునుబట్టి యారంభింపఁబడిన యుత్తమకర్మముచే స్వర్గము నొందును." అని పరమేష్ఠి తెలిపె" నని పలుక విని యుధిష్ఠిరుఁడు మఱియు ని ట్లనియె.

## కర్మఫలప్రవచనము

"ఓపితామహా! సమస్తశుభకర్మములకును గలఫలము లెట్టివో వినఁ గోరుచున్నాఁడను. నా కెఱిఁగింపుము."

అది విని యప్పితామహుఁ డాతనితో "ఓధర్మజా! నీవడిగితివి గానఁ దెలిపెదను. అది మహర్షులరహస్యము. వినుము. మరణించిన పిదప నే కర్మముచే నెట్టిగతి పొందఁబడుచున్నదో వినుము.

ఎవ్వఁ డేయేశరీరముచే నెట్టికర్మ మొనర్చుచున్నాఁడో యాయా శరీరముచే వాఁడాయాఫల మనుభవించుచున్నాఁడు. మఱియు నేయేయవస్థలో మానవుఁ డేయేశుభము నాచరించునో యాయా యవస్థలోఁ బ్రతిజన్మమునందును దానిదాని ననుభవించుచున్నాఁడు. చిత్తపంచేంద్రియములచేఁ జేయఁబడినకర్మము నశింపదు. ఆకర్మమున కాపంచేంద్రియములును నాఱవదగునాత్మయు నిత్యము సాక్షులై యుండును. అభ్యాగతునియెడ దృష్టిని మనస్సును సూనృతవచనమును గూర్చి గౌరవింపవలయును. వాని ననుసరింపవలయును. వానిసమీపమునఁ గూరుచుండవలయును. అట్టికృత్యము పంచదక్షిణలుగల యజ్ఞమగును. ఎవఁడు త్రోవనడుమఁ బోవువాని కాయాసము దొలఁగునట్లుగా నన్నము పెట్టునో, మున్నెన్నఁడును రాక యలసి వచ్చిన వాని కన్నము పెట్టిన యమ్మహాత్మునిపుణ్య మమానమై యుండును. స్థండిలశయనవ్రత మాచరించినవారికి శయనములును, గృహములును, జీరవల్కలధారులై నియమమూనినవారికి వస్త్రములు, నాభరణములును, యోగయుక్తాత్ములగు తపోధనులకు వాహనములును, యానములును, నగ్నిసమీపమున శయనించిన రాజునకుఁ బౌరుషమును, రసములను బరిత్యజించినవారికి సౌభాగ్యమును, మాంసములను బరిత్యజించినవారికిఁ బశువులును బుత్రులును ఫలముగాఁ గల్గును. తలక్రిందై వ్రేలాడుచుఁగాని, నీటనుండిగాని, యెల్లప్పుడు నొంటరిగా శయనించిగాని యెవ్వఁడు తప మొనర్చునో వాఁడు తన కభీప్సితము నొందుచున్నాఁడు. పాద్యము, నాసనము, దీపము ప్రతిశ్రితమగునన్నము, నతిథిపూజకై సంపాదించి, వానిచే నారాధించినది పంచదక్షిణమగుయజ్ఞ మనఁబడుచున్నది. వీరాసనమును, వీరశయ్యను, వీరస్థానమును బొందినవాని కక్షయలోకము లగును. మఱియు నెల్లకోర్కులును సిద్ధించును. దానముచే ధనము గల్గుచున్నది. మౌనముచే నాజ్ఞ చెల్లును. తప మొనర్చినచో సుఖభోగములును, బ్రహ్మచర్యముచే నాయువును, నహింసాచరణముచే రూపమును, నైశ్వర్యముచే నారోగ్యమును గల్గుచున్నవి. ఫలమూలములను దినుచుఁ దప మొనర్చినచో రాజ్యమును, పర్ణాహారులై చరించినవారికి స్వర్గమును నగును. ఓరాజా! ప్రాయోపవేశ మొనర్చినవాఁ డెల్లెడల

సుఖ మనుభవించును. శాకదీక్షగలవాఁడు పెక్కుగోధనముగలవాఁడగును. తృణాశనుఁడు స్వర్గసౌఖ్యము లందుచున్నాఁడు. త్రిషవణస్నానదీక్షగలవాని కుత్తమ కాంతాసౌఖ్య మొదవును. వాయుభక్షణనియమముగలవానికిఁ గ్రతుఫలము గల్గును. సత్యభాషణముచే స్వర్గము సమకూరును. యజ్ఞదీక్షచే నుత్తమకులము గలుగును. సలిలాశియు, నవాగ్నిసంస్కారము గలవాఁడును, వాయుధారణగలవాఁడును, రాజ్యము నొందుచున్నాఁడు. నిరాహారవ్రతి స్వర్గము నొందును. ఉపవాసదీక్షయును, నభిషేకమును, బండ్రెండువత్సరములొనర్చినవానికి వీరస్థానమును మించిన యుత్తమస్థానమగును. సకలవేదములను జదివినవాఁడు సద్యోదుఃఖమునుండి విడివడుచున్నాఁడు. దుర్మతుల కెయ్యది దుస్త్యజమో, ముదుసలి యయ్యు నేదానికి వార్ధకము గలుగదో, యేయది ప్రాణాంతకరోగ మనఁదగియుండునో, యట్టి మానసధర్మమగు తృష్ణను బరిత్యజించినవానికి సుఖమగుటయె గాక స్వర్గమగుచున్నది. వేయిగోవులలోనైన వత్సము తనతల్లి నెట్లు తెలిసికొనునో, యటులే పూర్వకృతకర్మను కర్తను వెదకి వెదకి వచ్చి తెలిసి చేరును. ఎవ్వరిచేనైనను బ్రేరింపఁబడకయే పుష్పఫలాదు లెట్లు తత్తత్కాలముల నతిక్రమింపక గల్గుచుండునో యటులే పురాకృతకర్మము సైతము నిజకాలము నతిక్రమింపక ఫలించుచుండును. ముసలియగుచుండఁ గేశములు పండును. దంతము లూడును. కన్నులదృష్టి చెడును. చెవులవినికి తగ్గును. ఒక్కయాశమాత్రము వార్ధకము నొందదు. తండ్రిని సంతసింపఁ జేసినచోఁ బ్రజాపతి ప్రీతుఁడగుచున్నాఁడు. తల్లిని సంతసింపఁజేసినచోఁ బుడమి పూజింపఁబడె ననవచ్చును. ఉపాధ్యాయునిఁ బ్రీతునిఁ గావించినవానికి బ్రహ్మ పూజితుఁడగుచున్నాఁడు. తల్లియుఁ దండ్రియు నుపాధ్యాయుఁడును నాదరింపఁబడుదురేని సకలధర్మములు నాదరింపఁబడుచున్నవి. ఈమువ్వురు నాదరింపఁబడరేని వాని క్రియలెల్ల నిష్ఫలము లగును" అని తెలిపెను.

ఓజనమేజయా! భీష్ముని యావచనమును విని యుధిష్ఠిరాదులగు కురుపుంగవులు విస్మయావిష్టులై యమందానంద మొందిరి. మంత్రము వ్యర్థముగా నుపయోగింపఁబడినపుడును, సోమము వ్యర్థముగా నభిషూయమాణ మగునపుడును, నగ్ని వ్యర్థముగా హోమము చేయఁబడి

నపుడును గల్గెడి పాపమెల్ల నసత్యవాది కగుచున్నది." అని తెల్పి భీష్ముఁడు మఱియు వారినారసి, "ఓయీ! ఋషిప్రోక్తమగు నీవిషయము దెలిపితిని. శుభాశుభఫలప్రాప్తివిధ మిట్టిదని తెలియుఁడు. ఇంక నేమి వినఁగోరెదు?" అని పలుక విని యుధిష్ఠిరుఁ డిట్లనియె.

### భీష్ముఁడు తననిశ్చయ మెఱిఁగించుట

"ఓపితామహా! నీ కెవ్వరు పూజ్యులో, యెవ్వరు నీకు నమస్కార్యులో, నీవెవ్వరిని బూజించెదో, యెవ్వరిని వాంఛించెదో, యదియెల్ల నా కెఱిఁగింపుము. మిక్కిలిగా నాపదలో నుండియు నీచిత్తము దేనియందుంచెదో, యీమానవలోకమున నెయ్యది యిహపరముల కగునో నాకుఁ దెలుపుము."

అది విని గాంగేయుఁ డప్పాండవేయునితో "ఓయుధిష్ఠిరా! ఎవ్వరికి వేద ముత్తమధనమో, మఱియు స్వర్గము స్వప్రత్యయమో, మఱియు నెవ్వరికి స్వాధ్యాయసాధనమగు తపము కాంక్షితమో, యట్టిబ్రాహ్మణులను గోరుచుందును. మఱియు నెవ్వరిబాలురును వృద్ధులును బితృపైతామహమగు నాచారమును, విడువకుందురో, యట్టివారిని నేను గోరుచుందును. విద్యాస్వభావనిరతులును, దాంతులును, మృదుభాషులును, శ్రుతవృత్తోపపన్నులును, బ్రహ్మవిదులును, సజ్జనులు నగువారిని నేను వాంఛింతును. సంఘముగా హంసలట్లు సభలలో మాటలాడునట్టి యుత్తమబ్రాహ్మణులకు నమస్కరింతును. శుభాకారులును, దివ్యజీమూతనిస్వనులు నై యెవ్వరు స్పష్టోచ్చారణముగా వేదాదులఁ బలుకుదురో యట్టిబ్రాహ్మణుల నాదరింతును. వారిని రాజు సేవించునేని వానికి వా రిహపరముల సుఖావహు లగుదురు. మఱియు నెవరట్టి ద్విజులసదుక్తులను సభలో నాలకింతురో, విజ్ఞానగుణసంపన్నులగు నట్టివారిని నైతము నే వాంఛింతును. మఱియు నెవ్వరు బ్రాహ్మణులకు లెస్సగా సంస్కరింపఁబడి గుణవంతములై పవిత్రములైన యన్నములను దృప్తికరముగా నొసంగుదురో, నియతాత్ములగు నట్టివారును నా కాదరణీయులే. ఓయుధిష్ఠిరా! మఱి యొకటి తెలిపెదను. వినుము. రణరంగమున నిలిచి యుద్ధము చేయుటకును, దానమున వెనుదీయకుండుటకును దగియుందురో, యట్టిశూరులును వీరు

లును లోకమున వందలకొలందిగా నుందురు. వారిని బరిగణించినపుడందు దానశూరుఁడు విశిష్టుఁ డగుచున్నాఁడు. ఓయీ! నేను నీచ బ్రాహ్మణుఁడనై జనించినను ధన్యుఁడననియే తలంచెదను. ఇఁక నుత్తమకులమున జనించి తపోదానపరాయణుఁడనై ధర్మనిశ్చయుఁడనైనచోఁ జెప్పవలసిన దేమి? ఓపాండునందనా! ఈలోకమున నీకంటె నాకుఁ బ్రియతరుఁడు లేఁడు గదా! అట్టి నీకన్నను బ్రాహ్మణులు నాకు ప్రియతరులు. ఓకురూత్తమా! నీకంటె బ్రాహ్మణులే నాకెంతయుఁ బ్రియతములు. అట్టిసత్యముచేతనే నాతండ్రియున్న యుత్తమలోకములకేఁగెదను. ఇంత యేల! నాకు నాతండ్రిగాని, నాతండ్రి తండ్రిగాని, యింకను గల మిత్రు లెవ్వరేనిగాని బ్రాహ్మణులకన్నఁ బ్రియతములు గారు. సాధుకర్ములగువారియెడ నాకల్పముగాని, యధికముగాని ఫలాశ లేదు. మనోవాక్కర్మములచే నేను బ్రాహ్మణుల, కేమేనారాధనమొనర్తునో యట్టిదానిచే నా కెట్టివ్యథయును లేదు. నన్ను బ్రాహ్మణాసక్తుఁడనని తెలుపుదురు. అట్టివచనమునకే నేను సంతసించుచుందును. నాకిదియే పవిత్రములైన సకలశ్రేయములకును నుత్తమమైనదిగా నిశ్చితమగుచున్నది. బ్రాహ్మణులను సంతోషపఱచుటవలనం బవిత్రములైన యుత్తమలోకములు నొందనగునని చూచుచున్నాఁడను. ఓయుధిష్ఠిరా! నేనాలోకములకు వడిగాఁ బోయి చిరకాలమందుండవలయునని కోరుదును. లోకమున స్త్రీలకు భర్త్రాశ్రయ మెట్లు కోరఁదగినదియో, యటులే క్షత్త్రియునకు బ్రాహ్మణుల యాశ్రయము కోరఁ దగియుండును. బ్రాహ్మణులే వారికిఁ బరమదైవతములు. క్షత్త్రియులకు వారు తప్ప వేఱొకగతి లేదు. నూఱేండ్లుగల క్షత్త్రియునకుఁ బదేండ్లుగల బ్రాహ్మణుఁడు తండ్రియు నాక్షత్త్రియుఁడు కొడుకు ననఁ దగియుండురు. అందు బ్రాహ్మణుఁడే గురుఁ డగుచున్నాఁడు. ఆఁడుది తనకు మగఁడు లేనపుడు భర్తృసోదరుని భర్తనుగాఁ జేసికొనుచున్నది. అటులే బ్రాహ్మణుఁడు లభింపనపుడే పృథివికి క్షత్త్రియుఁ డధిపతి గావలసి వచ్చెను. బ్రాహ్మణులు క్షత్త్రియులకుఁ బుత్రులట్లు రక్షణీయులును, గురువులట్లు లుపాస్యులు నగుచున్నారు. ఓకురుసత్తమా! మఱియు విప్రు లగ్నివలె క్షత్త్రియున కుపచరింపఁదగి యున్నవారునై యుండుదురు. ఋజుబుద్ధులును, సజ్జనులును, సత్యశీలురును, సర్వ

భూతహితరతులును నగు బ్రాహ్మణులను, కుపితములగు సర్పములను బోలె నుపచరింపవలయును. ఓయుధిష్ఠిరా! తప స్తేజములకు నిత్యము భయపడుచుండవలయును. వారి క్రోధయోగబలములఫలము తీవ్ర మైయుండును. తపోనిష్ఠులగు బ్రాహ్మణులు కుపితులై రేని యెట్టి వారిని నశింపఁజేయఁ గల్గుదురు. విప్రభార్యలను బల్లులట్లు భావించి దూరముగాఁ దొలఁగి, వారిని సగౌరవముగా రక్షింపవలయును. శాంతిపరుఁడగువాని యెడ నపరాధ మొనర్చినవాఁడు నరక మనుభవించును. బ్రాహ్మణు నెడఁజూపిన తేజ స్తపములు రెండును ఖండితములగుచున్నవి. బ్రాహ్మణ క్షత్త్రియులు పరస్పరము చూపికొనిన తప స్తేజములలోఁ దపము మిగులును. తేజము నశించును. కావున క్షత్త్రియుఁడు, గోపాలుఁడు గోష్ఠమునట్లు బ్రాహ్మణుని రక్షింపవలయును. బ్రాహ్మణుని యందున్న బ్రహ్మమును క్షత్త్రియుఁడు పరిపాలింపవలయును. బ్రహ్మ తేజముగల బ్రాహ్మణులను, క్షత్త్రియుఁడు తండ్రి పుత్త్రులనుబోలెఁ బాలింపవలయును. మఱియు నవిప్రు నిగ్రహమున జీవనాధార మేమి యున్నదియు, క్షత్త్రియుఁడు తెలిసికొనుచుండవలయును." అని తెలుప విని యుధిష్ఠిరుం డిట్లనియె.

### సృగాలవానరసంవాదము

"ఓపితామహా! ఎవ్వరు బ్రాహ్మణుల కేమేనొసంగుదుమని ప్రతిజ్ఞ చేసియు నీయకుందురో, యజ్ఞతగల వా రేమగుదురు? ఇచ్చెదమని చెప్పియు నీయనిదురాత్ము లెవ్వరు? అది యెల్ల నాకుఁ దెలుపుము."

అదివిని యాభీష్ముఁడు "ఓయుధిష్ఠిరా! ఎవ్వఁడు తక్కువ గాని, హెచ్చుగాని ప్రతిజ్ఞచేసియు నొసంగఁడో వానియాశలెల్ల నపుంసకునిసంతానఫలమట్లు హతము లగుచున్నవి. మఱియు వాఁడు జనించినది మొదలు నశించువఱకును జేసిన యేయేసుకృతము గలదో యదియు, వానిహోమము, వానితపము, వానిదానము, వానిసర్వమును వ్యర్థమగుచున్నవి. ఆదోషమును దొలఁగించుకొనుటలో శ్యామకర్ణములగు గుఱ్ఱములు వేయిం దాన మొనర్చుట యుపాయమని పరమ బుద్ధియుక్తులగు ధర్మశాస్త్రవేత్తలు దెలుపుదురు. ఇందులకుఁ దగు సృగాలవానరసంవాదమును ధర్మశాస్త్రవేత్తలు తెలుపుదురు. దాని నెఱిఁ

గించెదను వినుము. ఓపరంతపా! మున్నొకపుడు వానరసృగాలములు మానుషత్వ మొందియున్నసమయమున మిత్రములై యుండి మఱి యొకజన్మమున నొక్కటి నక్కయు నొకటి వానరము నై జనించెను. ఒకపుడు పరజీవములను భక్షించునట్టి నక్కను జూచి వానరము తనుకు నివాసమగు శ్మశానమధ్యమునఁ దనపూర్వజన్మము విధము స్మరించుచు, దానితో "ఓసృగాలమా! మున్నీవు దారుణమగు నేపాప కర్మ మొనర్చితివో? నీవిట్లు శ్మశానమధ్యమునఁ గుత్సితములై పృతి నొందిన పూతిగంధములగు జంతువులను భక్షించుచున్నదానవు గదా! అని పలికెను.

అది విని యాసృగాలము వానరమును జూచి, తనవెనుకటి జన్మమువిధము స్మరించుచు, ఓమిత్రమా! మున్ను నేనొకబ్రాహ్మణున కొకటి యొసంగెదనని ప్రతినచేసి దాని నొసంగనైతిని. ఓప్లవంగమా! తన్నిమిత్తమున నిట్టిపాపయోనిని జనించితిని. మఱియు దానఁ జేసియే యిట్టిభక్ష్యము నాఁకలిగొని భుజించుచున్నదానను." అని తెలిపెను.

ఓయుధిష్ఠిరా అది విని యావానరమూరకుండునంత, మఱియు నాసృగాలము "ఓవానరమా! నీవిట్లు వానర మైతివిగదా! ఏమిపాప మొనర్చితివి? అని యడుగుటయు, నది యానక్కం జూచి "ఓయీ! నేనెల్లపుడును బ్రాహ్మణులకు భోజ్యములగు పండ్లు దినుచు వచ్చితిని. కావున నేనిటు లయితిని. అటులగుట వివేకియగువాఁ డెన్వఁడును బ్రాహ్మణద్రవ్య మపహరింపరాదు. వారితో సమముగా వివాదము చేయరాదు. వారి కిచ్చెదమని చెప్పినద్రవ్యమును వాడుకొనరాదు." అని పలికెను. ఓయుధిష్ఠిరా! పురాతనమై పవిత్రమైన యిక్కథ నొకబ్రాహ్మణుఁడు తెలుపుచుండఁగా వింటిని. మఱియు నొకపు డొక బ్రాహ్మణునకుఁ గృష్ణుఁ డొకకథను జెప్పుచుండఁగా నంబీవిషయమును వింటిని. విప్రధనమును హరింపరాదు. వారియెడ నిత్యము శాంతి వహించుట మంచిది. వారు బాలురయ్యును, దరిద్రులయ్యును, నీచు లయ్యును, నవమానింపరాదు. ఇటులే నిత్యము బ్రాహ్మణులు నాకుఁ దెలుపుచుందురు. ఇచ్చెదనన్నచో నీయవలయునే గాని బ్రాహ్మణుని యాశ వ్యర్థము చేయరాదు. ఓరాజా! ముందుగా నాశపడియున్న

బ్రాహ్మణుఁడు ప్రదీప్తమగు పావకముభంగి వాఁడని యెఱుంగవలయును. అటులు తొలుత నాశ గలిగి యొవనిని గుపితుఁడై గాంచునో, వాఁడగ్నిచే నెండుగడ్డివలె దగ్ధుఁడగుచున్నాఁడు. ఆబ్రాహ్మణుఁడే సంతుష్టుఁడై మంచిమాటలాడెనేని తద్దేశమున నౌషధమట్లు హితము చేయువాఁడగును. మఱియు నట్లు విప్రుఁ డెవ్వనివలన దృప్తిపడునో యట్టిప్రభునకుఁ బుత్రులును బౌత్రులును గల్గుటయేగాక మంత్రులును దేశమును బత్తనమును శాంతి గలిగి పుష్టివహించియుండును. అట్టి తేజము బ్రాహ్మణునియందే గానఁబడుచున్నది. పుడమిని సూర్యునందే గానవచ్చుచున్నది. కావున బ్రాహ్మణునకుఁ బ్రతిజ్ఞ చేసినపుడు తప్పక యీయవలయును. ఓభరతసత్తమా! ఉత్తమజన్మమునొందఁ గోరునేని బ్రాహ్మణున కేమే నొసంగవలయును. దానివలన స్వర్గమగుచున్నది. దానము గొప్పధర్మక్రియ. ఈబ్రాహ్మణు లొసంగినదానిచే దేవతలును బితృదేవతలును జీవించుచున్నవారు. కావునఁ దెలిసినవాఁడు బ్రాహ్మణులకు దానముల నొసంగవలయును. బ్రాహ్మణుఁడు గొప్పతీర్థమనఁబడుచున్నాఁడు. ఎట్టివేళనేని బ్రాహ్మణుఁడు పూజింపఁబడక వ్యర్థముగాఁ బోరాదు." అని తెలుప విని యుధిష్ఠిరుం డిట్లనియె.

### శూద్రమునిసంవాదము

"ఓపితామహా! జాతిచే, నధముఁడైనవానికి మిత్రస్నేహముచే నుపదేశము చేయువానికి దోషముండునా? లేదా? ఓపితామహా! దీనిని యథార్థముగా వ్యాఖ్యానముచేయ వినఁ గోరుచున్నాను. దేనియెడ మానవులు మోహమందుచుందురో, యట్టి ధర్మగతి మిక్కిలి సూక్ష్మము గదా! అదియెల్ల నా కెఱిఁగింపుము."

అది విని గాంగేయుఁ డప్పాండవేయునితో "ఓరాజా! ఈవిషయము ఋషులు చెప్పికొనుచుండఁగా వినియుంటిని. దానిని యథానుపూర్విగాఁ దెలిపెదను. జాతిహీనున కెన్నఁడును నుపదేశము చేయఁదగదు. అటు లుపదేశించిన యుపాధ్యాయునకు దోషమగునని చెప్పఁబడుచున్నది. నీచున కుపదిష్టమగు వచనమునఁ గలదోషమునకుఁ నిదర్శనముగ నొకటి తెలిపెదను వినుము. అయ్యది శుభప్రదమై హిమవత్పార్శ్వమున నున్న బ్రహ్మాశ్రమపదమున జరిగినది. ఆయాశ్ర

మము పవిత్రమై వెలయుచుండెను. అందు నానావిధములగు వృక్షము లును, లతలును నొప్పార నయ్యది మృగపక్షినిషేవితమై యుండెను. పుష్పితారణ్యమై రమ్యమైన యవ్వనప్రదేశమును సిద్ధులును జారణు లును నిత్యము సేవించుచుండెడివారు. మఱియుఁ బలువిధములగు పక్షులరొదలతో నిండిన యచ్చోటు దాపసులకును, సూర్యాగ్నిసమ తేజులై మహాభాగులగు బ్రాహ్మణులకు నెలవై యుండెను. మఱియు నియమవ్రతసంపన్నులగు మఱికొందఱు తపస్వులును, భిక్షితములగు నియతాహారములచే జరించు కృతాత్ములును, దపోధ్యయనధ్యానము లచే సాధితముగా నొనర్ప నద్దాన వాలఖిల్యులగు పెక్కురు యతు లును నివసించుచు వచ్చిరి. ఒకపుడచ్చోటికిఁ బోవనుత్సహించి దయా న్వితుఁడగు నొకశూద్రుఁ డందులకు వచ్చి వారిచే గౌరవింపఁబడి యెను. అపు డాశూద్రుఁడు, దేవతుల్యులును, మహాతేజులును, వివిధ దీక్షాపరులునగు మహర్షులను గాంచఁగనే వానికిని దపమొనర్ప బుద్ధి వొడమెను. ఓధర్మజా! అటులగుట నాశూద్రుఁడు మునికులపతిపాద ములు పట్టుకొని యాతనితో "ఓబ్రాహ్మణోత్తమా! నీయనుగ్రహ ముచే ధర్మమును దెలుపఁ గోరుచున్నాఁడను కావున నాకు ధర్మోప దేశము సేయుటకును బ్రవ్రజనమొనరింపించుటకును దగియున్నాఁ డవు. ఓమహాత్మా! నేను జాతిచే నధమవర్ణుఁడనగు శూద్రుఁడను. నీ శుశ్రూష సేయ నాకుఁ గోర్కి గలదు. భక్తుఁడనగు నన్ననుగ్రహిం పుము." అని ప్రార్థించెను. అది విని యమ్మునికులపతి, యాశూద్రు నితో "ఓయీ! శూద్రుఁ డొకపరివ్రాజకచిహ్నము పూని యిందు జరింప వలనుపడదు. నన్ను సేవించునుత్సాహము గలదేని నీవిందుండ వచ్చును. శుశ్రూష చేయవచ్చును. దానిచే నీవుత్తమలోకముల నొందఁగలవు. ఇందులకు సందియము లేదు." అని ప్రత్యుత్తరము పలికెను.

ఓయుధిష్ఠిరా! అది విని యాశూద్రుఁడు చింతిల్లుచు నాతనితో "మహాత్మా! ఇందు నాయకార్య మేమి గలదు? నాకు ధర్మమం దెం తయు శ్రద్ధగలదే! నీయభిప్రాయము తెలిసినది. నీయిష్టమే కానిమ్ము." అని పలికి యాయాశ్రమపదమునకుఁ గొంతదూరముగా, నొకపాద రిల్లు గట్టికొని యందొక వేదికను, దేవతాగృహములను గల్పించికొని,

నియమస్థుఁడై యాశూద్రముని యందుండెను. అటులుండి నియతముగా, దేవతాయతనములం దభిషేకములను, బలిని, హోమమును, జేసి దేవతారాధన మొనర్చెను. మఱియు నతఁడు, సంకల్పనియమశాలియు, ఫలాహారుఁడును, జితేంద్రియుఁడును, నై నిత్యమును, సన్నిహితములగు నోషధులచేతను ఫలములచేతను దనయాశ్రమమున కరుదెంచునతిథుల సత్కరించుచు వచ్చెను. ఇటు లాశూద్రముని యొనర్చుచుండఁగా బెక్కుకాలము గడచెను. పిమ్మట నొకపుడు కులపతి యగు ముని, యాశూద్రమునియాశ్రమమునకు రా నతఁ డమ్మునివరుని స్వాగతదానపురస్సరముగాఁ బూజించి సంతసింపఁజేసెను. అటులు పూజించి మఱియు ననుకూలములగు కథాప్రసంగము లొనర్చి యాతనిరాకకు హేతువును బ్రశ్నించెను. పరమతేజస్వియు ధర్మాత్ముఁడును సంశితవ్రతుఁడునునగు నమ్మహర్షి యటులే తఱచుగా నాశూద్రమునిని జూచుటకై వాఁడున్న యాశ్రమమునకు వచ్చుచుండెను. ఒకపు డాశూద్రముని యమ్మహర్షిని గాంచి, "ఓమునివర్యా! నేను బితృకార్యమొనర్ప నుత్సహించుచున్నాఁడను. నన్నందుల కనుగ్రహింపుము." అని పలుకుటయు, నవ్విప్రముని, వానితో, సరియే. కానిమ్మని సెలవిచ్చెను. పిదప నాశూద్రుఁడు శుచియై యమ్మహర్షికిఁ బాద్యమొసఁగి, దర్భలను, వన్యములగునోషధులను, బవిత్రమగు నాసనమును సమర్పించెను. కాని తాను దక్షిణముగా నుండి యా యాసనము చరమశీర్షకముగాఁ జేయుటయు, నది యన్యాయమని తలంచి యవ్విప్రముని "ఓయీ! నీవీ యాసనమును బూర్వశీర్షకముగాఁ జేసి నీవు శుచివై యుత్తరాభిముఖుఁడవై యుండుము" మని తెలిపెను. వాఁడును నమ్మహర్షి చెప్పినటు లొనర్చి, మేధావియై మఱియు హవ్యకవ్యవిధినంతయు నమ్మహర్షి చెప్పినట్టుగాఁ బితృకార్యపరుఁడై ధర్మపథమునఁ బ్రవర్తించెను. అటు లతఁడు పితృకార్యమొనర్చిన పిమ్మట నమ్మహర్షి వానిని విడిచి వెడలిపోయెను. పిదప నాశూద్రతాపసుఁడు దీర్ఘకాలమువఱకును దప మొనర్చుచుఁ గొంతకాలమునకు మృతినొంది తత్పుణ్యమున మహాతేజుఁడై యొక మహారాజవంశమున నుద్భవించెను. ఓధర్మజా! అటులే యవ్విప్రమహర్షియుఁ, గాలధర్మమొంది మఱియు నొకవిప్రుఁడై యొకపురోహిత

వంశమున జనించెను. ఇటు లాంఛూద్రుఁడును, మునియు జనించి క్రమ ముగా వర్ధిలుచు విద్యాకుశలులై కీర్తిపాత్రులగుచు వచ్చిరి. ఆబ్రా హ్మణుఁడు వేదమందును నథర్వవిద్యయందును, కల్పజ్యోతిషసాం ఖ్యములందును బ్రవీణుఁడై వర్ధిలుచు వచ్చెను. పిమ్మట నమ్మహారాజ సుతుఁడు తనతండ్రి మరణింపఁగనే మంత్రులు మున్నగువారిచే రాజ్యాభిషిక్తుఁడై యావెంటనే నిజపురోహితకుటుంబమున జనించిన యమ్మునిని దనకుఁ బురోహితునిఁగా నియమించెను. వారిరువురును రాజ, పురోహితులై ధర్మయుక్తముగాఁ బ్రజలను బరిపాలించుచు రాజ్య సుఖములందుచు నిత్యము పుణ్యాహవాచనమందును ధర్మకార్యము లందును తత్పరులై యుండుతఱి, నొకపుడు రాజు పురోహితునిఁ గాంచి నగుచుఁ బరిహసించెను. ఇటులు పెక్కుసారు లారా జాపురో హితునిఁ బరిహసించుచు వచ్చుటయు, నది యప్పురోహితుఁడు గని పెట్టి కుపితుఁడై యుండియు నొకపుడు తామిరువురు మాత్రమె యున్నతఱి ననుకూలములగు కథాప్రసంగములచేఁ దా నారాజును మెప్పించెను. అటులు సంతసింపఁజేసి యాతనివలన నొకవరము వడయు వాఁడై యాతనిఁ బ్రార్థించెను. అది విని యప్పార్థివుఁడు "ఓవిప్రో త్తమా! నీకొకవరము గాదు నూఱువరము లిచ్చెదను. నీయెడ నాకుఁ గల స్నేహమునుబట్టియు గౌరవమునుబట్టియు, నీకొసంగరాని దేది యును లేదు." అని పలుకుటయు, నప్పురోహితుఁడు, "ఓరాజా! నీవు నాకుఁ బ్రసన్నుఁడవై తేని యొకవరము గోరికొనియెదను. నీవు తప్పక యిచ్చెదనని ప్రతిజ్ఞ సేయుము. నీనోటిమాట తప్పరాదు సుమీ!" అని కోరెను.

ఓయుధిష్ఠిరా! అది విని యారాజు, తనపురోహితుని, ఓయీ! నీవు కోరినకోర్కి తప్పక తీర్చెదను. నాకుఁ దెలిసెనేని తప్పక చెప్పె దను. తెలియక సంవాదము చేయను." అని పలికెను. అంత నప్పురో హితుఁడు "ఓపార్థివా! నీవు తఱుచుగా ధర్మకార్యములందును బుణ్యాహవాచనమందును, శాంతిహోమములందును, నన్నుఁ గాంచి నగుచుండుదు వేమి? నీవట్లు నగుటవలన నామన మెంతయు నొచ్చెడిని. ఓరాజా! నాకోర్కి తీర్తునని యొట్టుపెట్టికొంటివి గాదే! కావున వేఱొకవిధముగాఁ బలుకరాదు సుమీ! నీవు నవ్వుటకుఁ గారణమేమే

నుండ తప్పదు. నీహాస్యమహేతుక మైయుండదు. నాకానిమిత్తము
విన గౌతూహలము గల్గెడిని. యథార్థముగా దెలుపుము." అని
కోరెను. అది విని యారాజు "ఓబ్రాహ్మణోత్తమా! నీవిటు లను
చున్నాడవు. చెప్పఁ దగనిదేని చెప్పవలయునుగదా! అటులగుటఁ
దప్పక చెప్పెదను. ఏకాగ్రచిత్తుఁడ వై వినుము. నాకుఁ బూర్వజన్మ
స్మృతి గలదు. నాపూర్వదేహమున జరిగినవిధ మెఱిఁగించెదను జాగ
రూకుఁడవై వినుము. నేను బూర్వజన్మమున శూద్రుఁడనై యెంతయుఁ
దపోనిష్ఠుఁడనై ప్రవర్తించితిని. నీవు మహత్తరతపమొనర్చిన
మహర్షివై యపుడుంటివి. అపుడు నీవు నాయెడ ననుగ్రహము చూపి,
పితృకార్యమున నుపదేశమొనర్చితివి. బృసియందును, దర్భలందును,
హవ్యకవ్యములందును నాకు మార్గముపదేశించితివి. ఇట్టికర్మ మొనర్చి
తద్దోషముచే నీవు పురోహితుఁడవై జనించితివి. నేను రాజనై జనిం
చితిని. ఓవిప్రోత్తమా! కాలవిపర్యయ మెట్టిదో గనుఁగొనుము.
నాకు నీవొనర్చినయుపదేశమునకుఁ దగుఫల మిూవందితివి. ఓద్విజో
త్తమా! ఇక్కతమున నే నేను నగుచు వచ్చితిని. నిన్నుఁ బరిభవింపఁ బరి
హసింతునా? నీవు నాకు గురుఁడవుగాదే! నేనపుడు వ్యత్యస్తముగాఁ
జేయుటంబట్టి నాకు దుఃఖముగలిగి నాచిత్తము పరితపించెను. నాకుఁ
బూర్వజన్మస్మృతి గల్గుటను నేనిట్లు పరిహసించితిని. ఇట్లు నీవపుడొన
ర్చిన యుగ్రతపమెల్ల నాకొనర్చినయుపదేశముచే నశించెను. కావున
నీవిపు డీపురోహితత్వమును విడిచి మఱుసటిజన్మమునకేని దొలఁగించు
కొన యత్నింపుము. ఇటపై నీవు వేఱొక యధమజన్మమును బొంద
కుందువు గాక. నీకు వలసినధనము దీసికొమ్ము పూతాత్ముఁడవగుము"
అని పలికెను.

ఓయుధిష్ఠిరా! పిమ్మట నప్పార్థివునిచే విడువంబడి యవ్విప్రుఁడు
పెక్కుదానములు బ్రాహ్మణులకొనర్చి కొంతధనమును భూమిని గ్రామ
ములను నుత్తములగువారి కర్పించి, శాస్త్రోక్తములగు దుష్కరవ్రతము
లొనర్చుచు బ్రాహ్మణులతోఁ గూడి తీర్థాటనమొనర్చి, యందు
గోదానాది వివిధదానములు చేసి పూతాత్ముఁ డయ్యెను. మఱియు
నవ్విప్రుఁడు తనవెనుకటియాశ్రమమునకుఁ బోయి యందుఁ దప
మొనర్చి యుత్తమసిద్ధి వడసెను. తదాశ్రమవాసులెల్ల నాతనిదుష్కర

కృత్యముగకు సమ్మతించిరి. ఓనృపసత్తమా! అమ్మహర్షి యిట్లు గొప్పకష్ట మనుభవించెను. కావున నీచజాతియగువాని కుపదేశ మొసర్పరాదు. బ్రాహ్మణక్షత్త్రియవైశ్యులు మూఁడుజాతులవారును ద్విజులనఁబడు దురు. ఈమూఁడు తెగలవారిలో నెవ్వరి కుపదేశ మొసర్చినను బ్రాహ్మణుఁడు దూష్యుఁడు గానేరఁడు. కావునఁ బండితులు నీచుఁడగువాని ముందట నేమియుఁ బలుకరాదు. అకృతాత్ములగువారికి సూక్ష్మమగు ధర్మగతి తెలియుట దుర్ఘటము. అటులగుట మహర్షులు మౌనమున దీక్ష వహించియుందురు. దుర్వచన మేమి పలుకవలసివచ్చునో యని వారేమియు మాటలాడనొల్లరు. ధార్మికులును, గుణసంపన్నులును సత్యార్జవసమన్వితు లగువారును, దురుక్తభాషణములచే దుష్కృతమొందుచుందురు. ఎవ్వనికిని నెపుడును నుపదేశ మొసర్ప రాదు. ఉపదేశమువలన నట్టిపాపము బ్రాహ్మణున కగుచున్నది. ధర్మేచ్ఛ గలప్రాజ్ఞుఁడు చక్కఁగా విమర్శించి యుపదేశ మొసర్పవలయును. ధనాశచేఁ జేయఁబడిన యుపదేశ ముపదేష్టను హింసించుచున్నది. తన్నొకరు ప్రశ్నించినపుడు ధర్మనిశ్చయ మెఱిఁగి తెలుపవలయును. ఓయుధిష్ఠిరా! ఇదియెల్ల నీకుఁ దెలిపితిని గదా! నీచున కుపదేశించుట వలన నెంతయుఁ గ్లేశమగుచున్నది. కావున నుపదేశ మొసర్పరాదు." అని తెలుప విని యుధిష్ఠిరుఁ డి ట్లనియె.

### రుక్మిణీశ్రీసంవాదము

"ఓపితామహా! స్త్రీపురుషులలో నెట్టివారియందు నిత్యమును లక్ష్మి కాపుచేసికొని యుండునో నాకుఁ దెలుపుము."

అది విని గాంగేయుఁ డప్పాండవేయునితో "ఓధర్మజా! మున్ను జరిగినదియు నేను విన్నదియు నొకటి నీకీవిషయమునఁ దెలిపెదను. అక్కథ నీప్రశ్నమున కుదాహరణమగును. వినుము. మున్ను రుక్మిణి, నారాయణుని తొడపైఁ బ్రజ్వలించుచుఁ బద్మసమవర్ణయై యున్న శ్రీదేవిని గాంచి యాకృష్ణభగవానుఁడు వినుచుండఁగా, నప్పటి కుతూహలముచే నేత్రవికాసమొదవ నిట్లు ప్రశ్నించెను.

"ఓ శ్రీదేవీ! నీవెట్టిభూతములను సేవింతువు? ఎవ్వనియందు శౌర్యాదిరూపమున నివసింతువు? ఎట్టిభూతములను సమీపింపవు? అట్టిభూతము లెవ్వియో నాకెఱింగింపుము."

ఇట్టు లా శ్రీదేవి యా గరుడధ్వజుని సమక్షమునఁ బ్రశ్నింపం బడి, ప్రసన్నవదనయై మధురతరముగా మనోహరోక్తులతో నిట్లు పలికెను.

["ఓ రుక్మిణీ! సుభగుఁడును, ప్రగల్భుఁడును, దక్షుఁడును, కర్మపరుఁడునగు మానవునందును, మఱియు శాంతియుక్తుఁడును, దైవపరుఁడును, కృతజ్ఞుఁడును, జితేంద్రియుఁడును, సుదీర్ఘసత్వుఁడును, నగు వానియందు నేను నిత్యము నివసింతును.] కర్మశీలుఁడుగానివానియందుండను. అటులే నాస్తికుఁడును, సాంకరికుఁడును, కృతఘ్నుఁడును, భిన్నవృత్తుఁడును, క్రూరసవర్ణుఁడును, దొంగయు, గురులయెడ ననూయ గలవాఁడును మున్నగువారియం దెన్నఁడును నేనుండను. మఱియు, నెవ్వ రల్పతేజోబలసత్వమానులై యుందందుఁ గోపమును గ్లేశమును నొందుచుందురో యట్టి గుప్తమనోరథులగు మానవులందు నేను నివసింపను. ఎవ్వఁడు తనకుఁగా నించుకేని వాంఛింపఁడో, యెవ్వఁడు స్వభావోపహతచిత్తుఁడై యుండునో, యెవ్వ రల్పసంతుష్టులై యుండుదురో, యట్టివారియందు నేను నిత్యము నివసింపను. నిజధర్మశీలురును ధర్మజ్ఞులును, వృద్ధసేవానిరతులును, దాంతులు, కృతాత్ములు, శాంతిపరులు, సమర్థులు నగువారియందుండుదురు. అటులే శాంతలు దాంతలునగు కాంతలయందును వసింతును. మఱియు సత్యస్వభావార్జవయుక్తలును, దేవద్విజ పూజాపరలు నగువారియందుండుదును. ప్రకీర్ణభాండయు, నవిమర్శకారిణియు, భర్తృప్రతికూలవాదినియు నగు నాఁడుదానియం దుండను. మఱియుఁ బొరుగిండ్లకుఁ బోవుచుండు నదియు, సిగ్గులేనిదియు నగుదానియం దుండను. మఱియుఁ బతివ్రతలును, కళ్యాణస్వభావలును, నలంకృతలును, సత్యవతులును, ప్రియదర్శనలును, సౌభాగ్యవతులును, గుణవతులును నగుకాంతలయందు నేను నివసింతును. అత్యాసక్తిగలదియు, నదక్షయు, గర్వితయు, శౌచహీనయుఁ, గలహప్రియయుఁ, బెనునిద్దురగలదియు, నెల్లపుడును బరుండునదియు నగు నాఁడుది నాకెన్నఁడును దాపు గానేరదు.

నేను యానములందును, గన్నియలందును, విభూషణములందును, యజ్ఞములందును, వర్షమేఘములందును, వికసించిన పద్మినులందును, శారదనక్షత్రవీథులందును, నేత్రములందును, గోష్ఠములందును, నాసనము లందును, వికసితోత్పలపద్మములుగల సరస్సులందును, హంసాది నాదనాదితములగు నదులందును, మఱియుఁ బ్రకీర్ణకూలద్రుమవిరాజి తములును, దపస్విసిద్ధద్విజసేవితములునునగు నదులందును, బహూదక ములై సింహగజాదులచే నాకులితోదకములగు నదులందును నిత్యము నివసింతును. మఱియు, మత్తగజమందును గోవృషభమందును, నరేం ద్రునందును, సింహాసనమందును, సత్పురుషులందును, నిత్యాగ్నిహోత్రి యందును, గోబ్రాహ్మణపూజకునందును, దేవతారాధకునందును, సకాల మునఁ బుష్పబలులొసంగువానియందును, నిత్యము నివసింతును. మఱియు నిత్యస్వాధ్యాయపరులగు బ్రాహ్మణులందును, నిత్యము ధర్మ రతుఁడై యున్న క్షత్రియునందును గృష్యాసక్తుఁడగు వైశ్యునందును, నిత్యశుశ్రూషాపరుఁడగు శూద్రునందును నిత్యము నివసింతును. ఇంకను, నారాయణునకు సర్వభావములచే శరీరమునై యేకాగ్ర చిత్తనై యాతనియందు నివసింతును. అమ్మహాత్మునందు గొప్పధర్మ మును, బ్రహ్మణ్యతయుఁ, బ్రియబుద్ధియుఁ గలదు. ఓరుక్మిణీ! నేను దేని యందును శరీరముతో నుండను. నిజభావముచే నేనెవ్వని యందుం దునో, వాఁడు ధర్మయశోర్థకామములచే వృద్ధినొందుచుండును." అని తెలుప విని మఱియు యుధిష్ఠిరుం డిట్లనియె.

భంగాస్వనోపాఖ్యానము

"ఓతాతా! స్త్రీపురుషసంయోగమున వారిలో నెవ్వరికి సుఖ స్పర్శమధికమో యనువిషయమున సంశయమొదవుచున్నది. యథార్థ మెఱిఁగింపుము."

అది విని భీష్ముఁడు యుధిష్ఠిరు నారసి, "ఓయీ! నీవడిగినయర్థ మున కుదాహరణముగా నొకపురాతనేతిహాసము నెఱిఁగించెదను. భంగాస్వనునకును, నింద్రునకును వైరమొదవుట నక్కథ ప్రవర్తి ల్లెను. దానిని వినుము.

మున్నొకపుడు పరమధార్మికుఁడైన భంగాస్వనుఁడను రాజర్షి సంతానహీనుఁడై పుత్త్రులకై యొకయజ్ఞ మొనర్చెను. ఆయగ్నిష్టోమము శక్రున కనిష్టమై ప్రాయశ్చిత్తార్థమగు మానవులపుత్త్రకామేష్టులలోఁ జేరినది. గొప్పయాగభాగముగల సురేశ్వరుఁ డాయజ్ఞమువిధ మెఱిఁగి, నియతాత్ముఁడగు నారాజర్షి యొనర్చు యాగమునకు విఘ్నముచేయ నంతరము గనిపెట్టెను గాని, యించుకేని, యందులకుఁ జోటు దొరకదయ్యెను. కొంతకాలము గడచిన పిమ్మట నొకపు డారాజర్షి వేఁటకై వెడలుటయు, నదియే యదనని తలంచి యింద్రుఁ డాతని కం దధికమోహమును గల్గించెను. అటులింద్రమోహితుఁడై భ్రాంతివడి యొకగుఱ్ఱము నధిష్ఠించిపోయి వేఁటాడి తుదకు దిక్కెదియుఁ దెలియక క్షుత్పిపాసాపీడితుఁడై యిటునటు తిరుగుచు మిగుల శ్రమ గలుగఁ గొంతవడికిఁ బరమ వారిపూరితమై మనోహరమైన యొకసరోవరమును గాంచెను. అటులు చూచి, దానిలో దిగి గుఱ్ఱమునకు నీరువెట్టి దాని నొకచెట్టునఁ గట్టి, దానును నందు స్నానముచేయువాఁడై దిగి తీరమును జేరునప్పటి కాతఁ డొకయాఁడుది యయ్యెను. అంత నతఁ డట్లు తాను స్త్రీరూపమునొందుట కెంతయు లజ్జితుఁడై చింతాక్రాంతుఁడై మనోవ్యాకులతచేఁ దెలివిదప్పి యెట్టకేలకు ధైర్యముదెచ్చికొని, "అయ్యో! ఈగుఱ్ఱము నెటు లధిష్ఠింతును? పురము నెట్లు చేరుదును? అగ్నిష్టావకమగునిష్టిచే మహాబలులగు పుత్త్రుల నూర్వుర నౌరసులఁ గాంచితిని గదా! ఇట్టి నేనిపుడు వారికేమి చెప్పుదును? నేన భర్తగాఁగలభార్యల యెడను, పౌరజానపదులయెడను, మృదుత్వము, తనుత్వము, విక్లబత్వము, వహించి యెట్లు ప్రవర్తింపఁగలను? ధర్మతత్త్వార్థదర్శులగు మహర్షులచే స్త్రీలగుణములు చెప్పఁబడియున్నవి. వ్యాయామసహత్వమును, బరాక్రమమును బురుషగుణములుగదా! నాపౌరుషమూ! నశించెను. ఏకారణముననో నాకు స్త్రీత్వ మొదవెను. స్త్రీభావమునొందియు నీయశ్వము నధిష్ఠించి యెట్లు పోవుదును?" అని చింతించి, యెట్టకేల కతిప్రయత్నముచేఁ దనయశ్వ మధిరోహించి యారాజోత్తముఁడు స్త్రీరూపముతోఁ బురమున కరుదెంచెను. అంత నాతనిఁ గాంచి, పుత్త్రులును, భార్యలును, భృత్యులును, పౌరులును, దేశము

వారును నిదేమని యడిగి తెలిసికొని విస్మయపరవశులైరి. పిమ్మట నమ్మహారాజు "ఓయీ! నేను నాఁడు వేటకై నాపరివారముతో బయలువెడలి యందందుఁ దిరిగితిరిగి తుదకు దైవప్రేరితుఁడనై యొకఘోరారణ్యమును జేరుకొంటిని. అట్లు చొచ్చి యాఘోరారణ్యమున దప్పి గలుగ నిశ్చేతనుఁడనై, పెక్కు జలపక్షులతోఁ గూడిన యొకయుత్తమ సరోవరమును గాంచి, యందు మునిఁగి నేను దైవకృతముగా నిట్టి స్త్రీరూపమొందితిని." అని తెలిపి, యతఁడు తనభార్యలకును మంత్రులకును నిజనామగోత్రముల నెఱిఁగించి, మఱియుఁ దనపుత్రులతో "ఓతనయులారా! నే నిట్టి స్త్రీభూతుఁడ నైతిని, కావున మీరే యీ రాజ్యమేలుకొనుఁడు. నేను వనమునకుఁ బోయెదను." అని చెప్పి యతఁడు వనమునకుఁ బోయెను. అటులేఁగి యందొకతాపసునిఁ గలిసి యాయాశ్రమమున నాతనివలన మఱినూర్వురుపుత్రులను గాంచెను. పిమ్మటఁ గొన్నినాళులకు స్త్రీభూతుఁడగు నారాజర్షి తనవెనుకటితనయుల నందులకు రావించి వారితో "ఓపుత్రకులారా! నాపురుషత్వమునఁ గలిగినతనయులు మీరుగదా! ఈస్త్రీత్వమున నాకినూర్వురు సుతులును బ్రభవించిరి కావున మీరును వీరును సోదరస్నేహము గలిగి యొకచో నైకమత్యముగలిగి రాజ్యమనుభవింపుఁడు." అని తెలిపెను. ఓయుధిష్ఠిరా! అంతట, వారందఱును గూడి వెడలి రాజ్యమనుభవించుచు వచ్చిరి. అటులు భ్రాతృస్నేహముచే నయ్యుత్తమ రాజ్యమనుభవించుచున్న యాసోదరులను గాంచి, యింద్రుఁడు కోపావిష్టుఁడై కొంత యాలోచించి, "ఆహా! నేనారాజర్షి కపకారమొనర్చువాఁడనై చేసినపని యుపకారముగా మాఱెనుగదా! ఇపు డిఁక నేమి చేయఁదగును?" అని తలంచి యాశతక్రతుఁ డొకబ్రాహ్మణరూపమును ధరించి యాతనితనయులకుఁ బరస్పరభేదబుద్ధి గలిగించువాఁడై వెడలెను. అట్లు వెడలి యానృపతనయులపురముఁ జేరి, "ఓరాజపుత్రులారా! ఒకతండ్రిపుత్రులకే, లోకమున సోదరస్నేహముండుట గన్పట్టదు. వారు రాజ్యమునకై పోరాడుదురు. కశ్యపపుత్రులగు సురాసురులు రాజ్యహేతుకముగాఁ బోరాడిరిగాదే? మీరు భంగాస్వనుని పుత్రులు, వీరొకతాపసుని తనయులు. ఒకకశ్యపునకే జనించినదేవతలును రాక్షసులును మైత్రిగలిగి యుండలేదు. మీకుఁ బైతృకమై

వచ్చినరాజ్యమును దాపసతనయులు భుజించుటయా! ఇదియెంతయు నన్యాయ్యము" అని బోధించుటయు, నాయింద్రుని భేదకవచనములు విని వారెల్లఁ బరస్పరము కలహింపసాగి, యాపోరాటమున నొకరి నొకరు చంపికొనిరి. ఆవృత్తాంతము విని యారాజతాపసి సంతప్తయై రోదనమొనర్పసాగెను. అపు డింద్రుఁడు, బ్రాహ్మణవేషముతో నా తాపసికడకు వచ్చి "ఓతాపసీ! నీకుఁ గలిగినదుఃఖమేమి? నీవిట్లు సంతాపమడర రోదనమొనర్చుచున్నదానవేమి?" అని ప్రశ్నించెను. అంత నాతాపసకాంత యావిప్రరూపధారియగు నింద్రునిఁ గాంచి, మిగుల దుఃఖముతో "ఓవిప్రోత్తమా! ఏకకాలమున నాకొడుకు లిన్నూర్వురు మడిసిరి. నేను మున్నొకపుడు రాజనై యుండఁగా నపుడు నూర్వురుసుతు లుదయించిరి. నేనొకపుడు వేటకై యాదుర్గమారణ్యమునఁ దిరిగితిరిగి, యొకచో మనోహరమైయున్న యొకసరోవరమున స్నానమొనర్చి యిట్టి స్త్రీరూపమును గాంచితిని. పిదప నావెనుకటి పుత్రులను రాజ్యమున నిలిపి యీయాశ్రమముచేరి కాంతనై యున్న నాకుఁ దాపసోత్తమునివలన మఱినూర్వురుపుత్రులు పుట్టిరి. ఈ యాశ్రమమున జనించిన నూర్వురుతనయులను బత్తనమున కనిపి వెనుకటివారితోఁ గలిసి రాజ్యమేలికొండని పలుక, వల్లె యని వారు వోయి, తుదకు వైరమూని కాలయోగమునఁ గాలధర్మమొందిరి. ఇట్లు గలిగినదైవవైపరీత్యముచే నిట్లు శోకించుచున్నదానను." అని తెలిపెను.

అది విని యావిప్రవేషధారియగు నింద్రుఁడు దుఃఖితయై యున్న యత్తాపసిని గాంచి, పరుషముగా, "ఓసీ! మున్ను నాకొకపుడు దుస్సహమగుదుఃఖమును గల్గించితివి. ఇంద్రద్విష్టమగునిష్టి యొనర్చి యందులకు నన్నుఁ బిలువకయే యాక్రతువొనర్చితివి. ఓ దుర్మతీ! నేనే యింద్రుఁడను జుమీ! అప్పటి నావైర మిట్లు తీర్చికొంటిని. ఇటులగుటయెల్ల నాకృత్యమే యని తలంపుము." అని తెలిపెను. అంత నత్తాపసి యాయింద్రునిఁ గాంచి యాతనిపాదముల పైఁబడి "ఓత్రిదశేంద్రా! ప్రసన్నుఁడవు గమ్ము. పుత్రేచ్ఛచే నపుడట్టి క్రతు వొనర్చితిని. క్షమింపుము." అని పలువిధములఁ బ్రార్థించుటయు నద్దాని ప్రణిపాతమునకుఁ బ్రసన్నుఁడై యింద్రుఁ డొకవర మొసంగ

నెంచి, "ఓరాజా! నీయిన్నూర్వురుపుత్త్రులలో నెవ్వరు జీవింపవలయునో తెలుపుము. స్త్రీభూతుఁడవై యున్నపుడు జనించినవారు జీవింపవలయునా ? పురుషుఁడవై యున్నతఱిఁ బుట్టినపుత్త్రులు బ్రదుకవలయునా ?" అని ప్రశ్నించెను. అంత సత్తాపసి చేతులు మొగిడ్చి యాయింద్రునితో "ఓయింద్రా ! స్త్రీభూతుఁడనై యున్నతఱిఁ బుట్టిన నూర్వురుపుత్త్రులనే బ్రదికింపుము." అని పలికెను. ఇంద్రుఁ డందులకు విస్మయావిష్టుఁడై యక్కాంతను గాంచి, "నీవు పురుషుఁడవై యుండుతఱిఁ బుట్టినపుత్త్రులు నీకు విరోధులగుటకు నిమిత్తమేమి ? నీవు కాంతవై యున్నతఱిఁ బుట్టినపుత్త్రులపై నీకు స్నేహ మధికమగుటకు నిమిత్తమేమి ? ఇందులకు హేతువెయ్యదియో వినఁగోరుచున్నాఁడను. తెలుపుము." అని ప్రశ్నించెను. అది విని యాతాపసాంగన "ఓయింద్రా! పురుషునికంటె స్త్రీ కధికస్నేహముండును. అటులగుట స్త్రీభూతుఁడనై యున్న నాకు జనించినపుత్త్రులయెడ స్నేహ మెక్కుడు." అని తెలిపెను.

"యుధిష్ఠిరా! అమ్మునికాంతవచనముల కమ్మహేంద్రుఁ డలరి, 'ఓసత్యవాదినీ ! నీపలుకు నాకెంతయు సంతస మొదవించెను. నీపుత్త్రులెల్లరును బునర్జీవితు లగుదురుగాక. మఱియు నేనొకవర మొసంగ నెంచితిని కోరికొనుము. నావరము మహిమముచేఁ బురుషత్వము కోరెదవా? లేక, స్త్రీత్వమునే వాంఛితువా?' అని యడుగ, నామె, యామహేంద్రునితో 'ఓసురేశా ! నేను స్త్రీత్వమునే గోరుచున్నదానను. పురుషత్వమును వాంఛింపను' అని ప్రత్యుత్తర మొసంగెను. అంత నయ్యింద్రుఁ డామెను గాంచి మఱియు 'ఓతాపసీ ! పురుషత్వమునుగోరక స్త్రీత్వమును గోరుదు వేటికి?' అని యడుగ స్త్రీభూతుఁడై యున్న యారాజర్షి 'ఓశక్రా! స్త్రీకిఁ బురుషసంయోగమునఁ బ్రీతి యెక్కుడు. ఇక్కతమున నేను స్త్రీత్వమునే గోరుచున్నాఁడను. ఓదేవసత్తమా ! స్త్రీత్వమున నధికముగా రమింతును. నిజము చెప్పుచున్నాను. స్త్రీభావముచేతనే తుష్టయగుదును. కావున నీవిఁకఁబొమ్ము.' అని పలుకుటయు, నది విని యాత్రిదశేంద్రుఁడు సరియే ; కానిమ్మని పలికి సెలవుపుచ్చుకొని వెడలిపోయెను. ఓధర్మజా ! ఇట్లు స్త్రీకధికప్రీతి యగుచున్నదని తెలియుము." అని తెలుప విని యుధిష్ఠిరుం డిట్లనియె.

## భీష్ముడు లోకయాత్రవిధ మెఱిఁగించుట

"ఓపితామహా! లోకయాత్రాహితార్థియగు మానవుఁ డేమి చేయవలయును! ఎట్టి స్వభావముగలవాఁడు లోకయాత్ర నెట్లు చేయవలెను?"

అది విని భీష్ముఁడు "ఓయుధిష్ఠిరా! కాయముచేఁ ద్రివిధమును, వాక్కుచేఁ జతుర్విధమును, మానసముచేఁ ద్రివిధముగా, బదిరీతులు గలకర్మపథములను బరిత్యజింపవలయును. ప్రాణాతిపాతము, దొంగతనము, పరదారాసక్తి యనియెడి కాయికములగు మూఁడువిధముల పాపములను నెల్లవిధములఁ బరిత్యజింపవలయును. అటులే యసత్ప్రలాపము, పారుష్యము, పైశున్యము, అసత్యము అనియెడి వాచికములగు నాల్గిటిని విడువవలయును పరధనాసక్తియుఁ, బరులయెడ నసూయయు, నాస్తికత్వము అనియెడి మానసికములగు మూఁడిటిని బరిత్యజింపవలయును. కావున మనోవాక్కాయములచే మానవుఁ డశుభకర్మము నాచరింపరాదు. శుభాశుభకర్మముల నాచరించుచు మానవుఁడు తత్తత్ఫలముల నందుచుండును." అని తెలుప విని యుధిష్ఠిరుం డిట్లనియె.

## శివమాహాత్మ్యకథనము

"ఓయాపగానందనా! మున్ను నీవలన, జగత్పతియగు శంకరునినామములు కొన్ని వినియుంటిని. మఱియు నమ్మహేశునినామములను, బభ్రువు, విశ్వరూపుఁడును, నవ్యక్తయోనియు, సురాసురగురుఁడునగు శంకరునకుఁ గలసౌభాగ్యమును యథార్థముగా నెఱిఁగింపుము."

అది విని యా భీష్ముఁ డయ్యుధిష్ఠిరునితో "ఓ ధర్మజా! ధీశాలియగు మహాదేవుని గుణముల నెఱిఁగింప నేనెంతవాఁడను? ఆదేవుఁడు సర్వగతుఁడయ్యు నెందును గానరాఁడు. బ్రహ్మ విష్ణు మహేంద్రుల సృజించిన ప్రభువతఁడే. బ్రహ్మమొదలు పిశాచాంతముగలవారి కెల్ల నతఁడే యుపాస్యుఁడు. ప్రకృతులకును బురుషునకును నెవ్వఁడు పరుఁడని యోగవేత్తలగు మహర్షులు తత్త్వదర్శులై చింతింతురో యట్టి యక్షరుఁడును బరబ్రహ్మమును సదసద్రూపుఁడు నగు నాతని నెవ్వరు నుతింపఁగలరు? నిజతేజముచేఁ బ్రకృతిపురుషులకుఁ జలనముగలిగించి

బ్రహ్మను సృజింపఁజేయుటనుబట్టి యీ ప్రజాపతి దేవదేవుఁ డనఁబడియెను. ధీమంతుఁడగు దేవదేవుని గుణములను దెలుపుట కెవఁడు సమర్థుఁడు? గర్భ జన్మ జరాయుక్తుఁడును మృత్యుసమన్వితుఁడును నగు నాయట్టి మానవుఁడు పరమేశ్వరుఁడగు భవునిఁ దెలియ నెట్టులగును? ఓ పుత్రకా! అమ్మహాత్మునిఁ దెలియ నా శంఖ చక్ర గదాధరుఁడగు నారాయణుఁడు దక్క వేఱొక్కఁడు చాలఁడు. జ్ఞానాత్ముఁడును, గుణోత్తముఁడును, సర్వవ్యాపకుఁడును, బరమదుర్జయుఁడును, దివ్యచక్షువు మహాతేజుఁడు నగు నాతఁడు యోగదృష్టిగలవారిచేఁ జూడఁబడుచున్నాఁడు. ఆరుద్రునియెడఁ గల భక్తిమూలముననే మహాత్ముఁడగు కృష్ణుఁడు జగద్వ్యాపకత్వ మొందెను. మున్ను బదరికాశ్రమమున నమ్మహాదేవు నారాధించి సువర్ణాక్షుఁడగు నాదేవుని యనుగ్రహముచే సర్వలోక ప్రియత్వము బడసి యమ్మాధవుఁడు వేయి వత్సరములు పూర్ణముగాఁ దపమొనర్చెను. చరాచరగురుఁడును, శివుఁడును, వరదుఁడునునగు మహేశ్వరు నా కృష్ణభగవానుఁడు ప్రతియుగమందును బ్రసన్నునిఁ గావించుకొనుచుండును. అమ్మహాదేవుఁ డమ్మాధవు పరమభక్తికిఁ బ్రీతుఁడై తనకుఁగల నైశ్వర్యము నాతని కొసంగెను. తత్కాలముననే ప్రజాసృష్టికై యీ హరి పుత్రునిఁ బడసెను. ఓ భారతా! ఆ దేవదేవునికంటెఁ బరతరుఁడగు వాఁడు లేఁడు. ఆ యీశుని నామములనెల్ల వ్యాఖ్యానముచేయ నేను సమర్థుఁడనుగాను. మహాబాహుఁడగు నివ్వాసుదేవుఁ డా భగవానుని గుణగణములఁ దెలుప వలంతి యగుచున్నాఁడు." అని తెలిపెను.

ఓ జనమేజయా! ఆ గాంగేయుఁ డిట్లు పలికి మహాదేవ మాహాత్మ్యమును దెలిసిన వాసుదేవునితో "ఓ విష్ణూ! సురాసుర గురూ! దేవా! నీవే యీ శివుని—విశ్వరూపుని, మహత్త్వమును దెలుపఁదగువాఁడవు. అదియగాదె యీ యుధిష్ఠిరుఁ డిపుడు ప్రశ్నించినది. మున్నా దేవుని నామ సహస్రమును, భృంగి బ్రహ్మలోకమునఁ దెలిపెను. వ్యాసమహర్షి మున్నగు తపోధనులును, శాంతులును దాంతులునగు మఱికొందఱు ఋషులును, నీ వమ్మహాదేవుని మహత్త్వమును దెలుపఁగా విందురుగాక. ధ్రువుఁడును, నందియు, గోప్తయు, హోతయు, విశ్వస్రష్టయు, నగ్నిరూపుఁడు,

ముండియుఁ, గపర్దియునగు సర్వవిభుని మహాభాగ్యము నెఱిఁగింపుము." అని ప్రార్థించెను. అది విని యవ్యాసుదేవుఁడు, "ఆయీశుని కర్మగతి శక్తిచే యథార్థముగాఁ దెలియ శక్యముగాదు. హిరణ్యగర్భ ప్రభృతులగు నింద్రాది దేవతలును, మహర్షులును, సూక్ష్మదర్శనులగు నాదిత్యులును, నెవ్వని భవనము నెఱుంగఁజాలరో సజ్జనులకు గతియగు నట్టిమహాదేవుఁడు నరమాత్రునిచేఁ దెలియఁబడు టెట్లు? అటులగుట నసురఘ్నుఁడును, వ్రతేశుఁడునునగు భగవంతుని గుణములను గొన్నిటినే యథార్థములుగా గీర్తించెదను" అని పలికెను.

ఓ జనమేజయా! అవ్యాసుదేవుఁ డిట్లు పలికి, యుపస్పర్శన మొనర్చి శుచియై మహాత్ముఁడగు మహాదేవుని గుణముల నెన్న నారంభించి యిట్లు తెలిపెను.

"ఓ యుధిష్ఠిరా! నీవును బ్రాహ్మణోత్తములను సేవింపుము. ఓ గాంగేయా! అక్కపర్ది నామావళి నీవు వినుము. నేను మున్ను మా సాంబునకై దుష్కరసమాధి యొనర్చి యం దాభగవానుని దర్శించితిని. మఱియు మున్ను ప్రద్యుమ్నునిచే శంబరాసురుఁడు నిహతుఁడు గాఁగాఁ బండ్రెండువత్సరము లయినపిమ్మట జాంబవతి రుక్మిణీపుత్రులగు ప్రద్యుమ్న చారుదేష్ణాదులను గాంచి నాతో "ఓ నాథా! నేను బుత్రార్థిని నై నిన్నొకటి వేఁడుచున్న దానను. ఉత్తమ బలశాలియు, శూరుఁడును, మనోహరాకారుఁడును, నిష్కల్మషుఁడును, నీకు సరియగువాఁడునగు నొకపుత్రు నచిరకాలమున నాకుఁ గలుగు నట్లు ప్రసాదింపుము. ఈమూఁడు లోకములందును నీకుఁ బొంద రానిది లేదుగదా! ఓ యదూద్వహా! నీవు తలంతువేని మఱియు నెన్నియేని లోకముల సృజింతువు. నీవు పండ్రెండు వత్సరములు దీక్ష వట్టి ఘోర తపమొనర్చి పశుపతిని బ్రసన్నునిఁ గావించికొని రుక్మిణి యందుఁ బుత్రుల జనింపఁజేసితివి. చారుదేష్ణుఁడు, సుచారుఁడు, చారువేషుఁడు, యశోంబరుఁడు, చారుశ్రవుఁడు, చారుయశుఁడు, ప్రద్యుమ్నుఁడు, శంభువు అనువారు చారువిక్రములై రుక్మిణికిఁ బుత్రులై పుట్టుటకు నీ వ్రతదీక్షయె గాదె నిమిత్తము! అటులే నాకును నొక తనయునిఁ గల్గింపుము." అని నన్నుఁ బ్రేరించెను. అంత

నాసుమధ్యయగు జాంబవతితో "ఓ రాజ్ఞీ! నీమాటచొప్పున వర్తిం చెదను. నన్ను నమ్ముము.' అని నేను దెలుపుటయు మఱియు నామె నాతో "దేవా! నీకు విజయమును, శుభము నగుఁగాక. బ్రహ్మయు, శివుఁడు, కాశ్యపుఁడు, నదులును, దేవతలును, క్షేత్రౌషధములును, బ్రాహ్మణులును, వేదములును, ఋషిగణములును, బుడమియు, సముద్ర ములును, దక్షిణలును, స్తోభలును, నక్షత్రములు, గ్రహములు, పితృ దేవతలు, దేవపత్నులు, దేవకన్యలు, దేవమాతలు, మన్వంతరములు, గోవులు, సూర్య చంద్రులును, హరియు, సావిత్రి, బ్రహ్మవిద్య, ఋతు వులు, వత్సరములు, క్షణములు, లవములు, ముహూర్తములు, నిమేష ములు, యుగములు, నిన్నెల్లవేళలను నెల్ల చోటులను రక్షించుఁ గాక. నీకు సుఖ మొనఁగుఁగాక. ఓ యనఘా! శుభప్రదమగు మార్గ మునుబట్టి పొమ్ము. జాగరూకుఁడవై యుండుము" అని యిటు లామె నాకు మంగళాచరణ మొనర్ప నామెతోఁ జెప్పి పిమ్మట నా తలి దండ్రులకడకును, నాహుకునికడకును బోయి యామె నన్నుఁ గోరిన విధము వారి కెఱింగించి, వారి సెలవుగొని యనంతర మెట్టెటో గద బలరాముల సన్నిధికి విన్నవింపఁబోవుటయు, వారిరువురును బ్రీతివడి నాకు నిర్విఘ్నముగాఁ దపస్సమృద్ధి యగునట్లు లాశీర్వదించిరి. ఆటులు గురుజనులందఱి యనుజ్ఞనొంది నేనపుడు గరుడునిఁ దలంచితిని. అతఁడు వెంటనే వచ్చి నన్ను హిమవంతమును జేర్చి మరల నా యనుజ్ఞనొంది వెడలిపోయెను. అప్పర్వతమున నే నద్భుతములగు భావములను గాంచితిని. అత్యద్భుతమై తపసుల కుత్తమమైన యొక క్షేత్రము నాకందగపడియెను. అయ్యది మహాత్ముఁడును, వ్యాఘ్ర పాదపుత్త్రుఁడునగు నుపమన్యుని దివ్యక్షేత్రము బ్రాహ్మలక్ష్మిచే సమా వృతమై దేవగంధర్వులచేఁ బూజింపఁబడు నా క్షేత్రము, ధవ, కకుభ, కదంబ, నారికేళ, కురవక, కేతక, జంబు, పాటల, వట, వరుణక, వత్స నాభ, బిల్వాదులగు వృక్షములతోడను, సరళ, కపిత్థ, ప్రియాళు, సాల, తాళ, బదరీ పున్నాగములును, నశోకములును, ముక్తములు, నింగుదములు, నామ్రాతకములును, మధూక, కోవిదార, చంపక పనసములును, మున్నగు వృక్షములతోడను, ఫల పుష్ప వృక్షముల తోడను, వెలయుచుఁ జూపట్టెను. మఱియు నయ్యాశ్రమము పుష్ప

గుల్మలతాకీర్ణమై కదళీవనశోభితమై, బహువిధములగు పక్షుల కాహార ప్రదములగు ఫలవృక్షములచే నలంకృతమై యాయా యర్హస్థానము లందు భస్మరాశులు వెలయ, మృగ, వానర, శార్దూల సింహ, ద్వీపి సమూహులమై, యొకయెడ మయూరములు నాట్యము సేయుచుండ నెంతయు నొప్పారుచు వేఱొకచో మార్జార భుజగములు చరింప భల్లూక మహిషాదులతోఁగూడి యలరారుచుఁ గానవచ్చెను. మఱియుఁ గిలకిలారావము లొనర్చు పక్షులును, బుష్పితములగు వృక్షములును గలిగి, నానావిధ పుష్ప పరాగ మిశ్రితమగు గజమదధారలచేఁ బరిమిళితమై గంధర్వకాంతాగాన ఘూర్ణితమై వెలయు నందుఁ జల్లనిగాలులు మెల్లగా వీవఁజొచ్చెను. మఱియు జలధారల నినాదములును, విహంగముల ప్రణాదములును, నేనుగుల బృంహితములును, నుదారములగు కిన్నరుల గీతములును, సామగానపరుల స్వనములును, వినువారి కింపొసంగఁ దలంచుటకు నలవిగాని యొప్పిదముగల సరోవరములచే నలంకృతమై, విశాలములై కుసుమాన్వితములగు నగ్ని గృహములచే నలంకృతమై పవిత్రోదకములుగల గంగానది ప్రవహించుటను జూడ మనోహరమై యగ్ని తుల్యులై మహాత్ములగు ధర్మజ్ఞులసత్పురుషసంగముల కాకరమై, యాయాశ్రమ మెంతయు, విరాజిల్లుచు వచ్చెను. మఱియు నచ్చో, వాయ్వాహారులును, నంబుపాయులును, జపనిష్ఠులగు సంప్రక్షాళులును, ధ్యాననిష్ఠులగు యోగులును, ధూమాహారులును, సూక్ష్మపాయులును, క్షీరపాయులును, నగు బ్రాహ్మణోత్తము లెల్లెడలఁ జూపట్టిరి. గోచారులు, నశ్మ కుట్టులును, దంతోలూఖలికులును, మరీచిపాయులు, ఫేనపాయులు, మృగచారులు, నశ్వత్థఫల భక్షులు, జలశాయులు, చీరచర్మాంబరధరులును, వల్కలవసనులును, నాకందుఁ గానవచ్చిరి. అటులు తపోధనులై మహత్తరులగు మహర్షుల నెల్ల నరయుచు, బహువిధనియమములు గలమతులను గాంచుచు నయాశ్రమముఁ బ్రవేశింపఁ దొడంగితిని. మఱియు మహాత్ములును బుణ్యకర్ములును శివాదులు నగు దేవగణములచే సేవింపఁబడుచు నయాశ్రమము నభోగత చంద్రమండలమట్టులు మిగుల నొప్పారుచుఁ గానవచ్చెను. ఆహా! అది యెంత శాంతప్రదేశమోగాని యందుఁ బాములును, ముంగిసలును గలిసి యాడుకొనఁ దొడంగెను.

తేళ్లును బెబ్బులులును మిత్రములై మెలఁగుచుండెను. అవియెల్ల మహాత్ములగు తపోధనులసన్నికర్షప్రభావముచే నైసదియగాఁ దలంచితిని. సకలప్రాణిమనోహరమై, ద్విజశార్దూలాదిసేవితమై, వేదవేదాంగపారగులును నానానియమపరులును మహాత్ములునగు మహర్షులకు సేవ్యమైన యయ్యాశ్రమపదమున, నేను ప్రవేశించుచునే జటాచీరధరుఁడగు, నయ్యుపమన్యుమహర్షిని జూచితిని. అతఁడు తపస్తేజములచే నగ్నివలె వెలయుచు శిష్యజనపరివృతుఁడై శాంతుఁడును, యువకుఁడును నై నాకుఁ గానవచ్చెను. అపుడు నేనాతనికి నమస్కరింపఁగా నాకతఁడు స్వాగతమొసంగి "ఓపుండరీకాక్షా! మాతపములు ఫలించెను. సకలజనపూజనీయుఁడవగు నీవు నన్నుఁ బూజించుచున్నాఁడవు. అందఱకు ద్రష్టవ్యుఁడవగు నీవు మమ్ము దర్శింప వచ్చితివి." అని పలికెను. పిదప నే నాతనికిఁ బ్రాంజలి నై, యాతని యగ్నులు, మృగములు, పక్షులు, ధర్మము, శిష్యవర్గము, మున్నగువాని కుశలమును బ్రశ్నించితిని. పిమ్మట నమ్మహర్షి మిక్కిలి మనోజ్ఞమై ప్రియమగు వాగ్రచన వెలయ నాతో "ఓకృష్ణా! నీకుఁ దుల్యుఁడగు తనయుఁడు గల్గెడిని. సంశయమంద నక్కఱలేదు. గొప్పతపమొనర్చి శంకరునిఁ బ్రసన్నునిఁ జేసికొనుము. ఓయధోక్షజా! ఇందుఁ భార్యతితోఁ గూడ శంకరుఁడు విహరించుచుండును. మున్నా దేవతలును, మహర్షులును నిందే యద్దైవతశ్రేష్ఠమగు మహాదేవుని, బ్రహ్మచర్యతపస్సత్యదమములచే సంతోషపెట్టి యభీప్సితములెల్లఁ బడయఁగల్గిరి. ఓజనార్దనా! తేజస్తపోనిధియగు నాభగవానుఁ డిందే, శుభాశుభదములగు భావముల సంక్షేపవిక్షేపము లొనర్చుచు భవానీదేవితో నిత్యము నివసించును. ఆతనినిగాదే నీవు సేవింప నిందులకు వచ్చినది? మేరుకంపనుఁడగు హిరణ్యకశిపుఁడను దానవుఁ డా శర్వునియనుగ్రహముచేఁ గాదె సర్వామరైశ్వర్యము వడసినవాఁడు? కోటివత్సరము లాదానవుఁడు శంకరు నారాధించెను. వానిపుత్త్రులలో మందరుఁడనువాఁడు మహాదేవునివరమువలన నింద్రునితో నర్బుదవత్సరములు యుద్ధమొనర్పఁగలిగెను వానిమీఁద విష్ణునిచక్రమును నింద్రునివజ్రాయుధమును భగ్నము లయ్యెను గాదే? మఱియు నావృషాంకుఁడు,

జలాంతరచరుఁడై బలగర్వితుఁడైన దైత్యుని వధించి, దీప్తజ్వాలన తుల్యమగుచు నద్భుతతేజమై దుర్ధర్షమగు నొకచక్రము నామందరుఁ డను రక్కసునుక్కడంప నొసంగెనుగాదే? ఆశూలిదక్క వేఱొక్కఁ డాచక్రమును జూచుటకేని సమర్థుఁడు గాఁడు. కాని యది నీయెడ సుదర్శనమగునని యాశంకరుఁడు తెలిపెను. అటులగుటనే దానికి సుదర్శన మనుపేరు ప్రసిద్ధమయ్యెను. ఓకేశవా! అట్టిసుదర్శనమును, నామందరునిమేన జీర్ణతృణప్రాయ మయ్యెను గాదే? అతిబలుఁడై యీశ్వరవరమహత్త్వముగల యామందరునిమేన, శస్త్రములుగాని, చక్రముగాని, నూఱువజ్రాయుధములుగాని, పనిసేయఁజాలకుండెను. బలశాలియగు నామందరునిచే నెంతయుఁ బీడితులై సురలు, శివదత్త వరులగు నసురులఁ గొందఱను బీడించిరి. అమ్మహేశ్వరుఁడు తుష్టుఁడై విద్యుత్ప్రభునకుఁ ద్రిలోకేశత్వ మొసంగెను. వాఁడు నూఱువేలేండ్లు సర్వలోకేశ్వరుఁడై, యమ్మహేశునిఁ దనకనుచరుఁడుగా నుండుమని పలికెను. మఱియు నమ్మహాదేవుఁ డావిద్యుత్ప్రభునకుఁ బెక్కురఁ బుత్త్రులను బ్రసాదించి కుశద్వీపమును సైతము రాజ్యముగా వాని కొసంగెను. అటులు మున్ను విధాతచే శతముఖుఁ డనియెడి మహాసురుఁడు సృజింపఁబడి, నూతేండ్లొక్కరీతిగా నిజదేహమాంసములచే నగ్నిలో హోమము గావించెను. అందుల కాశంకరుఁడు సంతుష్టుఁడై నీకు నేనేమి చేయవలసి యుండునో తెలుపుమని పలుకుటయు, నాశతముఖుఁడు 'దేవా! నాకద్భుతమగు యోగమును బ్రసాదింపుము. ఓ దైవతోత్తమా! మఱియు స్థిరమగుబలము ననుగ్రహింపుము.' అని కోరెను. అది విని యమ్మహాదేవుఁడు నీయభీప్సితము నెఱవేఱుఁగాక యని పలికెను. మున్నొకపుడు స్వాయంభువ పుత్త్రులకై యోగనిష్ఠతో మూఁడువందలేండ్లు క్రతువొనర్ప నాతని కమ్మహాదేవుఁడు నూర్వురు పుత్త్రుల నొసంగెను. ఓకృష్ణా! దేవసన్నుతుఁడగు నాతని యోగీశ్వరేశ్వరునిఁగాఁ దెలియుము. సందియమింత నక్కఱలేదు. మఱియుఁ బరమధార్మికుఁడగు యాజ్ఞవల్క్యుఁ డనుపేరుగల మహర్షి యమ్మహాదేవు నారాధించి నిరుపమానమగుకీర్తి నార్జించెను. యోగనిష్ఠుఁడైన పరాశరాత్మజుఁడగు వ్యాసుఁ డమ్మహాదేవు నారాధించియే మహత్తరమగు యశము గడించెను. మున్నొకపుడు వాలఖిల్యు లింద్రుఁ డొన

ర్చిన యవమానము నోరువక కుపితులై యప్పుడు దీర్ఘ రుద్రు నారా ధించుటయు, నందులకుఁ బ్రీతుఁడై యాకందర్పవైరి వారితో మీ తపముచే సోమహర్తయగు సుపర్ణునిఁ బుట్టింపుఁడని వరమొసంగి వారి నంపెను. మున్నొకపు డమ్మహాదేవునకుఁ గోపము గల్గుటచే, నుదకములు నశించెను. అపుడు దేవతలు సప్తకపాలక్రతువుచే శంకరు నారాధించి మరల నుదకములను జనింపఁజేసిరి. అపు డాశంకరుఁడు ప్రసన్నుఁడగుటనే పానీయ ముత్పన్నమయ్యెను. మఱియు బ్రహ్మవాదినియగు నత్రిభార్య యొకపుడు భర్తను బరిత్యజించి 'నేనిఁక, నామహామునికి వశవర్తిని నై ప్రవర్తింప'నని పలికి శంకరుని శరణు చొచ్చి యత్రిభయము తప్పించుకొన, మూఁడువందలవత్సరములు నిరాహార యై యాభవునను గ్రహమునకై ముసలములయందే శయనించెను. ఆమెను జూచి యమ్మహాదేవుఁడు నగుచు 'ఓనారీమణీ, నీకు భర్తృసంయోగము లేకయే చరుద్రవమునఁ బుత్రుఁడు జనించును. నందియమందకుము. నీనామముచేతనే తద్వంశము గొప్పఖ్యాతి వహించును.' అని పలికెనఁట. మఱియు భక్తసుఖావహుఁడగు మహాదేవునిఁ బ్రసన్నునిఁ గావించికొని, వికర్ణుఁడనువాఁడు పరమసిద్ధి వడసెను. మఱియు శాకల్యుఁడు పరిశుద్ధాత్ముఁడై తొమ్మిదివందలయేండ్లు మనోయజ్ఞముచే నాభవు నారాధించుటయు, నతఁడు ప్రసన్నుఁడై, యాశాకల్యునితో 'ఓమునీశ్వరా! నీవు గ్రంథకారుఁడ వగుదువు. నీకు మూఁడులోకములందును నక్షయమగు కీర్తి లభించును. మఱియు నీవంశము మహర్షులచే నలంకృతమై యక్షయమయ్యెడిని. నీపుత్రుఁడు ద్విజోత్తముఁడై సూత్రకర్త యగును.' అని తెలిపెనఁట. మఱియుఁ గృతయుగమున సావర్ణియను ప్రసిద్ధివడసిన యొకమహర్షి, యీయాశ్రమముననే యాఱువేలేండ్లు గొప్పతపమొనర్చుటయు, నాతని కారుద్రుఁడు ప్రత్యక్షమై 'ఓయనఘా! నీతపమునకు మెచ్చితిని. కావున నీవు జరామరణవర్జితుఁడవై గ్రంథకర్తవై లోకవిఖ్యాతుఁడ వగుదువు.' అని వరమొసంగెనఁట. ఓజనార్దనా! మున్నొకపుడు మహేంద్రుఁడు వారాణసిలో శంకరు నారాధించుటయు, దిగంబరుఁడును, భస్మభూషితుఁడు నై తన్నటు లారాధించిన యాయింద్రునకమ్మహాదేవుఁడు దేవరాజ్యము నొసంగెను. మఱియు మున్ను నారదుఁ

డెంతయు భక్తిమెయి నాభవుని సేవించుటయు, నతఁడు ప్రీతుఁడై 'ఓనారదా ! తపస్తేజములందును కీర్తియందును నీకు సాటియగు వాఁడు వేఱొకఁ డుండఁడు. మఱియు వాదితవ్యమగు గీతముచే నిత్యము నన్ననుసరింతువు.' అని తెలిపెనఁట. ఓమాధవా ! మున్ను నాకును నమ్మహాదేవుఁడు ప్రత్యక్షమై కానిపించినవిధ మెట్టిదియుఁ దెలిపెదను వినుము. నియతుఁడనై నేనామహాతేజుఁడగు దేవదేవు నెందులకుఁ బ్రసన్నునిఁ గావించితినో యదియు నెఱిఁగించెదను వినుము. మఱియు మున్నా దేవదేవుఁడగు మహేశ్వరువలన నాకేది లభించెనో యదియెల్ల గూడఁ దెలిపెదను.

"ఓనాయనా ! మున్నొకపుడు కృతయుగమున మహాతపుఁడగు వ్యాఘ్రపాదుఁడను మహర్షియొకఁడు ప్రసిద్ధుఁడై యుండెను. అతఁడు వేదవేదాంగవేత్త. నేనాతనికిఁ బుత్రుఁడను. నాతమ్ముఁడు ధౌమ్యుఁడు. ఒకపుడు నేను నాతమ్ముఁడగు ధౌమ్యునితో నాడికొనుచు, భావితాత్ములగు కొందఱమునుల యాశ్రమమునకు వెళ్లితిని. అందుఁ బితుకఁబడు చున్న యొకయావు నాకుఁ గానవచ్చెను. దానిపా లమృతతుల్యమై యుండుట నేను గనిపెట్టి, పిమ్మట మాతల్లితో, బాలుఁడనగుట, నిట్లు పలికితిని—'ఓయమ్మా! నాకు క్షీరాన్నసహితమగు భోజనము పెట్టుము.' అని. అపుడామె తనయింటఁ బాలు లేకుండుటను దుగఖితయై కొంత వడి చింతించి, పిదప మెత్తనిపిండి, నీటఁ గలపి 'నాయనా ! ఇదె క్షీరము త్రాగుము.' అని తెచ్చి నాచేఁ ద్రావించెను. అంత నొకపుడు నేను మాతండ్రితో యజ్ఞమునకుఁగా, మాజ్ఞాతులయింటికిఁ బోయి నపు డందు గోక్షీరమును ద్రావుట సంభవించెను. ఆయజ్ఞమునఁ గామధేనువు క్షీరమొసంగుచు వచ్చెను. రుచిచే నమృతమనఁదగు దాని పాలు ద్రావి యపుడు క్షీరగుణములను, క్షీరోత్పత్తివిధమును దెలిసినవాఁడ నగుట, నాకు మాతల్లి యిచ్చిన పిష్టరసము రుచింపమి, నపుడు బాలుఁడ నగుటచే మఱియు నాతల్లితో 'అమ్మా! నీవు నాకిచ్చుచున్నది క్షీరాన్నము గాదు.' అని పలికితిని. అపుడు మాయమ్మ, దుగఖితయై పుత్రస్నేహమును బట్టి నన్నుఁ గౌఁగిలించికొని, ముద్దుపెట్టుకొని, 'నాయనా ! భావితాత్ములగు మునులయిండ్లలలో క్షీరాన్నమెట్లు సంభవించును ? మనము నిత్యమును వనవాసులమై కందమూల

ఫలాహారుల మై యున్నవారము గదా! వాలఖిల్యనిషేవితమై దివ్య మైనయిమ్మహానది నాశ్రయించి యున్నవారముగాని, మనకుఁ బాలు గలవా? తండ్రీ! కొండలలో వానప్రస్థులై పావనులై వన్యాహారులై వనములందున్న మునులకుఁ బాలు దుర్లభము గాదే? గ్రామ్యాహార నివృత్తులై యరణ్యఫలాహారులై సురభిగోత్రశూన్యమైనవనమున వసించుమునులకు క్షీరము లభించు టెట్లు? నదీగహ్వరశైలములందును, వివిధములగు తీర్థములందును, తపోజపనిత్యులై యున్నమనబోఁటివారికి ఈశ్వరుఁడే పరమగతి. విరూపాక్షుఁడును వరదుఁడును, నవ్యయుఁడును, స్థాణువు నగు శంకరుననుగ్రహము గలిగించుకొనకున్న మనకు క్షీరాన్న మెట్లు లభించును? వత్సా! మఱియు మనకు వసనములును సుఖములును గలుగు టెట్లు? ఓపుత్రకా! నీవెల్లవిధముల శంకరుని శరణుచొచ్చి యాతని యనుగ్రహమునఁ గోర్కుల నెల్ల నొందఁగలవు?' అని పలికెను. ఓమాధవా! అప్పుడు నాతల్లిమాట వినినతోడనే, నేను జేతులు మొగిడ్చి నమ్రుఁడనై 'ఓమాతా! మహాదేవుఁ డెవ్వఁడు? అతఁ డెట్లు ప్రసన్నుఁడగును? అతఁ డెక్కడ నుండును? అతనిదర్శనము నాకు లభించు టెట్లు? అతఁడు సంతుష్టుఁ డెట్లగును? అతనియాకార మెట్టిది? జ్ఞేయుఁడగు నతఁడు ప్రసన్నుఁ డైనపుడు తనరూప మెట్లు చూపించును?' అని ప్రశ్నించితిని. ఓకృష్ణా! నేనిటు లడుగుటయుఁ, బుత్రవత్సలయగు నాతల్లి నన్ను ముద్దుపెట్టుకొని, బాష్పాకులనేత్రయై నాయొడలు దడవుచు దైవమును దలంచి నాతో నిట్టు లనియె.

"ఓనాయనా! ఆమహాదేవుఁడు, దుర్విజ్ఞేయుఁడును, దురారాధుఁడు, దురంతకుఁడు నైనవాఁడు. మఱియు నతఁ డకృతాత్ములగు వారికి దుర్దర్శుఁడును, దుర్గ్రాహ్యుఁడు దురాబోధుఁడు నై యున్నవాఁడు. ఆతనిరూపము లనేకములని పండితులు తెలుపుచున్నారు. ఆతనిస్థానములును విచిత్రములు. అనుగ్రహములును ననేకవిధములై యుండును. ఆయీశునిశుభచరిత్రము నెవ్వఁడు యథార్థముగాఁ దెలియఁగలఁడు? మఱియు నా దేవదేవుఁ డే యేరూపముల ధరించెనో, యెట్లు విహరించెనో, యెట్లెట్లు ప్రసన్నుఁ డయ్యెనో? తెలియుట దుర్ఘటము. ఆమ్మహేశ్వరుఁడు విశ్వరూపుఁడై సకలభూతాంత

రాత్మయై యథాశ్రుతముగా, భక్తులను దయఁజూడ దర్శన మొసంగు చుండునఁట. ఆశంకరునిశుభప్రదమగు దివ్యచరితమును మునులు తెలుపుచుండఁగా వింటిని. అతఁడు విప్రుల ననుగ్రహించుటకై యేయేరూపముల ధరించెనో, వానినన్నిటిని, నీవిటులు నన్నుఁ బ్రశ్నించుటను సంక్షేపముగా నెఱిఁగించెదను వినుము. ఓవత్సా! అమ్మహానీయుఁడు, బ్రహ్మవిష్ణుమహేంద్రులయు, రుద్రాదిత్యులయు, నశ్వినీదేవతలయు, విశ్వేదేవులయు శరీరముల ధరించుచున్నవాఁడు. అటులే దేవకాంతలయు, మానవులయుఁ, బ్రేతపిశాచములయుఁ, గిరాతశబరులయు రూపముల వహించుచుండును. ఒకపుడాభగవానుఁ డరణ్యమున, మహత్తరమగు నొకశాబరరూపమును వహించును. మఱియు మత్స్యకూర్మశంఖాదిరూపములను ధరించును. నానారూపుఁడు నతఁడే. యక్షరాక్షససర్పములయు, దైత్యదానవులయు, బిలవాసులయు రూపులు ధరించును. అటులే వ్యాఘ్రసింహమృగములయుఁ, దరక్షుభల్లుకములయుఁ, బక్షులయు, నాకృతులఁ బూనుచుండును. శునకసృగాలములయు, నులూకములయు నాకారముల నాతఁడు వహించునఁట. మఱియు హంసకాకమయూరరూపముల నాతఁ డొకొక్కపుడు ధరించుచుండును. అటులే బలాకాగృధ్రచక్రాంగరూపములను బూనుచుండును. మఱియు నతఁడసమానరూపములను బూని పర్వతములను ధరించును. అమ్మహాదేవుఁడు గోరూపుఁడును, గజాశ్వఖరోష్ట్రాకారుఁడును, ఛాగశార్దూలరూపుఁడును నై చూపట్టుచుండునఁట. దివ్యములగు నండజరూపములను బూనుచుండును. మఱియు దండియు, ఛత్రియుఁ, గుండియు నై ద్విజులరూపు వహించుచుండును. అటులే షణ్ముఖుఁడును, బహుముఖుఁడును, త్రినేత్రుఁడును, బహుశీర్షకుఁడు, బహుకటిపాదుఁడును, బహూదరవక్త్రధారియు, బహుపాణిపార్శ్వుఁడును, బహుగణసంవృతుఁడును, ఋషిగంధర్వరూపుఁడును, సిద్ధచారణాకారుఁడును నై ప్రవర్తిల్లు చుండునఁట. మఱియు నతఁడు, భూతిరూషితశ్వేతగాత్రుఁడును, సూర్యచంద్రకృతభూషితుఁడును, నై యొప్పుచు, బహువిధారావసంఘుష్టుఁడై, బహుజనస్తుతిసంస్కృతుఁడై వెలయుచుండును. సర్వరూపియు, సర్వభూతాంతకుఁడును సకలలోకప్రతిష్ఠితుఁడును, సల

లోకాంతరాత్ముఁడును, సర్వవ్యాపకుఁడును, సర్వవాదియు నై యున్నవాఁడు. సకలప్రాణులకును హృదయగతుఁడై యాభగవానుఁ డెల్ల యెడలఁ గానవచ్చును. ఎవ్వఁడు తన్నేమి కోరునో, యెవ్వఁ డేయర్థమునకై తన్నర్థించునో, యదియెల్లఁ దెలిసికొని యాదేవేశుఁడు వారికి వానినెల్ల నొసంగుచుండును. అతనిఁ జేరి, నీవేది కోరుదువో దాని నతఁ డొసంగును. మఱియు నతఁడు సంతోషించును. ఒకపుడు కోపమును జూపును. వేఱొకపుడు హుంకరించును. మఱియు నతఁ డొకపుడు చక్రమును, వేఱొకపుడు శూలమును, నింకొకపుడు గదను, మఱియొకపుడు ముసలమును, ఖడ్గమును, బట్టసమును ధరించుచుండును. నాగమౌంజియు, నాగకుండలభూషితుఁడును, నాగయజ్ఞోపవీతియు, నాగచర్మోత్తరీయుఁడును, నై వెలయుచు నొకపుడు నగుచు, వేఱొకపుడుఁ బాడుచు, నింకొకపుడు నాట్యముసేయుచుండును. మఱియుఁ బ్రమథగణములతోఁ గూడి విచిత్రములగువాద్యము లొనర్చుచుండును, ఒకపు డొడలువిఱుచును. వేఱొకపు డావులించును. మఱియొకపు డేడ్చుచుండును. ఇంకొకపు డేడ్పించుచుండును. మఱియొకపుడు మత్తోన్మత్తరూపుఁడై సుస్వరముగా భాషించుచుండును. తన మిడిగ్రుడ్లచే జనములకు భయమొదవ మిక్కిలి రౌద్రముగా, నట్టహాసమొకప్పుడు సేయుచుండును. సుఖముగా నొకపుడు నిద్రించుచుండును. ఆవులించుచుండును. మేలుకని యుండును. మఱియు నమ్మహానీయుఁడు తపించుచుఁ, దపోనిష్ఠులచేఁ దలంపఁబడుచు, జపించుచు, జప్యుఁడగుచు, నిచ్చుచుఁ, బ్రతిగ్రహించుచు, యోగపరుఁడగుచు, ధ్యానమొనర్చుచు నుండును. అప్పరమేశ్వరుఁడు వేదీమధ్యమందును, యూపస్తంభమందును, గోష్ఠమధ్యమందును, హుతాశనునందును, జూపట్టుచుండును. మఱియు నొకపుడు బాలుఁడును, వేఱొకపుడు వృద్ధుఁడును మఱియొకపుడు యువకుఁడు నై గానవచ్చుచుండును. ఒకపు డమ్మహాదేవుఁడు ఋషికన్యలతోడను, వేఱొకపుడు ఋషిపత్నులతోడను గూడి యాడుకొనుచుండును. ఊర్ధ్వకేశుఁడును, మహాశేఫుఁడును, దిగంబరుఁడును, వికృతనేత్రుఁడును, గౌరశ్యామ కృష్ణ ధూమ్ర లోహితవర్ణములుగలవాఁడును, వికృతాక్షుఁడును, విశాలాక్షుఁడును, నగ్నుఁడును, సర్వాచ్ఛాదకుఁడును, నై

యున్నవాఁడు. రూపహీనుఁడును, నతిరూపుఁడును, నాద్యరూపుఁడును, వర్తమానరూపుఁడును, నాద్యంతరహితుఁడును, నజుఁడు నగు నాతనియంతమును యథార్థముగా నెవ్వఁ డెఱుఁగును? మఱియు నతఁడు, హృద్గతప్రాణమనోజీవరూపుఁడును, యోగరూపియు, యోగిసంజ్ఞకుఁడును, ధ్యానాకారుఁడును నై పరమాత్మ యగు నమ్మహేశ్వరుఁడు భావగ్రాహ్యుఁడై యుండును. అతఁ డొకపుడు వాదకుఁడును, నొకపుడు గాయకుఁడును నగుచు శతసహస్రనేత్రుఁడై చూపట్టుచుండును. మఱియు నేకవక్త్రుఁడును, ద్వివక్త్రుఁడును, త్రివక్త్రుఁడును, ననేకవక్త్రుఁడును, నై వెలయుచుండును. ఓపుత్త్రకా! నీవమ్మహాదేవుని భజింపుము. తద్భక్తుఁడవును తత్పరాయణుఁడవును, దద్గతుఁడవును, దన్నిష్ఠుఁడవు నగుదేని, నీయభీప్సితము నెఱవేఱెడిని."

ఓజనార్దనా! నాతల్లి చెప్పినమాటలు వినినదాదిగా నాకమ్మహాదేవునియెడ నైష్ఠికభక్తి గలిగెను. పిమ్మట నేనమ్మహాత్మునిఁ దపముచే మెప్పించితిని. వేయేండ్లు నేను వామపాదాంగుష్ఠముపై నిలిచియుంటిని. అందొకనూఱేండ్లు ఫలాహారుఁడనై యుండియు, నొకనూఱేండ్లు జీర్ణపర్ణాహారుఁడనై యుండియు, మఱియొకనూఱేండ్లు నీరు ద్రావియుఁ, దక్కిన యేడువందలసంవత్సరములు వాయుభక్షకుఁడనై కాలము గడపి దపమొనర్చియు నట్లు దివ్యముగా నాతని నారాధించితిని. అనంతర మాసర్వలోకేశ్వరుఁడును, సర్వప్రభుఁడునగు మహాదేవుఁడు సంతుష్టుఁడై 'నాకు వీఁడేకభక్తుఁ' డని తలంచి, నానిష్ఠను బరీక్షించువాఁడై యొకపుడు, శక్రరూపమూని దేవగణములతోఁ గూడి, సహస్రనేత్రములును, వజ్రాయుధమును వెలయ, నెఱ్ఱనికన్నులు, స్తబ్ధకర్ణములును, మహాకటములును, నాల్గుదంతములును, దెల్లనివర్ణమును గలిగి, తొండము చుట్టుకొనుచు, భయంకరమైన యొకమహాగజము నధిరోహించి, నిజతేజముచే నెంతయు వెలయుచు నాసమీపమునకు వచ్చెను. అమ్మహనీయుఁడు కిరీటమును, కేయూరములను, హారములను నలంకరించుకొని, శ్వేతచ్ఛత్త్రము మలరార, నప్సరోగీతములతోడను, దివ్యగంధర్వనాదములతోడను సేవింపఁబడుచు నాకుఁ బ్రత్యక్షమై నాతో 'ద్విజోత్తమా! నీతపమునకు సంతసించితిని. కావున నీకు వలయువర మొకటి కోరికొనుము.' అని పలికెను.

ఓకృష్ణా! నేనాయింద్రునివచనము విని మిక్కిలి సంతోషింపక, యాతనితో "ఓయీ! నేను నినుండి వరము గోరి తపమొనర్పలేదు. మఱి యేదేవతనుండియును గోరను. ఓసౌమ్యా! ఆమహాదేవుఁడు దక్క వేఱొక్కఁడు నాకు వరమొసంగ నక్కఱలేదు. ఇది నిజమని నమ్ముము. మఱియు నాయీవచనము సత్యము, సత్యము, నిశ్చితము. అమ్మహేశ్వరుని విడిచి నాకన్యదైవతముకథ రుచించు టెట్లు? అప్పశుపతియాజ్ఞ యగునేని, నేనొకపురుగు నయ్యెదను. లేక యొక మహాశాఖమగు తరువున య్యెదను. కాని, పశుపతి కాని యన్యదైవతమునుండి లభించిన త్రిభువనరాజ్యము నేని గోరను. ఓసౌమ్యా! హరచరణసేవకుఁడగు శ్వపచునింటనైన నాజన్మమును గోరుదును గాని, యీశ్వరభక్తిలేని శక్రునింట నేని జనింపఁ గోరను. సురాసుర గురుఁడగు విశ్వేశ్వరునెడ భక్తిలేక మానవుఁడు, వాయుజలభక్షకుఁడై తపమొనర్చినను వానిదుఃఖక్షయ మగు టెట్లు? ఎవ్వరికి, హరచరణస్మరణ పిచ్చున మిష్టపడదో, యట్టివారి, కన్యధర్మయుక్తములగు సామాన్యకథలచేఁ బ్రయోజనమేమి? వక్రమగు కలియుగమునఁ బుట్టియును, హరచరణనిరతబుద్ధి యగునేని, యాహరభక్తిరసాయనము, వానిభయములను దొలఁగించుచుండును. ఒకదినముగాని, యొకపూటగాని, రెండుగడియలుగాని, క్షణముగాని, లవముగాని, చిత్తనైర్మల్యము లేనివానికి శంకరునందు భక్తి గలుగ నేరదు. ఆశంకరునాజ్ఞ యగునేని, నేనొకకీటమునుగాని, పతంగమునుగాని, యగుదును. అంతియ కాని, నీవొసంగునట్టి త్రిలోకాధిపత్యము నేనిఁ గామింపను. అమ్మహేశ్వరునాజ్ఞచే నేను కుక్కనైనను నాకుఁ జింతలేదు. అదియే నాకోరిక. మహేశ్వరేతరుఁ డొసంగిన దేవరాజ్యమునైన నే నొల్లను. ఇంత యేల! నే నామహాదేవునిదాసత్వమును దక్క, స్వర్గలోకమునుగాని, దేవరాజ్యమునుగాని, బ్రహ్మలోకమునుగాని, మోక్షమునుగాని, సమస్తకామములనుగాని సమ్మతింపను. చంద్రశిరోభూషణుఁడును, భగవానుఁడును పశుపతియు నగునమ్మహేశుఁ డెంతవఱకు సంతసింపఁ జేయఁబడకుండునో యంతవఱకును జన్మజరామరణశతాభిఘాతములచే దేహసంబంధంబులగు దుఃఖముల ననుభవించుచున్నాఁడను. సూర్యచంద్రాగ్నిసమభాసమానుఁడును, త్రిభు

వనసారుఁడును, ననంతుఁడును, నాద్యుఁడును, గేవలుఁడును, జరా మరణవర్జితుఁడునగు రుద్రుని బ్రసన్నునిఁ జేసికొనక యెవ్వఁడు శాంతిసుఖ మొందఁగల్గును? నాకుఁ గలదోషములచే మఱిమఱియు నాకు జన్మములగునేని, యాయాజన్మములందెల్ల నాకమ్మహాదేవునెడ నక్షయభక్తియే యగుఁగాక" అని పలికెను.

అది విని యాయింద్రుఁడు "ఓమునీ! నీవాయీశ్వరునిఁ దక్క వేఱొక్కని భజింపననియు, వేఱొకని యనుగ్రహమును గోరననియుఁ బలుకుచున్నాఁడవు గదా! అట్టి కారణకారణమగు నీశుఁడు కల్గుటలో నిమిత్తమేది?" అని ప్రశ్నించుటయు, నేనపు డిట్లు పలికితిని.

"ఓయీ! బ్రహ్మవాదు లెవ్వని, సదసద్వ్యక్తావ్యక్తరూపునిఁ గను, నిత్యుఁగను, గేవలుఁగను, ననేకరూపునిఁగను బలుకుదురో యట్టి మహాదేవునుండియే వరము గోరుచున్నారము. ఆదిమధ్యాంత శూన్యుఁడును, జ్ఞానాత్ముఁడును, నచింతనీయుఁడును, బరమాత్మయు నగునాతనినుండియే వరము వడయఁ దలంచుచున్నారము. ఎవనివలన సకలైశ్వర్యములును సంభవించునో, యట్టి యవ్యయుఁడును ననుత్పాదితుఁడును, నబీజబీజసంభవతుల్యుఁడు నగు నమ్మహాదేవునుండి వరము గోరుచున్నారము. తమఃపరుఁడును జ్యోతిర్మూర్తియు నగు నెవనిఁ దెలిసిన, దుఃఖము లడంగునో, యట్టి మహనీయునుండి వరము గోరుచున్నారము. ఓపురందరా! భూతభావనభావజ్ఞుఁడును, సకలభూతాభిభావనుఁడును, సర్వవ్యాపకుఁడును, సర్వప్రదుఁడును, నగు దేవునిఁ బూజించెదను. తత్త్వజ్ఞు లెవ్వని నుపాసింతురో యట్టి హేతువాద వినిర్ముక్తుఁడును, సాంఖ్యయోగార్థప్రదుఁడునగు పరునుండి వరము గోరుచున్నారము. ఓయింద్రుఁడా! ఎవ్వని, సురేశ్వరుఁడగు శతక్రతునిఁగాఁ దెలుపుదురో, యట్టి సర్వభూతగురుఁడగు దేవునుండి వరము నపేక్షించుచున్నారము. ఆకసము నిండునట్లుగా, లోకభావనుఁడై యండరూపుఁడైన బ్రహ్మను మున్నెవఁడు సృజించెనో యట్టి దేవునుండి వరము వాంఛించుచున్నారము. పృథివ్యప్తేజోవాయ్వాకాశములకును, మహన్మనోబుద్ధులకును, నతఁడే స్రష్టగదా! అట్టి పరమేశ్వరునికంటె నింకెవ్వఁడు దైవతమో, తెలుపుము. మనోబుద్ధ్యహంకారములును, దన్మాత్రలును, నింద్రియములును నతఁడే సృజిం

చినవాఁడు గదా! అట్టి శివునికంటెఁ బరుఁ డెవ్వఁడు? ఎవని నారాధించి యప్పితామహుఁడు స్రష్ట యయ్యెనని తెలుపుదురో, యట్టి శివు నారాధించినవాఁడు గొప్పసిరుల నందుచున్నాఁడు. భగవానుఁడగు నెవనియందు బ్రహ్మవిష్ణుపురోగమములగు నుత్తమైశ్వర్య ముండునో, యట్టి పరమేశ్వరుఁడగు మహాదేవునికంటెఁ బరుఁ డెవ్వడో తెలుపుము. ఆధిపత్యగర్వితులగు దైత్యదానవముఖ్యులను, దితిపుత్రులనుగా సంపాదింప నాదేవేశుఁడు దక్క వేఱొక్కఁ డెవ్వఁడు సమర్థుఁడు? దిక్కాలసూర్యతేజములును, గ్రహవాయ్వంబుతారకలును, నాతనివలనఁ గలిగినవిగాఁ దెలియుము. అట్టి పరమేశ్వరుఁడగు మహాదేవునికంటెఁ బరమదైవత మెవ్వఁడు? మఱియు త్రిపుర, యజ్ఞముల, యుత్పత్తివినాశములకు హేతువై దైత్యదానవముఖ్యుల యాధిపత్యవినాశములకు నిమిత్తమైన యప్పరమేశ్వరునికంటెఁ బరముఁ డెవ్వఁడు? ఓపురందరా! పెక్కు హేతువాదములతోఁ బనియేమి? సిద్ధగంధర్వదేవపూజితుఁడవై మహర్షిసన్నుతుఁడవై నీవు సహస్రనయనుఁడవగుటయెల్ల నాదేవదేవుని యనుగ్రహముచేఁ గాదే? ఇట్టి నిన్నుఁ జూచియు హేతువాదము సేయ నాకవసర మేమి? అవ్యక్తుఁడును, సర్వగుఁడునునగు మహేశ్వరుఁడే, చేతనాచేతనాదుల కాత్మయై వెలయుచుండును. భూలోకమహర్లోకములందును, లోకాలోకాంతరములందును, ద్వీపస్థానములందును, మేరుశిఖరములందును, నాభగవానుఁ డున్నవాఁడని తత్త్వదర్శులగువారు దెలుపుదురు. ఓశక్రా! దేవత లామహేశ్వరాకృతిని వేఱొకవిధముగాఁ జూతురేని, వారు రక్కసులచే మర్దితులగునపు డాభగవానునిశరణ మందనేటికి? దేవయక్షోరగరాక్షసుల కభిఘాతకరములగు పరస్పరవినాశములు గల్గునపుడు, భవుఁడే గదా స్వస్థానైశ్వర్యము నొసంగువాఁడు మఱియు నంధకుఁడు, శుక్రుఁడు, దుందుభి, మహిషాసురుఁడు, నివాతకవచులును, యక్షేంద్రబలరక్షస్సులును, మున్నగువారికి వరదానావఘాతములను గలిగించువాఁ డామహేశ్వరుఁడు గాదే! అట్టి పరమేశ్వరునికంటెఁ బరముఁ డెవ్వఁడు? ఓయింద్రా! సురాసురగురుఁడగు నెవ్వని వక్త్రమున మున్ను రేతస్సు హుతము గావింపఁబడెను.? మఱియు నెవని రేతస్సు మేరువుగా నొనర్పఁబడియెను.? అతఁడు గాక మఱి

యెవ్వాఁడు దిగ్వాసుఁడై వెలయుచున్నాఁడు ? ఎవ్వాఁ డూర్ధ్వరేతుఁడు? ఎవ్వనిఁ గోరి కాంత తపమొనర్చెను? అయ్యనంగుని జయించినవాఁ డెవ్వాఁడు ? ఎవ్వని పరమస్థానము దేవతలచేఁ బ్రశంసింపఁబడుచున్నది? ఓశక్రా ! ఇట్టివాఁ డెవఁడేనిగలఁడా ? తెలుపుము. శ్మశానమున నెవ్వఁడు క్రీడించును ? నర్తనవిషయమున నెవ్వనిఁ జెప్పుదురు ? ఐశ్వర్యదర్పితులగు దేవత లెవ్వనికిఁ దుల్యబలులై ప్రవర్తింతురు ? భూతములతో నెవ్వఁ డాడికొనును ? ఎవని యైశ్వర్యము మన్నింపఁ దగినది ? త్రైలోక్యపూజితమగు నెవనిస్థాన మచలమని తెలుపఁబడు చున్నది ? అట్టి మహనీయుఁడు మఱియెవ్వాఁడో తెలుపుము. ఎవఁడు వర్షించుచున్నవాఁడు ? తపించువాఁ డెవఁడు ? తేజముచేఁ బ్రజ్వ లించువాఁ డెవ్వఁడు ? ఎవ్వనివలన నౌషధసంపత్తి గలుగుచున్నది ? వసుసంపత్తిని ధరించువాఁ డెవ్వఁడు ? సచరాచరమగు త్రైలోక్యమం దును, నెంతయుఁ గ్రీడించువాఁ డెవ్వఁడు? ఓశక్రా ! జ్ఞానసిద్ధ క్రియా యోగము గలయోగులును, ఋషిసిద్ధగంధర్వులును, నెవ్వని సేవిం తురో, వానిని గారణముగాఁ దెలియుము. మఱియుఁ గర్మయజ్ఞ క్రియాయోగులగు సురాసురులచే నిత్యమును సేవింపఁబడుచుఁ గర్మ ఫలహీనుఁడగువానిని గారణముగాఁ దెలుపుచున్నాను. స్థూల రూపుఁడును, సూక్ష్మరూపుఁడును, నిరుపమానుఁడును, నగ్రాహ్యుఁ డును, గుణగోచరుఁడును, గుణహీనుఁడును, గుణాధ్యక్షుఁడును, మాహేశ్వరుఁడును, బరుఁడును, విశ్వేశుఁడును, గావణగురుఁడును, లోకాలోకాంతకారణుఁడును, భూతభవ్యభవిష్యద్రూపుఁడును, సర్వ జనకుఁడును, సర్వకారణుఁడును, నక్షరాక్షరుఁడును, నవ్యక్తుఁడును, విద్యావిద్యలకును, గృతాకృతములకును, ధర్మాధర్మములకును, నిమిత్త భూతుఁడును, నగువానిని గారణముగాఁ దెలుపుచున్నాను. ఓ దేవేంద్రా ! సృష్టిసంహారహేతుభూతుఁడును, దేవదేవుఁడునగు రుద్రుని భగాంకితమైన లింగము నిందుఁ బ్రత్యక్షముగాఁ జూడుము. నాతల్లి మున్ను నాతో నమ్మహేశుఁడు లోకకారణమని తెలిపెను. ఓశక్రా ! నీవు గోరుదువేని యమ్మహేశునే నీవును భజింపుము. అతఁడు దప్ప వేఱొకదైవతము లేదు. ఓసురేశా ! సవికారము, సగు ణము బ్రహ్మాదిరేతోద్భవమునగు త్రైలోక్యమును సంయోగలింగో

ద్భవమగుట నీవు ప్రత్యక్షముగ నెఱిఁగినదియే గదా! బ్రహ్మ విష్ణు మహేంద్రాగ్నులు మున్నగు దేవతలును, దైత్యులును, గామసహస్ర సంకల్పితబుద్ధులయ్యు, నయ్యీశునికంటెఁ బరదైవత మొకటి గలదని తెలుపలేదుగదా! అట్టి చరాచరజగత్ప్రభుఁడను ప్రసిద్ధి వడసిన ప్రభూత్తముఁడగు దేవుని మోక్షకామార్థినై వరము వేఁడుచున్నాఁడను. పెక్కుహేతువులు తెలుపుటచేఁ బ్రయోజనమేమి? ఆ యీశుఁడు కారణకారణమైనవాఁడు. సకలదేవతలు, నమ్మహేశ్వరు లింగమును దక్క వేఱొక్కని లింగమును బూజించుట మనము విని యుండలేదు గదా! మున్ను గాని, యిపుడుగాని తద్భిన్న లింగార్చన వినియుంటివా? నీవును బ్రహ్మయు విష్ణువు దేవతలును నెవ్వని లింగము నెల్లపుడును బూజింతురో యట్టిమహాదేవుఁడు శ్రేష్ఠతముఁడు గాఁడే? పద్మాంకము, చక్రాంకము, వజ్రాంకమునై ప్రజ యున్నఁదేని చూపట్టునా? అయ్యది లింగాంకమును భగాంకమునై వెలయుచుండును. అటులగుటనే ప్రజయెల్ల మాహేశ్వర మనఁదగియుండును. సకల స్త్రీలును దేవీకారణరూపభావజనితలై భగాంకలైరి. సకలపురుషులును హరలింగముచేఁ బ్రత్యక్షచిహ్నము గలవారుగా నున్నవారు. ఈశ్వరునికంటె వేఱొకకారణ ముండునని యెవ్వఁడు చెప్పును? మఱియు నటులే సచరాచరమగు లోకత్రయమందును దేవ్యంకితము గానిదెద్ది? పై విషయములను విరుద్ధముగాఁ బలుకువాఁడు లోకబాహ్యుఁడగును సకలపుంలింగమును నీశానునిఁగను, సకలస్త్రీలింగమును దేవిఁగను దెలిసికొనుము. చరాచరమగు ప్రపంచమెల్ల నా రెండుశరీరములచే నిండియున్నది. నాకు నిధనము సంభవించినను సరియగాని, యమ్మహేశునుండిదక్క వేఱొక్కనినుండి వరము గోరువాఁడను గాను. ఓయింద్రా! నీకిష్టమగునేని నిలువుము. లేదా పొమ్ము. వరముగాని, శాపముగాని, నా కమ్మహేశ్వరునుండి కావచ్చును. సర్వకామఫలముల నొసంగునట్టిదైనను, నే నన్యదైవతమునుండి వరము గోరువాఁడనుగాను" అని యయ్యింద్రునితోఁ బలికి దుఃఖాక్రాంతమానసుఁడనై "అయ్యా! నాకు దైవతము ప్రసన్నుఁడు గాఁడయ్యెను. నేనిపుడేమిచేయవలయును." అని చింతించుచుండగా, మఱియు నొకక్షణములో నాయింద్రుని యైరావతము నాకుఁ గానవచ్చెను. అయ్యది

హంసకుందేందుతుల్యమై, రజత, మృణాళకాంతులు వెలయ, వృషరూపముతోఁ బ్రత్యక్షమైన క్షీరసాగరమునాఁ జూపట్టుచు, నల్లని తోఁకయు, గొప్పమేనును, మధుపింగళనేత్రములును, వజ్రసారమయములగు కొమ్ములును నలరార, మేలుబంగరుకాంతులు గలిగి తీవ్రములై మృదురక్తాగ్రములగు తన యాదంతములచేఁ బుడమిఁ ద్రవ్వుచున్నదియనోలె నొప్పారుచు వచ్చెను. మే నెల్లెడల సువర్ణమాలికలచే నలంకృతమై యుండెను. మఱియు దాని మొగము, ముట్టెయుఁ, జెవులునుఁ, గటీతటములును, బార్శ్వములును, విశాలస్కంధమును, గలిగి చక్కని డెక్కలు వెలయ, మనోహరాకారమై గానవచ్చెను. దాని కకుదము స్కంధము నావరించియుండెను. హిమవత్పర్వతశిఖరము నాఁదగి, శ్వేతాభ్రసదృశమైన యావృషభము నమ్మహాదేవుఁడు పార్వతితోఁ గూడి యధిష్ఠించి, పౌర్ణమీచంద్రునట్లు లెంతయు విరాజిల్లెను. ఆతని తేజమునఁ బొడముచున్న యగ్ని, మేఘములతోడను గర్జనములతోడఁగూడి, వేయిసూర్యబింబములట్లు నెల్లెడల నావరించియుండెను. అమ్మహాతేజుఁడగు శంకరుఁడు, యుగాంతమున సకలభూతములను దహింప నుద్యతమగు ప్రళయాగ్నియట్లు లెల్లెడలఁ దానై దుర్నిరీక్ష్యుఁడై యుండెను. మఱియు, నే నుద్విగ్నమానసుఁడనై యదేమై యుండునని చింతించుచుండఁగా, రెండుగడియలలో నాతని తేజము సకలదిశల వ్యాపించియు, మఱియొకక్షణములో నాతనిమాయచే నదియెల్ల నడఁగెను. పిదప నాభగవానుఁడగు మహేశ్వరుఁడు, నాకుఁ గానవచ్చెను. వృషభారూఢుఁడై, సౌమ్యుఁడై పొగలేనియగ్ని యట్లు వెలయుచు, సర్వాంగసుందరియగు పార్వతీదేవితోఁ గూడియున్న యమ్మహాత్మునిఁ జూచితిని. అవ్యక్తరూపుఁడును, దేజోనిధియు, మహాత్ముఁడును, నీలకంఠుఁడును, నష్టాదశభుజుఁడును, సర్వాభరణభూషితుఁడును, శుక్లాంబరధరుఁడును, శుక్లమాల్యానులేపనుఁడును, శుక్లధ్వజుఁడును, శుక్లయజ్ఞోపవీతియు, స్థాణురూపుఁడును నై యమ్మహాత్ముఁడు వెలయుచుండెను. మఱియు నాతనిచుట్టును, నాత్మతుల్యపరాక్రములు దివ్యరూపులునగు ననుచరులు, పాడుచు నాడుచు నావరించియుండిరి. మఱియు నతఁడు బాలేందుమకుటుఁడై తెల్లని మేనిచాయ వెలయ, నుదయించిన శరచ్చంద్రునట్లు లొప్పుచు, నుదయించిన

మూపుర సూర్యులట్టులు చూపట్టు మూఁడుకన్నులతో దిక్కుల వెలయించుచు గాన వచ్చెను. తెల్లని కాంతిగల యాతని మేన, సువర్ణమయము లగు పద్మములచేఁ గూర్పఁబడిన రత్న భూషితమైన యొకమాలిక విరాజిల్లుచుండెను. ఓగోవిందా! మఱియు నయ్యమితతేజుఁడగు భవుని యస్త్రములు, సర్వతేజోమయములై మూర్తిమంతములై నాకు దృగ్గోచరము లయ్యెను. అమ్మహాత్మునిధను వింద్రాయుధసదృశమై పినాకమనుపేరునఁ బరగి చూపట్టెను. మఱియు నేడుతలలును, గొప్పమేనును, వాఁడికోఱలును, గలిగి విషోల్బణమై జ్యావేష్టితమహాగ్రీవమై పురుషవిగ్రహమై యొకగొప్పసర్పము చూపఁ గానవచ్చెను. ప్రళయకాలాగ్నితుల్యమై సూర్యసన్నిభమైన యొక సాయక మాధనువునఁ గానవచ్చెను. మఱియు మహాఘోరమై దివ్యమై మహత్తరమగుపాశుపతాస్త్ర మొకటి మిడుంగురులతో సకలభూత భయావహమై నాకుఁ గానవచ్చెను. అద్వితీయము, ననిర్దేశ్యమును, మహాకాయమునై యగ్ని గురియునదివోలెఁ జూపట్టుచు, నొకపాదమును, గొప్పకోఱలును, వేయితలలును, వేయికడుపులును గలిగి, వేయిభుజములును, వేయినాలుకలును వెలయఁ బ్రజ్వరిల్లుచు నది బ్రాహ్మనారాయణైంద్రాగ్నేయవారుణాస్త్రములు మించి, సర్వశస్త్రవిఘాతమై చూపట్టెను. ఓగోవిందా! అమ్మహాదేవుఁ డమ్మహాస్త్రము గల్గుటనే, యొకసాయకముచేఁ ద్రిపురములను నొకక్షణములో బూడిదగాఁ జేసెను. మఱియు నయ్యది యమ్మహేశ్వరునిచేఁ బ్రయుక్తమై యొకయర్ధనిమేషమున సచరాచరమగు లోకత్రయమును సంపూర్ణముగా దహించును అందు సందియము లేదు. ఈలోకమున బ్రహ్మవిష్ణుసురాదులలో నెవఁడును నయ్యస్త్రము తేజమునకు వధ్యులు గాక తప్పదో, యట్టి యాశ్చర్యకరమై యుత్తమమగు తేజమును జూచితిని. మఱియు నమ్మహాత్మునకు, శూల మను ప్రసిద్ధిగల యొక యాయుధము గలదు. రహస్యమగు నయ్యస్త్రమును, దానికి సరియగు నవిగాని, దానిని మించినవిగాని లేవనవచ్చును. దానిచే నాకసమును జీల్పవచ్చును. పుడమిని బ్రద్దలు చేయనగును మహాసముద్రము నింకింపవచ్చును. అయ్యది శూలపాణిచేఁ బ్రయుక్తమై జగమునెల్ల సంహరించును. దానిచే మాంధాత సపరివారముగా హతుఁడయ్యెను గాదే!

డు చక్రవర్తియు, మహాతేజుఁడును, త్రిలోకవిజయియు, మహాబలపరాక్రమశాలియు, నింద్రసమవీర్యుఁడునుగాని, సామాన్యుఁడు గాఁడు. అట్టివాఁడు లవణాసురుఁ డీశూలమును జేతఁబట్టినమాత్రన నశించెను. అట్టి శూలము తీక్ష్ణాగ్రమై భయంకరమై రోమహర్షణమై మూఁడుశిఖలుగలిగి, భ్రుకుటి యొనర్చి వైరులను భయపెట్టునదివలెఁ జూపట్టుచుఁ, బొగలేనియగ్నిజ్వాలలు గలిగి బాలసూర్యుఁడునా విరాజిల్లుచు, నేడుమూరలపొడవై యనిర్వాచ్యప్రభావమై పాశహస్తుఁడగు యమునట్టులు భయప్రదమై యారుద్రునిసన్నిధిని గానరాఁ గాంచితిని. ఓగోవిందా! మున్నామహాదేవుఁడు ప్రసన్నుఁడై, రామునకే పరశువు నొసంగెనో, క్షత్రియ క్షయకరమై మిగుల ధారగల యద్దానిచేఁ జక్రవర్తియగు కార్తవీర్యుఁడు మహాసంగ్రామమున మడిసెను గాదే? మఱియు నారాముఁ డప్పరశువుచే నిరువదియొక్కమాఱులు క్షత్రియులఁ జంపి, మేదినిని క్షత్రియశూన్యముగా నొనర్చెను. తళతళమను ధారగలిగి, రౌద్రాగ్రమై, సర్పకంఠాగ్రాధిష్ఠితమై దీప్తాగ్నిశతతుల్యమగునప్పరశు వామహాదేవుని చేరువఁ గానవచ్చెను. ఓయనఘా! ఆధీమంతుఁడగు శంకరునకు దివ్యాస్త్రము లెన్నియేనిఁ గలవు. కాని వానినెల్లఁ దెలుపక యందుఁ బ్రధానములైన వానినే తెలిపితిని. ఆమహాదేవుని కుడిప్రక్కను, లోకపితామహుఁ డగు బ్రహ్మ హంసయుక్తమై మనోవేగముగల విమానము నధిష్ఠించియుండెను. అటులే నారాయణుఁడు గదాశంఖచక్రములఁ బూని గరుడారూఢుఁడై యెడమప్రక్క నుండెను. కుమారస్వామి మయూరము నెక్కి దేవిసన్నిధి నుండెను. శక్తి ఘంటలను బట్టుకొని రెండవయగ్నినాఁ జూపట్టుచు నమ్మహాదేవు నెదుటనున్న నందిని గాంచితిని. అతడు రెండవశంకరునివలె శూలముఁ బట్టుకొనియుండెను. స్వాయంభువాదులగు మనువులును, భృగువు మున్నగు మహర్షులును, నింద్రాదులగు దేవతలును, నందులకు వచ్చియుండిరి. అటులే సకలభూతగణములును. వివిధమాతలును, నమ్మహాత్మునకు నమస్కరించి యాతని నలువంకల నావరించియుండిరి. అపుడు దేవత లామహాదేవునిఁ బలువిధముల సన్నుతించిరి. పరమేష్ఠియు నపుడాభవుని, రథంతరసామమును బలుకుచు స్తుతించెను. దేవేశుఁడును బూజ్యుఁడునగు నాతని సామ

ముచే నారాయణుఁడు పొగడెను. అప్పు డింద్రుఁ డుత్తమమగు శత
రుద్రీయముచేఁ బరబ్రహ్మముగా నాతని సంస్తుతించెను. అప్పు డా
బ్రహ్మయు, నారాయణుఁడును, మహేంద్రుఁడును, మూఁడగ్నులవలె
నెంతయు విరాజిల్లిరి. వారినడుమ నాభగవానుఁడగు శంకరుఁ డెం
తయు, శరన్మేఘవిముక్తుఁడై పరివేషమధ్యగతుఁడగు భాస్కరునివలె
విరాజిల్లుచుండెను. ఓ కేశవా! అప్పు డాకసమునఁ బదివేవురు చంద్రా
ర్కులు గానవచ్చిరి. పిమ్మట నే నాజగత్పతియగు మహాదేవు నిట్లు
సంస్తుతించితిని.

"దేవాదిదేవునకు నీకు నమస్కారము, మహాదేవునకు నీకు
నమస్కారము. శక్రవేషధరుఁడవును, శక్రరూపుఁడవును, శక్రుఁడవు
నునగు నీకు నమస్కారము. వజ్రహస్తుఁడవును బింగళవర్ణుఁడవు, నరు
ణుఁడవునగు నీకు నమస్కారము. మఱియుఁ బినాకపాణివి, శంఖ
శూలధరుఁడవుఁ, గృష్ణాంబరుఁడవుఁ, గృష్ణాకుంచితకేశపాశుఁడవునగు
నీకు వందనము. కృష్ణాజినోత్తరీయుఁడవు, గృష్ణాష్టమీరతుఁడవు, శుక్ల
వర్ణుఁడవు, శుక్లుఁడవు, శుక్లాంబరధరుఁడవు, శుక్లభస్మావలిప్తాంగుఁడవు,
శుక్లధర్మరతుఁడవునగు నీకు నమస్కారము. రక్తవర్ణుఁడవును, రక్తాం
బరధరుఁడవు నగు నీకు నమస్కారము. రక్తధ్వజపతాకుఁడవు, రక్తాను
లేపనుఁడవు నగు నీకు నమస్కారము. పీతవర్ణుఁడవు, పీతాంబరధరుఁ
డవు, పీతచ్ఛత్రుఁడవు, వరకిరీటధారివియు నగు నీకు నమస్కారము.
అర్ధహారమును, నర్ధకేయూరమును, నర్ధకుండలకర్ణమును గలనీకు నమ
స్కారము. పవనవేగుఁడవు, దేవుఁడవునగు నీకు నమస్కారము.
సురేంద్రుఁడవు, మునీంద్రుఁడవు, మహేంద్రుఁడవు నగు నీకు నమ
స్కారము. ఉత్పలమిశ్రితమగు పద్మార్ధమాలగల మహాదేవునకు నీకు
నమస్కారము. అర్ధచందనలిప్తుఁడును, నర్ధస్రగనులేపియునగు నీకు
నమస్కారము. ఆదిత్యవక్త్రుఁడవును, నాదిత్యనయనుఁడవు, నాదిత్య
వర్ణుఁడవు, నాదిత్యప్రతిముఁడవునగు నీకు నమస్కారము. సోముఁ
డవు, సౌమ్యుఁడవు, సౌమ్యవక్త్రధరుఁడవు, సౌమ్యరూపుఁడవు, ముఖ్యుఁ
డవు, సౌమ్యదంష్ట్రావిభూషణుఁడవు నగు నీకు నమస్కారము. శ్యాముఁ
డవు, గౌరుఁడవు, నర్ధపీతార్ధపాండువర్ణుఁడవు నగు నీకు నమస్కారము.
నారీనరశరీరుఁడవు, స్త్రీపుంరూపుఁడవునగు నీకు నమస్కారము. వృషభ

వాహనుఁడవు, గజేంద్రగమనుఁడవు, దుర్గముఁడవు, నగమ్యగమనుఁడవు నగు నీకు నమస్కారము. గణస్తుతుఁడవు, గణబృందరతుఁడవు, గణానుయాతమార్గుఁడవు, గణనిత్యవ్రతుఁడవు నగు నీకు నమస్కారము. శ్వేతాభ్రవర్ణుఁడవు, సంధ్యారాగప్రభుఁడవు, ననిర్వచనీయాభిధానుఁడవు, స్వరూపుఁడవు నగు నీకు నమస్కారము. రక్తాగ్రవాసుఁడవు, రక్తసూత్రధరుఁడవు, రక్తమాలావిచిత్రుఁడవు, రక్తాంబరధరుఁడవు, మణిభూషితశిరస్కుఁడవు, నర్ధచంద్రభూషితుఁడవునగు నీకు నమస్కారము. విచిత్రమణిభూషితమస్తకుఁడవు, కుసుమాస్త్రధరుఁడవు నగు నీకు నమస్కారము. అగ్నిముఖనేత్రుఁడవు, సహస్రశశిలోచనుఁడవు, నగ్నిరూపుఁడవు, కాంతుఁడవు, గహనుఁడవు, ఖచరుఁడవు నగు నీకు నమస్కారము. గోచరాభిరతుఁడవు, భూచరుఁడవు, భువనరూపుఁడవు, చరుఁడవు నచరుఁడవునగు నీకు నమస్కారము. దిగ్వాసుఁడవు, నిత్యాధివాసుఁడవు, సువాసుఁడవునగు నీకు నమస్కారము. జగన్నివాసుఁడవు, ప్రతిపత్తిసుఖుఁడవు, ఉద్బద్ధమకుటకేయూరధారుఁడవునగు నీకు నమస్కారము. విచిత్రాభరణుఁడవును, సర్పకంఠహారుఁడవు, సూర్యచంద్రాగ్ని నేత్రుఁడవు, శతసహస్రలోచనుఁడవునగు నీకు నమస్కారము. స్త్రీపురుషరూపుఁడవు, పుంరూపభిన్నుఁడవు, సాంఖ్యయోగరూపుఁడవు, నథర్వరూపుఁడవునగు నీకు నమస్కారము. సర్వార్తిహరుఁడవును, శోకహరుఁడవు, మేఘగంభీరనినాదుఁడవు, బహుమాయాధరుఁడవు, బీజక్షేత్రాభిపాలుఁడవు, సృష్టిస్థితిలయహేతుభూతుఁడవునగునీకు నమస్కారము. విశ్వేశుఁడవును, సర్వసురేశ్వరుఁడవు, పవనరూపుఁడవు, పవనవేగుఁడవునగు నీకు నమస్కారము. కాంచనమాలాధరుఁడవును, గిరిమాలాభూషితుఁడవు, సురారిమాలుఁడవు, చండవేగుఁడవు నగు నీకు నమస్కారము. బ్రహ్మశిరోపహర్తవు, మహిషఘ్నుఁడవు, త్రిరూపధరుఁడవు, సర్వరూపధరుఁడవు, నగు నీకు నమస్కారము. త్రిపురహర్తవు, యజ్ఞవిధ్వంసనుఁడవు, కామాంగనాశనుఁడవు, కాలదండధరుఁడవునగు నీకు నమస్కారము. స్కందవిశాఖుఁడవు, బ్రహ్మదండుఁడవు, భవుఁడవు, శర్వుఁడవు, విశ్వరూపుఁడవునగు నీకు నమస్కారము. ఈశానుఁడవు, భవఘ్నుఁడవు, నంధకాసురహర్తవు, విశ్వరూపుఁడవు, మాయారూపు

డవు, చింత్యాచింత్యరూపుఁడవు నగునీకు నమస్కారము. ఓదేవా! నీవ మాకు గతి. నీవ శ్రేష్ఠుఁడవు. నీవ హృదయము. నీవ సర్వదేవతలకును, రుద్రులకును బ్రహ్మవు. నీలలోహితుఁడవు. సర్వభూతముల కాత్మవు. సాంఖ్యమునఁ బురుషుఁడవుగాఁ జెప్పఁబడుచున్నాఁడవు. పవిత్రములలో నీవుత్తముఁడవు. యోగులలో నిష్కళుఁడవగు శివుఁడవు. నాలుగాశ్రమములవారిలో గృహస్థుఁడవు. ఈశ్వరులలో మహేశ్వరుఁడవు. సర్వయక్షులలోఁ గుబేరుఁడవు. క్రతువులలో విష్ణుఁడవు. పర్వతములలో మేరువవు. నక్షత్రములలోఁ జంద్రుఁడవు. మహర్షులలో వసిష్ఠుఁడవు. గ్రహములలో సూర్యుఁడవు. ఆరణ్యకములగు మృగములలో సింహమవు. నీవు పరమేశ్వరుఁడవు. గ్రామ్యపశువులలో గోవృషభమవు. లోకపూజితుఁడవగు భగవంతుఁడవు. ఆదిత్యులలో నీవు విష్ణుఁడవు. వసువులలోఁ బావకుఁడవు. పక్షులలో గరుడుఁడవు. సర్పములలో ననంతుఁడవు. వేదములలో సామవేదమవు. యజుస్సులలో శతరుద్రియమవు. యోగులలో సనత్కుమారుఁడవు. సాంఖ్యులలోఁ గపిలుఁడవు. మరుత్తులలో నింద్రుఁడవు. పితృదేవతలలో యముఁడవు. లోకములలో బ్రహ్మలోకమవు. ఉత్తమగతులలో మోక్షమవు. సముద్రములలో క్షీరసముద్రమీవే. శైలములలో హిమవద్గిరి వీవ. వర్ణములలో బ్రాహ్మణుఁడవు. విప్రులలో దీక్షితబ్రాహ్మణుఁడవు. లోకముల కాదిభూతుఁడవు. లోకసంహర్తవు. కాలరూపుఁడ వీవ ఈ లోకమునఁగల తేజములలో నెల్ల నధికతేజమువని చెప్పఁబడుచున్నాఁడవు. ఈసమస్తము నీవ యని నానిశ్చితాభిప్రాయము. ఓభగవానుఁడా! నీకు నమస్కారము. ఓభక్తవత్సలా! నీకు నమస్కారము. ఓయోగేశ్వరా! నీకు వందనము. ఓవిశ్వసంభవా! నీకు వందనము. భక్తుఁడను, దీనుఁడను, కృపణుఁడనునగు నాకుఁ బ్రసన్నుఁడవు గమ్ము. ఐశ్వర్యహీనుఁడనగు నాకు గతి వగుము. ఓసనాతనా! నీవు పరమేశ్వరుఁడవని తెలియక నే నేమే నపరాధ మొనర్చియుంటినేని, వీఁడు నావాఁడని యెంచి దానినెల్ల క్షమింపుము. ఓదేవేశా! నీవెప్పటిరూపు విడిచి మాఱురూపు నొందుటచే నేనేమియుఁ దెలియకున్నవాఁడను. అటులగుట నోమహేశ్వరా! నేను నీకర్ఘ్యపాద్యములనే నర్పించికొననైతిని'' అని నే నాయీశుని సంస్తుతించితిని.

ఓగోవిందా ! అటు లాతని సన్నుతించి భక్తికొలఁదిగా నర్ఘ్య పాద్యము లపు డర్పించి, కృతాంజలినై యాతని కంతయు నెఱిఁగించితిని. పిమ్మట, శీతలోదకసంయుక్తమై దివ్యగంధము వెలయు పుష్పవర్షము నాతలపై నపుడు పడియెను. దేవయానులచే దివ్య దుందుభులు మ్రోయింపఁబడియెను. మఱియుఁ బవిత్రగంధమై సుఖావహమైన చల్లనిగాలి వీవ సాగెను. పిదప నావృషభవాహనుఁడు పార్వతితోఁగూడ నాయెడఁ బ్రసన్నుఁడై, యందున్న దేవతల కానందముగా నన్నుఁ గూర్చి, "ఓదేవతలారా ! మహాత్ముఁడగు నీయుపమన్యుఁ డొక్కరీతిగా నాపైఁ జూపినయుత్తమభక్తి యెట్టిదో కనుఁగొంటిరిగాదే?" అని పలికెను. ఓకృష్ణా! అపు డాదేవత లాశూలపాణిసూక్తు లాలించి, యావృషభధ్వజునకు నమస్కరించి ప్రాంజలులై "ఓభగవానుఁడా! ఓదేవదేవేశా! లోకనాథా! జగత్పతీ! నీవలన నీబ్రాహ్మణోత్తముఁడు, సకలకామఫలములను బడయుఁగాక." అని తెలిపిరి. బ్రహ్మాదులగు దేవతల తద్వచనము లాలించి, యాశూలి, నగుచు, నన్నుఁ గాంచి "ఓవత్సా ! ఉపమన్యూ! నేను నీయెడ సంతుష్టి నొందితిని, ఓమునిపుంగవా ! నన్నుఁ జూడుము. ఓవిప్రమునీ ! నీవు దృఢభక్తుఁడవు. నేను నిన్నుఁ బరీక్షించితినిగాదే? నీ వీచూపిన భక్తి కెంతయు సంతసించితిని. కావున నీకిపు డిష్టములగుకోర్కుల నెల్ల నొసంగెదను" అని పలికెను.

ధీమంతుఁడగు మహాదేవుఁ డిట్లు పలుకుటయు, నామేనికి గగుర్పాటును, హర్షాశ్రువులును గలుగ, నాతనితో నే నపుడు హర్షగద్గదస్వరమునఁ బలుకుచు, సాష్టాంగనమస్కృతి మఱిమఱియు నొనర్చుచు, "ఓదేవా! నేనిపుడు పుట్టినవాఁడ ననుకొనుచున్నాఁడను. నేఁటికి నాజన్మము ధన్యమయ్యెను. సురాసురగురుఁడ వగు నీవు నాయెదుట నిటులు నిలుచుటకన్న వేఱొకపున్నె మున్నదే? అమిత విక్రముఁడవగు నిన్నాశక్రాదులగు దేవతలును దర్శింపఁజాలరుగదా! ప్రభుఁడవగునట్టి నిన్నుఁ గాంచిన నాకంటె ధన్యుఁడెవ్వఁడు? మఱియు నిన్ను సనాతన పరతత్త్వముగను, షడ్వింశకునిఁగను, నజునిఁగను, నక్షరుఁగను, జ్ఞానరూపుఁగను విద్వాంసులు ధ్యానింతురు. సర్వసత్త్వాదియు, నవ్యయుఁడు, సకలసత్వ విధానజ్ఞుఁడు, ప్రధానపురుషుఁడు,

పరుఁడును నాభగవానుఁడగు మహాదేవుఁడే యని తెలుపుదురు. ఏమహాదేవుఁడు లోకరక్షణార్థమై తనదక్షిణాంగమునుండి లోక సంభవహేతువగు బ్రహ్మను, వామపార్శ్వమునుండి విష్ణువును సృజించెనో మఱియును, యుగాంతము ప్రాప్తించునపుడు, రుద్రుని జనింపఁజేయునో, యట్టిప్రభు వీశుఁడని తెలుపుదురు. ఆరుద్రుఁడు, స్థావరజంగమాత్మకమగు జగమునెల్ల సంహారించుచు, మహాతేజముగల సంవర్తకాగ్నివలెఁ గాలుఁడై యుగాంతమున సకలభూతముల మ్రింగు చుండును. ఈమహాదేవుఁడే చరాచరమగు జగము సృజించి, కల్పాంత మున సకలప్రాణులస్మృతి నాకర్షించుచుసుండును. ఇతఁడే సర్వవ్యాప కుఁడును సర్వభూతాత్మకుఁడును, సర్వభూతభవోద్భవుఁడును నై నిత్యమును సర్వగతుఁడయ్యు సర్వదేవతలకును గానరాకయుండును." అని తెలుపుదురు.

"ఓప్రభూ! నీవు నాకుఁ బ్రసన్నుఁడవై వరమొసంగు దేని, నిత్యము నీయందు నాకు భక్తిగుదురునటు లొసంగుము. ఓసుర సత్తమా! మఱియు నతీతానాగతములను వర్తమానమును దెలియ వలయునని నాయుద్దేశము. అది యనుగ్రహింపుము. మఱియు నాబంధువులతోఁగూడ నక్షయముగా నేను క్షీరౌదనము భుజింప వలయును. మఱియు నాయాశ్రమమున నెల్లకాలమును నీవు నివ సింపవలయును." అని పలుకుటయు, లోకపూజితుఁడగు నాభగ వానుఁడు నాతో నిట్లు పలికెను.

"ఓవత్సా! నీవు దుఃఖవర్జితుఁడవై జరామరణములు లేక యుండుదువు. మఱియుఁ గీర్తిశాలివై తేజస్సంపన్నుఁడవును, దివ్యజ్ఞాన సమన్వితుఁడవును నై నాయనుగ్రహముచే మహర్షిమాననీయుఁడ వగుదువు. సుశీలుఁడవును సుగుణసంపన్నుఁడవును, సర్వజ్ఞుఁడవును, బ్రియదర్శనుఁడవును నై యుండుదువు. అక్షయమగు యౌవనమును, యగ్నితుల్యమగు తేజమును నీకుఁ గలుగును. నీ వెందెందు క్షీర సముద్రమును గోరుదువో యందందు జాసాగరము సాన్నిధ్యముసేయుఁ గాక. మఱియు నమృతసమన్వితమగు క్షీరౌదనమును భుజింతువుగాక. కల్పాంతమున నీబంధువులతో నన్నుఁ బొందుదువు. నీబంధువు లక్షయులగుదురు. నీకులమును గోత్రమును స్థిరములై యుండును,

ఓద్విజోత్తమా! నీకు నాయెడ శాశ్వతభక్తి గలుగును. మఱియు నీయాశ్రమమున నిత్యము నివసింతును. ఓవత్సా! నీయిష్టము చొప్పున నుండుము నాకై నీవుత్కంఠ నొందకుము. నీవెపుడు మరల నన్ను స్మరింతువో యపుడు దర్శన మొసంగుదును."

ఓకృష్ణా! సూర్యకోటి సమప్రభుఁడగు నాభగవానుఁ డట్లు పలికి, వరము లొసంగి యందే యాయీశానుఁ డంతర్ధానమునొందెను. ఓగోవిందా! ఆదేవదేవుఁ డిట్లు నాకు సమాధిలోఁ గానఁబడియెను. ధీమంతుఁడగు నాభగవానుఁ డొసంగినదెల్ల నాకు లభించెను. ఓ కృష్ణా! ప్రత్యక్షముగా నున్నసిద్ధులను జూడుము. అటులే మహర్షులను, విద్యాధరులను, యక్షులను, గంధర్వులను, నప్సరసలను గనుఁగొనుము. అదె వృక్షలతాగుల్మము లెట్లు సకలఫలప్రదములై యున్నవో చూడుము. మఱియు సకలఋతువులందును గలపుష్పములు గలిగి, సుగంధమును సుందరపత్రములును వెలయ, నియాశ్రమ మెటు లొప్పుచున్నదో పరికింపుము. ఇదియెల్ల మహాత్ముఁడగు దేవదేవుని యనుగ్రహముచేఁ గలిగిన దివ్యప్రభావమే యని తెలియుము." అని తెలిపెను.

అది విని నే నాప్రత్యక్షదర్శనమున విస్మయంపడుచు నమ్మహామునితో, "ఓవిప్రవర్యా! నీవు మిగుల ధన్యుఁడవు. నిన్ను మించిన పుణ్యాత్ముఁ డెవ్వఁడు? ఆదేవదేవుఁడు నీకుఁ దక్క వేఱొక్కనికి సాన్నిధ్య మొసంగెనా? ఆభగవానుఁడు నాకును గనసాన్నిధ్యమిం దొసంగవచ్చును. ఓమునివర్యా! నీకుఁ బ్రసన్నుఁడయినట్టు నాకును దర్శన మొసంగి ప్రసన్నుఁడు కావచ్చునా?" అని యడిగితిని. అంత నయ్యుపమన్యుఁడు నాతో "ఓదేవా! నీ వమ్మహాదేవుని దర్శింపఁ గలవు. సందియము లేదు. ఓయనఘా! నాకు దర్శన మొసంగినట్టులే నీకును నచిరకాలమునఁ బ్రత్యక్షమగును. అమితవిక్రముఁడగు నమ్మహాదేవుని దివ్యజ్ఞానముచే నే నిపుడు చూచుచున్నాఁడను. ఓపురుషోత్తమా! ఇదిమొదలుగా నాఱవమాసమున నీ కామహాదేవుఁడు దర్శన మొసంగును. నీ కపుడు పదునాఱువరములు లభించును. అందు మహేశ్వరుఁ డెనిమిదియుఁ, బార్వతి యెనిమిదియు, నొసంగుదురు. ఓయదుశ్రేష్ఠా! ఇది సత్యమని నమ్ముము, ఓమహాబాహూ! అమ్మహాత్ముని

యనుగ్రహముచే, నాకతీతానాగత వర్తమానములు తెలియును. ఇవియే గాక యమ్మహాదేవుఁడు మఱియు వేలకొలఁది వరము లొసంగిన వాఁడు. ఓమాధవా! అట్టిదేవుఁడు నీకేల వరప్రసాదము సేయకుండును? నీయట్టివాని సమాగమము దేవతలకును శ్లాఘనీయము గదా! నీవు బ్రహ్మణ్యుఁడవును, శ్రద్ధాళుఁడవును, భూతదయాన్వితుఁడవుఁ గాదే? ఏమంత్రముచే నీ వాశంకరునిఁ బ్రసన్నునిఁ గావించుకొనఁగలవో యట్టిమంత్రమును నే నుపదేశించుచున్నాఁడను," అని పలికెను.

ఓధర్మజా! నే నపుడు, వానితో "ఓమునివర్యా! నీయనుగ్రహముచే రాక్షససంహారకుఁడును త్రిదశేశ్వరుఁడునగు నమ్మహాదేవునిఁ గాంచెద"నని పలికితిని. ఇటు లమ్మహాదేవునిసంబంధించినకథ నమ్మహాముని తెలుపుచుండఁగా, నెనిమిదిదినములు రెండుగడియలట్టులు జరగిపోయెను. ఆతొమ్మిదవ దినమున నవ్విప్రునిమూలమున యథావిధిగా దీక్షితుఁడనై దండము ధరించి ముండినై, కుశచీరధారనై, ఘృతాక్తుఁడనై మేఖలఁ బూని, యొకనెల ఫలములఁ దినుచుండియు, రెండవనెల జలము ద్రావుచుండియు, మూఁడునాలుగైదగు నెలలలో గాలియె యాహారముగా, నొకపాదముపై నిలువఁబడి, మిగుల జాగరూకతతో నూర్ధ్వబాహుఁడనై యాకసమున వేయిసూర్యమండలముల తేజమును గాంచితిని. ఆతేజమునడుమ, నింద్రాయుధపినద్ధాంగమును, విద్యున్మాలాగవాక్షకమును, నీలశైలనిభమును నై బలాకాభూషితమగు నొకమేఘము గానవచ్చెను. అందుఁ బార్వతితోఁగూడ మహాద్యుతియగు నమ్మహాదేవ భగవానుఁడు గానవచ్చెను. తప స్తేజములును గాంతియు నలరఁ, బార్వతి యెంతయు విరాజిల్లుచుండెను. మఱియు నాశంకరు డప్పార్వతితోఁ, జంద్రసహితుఁడై మేఘస్థితుఁడగు సూర్యునట్టు లెంతయు భాసిల్లుచుండెను, ఓకౌంతేయా! నేనపుడు విస్మయవికసితనేత్రుఁడనై మేము గగుర్పొడువ, దేవసంఘార్తిహరుఁడగుహరునిఁ గాంచితిని. అమ్మహానీయుఁడు కిరీటియు, గదాధారియునై శూలము చేతఁబట్టి, పులితోలు వెలయ, జటాధారియు దండపాణియునై, పినాకవజ్రాయుధములను బూని తీక్ష్ణదంష్ట్రుఁడును, శుభాంగదుఁడును, వ్యాళయజ్ఞోపవీతియునై, మఱియు, మడమలవఱకు త్రేలా

డుచు, నొకటియేఱంగుగల యొకదివ్యమాలికను వక్షమునం దుంచుకొని వర్షాత్యయమునఁ బరివేషమధ్యగతుఁడగు సంధ్యాకాలచంద్రునట్లు గానరా, నే నాతనిఁ గాంచితిని. ఆతనిచుట్టును బ్రమథగణములవారు పరివేష్టించియుండిరి. అప్పు డాతఁడు పరివేషగతుఁడగు శరత్కాల సూర్యునట్టులు గానవచ్చెను. నియతాత్ముఁడును, శుభకర్ముఁడును నగు నవ్వృషవాహనునిఁ బదునొకొండు వందలరుద్రులును సంస్తుతించిరి. మఱియు నాదిత్యులును, వసువులును, సాధ్యులును, విశ్వేదేవులును, నశ్వినీదేవతలును, విశ్వేదేవుఁడగు నాతనిఁ బలువిధముల సన్నుతించిరి. మఱియు భగవానుఁడగు విష్ణువు, శతక్రతుఁడును, నదితిపుత్రులును నాతనిఁ బొగడిరి. ఆభవునిసన్నిధిని బ్రహ్మ మున్నగువారు రథంతర సామముల నుగ్గడింపసాగిరి. అటులే యోగదుఁడును, జనకుఁడును, గురుఁడు నగు నామహాదేవుని, యోగీశ్వరు లనేకులును, బ్రహ్మర్షులును, ఋషిపుత్రులును, దేవర్షులును, బృథివియు, నంతరిక్షమును, నక్షత్రములును, గ్రహములును, మాసములును, బక్షములును, ఋతువులు, రాత్రియు, సంవత్సరమును, క్షణములు, ముహూర్తములు, నిమేషములు, యుగవిపర్యయములును సత్యమును దెలుపు విద్యలును సన్నుతింప నతఁ డెంతయు విరాజిల్లెను. అటులే సనత్కుమారుఁడును, దేవతలును, నితిహాసములును, మరీచియు, నంగిరసుఁడును, నత్రియు, బులహుఁడు, పులస్త్యుఁడు, క్రతువు, మనువు లేడ్వురును, సోముఁడును, నథర్వము, బృహస్పతి, భృగువు, దక్షుఁడు, కశ్యపుఁడు, వసిష్ఠుఁడు, కాశ్యుఁడు, వేదములు, యజ్ఞములు, దీక్షలు, దక్షిణలు, పావకుఁడు, హవిస్సు, యజ్ఞోపకరణములగు ద్రవ్యములును, బ్రజల యగ్నులును, నదులును, నగములును, బన్నగములును, సర్వదేవమాతలును, దేవపత్నులును, దేవకన్యకలును, అసంఖ్యాకములగుముని బృందములును, కులపర్వతములును, దిక్కులును, సముద్రములును, శాంతుఁడగునాప్రభుని నమస్కరించుచుండెను. అటులే గీతవాదిత్ర కోవిదులగుగంధర్వులును, నప్సరసలును, నద్భుతచరిత్రుఁడగునమ్మహాదేవు నాయాయుత్తమకాలములందు సన్నుతింపసాగిరి. విద్యాధరులును, దానవులును, గుహ్యకులును, రాక్షసులును, సకలభూతములును, జంగమస్థావరములును, వాఙ్మనఃకర్మములచే నవ్విభునకు నమస్కరించు

చుండిరి. ఓమహారాజా! ఆశర్వుఁడు నాయెదుట నిలువఁబడి యుండెను. అటులు నాముందట నిలిచియున్న యమ్మహాత్ముని గాంచి, బ్రహ్మాదిదేవేం ద్రాంతముగుజగము నన్నుఁ గాంచ మొదలిడెను. అపు డమ్మహాదేవునిఁ గనుఁగొనుటకు నాకు సామర్థ్యము చాలకుండెను. పిమ్మట నమ్మహాత్ముఁడు నాతో "కృష్ణా! నన్నుఁ జూడుము. మాటలాడుము. నీచే నేను వందల కొలందిగను, వేలకొలందిగను నారాధింపఁబడితిని. ముల్లోకము లందును నీయట్టిప్రియుఁ డెవ్వఁడును నాకుఁ గానరాలేదు." అని పలికెను. అటులు నే నాదేవునకు నమస్కరింపఁగనే, పార్వతియు సంప్రీత యయ్యెను. పిదప, బ్రహ్మాది సురసన్నుతుఁ డై యున్న యా స్థాణునితో "ఓదేవా! శాశ్వతా! పుణ్యయోనీ! నీకు నమస్కారము. మహర్షులు నిన్ను బ్రహ్మాధిపునిఁగాఁ బలుకుదురు. సజ్జనులు నిన్నే నరనారాయణశబ్దవాచ్యునిఁగను, సత్వ స్వరూపునిఁగను దెలుపు చున్నారు. నీవే బ్రహ్మవును, రుద్రుఁడవును, వరుణుఁడవు, నగ్నివి, మనువు, భవుఁడవు నై యున్నవాఁడవు. నీవ సర్వతోముఖుఁడవగు విధాతవు. జంగమస్థావరములగు భూతములన్నియు నీనుండియే జాతములయ్యెను. సచరాచరమగు త్రైలోక్యమెల్ల నీచే సృజింపఁబడి నది. అటులే యింద్రియములును, మనస్సు, వాయువు లేదును, నగ్నులును, దేవసంస్థలును, దేవతలును నీవ యని తెలుపవచ్చును. అటులగుటనే మహర్షులు నిన్నే పరునిఁగాఁ బలుకుచున్నారు. వేద ములు, యజ్ఞములు, సోమమును, దక్షిణలు, అగ్ని, హవిస్సు, యజ్ఞోప కరణములును, భగవానుఁడవగు నీవయగుట నిస్సంశయము. మఱియు దానము, అధ్యయనము, యాగము, వ్రతములు, నియమములు, బిడియము, కీర్తి, సిరి, స్థైర్యము, సిద్ధియుఁ, దుష్టియుఁ, గామ క్రోధ మద భయ లోభ స్తంభ మాత్సర్యములును, నాధివ్యాధులును నీతనయులు. ఓభగవానుఁడా! కృతియు, వికారము, ప్రళయము, ప్రధానము, నవ్యయబీజమును, మనోయోనియుఁ, బ్రభావమును నీవ యనఁదగియున్నవి. అవ్యయుఁడవు, పావనుఁడవు, నచింత్యుఁడవు, సహస్రాంశుఁడవు, హిరణ్మయుఁడవు నగునీవ సకలగణములకు నాదియగు జీవితాశ్రయ మనఁబడుదువు. మహాత్ము, ఆత్మ, మతి, బ్రహ్మా, విశ్వము, శంభువు, స్వయంభువుఁడవు, బుద్ధి, ప్రజ్ఞ, ఉపలబ్ధి, సంవిత్తు, ఖ్యాతి,

శ్రుతి, స్మృతి, యనియెడి శబ్దము లెల్లఁ దనకుఁ బర్యాయపదములుగా మహాత్ముఁడవగు నీవ యాత్మరూపివై యూహింపఁబడుదువు. బ్రహ్మజ్ఞానసంపన్నుఁడగు విద్వాంసుఁడు నిన్నుఁ దెలిసికొని మోహమును నివారించుకొనుచున్నాఁడు. మహర్షి సన్నుతుఁడవగు నీవ సకలభూతములకు హృదయము క్షేత్రజ్ఞుఁడవు నగుదువు. మఱియు నెల్లెడలఁ బాణిపాదములును, నెల్లెడల శిరోక్షిముఖములును, నెల్లెడలఁ గర్ణములును గలిగి, లోకమునెల్ల నావరించి యున్నవాఁడవు. లిప్తాంశుని నిమేషాదులగు నెల్ల కర్మములందును ఫలము నీవ యగుచున్నాఁడవు. నీవే ప్రభవు, జ్వాలవు నై సర్వహృదయసంశ్రితుఁడగు పురుషుఁడవై యున్నవాఁడవు. అణిమయు, లఘిమయుఁ బ్రాప్తియుఁగా నీశానుఁడవై యవ్యయజ్యోతి వగుదువు. మతియు బుద్ధియు సంశ్రితప్రపన్నములగు లోకములును నీయందుండును. మఱియు, ధ్యానపరులును, నిత్యయోగులును, సత్యసత్వులును, జితేంద్రియులు నగువారు నీయందుండుదురు. ఎవఁడు గుహాశయుఁడవు, ప్రభుఁడవు, పురాణపురుషుఁడవు నగునిన్ను నిశ్చయముగాఁ దెలిసికొనునో, మఱియు హిరణ్మయుఁడవు, బుద్ధిమత్తరులకుఁ బరమగతివిగాఁ దెలియునో, యట్టివాఁడు బుద్ధిమత్తరుఁడై బుద్ధి నతిక్రమించియుండును. సప్తసూక్ష్మములను దెలిసికొని షడంగమూర్తివిగా నిన్నెఱిఁగి, ప్రధానవిధి యోగనిష్ఠితుఁడగుపండితుఁడు నిన్నే ప్రవేశించుచున్నాఁడు" అని పలికితిని.

ఓధర్మజా! ఆర్తిహరుఁడగు భవుఁడు నాచే నిట్లు సన్నుతింపఁబడఁగనే, చరాచరమగు జగమెల్ల నిండ సింహనాద మొనరించెను. అపుడు, మహర్షులును, విప్రగణములును, సురాసురులును, నాగులును, పిశాచులును, పితృదేవతలును, గరుడులును, రక్షోగణములును, భూతగణములును నామహాదేవునకు నమస్కరించునంతలో, దివ్యసుగంధకుసుమరాసులు నాతలపైఁ బడియెను. చల్లనిగాలి వీచెను. అపుడు భగవానుఁడగు శంకరుఁడు, పార్వతీదేవిని నన్నును గాంచి, శతక్రతునిఁజూచి జగద్ధితముగా, నాతో, "ఓకృష్ణా! నీవు మాయెడఁజూపిన పరమభక్తి మాకుఁ దెల్లమైనది. నీకు వలయు నిష్టము వరింపఁబడుఁగాక. నీయెడ నా కెంతయుఁ బ్రీతి యొదవెను. ఓసత్తమా! నీకు నే నెనిమిదివరము లొసంగెదను. కోరికొనుము. సుదుర్లభములగు నేవరములు వలయునో

తెలుపుము." అని పలికెనని తెలిపి శ్రీకృష్ణభగవానుఁడు ధర్మజునితో మఱియు నిట్లనియెను.

"ఓయుధిష్ఠిరా! అటు లత్తేజోరాశిలోనున్న యమ్మహాత్మునకు వంగి మ్రొక్కి పరమానందభరితుఁడనై యాతనితో "ఓదేవా! ధర్మమునెడ దృఢబుద్ధియు, యుద్ధమున శత్రుఘాతమును, నుత్తమయశమును, నధికబలమును, యోగశక్తియుఁ, బ్రియత్వము, నీసాన్నిధ్యమును, బదివేవురుపుత్రులును గలుగునట్లు వరమొసంగుము." అని నేను గోరుటయు, నామహాదేవుఁ డటులే యగునని పలికెను. పిదప, జగన్మాతయు, సర్వపావనియుఁ, దపోనిధియు, నారాయణియు నగు శర్వాణి నన్నుఁ గాంచి, "ఓయనఘా! నీ కాభగవానుఁడు సాంబుఁ డనుపుత్రు నొసంగెనుగదా! నీవు నానుండియు నీకిష్టములగు నెనిమిది వరములను గోరికొమ్ము. వాని నొసంగెదను" అని పలుకుటయు, నే నామెకు నమస్కరించి "ఓపావనీ! ద్విజులయెడ శాంతము, తండ్రి యనుగ్రహము, నూర్వురుపుత్రులును, బరమభోగమును, వంశప్రీతియుఁ, దల్లిదయయు, శమప్రాప్తియు, సామర్థ్యమును నాకుఁ గల్గునటు లనుగ్రహింపుము." అని వేఁడితిని. అంత నయ్యుమాదేవి నాతో "ఓయమరప్రభావా! నీవు గోరినట్టు లిచ్చెదిని. నేనొకప్పుడు నన్నృతము పలుకుదానను గాను. మఱియు నీకుఁ బదునాఱువేల భార్యలయందు నతిప్రియత్వము గల్గును. బాంధవప్రీతియు, శరీరభోగానుభవమును నీకుఁ గల్గెడిని. మఱియు నీయింట నిత్యము నేడువేలయతిథులు భుజింతురు." అని పలికెను.

ఓధర్మజా! ఇటు లాదేవుఁడును దేవియును వరము లొసఁగి యాక్షణము సపరివారముగా నంతర్హితులైరి. ఓయుధిష్ఠిరా! ఈ యద్భుతమంతయుఁ దేజోనిధియు, బ్రాహ్మణోత్తముఁ డగునుపమన్యు నకుఁ దెలిపితిని. అప్పు డుపమన్యుఁ డాదేవదేవునకు నమస్కరించి "శర్వ సముఁడగు దేవుఁడు లేఁడు. శర్వసముఁడగు గతిప్రదుఁడు లేఁడు. శర్వున కర్పించుదానమువంటిదానము లేదు. రణమున శర్వసముఁడగు వాఁడు లేఁడు" అని పలికి మఱియు నతఁ డిట్లనియెను.

"ఓయచ్యుతా! మున్ను తండి యనుమహర్షి ప్రసిద్ధుఁడై యుండెను. అతఁడు పదివేలవత్సరములు సమాధిలోనుండి మహాదేవు

నకు భక్తుఁడై యాతని నారాధించెను. వానిచరిత్రమును వినిపించె దను వినుము. ఒకపు డాతండిమహర్షి పలువిధములగు స్తోత్రములచే నమ్మహాదేవుని సన్నుతించెను. అతఁడు తపోయోగమున నవ్యయుఁ డగుపరమాత్మను ధ్యానించి విస్మయావిష్టుఁడై యిట్లు పలికెను.

"సాంఖ్యులును, యోగులును నెవ్వాని నెల్లపుడును, బరునిఁ గను, బ్రధానముగను, బురుషునిఁగను, నధిష్ఠాతగను, నీశ్వరునిఁగను, నుత్పత్తివినాశములకుఁ గారణముగను బండితులు తెలుపుదురో, దేవాసురమహర్షులలో నెవ్వాని మించినవాఁ డుండఁడో, యట్టియజుని, ననాదినిధనుని, విభుని, నీశానుని, నత్యంతసుఖితుని, ననఘుని శరణ మొందుచున్నాఁడను." అని.

అతఁ డిట్లు పలుకుచునే తపోనిధియగు నమ్మహాదేవునిఁగాంచెను. అవ్యయుఁడును, నిరుపమానుఁడును, నచింత్యుఁడును, శాశ్వతుఁడును, ధ్రువుఁడును, నిష్కళుఁడును, సకళుఁడును, బ్రహ్మము, నిర్గుణుఁడును, గుణగోచరుఁడును, యోగిపరమానందజనకుఁడును, నక్షరుఁడును, మోక్షసంజ్ఞుఁడును, నింద్రాగ్నిమరుత్తులకును మనువిశ్వబ్రహ్మలకును గతియగువాఁడును, నగ్రాహ్యుఁడును, నచలుఁడును, శుద్ధుఁడును, బుద్ధిగ్రాహ్యుఁడును, మనోమయుఁడును, దుర్విజ్ఞేయుఁడును, నసంఖ్యేయుఁడును, దుష్ప్రాపుఁడును, విశ్వజగద్యోనియుఁ, దమఃపరుఁడును, బ్రాణిహృదయాంతస్థజ్యోతియు, మనోరూపుఁడునగు దేవుని దర్శించువాఁడై పెక్కువత్సరము లటు లుగ్రతపమునసుండి యాతని దర్శించి మఱియు నిట్లు సన్నుతించెను.

"ఓమహాదేవా! పవిత్రులలోఁ బవిత్రుఁడవు. బుద్ధిమంతులకు గతివి. తేజములలో నత్యుగ్రతేజమవు. తపములకు త్తమతప మిహాన. విశ్వావసుహిరణ్యాక్షపురుహూతులకు నమస్కరింపఁదగినవాఁడా! బహుశుభప్రదా! విభూ! పరుఁడవు, సత్యరూపుఁడవు నగు నీకు నమస్కారము. జననమరణభీరులై ప్రయత్నించుయతులకు మోక్షమొసంగువాఁడా! సహస్రకిరణా! సుఖప్రదా! నీకు నమస్కారము. బ్రహ్మయు, నింద్రుఁడు, విష్ణువు, విశ్వేదేవులు, మహర్షులు మున్నగువారే యథార్థముగా నిన్నుఁ దెలియఁజాలరుగదా! మేము నిన్నుఁ దెలియు టెట్లు! సమస్తము నీనుండియే ప్రవర్తిల్లుచున్నది. సమస్తము నీయందుఁ

ప్రతిష్ఠితమైయున్నది. కాలాఖ్యుఁడవును, బురుషాఖ్యుఁడవును బ్రహ్మాఖ్యుఁడవును నీవేగదా! పురాణజ్ఞులగుసురర్షులు, 'అధిపౌరుషాధ్యాత్మాధిభూతాధిదైవతములు నీతనువులుగాఁ దెలుపుదురు. మఱియు సధిలోకాధివిజ్ఞానాధియజ్ఞములు నీవ గదా! ఆత్మ దేహస్థుఁడవును, దేవతలకును దుర్విజ్ఞేయుఁడవు నగునిన్నుఁ దెలిసికొని విద్వాంసులు నిర్ముక్తులై యనామయమగు నుత్తమస్థితి నొందుచున్నారు. ఓ ప్రభూ! నీవు గోరకున్నను జననమరణము లనేకములు గల్గుచుండును. స్వర్గమోక్షములకు ద్వారమవై వానిని నీవొసంగుచుండుదువు. స్వర్గమోక్షములు నీవ. కామక్రోధములు నీవ. సత్త్వరజస్తమములును, నూర్ధ్వాధోభాగములును నీవ. బ్రహ్మవిష్ణుమహేశ్వరులును, స్కందుఁడు, నింద్రుఁడు, యముఁడు, సవిత, వరుణుఁడు, చంద్రుఁడు, మనువు, ధాతయు, విధాతయు, ధనేశుఁడును నీవ. పృథివ్యప్తేజోవాయ్వాకాశములును, బుద్ధియు, మతియు, స్థితియుఁ, గర్మము, సత్యానృతములును, భావాభావములును నీవ. ఇంద్రియములు, నింద్రియార్థములు నీవ. ప్రకృతులకంటెఁ బరమీవ. నీవు ధ్రువుఁడవు. విశ్వావిశ్వపరుఁడవును, సత్తారూపుఁడవు, చింత్యాచింత్యుఁడవును నీవగదా! పరబ్రహ్మ మెయ్యదియో, పరమపదమెయ్యదియో, సాంఖ్యయోగులకు గతియెయ్యదియో, యది నీవ యగుటలో సందియము లేదు. మేమిపుడు నిశ్చయముగాఁ గృతార్థులమైతిమి. జ్ఞాననిర్మలబుద్ధులగువా రేగతిని ప్రార్థించుచున్నవారో, యట్టి సద్గతిని మేమిపుడు నిశ్చయముగాఁ బొందితిమి. ఇట్లు చిరకాలము జ్ఞానహీనులమై మూఢులమైతిమి. పండితు లెవ్వని శాశ్వతునిఁగాఁ దెలుపుదురో యట్టిపరుఁడవగు నిన్నుఁ దెలియకున్నవారము. బహుజన్మములచే నిట్టి నీ యీభక్తి సంపాదింపఁబడినది. ఎవ్వనిఁ దెలియుటచే నిత్యానంద మనుభవింపనగునో యట్టిభక్తానుగ్రహకర్తవగు దేవుఁడవు నీవగాదే! దేవతలకును నసురులకు మహర్షులకును రహస్యమై, సనాతనమై, గుహానిహితమై, బ్రహ్మమై దేవతలకును దుర్విజ్ఞేయమై యెయ్యది వెలయునో, యట్టిసర్వకర్తయు సర్వతోముఖము నగు వస్తువు భగవానుఁడవగు నీవగదా! సర్వాత్మయు, సర్వదర్శియు, సర్వగము, సర్వవేదియు, దేహకర్తయు, దేహభర్తయు, దేహియు, దేహభుక్కు, దేహిగతియుఁ, బ్రాణకర్తయుఁ, బ్రాణభర్తయు, బ్రాణియుఁ,

బ్రాణదము, ప్రాణిగతియు, నాత్మవేదులై ధ్యానపరులైన భక్తుల కధ్యాత్మగతియుఁ, గామరాహిత్యగతియు నీయీశ్వరుఁడే. ఈమహాదేవుఁడే సకలభూతములకును శుభాశుభగతిప్రదుఁడు. ఇతఁడే సకల జంతులకును జననమరణములు గల్గించువాఁడు. సిద్ధికాములగుమహార్షుల కితఁడే సిద్ధిప్రదుఁడగుప్రభువు. భూలోకాద్యఖిలలోకములను దేవతలను బుట్టించి, తనయొనిమిదితనువులచే ధరించుచుఁ బోషించువాఁ డితఁడే. ఇతనినుండియే యంతయుఁ బ్రవర్తిల్లుచున్నది. ఇతనియందే సకలము ప్రతిష్ఠితమగుచున్నది. మఱియు నీతనియందే సమస్తము లయమగుచున్నది. ఇతడే సనాతనుఁడు. సత్యకాములగు సజ్జనుల కితఁడే యుత్తమమగు సత్యలోకము. యోగుల కపవర్గమును, నాత్మవేత్తలకుఁ గైవల్యమును నీతఁడే. బ్రహ్మాదులగు సిద్ధులచే గుహాగోపితుఁడగు ప్రభు వితడే. దేవాసురమానవుల కితఁడు గోచరుఁడు గాకుండును. అని నిన్ను విద్వాంసులు పొగడుదురు. దేవాసురమానవులలో నొకఁడును యథార్థముగా నిన్నుఁ దెలియఁజాలరు. వారు నిజహృత్ప్రవర్తియై యప్రకాశియగు నీతనిచే మోహితులగుచున్నారని పండితులు తెలుపుదురు. భక్తియోగముచే భావించి యెవ్వ రీతనిఁ దెలియఁగల్గుదురో, యట్టివారికే యాహృచ్ఛయుఁడు తన్నుఁ దెలియఁ జేయుచున్నవాఁడు. ఎవ్వనిఁ దెలిసినచో జననమరణములు గల్గవో, యెవ్వనిఁ దెలిసినచో, మఱి యేవేదితవ్యమును గలుగదో, యేపరమలాభమును బొంది పండితుఁడు మఱి యేలాభమును గోరకుండునో, సూక్ష్మమగు నేపరమగతి ప్రాప్తించిన నక్షయము నవ్యయము నగులాభమగునో, సాంఖ్యశాస్త్రవిశారదులును, గుణతత్త్వజ్ఞులును, సూక్ష్మజ్ఞానరతులు నగుసాంఖ్యులు సూక్ష్మమగు నేదానిని దెలిసికొని బంధవిముక్తులగుదురో, వేదవేత్తలెద్దానిని వేదాంతప్రతిష్ఠితమగు వేద్యమునుగాఁ దెలుపుదురో, ప్రాణాయామపరులు నిత్యము దేనిని ధ్యానించుచుఁ బ్రవేశింతురో యట్టివా రోంకారరథము నధిష్ఠించి యమ్మహేశ్వరునిఁ బొందఁగల్గుచున్నారు. దేవయానులగువారి కితఁడే ద్వారమగు నాదిత్యుఁడుగా జెప్పఁబడుచున్నాఁడు. మఱియు నితఁడే పితృయానులగు వారికి ద్వారమగుచంద్రుఁడుగాఁ దెలుపఁబడుచున్నాఁడు. దిక్కులు, కాష్ఠలు, సంవత్సరములు, యుగములు నితఁడే. దక్షిణోత్తరాయణ

ములు నీతఁడే. మున్నా ప్రజాపతి పెక్కు స్తవములచేఁ బ్రజార్థముగా నారాధించి, యీనీలలోహితుని వరముగోరికొనియెను. బహ్వృచులు తత్వకర్మమున ఋక్కులచే నెవ్వని ననుశాసింతురో, యధ్వర్యు లధ్వరమున యజుర్మయుఁగను త్రిధావేద్యుఁగను నెంచి హోమ మొనర్తురో, శుద్ధబుద్ధులగుసామగులు సామములచే నెవ్వని గాన మొనర్తురో, ఋతముగను సత్యముగను బరబ్రహ్మముగను నాథర్వణులగు ద్విజు లెవ్వని సన్నుతింతురో, యతఁడే యజ్ఞపరమయోనియు, యజ్ఞపతియు నని చెప్పఁబడుచున్నాఁడు. రాత్రులును బవళ్లును జెవులును గన్నులుగా, బక్షమాసములు శిరోభుజములుగా, ఋతువులె వీర్యముగా, మాఘమాసమె ధైర్యముగా, వత్సరములె గుహ్యోరుపాదములుగాఁ, గాలరూపుఁడై మృత్యుయమహుతాశనరూపుడై సంహారవేగముగలవాఁ డీతఁడె. కాలపరమయోనియు, సనాతనకాలమును నితఁడే. చంద్రాదిత్యులును, నక్షత్రములును, గ్రహములును, బవనుఁడును, ధ్రువుఁడును, సప్తర్షులును, బదునాల్గుభువనములును, ప్రధానము, మహత్తు, విశేషాంతమై స్వవైకృతమగునవ్యక్తమును, భూతాదియై బ్రహ్మాదిస్తంబపర్యంతమగుసత్తును, అసత్తును, నెనిమిదగు ప్రకృతులును బ్రకృతులకంటెఁ బరుఁడును మున్నగుపదార్థముల కమ్మహాదేవుని యొకభాగమే పరివర్తనకారణ మగుచున్నది. ఇదియే యనుద్విగ్నమగుపరము. ఇదియే సనాతనబ్రహ్మము. వేదవేదాంగవిదుల కిదియే ధ్యానగోచరము. ఇదియే పరమపదము. ఇదియే పరమకాష్ఠ. ఇదియే పరమకళ. ఇదియే పరమసిద్ధి. ఇదియే పరమగతి. ఇదియే పరమశాంతి. ఇదియే ప్రసిద్ధమగునిర్వృతి. ఇదియే తుష్టి. ఇదియే సిద్ధియు, శ్రుతియు, స్మృతియు నై యున్నది. దేనిని బొంది కృతకృత్యులగుదురో యది యిదియే అని యోగులు నిన్ను తలంచుచున్నారు. భక్తుల కీవ యథాత్మగతివి. విద్వాంసుల కవ్యయప్రాప్తివి. కామయమానులై విపులదక్షిణలతో యజ్ఞము లొనర్చు యాగశీలుర కేదిగతియో, యట్టిగతి వీవగదా! శరీరతాపనములై శాంతినియమములగు సమ్యగ్యోగజపములచేఁ దపించువారి కేదిగతియో యట్టిగతి వీవ యనుటలో సందియము లేదు. ఓసనాతనా! కర్మన్యాసమొనర్చిన విరక్తులకు బ్రహ్మసదనమున నేగతియగునో, యట్టిగతి వీవగదా! అపునర్భవకాములై వైరా

గ్యథనులైనవారికిని బ్రకృతిలయములకును గతివీవ. జ్ఞానవిజ్ఞానయుక్తులగువారికి, నిరుపాఖ్యమై నిరంజనమైన యేకైవల్యగతిగలదో యట్టి పరమగతి వీవగదా! ఓ ప్రభూ! వేదశాస్త్రపురాణములందుఁ జెప్పఁబడిన యీయైదుగతులును, నీయనుగ్రహముచే లభించునుగాని, వేఱొకవిధముగా లభింపనేరవు. అని తపోరాశియగు నా తండి మహర్షి పరమేశునిసన్నుతించి, మఱియు మున్నాలోకకర్త స్తుతించిన విధముగా సంస్తుతించెను.

ఓకృష్ణా! బ్రహ్మావాదియగు నమ్మహాముని సన్నుతించుటయు, నుమాసహితుఁడగు నమ్మహాదేవుఁడు బ్రహ్మేంద్రాదులును మహర్షులును నిన్నుఁ దెలియఁజాలరని పలుకుచు సంతసించి యిట్లు పలికెను.

"ఓబుషివర్యా! నీవక్షయుఁడవు, నవ్యయుఁడవునై దుఃఖవర్జితుఁడ వగుదువు. మఱియుఁ దేజోనిధివై కీర్తిశాలివై దివ్యజ్ఞానము గలిగి, మహర్షులకును సంస్తవనీయుఁడవై వెలయుదువు. నీపుత్రుఁడు సూత్రకర్త యయ్యెడిని. ఇదియెల్ల నాయనుగ్రహముచే నగును. ఇందు సందియము లేదు. నీకేమి కావలయునో, నేనేమి యొసంగవలయునో తెలుపుము."

అంత నత్తండిమహర్షి "దేవా! నీయెడ నాకు దృఢభక్తి గల్గునట్టు లనుగ్రహింపుమని ప్రార్థించెను. ఓగోవిందా! ఇటు లమ్మహాదేవుఁడాతండిమహర్షికి వరము లొసంగి, సురర్షులచే వంద్యమానుఁడగుచు, విబుధులచే సన్నుతింపఁబడుచు నందే యతఁ డంతర్హితుఁడయ్యెను. ఓయాదవాధీశా! అటు లాభగవానుఁడు సపరివారముగా నంతర్ధానమొందుటయు, నమ్మహర్షి నిజాశ్రమమునకు వచ్చి నా కీవిషయము నెల్ల నెఱిఁగించెను. ఓయాదవోత్తమా! మఱియు నమ్మహాదేవుని ప్రసిద్ధములగునామముల నమ్మహర్షి నాకెఱిఁగించెను. పరమసిద్ధి గల్గుటకై వాని నెఱిఁగించెదను. వినుము. ఆశర్వునినామములు పదివేలని పితామహుఁడు దేవతల కెఱిఁగించెను. అటులే శాస్త్రములందు శర్వుని నామములు వేయి యని తెలుపుదురు. ఓయచ్యుతా! భగవానుఁడగు నాదేవునియనుగ్రహముచేతనే తండిమహర్షి రహస్యములగు నీనామముల నాకెఱిఁగింపఁగలిగెను." అని తెలిపెనని చెప్పి వాసుదేవుఁడు మఱియు నిట్లనియె.

శివసహస్రనామస్తోత్ర పరిసమాప్తి

ఓయుధిష్ఠిరా! అంత నమ్మహర్షి నియతుఁడై చేతులు మోగిడ్చి తొలుతనుండి మహాదేవు నామసంగ్రహము చేయువాఁడై యిట్లు తెలిపెను.

"వేదవేదాంగసంభవములును బ్రహ్మప్రోక్తములును ఋషిప్రోక్తములునునగు నామములచే సర్వలోకవిఖ్యాతుఁడై స్తుత్యుఁడైన యమ్మహాదేవుని స్తుతించెదను. అయ్యవి మహత్తరులచే విహితములును సత్యములు సిద్ధములు సర్వార్థసాధకములును మహర్షియగు తండిచే భక్తిపురస్సరముగాఁ బఠింపఁబడినవియు, సాధుజనులచే యథోక్తములును,దత్త్వదర్శులగుమునులచేఁ బ్రఖ్యాతములైనవియు నైయున్నవి. బ్రహ్మలోకావతారితములై సత్యములైన శ్రుతములచే సకలజగద్వ్యాప్తమై సర్వభూతహితమై శుభప్రదమును స్వర్గప్రదమును నుత్తమమును బ్రథమమును బ్రహ్మప్రోక్తము నైన బ్రహ్మమును దెలిపెదను. జాగరూకుఁడవై వినుము. నీవు భక్తుఁడవై పరమేశ్వరుఁడగు భవునిఁ గోరికొనుము. నీ కాసనాతనబ్రహ్మమును వినిపించెదను. ఆశర్వుని విధమంతయు విస్తరించి తెలుప నెవ్వనికిని వశముగాదు. విభూతియుక్తుఁడగువాఁడును నమ్మహేశుని వందలకొలందివత్సరములకేనిఁ

---

శ్రీ శివసహస్రనామస్తోత్రమ్

వాసుదేవ ఉవాచ.—తతస్స ప్రయతో భూత్వా మమ తాత యుధిష్ఠిర, ప్రాంజలిః ప్రాహ విప్రర్షి ర్నామసంగ్రహ మాదితః. ౧. ఉపమన్యు రువాచ.— బ్రహ్మప్రోక్తైః ఋషిప్రోక్తై ర్వేదవేదాంగసంభవైః, సర్వలోకేషు విఖ్యాతం స్తుత్యం స్తోష్యామి నామభిః. ౨. మహద్భి ర్విహితై స్సత్యై స్సిద్ధై స్సర్వార్థసాధకైః, ఋషిణా తండినా భక్త్యా కృతై ర్వేన కృతాత్మనా. ౩. యథోక్తై స్సాధుభిః ఖ్యాతై ర్మునిభి స్తత్త్వదర్శిభిః, ప్రవరం ప్రథమం స్వర్గ్యం సర్వభూతహితం శుభమ్.౪. శ్రుతై స్సర్వత్ర జగతి బ్రహ్మలోకావతారితైః సత్యైః, స్తత్పరమం బ్రహ్మ బ్రహ్మప్రోక్తై స్సనాతనమ్.౫. వక్ష్యే యదుకులశ్రేష్ఠ శృణుష్వావహితో మమ, వరయైనం భవం దేవం భక్త స్త్వం పరమేశ్వరమ్. ౬. తేన తే శ్రావయిష్యామి యత్తద్బ్రహ్మ సనాతనం, న శక్యం విస్తరాత్కృత్స్నం వక్తుం శర్వస్య కేనచిత్. ౭. యుక్తేనాపి విభూతీనా మపి వర్షశతైరపి

తెలుపఁజాలఁడు. ఆతని యాదిమధ్యాంతములు సురలకును గోచరములు గావు. ఓమాధవా! అట్టివానిగుణములను బూర్ణముగాఁ దెలుపుట కెవ్వానికి వశమగును? కాని, ధీమంతుఁడగు నమ్మహాత్ముని యనుగ్రహము వలన నాశక్తికొలఁదిగా, నాతనిచరిత్రమును సంక్షిప్తార్థపదాక్షరముగాఁ దెలిపెదను. ఆ యీశ్వరు ననుజ్ఞ నొందక యాతని సన్నుతింప శక్యముగాదు. నేనెపు డాతని యనుజ్ఞ వడయుదునో యపుడే యతఁడు సన్నుతింపఁబడినవాఁ డగును. ఆద్యంతరహితుఁడును, మహాత్ముఁడును, జగద్యోనియు, నవ్యక్తయోనియు నగు నతని నామసముద్దేశము నించుక దెలిపెదను. ఓకృష్ణా! ధీమంతుఁడును, వరదుఁడును, వరేణ్యుఁడును, విశ్వరూపుఁడునగు నమ్మహాదేవు నామములను గుఱించి మున్ను పద్మయోని తెలిపినవిధ మెద్దియో దాని ననుసరించి చెప్పెదను. అప్పితామహుఁడు పదివేలనామములను దెలిపెను. వాని నెల్ల మానసముచే మథించి, పెరుగునుండి నేయియు, గిరినుండి సారమగు బంగారము, పుష్పములనుండి మధువు, ఘృతమునుండి మండము దీసినట్టులు, చతుర్వేదసమన్వితమై సర్వపాపాపహమగు తన్నామసారమును సముద్ధరించి, ప్రయతాత్ముఁడగువాఁడు ప్రయత్నించి పొందవలయు. మంగళప్రదమును, పుష్టికరమును, రక్షోఘ్నమును, మహత్తరము, పావనమునగు దీనిని శ్రద్ధాళువు, ఆస్తికుఁడు, భక్తుఁడు

---

యస్యాదిమధ్యమాంతాని గమ్యంతే న సురైరపి. ౮. కస్తస్య శక్నుయా ద్వక్తుం గుణాన్ కార్త్స్న్యేన మాధవ, కింతు దేవస్య మహత స్సంక్షిప్తార్థపదాక్షరమ్. ౯. శక్తిత శ్చరితం వక్ష్యే ప్రసాదా త్తస్య ధీమతః, అప్రాప్య తు తతోఽనుజ్ఞాం న శక్య స్తోతు మీశ్వరః. ౧౦. యదా తేనాభ్యనుజ్ఞాతస్తుతో వై స తదా మయా, అనాదినిధనస్యాహం జగద్యోనే ర్మహాత్మనః. ౧౧. నామ్నాం కించి త్సముద్దేశం వక్ష్యామ్యవ్యక్తయోనినః, వరదస్య వరేణ్యస్య విశ్వరూపస్య ధీమతః. ౧౨. శృణు నామ్నాం చయం కృష్ణ య దుక్తం పద్మయోనినా, దశ నామసహస్రాణి యాన్యాహ ప్రపితామహః. ౧౩. తాని నిర్మథ్య మనసా దధ్నో ఘృతమివోద్ధృతం, గిరేస్సారం యథా హేమ పుష్పసారం యథా మధు. ౧౪. ఘృతాత్సారం యథామండం తథైతత్సారముద్ధృతం, సర్వపాపాపహ మిదం చతుర్వేదసమన్వితమ్. ౧౫. ప్రయత్నేనాధిగంతవ్యం ధార్యం చ ప్రయతాత్మనా, మాంగళ్యం పౌష్టికం చైవ రక్షోఘ్నం పావనం మహత్. ౧౬. ఇదం భక్తాయ దాతవ్యం శ్రద్ధయా నాస్తికాయ చ, నాశ్రద్ధధాన

నగువాని కుపదేశింపవలయును. శ్రద్ధాహీనునకును, నాస్తికునకును, నజితాత్మునకును, నసూయాపరునకును దెలుపరాదు. కారణాత్ముఁడు నీశ్వరుఁడునగు దేవునిపై నెవ్వఁ డసూయవహించునో, వాఁడు తన సంతతితోడను బూర్వులతోడను నరక మొందుచున్నాఁడు. ఇదియే ధ్యానము. ఇదియే యోగము. ఇదియే సర్వోత్తమమగు ధ్యేయము. ఇదియే జప్యము. ఇదియే జ్ఞానము. ఇదియే యుత్తమ రహస్యము. దీని నంతకాలమందేని దెలిసినవాఁడు పరమగతి నొందుచున్నాఁడు. పవిత్రము శుభప్రదము, మేధ్యము, కళ్యాణము, ఉత్తమమునగు దీనిని, మున్నులోకప్రపితామహుఁడగు బ్రహ్మ సర్వస్తవరాజముగా నొనర్చి దేవతల్కకై కల్పించెను. అదిమొదలుగనే, మహాత్ముఁడగు నీశ్వరుని యీస్తోత్రము సురపూజితమై స్తనరాజమని ప్రసిద్ధి వడసెను. ఈ స్తవరాజము బ్రహ్మలోకమునుండి స్వర్గమం దవతరింపఁజేయఁబడియెను. తండిమహర్షి యీ స్తవరాజమును ముందుగా సంగ్రహించుటచే నిది తండికృత మయ్యెను. ఆతండిమహర్షియే స్వర్గమునుండి యీ స్తవరాజమును భూలోకమునకుఁ దెచ్చెను. ఓమహాబాహూ! సర్వమంగళమాంగళ్యమును, సకలకల్మషవినాశకమును, స్తవములలో నుత్తమ స్తవమునగు దీనిని దెలిపెదను. ఏమహానీయుఁడు బ్రహ్మలకెల్ల బ్రహ్మయుఁ, బరులకంటెఁ బరుఁడును, దేజములకుఁ దేజ

---

రూపాయ నాస్తికా యాజితాత్మనే. ౧౭. యశ్చాభ్యసూయతే దేవం కారణాత్మాన మీశ్వరం, స కృష్ణ నరకం యాతి సహ పూర్వైః స్వహాత్మజైః. ౧౮. ఇదం ధ్యాన మిదం యోగ మిదం ధ్యేయ మను త్తమం, ఇదం జప్య మిదం జ్ఞానం రహస్య మిద ముత్తమమ్. ౧౯. యం జ్ఞాత్వా హ్యంతకాలేఽపి గచ్ఛేత పరమాం గతిం, పవిత్రం మంగళం మేధ్యం కల్యాణ మిద ముత్తమమ్. ౨౦. ఇదం బ్రహ్మ పురా కృత్వా సర్వ లోకపితామహః, సర్వస్తవానాం రాజత్వే దివ్యానాం సమకల్పయత్. ౨౧. తదా ప్రభృతి చైవాయ మీశ్వరస్య మహాత్మనః, స్తనరాజ ఇతి ఖ్యాతో జగత్యమరపూజితః. ౨౨. బ్రహ్మలోకాదయం స్వర్గే స్తవరాజోఽవతారితః, యత స్తండిః పురా ప్రాప తేన తండికృతోఽభవత్. ౨౩. స్వర్గాచ్చైవాత్ర భూలోకం తండినా హ్యవతారితః, సర్వమంగళమాంగళ్యం సర్వపాపప్రణాశనమ్. ౨౪. నిగదిష్యే మహాబాహో స్తవానా ముత్తమం స్తవం, బ్రహ్మణా మపి యద్బ్రహ్మ పరాణా మపి యత్పరమ్. ౨౫. తేజసా

మును, దపములకుఁ దపమును, శాంతములకు శాంతమును, ద్యుతులలో ద్యుతియు, దాంతులలో దాంతుఁడును, ధీమంతులకు ధీయును, దేవతలకు దేవతయు, మహర్షులకు మహర్షియు, యజ్ఞములకు యజ్ఞమును, శివులకును శివుఁడును, రుద్రులకును రుద్రుఁడును, ప్రభ గలవారి ప్రభయు, యోగులకును యోగియుఁ, గారణములకును గారణమును నై వెలయునో, యెవనివలన లోకములు సంభవించునో, యెవనివలన నడంగునో, యట్టి సర్వభూతాత్మభూతుఁడును, నమిత తేజుఁడునగు హరుని యష్టోత్తరసహస్రనామముల నన్నిటి నెఱిఁగించెదను వినుము. దానిని వినుటేని సకలకామముల నందఁగలవు.

"ఓం. స్థిరుఁడును, స్థాణువు, ప్రభువు, భీముఁడు, ప్రవరుఁడు, వరదుఁడు, వరుఁడు, సర్వాత్మయు, సర్వవిఖ్యాతుఁడు, సర్వుఁడు, సర్వకరుఁడు, భవుఁడు, జటి, చర్మి, శిఖండి, సర్వాంగుఁడు, సర్వభావనుఁడు, హరుఁడు, హరిణాక్షుఁడు, సర్వభూతహరుఁడు, ప్రభువు, ప్రవృత్తి, నివృత్తి, నియతుఁడు, శాశ్వతుఁడు, ధ్రువుఁడు, శ్మశానవాసి, భగవానుఁడు, ఖచరుఁడు, గోచరుఁడు, అర్దనుఁడు, అభివాద్యుఁడు, మహాకర్ముఁడు, తపస్వి, భూతభావనుఁడు, ఉన్మత్తవేష ప్రచ్ఛన్నుఁడు, సర్వలోకప్రజాపతి, మహారూపుఁడు, మహాకాయుఁడు, వృషరూపుఁడు, మహాయశుఁడు, మహాత్ముఁడు, సర్వభూతాత్ముఁడు,

---

మపి యత్తేజ స్తపసామపి యత్తపః, శాంతానా మపి యశ్శాంతో ద్యుతీనామపి యో ద్యుతిః. ౨౬. దాంతానామపి యో దాంతో ధీమతామపి యోచ ధీః, దేవానామపి యో దేవ ఋషీణామపి యస్త్వృషిః. ౨౭. యజ్ఞానామపి యో యజ్ఞ శ్శివానామపి యశ్శివః, రుద్రాణామపి యో రుద్రః ప్రభా ప్రభవతామపి. ౨౮. యోగినామపి యో యోగీ కారణానాం చ కారణం, యతో లోకా స్సంభవంతి సంభవంతి యతః పునః. ౨౯. సర్వభూతాత్మభూతస్య హర స్యామిత తేజసః, అష్టోత్తరసహస్రం తు నామ్నాం సర్వస్య మే శృణు. ౩౦. యచ్ఛ్రుత్వా మనుజవ్యాఘ్ర సర్వాన్ కామా నవాప్స్యసి.

ఓమ్. స్థిరః స్థాణుః ప్రభు ర్భీమః ప్రవరో వరదో వరః. ౩౧. సర్వాత్మా సర్వ విఖ్యాత స్సర్వ స్సర్వకరో భవః, జటీ చర్మీ శిఖండీ చ సర్వాంగ స్సర్వభావనః. ౩౨. హరశ్చ హరిణాక్షశ్చ సర్వభూతహరః ప్రభుః, ప్రవృత్తిశ్చ నివృత్తిశ్చ నియత శ్శాశ్వతో ధ్రువః. ౩౩. శ్మశానవాసీ భగవాన్ ఖచరో గోచరోఽర్దనః, అభివాద్యో మహాకర్మా తపస్వీ భూతభావనః. ౩౪. ఉన్మత్తవేషః ప్రచ్ఛన్న స్సర్వలోకప్రజాపతిః, మహారూపో మహాకాయో వృషరూపో మహాయశాః. ౩౫. మహాత్మా సర్వభూతాత్మా

విశ్వరూపుఁడు, మహాహానుఁడు, లోకపాలుఁడు, అంతర్హితాత్ముఁడు, ప్రసాదుఁడు, నీలలోహితుఁడు, పవిత్రుఁడు, మహత్తరుఁడు, నియమరూపి, నియమాశ్రితుఁడు, సర్వకర్ముఁడు, స్వయంభూతుఁడు, ఆదియు, నాదికరుఁడు, నిధి, సహస్రాక్షుఁడు, విశాలాక్షుఁడు, సోముఁడు, నక్షత్రసాధకుఁడు, చంద్రుఁడు, సూర్యుఁడు, శని, కేతువు, గ్రహరూపి, గ్రహపతి, వరరూపి, అత్రి, అత్రినమస్కర్త, మృగబాణార్పణుఁడు, అనఘుఁడు, మహాతపుఁడు, ఘోరతపుఁడు, అదీనుఁడు, దీనసాధకుఁడు, సంవత్సరకరుఁడు, మంత్రరూపి, పరముఁడు, తపుఁడు, యోగి, యోజ్యుఁడు, మహాబీజుఁడు, మహారేతుఁడు, మహాబలుఁడు, సువర్ణరేతుఁడు, సర్వజ్ఞుఁడు, సుబీజుఁడు, బీజవాహనుఁడు, దశబాహుఁడు, అనిమిషుఁడు, నీలకంఠుఁడు, ఉమాపతి, విశ్వరూపుఁడు, స్వయంశ్రేష్ఠుఁడు, బలవీరుఁడు, బలుఁడు, గణుఁడు, గణకర్త, గణపతి, దిగ్వాసుఁడు, కాముఁడు, మంత్రవిత్పరముఁడు, మంత్రుఁడు, సర్వభావకరుఁడు, హరుఁడు, కమండలుధరుఁడు, ధన్వి, బాణహస్తుఁడు, కపాలవంతుఁడు, అశని, శతఘ్ని, ఖడ్గి, పట్టసి, ఆయుధి, మహానీయుఁడు, స్రువహస్తుఁడు, సురూపుఁడు, తేజోరూపుఁడు, తేజస్కరుఁడు, నిధి, ఉష్ణీషి, సువక్త్రుఁడు, ఉదగ్రుఁడు, వినతుఁడు, దీర్ఘుఁడు, హరికేశుఁడు, సుతీర్థుఁడు, కృష్ణుఁడు,

---

విశ్వరూపో మహాహనుః, లోకపాలోఽంతర్హితాత్మా ప్రసాదో నీలలోహితః. ౩౬. పవిత్రం చ మహాంశ్చైవ నియమో నియమాశ్రితః, సర్వకర్మా స్వయంభూత ఆదిరాదికరో నిధిః. ౩౭. సహస్రాక్షో విశాలాక్షస్సోమో నక్షత్రసాధకః, చంద్రస్సూర్యశ్శనిః కేతుర్గ్రహో గ్రహపతిర్వరః. ౩౮. అత్రి రత్ర్యై నమస్కర్తా మృగబాణార్పణోఽనఘః, మహాతపా ఘోరతపా అదీనో దీనసాధకః. ౩౯. సంవత్సరకరో మంత్రః ప్రమాణం పరమంతపః, యోగీ యోజ్యో మహాబీజో మహారేతా మహాబలః. ౪౦. సువర్ణరేతా స్సర్వజ్ఞ స్సుబీజో బీజవాహనః, దశబాహు స్త్వనిమిషో నీలకంఠ ఉమాపతిః. ౪౧. విశ్వరూపః స్వయం శ్రేష్ఠో బలవీరో బలోగణః, గణకర్తా గణపతి ర్దిగ్వాసాః కామ ఏవచ. ౪౨. మంత్రవిత్పరమో మంత్రః సర్వభావకరో హరః, కమండలుధరో ధన్వీ బాణహస్తః కపాలవాన్. ౪౩. అశనీ శతఘ్నీ ఖడ్గీ పట్టసీ చాయుధీ మహాన్, స్రువహస్త స్సురూపశ్చ తేజస్తేజస్కరో నిధిః. ౪౪. ఉష్ణీషీ చ సువక్త్రశ్చ ఉదగ్రో వినత స్తథా, దీర్ఘశ్చ హరికేశశ్చ సుతీర్థః కృష్ణఏవచ. ౪౫. సృగాలరూప

సృగాలరూపుఁడు, సిద్ధార్థుఁడు, ముండుఁడు, సర్వశుభంకరుఁడు, అజుఁడు, బహురూపుఁడు, గంధధారి, కపర్ది, ఊర్ధ్వరేతుఁడు, ఊర్ధ్వలింగుఁడు, ఊర్ధ్వశాయి, నభస్థలుఁడు, త్రిజటుఁడు, చీరవాసుఁడు, రుద్రసేనాపతి, విభుఁడు, అహశ్చరుఁడు, నక్తంచరుఁడు, తిగ్మమన్యుఁడు, సువర్చసుఁడు, గజఘాతుకుఁడు, దైత్యఘాతుకుఁడు, కాలుఁడు, లోకధాత, గుణాకరుఁడు, సింహశార్దూలరూపుఁడు, ఆర్ద్రచర్మాంబరావృతుఁడు, కాలయోగి, మహానాదుఁడు, సర్వకాముఁడు, చతుష్పథుఁడు, నిశాచరుఁడు, ప్రేతచారి, భూతచారి, మహేశ్వరుఁడు, బహుభూతుఁడు, బహుధరుఁడు, స్వర్భానుఁడు, అమితుఁడు, గతి, నృత్యప్రియుఁడు, నిత్యనర్తుఁడు, నర్తకుఁడు, సర్వలాలసుఁడు, ఘోరుఁడు, మహాతపుఁడు, పాశరూపి, నిత్యుఁడు, గిరిరుహుఁడు, నభోరూపి, సహస్రహస్తుఁడు, విజయుఁడు, వ్యవసాయుఁడు, అతంద్రితుఁడు, అధర్షణుఁడు, ధర్షణాత్ముఁడు, యజ్ఞహంత, కామనాశకరుఁడు, దక్షయజ్ఞధ్వంసి, సుసహుఁడు, మధ్యముఁడు, తేజోపహారి, బలహంత, ముదితుఁడు, అర్థుఁడు, అజితుఁడు, వరుఁడు, గంభీరఘోషుఁడు, గంభీరుఁడు, గంభీరబలవాహనుఁడు, న్యగ్రోధరూపుఁడు, న్యగ్రోధవృక్షకర్ణస్థితి, విభుఁడు, సుతీక్ష్ణదశనుఁడు, మహాకాయుఁడు, మహాననుఁడు,

---

స్సిద్ధార్థో ముండ స్సర్వశుభంకరః, అజశ్చ బహురూపశ్చ గంధధారీ కపర్ద్యపి. ౪౬. ఊర్ధ్వరేతా ఊర్ధ్వలింగ ఊర్ధ్వశాయీ నభస్స్థలః, త్రిజట శ్చీరవాసాశ్చ రుద్ర స్సేనాపతిర్విభుః. ౪౭. అహశ్చరో నక్తంచర స్తి గ్మమన్యు స్సువర్చసః, గజహా దైత్యహా కాలో లోకధాతా గుణాకరః. ౪౮. సింహశార్దూల రూపశ్చ ఆర్ద్రచర్మాంబరావృతః, కాలయోగీ మహానాథ స్సర్వకామ శ్చతుష్పథః. ౪౯. నిశాచరః ప్రేతచారీ భూతచారీ మహేశ్వరః, బహుభూతో బహుధరః స్వర్భాను రమితో గతిః. ౫౦. నృత్యప్రియో నిత్యనర్తో నర్తక స్సర్వలాలసః, ఘోరో మహాతపాః పాశో నిత్యో గిరిరుహో నిరాలయః. ౫౧. సహస్రహస్తో విజయో వ్యవసాయో హ్యతంద్రితః, అధర్షణో ధర్షణాత్మా యజ్ఞహా కామనాశకః. ౫౨. దక్షయాగాపహారీ చ సుసహో మధ్యమ స్తథా, తేజో ఽపహారీ బలహా ముదితో ఽర్థో ఽజితో వరః. ౫౩. గంభీరఘోషో గంభీరో గంభీర బలవాహనః, న్యగ్రోధరూపో న్యగ్రోధవృక్షకర్ణస్థితి ర్విభుః. ౫౪. సుతీక్ష్ణదశన శ్చైవ మహాకాయో మహాననః, విష్వక్సేనో హరి ర్యజ్ఞ స్సంయుగా పీడ

విష్వక్సేనుఁడు, హరి, యజ్ఞుఁడు, సంయుగాపీడవాహనుఁడు, తీక్ష్ణతాపుఁడు, హర్యశ్వుఁడు, సహాయుఁడు, కర్మకాలవేత్త, విష్ణుప్రసాదితుఁడు, యజ్ఞుఁడు, సముద్రుఁడు, బడబాముఖుఁడు, హుతాశనసహాయుఁడు, ప్రశాంతాత్ముఁడు, హుతాశనుఁడు, ఉగ్రతేజుఁడు, మహాతేజుఁడు, జన్యుఁడు, విజయకాలవేత్త, జ్యోతిరయనుఁడు, సిద్ధి, సర్వవిగ్రహుఁడు, శిఖి, ముండి, జటి, జ్వాలి, మూర్తిజుఁడు, మూర్ధగుఁడు, బలి, వైణవి, పణవి, తాళి, ఖలి, కాలకటంకటుఁడు, నక్షత్రవిగ్రహమతి, గుణబుద్ధి, లయుఁడు, గముఁడు, ప్రజాపతి, విశ్వబాహుఁడు, విభాగుఁడు, సర్వగోముఖుఁడు, విమోచనుఁడు, సుసరణుఁడు, హిరణ్యకవచోద్భవుఁడు, మేఢ్రజుఁడు, బలచారి, మహీచారి, స్తుతుఁడు, సర్వతూర్యనినాది, సర్వాతోద్యపరిగ్రహుఁడు, వ్యాలరూపుఁడు, గుహావాసి, గుహుఁడు, మాలి, తరంగవేత్త, త్రిదశుఁడు, త్రికాలదృక్కు, కర్మసర్వబంధవిమోచనుఁడు, అసురేంద్రబంధనుఁడు, యుద్ధశత్రువినాశనుఁడు, సాంఖ్యప్రసాదుఁడు, దుర్వాసుఁడు, సర్వసాధునిషేవితుఁడు, ప్రస్కందనుఁడు, విభాగజ్ఞుఁడు, అతుల్యుఁడు, యజ్ఞభాగవేత్త, సర్వవాసుఁడు, సర్వచారి, దుర్వాసుఁడు, వాసవుఁడు, అమరుఁడు, హైముఁడు, హేమకరుఁడు, యజ్ఞుఁడు, సర్వధారి, ధరోత్తముఁడు, లోహితాక్షుఁడు, మహాక్షుఁడు, విజయాక్షుఁడు, విశా

వాహనః. ౫౫. తీక్ష్ణతాపశ్చ హర్యశ్వ స్సహాయః కర్మకాలవిత్, విష్ణుప్రసాదితో యజ్ఞ స్సముద్రో బడబాముఖః. ౫౬. హుతాశనసహాయశ్చ ప్రశాంతాత్మా హుతాశనః, ఉగ్రతేజా మహాతేజా జన్యో విజయకాలవిత్. ౫౭. జ్యోతిషామయనం సిద్ధి స్సర్వవిగ్రహఏవచ, శిఖీ ముండీ జటీ జ్వాలీ మూర్తిజో మూర్ధగోబలీ. ౫౮. వైణవీ పణవీ తాళీ ఖలీ కాలకటంకటః, నక్షత్రవిగ్రహమతి ర్గుణబుద్ధి ర్లయోఽగమః. ౫౯. ప్రజాపతి ర్విశ్వబాహు ర్విభాగ స్సర్వగోముఖః. విమోచన స్సుసరణో హిరణ్యకవచోద్భవః. ౬౦. మేఢ్రజో బలచారీ చ మహీచారీ స్తుత స్తథా, సర్వతూర్యనినాదీ చ సర్వాతోద్యపరిగ్రహః. ౬౧. వ్యాళరూపో గుహావాసీ గ్రహమాలీ తరంగవిత్, త్రిదశ స్త్రికాలదృక్కర్మ సర్వబంధవిమోచనః. ౬౨. బంధన స్త్వసురేంద్రాణాం యుధి శత్రువినాశనః, సాంఖ్యప్రసాదో దుర్వాసా స్సర్వసాధునిషేవితః. ౬౩. ప్రస్కందనో విభాగజ్ఞో హ్యతుల్యో యజ్ఞభాగవిత్, సర్వవాస స్సర్వచారీ దుర్వాసా వాసవోఽమరః. ౬౪. హైమో హేమకరో యజ్ఞ స్సర్వధారీ ధరోత్తమః, లోహితాక్షో మహాక్షశ్చ విజ

రదుఁడు, సంగ్రహుఁడు, నిగ్రహుఁడు, కర్త, సర్పచీరనివాసనుఁడు, ముఖ్యుఁడు, అముఖ్యుఁడు, దేహుఁడు, కాహలి, సర్వకామదుఁడు, సర్వకామప్రసాదుఁడు, సుబలుఁడు, బలరూపధారి, సర్వకామవరుఁడు, సర్వదుఁడు, సర్వతోముఖుఁడు, ఆకాశనిర్విరూపుఁడు, నిపాతి, అవశుఁడు, ఖగుఁడు, రౌద్రరూపుఁడు, అంశువు, ఆదిత్యుఁడు, బహురశ్మి, సువర్చసి, వసువేగుఁడు, మహావేగుఁడు, మనోవేగుఁడు, నిశాచరుఁడు, సర్వవాసి, శ్రియావాసి, ఉపదేశకరుఁడు, అకరుఁడు, ముని, ఆత్మనిరాలోకుఁడు, సంభగ్నుఁడు, సహస్రదుఁడు, పక్షి, పక్షరూపుఁడు, అతిదీప్తుఁడు, విశాంపతి, ఉన్మాదుఁడు, మదనుఁడు, కాముఁడు, అశ్వత్థుఁడు, అర్థకరుఁడు, యశోరూపి, వామదేవుఁడు, వాముఁడు, ప్రాగ్దక్షిణుఁడు, వామనుఁడు, సిద్ధయోగి, మహర్షి, సిద్ధార్థుఁడు, సిద్ధసాధకుఁడు, భిక్షువు, భిక్షురూపుఁడు, విపణుఁడు, మృదువు, అవ్యయుఁడు, మహాసేనుఁడు, విశాఖుఁడు, షష్టిభాగుఁడు, గవాంపతి, వజ్రహస్తుఁడు, విష్కంభి, చమూస్తంభనుఁడు, వృత్తావృత్తకరుఁడు, తాలుఁడు, మధువు, మధుకలోచనుఁడు, వాచస్పత్యుఁడు, వాజసనుఁడు, నిత్యాశ్రమపూజితుఁడు, బ్రహ్మచారి, లోకచారి, సర్వచారి, విచారవేత్త, ఈశానుఁడు, ఈశ్వరుఁడు, కాలుఁడు, నిశాచారి, పినాక

---

యాక్షో విశారదః. ౧౭. సంగ్రహో నిగ్రహః కర్తా సర్పచీరనివాసనః, ముఖ్యోఽముఖ్యశ్చ దేహశ్చ కాహళి స్సర్వకామదః. ౧౮. సర్వకాల ప్రసాదశ్చ సుబలో బలరూపభృత్, సర్వకామవరశ్చైవ సర్వద స్సర్వతోముఖః. ౧౯. ఆకాశ నిర్విరూపశ్చ నిపాతీహ్యవశః ఖగః, రౌద్రరూపోఽంశు రాదిత్యో బహురశ్మి స్సువర్చసీ. ౧౭. వసువేగో మహావేగో మనోవేగో నిశాచరః, సర్వవాసీ శ్రియావాసీ ఉపదేశకరోఽకరః. ౧౯. మునిరాత్మా నిరాలోక స్సంభగ్నశ్చ సహస్రదః, పక్షీచ పక్షరూపశ్చ అతిదీప్తో విశాంపతిః. ౨౦. ఉన్మాదో మదనః కామో హ్యశ్వత్థోఽర్థకరో యశః, వామదేవశ్చ వామశ్చ ప్రాగ్దక్షిణ ఉదఙ్ముఖః. ౨౧. సిద్ధయోగీ మహర్షిశ్చ సిద్ధార్థ స్సిద్ధసాధకః, భిక్షుశ్చ భిక్షురూపశ్చ విపణో మృదురవ్యయః. ౨౨. మహాసేనో విశాఖశ్చ షష్టిభాగో గవాంపతిః, వజ్రజిహ్వశ్చ విష్కంభి చమూస్తంభన ఏవచ. ౨౩. వృత్తావృత్త కరస్తాలో మధు ర్మధుకలోచనః, వాచస్పత్యో వాజసనో నిత్యమాశ్రితపూజితః. ౨౪. బ్రహ్మచారీ లోకచారీ సర్వచారీ విచారవిత్, ఈశాన ఈశ్వరః కాలో నిశాచారీ పినాక

ధారి, నిమిత్తస్థుఁడు, నిమిత్తరూపుఁడు, నంది, నందికరుఁడు, హరి, నందీశ్వరుఁడు, నందినందనుఁడు, నందివర్ధనుఁడు, భగహారి, నిహంత, కాలుఁడు, బ్రహ్మ, పితామహుఁడు, చతుర్ముఖుఁడు, మహాలింగుఁడు, చారులింగుఁడు, లింగాధ్యక్షుఁడు, సురాధ్యక్షుఁడు, యోగాధ్యక్షుఁడు, యుగావహుఁడు, బీజాధ్యక్షుఁడు, బీజకర్త, అధ్యాత్ముఁడు, అనుగతుఁడు, బలుఁడు, ఇతిహాసరూపుఁడు, సకల్పుఁడు, గౌతముఁడు, నిశాకరుఁడు, దంభుఁడు, అదంభుఁడు, వైదంభుఁడు, వశ్యుఁడు, వశకరుఁడు, కలి, లోకకర్త, పశుపతి, మహాకర్త, అనౌషధుఁడు, అక్షరుఁడు, పరముఁడు, బ్రహ్మము, బలవంతుఁడు, శక్తుఁడు, నీతి, అనీతి, శుద్ధాత్ముఁడు, శుద్ధుఁడు, మాన్యుఁడు, గతాగతుఁడు, బహుప్రసాదుఁడు, సుస్వప్నుఁడు, దర్పణుఁడు, అమిత్రజేత, వేదకరుఁడు, మంత్రకారుఁడు, విద్వాంసుఁడు, సమరమర్దనుఁడు, మహామేఘనివాసి, మహాఘోరుఁడు, వశీకరుఁడు, అగ్నిజ్వాలుఁడు, మహాజ్వాలుఁడు, అతిధూమ్రుఁడు, హుతుఁడు, హవిస్సు, వృషణుఁడు, శంకరుఁడు, నిత్యవర్చస్వి, ధూమకేతనుఁడు, నీలుఁడు, అంగలుబ్ధుఁడు, శోభనుఁడు, నిరవగ్రహుఁడు, స్వస్తిదుఁడు, స్వస్తిభావుఁడు, భాగి, భాగకరుఁడు, లఘువు, ఉత్సంగుఁడు, మహాంగుఁడు, మహాగర్భపరాయణుఁడు, కృష్ణవర్ణుఁడు, సువర్ణుఁడు, సర్వదేహీంద్రియభూతుఁడు,

---

ధృత్. ౭౫. నిమిత్తస్థో నిమిత్తం చ నందిర్నందికరో హరిః, నందీశ్వరశ్చ నందీ చ నందనో నందివర్ధనః. ౭౬. భగహారీ నిహంతా చ కాలో బ్రహ్మా పితామహః, చతుర్ముఖో మహాలింగ శ్చారులింగ స్తథైవ చ. ౭౭. లింగాధ్యక్షః సురాధ్యక్షో యోగాధ్యక్షో యుగావహః, బీజాధ్యక్షో బీజకర్తా అధ్యాత్మానుగతో బలః. ౭౮. ఇతిహాస స్సకల్పశ్చ గౌతమోఽథ నిశాకరః, దంభో హ్యదంభో వైదంభో వశ్యో వశకరః కలిః. ౭౯. లోకకర్తా పశుపతి ర్మహాకర్తా హ్యనౌషధః, అక్షరం పరమం బ్రహ్మ బలవాన్ శక్త ఏవచ. ౮౦. నీతిర్హ్యనీతి శ్శుద్ధాత్మా శుద్ధో మాన్యో గతాగతః, బహుప్రసాద స్సుస్వప్నో దర్పణోఽథ త్వమిత్రజిత్. ౮౧. వేదకారో మంత్రకారో విద్వా న్సమరమర్దనః, మహామేఘనివాసీ చ మహాఘోరో వశీకరః. ౮౨. అగ్నిజ్వాలో మహాజ్వాలో హ్యతిధూమ్రో హుతో హవిః, వృషణ శ్శంకరో నిత్యం వర్చస్వీ ధూమకేతనః. ౮౩. నీల స్తథాంగలుబ్ధశ్చ శోభనో నిరవగ్రహః, స్వస్తిద స్వస్తిభావశ్చ భాగీ భాగకరో లఘుః. ౮౪. ఉత్సంగశ్చ మహాంగశ్చ మహాగర్భపరాయణః, కృష్ణవర్ణ స్సువర్ణశ్చ

మహాపాదుఁడు, మహాహస్తుఁడు, మహాకాయుఁడు, మహాయశుఁడు, మహామూర్ధుఁడు, మహామాత్రుఁడు, మహానేత్రుఁడు, నిశాలయుఁడు, మహాంతకుఁడు, మహాకర్ణుఁడు, మహోష్ఠుఁడు, మహాహనువు, మహానాసుఁడు, మహాకంబువు, మహాగ్రీవుఁడు, శ్మశానవాసి, మహావక్షుఁడు, మహోరస్కుఁడు, అంతరాత్మ, మృగాలయుఁడు, లంబనుఁడు, లంబితోష్ఠుఁడు, మహామాయుఁడు, పయోనిధి, మహాదంతుఁడు, మహాదంష్ట్రుఁడు, మహాజిహ్వుఁడు, మహాముఖుఁడు, మహానఖుఁడు, మహారోముఁడు, మహాకేశుఁడు, మహాజటుఁడు, ప్రసన్నుఁడు, ప్రసాదుఁడు, ప్రత్యయుఁడు, గిరిసాధనుఁడు, స్నేహనుఁడు, అస్నేహనుఁడు, అజితుఁడు, మహాముని, వృక్షాకారుఁడు, వృక్షకేతువు, అనలుఁడు, వాయువాహనుఁడు, గండలి, మేరుధాముఁడు, దేవాధిపతి, అథర్వశీర్షుఁడు, సామపదనుఁడు, ఋక్సహస్రామితేక్షణుఁడు, యజుఃపాదభుజుఁడు, గుహ్యుఁడు, ప్రకాశుఁడు, జంగముఁడు, అమోఘార్థుఁడు, ప్రసాదుఁడు, అభిగమ్యుఁడు, సుదర్శనుఁడు, ఉపకారుఁడు, ప్రియుఁడు, సర్వరూపి, కనకరూపి, కనకచ్ఛవి, నాభి, నందికరుఁడు, భావుఁడు, పుష్కరుఁడు, స్థపితుఁడు, స్థిరుఁడు, ద్వాదశుఁడు, త్రాసనుఁడు, ఆద్యుఁడు, యజ్ఞుఁడు, యజ్ఞసమాహితుఁడు, నక్తరూపి, కలి, కాలుఁడు, మకరుఁడు, కాలపూజితుఁడు,

---

ఇంద్రియం సర్వదేహినామ్. ౭౫. మహాపాదో మహాహస్తో మహాకాయో మహాయశాః, మహామూర్ధా మహామాత్రో మహానేత్రో నిశాలయః. ౭౬. మహాంతకో మహాకర్ణో మహోష్ఠశ్చ మహాహనుః, మహానాసో మహాకంబు ర్మహాగ్రీవ శ్శ్మశానభాక్. ౭౭. మహావక్షా మహోరస్కో హ్యంతరాత్మా మృగాలయః, లంబనో లంబితోష్ఠశ్చ మహామాయః పయోనిధిః. ౭౮. మహాదంతో మహాదంష్ట్రో మహాజిహ్వో మహాముఖః, మహానఖో మహారోమా మహాకేశో మహాజటః. ౭౯. ప్రసన్నశ్చ ప్రసాదశ్చ ప్రత్యయో గిరిసాధనః, స్నేహనోఽస్నేహనశ్చైవ అజితశ్చ మహామునిః. ౮౦. వృక్షాకారో వృక్షకేతు రనలో వాయువాహనః, గండలీ మేరుధామా చ దేవాధిపతి రేవచ. ౮౧. అథర్వశీర్షస్సామాస్య ఋక్సహస్రామితేక్షణః, యజుఃపాదభుజో గుహ్యః ప్రకాశో జంగమస్తథా. ౮౨. అమోఘార్థః ప్రసాదశ్చ అభిగమ్య స్సుదర్శనః, ఉపకారః ప్రియ స్సర్వః కనకః కాంచనచ్ఛవిః. ౮౩. నాభి ర్నందికరో భావః పుష్కరః స్థపతిః స్థిరః, ద్వాదశ స్త్రాసన శ్చాద్యో యజ్ఞో యజ్ఞసమాహితః. ౮౪. నక్తం కలిశ్చ కాలశ్చ మకరః కాల

సగణుఁడు, గణకారుఁడు, భూతవాహనసారథి, భస్మశయనుఁడు, భస్మగోప్త, భస్మభూతుఁడు, తరువు, గణరూపి, లోకపాలుఁడు, లోకరూపుఁడు, మహాత్ముఁడు, సర్వపూజితుఁడు, శుక్లుఁడు, త్రిశుక్లుఁడు, సంపన్నుఁడు, శుచి, భూతనిషేవితుఁడు, ఆశ్రమస్థుఁడు, క్రియావస్థుఁడు, విశ్వకర్మమతి, వరుఁడు, విశాలశాఖుఁడు, తామ్రోష్ఠుఁడు, అంబుజాలుఁడు, సునిశ్చలుఁడు, కపిలుఁడు, కపిశుఁడు, శుక్లుఁడు, ఆయువు, పరుఁడు, అపరుఁడు, గంధర్వుఁడు, అదితి, తార్క్ష్యుఁడు, సువిజ్ఞేయుఁడు, సుశారదుఁడు, పరశ్వధాయుధుఁడు, దేవుఁడు, అనుకారి, సుబాంధవుఁడు, తుంబవీణుఁడు, మహాక్రోధుఁడు, ఊర్ధ్వరేతుఁడు, జలేశయుఁడు, ఉగ్రుఁడు, వంశకరుఁడు, వంశరూపుఁడు, వంశనాదుఁడు, అనిందితుఁడు, సర్వాంగరూపుఁడు, మాయావి, సుహృదుఁడు, అనిలుఁడు, అనలుఁడు, బంధనుఁడు, బంధకర్త, సుబంధన విమోచనుఁడు, యజ్ఞారి, కామారి, మహాదంష్ట్రుఁడు, మహాయుధుఁడు, బహుధానిందితుఁడు, శర్వుఁడు, శంకరుఁడు, అధనుఁడు, అమరేశుఁడు, మహాదేవుఁడు, విశ్వేదేవుఁడు, సురారిహంత, అహిర్బుధ్న్యుఁడు, అనిలాభుఁడు, చేకితానుఁడు, హవిస్సు, అజైకపాదుఁడు, కాపాలి, త్రిశంకుఁడు, అజితుఁడు, శివుఁడు, ధన్వంతరి, ధూమకేతుఁడు, స్కందుఁడు, వైశ్రవణుఁడు, ధాత, శక్రుఁడు, విష్ణువు, మిత్రుఁడు,త్వష్ట, ధ్రువుఁడు, ధరుఁడు

---

పూజితః, సగణో గణకారశ్చ భూతవాహనసారథిః. ౯౫. భస్మాశయో భస్మగోప్తా భస్మభూతస్తరుర్గణః, లోకపాలస్తథా౽లోకో మహాత్మా సర్వపూజితః. ౯౬. శుక్ల స్త్రిశుక్లః సంపన్న శ్శుచిర్భూతనిషేవితః, ఆశ్రమస్థః క్రియావస్థో విశ్వకర్మమతి ర్వరః. ౯౭. విశాలశాఖ స్తామ్రోష్ఠో హ్యంబుజాల స్సునిశ్చలః, కపిలః కపిశ శ్శుక్ల ఆయుశ్చైవ పరో౽పరః ౯౮. గంధర్వో హ్యదితి స్తార్క్ష్య స్సువిజ్ఞేయ స్సుశారదః, పరశ్వధాయుధో దేవో హ్యనుకారీ సుబాంధవః. ౯౯. తుంబవీణో మహాక్రోధ ఊర్ధ్వరేతా జలేశయః, ఉగ్రో వంశకరో వంశో వంశనాదో హ్యనిందితః. ౧౦౦. సర్వాంగరూపో మాయావీ సుహృదో హ్యనిలో౽నలః బంధనో బంధకర్తా చ సుబంధనవిమోచనః; ౧౦౧. సయజ్ఞారి స్సకామారి ర్మహాదంష్ట్రో మహాయుధః, బహుధానిందితశ్శర్వశ్శంకరశ్శంకరో౽ధనః. ౧౦౨. అమరేశో మహాదేవో విశ్వదేవ స్సురారిహా, అహిర్బుధ్న్యో౽నిలాభశ్చ చేకితానో హవి స్తథా. ౧౦౩. అజైకపాచ్చ కాపాలీ త్రిశంకురజితశ్శివః, ధన్వంతరి ర్ధూమకేతు స్స్కందో వైశ్రవణ స్తథా. ౧౦౪. ధాతా శక్రశ్చ విష్ణుశ్చ మిత్ర స్త్వష్టా ధ్రువో ధరః

ప్రభావుఁడు, సర్వగుఁడు, వాయురూపి, అర్యముఁడు, సవిత, రవి, ఉషంగుఁడు విధాత, మాంధాత, భూతభావనుఁడు, విభుఁడు, వర్ణవిభావి, సర్వకామగుణావహుఁడు, పద్మనాభుఁడు, మహాగర్భుఁడు, చంద్రవక్త్రుఁడు, అనిలుఁడు, అనలుఁడు, బలవంతుఁడు, ఉపశాంతుఁడు, పురాణుఁడు, పుణ్యచంచురి, కురుకర్త, కురువాసి, కురుభూతుఁడు, గుణౌషధుఁడు, సర్వాశయుఁడు, గర్భచారి, సర్వప్రాణపతి, దేవదేవుఁడు, సుఖాసక్తుఁడు, సత్తు, అసత్తు, సర్వరత్నవేత్త, కైలాసగిరివాసి, హిమవద్గిరిసంశ్రయుఁడు, కూలహారి, కూలకర్త, బహువిద్యుఁడు, బహుప్రదుఁడు, వణిజుఁడు, వర్ధకి, వృక్షరూపి, నకులుఁడు, చందనచ్ఛదుఁడు, సారగ్రీవుఁడు, మహాజత్రువు, అలోలుఁడు, మహౌషధుఁడు, సిద్ధార్థకారి, సిద్ధార్థచ్ఛదుఁడు, వ్యాకరణోత్తరుఁడు, సింహనాదుఁడు, సింహదంష్ట్రుఁడు, సింహగుఁడు, సింహవాహనుఁడు, ప్రభావాత్ముఁడు, జగత్కాలుఁడు, కాలుఁడు, లోకహితుఁడు, తరురూపి, సారంగుఁడు, నవచక్రాంగుఁడు, కేతుమాలి, సభావనుఁడు, భూతాలయుఁడు, భూతపతి, అహోరాత్రరూపి, అనిందితుఁడు, సకలభూతవాహిత, నిలయుఁడు, విభువు, భవుఁడు, అమోఘుఁడు, సంయతుఁడు, అశ్వుఁడు, భోజనుఁడు ప్రాణధారణుఁడు, ధృతిమంతుఁడు, మతిమంతుఁడు, దక్షుఁడు, సత్కృ

---

ప్రభావస్సర్వగో వాయు రర్యమా సవితా రవిః. ౧౦౫. ఉషంగుశ్చ విధాతాచ మాంధాతా భూతభావనః, విభు ర్వర్ణవిభావీ చ సర్వకామగుణావహః. ౧౦౬. పద్మనాభో మహాగర్భ శ్చంద్రవక్త్రోఽనిలోఽనలః, బలవాంశ్చోపశాంతశ్చ పురాణః పుణ్యచంచురీః. ౧౦౭. కురుకర్తా కురువాసీ కురుభూతో గుణౌషధః, సర్వాశయో గర్భచారీ సర్వేషాం ప్రాణినాం పతిః. ౧౦౮. దేవదేవ స్సుఖాసక్త స్సదసత్సర్వరత్నవిత్, కైలాసగిరి వాసీచ హిమవద్గిరిసంశ్రయః. ౧౦౯. కూలహారీ కూలకర్తా బహువిద్యో బహుప్రదః, వణిజో వర్ధకీ వృక్షో వకుళశ్చందనచ్ఛదః. ౧౧౦. సారగ్రీవో మహాజత్రు రలోలశ్చ మహౌషధః, సిద్ధార్థకారీ సిద్ధార్థ శ్ఛందోవ్యాకరణోత్తరః. ౧౧౧. సింహనాద స్సింహదంష్ట్ర సింహగ స్సింహవాహనః, ప్రభావాత్మా జగత్కాలః కాలో లోకహిత స్తరుః. ౧౧౨. సారంగో నవచక్రాంగః కేతుమాలీ సభావనః, భూతాలయో భూతపతి రహోరాత్ర మనిందితః. ౧౧౩. వాహితా సర్వభూతానాం నిలయశ్చ విభుర్భవః, అమోఘ స్సంయతో హ్యశ్వో భోజనః ప్రాణధారణః. ౧౧౪. ధృతిమాన్ మతిమాన్ దక్షః సత్కృతశ్చ

తుఁడు, యుగాధిపుఁడు, గోపాలి, గోపతి, గ్రామరూపి, గోచర్మవసనుఁడు, హరి, హిరణ్యబాహువు, గుహాపాలుఁడు, ప్రవేశకుఁడు, ప్రకృష్టారి, మహాహర్షుఁడు, జితకాముఁడు, జితేంద్రియుఁడు, గాంధారుఁడు, సువాసుఁడు, తపస్సక్తుఁడు, రతి, నరుఁడు, మహాగీతుఁడు, మహానృత్యుఁడు, అప్సరోగణసేవితుఁడు, మహాకేతువు, మహాధాతువు, అనేకసానుచరుఁడు, చలుఁడు, ఆవేదనీయుఁడు, ఆదేశుఁడు, సర్వగంధసుఖావహుఁడు, తోరణుఁడు, తారణుఁడు, వాతుఁడు, పరిధి, పతి ఖేచరుఁడు, సంయోగుఁడు, వర్ధనుఁడు, వృద్ధుఁడు, అతివృద్ధుఁడు, గుణాధికుఁడు, నిత్యుఁడు, ఆత్మసహాయుఁడు, దేవాసురపతి, పతి యుక్తుఁడు, యుక్తబాహుఁడు, దేవుఁడు, సుపర్వణుఁడు, ఆషాఢుఁడు, సుషాఢుఁడు, ధ్రువుఁడు, హరిణుఁడు, హరుఁడు, ఆవర్తమానవపువు, వసుశ్రేష్ఠుఁడు, మహాపథుఁడు, శిరోహారి, విమర్శుఁడు, సర్వలక్షణలక్షితుఁడు, అక్షుఁడు, రథయోగి, సర్వయోగి, మహాబలుఁడు, నిర్జీవుఁడు, జీవనుఁడు, మంత్రుఁడు, శుభాక్షుఁడు, బహుకర్కశుఁడు, రత్నప్రభూతుఁడు, రక్తాంగుఁడు, మహార్ణవనిపానవేత్త, మూలభూతుఁడు, విశాలుఁడు, అమృతుఁడు, వ్యక్తావ్యక్తరూపుఁడు, తపోనిధి, ఆరోహణుఁడు, అధిరోహుఁడు, శీలధారి, మహాయశుఁడు, సేనా

---

యుగాధిపః, గోపాలీ గోపతిర్గ్రామో గోచర్మవసనో హరిః. ౧౧౫. హిరణ్యబాహుశ్చ తథా గుహాపాలః ప్రవేశకః, ప్రకృష్టారిర్మహాహర్షో జితకామో జితేంద్రియః. ౧౧౬. గాంధారశ్చ సువాసశ్చ తపస్సక్తో రతిర్నరః, మహాగీతో మహానృత్యో హ్యప్సరోగణసేవితః. ౧౧౭. మహాకేతుర్మహాధాతు ర్నైకసానుచర శ్చలః, ఆవేదనీయ ఆదేశః సర్వగంధసుఖావహః. ౧౧౮. తోరణస్తారణో వాతఃపరిధీపతిఖేచరః, సంయోగో వర్ధనో వృద్ధో హ్యతివృద్ధో గుణాధికః. ౧౧౯. నిత్య ఆత్మా సహాయశ్చదేవాసురపతిః పతిః, యుక్తశ్చ యుక్తబాహుశ్చ దేవో దివిసుపర్వణః. ౧౨౦. ఆషాఢశ్చ సుషాఢశ్చ ధ్రువోఽథ హరిణో హరః, వపురావర్తమానేభ్యో వసుశ్రేష్ఠో మహాపథః. ౧౨౧. శిరోహారీ విమర్శశ్చ సర్వలక్షణలక్షితః, అక్షశ్చ రథయోగీచ సర్వయోగీ మహాబలః. ౧౨౨. సమామ్నాయోఽసమామ్నాయస్తీర్థదేవో మహారథః. నిర్జీవో జీవనో మంత్రశ్శుభాక్షో బహుకర్కశః. ౧౨౩. రత్నప్రభూతో రక్తాంగో మహార్ణవనిపానవిత్, మూలం విశాలో హ్యమృతో వ్యక్తావ్యక్త స్తపోనిధిః. ౧౨౪. ఆరోహణోఽధిరోహశ్చ శీల

కల్పుఁడు, మహాకల్పుఁడు, యోగము, యోగకరుఁడు, హరి, యుగ రూపుఁడు, మహారూపుఁడు, మహానాగహనువు, వధుఁడు, న్యాయ నిర్వపణుఁడు, పాదుఁడు, పండితుఁడు, అచలోపముఁడు, విస్తారుఁడు, లవణుఁడు, క్షూపుఁడు, త్రియుగుఁడు, సకలోదయుఁడు, త్రిలోచ నుఁడు, విషణ్ణాంగుఁడు, మణివిద్ధుఁడు, జటాధరుఁడు, బిందురూపుఁడు, విసర్గరూపుఁడు, సుముఖుఁడు, శరరూపి, సర్వాయుధుఁడు, సహుఁడు, నివేదనుఁడు, సుఖాజాతుఁడు, సుగంధారుఁడు, మహాధనువు, గంధపాలి, భగవానుఁడు, సర్వకర్మోత్థానుఁడు, మంథానుఁడు, బహు లుఁడు, వాయువు, సకలుఁడు, సర్వలోచనుఁడు, తలుఁడు, తాలుఁడు, కరస్థాలి, ఊర్ధ్వసంహననుఁడు, మహత్తరుఁడు, ఛత్రరూపి, సుచ్ఛ త్రుఁడు, విఖ్యాతుఁడు, లోకరూపి, సర్వాశ్రయుఁడు, క్రముఁడు, ముండుఁడు, విరూపుఁడు, వికృతుఁడు, దండి, కుండి, వికుర్వాణుఁడు, హర్యక్షుఁడు, కకుభుఁడు, వజ్రి, శతజిహ్వుఁడు, సహస్రపాదుఁడు, సహస్రశిరస్కుఁడు, దేవేంద్రుఁడు, సర్వదేవమయుఁడు, గురుఁడు, సహస్రబాహువు, సర్వాంగుఁడు, శరణ్యుఁడు, సర్వలోకకర్త, పవిత్ర రూపుఁడు, త్రికకుత్తు, మంత్రరూపి, కనిష్ఠుఁడు, కృష్ణపింగళుఁడు, బ్రహ్మదండవినిర్మాత, శతఘ్నిపాశశక్తిమంతుఁడు, పద్మగర్భుఁడు, మహాగర్భుఁడు, బ్రహ్మగర్భుఁడు, జలోద్భవుఁడు, గభస్తి, బ్రహ్మకర్త

---

ధారీ మహాయశాః, సేనాకల్పో మహాకల్పో యోగో యోగకరో హరిః. ౧౨౫.
యుగరూపో మహారూపో మహానాగహనో వధః, న్యాయనిర్వపణః పాదః పండితో హ్యచలోపమః. ౧౨౬. బహుమాలో మహామాల శ్శశీ హరిసులోచనః, విస్తారో లవణః కూపస్త్రియుగస్సఫలోదయః. ౧౨౭. త్రినేత్రశ్చ విషణ్ణాంగో మణివిద్ధో జటాధరః, బిందు ర్విసర్గ స్సుముఖః శర స్సర్వాయుధస్సహః. ౧౨౮. నివేదనస్సుఖాజాతః సుగంధారో మహాధనుః, గంధపాలీ చ భగవానుత్థాన సర్వకర్మణామ్. ౧౨౯. మంథానో బహుళో వాయుః సకల స్సర్వలోచనః, తలస్తాలః కరస్థాలీ ఊర్ధ్వసంహననో మహాన్. ౧౩౦. ఛత్రం సుఛత్రో విఖ్యాతో లోక స్సర్వాశ్రయక్రమః, ముండో విరూపో వికృతో దండీ కుండీ వికుర్వణః. ౧౩౧. హర్యక్షః కకుభో వజ్రీ శతజిహ్వస్సహస్రపాత్, సహస్రమూర్ధా దేవేంద్ర స్సర్వదేవమయో గురుః. ౧౩౨. సహస్రబాహు స్సర్వాంగః శరణ్య స్సర్వలోకకృత్, పవిత్రం త్రికకున్మంత్రః కనిష్ఠః కృష్ణపింగళః. ౧౩౩. బ్రహ్మ దండ వినిర్మాతా శతఘ్నీ పాశశక్తిమాన్, పద్మగర్భో మహాగర్భో బ్రహ్మగర్భో జలో

బ్రహ్మి, బ్రహ్మవేత్త, బ్రాహ్మణుఁడు, గతి, అనంతరూపుఁడు, అనేకాత్మ, తిగ్మతేజుఁడు, స్వయంభువుఁడు, ఊర్ధ్వగాత్ముఁడు, పశుపతి, వాతరంహుఁడు, మనోజవుఁడు, చందని, పద్మనాళాగ్రుఁడు, సురభ్యుత్తరణుఁడు, నరుఁడు, కర్ణికారమహాస్రజుఁడు, నీలమౌళి, పినాకధారి, ఉమాపతి, ఉమాకాంతుఁడు, జాహ్నవీధరుఁడు, ఉమాధవుఁడు, వరుఁడు, వరాహుఁడు, వరదుఁడు, వరేణ్యుఁడు, సుమహాస్వనుఁడు, మహాప్రసాదుఁడు, దమనుఁడు, శత్రుహంత, శ్వేతపింగళుఁడు, పీతాత్ముఁడు, పరమాత్ముఁడు, ప్రయతాత్ముఁడు, ప్రధానధారి, సర్వపార్శ్వముఖుఁడు, త్ర్యక్షుఁడు, ధర్మసాధారణుఁడు, వరుఁడు, చరాచరాత్ముఁడు, సూక్ష్మాత్ముఁడు, అమృతుఁడు, గోవృషేశ్వరుఁడు, సాధ్యర్షి, వసువు, ఆదిత్యుఁడు, వివస్వంతుఁడు, సవిత, అమృతుఁడు, వ్యాసుఁడు, సర్గుఁడు, సుసంక్షేపుఁడు, విస్తరుఁడు, పర్యయుఁడు, నరుఁడు, ఋతువు, సంవత్సరరూపి, మాసరూపుఁడు, పక్షరూపుఁడు, సంఖ్యాసమాపనుఁడు, కలయుఁ, గాష్ఠయు, లవరూపి, మాత్రారూపుఁడు, ముహూర్తాహస్సు, క్షప, క్షణుఁడు, విశ్వక్షేత్రము, ప్రజాబీజము, లింగము, ఆద్యుఁడు, స్తుతి, గముఁడు, సత్తు, అసత్తు, వ్యక్తము, అవ్యక్తము, పిత, మాత, పితామహుఁడు, స్వర్గద్వారము, ప్రజాద్వారము, మోక్షద్వారము, త్రివిష్టపము, నిర్వాణము, హ్లాదనము, బ్రహ్మలోకము,

---

ధ్రువః. ౧౩౪. గభస్తి ర్బ్రహ్మకృద్బ్రహ్మీ బ్రహ్మవిద్బ్రాహ్మణో గతిః, అనంతరూపో నైకాత్మా తిగ్మతేజా స్స్వయంభువః. ౧౩౫. ఊర్ధ్వగాత్మా పశుపతి ర్వాతరంహా మనోజవః, చందనీ పద్మనాళాగ్ర స్సురభ్యుత్తరణో నరః. ౧౩౬. కర్ణికారమహాస్రగ్వీ నీలమౌళిః పినాకభృత్, ఉమాపతి రుమాకాంతో జాహ్నవీభృదుమాధవః. ౧౩౭. వరో వరాహో వరదో వరేణ్య స్సుమహాస్వనః, మహాప్రసాదో దమనః శత్రుహా శ్వేతపింగళః. ౧౩౮. ప్రీతాత్మా పరమాత్మా చ ప్రయతాత్మా ప్రధానధృత్, సర్వపార్శ్వముఖ స్త్ర్యక్షో ధర్మసాధారణో వరః. ౧౩౯. చరాచరాత్మా సూక్ష్మాత్మా అమృతో గోవృషేశ్వరః. సాధ్యర్షి ర్వసురాదిత్యో వివస్వాన్ సవితాఽమృతః. ౧౪౦. వ్యాసస్సర్గ స్సుసంక్షేపో విస్తరః పర్యయో నరః, ఋతు స్సంవత్సరో మాసః పక్షస్సంఖ్యాసమాపనః. ౧౪౧. కళా కాష్ఠా లవా మాత్రా ముహూర్తాహః క్షపాః క్షణాః, విశ్వక్షేత్రం ప్రజాబీజం లింగమాద్య స్తుతిః ర్గమః. ౧౪౨. సదసద్వ్యక్త మవ్యక్తం పితా మాతా పితామహః, స్వర్గద్వారం ప్రజాద్వారం మోక్షద్వారం త్రివిష్టపమ్. ౧౪౩. నిర్వాణం

పరగతి, దేవాసురవినిర్మాత, దేవాసురపరాయణుఁడు, దేవాసుర గురువు, దేవుఁడు, దేవాసురగణాగ్రణి, దేవాదిదేవుఁడు, దేవర్షి, దేవాసురవరప్రదుఁడు, దేవాసురేశ్వరుఁడు, విశ్వుఁడు, దేవాసుర మహేశ్వరుఁడు, సర్వదేవమయుఁడు, అచింత్యుఁడు, దేవతాత్మ, ఆత్మ సంభవుఁడు, ఉద్భిత్తు, త్రివిక్రముఁడు, వైద్యుఁడు, విరజుఁడు, నీర జుఁడు, అమరుఁడు, ఈడ్యుఁడు, హస్తీశ్వరుఁడు, వ్యాఘ్రరూపి, దేవ సింహుఁడు, నరర్షభుఁడు, విబుధుఁడు, అగ్రవరుఁడు, సూక్ష్ముఁడు, సర్వదేవుఁడు, తపోమయుఁడు, సుయుక్తుఁడు, శోభనుఁడు, వజ్రి, ప్రాస ప్రభవుఁడు, అవ్యయుఁడు, గుహుఁడు, కాంతుఁడు, నిజుఁడు, సర్గరూపి, పవిత్రము, సర్వపావనుఁడు, శృంగి, శృంగప్రియుఁడు, బభ్రువు, రాజ రాజు, నిరామయుఁడు, అభిరాముఁడు, సురగణుఁడు, విరాముఁడు, సర్వ సాధనుఁడు, లలాటాక్షుఁడు, విశ్వదేవుఁడు, హరిణుఁడు, బ్రహ్మవర్చ సుఁడు, స్థావరపతి, నియమేంద్రియవర్ధనుఁడు, సిద్ధార్థుఁడు, సిద్ధుఁడు, భూతార్థుఁడు, అచింత్యుఁడు, సత్యవ్రతుఁడు, శుచి, వ్రతాధిపుఁడు, పర బ్రహ్మము, భక్తపరమగతి, విముక్తుఁడు, ముక్తతేజుఁడు, శ్రీమంతుఁడు, శ్రీవర్ధనుఁడు జగద్రూపి"

ఇట్లు యథాప్రధానముగానే నాభగవానుని నాభక్తికొలఁదిని సన్నుతించితిని. బ్రహ్మాది దేవతలును, మహర్షులును, నెవ్వని స్తుతింపఁ

---

హ్లాదనంచైవ బ్రహ్మలోకః పరాగతిః, దేవాసురవినిర్మాతా దేవాసురపరాయణః. ౧౪౪. దేవాసురగురుర్దేవో దేవాసుర నమస్కృతః, దేవాసుర మహామాత్రో దేవాసుర గణాశ్రయః. ౧౪౫. దేవాసురగణాధ్యక్షో దేవాసురగణాగ్రణీః, దేవాదిదేవో దేవర్షి ర్దేవాసురవరప్రదః. ౧౪౬. దేవాసురేశ్వరో విశ్వో దేవాసురమహేశ్వరః, సర్వదేవమయోఽచింత్యో దేవతాత్మాత్మసంభవః. ౧౪౭. ఉద్భి త్త్రివిక్రమో వైద్యో విరజో నీరజోఽమరః, ఈడ్యో హస్తీశ్వరో వ్యాఘ్రో దేవసింహో నరర్షభః. ౧౪౮. విబుధోఽగ్రవరస్సూక్ష్మ స్సర్వదేవ స్తపోమయః, సుయుక్తః శోభనో వజ్రీ ప్రాసానాం ప్రభవోఽవ్యయః. ౧౪౯. గుహః కాంతో నిజస్సర్గః పవిత్రం సర్వపావనః, శృంగీ శృంగప్రియో బభ్రూ రాజరాజో నిరామయః. ౧౫౦. అభిరామ స్సురగణో విరామ స్సర్వసాధనః, లలాటాక్షో విశ్వదేవో హరిణో బ్రహ్మవర్చసః. ౧౫౧. స్థావరాణాం పతి శ్చైవ నియమేంద్రియవర్ధనః, సిద్ధార్థస్సిద్ధభూతార్థోఽచింత్యస్సత్యవ్రతశ్శుచిః. ౧౫౨. వ్రతాధిపః పరం బ్రహ్మ భక్తానుగ్రహకారకః, విముక్తో ముక్తతేజాశ్చ శ్రీమాన్ శ్రీవర్ధనో జగత్. ౧౫౩. యథాప్రధానం భగవా నితి భక్త్యా స్తుతోమయా, యంన

జాలరో, యట్టిస్తోతవ్యుఁడును, బూజ్యుఁడును, వంద్యుఁడును, నగునమ్మహాదేవుని, జగత్పతి నెవ్వఁడు సన్నుతింపఁగలఁడు? యజ్ఞపతియగు నవ్విభుని భక్తిపురస్సరముగా సన్నుతించి, యాతనియనుజ్ఞ వడసి, పుష్టివర్ధనములగు నామములచే మఱియు నాతనిఁ బొగడుచు, నిత్యయుక్తుఁడును, శుచియు, భక్తుఁడు నగువాఁ డాత్మైక్యము నొందును. ఈ స్తవము పరబ్రహ్మము. దీనిని బఠించినవాఁడు పరబ్రహ్మము నొందును. దేవతలును, మహర్షులును, నీ స్తవరాజముచే నాపరమబ్రహ్మమును సన్నుతించుచున్నారు. నియతాత్ములగు వారిచే నమ్మహాదేవుఁడు సన్నుతింపఁబడుచుఁ బ్రీతుఁడగుచున్నవాఁడు. ఆభగవానుఁడు భక్తప్రియుఁడును, నాత్మసంస్థాకరుఁడును, విభుఁడు నైనవాఁడు. అటులే మానవులం దెవ్వరు ప్రధానులై శ్రద్ధయు, ఆస్తికతయుఁగల్గి బహుజన్మములచే భక్తిపూర్వకములగు స్తవములచే, నీశానుఁడును, బరముఁడును, సనాతనదేవుఁడును నగునాతని, మనోవాక్కర్మములచే నిద్రించియుండియు, జాగరూకులై యుండియు, నడుచుచుండియుఁ, గూర్చుండియు, ఱెప్పమూయుచుండియుఁ, దెఱచుచుండియు, సర్వకాలములందును మఱిమఱియుఁ జింతించుచుఁ, దత్కథలు వినుచు, వినిపించుచు, సన్నుతించుచు నుందురో, వారు సకలజనస్తూయమానులగుచు సంతసించుచుందురు. పెక్కుకోట్లజన్మములందును' బెక్కుయోనులందును, బాపరహితుఁడగువానికే భవునిభక్తి యొదవు

బ్రహ్మాదయో దేవా విదుస్తత్త్వేన సర్వశః. ౧౪౪. స్తోతవ్య మర్చ్యం వంద్యం చ కః స్తోష్యతి జగత్పతిం, భక్త్యా త్వేవం పురస్కృత్య మయా యజ్ఞపతి ర్విభుః. ౧౪౫. తతో ఽభ్యనుజ్ఞాం సంప్రాప్యస్తుతో మతిమతాంవరః, శివమేభిః స్తువన్ దేవం నామభిః పుష్టివర్ధనైః. ౧౪౬. నిత్యయుక్తః శుచిర్భూతః ప్రాప్నోత్యాత్మాన మాత్మనా, ఏతద్ధి పరమం బ్రహ్మ పరం బ్రహ్మాధిగచ్ఛతి. ౧౪౭. ఋషయశ్చైవదేవాశ్చ స్తువం త్యేతేన తత్పరః స్తూయమానో మహాదేవ స్తుష్యతే నియతాత్మభిః. ౧౪౮. భక్తానుకంపీ భగవానాత్మసంస్థాకరో విభుః, తథైవ చ మనుష్యేషు యే మనుష్యాః ప్రధానతః. ౧౪౯. ఆస్తికాశ్శ్రద్దధానాశ్చ బహుభి ర్జన్మభిస్స్తవైః, భక్త్యా హ్యనన్యమీశానం పరం దేవం సనాతనమ్. ౧౫౦. కర్మణా మనసా వాచా భావేన మితతేజసః, శయానా జాగ్రమాణాశ్చ వ్రజ న్నుపవిశం స్తథా. ౧౫౧. ఉన్మిషన్నిమిషంశ్చైవ చింతయంతః పునః పునః, శృణ్వంతశ్శ్రావయంతశ్చ కథయంతశ్చ తే భవమ్. ౧౫౨. స్తువంతస్స్తూయమానాశ్చ తుష్యంతి చ రమంతి చ, జన్మకోటిసహస్రేషు నానాసంసారయోనిషు. ౧౫౩. జంతో

చున్నది. భవునియం దన్నివిధములఁ గలిగినభక్తి యసాధారణమై సర్వముక్తుఁడై భావియగునతనికిఁ గారణ మగుచుండును. ఇట్టిభక్తి దేవతలందును, దుర్లభమై మానవులకు లభింప నలవిగాకుండును. రుద్రభక్తి, నిర్విఘ్నము, నిర్మలము, నవ్యభిచరితము నై వెలయుటకు నాదేవుని యనుగ్రహము లేక మానవులకుఁ గలుగనేరదు. ఎవ్వారు తనయందుఁ జిత్తము లునిచి, పరమసిద్ధి నొందుదురో, మఱియు సర్వభావములఁ దన్నే శరణ మందుదురో యట్టివారిని భక్తవత్సలుండగునతఁడు సంసారార్తినుండి సముద్ధరించును. ఇటులే కొందఱు దేవతలును సంసారమోచన మొనర్చుకొనుచున్నారు. మానవుల కమ్మహాదేవుని విడిచిన వేఱొకతపశ్శక్తి లేదు. వేఱొకబలము లేదు.” అని శుభబుద్ధియు, నింద్రతుల్యుఁడునగు తండిమహర్షిచే, సదసత్పతియుఁ గృత్తివాసుఁడునగు నాభగవానుఁడు సంస్తుతింపఁబడియెను. భగవానుని యీ స్తవమును బరమేష్ఠి తానై యవధరించెను. మఱియు నతఁడా శంకరునిసన్నిధి నమ్మహాదేవు నుద్దేశించి గాన మొనర్చెను. ఇది పవిత్రమై పుణ్యప్రదమై పాపనాశనమై, యోగమును, మోక్షము నొసంగునదియై, స్వర్గమును సంతోషమును గలిగించును. ఎవ్వఁడు దీనిని శంకరునెడఁ దదేకభక్తిగలిగి పఠించునో, వానికి సాంఖ్యయోగుల కగుసద్గతి సంభవించును. ఈ స్తవము నతిప్రయత్నముతో రుద్రుని

---

ర్విగతపాపస్య భవే భక్తిః ప్రజాయతే, ఉత్పన్నా చ భవే భక్తి రనన్యా సర్వభావతః. ౧౬౪. భావినః కారణం చాస్య సర్వముక్తస్య సర్వదా, ఏతద్దేవేషు దుష్ప్రాపం మనుష్యేషు న లభ్యతే. ౧౬౫. నిర్విఘ్నా నిర్మలా రుద్రే భక్తి రవ్యభిచారిణీ, తస్యైవచ ప్రసాదేన భక్తి రుత్పద్యతే నృణామ్. ౧౬౬. యేన యాంతి పరాం సిద్ధిం తద్భావగతచేతసః, యే సర్వభావానుగతాః ప్రపద్యంతే మహేశ్వర. ౧౬౭. ప్రపన్నవత్సలో దేవ స్సంసారార్తాన్ సముద్ధరేత్, ఏవ మన్యే న కుర్వంతి దేవా స్సంసారమోచనమ్. ౧౬౮. మనుష్యాణామృతే దేవం నాన్యా శక్తి స్తపోబలం, ఇతి తేనేంద్రకల్పేన భగవాన్ సదసత్పతిః. ౧౬౯. కృత్తివాసా స్స్తుతః కృష్ణ తండినా శుభబుద్ధినా, స్తవ మేతం భగవతో బ్రహ్మా స్వయమధారయత్. ౧౭౦. గీయతే చ సబుధ్యేత బ్రహ్మా శంకరసన్నిధౌ, ఇదం పుణ్యం పవిత్రంచ సర్వదా పాపనాశనం. ౧౭౧. యోగదం మోక్షదం చైవ స్వర్గదం తోషదం తథా, ఏవ మేత త్పఠంతే య ఏకభక్త్యా తు శంకరే. ౧౭౨. యా గతి స్సాంఖ్యయోగానాం వ్రజంతే తాం గతిం తథా, స్తవ మేనం ప్రయత్నేన సదా

సన్నిధి నొకవత్సర మొనర్చినభక్తుఁ డిష్టఫలము నొందుచున్నవాఁడు. ఇయ్యది బ్రహ్మకు హృదయసంస్థితమగు పరమరహస్యము. దీని నాపర మేష్ఠి యింద్రునకును, నయ్యింద్రుఁడు మృత్యువునకును నెఱిఁగించిరి. ఆమృత్యువు రుద్రుల కెఱిఁగించెను. ఆరుద్రులనుండి తండిమహర్షికి వచ్చెను. బ్రహ్మసద్మమున, నాతండిమహర్షి గొప్పతప మొనర్చి సంపాదించెను. ఆతండిముని శుక్రున కిద్దాని నెఱిఁగింప, నతఁడు గౌతమునకుఁ దెలిపెను. ఓమాధవా! ఆగౌతముఁడు వైవస్వతమనువునకు బోధింప, నమ్మనువు ధీమంతుఁడును, నిష్ఠుఁడు సాధ్యుఁడగునారాయణునకుఁ దెలిపెను. అతఁడు యమునకుఁ దెలుప, నతఁడు నాచికేతున కెఱిఁగించెను. ఆనాచికేతుఁడు మార్కండేయున కుపదేశింప, నమ్మార్కండేయమహర్షి నియమ మొప్ప నాకుపదేశించెను. ఓజనార్దనా! నేను నీకింతకుమున్ను తెలియనియీ స్తవము నొసంగెదను. ఇయ్యది, స్వర్గప్రదమై యాయురారోగ్యముల నొసంగునదియై ధన్యము వేదసమ్మితమునైనయది. దీని దానవులుగాని, యక్షరాక్షసులుగాని, పిశాచ యాతుధాన గుహ్యకభుజగాదులుగాని విఘ్న మొనర్పఁజాలరు.” అని నాకయ్యుపమన్యుఁడు తెలిపెను. ఓధర్మజా! ఎవ్వాఁడు, బ్రహ్మచర్యము గలిగి జితేంద్రియుఁడై శుచియై భగ్నయోగుఁడుగాక యొకవత్సర మీ స్తవము పఠించునో, వాని కశ్వమేధఫలము లభించును.” అని

---

రుద్రస్య సన్నిధౌ. ౧౭౩. అబ్దమేకం చరేద్భక్తః ప్రాప్నుయాదీప్సితం ఫలం, ఏతద్రహస్యం పరమం బ్రహ్మణో హృది సంస్థితమ్. ౧౭౪. బ్రహ్మా ప్రోవాచ శక్రాయ శక్రః ప్రోవాచ మృత్యవే, మృత్యుః ప్రోవాచ రుద్రేభ్యో రుద్రేభ్యస్తండిమాగమత్. ౧౭౫. మహతా తపసా ప్రాప్తంతండినా బ్రహ్మసద్మని, తండిః ప్రోవాచశుక్రాయ గౌతమాయచ భార్గవః. ౧౭౬. వైవస్వతాయ మనవే గౌతమః ప్రాహమాధవ, నారాయణాయసాధ్యాయ మనురిష్టాయధీమతే. ౧౭౭. యమాయ ప్రాహ భగవాన్ సాధ్యో నారాయణోఽచ్యుతః, నాచికేతాయ భగవా నాహ వైవస్వతో యమః. ౧౭౮. మార్కండేయాయ వార్ష్ణేయ నాచికేతోఽభ్యభాషత, మార్కండేయాన్మయా ప్రాప్తో నియమేన జనార్దన. ౧౭౯. తవాప్యహ మమిత్రఘ్న స్తవం దద్మ్యాం హ్యవిశ్రుతం, స్వర్గ్య మారోగ్య మాయుష్యం ధన్యం వేదేన సంమితమ్. ౧౮౦. నాస్య విఘ్నం వికుర్వంతి దానవా యక్షరాక్షసాః, పిశాచా యాతుధానా వా గుహ్యకాభుజగా అపి. ౧౮౧. యః పఠేత శుచిః పార్థ బ్రహ్మచారీ జితేంద్రియః, అభగ్నయోగో వర్షంతు సోఽశ్వమేధఫలం లభేత్.

కృష్ణుఁడు యుధిష్ఠిరున కెఱిఁగించెనని తెలిపి వైశంపాయనుఁడు జనమేజయునకు మఱియు నిట్లనియె.

### శ్రీకృష్ణకృతశివమాహాత్మ్యవర్ణనము

ఓజనమేజయా! మహాయోగియగు శ్రీకృష్ణద్వైపాయనముని, ధర్మజు నుద్దేశించి, "ఓపుత్రకా! దీనిని నీవు పఠింపుము. అమ్మహేశ్వరుఁడు నీకుఁ బ్రియుఁడగును. ఓవత్సా! మఱియు నొకటి తెలిపెదను వినుము. మున్ను నేనొకపుడు మేరుపర్వతమునఁ దపముచేయుచుఁ బుత్రప్రాప్తిహేతుకముగా నీస్తవమును బరికీర్తించితిని. ఓపాండునందనా! దానివలన నాకభీప్సితములగు కోర్కులు సిద్ధించెను. అటులే నీవును నాశర్వుని యనుగ్రహమువలన సర్వకామములఁ బడయఁగలవు." అని తెలిపెను.

పిదప దేవసమ్మతుఁడును సాంఖ్యర్షియునగు కపిలుఁడు తా ననేకజన్మములందు భక్తిమిగుల భవు నారాధించితిననియు, నందుల కా భగవానుఁడు ప్రసన్నుఁడై తనకు సంసారాంతకరమగుజ్ఞానము నొసంగెననియుఁ దెలిపెను. అంతట, నింద్రమిత్రుఁడును, నాలంబగోత్రుఁడును, గరుణాళుఁడునగుచారుశీర్షుఁడనుముని తాను గోకర్ణక్షేత్రమున మున్నాభవుని నూఱువత్సరము లారాధించి, యాతని యనుగ్రహముచే, నయోనిజులును, దాంతులును, ధర్మజ్ఞులును, సువర్చసులు, నజరులును, దుఃఖరహితులునగు పుత్రుల నూర్వురఁ బడసితి నని తెలిపెను. పిమ్మట భగవానుఁడగు వాల్మీకియు, నయ్యుధిష్ఠిరునితో "ఓయీ! మున్నొకపుడు, వేదములకు విపరీతవాదము గలిగినపుడు, అగ్నిసహితులగుమునులు, నన్ను బ్రహ్మఘ్నుఁడనని పలుకఁగా, నేనా యధర్మమునకుఁ బాల్పడి, యపు డనఘుఁడు, నమోఘుఁడు నగున య్యీశానుని శరణమొంది యతనియనుగ్రహముచేఁ బాపవిముక్తుఁడ నైతిని. అంత నయ్యీశానుఁడు నాతో నీకు గొప్పయశమగుననియుఁ బలికెను" అని తెలిపెను. పిమ్మట జామదగ్న్యుఁ డయ్యుధిష్ఠిరు

౧౭-౨. ఇతి శ్రీమన్మహాభారతే అనుశాసనికపర్వణి శ్రీశివసహస్రనామస్తోత్రరత్నకథనం నామ సప్తదశోఽధ్యాయః.

శివసహస్రనామస్తోత్రరత్నం సమాప్తమ్.

నితో "ఓధర్మజ్ఞా ! నేను బితృవిప్రవధముచే నార్తుఁడనై తద్దోష మును బరిహరించుకొొన శుచినై యమ్మహాదేవుని శరణమొంది, యాతని, దివ్యనామములచే సన్నుతించుటయు నందుల కాభవుఁడు సంతుష్టుఁడై నాకు దివ్యాస్త్రములను బరశువును ననుగ్రహించె. మఱియు నీకుఁ బాపమును దొలఁగునుననియు నజేయుఁడ వగుదు వనియు, జరామరణవర్జితుఁడ వగుదువనియు, శివవిగ్రహుఁడును, శిఖండియు నగునాతఁడు పలికెను. ఆధీమంతునియనుగ్రహమువల ననే నా కవియెల్లఁ గలిగెను" అని యాసభామధ్యమున దివా కరునివలె వెలుఁగుచుఁ బలికెను. పిమ్మట విశ్వామిత్రుఁడును ధర్మజుఁ జూచి, "ఓయుధిష్ఠిరా! నేను దొలుత క్షత్రియుఁడ నై యుండి, బ్రాహ్మ ణుఁడను గావలయునని యమ్మహాదేవు నారాధించి, తదనుగ్రహముచే మహత్తరమై దుర్లభమగు బ్రాహ్మణ్య మొందితిని" అని తెలిపెను. పిమ్మట, దేవలుఁడు, ధర్మజునిఁ గాంచి. "ఓయీ నాకొకపుడు శక్రుని శాపముచే ధర్మము నశించుటయు నే నామహాదేవు నారాధింప నా కాతఁడు మరల, ధర్మమును, కీర్తిని, నాయువు నొసంగెను." అని తెలిపెను. అంతట, బృహస్పతిసమతేజుఁడై యింద్రమిత్రుఁడగు గృత్స మదుఁ డనుమహర్షి, ధర్మజునిఁ జూచి "ఓయీ! చాక్షుషమనుపుత్రుఁ డగు వరిష్ఠుఁడనుమహర్షి, యింద్రునివర్షసహస్రసత్ర యాగము జరుగు నపుడు, నేనొకరథంతరసామము నుచ్చరింపఁగా, నది సరిగా లేదనియు నపస్వరము విడిచి మఱియు సరిగా నుచ్చరింపుమనియుఁ బలికి, మఱియును, యజ్ఞమును జెఱుచుపాప మీవొందుదువనియుఁ బలుకుచు, మహాక్రోధుఁడై శంభుఁడు వినుచుండఁగాఁ బ్రజ్ఞారహితుఁ డవై దుఃఖమడర, నిత్యభీతుఁడవై వనమునఁ జరించుచుఁ బదు నొకొండువేలయొనిమిదివందలేండ్లు, గాలియు నీరును లేక మృగా దులును, యజ్ఞీయద్రుమములులేని సింహనిషేవితమగు దేశమునఁ గ్రూరమృగమవై మహాదుఃఖసమన్వితుఁడవై యుందువనిశపించునంతలో నేనొకమృగమనై, యాశంభుని శరణమొందఁగా, నమ్మహేశ్వరుఁడు, నాతో జరామరణవర్జితుఁడవై దుఃఖరహితుఁడ వగుదని నన్నుగ్ర హించుటయెగాక, నాకును నాయింద్రునకును సౌఖ్యము గల్గునట్లును, మాక్రతువు వర్ధిలునట్లును, బలికి మమ్మనుగ్రహించెను. ఇటులే యీ

భగవానుఁ డనుగ్రహములను జూపుచుండును. ఇతఁడు పరమొసంగు
వాఁడును, సుఖదుఃఖప్రదుఁడును, మనోవాక్కర్మముల కగోచరుఁడును
నైనవాఁడు. ఓయుధిష్ఠిరా! జ్ఞానముచే నాకు సరియగువాఁడు లేఁడు
సుమీ!'' అని తెలిపెను. పిమ్మట బుద్ధిమద్వరుఁడగు వాసుదేవుఁడు
మఱియు నయ్యుధిష్ఠిరునితో "ఓధర్మజా! మున్నొకపుడు సువర్ణాక్షుఁ
డగు మహాదేవుఁడు, నాతపమునకు మెచ్చి నాతో "కృష్ణా! లోక
మున, నర్థ మన్నిటికంటెఁ బ్రియతరమైనది గదా! అట్టి ధనముకంటెఁ
బ్రియమైనది యంతరాత్మ. అట్టి యంతరాత్మవై నాయనుగ్రహముచే
వెలయుదువని పలికి, మఱియు, రణరంగమునఁ బరాజయము గాకుండు
నట్లును, గడుతేజము గల్గునట్లును గరుణించి యింకను బెక్కువరము
లొసంగెను. మఱియు నాపూర్వజన్మమున మణిమంథమనుపర్వతమునఁ
బెక్కేండ్లు నాచే నాభగవానుఁ డారాధింపంబడి ప్రసన్నుఁ డై నాకభీ
ష్టమగు వరమును గోరుకొమ్మని పలికెను. అపు డేను సవినయముగా
నాతనికి మ్రొక్కి, "దేవా! నాపరమభక్తికిఁ బ్రీతుఁడవై తేని, నీయెడ
నెల్లకాలములందును నాకు స్థిరభక్తి గుదురుగాక. యని కోరుటయు,
నటులే యగునని పలికి యతఁ డందే యంతర్ధానముం దెను" అని
తెలిపెను. పిమ్మట, జైగీషుఁడు ధర్మజునిఁ గాంచి, "ఓయుధిష్ఠిరా!
మున్నొకపుడు వారాణసియందు, బలవత్తరమగు ప్రయత్నముచే నా
భగవానునివలన నాకష్టగుణమగు నైశ్వర్యము లబ్ధమయ్యెను" అని
తెలిపెను. పిదప గర్గుఁడు, యుధిష్ఠిరు నారసి "ఓయీ! సరస్వతీతీర
మున నాయొనర్చిన మనోయజ్ఞమునకుఁ బ్రసన్నుఁడై, యద్భుతమై
చతుష్షష్ట్యంగమునుగల కలాజ్ఞానము నామహాదేవుఁ డొసంగెను.
మఱియు నాకు సరియగు బ్రహ్మవాదులను వేవురుపుత్త్రుల నొసంగి,
పుత్త్రసహితుఁడ నగునాకు శతాయుతవత్సరము లాయువు ననుగ్ర
హించెను." అని తెలిపెను. అనంతరము పరాశరుఁడు, "ఓయుధిష్ఠిరా!
మున్నొకపుడు శంకరునిఁ బ్రసన్నుం గావించుకొని, మహాతపుఁడును,
మహాతేజుఁడును, మహాయోగియు, మహాయశుఁడును, గరుణాలుఁ
డును, బ్రహ్మణ్యుఁడును, సంపదావాసుఁడునగు నీవ్యాసుఁడు నాకుఁ
బుత్త్రుఁడుగాఁ బుట్టవలయునని మనసునఁ జింతించి యమ్మహేశ్వరుని
ధ్యానించుటయు, నతఁడు నామత మెఱిఁగి, ఓయీ! నీకు నాయెడఁ

కలిగిన యీసంభావనకు ఫలముగాఁ గృష్ణద్వైపాయనుఁడు జనించును. సావర్ణిమనుసర్గమున నతఁడు సప్తర్షి యగును మఱియు నతఁడు వేదవక్తయై కురువంశకరుఁడై జగద్ధితముగా, నితిహాసకర్తయు నగును. అమ్మహాముని మహేంద్రున కిష్టుఁడై యుండును. మఱియు నతఁడు జరామరణవర్జితుఁడై వెలయు ననిపలికి యందేయంతర్హితుఁడయ్యెను. ఓ యుధిష్ఠిరా! ఆశంభుఁడు, మహాయోగియు, వీర్యనిధియు, నక్షయుఁడు, నవ్యయుఁడునై వలయువాఁడు సుమీ!" అని తెలిపెను. పిమ్మట, మాండవ్యుఁడు, ధర్మజునితో "ఓయీ! నేనొకపుడు చోరుఁడను గాకయు నాయెడఁ జోరశంక గలుగుటను శూలమునఁ గొఱఁతవడి, యపు డందుండియే మహేశ్వరుని సన్నుతింపఁగా, నతఁడు ప్రసన్నుఁడై 'ఓమునీ! నీ వీశూలమునుండి విడువఁబడుదువు. అర్బుదవత్సరములు జీవింతువు. ఓవిప్రా! శూలకృతమగుపీడ నీకెన్నఁడును గలుగదు. మఱియు నాధివ్యాధివర్జితుఁడవై యుందువు. ఓమహర్షీ! నీశరీరము సత్యమునుండి సంభవించినదగుట నీవు నిరుపమానుఁడవగుదువు. నీజన్మము సఫలమొనర్చికొనుము. నీవు సకలతీర్థస్నానమును నిర్విఘ్నముగా నొందఁగలవు. మఱియు నీకక్షయమగు స్వర్గమును నేను గలిగించుచున్నాఁడను.' అని పలికి వరేణ్యుఁడును వృషవాహనుఁడునగు భగవానుఁడు, తనపరివారముతో నందే యంతర్హితుఁడయ్యెనని తెలిపెను. ఓజనమేజయా! పిమ్మట గాలవుఁడు యుధిష్ఠిరునారసి, "ఓయీ! నేను మున్ను విశ్వామిత్రు ననుజ్ఞవడసి నాతండ్రిని దర్శింపఁబోఁగా, నపుడు నాతల్లి నన్నుఁ గాంచి, దుఃఖితయై యెంతయు నేడ్చుచు, 'నాయనా! వేదవిభూషితుఁడవై గురుఁడగు విశ్వామిత్రు నాజ్ఞవడసివచ్చిన తరుణవయస్కుఁడవును దాంతుఁడవునగు నిన్ను నీ తండ్రి గనుఁగొనఁజాలఁడయ్యెనుగదా!' యని పలుకుటయు, నే నామాతమాట విని గురుదర్శననిరాశుఁడనై నియతచిత్తమున నమ్మహాదేవుని ధ్యానించితిని. అపు డమ్మహాదేవుఁడు నాతో 'ఓమునికుమారా! నీ తండ్రియు, నీతల్లియు, నీవును, మృత్యువివర్జితులగుదురు. వడిగా నింటికిఁబొమ్ము. నీతండ్రిని గనుఁగొనఁగలవు.' అని పలుకుటయు నే నమ్మహాత్ము ననుజ్ఞవడసి యింటికిఁ బోవునప్పటికి, యపుడే యిష్టి యొనర్చి వెడలిన నాతండ్రి నాకుఁ గానవచ్చెను. అతఁ

డప్పటి కుపస్పర్శన మొనర్చి యిధ్మములను గుశలను బట్టుకొని, స్వయముగాఁ బండిపడినఫలములను సరిగాఁ జేయుచునుండియు నన్నుం గాంచి వానినెల్ల విడిచి, కన్నీటిచే నేత్రములు కలుషితములుగా, నమస్కరించియున్న నన్నాలింగన మొనర్చి శిరము మూర్కొని, నాతో 'నాయనా! విద్యాభ్యాస మొనరించి యిందులకు వచ్చిన నిన్ను దైవానుగ్రహముచేఁ గాంచఁగలిగితిని" అని పలికెను.

ఓజనమేజయా! మహాత్ముఁడగు మహాదేవుని యద్భుతము లిట్టి వనేకములు మునివరు లెఱిఁగింప విని యుధిష్ఠిరుఁ డెంతయు విస్మయ మందెను. పిమ్మట మఱియు నవ్వాసుదేవుఁడు ధర్మనిధియగు యుధిష్ఠిరునితో ము న్నాయీశ్వరుఁ డింద్రునితో సంభాషించినవిధముగ సంభాషించువాఁడై యిట్లు పలికెను.

"ఓయీ! ధర్మజా! అయ్యుపమన్యుఁడు, ప్రజ్వలించు దివాకరుని వలె వెలయుచు, నాతో 'కృష్ణా! పాపకర్ములగుమానవు లెవ్వరు పాపదూషితులగుదురో, యట్టివారు, తమోరాజసవృత్తులై మహేశ్వరుని భజింపఁజాలరు. భావితభావనులగు విప్రులే యీశ్వరునిఁ బొందఁగలుగుచున్నారు. ఎవఁడు పలువిధములఁ బ్రవర్తించువాఁడయ్యుఁ బరమేశ్వరునకు భక్తుఁడై యుండునో, వాఁ డరణ్యవాసులై భావితాత్ములగు మునులకు సదృశుఁడై బ్రహ్మత్వమునుగాని, కేశవత్వమును గాని, సురలతోఁ గూడిన యింద్రత్వమునుగాని బొంది, యమ్మహాదేవు ననుగ్రహముచేఁ ద్రైలోక్యాధిపత్యమును వహింపఁగల్గుచున్నాఁడు. ఓనాయనా! మానవులు మనసుచేనైన నాశంకరునిఁ బొందుదురేని, వారు సకలపాపములనుండి విముక్తులై దేవతలతోఁగూడి నివసింపఁ గలరు. గృహతటాకాదులను భేదించియు, సకలజగమును జంపియు నైన విరూపాక్షుఁడగు మహాదేవుని యజించునేని, వానిని బాపలేశ మంటఁజాలదు. మఱియు సర్వలక్షణహీనుఁడయ్యు, సకల పాతక యుక్తుఁడయ్యు, శివునిఁ జిత్తమునం దిడినవాఁడు, తనపాపము నెల్లఁ దొలఁగించుకొనఁ గల్గుచున్నాఁడు. ఓకేశవా! మహాదేవుని శరణ మొందిన కీటపక్షిపతంగములకును, దిర్యక్కులకును, దేనినుండియు భయముగ లుగనేరదు. ఇటులే యెవ్వరు పుడమి మహాదేవభక్తులై

ప్రవర్తిల్లుదురో, వారు సంసారకష్టములకు లోనుగాక, సుఖితులగు దురని నానిశ్చయము. ” అని.

ఇటు లాయుపమన్యుని వచనములు తెలిపి మఱియు నవ్వాసు దేవుఁ డయ్యుధిష్ఠిరునితో “ఓధర్మజా! సూర్యచంద్రులును, నగ్నియు, వాయువు, భూమ్యాకాశములు, వసువులు, విశ్వేదేవతలు, ధాతయు, నర్యముఁడును, శుక్రబృహస్పతులును, రుద్రులును, సాధ్యులును, వరుణుఁడు, బ్రహ్మయు, శక్రుఁడును, మారుతుఁడును, బ్రహ్మము, సత్యము, వేదములు, యజ్ఞములు, దక్షిణలు, సోముఁడు, యష్టయు, హవ్యము, హవిస్సు, రక్షయు, దీక్షయు, నియమములు, స్వాహయు, వౌషట్టు, బ్రాహ్మణులు, సౌరభేయి, యుత్తమధర్మము, కాలచక్రము, బలము, యశము, దమము, స్థితియు, శుభాశుభములు, మునులును, మనోదర్శనములకగు నుత్తమబుద్ధియు, నుత్తమస్పర్శము, కర్మసిద్ధియు, దేవగణములు, ఊష్మపులు, సోమపులు, సుయామలోకములు, బ్రహ్మ కాయులగు తుషితులు, ఆభాసురులు, గంధపులు, దృష్టిపులు, వాచా విరుద్ధులు, మనోవిరుద్ధులు, శుద్ధులు, నిర్మాణరతులగు దేవతలు, స్పర్శా శనులు, దర్శపులు, ఆజ్యపులు, చింత్యద్యోతులు, దేవముఖ్యులు, మఱియుఁ గలదేవతలను, సువర్ణులు, గంధర్వులు, పిశాచులు, దాన వులు, యక్షులు, చారణులు, పన్నగులు, స్థూలసూక్ష్మములును, మృదు సూక్ష్మములును, సుఖదుఃఖములును, దుఃఖానంతరము సాంఖ్యయోగ ములును, బరాత్పరవస్తువును సకలమును శర్వునివలననే సంభవించె నని తెలియుము. ఉత్తములగు భూతకర్తలును, భువనరక్షకులగు సకలదేవతలును నమ్మహాదేవునుండి జనించినవే. పురాతనమగు నాదేవుని సృష్టియగు నీధరణి నావేశించి యెవ్వరు రక్షించుచుందురో యట్టి వారును నాతనివలనఁ గల్గినవారుగా నమ్ముము. అట్టి స్థిరతరమగు నీశ్వరతత్త్వమునకుఁ బ్రాణహేతుకముగా నమ్రుఁడ నగుచున్నాఁడను. అవ్యయుఁ డగునా ప్రభుఁడు సంస్తుతుఁడై మాకు సకలేప్సితములను సమకూర్చుఁగాక. ఈ స్తవరాజము నెవ్వఁడు నియతేంద్రియుఁడై శుచియై యొకనెల నిర్విఘ్నముగాఁ బఠించునో, వాఁ డశ్వమేధఫలము నందు చున్నాఁడు. బ్రాహ్మణుఁడు పఠించినచో నిఖిలవేదములను బడయు చున్నాఁడు. రాజు జయమందుచున్నాఁడు. వైశ్యుఁడు లాభమును,

శూద్రుఁ డుత్తమగతిని సుఖమును బడయుచున్నారు. సకలదోషాపహమును, బవిత్రమునునగు నీ స్తవరాజమును బఠించినచో శివునిపైఁ జిత్తము కుదురును. అట్టిమానవునిశరీరమున నెన్నిరోమకూపములు గలవో యన్నివేలవత్సరములు వాఁడు స్వర్గమున నివసించుచున్నాఁడు” అని శ్రీకృష్ణుఁడు తెలుపుటయు నయ్యుధిష్ఠిరుఁడు భీష్మునితో మఱియు నిట్లనియె.

## అష్టావక్రదిక్సంవాదము

“ఓ భరతసత్తమా! స్త్రీలకుఁ బాణిగ్రహణకాలమున సహధర్మమని యెయ్యది తెలుపఁబడుచున్నదో యది యెట్టిది? సహధర్మమని మహర్షులచే మున్నెయ్యది చెప్పఁబడెనో, యది యార్షమా? లేక ప్రాజాపత్యమా? కాక యాసురమా? ఇందు నాకెంతయు సందేహ మొదవెడిని. ఇది విరుద్ధమని నాయభిప్రాయము. ఈలోకమున సహధర్మమై మరణించినను నది విహితమగుచున్నది. అది యెట్లు? ఓపితామహా! మృతులగువారికి సహధర్మములచే స్వర్గమగు నందురుగదా! ముందొకఁడు మరణించునుగదా! వాఁ డెందుండును? మఱియు మానవులు నానాధర్మోపేతులై నానాకర్మనిరతులై నానావిధనరకవాసముల ననుభవించుచుండుదురు. స్త్రీ లనృతవాదినులని సూత్రకారుని యభిప్రాయము. స్త్రీ లెపు డనృతవాదినులో యపుడు సహధర్మ మెట్లు పొసఁగును? వేదములందును స్త్రీ లనృతవాదినులనియే తెలుపఁబడుచున్నారు. నేనెంతయు నాలోచింపఁగా నా కీధర్మము మిగుల గహనమై గానవచ్చుచున్నయది. కావున నోపితామహా! దీనిని శ్రుతిసమ్మతముగాఁ దెలిపి నాసందేహమును నివర్తింపఁజేయుము. దీనిస్వరూప మెట్టిదో, యిది యెట్లు ప్రవర్తిల్లుచున్నదో యనువిషయ మెల్ల నీవు నా కెఱిఁగింపఁదగుదువు.” అని ప్రశ్నించెను.

అది విని భీష్ముఁడు యుధిష్ఠిరుం జూచి, “ఓయీ! పురాతనమగు నొకయితిహాసము గలదు. అయ్యది దిక్కులకును నష్టావక్రునకును జరిగినసంవాదము. మున్ను మహాతపుఁడగు నష్టావక్రుఁడు భోగాభిలాషియై మహర్షియగు వదాన్యుఁడనువానిని దన కొకకన్నియ నిమ్మని గోరును. అది రూపముచే నిరుపమానయై గుణప్రభావశీలచారిత్ర

ములచే నెన్నఁదగి సుప్రభ యనుపేరున వెలయుచుండెను. అయ్యది తనదర్శనమాత్రమున నాతనిమానసము నాకర్షించెను. వసంతమునఁ గుసుమాలంకృతమగు వనవీథివలె నున్నయక్కన్నియ నయ్యష్టావక్రుఁడు గాంచి యటులు తనకిమ్మని కోరఁగా నావదాన్యుఁడు 'ఓమునీంద్రా! నాకన్నియ నీకొసంగఁదగినదియే. కాని యొకటి తెలిపెదను వినుము. పవిత్రమగు నుత్తరదెసకుఁ బొమ్ము. అందు నీకొకటి గానవచ్చును.' అని తెలిపెను. అంత నయ్యష్టావక్రుఁడు 'ఓవదాన్యా! అందు నేనేమి చూడవలయునో తెలుపుము. నీవు తెలిపినట్టులు నేనొనర్పవలసియున్నదిగదా!' అని ప్రశ్నించుటయు నావదాన్యుఁడు 'ధనదునిదగు హిమవత్పర్వతము నతిక్రమించి, పిదప సిద్ధచారణసేవితమగు కైలాసమును గాంచుము. అయ్యది వివిధాకారులై హర్షమడర నృత్తమొనర్చుపారిషదులును, దివ్యాంగరాగలిప్తాంగులై నానావిధరూపులగు పైశాచులును, బాణితాలములచేతను, సుతాళ, శంపాతాళ, సమతాళములచేతను, శర్వుని నలువంకల సేవింప, నామహాదేవున కెంతయు నిష్టమగుస్థానమై దివ్యమైనదని వినుచున్నారము. అందు మహాదేవుఁడును బారిషదులును నిత్యమును సన్నిహితులై యుండుదురు. అందే శంకరునకై పార్వతీదేవి దుర్ఘటమగు తపమొనర్చెను కావున నే యాప్రదేశ మాదేవునకును దేవికిని నిష్టమైనదని వినికి. ఆదేవుని యుత్తరపార్శ్వమున ఋతువులును గాలరాత్రి దేవతలును, మానవులును నాతని సేవించుచుండుదురు. ఆభవనమును నీవతిక్రమించి వెళ్లవలయును. పిమ్మట మేఘతుల్యమగు నల్లనివనప్రదేశ మొకటి నీకుఁ గానవచ్చును. అచ్చట మనోహరాకారయై రమణీయయగు నొకకాంత నీకుఁ గానవచ్చెడిని. తపస్వినియు, మహాభాగయు, వృద్ధయు, దీక్షానిష్ఠయు నగు నామె నీచేఁ బ్రయత్నపూర్వకముగా సేవింపఁదగినది. నీ వామెను గాంచి మరలుము. పిదప నీమె నీహస్తమును గ్రహింపఁగలదు. ఈ నాచెప్పినచొప్పు దప్పక నీ వాచరింపవలయును. ఇఁక నీవందులకుఁ బొమ్ము' అని తెలిపెను.

అంత నయ్యష్టావక్రుఁడు, 'ఓవదాన్యా! నీవుచెప్పిన విధముగా, నేనందులకేఁగి తప్పక యాకార్యమును సాధించెదను. నీవు సత్యవచనుఁడవగుము.' అని ప్రత్యుత్తరమిచ్చెను.

ఓయుధిష్ఠిరా! పిమ్మట నమ్మునివరుఁ డుత్తమమగు నుత్తరదిశకు వెడలి సిద్ధచారణసేవితమై గిరిశ్రేష్ఠమగు హిమవంతమునకుఁ బోయి, పిమ్మట ధర్మనిధానమై పవిత్రమగుబాహుదానదిని జేరి, నిర్మలమగు తత్తీర్థమున స్నానమొనర్చి దేవతాతర్పణము చేసి, యందుఁ గుశశయనమున సుఖముగా నుండెను. అంత నతఁ డారాత్రి గడచుటయుఁ బ్రభాతమున లేచి స్నానము చేసి యగ్నిని బ్రాదుర్భవింపఁజేసి ప్రధానముగా నాయగ్నిని సంస్తుతించి, రుద్రాణీకూపమును జేరి, యందు విశ్రమించి, పిదపఁ గైలాసమును జేరువాఁడై వెడలెను. అం దతనికి విలాసభాసురమగు నొకసువర్ణమయద్వారమును, గంగానదియు మహాత్ముఁడగుధనదునినళినియుఁ గానవచ్చెను. పిమ్మటఁ బద్మినీరక్షకులగు రాక్షసులు కొందఱగు మాణిభద్రప్రభృతు లాయష్టావక్రున కెదు రేఁగుటయు, నాతఁడు వారి నాదరపురస్సరముగా గౌరవించెను. అటులా భీమవిక్రములగురాక్షసుల నాదరించి తన్ను వడిగా నాధనదునకు నివేదింపుడని పలికెను. అంత నారాక్షసులు మునివరునితో 'ఓ మహాత్మా! ఇదె యాకుబేరుఁ డిందులకుఁ దనంతఁ దా నిన్ను దర్శింప వచ్చుచున్నాఁడు. ఈ నీ యాగమనకార్యము మాభగవానునకుఁ దెలిసెను. అదె తేజఃప్రజ్వలితుఁడై యరుదెంచు నాభగవానుని గనుఁగొనుము.' అని తెలిపిరి. అంత నాకుబేరుఁ డందులకు వచ్చి, యాయనిందితుఁడగు నష్టావక్రుని, విధ్యుక్తముగాఁ గుశలప్రశ్న మొనర్చి యాబ్రహ్మర్షితో, 'ఓమహానీయా! నీవు సుఖముగా వచ్చితివా? నీకు నావలనఁ గావలసినదేమి? నీవేమి దెలుపుదువో యదియెల్ల గావించువాఁడను. ఓద్విజోత్తమా! నీవు నీయిచ్ఛవచ్చిన విధమున నాభవనమును బ్రవేశింపవచ్చును. మఱియు నీవు నిర్విఘ్నముగా సత్కృతుఁడవై నీకార్య మొనర్చికొని పోవచ్చును.' అని పలికి యా యక్షేశుఁ డాద్విజవర్యునిఁ దీసికొని నిజభవనమును బ్రవేశించి, మఱియు నాతని కాసనమును నర్ఘ్యపాద్యములను సమర్పించెను. పిమ్మట నాయష్టావక్రకుబేరులిరువురు నాసనములపైఁ గూర్చుండ, మాణిభద్రప్రభృతులగు కుబేరభటులగు యక్షగంధర్వకిన్నరులును నుచితాసనములపైఁ గూరుచుండిరి. అటులు వారెల్లరును గూరుచుండు నంతఁ గుబేరుఁ డమ్మునివర్యు నారసి, 'ఓమహానుభావా! నీసెలవయి

నచో నప్సరోగణములు నాట్యమొనర్తురు. నీకిపుడు పరమాతిథ్యమొనర్పవలసియున్నది. శుశ్రూష గావింపవలసియున్నది.' అని పలికెను. అది విని యమ్ముని మధురముగా నటులే యొనర్పుమని తెలిపెను. పిమ్మట నూర్వశియు, రంభయు, సుర్వరయు, మిశ్రకేశియు, నలంబుస, ఘృతాచి, మిత్ర, చిత్రాంగద, రుచి, మనోహర, సుకేశి, సుముఖి, హాసిని, ప్రభ, విద్యుత, ప్రశమి, దాంత, విద్యోత, రతి, మఱియుఁ గల కొందఱప్సరసలును, నృత్తము సేయనారంభించిరి. గంధర్వులు పలువిధములగు వాద్యముల మ్రోయించిరి. అటులా దివ్యగాంధర్వ మారంభమగుటయు నయ్యష్టావక్రుఁడు చూచుచుండెను. అటులమ్మహర్షి యం దొకదివ్యసంవత్సరము సుఖముగాఁ గడపెను. పిమ్మట నాయక్షరాజ యష్టావక్రునితో 'ఓవిప్రోత్తమా! నీవిటులు చూచుచుండఁగా నొకవత్సరము గడచెను. ఓబ్రాహ్మణోత్తమా! ఈ గాంధర్వవిషయ మెంతయు మనోహరమైనది. నీవన్నటులు స్వేచ్ఛగా నిది ప్రవర్తిల్లుఁ గాక. అతిథివగు నీవు మాకుఁ బూజనీయుఁడవు. ఇది నీగృహ మనుకొమ్ము. నీకుఁ గావలసిన దెల్ల సెలవొసంగుము. మేము నీకధీనులము.' అని పలుకుటయు, నా వైశ్రవణు నెడ నెంతయుఁ బ్రీతుఁడై యమ్ముని, యక్కుబేరునితో నిట్లు పలికెను.

'ఓయక్షాధీశా! నీవు మమ్ము విధ్యుక్తముగాఁ బూజించితివి. ఇఁక మేము పోవుదుము, నీసపర్యల కెంతయు సంతసమందితిమి. నీ యనుగ్రహమువలనను మహాత్ముఁడగుమహర్షి నియోగమువలనను నా వెడలవలసినచోటు కేఁగవలయును. వృద్ధియు, బుద్ధియుఁ గల్గి ప్రవర్తిల్లుము' అని.

పిదప నటులు పల్కి యమ్ముని యుత్తరాభిముఖముగా వెడలి కైలాసము, మందరము, హైమము మున్నగుమహాశైలములను గడచి, యుత్తమస్థానమగు కైరాతమునకు నమ్రుఁడై ప్రదక్షిణము గావించి, మఱియు నుత్తరాభిముఖుఁడై యెంతయు సంతసమడర సమభూమి భాగమున వెడలి, పిమ్మట నొకరమణీయమగు వనప్రదేశమును గాంచెను. సకలఋతుధర్మములతోడను ఫలమూలములతోడను బక్షులతోడను గూడిన మనోజ్ఞములగు వనప్రదేశములచే నందం దలంకరింపఁబడిన యొకయాశ్రమపద మాయష్టావక్రునకుఁ గాన

వచ్చెను. అంత నమ్మునివర్యుఁడు పర్వతములను బుష్కరిణులను, మఱియు మనోజ్ఞములగు పెక్కుప్రదేశవిశేషములను గనుఁగొనుచు, భావితాత్ముఁడగు నమ్మహర్షి మహానందమొందెను. అనంతర మంద్రో కచో సర్వరత్నమయమై దివ్యకాంచనాలంకృతమై యద్భుతమైన యొక గృహరాజ మాతనికిఁ గానవచ్చెను. అయ్యది కుబేరునిది. అందు వివిధములై గొప్పవగు మణికాంచనపర్వతములును, రమ్యములగు విమానములును, వివిధములగురత్నములును, మందారపుష్పసంకీర్ణమగు మందాకినీనదియు, స్వయంప్రభగలమణులును, వజ్రభూషితములగు ప్రదేశములును, విచిత్రమణితోరణములుగల నానావిధభవనములును, మఱియు ముక్తాజాలవిభూషితములై మణిరత్నవిభూషితములై మనో దృష్టిహారములై సర్వసంపత్సమృద్ధములైన గృహవిశేషములును నందుఁ గానవచ్చెను. ఆయాశ్రమము మహర్షులచే నావృతమై మనోహరమై యుండెను. అంత నమ్మహర్షి కచ్చోచ్చె నెందు నివసింపవలయునో యను చింత యొదవెను. అంత నమ్మహర్షి యాభవనద్వారము చేరువకుఁ జేరి యచ్చో నిలువఁబడి 'ఓయీ! ఈభవనమున నెవ్వరున్నారో వారు నన్నిందులకు వచ్చినయతిథిగా నెఱుంగుదురుగాక' అని బిగ్గరగాఁ బలికెను. అనంతర మాగృహాంతరమునుండి, నానారూపములును, మనోహరా కారలునునగు నేడ్వురుకన్నియలు సపరివారలై వెడలివచ్చిరి. వారిలో నాతనికిఁ గానవచ్చినకన్నియలందఱును జిత్తము నాకర్షించువారై యుండిరి. అతఁడు వారినుండి తనచిత్తమును నివారింప శక్తుఁడుగా కుండెను. కాని ధీమంతుఁడగు నవ్విప్రునకుఁ గొంతవడి కించుక ధైర్య మొదవెను. పిమ్మట నమ్మహర్షిని లోనికిరమ్మని యక్కన్నియలు నుడివిరి. అంత నతఁడు కౌతూహలావిష్టుఁడై సురూపలగు నక్కన్నియల యాభవనమును బ్రవేశించి, యందు వృద్ధయు, శ్వేతవస్త్రధారిణియు, ముదుసలిలక్షణములుగలదియుఁ, బర్యంకసమాసీనయు, సర్వాభరణభూషితయు నగునొకయుత్తమాంగనను దిలకించెను. పిమ్మట నతఁడు 'స్వస్తి' యని పలుకుటయు, నామె లేచి యామునీంద్రున కాసనమొసంగి యందుఁ గూర్చుండుమని బదులు పలికెను. అంత నయ్యష్టావక్రుఁడు వారితో, 'మీరెల్లరును మీమీయాలయములకుఁ బొండు ఈమెయొక్కతియ యిక్కడ నుండుఁగాక. ఈమె

ప్రజ్ఞాతయుఁ బ్రశాంతయు నగుట నీమె యుండవచ్చును. తక్కిన మీరెల్లరును వెడలిపొండు.' అని పలికెను. అంత నక్కన్నియలందఱును నమ్మహర్షికిఁ బ్రదక్షిణనమస్కారములొనర్చి యచ్చోటు విడిచి పోయిరి. అందొక యావృద్ధాంగనయే నిలిచియుండెను. పిదప నతఁడు భాసురమగు శయనమునఁ బరుండి యామెతో 'ఓసుచరిత్రా! నీవును నిద్రింపుము. రాత్రి గడచుచున్నది గాదే?' యని పలుకుటయు, నామెయు మహాప్రభగల వేఱొకదివ్యశయనమునఁ బరుండియుండి కొంతవడికి, మేనువడంకఁ, జలి యని యొకమిషవెట్టి యమ్మహర్షిశయనము నెక్కెను. భగవానుఁడగు నమ్మహర్షి యామెకు స్వాగతమొసంగి సంభాషించెను. పిమ్మట నవ్వృద్ధాంగన యమ్మునివరునిఁ దనభుజములచే సప్రియముగాఁ గౌఁగిలించికొని, కాష్ఠకుడ్యతుల్యుఁడై నిర్వికారుఁడై యున్న యాతనిఁ గాంచి దుఃఖితయై 'ఓబ్రాహ్మణోత్తమా! స్త్రీలకుఁ బురుషసంసర్గమున, ధైర్యము, కామమును విడిచి యుండదు. అపుడు వారికి నిజధైర్యమే నిలువదు. నేను గామమోహితనై నిన్నుఁ జేరితిని. నన్ను భజింపుము. ఓవిప్రవర్యా! ప్రహృష్టుఁడవగుము. నాతో సంగమింపుము. నేను నీయెడ నెంతయుఁ గామము గలిగియున్నదానను. నన్నుఁ గౌఁగిలించికొనుము. ఓధర్మాత్మా! ఇది నీతపఃఫలముగాఁ బూజింపఁబడుచున్నది. నిన్నుఁ జేరిన నన్నుఁ గలియుము. మఱియు నాకుఁగల యీధనమునకంతకును, నాకును నెల్లవిధముల నీవు ప్రభుఁడవు గావచ్చును. ఇందులకు సందియములేదు. నీయెల్లకోర్కెల సమకూర్చుదానను. నన్నుఁగూడి రమింపుము. సర్వకామఫలప్రదమగు నీవనప్రదేశ మతిరమణీయమైయున్నది. నీవు నాతోఁ గ్రీడింతువేని నీకు నే నధీన నగుచున్నదానను. మానుషములును దివ్యములునగు నేయేకామములు గలవో వానినెల్ల మన మనుభవింతము. స్త్రీలకుఁ బురుషసంసర్గమును మించిన వేఱొకఫల మెకపుడును గలుగదుగదా! అదియే మాకు గొప్పఫలము. మన్మథచోదితలగుకాంత లిష్టమువచ్చినచొప్పునఁ బ్రవర్తించుచుందురు. అట్టిపనికై పోవుచు వారు, కాలిన యిసుకనేలపై నడువవలసివచ్చినను జాలుకు నని తలంపరు' అని పలికెను.

అది విని యష్టావక్రుఁడు 'ఓసుశీలా! నేను బరదారలతోఁ బోవువాఁడను గాను. ధర్మశాస్త్రజ్ఞులచేఁ బరదారాభిమర్శనము దూషింపఁబడినది గాదే? నేను నిజముగా భోగకామముగలవాఁడనే. కాని విషయముల నెఱిఁగినవాఁడనుగాను. సంతతి ధర్మార్థముగదా! ఇటులేనిఁ బుత్రులచే నుత్తమలోకములను బొందఁగలను. సందియము లేదు. ఓసుచరిత్రా! ధర్మమును దెలిసికొనుము. అటులు తెలిసి భోగింపుము' అని ప్రత్యుత్తరమిచ్చెను.

అంత నవ్వృద్ధకాంత యమ్మునితో 'ఓయీ! అనిలుఁడు, అగ్నియు, వరుణుఁడు, మఱియుఁ గలదేవతలును, స్త్రీలకుఁ గాముసట్టి ప్రియ మొనర్పఁజాలరుగారు. కాంతలు రతిప్రియలు. స్త్రీలలో వేల కొక్కతెయో, లక్షలకొక్కతెయో పతివ్రత యుండును. వారు కుల మునుగాని, తండ్రినిగాని, తల్లినిగాని పరిగణింపరు. అటులే భ్రాతలను గాని, భర్తనుగాని, పుత్రులనుగాని, మఱందులనుగాని లక్ష్యపెట్టరు. నదులొడ్లను జెఱుచునట్లు కాంతలు సవిలాసముగాఁ జరించుచుఁ, గులమును బాడుచేయుదురు. ఈదోషములన్నియుఁ దలంచియే, వెనుకఁ జెప్పఁబడినవిధమును బ్రజాపతి పలికెను.'

ఓయుధిష్ఠిరా! అది విని యమ్మహర్షి యేకాగ్రచిత్తుఁడై యా వృద్ధాంగనతో 'ఓభద్రా! నీవిఁక నుండుము. నీయిచ్చవచ్చినకార్య మేమియో తెలుపుము." అని పలుకుటయు, నామె యాతనితో 'ఓ భగవానుఁడా! దేశకాలములనుబట్టి స్పర్శసుఖ మెఱుంగఁగలవు. ఓమహాభాగా! నీవిందుండుము. కృతకృత్యుఁడవగుదువు.' అని తెలి పెను. అంత నాబ్రహ్మర్షి యటులేగావచ్చును. నీయుత్సాహ మున్నంత వఱకు నే నిందుండువాఁడను. ఇందులకు సందియములేదు' అని పలికి జరార్దితయైన యక్కాంతను గాంచి యతఁ డెంతయుఁ జింతిలి సంతప్తుఁ డయ్యెను. అటులు కొంతవడిఁ జింతించి యతఁ డామె యవయవముల నెల్ల నరయఁగా నందొక్కదానిపై నేని యాతనిదృష్టి నిలువక తద్రూ పమునెడ నాతనికి విరక్తి గలుగుటయు నపు డతఁడు 'అహో! ఈమె యాగృహదేవత గాఁబోలు? శాపమునుండి యిట్టిరూపము గలిగియుండ నోపు. త్వరపడి నేను దీనికిఁ గారణము తెలిసికొనుట యుక్తము గాదు.' అని యావిషయమును దెలియఁగోరి చింతించుచు వ్యాకుల

మనస్కుఁడై యుండునంతనే యారాత్రి శేషము గడచెను. పిమ్మట నయ్యంగన యాతనితో 'ఓమహానీయా ! అదె రవిరూపమును గాంచితే? సంధ్యాభ్ర సంర క్తమై గానవచ్చెడిని. ఏమి కావలెనో తెలుపుము.' అని పలికెను. అంత నతఁడామెతో 'ఓసుచరిత్రా! స్నానోదకము దెప్పింపుము. స్నానమొనర్చి నియతేంద్రియుఁడనై వాఙ్నియమముగల్గి సంధ్యోపాసన మొనర్చెదను.'అని పలికె''నని తెలిపి మఱియు భీష్ముఁ డిట్లనియె.

## అష్టావక్రవృద్ధాసంవాదము

"ఓయుధిష్ఠిరా ! అయ్యష్టావక్రుని వచన మాలించి యకాంత యాతనితో 'ఓయీ ! నీవన్నటులు తప్పక యొనర్చెదను' అని పలికి దివ్యమగుతైలమును, స్నానశాటిని దెప్పించి మఱియు నాతని యనుజ్ఞ వడసి యాసుగంధతైలముచే నాతని యవయవములనెల్లఁ బూసి నలుగువెట్టి మెల్లఁగా స్నానశాలకుఁ దీసికొనిపోయెను. అపు డమ్మహర్షి యందొకక్రొత్తదగు నాసనముపై గూర్చుండుటయు, నామె సుఖహస్తస్పర్శము గలుగునట్లుగా మెల్లఁగా స్నానముచేయించెను. అపు డామె యామహర్షికి దివ్యమగునుపచారము విధ్యుక్తముగా నొనర్చి, సుసుఖోష్ణమగు నిజహస్తముఖముచే నాతనికి సుఖస్పర్శము గలిగించెను. మహావ్రతుఁ డగునతఁడు గడచినరాత్రి యెల్లఁ దెలియకుండెను. పిమ్మట నమ్ముని పరమవిస్మయావిష్టుఁడై లేచి యపుడే యుదయించుచున్న సూర్యునిఁ దూర్పుదెసను జూచెను. అపు డాతని కదియెల్ల మోహమా ! లేక నిజమా! యనుబుద్ధి వొడముటయు, నాసహస్రాంశు నారాధించి 'యిఁక నేనేమి చేయవలయునో తెలుపు' మని యామెను బ్రశ్నించెను. అంత నామె యమృతరసతుల్యమగు నన్నము నమ్మునివరుని కర్పించుటయు, నయ్యన్న మెంతయు రుచిగల దగుటచేఁ జాలునని పలుకకుండెను. అంత నతఁ డాయహశ్శేషమును గడపుటయు మరల సంధ్యయు సంభవించెను. పిదప నకాంతమిని యమ్మునివరు నిద్రింపుమని ప్రేరించెను. అంత, వారిరువురకును వేఱు వేఱుగా శయనములు కల్పింపఁబడియెను. అపుడు వారిద్దఱును వేఱు వేఱుగా శయనించిరి. పిమ్మట నర్ధరాత్రమగుటయు, మఱియు నయ్యంగన యాతని శయనమును సమీపించెను. అపు డాయష్టావక్రుఁ

డామెను గాంచి 'ఓభద్రా! పరస్త్రీలయందు నాచిత్తము సక్తము గాదు, కావున నీక లెమ్ము. నీకు భద్రమగుఁగాక, నీయంతన నీవ మరలుము' అని పలికెను.

ఓయుధిష్ఠిరా! అటు లావిప్రుఁడు నివారించుటయు నక్కాంత, యమ్మునితో 'ఓయీ! నేను స్వతంత్రను. నీకు ధర్మచ్ఛల మిందేమియు లేదు' అని పలికెను.

అష్టా:—ఓసీ! స్త్రీలకు స్వాతంత్ర్య మెందును లేదు. కాంత లస్వతంత్రలు సుమీ! స్త్రీకి స్వాతంత్ర్యము లేదని పరమేష్ఠిమతము.

స్త్రీ:—ఓవిప్రోత్తమా! మైథునేచ్ఛ నన్ను బాధించెడిని. నా భక్తి నరయుము. ఓయీ! నీవిపుడు నన్నుఁ బరిగ్రహింపవేని యధర్మము నొందుదువు.

అష్టా:—యథేచ్ఛగాఁ బ్రవర్తిల్లుమానవుని దోషములు నశింపఁ జేయుచున్నవి. నేనెల్లపుడును ధైర్యముచే సమర్థుఁడ నగుచున్నాఁడను. కావున నీవు నీశయనమునకుఁ బొమ్ము.

స్త్రీ:—ఓవిప్రోత్తమా! నేనిదె నీకు నమస్కరించుచున్న దానను. నన్ననుగ్రహింపఁ దగుదువు. ఇటులు పుడమిఁబడి దొరలుచున్న నాకీవు శరణము గమ్ము. నీకుఁ బరదారసంగమము దోషహేతువని తలంపేని, యిదె నిన్ను ముట్టుకొనుచున్నాను, నాపాణిని బరిగ్రహింపుము. అటులేని నీకు దోషము గలుగదని ప్రమాణముచేసి చెప్పఁ గలను. నేను నిన్ను బెండ్లాడుటకు స్వతంత్రను గాకపోను .ఏది ధర్మమో యది నాయందు నీకయ్యెడిని. మఱియు నేను నీయందే చిత్తముంచితిని. స్వతంత్రను కావున నన్నంగీకరింపుము.

అష్టా—ఓభద్రా! నీవు స్వతంత్ర వెట్టులగుదువో నిమిత్త మెఱిఁగింపుము. మూఁడులోకములం దెవ్వతెకును స్వాతంత్ర్యము లేదే! ఆఁడుదానిని, గౌమారమునఁ దండ్రియు, యౌవనమున భర్తయు, వార్ధకమునఁ బుత్రులును రక్షించుచుండుదురు. కాని యేకాలమందును గాంతకు స్వాతంత్ర్యముండరాదు.

స్త్రీ:—ఓమునివర్యా! నాకౌమారము బ్రహ్మచర్యమే. నేను గన్నియను, సంశయములేదు. కావున నన్నుఁ బత్నిగాఁ బరిగ్రహింపుము, నాశ్రద్ధకు భంగ మొదవింపకుము.

అష్టా—ఈసంగమ శ్రద్ధ నీకెట్టిదియో నాకును నట్టిదియే. ఆవదాన్యమహర్షి యొనర్చినపరీక్ష విఘ్నకారి యయ్యెను. సత్య మెట్టిదో! ఇది యెంతయు నా కాశ్చర్యముగా నగపడుచున్నది. ఇందు శ్రేయ మెట్టిదో తెలియకున్నది' అని పల్కి మఱియు నతఁ డిట్లు చింతించెను.

'ఆహా! ఇక్కన్య దివ్యాభరణభూషితయై యిపు డిట్లు నన్ను సమీపించియున్నది. ఈమె యీపరమరూపము మున్ను జీర్ణమై గాన వచ్చెనే! ఇపు డిట్లు కన్యారూపమునఁ గానవచ్చుచున్నది. ఇందుల కిఁకఁ గర్తవ్య మేమైయుండునో! శాశక్తియున్నంతకును దీనిని బరి గ్రహింపను. ధర్మాతిక్రమముచేయుట తగదుగదా! కావున దీనిని భార్యనుగాఁ బరిగ్రహించెదను' అని తలంచె"నని తెలుప విని యుధి ష్ఠిరుఁ డిట్లనియె.

## అష్టావక్ర స్త్రీసంవాదము

"ఓపితామహా! పరమతేజుఁడగు నయ్యష్టావక్రునికడ, నాయం గన జడియకుండెనేమి? అతఁడు శపింప కూరకుండుటకు హేతువెద్ది? నాకది యెఱిఁగింపుము."

అది విని భీష్ముఁడు "ఓయుధిష్ఠిరా! అపు డయ్యష్టావక్రుఁ డమ్ము ద్దియం గాంచి 'ఓభద్రా! నీ వీరూప మెట్లు మార్చికొనఁగల్గితివి? బ్రాహ్మణుఁడనగు నేను గోరుచున్నవాఁడ నగుట నన్నృతమాడక తెలు పుము.' అని ప్రశ్నించెను. అంత నయ్యువిద యమ్మునివరు నారసి 'ఓమునీ! భూమ్యాకాశములం దెందున్న స్త్రీపురుషులకును బరస్పరాభి లాష గలిగియే యుండును. ఓసత్యవిక్రమా! నీవు జాగరూకుఁడవై నా తెలుపునదంతయు వినుము. నీస్థిరచిత్తముఁ దెలియుటకై యిట్లు పరీక్షించితిని. ఇందులకు నీవించుకేనిఁ జలింపమి నీచే నుత్తమ లోకములన్నియు జయింపఁబడినవి. నే నుత్తరదిశనని తెలియుము. నీస్త్రీచాపలము తెలియఁబడినది. ముదుసలికాంతలకును మైథునజ్వరము పీడగలిగించెడిని. నీయెడఁ బరమేష్ఠియు, నింద్రాదిదేవతలును సంతుష్టు లైరి. భగవానుఁడవగు నీవేమిపనిపై వచ్చితివో తెలిసినది. నీవాక కన్నియను గోరుటయు నాపె తండ్రి నిన్నిందులకుఁ బంపెనుగాదే? నీకు సదుపదేశ మొనర్చుటకై నేనీపనియెల్లఁ జేసితిని. కావున నీఁక

నీవు కుశలముగా నింటికిఁ బొమ్ము. నీ కీశ్రావనడుము శ్రమము కాకుండెడిని. నీ కాకన్నియ లభించును. అది పుత్రవతియు నగును. నీవు నన్ను భోగేచ్ఛచేఁ బ్రశ్నించితివి. దాని కుత్తర మొసంగితిని. ఆభోగవాంఛ మూఁడులోకముల వారికిని నతిక్రమింపరానిదిసుమీ! నీవికఁ బొమ్ము. మంచిపని చేసితివి. ఇంక నావలన నేమి వినఁగోరెదు! ఓవిప్రర్షి! యథార్థముగాఁ దెలిపెదను. ఓద్విజోత్తమా! నీనిమిత్తముగా మహర్షి యనుగ్రహమునకుఁ బాత్రమైతిని. ఆ వదాన్యమునివర్యుని సమ్మానించుటకై నీయెడ నిట్టిప్రసంగ మొనర్చితిని.' అని తెలిపెను.

ఓయుధిష్ఠిరా! అపుడా మెపలుకు లాలించి యవ్విప్రుఁడు ప్రాంజలియై నిలువఁబడి, యామె సెలవుపడసి నిజావాసమునకు మరలి యిల్లుచేరి స్వజనమును బ్రశ్నించి పిదప వెనుకటి మహర్షిని సమీపింపఁ బోయెను. అంత నవ్విప్రుఁ డమ్మహర్షిని తానియోగించినపని జరిగిన విధము ప్రశ్నించెను. అందుల కయ్యష్టావక్రుఁడు సంతసిలి యావదాన్యునితో 'ఓమునివర్యా! నీయానతి శిరసావహించి గంధమాదనమునకు వెడలిపోయి, దాని కుత్తరముగా నొకచో మహత్తరమగు దైవతమును గాంచితిని. ఆమె నిన్నుఁ గీర్తించి నాకు సెలవొసంగెను. నే నామెవచన మాలించి నీయింటికి వచ్చితిని' అని తెలిపెను. అంత నావదాన్యుఁ డష్టావక్రునితో 'ఓమునివర్యా! నీవు నాపుత్రికను బరిగ్రహింపుము. పరమపాత్రుఁడవగు నీవు నక్షత్రతిథియోగముచే నా కన్నియకు తగుదువు.' అని తెలిపెను. ఓధర్మజా! అదివిని యాయష్టావక్రుఁ డందుల కంగీకరించి, యాకన్నియను బరిగ్రహించి పరమధర్మాత్ముఁడై యెంతయు సంతసమందెను. అటు లామెను భార్యనుగాఁ బరిగ్రహించి పరమశోభనమగు నామెతో నిజాశ్రమమున నిర్విచారుఁడై పరమానందముగా నివసించెను." అని తెలుపుటయు ధర్మజుఁడు మఱియు ని ట్లనియె.

బహుప్రశ్నములు

"ఓపితామహా! సనాతనులగు విప్రు లెట్టివానిని బాత్రునిఁగాఁ దెలుపుదురు? బ్రహ్మవేత్తయగు బ్రహ్మచారియు సన్న్యాసియునా? లేక తదితరుఁడా? పాత్రుఁడు?"

భీష్ముఁడు:—ఓమహారాజా! బ్రహ్మచారి సన్న్యాసులలో నెవరుగాని తదితరులుగాని, నిజవృత్తిపరులై యుందురేని వారు దానపాత్రులని చెప్పఁబడుదురు. అట్టివారు తపస్వులు.

యుధిష్ఠి:—పితామహా! మిక్కిలి శ్రద్ధతో హవ్యకవ్యములుగాని, లేక యేదేనొకదానముగాని బ్రాహ్మణునకుఁ జేయువాఁడపవిత్రుఁడైనపుడు వాని కెట్టిదోషమే నగునా?

భీష్ముఁడు:—ఓ నాయనా! శ్రద్ధాపూతుఁడగువాఁడు, దుర్దాంతుఁడయ్యు నెల్లవిధములఁ బవిత్రుఁడగుచున్నాఁడు. సందియములేదు. ఓ మహాద్యుతీ! నీకిఁకఁ జెప్పనేటికి!

యుధిష్ఠి:—దైవకర్మములం దొకప్పుడును బ్రాహ్మణునిఁ బరీక్షింపరాదనియుఁ, బైతృకములందు బ్రాహ్మణునిఁ బరీక్షింపవలయుననియుఁ బండితులు తెలుపుదురుగదా! అది యెట్టిది?

భీష్ముఁడు:—ఓయుధిష్ఠిరా! బ్రాహ్మణుఁ డెప్పుడును హవ్యఫలమును సాధింపఁజాలఁడు. అయ్యది దైవమువలననే సిద్ధినొందుచున్నది. దేవానుగ్రహమువలననే యజమానులు యాగములు చేయుచుందురు. లోకములందు బుద్ధిమంతుఁ డనఁదగుమార్కండేయుఁడు మున్ను బ్రహ్మవాదులగు బ్రాహ్మణులే కవ్యకర్మఫల మొసంగుదురని తెలిపెను.

యుధిష్ఠి:—తాతా! క్రొత్తవాఁడును, విద్వాంసుఁడగు సంబంధియుఁ, దపోయజ్ఞశీలుఁడును, దానపాత్రులందురు గదా! వారెట్టివారైన, దానపాత్రు లగుదురు?

భీష్ముఁడు:—నీ వడిగినమూఁవురును, సత్కులప్రసూతులును, సత్కర్మకర్తలును, ప్రాజ్ఞులును, నక్రూరులును, బిడియముగలవారును, ఋజుబుద్ధిగలవారును, సత్యవాదులును నగుదురేని, దానపాత్రులగుదురు. ఓపార్థా! సర్వజ్ఞులైన కాశ్యపాగ్నిమార్కండేయులును బృథివియు ననెడినలువురును బలికినపలుకులు కొన్నిగలవు. వాని నెఱిఁగించెదను వినుము.

పృథివి—మహాసముద్రమునఁ బడఁద్రోచినవస్తు వెట్లు వడిగా నశించునో యటులే సకలవిధ దుశ్చరితమును వేదనిత్యుఁడగువానియందడఁగుచున్నది.

కాశ్యపుఁడు—ఆఱంగములతోఁ గూడిన నాల్గువేదములును,

బురాణము, సాంఖ్యము, సత్కులప్రసూతియు ననునవియెల్ల సౌశీల్య రహితుఁడగు బ్రాహ్మణునకు సద్గతిహేతువులు కాఁజాలవు.

అగ్ని:—చదువుకొని పండితుఁడనని గర్వించుచు నెవ్వఁడు విద్యచే నొరులకీర్తికి భంగముగల్గించునో, వాఁడు నశించుచున్నాఁడు. వానిలోకము లస్థిరములగుచున్నవి.

మార్కండేః—అశ్వమేధసహస్రమొకవైపును సత్యమొకవైపును దులయందుంచి తూఁచఁగా, సత్యమునందు సగమునకేని దక్కినది జాలదని నానిశ్చయము.

ఓయుధిష్ఠిరా! ఇటులు పలికి యమితతేజులగువారు నలువురును వడిగా వెడలిపోయిరి." అని తెలిపెను.

యుధిష్ఠి:—పితామహా! లోకమున బ్రహ్మచర్యవ్రతనిష్ఠగల బ్రాహ్మణులు పైతృకమున దత్తమగుహవిస్సు భుజింతురుగదా! అట్టి పైతృకము సుకృతమగునా?

భీష్ముఁడు:—ఓరాజేంద్రా! బ్రహ్మచర్యమునెడ గుర్వాదేశమొంది యున్న వేదపారగులగు బ్రాహ్మణులు పైతృకాదుల భుజింతురేని వారలు వ్రతుల గుచున్నారు.

యుధిష్ఠి:—తాతా! ధర్మమనేకాంతమై బహుద్వారముగా నుండునని పండితులు తెలుపుదురుగదా! అందు స్థిరమైన దెద్దియో తెలుపుము.

భీష్ముఁడు:—ఓనాయనా! అహింసయు, సత్యము, శాంతము, దమము, అక్రౌర్యము, ఋజుబుద్ధి అనునవి నిశ్చితములగు ధర్మలక్షణములని తెలియుము. ఎవ్వరు తాము ధర్మము నాచరింపక, యొరులకు ధర్మములను దెలుపుచుఁ బుడమిని జరింతురో యట్టివారు ధర్మసంకరాభిరతు లనఁబడుచున్నారు. అట్టివారి కెవ్వఁడు హిరణ్యమునుగాని, రత్నమునుగాని, గోవునుగాని, యశ్వమునుగాని దానము సేయునో, వాఁడు నరకగతుఁడై పదివత్సరములు మలభక్షకుఁడగుచున్నవాఁడు. మ్లేచ్ఛులును, బుల్కసులును, జండాలురును, రాగమోహములచేఁ బల్కువారును, జేయునట్టికర్మము మంచిదైనను నకృతమగుచున్నది. మూఢులై యెవ్వరు, బ్రహ్మచారియగు విప్రునకు వైశ్వదేవ మొసంగరో, వా రశుభములగులోకముల ననుభవించుచున్నారు.

యుధిష్ఠి:—ఓపితామహా! బ్రహ్మచర్య మెట్లు శ్రే
పరమధర్మలక్షణ మెద్ది? శౌచ మెట్లు శ్రేష్ఠతమమగును?
గింపుము.

భీష్ముఁడు:—ఓధర్మజా! మధుమాంసవివర్జనముగు బ్రహ్మచర్యమే యుత్తమమైనది. మేరమీఱకుండుటయే యుత్తమధర్మము. శమమే శౌచలక్షణము,

యుధిష్ఠి:—ఓతాతా! ఎట్టికాలమందు ధర్మమాచరింపవలయును? ఎట్టివేళల నర్థ మార్జింపవలయును? ఎట్టికాలమున సుఖ మనుభవింపవలయును? అది నాకెఱిఁగింపుము.

భీష్ముఁడు:—ప్రొద్దుటవేళ నర్థ మార్జింపవలెను పిమ్మట ధర్మమొనర్పవలయును. పిదప కామసుఖము లనుభవింపవలయును. కాని యత్యాసక్తి పెట్టుకొనఁగూడదు. బ్రాహ్మణులను సన్మింపవలయును. గురువులను బూజింపవలయును. సకలభూతానుకూలముగా మృదుశీలుఁడై ప్రియోక్తులుగల్గి ప్రవర్తింపవలయును. అధికారమున నసృతమాడుటయు, రాజులపైఁ గొండెములు పల్కుటయు, గురునికడ వంచనసేయుటయు, బ్రహ్మహత్యతోఁ దుల్యము లనఁబడుచున్నవి. నరేంద్రులపైఁ బ్రహారము సేయరాదు. అటులే గోవును జంపరాదు. ఈరెండును భ్రూణహత్యాసమములగుట వీని నెపుడును సేవింపరాదు. మఱియు నొకపుడును నగ్నిపరిచర్య విడువఁదగదు. వేదములను బరిత్యజింపరాదు. బ్రాహ్మణునిఁ దిట్టఁగూడదు. అవి బ్రహ్మహత్యాతుల్యములు.

యుధిష్ఠి:—ఓతాతా! విప్రులు సాధువు లెట్లగుదురు? ఎట్టివారికొనర్చినదానము మహాఫల మొసంగును? ఎట్టివారిని భుజింపఁజేయవలయును? తెలుపుము.

భీష్ముఁడు:—అక్రోధనులును, ధర్మపరులును, నిత్యసత్యులును, దమనిరతులును నగువిప్రులు సాధువులు. అట్టివారి కొసంగుదానము మహాఫల మొసంగును. అహంకారశూన్యులును, సర్వసహులును, దృఢార్థులును, విజితేంద్రియులును, సర్వభూతహితులును, మైత్రీరతులు నగువారి కొనర్చినదానమే మహాఫలజనక మగుచున్నది. లోభరహితులును శుచులు, వైద్యులు, బిడియముగలవారును, సత్యవాదులును,

నిజకర్మనిరతులును నగువారి కొనర్చినదానము మహాఫలజనకము గుచున్నది. షట్కర్మనిరతుఁడై, యేవిప్రోత్తముఁడు సాంగములగు నాల్గు వేదములను బఠించునో, వాఁడు దానపాత్రుఁడని మహర్షులు తెలుపుదురు. పైఁజెప్పినగుణములు గలవారందఱును దానపాత్రులగుట వారికిఁ జేసినదాన ముత్తమఫల మొసంగును. గుణార్హుఁడగువాని కొసంగినదాత, సహస్రగుణము నొందుచున్నాఁడు. ప్రజయు శ్రుతము సుచరిత్రము శీలముగలవానికి దాన మొనర్చినదాత తనసకలకులమును దరింపఁజేయుచున్నవాఁడు. అట్టివానికి, గోవునుగాని, యశ్వమునుగాని, విత్తమునుగాని, యన్నముగాని, మఱియు నేదేని ద్రవ్యమునుగాని సమర్పింపవలయును. అట్టిదాత మరణించినపిదప శోకింపవలసినది లేదు. అట్టిగుణములుగల పరిగ్రహీత యొకఁడే దాతకుల మును దరింపఁజేయును. అట్టివారు పెక్కురై రేని చెప్పవలసినది లేదు. కావునఁ బాత్రదాన మొనర్పవలయును. సాధుసమ్మతుఁడై సద్గుణసమన్వితుఁ డగుబ్రాహ్మణునిఁ దెలిసికొని, యట్టివానిని దూరమునుండి దీసికొనివచ్చి సత్కరించి యెల్లవిధములఁ బూజింపవలయును.'' అని తెలుప విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె.

దానకథనము

''ఓపితామహా! శ్రాద్ధకాలమున, దైవపైతృకములవిషయమున మహర్షు లేమివిధించిరో యది నీ వెఱిఁగింప వినఁగోరుచున్నాఁడను.''

అది విని భీష్ముఁడు ''ఓయుధిష్ఠిరా! దైవకర్మము పూర్వాహ్ణమందును, నపరాహ్ణమునఁ బైతృకమును నొనర్పవలయును. అట్టిపట్టుల మంగళాచారసంపన్నుఁడును గృతశౌచుఁడును నై ప్రయత్నపరుఁడై యుండవలయును. మానవులకు సగౌరవముగా మధ్యాహ్నమున దాన మొనర్పవలయును. కాలహీనమగు దానభాగము రాక్షసభాగమని తెలుపుదురు. కాలాతిక్రాంతము, నుచ్ఛిష్టము, పూర్వకాలికము, రజస్వలాదృష్టము నగుభాగము రాక్షసభాగముగఁ దెలుపుదురు. వ్రతరహితమై చెడినదియు, శునకస్పృష్టమైనదియు నగుభాగము రాక్షసభాగమని తెలుపుదురు. వెండ్రుకలు పురుగులు పడినదియు, క్షుతక్షిప్తమైనదియు, శునకదృష్టమైనదియు, రోదనదూషితమును,

నవధూతము నగునది రాక్షసభాగమని తెలుపఁబడుచున్నది. నిరోంకారమును, సశస్త్రమును, దుష్టజనభుక్తము నగుదానిని రాక్షసభాగమని తెలుపుదురు. మూఁడువర్ణములవారిచే మంత్రహీనముగను, క్రియాహీనముగను వడ్డింపఁబడిన శ్రాద్ధాన్నము రాక్షసభాగమని తెలుపుదురు. ఆజ్యాభిఘారములేనిదియు, దురాచారభుక్తమైనదియు వడ్డింపఁబడెనేని, యది రాక్షసభాగ మనిపించుకొనును. ఓభారతోత్తమా! రాక్షసభాగము లెవ్వియో తెలిపితిని. ఇఁక, దానమునకు బ్రాహ్మణునిపరీక్ష యెట్టిదో తెలిపెదను వినుము. ఓరాజా! జాతిబహిర్భూతులును, జడులును, నున్మత్తులునగు బ్రాహ్మణులు దైవపైత్రకములందు నిమంత్రణపాత్రులు గాఁజాలరు. అటులే బొల్లివాఁడును, నపుంసకుఁడును, గుష్ఠరోగియు, క్షయరోగపీడితుఁడును, నపస్మారరోగియు, నంధుఁడును నిమంత్రణమున కర్హులుగారు. మఱియు వైద్యులును, బూజారులును, దంభనియమధారులును, సోమవిక్రయముచేయువారును, దైవపైత్రకములందు నిమంత్రణమున కర్హులు కాఁజాలరు. గాయకులును, నర్తకులును, క్రీడాపరులును, వాదకులును, వృథాప్రసంగముచేయువారును, యుద్ధముచేయువారును నిమంత్రణార్హులుగారు. శూద్రులచే హోమముచేయించువారును, శూద్రాధ్యాపకులును, శూద్రశిష్యులును దైవపైత్రకములందు నిమంత్రణార్హులు కాఁజాలరు. జీతము పుచ్చుకొని చదువుచెప్పువాఁడును, జీతమిచ్చి చదువుకొనినవాఁడును, బ్రహ్మవిక్రయులగుట, శ్రాద్ధక్రియలందు దానపాత్రులు కాఁజాలరు. శూద్రనాయకుఁడును, శూద్రపతియునగు బ్రాహ్మణుఁడు సకలవిద్యాశాలియయ్యు నిమంత్రణార్హుఁడు కాఁజాలఁడు. అగ్నిహోత్రహీనులును, శవములమోయువారును, దొంగలును, జాతిబహిర్భూతులును నిమంత్రణార్హులు కాఁజాలరు. పూర్వచరిత్రము తెలియనిక్రొత్తవారును, గ్రామాధికారులును, తొలుతఁ బుత్రికాసంతానముగలవారును, శ్రాద్ధకర్మములందు నిమంత్రణార్హులుగారు. ఋణకర్తయు, వడ్డిచే జీవించువాఁడును, ప్రాణివిక్రయముచేసికొనుచు జీవించువాఁడును, నిమంత్రణార్హులు గారు. స్త్రీపణ్యజీవులును, వేశ్యాప్రియులును సంధ్యావందనాదిహీనులును శ్రాద్ధకర్మములందు నిమంత్రణార్హులుగారు. దాతృత్వప్రతిగ్రహీతృత్వములయెడను దైవశ్రాద్ధకర్మములలోను నిర్దిష్టుఁడగు

బ్రాహ్మణుఁడు నిషిద్ధుఁడయ్యు నితరసద్గుణములనుబట్టి యనుగ్రహించువిధ మెఱింగించెదను వినుము. సద్వృత్తముగలిగి గుణవంతులై సావిత్రీ జపపరులై క్రియావంతులునగువారు కర్షకులయ్యు నిమంత్రణార్హు లగుచున్నారు. సత్కులప్రసూతులగు ద్విజులు యుద్ధమున క్షాత్ర ధర్మమూనియు నిమంత్రణార్హు లగుచున్నారు. వణిగ్వ్యాపారముగల వాఁడు శ్రాద్ధములం దెన్నఁడును నిమంత్రణార్హుఁడు గాఁజాలఁడు. అతిథిజ్ఞుఁడు, నస్తేనుఁడు నై యగ్నిహోత్రియగు బ్రాహ్మణుఁడు గ్రామాధి కారియయ్యు నిమంత్రణార్హుఁ డగుచున్నాఁడు. మూఁడుకాలము లందును సావిత్రీజపపరుఁడై భిక్షావృత్తియుఁ గ్రియాశాలియు నగువాఁడు నిమంత్రణార్హుఁ డగుచున్నాఁడు. తొలుత నాఢ్యుఁడై దరిద్రుఁడైనవాఁడును, దొలుత దరిద్రుఁడై యాఢ్యుఁడైనవాఁడును, హింసచేయనివాఁడును, నైనవాఁ డల్పదోషుఁడయ్యు నిమంత్రణార్హుఁ డగుచున్నాఁడు. అధాంభికుఁడును, హేతువాద మొనర్పనివాఁడును, సంగత్యర్థమగుస్థలమున భైక్ష్యవృత్తి చేయువాఁడునగు బ్రాహ్మణుఁడు నిమంత్రణార్హుఁ డగుచున్నవాఁడు. వ్రతరహితుఁడును, గితవుఁ డును, స్తేనుఁడును, బ్రాణివిక్రయము చేయువాఁడునునగు వర్తక బ్రాహ్మణుఁడు సోమపానము చేసినచో నిమంత్రణార్హుఁ డగు చున్నాఁడు. తొలుత దారుణకర్మములచే ధనమార్జించియుఁ బిదప నెల్లయతిథుల నాదరించువాఁడు నిమంత్రణార్హుఁ డగుచున్నాఁడు. బ్రహ్మవిక్రయముచే సంపాదింపఁబడినదియు, స్త్రీనుండి యార్జింపఁ బడినదియు, నిస్సారమునుండి సంపాదింపఁబడినదియునగు ధనమును బితృదేవతలకును, విప్రులకును నొసంగరాదు. శ్రాద్ధ సమాప్తి చేయునపుడు యుక్తమగు 'అస్తు, స్వధే'తి ప్రతివచన మెవ్వఁడు పలు కఁడో, వాని కనృతగోశపథపాపము సంభవించును. ఓయుధిష్ఠిరా! నేయి, పెరుగు దొరకినపుడును, నమావాస్యయు నారణ్యమాంసము లభించునపుడును, శ్రాద్ధమునకు బ్రాహ్మణకాల మగుచున్నది. శ్రాద్ధ సమాప్తియందు విప్రునకైనచో స్వధోచ్చారణము సంతోషకర మగును. క్షత్రియుని శ్రాద్ధావసానమునఁ 'బితృదేవతలు ప్రీతులగుదురు. గాక, యని పలుకవలయును. వైశ్యుని శ్రాద్ధావసానమున, 'అక్షయ్య' మని పలుకవలయును. శూద్రుని శ్రాద్ధకర్మావసానమునఁ 'స్వస్తి' యని

పలుకవలయును. బ్రాహ్మణుని దైవకార్యమున, యజమానుఁడు "ఓం పుణ్యాహం భవంతో బ్రువంతు" అని పలుకఁగా "ఓం పుణ్యాహమస్తు" అని బ్రాహ్మణులు పలుకవలయు. ఈవచనమే క్షత్రియుని దైవకార్యమునెడ, నిరోంకారముగా నుచ్చరింపవలయును. వైశ్యుని దైవకార్యమున, 'దేవతలు ప్రీతులగుదురుగాక' యని పలుకవలయును. విధ్యుక్తముగాఁ గర్మము లాయాజాతులవా రెట్టిక్రమముగా నొనర్పవలయునో తెలిపెదను వినుము. ఓభారతా! జాతకర్మాదికర్మములన్నియు మూఁడువర్ణములవారికిని విధింపఁబడినవి. బ్రహ్మక్షత్రియులకును వైశ్యులకును మంత్రోక్తముగాఁ గర్మములు విధింపఁబడియెను. విప్రునకు రశన మౌంజియు, క్షత్రియునకు మౌర్వియు, వైశ్యునకు బాల్బజియు, ధర్మకరమై . యుండును. దాతకును బ్రతిగ్రహీతకును నెట్టివి ధర్మాధర్మములో తెలిపెదను వినుము. బ్రాహ్మణున కనృత మధర్మమై పాతకమగుచున్నది. క్షత్రియుఁ డనృతమాడినచో బ్రాహ్మణునకగుపాతకముకంటె నాల్గుమడుంగులును, వైశ్యున కనృత మెనిమిదిమడుంగులును దోషజనకమగుచున్నది. బ్రాహ్మణుఁడు తొలుత నొకవిప్రునిచే నిమంత్రింపఁబడి వేఱొకచోట భుజింపరాదు. నిమంత్రితుఁడగుబ్రాహ్మణుఁడు చిన్నవాఁడైనచోఁ గర్తపశుహింసాఫలము నొందుచున్నాఁడు. రాజన్యవైశ్యులచే నట్టిచిన్నవాఁడు నిమంత్రితుఁడైనచోఁ గర్త పశుహింసాఫలమున నర్ధభాగ మొందుచున్నాఁడు. అస్నాతుఁడై బ్రాహ్మణుఁడు, బ్రాహ్మణాదులదైవపైతృకకర్మములందు నిమంత్రితుఁడై భుజించునేని, యనృతగోశపథదోష మొందుచున్నాఁడు. తమకు జాతాశౌచమృతాశౌచములున్న వని తెలిసియే లోభముచే బ్రాహ్మణాదులగృహములందు భుజించినబ్రాహ్మణుఁ డనృతగోశపథదోష మొందును. తీర్థయాత్రాదు లొనర్తునని గాని, కర్మము లొనర్తుననిగాని యెవ్వఁడు దాతను యాచించి ధనము గొనునో వాఁడు, గవానృతదోష మొందుచున్నాఁడు. వేదవ్రతచరిత్రహీనులగువారిని మంత్రయుక్తముగా భుజింపఁజేసిన మూఁడువర్ణములవారును గవానృతదోష మొందుచున్నారు." అని తెలుప విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లు ప్రశ్నించెను.

"ఓపితామహా! దైవపైతృకములలో నెట్టివారి కొసంగిన మహాఫలముగల్గునో యది తెలుప వినఁగోరుచున్న వాఁడను."

అది విని భీష్ముఁడు "ఓయుధిష్ఠిరా! కర్షకులు మంచివర్షమునట్టులెవ్వనిభార్య తనభర్త భోజనపాత్ర శేషమును బాకపాత్రాన్న శేషమును నపేక్షించుచుండునో, యట్టివిప్రుని భోజనమునకు నిమంత్రింపవలయును. సచ్చరిత్ర గలిగి వృత్తిహీనులై కృశులై వచ్చినయర్థుల కిచ్చిన యన్నాదికము మహాఫల మొసంగుచున్నది. మఱియుఁ దమ సచ్చరిత్రమే యన్నము, నదియే తమబలము, నదియే గృహము, నదియే తమకాశ్రయముగాఁగల యర్థులు దానపాత్రులగుట వారి కొసఁగినచో మహాఫలమగుచున్నది. మఱియు దొంగలవలనఁ గాని, వైరులవలనఁగాని భయార్తులై వచ్చినయర్థులు భోజనాపేక్షగలిగి వత్తురేని వారికి దాన మొసంగవలయును. అదాంభికుఁడై భైక్షాహార మొనర్చువిప్రునకును, వటువులకును జేసినదానము మహాఫల మొసంగును. దేశవిప్లవమున నెవ్వ రపహృతధనులు, నపహృతదారులును నై ధనార్థముగా వత్తురేని వారి కొసంగవలయును. అటులేని మహాఫలమగుచున్నది. శ్రుతసమ్మతులై యెవ్వరు వ్రతులును నియమవంతులునై తమవ్రతసమాప్తికై ధనము యాచింతు రేని వారికి ధనదానము నేయుట మహాఫలజనక మగుచున్నది. పాషండాచారానుసారములైన ధర్మములందుఁ బోక కృశధనులును గృశప్రాణులు నైనవారి కొనర్చినదానము మహాఫలము గల్గించును. సమర్థులగువారిచే నెల్ల ధనములుగోల్పడిననిర్దోషులు, భుక్తాన్నము గోరినపుడు వారి కొసంగిన మహాఫలము గల్గుచున్నది. మఱియుఁ దపస్వులును, తపోనిష్ఠులును, వారిలో భైక్ష్యచరులును యాచకులై రేని, వారి కొసంగిన కొంచెమును మహాఫలజనకమగుచున్నది. ఓభరతోత్తమా! దానమున మహాఫలము నొసఁగుమార్గమును నెఱిఁగించితిని ఇఁక నెట్టులైన, నరకమో, యెట్టులైన స్వర్గమో, యది యెఱిఁగించెదను వినుము. గుర్వర్థమునకును భయమునకును గాక, తక్కినపు డనృతమాడినవారు నరకగాములగుచున్నారు, పరకళత్రాపహారులును, బరకళత్రాభిమర్శులును, బరదారప్రయోక్తలును నరకమునకుఁ బోవుచున్నారు. చలిపందిరులను, సభలను, వంతెనలను, గృహములను జెరుచుమానవులు నిరయ

మునకుఁ బోవుచున్నారు. అనాథయగుకాంతను, బాలికను, వృద్ధను, జడిసినదానిని, దపస్వినిని నెవ్వరు వంచింతురో, వారు నరకగాములగుచున్నారు. ఒకరివృత్తికి భేదమును జేయువారును, గృహచ్ఛేదము చేయువారును, నటులే ద్వారచ్ఛేదమును, మిత్రచ్ఛేదమును, నాశాచ్ఛేదమును జేయువారును నరకమునకుఁ బోవువారగుచున్నారు. మఱియుఁ గొండెకాండ్రును, సేతుభేత్తలును, బరివృత్త్యుపజీవకులును, నకృతజ్ఞులును నరకగతు లగుచున్నారు. పాషండులును, బరులను దూషించువారును, నాచారదూషకులును, బతితులును నరకగాములగుచున్నారు. మఱియు ద్యూతమాడువారును, దూరదృష్టి లేనివారును, బ్రాణిహింసాపరులును నరకగతు లగుచున్నారు. ఆశపడియున్న దాసులు మున్నగువారిని, బుచ్చికొనుటకు నిర్ణయింపఁబడినవారిని, వేతనముగలవారిని, బెక్కుకాలము పనిచేసియున్నవారిని నెవ్వరు దొలఁగింప నెంతురో వారు నరకగతులగుచున్నారు. ఎవ్వరు పితృదేవయజ్ఞముల నుత్సన్నముగావించి భార్యలను, నగ్నులను భృత్యులను, నతిథులను బరిత్యజించి, తామొక్కరే భుజింతురో వారు నరకగాము లగుచున్నారు. అటులే వేదవిక్రయము చేయువారును, వేదదూషకులును, వేదలేఖకులును నరకమునకుఁ బోవుచున్నారు. నాలుగాశ్రమములకు బాహ్యులైనవారును, వేదబాహ్యులును, నిషిద్ధకర్మములచే జీవించువారును, నరకార్హు లగుచున్నవారు. చామరకంబలాది విక్రయము చేయువారును, విషవస్తువిక్రయముచేయువారును, పాలునమ్మువారును, నరకగాము లగుచున్నారు. ఓయుధిష్ఠిరా! బ్రాహ్మణులయు, గోవులయుఁ, గన్యకలయుఁ గార్యముల కెవ్వరు విఘ్న మొనర్తురో, వారు నరకగాము లగుచున్నారు. శస్త్రవిక్రయముచేయువారును, శస్త్ర శల్యాదికర్తలును, నరకమునకుఁ బోవుచున్నారు. ఎవ్వరు ఱాలచేతను, గొఱ్ఱులచేతను, గోతులచేతను మార్గములను నిరోధింతురో వారు నరకగాము లగుచున్నారు. ఎట్టి వికారములేని భార్యను, నుపాధ్యాయులను, భృత్యులను, భక్తులను నెవ్వరు పరిత్యజింతురో, వారు నరకార్హు లగుచున్నారు. పశువుల కండమర్దనముచేయువారును, ముకుఁద్రాళ్లు బిగించువారును, దిరుగనీకుండ నొకచోటఁ గట్టినవారును నరకగాము లగుచున్నవారు. ఆఱవ

భాగమునన్నఁ బరిగ్రహించుచుండియుఁ బ్రజలను బాలింపని రాజులును, సమర్థులైయుండియు దానముచేయనివారును నరకార్హులగుచున్నారు. చిరకాలము తమతోఁ గలిసియున్నవారిని, శాంతులను, నింద్రియనిగ్రహముగలవారిని దమవని తీఱినతరువాత నెవ్వరు పరిత్యజింతురో వారు నరకార్హు లగుచున్నారు. బాలురకును, వృద్ధులకును, దాసులకును నొసంగక యెవ్వఁడు తొలుత భక్షించునో వాఁడు నరకగతుఁ డగుచున్నాఁడు. ఓధర్మజా! ఇట్టివారు నరకమునకుఁ బోవుదురని మున్నుగాఁ దెల్పితిని. ఇఁక నెట్టివారికి స్వర్గమగునో తెలిపెదను వినుము. దైవపూర్వకములగు సకలకార్యములందును నెవ్వరు నిజపశుపుత్త్రాదికముచే బ్రాహ్మణుల నారాధింతురో యట్టివారు స్వర్గగాము లగుచున్నారు. ఓయుధిష్ఠిరా! ఎవ్వరు తపముచేతను, దానముచేతను, సత్యముచేతను ధర్మమును విడువక యాచరింతురో, వారు స్వర్గార్హు లగుచున్నారు. శుశ్రూషలుచేసియుఁ, దపమొనర్చియు, విద్యనేర్చికొని యెవ్వరు ప్రతిగ్రహముచేయకుండుదురో యట్టివారు స్వర్గమునకుఁ బోవుదురు. భయమువలనఁగాని, పాపము గలుగుననిగాని, బాధ గలుగుననిగాని, దారిద్ర్యముచేఁగాని పీడచేఁగాని ధనమును సంగ్రహింపఁగోరరు వారు స్వర్గగాము లగుచున్నారు. శాంతులును, ధీరులును, ధర్మకార్యరతులును, శుభాచారసంపన్నులును నగుమానవులు స్వర్గవాసార్హులగుచున్నారు. మధుమాంసములను, మద్యమును, బరదారాపేక్షను బరిత్యజించినవారు స్వర్గగాము లగుచున్నారు. ఆశ్రమపాలనముచేయువారును, గులపాలకులును, దేశనగరపాలకులును నగుమానవులు స్వర్గమున కర్హులగుచున్నారు. మఱియు, వస్త్రములను నాభరణములను నొసంగువారును, భక్తుల కన్నపానముల నిచ్చువారును, గుటుంబదాతలును నగుపురుషులు స్వర్గము నొందఁగలుగుచున్నారు. సర్వహింసానివృత్తులును, సర్వంసహులును, సకలప్రాణులకు నాశ్రయమగువారును స్వర్గాశ్రయు లగుచున్నారు. జితేంద్రియులై తలిదండ్రుల శుశ్రూషచేయుచు, భ్రాతృస్నేహముగల్గి ప్రవర్తించువారు స్వర్గమునకుఁ బోవుదురు. మఱియు నెవ్వరు ధనాఢ్యులును, బలవంతులును, యువకులు నయ్యు జితేంద్రియులై ధీరులై వర్తింతురో వారు స్వర్గగాము లగు

చున్నారు. అపరాధులయెడ దయచూపువారును, మృదుస్వభావులును, దీనదయాళురును, నారాధించి యితరులకు సుఖముగలిగించువారును స్వర్గమునొందుచున్నారు. వేయిమంది కన్యదానము చేయువారును, వేలకొలఁదిరాకల నిచ్చువారును, వేలకొలఁదిప్రజలను రక్షించువారును స్వర్గమున కర్హులగుచున్నవారు. సువర్ణదాతలును, గోదాతలును, యానవాహనాదిదాతలును స్వర్గార్హులగుచున్నారు. ఓయుధిష్ఠిరా ! వైవాహికద్రవ్యములను, ప్రేష్యులను, వస్త్రములను దానము చేయువారు స్వర్గమున కర్హులగుచున్నారు. విప్రులకుఁగా విహారాగారములు, నుద్యానములు, నూతులు, తోఁటలు, సభలు, చలిపందిరులు మున్నగువానిని గల్పించువారు స్వర్గమునకుఁ బోవుచున్నారు. విప్రులకుఁ గోరినవసతులను, నివేశములను, క్షేత్రములను దానముచేసిన దాతలు స్వర్గమునకుఁ బోవ నగుచున్నారు. ఓయుధిష్ఠిరా ! రసములను, విత్తనములను, ధాన్యములను దమంతఁదాము పుట్టించి యితరుల కొసంగినపురుషులు స్వర్గమునకుఁబోవ నర్హులగుచున్నారు. ఏవంశమువారు బహుపుత్రులును శతాయువులును, సదయులును, జితక్రోధులును నైయుండుదురో, వారివంశమున జనించినవారు స్వర్గార్హులగుచున్నారు. ఓయుధిష్ఠిరా ! ఆముష్మికమునకై చేయు దైవపిత్ర్యములును దానధర్మములును బూర్వమహర్షు లొనర్చినవి తెలిపితినిగదా!" అని పలికిన విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె.

### బ్రహ్మహత్యాకథనము

"ఓపితామహా ! ఒకప్రాణికి హింసయొనర్పకయే బ్రహ్మహత్య యెట్లు గలిగెడునో యథార్థముగాఁ దెలుపుము."

అది విని భీష్ముఁడు, "ఓరాజేంద్రా! మున్నొకపుడు నేను వ్యాసునిఁ బ్రశ్నింపఁగా, నతఁడు నాకెఱిఁగించెను. దానిం దెలిపెదను వినుము. నేనొకపుడు ఓమహర్షివర్యా! నీవు వసిష్ఠునకు నాల్గవవాఁడవుగదా ! ఒకప్రాణికి హింసచేయకయు బ్రహ్మహత్యాదోషము సంభవించునందురు. అది యెట్టిదో నాకెఱిఁగింపు' మని యడిగితిని. అపుడతఁడు ధర్మనిపుణుఁడగుట నాకిట్లు తెలిపెను. అది వినుము. సుగుణశాలియగు బ్రాహ్మణునిఁ దనంతఁ దాఁ బిలిచి, పిమ్మట నీకు భిక్షయొసంగఁ

బడదని పొమ్మనినవాఁడు బ్రహ్మహత్యాపాతక మొందునని తెలియుము. వేదవేత్తయై మధ్యస్థుఁడై నవిప్రుని జీవనాధారము నెవ్వఁడు హరించునో, యట్టి దుర్బుద్ధి బ్రహ్మఘాతి యని తెలియుము. ఓవసుధాధిపా! నీటికై త్వరపడుగోకులమున కెవ్వఁడు విఘ్నము గలిగించునో, వాఁడు బ్రహ్మఘాతి యనఁబడుచున్నాఁడు. ఎవ్వఁడు ప్రవృత్తమగు వేదమును, మునికృతమగు శాస్త్రమును, నప్రాజ్ఞుఁడై దూషించునో, వాఁడు బ్రహ్మఘాతి యగుచున్నాఁడు. రూపసంపన్నయు, గుణవతియు నగుతనకూఁతు నెవ్వఁడు తగినవరున కొసంగఁడో వాఁడు బ్రహ్మహత్యాపాతకమునకుఁ బాత్రుఁ డగుచున్నాఁడు. అధర్మనిరతుఁడును మూఢుఁడునై యెవ్వఁడు బ్రాహ్మణులకు నిర్హేతుకముగా నెంతయుఁ బీడగలిగించునో, వాఁడు బ్రహ్మఘాతి యగుచున్నాఁడు. సొట్టవారియు, గ్రుడ్డివారియు, జడులయు సర్వస్వము నెవ్వఁడు హరించునో, యట్టివానిని బ్రహ్మఘాతియందురు. అవివేకముచే నెవఁడు పట్టణమునఁగాని వనమునఁగాని, యాశ్రమమునఁగాని, గ్రామమునఁగాని, యగ్నిని విడుచునో, యట్టివానిని బ్రహ్మఘాతి యందురు." అని తెలుప విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె.

## అంగిరసతీర్థయాత్ర.

"ఓభరతర్షభా! మహాప్రాజ్ఞా! ఉత్తమతీర్థములదర్శనము, స్నానము వానిని వినుటయు శ్రేయస్కరమందురుగదా! అది యెట్టిదో తెలుపుము. ఓప్రభూ! పుడమిపైఁ బవిత్రములగుతీర్థము లెవ్వియో వాని నెఱిఁగింపుము."

అదివిని గాంగేయుఁడు "ఓధర్మజా! మున్నితీర్థసంఘమునుగూర్చి యంగిరసుఁడు తెలిపియున్నవాఁడు. అది యుత్తమధర్మమును నీకుఁ గలిగించెడిని. వినుము. మున్నొకపుడు సంశితవ్రతుఁడగుమహాముని గౌతముఁడు తపోవనగతుఁడై విప్రోత్తముఁడైన యంగిరసునిఁ జేరి 'ఓభగవానుఁడా! తీర్థములనుగూర్చి నాకొకధర్మసంశయ మొదవెడిని. ఓమహాముని! అదియెల్ల నాకుఁ దెలిపి నాసంశయమును దీర్పుము. ఉత్తమతీర్థముల యుపస్పర్శనముచే నెట్టిఫలము గలుగునో, యాయుపస్పర్శన మొనర్చినవాఁడు మరణించినపిదప నెట్టిగతి గాంచునో తెలుపుము.' అని ప్రశ్నించెను.

అది విని యంగిరసుఁడు, 'ఓగౌతమా! విశాలమై తరంగములు గల చంద్రభాగలో నెవ్వఁ డేడుదినములు నిరాహారుఁడై స్నాన మొనర్చునో, వాఁడు నిర్మలుఁడై మునులయుత్తమగతి నొందుచున్నాఁడు. ఓయీ! కాశ్మీరమండలమున నెయ్యవి మహానదమగుసింధునదమును గలియుచున్నవో యట్టినదులను జేరినసుశీలుఁడు స్వర్గమున కేఁగుచున్నవాఁడు. పుష్కరమును, ప్రభాసమును, నైమిశమును, సాగరోదకమును, దేవికను, నింద్రమార్గమును, స్వర్గబిందువును ప్రవేశించి పరిశుద్ధుఁడైనవాఁడు విమానస్థుఁడై యప్సరసలచే సంస్తుతుఁడగుచున్నాఁడు. ఎవ్వఁడు హిరణ్యబిందువున స్నానమొనర్చి, నియతుఁడై, కుశేశయమును దేవంతమును జేరి నమస్కరించునో, వాని కల్మషమెల్ల నడంగుచున్నది. గంధమాదనసమీపమున, నింద్రతోయను జేరియు, గరతోయలో మునిఁగియుఁ, గురంగమున మూఁడురాత్రు లుపవాస మొనర్చియు నియతుఁడై పవిత్రుఁడైనవాఁ డశ్వమేధఫల మొందుచున్నాఁడు. మఱియు, గంగాద్వారము, కుశావర్తము, బిల్వకము, నీలపర్వతము, కనఖలము ననువానిలో స్నానముచేసినచోఁ బాపరహితుఁడై స్వర్గమును జేరుచున్నాఁడు. బ్రహ్మచర్యమూని, జితక్రోధుఁడై సత్యసంధుఁడు, నహింసకుఁడునై యెవ్వఁ డపాంహ్రదమున స్నానముచేయునో, వాఁడు వాజిమేధఫల మందుచున్నాఁడు. ఉత్తర దిక్కున నెచట భాగీరథియగు గంగ పడుచున్నదో యట్టి మహేశ్వర త్రిస్థానమున నెవ్వఁడు, స్నానమొనరించుచు నొకనెల నిరాహారుఁడై యుండునో, వానికి దేవతలెల్ల దర్శన మొసంగుదురు. సప్తగంగమందును, త్రిగంగమందును, నింద్రమార్గమందును దర్పణముచేసి పునర్జన్మ మొందినవానికర్థములన్నియు ననుభవయోగ్యములై సిద్ధించుచున్నవి. మహాశ్రమమున నుపస్పర్శ మొనర్చి, యగ్నిహోత్రపరుఁడై పవిత్రుఁడై యొకనెల నిరాహారుఁడై యున్నచో నొకనెలలో సిద్ధినొందుచున్నాఁడు. మహాహ్రదమున నుపస్పర్శన మొనర్చి నిష్కాముఁడై భృగుతుందమున మూఁడురాత్రు లుపవసించినచో బ్రహ్మహత్యాపాతకమునుండి విడివడుచున్నాఁడు. మఱియుఁ గన్యాకూపమున స్నానముచేసి బలాకలోఁ గృతస్నానుఁడైనచో దేవతలందును గీర్తిచే విరాజిల్లుచుండును. దేవికయందును, సుందరికాహ్రదమందును, నశ్వినియందును, స్నాన

మొనర్చినవాఁడు మరణించినపిదప, రూపమును, వర్చస్సును బొందుచున్నాఁడు. మహాగంగయందు స్నానముచేసి, యటులే కృత్తికాంగారకమున మునుఁగుచు, నొకపక్షముదినములు నిరాహారుఁడై యున్నచో, నిర్మలుఁడై స్వర్గమొందుచున్నాఁడు. వైమానికమందును, గింకిణికాశ్రమమందును, స్నానమొనర్చినచో, దివ్యమగు నప్సరోనివాసమందుఁ జరించినవాఁ డధికుఁ డగుచున్నాఁడు. కాళికాశ్రమమును జేరి, విపాశలో మునిఁగి, బ్రహ్మచర్యవ్రతముగలిగి జితక్రోధుఁడై మూఁడురాత్రులుండినచో, సంసారవిముక్తుఁ డగుచున్నాఁడు. కృత్తికాశ్రమమున స్నానమొనర్చి పితృదేవతలకుఁ దర్పణముచేసి మహాదేవు నారాధించినవాఁడు నిర్మలుఁడై స్వర్గము నొందుచున్నాఁడు. మహాకూపమున స్నానముచేసి మూఁడురాత్రు లుపవసించిన పవిత్రుఁడు జంగమస్థావరములనుండియు మఱియు మానవులనుండియు, భయములేనివాఁ డగుచున్నాఁడు. దేవదారువనమున స్నానమొనర్చి, కృతోదకుఁడై కలుషములఁ దొలఁగించుకొనినవాఁడు, దేవలోకమొందుచున్నాఁడు. శర్మస్తంబమునందును, కుశస్తంబమునందును, ద్రోణశర్మపదమునందును, శుచియై యేడురాత్రు లుపవసించి, యపాంప్రపతనను సేవించినవాఁ డప్సరసలచే సేవింపఁబడుచున్నాఁడు. చిత్రకూటమందును, జనస్థానమందును, మందాకినీజలమందును స్నానమొనర్చి నిరాహారుఁడైనవాఁడు రాజ్యలక్ష్మిచే సేవింపఁబడుచున్నాఁడు. శ్యామాశ్రమముననుండి, యందొకపక్షముదినములు నిరాహారుఁడై స్నానమొనర్చినచో, నంతర్ధ్యానఫల మొందుచున్నాఁడు. కౌశికిని జేరి, నిష్కాముఁడై వాయుభక్షుఁడై యిరువదియొకరాత్రు లుండినచో, స్వర్గము నొందఁగల్గుచున్నాఁడు. మతంగవాపియందు స్నానమొనర్చినవాఁ డొకరాత్రిలో సిద్ధి నొందుచున్నాఁడు. సనాతనమగునంధకమును జేరి జితేంద్రియుఁడై నైమిశమునందును, స్వర్గతీర్థమునందును స్నానమొనర్చినచో నొకమాసముననే పురుషమేధఫలము సిద్ధించుచున్నది. అటులే గంగాహ్రదమునందును, నుత్పలావనమునందును నొకనెల స్నానమొనర్చినవాఁ డశ్వమేధఫల మందుచున్నాఁడు. గంగాయమునలలోను, గాలాంజనగిరియందును నొకనెల స్నానమొనర్చి నివసించినవాఁడు పదియశ్వమేధములఫల మొందుచున్నాఁడు. యష్టిహ్రదమున

స్నానముచేసినచో నన్నదానఫలమును మించినఫల మగుచున్నది. మాఘమాసమునఁ బ్రయాగక్షేత్రమున మూఁడుకోట్లపదివేల తీర్థములు గలియుచున్నవి. కావున మాఘమాసములోఁ బ్రయాగమున నియతుఁడై సంశితవ్రతుఁడై స్నానమొనర్చినచో, నిర్మలుఁడై స్వర్గమొందుచున్నాఁడు. మఱియు, మరుద్గణమందును, బిత్రాశ్రమమందును, వైవస్వతతీర్థమందును, స్నానమొనర్చినచోఁ దీర్థభూతుఁ డగుచున్నాఁడు. బ్రహ్మసరమునకు వెళ్లి భాగీరథిలోఁ గృతస్నానుఁడై యొకనెల నిరాహారుఁడై యుండెనేని సోమలోకము లభించుచున్నది. ఉత్పాతకమున, నష్టావక్రముననను బండ్రెండుదినములు నిరాహారుఁడై స్నానము నియమముగా నొనర్చినచో, నశ్వమేధఫలము గలుగుచున్నది. అశ్మపృష్ఠమందును, గయలోను, నిరవిందపర్వతమందును, మూఁడవక్రౌంచపదియందును స్నానమొనర్చినచో, బ్రహ్మహత్య తొలగుచున్నది. కలవింకమునఁ బలుమాఱులు స్నానమొనర్చి, యగ్నిపురతీర్థమున మునిఁగినచో, నగ్నికన్యాపురమున నివసింపనగును. మఱియుఁ గరవీరపురమందును, విశాలయందును స్నానముచేసి, దేవహ్రదమున నుపస్పర్శనమొనర్చినచో, బ్రహ్మభూతుఁడై విరాజిల్లుచున్నవాఁడు. పునరావర్తనందను, మహానందను సేవించి, శాంతుఁడై నందనమును సేవించినచో, నప్సరసలకు సేవ్యుఁడగుచున్నాఁడు. కృత్తికానక్షత్రమున సమాహితుఁడై యూర్వశీతీర్థమునకుఁబోయి యందును, లౌహిత్యమునందును, విధ్యుక్తముగా స్నానమొనర్చిన వానికిఁ బుండరీకయాగఫలమగుచున్నది. పండ్రెండుదినములు నిరాహారుఁడై రామహ్రదమునందును, విపాశయందును స్నానముచేసినవాఁడు కలుషవిముక్తుఁడగును. శుద్ధమనస్కుఁడై యెవఁ డొకనెల నిరాహారముగా, మహాహ్రదమున నుపస్పర్శన మొనర్చునో, వానికి జమదగ్నికగు గతి గలుగుచున్నది. సత్యసంధుఁడు నహింసకుఁడు నై వింధ్యమున నుపవాసాదులచే మేను కృశింపఁజేసికొని, యొకనెల తపోనిష్ఠుఁడైనచో సిద్ధినొందుచున్నాఁడు. నర్మదయందును, శూర్పారకోదకమందును, నొకపదునైదుదినము లుపవసించినవాఁడు రాజపుత్త్రుఁడై జనించుచున్నాఁడు. మూఁడునెలలు నియతుఁడై సమాధినిష్ఠ గలిగియున్నచో, వెంటనే యొకయహోరాత్రమునకే సిద్ధి గలుగుచున్నది. కోకాముఖ

మున స్నానమొనర్చి, చాండాలికాశ్రమమును జేరి చీరవసనుఁడై శాకాహారము గలిగియున్నచోఁ, బదుపురు కుమారికల నొందు చున్నాఁడు. ఎవ్వఁడు కన్యాహ్రదమున నివసించునో, వానికి యమ లోకదర్శనము గాకుండనే స్వర్గలోకప్రాప్తి గలుగుచున్నది. అమా వాస్య నొకరాత్రి ప్రభాసమున సమాహితుఁడై యున్నచో, సిద్ధినొంది దేవత్వమొందుచున్నాఁడు. ఉజ్జానకమందును, నార్ష్టిసేను నాశ్రమ మందును, బింగాశ్రమమందును స్నానమొనర్చినవానికి సకలపాప ములును దొలఁగుచున్నవి. కుల్యానదిలో మునిఁగి, యఘమర్షణము జపించి మూఁడురాత్రు లుపవసించినవాఁ డశ్వమేధఫల మందు చున్నాఁడు. ఒకపగలును నొకరాత్రియు, శుచియై పిండారకమున నుపస్పర్శన మొనర్చినచో నగ్నిష్టోమఫల మందుచున్నాఁడు. బ్రహ్మ సరమునకు వెళ్లి ధర్మారణ్యమునసుండి స్నానమొనర్చినవాఁడు పవిత్రుఁడై పుండరీక ఫలమందుచున్నాఁడు. మైనాకపర్వతమున స్నాన ముచేసి సంధ్యోపాసన మొనర్చుచు, నొకనెల యింద్రియనిగ్రహము గలిగియున్నచో సర్వమేధఫల మందుచున్నాఁడు. మఱియుఁ గాలో దకమును, నందికుండమును, నుత్తరమానసమును జేరినవానికి భ్రూణ హత్యాదోషము తొలఁగుచున్నది. నందీశ్వరమూర్తిని గాంచినవాని పాపములన్నియు నడఁగును. అటులే స్వర్గమార్గమున స్నానమొనర్చిన వానికి బ్రహ్మలోకమగుచున్నది. శంకరునకు మామయై పవిత్రమై సకలరత్నములకు స్థానమై సిద్ధచారణసేవితమైన హిమవంతమున నెవ్వఁడు తనజీవిత మస్థిరమని తెలిసి యుపనిషత్తత్త్వ మెఱిఁగి యందున్న దేవతల నభ్యర్చించి మునులకు నమస్కరించి, శరీరమును విడుచునో, వాఁడు సిద్ధుఁడై సనాతనమగు బ్రహ్మలోకము నొందు చున్నాఁడు. కామక్రోధలోభమోహములను జయించి తీర్థములందు నివసింపవలయును. తీర్థాభిగమనముచే లభింపని దెయ్యదియును లేదు. మఱియుఁ గొన్నితీర్థములు, దుర్గములును, విషమములును జేరరాని వియునై యుండును. సర్వతీర్థసమీక్షనుబట్టి, వానిని మానసములచేఁ గనుఁగొనవలయును. ఈతీర్థసేవనము యజ్ఞఫలప్రదమును, బవిత్ర మైనదియు, స్వర్గకరమైనదియు, వేదరహస్యమైనదియు నై వెలయు

చున్నది. ఈతీర్థచరిత్రమును బ్రాహ్మణులకును, సాధువగు తనమిత్రునకును, సహృదయులకును నుపదేశింపవలయును. మఱియుఁ దన్ననుసరించు శిష్యునిచెవిలోఁ జెప్పవలయును. మున్ను మహాతపుఁడగు నంగిరుఁడు గౌతమున కెఱిఁగించెను. ఇయ్యది మహర్షుల కుత్తమజప్యమగుచున్నది. దీనిని మఱిమఱియు జపించువాఁడు నిర్మలుఁడై స్వర్గమొందుచున్నాఁడు. అంగిరసుఁడు తెలిపిన యీరహస్యము నెవఁడు వినునో, వాని కుత్తమకుల సంభవమును బూర్వజన్మజ్ఞానమును గల్గుచున్నది." అని భీష్ముఁడు యుధిష్ఠిరున కెఱిఁగించినవిధముగఁ దెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

## గంగామాహాత్మ్యకథనము

ఓజనమేజయా! బుద్ధికి బృహస్పతితోడను, శాంతికి బ్రహ్మతోడను దుల్యుఁడై పరాక్రమమున శక్రసముఁడై, రవితేజుఁడై వీరశయనమున శయనించి కాలమున కెదురుచూచుచున్న భీష్ముని, యుధిష్ఠిరుఁడును, నాతని యుద్ధమునఁ బడఁద్రోసిన యర్జునుఁడును, భీమనకులసహదేవులునుగూడి, సూక్ష్మధర్మములను వినుచువచ్చిరి. మఱియు నా గాంగేయు నరయువారై యందుల కత్రియు, వసిష్ఠుఁడును భృగువు, పులస్త్యుఁడు, పులహుఁడు, క్రతువు, నంగిరుఁడు, గౌతముఁడు, అగస్త్యుఁడు, సుమతి, విశ్వామిత్రుఁడు, స్థూలశిరుఁడు, సంవర్తుఁడు, ప్రమతి, దముఁడు, బృహస్పతి, ఉశనుఁడు, వ్యాసుఁడు, చ్యవనుఁడు, కాశ్యపుఁడు, ధ్రువుఁడు, దుర్వాసుఁడు, జామదగ్ని, మార్కండేయుఁడు, గాలవుఁడు, భారద్వాజుఁడు, రైభ్యుఁడు, యవక్రీతుఁడు, త్రితుఁడు, స్థూలాక్షుఁడు, శబలాక్షుఁడు, కణ్వుఁడు, మేధాతిథి, కృశుఁడు, నారదుఁడు, పర్వతుఁడు, సుధన్వుఁడు, ఏకతుఁడు, ద్వితుఁడు, నితంతువు, కవషుఁడు, ధౌమ్యుఁడు, శతానందుఁడు, కృతవ్రణుఁడు, జామదగ్న్యుఁడు, కచుఁడు మున్నగుమహాత్ములు మహర్షులు వచ్చిరి. అటులు వచ్చినమహర్షుల నయ్యుధిష్ఠిరుఁడు తనతమ్ములతోఁ గూడ యథావిధిగాఁ గ్రమముతప్పక పూజించెను. వారు నటులు పూజితులై సుఖాసీనులై, భీష్మాశ్రితములై మధురములై సకలేంద్రియమనోజ్ఞములగు కథలను దెలుపుచువచ్చిరి. భావితాత్ములగు నమ్మహర్షులు దెలుపుకథలను విని యాగాంగేయుఁడు పరమప్రీతితోఁ దన్ను స్వర్గగతునిఁగాఁ దలం

చెను. పిదప నమ్మహర్షులు పాండవులకడను భీష్మునియొద్దను సెలవు పుచ్చుకొని యందఱును గనుఁగొనుచుండఁగనే యొక్కుమ్మడిగా నంతర్ధానమొందిరి. అటు లంతర్ధానమొందిన మహాభాగులగు నమ్మహర్షులను బాండవులు సన్నుతించి మఱిమఱియు నమస్కరించిరి. పిదప నప్పాండవులు, మంత్రకోవిదు లాదిత్యునట్లు ప్రసన్నచిత్తులై యాగాంగేయునిఁ బలువిధముల సన్నుతించిరి. మఱియు నమ్మహర్షులతపఃప్రభావముచే దెసలన్నియుఁ బ్రకాశములై యుండుటఁ గాంచి పరమాశ్చర్యభరితులై, యింకను నమ్మహర్షులమహాభాగ్యమును దలంచికొనుచు నప్పాండవులు మహర్షులను సంబంధించినకథల నాభీష్మునితోఁ బ్రసంగించిరి. ఓజనమేజయా! అమ్మహర్షులకథ ముగిసినపిదప యుధిష్ఠిరుఁడు భీష్మునిపాదములు పట్టికొని, ధర్మయుక్తమగుప్రశ్న యొకటి యిటు లొనర్చెను.

"ఓపితామహా! ఏదేశములు పవిత్రములైనవి? ఏజనపదములుత్తమమైనవి? ఏయాశ్రమములు మేలైనవి? ఏపర్వతములు గొప్పవి? ఏవి పుణ్యప్రదములు? తెలుపుము."

అది విని భీష్ముఁడు "ఓయుధిష్ఠిరుఁడా! ఇందుల కొకపురాతనేతిహాసము గలదు. అయ్యది శిలోంఛవృత్తియగు శీలవృత్తికిని సిద్ధునకును జరిగినసంవాదము. ఒకపు డొకసిద్ధుఁ డిద్ధరణినెల్లఁ దిరిగి తిరిగి, మఱిమఱియుఁ బర్వతములను గాంచి కాంచి, యొకపుడు శీలవృత్తియను నొకగృహస్థునింటి కతిథియై వచ్చి యాగృహస్థుచే విధ్యుక్తముగాఁ బూజింపఁబడి యొకరాత్రి యాసుముఖుఁ డందు సుఖముగా నుండెను. ఆశీలవృత్తియుఁ బ్రాతఃకరణీయములనెల్లఁ దీర్చి శుచియై యతిథియగు నాసిద్ధుని సమీపించెను. పిమ్మట వారిరువురును నొకచో సుఖాసీనులై, వేదసంబద్ధములును, వేదాంగకృతలక్షణములు నగుశుభకథలను గొంతవడిఁ బ్రసంగించికొనిరి. అక్కథాంతమున యాశీలవృత్తి సిద్ధునిఁ గాంచి, యిపుడు న న్నీవేమి ప్రశ్నించితివో యదియే మదినిడి 'ఓసిద్ధవర్యా! ఏదేశములు ప్రకృష్టములైనవో, యేజనపదము లుత్తమములైనవో, యేయాశ్రమములు శ్రేష్ఠములైనవో, యేపర్వతములు గొప్పవో, యేనదులు పవిత్రములైనవో తెల్పు'మని యడిగెను.

అది విని యాసిద్ధుఁడు, 'ఓమునివర్యా! ఉత్తమనదియగు గంగ, యే దేశములనడుమఁ బ్రవహించునో, యట్టి దేశములును, నట్టిజనపదములును, నట్టియాశ్రమములును నట్టిపర్వతములును శ్రేష్ఠములైనవి. గంగను సేవించినపు డెట్టిఫలము గలుగునో యట్టిఫలము, తపముచేఁగాని, బ్రహ్మచర్యముచేఁగాని, యజ్ఞములచేఁగాని, త్యాగముచేగాని గలుగనేరదు. మరియు నెవ్వనియవయవములు గంగోదకముల సంపర్కమొంది, వానియం దుంపబడునో, యట్టివానికి స్వర్గనివాసము నిత్యమగుట సత్యము. ప్రాణుల యెల్లకార్యములును, గంగోదకములచే నిర్వర్తింపఁబడునేని, యట్టిప్రాణులు పుడమి విడిచి తమతేజముచే స్వర్గమొందుదురు. ఎవరేనిఁ బూర్వవయసులోఁ బాపములొనర్చినను, వారు పిదప గంగను సేవించినచో నుత్తమగతి నొందుచున్నారు. ఎవ్వరు పవిత్రములగు గంగాజలములఁ బ్రయతాత్ములై స్నానమొనర్తురో, యట్టిమానవుల కగుపుణ్యవృద్ధి, క్రతుశతములచేనేనిఁ గలుగదు. ఎవ్వనియెముకలు గంగాజలముల నెన్నినాళ్లు లుండునో, యన్నినాళ్లు లామానవుఁడు స్వర్గలోకమున నివసించును. ఉదయకాలరవి, తీవ్రమగుచీకటి నెట్లు తొలఁగఁద్రోసి ప్రకాశించునో, యటులే గంగానదీజలస్నాతుఁడు పాపములను బాఱఁద్రోలి వెలయుచున్నాఁడు. పవిత్రములగుగంగాజలములు లేనిదేశములును, దెసలును, జంద్రుఁడులేని రాత్రులట్టులును, బూవులులేని చెట్టులట్టులును శోభారహితములై యుండును. ధర్మజ్ఞానశూన్యములగు వర్ణాశ్రమధర్మములట్టులును, సోమరహితములగు యజ్ఞములట్టులును, గంగాశూన్యమగుజగము నిష్ఫలమగుచున్నది. రవిహీనమగు నాకసమట్టులును, శైలములులేని పుడమియట్టులును, వాయుశూన్యమగు నంబరమట్టులును, గంగాహీనములగు దేశములును, దెసలును, నిస్సారములనుటలో సందియములేదు. ముల్లోకములఁగల ప్రాణులన్నియు, శుభప్రదములగు గంగాజలములచేఁ దర్ప్యమాణములై గొప్పతృప్తి నొందుచున్నవి. ఎవఁడు సూర్యకాంతితప్తములగు గంగాజలములఁ ద్రావునో, యట్టివాఁడు గోమయముకంటెను బవిత్రుఁ డనఁబడుచున్నాఁడు. కాయశుద్ధికై వేయిచాంద్రాయణములు చేసినవాఁడును, గంగాజలముఁ ద్రావినవాడును సములుగావచ్చును. లేదా గంగా

జలము ద్రావినవాఁ డధికుఁడేని గావచ్చును. వేయియుగము లెవ్వాఁ డొకపాదముపై నిలువఁబడి వ్రతము గడపునో వాఁడును, నొకనెల గంగయందు మునిఁగినవాఁడును దుల్యులేని గావచ్చును. లేదా గంగాస్నాత యధికుఁడు గావచ్చును. పదివేలయుగములు తల క్రిందుగాఁబెట్టి వ్రతము సలిపినవాఁడును, యథేచ్ఛముగా గంగలో మునిఁగినవానికిఁ దుల్యుఁడు గానేరఁడు. ఓద్విజోత్తమా! అగ్ని యంటుకొన్న దూదివలె, గంగాస్నానము చేసినవాని పాపములన్నియు నశించిపోవుచున్నవి. దుఃఖములను దొలఁగించుకొను చిత్తముగలిగి సద్గతి నన్వేషించు సకలభూతములకును గంగనుబోలుగతి గలుగఁ జేయునది వేఱొకటిలేదు. గరుడదర్శనముచే సర్పములు నిర్విషము లయినట్టులు, గంగాదర్శనము చేయువారిపాపములన్నియుఁ దలఁగి పోవుచున్నవి. లోకమున నధర్మాశ్రయులును, బ్రతిష్ఠాశూన్యులును నగువారికెల్ల గంగయే ప్రతిష్ఠాశ్రయమును, గర్మము, శర్మము నగుచున్నది. మహత్తరములగు పెక్కుపాపములచేఁ బీడితులగుచు నరకమునఁ బడనున్న పురుషాధములు గంగ నాశ్రయింతురేని వారి నది తరింపఁజేయును. ఎవ్వరు గంగానదిలో నెల్లపుడు స్నానముసేయు దురో, వా రింద్రాదిదేవతలతోడను, మునులతోడను సమభాగము గలవారగుచున్నారు. వినయాచారహీనులును, నమంగళులు నగు మానవాధములేని, గంగ నాశ్రయించినచో శుభాస్పదులగుచున్నారు. సురల కమృతమును, బితరులకు స్వధయు, నాగులకు సుధయు నెట్టివో, మానవులకు గంగాజల మట్టిదని తెలియుము. ఆఁకలిచే బీడితులగు బాలకులు తల్లి నెట్టులాశ్రయింతురో, యటులే శ్రేయస్కాములగు మానవులు గంగ నాశ్రయించుచున్నారు. స్థానములలో నెల్ల స్వాయంభువస్థాన మెట్టు లుత్తమమైనదో, యటులే నదులలో నెల్ల గంగానది యుత్తమమైనదని చెప్పఁబడుచున్నది. తన్నాశ్రయించిన దేవాదులకుఁ గామధేను వెట్టిదో, గంగోపజీవులగు సకలప్రాణులకును గంగ యట్టి దని తెలియవలయును. సత్రాదులగుయాగములచే దేవత లెట్లు సోమార్కసంస్థగల యమృతమునుబట్టి జీవింతురో, యటులే మానవులు గంగాజలము నాశ్రయించి జీవించుచున్నారు. గంగాతీరమున నెగురుచున్న యిసుకరేణువులు సోకినవాఁడు తన్ను స్వర్గమందున్న

వానిఁగాఁ దలంచుకొనుచున్నాఁడు. గంగాతీరమునఁగలమన్ను నెవ్వఁడు తలకుఁ బూసికొనునో, వాఁడు తమోనాశ మొనర్పఁదగు నర్కుని నిర్మలతేజమొందును. గంగాతరంగములపై నుండి వచ్చినగాలి సోకినపురుషునిపాపము నాగాలి తొలఁగించుచున్నది. వ్యసనపీడితుఁడై నశింపనున్నమానవునకు గంగాదర్శనముగలిగెనేని వానివ్యసనముల పీడ పోవుచున్నది. గంగానది, తనయందుఁ గల హంసారావముల చేతను, చక్రవాకధ్వనులచేతను, మఱియుఁగల పక్షులకలకలధ్వనుల చేతను గంధర్వులను, నిసుకదిబ్బలచేఁ బర్వతములను, దిరస్కరించుచుండును. పలువిధములై పెక్కులగు హంసాదిపక్షులచే శోభిల్లుచు గోకులవ్యాప్తయగు గంగను గాంచినచో స్వర్గమునెడ విస్మృతిగలుగక పోదు. గంగాతీరవాసులగు మానవులకుఁ గలిగినప్రీతి, సర్వకామముల ననుభవించుచు స్వర్గమందున్నవానికిని గలుగనేరదు. మనోవాక్కర్మములచేఁ గలిగినపాపములచేఁ బీడితుఁడగువాఁడు గంగానదిని గాంచినచోఁ బవిత్రుఁ డగుచున్నాఁడనుటలో సందియములేదు. గంగానదిని స్పృశించువారును, నందు స్నానముచేయువారును, దమకుముం దేడుతరములవారిని, వెనుక నేడుతరములవారిని, నింకను వెనుకటివారిని దరింపఁజేయఁగలుగుచున్నారు. గంగను వినినవారును, నభిలషించినవారును, జూచినవారును, సోకినవారును, దజ్జలము ద్రావినవారును, స్నానముచేసినవారును దమ పితృమాతృవంశములఁ దరింపఁజేయఁ గలుగుచున్నారు. గంగానది తనదర్శనస్పర్శనములను జేసినవారినిగాని, తననీరు ద్రావినవారినిగాని, తనలో మునిఁగిన వారినిగాని, తన్నుఁ గీర్తించినవారినిగాని పవిత్రులను జేయును. అట్టివారు వేలకొలఁదియైనను బావనులగుచున్నారు. ఎవఁడు తనజన్మమును, జీవితమును, శ్రుతమును సఫలముగఁ జేయఁదలంచునో, యట్టివాఁడు గంగానదిని జేరి పితృదేవతలకును, దేవతలకును దర్పణమొనర్పవలయును. గంగాస్నానముచేఁ గలిగినఫలము, పుత్రులచేఁ గాని, ధనముచేఁగాని, సత్కర్మముచేఁగాని మానవునకుఁ గలుగ నేరదు. ఎవ్వరు సమర్థులైయుండియు, శుభప్రదయుఁ బవిత్రోదకయు నగుగంగను దర్శింపరో వా రంధులతోడను, సొట్టవారితోడను, మృతులతోడను దుల్యు లనఁబడుచున్నారు. భూతభవ్యభవిష్యజ్ఞులగు

మహర్షులును, నింద్రాది దేవతలును నేజాహ్నవిని సేవించిరో, యట్టి గంగ నేమానవుఁడు సేవింపఁడు? విద్యానిధులగు బ్రహ్మచారులును, గృహస్థులును, వానప్రస్థులును, యతులును నేజాహ్నవి నాశ్రయించిరో, యట్టిజాహ్నవి నేమానవుఁ డాశ్రయింపఁడు? ఎవఁడు, నియమవంతుఁడై శిష్టసమ్మతుఁడై ప్రాణములు పోవునపుడు గంగను దనచిత్తమున నుంచి స్మరించునో, యట్టివాఁ డుత్తమగతి నొందుచున్నాఁడు. ఎవ్వఁడు గంగను సేవించునో, వాఁడు బ్రదికియున్నంతకును రాజులనుండియుఁ, బాపములనుండియు, మఱియేభయములనుండియుఁ గ్లేశమందఁడు. మహాపవిత్రమైనదియు, గగనమునుండి పడుచున్నట్టియు గంగ, నామహేశ్వరుఁడు, తనతలను ధరించి స్వర్గమున సేవించుచున్నాఁడు. నిర్మలములగు మూఁడుగంగామార్గములచే మూఁడులోకములును నలంకరింపఁబడినవి. ఎవ్వఁ డట్టిగంగను సేవించునో, యట్టిపురుషుఁడు కృతకృత్యుఁ డగుచున్నాఁడు. ఆకసమునకుఁ దేజోరూపుఁడగు నాదిత్యుఁడును, బితృదేవతలకు దేవేశుఁడును నెట్టులు సంతోషకరులో, యటులే మానవులకు గంగ యానందదాయక మగుచున్నది. గంగావియోగమువలనఁ గలిగినదుఃఖము మాతృపితృ వియోగముచేఁగాని, దారసుతవియోగముచేఁగాని, ధనవియోగముచేఁగాని గలుగదు. గంగను దర్శించుటచేఁ గలిగినయానందము, చిత్రారణ్యములను జూచినను, నిష్టవిషయములను గాంచినను, బుత్రులను గనినను,ధనాదులు లభించినను గలుగ నేరదు. పూర్ణచంద్రునిఁ గాంచినమానవులదృష్టి యెట్లు ప్రసన్నమగునో, యటులే గంగను దర్శించిన వారిదృష్టి ప్రసన్నమగును. ఎవ్వఁడు భక్తిమెయిఁ గంగను, భావించి, తద్గతచిత్తుఁడై తన్నిష్ఠుఁడగుచుఁ, దత్పరాయణుఁడగునో వాని కాగంగ ప్రసన్నయై ప్రియమొనర్చును. పుడమియందును, నాకసమందును, స్వర్గమందును గల పలువిధములగు ప్రాణులకును గంగ సేవింపఁదగిన దగుటఁ, దెలివిగలపండితులగువారి కెల్లపుడు గంగాసేవన మవశ్యకర్తవ్యము. సకలలోకములందును గంగయే పరమపవిత్రమైనదని ప్రసిద్ధి గలదు. అట్టిదగుటచేఁగాదె, భగీరథుఁడు, మున్ను బూడిదపాలయిన సగరపుత్రుల, నాగంగాజలసంపర్కముచే స్వర్గము నొందింపఁగలిగెను. మఱియు, గాలిచేఁ గదలి, యెగురుచు

మిక్కిలి మనోజ్ఞములగు గంగాతరంగములయందు మునిఁగినవారు సూర్యసమతేజు లగుదురు. యాగీయపయోఘృతము లొసఁగుఫలము నిచ్చుజలముగలదియు, మిక్కిలి గొప్పదియు, సమృద్ధిగలదియు, వేగముగలదియు, దుష్ప్రవేశయునగు గంగ నెవ్వఁడు చేరి శరీరమును విడుచునో, యట్టిపండితుఁడు దేవతుల్యుఁ డగుచున్నాఁడు. యశస్వినియు, మహాత్తరయు, విశ్వరూపిణియు నగుగంగ, యింద్రాది దేవతలకును, మునులకును, మానవులకును సేవింపఁదగుగంగ, తన్ను సేవించినయంధులను, జడులను, ద్రవ్యహీనులను సకలాభీష్టసమన్వితులఁగాఁ జేయును. పశ్వన్నాదుల నొసంగునదియు, మహాపవిత్రమైనదియుఁ, గర్మఫలప్రదయు, త్రిమార్గగామియుఁ, ద్రిలోకగోప్త్రియునగు, గంగ నెవ్వరు సేవింతురో, యట్టివారు స్వర్గము నొందుచున్నారు. ఎవ్వఁడు గంగను దర్శించియుఁ, దత్తీరమున వసించియుఁ బవిత్రుఁడై వెలయునో, వానికి దేవతలు సుఖ మొసంగుచున్నారు. మఱియుఁ దద్దర్శనస్పర్శనములచేఁ దద్భావభావితులగువారికి దేవత లభీష్టముల నిచ్చుచున్నారు. సంసారతారణసమర్థయు, విష్ణుమాతయు, విశాలయు, శుభప్రదయు, సమృద్ధయు, విమలోదకయు, సుప్రసన్నయుఁ, బ్రకాశకరియు, సర్వభూతప్రతిష్ఠయునగు గంగ నాశ్రయించినవారు స్వర్గము నొందుదురు. ఏజాహ్నవిప్రసిద్ధి, నిత్యమై భూమ్యాకాశములందును, స్వర్గమునందును, దిక్కులందును, విదిక్కులందును నిండియుండెనో, నదులలో నుత్తమయగు నాగంగానదిజలమును సేవించినమర్త్యులందఱును గృతకృత్యులగుచున్నారు. మఱియు నిది గంగయని యితరులకుఁ జూపువాని కయ్యది సంసారతరణనిమిత్తమై వెలయును. ఆజాహ్నవి, గుహునకును, సువర్ణమునకును, గర్భధారిణియగు కాంతయై, ధర్మార్థకామప్రదయై జలవాహినియై, దోషరహితయై విశ్వతోముఖోదకయై యాకసమునుండి పుడమికి డిగియెను. మఱియు నాగంగ, హిమవంతునకుఁ బుత్త్రికయై, హరునకు భార్యయై, భూలోకస్వర్గలోకములకనురూపయై, భవ్యయై, ముల్లోకములవారికిని బుత్త్రప్రదయై, మధుస్రవయై, తేజోధారయై, ఘృతవర్చస్కయై, మహాతరంగములతోడను, బ్రాహ్మణులతోడను వెలయునదియై యొప్పెడిని. మఱియు నాకసమునుండి జాఱి, శివునితలపై నిలిచి, త్రిదివమాతయగు నాగంగ,

హిమవంతమునుండి క్రిందికి డిగియెను. మఱియు నాజాహ్నవి, పరమ కారణమైనదియు, నిర్మలమైనదియు, సూక్ష్మరూపయుఁ, బుష్పాచితయుఁ, గీర్తిప్రదయుఁ, బ్రపంచరక్షణ మొనర్చునదియుఁ, నిష్టసిద్ధి నొసంగు నదియు, భువనమార్గమైనదియు నై వెలయుచున్నది. ఆగంగ శాంతికిని, రక్షణమునకును, ధారణమునకును, భూమినాఁదగి, దీప్తిచే రవికృశాను లనఁదగి, బ్రాహ్మణుల పొగడ్త గనుచున్నది. బ్రాహ్మణుల ననుగ్రహించునదగుటఁ, గుమారస్వామికి సమ్మతమైనది. మఱియు, ఋషిసన్నుతయు, విష్ణుపదజనితయుఁ, బరమప్రాచీనయుఁ, బవిత్రతో యమునగు జాహ్నవి నెవ్వరు సర్వాత్మకమగుచిత్తముతో శరణ మందుదురో, వారు బ్రహ్మసదనమునకుఁ బోవుచున్నారు. జాహ్నవి యెల్లవిధములఁ దన్ను సేవించుసజ్జనులను, దల్లిపుత్రులనట్లు చూచును. కావున బ్రహ్మపదముఁ గోరినవారిచే, గంగావారి యెల్లపుడు సేవింపఁ దగియున్నది. అమృతదోహముగల్గినదియుఁ, బుష్టిగలదియు, సర్వమును జూచునదియుఁ, బ్రపంచభోజ్యయు, నన్నమిచ్చునదియు, భూధరధారి ణియు, శిష్టుల కాశ్రయింపఁదగినదియు, నమృతరూపిణియు, బ్రహ్మ కాంతయునగు గంగను సిద్ధికాముఁడై యాత్మజ్ఞుఁడైన మానవుఁ డాశ్రయింపవలయును. మున్ను భగీరథుఁడు తనయుత్తమతపముచే నింద్రాదిదేవతల నందఱఁ బ్రసన్నులఁగావించి, యేగంగను బుడమికిఁ దెచ్చెనో, యట్టిగంగను మఱిమఱియు, నాశ్రయించినమానవుల కిహ పరభయ మించుకయుఁ గలుగనేరదు. ఓయీ! నాబుద్ధిచేఁ జక్కఁగా నాలోచించి యాజాహ్నవిగుణములలోఁ గొన్నిటినిమాత్ర మిపు డేను జెప్పఁగలిగితిని. ఆగుణములనెల్లఁ దెలుపుటకును, గణించుట కును నేను సమర్థుఁడనుగాను. మేరుసముద్రముల పాషాణోదకము లను సర్వరత్నములను లెక్కించిన లెక్కింపవచ్చునుగాని, గంగాజల ములగుణములను లెక్కించుటకును, దెలుపుటకును శక్యముగాదు. కావున, మనోవాక్కాయకర్మములచేఁ బరమశుద్ధమైన భక్తితోడను, శ్రద్ధతోడనుగూడి యెల్లపుడును మానవుఁడు జాహ్నవీగుణముల నెల్లఁ బల్కువాఁడై యుండవలయును. ఓయీ! నీవటు లొనర్తువేనిఁ మూఁడులోకములందును గీర్తిని వెలయఁజేసి, దుర్లభమగు గొప్పసిద్ధిని బొంది, గంగాకృతములగు నుత్తమలోకములఁ జేరి యథేష్టముగా

విహరింపఁగలుగుదువు. నిజధర్మయుక్తములగు నీయొక్కయు నా యొక్కయు గుణములచే, మహానుభావయగు గంగ ముదముచెందుఁ గాక. లోకమున నభిమతజనవత్సలయగు గంగ, భక్తిగలవానికి సుఖములు గలిగించుచున్నది' అని పలికెను.

ఓయుధిష్ఠిరా! అటు లాపరమబుద్ధియగు సిద్ధుఁ డాశిలవృత్తితోఁ బ్రశ్నానురూపముగా సత్యములును, బహువిధములునునగు గంగా గుణముల నెఱిఁగించి, విద్యాశాలియగునతఁడు తేజోనిధియగుచు నాకసమున కెగిరిపోయెను. పిమ్మట నాశిలవృత్తి, యాసిద్ధునివచన ములచేఁ దెలివొంది, యపుడు గంగ నుపాసించి, సుదుర్లభమగు సిద్ధి నొందెను. ఓకౌంతేయా! నీవును నటులే పరమభక్తిగలిగి యెల్లపు డును గంగాసేవన మొనర్పుము. ఉత్తమసిద్ధి నొందఁగలవు." అని తెలిపెను.

ఓజనమేజయా! భీష్మునిచేఁ దెలుపఁబడిన, స్తోత్రసంయుక్తమగు నాగంగాచరిత్రమును, విని యుధిష్ఠిరుఁడు తనతమ్ములతోఁ గూడ నెంతయు సంతసమొందెను. పరమపవిత్రమగు నీయితిహాసమును వినిన వాఁడును, బఠించినవాఁడును, సకలపాపవిముక్తుఁ డగుచున్నాఁడు." అని తెలిపెను. అంత నాభీష్మునివచనములు విని యుధిష్ఠిరుఁడు మఱియు ని ట్లనియె.

### ఇంద్రమతంగ సంవాదము

"ఓపితామహా! ప్రజ్ఞయు, శ్రుతము, వృత్తము, శీలముగలిగిన వాఁడవు. వివిధములగు పెక్కుసద్గుణములును, వయసునుగలవాఁడవు. మఱియుఁ దపోబుద్ధి ప్రజ్ఞలచే నెల్లవారిని మించినవాఁడవు. కావున నోధర్మజ్ఞా! నిన్ను ధర్మమడుగుచున్నాఁడను. ఓరాజోత్తమా! లోక ములందు నీకుఁదక్క వేఱొక్కఁడు ప్రశ్నింపఁదగినవాఁడె లేఁడు. అటులగుట నీవ తెలుపవలయును. క్షత్రియవైశ్యశూద్రులలో నెవఁ డేని బ్రాహ్మణ్య మొందవలయునన్నచో, నెటు లొందఁగలుగునో, యది నాకెఱిఁగింపుము. ఆబ్రాహ్మణ్యము తపముచేఁ గల్గునా? గొప్ప సత్కర్మముచే నగునా? శ్రుతముచే సమకూఱునా?"

అది విని భీష్ముఁ డయ్యుధిష్ఠిరునితో "ఓధర్మజా! క్షత్రియాదు లగు మూఁడువర్ణములవారికిని, బ్రాహ్మణ్యము దుర్లభము. ఓయుధిష్ఠిరా! సకలభూతములకును బ్రాహ్మణ్య ముత్తమస్థానము. మఱి మఱియుఁ బెక్కుజన్మములొంది, పెక్కుయోనులజనించి, తుది కెపుడో బ్రాహ్మణయోనియందు జనించును. ఓయుధిష్ఠిరా! ఇందుల కుదాహరణముగాఁ బురాతనమగు నొకయితిహాసము దెలిపెదను. అయ్యది మతంగునకును గర్దభికిని జరగినసంవాదము. ఒకపు డొక బ్రాహ్మణునకుఁ దుల్యవర్ణుఁడగు నొకకొమరుఁ డుదయించెను. వానిపేరు మతంగుఁడు. వాఁడు సకలసద్గుణసమన్వితుఁడై యన్యజాతిస్త్రీసంభూతుఁ డయ్యును బ్రాహ్మణతుల్యుఁ డనఁదగియుండెను. వాఁడొకపుడు, యజ్ఞము చేయించువాఁడై తండ్రియాజ్ఞగొని, వడిగాఁ బోవునట్టి గర్దభముఁ బూన్చిన యొకరథము నెక్కి వెడలి, తల్లికిఁ జేరువగాఁ బోవుచున్న పిన్నదగు తనరథగర్దభము వడిగా నడుచుటకై దానిమోరపైఁ బ్రతోదముచే మఱిమఱియుఁ గొట్టెను. అపు డాపిల్లగాడిదముఁ గలిగిన తీవ్రవ్రణమును జూచి దానితల్లి పుత్రప్రేమచేఁ బరితపించుచు, 'ఓపుత్రకా! నీవు చింతింపకుము. నిన్నధిష్ఠించినవాఁడు చండాలుఁడు. సామాన్యముగా బ్రాహ్మణుఁడై యుండఁడు. బ్రాహ్మణునకు మైత్రి యుండునని చెప్పుదురు. సర్వభూతములకు నాచార్యుఁడై యాచారములను శాసించు బ్రాహ్మణుఁడు ప్రహరించునా? పాపప్రకృతియగు వీఁడు బాలుఁడవగు నీయందు దయచూపకున్నవాఁడు. వీఁడు తనదగు మానవయోనిని గౌరవించుచున్నాఁడు. ఎందను స్వజాతిభావమే బుద్ధిని నియమించుచుండును.' అని పలికెను. అంత నామతంగుఁ డాయాఁడు గాడిద నుడు లాలించి, వడిగా రథముడిగి, దానితో 'ఓకళ్యాణీ! రాసభీ! నాతల్లి యెవనిచేఁ జెఱుపఁబడినది? నేను జండాలుఁడ నెట్లు లయితినో, వడిగా నాకెఱిఁగింపుము. నాబ్రాహ్మణ్య మెట్లు చెడిపోయెను? నేనెట్లు చండాలుఁడనైతిని? అదియెల్ల యథార్థముగాఁ దెలుపుము.' అని ప్రశ్నించెను. అంత నాగార్దభి, 'ఓరీ! నీవొకశూద్రునిచే నాపిత మత్తయగు నొకబ్రాహ్మణియందు జనించినవాఁడవు. అటులగుట నీవు చండాలుఁడవైతివి. నీబ్రాహ్మణ్యము నశించెను.' అని ప్రత్యుత్తర మిచ్చెను. అది విని మతంగుఁడు తనయింటికి మరలిపోఁగా, నటులు

వచ్చిన తనతనయునిఁ గాంచి తండ్రి, 'ఓపుత్రకా! గొప్పదగుయజ్ఞ కర్మమును జేయింప నిన్ను నియోగించితినిగదా! నీవప్పని చేయక మరలితివేమి? నీకేమి నేమమునఁ గొఱంతవడియెనా?' అని యడిగెను. అది విని యామతంగుఁడు, 'ఓనాయనా! నేను జండాలయోనిజాతుఁడనో యింకేయోనియందుఁ బుట్టినవాఁడనో! నాకుఁ గుశల మెట్టులు? ఓతండ్రీ! ఎవ్వని కిట్టి తల్లియో యట్టి నాకు నేమ మన నెట్టిది? అమానుషియగు నీగాడిద, యొకబ్రాహ్మణియం దొకవృషలునివలన జనించినవానిఁగా నన్నుఁ దెలుపుచున్నది. కావున నే నిఁక గొప్పతప మొనర్పఁ బోయెదను.' అని పలికి వ్రతమునెడఁ గృతనిశ్చయుఁడై మహారణ్యమునకుఁ బోయి, గొప్పతప మాచరింపఁ దొడంగెను. అటు లాత డారంభించి, లోకాతీతమగు సుచరితస్థానమును సుఖమును గోరుచు, ఘోరతప మొనర్చి సురలకు వెఱపొదవించెను. అటు లెంతయుఁ దపము చేయు నామతంగున కింద్రుఁడు పొడసూపి, 'ఓమతంగా! మానుష భోగములనెల్లఁ బరిత్యజించి నీవిట్లు తపమేల చేసెదు? నీకేమి కావలయునో యొకవరము గోరికొమ్ము ఇంకను నీచిత్తమున నేమి గలదో, యది వడిగాఁ దెలుపుము' అని ప్రశ్నించెను. అంత నామతంగుఁడు, 'ఓయింద్రా! నేను బ్రాహ్మణ్యమును గోరి యీతపోవిధి నారంభించితిని, దీని బడసి పోయెదను. నా కీవర మొసంగుము' అని యడిగెను.

ఓయుధిష్ఠిరా! ఆమతంగునివచన మాలించి యప్పురందరుఁడు 'ఓమతంగా! నీవు విప్రత్వమును గోరుచున్నాఁడవు. కాని యది నీకు దుర్లభము. నీవు గోరినబ్రాహ్మణ్య, మకృతాత్ము లగువారికి దుర్లభము. ఓదుర్బుద్ధీ! నీ వాబ్రాహ్మణ్యమును గోరుదేని నశింతువు కావున నీ వీయుద్యమమునుండి మరలుము. జాగుసేయకుము. తపము సర్వభూత శ్రేష్ఠమగుబ్రాహ్మణ్యము నెన్నఁడును మించనేరదు. అట్టి యుత్తమపదమును గోరుదువేని, వడిగా నశింపకమానవు. దేవతాసురమానవులందెది పరమపవిత్రమైనదని స్మృతులందుఁ దెలుపఁబడియెనో, యట్టి బ్రాహ్మణ్యము, చండాలయోనియందు జనించిన నీకెట్లు లభించెడిని?' అని పలికె"నని తెలిపి భీష్ముఁడు మఱియు నిట్లనియె.

ఓయుధిష్ఠిరా! ఆయింద్రుఁ డట్లు పలుక వినియు నామతంగుఁడు మఱియు సంశితాత్ముఁడును, యతవ్రతుఁడును నై యొకపాదముపై

నిలిచి, తొలఁగక నూఱేండ్లు తపమొనర్చుటయు, నపు డింద్రుఁడు మఱియు నాతనికిఁ గానవచ్చి యాతనితో 'ఓనాయనా! దుర్లభమగు బ్రాహ్మణ్యమును గోరుచున్నాఁడవుగాని, యది నీకెన్నటికిని లభింపదు. ఓమతంగా! నీ వీపరమస్థానమును గోరుచుండుదేని నశింతువుసుమీ! ఓపుత్రా! నీవు సాహసము చేయకుము. నీకిది ధర్మముగాదు. ఓదుర్మతీ! నీవీలోకమున బ్రాహ్మణ్యమును బొందనేరవు. పొందరానిస్థానమునొందఁ దలంచితివేని, యలఁతికాలమున మ్రందకమానవు. ఓమతంగా! ఈ యుత్తమస్థానమునుండి, యపేక్షవిడిచి తొలఁగుమని నేను బలుమఱు తెలిపి నివారించుచున్నాఁడను గదా! నాయీవచనముచొప్పవట్టక, నీ వాయుత్తమస్థానము గోరుదేని, నీతప మేమియు ఫలింపదు. తిర్యగ్యోనిగతమగు ప్రాణికోటి సకలము నొకపుడు మానుష్యమునొందినను నొందవచ్చును; కాని చండాలుఁడుగను, బుల్కసుఁడుగను జనించుట కిచ్చవహింపదు. పుల్కసుఁడుగాని, చండాలుఁడుగాని, మఱియు జనింపవలసివచ్చినను వాఁ డాపుల్కసాదియోనులందే జనించుచుండును. పిదప నేవేయిసంవత్సరములకో వాఁడు శూద్రయోనియందు జనించి, యనంతర మాశూద్రయోనియందే యటులు పలుమఱు జనించుచుఁ, బిమ్మట మఱిముప్పదివేలవత్సరములయినతరువాత, వాఁడు వైశ్యత్వమొందును. అటు లావైశ్యత్వమొంది పెక్కుకాల మావైశ్యయోనులందే జనించి జనించి, మాఱియాఱురెట్టులకాల మతిక్రమించినపిదప క్షత్రియత్వ మొందును. అటులు క్షత్రియుఁడై పుట్టి పుట్టి, మఱి యఱువదిరెట్లకాల మతిక్రమించినపిదప వాఁడు బ్రహ్మబంధుఁడగును. అటులు బ్రహ్మబంధుఁడై చిరకాలమటులే జనించుచుఁ, బిదపఁ బెక్కుకాలము కాఁగా జపపరులయింట జనించును. అటులు జనించి పెక్కుకాల మటులే పరివర్తనమందుచు, నాల్గువందలవత్సరములయిన పిమ్మట శ్రోత్రియుఁడై పుట్టును. అటులు శ్రోత్రియత్వమొంది యందే చిరకాలముండి, యందు శోకహర్షములను గామద్వేషములను బొందవలసినవాఁడగును. అటులే వాని, నతిమానాతివాదము లావేశించును. అపుడు శత్రువులగు నాకామద్వేషాదులను వాఁడు జయించెనేని సద్గతిని బొందును. లేక యాకామాదులే వానిని జయించెనా? వాఁడు తాటిచెట్టుపై నుండివలెఁ గ్రిందికిఁబడును.

ఓమతంగా! ఇదియెల్లఁ దెలిసియే నేను నీ కిట్లుపదేశించుచున్నాఁడను. కావున, సుదుర్లభమగు బ్రాహ్మణ్యముదక్క వేఱొక్కవరముఁ గోరి కొమ్ము." అని పలికెనని తెలిపి భీష్ముఁడు మఱియు నిట్లనియె.

ఓయుధిష్ఠిరా! అంత నామతంగుఁ డాయింద్రునిపలుకులు మఱియు నాలించియు, తనపూనిక విడువక యెప్పటియట్ల సంశితాత్ముఁడును, యతవ్రతుఁడునై వేయేండ్లొక్కరీతిగా నొకపాదముపై నిలిచి ధ్యానమొనర్చువాఁ డయ్యెను. అంత నాయింద్రుఁడు వానిని మఱియుఁ జూచువాఁడై వచ్చి, యెప్పటి చొప్పుననే పలికెను.

అది విని యామతంగుఁడు, 'ఓయింద్రా! నేనిటులు వేయేండ్లొక్కవిధముగా, నొకపాదముపై నిలిచి బ్రహ్మచారినై సమాధినిష్ఠనుండితినికదా! ఇంకను నాకు బ్రాహ్మణ్యము లభింపకుండు టెట్లు?' అని ప్రశ్నించెను. అంత నాయింద్రుఁ డామతంగునితో 'ఓయీ! చండాలయోనియందు జనించినవాని కెన్నఁటికిని బ్రాహ్మణ్యము లభింపదు. కావున నీ వీవ్యర్థశ్రమ మొందక వేఱొకవరము కోరికొనుము.' అని పలుకుటయు నామతంగుఁ డెంతయు శోకాకులమానసుఁడై గయకుఁ బోయి, యందొక నూఱేం డ్లొకయంగుష్ఠముపై నిలిచి, వహింపరాని యోగమువహించి, కృశుఁడై నాడులు పైకిఁ గానరా నెమ్ముకలును చర్మమును మాత్రము మిగుల, ధర్మాత్ముఁడగు నతఁడు పుడమిం బడియెనని మావినికి. అపు డటులు పడుచున్న యమ్మతంగునికడకు వడిగా నవ్వాసవుఁడు వచ్చి పట్టుకొని, వరాధీశుఁడును, వరదాతయు, సర్వభూతహితరతుఁడునగు నాశతక్రతుఁడు 'ఓమతంగా! నీకు బ్రాహ్మణ్యము విరుద్ధముగా నగపడుచున్నది. బ్రాహ్మణ్యము మిక్కిలి దుర్లభమైనది. అది పెక్కువిఘ్నములచే నావరింపఁబడియుండుట సులభముగాదు. బ్రాహ్మణునిఁ బూజించినవాఁడు సుఖమును, బూజింపనివాఁడు దుఃఖమును బొందుచున్నాఁడు. బ్రాహ్మణుఁడే సకలభూతములకును యోగక్షేమములను గలిగించువాఁడు. బ్రాహ్మణులవలననే పితరులును, దేవతలును దృప్తినొందుచున్నారు. ఓమతంగా! సకలభూతములకంటెను బ్రాహ్మణుఁడుత్తముఁడని చెప్పబడుచున్నాఁడు. బ్రాహ్మణుఁ డేమేమి వాంఛించునో, దానినెల్లఁ బడయఁగల్గుచున్నాఁడు. పెక్కుయోనులందు మఱిమఱియు జనించి జనించి క్రమముగా నొకబ్రాహ్మణుని గర్భమున

జనించును. కావున నీ కీజన్మమున దుర్లభమగు బ్రాహ్మణ్యమునెడ నాస విడిచికొని వేఱొకవరము గోరికొమ్ము. నీవు కోరినవరము దుర్లభము.' అని పలికెను.

అంత నామతంగుఁడు 'ఓమహానుభావా! దుఃఖార్తుఁడనగు నన్నేల యిట్లు పీడించెదు? చచ్చినవానిని జంపుచున్నాఁడవు. నిన్నుఁ గూర్చి విచారించుచున్నాఁడను. నీవు బ్రాహ్మణ్యమునొందియు దుర్లభమనుచున్నాఁడవే, మూఁడువర్ణములవారికిని బ్రాహ్మణ్యమే దుర్లభమేని, యట్టి దుర్లభమగుదాని నొందియు, మానవులు నిలుపుకొనఁగలరా? దుర్లభమగు ధనమునట్లు బ్రాహ్మణ్య మొందియు నెవఁడు దాని నవమానించునో, వాఁడు పాపులలో, బాపుఁడును, వారిలో నధముఁడు నగుచున్నాఁడు. దుష్ప్రాపమును, దురనుపాలనమును, దుఃఖావహమునగు విప్రత్వము నొందియు మానవులు దానిని నిలుపుకొనఁజాలరు. ఓశక్రా! నేను నిర్ద్వంద్వుఁడను, నిష్పరిగ్రహుఁడను, నేకారాముఁడనై యహింసాదమముల నాశ్రయించియుండియు, విప్రత్వమేల పొందరాదు? నేను మాతృదోషమువలన నిట్టి యవస్థనొంది యుండుట దైవవశము గదా! ఓపురందరా! నీవు ధర్మజ్ఞుఁడవు గాదే? దైవమును బౌరుషముచే నతిక్రమింప వలనుపడదనుట నిశ్చయముగదా! నేను దేనికై యిట్టియత్న మొనర్చితినో, యట్టివిప్రత్వ మొందకున్నాఁడను. ఓధర్మజా! ఇటులగుట, నీకు నే ననుగ్రాహ్యుఁడనేని, నాకేమేని సుకృతము గలదేని, నా కీవరము నొసంగుము.' అని పలికెను.

ఓజనమేజయా! ఆమతంగుని నడు లాలించి, యాయింద్రుఁడు, 'ఓయీ! వరము గోరికొమ్ము' అని పలుకుటయు, నామతంగుఁడు, 'ఓపురందరా! నేను గామరూపినై పక్షివలె స్వేచ్ఛావిహారి నెట్లగుదునో, యటు లొనర్పుము. బ్రహ్మక్షత్రముల కవిరోధముగా, నేను బూజలందుచుండునట్లు గావింపుము. ఓదేవా! నాకక్షయమగుకీర్తి గలుగవలయును. ఈనావాంఛితములు సిద్ధించునట్లు వర మొసంగుము. ఇదె నీపాదములపైఁ బడుచున్నాఁడను.' అని ప్రార్థించెను. అది విని యింద్రుఁడు 'ఓమతంగా! నీవు ఛందోదేవుఁడను ప్రసిద్ధివడసి స్త్రీలకుఁ బూజ్యుఁడగుదువు. ఓవత్సా! మూఁడులోకములందును

నీకు నిరుపమానకీర్తి గలిగెడిని' అని యిట్లు వరమొసఁగియా యింద్రుఁ డంతర్ధానమొందెను. ఓధర్మజా! బ్రాహ్మణ్య మిట్లు పరమస్థాన మైనది. మహేంద్రుఁడు చెప్పినట్లు బ్రాహ్మణ్య మెంతయు దుర్లభమైనదని తెలియుము." అని తెలుప విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె.

## వీతహవ్యోపాఖ్యానము

"ఓపితామహా! బ్రాహ్మణ్యము మిక్కిలి దుర్లభమని తెలుపుచు గొప్పయాఖ్యానము చెప్పితివి. మున్ను విశ్వామిత్రుఁడు బ్రాహ్మణ్య మొందెనని వినుచున్నారముగదా! అటులగుట నది దుర్లభమగుటెట్లు? మఱియు వీతహవ్యుఁడను రాజు విప్రత్వ మొందెననియు వినియుంటిని. ఓగాంగేయా! తచ్చరిత్ర మెట్టిదో వినఁగోరుచున్నాఁడను. ఆరాజ సత్తముఁ డెట్టిసత్కర్మముచే బ్రాహ్మణ్య మొందెను. ఒకనివరముచే బ్రాహ్మణుఁడయ్యెనా? లేక తపముచే నాతనికి విప్రత్వము సిద్ధించెనా? అదియెల్ల నాకెఱిఁగింపుము."

అది విని భీష్ముఁడు "ఓధర్మజా! మహాయశుఁడగు వీతహవ్యుఁడు, లోకసత్కృతమై మిక్కిలి దుర్లభమగు బ్రాహ్మణ్య మెట్లొందెనో, తెలిపెదను వినుము. ఓనాయనా! ధర్మయుక్తముగాఁ బ్రజలను బరిపాలించుచు, మహాత్ముఁడైన మనువునకు, ధర్మాత్ముఁడగుశర్యాతి, పుత్త్రుఁడై యుండెను. ఓయుధిష్ఠిరా! వానివంశమున వత్సుఁడనువానికి, హైహయుఁడు, తాలజంఘుఁడు ననియెడిరాజులు సంభవించిరి. వారిలో హైహయునకుఁ బదుగురుభార్యలు గలరు. వారియం దాతనికి శూరులును, యుద్ధాభిలాషులును, దుల్యరూపప్రభావులును, బలవంతులు నగు నూర్వురుపుత్త్రులు జనించిరి. వారు ధనుర్వేదమందును, వేదమందును, మఱియుఁ గలవిద్యలందును బరిశ్రమచేసిరి. ఇటులుండఁ, గాశిలో దివోదాసపితామహుఁడగు హర్యశ్వుఁడనువాఁడు వీతహవ్యదాయాదులగు హైహయపుత్త్రులతోఁ గలిసి గంగాయమునలనడుమదేశమునఁ బోరాడి, వారిచే హతుఁడయ్యెను. అంత నామహారథులగు హైహయు లాగరపతిని జంపి, నిర్భయులై రమ్యమగు నిజపత్తనమునకుఁ బోయిరి. పిదప హర్యశ్వదాయాదుఁడును, దేవతుల్యుఁడు నగు సుదేవుఁడు మూర్తీభవించినధర్మ మట్లు వెలయుచుఁ గాశికి రాజై

యభిషేకింపఁబడియెను. అటు లభిషిక్తుఁడై యాకాశిరాజు, ధర్మము దప్పక పరిపాలించుచుండ, మఱియు నాహైహయులువచ్చి యుద్ధమున వానిని జయించిపోయిరి. పిమ్మట నాసుదేవపుత్త్రుఁడును, గాశీశుఁడు నగు దివోదాసుఁడు రాజ్యాభిషిక్తుఁడై మహాత్ములగు నాహైహయుల పరాక్రమ మెఱిఁగి, మహాతేజుఁడై యింద్రుని శాసనముచే, వారాణసి నిర్మించెను. అయ్యది విప్రక్షత్త్రియసమాకులమై, వైశ్యశూద్రసమృద్ధమై బహువిధద్రవ్యసమృద్ధమై, మనోహరవిపణములు నాపణములు గలిగి, గంగానది యుత్తరతీరమున, గోమతికి దక్షిణమునను, నింద్రుని యమరావతివలె నెంతయు విరాజిల్లెను. ఓధర్మజా! అం దారాజశార్దూలుఁడగు దివోదాసుఁడు నివసించియుండఁగా హైహయు లచ్చోటికెప్పటిచొప్పునఁ బరువులిడిరి. అప్పు డామహాబలుఁడగు రాజు పురము వెడలి వారితో యుద్ధము చేయఁదొడంగెను. అటులు సన్నద్ధుఁడై మహాద్యుతియగు దివోదాసుఁడు, వేయిదినము లొక్కరీతిగా, దేవాసురసమరతుల్యమగు ఘోరసమర మొనర్చి హతవాహనుఁడై సైన్య మడర, హతయోధుఁడును, క్షీణకోశుఁడును నగుచుఁ, బురమువిడిచి పలాయనపరుఁడయ్యెను. ఓయుధిష్ఠిరా! అటు లాదివోదాసుఁడు పలాయితుఁడై రమ్యమగుభరద్వాజు నాశ్రమముచేరి కృతాంజలియై యాతని శరణుచొచ్చెను. బృహస్పతికి జ్యేష్ఠపుత్త్రుఁడును, శీలసంపన్నుఁడును, నాభూపతికిఁ బురోహితుఁడునగు నాభరద్వాజుఁ డాదివోదాసునిఁ గాంచి, 'ఓరాజా! నీవిందులకు రాఁగతమేమి? నీకుఁ బ్రియమెయ్యదియో తెలుపుము. నీకుపకార మొనర్చుటలో నాకేమియు నాలోచింపవలసినది లేదు.' అని పలికెను. అదివిని యారాజు 'ఓదేవా! యుద్ధములందు నావంశమెల్ల వీతహవ్యదాయాదులచే నశింపఁజేయఁబడియెను మావంశమున నేనొకండనే మిగిలి నిన్ను శరణమొందితిని. ఓభగవానుఁడా! శిష్యస్నేహము చూపి, నీవు నన్ను రక్షింపదగుదువు. పాపాత్ములగు నాహైహయులచే నావంశ మేకశేషమై చేయఁబడియెను.' అని పలుకుటయు, మహాభాగుఁడును బ్రతాపశాలియునగు నాభరద్వాజుఁడు, 'ఓసుదేవతనయా! నీవు భయపడకుము, భయపడకుము, ఇఁక నీవు భీతి విడువవచ్చును. ఓ రాజా! నీకుఁ బుత్త్రులు గలుగుటకై నేనొకయిష్టి చేయించెదను,

దానిచే నీవు వేలకొలఁది వీతహవ్యదాయాదులను వధింపఁ గలవు.' అని పలికి యమ్మహర్షి యాదివోదాసునిచేఁ బుత్రకామేష్టిని జేయించెను. పిమ్మట వానికిఁ బ్రతర్దనుఁడను నొకపుత్త్రుఁడుద యించెను. వాఁడు పుట్టినతోడనే వృద్ధినొంది పదుమూఁడువత్సర ములవాఁడయ్యెను. ఓయుధిష్ఠిరా! ఆప్రతర్దనుఁడు, వేదమంతయు నభ్యసించి, ధనుర్వేదమునఁ గుశలుఁడై, ధీమంతుఁడగు నాభరద్వా జునివలన యోగాభ్యాసమొనర్చి, మిక్కిలి తేజముగలిగియుండెను. ఇంతయేల? ఆతనియోగబలముచే లోకమునఁగల తేజమెల్ల నాతని యందావేశించెను. పిమ్మట నతఁడు, కవచియు, ధన్వియు నై మహ ర్షులచే సంస్తూయమానుఁడగుచు, వందులపొగడ్తలుగొనుచు, నుదయ కాలసూర్యునట్లు లెంతయు విరాజిల్లెను మఱియు నాప్రతర్దనుఁడు, రథ మధిరోహించి, కత్తికట్టుకొని, ప్రజ్వలితాగ్నివలెఁ బ్రకాశించెను. అంత నతఁ డొకపుడు, కత్తియుఁ గేడెముపట్టుకొని, ధనువు ద్రిప్పుచు, వెడలుటయు, నాతనిఁ గాంచి, దివోదాసుఁడు పరమానందభరితుఁ డయ్యెను. అపు డాతనికిఁ దనతనయుఁ డావీతహవ్యదాయాదులను దహించునను నిశ్చయ మొదవెను. పిమ్మట నాదివోదాసుఁడు తనతన యుఁడగు ప్రతర్దనుని యౌవరాజ్యమున నిలిపి, యపుడు తన్నుఁ గృతకృత్యునిఁగాఁ దలంచి సంతసించెను. పిదప నాదివోదాసుఁడు హైహయులను వధించుటకై, శత్రుఘాతకుఁడగు తనపుత్త్రునిఁ బ్రత ర్దనునిఁ బ్రయాణముచేయ, నతఁడు రథాధిరూఢుఁడై పరాక్రమ మడర గంగానదిని దాఁటి, వీతహవ్యదాయాదుల పురముపైకిఁ బోయెను. అపు డాహైహయులు, మహత్తరమై వెడలిన యాప్రత ర్దనుని రథధ్వానమును విని, వైరిరథ పీడాకరములై నగరాకారము లగురథము లధిష్ఠించి, వెడలి, కవచధారులగు నవీరులు చిత్రయో ధులై, యుదాయుధులై యాప్రతర్దనుని శరవర్షమున ముంచిరి. ఓ యుధిష్ఠిరా! వివిధములగుశస్త్రములచే నాహైహయు లాభూపతిని, మేఘములు హిమవంతమును బోలెఁ గప్పుటయు, నాప్రతర్దనుఁడు వారియస్త్రములనెల్ల నిజాస్త్రములచే నివారించి, మహాతేజులగు వారిని, వజ్రాగ్నితుల్యములగు నిజశరపరంపరలచేఁ గొట్టుటయు, నాతని సహస్ర సంఖ్యాకములగు భల్లములచే ఛిన్నశిరస్కులై

మేనుల రక్తములు స్రవింప, నఱుకఁబడిన మోదుగులట్లు పుడమిఁ బడిరి. అటులు వారెల్ల హతులగుడు నపు డావీతహవ్యుఁడు నిజనగరమువిడిచి భృగువునాశ్రమమునకుఁ బోయి, యాభూపతి యామౌని శరణముఁగోరెను. ఓ రాజా! అపు డాభృగు వావీతహవ్యున కభయ మొసఁగియుండునంతఁ, దత్క్షణ మందుల కాప్రతర్దనుఁ డరుదెంచి, యాభృగువునాశ్రమముచొచ్చి, 'ఓయి! ఓయి! భృగుశిష్యులారా! మహాత్ములారా! ఈయాశ్రమమున నెవరు? మీగురువరుఁడగు భృగుమహర్షిని గాంచవచ్చితిని. నారాక యాతని కెఱిఁగింపుఁడు.' అని పలికెను. అంత నాభృగు వాప్రతర్దనునిఁ దెలిసికొన, యాశ్రమమునుండి వెడలివచ్చి విధ్యుక్తముగా, నారాజోత్తమునిఁ బూజించి మఱియు నాతనితో 'ఓరాజేంద్రా! నీ వేమిపనిపై వచ్చితివో తెలుపుము.' అని పలుకుటయు, నానృపతి, నిజాగమనకారణము తెలుపువాఁడై 'ఓమహర్షివర్యా! నీచే నీవీతహవ్యభూపతి విడువఁబడుఁగాక. వానిపుత్త్రులచే నావంశమువారెల్ల నిర్మూలింపఁబడిరి. రత్నసంచయముగల మాకాశీదేశమెల్ల నశింపఁజేయఁబడియెను. అటులగుట వీరదృప్తుఁడగు వీనిపుత్త్రశతమును నేను వధించితిని. ఇపుడు వీనిని వధించి నాపితరులఋణము తీర్చికొనియెదను.' అని పలికెను. అది విని ధర్మజ్ఞుఁడగు భృగువు దయాళువై యాప్రతర్దనునితో 'ఓరాజా! నాయీ యాశ్రమమున క్షత్త్రియుఁ డెవ్వఁడును లేఁడే! ఇందుఁగలవారందఱును బ్రాహ్మణులు' అని తెలుపుటయు, నాప్రతర్దనుఁ డాభృగువు సత్యవచనము విని, సంతుష్టుఁడై యాతని పాదములఁ బట్టికొని మెల్లగా నాతనితో, 'ఓభగవానుఁడా! ఇటులేని నేను గృతకృత్యుఁడ నగుచున్నాఁడను. అందు సందియము లేదు. ఈ రాజు నాపరాక్రమముచే స్వజాతినుండి నాచేఁ దొలఁగింపఁబడినవాఁడుగదా! ఓబ్రాహ్మణోత్తమా! నాకనుజ్ఞయొసంగుము. నాకు శుభములగునట్లులు తలంపుము. ఓభృగూద్వహా! ఈధరాపతిజాతి నాచే విడిపింపఁబడినదిగదా!' అని పలికి యాప్రతర్దనుఁడు, భృగుమహర్షి సెలవుగొని వెడలిపోయెను. ఓమహారాజా! అంత నావీతహవ్యుఁడు భృగుమహర్షి వచనమాత్త్రమున బ్రహ్మర్షియై బ్రహ్మవాదిత్వ మొందెను. వానికి గృత్సమదుఁడనుపుత్త్రుఁ డొకఁడుగలఁడు. వాఁడు రూపముచే

నింద్రునిఁ బోలినవాఁడు. అతఁ డింద్రుఁడని తలంచి, దైత్యు లాతని నిగ్రహించిరఁట. మహాత్ముఁడగు నాతనివిషయమున, 'గృత్సమదుఁడు బ్రాహ్మణుల కీడై మహనీయుఁ డనఁబడుచున్నాఁడు' అని ఋగ్వేదమున నుత్తమశ్రుతి చెప్పుచున్నది. ఆగృత్సమదుఁడు, విప్రర్షియై బ్రహ్మచారియై వెలయుచుండెను. ఆగృత్సమదునకు సుతేజుఁడను పుత్త్రుఁ డుదయించెను. ఆసుతేజునికొడుకు విహవ్యుఁడు. వాని కొడుకు వితత్యుఁడు. ఆవితత్యునికొడుకు సత్యుఁడు. సత్యునికుమారుఁడు సంతుఁడు. వానికొడుకు శ్రవుఁడు. శ్రవుని పుత్త్రుఁడు తమసుఁడు. తమసునితనయుఁడు ప్రకాశుఁడు. ఆప్రకాశుని కొడుకు వాగింద్రుఁడు. జపితయగు నావాగింద్రుని సుతుఁడు ప్రమతి. వేదవేదాంగ పారగుఁడగువానికి ఘృతాచియందు రురువనువాఁడు పుత్త్రుఁడై జనించెను. ఆరురునకుఁ బ్రమద్వరయందు శునకుఁ డనువాఁడు జనించెను. వాని కొడుకు శౌనకుఁడు. ఓయుధిష్ఠిరా! ఇటు లానరాధిపుఁడగు వీతహవ్యుఁడు విప్రత్వ మొందెను. ఆక్షత్త్రియునకు విప్రత్వమాభృగుమహర్షియనుగ్రహమువలనఁ గలిగెను. నే నిపుడు నీ కాగృత్సమదుని వంశము విధముఁ దెలిపితిని సవిస్తరమగు దీనిని వింటివిగదా! ఇఁక నేమి వినఁగోరెదు?" అని పలుక విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె.

## శ్రీకృష్ణనారదసంవాదము

"ఓపితామహా! నీవెన్ని చెప్పినను దృప్తిగలుగకున్నది. మానవులలో నెవ్వరు పూజ్యులో సవిస్తరముగాఁ దెలుపుము.

అది విని భీష్ముఁడు "ఓయుధిష్ఠిరా! నీవడిగినప్రశ్నమున కుత్తరముగా, నొకపురాతనేతిహాస మెఱిఁగించెదను. వినుము. అయ్యది వాసుదేవ నారదులకు జరిగినసంవాదము. ఒకపుడు, బ్రాహ్మణపూజాపరుఁడై యున్న నారదునిఁగాంచి వాసుదేవుఁడు 'ఓదేవా! నీ వెవ్వరికి నమస్కరించెదు? మానవులం దెవ్వరు నీకు బహుమానపాత్రులై నీ నమస్కారమున కర్హులు? ఓధర్మవిత్తమా! ఈవిషయము వినఁగోరుచున్నాను' అని ప్రశ్నించెను. అదివిని యానారదుఁడు, 'ఓగోవిందా! వినుము. నేనెవ్వరిని బూజింతునో యెఱిఁగించెదను. లోకమున

నీకంటె నిది విన నర్హుఁడెవ్వఁడు ? వాయువరుణాదిత్యులను, బర్జన్యజాతవేదసులను, స్థాణుస్కందులను, లక్ష్మీనారాయణులను, బరమేష్ఠిని, వాచస్పతినిఁ, జంద్రునిఁ, బృథ్వీజలములను, సరస్వతిని నెవ్వ రారాధింతురో వారికి నే నమస్కరింతును. ఓవృష్ణిశార్దూలా! మఱియుఁ దపోధనులను, వేదవేత్తలను, వేదసక్తిగలవారిని, నేనెల్లపుడును బూజించువాఁడను. ఎవ్వారు గర్వరహితులై తాము భుజింపక దేవకార్యము లొనర్తురో, మరియు నెవ్వారు సంతుష్టియు శాంతియుఁ గలిగి ప్రవర్తింతురో, వారికి నేను నమస్కారమొనర్తును. ఎవ్వారు వేదమునొంది దుర్ధర్షులై బ్రహ్మప్రచారులై నిత్యమును యాజనాధ్యాపనపరులై యుండుదురో, వారిని నేను బూజించువాఁడను. మఱియు నెవ్వారు, లెస్సగా నిష్టులఁ జేయుచు శాంతులు దాంతులు జితేంద్రియులు నై సత్యమును, ధర్మమును, బుడమిని, గోవులను రక్షింతురో, వారిని నేను బూజింతును. మఱియు నెవ్వ రరణ్యమునఁ దపోనిష్ఠ గలిగి మూలఫలాశనులై ద్రవ్యసంచయ మక్కఱలేక సత్క్రియాపరులై ప్రవర్తిల్లుదురో, వారిని నే నాదరింతును. ఎవ్వారు భృత్యభరణసమర్థులై నిత్యము నతిథి పూజసలుపుచు, దేవశేషములను భుజింతురో, వారిని నే నారాధింతును. నిత్యము సకలజంతువులయందును బ్రసన్న హృదయులై మధ్యాహ్న కాలమగు నంతకును స్వాధ్యాయపరులై ప్రవర్తిల్లుదురో, వారిని నేను గౌరవింతును. ఎవ్వారు స్థిరవ్రతులై గురుప్రసాదముచే స్వాధ్యాయ మలవఱుచుకొన, వారిసేవలు చేయుచు, నసూయారహితులై చరింతురో, వారిని బూజింతును. మఱియు నెవ్వారు వేదమభ్యసించి దుర్ధర్షులై వాచాలత వెలయ బ్రహ్మవాదులై నిరహంకారులును, నిష్ప్రతిద్వందులును, నిర్హ్రీకులును, బ్రయోజనరహితులును నై యుందురో వారిని నే నాదరింతును. ఎవ్వారు సువ్రతులును, సత్యప్రతిజ్ఞులును, మౌనముగలవారును, బ్రహ్మపరులును, హవ్యకవ్యపరులు నై ప్రవర్తిల్లుదురో, వారిని నే నాదరింతును. మరియు నెవరు భైక్ష్యచర్యాపరులై గురుకులము నాశ్రయించి ధనసుఖాద్యపేక్ష విడిచి కృశులై యుందురో వారిని నేను బూజింతును. ఎవ్వారు సత్యవ్రతులై హింసయనునది యెఱుఁగక, దాంతులు, శాంతులు నై ప్రవర్తిల్లుదురో, వారిని నేను బూజిం

తును. మఱియు నేగృహస్థులు, దేవతాధిపూజాపరులై నిత్యము కపోత వృత్తిగలిగి చరింతురో, వారిని నేను బూజించువాఁడను. ఎవ్వారి కృత్యములందుఁ ద్రివర్గమును దక్కువగాక ప్రవర్తిల్లునో, శిష్టాచారమును విడువకుండునట్టివారు నాకుఁ బూజార్హులగుచున్నారు. త్రివర్గానుష్ఠానపరులై పుణ్యశీలురై లోభగుణవర్జితులై వేదసంపన్నులైనబ్రాహ్మణులు నాకు వందనార్హులు. ఓ కేశవా! జలాహారులును, వాయుభక్షులును, వైశ్వదేవశేషభక్షులును, వివిధవ్రతయుక్తులు నగువారు నాకుఁ బూజార్హులు. ఓమాధవా! దారాపరిగ్రహము సేయనివారును, దారాగ్నిహోత్రములుగలవారును, వేదాశ్రయభూతులును, సర్వభూతాత్మాశ్రయభూతులును నగువారిని నేను బూజింతును. ఓ కృష్ణా! నేను, లోకజ్యేష్ఠులును, కులజ్యేష్ఠులును, లోకసత్తములును, దమోహంతలును, లోకకరులునగు ఋషులను బూజించువాఁడను. కావున నోవార్ష్ణేయా! నీవు నిత్యము బ్రాహ్మణులను బూజింపుము. ఓయనఘా! పూజనార్హులగువారు పూజితులై సుఖము నొసంగుదురు. ఆబ్రాహ్మణులు పూజ్యమానులగుదురేని వారు నీకిహాపరసుఖముల నొసంగువారగుచున్నారు. ఎవ్వ రెల్లయతిథుల నాదరించుచు, నిత్యము గోబ్రాహ్మణులయందును సత్యమందును బ్రీతిగలిగి వర్తింతురో, వా రెట్టికష్టములనేనిఁ దరింపఁగలరు. ఎవ్వారు నిత్యము శమపరులై యసూయలేక నిత్యస్వాధ్యాయపరులై ప్రవర్తిల్లుదురో, వా రెట్టియాపదలను దొలఁగించుకొనుచున్నారు. ఎవ్వరొక వేదమునే యాశ్రయించి, శ్రద్ధాళులై దాంతులై సకలదేవతల నారాధింతురో వా రెన్నికష్టములనేనిఁ గడవఁగలరు. అటులే యెవ్వరు యతవ్రతులై బ్రాహ్మణులఁ బూజించుచు దానరతులై ప్రవర్తిల్లుదురో, యట్టివా రెట్టికష్టములను గడతేర్పఁగలరు. మఱియు నెవ్వరు తపోనిరతులును, కౌమారవ్రతచారులును, దపోభావితాత్ములు నైయుందురో, వా రెట్టియాపదలను దొలఁగించుకొనుచున్నారు. ఎవ్వరు దేవతాతిథిభృత్యుల నాదరించుచుఁ, బితృదేవతార్చనాపరులై శిష్టాన్నమును భుజింతురో, యట్టివారు దుర్గముల నెన్నేని దాఁటఁగలుగుచున్నారు. ఎవ్వరు విధ్యుక్తముగా నగ్ని నారాధించి నమ్రులై ధ్యానించుచు, సోమాహుతిని బొందుదురో, వా రెట్టి

కష్టములనైనను గడచుచున్నారు. ఎవరెల్లప్పుడును దల్లిదండ్రులను గురువులను నీవలె లెస్సగాఁ బూజింతురో, యట్టివారు దుర్గములను దరించుచున్నారు" అని తెలిపి యతఁ డూరకుండెను. కావున నో కౌంతేయా! నీవును బితృదేవద్విజాతిథులను లెస్సగాఁ బూజింపుము. అటులేని నీవిష్టగతి నొందగలవు". అని తెలుప విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె.

## శ్యేనకపోతాఖ్యానము

ఓపితామహా! మహాప్రాజ్ఞా! సకలశాస్త్రవిశారదా! నీవలన ధర్మమును వినఁగోరుచున్నాఁడను. తన్ను శరణమొందిన చతుర్విధమగు భూతకోటిని నెవ్వరు రక్షింప నెంతురో, యట్టివారి కెట్టి ఫలమగునో యథార్థముగాఁ దెలుపుము.

అది విని గాంగేయుఁడు "ఓయుధిష్ఠిరా! మహాయశా! శరణాగతరక్షణవిధము దెలుపునదియు మహాఫలప్రదమైనదియునగు పురాతనేతిహాస మొకటి తెలిపెదను వినుము. ఒకప్పు డొక ప్రియదర్శనమగు కపోత మొక శ్యేనముపాలఁబడి, వృషదర్భుఁ డనునొక రాజేంద్రుని శరణమొందెను. అటులు భీతిమెయిఁ, దనకడకుపచ్చిన యాకపోతమును గాంచి, విశుద్ధాత్ముఁడగు నావృషదర్భుఁ డోదార్చి 'ఓయండజోత్తమా! నీవు భయపడవలదు. నీకెద్దాన నిట్టిగొప్పభయము గలిగెను? నీ వెవ్వరి కేమిచేసితివి? నీవిట్లు తెలివితప్పి భ్రాంతచేతనుఁడవై యిందుల కేల వచ్చితివి? ఓ నవనీలోత్పలాపీడా! ఓ చారువర్ణా! ఓ సుదర్శనా! దాడిమాశోకపుష్పనేత్రా! నీవు వెఱపకుము. నీకు నే నభయ మొసంగుచున్నాఁడను. నన్ను శరణమొందిన నిన్నుఁ జేర నెవ్వఁ డుత్సహించును? రక్షాధ్యక్షుఁడుగలని న్నుఁ జిత్తముచేనైన నెవ్వఁడును స్మరింపఁజాలఁడు. ఓకపోతమా! నేనునీకై నా కాశిరాజ్యమును, నాజీవితమును బరిత్యజింతునుగాని, నీకు భయము గలుగనీను. నీవు నమ్ముము, భయ ముడుగుము.' అని పలికెను. అదివిని యాశ్యేనమావృషదర్భునిఁ గాంచి 'ఓరాజా! ఇక్కపోతము నాకు విధివిహితమైన యాహారము. కావున నీవు దీనిని రక్షింపఁబూనఁదగదు. ఇయ్యది గతప్రాయజీవితమును, నాకుఁ బ్రయత్నముచే సంపాదింపఁ

బడి లభించినదియు నగుచున్నది. దీనిరక్తమాంసమేదోమజ్జాదులు నాకెంతయుఁ బ్రియములు. నాకు దీనింజూచిన సంతోషము. కావున నీవిఁక దీనియెదుట నిలువకుము. డప్పి యెంతయు నన్ను బాధించెడిని. ఆఁకలి నన్ను దహించుచున్నది. నే నీయాఁకలి నోరువజాలను, కావున దీని నిఁక విడువుము. దీనిని, మత్పక్షనఖవిక్షతముగా నొనర్చి వెంబడించి వచ్చితిని. దీని కుచ్ఛ్వాసనిశ్వాసము లించుకగలవు. కావున నీవు దీనిని రక్షింపరాదు. ఓరాజా! మఱియొకటి వినుము. నీవు నీదేశమునఁ గలవారిని రక్షింపఁ బ్రభుఁడవు. ఆకాశమునఁ జరించుచుఁ దృషార్తుఁడగువానియెడ నీవు శిక్షణమున కెట్లు సమర్థుఁడవు? నీవు వైరులయెడను, భృత్యులయెడను, స్వజనవ్యవహారములయెడను, నింద్రియవిషయములయెడను, నీవు నీప్రభుత్వమును జూపుము. ఆకాశమునఁ బరాక్రమింపకుము. నీయాజ్ఞకు భంగముగలిగించువైరుల యెడఁ బరాక్రమించి పూర్ణముగాఁ బ్రభుత్వము చూపుదువేని, ధర్మార్థివగునీవు నన్నుమాత్రమువిడిచి యటు లొనర్పుము.' అని తెలిపెను.

ఓయుధిష్ఠిరా! అపు డాశిబి, యాశ్యేనవచన మాలించి పరమ విస్మయమొంది, దానిమాట నాలోచించి, యక్కపోతమును గోరుచు 'ఓశ్యేనమా! నీకువలయునేని, గోవృషముగాని, వరాహముగాని, మృగముగాని, మహిషముగాని యొసంగెదను. అది నీయాఁకలి దీర్పఁ దగియుండును. నన్ను శరణమొందినవానిని బరిత్యజింపనని నాపూనిన వ్రతము. ఇక్కపోతము నాయవయవములఁబట్టికొని యెట్లు విడువకున్నదియో చూడుము" అని పలికెను. అంత నా శ్యేన మాశిబిచక్రవర్తి నారసి "ఓరాజా! నేను వరాహమునుగాని, వృషభమునుగాని, మఱియేవేని పక్షులనుగాని భక్షింపను. నాకుఁ గాని యాహారముచే నేమిప్రయోజనము? నాకు సహజముగా దేవతలచే నేది భక్ష్యముగా విధింపఁబడియెనో, యట్టిదాని నెట్లు విడుతును? శ్యేనములు కపోతములను దినుట యనునది సనాతనమైనస్థితి. ఓయనఘా? ఉశీనరా! కపోతమునెడ నీకు స్నేహముగలదేని, దానిమేనిమాంసముతో సమప్రమాణముగల నీమాంసము నాకిమ్ము" అని కోరెను. అదివిని యాశిబి 'ఓశ్యేనమా! ఇపుడు నీవిట్లు పలుకుట, నాయెడ మిక్కిలి యనుగ్రహా

ముచూపుటయే. తప్పక నీచెప్పినచొప్పునఁ జేయువాఁడను.' అనిపలికి యారాజసత్తముఁడు, తనమేనిమాంస మొలిచి యొలిచి తులయందుం చుచు వచ్చెను. పిమ్మట, రత్నవిభూషితాంగులగు నంతఃపురకాంతలు, హాహాకారములతో వెడలి పరమార్తలై రోదనము సేయసాగిరి. వారి యొక్కయు, మంత్రిభృత్యజనముయొక్కయు, రోదనారావములచే, మేఘగంభీరధ్వని యనఁదగుమహానాద మప్పు డుప్పతిల్లెను. గగన మంతయు మేఘములచే నిరుద్ధమయ్యెను. ఆతని సత్యకర్మమునకుఁ బుడమి వడంకెను. అంత నాశిబి, తనబాహువులనుండియుఁ, బ్రక్కల నుండియు, దొడలనుండియు, నందుఁగలమాంసముల నొలిచి యొలిచి తులయం దుంచుచువచ్చెను. అతఁ డటు లెంతయుంచినను నాకపోత ముతో సరిగాఁ దూఁగకుండెను. అంత నాభూపతి యెపుడు తాను నిర్మాంసుఁడై యెముకలుమాత్రము శేషింప రక్తము స్రవింప నేమియు లేకుండెనో యపుడు తానే యాతులయందుఁ గూరుచుండెను. అంత నందుల కింద్రాదిదేవతలు, ముల్లోకములవారును వచ్చిరి. ఖేచరులు దేవదుందుభులమ్రోయించిరి. ఆవృషదర్భుఁ డమృతముచేఁ దడుపఁ బడియెను. మఱిమఱియు నాతనిపై దివ్యపుష్పమాల్యములు వర్షింపఁ బడియెను. దేవగంధర్వులును నప్సరసలును నెల్లెడల నాట్యము సేయుచుఁ బాడఁదొడంగిరి. సంస్తుతించిరి. అంత నారాజర్షి, సువర్ణప్రాసాదసహి తమును, మణికాంచనతోరణమనోజ్ఞమును, వైడూర్యమణిస్తంభవిరా జితము నగువిమాన మధిరోహించి, తనసత్కృత్యముచే శాశ్వతమగు స్వర్గమునకుఁ బోయెను. ఓయుధిష్ఠిరా! శరణాగతులపట్ల దయ చూపుము. అనురక్తులగుభక్తులు, నాశ్రితులు నగువారిని రక్షించుచు సకలభూతములయందును దయగలిగి వర్తించువాఁ డిహపరములసుఖ మొందుచున్నాఁడు. ఏభూపతి సాధువృత్తుఁడై ప్రవర్తిల్లునో, యెంత యుఁ గపటము లేని తనసత్కృత్యమునుబట్టి యట్టివానికి లభింపని దెద్ది? విశుద్ధాత్ముఁడును, ధీరుఁడును, సత్యపరాక్రముఁడును, రాజర్షియు నగు నాకాశీశ్వరుఁడు నిజకర్మముచే మూఁడులోకములందును బ్రసిద్ధి వడసెను. ఇటు లెవ్వఁడు శరణాగతరక్షణ మొనర్చినను, వాఁ డీశిబి చక్రవర్తియొందిన యుత్తమగతి నొందుచున్నాఁడు. రాజర్షియగు నీవృషదర్భునిచరిత్రమును గీర్తించువాఁడును, వినువాఁడునుబవిత్రుఁ

డగుచున్నాఁడు." అని దెలుప విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె.

### బ్రాహ్మణప్రశంస

ఓపితామహా! సకలకృత్యములందును, ధరాపతికి గొప్ప దెయ్యదియో, యెట్టికృత్య మొనర్చుచు, నృపతి యుభయలోకములందును సుఖమనుభవించునో దెలుపుము.

అదివిని గాంగేయుఁడు, "ఓయుధిష్ఠిరా! అభిషిక్తుఁడగు రాజున కిది యవశ్యకర్తవ్యము. సుఖముఁ గోరుభూపతి బ్రాహ్మణుల నారాధింపవలయును. శ్రోత్రియులు వృద్ధులు నగుబ్రాహ్మణులు నిత్యము నారాధనీయులు. మఱియు బహుశ్రుతులగుచు పౌరులు జానపదులునగు బ్రాహ్మణులను మంచిమాటలచేతను, భోగదానములచేతను, నమస్కారములచేతను నాదరింపవలయును. ఇదియే రాజున కవశ్యములైన నిత్యకృత్యములు. మఱియు నతఁడు విప్రులను, దన్నును దనపుత్రులనుబోలెఁ బాలింపవలయును. ఆవిప్రులందును, బూజ్యతము లెవ్వరో వారిని మఱియుఁ బూర్ణముగాఁ బూజింపవలయును. ఆబ్రాహ్మణులకు శాంతిగలిగించెనేని రాజ్యమెల్ల శాంతముగల్గి విరాజిల్లుచుండును. వారు తలిదండ్రులట్లు పూజ్యులు, వారే నమస్కార్యులు, వారే మన్నింపఁదగినవారు. ఎల్లభూతములకు వాసవునందువలె, లోకములకన్నిటికిని వారియందే లోకయాత్ర నిలిచి యున్నది. వారు తమతేజముకలిమి, నుపాయములచేతను, నభిచారములచేతను దహింపఁగలుగుదురు. సత్యపరాక్రములగు బ్రాహ్మణులు కుపితులైరేని, యుగ్రులై నిశ్శేష మొనర్తురు. వీరి కంతమును గానరాదు. దిక్కులును వీరి కపావృతములుగావు. వారికిఁ గోపము వచ్చెనా! వనాగ్నులందలి జ్వాలలట్లు పరికింతురు. అకార్యము లొనర్చు సాహసికులును, వీరికడ జడియుదురు. వారిగుణములు లోకాతీతములు. వారిలోఁ గొందఱు తృణచ్ఛన్నకూపము లట్టులుందురు. మఱి కొందఱు విశుద్ధులై నిర్మలాకాశమువలె వెలయుదురు. ఇంకొక కొందఱు పారుష్యమును జూపుదురు. మఱికొందఱు ప్రత్తివలె మెత్తని స్వభావముగలవారు. వారిలోఁ గొందఱు శఠులును, గొందఱు తపో

ధనులు నుందురు. కొందఱు కృషిగోరక్షణములను, మఱికొందఱు భైక్ష్యవృత్తిని జేయుదురు. కొందఱు చోరులును, కొందఱు సత్యదూరులును, మఱికొందఱు నటనర్తకులును నుండుదురు. వేఱొక కొందఱు రాజులవద్దను, నితరులవద్దను సకలకర్మముల నాచరించుచుందురు. ఓభరతసత్తమా! ఆవిప్రులు బహువిధాకారులై యుండుదురు. నానాకర్మానురక్తులును, బహువిధకర్మోపజీవులును సజ్జనులు నగువారిధర్మజ్ఞానము నిత్యమును గీర్తింపవలయును. ఈబ్రాహ్మణులు పితృదేవతలకును, దేవతలకును, మానవోరగరాక్షసులకును, మున్ను పూజనీయులైనమహాభాగులు. ఈద్విజులు దేవతలకుఁగాని, పితృదేవతలకుఁగాని, గంధర్వులకుఁగాని, రాక్షసులకుఁగాని, యసురపిశాచాదులకుఁగాని జయింప వలనుపడరు. మఱియు వారు దైవతముల నదైవతములుగను, నదైవతములను దైవతములుగను జేయఁగలుగుదురు. వారెవ్వనినేనిఁ బ్రేమింతురా! వాఁడు రాజగును. వారిష్టపడనిచో నెట్టివారును బరాభూతులగుదురు. ఎవ్వరవివేకులై బ్రాహ్మణులతోఁ బరివాదము సేయుదురో, వారు తప్పక నశింతురు. సందియము లేదు. సత్యము తెలుపుచున్నాఁడను. ఆద్విజులు, నిందాప్రశంసానిపుణులును, గీర్త్యకీర్తిపరాయణులునై వైరులపై నెల్లపుడును గోపింతురు. బ్రాహ్మణు లేమానవునిఁ బ్రశంసింతురో, వాఁడు వృద్ధినొందుచున్నాఁడు. ఎవఁడు బ్రాహ్మణులచే నిందింపఁబడునో, వాఁ డాక్షణమపరాభూతుఁడగుచున్నాఁడు. శకులు, యవనులు కాంభోజులు మున్నగు కొందఱు క్షత్త్రియులు, బ్రాహ్మణులదర్శనము లేమి శూద్రత్వము నందిరి. అటులే ద్రావిడులును, గలింగులును, బుళిందులు, నుశీనరులు, కోలిసర్పులు, మాహిషకులు మున్నగు క్షత్త్రియజాతులు, బ్రాహ్మణులదర్శనము లభింపమి శూద్రత్వమొందిరి. ఓధర్మజా! వారిని జయించుటకంటె వారివలని పరాజయము మేలు. బ్రాహ్మణునిఁజంపిన పాపము సకలమును జంపినను గలుగదు. బ్రహ్మవధ్య మహాదోషమని పరమర్షులు తెలుపుచున్నారు. బ్రాహ్మణులపరివాదమును వినఁగూడదు. వారు కలహించునపు డెవ్వఁడును నధోముఖుఁడై యూరకుండుటగాని, లేక యచ్చోటినుండి వెడలిపోవుటగాని యొనర్పవలయును. పుడమి నెవ్వఁడు బ్రాహ్మణునితో విరోధించునో, యట్టివాఁడు సుఖ

పడుట, పుట్టినవారియందును బుట్టఁబోవువారియందును లేఁడని తెలుప వచ్చును. అట్టివాఁడు జీవింపను దలంపఁడు. గాలి యెవ్వనికిని బిడికిటఁ బట్ట వలనుపడదు. చేతితోఁ జంద్రు నెవ్వరును స్పృశింపలేరు. పుడమి నెవ్వరు మోయఁజాలరు. బ్రాహ్మణుల నెవ్వరును జయింపఁజాలరు." అని తెలిపి భీష్ముఁడు మఱియు నిట్లనియె

## బ్రాహ్మణ స్తవము

ఓయుధిష్ఠిరా! బ్రాహ్మణులనే యెల్లపుడు నెంతయుఁ బూజింప వలయును. వారు సోమరాజులై సుఖదుఃఖముల కీశ్వరులై వెలయు చున్నవారు. మఱియు నావిప్రులు గోరునట్టిభోగములుగాని, యలం కారములుగాని, యింకేమియుఁగాని యొసఁగి నమస్కరించి తలిదండ్రుల వలెఁ బూజించుచు రక్షింపఁదగినవారు. వాసవునుండి భూతములకుఁ బోలె బ్రాహ్మణునుండియే రాష్ట్రమునకు శాంతిగలుగుచున్నది. రాష్ట్ర మున బ్రహ్మవర్చస్సుగలబ్రాహ్మణుఁడే శుచి యనఁబడుచున్నాఁడు. జాతి సంపన్నుఁడును, ధర్మజ్ఞుఁడును, సంశితవ్రతుఁడునునగు బ్రాహ్మణుని, మహారథుఁడగురాజన్యుఁ డాశ్రయింపవలెను. బ్రాహ్మణు నాభూపతి తనయింటఁ బెట్టికొనవలయును. భూపతికి బ్రాహ్మణునికంటె వేఱొక యుత్తమపదార్థములేదు. బ్రాహ్మణుల కొసంగినహవిస్సును దేవతలు పరిగ్రహింతురు. అటులే పితృదేవతలును బరిగ్రహించుచున్నారు. సకలభూతములందును బ్రాహ్మణులను మించినవారులేరు. సూర్య చంద్రులును, బుడమియు, నాకసమును, వాయుజలములును, దిశలును, బ్రాహ్మణు నావేశించియే తమయాహారములను భుజించుచుండును. ఎవ్వనియింట బ్రాహ్మణులు భుజింపరో, వానియింటఁ బితృదేవతలును భుజింపరు. బ్రాహ్మణద్వేషియగు పాపాత్మునింట దేవతలును భుజింపరు. బ్రాహ్మణులు సంతుష్టు లగుదురేని పితరులు సంతుష్టు లగుచున్నారు. అటులే విప్రసంతుష్టిఁయొనర్చినవారికే దేవతలును బ్రసన్నులగు చున్నారు. ఇందులకు సందియములేదు. బ్రాహ్మణుల కెవ్వరిద్రవ్య మొసంగఁబడునో, వారును బ్రీతిపాత్రులగుచున్నారు. అట్టివానికిఁ బర మందును జెడుగులేక యుత్తమగతి గలుగుచున్నది. ఏయేద్రవ్యముచే మానవుఁడు బ్రాహ్మణులను దృప్తిపఱుచునో, యాయాపదార్థముచే

దేవతలును బితృదేవతలును బ్రీతులగుచున్నారు. దేనివలనఁ బ్రజలు
జనించుచున్నారో, యట్టియజ్ఞాదికము బ్రాహ్మణునివలననే గలుగు
చున్నది. దేనివలన జననమరణములును, స్వర్గనరకములును గలుగు
చున్నవో, యది తెలియఁదగుమార్గ మిదియే యని తెలియుము. మానవ
శ్రేష్ఠుఁడగు బ్రాహ్మణుఁడే, యాగతానాగత నిమిత్తమగుచుండును.
బ్రాహ్మణుఁడే నిజధర్మఫలప్రదుఁడని యెవ్వఁడు తెలియునో, యెవ్వ
రావిప్రు ననువర్తింతురో, యట్టివా రుత్తమగౌరవపాత్రులగుచు
న్నారు. అట్టివారు మరణించియు, దుఃఖమునొందక గౌరవార్హులగు
చున్నారు. ఎవ్వరు బ్రాహ్మణునినోట వెడలినమాట నంగీకరించి పరిగ్ర
హింతురో, యట్టివారు భూతాత్మలును, మహాత్ములునై పరాభవ
పాత్రు లెన్నఁడును గాఁజాలరు. తేజోబలములచేఁ బ్రతాపవంతులగు
క్షత్రియుల గొప్పదనమెల్ల బ్రాహ్మణులకడ నడంగునుగాని విజృం
భింపదు. భృగువులును, దాలజంఘులును, నాంగీరసులును, నీపులను
జయించిరి. భరద్వాజుఁడు, వైతహవ్యులను, నైళులను జయించెను.
కృష్ణాజినచిహ్నములుగల బ్రాహ్మణులు, చిత్రాయుధులగు క్షత్రియు
లను జయించిరి. బ్రాహ్మణునకు భూదానముచేసి యుభయలోకము
లకు దీప్తిగలిగించుచుఁ బరలోకహితముగుకర్మ మొనర్పవలయును.
లోకమున నేదియేది చెప్పఁబడుచున్నదో వినవచ్చుచున్నదో, చూడఁ
బడుచున్నదో యవియెల్ల దారువులం దగ్నివలె, బ్రాహ్మణులయందు
గుప్తముగా నుండును. ఓధర్మజా! ఈవిషయమున వాసుదేవునకును
భూమికిని జరగినపురాతనేతిహాస మొకటి గలదు. దానిం దెలిపెదను
వినుము.

ఒకపుడు, శ్రీకృష్ణుఁడు, భూదేవిని గాంచి, "దేవీ! నీవు సకల
భూతమాతవు కావున నిన్నొకటి యడిగెదను. గృహస్థుఁడగుమానవుఁ
డెట్టిసత్కర్మముచేఁ దనపాపమును బోఁగొట్టికొనుచున్నాఁడు? అని
ప్రశ్నించెను. అదివిని భూదేవి 'వాసుదేవా! బ్రాహ్మణులనే సేవింప
వలయు. అదియే యుత్తమకర్మము. విప్రులను సేవించుమానవుని రజ
మంతయు నడఁగుచున్నది. ఆవిప్రునివలననే భూతరతియుఁ, గీర్తిరతియు,
బుద్ధియు గలుగుచున్నది. శత్రుతాపనుఁడగుక్షత్రియుఁడును బ్రాహ్మణునే
యాశ్రయింపవలయును. జాతిసంపన్నుఁడును, ధర్మజ్ఞుఁడును, బ్రశస్త

వ్రతుఁడును, శుచియునగు బ్రాహ్మణుఁడే సకలసమృద్ధులకును, నిమిత్త భూతుఁడని మున్ను నాకు నారదుఁడు తెలిపెను. సర్వజాతులలో బ్రాహ్మణులే యుత్తములని యెవ్వరు ప్రశంసింతురో, వారు వృద్ధి నొందుచున్నారు. ఎవ్వఁడు బ్రాహ్మణులను దిట్టునో వాఁడచిరకాల మునఁ బరాభవపాత్రుఁ డగుచున్నాఁడు. బ్రాహ్మణావమంత సముద్ర మునఁబడవైచిన పచ్చిబెడ్డవలె చూపుమాయుటయే గాక, వానిదుశ్చరి తము వానికిఁ బరాభవనిమిత్తమగుచున్నది. చూచితివా! బ్రాహ్మణునెడ నపరాధమొనర్చినయింద్రునకు భగసహస్రము, చంద్రున కంకమట్టు లును, సముద్రమునకు లవణోదకమట్టులును జిహ్మమై యుండెనుగాదే? మఱియు నాయింద్రున కవి, యాబ్రాహ్మణప్రభావముచేతనే, కన్ను లుగా లోకమునకుఁ గానవచ్చునట్టు లయ్యెను మఱియు నావిప్రుల ప్రభావముచేతనే, యింద్రుఁడు శతక్రతుఁడై వెలసెను. కీర్తిని, నైశ్వ ర్యమును, నుత్తమలోకములను గోరువాఁడు, బ్రాహ్మణులసమ్మతి వడసి, శుచియు, నాత్మవంతుఁడును, నై మెలంగవలయును.' అని తెలిపెను.

ఓయుధిష్ఠిరా! మధుసూదనుఁ డాభూదేవిపలుకు లాలించి, మేలు మేలని సన్నుతించెను. ఓధర్మజా! ఈ నాచెప్పినయితిహాసమును వింటి విగదా! నీవు నియమము దప్పక బ్రాహ్మణోత్తముల నెల్లపుడును బూజింపుము. అటులేని నీకు శ్రేయము గల్గెడిని." అని తెలిపి మఱియు భీష్ముఁ డి ట్లనియె.

## బ్రాహ్మణప్రభావవర్ణనము

"ఓయుధిష్ఠిరా! మహాభాగుఁడగు బ్రాహ్మణుఁడు సంస్కారాదు లక్కఱలేక, కేవలము జన్మమాత్రముచే నమస్కారార్హుఁడగుచు, మఱియు సకలభూతములకు నతిథియై పక్వాన్నములను ముందుగా భుజింపఁ బాత్రుఁడగుచున్నాఁడు. ఓనారదా! విప్రులు పూజితు లై రేని పరమమిత్రులై సకలార్థసాధకులును, శేషలేకు సుఖస్థానీయులు నగుచు, శుభప్రదములగు మంచిమాటలచే నెల్లవారి నాచరింతురు. వారిని బూజింపమేని, కోపముగలిగి మనకు బాటఁ వైరులై దారుణము లగుమాటలచే వాని గలుగునట్లు తలంతురు. ఓధర్మజా! ఈవిషయ మునఁ బూర్వులు కొన్నిగాథలను దెలుపుచున్నారు. మున్ను పర

మేష్టి యథాపూర్వముగా, బ్రాహ్మణులను సృజించి, యిట్లు నియమించెను.

'ఓయీ! బ్రాహ్మణుఁడు సురక్షితుఁడై మిమ్ము రక్షించును; దానిచే మీకు శుభముగలిగెడిని. మీ రిహపరములకు మఱేమియు నాచరించుకొననక్కఱలేదు. బ్రాహ్మణరక్షణమే సర్వశుభదాయకము. నిజకర్మానుష్ఠానపరులకు మీకు బ్రాహ్మణులక్ష్మి గలుగుచున్నది. వివేకముగల బ్రాహ్మణుఁ డెన్నఁడును, శూద్రకర్మ మొనర్పఁగూడదు. శూద్రకర్మ మొనర్చువాఁడు, బ్రాహ్మసంపదకు దూరుఁ డగుచున్నవాఁడు. లక్ష్మియు, బుద్ధియు, తేజము, విభూతియు, ప్రతాపశక్తియు, విపులమగుమహత్త్వమును స్వాధ్యాయమందే ప్రతిష్ఠితమగుచున్నది. దేవతాగణమునుగూర్చి విధ్యుక్తముగా హోమ మొనర్చి మహాభాగ్యమునఁ బ్రతిష్ఠితులై, శిశువులుసైత మగ్రభోజ్యులై యేవారిలో వెలయుదురో, యట్టివిప్రులు బ్రాహ్మ్యసంపద్యుక్తులై యొప్పుచున్నవారు. వంచనారహితమైన పరమశ్రద్ధతోఁగూడి దమస్వాధ్యాయనిరతులైనవిప్రులు సకలకామసంపన్నులగుదురు. మానవలోకమందును, దేవలోకమందును నెయ్యవిగలవో, యవియెల్లఁ దపముచేతను, జ్ఞానముచేతను, నియమముచేతను సాధింపఁదగిన వగుచున్నవి.

ఓయుధిష్ఠిరా! ఇవియే బ్రహ్మగీతలు. వీనిని నీకెఱిఁగించితిని. బ్రాహ్మణుల ననుగ్రహించుటకై ధీమంతుఁడగునాతనిచే నిట్లు తెలుపఁబడియెను. తపస్వియగుభూపతిబల మట్టులు, మఱియు వారిబల మిట్టిదై యుండునని తలంచెదను. ఆవిప్రులందుఁ గొందఱు దురాసదులును, తీవ్రవ్యాపారులును, రభసులును, క్షిప్రకారులు నైయుందురు. మఱికొందఱు సింహసత్త్వులును, వ్యాఘ్రబలులును, వరాహసత్త్వులును నై వెలయుదురు. వేఱొకకొందఱు జలతుల్యబలులగుచున్నవారు. ఇంకొకకొందఱు సర్పస్పర్శతుల్యస్పర్శులును, మకరస్పర్శముచేయువారునునై యుందురు. మఱికొందఱు మాటమాత్రన చంపువారును, కొందఱు చూపులతోడనే వధించువారును నైయుందురు. వేఱొకకొందఱు విషసర్ప సదృశులును, మఱికొందఱు మందులు నైయుందురు ఓయుధిష్ఠిరా! బ్రాహ్మణులవృత్తము లిట్లు వివిధము లైయుండును ఓధర్మజా! బ్రాహ్మణులకోపముచే, మేఖలులును, ద్రవిడులును, లాట

పౌండ్రకోంకణులును, శౌండీక దరద దర్వ చౌరులును, శబరులును, బర్బరులును, గిరాతులును, యవనులును మున్నగుకొందఱు క్షత్రియులు శూద్రత్వ మొందిరి. బ్రాహ్మణులను బరిభవించుటవలన, నసురులు జలవాసులైరి. బ్రాహ్మణానుగ్రహముచే దేవతలు స్వర్గవాసులైరి. ఆకసము స్పృశించుటకు వలనుపడదు. హిమవంతము గదల్పఁబడదు. గంగ గట్టున కాగదు. బ్రాహ్మణుల నేవారును జయింపఁజాలరు. బ్రాహ్మణులతో విరోధించెనేని భూమిని బరిపాలించుట కష్టసాధ్యము. మహాత్ములగు బ్రాహ్మణులు దేవతలకును దేవతలు. కావున నోయుధిష్ఠిరా! నీవు నిత్యము దానముచేతను, బరిచర్యచేతను బ్రాహ్మణుల నాదరింపుము. అటులేని చతుస్సముద్ర ముద్రితమగు నీధరావలయమనుభవించి సుఖింపఁగలుగుదువు. ఓయనఘా! బ్రాహ్మణులకుఁ బ్రతిగ్రహముచేఁ దేజము తగ్గును. అట్టిప్రతిగ్రహ మెవ్వరు గోరరో, యట్టివారిని నీవు సంరక్షింపవలయును.” అని తెలిపి భీష్ముఁడు మఱియు ని ట్లనియె.

### శక్రశంబరసంవాదము

“ఓయుధిష్ఠిరా! మఱియు నొకపురాతనేతిహాసము గలదు. అయ్యది శక్రశంబరులకు జరిగినసంవాదము. దాని నెఱిఁగించెదను వినుము. ఒకపు డింద్రుఁడు నిజరూపము మఱుగుపఱచి, జటాధారియు, రజోరక్తుఁడునై యొకవిప్రరూపమును బూని, శంబరునికడ కేఁగి, ‘ఓయీ! శంబరా! నీవెటులు వర్తించుచు నీవారికెల్ల నధికారివైతివి? వారు నిన్నెటు లుత్తమునిఁగాఁ దలంచుచున్నవారు? అదియెల్ల యథార్థముగా నెఱిఁగింపుము.’ అని ప్రశ్నించెను.

అది విని యాశంబరుఁడు శక్రునితో ‘ఓయీ! నేను విప్రులపై నసూయపడక యెల్లపుడు వారిమతము నాదరించి వర్తింతును. శాస్త్రములను దెలుపు బ్రాహ్మణులను గాంచినపుడు, వారికి సుఖముదప్పకుండఁగా గౌరవింతును, వారిమాట విని యవమానింపను. ఒకప్పుడును వారికిఁ దప్పొనర్పను, వారిని బూజింతును. వారికుశల మరయుచుండుదును, బుద్ధిమంతులగు వారిపాదములు పట్టుకొనుచుండుదును. వారు నాయందు నమ్మికగలిగి మాటలాడుదురు. ఎల్లపుడును వారు

నావిషయమును బ్రశ్నించుచుందురు. ప్రమాదపడియున్న వారియెడ నేను బ్రమాదములేక యుండెడుదును. వారు నిద్రితులై యున్నపుడు నేను మేలుకనియుండుదును. వారు నన్ను శాస్త్రమార్గ ప్రవర్తిగను, బ్రహ్మణ్యునిగను, నసూయారహితునిగను దలంచి, మక్షికలు తేనె పట్టునఁ దేనెనుబోలె, మంచినే నాయందుండునట్లు శాసించుచుందురు. వారు సంతోషపూర్వకముగా నేమి పలుకుదురో దానినెల్ల నేను బరి గ్రహించుచుండుదును. నేను నిత్యమును బ్రాహ్మణులయెడ నిష్ఠయే యనుకూలమని తలంచితిని. నాలుకచివర నమృతముగల బ్రాహ్మణుల వచనసుధను ద్రావుచు, నక్షత్రములను జంద్రుఁడు పాలించునట్టులు, నాజాతివారిని బాలించుచుండుదును. బ్రాహ్మణోక్తియే పుడమి నమృత మనఁబడుచున్నది. అదియే యుత్తమచక్షువు. బ్రాహ్మణులముఖమునుండి వెడలినశాస్త్రమును విని దాని ననుసరించుటయే సకలశ్రేయస్కరము. ఈకారణము తెలిసి, మున్ను నాతండ్రి దేవాసురయుద్ధమును జూచి నపుడు విస్మయాశ్చర్యపరవశుఁ డయ్యెను. అట్లు విస్మితుఁడై, మహాత్ము లగుబ్రాహ్మణుల మహిమను మెచ్చికొనుచు నతఁడు, 'బ్రాహ్మణుల కట్టిసిద్ధి యెట్లు గలిగె'నని చంద్రునిఁ బ్రశ్నించెను. అందుల కాయిం దుఁడు, 'ఓయీ! బ్రాహ్మణులందఱును, దమతపముచే సిద్ధిపడసి, యెల్ల పుడు వాగ్బలముగలిగి వర్తింతురు. రాజులు భుజవీర్యధనులును, విప్రులు వాగస్త్రధనులును నై వెలయుచున్నారు. మఱియు బ్రాహ్మ ణుఁడు క్లేశకరములగు గురుకులవాసాదుల నొనర్చి ప్రణవాధ్యయనము చేయును. మఱియు నిర్మన్యుఁడును, నిర్మానుఁడును నై సమదృష్టితో యతియు నగును. జ్ఞానసంపన్నుఁడయ్యుఁ దనతండ్రియింటనే వేద ములను జదువుచు శ్లాఘించుకొనువానిని గ్రామ్యుఁడని తెలిపెదరు. యుద్ధమునకు వెనుదీయు క్షత్రియునిఁ, బ్రవాస మొనర్పఁజాలని బ్రాహ్మ ణుని, బిలములోనున్నవానిని సర్పమట్లు, పుడమి మ్రింగునందురు. అల్పబుద్ధియగు మానవుని యహంకారమే వానిసిరుల హరించును. పెండ్లిగానిపడుచు, గర్భముచే దూషిత యగుచున్నది. ద్విజుఁడు నిజ గృహవాసముచేఁ జెడుచున్నాఁడు.' అని తెలిపినసోముని వచనములు విని నాతండ్రి బ్రాహ్మణులను బూజించెను. అటులే నేనును మహా వ్రతులగు బ్రాహ్మణులను బూజించుచుండుదును.' అని తెలిపెను.

ఓయుధిష్ఠిరా! ఆశంబరుని నోటినుండి వెడలిన యావచనములను విని యింద్రుఁడును బ్రాహ్మణులను బూజించి మహేంద్రత్వమొందెను." అని తెలుప విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె.

## పాత్రపరీక్ష

"ఓపితామహా! దానమొనర్చునపు డద్దానిని బరిగ్రహించుటలోఁ గ్రొత్తయాతఁడు పాత్రుఁడా? లేక చిరకాలమునుండి యాశ్రయించినవాఁ డర్హుఁడా? అదియుగాక, మిక్కిలి దూరమునుండివచ్చిన యభ్యాగతుఁ డర్హుఁడా? తెలుపుము.

అది విని గాంగేయుఁడు, "ఓధర్మజా! కొందఱు యాగాదిక్రియలకై యాచింతురు. కొందఱ కుత్తమమగు మౌనవ్రతముండును. అట్టివారేమేమి యాచింతురో, యదియెల్ల భృత్యవర్గమునకుఁ బీడ గలుగకుండునట్లుగా నిత్తుమని చెప్పవలయును. అని పెద్దలు దెలుపఁగా వినుచున్నారము. భృత్యవర్గమునకుఁ బీడ గలుగునట్లు దానముచేయువాఁడు తన కపకర్షమును గలిగించుకొనుచున్నవాఁ డగుచున్నాఁడు. అట్టి భృత్యపీడాకరమగుదానముపట్లఁ గ్రొత్తవాఁడుగాని, చిరోషితుఁడుగాని, దూరాభ్యాగతుఁడుగాని పాత్రుఁడుగాఁడని పండితులు తెలుపుదురు." అని తెలిపెను.

అది విని యుధిష్ఠిరుఁడు "పితామహా! భూతపీడయు, ధర్మహింసయుఁ గలుగకుండ దానముచేయుటయే సత్పాత్రదానమగును. ఎవ్వని కిచ్చినదానమున సంతాప మొదవకుండునో, యదియే యుత్తమదాన మనఁబడునుగదా! ఇఁకఁ బాత్రపరీక్షచేయువిధ మెట్టిది?" అని ప్రశ్నించెను.

అంత నాభీష్ముఁడు, "ఓధర్మజా! ఋత్విజులును, బురోహితులును, నాచార్యులును, శిష్యులును, సంబంధిబాంధవులును బూజ్యులు మాన్యులు నగుచున్నారు. అటులే యసూయారహితులగు వేదాధ్యయనసంపన్నులును సత్కారార్హు లగుచున్నారు. పైఁదెలుపఁబడినవారుదక్కఁ దక్కినవారెల్లరును, సత్కారార్హులు కాఁజాలరు. కావున నిత్యమును, రహస్యముగాఁ బురుషులను బరీక్షింపవలయును. 'క్రోధరాహిత్యము, సత్యవచనము, అహింస, దమము, ఆర్జవము,

అద్రోహము, అభిమానరాహిత్యము, బిడియము, శాంతి, తపము, శమము అను నీపదునొకొండును, నెవ్వనియందు సహజముగా నివిష్టములై గానవచ్చునో, యట్టివాఁడు మన్నింపఁదగుపాత్రుఁ డనఁదగుచున్నాఁడు. పైఁదెలిపిన గుణములుగలవాఁడు, చిరోషితుఁడుగాని, యపుడు వచ్చినవాఁడుగాని, క్రొత్తవాఁడుగాని పాత్రుఁడగుచున్నాఁడు. వేదములను బ్రమాణీకరింప కుండుటయు, శాస్త్రముల నుల్లంఘించుటయు, నెల్లయెడల వ్యవస్థలేకుండుటయు నను నీమూఁడును, నాత్మనాశమునకు నిమిత్తమగుచున్నవి. ఓనాయనా! ఎవ్వఁడు పండితమానియై వేదముల నిందించుచు, నిరర్థకమగు వైశేషికాది తర్కవిద్యయం దనురక్తుఁడై, హేతువాదములచే సజ్జనుల నోడించుచు, నతివక్తయై పరులఁ దిట్టుచు, సర్వాభిశంకియు, మూఢుఁడు, బాలుఁడు, కటువచనుఁడునగునో యట్టిబ్రాహ్మణుఁడు జ్ఞానోపదేశ మొందవలసియుండును. అట్టివానిని శునకమునుగాఁ బండితులు తెలుపుదురు. అట్టివాఁడు కుక్కవలె మొఱఁగుటకును, గొట్టుటకును, వాద మొనర్చుటకును, సకలశాస్త్రవధమునకును సన్నద్ధుఁ డగుచునుండును. లోకయాత్రయు, ధర్మము, నాత్మహితమును జూచుకొనుచుఁ బ్రవర్తించుమానవుఁడు, చిరకాలము వృద్ధినొందుచుండును. దేవతలయుఁ, బితృదేవతలయు, ఋషులయు, బ్రాహ్మణులయు, నతిథులయు ఋణము లైదును దీర్చికొని క్రమానుగతమై విశుద్ధమై సువినీతమగుసత్కర్మ మొనర్చుచు వర్తించువాఁడు ధర్మమునకు దూరుఁడు గా నేరఁడు.” అని తెలుప విని యుధిష్ఠిరుఁడు మఱియు ని ట్లనియె.

## పంచచూడానారదసంవాదము

“ఓపితామహా! లఘుచిత్తలగుస్త్రీలు దోషములకు మూలము లని తెలుపఁబడుదురుగదా! వారిస్వభావము విననోరుచున్నాఁడను. తెలుపుము.”

అది విని భీష్ముఁడు, “ఓయుధిష్ఠిరా! నీవడిగినప్రశ్నమున కుదాహరణముగా నొకపురాతనేతిహాస మెఱిఁగించెదను. అయ్యది పుంశ్చలియగు పంచచూడకును నారదునకును జరగినసంవాదము. వినుము. మున్నొకపుడు నారదుఁడు లోకములందెల్లఁ దిరుగుచు, బ్రాహ్మియు,

ననిందితయు, నప్సరసయునగు పంచచూడను గాంచి, యా దేవర్షి, సర్వాంగసుందరియగు నామెను 'ఓసుమధ్యమా! నాచిత్తమున కొక సందియ మొదవును. దానిం దీర్పు'మని యడిగెను.

ఓయుధిష్ఠిరా! అది విని యాపంచచూడ, విప్రుఁడగునారదుని గాంచి, 'ఓయీ! నన్ను సమర్థనుగాఁ దలంచుచున్న వాఁడవగుటను, బ్రసంగింపఁ దలఁతువేనిఁ దెలిపెదను వినుము' అని పలికెను. అంత నారదుఁడు 'ఓపంచచూడా! ప్రసక్తిలేక, నిన్నే విషయమును సిర్బంధించువాఁడను గాను. ఓవరాననా! నీవలన స్త్రీలస్వభావమును వినఁ గోరుచున్నాఁడను.'

ఓయుధిష్ఠిరా! అప్పంచచూడ నారదునివచనము విని 'ఓమునివర్యా! నేను బతివ్రతనగు నాఁడుదాననై స్త్రీల నెట్లు నిందింపఁగలను! ఏస్త్రీ లెట్టిస్వభావముగలవారో, నీ వెఱింగినదియే! ఇట్టికార్యమున నన్నీవు నియోగింపఁదగదు.' అని తెలుపవిని యా దేవర్షి 'ఓసుమధ్యమా! నీవు చెప్పినది నిజము కాకపోదు. కాని సత్యము చెప్పుటలో దోషములేదు. వారియెడ ననృతమాడినఁగదా! దోషము. కావున దెలుపు'మని పలికెను. అంత నాయప్సరస కృతబుద్ధియై చిరునగవు వెలయ, సత్యములును స్థిరములునగు స్త్రీదోషములను నిట్లు దెలుప నారంభించెను.

'ఓనారదా! సత్కులప్రసూతలు, రూపవతులు, నాథవతుల నగుస్త్రీలును మర్యాదకు లోఁబడియుండరు. అదియే వారిదోషము. స్త్రీలనుమించిన పాపతమమగు పదార్థ మొకటిలేదు. దోషములకే స్త్రీలే మూలము. అది నీవును నెఱుంగుదువు. మిక్కిలి పరిచితిగలవారైనను, ధనవంతులైనను, దుల్యరూపులైనను, దమ్మనుసరించినవారైనను, భర్తలను లక్ష్యముసేయక, యవకాశము గలిగినచో, వారిఁ బ్రతీక్షింపక వేఱొకవిధముగాఁ బ్రవర్తింపఁజూతురు. స్త్రీలము మాకాపద్ధర్మమిదియే. మేము లజ్జవిడిచి యెట్టిపాపులనేని సేవింతుము. ఎవ్వఁడొకస్త్రీని గోరి సమీపించి యేమేనిఁ గొంచెము ముచ్చట చేయునో, వానినే స్త్రీలిచ్ఛగించుచుందురు. మర్యాదారహితలగు స్త్రీలు, తమ్మెవ్వరును గోరనపుడుగాని, పరిజనమువలనిభయమున్నపుడుగాని, భర్తలయెడ మేరమీఱక ప్రవర్తింతురు. స్త్రీలకుఁ బొందరా

వాఁ డెవ్వఁడును లేఁడు. వారికి వయోనిశ్చయ ముక్కఅ లేదు. విరూపుఁడైనను సరియే, రూపవంతుఁడైనను సరియే, పురుషుఁడైనఁ జాలును. వాని ననుభవింపజూతురు. భర్తలయెడ భయముగాని, దయగాని లేక వారిధనమునే నపేక్షింపక, జ్ఞాతికులసంబంధమునేని దలంపక, స్వేచ్ఛాచారలై ప్రవర్తింతురు. యావనవతులై మంచి నగలును, చక్కనిచీరలునుగల కాంతలు స్వేచ్ఛావృత్తిగలవారయ్యు, వారినే కులస్త్రీలునైతము గౌరవింతురు. మఱియుఁ బురుషులు గౌరవముగలిగి ప్రియమెలర్పఁ గాంచుచున్నను స్త్రీలు, కుబ్జులనియు, నంధులనియు, జడులనియు, వామనులనియుఁ, బంగువులనియు నెంచక కుత్సితులని యాలోచింపక, పరపురుషులను బ్రేమింప నెంతురు. ఓ మహామునీ! ఇంతయేల! ఈలోకమున స్త్రీల కొక్కఁడును బొందరాని వాఁడు లేఁడని తెలియుము. ఓ బ్రాహ్మణోత్తమా! స్త్రీలు తమకుఁ బరపురుషులు లభించుట కష్టమైనను నుపేక్షింపక మాఱువేషములవేసి కొనియేని వారిని బ్రేమింపఁ బోవుదురుగాని, భర్తలను నమ్మికొని యుండరు. వారికెవ్వరును లభింపకుండినను, బరిజనులవలన భయమున్నను, వధబంధాదిభయ మొదవినను దమంతఁదా మడఁగియుండుదురు. మఱియు స్త్రీలు స్వభావమునుబట్టి తెలియఁబడనివారును, జలచిత్తలును, సేవింప వీలుపడనివారును నగుచున్నారు. ప్రాజ్ఞుఁడగుపురుషునిమాట యెట్లు గంభీరమై యుండునో, యటులే యాఁడుదానిమాట లతిగంభీరములై యుండును. ఎన్నికట్టెలఁ గాల్చినను నగ్ని తృప్తినొందదు. ఎన్నినదులు కలిసినను సముద్రము నిండదు. ఎన్ని ప్రాణులను దీసికొనిన నంతకునకుఁ దృప్తిగలుగదు. ఎందఱు పురుషులఁ గూడినను స్త్రీలకుఁ దృప్తిగలుగదు. ఓ దేవమునిసత్తమా! ఇది మఱియొక రహస్యము. చక్కనిపురుషునిఁ గాంచిన సకలకాంతలకును యోని తడియగుచుండును. కోర్కెల నీడేర్చువాఁడైనను బ్రియగౌరవముల సమకూర్చువాఁడైనను, దన్ను రక్షించువాఁడైనను నిజభర్తను, దుష్టలగుకాంతలు సహింపరు. స్త్రీలకు రతియందుఁ గలప్రీతి, విస్తారములగు కామభోగములందుఁగాని, యలంకారములందుఁగాని, తమ్మాశ్రయించినవారియందుఁగాని యుండదు. అంతకుఁడును, బవనుఁడును, మృత్యువు, పాతాళము, బడబాముఖము, కత్తిదారు, విషము, సర్పము,

అగ్ని యనునది యొకవైపును, స్త్రీ లొకవైపును బెట్టిన సరిగా నుందురు. పంచమహాభూతములను, లోకములను, బురుషులను, స్త్రీలను సృజించి, పరమేష్ఠి దోషములన్నియు స్త్రీలయందే యుంచెను." అని తెలుప విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె.

## స్త్రీస్వభావకథనము

"ఓపితామహా! ఈలోకమునఁగల పురుషులందఱు నెంతయు దైవసృష్టమగుమోహముచేఁ బరమావేశపరులై స్త్రీలయందు సక్తులై ప్రవర్తించుచుందురు. అటులే స్త్రీలును బురుషులందు సక్తలై యుండుట ప్రత్యక్షవిషయమై లోకానుభవసిద్ధము. కాని యిందు నాకొక తీవ్రమగుసంశయము గలుగుచున్నది. ఓకురునందనా! మానవులకీ స్త్రీలసాంగత్య మెట్లు గలుగుచున్నది? స్త్రీ లెట్లు పురుషులందు రక్తలగుదురు? మరల వారికిఁ గాంతలయెడ విరక్తి యెట్లు పుట్టును? కాంతలప్పురుషులకెట్లురక్షింపఁదగుదురు? అదియెల్ల నాకు వివరించి తెలుపుము. వారు క్రీడాపరత్వముగలిగి పురుషులను వంచించుచుండుదురు. ఎట్టి మానవుఁడును, వారిచేతులనుండి తప్పించుకొనిపోఁజాలఁడు. గోవులు క్రొత్తదగు లేఁతగడ్డి నపేక్షించునట్టులు, కాంతలు క్రొత్తక్రొత్తపురుషునిఁ గోరుచుండుదురు. శంబరునకు, నముచికి, బలికిఁ, గుంభీనసునకుఁ గలిగిన మాయలన్నియు స్త్రీలకుఁ దెలిసియుండును. వీరు నవ్వుచున్నవారితో నవ్వుచుందురు. ఏడ్చుచున్నవారితో నేడ్చుచుందురు. తత్తత్కాలానుకూలముగా, నప్రియునిసైతము ప్రియవాక్యములచే సంగ్రహింతురు. శుక్రాచార్యుఁ డేశాస్త్రము నెఱుఁగునో, దేవగురుఁ డేశాస్త్రము తెలియునో, యవి స్త్రీబుద్ధి నతిక్రమింపఁజాలవు. అట్టికాంతలను బురుషులు కాపాడు టెట్లు? ఎవ్వరు సత్యము నసత్యముగను, నసత్యమును సత్యముగను జేసి పలుకుదురో, యట్టికాంతలు పురుషులచే నెట్లు రక్షింపఁదగియుండుదురు. ఓవైరిమారకా! బృహస్పతి మున్నగుబుద్ధిమంతులు, కాంతలబుద్ధ్యర్థనిష్కర్షమునుబట్టియే, యర్థశాస్త్రములనెల్లఁ జేసిరని తలంచుచున్నాఁడను. మఱియుఁ, గాంతలు పురుషులచే గౌరవింపఁబడియు మనోవికార మొందుదురు. తిరస్కరింపఁబడియుఁ జిత్తవైకల్యము గలిగింతురు. ఓమహాబాహూ! ఈస్త్రీలందఱును, ధర్మమునకు నిమిత్త

భూతలని కొందఱు తెలుపుదురు. వారు గౌరవమొనర్చినను నగౌరవమొనర్చినను మనోవికారముగలిగించుచు నుందురు. అట్టివారి నెవ్వరు రక్షింపఁగలరు? ఇదియే నాకు గొప్పసంశయము. ఓకురువంశవర్ధనా! ఈ నాసంశయము దొలఁగునట్లు దెలుపుము. వారిని గాపాడుటకు వీలు పడునా? అది యెన్నఁడేని చేయఁబడెనా? నాకెఱిఁగింపుము." అని ప్రశ్నించుటయు నాపగాతనయుం డిట్లనియె.

### విపులోపాఖ్యానము

"ఓయుధిష్ఠిరా! స్త్రీలనుగుఱించి నీవు పలికినదానిలో నేమియు ననృతము లేదు. ఇందులకుఁ దగుపురాతనేతిహాస మొకటి తెలిపెదను వినుము. మహాత్ముఁడగు విపులుఁడు స్త్రీ నెట్లు రక్షించెనో, పరమేష్ఠి యెందులకై స్త్రీలను సృజించెనో, యదియెల్ల నెఱిఁగించెదను. ఓ పుత్రకా! స్త్రీలనతిమించిన పాపవస్తు వొకటిలేదు. ఆఁడుది ప్రదీప్తమగునగ్నిజ్వాలయు, మయకృతమగు మాయయు, కత్తిదారు ననఁదగి, విషసర్పములకు సాటియై యుండునది. ఓమహాబాహూ! ఈస్త్రీలు ధర్మసంపాదనకు హేతువులని మనము వినినదియే. అయిన నొకటి తెలిపెదను వినుము. మానవులు తమంతఁదాము దేవత్వమొందుచుండఁగా, దేవతలకు భయముగలిగి పితామహునికడకు వెడలి తమయభిప్రాయము నెఱిఁగించి యధోముఖులై యూరకుండరి. ఆదేవతలయుద్దేశమును దెలిసికొని యప్పితామహుఁడు, మానవులకు మోహమును గలిగించునట్లుగా స్త్రీలను శక్తిస్వరూపిణులఁగా సృజించెను. అంతకు ముందటిసృష్టిలో స్త్రీలందఱును బతివ్రతలుగా నుండిరి. పిమ్మట నప్పరమేష్ఠిచే స్త్రీలు దుస్స్వభావలుగా సృజింపఁబడిరి. వారి కాపితామహుఁడు పెక్కుకోర్కులను గల్పించెను. అటులగుట నప్పడంతులు కామలుబ్ధలై పురుషుల నెల్లపుడు బాధింపఁదొడంగిరి. మఱియు నాదేవేశ్వరుఁడగు పరమేష్ఠి వారికిఁ దాఁగల్పించిన కామమునకు సహాయముగాఁ గ్రోధమును నైతము సృజించెను. అపుడాస్త్రీలందఱును గామక్రోధవశగతలై ప్రవర్తింపనారంభించిరి. అటులగుట స్త్రీల కెట్టిధర్మక్రియయు లేకుండునట్లు ధర్మ మేర్పడియెను. మఱియు, వారు నిరింద్రియలును, శాస్త్రహీనలు నై యనృతమూర్తులని శ్రుతి. అప్పర

మేష్టి వారికి శయ్యాసనములను, నలంకారములను, నన్న పానములను, నపూజ్యతను, వచనపారుష్యమును, రతిని గల్పించెను. అట్టిస్త్రీలను గాపాడికొనుట పురుషుల కెంతయు దుర్ఘటము. ఓనారాయనా! ఆవిశ్వ కర్తకుఁగాని, మఱి యేపురుషులకుఁగాని, మాటలచేఁగాని, వధ బంధాదులచేఁగాని, మఱియు వివిధములగు క్లేశములచేగాని రక్షింప వలనుపడదు. వారొకప్పుడు నొక్కరికిని లొంగక ప్రవర్తించువారు. ఈవిషయమును నేను మున్ను వినియున్న వాఁడను. ఒకపుడు విపులుఁ డనువాఁడు గురుస్త్రీని గాపాడెను. ఆచరిత్ర మెట్టిదో తెలిపెదను. వినుము.

ఓధర్మజా! మున్నొకపుడు మహాభాగుఁడై దేవశర్మయను నొక మహర్షి యుండెను. ఆతనికి రుచియను నొకభార్య గలదు. అది పుడ మిని జక్కనిచుక్క యనఁదగియుండెను దేవదానవగంధర్వు లామె రూపమును గాంచి మోహించిరి. ఓరాజేంద్రా! ఆదేవతలం దింద్రునకు మఱియు నామెయందుఁ బ్రీతిగలిగియుండెను. మహామునియగు దేవ శర్మ స్త్రీలచరిత మెఱిఁగినవాఁడగుటఁ దనశక్తికొలఁదిని, నుత్సాహము కొలఁదిని, నామెను గాపాడికొనుచువచ్చెను. మఱియు నాదేవశర్మకుఁ బురందరుఁడు పరస్త్రీ కామచారియగుటయుఁ దెలియును. అటులగుట నతఁడు, తగువిధముగాఁ దనభార్యను గాపాడికొనుచువచ్చెను. ఇటు లుండ నొకపు డాతని కొకయజ్ఞముచేయింపఁ బోవలసివచ్చి నిజభార్యా రక్షణ మెటులగునో యని చింతించి, తద్రక్షావిధానమును దుద కిట్లు నిశ్చయించికొని, తనకుఁ బ్రియశిష్యుఁడగు విపులునిఁ బిలిచి వానితో 'ఓవిపులా! నేనొకయజ్ఞము చేయింపఁ బోవలసివచ్చెను. నాభార్య యగురుచి, నాయింద్రుఁడు నిత్యము గలియఁగోరుచున్న వాఁడు. కావున నీ వామెను యథాశక్తిగా రక్షింపవలయుఁజుమీ! నీవెల్లపుడు నాయింద్రునెడ, నప్రమత్తుఁడవై యుండఁదగును. ఓభృగూత్తమా! ఆయింద్రుఁడు బహువిధరూపములతో నేడ్చెడివాఁడుసుమీ!' అని తెలిపెను.

ఓయుధిష్ఠిరా! తనగురువగు దేవశర్మ యిట్లు తెలుప విని తపస్వియు, నియతేంద్రియుఁడునగు నావిపులుఁడు, 'మహామునీ! తమయానతి ననువర్తించెద' నని పలికి, యుగ్రతపుఁడును, నగ్నిరవి

తుల్య తేజుఁడును, ధర్మజ్ఞుఁడును, సత్యవాదియునగు నతఁడు, పయస్నమై యున్న గురునిఁ గాంచి మఱియు నాతనితో 'ఓమునివర్యా! ఇందు లకువచ్చు నాపురందరుఁ డేయేరూపముల వహించును? ఆతనిశరీర మెట్టులుండును? తెలుపుము' అని యడిగెను.

ఓపాండవాగ్రజా! అదివిని భగవానుఁడగు నా దేవశర్మ మహాత్ముఁడగు నావిపులున కాయింద్రుని మాయావిధమెల్లఁ దెలుపువాఁడై యిట్లు పలికెను.

'ఓవిపులా! భగవానుఁడగు నా పాకశాసనుఁడు, పెక్కు మాయలుగలవాఁడు. అతఁడు మఱిమఱియు నాయాభావములఁ బెక్కుచూపును. అతఁ డొకప్పుడు కిరీటియు, వజ్రభూషణుఁడును, వజ్రాయుధధారియు, మకుటాలంకృతుఁడును, గుండలధారియు నై గానిపించును. మఱియు నొకగడియలోఁ జండాలసమరూపుఁడై చూపట్టును. ఓనాయనా! మఱియు నొకనిమేషమునకే, జటాధారియుఁ, జీరవసనుఁడును, శిఖాలంకృతుఁడు నై యగపడును. అంతలోనే గొప్పమేనుగలవాఁడును, నంతలోనే మఱియుఁ జీరవసనుఁడును, గృశుఁడు నై గానిపించును. అటులే యొకగడియకు గౌరవర్ణుఁడును, మఱొకగడియకు శ్యామకాంతియు, మఱియొక గడియకుఁ గృష్ణవర్ణుఁడు నై చూపట్టుచుండును. ఒకమాఱు కురూపియు, వేఱొకమాఱు సురూపియు నై యుండును. అపుడు యువకుఁడును, దత్క్షణము వృద్ధుఁడు నై చూపట్టును. ఆయింద్రుఁ డొకపుడు బ్రాహ్మణుఁడుగను, నొకపుడు క్షత్త్రియుఁడుగను, నొకపుడు వైశ్యుఁడుగను, వేఱొకపుడు శూద్రుఁడుగను గానిపించును. మఱియు నతఁడు ప్రతిలోమానులోమరూపుఁ డై యగపడుచుండును. ఇంకను, జిలుకవలెను, గాకివలెను, హంసరీతిగను, గోకిలమాదిరిగను గనఁబడుచుండును. మఱియు సింహవ్యాఘ్రగజాదులరూపమును ధరించుచుండును. అటులే దేవదానవులయు, క్షత్త్రియులయు రూపము పూనుచుండును. ఒకనిమేషమునకు స్థూలాకారుఁడును, నొకగడియకు వాతరోగియు, వేఱొకగడియకుఁ బక్షిరూపుఁడును, వికృతరూపుఁడును నై యుండును. అటులే పశురూపుఁడు, బహురూపుఁడును, బాలిశుఁడు నై చూపట్టుచుండును. మఱియు మక్షికామశకాదులరూప మూను

చుండును. ఓవిపులా! ఎవ్వనికిని వీనిని దెలియుట కష్టము. ఓనాయనా! ఈప్రపంచమును సృజించిన పరమేష్ఠికిని, నాయింద్రునిఁ దెలియుట దుర్ఘటము. అతఁ డంతర్హితుఁడైనపుడు జ్ఞానదృష్టిచేఁ జూడనగును. కాని యతఁడు వాయుభూతుఁడై యుండును. ఇటు లాపాకశాసనుఁడు పెక్కురూపములు పూనును. కావున నోవిపులా! తనుమధ్యయగు నీగురుపత్నిని బ్రయత్నపూర్వకముగాఁ గాపాడవలయును. ఓభృగుసత్తమా! ఇంతయేల? ఆయింద్రుఁడు, రుచి నెట్లు స్పృశింపకుండునో, యటు లొనర్పవలయును.'

ఓయుధిష్ఠిరుఁడా! విపులుఁ డాగురుని వచనము లాలించి యొంతయుఁ జింతించుచు, మహాబలుఁడగు నాదేవరాజునుండి పరమ రక్షనొనర్చువాఁడై 'ఆహా! గురుభార్యారక్షణ మెట్లుచేయఁగలను? ఆయింద్రుఁడు మాయాశీలుఁడును, వీర్యవంతుఁడును, దుర్ధర్షుఁడును నైయున్నవాఁడు. ఈ మా యాశ్రమమును, నీపాదరింటిని మూయక పాకశాసనునుండి యీమెను రక్షింప వీలుగాదు. వీఁడు నానావిధ రూపములనొందును. ఒకపుడు వాయురూపమునవచ్చి యావాసవుఁ డీమెను బలాత్కరించి చెఱుచునో? కావున నేనిపు డీమెశరీరములోఁ బ్రవేశించియుందును. అటులుగాదేని, కేవలపురుషకారముచే నీమెను గాపాడ వలనుపడదు. భగవానుఁ డగుపాకశాసనుఁడు బహురూపుఁ డని దెలుపుదురుగాదే? అటులగుట నే నీమెగాత్రములం దేకీభవించి యుండుదును. అటులేని యీమె రక్షణమగును. ఇటులు నేనొనర్తు నేని నాగురుఁడు తనభార్య యుచ్ఛిష్టయయ్యెనని కుపితుఁడై శపించు నేమో? దివ్యజ్ఞానసంపన్నుఁడును మహాతపుఁడునగు నాతని కది తెలియ కుండునా! తెలిసిన శపింపకుండునా? సామాన్యముగా నితర కాంతలు వారివారిచే రక్షితలైనట్టు లీమె రక్షింపఁబడుట దుర్లభము. ఈయింద్రుఁడు బహుమాయావి. కావున నిపుడు గొప్పసంశయ మొదవెను. గురుశాసన మవశ్యకర్తవ్యముగదా! అటులగుట, నే నీమెమేనఁ బ్రవేశించి రక్షించితినా? గొప్పయాశ్చర్యము చేసినవాఁడ నగుదును. ఇపుడే గురుపత్నీకళేబరమును యోగబలముచేఁ బ్రవేశింతును. వేఱొక యుపాయములేమి? నే నీమెను బ్రవేశించి స్థిరచిత్తుఁడనై పద్మపత్రగత జలబిందువట్లుండి, రజోరూపమున మరల వెడలితినా? అపుడు నాయప

బాధముండదు. బాటసారి, త్రోవలోనున్న శూన్యసభలోఁ బ్రవేశింపఁడా? అటులే గురుపత్నికళేబరమున, నా మేను బ్రవేశపెట్టెదను. ఆమెశరీరమందే సమాధినిష్ఠుఁడనై యుండుదును.' అని తనధర్మమును తనగురుని విపులమగుతపమును దలంచి, గురుపత్నిరక్షణమును నిశ్చయించి యావిపులుఁ డెంతయుఁ బ్రయత్నించెను. దానిం దెలిపెదను. వినుము. మహాతపుఁడగు నావిపులుఁ డపు డట్లు గురుపత్నిని బ్రవేశించి, తననేత్రరశ్ములచే నామె నేత్రరశ్ములనుగూర్చి, వాయు వాకసమునట్లు లామెశరీరమున నేకీభవించి యుండెను. అటు లమ్ముని, యమ్ముదితమేన నడఁగి నీడవలె విడువక చలింపక యామెరక్షణమున జాగరూకుఁడై యుండెను. అటు లతఁడు లక్షణము లక్షణముతోడను మొగము మొగముతోడను గూర్చియుండుట యామెకుఁ దెలియదు. ఓరాజా! మహాత్ముఁడగు విపులుని యుపాధ్యాయుఁడు క్రతుసమాప్తి గావించి నిజాశ్రమమునకు వచ్చునంతకును నతఁ డామెను రక్షించువాఁడై యుండెను." అని తెలిపి భీష్ముఁడు మఱియు నిట్లనియె.

## దేవశర్మోపాఖ్యానము

ఓధర్మజా! పిమ్మట నొకపు డింద్రుఁడు దివ్యరూపధారియై యదియే తానందులకు వచ్చుట కదనని తలంచి, లోభనీయమగు నిరుపమానరూపమూని చూడఁదగి వెలయుచువచ్చెను. అందు, నిశ్చేష్టయై, స్తబ్ధనయనయై, చిత్రగతయైనదివలెనున్న యావిపులుని కళేబరమాతనికి గానవచ్చెను. అచ్చోటనే పీనశ్రోణిపయోధరయుఁ, బద్మదళవిశాలాక్షియుఁ, బూర్ణచంద్రవదనయు,రుచిరాపాంగయునగు రుచియు నాతనికంటఁబడెను. అపు డామె యాయింద్రునిఁ జూచి వడిగాలేచి, యెదుర్కొనఁబోవ నుద్యుక్తయై యామహేంద్రునిరూపమున కచ్చెరువందుచు, 'నీవెవ్వఁడవని యడుగ నెంచి నిలువఁబడియు, నావిపులునిచే నిగ్రహింపఁబడి నిశ్చేష్టయై యేమియుఁ జేయఁజాలదయ్యెను. అపు డాయింద్రుఁడు మిక్కిలి యింపగు ప్రియోక్తివెలయ నామెతో, 'ఓమందహాససుందరవదనా! నీకై వచ్చినయింద్రునిఁగా నన్నుఁ దెలియుము. నిన్నుఁ బ్రేమించుటచేఁ గల్గినయనంగునిచే నెంతయుఁ గ్లేశమందుచున్నవాఁడను. ఇట్లువచ్చిన నన్నుపేక్షింతువేటికి? కాలముగడచు

మన్నది' అని పలికెను. అటులు పలుకుచున్న శక్రునివచన మావిపులుఁ డాలించి, తనగురుపత్ని శరీరమందున్నవాఁడగుట నాయింద్రు నతఁడు పరికించెను. ఓరాజా! ఆరుచి యాయింద్రు నెదుర్కొన నుద్దేశించియు నప్పని చేయఁజాలదయ్యెను. ఓరాజా! ఆమె నిశ్చేష్టయై మాటలాడను జాలదయ్యెను. ఓయుధిష్ఠిరా! అపుడు విపులుఁడు తనగురుపత్ని యాకారమును గాంచి, మహాతేజుఁడై యోగబలముచే బలాత్కారముగా నామెను నిగ్రహించి మరియు యోగబంధములచే నామె యింద్రియములను నిర్బంధించెను. అంత నిర్వికారయైయున్న యామెను గాంచి యాశచీపతి, లజ్జితుఁడై యోగబలవశయైయున్న యామెతో 'రమ్ము, రమ్మ'ని పలుకుటయు, నామె ప్రతివచన మొసంగ నెంచినదయ్యు, విపులునిచే నిగ్రహింపఁబడినదగుట మాఱుపలుకనేరదయ్యెను. పిమ్మట నావిపులుని యోగబలముచేఁ, జంద్రసదృశమగు నామెవదనమునుండి, 'ఓయీ! నీవిందు కేలవచ్చితివి?' అను సంస్కారభూషితమగు నొక వచనము వెడలెను. ఆరుచియుఁ బరవశయగుటచే నిట్లు పలికి లజ్జావతియై యుండెను. అంత నాపురందరుఁడును, నెంతయు వికలచిత్తుఁడై కాలుగదల్పనేర కూరకుండెను. పిమ్మటఁ గొంతవడి కాసహస్రాక్షుఁడు, మునిపత్నివికారమును గనిపెట్టి దివ్యదృష్టిచేఁ బరికింపఁ, నామె శరీరమున నడఁగియున్న యావిపులముని గానవచ్చెను. అటులు గురుపత్నిశరీరముననున్న ఘోరతపోయుక్తుఁడగు విపులు నద్దమునఁ గానవచ్చిన ప్రతిబింబమట్లు గాంచి, యతఁడు తన్ను శపించునేమో యని మిగుల జడిసి వడఁకఁదొడంగెను. మహాతపుఁడగు విపులుఁడును, తన గురుపత్నిశరీరమునువిడిచి, నిజశరీరమును జొచ్చి, మిక్కిలి భీతుఁడైయున్న యమ్మహేంద్రునితో "ఓయింద్రా! అజితేంద్రియా! దుర్మతీ! పాపాత్మా! నిన్నిఁక దేవతలును మానవులును చిరకాలము పూజింపరు. ఓశక్రా! మున్ను నీవు గౌతమునిచే, భగాంకపరిచిహ్నితుఁడవై విడువంబడితివిగాదే? అది నీచిత్తమున లేదా? అపుడే మఱచితివా? నీవు బాలిశుఁడవు, నకృతాత్ముఁడవునగు విభుఁడవగుట నేనెఱుంగక పోలేదు. ఓమూఢా! ఈరుచి నాచే రక్షింపఁబడుచున్నది. కావున నీవు వచ్చినత్రోవఁబొమ్ము. ఓరీ! నేనిపుడు నీపైఁ దయదలఁచి విడుచుచున్నాఁడను. లేనిచో నాతేజముచే నిన్నొకనిమేషమున దహింప

కుండునా ? ఓవాసవా ! ధీమంతుఁడగునాగురుఁడు, పాపచిత్తుఁడవగు నిన్నుఁ గాంచెనేని, ఘోరాకారుఁడై క్రోధోద్దీపితమగుచూపులచే నిపుడే నీరూపు మాపకుండునా ? ఓశక్రా ! నీవిఁకనైన నిట్టిపని నెన్నఁడును జేయవలదు. నీకు బ్రాహ్మణులు మాననీయులుసుమీ ! నీవు బ్రహ్మబలబాధితుఁడవై నిజపుత్త్రామాత్యసహితముగా నశింపవలదు. నేను మరణములేనివాఁడ ననుబుద్ధిపెట్టికొని ప్రవర్తించుచున్నవాఁడవు గాఁబోలును. తపమునకు సాధింపరాని దేదియు నుండదని తలంపుము' అని పలికెను.

ఓధర్మజా ! మహాత్ముఁడగువిపులుని యావచన మాయింద్రుఁ డాలించి, సిగ్గువడి యేమియుఁబలుకలేక యందే యంతర్ధానమొందెను. అటు లాయింద్రుఁడు వెడలిన రెండుగడియలకే మహాతపుఁడగు దేవశర్మ, తాను జేయించుయాగమును సమాప్తముగావించి నిజాశ్రమమున కరుదెంచెను. అటు లతఁడు వచ్చినతోడనే, గురుప్రియకర్తయగు విపులుఁడు, తానొనర్చిన గురుభార్యారక్షణవిధమంతయు నెఱిఁగించి, గురుభక్తిగల యతఁడు గురువర్యునకు నమస్కరించి, నిశ్శంకముగ వెనుకటిచొప్పున నాతనిసేవించుచువచ్చెను. అటులు కొలఁది కాలము గడచినపిదప నొకపుడు విశ్రాంతుఁడై భార్యతోఁ గూర్చుండియున్న తనగురునకు, శక్రుఁ డొనర్చినచేష్టలెల్ల సవిస్తరముగా నివేదించుటయు, నమ్మునివర్యుఁ డదివిని నిజశీలవృత్తతపోనియమములకు భంగముగలుగకుండ శాంతుఁడై, విపులునకుఁ దనయెడఁగలభక్తికిని, ధర్మమునెడఁగల స్థైర్యమునకును మెచ్చి మేలు మేలని పొగడెను. అటు లతఁ డెంతయు సంతుష్టుఁడై శిష్యుని ధర్మపరాయణునిఁగా నెఱిఁగి, యాతని నొకవరము గోరికొమ్మని పలికెను. అంత నాగురువత్సలుఁడగు విపులుఁడును దనకు ధర్మస్థిరతగోరికొని యతనిచే ననుజ్ఞాతుఁడై వెడలి, నిరుపమానమగు తపమొనర్చుచు వచ్చెను. అటులే దేవశర్మయు, నిజభార్యాసహితుఁడై యింద్రునివలన భయముదక్కి నిజవనమునఁ జరింపసాగెను.” అని తెలిపి భీష్ముఁడు మఱియు నిట్లనియె,

## విపులునిచరిత్రము.

"ఓయుధిష్ఠిరా! ఆవిపులుండట్లు గురునానతి వడసి తీవ్రతపము గావించి, తత్సుకృతముచే నిర్భయముగా స్వర్గభూలోకములం జరించుచు సత్కీర్తి వడసి, యుభయలోకములును దనచే జయింపం బడియెనని యతఁడు తలంచియుండెను. ఓకురునందనా! అంతఁ గొంత కాలము గడచెను. అపుడు రుచియక్కయింట ధనధాన్యసమృద్ధిగల యొక వివాహము జరుప నిశ్చయింపఁబడియెను. అపుడే యొక దేవ కాంత, నిజసౌందర్యము వెలయించుచు నాకాశమునఁ బోవు చుండఁగా, దాని శరీరమునుండి, రుచియాశ్రమసమీపమున దివ్య గంధముగల కొన్నిపుష్పములు రాలిపడెను. ఓరాజా! అపు డారుచి, యాపుష్పములను దీసికొనియుండఁగా, నంతలో వివాహమునకు రమ్మని తనయక్కనుండి రుచికిఁ బిలుపువచ్చెను. అటులగుట నారుచి తన యక్కభర్తయగు నంగదేశాధీశునియింటికిఁ బోవలసివచ్చెను, ఆరుచియక్కపేరు ప్రభావతి. అంగేశ్వరుఁడగు చిత్రరథున కామె భార్య. అటులు ప్రయాణమై యారుచి, తాను మున్ను సంగ్రహించి యున్న దివ్యగంధములగు పుష్పములఁ దల నలంకరించికొని యంగపతి యింటికిఁ బోయెను. అపు డంగరాజుభార్యయగు ప్రభావతి, రుచి తలలోనున్న పూవులను గాంచి యవి తనకుఁ గావలయుననియు, నెటులేనిఁ దెప్పింపవలయుననియుఁ గోరుటయు, నారుచి యాసందర్భ మును దనభర్తకెఱిఁగించెను. దాని కాదేవశర్మ సమ్మతించి, తనశిష్యుఁ డగు విపులునిఁ బిలిపించి 'ఓవిపులా! దివ్యగంధములగు నిట్టిపూవుల నెటులేని సంపాదించుకొనిరమ్ము. వడిగా వెడలి పొమ్ము' అని చెప్పెను. అపు డావిపులుఁడు గురునివచనము లాలించి, మఱియేమియు నాలో చింపక యటులే యొనర్తునని పలికి, యాపూవు లెచ్చటనుండి పడి యెనో, యవి యెందుండునో యందుల కేఁగుటయు, నందించుకేని వాడకయున్న మఱికొన్నిపూవు లాతనికిఁ గానవచ్చెను. అపు డతఁడు మిక్కిలి మనోజ్ఞములగువానిని దీసి, తపశ్శక్తిచేఁ దనకటులు ప్రాప్త ములగు నాపూవులను బట్టికొని, ప్రీతాత్ముఁడును, గురువచనకారకుఁడు నగుచు వడిగా వెడలి, చంపకమాలినియగు చంపాపురము చేరువను బోవుచుండఁగా, నందొక నిర్జనవనమున నొకమానవద్వయము గాన

వచ్చెను. ఆతనికిఁ గానవచ్చినయాపురుషు లిద్దఱు నొకనిచేయి నొకఁడు పట్టికొని చక్రాకారముగాఁ దిరుగుచుండిరి. అందొకఁడు రెండవవాని నడుగునుండి తప్పించుచు గట్టిగా నాకర్షించెను. ఓరాజా! అపుడా రెండవవాఁ డటులు తిరుగలేక పోయెను. అపుడు వారికిఁ గలహము గలిగెను 'ఓరీ! నీవు వడిగాఁ దిరుగుచున్నాఁడ'వని యొకఁడును, 'లేదు నేనటులు తిరుగలే'దని యొకఁడును బలుకసాగిరి. వారపుడు కాదనియు, నౌననియుఁ బరస్పరము వాదము సేసికొనిరి. ఇటులు వారిరువురును గలహించి, విపులు నుద్దేశించి యొకరియొట్టు పెట్టుకొనువారై 'ఓరీ! మనలో నెవ్వఁ డనృతమాడెనో, వానికిఁ బరలోకమున విపులున కైన దుర్గతి గాక తప్పదు' అని పలికిరి. అది విని విపులుఁడు చింతాక్రాంతుఁడై 'అయ్యో! నేను దీవ్రతప మొనర్చితిని. ఈనాపరిశ్రమ మెంతయుఁ గష్టమైనది గదా! ఈయిరువురకు నేనేమి పాపము చేసితినో, సకలభూతానిష్టముగా, నిపుడు వీరిచేఁ బలుకఁ బడుచున్నది.' అని చింతించుచునే, యావిపులుఁడు మొగము వాంచి దీనమానసుఁడై తనదుష్కృతమును జ్ఞప్తికిఁ దెచ్చికొనుచుండెను. పిమ్మట నాతనికి మఱియు నార్వురుపురుషులు గానవచ్చిరి. వారు పరమానందముగా, సువర్ణరజతమయములగు పాచికలతో నాఁడుకొనుచు వానికిఁ గానవచ్చిరి. మున్నాయిరువురు నొనర్చినవిధముగనే, వారును నావిపులు నుద్దేశించియే, శపథముచేయువారై 'ఓరీ! మనయార్వురలో నెవఁడు లోభమూని, విషమక్రీడఁ జేయనుత్సహించునో, వాఁడు, పరలోకమున విపులుఁ డొందఁదగిన దుర్గతి నొందుచున్నాఁడు.' అని పలికికొనిరి. అంత నావిపులుఁడదియువిని ధర్మసాంకర్యమును దెలిసికొనలేక, తాను జనించినదిమొదలుగ నేమి యొనర్చినదియు జ్ఞప్తికి రాక, యట్టిపరుషవచనములను వినుట దహ్యమానమానసుఁడై యగ్నియందుంచినయగ్నివలెఁ దప్తుఁడగుచుఁ జింతించుచుండఁగాఁ బెక్కుదినములు గడచెను. అంతఁ గొన్నినాళుల కాతని కిట్లు స్మృతిపథమునకు వచ్చెను. అపు డతఁడు 'అయ్యో! నేను గురుపత్నిని రక్షించుటకై యొనర్చినవిధమే నన్నుఁ బాతకునిఁగా నొనర్చెను. నేనపుడు లక్షణముతో లక్షణమును, వదనముతో వదనమును గూర్చితిని గాదే? ఆసత్యవిషయమును నాగురున కెఱిఁగింపనైతిని.' అని చింతించెను.

ఓయుధిష్ఠిరా! ఆవిపులుఁ డదియే తానొనర్చినపాపముగా నిశ్చయించి చంపానగరమును జేరి తాను దెచ్చిన పూవులను గురున కర్పించి విధ్యుక్తముగా గురుసేవ సేయుచునుండెను” అని తెలిపి భీష్ముఁడు మఱియు నిట్లనియె.

విపులోపాఖ్యానము

“ఓయుధిష్ఠిరా! అటులు వచ్చిన యాశిష్యునిఁ గాంచి దేవశర్మ, యేమి తెలిపెనో, యది యెఱిఁగించెదను వినుము. ఆదేవశర్మ విపులునిఁ గాంచి ‘ఓశిష్యా! నీవామహావనమున నేమి చూచితివి? ఓవిపులా! వారు నిన్నుఁ దెలిసికొనిరా? రుచియు వారికిఁ దెలిసెనా? తెలుపుము.’ అని పలికెను. అది విని యావిపులుఁ డమ్మునితో ‘ఓగురూత్తమా! ఆద్వయ మెద్ది? ఆపురుషు లెవ్వరు? వారు నన్నెట్లు తెలిసికొనిరి? నీవెట్లు నన్నడుగుచున్నాఁడవు? తెలుపు’మని ప్రశ్నించెను. అంత నాదేవశర్మ, ‘ఓశిష్యా! నీకుఁ గానవచ్చిన యాద్వయమును, నహోరాత్రములని తెలియుము. అయ్యవి చక్రాకారముగాఁ దిరుగుచు నీదుష్కృతమును దెలిసెను. ఓవిప్రా! సంతుష్టాంతరంగులై యేపురుషులు పాచికలాడుకొనిరో, యవి ఋతువులుగా నెఱుఁగుము. అవి నీదుష్కృతము తెలిసికొనుచున్నవి. నన్నెవ్వఁ డెఱుఁగునని మాత్రము నమ్మవలదు. ఓద్విజోత్తమా! పాపాత్ముఁడగు మానవుఁడు రహస్యముగాఁ బాపమొనర్చును. అటులు రహస్యముగాఁ బాపమొనర్చు మానవునెల్లపుడు నహోరాత్రములును, ఋతువులును బరికించుచుండును. లోకులెల్లఁ బాపకారు లగుచుండుదురు. నీవు నాకుఁ దెలుపక కర్మ మొనర్చితివి గాదే? అటులు గురుఁడనగునాతోఁ దెలుపని, యానీకృత్యమును గాంచి, చిఱునగవు వెలయ, నిన్నవి, స్మరింపఁ జేయుచున్నవి. వానిపలుకు లాలించితివి గాదే? పురుషుఁడు నిత్యము నొనర్చు శుభకర్మమునుగాని, యశుభకర్మమునుగాని, యాయహోరాత్రములును, ఋతువులును దెలిసికొనుచుండును. నీవు నాకడ, నిపుడు భయాత్మకమగు నేమికర్మ మొనర్చి తెలుపవైతివో, దాని నవి యెఱిఁగి, నీతోఁ బలికినవి. నీవు రుచిని దుర్వృత్తినుండి రక్షించితివి. కావున నీవలన నించుకేని పాప మొనర్పఁబడలేదు.

నేనందులకుఁ బ్రీతుఁడనైతిని. ఓద్విజసత్తమా! నీవు దుర్వృత్తుఁడవని నాకుఁ గన్పట్టితివేని, కోపముచే నిన్ను శపించియుందును. ఇందు నాకు సందియము లేదు. కాంతలు పురుషులందు సక్తలగుదురు. అదియే పురుషులకుఁ బుష్కలమగు కార్యమగుచుండును. నీవు రక్షింపకుండుదువేని నిన్ను శపింపక మానను. నీవు నాభార్యను రక్షించితివి. నాకావిషయమెఱిఁగించితివి. ఓపుత్రకా! నీయెడ నాకుఁ బ్రీతి గలిగెను. నీవు సుఖముగా స్వర్గమొందుదువు.' అని పలికి యాదేవశర్మ విపులుని యెడ దయగలిగియుండెను! మఱియు నాదేవశర్మ, భార్యాశిష్యులతో స్వర్గమునొంది సంతుష్టాంతరంగుఁడై యుండెను. ఈమహాఖ్యానమును, మహామునియగు మార్కండేయుఁడు మున్ను గంగాతీరమునఁ బ్రసంగవశమున నాకెఱిఁగించెను. ఓపార్థా! కావుననే స్త్రీలు జాగరూకతమెయి రక్షింపఁదగినవారని యెఱిఁగించితిని. సాధుత్వాసాధుత్వములు రెండును, నెల్లపుడును స్త్రీలయందుండును. వారిలోఁ బతివ్రతలును లోకమాతలును, మహాభాగలునగు స్త్రీలును లేకపోలేదు. ఓరాజా! వారిమ్మహినెల్ల ధరించుచున్నారు. ఇఁక దుర్వృత్తిగలవారును, కులపాంసనలును, పాపనిశ్చయలును, నయోగ్యలునగు స్త్రీలును గలరు. ఓరాజా! నిజగాత్రసహజములగు దుష్టలక్షణములచేఁ దెలియఁబడుచుందురు. ఇటులే యట్టికాంతలు మహాత్ములగువారిచే రక్షింపఁదగియుండుదురు. కాదేని వారిని రక్షించుట కష్టము. ఓపురుషవ్యాఘ్రా! వారు తీవ్రలును, దీవ్రపరాక్రమలునై ప్రవర్తింతురు. ఎవ్వఁడు మైథునమున వారిని గూడునో, వాఁడే వారికిఁ బ్రియుఁడగును. వారికందుఁ బ్రియుఁడు గానివాఁ డుండఁడు. ఓభరతర్షభా! స్త్రీలు కష్టమొనర్చువారై కృతఘ్నులును గృత్యస్వరూపలునయి ప్రవర్తిల్లుదురు. ఓపాండునందనా! వారొకపురుషునందు మాత్రమెన్నఁడును బ్రీతి నిలుపరు. పురుషులు వారితో స్నేహమును వైరమును జేయరాదు. వారితోఁ గష్టముగా భుజింపవలెను. ధర్మమును విడువక వర్తింపవలయును. ఓకురునందనా! మానవుఁ డీవిధముగాఁ గాక, వేఱొకరీతి వర్తించునేని హానికిఁ దానక మగుచున్నాఁడు. ఓరాజా! ఎల్లవిధముల యుక్తముగాఁ బ్రవర్తించువాఁడు పూజ్యుఁ డగుచున్నాఁడు. ఆవిపులుఁ డొక్కఁడే స్త్రీకి రక్షణమొన

ర్చెను. ఓయుధిష్ఠిరా! ఈమూఁడులోకములందును, నతఁడు తక్క వేఱొక్కఁడు స్త్రీని రక్షింప సమర్థుఁడు లేఁడు." అని తెలుప విని యుధిష్ఠిరుఁడు మఱియు ని ట్లనియె.

## వివాహకథనము

"ఓపితామహా! సకలధర్మములకును, స్వజనమునకును, గృహమునకును, పితృదేవాతిథులకును, నెయ్యది మూలమో యది నాకెఱిఁగింపుము. సర్వధర్మములందును నదియే తగు ధర్మమని తెలిసికొనవలెను. ఓ తాతా! ఎట్టివానికి గన్య నొసంగవలయును?"

అది విని భీష్ముఁడు, "ఓయుధిష్ఠిరా! వరుని శీలవృత్తములను, విద్యను, మాతృవంశమును, గర్మమును దెలిసికొని, వివేకులగువారు గుణవంతుఁడగు వరునకే కన్నియ నొసంగవలయును. సద్బ్రాహ్మణులకు బ్రాహ్మవివాహమే మొదటి ధర్మము. వివాహయోగ్యుఁ డగువరునిఁ బిలిపించి యనుకూలునిఁగా నొనర్చి వానికి గన్నియ నియవలయును. రెండవదగు ప్రాజాపత్యవివాహము విప్రులకును, క్షత్రియులకును బ్రశస్తమైనది. గృహస్థు తనయిష్టమును మాని కన్నియ కెవ్వఁ డిష్టపడునో, వాని కొసంగవలెను. వరుఁడు దేనిని గోరునో, దానినే యాతని కీయవలయును. అది గాంధర్వవివాహ మనఁబడును. ఓరాజా! హెచ్చుగా ధన మొసఁగి, బాంధవులను లోభపెట్టి కన్నియను గొనినచో, నది యాసురవివాహమని పండితులు తెలుపుదురు. బంధుమిత్త్రాదులను గొట్టి, తలలఁ దెగఁగొట్టి, కన్నియ యేడ్చుచుండఁగా గృహమునుండి బలాత్కారముగాఁ గన్నియను హరించి పెండ్లాడినచో, నది రాక్షసవివాహ మనఁబడుచున్నది. ఈయైదు వివాహములలో మొదటి మూఁడును ధర్మమును గూర్చునవి. తక్కినవి రెండును ధర్మప్రదములు గావు. రాక్షసవివాహాంతర్భూతమగు పైశాచము నాసురమును జేయరానివని తెలియుము. బ్రాహ్మప్రాజాపత్యగాంధర్వములు త్తమములు. ఈపై వివాహవిధులు కలిసిగాని వేఱువేఱుగఁగాని కర్తవ్యములు. బ్రాహ్మణునకు మూఁడుజాతులవారును, క్షత్త్రియునకు రెండుజాతులవారును భార్యలు గావచ్చును. వారియందు సంతానము గనవచ్చును. వైశ్యుఁడు స్వజాతిస్త్రీయందే సంతానము గనవలెను.

బ్రాహ్మణునకు బ్రాహ్మణకాంత మొదటి దనఁదగియుండును. క్షత్త్రియునకు క్షత్త్రియకాంత ప్రధానమైనది. శూద్రకాంతతో సంభోగము మాత్రము చేయవచ్చునని కొందఱును నదియుఁ దగదని మఱికొందఱును దెలుపుదురు. శూద్రకాంతయందు సంతానము మాత్రము గనరాదని సజ్జనులు దెలుపుదురు. శూద్రయందు సంతాపము గనిన విప్రుఁడు ప్రాయశ్చిత్తము చేయించుకొనవలయును. ముప్పదివత్సరములు వయసుగలవరుఁ డేకవసనయై పదేండ్లవయసుగల కన్నియను బెండ్లాడవలయును. ఇరువదొకవత్సరములు వయసుగలవాఁ డేడేండ్ల కన్నియను వివాహము చేసికొనవలయును. ఏకన్నియకుఁ దండ్రి తెలియఁబడకుండునో, అన్న యుండఁడో యట్టిదానిని బెండ్లాడరాదు. అట్టిది నిజపితృధర్మనిమిత్తయై ధర్మిణి యనఁబడుచున్నది. కన్నియ ఋతుమతియైనపిదప మూఁడువత్సరములు నిరీక్షించి యప్పటికిని బిత్రాదులు తన్నొకగుణవద్వరున కొసంగనిచోఁ బిమ్మటఁ గన్నియ తనంతఁ దానే భర్తను జూచుకొనవచ్చును. అటులేని దానిరతికిని సంతానమునకును భంగము గలుగకుండును. అటులుగాక యది వేఱొకవిధముగాఁ బ్రవర్తించెనేని నింద్య యగుచున్నది. వరుఁడు తనతల్లికి సాపిండ్యసంబంధము లేనిదియుఁ దండ్రికి సమగోత్ర గానిదియునగు కన్నియను బెండ్లాడినచో, ధర్మము లభించునని మనువు చెప్పియున్నాఁడు." అని తెలుప విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె.

"ఓపితామహా! కన్నియకొకఁడు శుల్కమిచ్చియుండును, ఒకఁ డిచ్చెదనని చెప్పును. వేఱొకఁడు బలాత్కారముగా నడిగి వాగ్దాన మొందును. మఱియొకఁడు పూర్ణమగు ధనము చూపి కన్నియను దన కిచ్చుటకై సమ్మతింపఁ జేయును. ఇంకొకఁ డాకన్నియను బెండ్లాడును, అట్టికన్నియ యెవ్వనికి భార్య యగునో తెలుపుము. యథార్థమును దెలియఁగోరు మాకు నీవగదా! నేత్రము."

అది విని భీష్ముఁడు, "ఓధర్మజా! ఆలోచనగలపలువురిచే నిర్ణయింపఁబడిన మానవకృత్యమే వివాహవ్యవస్థాపకమగును. దానిని దప్పుట పాతకహేతువు గాకతప్పదు. తలిదండ్రులును ఋత్విగాచార్యులును శిష్యులు నుపాధ్యాయులును వివాహవిషయమున నసృతమాడుదురేని శిక్షార్హు లగుదురని కొందఱును, గారని కొందఱును, బలుకుదురు.

ఇష్టములేకుండియు వాగ్దానము చేయుట తగదని మనువు చెప్పెను. అనృతమాడి ధర్మవిరోధము గలిగించుకొనుట యపకీర్తికరమును, దోషహేతువు నగుచున్నది. ధర్మలోపము గలుగకుండఁ గన్నియ నొసంగినవానికిని, శుల్కమిచ్చి పరిగ్రహించినవానికిని దోషము గలుగకుండును. బంధుగులందఱును సమ్మతించినపిమ్మట మంత్రహోమకృత్యము లొనర్పవలయును. వారిసమ్మతి గల్గునపుడే మంత్రములు సిద్ధించును గాని, వారిచే దానము చేయఁబడని కన్నియ యెడ నవి సిద్ధింపవు. వివాహవిషయమున జ్ఞాతికృతినిశ్చయము కన్నఁ దలిదండ్రు లాలోచించి చేసిన నిశ్చయమే గురుతర మైనది. ధర్మశాసనముఁబట్టి దేవదత్త యగుభార్యను, బతి పడయు నేని, వానికి దైవమానుషమగునన్నృతము సంభవింపనేరదు" అని తెలుప విని యుధిష్ఠిరుఁడు మఱియు నప్పితామహునితో "ఓతాతా! ఒకఁడు తనకన్నియకు శుల్కము పుచ్చుకొని, పిదప ధర్మకామార్థసంపన్నుఁ డగు వేఱొకవరుఁడు లభించి నపుడు వాని కొసంగినచో, దాతకు, వాచ్యతయు, ననృతము నగునా? అట్టిపట్టున వాఁ డేమిచేయుట శ్రేయస్కరము? ఇదియే సకల ధర్మములలోఁ జింతింపఁనగు ధర్మమని నాయభిప్రాయము. యథార్థమును దెలియఁగోరు మాకు నీవే నేత్రస్థానీయుఁడవు కావున నది యెల్ల మా కెఱిఁగింపుము. నీ వెంత చెప్పినను దృప్తి గలుగకున్న యది." అని ప్రశ్నించెను.

అది విని యాభీష్ముఁడు, "ఓధర్మజా! శుల్కము, కన్యాప్రదాన విషయమున వ్యవస్థాపకముగాదు. తెలిసిన పిదప, వాగ్దానముఁండి తప్పినను ననృతదోషములేదు. సజ్జనులు శుల్కపరులై కన్నియ నొసంగరుగదా! వరగుణములుగాక, వృద్ధత్వాదిగుణములుగలవానినుండియే బంధుగులు శుల్కము నపేక్షింతురు. దాత, 'నీ వీకన్నియ నలంకరించి పరిగ్రహింపుమని చెప్పినను, నట్టికన్నియ కలంకారము లుంచి వరుఁడు పరిగ్రహించినను దోషములేదు. వారొనర్చినవి శుల్కదానమును, విక్రయమును గానేరవు. అటు లలంకారద్రవ్యము పుచ్చుకొని యీయ వచ్చును. అది సనాతనధర్మమే యగుచున్నది. ఇచ్చెదమనియు, నీయమనియుఁ, దప్పక యిచ్చెదమనియుఁ బలికినను, గుణవద్వరుఁడు

గానపుడు దానిని దప్పినను, నది పలుకనట్టిదియే యగుచున్నది. పాణిగ్రహణమగునంతకును గన్యావరులు పరస్పరము యాచించుకొనవచ్చును. కన్నియ దేవతలచె నొసంగఁబడునని వినికి. ఎపుడును, ననిష్టుఁడగువానికిఁ గన్నియ నొసంగరాదు.' అని మునివచనము. కామమూలమగు సంతానమునకుఁ గన్నియ యభీప్సితమే మూలము. క్రయవిక్రయసంభాషణసమయమునఁ బరిచితునివలన దోషములను దెలిసికొని నిర్ణయించుకొనవలయును. శుల్క మెన్నఁడును వ్యవస్థాపకము కానేరదను విషయమునఁ దెలిపెదను వినుము."

నేను మున్నొకపు డంగమాగధకోసలముల జయించి, కాశీపతుల నోడించి, విచిత్రవీర్యునకై మూవురుకన్నియలఁ దీసికొనివచ్చితిని. వీర్యశుల్కప్రాప్తలగువారిలో నంబికాంబాలికలు పాణిగృహీతులైరి. అంబను బరిగ్రహింపక విడువవలయునని నాపినతండ్రి బాహ్లీకుఁడు చెప్పెను. ఆతనికి ధర్మేచ్ఛ మిక్కిలి యధికము. పిమ్మట నే నాతనివలన నాచారముఁ దెలియఁగోరి మఱిమఱియుఁ బ్రశ్నింపఁగా నతఁడు నాతో 'ఓయీ! వివాహబంధమునకుఁ బాణిగ్రహణమే వ్యవస్థాపకముగాని శుల్క మెన్నఁడును వ్యవస్థచేయునదిగాదు. అటులేని వరాంతరు నొందవచ్చునను శ్రుతి బాధింపఁబడియుండెనుగదా! శుల్కమే వ్యవస్థాకరమనువారికిఁ బ్రమాణవాక్య మేదియుఁ దెలుపఁబడ లేదుగదా! ధర్మవేత్త లందుల కేమియుఁ దెలుపలేదుగదా! కన్యాదానమనియే ప్రసిద్ధముగాని, కన్యాశుల్కమనియుఁ, గన్యాజయమనియుఁ గలదా? శుల్కవాదులకుఁ బరిణయసూచక మేమిగలదు? ఎవరు శుల్కమును గ్రయముగాఁ దలంతురో వారు ధర్మవేత్తలు గారుగదా! అట్టియభిప్రాయముగలవరునకుఁ గన్నియ నీయఁగూడదు. అట్టియుద్దేశము గల కన్నియను బెండ్లాడఁగూడదు. భార్యనుగా నెవ్వనికి విక్రయింపఁగూడదు. భార్యనుగాఁ గొనఁగూడదు. ఎవ్వరొక దాసి నట్లు విక్రయింతురో, యెవ్వరు కన్నియను దాసినట్టులు గొందురో, యట్టి పాపచిత్తులగు లుబ్ధులమతమున శుల్కమే వివాహవ్యవస్థాకరమగుచున్నది. ఈవిషయమున జనులు కొందఱు సత్యవంతునిఁ గాంచి 'ఓమహాశీయా! కన్నియ ప్రాప్తశుల్కయైనపుడు, శుల్కమొసంగినవరుఁడు మరణించినచో మఱియొకఁడు దానిని బెండ్లాడవచ్చునా? ఈధర్మసంశ

యముసు దీర్పుము. నీవు పరమ ప్రాజ్ఞుండవగుట త త్త్వమును దెలియఁ గోరుమాకు దృష్టివంటివాఁడవుగాదే?' అని ప్రశ్నించుటయు వారి నారసి యాసత్యవంతుఁ డి ట్లనియె.

'ఓజనులారా! ఎవ్వరి కెందిష్టముండునో, యవ్వానికే కన్నియ నొసంగవలయును. అందు సందియము లేదు. శుల్కమిచ్చినవాఁడు జీవించియున్నను, గుణవంతుఁడు లభించినపుడు వాని కీయవచ్చును గదా! శుల్కదుఁడు మరణించినపుడు వేఱొకని కిచ్చుటలో సందియ మేమున్నది? మఱియు నొకటి తెలిపెదను వినుము. అట్టివిషమస్థితి తటస్థించినపుడు శుల్కమిచ్చినవానితమ్మునిఁ బెండ్లాడవచ్చును. లేదా, తప మొనర్చికొనుచు నుండవచ్చును. కొందఱమతమున దేవరాదులు పరిభుక్తగాని, భ్రాతృభార్యను గలియవచ్చుననియుఁ, గొందఱమత మున నది యంతగా సమ్మతము గాదనియుఁ దెలుపఁబడుచున్నది. సంకల్ప పూర్వకముగా దాన మొనర్చినను, పాణిగ్రహణమగునంతకును భార్యా త్వసిద్ధి గలుగదు. అటులు దాన మొనర్చితప్పినను దాత కన్నృత వాదదోషముమాత్రమె గలుగునుగాని, ధర్మవిరోధ మేమియుఁ గలు గదు. సప్తపదియందుఁ బాణిగ్రహణమంత్రములే వివాహావ్యవస్థాప కము లగుచున్నవి. పాణిగ్రహణ మొనర్చిన యెవ్వని కెప్పుడు కన్నియ యుదకములతో దాన మొనర్పఁబడునో, యపుడే వాని కది భార్య యగుచున్నది. అనుకూలయు, వశవర్తినియునై భ్రాతృదత్తయై యగ్ని సాక్షికముగా నొసంగఁబడినకన్నియను బరిగ్రహించి, యథావిధిగా నగ్నికిఁ బ్రదక్షిణ మొనర్చి భార్యను స్వీకరింపవలయును?'

ఓయుధిష్ఠిరా! సత్యవంతుఁ డిట్లు తెలిపెనని బాహ్లీకుఁడు నా కెఱిఁగించెను." అని తెలుప విని ధర్మజుఁడు మఱియు ని ట్లనియె.

### వివాహధర్మకథనము

"ఓ పితామహా! కన్నియకు శుల్కము పుచ్చుకొనినపిమ్మట వరుఁడు దేశాంతరగతుఁడగునేని వానికి జడిసి యెవ్వరును బెండ్లాడ రనుకొందము. అట్టిపట్టునఁ దండ్రి సేయవలసినదేమి ?"

అది విని భీష్ముఁడు "ఓధర్మజా! కన్నియ తండ్రికి వశరాయై తన తండ్రి యొకవరునియొద్ద శుల్కము పుచ్చుకొనియు వానికి మరలనీయక

యుండఁగాఁ, దనకు గుణవద్వరుఁడు లభించినను, వెనుక శుల్కమిచ్చిన వానికే యది భార్యగావలసియుండును. ఒకవరుఁడు తన్నుఁగోరి వరించి నపుడు తండ్రియాజ్ఞవడసి కన్నియ వరునిఁ బరిగ్రహింపవచ్చును. అట్టి వివాహమును గొందఱు ప్రశంసింతురు; మఱికొందఱు కాదందురు. సజ్జనుల యాచారమే ధర్మలక్షణమై గొప్పగాఁ జెప్పఁబడుచుండును. ఈవిషయమున మహాత్ముఁడగు జనకచక్రవర్తి మనుమఁడగు సుక్రతు వనువాఁడు 'అపండితులగువా రాచరించినవిధము నొకమార్గముగాఁ దెలుపుట తగదు. ప్రశ్నించుటగాని, సంశయము తీర్చుకొనుటగాని, సజ్జనులనుండియే గావలయును. స్వాతంత్ర్యరహితమగు స్త్రీధర్మము జెఱుచుట యాసురధర్మ మనఁబడును. వివాహకర్మములందుఁ బూర్వ మిట్టిపద్ధతి యుండుట వినియుండలేదు. భార్యాభర్తలగు స్త్రీపురుషుల సంబంధము సమానమే. అటులే రతియును వారికిఁ దుల్యమే' అని యెఱిఁగించెను." అని తెలుపుటయు నయ్యుధిష్ఠిరుఁడు "ఓపితామహ! లోకమునఁ గలమానవులధనమునం దెంతవఱకుఁ గన్నియలు స్వీకరింపవచ్చును? తండ్రికిఁ బుత్త్రుఁడును బుత్త్రికయు సమబుద్ధితోఁ జూడఁ దగినవారుగాదే?" అని ప్రశ్నించెను.

అది విని భీష్ముఁడు, "ఓధర్మజా! మానవునకుఁ బుత్త్రుఁడు, తన కభిన్నుఁడే యనఁదగియుండును. పుత్త్రునితోఁ బుత్త్రిక సమానయగుటకు సందియము లేదు. అట్టిపుత్త్రిక తనదైయుండఁగా దానిధన మెవ్వఁడు హరించును? మఱియుఁ దల్లియలంకారద్రవ్యము కొమారితదై యుండును. ఇంక నపుత్త్రకుఁడగువానిధనమును దౌహిత్త్రుఁడే తీసికొనన ర్హుఁడగుచున్నాఁడు. ఆదౌహిత్త్రుఁడే తనకును వానితండ్రికిని బిండదానముచేయ నర్హుఁడు. ధర్మమునుబట్టి పుత్త్రునకును దౌహిత్త్రునకును భేద మేమియును లేదు. సంతానములోఁ బుత్త్రుఁ డపేక్షితుఁ డగుచు నుండును. అటులు పుత్త్రుఁడు జనించినపిదప నంతకంటెఁ బుత్త్రిక మఱియునపేక్షిత యగుచుండును. అట్లు పుత్త్రికాపేక్ష విశేషమగుటకు దౌహిత్త్రునివలనఁ గలుగుధర్మమే కారణము. ఎవఁడు తనకన్నియను విక్రయించునో, వానికి దౌహిత్త్రునివలనఁ గలుగుధర్మము గలుగదు. అట్టిదానికి జనించుపుత్త్రులు తమతండ్రికే యగుదురు. అంతియగాక, యట్టివిక్రీతకుఁ బుట్టినవారు ధర్మరహితులు,

నసూయాగ్రస్తులును, బరధనాపహర్తలును, మూర్ఖులు నగుదురు. అట్టి యాసురధర్మముగలదానిపుత్రులు విషమవృత్తు లగుచున్నారు. ఈవిషయమున యమోద్గీతములగుగాథలను పూర్వులు దెలిపిరి. ధర్మజ్ఞులగు వారివచనములు, ధర్మసేతువులగు ధర్మశాస్త్రములను సంబంధించియున్నవి.వానిని దెలిపెదను వినుము. ఎవ్వరు, తమకన్నియనుగాని, పుత్రునిగాని ధనముకై యాశించి విక్రయింతురో, యట్టివారు మహాఘోరమగుకాలసూత్రమను నరకమునఁబడి స్వేదమూత్రపురీషములఁ ద్రావుచుండుటయెగాక, తమవెనుకముందటి యేడుతరములవారికిఁగూడ నట్టి కష్టములఁ గలిగించుచున్నారు. ఆర్షవివాహమున గోమిథునమే శుల్కమని కొందఱు దెలుపుదురుగాని యది సత్యముగాదు. ఓధర్మజా! అల్పమెగాని, యధికమెగాని విక్రయము విక్రయమె యగుచున్నది. అది కొందఱచే నాచరింపఁబడినను, నది సనాతనధర్మముగాదు. అయినను లోకమునుబట్టి యట్టిప్రవృత్తు లితరులయందును గానవచ్చుచుండును. ఎవ్వరు తమకు వశలగుకొమారితలను విక్రయించి తద్ధనమనుభవింతురో, వారంధతమసమునఁ గూలుచున్నవారు. అట్టివారు పరమపాపకర్తలు. మానవుఁడు సామాన్యముగా దేనినైనను విక్రయింపరాదు. అట్టితఱి సంతానమును విక్రయింపరాదని వేఱచెప్పనేల? అధర్మహేతువులగు నట్టికన్యాధనముల ధర్మ మెట్లగును?" అని తెలిపి భీష్ముఁడు మఱియు నిట్లనియె.

## స్త్రీప్రశంస

"ఓయుధిష్ఠిరా! ఈవిషయమున దక్షునివచన మొకటి పెద్దలు దెలుపుదురు. కన్యాధనమును, దలిదండ్రులు మున్నగువా రపహరింపని తలంపుతో నలంకారముగాఁ బుచ్చికొన్నను, నది విక్రయము కానేరదు. అటులొనర్చుట కన్నియను గౌరవించునట్టిదిగాన నది యించుకేని క్రౌర్యము కానేరదు. అటులు పుచ్చికొనిన ధనమంతయును నిశ్శేషముగాఁ గన్నియ కొసంగవలయును. అలంకారద్రవ్యమును దండ్రిగాని, యన్నగాని, మామగాని, మఱఁదిగాని యుంచుకొనఁగూడదు. మిక్కిలి శ్రేయమును గోరువాఁడు వధువును భూషించి గౌరవింపవలయును. భార్య భర్తపై నిష్టము చూపకున్నను, నాతనికి సంతో

షము గలిగింపకున్నను వానివలన సంతానము వృద్ధినొందనేరదు. ఓజనాధిపా! స్త్రీ లెప్పుడును, బూజనీయలును, లాలనీయలు నగుచున్నారు. ఆఁడువాం డ్రెచ్చోట గౌరవింపఁబడుదురో, యుత్సాహము గలిగియుండుదురో, యచ్చట దేవతలందఱును గ్రీడించుచుండుదురు. ఎందుఁ గాంత లవమానింపఁబడుదురో, వారి కార్యములన్నియు ఫలశూన్యములగును. స్త్రీ లెవ్వరియెడ దుఃఖింతురో, వారికి వంశముండదు. కాంతాశప్తములగు గేహములు, శక్తిచే నశింపఁజేయఁబడినవి వోలె వెలయక లక్ష్మీశూన్యములై వృద్ధినొందఁజాలవు. మున్ను మనువు స్వర్గమునకుఁ బోవువాఁడై స్త్రీలను బురుషుల కొసంగెను. మఱియుఁ గాంతలు సులభసాధ్యలును, స్నేహము గలవారు, సత్యహేతుకః జయముగలవారు నై యుందురు. మఱియు వారు గౌరవార్హలు. కావున, నోమానవులారా! మీ రవివేకులై యీర్ష్యమానకామపరులై చండమానసులై స్నేహహీనులై ప్రవర్తింపకుఁడు. స్త్రీలను మన్నింపుఁడు. కేవలరతిభోగములే స్త్రీ హేతుకములగు ధర్మములు వారికిఁ జేతనగు పరిచర్యలు నమస్కారములును మీకగుఁగాక. లోకయాత్రలోఁ బ్రీతిని గల్గించుటయు, సంతానము గనుటయుఁ, బుట్టినవారిని బెంచుటయు, స్త్రీల ముఖ్యధర్మము. కావున, వారి నాదరించి సకలకామములను ననుభవింపుఁడు. ఈవిషయమున విదేహరాజపుత్రిక యొకవిషయమును బోధించెను. 'స్త్రీలకు యాగక్రియలుగాని, యుపవాసక్రియలుగాని, శ్రాద్ధక్రియలుగాని యేవియు ముఖ్యములుగావు. వారికి స్వభర్తృశుశ్రూషయే ధర్మజనకము. దానిచే వారికి స్వర్గమగుచున్నది. వారికిఁ గౌమారమునఁ దండ్రియు, యౌవనమున భర్తయు, వార్ధకమునఁ బుత్రులును రక్షకు లగుచున్నారు కాని వారికి స్వాతంత్ర్య మెన్నఁడును లేదు. శ్రేయమును గోరువారు, గృహలక్ష్ములగు స్త్రీలను సత్కరింపవలయును. అనుగ్రహింపఁబడినట్టియుఁ బాలింపఁబడినట్టియుఁ, గాంతామణి రమాకాంతామణి యగుచున్నది." అని తెలుప విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె,

### ధనవిభాగకథనము

"ఓపితామహా! నీవు సకలశాస్త్రవిధానజ్ఞుఁడవును, రాజధర్మవేత్తవు, సంశయచ్ఛేత్తవు, నియమకర్తవునుగదా! కావున, నాకుఁగల

యొకసంశయమును దీర్పుము. నా కీసంశయ మొదవుటచే, దీనినిదక్క వేఱొక్కటి యడుగను. ధర్మమార్గము ననుసరించువాఁ డేమిచేయ వలయును? ఓమహాబాహూ! దానిని నాకెఱిగింపుము. ఓపితామహా! మఱియు నొకటి తెలుపుము. బ్రాహ్మణునకు నాల్గుజాతులభార్య లుండ వచ్చు నందురుగదా! అందు, బ్రాహ్మణియందును, క్షత్రియకాంత యందును, వైశ్యాంగనయందును బుత్రులను గనవచ్చును. శూద్ర కాంత రతిసౌఖ్య మనుభవించుటకుమాత్రమె యుపయోగించును. అట్టిస్థితిలో నాయాకాంతలకు జనించినపుత్రులందఱు గ్రమముగాఁ, బిత్ర్యమగుదాయమును బరిగ్రహింప నెవ్వరెవ్వ రెట్టెట్టు లర్హులగు దురు? పిత్రువిత్తమునుండి యెవ్వఁ డేది తీసికొనవచ్చును? వారిలో నెవ్వరి కెట్టివిభాగము చెప్పఁబడెనో వినఁగోరుచున్నాఁడను. నా కెఱిఁ గింపుము ”

అది విని యాగాంగేయుఁడు, “ఓధర్మనందనా! బ్రాహ్మణక్షత్రియ వైశ్యులగు మూఁడువర్ణములవారును ద్విజాతు లనఁబడుదురు. ఓ యుధిష్ఠిరా! పై మూఁడుజాతులపుత్రులందును బ్రాహ్మణునకు ధర్మము విధింపఁబడియెను. ఇఁక శూద్రకాంతయన్ననో, బ్రాహ్మణునకు విష మావస్థతటస్థించినను, లోభకామములుగల్గినను గావచ్చునుగాని,యది శాస్త్రీయమును గాదు. తఱచుగా నెందును గన్పట్టను లేదు. బ్రాహ్మ ణుఁడు, శూద్రకాంతను దనశయనముందుఁబరుండఁబెట్టెనేని, యధో గతిపాలగుచున్నాఁడు. అంతియగాక, యట్టివాఁడు విధ్యుక్తమగు ప్రాయశ్చిత్తము చేయించుకొనఁదగియుండును. మఱియు నాతఁ డాశూద్రకాంతయందుఁ బుత్రులఁ బడసెనేని ద్విగుణప్రాయశ్చిత్త మున కర్హుఁడగుచున్నాఁడు. ఇఁకఁ బిత్రువిత్తమును వారికి విభజించు విధ మెఱిఁగించెదను వినుము. పిత్రుధనములోఁ బ్రధానమై లక్షణ వంతమగు గోవృషయానాదికమున ముఖ్యాంశమును బ్రాహ్మణి పుత్రుఁడుతీసికొనవచ్చును. మిగిలినదానిని బదిభాగములుగా నొనర్చి, యందు, నాల్గువంతు లాబ్రాహ్మణీపుత్రుఁడే మఱియుఁ దీసికొనవచ్చును. శేషించినవానిలో మాతృవిశేషమునుబట్టి క్షత్రియకాంతవలన జనిం చినవాఁడు మూఁడంశములను, వైశ్యాంగనవలనఁ బుట్టువాఁడు రెండు భాగములను తీసికొనవలయును. క్షత్రియాపుత్రుఁడు బ్రాహ్మణునట్టి

వాఁడే యగుచున్నాఁడు. ఇఁక శూద్రకాంతయందు జనించినవాఁడా బ్రాహ్మణునకుఁ గలధనములో నల్పమునకే యర్హుఁడగుచున్నాఁడు. వాఁడు నిత్యము సంపాదించుకొనుచుండవలయును. పదివంతులుగా నేర్పఱచినధనమునకుఁ గ్రమ మిట్లిదె యుండును. సవర్ణలగువారియందుఁ బుట్టినవారికిఁ బితృధనము సమభాగములుగనే కల్పింపవలయును. నిపుణత లేమి శూద్రాపుత్త్రు నబ్రాహ్మణునిఁగాఁ దలంతురు. బ్రాహ్మణునివలన మొదటి మూఁడుజాతులవారియందును బుట్టినవారు బ్రాహ్మణు లనఁబడుచున్నారు. వర్ణములు నాల్గువిధములుగనే చెప్పఁబడినవిగాని, యైదవవర్ణ మెందును లేదు. శూద్రాపుత్త్రుఁడు, పితృధనమునుండి పదియవభాగమును దీసికొనవచ్చును. అదియును, నాశూద్రాసుతుఁడు, తండ్రియానతి వడసియే తీసికొనవలెనుగాని స్వతంత్రించి తీసికొన వలనుపడదు. కాని, వానికిఁ దప్పక ధన మొసంగవలయును. అక్రౌర్యము పరమధర్మ మగుటచే వానికీయవలసియుండును. ఎవ్వనియెడ నేనిఁ జూపెడిదయ, గుణమే యగుచున్నది. ఆశూద్రాపుత్త్రుఁడు, పుత్త్రవంతుఁడైనను, నపుత్త్రకుఁడైనను వానికిఁ బదియవభాగముకంటె నధికముగా నీయనక్కఱ లేదు. బ్రాహ్మణీపుత్త్రునకు, మూఁడువత్సరములకు సరిపడుద్రవ్యముకంటె నధికముగా నున్నపుడు, దానితో వాఁడు యాగముచేయవలయును గాని వ్యర్థముగా వ్యయముసేయరాదు. భర్త స్త్రీకి తనధనములో మూఁడువేలకుఁ దక్కువగాని ధనము వంతుగా నీయవచ్చును. అటులు భర్త యొసఁగినధనమును యథేచ్ఛగా నామె యనుభవింపవచ్చును. భర్తయొసఁగినద్రవ్యము భార్య కనుభవమునకు మాత్రమె యధికారము. అటులు తండ్రి, తల్లి కొసఁగినధనమునుండి యించుకేని పుత్త్రు లపహరింపరాదు. ఓయుధిష్ఠిరా! తనతండ్రి, తల్లికిచ్చిన ధనము, బ్రాహ్మణపుత్త్రిక పొందఁదగుచున్నది. దానికిఁ బుత్త్రుఁడును బుత్త్రికయు సమముగాఁ జూడఁదగినవా రగుదురుగదా! ఇటులే విభాగప్రకార మేర్పఱుపఁబడియెను. ఇట్టివిభాగ ముండుటనుబట్టి ధనమును వ్యర్థముగా వ్యయముసేయరాదు." అని తెలిపెను.

అది విని యుధిష్ఠిరుఁడు, "ఓపితామహా! బ్రాహ్మణునివలన శూద్రకాంతయందు జనించినవానికి ధన మీయకుండు టేల? ఏకార

ణముచే వానికిఁ బనియవపా లీయఁబడుచున్నది? మఱియు, బ్రాహ్మణియందు బ్రాహ్మణునివలన జనించినవాఁడు నిస్సంశయముగా బ్రాహ్మణుఁడే యగుచున్నాఁడు. అటులే క్షత్రియకాంతయందును, వైశ్యకాంతయందును జనించినవారును బ్రాహ్మణధర్మము గలవారుగదా! ఓనృపోత్తమా! వారిమూవురకును, దాయవిభాగభేద మెట్లు గలిగెను? ఆమూఁడుజాతులవారియందును జనించినవారు బ్రాహ్మణులనియేగదా తెలిపితివి!" అని ప్రశ్నించెను. అంత నాభీష్ముఁడు "ఓయుధిష్ఠిరా! పత్నీవిషయమున, నాదరపాత్రమైనదగుట, దారశబ్దము ప్రవర్తిలుచున్నది. ఇట్లు దారశబ్దవాచ్యలగుటచే వీరిలో నిట్టివిశేషము చూపట్టుచున్నది. వారిలో మూవురను ముందుగాఁ గుదిర్చికొని పిమ్మట బ్రాహ్మణిని బెండ్లాడవలయును. ఆబ్రాహ్మణియే వారిలోఁ బూజ్యయు జ్యేష్ఠయు నై గౌరవింపఁదగియుండును. భర్తకు వలయు నుపచారములలో, దంతధావనము, అంజనము, స్నానము, ప్రసాధనము, హవ్యము, కవ్యము, ధర్మయుక్తమగు మఱియేకృత్యమును గలవో, యవి, యాబ్రాహ్మణి యుండగాఁ దక్కినవారు చేయరాదు. బ్రాహ్మణునకు వానినెల్ల బ్రాహ్మణియే చేయవలయును అన్నపానమాల్యవస్త్రాభరణాదులు బ్రాహ్మణికే యొసంగవలయును. బ్రాహ్మణునకదియే యుత్తమకాంత. మనుప్రోక్తమగు ధర్మశాస్త్రమందును, నీసనాతనధర్మ మెఱిఁగింపఁబడియెను. ఓయుధిష్ఠిరా! కామవశుఁడై పైపద్ధతికి విలక్షణముగాఁ బ్రవర్తించెనేని, వాఁడు బ్రాహ్మణచండాలుఁ డనఁబడును. క్షత్రియాపుత్రుఁడు, బ్రాహ్మణీపుత్రునియట్టివాఁడయ్యును, బ్రాహ్మణి, క్షత్రియకంటె వర్ణముచే నధికమగుటచే నుత్తమ యగుచున్నది. లోకమున జాతినిబట్టి బ్రాహ్మణితో, క్షత్రియ యెన్నఁడును సాటి గాదుగదా! ఓరాజోత్తమా! బ్రాహ్మణి తొలిపుత్రుఁ డుత్తముఁడు. అటులగుట నతడు పితృధనమునుండి యత్యధికముగాఁ దీసికొనవచ్చును. బ్రాహ్మణితో, క్షత్రియకాంత యెట్లు తుల్య గానేరదో, యటులే క్షత్రియతో, వైశ్యాంగన సమానగానేరదు. లక్ష్మియు, రాజ్యము, కోశము చతుస్సముద్రముద్రితమగు మేదినియు క్షత్రియులదై యున్నది. క్షత్రియుఁడు నిజధర్మముచే గొప్పలక్ష్మిని బొందుచున్నాఁడు. రాజే దండధరుఁడు. రక్షణ మాక్షత్రియుని యధీనమై

యున్నది. మహాభాగులకు బ్రాహ్మణులు దేవతలకును దేవత్వైనవారు. ఓరాజా! అటులగుట వారియెడ గౌరవముగాఁ బ్రవర్తింపవలయును. ఋషిప్రోక్తమై శాశ్వతమై యవ్యయమైనధర్మమును దెలిసికొని, నిజ ధర్మముచే ధర్మలోపము గలుగకుండ రాజే రక్షించుచున్నాఁడు. దొంగలచే నపహరింపఁబడు ధనదారాదులవలన నష్టపడకుండ, సకల వర్ణములవారికిని బార్థివుఁడే రక్షకుఁ డగుచున్నాఁడు. వైశ్యా పుత్త్రునికంటె క్షత్త్రియాపుత్త్రుఁ డధికుఁడనుటలో సందియ మించుక యును లేదు. కావున వైశ్యాపుత్త్రునికంటె క్షత్త్రియాసుతుఁడు పితృ విత్తమునుండి హెచ్చుగాఁ గొనవచ్చును." అని తెలిపెను.

అంత నయ్యుధిష్ఠిరుఁడు, "ఓపితామహా! బ్రాహ్మణునిధనమును విభజించువిధమును దెలిపితివి. ఇఁక నితరవర్ణములవారికి ధనవిభాగ క్రమ మెట్టిదో యెఱిఁగింపుము." అని యడుగుటయు, భీష్ముఁడు మఱియు నాధర్మజునితో, "ఓపాండవాగ్రజా ! క్షత్త్రియునకును క్షత్త్రియావైశ్యాంగనలు భార్యలుగా నుండవచ్చునుగదా ! మూఁడవ దగుశూద్రాంగనగూడ భార్యగా నుండఁదగును. కాని యందులకు దృష్టాంతమేమియుఁ గానరాదు. ధనవిభాగవిషయమున నిదియే క్రమము. ఓజనాధిపా ! క్షత్త్రియునిధనము నెనిమిదివిధములుగా విభ జింపవలయును. అందు నాల్గువంతులు క్షత్త్రియాపుత్త్రుఁడు తీసికొన వచ్చును. యుద్ధోపయోగియగు రథగజాదికము నతఁడు తండ్రినుండి తీసికొనవచ్చును. పిదప నాక్షత్త్రియునిధనములో మూఁడువంతులు వైశ్యాపుత్త్రుఁడును, మిగిలిన యెనిమిదవపాలు శూద్రాపుత్త్రుఁడును దీసికొనవలయును. ఆయెనిమిదవ భాగమును నైతము తండ్రియాజ్ఞ ననుసరించియే తీసికొనవలయునుగాని, యాశూద్రాసుతుఁడు స్వతం త్రించి తీసికొనరాదు. ఓకురునందనా! వైశ్యున కొక్కతయే భార్యగా విధింపఁబడెను. రెండవది శూద్ర కాంతగావచ్చును. కాని యందులకు దృష్టాంతము గానరాదు. అటులు వైశ్యునకు వైశ్యాశూద్రాంగనల కిరువురకును బుత్త్రులున్నపుడు వారికి ధనవిషయమున నిట్టినియమ మేర్పడియెను. వైశ్యునిధన మైదువంతులుగా విభజించి యందు వైశ్యాపుత్త్రుఁడు నాల్గువంతులును, శూద్రాసుతుఁ డొకభాగమును దీసికొనవలయును. అదియును, వాఁడు తనతండ్రియాజ్ఞవడసియే తీసి

కొనవలయును. ఎపుడును మూఁడువర్ణములవారిచేతను శూద్రా సుతుఁడు దయాపూర్వకముగాఁ బుచ్చికొనువాఁ డగుచున్నాఁడు. శూద్రుఁడు సవర్ణకాంతనే పెండ్లాడవలయును. కాని వానికి వేఱొక్కతె విధింపఁబడలేదు. సమవర్ణయగు దానికి నూర్వురుపుత్రులు పుట్టినను వారు సమాంశమున కర్హులగుచున్నారు. వారిలోవారికి విశేషములేదు. అటులే సకలవర్ణములవారికిని సమభాగమే గావలెను. అయినను జ్యేష్ఠునకుఁ బ్రధానముగా జ్యేష్ఠభాగము గావచ్చునని మున్ను పరమేష్ఠి చెప్పెను. సవర్ణలగువారికిఁ బుట్టినవారిలో వివాహవైశిష్ట్యకృతమగు మఱియొకవిశేషము గలదు. వారిలో ముందుముందుఁ బుట్టినవారు క్రమముగా వివాహము చేసికొనవలయును. ఒకతల్లికడుపునఁ బుట్టినవారిలో జ్యేష్ఠునకుఁ బ్రధానాంశమును, మధ్యమునకు మధ్యమాంశమును, గనిష్ఠునకుఁ గనీయాంశమును గావలెను. ఇట్లు సకలజాతులందును సవర్ణుఁడు శ్రేష్ఠుఁడని మహర్షియు, మరీచపుత్రుఁడునగు కశ్యపుఁడు తెలిపెను” అని పలుక విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె.

### వర్ణసంకరకథనము

“ఓపితామహా! ఒకయర్థము నాశ్రయించిగాని, కామముచేఁగాని, వర్ణమేదియో తెలియకగాని, యవివేకముచేఁగాని ప్రవర్తించుటనుబట్టి వర్ణసాంకర్యమగుచుండును. ఈరీతిగా జాతులైనవారికి వర్ణసాంకర్యము గలిగినపుడు, వారిధర్మమేమి? వారాచరింపఁదగుకర్మములెట్టివై యుండవలయును? తెలుపుము.”

అది విని గాంగేయుఁ డాపాండవేయునితో “ఓయీ! మున్ను పరమేష్ఠి, కేవలము చాతుర్వర్ణ్యమును, వారికుపయుక్తములగు యాగాదిక్రియలను సృజించెను. అందు శూద్రునకు వర్ణత్రయము వారిసేవారూపమగు యాగక్రియ నిర్ణయింపఁబడియెను. విప్రునకు భార్యలు నాల్గుజాతులవా గుండవచ్చునుగదా! అందు మొదటి రెండు జాతులస్త్రీలయందుఁ దానే జనించుటను, వారు తనయట్టివారగుదురు. మిగిలిన రెండుజాతులయందును మాతృజాతీయులౌట క్రమముగా హీనులు పుట్టుదురు. బ్రాహ్మణునివలన శూద్రస్త్రీకిఁ బుట్టినవాఁడు, శవ

స్థానీయుఁడగు శూద్రునికంటెఁ బరుండగుటచేఁ బారశవుఁ డనఁబడుచున్నాఁడు. వాఁడు తద్బ్రాహ్మణకులమును సేవించుచు నిత్యము నిజచరిత్రమునుండి తొలఁగకుండవలయును. మఱియు వాఁడు సకలోపాయములను గ్రహించి యాబ్రాహ్మణకులమునకు వలయునుపకరణములను సంగ్రహించుచు నుండవలయును. వయసుచే వాఁడు జ్యేష్ఠుఁడయ్యును ద్విజుని శుశ్రూష సేయుచు దానపరాయణుఁడై ప్రవర్తింపవలయును. ఇఁక క్షత్రియునకు మూవురుభార్య లుందురుగదా! వారిలో నిరువురయందుఁ దానై జనించుటను వారు దనయట్టివారగుదురు. క్షత్రియునకు శూద్రకాంతయందుఁ బుట్టినవా రుగ్రులనఁబడుదురు. వైశ్యునకు భార్య లిరువురు. వారియం దతఁడు దనయట్టివారిని గనును. శూద్రున కొక్కతెయ భార్య యగును. వాఁడు దానియందు శూద్రునిఁ గనును. అధముఁడగుశూద్రుఁడు, బ్రాహ్మణాదికళత్రప్రధర్షకుఁడై చాతుర్వర్ణ్యబహిష్కృతమగువర్ణమును జనింపఁజేయును. క్షత్రియునివలన బ్రాహ్మణియందు జనించినవాఁడు సూతుఁడనఁబడును. వాఁడు యాగాదిక్రియ కర్హుఁడుగాక వ్రాత్యుఁడై స్తోత్రక్రియాపరుఁ డగుచుఁ బ్రవర్తించును. వైశ్యునివలన బ్రాహ్మణియందుఁ బుట్టినవాఁడు వైదేహకుఁడనఁబడును. శూద్రునివలన బ్రాహ్మణియందు జనించినవాఁ డత్యుగ్రుఁడై వధ్యులగువారిని జంపుచు, బాహ్యప్రదేశవాసిగా నుండఁదగుచండాలుఁడు జనించును. ఇట్టివారే కులపాంసనులగు వర్ణసంకరజాతులవారు వైశ్యునివలన క్షత్రియకుఁ బుట్టినవాఁడు మాగధుఁడు. వాఁడు వాక్యజీవియై వర్తించును. వ్యతిక్రమముగా, శూద్రునివలన క్షత్రియకాంతయందుఁ బుట్టినవాఁడు, మత్స్యఘ్నుఁడై నిషాదుఁ డగుచున్నాఁడు. వైశ్యకాంతయందు శూద్రునివలనఁ బుట్టినవాఁడు ఆయోగవుఁ డనఁబడుచున్నాఁడు. నిజధనజీవనుఁడగుతక్షుఁడు బ్రాహ్మణుల కప్రతిగ్రాహ్యుఁ డగుచున్నాఁడు. పైఁదెలిపినవారందఱును దమయోనులందుఁ దగువర్ణములవారిని జనింపఁజేయుదురు. మఱికొంద అధములు హీనయోనులందు క్షేత్రప్రధానులై పుట్టుచుండుదురు. నాల్గువర్ణములవారియందును వారువారు స్త్రీలయందుఁ దమ్మును జనింపఁజేసినట్టులే సంకరులు సైతము నాయాయోనులందు జనింపఁజేయుచుందురు. అట్టులు పరస్పరకళత్రములనుగూడుటను విగ

ర్భూతులగువా రుద్భవించుచున్నారు. శూద్రుఁడు బ్రాహ్మణియందు బహిష్కృతుఁడగువానిని జనింపఁజేసినట్టులే బాహ్యతరమగు చాతుర్వర్ణ్యమునుండి బాహ్యులు జనింతురు. ఆబాహ్యులనుండి ప్రతిలోమముగా వర్ధిలుచుండుదురు. ఇట్లు హీనునుండి హీను లుద్భవించుటను వర్ణములు పదునైదుగా నుండును. అగమ్యాగమనమునుండియే వర్ణసంకరమగును. బాహ్యులలో మాగధులకు సైరంధ్రియందుఁ బ్రసాధనోపచారవేత్తయు, నదాసుఁడును, దాసజీవనుఁడును జనించును. క్షత్తవలన వాగురాబంధజీవనుఁడగు నాయోగవుఁడు జనించును. వైదేహుని వలన నీచకాంతయందు మైరేయకమాధుకులు గలుగుదురు. నిషాదుఁడు దాసుఁడు నావోపజీవియునగు మద్గురుని జనింపఁజేయును. చండాలునివలన శ్వపాకుఁడని విశ్రుతుఁడగు మృతపుఁడు గల్గును. వైదేహకునివలన పాపిష్ఠయోనియందు, మాయోపజీవియైన క్రూరుఁడు జనించును. నిషాదునివలన ఖరవాహనప్రయాణముచేయు మద్రనాభుఁడును, జండాలునివలన ఖరాశ్వగజాదులను భుజించుపుల్కసుఁడును జనింతురు. ఆయోగవకాంతలందుఁ బైనిదెలిపిన వైదేహకనిషాదచండాలురవలన మృతులవసనములధరించుచు నుచ్ఛిష్టపాత్రములందలి మెతుకులను దినువారును, పైఁదెలిపిన ఖరాశ్వాద్యాహారులును జనింతురు. వైదేహకునివలన నిషాదియందు గ్రామబహిర్వాసియు క్షుద్రుఁడును గారావరుఁడునగు చర్మకారుఁడు జనించును. చండాలునివలన వైదేహకకాంతయందు త్వక్సారవ్యవహారముగల పాండుసోపాకుఁడును, నిషాదునివలన నాహిండకుఁడును జనింతురు. చండాలుఁడు నిషాదియందుఁ జండాలసమవృత్తియగు సోపాకునిఁ గనును. పితృమాతృవ్యతిక్రమముచే నిట్లు సాంకర్యము గలుగఁగా జనించినవారు కొందఱు ప్రచ్ఛన్నులును, గొందఱు ప్రకాశులునై నిజకర్మములచేఁ దెలియఁదగియుందురు. బ్రాహ్మణక్షత్త్రియవైశ్యశూద్రజాతులవారికే ధర్మము విధింపఁబడియెనుగాని తక్కినవారికి లేదు. సులభముగా లభించినయజ్ఞబహిష్కృతులగుబాహ్యులచే బాహ్యులు జనించి యథావృత్తిగను యథాశ్రయముగను బ్రవర్తింతురు. పైని దెలిపినజాతులవారు, చతుష్పథములు, శ్మశానములు, కొండలు, వృక్షములు మున్నగుచోట్ల నివసించుచు, నినుముతోఁజేసిననగలను ధరిం

చుచు నాయానిజవృత్తులచే జీవించుచుఁ దిరుగుచుండుదురు. అందుఁ గొంద ఱలంకారములను, నుపకరణములను సంఘటించుచు, గోబ్రాహ్మణులకు సాహాయ్యముచేయుచుండుదురు. అక్రౌర్యము, అనుక్రోశము, సత్యవచనము, శాంతి తమశరీరము లర్పించియైన నొకరిని రక్షించుటయు, బాహ్యజాతులవారికి సిద్ధిహేతువగును. అందులకు సందియము లేదు. నాచెప్పినవిధముగా, హీనయోనులందుఁ బుట్టుచుండుదురు. బుద్ధిమంతుఁడగువాఁడు హీనయోనియందుఁ బుత్రునిఁ గనఁగూడదు. హీనయోనియగు పుత్త్రుఁడు, నీరు దాఁటవలసినవానిని పాషాణభారమువలెఁ దన్ను నశింపఁజేయును. మానవుఁడు విద్వాంసుఁడేగాని, యవిద్వాంసుఁడేగాని, కామక్రోధవశుఁడగునేని, గాంతలు వానిని జెడుమార్గమునఁ బెట్టక మానరు. స్త్రీలస్వభావము సాధారణముగా మానవులకు దోషముగలిగించునదై యుండును. కావునఁ బండితులగు వారు స్త్రీలయందు మిక్కిలి సక్తులు గాఁగూడదు." అని తెలిపెను.

అది విని యుధిష్ఠిరుఁడు "ఓపితామహా! సంకరయోనిజాతుఁడై వర్ణాపేతుఁడగు ననార్యుఁ డార్యునట్లు గానవచ్చునుగదా! అట్టివాఁ డెట్లు తెలియఁబడును?"

అంత నాశాంతనవుఁ డాధరాకాంతునితో "ఓకౌంతేయా! నానావిధములగు దుర్వ్యాపారములతోఁ బ్రవర్తించువారు సంకరయోనిజాతులనియు, సదాచారయుక్తములగు కర్మములుచేయువారు శుద్ధయోనిజాతులనియుఁ దెలియవలయును. అనార్యత్వము, దురాచారము, క్రౌర్యము, క్రియారాహిత్యమును సంకరయోనిజాతుఁడగు పురుషునిఁ దెలియఁజేయును. సంకరయోనిజాతుఁడగువాఁడు తండ్రిశీలమునుగాని, తల్లిశీలమునుగాని, వారిరువురశీలములనుగాని బొందకతప్పదు. వాఁ డెన్నివిధములనేని నిజప్రకృతిని దాఁచుకొనఁ జాలఁడు. బెబ్బులి తలిదండ్రులమేనిచారలతోఁ బుట్టునట్టులే పురుషుఁడును నిజయోనిధర్మము నొందుచుండును. సంకరయోనిజాతుఁడు కులమును దాఁచినను, గొలఁదిగనో, హెచ్చుగనో, యోనిశీలము నాశ్రయింపక తప్పదు. కపటమార్గమునఁ జరించుచు, నార్యులవేషమును నాచారమును బ్రకటించినను, సవర్ణుఁ డెవ్వఁడో, యన్యవర్ణుఁ డెవ్వఁడో వాని స్వభావమే వానినిశ్చయమును దెలుపును. నానా

వృత్తులును, నానాకర్మములును గలభూతములందు వృత్తము జన్మము ననుసరించియే యుండును. అట్టివారి కావృత్తియందు విరక్తి గలుగదు. సంకరజాతివానిశరీరము శాస్త్రదృష్టినిబట్టి నీచమార్గమునుండి మరల నేరదు. వయసుచే జ్యేష్ఠుఁడయ్యును శీలహీనుఁడగువానిని బూజింపరాదు. సద్వృత్తుఁడగు శూద్రునేనిఁ బూజింపవలయును. మానవుఁడు తనకర్మములచేఁ దన్నుఁ దెలిపికొనుచున్నాఁడు. ఒకపుడు తనకులము గుప్తమైనను తనకృత్యముచే నది తెలియక తప్పదు. సంకీర్ణములుగాని తదితరములుగాని గలిగిన యోనులను దెలియక ప్రాజ్ఞుఁడు వాని యందుఁ దన్ను జనింపఁజేసికొనరాదు. అట్టి హీనయోనిని బరిత్యజింపవలయును" అని తెలుప విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె.

### పుత్రప్రతినిధికథనము

"ఓకురూత్తమా! పితామహా! వర్ణములందు వేఱు వేఱుగా నెట్టిదానియందుఁ బుట్టినవా రెట్టిపుత్రులగుదురు? అం దెవ్వని కెవ్వరు పుత్రులో యెఱిఁగింపుము. ఈపుత్రులవిషయమున బహువిధములగు విరుద్ధవాదములను వినుచున్నారము. ఇందు సంశయావిష్టులమైయున్న మాసందేహమును దీర్పుము. మానవుఁడు తానే పుత్రుఁడగును. వాఁడే యౌరసుఁడు. స్వక్షేత్రమున నితరునిబీజముచేఁ బుట్టినవాఁడు నిరుక్తజుఁడు. వాఁడు తనయాజ్ఞచే నితరునివలన జనించినవాఁడగుట నిరుక్తజుఁ డనఁబడుచున్నాఁడు. తనయాజ్ఞ లేకున్నను వేఱొకఁడు ప్రేమించి తనభార్యయందు బీజముంచఁగా దానివలన జనించినవాఁడు ప్రసృతజుఁడు. అటులే పతితుఁడైనవాఁడు తనభార్యయందు బీజముంచఁగాఁ బుట్టినవాఁ డొకఁడు. దత్తుఁడై దవవాఁడు. కృతకుఁ డాఱవవాఁడు. అటులే యధ్యూఢుఁ డొకఁడు. వాఁడు సప్తముఁడు. మఱియు నపధ్వంసజు లార్వురు. అటులే యపసదు లార్వురు వారి విధము తెలియుము" అని తెలుప విని ధర్మపుత్రుఁ డాశంతనుపుత్రునిఁ జూచి "తాతా! అపధ్వంసజు లార్వురు నెవ్వరు? అపసదు లెవ్వరు? వారివిధ మెట్టిదో నా కెఱిఁగింపుము." అని యడుగుటయు మఱియు నతఁ డిట్లనియె.

"ఓధర్మజా! బ్రాహ్మణునకు మూఁడువర్ణములయందుఁ బుట్టిన పుత్రులును, క్షత్త్రియునకు వైశ్యశూద్రాంగనలయందుఁ బుట్టిన

వారును, వైశ్యునకు శూద్రకాంతయందుఁ బుట్టినవారును నపధ్వంసజులుగఁ బరిగణింపఁబడుచున్నారు. శూద్రునివలన బ్రాహ్మణియందుఁ బుట్టినవాఁడు చండాలుఁడును, క్షత్రియా వైశ్యాంగనలయందుఁ బుట్టిన వర్ణవ్రాత్యులును నపసదులగుదురు. అటులే వైశ్యునివలన బ్రాహ్మణియందును క్షత్రియయందును బుట్టినవారపసదులు. మఱియు క్షత్రియునివలన బ్రాహ్మణియందు జనించినవాఁ డొకఁ డపసదుఁ డగును. ఈపుత్రులు మిథ్యాకరింపఁదగినవారు గారు.”

అది విని ధర్మజుఁడు “ఓతాతా! కొందఱు క్షేత్రజుఁడు పుత్రుఁ డందురు. మఱికొందఱు నిజబీజమువలన జనించినవాఁడు పుత్రుఁ డందురు. వారిరువురు నెవ్వనికి సమానపుత్రులగుదురో తెలుపు” మన నతఁ “డో యుధిష్ఠిరా! నిజబీజమువలనఁ బుట్టినవాఁడును బుత్రుఁడే. స్వక్షేత్రమున మఱియొకనివలనఁ బుట్టినవాఁడును బుత్రుఁడే. అటులే యధ్యూఢుఁడును బుత్రుఁడగుచున్నాఁడు.” అని తెలిపెను. అది విని యుధిష్ఠిరుఁడు “ఓపితామహా! నిజబీజమువలనఁ బుట్టినవాఁడు పుత్రుఁ డని తెలియుదుము. స్వక్షేత్రజుఁడును, నధ్యూఢుఁడును బుత్రు లెట్లగుదురు? తెలుపు”మన నతఁ “డో యుధిష్ఠిరా! ఒకఁడు తనక్షేత్రమున బీజముంచి లోకాపవాదభయముచే వానినివిడిచినను, క్షేత్రప్రాధాన్యమునుబట్టి యట్టిపుత్రుఁడు క్షేత్రస్వామికే యగుచున్నాఁడు. అటులే గర్భవతియైనదానిని బెండ్లాడిన దానికిఁ బుట్టినవాఁడును క్షేత్రస్వామికే యగును. అటులే యొకచో దొరకినవాఁడు కృతకపుత్రుఁడు. వానియెడ శుక్రక్షేత్రములు రెండును బ్రమితములు గావు.” అని తెలుప విని యుధిష్ఠిరుఁడు భీష్మునితో “ఓతాతా! కృతకపుత్రుఁడన నెట్టివాఁడు? వాఁడు సంగ్రహింపఁబడినవాఁడంటివి. శుక్రక్షేత్రములు ప్రమితములు గాకుండుటెట్లు?” అని యడుగ నతం డిట్లనియె.

“ఓధర్మజా! ఒకఁడు తలిదండ్రులచే మార్గమధ్యమున విడువఁబడి లభించినపుడు వానిని బుత్రునిఁగాఁ గల్పించికొనినవాఁడు కృతకుఁడగును. వాని తలిదండ్రులెవరో తెలియఁబడరు. స్వామిలేకున్నవాని కెవ్వఁడు స్వామియై పోషించునో యాస్వామివర్ణమే పోష్యునకగుచున్నది.”

అది విని యుధిష్ఠిరుఁడు "ఓపితామహా! అట్లు తలిదండ్రుల విధము తెలియనివానికి సంస్కార మెట్లు? వాని కెవ్వని కన్య నీయ వచ్చును? అది నాకెఱిఁగింపుము." అని పలుకుటయు, భీష్ముఁడు "ఓధర్మజా! అట్టివానికి స్వామి, తనకులమునకుఁగల సంస్కారమే యొసఁగవలెను. తలిదండ్రులచే విడువఁబడినవాఁడు స్వామి కవర్ణుఁ డగుచున్నవాఁడు. స్వామి సమవర్ణమునఁ బుట్టినకన్యకయే వాని కీయవలెను. సంకరపుత్రులగు కానీనాధ్యూఢజులును, తనపుత్రులట్లు సంస్కరింపఁ దగువారని పెద్దలసిద్ధాంతము. క్షేత్రజుఁడు, నపసదుఁడు, నధ్యూఢుఁడు ననెడివారికిని బ్రాహ్మణాదులు తమసంస్కారములనే యొసఁగవలయును. ధర్మశాస్త్రములందు వర్ణనిశ్చయ మిట్టిదిగాఁ జూపట్టుచున్నది. ఇవియెల్ల నీకుఁ దెలిపితినిగదా! ఇఁక నేమి వినఁగోరెదవు?" అని పలుకుటయు, నయ్యుధిష్ఠిరుఁ డిట్లనియె.

## చ్యవనోపాఖ్యానము

"ఓపితామహా! దర్శనసహవాసములచేఁ గలిగినస్నేహ మెట్టిది? గోవులప్రభావ మెట్టిది? నాకు వివరించి తెలుపుము."

అది విని భీష్ముఁడు "ఓపాండవాగ్రజా! నీవడిగినప్రశ్నమున కుదాహరణముగా, నొకపూర్వవృత్త మెఱిఁగించెదను వినుము. అయ్యది నహుషునకును, మహర్షియగుచ్యవనునకును జరిగినసంవాదము. మున్నొకపుడు, భార్గవుఁడగు చ్యవనమహర్షి, యుదకవాసమహావ్రత మారంభించి మానక్రోధశోకహర్షముల నడంచి, పండ్రెండువత్సరములు వరుసగా, జలవాసము సేయువాఁడై యుండెను. అతఁడు సకలభూతములందును బరమశుభమగు విశ్వాసముఁగలిగి సకలజలచరములలోఁ జంద్రునివలె వెలయుచు స్థాణుభూతుఁడై శుచియై దేవతానమస్కారపురస్సరముగా, గంగాయమునాజలమధ్యమునఁ బ్రవేశించెను. అటు లానదులనడుమఁ జొచ్చి మిగుల భయముగూర్చునట్టియు, భయంకరారావముగలట్టియు వాయువేగముతో సరియగువానివేగమును దనతలచే ధరించి యతఁ డుండుటయు, నాగంగాయమునలును, మఱియుఁగలనదులును, సరోవరములును, నాతనికిఁ బ్రదక్షిణమొనర్చి భక్తిమెయి నాతనిఁ బీడింపవయ్యెను. అమ్మహా

మునియు, నాజలమధ్యమున నూర్ధ్వముగానుండి, కట్టవలెఁ జలింప కుండి యందుఁగల సకలసత్వములకును బ్రియదర్శనుఁడై యుం డెను. అంత నాజలచరములన్నియు, నాతని పెదవి వాసనచూచునవై సమీపించియుండ, నటు లాతని కందు బహుకాల మతిక్రమించెను. పిమ్మట నొకపుడు, చేఁపలవాండ్రు కొందఱు అందులకు వలలుపట్టుకొని వచ్చిరి. ఓమహారాజా! మఱియు నటులే పెక్కురు నిషాదులును నందలిచేఁపలను బట్టువారై బలశాలులును శూరులునై జాలకర్మనిపుణు లగుచుఁ దజ్జలములనుండి మరలక యతఁడున్నచోటుచేరి యందఱు నొక్కమాఱుగా నందు వలలఁ బఱచిరి. అటులు వారు మత్స్య కాంక్షులై పలువిధములగు నుపాయములఁ బూని నీరుచల్ల నారం భించిరి. మఱియు మిక్కిలి వెడల్పును బొడవునుగలిగి క్రొత్తగాఁ దయారుచేయఁబడిన తమవలలా వారిమధ్యమున విసరి, పలుమఱు త్రిప్పి, పిదప వారందఱును నొడ్డుచేరి యవ్వలలను బైకిలాగి, నిర్భయులై సోత్సాహముగా నందుఁగలమత్స్యములు మఱియుఁగలజలచరములు మున్నగువానినిగట్టి, యాజలచరములచేఁ బరివృతుఁడై యున్న భార్గవుఁ డగుచ్యవనునిఁగూడ వానితోపాటుగా నాకర్షించిరి. ఓయుధిష్ఠిరా! అటు లాకర్షించి, నాచుచేఁ గప్పఁబడిన మేనుగలిగి, హరిశ్మశ్రుజటా ధరుఁడై మెయినంటికొన్న శంఖనఖములచే వెలయు నవయవములతో వేదపారగుఁడై యొప్పాఱుచుఁ దమజాలమధ్యముననున్న యాజడ దారిమిన్న నారసి, వారందఱును సవినయముగా నమస్కరించిరి. అపుడు వారివలలయందలి మత్స్యములు, బలవదాకర్షణమువలనను, ఖేదపరిత్రాసములచేతను, స్థలస్పర్శముచేతను, మృతినొందవలసిన వయ్యెను. అపు డమ్మునియు, నమ్మత్స్యములదుస్థితిని గాంచి దయా విష్టుఁడై మఱిమఱియు నిట్టూర్పులు విడుచుచుండుటయు, నాబోయ లమ్మహర్షితో "ఓమునీంద్రా! తెలియకచేసిన మా యీయపరాధమును క్షమించి మమ్మనుగ్రహింపుము. నీకు, మేమేమి ప్రియమొనర్పవల యునో తెలుపుము." అని ప్రార్థించుటయు, మత్స్యమధ్యగతుఁడై యున్న యమ్మహాముని, "ఓజాలరులారా! నాకుఁగలపరమాభీష్ట మెయ్య దియో తెలిపెదను వినుఁడు. నే నిపు డీమత్స్యములతో పాటుగాఁ బ్రాణోత్సర్గమునుగాని, విడుదలనుగాని పొందవలసినవాఁడను. జల

మధ్యముననున్న వీనితోఁ జిరసహవాసముగల నేను వీనిని విడువ నుత్సహింపను.' అని తెలిపెను. అది విని యానిషాదులు మిగుల భయముచే వడఁకుచు వెలవెలపోవుచు నందఱును దద్విషయమును నహుషున కెఱిఁగించిరి" అని తెలిపి భీష్ముఁడు మఱియు నిట్లనియె.

### చ్యవనోపాఖ్యానము

"ఓధర్మజా! అంత నానహుషుఁడు, జాలరులవలన, నాచ్యవనుని వృత్తాంతము విని, నిజామాత్యపురోహిత సహితముగా నమ్మహా మునిని దర్శించువాఁడై వెడలి, శౌచమొనర్చి నియతుఁడై చేతులు మొగిడ్చి యాతనికిఁ దన్నెఱిఁగించికొనియెను. పిమ్మట నానహుషుని పురోహితుఁడు, సత్యవ్రతుఁడును, దేవతుల్యుఁడును, మహాత్ముఁడు నగునాచ్యవనుని యథావిధిగాఁ బూజించెను. అప్పుడానహుషుఁడు 'ఓబ్రాహ్మణోత్తమా! నీకు మే మెట్టిప్రియ మొనర్పవలయునో తెలుపుము. ఎట్టిదుష్కరమైనను, నీకు వలయునే, నద్దాని నొనర్చువాఁడను.'

చ్యవనుఁడు:—ఓరాజా! మత్స్యజీవనులగు నీకైవర్తులు మిక్కిలి శ్రమపడిరి; కావున నీమత్స్యములవిలువయు, నావిలువయు వీరి కిచ్చి పంపుము.

నహుషుఁడు:—ఓపురోహితా! భార్గవుఁడగు నిమ్మహాముని సెలవిచ్చినచొప్పున, నీనిషాదులకుఁ దగునిష్క్రియముగా నొకసహస్ర రూప్యము లొసంగుము.

చ్యవనుఁడు:—ఓనహుషా ! నీవేమి తలంచుచున్నాఁడవు? నేనొకసహస్రము విలువగలవాఁడనా? నీవు నిజబుద్ధిచే నిశ్చయించి నాకుఁ దగుమూల్యము వీరి కిప్పింపుము.

నహుషుఁడు:—ఓపురోహితుఁడా! ఈనిషాదులకు నూఱువేల రూప్యము లిప్పింపుము. ఓభగవానుఁడా! ఈవిలువచాలునా? ఇంకను మఱియొకవిధముగా నీవు దలంచుచున్నాఁడవా? తెలుపుము.

చ్యవనుఁడు:—ఓపార్థివోత్తమా! నే నీశతసహస్ర పరిమితి వాఁడనుగాను. నాకుఁ దగునట్టిమూల్యమిమ్ము. నీయమాత్యులతోఁ గలిసి యాలోచింపుము.

నహుషుఁడు:—ఓపురోహితా! నీ వీనిపాదులకుఁ గోటిధన మిప్పింపుము. అదియుఁ జాలదేని నంతకు నధికముగా నీయవచ్చును.

చ్యవనుఁడు:—ఓరాజా! నేనొకకోటికిఁగాని, యంతకంటె నధికమునకుఁగాని తగను. నాకుఁ దగుమూల్య మిప్పింపుము. బ్రాహ్మణులతోఁ గలిసి యాలోచింపుము.

నహుషుఁడు:—ఓపురోహితుఁడా! నాకుఁ గలరాజ్యములో సగ మీనిపాదుల కిప్పింపుము. ఓద్విజోత్తమా! ఇది నీకుఁ దగు మూల్యమని తలంచెదను. నీవేమందువు?

చ్యవనుఁడు:—ఓపార్థివా! నీసమగ్రమగు సర్వరాజ్యమును నాకుఁదగదు. కావున నాకుఁ దగుమూల్య మీనిపాదుల కిప్పింపుము. మహర్షులతోఁ గలిసి చింతింపుము.

ఓయుధిష్ఠిరా! ఆనహుషుఁ డామహర్షి వచన మాలించి దుఃఖాక్రాంతుఁడై యమాత్యపురోహిత సహితముగా నాలోచింపసాగెను. అంతలో మూలఫలాశనుఁడును, గోజాతుఁడును నగునొకముని, యానహుషుని సమీపించియుండుటను, వారిసంభాషణమును విని యానహుషునితో 'ఓరాజా! నే నీమహర్షిని గడువడిగా సంతుష్టునిఁ గావింతును. నాయిచ్ఛ వచ్చినచోటుల నేని, నే ననృతము పలుకు వాఁడనుగాను. తక్కినచోటులఁ జెప్పవలసినదేమి? కావున నేను నిశ్శంకముగా నొకకార్యమును దెలిపెదను.' అని పలుకుటయు, నహుషుఁ డాతనితో 'ఓమహనీయా! ఈభార్గవునకుఁ దగుమూల్య మేదియో తెలుపుము. నన్నును నాదేశమును నాకులమును రక్షింపుము. భగవానుఁడగు నీచ్యవనుఁడు కుపితుఁడగునే నెంతయు ముల్లోకములను నశింపఁజేయఁగలుగును? తపోహీనుఁడనై కేవల బాహువీర్యపరాయణుఁడనగు నామాట చెప్పనేటికి? అమాత్య పురోహిత సహితముగా నాపత్సముద్రమున మునిఁగియున్న నాకీవ యోడవై రక్షింపుము. మహర్షివర్యా! ఈతనిమూల్యము నిశ్చయింపుము.' అని ప్రార్థించెను.

ఓధర్మజా! ప్రతాపశాలియు గోజాతుఁడునగు నవ్వనచరుఁ డానహుషుని పలుకులాలించి యాభూపాలునకును వానిమంత్రులకును మోదమొదవునట్లుగా 'ఓరాజా! వినుము. సకలవర్ణములలో

ద్విజు లుత్తములు. వారమూల్యప్రభావులగుట, వారికి వీలులేదు. గోవులును నట్టి విలువగలవియే. కావున నొకగోవు నీతనికి మూల్యముగాఁ గల్పింపుము.' అని తెలిపెను. అంత నానహుషుఁ డామహర్షి వచన మాలించి, సామాత్యపురోహితముగా, మహానందభరితుఁడై, శంసితవ్రతుఁడగు నాభార్గవచ్యవనుని సమీపించి మధురవచనములతో నాతని సంతసింపఁజేయుచు, 'ఓవిప్రర్షి! లెమ్ము, లెమ్ము. ఒక గోవుచేఁ గొనఁబడితివి. ఓధర్మజ్ఞా! నీకిదియే తగుమూల్యమని తలంచెదను.' అని పలికెను.

అదివిని చ్యవనుఁడు, 'ఓరాజేంద్రా! నేనిఁక లేచెదను. లెస్సగా నన్నుఁ గొంటివి. ఓయనఘా! గోవుల కీడగుధన మేదియు లేదని నా యభిప్రాయము. ఓపార్థివా! గోవులదర్శనము, కీర్తనము, శ్రవణము, దానము ప్రశస్త మనఁబడుచున్నది. మఱియు నవి సకలపాపములఁ దొలఁగఁద్రోసి శుభముల సమకూర్చును. ఎల్లపుడును గోవులు లక్ష్మికి మూలము. గోవులం దెట్టిపాపమును లేదు. అవియే దేవతలకు హవిస్సును నాహారమును గలిగించునవి. స్వాహాకారవషట్కారములు గోవులందే ప్రతిష్ఠితములై యున్నవి. అవియే యజ్ఞమునకు నేత్రములు. అవియే దానికి ముఖములు. అవి యవ్యయము దివ్యము నగు నమృతమును వహించి స్రవించుచుండును. సకలలోక నమస్కృతములగు గోవులే యమృతస్థానములు. తేజోరూపములచే నవి, వహ్నితుల్యములు. పుడమి నావులు మహత్తరతేజోరూపములై ప్రాణులకు సకలసౌఖ్యములు సమకూర్చునవి. ఎచ్చట గోకులము నివిష్టమై నిర్భయముగా నూపిరివిడుచునో, యాదేశము మిక్కిలి విరాజిల్లుటయే గాక, పాపములఁ బాఱఁద్రోలును. గోవులు స్వర్గసోపానములై స్వర్గము నందును బూజింపఁబడునవి. అవి యెల్లకోర్కుల నొసఁగు దేవీమూర్తులే. వానినిమించిన దేదియు లేదనవచ్చును. ఓయీ! గోవుల మాహాత్మ్య మిట్టిదని నాకుఁ దెలియును. ఆగోవులగుణములలోఁ గొన్నిటిని దెలియుటయేగాని, వానినెల్లఁ బారాయణముచేయ వలనుపడదు.' అని తెలిపెను.

పిమ్మట నిషాదులు 'ఓమునివర్యా! నీదర్శనమును నీకథనమును మాకిపుడు లభించెను. సజ్జనులతోడిమైత్రి సప్తపదమున నయ్యె

డిని. ఓప్రభూ! మమ్మనుగ్రహింపుము. అగ్ని యెట్లు సకలవిధములగు హావిస్సులను భుజించునో, ధర్మాత్ముఁడవును, బురుషాగ్నివి నగు నీవును నట్టివారినే ననుగ్రహింతువు. ఓవిద్యానిధీ! మేమిదె నీకుఁ బ్రణతుల మగుచున్నారము. మమ్మనుగ్రహించుటకై యీగోవును బరిగ్రహింపుము.' అని ప్రార్థించిరి. అంత నాచ్యవనుఁడు, 'ఓకైవర్తులారా! కృపణునియొక్కయు, మునియొక్కయు, సర్పముయొక్కయు దృష్టి, యగ్ని యెండుగడ్డినిబోలె, సమూలముగా మానవుని దహించును. మీధేనువు నిదె పరిగ్రహించుచున్నాఁడను. మీరు పాపరహితులై తిరి. జలోద్భవములగు మత్స్యములతోఁ గూడ మీరు స్వర్గము నొందుఁడు.' అని పలికెను.

ఓపాండవాగ్రజా! భావితాత్ముఁడగు నమ్మహర్షి ప్రభావముచే, నతఁ డాడినతోడనే యానిషాదులు మత్స్యములతోఁగూడ స్వర్గమునకుఁబోయిరి. పిమ్మట నానహుషుఁ డాజాలరులఁ గాంచి యచ్చెరువడి, యామత్స్యములు స్వర్గము నధిరోహించుట కెంతయువింతగలుగ నిశ్చేష్టుఁడై యుండెను. పిమ్మట నమ్మహర్షిచ్యవనుఁడును, గోజాతుఁడును, నహుషున కనుకూలములగువరముల నొసంగిరి. పిదప మహావీర్యుఁడగు నహుషచక్రవర్తియు నెంతయేనిఁ బ్రీతుఁడై తద్వరప్రభావమున నింద్రతుల్యుఁడగుచు ధర్మపథమువట్టి ప్రవర్తించుచు నమ్మహర్షులను బూజించెను. అనంతర మాచ్యవనమహర్షియుఁ దనదీక్ష సమాప్త మొనర్చుకొని నిజాశ్రమమునకుఁ బోయెను. గోజాతుఁడగు దనయావాసమున కేఁగెను. ఓరాజా! ఆనిషాదులును, వారివలలయందున్న మత్స్యములును స్వర్గమునకుఁబోయెను. నహుషుఁడును వరమువడసి నిజపురమును బ్రవేశించెను. ఓనాయనా! నీవడిగినప్రశ్నమున కుత్తర మొసంగితిని. దర్శనసహవాసములం దిట్టిస్నేహామే గలుగును. గోవుల ప్రభావ మిట్టిదని ధర్మవేత్తనిశ్చయము. ఓవీరాగ్రణీ! ఇంక నేమి వినఁగోరెదు? నేను నీకేమి చెప్పవలయును?" అని తెలుపుటయు నయ్యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె.

### పరశురామచరిత్రము

"ఓపితామహా! మహాప్రాజ్ఞా! నాకొక గొప్పసంశయము గలిగెడిని. ఆ నాసందియమును దీర్పుము. జామదగ్న్యునిఁగూర్చి నాకెం

తయుఁ గుతూహలము గలదు. ధర్మభృద్వరుఁడగు నా రామునిచరిత్ర మును వివరింపుము. సత్యపరాక్రముఁడగు నతఁ డెట్లు జనించెను? బ్రహ్మర్షివంశమువాఁడగు నితఁడు క్షత్రియకులమువాఁ డెటు లయ్యెను? కావున నీతనియుత్పత్తినంతయుఁ దెలుపుము. క్షత్త్రియుఁగు కౌశికవంశమునుండి బ్రాహ్మణుఁ డెటులయ్యెను? ఆహా! మహాత్ముఁడగు నాతనిప్రభావ మెంతయు నెన్నఁదగినదియే! అటులే రాముఁడును నెంతయు మహనీయుఁడుగదా! వారిచరువ్యత్యాసములు పుత్త్రుల నతిక్రమించి, న ప్తలయం దెట్లు సంక్రమించెను? ఆదోషము పుత్త్రుల యందు సంక్రమింపకుండెనేమి? దానినెల్ల వివరింపుము."

అది విని గాంగేయుఁడు "ఓయుధిష్ఠిరా! ఇందులకొకపురాతనేతి హాసము గలదు. అయ్యది కుశికచ్యవనులకుజరిగినసంవాదము. మున్ను భార్గవుఁడగుచ్యవనుఁడు, మహాబుద్ధిశాలియగుటఁ, దనవంశమున రాఁ బోవుదోషమును దెలిసికొని, యందలిగుణదోషములను బలాబలము లను మనసునఁ బర్యాలోచించి నిశ్చయించుకొని, తపోధనుఁడగు నాతఁడు కుశికులకులమునెల్ల దహించువాఁడై యాకుశికుని జేరి 'ఓ యనఘా! నీతోఁగలిసి నివసింప నాకిచ్ఛవొడమెడిని' అని పలుకుటయుఁ, గుశికుఁ డాతనితో 'ఓభగవానుఁడా! కన్యాప్రదానకాలమున నథితిసేవారూపధర్మము పండితులచే నాచరింపఁబడవలయునని పెద్దలు దెలుపుదురు. ఓతపోధనా! అట్టి ధర్మద్వార మతిక్రమించెను. ఆకార్యము నిపుడు చేయుదుము. నాసేవ నంగీకరింపుము.' అని పలికెను.

ఓధర్మరాజా! అటులు పలికి యాకుశికుఁడు, తనభార్యతోఁగూడి యమ్ముని నారాధించువాఁడై యొకయాసనము పట్టికొని యాతని కడకు వెడలి, యొకగిండియతోఁ బాద్యము తీసికొనిపోయి యా చ్యవనునకర్పించెను. మఱియు నాతనిచే నతిథికిఁ జేయఁదగుసత్క్రియ లన్నియు నొనర్పఁబడియెను. పిదప నాకుశికనృపతి యథావిధిగా మధుపర్కమర్పించి మన్నించెను. ఓయుధిష్ఠిరా! ఇటు లమ్మహర్షిని సత్కరించి యాకుశికుఁడు 'ఓమహానుభావా! మేమిరువురము నీకధీను లము. గావున మే మేమిచేయవలయునో తెలుపుము. ఓసంశ్రితవ్రతా! నా యీ రాజ్యము, లేక నాకుఁగలధనము, నాగోవులు నాయజ్ఞదాన

ఫలము నాసకలమును నీకు సమర్పించుకొనుచున్నాఁడను. ఏమి వల
యునో తెలుపుము. మఱియు నా యీగృహము, నా యీరాజ్యము,
నా యీధర్మాసనము పరిగ్రహింపుము. నీవ రాజవై నా యీభూవల
యమును శాసింపుము. నేను నీ కధీనుఁడను' అని పలుకుటయు నాకుశిక
వచనము లాలించి యాచ్యవనుఁడు పరమానందభరితుఁడై యాత
నితో 'ఓరాజా! నీరాజ్యమునుగాని, నీధనమునుగాని గోరలేదు.
నాకుఁ గొంత లక్కఱలేదు. గోవులను వాంఛింపను. దేశముల నపే
క్షింపను. యాగాదిఫలము నిచ్చగింపను. మీయిరువుర కిష్టమగునేని
నేనొకనియమ మారంభించెదను. అందు మీరు నిశ్శంకముగా నన్నుఁ
బరిచరింపవలయును.' అని పలికెను. అందుల కాదంపతులు పరమా
నంద మొంది 'మహనీయా! అటులే గావచ్చు'నని ప్రత్యుత్తర మొసంగిరి.
పిమ్మట నక్కుశికుఁడు, చ్యవనమహర్షిని లోనికిఁ దీసికొనిపోయి,
మనోజ్ఞమగు నొకప్రదేశమును జూపించి, దేవా! తమరు పరుండుట
కిదియే సెజ్జ. తమరిచ్చవచ్చినటు లీప్రదేశమున నివసింపవచ్చును. ఓతపో
ధనా! నీకుఁ బ్రియము గల్గునట్లుగాఁ బ్రవర్తింపఁ బ్రయత్నింతుము.'
అని పలికిరి. వారటులు సంభాషించుచుండఁగనే సూర్యుఁ డస్తమింపఁ
జొచ్చెను. అంత నమ్మహర్షి యన్నపానములను వాంఛించుటయు,
నాకుశికుఁడు చ్యవనునితోఁ గేల్మొగుడ్పు వెలయ, 'దేవా! ఏయాహార
పదార్థము నీకిష్టము? మేమిపుడు నీకేమి సమర్పించుకొనవలయును?'
అని యడుగుటయు, నాచ్యవనముని, పరమప్రీతుఁడై 'నరాధిపా! నా
కర్హమగు నాహార మేదైనను సరియే, నీవట్టిదానిని గల్పింపవచ్చు'నని
పలికెను. అది విని యప్పార్థివుఁడు సగౌరవముగా, నటులే గావింతు
నని పలికి తగినయాహార మాతని కర్పించుటయు, నతఁ డది యార
గించి, యాదంపతులతో 'సతీపతులారా! నేనిఁక నిద్రించెదను. నన్ను
మిగుల నిద్ర బాధించుచున్నది.' అని పలికి పిమ్మట నమ్మహర్షి శయ్యా
గృహముఁ జేరి సెజ్జపైఁ బరుండెను. అంత నాధరాకాంతుఁడు భార్య
తోఁగూడ వచ్చి నిలువబడియుండుటయు, మఱియు నమ్ముని, 'నేను
నిద్రించునపుడు నన్నెవ్వరును మేలుకొలుపరాదు సుఁడీ! మఱియు
మీరు నాపాదములఁ బట్టుచు నరగడియయేని ప్రమాదపడక మేలు
కనియుండవలయును.' అని పలికెను. అందుల కించుకయు శంకింపక

యాకుశికుఁడు, ధర్మజ్ఞుఁడగుట నట్లే యని యంగీకరించి నాఁటి రేయి ముగిసినను నాతని మేలుకొలుపఁడయ్యెను. అమ్మహర్షి శాసన మనుసరించి యాతని సేవించుచు నియమము దప్పక యాదంపతులుండిరి. అటులమ్మహర్షి వారి కాజ్ఞాపించి నిద్రించుచు నొకప్రక్కనే యిరువది యొక్క దినములు మేలుకొనకుండెను. ఆభూపతి భార్యాసహితుఁడై యాహారము లేక యుత్సాహము విడువక తదారాధనపరుఁడై సేవించుచువచ్చెను. పిమ్మటఁ దపోధనుఁడగు చ్యవనుఁడు తానే లేచి, యేమియుఁ బలుకక యాకుశికునింటినుండి వెడలిపోవసాగెను. అంత నాదంపతులు, క్షుధాపరిశ్రాంతులైయుండియు నమ్మహర్షిని వెంబడించి వెడలిరి. కాని యామౌని, వారి నారయఁడయ్యెను. ఆభార్గవుఁ డట్లు పోవుచు వారు చూచుచుండఁగనే యంతర్హితుఁడయ్యెను. అప్పు డాకుశికుఁడు పుడమిఁబడియెను. అనంతర మతఁ డొకముహూర్తకాలమటులు పడియుండి, తన దేవితోఁగూడఁ దెప్పఱిలి, మఱియు నాచ్యవనుని వెదక నారంభించెనని" తెలుపుటయు, నాయుధిష్ఠిరుఁ డిట్లనియె.

"ఓపితామహా! ఆచ్యవనమహర్షి యంతర్ధానమొంద, నాకుశికుఁ డేమిచేసెను? ఆతనిభార్య యేమియొనర్చెను? తెలుపుము."

ఆది విని భీష్ముఁడు, "ఓయుధిష్ఠిరా! ఆమహీనాథుఁ డమ్మహర్షిని వెదకియుఁ గానక, భార్యతోఁ గూడఁ బరిశ్రాంతుఁడై లజ్జవొడమ నిశ్చేతనుఁడై మరలెను. అటులు మరలి దీనుఁడై పురముచొచ్చి యాచ్యవనుని చేష్టితమునే చింతించుచు నెవ్వరితో నేమియు మాటలాడక, శూన్యచిత్తుఁడై యభ్యంతరమందిరముఁ బ్రవేశించి, మఱియు నావెనుకటిశయనమున శయనించియున్న యాచ్యవనమహర్షినిఁ గనుఁగొనియెను. అటులు తమ కాతఁడు నిద్రితుఁడై గానవచ్చుట కెంతయు వారు వింతపడి చింతించి, యాతనిదర్శనము తమకు మరల సంభవించినందులకు సంతసిలి విశ్రాంతులైరి. అటులు వారు చింతలుడిగి, యథాస్థానమున నిలువఁబడి మరల నెప్పటివొప్పునఁ బాదసంవాహన మాచరించుచువచ్చిరి. అంత నాచ్యవనుఁడు రెండవప్రక్కకుఁ దిరిగి, మఱి యిరువదొకదినములు నిద్రించి మేలుకనియెను. అప్పుడు భయముచే వడఁకుచు నించుకేని వికారమునొందక యాతనికిఁ గానవచ్చిరి. అటు లమ్ముని మేలుకని, యాదంపతులతో 'ఓరాజదంపతులారా! నాకుఁ

డై లాభ్యంగ మొనర్పుఁడు. నేనిపుడు స్నాన మొనర్పవలసియున్నది' అని పలుకుటయు, వారందులకు సమ్మతించి, యాఁకలిచే బీడితులయ్యు వెనుదీయక, మహార్హమగు శతపాకతైలము గొని యాతని సమీపించిరి. అంత నామహర్షి యొకయాసనమునఁ గూరుచుండెను. వారిరువురును మౌనవ్రతమూని యామౌనికి నలుగుపెట్టిరి. కాని యది చాలదని యతఁడు పలికెను. అంతకును వారు నిర్వికారచిత్తములతో సేవ సేయుచునేయుండిరి. అది కనిపెట్టి, యాచ్యవనుఁడు వడిగా నచ్చోఁ గదలి స్నానశాలను బ్రవేశించెను. అంతకుమున్నే యాస్నానాగారమున రాజోచితమగుస్నానీయ మమర్పఁబడియుండెను. అమ్ముని వాని నాదరింపక యచ్చోటనే యంతర్హితుఁడయ్యెను. అటు లానృపతి చూచుచుండఁగనే యమ్ముని యంతర్ధానమొందినను, వారందుల కించుకేని కినుకఁబూనరైరి. పిమ్మట నమ్మహర్షి వారి కగపడి స్నానమొనర్చి సింహాసనాసీనుఁడై, యాదంపతులకుఁ గానవచ్చెను. అందుల కాభూపతి, భార్యతోఁగూడ సంతుష్టాంతరంగుఁడై 'ఆర్యా! అన్నము సిద్ధము చేయఁబడినది.' అని మనవిచేసెను. నిర్వికారుఁడైన యారాజువచనము విని, యమ్ముని, 'ఓయీ! సిద్ధమైనచోఁ దెప్పింపు'మనియెను. అంత నాకుశికుఁ డమ్మునికివలయు నాహారమును, భార్యయుఁ దాను దెచ్చి సమర్పించెను. పలువిధములగు మాంసములును, వివిధములగు శాకములును, జిత్రములగు రసాలాపూపకములును, మోదకములును, ఖాండవములును, నానాప్రకారములగు రసములును, వన్యమగు మున్యాహారమును, విచిత్రములై రాజభోగ్యములగు పెక్కుకండ్లును, మఱియు, నింగుదకాశ్మర్యబదరభల్లాతకాదులగు ఫలములును, మఱియు గృహస్థులకును వనవాసులకును భోగ్యము లగునాహారములును నందులకుఁ దేఁబడియెను. అమ్ముని యేమి శపించునో యను భయముచే నాహారజాతమునెల్లఁ దెప్పించెను. అదియెల్ల నామునితల్లజునిముం దుంపఁబడియెను. పిమ్మట నమ్ముని తానున్న శయ్యాసనముల నందులకుఁ దెప్పించి మనోజ్ఞములగు వస్త్రములతోడను భోజనోపస్కరములతోడను వానిని గప్పి భార్గవుఁడగునాచ్యవనుఁడు ప్రజ్వలింపఁజేసెను. మహామతులగునాదంపతు లందులకును నించుకేనిఁ గోపింపరైరి. అంత నతఁడు, వారు తన్నరయుచుండఁగనే యంతర్హితుఁ

డయ్యెను. అంత నారాజర్షి యటులే యారాత్రియెల్ల మౌనమూని, తనదేవేరితోఁగూడ నించుకేని వికారమొందక యుండెను. ఆరాజ మందిరమునఁ, బ్రతిదినమును, వివిధముగా సంస్కరింపఁబడిన యన్నమును, ముఖ్యములగు శయనాసనాదులును, సంపూర్ణములగు స్నానద్రవ్యములును, వివిధములగు వస్త్రములును, సిద్ధముచేయఁబడుచునే యుండెను. అటులగుట నాచ్యవనున కించుకేని లోపముఁ గనిపెట్ట నవకాశము గలుగకుండెను. అపు డామహర్షి మఱియు నాకుశికునిఁ గాంచి 'ఓరాజా! నన్నొకరథముపైఁ గూర్చుండఁబెట్టి, నీవును నీ భార్యయు నెందేని మోసికొనిపోవుఁడు.' అని యాజ్ఞాపించెను. ఆరాజందులకు నిశ్శంకముగా సమ్మతించి, 'ఓదేవా! నిన్నుఁ గ్రీడారథముతో వహింపవలయునా? లేక సాంగ్రామికమగురథముపైఁ బెట్టి యీడ్వవలయునా?' అని ప్రశ్నించుటయు, సోత్సాహముగాఁ బలికిన యానృపతివచనము లాలించి యాచ్యవనుఁడు, సంతుష్టాంతరంగుఁడై 'ఓనృపా! నీదగు సాంగ్రామికరథమే సమకట్టింపుము. ఆరథము సాయుధమై సపతాకమై శక్తి కనకయష్టిసహితమై యుండవలయును. మఱియు నది తోరణాలంకృతమై మువ్వలచప్పుడు లుప్పతిలఁ దీవ్ర సాయక సహస్రసమేతమై యుండవలయుఁ జుమీ!' అని తెలిపెను. అది విని యందుల కానృపతి సమ్మతించి, యట్టిమహారథమును గల్పించి యారథము కుడివైపు తానును, నెడమప్రక్క భార్యయుఁ బూని కొనియెను. అంత నమ్ముని, త్రిదండమును, వజ్రసూచ్యగ్రమునగు నొకమునికోలఁ బూని యందుఁ గూరుచుండెను. ఆపరికరమెల్ల నా మునికి సమకూర్చి యానృపతి, యమ్మునిపతితో 'ఓభగవానుఁడా! ఈరథ మెందులకుఁ దీసికొనిపోవలయును? నీవెచ్చోటకుఁ బోనిమ్మని సెలవిచ్చెదో, యందులకుఁ బోవచ్చును.' అని పలికెను. అది విని యాముని, 'ఓరాజా! ఇఁక నీవును నీమెయు నాకు శ్రమము గలుగ కుండఁ గడుమెల్లగా నడుగులో నడుగుపెట్టి నడువవలయును. బహు సుఖముగా వహింపవలయును. జనమెల్ల ననుఁ గనుఁగొనుచుండ వలయును. త్రోవలో మార్గస్థుల నెవ్వరినిఁ దొలఁగింపరాదు. వారికి నేను ధన మొసంగుచుండవలసియున్నది. మఱియు బ్రాహ్మణు లెవ్వరేనిఁ ద్రోవలో నన్నేమైనఁ గోరిన, వారికి వలయువాని నొసంగవలసి

యుండును. వారడిగినచో రత్నములను, ధనమును, సకలమైనవానిని వారి కిచ్చెదను. కావున నదియెల్ల సమకూర్పవలయును. ఓపార్థివా! ఇందు మఱి చింతింపవలదు.' అని పలుకుటయు, నాకుశికుఁడు తన భృత్యులతో 'ఓయీ! ఇమ్మహర్షి యేమేమి చెప్పునో యదియెల్ల నిశ్శంకముగా నొసంగుచుండుఁడు' అని సెలవిచ్చెను. పిమ్మట, పెక్కురత్నములును, స్త్రీలును, గోవృషభాదులును, నజావికము, కృతాకృతమగు సువర్ణము, కొండలవంటియేనుఁగులును నమ్మహర్షిని వెంబడించి రాసాగెను. రాజామాత్యులును వెనుక వచ్చుచునుండిరి. అప్పు డప్పురమంతయు నార్తనాదములతో, హాహాకారము లొనర్పసాగెను. ఆదంపతు లిరువురును దీవ్రాగ్రమగు మునికోలచేఁ దఱుమఁబడుచుఁ, బృష్టమునను గటిభాగమునను బశువులట్లు కొట్టఁబడుచు నించుకేని వికారములేక యమ్మునిరథము నీడ్వసాగిరి. ఆహా! వారప్పటి కేఁబదిదినములనుండి యాహారము లేకుండిరి. అయినను నందులకు వెనుదీయక వడఁకుచు నాతనిరథమును వహించుచువచ్చిరి. అమ్ముని, యాదంపతుల మేనుల నుండి రక్తము స్రవించునట్లు మోదసాగెను. ఓమహారాజా! అప్పు డాదంపతులు పుష్పించినయశోకములట్లు గానరాసాగిరి. అప్పుడు వారి నారసి పౌరవర్గ మెంతయు శోకసమాకులమై పరితపించుచునుండియు, నతఁ డెవ్వరి నేమిశపించునో యనుభయముచే మాటాడకూరకుండెను. ఒక్కొకచో నొకరితో నొకరు గలిసి, 'చూచితిరా! తపోబలమహిమ, మనమెల్లఁ గుపితులమయ్యు నమ్మునిఁ దేఱిచూడఁజాలకున్నవారము. మహాత్ముఁ డగుమహర్షిశక్తి యెట్టిదై యున్నదో యరయుఁడు' అని కొందఱు పలికిరి. మఱికొందఱు 'ఆహా! ఈరాజదంపతులధైర్య మెట్టిదో చూడుఁడు. ఎంతయేని పరిశ్రాంతులయ్యు రథ మెటులు వహించుచున్నారో చూచితిరా?' అని పలుకఁజొచ్చిరి. అప్పటికి నాభార్గవున కాదంపతుల మొగములం దించుకేని వికారము గానఁబడదయ్యెను.

ఓయుధిష్ఠిరా! ఆచ్యవనుఁ డటులు నిర్వికారులై యున్న యన్నరాధిప దంపతుల నాలోకించియు నాకుబేరునట్లు తనయిచ్చవచ్చినట్లు ధన మెల్లవారికి నిప్పింపసాగెను. అప్పటికి నప్పుడమిఱేఁడు పరితపింపక ప్రీతాత్ముఁడై యాతఁడు చెప్పినచొప్పునఁ జేయుచునేవచ్చెను.

పిమ్మట నమ్మహర్షి యందుల కెంతయు సంతసిలి, యారథము డిగి యాదంపతులను, దద్రథమునుండి విడిపించి, వారితో సుప్రసన్నమై స్నిగ్ధగంభీరమగు వచనము లొప్పార 'ఓరాజదంపతులారా! మీకొక యుత్తమవర మొసంగుచున్నాఁడను. కోరికొనుఁడు.' అని పలికెను. ఓధర్మజా! తనచేఁ గొట్టుబడి సుకుమారులై యున్న యాదంపతుల నమ్మహర్షి యమృతతుల్యములగు తనహస్తములచే స్నేహముడర నిమురసాగెను. అపుడా నృపతి, 'దేవా! మా కీయెడ నించుకేని శ్రమ గలుగలేదు. ఓభార్గవా! నిన్ను ధ్యానించి, నీ ప్రభావబలముచే మాయలజడియెల్లఁ దీఱినది' అని పలికెను. పిమ్మట నాభగవానుఁడగుచ్యవనుఁడు, మోదమానమానసుఁడై 'ఓయీ! నే మున్ను పలికినది వ్యర్థముగాదు. మనోజ్ఞమగు నీ గంగాతీర మెంతయు శుభప్రదమగుప్రదేశము. ఓపార్థివా! వ్రతపరుఁడనై కొంతకాల మీతీరమున నివసించువాఁడను. కావున నీపురమునకుఁ బొమ్ము. ఓపుత్రకా! మరల విశ్రమించి రావచ్చును. ఓనరాధిపా! నేనిందుండఁగనే రేపు నీవు నీభార్యతోఁ గూడ నన్నుఁ జూచెదుగాక, నీవు కోపింపకుము. నీకు శ్రేయమయ్యెడిని, నీమానసమునఁ గలవాంఛితమంతయు నీకు లభించెడిని.' అని యతఁడు సెలవొసంగెను. అందుల కాకుశికుండెంతయు సంతసిల్లి కడునిపుణముగా నమ్మహర్షితో 'ఓమహామునీ! మాకించుకేని పరితాపములేదు. మేము పవిత్రులమైతిమి. మఱియు, మాకుఁ గోపమును లేదు, మేము వృద్ధులము గాముగదా! బలాన్వితులము. మేముగలవారము. నీవు మాగాత్రములం దొనర్చిన ప్రతోద ప్రహారములకు లక్ష్యముసేయను లేదు. నాభార్యతోఁగూడ నేనిపుడు స్వస్థచిత్తుఁడనైతిని. ఈ నా దేవి యప్సరవలె మిగులఁ జక్కఁగనే యున్నది. మఱియు శోభాయుక్తయై యెంతయు విరాజిల్లుచున్నయది. ఓమహామునీ! నీయనుగ్రహముచే నిదియెల్ల మాకు సమకూరెను. అయినను ఓసత్యపరాక్రమా! ఇదియొక చిత్రముగాదు' అని పలుకుటయు, నాచ్యవనుఁడు 'ఓరాజా! నీవు పొమ్ము. మరల నీభార్యతోఁ గూడ రమ్ము.' అని తెలిపెను. అంత నాకుశికనృపతి యతనిచే ననుజ్ఞపడసి, మఱిమఱియు నభివాదనమొనర్చుచు నింద్రునివలెఁ దేజశ్శాలియై యింటికి మరలెను. పిమ్మట నాతనిమంత్రులును బురోహితులును,

సేనలవారును, వేశ్యలును, బ్రజలును గలసిరాఁ, బరమశోభాన్వితుఁడై యతఁడు విరాజిల్లుచు వందులు సన్నుతింపఁ బురముఁ బ్రవేశించెను. అటులు నగరప్రవేశ మొనర్చి, పూర్వాహ్ణక్రియలు నిర్వర్తించి తనభార్యతోఁగూడ భుజించి యారాత్రి సుఖముండెను. అంత నాదంపతులు, ముదిమిలేని దేవతలట్లు వెలయు తమనూత్న యౌవనమును జూచికొని సంతసించుచు, మునిదత్తవరప్రభావముచే నెంతయు వెలయుచు శయనించిరి. పిమ్మట నమ్మహర్షి యగు చ్యవనుఁడు, తనకీర్తిని వెలయించువాఁడై తపోధనుఁడగుటను దానున్నవనము నభిరామముగను, సమృద్ధిమత్తరముగను, దనబుద్ధిమహిమచే బహువిధరత్న భూషితముగను నొనర్చి, యింద్రునియుద్యానమును మించునట్లు సృజించెను." అని తెలిపి భీష్ముఁడు మఱియు నట్లనియె.

### కుశికచ్యవనసంవాదము

"ఓయుధిష్ఠిరా! అనంతర, మాధరాకాంతుఁ డారాత్రి వేఁగుటయు మేలుకని, పూర్వాహ్ణిక క్రియ లాచరించి, యెప్పటి చొప్పున నమ్మహర్షిని దర్శించువాఁడై భార్యతో వెడలెను. పిమ్మట నాతని కొక గొప్పప్రాసాదము గానవచ్చెను. అయ్యది సువర్ణమయమై వేయిమణిస్తంభములు గలిగి, గంధర్వనగరమునా విరాజిల్లుచునుండెను. అందా కుశికునకు దివ్యములగు సుద్దేశములు గానవచ్చెను. అందాతని కొకచో రజతసానువులుగల పర్వతములును, బద్మములుగల నళినీసమూహమును, వివిధములగు నక్షత్రశాలలును, దోరణములును గానవచ్చెను. మఱియొకచో సువర్ణకుట్టిమమునాఁదగు శాద్వలప్రదేశము నతఁడు గాంచఁగలిగెను. మఱియు సహకారములును, వికసించిన కేతకోద్దాలకములును, ధవాశోకములును, బూఁచినమల్లియలును, బండిగురివెందలును, సంపెంగలును, దిలకములును, భవ్యములగుపనసలును, వంజుళములును, బుష్పితములగు కొండగోఁగులును, నందందాతనికిఁ గానవచ్చెను. ఇంకను వేఱొకచో శ్యామములు, వారణపుష్పములు, నష్టపదికాలతలును బరిక్షిప్తములై యుండుట నతఁడు గనుఁగొనియెను. పద్మోత్పలములుగలవియు, సకలఋతువులందును బూచునవియు, నగుచెట్లును,విమానసమానములైనవియు, శైలతుల్యము

లైనవియు నగు ప్రాసాదములను నతఁడు చూచెను. కొన్నిచోటుల చలినీళులును, మఱికొన్నిచోటుల వేఁడినీళులును, విచిత్రములగు నాసనములును, శయనోత్తమములును, రత్నసువర్ణమయములగు పర్యంకములును గానవచ్చెను. అయ్యవి యుత్తమాస్తరణావృతములై యుండెను. మఱియు నందందు భక్ష్యభోజ్యము లనంతముగాఁ గల్పింపఁబడి యుండెను. ఒకచోఁ బాణిశాదులును, వేఱొకచో శుకములును, శారికలును, భృంగరాజకములును, మఱియొకచోఁ గోకిలములును, శతపత్రములును, గోయష్టికములు, కుక్కుటములు, మయూరములు, కురరములు, దాత్యూహములు, జీవంజీవకములు, వానరములు, హంసములు, సారసములు, చక్రసములు మున్నగుపక్షు లాతనికిఁ గానవచ్చెను. అవి యెల్లెడలఁ గిలకిలలాడుచు మనోజ్ఞములై చూపట్టెను. ఓపార్థివా! ఒకచో నాతనికి గంధర్వాప్సరోగణము గానవచ్చెను. మఱియుఁ గాంతాభిషక్తులైన మఱికొందఱు గానవచ్చిరి. వారి నా రాజు చూడఁ దున్నను మఱియుఁ గానవచ్చుచుండిరి. మధురమగుగీతధ్వనియు, నధ్యాపనధ్వనియు వినవచ్చుచుండెను. మధురములగు హంసారావములును విననయ్యెను. ఓధర్మజా! ఆకుశికుఁ డాయద్భుతమును గాంచి, 'ఆహా! ఇది కలయా! లేక చిత్తవిభ్రాంతియా! లేక సత్యమా! నే నీశరీరముతోడనే స్వర్గమునొందినవాఁడనైతినే! ఈప్రదేశము లుత్తరకురువులా? లేక యమరావతియా? ఇది యేమో నాకెంతయు నచ్చెరువు గొలుపుచున్నయది' అని చింతించెను. అతఁ డట్లు చింతించుచుండఁగనే యందొక సువర్ణవిమానమున గొప్పవిలువగలశయనమున శయనించియున్న చ్యవనుఁ డాతనికిఁ గానవచ్చెను. ఆవిమానము మణిస్తంభసమాకులమై మనోజ్ఞముగా నుండెను. అంత నాకుశికుఁ డమందానందభరితుఁడై భార్యతోఁగూడ నమ్మహర్షిని సమీపించెను. అతఁడును జేరుపకుఁ జేరునంతనే, యమ్ముని తిలకుఁడును గానరాఁడు. ఆతనిశయనము నగపడదు. తత్క్షణము మఱియొక ప్రదేశమున నాచ్యవనుఁ డాకుశికునకుఁ గానవచ్చెను. అతఁ డొకదర్భాసనముపైఁ గూర్చుండి జప మొనర్చుకొనుచు మహావ్రతనిష్ఠ మెయి నుండెను. ఓధర్మజా! ఇటు లావిప్రోత్తముఁడు తనయోగబలముచే నప్పార్థివునకు మోహము గలిగించెను. మఱియొకనిమేషమున

కందావృక్షములా! లేవు. ఆగంధర్వులా! కానరారు. అంతయు నంతర్హితమయ్యెను. ఓరాజా! మరల నెప్పటిచొప్పున నాగంగాతీరము నిశ్శబ్దమైయుండెను. అపు డాప్రదేశమందంతటను, దర్భలును వల్మీకములుఁ గానరాఁదొడఁగెను. ఆయద్భుతకృత్యమున కారాజును నాతని భార్యయుఁ బరమవిస్మయాపన్నులైరి. పిమ్మట నాకుశికుఁడు హర్ష మొదవ భార్యను జూచి 'ఓదేవీ! గాంచితే? సుదుర్లభములైన యీభావము లెంతచిత్రములో! ఇదియెల్ల నాచ్యవనుని యనుగ్రహముచే నైనది గాదే? తపోబలమును మించిన దొకటిలేదుగదా! మనోరథమాత్రమున కశక్యమైనదియు నైతముఁ దపముచే లభించును. త్రైలోక్యరాజ్యమునకంటెను దపమే యధికమనవచ్చును. ఉత్తమమగు తప మొనర్చినచోఁ దద్బలముచే మోక్షమును నైతము సంపాదింపనగును. ఆహా! మహాత్ముఁడగు చ్యవనబ్రహ్మర్షిప్రభావ మెంతగొప్పది? ఇతఁడు తలంచినచోఁ దన తపోబలముచే లోకములనేని సృజింపఁగలఁడు. ఎవ్వరేని పుణ్యవాగ్బుద్ధికర్ములగు బ్రాహ్మణులుగనే పుట్టవలయును. ఉత్సాహము జనింపఁగనే యట్లుచేయుట యీచ్యవనునకుఁ దక్క వేఱొక్కని కెవ్వనికగును? బ్రాహ్మణ్యము మానవులకుఁ గడుదుర్లభము. రాజ్యమేని సులభముగాని యది లభింపదు. బ్రాహ్మణప్రభావమును బట్టియే, ధుర్యములట్లు రథమును బూని వహింపఁగలిగితిమి' అని చెప్పుచుండెను. ఇటు లానృపతి పలుకుచుండఁగనే యాచ్యవనుఁ డది యెఱిఁగి, రాజును గాంచి వడిగా రమ్మనుటయు, నతఁడు భార్యతోఁ గూడ నమ్మహామునిఁ జేరి వందనీయుఁడగు నాతని కభివందన మొనర్చెను. అంత నాచ్యవనుఁ డాకుశికునిఁ దగువిధముగా నాశీర్వదించి, యూఱడించుచు నందుఁ గూర్చుండుమని పలికి, పిమ్మటఁ బ్రకృతినొంది, మధురోక్తులతో నానృపతికిఁ దృప్తిగలుగునట్లుగా, 'ఓరాజా! మనష్షష్ఠము లగునింద్రియములు నీచే సులభముగా జయింపఁబడినవి. నీవిఁక ముక్తుఁడ వైతివి. ఓపుత్రకా! నీవు నన్ను లెస్సగా నారాధించితివి. నీకిఁకఁ గొంచెమేని కలుషములేదు. కావున నివిఁక సమ్మతింతువేని నేను బోవఁదలంచినవాఁడను. ఓరాజేంద్రా! నీయెడ నాకెంతయుఁ బ్రీతిగలిగెను. ఒకవర మొసంగెదను. ప్రతిగ్రహింపుము' అని తెలిపెను. అది విని యాకుశికుఁడు, 'దేవా! భృగుశార్దూలా! నేను నీస

న్నిధి నగ్నిమధ్యగతునట్టులు ప్రవర్తించితిని. అపుడు దగ్ధుఁడను గాకుండుటయే యెక్కువ. ఇదియే నాకు ముఖ్యవరము. ఓ బ్రాహ్మణోత్తమా! నీవు ప్రీతుఁడవైనందుఁలకు నావంశము రక్షింపఁబడియెను. ఇదియే నీవు చూపవలసిన యనుగ్రహము. ఇదియే నాజీవితప్రయోజనము. ఇదియే రాజ్యఫలము. ఇదియే తపఃఫలము. ఓభార్గవా! నీకు నాపై దయగలిగినేని నాసంశయముదీఱ నాశోకవిషయము వివరించి తెలుపుము.' అని పలుక విని చ్యవనుఁ డిట్లనియె.

చ్యవనకుశికసంవాదము

'ఓకుశికా! వరము పరిగ్రహింపుము. నీచిత్తమునఁ గలసంశయ మేదియో తెలుపుము అదియెల్ల నీకు సమకూర్చువాఁడను.'

అది విని యాభూపతి 'ఓదేవా! నీవు నాకుఁ బ్రసన్నుఁడవేని నాశోకవిషయమును దెలుపుము. నీవు నాయింట నివసింపఁగోరుట కారణమేమో వినఁగోరెదను. ఒకప్రక్కగనే యిరువదియొకదినములు శయనించితివి. నిద్రనుండిలేచి యేమియుఁ బలుకక పైకివెడలితివి. మఱియు నకస్మాత్తుగా నంతర్హితుఁడవైతివి. మఱియు శయనించి రెండవప్రక్క నిరువదియొకదినములు నిద్రించితివి. పిదపఁ దైలాభ్యంగన మొనర్చికొని వెడలిపోయితివి. మరలివచ్చి భోజనపదార్థమెల్ల నగ్నిదగ్ధము గావించితివి. రథముపై వెడలి ధనము దానమొనర్చితివి. వనము చూపించితివి. అందుఁ బ్రాసాదపర్యంకాదులఁ జూపించితివి. మఱియుఁ గానరాకుండ వెడలిపోయితివి. వీనికెల్లఁ గారణ మెద్దియో యెఱిఁగింపుము. ఓభృగూద్వహా! ఈవిషయ మెంతయుఁ జింతించి మోహపరవశుఁడ నగుచున్నాఁడను. దీనినిశ్చయ మెట్టిదియో నా కేమియుఁ దెలియకుండెను. ఓతపోధనా! ఇదియెల్లఁ బూర్తిగా వినిపింపుము.' అని యడిగెను.

అది విని చ్యవనుఁడు 'ఓ రాజా! ఈజరిగినయంతయును నేమినిమిత్తమున నయ్యెనో తెలిపెదను వినుము. నీవిట్లు లడుగుటను దెలుపక తీరదు. మున్ను పరమేష్ఠి దేవసమాగమమున నీవిషయమును దెలుపుచుండగా నేను వింటిని. అది నీకెఱిఁగించెదను.

బ్రహ్మక్షత్రవిరోధముచేఁ గులసాంకర్యమగును. ఓ రాజా! నీకుఁ దేజోవీర్యసమన్వితుఁడగు నొకపౌత్రుఁడు గలిగెడిని. అత్తి

యెఱింగి నీవంశమును నశింపఁజేయఁగోరివచ్చితిని. అటులు నిన్ను దహించువాఁడనై వచ్చి, ముందుగా 'ఓరాజా! నేనొకనియమపు మారంభించెదను. అందు నాకు శుశ్రూషగావింపు'మని పలికితిని. కాని నీయింట నీవలన నాకేమియు లోపము గలుగదయ్యెను. అటులగుట నీవు జీవింపగలిగితివి. అటులుగానిచో, లోకమున లేనివాఁడవగుదువు. ఇట్టిబుద్ధిపెట్టికొనియే యిరువదియొకదినములు పరుండి నన్నెవ్వరును మేలుకొలుపరాదని పలికితిని. నిరాహారులై యుండియు నన్ను మేలుకొలుపకుండుట యెపుడు తెలియఁబడియెనో, యప్పుడే నీయెడ నాకుఁ బ్రీతిగలిగెను. అపుడు నిద్రనుండి లేచి నేను బోవునపుడు, 'మీరెందుల కేఁగెదరని యడిగియుంటివా! యప్పుడే శపించియుందుదును. అందే యంతర్హితుఁడనై మరల నీయింట మఱియిరువదియొక దినములు పరుండి యోగనిద్రనుండి మేలుకని, యాకలిచే శ్రమపడుటను, నాపై నసూయవహింతురేమో యనికొంటిని. ఇది మనసున నుంచియే యంతకాలము మీకాహారము లేకుండఁ జేసితిని అప్పటికిని గొంచెమేని గోపము తెచ్చుకొనవైతివి. అపుడు మీ యిరువురపై నాకెంతయుఁ బ్రీతిగలిగెను. పిమ్మట నీచే భోజన పదార్థములు దెప్పించి వానిని బ్రజ్వలింపఁజేసినచో సహింపకుందువేమో యని తలంచితినిగాని, యదియుఁ సహించితివి. పిదప రథమెక్కి మిమ్ముల వహింపుఁడంటిని. అదియుఁ గాదనక మీరు నాయానతి నొనర్చితిరి. అందులకును సంతసించితిని. నీధనమెల్ల వెచ్చించునపుడేని నీకుఁ గోపముగలుగదా! అని యట్లు పరీక్షించితిని. దానికిని సమతించుటను నీపై నాకు దయగలిగెను. ఇఁక నిన్ను నీభార్యతోఁ గూడ వనమునకు రమ్మనుటకు నిమిత్తము నీకుఁ బ్రీతిగలిగించుటయే. అటులగుటనే యందు నీకు స్వర్గమును జూపించితిని. అందులకు నీకీ వనమునఁ గలిగినదివ్యదర్శనమె నిదర్శనము. ఓపార్థివా! మీకు స్వశరీరముతో స్వర్గదర్శనమయ్యెనుగాదె? ఆసౌఖ్యమును రెండు గడియ లనుభవించితిరిగాదె? మఱియుఁ దపోధర్మములకు నిదర్శనముగా చేసితిని. అపుడు నీకాతపమున వాంఛగలుగుటయుఁ దెలిసితిని. నీవు దేవేంద్రత్వమును సైతము గోరక బ్రాహ్మణ్యమునే వాంఛించుట యెఱింగితిని. నీవు పలికినట్లుగా, దుర్లభమగు బ్రాహ్మణ్యము

నందును ఋషిత్వము, నందును దపస్వితయు ననియెడికోర్కి నీకామ రుడగు, కౌశికునికిఁ గామరుఁడగు కౌశికు నెడ సిద్ధించును. నీకుఁ దృతీయుఁడగుపురుషు నెడ బ్రాహ్మణత్వము సిద్ధించును. ఓపార్థివోత్తమా! భృగువుల తేజముచే నీవంశము వర్ధిల్లును. నీపౌత్త్రుఁడు పావకతేజుఁడును, దపస్వియు నగును. మఱియు నతఁడు తనతపముచే దేవతల, కును మానవులకును భయ మొందవించెడిని. మూడులోకముల వారును నాతనికి జడియుదురు. ఇది సత్యము. ఓరాజా! నీచిత్తమునఁ గలకోర్కి యెద్దియో దానిని గోరికొనుము. ఇఁక నేను దీర్థయాత్రకుఁ బోవలసిన కాలము సమీపించుచున్నది.' అని తెలిపెను.

ఓయుధిష్ఠిరా! అదివిని యాకుశికుఁడు, 'ఓమునివర్యా! నీవు నాకుఁ బ్రసన్నుఁడవేని యిదియే నాకు వరముగా నొసంగుము. నీవన్నటుల నాపౌత్త్రుఁడగుఁగాక, నావంశము బ్రాహ్మణ్యము నొందవలయును. అదియే నాకు వరము. ఓదేవా! మఱియు దీనిని విస్తరించి తెలుప వినఁగోరుచున్నాఁడను. ఓభార్గవా! నావంశము విప్రత్వ మెటులొందెడిని? అందు నాకెవ్వఁడు బంధుఁడగును? ఎవ్వఁడందులకు సమ్మతుఁడు?" అని ప్రశ్నింప విని చ్యవనుఁడు మఱియు నిట్లనియె.

### చ్యవనకుశికసంవాదము

ఓపార్థివోత్తమా! నీవడిగినది తప్పక చెప్పఁదగినదియే. ఓమనుజాధిపా! అందులకే గాదే! నిన్ను నేను జంపవచ్చితిని. ఓరాజా! భృగువులకు క్షత్త్రియులు యాజ్యులు. అది వంశపరంపరగా వచ్చుచుండెను. ఇఁక వారికి, దైవయోగమే నిమిత్తముగాఁ బరస్పరము భేదముగలుగును. క్షత్త్రియులు భృగువుల నెల్ల వధింతురు. అపుడు గర్భస్థశిశువులు సైతము దైవదండ నిపీడితులగుదురు. పిదప మాకుల గోత్రములను వర్ధిలఁజేయువాఁ డొకఁ డుదయించును. అతనిపేరు ఔర్వుఁడు. అతఁడు జ్వలనార్కసమద్యుతియు మహాతేజుఁడునై వెలయుచు, ముల్లోకములను నశింపఁజేయఁదగు కోపాగ్నిని జనింపఁజేయును. అతనికోపాగ్నికిఁ బర్వతవనాదులతోఁగూడిన పుడమినెల్ల భస్మముగావించును. కొంతకాల మయినపిమ్మట నతఁడే యావహ్నిని

సముద్రగతబడబాముఖమునుంచి శమింపఁజేయును. ఓమహారాజా! ఆయౌర్వునకుఁ బుత్రుఁడగు ఋచీకునకు ధనుర్వేదమెల్ల సాక్షాత్కరించి యాతనిఁ జేరును. దైవయోగమే నిమిత్తముగా, క్షత్రియుల నాశమునకై, యతఁడాధనుర్వేదమును బరిగ్రహించి, తనపుత్రునియం దద్దానిని సంక్రమింపఁజేయును. తపోభావితాత్ముఁడును మహాభాగుఁడు నగు నాజమదగ్ని తనతండ్రియొసంగిన యావేదమును ధరించును. ఓధర్మాత్మా! వాఁడు మీకులమునుండి యొకకన్నియను బరిగ్రహించును. నీవంశమును వర్ధిలఁజేయుటకై మహాతపుఁడగు నతఁడు, గాధికిఁ బుత్రికయు, నీకుఁ బౌత్రికయు నగుకన్నియ నటులు పరిగ్రహించి క్షత్రధర్ముఁడును బ్రాహ్మణుఁడునగు పుత్రునిఁ గనును. మఱియు నతఁడు, తేజముచే బృహస్పతియై విప్రకర్ముఁడును, మహత్తరతపోయుక్తుఁడును, సుధార్మికుఁడునగు విశ్వామిత్రుని నీవంశమున గాధికిఁ బుత్రునిగాఁ బ్రసాదించును. అట్టి పుత్రివర్తనమున స్త్రీలే కారణమగుదురు. అయ్యది పరమేష్ఠి నియోగమగుటవలన వేఱొక విధముగఁ గానేరదు. నీమూఁడవపురుషునియందు బ్రాహ్మణత్వము సంభవించెడిని. భావితాత్ములగుభృగువుల కీవు సంబంధివగుదువు.' అని పలికెను.

ఓయుధిష్ఠిరా! మహాత్ముఁ డగుచ్యవనమునివచన నాలించి యాకుశికనృపతి, సంతుష్టాంతరంగుఁడై యాతనితో 'ఓమహామునీ! మహాప్రసాదము. అటులే గావచ్చును.' అని పలికెను. అంత నమ్మహాతేజుఁ డగుచ్యవనుఁడు మఱియు నానరాధిపుతో 'రాజా! వరము గోరికొమ్ము' అని ప్రేరించుటయు నాభూపతి, 'ఓమునివర్యా! నీయానతి శిరసావహించి యటులే వరమొందెదను. నావంశము బ్రహ్మభూతమై వెలయుఁగాక. అందలివారు ధర్మమునఁ బ్రవర్తింతురుగాక.' అని కోరెను. అపు డాచ్యవనుఁ డటులే యగునని పలికి, యాకుశికునకు సెలవొసంగి తాను దీర్ఘయాత్రకు వెడలెను.

ఓధర్మజా! ఇదియెల్ల నీ కెఱిఁగించితినిగదా! ఆభృగువులకును గుశికులకును గలిగెడిసంబంధము చ్యవనుఁడు చెప్పినట్టులుగనే జరిగెను. అటులే రాముఁడును విశ్వామిత్రుఁడును జనించిరి.' అని తెలుప విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె.

### దానధర్మకథనము

ఓపితామహా! ఇదియెల్ల విని మఱిమఱియుఁ జింతింపఁగా మోహ మొదవుచున్నది. శ్రీమంతులగు క్షత్త్రియపుంగవులందఱు నశింప హీనమైన యిప్పుడమివిధముచూచిన దుఃఖ మొదవెడిని. రాజ్యములను వందలకొలఁదిగఁ బొందియు, భూమినెల్ల జయించియుఁ, గోట్లకొలఁది మానవులను మడియించుటను బరితాపమునకుఁ బాత్త్రుఁడ నైతిని. వారియుత్తమకాంతల కిఁక నేమిదిక్కు? అయ్యయో! ఆసతులు, సుతులకును బతులకును దూరలై, మాతులులను భ్రాతలను గోలుపోయిరిగదా! మేము జ్ఞాతులును మిత్త్రులునగు కురువులను వధించుటను దలక్రిందుగా నరకమునఁ గూలక మానము. ఇందేమియు సందియము లేదు. ఉగ్రతపముచే నామేను కృశింపఁజేసికొనియెదను. వస్తుతత్త్వము నుపదేశింప వినఁగోరుచున్నాఁడను.

ఓజనమేజయా! మహోదారుఁడగు భీష్ముఁ డయ్యుధిష్ఠిరుని పలుకు లాలించి, నిపుణముగా బుద్ధిచే నాలోచించి యాతనితో "ఓపాండవాగ్రజా! నీయెడ నద్భుతమగు నొకరహస్యముఁ దెలిపెదను వినుము. ఓయీ! మృతినొందినపిదప నీకేమిగతిగలుగునో యొఱిఁగించెదను. తపముచే స్వర్గమగుచున్నది. దానిచేతనే కీర్తిగలుగుచున్నది. మఱియుఁ దపముచేతనే యాయువు, సంతోషము, భోగములును లభించెడిని. జ్ఞానవిజ్ఞానములును, రూపారోగ్యములును, సంపత్సౌభాగ్యములును దపమువలననే గలుగుచున్నవి. ధనము తపముచే నగుచున్నది. మౌనముచే నాజ్ఞ చెల్లుచున్నది. దానముచే నుపభోగము సిద్ధించును. బ్రహ్మచర్యముచే జీవితము వర్ధిలును. అహింసకు రూపము ఫలము. దీక్ష కుత్తమవంశమునఁ బట్టుట సంభవించును. ఫలమూలాహార మొనర్చినవానికి రాజ్యము సిద్ధించును. పర్ణాహారులకు స్వర్గమగును. నీరుత్రాగి తప మొనర్చినవానికి దివముగల్గెడిని. దాత కధికముగా ద్రవ్యము లభించును. గురుశుశ్రూషచే విద్యయు, శ్రాద్ధసక్తిచే సంతతియు సంభవించును. శాకదీక్షగలవానికి గోవులును, తృణాహారులకు స్వర్గము నగునని తెలుపుదురు. త్రిషవణస్నాన మొనర్చినవానికిఁ జక్కని కాంతలును, వాయుభక్షణముచేఁ బ్రజాపతిలోకమును లభించును. ఎవ్వఁ డిరుసంధ్యలందు

స్నానముచేయుచు జపమొనర్చునో వాఁడు దక్షుఁడగును. మంత్ర
సాధకునకు రాజ్యమును, నిరాహారికి నాకలోకవాసము నగును.
యోగయుక్తుఁడగు తపోధనున కొసర్చిన శయ్యాసనాదిదాన
ములును, నియతాగ్నిప్రవేశమును బ్రహ్మలోకప్రాప్తికి నిమిత్తము
లగుచున్నవి. స్థండిలశాయియై వ్రతమూనినవానికి, గృహశయనాదులు
లభించును. చిరవల్కలవాసోదానముచే వస్త్రాభరణములును, రసాది
దానముచే సౌభాగ్యమును సమకూడును. ఆమిషదానముచే నాయువు
గలసంతానము గలిగెడును. నీటఁ దపమొనర్చినవాఁడు నాకాధిపతి
యగును. సత్యవ్రతముగలవాఁడు దేవతలతోఁగూడి మోదమందు
చుండును. దానముచేఁ గీర్తియగును. అహింసావ్రతముచే నారో
గ్యము సిద్ధించును. బ్రాహ్మణసేవచే రాజ్యప్రాప్తి గల్గును. మఱియు
నట్టివానికి ద్విజత్వమును లభించెడిని. పానీయప్రదానముచే శాశ్వత
కీర్తి గల్గును. అన్నప్రదానముచేఁ గామభోగములు సిద్ధించును. సకల
భూతములకును బ్రియమొనర్చువాఁడు సర్వశోకవిముక్తుఁ డగు
చున్నాఁడు. దేవతలను సేవించునేని, దివ్యమగురూపము రాజ్య
ప్రాప్తియుఁ గలిగెడిని. చీకటిచోటుల దీపములు బెట్టించువానికి
మంచిదృష్టి గల్గుచున్నది. మనోజ్ఞవస్తుప్రదానముచే మేధయు
స్మృతియుఁ గల్గుచున్నవి. గంధమాల్యదానమువలనఁ బరిపూర్ణమగు
కీర్తి సిద్ధించును. దీక్షాపరుఁడై శ్మశ్రుకేశాదులను బెంచుకొన్న వాని
కుత్తమసంతానము గల్గును. ఓపార్థివా! ఉదకవాసమున దీక్షను
త్రిషవణస్నానమును, వరుసగాఁ బండ్రెండువత్సరములు వ్రతముగా
నొనర్చినవారికి, వీరలొందఁదగుస్థానముకంటె నుత్తమస్థాన మగును.
సాలంకృత కన్యాదాన మొనర్చినవానికి దాసీదాసాదులును, నలంకార
ములును, గృహక్షేత్రాదులును సిద్ధించును. క్రతువులు నుపవాస
ములు నొనర్చినవాఁడు స్వర్గము నొందును. ఫలపుష్పదాన మొనర్చిన
వారి కుత్తమజ్ఞానమగును. బంగారు శృంగములుగల గోసహస్రము
నొసంగినవాఁడు పవిత్రమగుస్వర్గలోకమున సుఖించునని దేవతలు
దెలుపుచున్నారు. ఎవ్వఁడు సువర్ణశృంగములును వత్సమును గలిగి,
కాంస్యోపదోహమైన కపిలగోవు నొసంగునో, వాని కాయావే
కోర్కులనెల్లఁ గూర్చు కామధేను వగుచున్నది. గోదాన మొనర్చిన

వాఁడు, గోవునకు రోమము లెన్నియుండునో, యంత కాలమును బుత్రపౌత్రాభివృద్ధిగలిగి, యేడుతరములవారిని సైతముఁ దరింపఁ జేయుచున్నాఁడు. సువర్ణశృంగములును, ద్రవిణోత్తరీయమును, దక్షిణాయుఁగలిగిన కాంస్యోపదోహమగు, తిలగోదానము నొనర్చినవానికి వసువులలోకము సులభముగఁ బ్రాప్తించును. నిజకర్మనిరుద్ధుఁడై తీవ్రాంధకారమగు నరకమునఁ బడనున్న మానవుఁడును, గోదానముచే ననుకూలవాయువుగల యోడ సముద్రమును దాఁటినట్లు దాఁటుచున్నాఁడు. ఉత్తమవిప్రునకెవ్వఁడు కన్యాభూమిదానములఁ జేయునో, విధ్యుక్తముగ నన్నదాన మెవ్వఁ డొనర్చునో, వారు పురందరలోక మొందుచున్నారు. స్వాధ్యాయము సుశీలము మున్నగు సద్గుణములునుగల బ్రాహ్మణునకు శయ్యాది సకలోపస్కారములును గలగృహము నొసంగినవాని కుత్తమలోకములు లభించును. వృషభములు మున్నగుధుర్యముల నొసంగినవాఁడు వసులోకము నొందును. హిరణ్యదానము స్వర్గమొసంగును. ఛత్రదానముచే నుత్తమగృహప్రాప్తియుఁ, బాదుకాదానముచే నుత్తమయానములును లభించును. వస్త్రదానముచే సౌందర్యమును, గంధప్రదానముచే సౌరభ్యమును బ్రాప్తించును. పుష్పములు ఫలములుగల వృక్షములను బ్రాహ్మణునకొసంగినవాఁడు స్త్రీసమృద్ధిని, బహురత్నపూర్ణమగు గృహమును సులభముగ నొందుచున్నాఁడు. భక్ష్యాన్నములను, పానీయరసములను నొసంగినవానికి సకలరసములును సిద్ధించును. గృహవస్త్రాదుల నిచ్చినవాని కవి దప్పక గలుగుచున్నవి. ధూపగంధములను, ననులేపనములను, సుగంధజలస్నానములను, మాల్యములను విప్రులకొసంగినవాని కారోగ్యము గలుగుటయేగాక సురలోకవాసమును సిద్ధించుచున్నది. బీజశూన్యమై శయనములతోఁ గూడియున్న గృహము నెవ్వఁడు బ్రాహ్మణునకొసంగునో, వాఁడు పవిత్రమైనట్టియు, మనోహరమై బహురత్నపూర్ణమైనట్టియు నుత్తమావాసమును బడయుచున్నాఁడు. మఱియు సుగంధచిత్రాస్తరణములును, దలగడలును గలిగినశయనమును దానమొనర్చినవాఁడు, సత్కులప్రసూతయు, మనోజ్ఞయు, సులభలభ్యయునగు భార్యను బడయుచున్నాఁడు. వీరశయనమున శయనించినమానవుఁడు, సర్వాధికుఁడగు పరమేష్ఠికిఁ దుల్యుఁ

డనఁబడుచున్నాఁడు." అని గాంగేయుఁడు తెలిపెనని పలికి వైశంపా యనుఁడు జనమేజయునితో మఱియు ని ట్లనియె.

ఓజనమేజయా! ఆభీష్మునివచనము లాలించి యయ్యుధిష్ఠిరుఁ డెంతయు సంతసిలి, వీరమార్గానుస్మృతమగుమార్గము నభిలషించుటను, నాశ్రమాంతరమున వాంఛపెట్టుకొనక తనతమ్ములతో 'సోదరు లారా! మనపితామహునివచనములు మిక్కిష్టములయ్యెనుగాదే' అని పలికెను. పిదప వారును ద్రౌపదియు, నయ్యుధిష్ఠిరుని వచనము లాలించి, 'అన్నా! నీమాట లెస్సగా నున్నది' అని యాతని గౌరవిం చిరి." అని తెలిపెను.

## దానఫలకథనము

అంత నయ్యుధిష్ఠిరుఁడు భీష్మునిఁగాంచి "తాతా! ఆరామతటా కములవలనఁ గలుగుఫల మెట్టిదో, తెలుప వినఁగోరుచున్నాఁడను" అని ప్రశ్నించెను.

అదివిని భీష్ముఁడు, "ఓధర్మజా! జలముగలిగి, చిత్రధాతుభూషి తమై చూడనొప్పారుచు సకలభూతసమేత మైనభూమి యుత్తమ మైనదని చెప్పఁబడుచున్నది. అట్టి పుడమియందున్న క్షేత్రవిశేషము లను, తటాకాదిబంధనములను, సకలవిధములగు జలప్రదేశములను గ్రమముగాఁ దెలిపెదను. మఱియు బద్ధములగు నాతటాకాదుల గుణముల నెఱిఁగించెదను వినుము. మూఁడులోకములఁగల ప్రాణి కోటికెల్లఁ దటాకవంతుఁడు పూజనీయుఁ డగుచున్నాఁడు. మఱియుఁ దటాకనివేశనము, మిత్రస్థానము, మైత్రీకరము, మిత్రవర్ధనము, కీర్తి కరము, నుత్తమము నగుచున్నది. దానిని ధర్మార్థకామములకు ఫల ముగాఁ బెద్దలు తెలుపుదురు, మంచిప్రదేశమున నేర్పఱచినతటాకము మహాశ్రయమగు నొకక్షేత్రమగుచున్నది. నాలుగువిధములగు భూత ములకును దటాక మాశ్రయ మగుచున్నది. తటాకము లన్నియు నుత్తమలక్ష్మి నొసంగుచున్నవి. దేవమనుష్యగంధర్వులును, పితృ దేవతలును, యక్షరాక్షసులును, స్థావరములు జలాశయము నాశ్ర యించుచున్నవి. కావునఁ దటాకగుణములనెల్లఁ దెలిపెదను. వానికిఁ గలఫలప్రాప్తి మహర్షులచేఁ దెలుపఁబడియెను. ఎవ్వనితటాకమున

వర్ష కాలములో సలిలముండునో, వాని కగ్నిహోత్రఫలమగునని పెద్దలు తెలుపుదురు. ఎవ్వనితటాకమున శరత్కాలమున జలముండునో, వాఁడు మరణించినపిదప గోసహస్రదానఫలము నొందును. అటులే హేమంతకాలమున నెవ్వనితటాకమున నీరుగలిగియుండునో, వాఁడు బహుసువర్ణదక్షిణయజ్ఞఫలము నొందుచున్నాఁడు. శిశిర కాలమున నెవ్వనితటాకమున నుదకముండునో వానికి నగ్నిష్టోమ యజ్ఞఫలమగునని పెద్దలు తెలుపుదురు. లెస్సగాఁ జేయఁబడిన యెవ్వని తటాకము నీరు గలిగియుండునో వాఁ డతిరాత్రయజ్ఞ ఫలమునకుఁ బాత్రుఁ డగుచున్నాఁడు. ఎవ్వనితటాకమున నిదాఘ కాలమునందును బానీయముండునో వాని కశ్వమేధఫలము గలుగు చున్నదని మునులు దెలుపుదురు. ఎవ్వఁడు త్రవ్వించినతటాకమునందలి సలిలమును సజ్జనులగువారు త్రావుదురో, వాఁడు తనకులమునెల్లఁ దరింపఁజేయును. అటులే గోవు లెవ్వనిచెర్వు నీరుద్రావునో వాఁడును కులతారకుఁ డగుచున్నాఁడు. మఱియు నెవ్వని తటాకమున దప్పి గలగోవులు నీరుద్రావునో, మృగములును బక్షులును మానవులును ద్రావుదురో, వాని కశ్వమేధఫలము గలుగుచున్నది. ఎవ్వని తటాకమునందలి జలము స్నానపానముల కుపయుక్తమై విశ్రాంతిని గల్గించునో, యది మృతుఁడయినపిదప వాని కనంత సుఖమునకు నిమిత్తమగుచున్నది. ఎచ్చో విశేషముగా జలము దుర్లభమగునో, యట్టిచోటఁ బానీయదాన మొనర్చినవాని కధిక ప్రీతి యగుచున్నది. తిలలను బానీయము నొసంగుఁడు. దీపదాన మొనర్పుఁడు. మేలుకనుఁడు. జ్ఞాతులతోఁ గూడి సంతసింపుఁడు. మృతి నొందుదురా? ఇట్టివి దుర్లభము. పానీయదానము సకలదానములను మించినదగుటచేఁ దప్పక పానీయదాన మొనర్పఁదగినది. ఓయుధిష్ఠిరా! ఉత్తమమగుతటాకఫలము దెలిపితినిగాదే? ఇఁక నారామము వేయించినవాని కగుఫలము నెఱిఁగించెదను వినుము. స్థావరభూతములు వృక్షములు, గుల్మములు, లతలు, వల్లులు, త్వక్సారములు, తృణములు నని యాఱువిధములుగా నున్నవి. ఇవియెల్ల వృక్షజాతులలోనివి. వానినిఁ బ్రతిష్ఠించినచో నీగుణము లగుచున్నవి. మానుషలోకమునఁ గీర్తియు, మరణించినపిదప శుభఫలమును దోఁటలువేసినవాని కగు

చున్నది. మఱియు నట్టివాఁడు లోకమునఁ బేరువడసి పితృలోక మున మహాత్మఁడగుచున్నాఁడు వాఁడు దేవలోకగతుఁడైనను వానిపేరు నశింపదు. వృక్షారోపణ మొనర్చినవాఁ డతీతానాగతములగు నుభయపితృవంశములను దరింపఁజేయుచున్నాఁడు. కావునఁ దోఁటలను నాఁటవలయును. అవి వానికిఁ బుత్త్రులై ఫలించును, సందియము లేదు. వాఁడు మృతుఁడై స్వర్గమును, నవ్యయలోకములను బొందుచున్నాఁడు. వృక్షములు, పుష్పములచే దేవగణములను, ఫలములచేఁ బితృగణములను, నీడలచే నతిథులను సంతసింపఁ జేయును. కిన్నరులు, నురగులు, రక్షస్సులు, దేవగంధర్వమానవులును, మహర్షిగణములును, మహీరుహముల నాశ్రయించుచున్నారు. వృక్షములు పుష్పఫలయుక్తములై మానవులఁ దృప్తినొందించుచున్నవి. ఆరామకర్త కావృక్షములు పుత్త్రులై పరలోకమునఁ దోడ్పడుచున్నవి. కావున శ్రేయముఁ గోరువాఁడు, తటాకసమీపమునఁ దోఁటలు వేయింపవలయును. ఆవృక్షములను పుత్త్రుల నట్టులు గాపాడవలయును. అయ్యవి ధర్మమునుబట్టి పుత్త్రులై వెలయుచున్నవి. తటాకకర్తయు, నారామారోపకుఁడును, యాగకర్తయును, సత్యవాదియును స్వర్గమునొందుచున్నారు. కావునఁ దటాకమును ద్రవ్వింపవలయును. ఆరామము నారోపింపవలయును. వివిధములగుయాగము లొనర్పవలయును. సత్యము పలుకవలయును." అని తెలుప విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె.

## దానఫలప్రశ్నము

ఓపితామహా! బహిర్వేదికయం దేమేమి దానములు దెలుపఁబడుచున్నవో, వానిని మించినదాన మేదేనిఁ గలదా? అది నాకెఱిఁగింపుము. అది విన నాకుఁ బరమకౌతుకమయ్యెడిని. దత్తమగు నేదానము దాతను జేరునో, దానిని నాకెఱిఁగింపుము.

అదివిని భీష్ముఁడు, 'ఓయుధిష్ఠిరా! సకలభూతాభయప్రదానమును, వ్యసనపరుల ననుగ్రహించుటయు, దప్పిగలవానికి వలయుదాని నొసంగుటయు, నుత్తమమని తెలుపుదురు. అట్టిదానము దాత ననుసరించుచున్నది. హిరణ్య భూ గోదానములు మిగులఁ బవిత్రము

లైనవై దుష్కృతమునుండి మానవుని దరింపఁజేయుచున్నవి. ఓ పురుషవ్యాఘ్రా! నా యీ తెలిపిన దానములు నిత్యము సజ్జనుల కొనర్పవలయును. ఈదానములు పాపములనుండి మానవుని దొలఁగించుచున్న వనుటలో సందియము లేదు. లోకమున మానవునకు గృహమున నెయ్యది యిష్టమగునదియుఁ బ్రియమగునదియు నుండునో, దానిని గుణవంతుఁడగువాని కొసంగవలయును. అది, యక్షయపుణ్యఫలప్రదమగును. ప్రియము నిచ్చువాఁడును, బ్రియముచేయువాఁడును, సర్వభూతప్రియుఁడై నిత్యమును బ్రియ మొందుచున్నాఁడు. ఓయుధిష్ఠిరా! దగ్గఱకువచ్చి యాచించువానిని, నాసపడియున్న యకించనుని, యథాశక్తిగా నెవ్వఁ డర్చింపఁడో, వానిని గ్రూరుఁడని తెలుపుదురు. శత్రువైనను, దీనుఁడై శరణుపొందెనేని వ్యసనియైన యాతనిననుగ్రహించువాఁడు పురుషోత్తముఁ డనఁబడుచున్నాఁడు. కృశుఁడును, గృతవిద్యుఁడును, వృత్తిహీనుఁడును నై దురవస్థ నొందియున్న వాని యాఁకలి నెవ్వఁడు తీర్చునో, వానికిఁ దుల్యుఁడగువాఁడు లేఁడు. క్రియానియమముగలవారును, బుత్రదారపీడితులును నైయుండియు నొకరి యాచింపకయుండుసజ్జనులను దానాదులలో నిమంత్రింపవలయును. ఎవ్వరు దేవతలను మానవులను యాచింపక నిత్యసంతుష్టులై యేది లభించిన దానితోఁ గాలము గడపికొనెదరో, యాశీవిషసములగువారినుండి రక్షించుకొనవలయును. అట్టివారిని రావించి, యుక్తములగుభోగముల వారి కొసఁగి తృప్తినొందింపుము; రక్షింపుము. వారికి సకలభూతసుఖావహములై ప్రేష్యపరిచ్ఛదాదులతోఁ గూడిన గృహముల నొసఁగి యాదరింపుము. విద్యాస్నాతులును వ్రతస్నాతులును నై ధర్మము నాశ్రయించి జీవించుచు, గూఢస్వాధ్యాయతపోనిష్ఠగలిగి ప్రవర్తించు బ్రాహ్మణులు సంశితవ్రతులగుచున్నారు. స్వదారనిరతులును సంశుద్ధులును దాంతులు నగువారియెడ నొనర్చినసత్కారమే నీకు లోకమునఁ గళ్యాణదాయకమయ్యెడిని. కృతాత్ముఁడై పండితుల కొసంగినదానముచే, సాయంప్రాతఃకాలములయందు ద్విజుఁ డొనర్చినయగ్నికృత్యమునకుఁ గలఫలము గలిగెడిని. ఓయుధిష్ఠిరా! సదక్షిణముగా నొనర్పఁబడినదానము సకలయజ్ఞములను మించినదగుచున్నది. నివాపదానము తగినయుత్తముల కొనర్చినదానమును

బోలును. అట్టి పితృతర్పణముచేఁ బితరులఋణము నీఁగుచున్నాఁడు. ఎవ్వఁరు కోపరహితులై లోభములేక దేనినైనఁ దృణముగా భావింతురో, యట్టివారును, ప్రియవాదులును, నాకుఁ బ్రియతములగుచున్నారు. ఎవ్వఁరు ధనికులగువారిని బహూకరింపరో, యెవ్వఁరు యాచింపరో యట్టివారు పుత్త్రులట్లు పాలింపఁదగుదురు. వారికభయ మొసంగవలయును. అట్టివారికి నమస్కారము. మృదుధర్మపరులగు ఋత్విక్పురోహితాచార్యులు పూజ్యులు. ద్విజునెడ క్షాత్త్రతేజము శాంతివహించునుగాని పనిచేయఁజాలదు. ఓయుధిష్ఠిరా! నేను రాజననియుఁ, గలవాఁడననియు, బలశాలిననియు, గర్వించి బ్రాహ్మణులకు నన్నవస్త్రము లొసంగునెడ విపర్యాసమొనర్పకుము. నిజధర్మానుష్ఠానపరుఁడవగునీకు సౌభాగ్యము బలాఢ్యమునగుచు వెలయు విత్తమెయ్యదియో, దానిచే బ్రాహ్మణులను బూజింపుము. నమస్కార్యులగువిప్రులు గౌరవింపఁబడుదురేని, నిన్నుఁ బుత్త్రునట్టులు, యథోత్సాహముగను, యథాసుఖముగను బ్రేమింతురు. అక్షయప్రసాదులును, సహృదయులును. నల్పసంతుష్టులునగు విప్రులకుఁ దగుజీవనాధారము గల్పింప నీకంటె నర్హుఁ డెవ్వఁడు? ఓపురుషసత్తమా! లోకమున స్త్రీలకు సంతానము నాశ్రయించిన ధర్మ మెట్టిది సనాతనధర్మమో, యటులే క్షత్త్రియులమగు మనకు బ్రాహ్మణులే ధర్మగతిహేతువులగుచున్నారు. వారికంటె మనకు వేఱొకగతిలేదు. ఓనాయనా! బ్రాహ్మణులు పూజితులు గాకుందురేని, క్షత్త్రియుఁడు దారుణకృత్యుఁడని తలంచి, వా రాతనిఁ బరిత్యజింతురు. అటులు వారు పరిత్యజింతురేని, వేదములు యాగములు కీర్తియు లేకపోవలసివచ్చును. అట్టిపట్టున క్షత్త్రియులు జీవించిన ప్రయోజనములేదు అదియెల్ల బ్రాహ్మణాధీనమై యున్నది. నీకు సనాతనధర్మ మెఱిఁగించెదను. 'పూర్వము రాజన్యుఁడు బ్రాహ్మణులను బరిచరించెను. ఆరాజన్యుని వైశ్యుఁడు సేవించెను. ఆవైశ్యుని శూద్రుఁడు సేవించెను.' అని వేదములందున్నది. అగ్నివలెఁ బ్రజ్వరిల్లునట్టిబ్రాహ్మణుని దూరమునుండియే శూద్రుఁడు సేవింపవలెను. క్షత్త్రియుఁడును వైశ్యుఁడును బ్రాహ్మణుని ముట్టికొని సేవింపవచ్చును. మృదుభావులును, సత్యశీలురును, సత్యధర్మానుపాలకులునై కుపితములగుసర్పములఁ బోలిన బ్రాహ్మణులను సేవింపుఁడు.

మహాధికులై ప్రతాపవంతులగుచుఁ దేజోబలములచే నెన్నఁదగు క్షత్రియుల తేజస్తపములు, బ్రాహ్మణులయెడ శాంతించుచున్నవి. ఓయుధిష్ఠిరా! నాకుఁ దండ్రియుఁ బ్రియుఁడుగాఁడు; నీవును నాకుఁ బ్రియుఁడవు గావు; అటులే పితామహుఁడును బ్రియుఁడుగాఁడు; మఱియు నాయాత్మయు జీవితమును బ్రియములు గానేరవు. ఓయీ! ఇప్పుడమిని నిన్నుమించిన ప్రియతముఁడు లేఁడుగదా! బ్రాహ్మణులు నాకు నీకంటెను బ్రియతములని తెలియుము. నాయీవచనము సత్యమని నమ్ముము. నే నీసత్యముచేతనే నాతండ్రిలోకముల నొందెదను మఱియు నే నీసత్యముచేతనే బ్రహ్మపురస్కృతములగు సజ్జనుల లోకములను గనుఁగొనఁగల్గి యందుల కచిరకాలమున వడిగాఁ బోవుదును. అట్టియుత్తమలోకములను గనిపెట్టియే బ్రాహ్మణారాధన మొనర్చితిని. తన్నిమిత్తమున, నాకించుకేనిఁ బరితాపము లేదు." అని తెలుప విని యుధిష్ఠిరుఁ డిట్లనియె.

"ఓపితామహా! ఎవ్వరు సత్కర్మాచరణపరులై విద్యాజన్మములచేఁ దుల్యులై యుండియు, నొకఁడు యాచించును; వేఱొకఁడు యాచింపకుండును. అట్టి యిరువురలో నెవ్వఁడు దానపరిగ్రహమున విశిష్టుఁడగునో తెలుపుము."

అది విని భీష్ముఁడు, "ఓయుధిష్ఠిరా! వారిలో యాచించినవానికంటె యాచింపనివానికే దానముచేయుట శ్రేయమని పెద్దలు దెలుపుదురు. ధైర్యహీనుఁడగు కృపణునికంటె, ధైర్యవంతుఁడే దానపాత్రుఁడు. క్షత్రియుఁడు రక్షణధృతియు, బ్రాహ్మణుఁడు యాచనాధృతియు నై యుండవలయును. వివేకశాలియై యాచ్ఞాధైర్యముగల బ్రాహ్మణుఁడు దేవతలకునైతముఁ బ్రీతిగలిగించుచున్నాఁడు. ద్విజుఁడు తుష్టిగలిగియుండవలయును. దరిద్రునియాచ్ఞా కర్మమును దిరస్కారముగాఁ దెలుపుదురు. యాచనసేయు భూతములు దొంగలట్లు లోకమున కుద్వేగము గలిగించును. యాచకుఁడు మృతతుల్యుఁడగుచున్నాఁడు. దాత కెన్నఁడును మరణము లేదు. మఱియును దాత దన్నుగు యాచకుని జీవింపఁజేయుచున్నాఁడు. యాచించినవానికి దానముచేయుట భూతదయారూపమగు పరమధర్మమగుచున్నది. యాచింపక కృశించుచున్న వారి నెల్లయుపాయములచే నుద్ధరింపవలయును. యాచనసేయని

ద్విజోత్తములు రాష్ట్రమున నివసించియుండవచ్చును. నిపుణులగప్పిన నిష్ఫలునగు వారిని బహుప్రయత్నములచేనైనఁ దెలిసికొనవలయును. తపోదీప్తులగు నట్టియుత్తములు లోకమును దహింతురు. ఓయుధిష్ఠిరా! పూజార్హులగునట్టివారు పూజితులు గాకుండు రేని వానిని వాటిల్లెడును. జ్ఞానవిజ్ఞానతపోయోగ సమన్వితులగు బ్రాహ్మణులు పూజ్యులు; కావున నట్టిబ్రాహ్మణులఁ దప్పక పూజింపవలయును. యాచింపనివారిని సమీపించి, వారికి బహువిధములగు దానములు సేయుట యుత్తమము. సాయంప్రాతఃకాలముల నగ్నిహోత్తమున లెస్సగా హోమమొనర్చిన నెట్టిఫలమగునో, యట్టిఫలము వేదవిద్యావ్రతుఁడగువానికి దానముచేసిన నగునని తెలియవలయును. ఓకౌంతేయా! ఒకరి నాశ్రయింపక వేదవిద్యావ్రతస్నాతులై రహస్యముగాఁ దపమొనర్చికొనుచు, సంశితవ్రతులై ప్రవర్తించుబ్రాహ్మణోత్తములకు ప్రేష్యులు పరిచ్ఛదములు మున్నగువానితోఁగూడి మనోజ్ఞములైన గృహములను మఱియుఁగల కోర్కులను సమకూర్చి వారి నాదరింపవలయును. ధర్మజ్ఞులును సూక్ష్మదర్శనులునగు, వా రట్టిశ్రద్ధాయుక్తమగుదానిని బరిగ్రహించుట యుక్తమని తలంచి స్వీకరింతురు. మఱియు నెవ్వరిభార్యలు, కర్షకులు మేఘములకుఁ బోలె నెవ్వరికై కనిపెట్టుచు నిండ్లకడనుందురో, యట్టి తమగృహములకు వారు భుజించి పోవుదురు. నియతులై బ్రహ్మచారులగు బ్రాహ్మణు లెవ్వనియింటఁ బ్రాతస్సవనమున భుజింతురో, వానియింటఁ ద్రేతాగ్నులును బ్రీతి నొందును. వారు మధ్యందినసవనమున భుజింతు రేని యందులకును, వారికొసఁగిన గోహిరణ్య వస్త్రములకును నింద్రుఁడు ప్రీతుఁడగుచున్నాఁడు. తృతీయసవనమున నటులొనర్చుట విశ్వేదేవులు ప్రీతులగుదురు. కావున దేవతలకును, పితృదేవతలకును, బ్రాహ్మణులకును దృప్తిగలిగింపవలయును. సర్వభూతాహింసయు, దమము, త్యాగము, ధృతియు, సత్యము, నవభృథఫలము నొసంగును. ఇట్టి యజ్ఞమును శ్రద్ధగలిగి సదక్షిణముగా నొనర్తు వేని యదియే సకలయజ్ఞములలో నుత్తమమైనది,” అని తెలుప విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె,

బ్రాహ్మణాది ప్రజారక్షణకథనము

"ఓతాతా! దాన మెట్టివానికిఁ జేయవలయును? యజ్ఞక్రియ యెటు లొనర్పవలయును? కర్త మృతుఁడైనపిదప నేది మహాఫల మొసంగును? దేనిఫల మధికమని తెలుపుదుగు? ఎపుడు దానము చేయవలయును? దీనిని యథార్థముగా నెఱిఁగింప వినఁగోరుచున్నాఁడను. దానధర్మములవిధమును వివరింపుము. మఱియు శ్రద్ధాభక్తులతో నంతర్వేదియం దొనర్చినదాన మెట్టిశ్రేయ మొసంగునో తెలుపుము."

అది విని భీష్ముఁడు, "ఓయుధిష్ఠిరా! క్షత్రియునికృత్య మెపుడు నెంతయు రౌద్రమై యుండును. కావున వానికి యజ్ఞక్రియయు దానమును బావనత్వముఁ గలిగించుటకై యాచరింపఁదగినవి. యజ్ఞము చేయక వారు కేవలదానముచేఁ బావనులు కాఁజాలరు. సత్యప్రదాతలయ్యుఁ బాపకర్తలగురాజులనుండి, సాధువులును యాజకులు నగు బ్రాహ్మణోత్తములు ధనమును బరిగ్రహింపరు. అటులు వారు ధనపరిగ్రహముసేయకుండుటను రాజు యజ్ఞములుచేసి దక్షిణలవలన వారు ధనమును గ్రహించునట్లు చేయవలయును. వారు పరిగ్రహింతురేనిఁ బ్రతిదినమును బరమశ్రద్ధతో రాజు దానములు సేయుచుండవలయును. దానిచే నతఁడు పవిత్రుఁడగుచున్నాఁడు. తపోనిష్ఠులును సుశీలవృత్తసంపన్నులును వేదవేత్తలును సాధువులును మైత్రిగల వారునగు బ్రాహ్మణులను ద్రవ్యదానముచేఁ దృప్తినొందించుటయే శుభప్రదమగుయాగ మనఁబడుచున్నది. వారు పరిగ్రహింపరేని నీకు సుకృతము గలుగనేరదు. కావున సజ్జనుల కుపయుక్తముగా మధురాన్నములును దక్షిణలును గలయజ్ఞము లొనర్పుము. యజ్ఞాదికము దానమున నంతర్భూతమగుచున్నది. కావున నీకు యజ్ఞఫలభాగము సిద్ధించునట్లుగా, యాగకర్తలను బూజించి దానముచే సత్కరింపుము. సంతానవంతులై స్వర్గప్రదులైనబ్రాహ్మణులను బోషింపుము. అటులు వారినిఁ బూజించువాఁడు బ్రహ్మవలెఁ బ్రజాసమృద్ధిగలిగియుండును. పండితులగు నెవ్వరు లెస్సగా ధర్మములనెల్ల నుద్ధరింతురో, యట్టి బహూపకారులగు, వారిని సర్వధనములతోడను సంరక్షింపుము. ఓయుధిష్ఠిరా! సర్వసమృద్ధిగలనీవు బ్రాహ్మణులకు ధేనువులను వృషభ

మును, నన్నములను, వస్త్రములను, ఛత్రోపానహాదులను నొసంగుము. యాగములు చేయువారికి వలయునన్నములను నాజ్యములను సమర్పింపుము. మఱియు వారికి గుఱ్ఱపుబండ్లను, గృహములను, శయనములను సమృద్ధిగలవారొసంగవలయును. ఇవి లఘూపాయములు. వృత్తిహీనులై రక్షణలేని బ్రాహ్మణులను దెలిసికొని, వారికి రహస్యముగనో సువ్యక్తముగనో వృత్తినిగూర్చి పోషింపవలయును. అయ్యది క్షత్రియులకు రాజసూయాశ్వమేధములకంటెను శ్రేయస్కరము. ఇటులేని నీవు సర్వపాపవినిర్ముక్తుడవై స్వర్గము నొందెదవు. మరల నీవు కోశమును సంపాదించికొని రాజ్యమును బాలించుకొనవచ్చును. ఓధర్మజా! అటులేని నీకు బ్రహ్మభూయత్వము ధనములును లభించెడిని. ఓయీ! నీవు నీయొక్కయు నితరులయొక్కయు వృత్తిని సంరక్షింపుము. మఱియు నీభృత్యులను, బ్రజలను నీసంతానమట్టులు గాపాడుము. నీకు నిత్యమును బ్రాహ్మణులయందే యోగక్షేమములు గావలయును. నీజీవితమును వారికి వినియోగింపవలయు. వారిరక్షణమునెడః బ్రమాదపడవలదు. బ్రాహ్మణున కధికవిత్తసంచయము మిక్కిలి యనర్థకారి. బ్రాహ్మణుఁడు సిరిగలిగియుండునేని దర్పముగలిగి మూఢుఁడగును. అటులు బ్రాహ్మణులు మూఢులగుదురేని దప్పక ధర్మము నశించును. ధర్మము నశించెనేని, నిస్సంశయముగా భూతములనాశమగును. ఎవ్వఁడు సంగ్రహపరులకు ధనమిచ్చి యజ్ఞమునకుఁ గావలయునని రాష్ట్రమునుండి ధనమును స్వీకరించునో, యట్టిరాజు రాజ్యము నశించుచున్నది. తనయాజ్ఞకు జడిసి ప్రజ లీయఁగాఁ దెచ్చిన దారుణమగు ధనముచే నొనర్చినయజ్ఞమును సజ్జనులు మెచ్చరు. ఎవ్వరు సమృద్ధులై తమ కది పీడయనక యనుకూలముగా ధనమొసంగుదురో యట్టిధనముచే రాజు యాగము చేయవలయునుగాని, ప్రయత్నముగాఁ దెచ్చిన ధనముచేఁ జేయరాదు. ఎపుడు రాజు ప్రజలవలన హితముగా ధనముఁ బడయుట కవకాశముండునో, యపుడే యథావిధిగా బహుదక్షిణలుగలయాగము లొనర్పవలయును. మఱియు రాజు, వృద్ధులయు, నంధులయు, బాలురయుఁ, గృపణులయు ధనము రక్షింపవలెను. ఒకరు పాతిపెట్టికొనినధనమును దనస్వాధీన మొనర్చుకొనరాదు. ఏడ్చుచున్నయాఁడుదాని ధనము దీసికొనఁగూడదు. కృపణావృత్తి

యొనర్చునేని ధనలక్ష్మియు రాష్ట్రమును జెడుచున్నవి. సజ్జనులకు గొప్పభోగముల నొసఁగి వారికి క్షుద్బాధ లేకుండఁ జేయవలయును. ఎవ్వరి స్వాదువులగు భోజ్యములను బాలకులు చూచియుఁ దినఁ జాలకుండుదురో, యట్టివస్తువులుగలవారి కంతకంటె వేఱొకపాపము లేదు. నీరాజ్యమున బ్రాహ్మణుఁ డాఁకలిచేఁ బీడితుఁడగునేని గొప్పపాపమొనర్చినవాఁడ వగుటయెగాక భ్రూణహత్యాఫలము నొందఁగలుగుచున్నాఁడవు. ఎవ్వనిరాష్ట్రమున బ్రాహ్మణుఁడుగాని, మఱియొకఁడుగాని యాఁకలిచేఁ బీడితుఁడగుచుండునో, వానిజీవితముచేఁ బ్రయోజనము లేదని శిబి చెప్పియున్నవాఁడు. ఏరాజు రాష్ట్రమున స్నాతకవ్రతనిష్ఠుఁ డాఁకలిచేఁ బీడితుఁడగునో, యాభూపతియు వానిరాష్ట్రమును వృద్ధి నొందఁజాలవు. ఎవ్వనిరాష్ట్రమునఁ దమపతిపుత్త్రాదు లేడ్చుచుండఁగా, నేడ్చుచున్న కాంతలు బలాత్కారముగా నొరులచే నపహరింపఁబడుదురో, యట్టివాఁడు జీవించియు మృతుఁ డనఁబడుచున్నాఁడు. రక్షణ మొనర్పకుండుటయెగాక, హర్తయు, ధనవిలోప్తయు నై పాలింపక దయావిహీనమై యున్న రాజకులమును బ్రజలు ప్రయత్నించి చంపకమానరు. ఏభూపతి తాను రక్షకుఁడ నని చెప్పియు రక్షింపఁడో, యట్టివానిని బ్రజ లేకీభవించి, పిచ్చిపట్టి, రోగపీడితమైన కుక్కనువలెఁ జంపవలయును. రాజరక్షణము లేకుండుటను బ్రజలు పాపమొనర్తురేని, వారిపాపమున నాలవపాలాభూపాలున కగుచున్నది. ఆపాపమంతయు రాజునకే యగునని కొందఱును, సగమగునని కొందఱును దెలుపుదురు. మనువుచెప్పినవిధముగా నాలవపాలే యగునని నాయభిప్రాయము. రాజుచేఁ బ్రజలు లెస్సగా రక్షింపఁబడి సుకృతమొనర్తురేని, యందును నాలవపాలాధరాపాలున కగుచున్నది. ఓయుధిష్ఠిరా! జీవించుచున్న నిన్ననుసరించి ప్రజలు జీవింపవలయును. భూతకోటి పర్జన్యునట్టులును, పక్షులు చెట్టునట్టులును, రక్షస్సులు కుబేరునట్టులును, దేవత లింద్రునట్టులును, జ్ఞాతులును మిత్త్రులును నిన్ననుసరించి జీవింపవలయును." అని తెలుప విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె.

## భూమిదానప్రశంస

"ఓపితామహా! ఇదియొసంగవలయును, నది యొసంగవలయు నని వేదము తెలుపుచున్నది. రాజులు పెక్కుగా నొసంగవలసియున్నది గదా! సర్వోత్తమమగు దాన మెయ్యది?"

అది విని గాంగేయుఁ డాపాండవేయునితో "ఓధర్మజా! భూదాన మన్నిదానములను మించినదానమని చెప్పఁబడుచున్నది. భూమి నశింపక స్థిరమై యుత్తమకాముల నెల్ల నొసంగునది. అయ్యది వస్త్రములను, రత్నములను, పశువులను, వ్రీహియవాదులను సమకూర్చునది. సకలభూతములందును భూదాత పెక్కేండ్లు వృద్ధినొందుచున్నాఁడు. భూదాత భూమియున్నంతకాలమును బేరుగలిగియుండును. ఓయుధిష్ఠిరా! భూదానమును మించినదానము లేదు. అందఱును బుడమిని గొంచెమే నిచ్చియున్నవారని నావినికి. మఱియు నందఱును నీభూమినే యిచ్చిరి. దానినే ప్రజ లనుభవించుచున్నారు. మానవులు తమకర్మము ననుసరించియే యిహపరములందు సుఖముగా నుండఁ గలుగుచున్నారు. భూమహాదేవి, భూదాతను ప్రియపతినిగా నొనర్చునది. ఓభరతసత్తమా! భూమి నెవ్వఁ డక్షయమగుదక్షిణగా నొసంగునో, వాఁడు మఱియు మానవత్వ మొందునపుడు రాజగుచున్నాఁడు. దాన మెట్టిదియో, భోగము నట్టిదే యని నాధర్మనిశ్చయము. యుద్ధమున శరీరము నేని విడువవలయును. భూదానమేనిఁ జేయవలయును. ఇవియే క్షత్రియునకుఁ బరమలక్ష్మి నొసంగునవి. భూమి దాతను బవిత్రునిఁ జేయుచున్నదని వినికి. భూమి నిచ్చినవాఁ డెట్టిపాపసమాచారుఁ డయ్యెను, బ్రహ్మఘ్నుఁ డయ్యెను, ననృతవాదియయ్యెను, నాభూమియే వానిని బవిత్రునిఁగాఁ జేసి పాపమునుండి విముక్తునిఁ గావించుచున్నది. రాజులు పాపకర్తలైనను, వారినుండి సజ్జనులు భూమినిమాత్రము ప్రతిగ్రహింతురు. పవిత్రమైనదగుట దానినిదప్ప వేఱొకదానిని వారు పరిగ్రహింపరు. భూదేవికిఁ బ్రియదత్త యని పేరుగలదు. అటులగుట భూమిని దానముగాఁగాని, మఱియొక విధముగఁగాని దానము చేసినవాఁడు దానికిఁ బ్రియుఁడగుచున్నాఁడు పృథివీపతి పండితుఁడగువానికిఁ బుడమి నొసంగవలయును. అది పుడమి నొక

యాగమగుచున్నది. దీనినుండియే రాజ్యము నొందును. మఱియు నతఁడు పునర్జన్మమునందును రాజగును. సంశయము లేదు. అటు లగుట, రాజు దానిని బొందియు బ్రాహ్మణున కీయకుండుట యుక్తము గాదు. భూమిపతిగానివాఁడు భూమి కధిష్ఠాతయై యుండరాదు. దానమిచ్చినను దాని నపాత్రుఁడు గ్రహింపరాదు. కొందఱు భూమిని గోరవచ్చును. వారికిఁ గొందఱు దానమిత్తురు. కాని యెవ్వఁడు సజ్జనునిభూమినిఁ బరిగ్రహించునో, వానికి మఱి భూమి గలుగదు. ఎవఁడు సజ్జనులకు భూమి నొసంగునో, వాఁడుత్తమ మగు భూమినిఁ బొందుచున్నాఁడు. అట్టిధర్మాత్ముఁ డిహపరములం దుఁ గీర్తిని బడయును. బ్రాహ్మణులు, సజ్జనుఁడగు నెవ్వని భూమిని బ్రశంసింతురో, యట్టివాని శత్రువు లాతనిపుడమి యుంబుసుపట్టఁ జాలరు. మానవుఁడు జీవికకై కొంచెమేని పాపమొనర్చియు, గోచర్మ మాత్రమేని భూమిని దానముచేసెనేని పవిత్రుఁడగుచున్నాఁడు. సం కీర్ణకర్ములై రౌద్రకృత్యము లొనర్చురాజులను బవిత్రులఁజేయుటలో నీభూమిదానముత్తమదానమగుచున్నది. అశ్వమేధకర్తకును భూదాత కును నల్పమగుభేదము గలదని పెద్దలు తలంచుచున్నారు. సుకృత మొనర్చినపండితులే నిందులకు శంకింపరాదు. నిజముగా నీభూమిదాన మొకటియే సర్వోత్తమదాన మనఁబడుచున్నది. భూదాతకు సువర్ణ రజతవస్త్రమణిముక్తాధనాదు లొసంగినవాని కగుఫలమెల్లఁ గలుగు చున్నది. తపము, యజ్ఞము, శ్రుతము, శీలము, లోభరాహిత్యము, సత్యము, గురుదైవతపూజయును భూదాతయందున్నవని తెలియవల యును. తమస్వామిశ్రేయమునకై రణరంగమునఁ బరిత్యక్తశరీరులై హతులై సిద్ధినొందిన బ్రహ్మలోకగతులును భూదాతకంటె నధికులు కాఁజాలరు. తల్లి తనపాలచేఁ బుత్రు నెట్లు పోషించునో, యట్లే భూదాత నాభూమి సర్వరసము లొసఁగి సంరక్షించుచున్నది. మృత్యువు, కింకరుఁడు, యమదండము, చీకటియు, వహ్నియు, ఘోరములు దారుణములునగు పాశములును, భూదాతను సమీపింపఁజాలవు. పితృలోకమందుఁ గలపితరులను, దేవలోకమునఁ గల దేవతలను, భూదానమొనర్చిన శాంతాత్ముఁడు తృప్తినొందించు చున్నాఁడు. వృత్తిరహితుఁడై పరితపించుచుఁ, గృశించి మరణింపనున్న

వానికి భూమిని జీవనాధారముగా నిచ్చినమానవుఁడు యాగఫలము నందుచున్నాఁడు. ఓమహాభాగా! ప్రేమగలగోవు పాలు స్రవింప వత్సమునకై యెట్లు పరువిడునో, యటులే భూమియు, భూదాతను బ్రేమించుచుండును. నాఁగటిచే దున్ని విత్తులు చల్లి ఫలయుక్తమై యున్నభూమిని; గొప్పగృహమును దానముచేసినవాఁడు, కామప్రదుఁడగుచున్నాఁడు. ఆహితాగ్నియు, వృత్తసంపన్నుఁడును, శుచివ్రతుఁడు నగుబ్రాహ్మణునకు భూమి నిచ్చినవాని కెన్నఁడును నాపద గలుగనేరదు. చంద్రునకుఁ బ్రతిదినము వృద్ధి యెట్లు గలుగుచుండునో, యటులే భూదానకర్తప్రతిసస్యమందును వృద్ధిగలుగుచునే యుండును. ఈవిషయమునఁ బ్రాచీనులు, భూమిగీతలగుగాథలను దెలుపుచున్నారు. వానిని వినియే జామదగ్న్యుఁడు కాశ్యపునకు భూమినెల్ల నొసంగెను. 'నన్నే ప్రతిగ్రహింపుఁడు. నన్ను దానముసేయుఁడు. నన్నొసఁగుదురేని మరల నన్నుఁ బొందుదురు. దత్తమగుదాని కిహపరములందు ఫలమగుచున్నది' అను వేదసమ్మితమగు నీభూదేవివచనము నెవ్వఁడు, శ్రాద్ధముచేయునపుడు తెలిసికొనుచున్నాఁడో, యట్టివానికధికఫలమగుచున్నది. ఈభూదానము మంత్రశక్తులవలనఁ గలుగునరిష్టమును శమింపఁజేయు గొప్పప్రాయశ్చిత్తము. భూదానముచేసినవాఁడు పితృమాతృవర్గములఁ బదింటిని బవిత్రముగఁ జేయును. సకలభూతప్రకృతియగు నీభూమి స్థిరమైనది. రాజున కభిషేకమొనర్చి యీవేదవాదమును వినిపింపవలయును. దీనిని విని యతఁడు భూమి నొసంగుటయు, సజ్జనునుండి దానిని దీసికొనకుండుటయు జరపును. బ్రాహ్మణకార్యమగు నిదియెల్ల రాజు నర్థమనుటలో సందియము లేదు. ధర్మకుశలుఁడగురాజు ప్రథమైశ్వర్య లక్షణమగుచున్నాఁడు. ఎవ్వరికి రాజగువాఁడు ధర్మజ్ఞుఁడుగాక నాస్తికుఁడగునో, వారు సుఖముగా నిద్రింపలేరు. వారికి సుఖముగా నిద్రపట్టదు. మఱియు వానిదుశ్చరిత్రములచే వారు సర్వకాలములందు జడియుచునే యుందురు. అట్టిభూపతిరాష్ట్రమునకు యోగక్షేమములును గలుగవు. అటులుగాక యెవ్వరియేలిక ధార్మికుఁడును బ్రాజ్ఞుఁడునై యుండునో, వారికి సుఖనిద్రయు, సుఖప్రబోధమును గలుగుచున్నవి. అట్టివాని పూజ్యములును శుభప్రదములు నగుకృత్యములచేఁ దత్ప్రజలు సుఖితులగుచున్నారు. మఱియు

నాతని రాష్ట్రమువారు యోగక్షేమములును వర్షమును గలిగి నిజ కర్మములు వెలయ వృద్ధినొందుదురు. ఎవఁడు భూమిని దానము సేయునో, వాఁడే కులీనుఁడును, సద్బంధువును, సత్పురుషుఁడును, బుణ్యకర్తయు, దాతయు, విక్రమశాలియు ననఁదగుచున్నాఁడు. ఎవఁడు వేదవేత్తయగు బ్రాహ్మణునకు మంచిభూమి నొసంగునో, యట్టివాఁడు తేజముచే నాదిత్యునట్టు లు వెలయుచుండును. పుడమిని సస్యము లెట్లు ప్రకీర్ణములై మొలచునో, యటులే భూదాతకుఁ, దద్దాన సమార్జితములై కోర్కులు ఫలించును. వరుణాదిత్యులును, బ్రహ్మవిష్ణువులును, సోమాగ్నులును, భగవానుఁడగు శూలపాణియు, భూదాత నభినందించుచున్నారు. మానవులు భూమియందే జనించుచున్నారు. అందే వారు స్థితినొందుచున్నారు. చతుర్విధమగు నీలోకమును భూమిగుణాత్మకముగా దే! ఓయీ! ప్రపంచమున కీభూదేవియే తల్లియుఁ దండ్రియు నై యున్నయది. ఓజనాధిపా! దీనితో సరియగు మఱియొక భూత మే లేదు.

ఓయుధిష్ఠిరా! ఇందుల కొకపురాతనేతిహాసము గలదు. అయ్యది బృహస్పతికి నింద్రునకు జరగినసంవాదము. దాని నెఱిఁగించెదను. వినుము. ఇంద్రుఁడు దక్షిణలుగల గొప్పనూఱుయజ్ఞములు చేసి, పిదప బృహస్పతితోఁ దనవాక్కౌశల్య మేర్పడునట్లుగా 'ఓభగవానుఁడా! ఏదానముచే స్వర్గసుఖము గలిగెడిని? ఎయ్యది యక్షయమై గొప్ప సుఖము నొసంగును? తెలుపుము.' అని ప్రశ్నించెను. ఓధర్మజా! అది విని యాబృహస్పతి, యా దేవపతినిఁ గాంచి 'ఓయీ! సువర్ణదానము, గోదానభూదానములును నెవఁడు చేయునో, వాఁడు సకలపాపముల నుండి విముక్తుఁడగుచున్నాఁడు. ఓయింద్రా! భూమిదానమును మించినదానము వేఱొకటి లేదు. పెద్ద లటులు దెలుపుట, నదియే యుత్తమమైనదని నేను దలంచెదను. ఎవ్వరు శూరులై రణాభిలాష మున వెడలి యుద్ధమునఁ జచ్చి స్వర్గమునొందుదురో, వారికంటెను భూదాత, యధికుఁ డనఁదగును. మఱియు స్వామిభక్తులై రణరంగమున మడిసి శరీరము విడిచి బ్రహ్మలోకగతులైనవారును భూదాత నతిక్రమింపఁజాలరు. భూదాత తనకుఁ బూర్వుల నేడుతరముల వారినిఁ దరువాత నాలుతరములవారిని రక్షించుచున్నాఁడు. ఓపురం

దరా! రత్నోపకీర్ణమగుభూమి నెవ్వఁడిచ్చునో, వాఁడు సకలకలుష విముక్తుఁడై స్వర్గలోకమునఁ బూజ్యుఁడగుచున్నాఁడు. ఓరాజా! సకల కామగుణాన్వితమై ప్రశస్తమగుభూమి నెవ్వఁడిచ్చునో, వాఁడు రాజాధిరాజగుచున్నాఁడు. భూదానము సర్వోత్తమమైనది. ఎల్ల కోర్కుల నొసఁగుభూమి నెవ్వఁడొసంగునో వానిని సకలభూతము లును దమ్మన్నిటి నొసంగువానినిగా భావించును. ఓవాసవా! అటులే యెల్లకోర్కుల నిచ్చునదియు, సకలకామగుణాన్వితయునగు ధేనువు నెవఁ డొసంగునో, వాఁడు స్వర్గమొందుచున్నాఁడు. ఓసురేంద్రా! భూదాతను, మధుసర్పిః ప్రవాహములుగలిగి, పాలను బెరుఁగును స్రవింపఁజేయునదులు తృప్తినొందించును. భూప్రదానముచే రాజు సకలకలుషవిముక్తుఁడగును. ఇంతయేల! భూమిదానమును మించిన దానము లేదు. శస్త్రనిర్జితమైన సముద్రముద్రితమగుభూమి నెవఁడు దానముసేయునో, వానిని భూమిగలంత కాలము జనులు చెప్పికొందురు. ఓపురందరా! రససమృద్ధమై పవిత్రమైనభూమి నిచ్చినవానికి భూదానగుణములు గలలోకము లెన్నటికిని జెడవు. సుఖాభిలాషియై యెల్లపుడును భూమిని గోరుపార్థివుఁడు సత్పాత్రమున భూదానము సేయవలయును. ఎట్టిపాపాత్ముఁడేని, బ్రాహ్మణునకు భూదానమొనర్చిన యెడ వాఁడు పాము పొరవిడిచినట్టులు సకలపాపములను దొలగించు కొనుచున్నాఁడు. ఓయింద్రా! భూదాత, సరిత్సాగరశైలకాననముల నెల్ల నిచ్చినవాఁడగును. మఱియు నాతనికి నూతులు, చెరువులు, కాలువలు, సరస్సులు, స్నేహపదార్థములు, సకలరసములు నొసంగిన వానికగుఫలము గలుగుచున్నది. మఱియు భూదానముచేసినవాఁడు పుష్పఫలాన్వితములగు వృక్షములను, సారములగు నోషధులను, గాననోపలశైలములను దానముచేసినవాఁడగుచున్నాఁడు. ఆప్త దక్షిణములగు నగ్నిష్టోమాదు లొనర్చినవాని కగుఫలము భూదాత కగును. భూదాత పదితరములవారి ననుగ్రహించును. భూమి నప హరించినవాఁడు పదితరములవారిని జెఱుచుచున్నాఁడు. పూర్వు లిచ్చినభూముల నపహరించినవాఁడు నరకము నొందుచున్నాఁడు. ఎవ్వఁడు ప్రతిజ్ఞచేసి యీయకుండునో, యిచ్చి తీసికొనునో, వాఁడు దారుణపాశబద్ధుఁడై మృత్యుశాసనముచేఁ బరితాపమొందుచున్నాఁడు.

ఆహితాగ్నియు, యజ్ఞపరుఁడును, వ్రత్రిహీనుఁడును, నతిథియు నగు బ్రాహ్మణోత్తము నెవ్వారు సేవింతురో, వారు యమునిఁ జేరరు. ఓపురందరా! పార్థివుఁడు బ్రాహ్మణులకు ఋణపడియుండరాదు. ఇతర వర్ణములవారిలోఁ గృశులు దుర్బలులు నగువారినిఁ బరిపాలింప వలయును. ఓ త్రిదశాధీశా! ఒకఁడొసంగినభూమిని దీసికొనఁగూడదు. కృశకృత్తులును దీనులు నగుచుఁ బరితపించు బ్రాహ్మణులక్షేత్ర మప హరించినచో వారు శోకింతురు. వారి కన్నీటిబొట్టు లాభూమి నప హరించినవాని మూఁడుతరములను నశింపఁజేయును. ఓసహస్రాక్షా! రాజ్యచ్యుతుఁడగురాజు నెవ్వఁడు, మరల రాజ్యమున నిలుపునో, వానికి స్వర్గవాసము గలుగుచున్నది. చెఱకుతోఁటలు గలట్టియు, యవగోధూమములు ఫలించునట్టియు, నశ్వాదివాహనపూర్ణమై నట్టియు, నిజభుజబలార్జితమైనట్టియు, నిధిగర్తములుగలట్టియు భూమి నెవ్వఁడు దానముచేయునో, వాఁ డక్షయలోకముల నందుచున్నాఁడు. అది వానికి భూమియాగ మనఁబడుచున్నది. ఎవ్వఁడు వసుంధర నొసంగునో, వాఁడు నిజకలుషములఁ దొలఁగించికొని సజ్జనసమ్మతుఁడై సత్వగుణప్రధానుఁడై యుత్తమలోకముల మహత్తరుఁ డనఁబడు చున్నాఁడు. ఓయింద్రా! నీటఁబడిన తైలబిందువు లెట్లుచెదరునో, యటులే చేసినభూదానము, ప్రతిసస్యమందును, మఱిమఱియు వృద్ధి ప్రదమగుచున్నది. ఏమహీపాలురు,శూరులై రణశోభితులై శత్రులమా రొగ్గని హతులగుదురో, వారు బ్రహ్మలోకము నొందుదురు. వారి నెటు లప్సరసలు దివ్యమాల్యవిభూషితలై నృత్యగీతాదులతో సమీపింతురో, యటులే భూదాతనుసైతము వారు సమీపించుచున్నారు. ఎవ్వఁడు విధ్యుక్తముగా నుత్తమబ్రాహ్మణునకు భూమి నొసంగునో, వాఁడు దేవగంధర్వపూజితుఁడై స్వర్గమున సుఖముగా నుండును. భూదాతయగువానిని వందలకొలదియప్సరసలు పుష్పములు గురి యుచు సమీపింతురు. మఱియు నట్టివానికి శంఖము, భద్రాసనము, ఛత్రము, వరాశ్వాదివాహనములును, బుష్పములును హిరణ్యసంచయ ములును సంభవించును. ఆతనియాజ్ఞ యప్రతిహతమై వెలయును. మఱియు నాతనికి జయశబ్దములతో ధనములు గలుగుచుండును. ఇవి యెల్ల భూదానపుణ్యఫలములై భూదాతకు స్వర్గమును గూర్చునవి.

మఱియు భూదాత, సువర్ణపుష్పములగు నోషధులును, కుశకాంచన శాద్వలములును గలిగి యమృతము నిచ్చుభూమిని బడయఁగల్గుచున్నాఁడు. భూదానమువంటి దానమును, దల్లివంటి పూజ్యపదార్థమును లేవు. సత్యమువంటిధర్మమును, దానమునుబోలిన నిధియును మఱి లేవనవచ్చును' అని తెలిపెను.

ఓయుధిష్ఠిరా! ఇంద్రుఁడు బృహస్పతి వచనము లాలించి వసురత్నసమాకీర్ణమగు వసుంధర నాతని కొసంగెను. ఎవ్వఁ డీభూదాన విషయమును శ్రాద్ధకాలమున వినిపించునో వానికి రక్కసులయు, నాసురులయు భాగము గలుగదు. తత్కాలమున దత్తమగునది పితరుల కక్షయమగుచున్నది. అందు సందియము లేదు. కావునఁ బండితుఁడగు వాఁడు దీనినిశ్రాద్ధకాలములందు భుజించుచున్న బ్రాహ్మణులకు వినిపింపవలయును. ఓయుధిష్ఠిరా! ఈభూదాన మెల్లదానములలో నుత్తమమైనదని నీకుఁ దెలిపితిని గదా! ఇంక నేమి వినఁగోరెదవు?" అని యడుగ విని యుధిష్ఠిరుఁ డిట్లనియె.

## దానధర్మకథనము

"ఓపితామహా! ఈలోకమున దానములొనర్చు నుత్సాహము గలమహీపతి గుణాధికులగు విప్రుల కెట్టిదానము లొనర్పవలయును? పరిగ్రహీతలగువారు వెంటనే యెట్టిదానముచే సంతసింతురు? మఱియు నాపరిగ్రహీతలు సంతుష్టులై యేమియొసంగుదురు? దేనివలన మహత్తరమగు పుణ్యఫలము గలుగునో తెలుపుము."

అది విని భీష్ముఁడు "ఓయుధిష్ఠిరా! ఈ యర్థమునుగూర్చి మున్ను ప్రశ్నింపఁబడి నారదుఁడు తెలిపిన వచనములు కొన్ని గలవు. వానిని నే నెఱిఁగించెదను. వినుము.

ఓధర్మజా! దేవతలును, మహర్షులు నన్నమునే ప్రశంసించుచున్నారు. లోకతంత్రమును, యజ్ఞములు మున్నగునవియెల్ల నన్నమందే ప్రతిష్ఠితములగుచున్నవి. అన్నదానముతో సదృశమగుదానము పూర్వము లేదు. మఱియు గలుగదు. కావుననే మానవులు విశేషముగా నన్నమునే దానముసేయఁగోరుచుందురు. అన్నము బలము నొసంగును. ప్రాణము లన్నమందే యిమిడియున్నవి. ఓప్రభూ! సకల

మగునీ ప్రపంచము నన్నముచేతనే ధరింపఁబడుచున్నది. ఈలోకమున నన్నమువలననే గృహస్థులును, భిక్షుకులును, తాపసులును బ్రదుకుచున్నారు. ప్రత్యక్షముగా నన్నమునుండియే ప్రాణములు నిలువఁబడుచున్నవి. అందు సందియము లేదు. శ్రేయము గోరువాఁడు, కుటుంబమును బీడించియైన మహాత్ముఁడగు బ్రాహ్మణునకును, భిక్షుకునకును నన్నము పెట్టవలయును. అభిరూపుఁడును, బ్రాహ్మణుఁడునగు యాచకున కన్న మెవ్వఁడు పెట్టునో, వాఁడు తనకుఁ బారలౌకికమగు నిధినిఁ గూర్చుకొనుచున్నాఁడు. గృహస్థుఁడగువాఁడు మార్గశ్రాంతుఁడును, వృద్ధుఁడును, నర్హుఁడును నై దనయింటికి వచ్చిన యతిథిని యథావిధిగా నర్చింపవలయును. తనకుఁగలకోపము నడంచికొని, సుశీలుఁడును వీతమత్సరుఁడునై యన్నదానముచేయువాఁ డిహపర సుఖము లందుచున్నాఁడు. తనయింటికి వచ్చినవాని నవమానింపరాదు. వానినిఁ బొమ్మనరాదు. చండాలునకుఁగాని, కుక్కకుఁగాని చేసిన యన్నదానము నిష్ఫలమై చెడదు. మార్గమున నలసి క్రొత్తగావచ్చిన వాని కెవ్వఁడు క్లేశరహితముగా నన్నము పెట్టునో వాఁడు మహాధర్మ మొందుచున్నాఁడు. ఎవ్వఁడు పితరులను, నతిథులను, దేవతలను, బ్రాహ్మణులను, మహర్షులను నన్నములచేఁ దృప్తినొందించునో వాఁడు మహత్తరమగు పుణ్యఫలమునకుఁ బాత్రుఁడగును. గొప్పపాపమొనర్చియు నెవ్వఁ డన్నదానముసేయుచు బ్రాహ్మణులఁ దృప్తిపఱచునో, వాఁడు తత్పాపమునుండి విముక్తుఁడగును. అన్నదానము బ్రాహ్మణునియం దక్షయమును, శూద్రునియందు మహాఫలజనకము నగుచున్నది. అయ్యది బ్రాహ్మణునియందును శూద్రునియందును విశేషించి చేయఁదగినది. గోత్రమును, శాఖను స్వాధ్యాయమును దేశమును బ్రశ్నింపకయే, తనయింటికివచ్చి యాచించిన బ్రాహ్మణున కన్నము పెట్టవలయును. ఓధర్మజా! అన్నదాతకు, నన్నములును, వ్నక్షములును, సకలకామఫలప్రదములై యిహపరములసుఖము గల్గించుటలో సందియములేదు. కర్షకులు వర్షమునట్టులు, పితరు లెప్పుడును దమ పుత్రులుగాని, పౌత్రులుగాని యన్నదానము సేయువలయునని కోరుచుండుదురు. బ్రాహ్మణుఁ డందఱలో నధికుఁడు. అతఁడు కోర్కెగలిగి గాని లేకుండియుగాని యాచించునేని యాతని కొసఁగి మహత్తర

పుణ్యమొందవలయును. బ్రాహ్మణుఁ డెల్లభూతములకు నతిథియై ముందుగా భుజింపఁదగినవాఁడు. విప్రు లెవ్వనియింటికి భిక్షుకులై వచ్చి సత్కరింపఁబడి మరలుదురో, వానియిల్లు వర్ధిలును. మఱియు నట్టివాఁడు మహాభోగముగల వంశమునందు మరల జన్మించును. లోకమున నన్నదానము సేయువాఁ డుత్తమస్థానమును, నిత్యాన్నదాత స్వర్గమును బొందుచున్నారు. మానవుల కన్నమే ప్రాణములు. సకలము నన్నమందే ప్రతిష్ఠితమగుచున్నది. అన్నదాతకుఁ బశువులును, ధనములును, పుత్త్రులును, భోగములును గలుగును. మఱియు నతఁ డాయువుగలవాఁడును రూపముగలవాఁడుగా జనించును. ఓ రాజా! అన్నదాత లోకమున నన్నియు నొసఁగినవాఁడు. ఇంతయేల! ప్రాణములిచ్చినవాఁడగును. అతిథిగావచ్చిన బ్రాహ్మణునకు యథావిధిగా నన్నముపెట్టినదాత, దేవతలకును బూజ్యుఁడై సుఖమొందుచున్నాఁడు. ఓ యుధిష్ఠిరా! బ్రాహ్మణుఁడు క్షేత్రభూతుఁడై నమహాత్తరుఁడు. అట్టిక్షేత్రమున నుంచినబీజము మహాత్తరఫలజనక మగుచున్నది. అన్నము ప్రత్యక్షముగా భోక్తకును దాతకును బ్రీతికలిగించునది. అన్నమునుండియే రతియు, సంతతియ నగుచున్నది. ధర్మార్థములును, రోగనాశమును నన్నమునుండియే యగును. పూర్వకల్పమునఁ బ్రజాపతి, యన్నమేయమృతమని తెలిపెను. అన్నమే భూమియు నాకసము స్వర్గము నగుచున్నది. మఱియు నన్నియు నన్నమందే ప్రతిష్ఠితమనఁదగును. అన్ననాశమగునపుడు శరీరమందలిధాతువు లైదును భిన్నములగుచున్నవి. అన్నహానినుండియే బలవంతునిబలము తొలఁగుచున్నది. పెండిండ్లును, పిలుపులును, యజ్ఞములును నన్నము లేనిచో నివర్తించును. ఓయీ! అన్నమందు బ్రహ్మ మడఁగియుండును. జంగమస్థావరరూపమగు సమస్తము నన్నమునుండియే కలుగుచున్నది. మూఁడులోకములందును ధర్మమునకుఁగా నన్నమునే యొసంగవలయును. అన్నదానము సేయువానికిఁ దేజము, బలము, కీర్తియుఁ గలుగును. మఱియు నాయువును దానిచేతనే గలుగుచున్నది. ప్రాణపతియగుపవనుఁడు మేఘములకు మీఁదుగా వానిని సమీపించియుండును. ఓధర్మజా! ఇంద్రుఁ డామేఘగతమగునుదకమును వర్షించుచున్నాఁడు. సూర్యుఁడు పుడమిఁగల రసములనెల్ల నిజకిరణములచే నాకర్షించుచున్నాఁడు. ఎపుడు మేఘము

నుండి యుదకము పుడమిఁబడునో, యపుడే భూమి స్నిగ్ధమగుచున్నది. అపుడు ప్రపంచమునకు జీవనాధారమగు సస్యము జనించుచున్నది. పిదప వానివలన మానవులకు మేదోమాంసాస్థిశుక్రముల ప్రాదుర్భావమగును. ఆశుక్రమునుండియే ప్రాణు లుద్భవించుచున్నవి. ఆశుక్రము నగ్నిషోములు సృజించి పోషించుచుండుదురు. సూర్యునకుఁ బవనునకు శుక్రమునకును నన్నముతో నిత్యసంబంధము గలదుగదా! ఇవియెల్ల నొక్కరాశియే. ఈరాశినుండియే భూతములు జనించును. ఈయన్నమే భూతములకుఁ దేజమును బ్రాణములను నిచ్చునది. అన్నార్థియై తనయింటికివచ్చినయభ్యాగతున కెవ్వఁ డన్నమిడునో వాఁడు సకలసుఖముల నందుచున్నాఁడు.' అని తెలిపెను.

ఓధర్మజా! నారదుఁడు తెలిపినయావచన మాలించి నేను నిత్యమును నన్నముపెట్టితిని. కావున నీవును శాంతిపరుఁడవై పరితాపపడక యన్న మెల్లవారికిఁ బెట్టుము. ఓరాజా! నీవు విప్రులకు యథావిధిగా నన్నము పెట్టుదువేని దానివలన నీకు స్వర్గమగుచున్నది. మఱియు నన్నదానమువలనఁ గలిగెడిలోకములును నీకగుచున్నవి. స్వర్గమందును మహాత్ములగు నన్నదాతలభవనములు వెలయుచుండును. మఱియు వారి కాస్వర్గమున లభించుభవనములు, నానావిధములగు స్తంభములతోఁగూడి నానావిధాకారములై యుండును. చంద్రమండలములునాఁ దెల్లనై చిఱుమువ్వలు గలిగి కొన్నియు, బాలసూర్యసమవర్ణములై జంగమములును స్థావరములునై పెక్కునంతరములుగలిగి మఱికొన్నియు వెలయుచుండును. మఱియు వైదూర్యప్రకాశములును, సువర్ణరజతమయములును, సకలకామఫలప్రదములు నై యవి యొప్పుచుండును. వానిలో వీథులును, బావులును, సభలును, కూపములును, దీర్ఘికలును నెల్లెడల శోభిల్లుచుండును. వానిలో ధ్వనిగలయానములు పూన్పఁబడియుండును. మఱియు నాభవనములందు భక్ష్యభోజ్యమయములైన పర్వతములును, వస్త్రములు నాభరణములు వెలయుచుండును. ఒక్కొకచో నన్నపర్వతములు లొప్పును. మఱియొకచో నదులు క్షీరమును బ్రవహించును. తెల్లనిమేఘములు నాఁదగు మేడలును సుగన్ధోజ్జ్వలములగు శయ్యలును నలరారుచుండును. వానినన్నిటి నన్నదాతలు వడయుదురు. కావున నన్నదాతవుగమ్ము. అన్నప్రదులగు మహాత్ములకు

నుత్తమలోకములు సిద్ధించును. అటులగుట మానవులు ప్రయత్నించియే నన్నదానము సేయవలయును." అని తెలుప విని యుధిష్ఠిరుఁ డిట్లనియె.

## దేవకీనారదసంవాదము

"ఓపితామహా! నీవచనము వింటిని. అన్నదానవిధి యెట్టిదో తెలిపితివి. అశ్విన్యాదినక్షత్రయోగమున నన్నదానఫల మెట్టిదియో తెలుపుము."

అది విని భీష్ముఁడు "ఓయుధిష్ఠిరా! నీవడిగినయర్థమున కుదాహరణముగా నొకపురాతనేతిహాసమును దెలిపెదను. అయ్యది దేవకీనారదులకు జరిగినసంవాదము. ఒకపుడు దేవదర్శనుఁడగు నారదుఁడు ద్వారకకు రాఁగా, ధర్మజ్ఞురాలగు దేవకి యాతనిఁ గాంచి, నీవడిగిన ప్రశ్నము నడుగఁగా నతఁడు దానినెల్ల విధ్యుక్తముగా నిట్లు చెప్పెను.

'ఓదేవీ! కృత్తికానక్షత్రములయందు, నేయితోడను బాయసముతోడను బ్రాహ్మణులను దృప్తినొందించినచో, సర్వోత్తమములగు సాధులోకములగును. రోహిణినక్షత్రమున మృగమాంసములతోడను, నేయితోడను, బాయసాన్నపానము లిచ్చెనేని, బ్రాహ్మణఋణము తీర్చినవాఁడగును. మృగశీర్షమున వత్సముతోఁ గూడిన పాలయావు నిచ్చినవాఁడు మానుషలోకవిముక్తుఁడై యుత్తమమగు స్వర్గలోకము నందుచున్నాఁడు. ఆర్ద్రానక్షత్రమున నుపోషితుఁడై తిలమిశ్రమగుకృసరము నొసంగినవాఁడు, దుర్గమప్రదేశములను, క్షురధారగలపర్వతములను దాఁటఁగల్గుచున్నాఁడు. పునర్వసునక్షత్రమున నప్పములను నన్నములను బెట్టినవాఁడు యశమునొంది, రూపసంపన్నుఁడై సత్కులమున, ధనికుఁడై జనించును. పుష్యమీనక్షత్రమున శుద్ధసువర్ణమునుగాని, భూషణముగ నొనర్చిగాని యిచ్చినచో వాఁడు ప్రకాశమయములగు లోకములందుఁ జంద్రునివలె విరాజిల్లుచున్నాఁడు. ఆశ్లేషానక్షత్రమున నెవ్వఁడు రూప్యమునుగాని, ఋషభమునుగాని యొసంగునో, వానికెన్నిజన్మములందును సర్పభయము గలుగనేరదు. మఘానక్షత్రమునఁ దిలపూర్ణములగుమూఁకుడులను దానమొనర్చినచో, నిహమునఁ బుత్రపశుసమృద్ధి గలిగి మరణించియు సుఖితుఁడగు

చున్నాఁడు. ఫల్గునీపూర్వభాగమున నెవ్వఁడు పోషితుఁడై బ్రాహ్మణులకు మీఁగడతోఁజేసిన భక్ష్యముల నొసంగునో, వాఁడు సౌభాగ్య మొందుచున్నాఁడు. ఉత్తరానక్షత్రము విధ్యుక్తముగా ఘృతక్షీరసమాయుక్తమగు షష్టికాన్నమును బెట్టినచో, స్వర్గలోకముల మహత్తరుఁ డగుచున్నాఁడు. అదియగాక యానక్షత్రమున నేదాన మొనర్చినను ననంతమగు మహాఫల మది యొసంగు ననుట నిశ్చయము. హస్తనక్షత్రమున నుపవాస మొనర్చి నాలు గేనుఁగులఁ బూన్చిన రథము నొసంగినచో, సకలకామసమన్వితము లగు పరమపుణ్యలోకములఁ బడయ నగును. చిత్రానక్షత్రమునఁ బవిత్రగంధద్రవ్యములను వృషభమును నొసంగినవాఁ డప్సరోలోకమునను నందనవనమందును జరించుచు సంతసించును. స్వాతీనక్షత్రమున దనకిష్టమగుధన మెవ్వనికే నొసంగినచో, నిహమున మహాయశము వడసి మఱియు, శుభప్రదములగు లోకముల నొందుచున్నాఁడు. విశాఖానక్షత్రమున నొకవృషభమును నొకపాడియావు నొసంగినవాఁడును, ధాన్యవస్త్రసహితమై ప్రాసంగముతోఁ గూడిన శకటమిచ్చినవాఁడును, దేవతలకును బితృదేవతలకును బ్రియ మొనర్చినవాఁడగుచు మృతుఁడై యానంత్య మొందుచున్నాఁడు. మఱియు నట్టివాఁడు, దుర్గములందుఁ జిక్కువడక స్వర్గమునందఁగోరునేని, పైని దెలిసినదానములను యథోక్తముగా నొనర్చి యిష్టవృత్తి నొందుచున్నాఁడు. వానికిఁ గ్లేశకరములగు నరకములును గలుగవనుట నిశ్చయము. అనూరాధానక్షత్రములందు నుపవాస మొనర్చి యుత్తమాన్నమును బ్రావారమును దాన మొనర్చినచో, మానవుఁడు నూఱుయుగములు స్వర్గలోకమున మహత్తరుఁడై వెలయును. జ్యేష్ఠానక్షత్రమునఁ గందమూలముతోఁగూడిన కాలశాకమును బ్రాహ్మణుల కిచ్చినవాఁడు వర్ధిలుటయెగాక యిష్టగతి నొందుచున్నాఁడు. మూలనక్షత్రమున సమాహితుఁడై బ్రాహ్మణులకు మూలములను ఫలములను దాన మిచ్చినవాఁడు పితృదేవలకుఁ బ్రియ మొనర్చినవాఁడై యిష్టగతి నొందును. మఱియుఁ బూర్వాషాఢానక్షత్రములం దుపవాస మొనర్చి కులవృత్తోపసంపన్నుఁడును, వేదపారగుఁడునునగు బ్రాహ్మణునకు దధిపాత్రముల నిచ్చినవాఁడు జన్మాంతరమున బహుగోధనసమన్వితమగు

సద్వంశమున జనించును. అధికమధుఫాణితములుగలట్టియు, నేయితోఁ గూడినట్టియు, నుదకకుంభముతోఁ గూడినట్టియు సక్తువు నెవ్వఁ డుత్తరాషాఢానక్షత్రమున దానముచేయునో, వాఁడు సకలకామముల నొందుచున్నాఁడు. అభిజిన్నక్షత్రమునఁ దేనెయు నేయియుఁ గలిపిన దుగ్ధమును బండితుల కిచ్చిన ధర్మపరుఁడు స్వర్గలోకవాసి యగును. శ్రవణానక్షత్రమునఁ గంబళమునుగాని, వస్త్రాంతరమునుగాని దానము చేసినవాఁడు తెఱచినస్వర్గద్వారమును శ్వేతయానముతోఁ జేరుచున్నాఁడు. వివేకియై ధనిష్ఠానక్షత్రమునందు వృషభములఁ బూన్చిన యానమును దానముచేసినవాఁడు తత్కాలముననే ధనవస్త్రరాశిని, బరమున రాజ్యము నొందుచున్నాఁడు. శతభిషగ్యోగమున నగరుచందనములతోఁ గూడిన గంధద్రవ్యముల నొసంగినవాఁ డప్సరోలోకమునొంది గంధద్రవ్యములను శాశ్వతముగ నొందుచున్నాఁడు. పూర్వప్రోష్ఠపదానక్షత్రమున రాజమాషదాన మొనర్చినవాఁడు సకలభక్ష్యఫలసమేతుఁడై మృతినొందినపిమ్మట సుఖమొందుచున్నాఁడు. ఉత్తరాభాద్రానక్షత్రమున నొక గొఱియమాంసము నొసంగినచోఁ, బితృదేవతలను దృప్తినొందించువాఁడై, మృతినొంది యనంతసుఖ మొందును. రేవతియందుఁ గంచుపాత్రలకొలంది పాలనిచ్చు ధేనువు నెవ్వఁడు దానముసేయునో, వాని కాధేనువు వలయుకోర్కుల నొసఁగునదై యాదాతను సమీపించును. అశ్వినీనక్షత్రమున గుఱ్ఱములఁ బూన్చినరథము నొసంగినమానవోత్తమునకు హస్త్యశ్వసంపన్న మగుసద్వంశమున జననము సిద్ధించును. భరణియందు బ్రాహ్మణులకుఁ దిలధేనువుల నొసంగినవాఁడు ప్రభూతమగుగోధనము వడయుటయ గాక చచ్చి కీర్తినొందుచున్నాఁడు.' అని.

ఓయుధిష్ఠిరా! ఏనక్షత్రమున నెట్టిదానము లొనర్పవలయునో యనువిషయమును దెలిపిన నారదునివచనము లాలించి దేవకి, తన కోడండ్రతో దానినిఁ దెలిపెను" అని పలికి మఱియు భీష్ముఁ డిట్లనియె.

### జలాదిదానకథనము

"ఓధర్మజా! సువర్ణదాన మొనర్చినవా రఖిలకామముల నొసంగువారగుచున్నారని పితామహసుతుఁ డగుభగవానుఁ డత్రిమహర్షి తెలి

చెను. సువర్ణదానము పవిత్రము, శుచియుఁ, బితృదేవతల కక్షయఫల ప్రదము నగునని రాజేంద్రుఁడగు హరిశ్చంద్రుఁడు కీర్తించియున్నాఁడు. దానములలోనెల్లఁ బానీయదానము పరమమైనదని మను వెల్లడించి యున్నాఁడు. కావున నూతులను, దటాకములను, బావులను ద్రవ్వింప వలయును. ఎవ్వనిచేఁ ద్రవ్వింపఁబడినకూపము ప్రవృద్ధపానీయమై ప్రవర్తిల్లునో, వానికి నిజకర్మముచేఁ బాపము గల్గునేని యదియెల్ల నశించును. తటాకము ద్రవ్వించినవాఁడు తనవంశమునెల్ల, దరింపఁ జేయుచున్నాఁడు. ఎవ్వనితటాకమునందలి జలమును వేసఁగిలో గోవులును, బ్రాహ్మణులును, సాధువులగువారును ద్రావుదురో, వాఁడెట్టి యిక్కట్టులకును లోనుగాక, సుఖితుఁడై యుండును. ఘృతదానముచే భగవానుఁడగు బృహస్పతియుఁ బూషభగాశ్వినులును, వహ్నియుఁ బ్రీతులగుచున్నారు. ఘృతమే యజ్ఞాదులకుఁ బరమోత్తమమగు నౌషధము నాఁదగుచున్నది. మఱియు నది రసములందును, ఫలములందును నుత్తమమైనది. ఫలకాముఁడును, కీర్తికాముఁడును, బుష్టికాముఁడును నగు వాఁడు నిత్యమును శుచియు, నాత్మశాలియునై బ్రాహ్మణులకు ఘృతము నొసంగవలయును. ఆశ్వయుజమాసమున విప్రుల కెవ్వఁడు ఘృతదానము సేయునో, వాని కశ్వినీదేవతలు ప్రీతులై రూపము నొసంగుచున్నారు. మఱియు నెవఁడు ఘృతమిశ్రమగుపాయసమును బ్రాహ్మణులకుఁ బెట్టునో, వానిగృహము నొకపుడును రక్షస్సులు సోఁకఁజాలవు. కరకము లనియెడిపాత్రముల నెవఁడు బ్రాహ్మణుల కిచ్చునో, వాఁడు దప్పితో మృతినొందఁడు. మఱియు నుపకరణములతో జనించును. ఎన్నఁడును వాఁడు వ్యసనములపాలు గానేరఁడు. ఎవ్వఁడు బ్రాహ్మణవృత్తిక్షేత్రాదులయెడఁ బరమశ్రద్ధగలిగి నియతుఁడై ప్రవర్తిల్లునో, వాఁ డాభూదానఫలమునందలి యాఱవభాగము నొందఁగల్గుచున్నాఁడు. ఎవ్వఁడు సద్వృత్తులగు బ్రాహ్మణులకు యజ్ఞసాధనములుగను, వంటచెఱకుగను గాష్ఠముల నొసంగునో, వానికి వివిధములగు కార్యములును సిద్ధించును. మఱియు వానికి భగవానుఁడగు నగ్నిదేవుఁడు ప్రీతుఁడై శత్రులకందఱకు దుర్జయుఁగను రూపవంతుఁగను జేయును. వానికిఁ బశుబాధ యెన్నఁడును గలుగకుండుటయేగాక, వాఁడు సంగ్రామజయ మొందుచున్నాఁడు. ఎవ్వఁడు ఛత్త్రదానము

సేయునో, వానికి సిరియు సంపదయుఁ గలుగుటయెగాక నేత్రరోగ
ము గలుగదు. మఱియు వానికి యజ్ఞభాగము నగుచున్నది. ఎవ్వఁడు
వర్ష కాలమందును వేసఁగియందును, బ్రాహ్మణులకు గొడుగు నొస
గునో, వానికి మనఃపరితాప మెన్నఁడును గలుగదు. మఱియు వాఁ
డెట్టికష్టదశనుండియు విముక్తుఁడగును. ఓరాజా! ఎల్లదానములందును
శకటదాన ముత్తమమని భగవానుఁడగు శాండిల్యమహర్షి తెలిపి
యున్నాఁడు." అని తెలుప విని యుధిష్ఠిరుఁ డిట్లనియె.

## గోదానాదిదానఫలకథనము

"ఓపితామహా! నేల కాలుచున్నతఱి బ్రాహ్మణున కెవ్వఁడు
చెప్పులనొసంగునో, వానికిఁ గలుగుఫల మెట్టిది? తెలుపుము"

అది విని భీష్ముఁడు, "ఓయుధిష్ఠిరా! ఎవ్వఁడు సమాహితుఁడై
బ్రాహ్మణుల కుపానహము లొసంగునో, వాఁడు కంటకములగువాని
నెల్ల మర్దించుటయెగాక, విషమావస్థనుండి దాఁటఁ గల్గుచున్నాఁడు.
మఱియు వాఁడు శత్రులకెల్ల భయప్రదుఁ డగుటయెగాక, యశ్వతరీ
యుక్తమగు తెల్లనియానము నైతము వానికి సిద్ధించును. ఇంకను
వానికి దమ్యములు పూన్చిన రజతసువర్ణభూషితమగు శకటమును
లభించును." అని తెలుప విని ధర్మజుఁడు గాంగేయు నారసి, "తాతా!
గోభూదానములకును, దిలదానమునకు నన్నదానమునకును ఫలము
తెలిపితివి. అయినను మఱియు నద్దాని నెఱిఁగింపుము." అని
యడిగెను.

అందుల శాంతనునందనుఁడు "ఓపాండునందనా! నీకిపుడు
తిలదానఫలము తెలిపెదను. అది విని నీవద్దానిని, యథాన్యాయముగా
నాచరింపుము. పరమేష్ఠి తిలలను బితృదేవతలకుఁ బ్రథమభోజ్యముగా
సృజించెను. కావునఁ దిలదానముచేఁ బితృపతులుమువారు సంతసించు
చున్నారు. మాఘమాసమున బ్రాహ్మణుల కెవ్వఁడు తిలల నొసంగునో
వానికి సకలసత్త్వసమాకీర్ణమగు నరకము దృష్టిగోచరమేని గాదు.
ఎవ్వఁడు తిలలచేఁ బితరుల నర్చించునో, వాఁడు సర్వయాగములు
చేసినవాఁ డగుచున్నాఁడు. శ్రద్ధాహీనుఁడై యెన్నఁడును దిలలచే
శ్రాద్ధము సేయరాదు. మహర్షియగు కాశ్యపుని యవయవములనుండి

తిలలు వెడలినవి కావున దాన విషయమునఁ దిలలు దివ్యభావము నొందుచున్నవి. తిలలు పుష్టిని, రూపమును నొసంగునవగుచుఁ బాప వినాశము లగుటచే, నెల్లదానములలోఁ దిలదాన మధిక మనఁబడు చున్నది. ఆపస్తంబుఁడును, మేధావి శంఖలిఖితులును, మహర్షియగు గౌతముఁడును, దిలదానముచేతనే దివమునొందిరి. నియతచిత్తులై విప్రు లెవ్వరు తిలహోమము నొనర్తురో, వారు ప్రవృత్తిసంస్థితు లైనను, గవ్యహావిస్సనకీడై యుండనోపుదురు. సకలదానములందును దిలదానమే గొప్పదనియు, నదియే యక్షయమైనదనియుఁ దెలుపఁ బడుచున్నది. మున్ను కుశికమహర్షి హావ్యోచ్ఛిత్తిగలిగినతఱిఁ దిలలచే నగ్నిత్రయము నారాధించి యిష్టగతి నొందెను. ఏవిధిచేఁ దిలదానము ప్రశస్తమగుచున్నదో యట్టివిధ మెఱిఁగించితినిగదా! మఱియొకటి తెలిపెదను. వినుము. మున్నొకపుడు దేవతలకు యాగముచేయు సంకల్పముగలిగి బ్రహ్మతోఁ గూడి భూభాగమున యజ్ఞముచేయు వారై, తమకొకశుభ ప్రదేశమును జూపింపుమని యాపరమేష్ఠిని యాచించి, 'ఓదేవా! నీవే త్రిదివమునకును భూమికిని బ్రభుఁడవు. ఓమహాభాగా! నీయనుజ్ఞపడయక యజ్ఞముచేయఁజాలము. అనుజ్ఞలేని భూభాగమునఁ జేసినయాగమువలన ఫలము గలుగనేరదు. జంగమ స్థావరముల కన్నిటికిని నీవగదా ప్రభుఁడవు! కావున నీవిపుడు యజ్ఞమునకు మాకనుజ్ఞ నొసంగఁదగుదువు.' అని ప్రార్థింప, వారితో నావారిజాసనుఁడు 'దేవతలారా! మీరు యాగముచేయఁదగుభూ భాగమును నేను దప్పక యొసంగెద'నని పలికెను. అంత నయ్యమరులు 'ఓదేవా! సఫలమనోరథులమైతిమి. ఇఁక దక్షిణలతో యాగమొన ర్తుము.' అని తెలిపిరి. పిమ్మట నీభూభాగమునకుఁ గణ్వుఁడు, నగ స్త్యుఁడు, భృగువు, అత్రి, వృషాకపి, అసితుఁడగు దేవలుఁడును వచ్చి, యాయజ్ఞదేశమును సమీపించిరి పిదప దేవతలు నిర్విఘ్నముగా యాగమొనర్చి సమాప్తియొనర్చిరి. ఉత్తమమగు హిమవత్పర్వతమున వారటులు యాగమొనర్చి దానికి దక్షిణగా భూమిలో నాఱవ భాగము దానముచేసిరి. భూమిలోఁ బ్రాదేశమాత్రమేని యొసంగిన వాని కెట్టియిక్కట్టులును గలుగక సుఖితుఁడగుచున్నాఁడు. శీతవా తాతపబాధను దొలఁగించునట్టియు, సంస్కరింపఁబడినట్టియు భూభాగ

మును యాగమున కెవ్వఁ డొసంగునో, వాఁడు స్వర్గమునుజేరి పుణ్యము పూర్తియయినను జలింపక యుండే యుండును. మఱియు వాఁడందుఁ బరమానందభరితుఁడై యింద్రునితోఁ గలిసి మెలఁగును. గృహము నొసంగినవాఁడును నటులే స్వర్గవాసి యగుచున్నాఁడు. అధ్యాపకవంశమునఁ బుట్టి నియతేంద్రియుఁడైన శ్రోత్రియుఁ డెవ్వని యింట నివసించునో, వాఁ డుత్తమలోకము నొందుచున్నాఁడు. ఓభరత సత్తమా! చలినుండియు వర్షమునుండియు బాధ లేకుండునట్టి దృఢమగు గృహమును గోవులకుఁగా నిచ్చునట్టివాఁ డేడుతరముల తమవారిని దరింపఁజేయుచున్నాఁడు. క్షేత్రభూమి నొసంగినవాఁ డుత్తమసంపద నొందును. రత్నభూమి నిచ్చినవానివంశములన్నియు వర్ధిల్లును. నిర్దగ్ధము నూషరమునగు భూమి నెన్నఁడును దానము చేయరాదు. అటులే శ్మశానవ్యాప్తమైనదియు, దుష్టులయధీనమైనదియునగు భూమిని దాన మొనర్పరాదు. పరకీయమగు భూభాగమును బితృకర్మమునందు దాన మొనర్చినచోఁ దద్దానమును, దచ్ఛ్రాద్ధమును వృథయగుచున్నవి. కావునఁ బండితుఁడగువాఁడు కొంచెమైనను భూమినిఁ గొని పిండదానము చేయవలయును. అట్టిభూమియందుఁ జేసినపిండదానము శాశ్వతమగుచున్నది. అడవియుఁ, బర్వతములు, నదులును, దీర్థములును, నొకరియధీనములుగావు. కావున వానిలోఁ గొనవలసిన యక్కఱ లేదు. ఓధర్మజా! భూదానఫలము దెలిపితినిగదా! ఇఁక గోదానఫలాదులను దెలిపెదను వినుము. తపోధనులకంటెను గోవు లుత్తమస్థితిగలవి. కావుననే పరమశివుఁడు గోవులతోఁ గూడి తప మాచరించెను. సిద్ధులగు బ్రహ్మర్షు లెట్టిగతినిఁ గోరుదురో, యట్టిగతి గలిగి గోవులు బ్రహ్మలోకమున సోమునితోఁ గూడియుండును. అయ్యవి పాలు, పెరుఁగు, నేయి, పేఁడ, చర్మము, ఎముకలు, కొమ్ములు, వాలములు మున్నగువానివలన లోకోపకార మొనర్చునవి. వానికి శీతాతపములు లేవు. అవియెల్లపుడును దమకృత్యమును జేయుచుండును. వర్షమువలనికష్టమును వానికిఁ గలుగదు. కావున నయ్యవి బ్రాహ్మణులతోఁగూడఁ బరమపదము నొందునవి. పండితులగువారు గోవులును బ్రాహ్మణులు నొక్కటియే యని తెలుపుదురు. రంతిదేవుని యాగమున గోవులు యాగపశువులుగాఁ గల్పింపఁబడియెను. ఆగోవులచర్మములనుండియే చర్మణ్వతి యనునది ప్రవర్తిల్లెను. అప్పటి

నుండియే యవి పశుత్వమునుండి విముక్తములై ప్రదానమునకుఁగాఁ గల్పింపఁబడినవి. అట్టిగోవుల నెవ్వఁడు విప్రముఖ్యుల కొసంగునో, వాఁ డెట్టివిషమావస్థయందున్నను, దానినిఁ దప్పించుకొనఁగల్గుచున్నాఁడు. గోసహస్రము నిచ్చినవాని కెన్నఁడును నరకమన్నది గలుఁగదు. ఓమనుజాధిపా! అట్టి యతఁడు విజయమునుసైతము గనుచున్నాఁడు. గోవుపా లమృతమని యింద్రుఁడు పలికెను. కావున గోదాత యమృతము నిచ్చినవాఁడగును. అగ్నుల కయ్యది యవ్యయమగుహోమపదార్థ మగుచున్నదని వేదవేత్తలు తెలుపుచున్నారు. కావున గోవునిచ్చినవాఁడు హోమపదార్థప్రదాత యగుచున్నాఁడు. ఇది మూర్తీభవించిన స్వర్గమే యనఁదగును. గోపతియగు వృషభమును, సద్గుణాన్వితుఁడగువిప్రున కిచ్చినవాఁడు స్వర్గమున వెలయును. ఈ గోవులు ప్రాణులకుఁ బ్రాణములగుచున్నవి. కావున ధేనుదాత ప్రాణప్రదుఁడగును. గోవులు భూతములకు శరణ్యములగుటచే, గోదాత శరణమిచ్చినవాఁ డగుచున్నాఁడు. గోవును వధమునకుఁగా నీయరాదు. మఱియుఁ గీనాశునకు, నాస్తికునకు నీయరాదు. ఓభరతర్షభా! అటులే, గోజీవనుఁ డగువానికిని నీయరాదు. కృశించినదియు, వత్సలేనిదియు, వంధ్యయు, రోగముగలదియు, వికలాంగయుఁ, బరిశ్రాంతయునగు గోవును బ్రాహ్మణున కీయరాదు. పదివేలగోవులనిచ్చినవాఁ డింద్రునిఁగూడి యానందమొందుచున్నాఁడు. నూఱువేలావులనిచ్చినవాఁ డక్షయలోకముల నొందును. ఇవియే గోప్రదానతిలదానవిధములని తెలిపితినిగదా! అటులే యన్నదానభూదానములఫలమును దెలిపెదను వినుము. ఓకౌంతేయా! అన్నదానము ప్రధానదానమని పెద్దలు దెలుపుదురు. అన్నప్రదానముచే రంతిదేవుఁడు స్వర్గము నొందెను. ఓరాజా! ఆఁకలిచే నలసియున్నవాని కన్న మెవ్వఁడు పెట్టునో, యట్టివాఁడు మహత్తరమగు స్వాయంభువస్థానము నొందుచున్నాఁడు. అన్నప్రదాతలకుఁ గలుగుశ్రేయము హిరణ్యదానముచేఁగాని, వస్త్రదానముచేఁగాని, మఱియొకదానముచేఁగాని కలుగనేరదు. అన్నమే ప్రథమద్రవ్యము. అన్నమే పరమలక్ష్మి. అన్నము నుండియే ప్రాణము, తేజోవీర్యములును, బలమును గలుగుచున్నవి. అతిథివచ్చినవెంటనే యాలోచింపక యెవ్వఁ డన్నము పెట్టునో, వానికిఁ

గష్టము లెన్నఁడును గలుగనేరవని పరాశరుఁడు పలికెను. మున్ముగా దేవతలను విధ్యుక్తముగాఁ బూజించి వారి కన్నమును నివేదింప వలయును. మానవు లెవ్వ రేయన్నము భుజింతురో, వారిదేవతల కదియే యన్నమగుచున్నది. శుక్లపక్షమున వెన్నెలలో నెవ్వఁ డన్నదాన మొనర్చునో, వాఁడిహమున నాపదలు దాఁటి, పరమున ననంత సుఖ మొందుచున్నాఁడు. ఎవ్వఁడు తాను దినకుండ నతిథి కన్నము పెట్టునో, వాఁడు బ్రహ్మవేత్తలలోకముల నుండును. ఎట్టియిక్కట్టునే నన్నదాత తప్పించుకొనుచున్నాఁడు; పాపమును బాపుకొనును, దుష్కృతమును దొలఁగించుకొనును. ఇవియే యన్నదానతిలదానములకును, గోదానభూదానములకును ఫలములని తెలియవలయును" అని తెలుప విని యుధిష్ఠిరుఁ డిట్లనియె.

### జలప్రభావాదివర్ణనము

"ఓపితామహా! నీవు దానఫలములఁ దెలుపఁగా వింటిని. అన్నదాన మన్నిదానములలో నెన్నఁదగినదిగదా! ఇఁకఁ బానీయదానమునఁ బడయఁగలుగుఫల మెట్టిదోఁ విస్తరముగా వినిపింప వినఁగోరుచున్నాఁడను."

అది విని గాంగేయుఁ డప్పాండవేయునితో, "ఓయుధిష్ఠిరా! నీవిట్టు లడుగ నేఁ దెలుపకుండుదునా? వినుము. పానీయదానము మొదలుగఁ దద్విధమెల్ల నెఱిఁగించెదను. అన్నపానీయదానములచే నెట్టిఫలము గలుగునో, యట్టిఫల మేదానముచేనైనను గలుగఁబోదని నానిశ్చయము. అన్నదానముననే ప్రాణధారులెల్లఁ బ్రవర్తిల్లఁగలుగుచున్నారు. కావుననే లోకమున నెల్లదానములందు నన్నదానము పరమదాన మనఁబడుచున్నది. అన్నమునుండియే ప్రాణులకుఁ దేజోబలములు వర్ధిలుచుండును కావుననే యది యుత్తమమైనదని ప్రజాపతి పలికెను. మహాత్తరమగు దేవసత్రమున సావిత్రియు, నన్నదానవిధమిట్టిదియగాని వేఱొకటి గాదని తెలుపఁగా వినియున్నాఁడను. అన్నమిచ్చినచోఁ బ్రాణమిచ్చినట్టు లగుచున్నది. ఇహమునఁ బ్రాణదానమును మించినదాన ముండదుగదా! ఓమహాబాహూ! మున్ను శిబి కపోతమునకుఁ దనప్రాణములిచ్చి యేమిపొందెనో యది

లోమశునివచనమువలన వింటివిగదా! బ్రాహ్మణున కన్నము పెట్టిన వాని కెట్టిగతి గలుగునో యంతకుమించిన యుత్తమగతి ప్రాణప్రదున కగునని నేను వినియున్నాఁడను. ఓపురుసత్తమా! పానీయమునుండియే యన్న ముత్పన్నమైనది. నీరజాతమగు ధాన్యాదికము లేక యేదియుఁ బ్రవర్తిల్లదుగదా! గ్రహగణాధీశుఁడగు భగవానుఁడు సోముఁడును నీరజాతుఁడు గాదే? అమృతమే సుధ, సుధయే యమృతము. ఓమహా రాజా! అన్నములు, నోషధులును, లతలును నీటియందుఁ బుట్టినవియే గదా! ఓరాజా! అన్నమునుండియే ప్రాణుల ప్రాణములు సంభవించు చున్నవి. దేవతల కమృతమన్నము. నాగులకు సుధ యన్నము. పితృ దేవతలకు స్వధ యన్నము. పశువులకుఁ దృణాదిలత లన్నము. అవి యెల్లఁ బానీయమువలననేగాదె జనించునవి. కావునఁ బానీయదాన మును మించినదాన మెందునులేదు. అటులగుట శ్రేయము గోరు వాఁడు పానీయదాన మొనర్పవలయును. జలదానము, ధన్యము, నాయుష్కరముఁ, గీర్తికరము నగునని తెలుపఁబడుచున్నది. జలదాత, తనశత్రులను మించినవాఁడగుచున్నాఁడు. మఱియు నాతనికిఁ గీర్తియు సకలకామములును సిద్ధించును. వాఁడు పాపవిముక్తుఁడై మరణింపఁగము చినపిదప, నానంత్య మొందుచున్నాఁడు. ఓరాజా! జలదాత స్వ నకుఁ బోయి, నిత్యము నక్షయములగుసుఖముల ననుభవించునని మనువు చెప్పియున్నాఁడు." అని తెలుప విని యుధిష్ఠిరుం డిట్లనియె.

## యమబ్రాహ్మణసంవాదము

"ఓపితామహా! తిలదాన దీపదానములయు, నన్నవస్త్రదానము లయు విధమును తత్ఫలమును మఱియు నెఱిఁగింపుము."

అది విని శాంతనవుఁ డాకౌంతేయునితో "ఓధర్మరాజా! నీవడి గినయర్థమున కుదాహరణముగా నొకపురాతనేతిహాసము గలదు. అయ్యది యమునకును బ్రాహ్మణునకును జరగినసంవాదము. దానిం దెలిపెదను వినుము. మధ్యదేశమున నొకగొప్ప బ్రాహ్మణగ్రామము గలదు. అయ్యది గంగాయమునలకునడుము, యామునగిరికిఁ గ్రిందుగా నుండెను. రమణీయమగు నద్దానిని బర్ణశాలయని పలుకుచుందురు. అందు విద్వాంసులగుబ్రాహ్మణు లనేకులు నివసించియుండిరి. అటు

లుండఁగా నొకపుడు యముఁడు తనసేవకుఁడగు నొకపురుషునిఁ బిలి చెను. వాఁడు కృష్ణాంబరధరుఁడును, రక్తనేత్రుఁడును, నూర్ధ్వ రోముఁడును, గాకజంఘాక్షినాసికుఁడు నగుచు వికృతరూపుఁడై యాతనిసమీపించుటయు, 'ఓరీ! నీవు పర్ణశాల యను బ్రాహ్మణగ్రామ మునకుఁ బోయి, యందుఁగల యొక బ్రాహ్మణునిఁ బిలిచికొనిరమ్ము. అతఁ డగస్త్యగోత్రజాతుఁడు. ఆతనిపేరు శర్మి. అతఁడు శమశాలియు, నిస్సంగుఁడును, విద్వాంసుఁడును, నధ్యాపకుఁడును నై యుండును. కాని, వానిపొరుగుననున్న తత్సగోత్రుఁడగు వేఱొకనినిమాత్రము తీసికొనిరావలదు సుమీ! అధ్యయనజన్మముచే వాఁడును నాశర్మికిఁ దుల్యుఁడై యట్టిగుణములనే గలిగియుండును. మఱియు సంతానవిష యమునను, బ్రవృత్తియందును, వాఁ డాశర్మికిఁ దుల్యుఁడై యుండును. కావున నదియెఱిఁగి నాచే నుద్దిష్టుఁడగుశర్మినే తీసికొనిరమ్ము. వానికి నేను బూజలొసంగవలయును.' అని తెలిపెను.

అది వినియు వాఁడు తనస్వామిశాసనమును బ్రతికూలముగా నొనర్చెను. ఎవఁడు యమునిచే నిషిద్ధుఁడయ్యెనో, వానినే యా యమభటుఁడు బలాత్కారముగాఁ దీసికొనివచ్చెను. అంత నా యముఁడు లేచి వానికిఁ బూజలొసఁగి పిదప మఱియుఁ దనసేవకు నితో 'ఓయీ! వీనినిఁ దీసికొనిపోయి విడిచి, మఱియొకనిఁ దీసికొని రమ్ము.' అని పలికెను. యముఁ డట్టులు పలుక విని, యా బ్రాహ్మణుఁ డధ్యయనజ్ఞానముచే నిర్విణ్ణుఁడగుట నాతనితో 'ఓధర్మరాజా! ఇంకను నాకుఁ గాలము మిగిలియుండెనేని, యదియు నిందే పుచ్చెదను.' అని పలికెను. అంత నాయముఁ డాబ్రాహ్మణుఁ గాంచి 'ఓయీ! నేనొకరి యాయుఃప్రమాణమును దెలిసికొనువాఁడను గాను. కాలప్రవృత్తుఁ డవు కాని నిన్ను నిలుపుటకు నాకు శక్తిలేదు. ఎవ్వఁ డేధర్మమును జేయునో దానిని మాత్రమే నెఱుంగుదును. ఓమహాతేజా! కావున నీవిపుడే నీయాలయమునకుఁ బొమ్ము. ఇఁక నీయిచ్ఛవచ్చినది ప్రశ్నిం పుము. దానికి నే సమాధానము తెలిపెద'నని పలికెను. అది విని యా విప్రుఁడు, 'ఓయమధర్మరాజా! మహాపుణ్యప్రదమగు పరిశుద్ధదాన మెయ్యదియో నాకెఱిఁగింపుము. ముల్లోకములకును నీవగదా ప్రమా ణము.' అని యడిగెను. అంత నాయముఁడు, 'బ్రాహ్మణోత్తమా!

ఉత్తమమగు ప్రదానవిధి నెఱిఁగించెదను వినుము. తిలదానము పవిత్రమై శాశ్వతమైన యుత్తమదానము. యథాశక్తిగాఁ దిలల నొసంగవలయును. తిలలు నిత్యము దానముసేయువాఁడు సకలకామములను బడయుచున్నవాఁడు. శ్రాద్ధమున నీతిలదాన ముత్తమమని ప్రశంసింతురు. విధ్యుక్తముగాఁ దిలలను బ్రాహ్మణుల కొసంగుము. వైశాఖపౌర్ణమియందు బ్రాహ్మణులకుఁ దిలదానము సేయవలయును. సర్వవిధముల నెల్లప్పుడు శ్రేయముఁగోరువారు, తిలోద్వర్తనమును దిలభక్షణమును నపుడు సేయవలయును. అటులే యుదకదానమును జేయవలయును. వానిని త్రావవలయును. మఱియుఁ దటాకములను, సరోవరములను ద్రవ్వింపవలయును. లోకమున వీనివలనఁ గలుగుఫలము దుర్లభమైనది. నిత్యము జలముల నొసంగవలయును. ఉదకదాన ముత్తమమైనది. నిత్యముఁ బానీయ మొసంగుశాల లేర్పఱుపవలయును. భోజనమైనపిదపఁ బానీయదాన మొనర్చుట విశేషించి పుణ్యమిచ్చును. వస్త్రదానమునఁ దంతుప్రమాణముగఁ బుణ్యమగును. దీపదానమున నది యెన్నినిమిషములు వెలుఁగునో యన్నివత్సరములు పుణ్యఫల మనుభూతమగును. గోదానమునఁ దద్రోమప్రమాణముగను, జలదానమునఁ దద్బిందుప్రమాణముగను బుణ్యమనుభవింపఁబడుచున్నది. కావున వాని నన్నిటిని నిర్వర్తింపుము.' అని తెలిపెను.

"ఓయుధిష్ఠిరా! ఆ బ్రాహ్మణుఁ డాయమునివచనములు విని యమదూతచే గృహమునఁ జేర్పంబడి యాయమశాసనము నెల్ల నిర్వర్తించెను. అంత నాయమభటుఁ డా బ్రాహ్మణుని వానియింట దిగవిడిచి, శర్మి యనువానినిఁ దీసికొనివచ్చి యమధర్మరాజునొద్దఁ బెట్టెను. ప్రతాపశాలియగు నాయముఁ డాధర్మజ్ఞుఁడగు శర్మినిఁ బూజించి, వానితో సంభాషించి మరల నెప్పటియట్ల వానిని విడిచెను. అటులు విడుచునపుడు వానికిని సదుపదేశమును జేసెను. పిదప వాఁడును మరలి యముఁడు చెప్పినచొప్పునఁ బ్రవర్తించెను. పితృహితాభిలాషముచే దీపదానవిషయమును యముఁడు ప్రశంసించుచున్నాఁడు. కావున నిత్యము దీపదానము సేయువాఁడును బితరులనుదరింపఁజేయుచున్నాఁడు. అటులగుట నిత్యము దీపదానము సేయవలయును. అయ్యది చేయువారికిని దేవతలకును బితృదేవతలకును దృప్తిని బ్రసా

దించునది. ఓజనాధిపా! రత్నదానమును మిగులఁ బుణ్యమును గూర్చును. ఏ బ్రాహ్మణుఁ డభయంకరమగు సద్దానిని విక్రయించి యాగము చేయునో, యెవ్వఁడు దానిని బ్రాహ్మణుల కొసంగునో, యెవ్వఁడు ప్రతిగ్రహించునో వారికెల్ల నక్షయపుణ్యమగుచున్నది. తమతమకుఁదగు దానప్రతిగ్రహము లెవ్వరాచరింతురో వారిరువురును నక్షయధర్మము నొందుదురని మనువు చెప్పియున్నాఁడు. వస్త్రదాన మొనర్చినవాఁడును, స్వదారనిరతుఁడును, మంచివస్త్రములను, సురూపమును బొందుచున్నారు. గోసువర్ణతిలదానములవిషయ మను వర్ణింపఁబడినది. ఓపురుషవ్యాఘ్రా! బహువిధమగు వేదప్రామాణ్యమునుబట్టి వివాహములను జేయవలయును. పుత్త్రుల నుత్పాదింపవలయును. ఓకౌరవోత్తమా! అన్నిలాభములకంటెను బుత్త్రలాభము గొప్పది" అని తెలుప విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె.

## విద్యాదిదానప్రశంస

"ఓపితామహా! మహాప్రాజ్ఞా! దానములయుత్తమవిధిని, భూదానవిశేషమును దెలుపుము. మఱియు యాగశీలుఁడగు బ్రాహ్మణునకు క్షత్త్రియుఁడు విధ్యుక్తముగా భూమిని నొసంగవలయును. బ్రాహ్మణుఁడు ప్రతిగ్రహింపవలయును. భూమిని సామాన్యుఁడగు మనుష్యుఁ డొసంగలేఁడు. ఫలకాములగు తక్కినజాతులవా రేమిదానము సేయుటకు శక్యమగును? వేదమం దేమి చెప్పఁబడియెను? దానినెల్ల నాకు మఱియు నెఱిఁగింపుము."

అది విని భీష్ముఁడు "ఓయుధిష్ఠిరా! గోపదవాచ్యములగుటఁ దుల్యనామములై తుల్యఫలములై సకలకామప్రదములైన మూఁడు దానములు గలవు. అవి యేవియంటేని వినుము. గోవులును బుడమియు సరస్వతియు నైయున్నవి. ఎవ్వఁడు ధర్మయుక్తమైన బ్రాహ్మ సరస్వతిని దగుశిష్యున కుపదేశించునో, వాఁడు గోభూదానఫలసమఫలము నొందుచున్నాఁడు. గోదానము సట్టిద యని ప్రశంసింతురు. దానిని మించిన దేయము మఱియొకటిలేదు. ఆమూఁడును సులభసాధ్యములై సమీపఫలము గలవియగుచున్నవి. సకలసుఖప్రదములగు గోవులు సర్వభూతమాతలు. నిత్యమును, శ్రేయము గోరువారు గోవులను దక్షి

ణగాఁ జేయవలయును. గోవులను బాదముతోఁ దన్నఁగూడదు. వాని నడుమఁ బోవరాదు. అయ్యవి శుభస్థానములగు దేవులగుట వానినెల్ల ప్పుడు పూజింపవలయును. యజ్ఞాదికర్మములందు గోవులకు దేవకృత మగుచోదన మొనర్పవలయును. అందు దోషములేదు. యజ్ఞాదు లును గృషియు నగిరెడికర్మములలో యజ్ఞకర్మములందు వానినిఁ బ్రేరించుట మంచిది. రెండవదగుకృషికర్మమునఁ బ్రేరించుట రెండవ పక్షముగా నుండును. పసుగెత్తించిగాని, కఱకునేలపై నడిపించిగాని గోవులకుద్వేగము గలిగింపరాదు. అయ్యవి డప్పిగలిగి చూచునేని యాచూపులచేఁ దత్స్వామి సబాంధవముగా నశించును. గోవులపేడచేఁ గదా పితృస్థానములును దేవస్థానములును బవిత్రములుగఁ జేయఁ బడును. అట్టిగోవులకంటెఁ బవిత్రమైనవేవి? ఎవ్వఁ డొకవత్సరము క్రమ ముగా దా నాహారము విడిచియేని యొకగోవున కాహార మొసంగునో, వాఁడు సకలకామప్రదమగువ్రత మొనర్చినవాఁ డగుచున్నాఁడు. అట్టివానికిఁ బుత్రసంపదయు, ధనముఁ, గీర్తియు, లక్ష్మియు నగుచున్నది. మఱియు వాని కశుభముగాని, దుఃఖస్వప్నములుగాని, గలుగవు" అని తెలిపెను.

అంత నయ్యుధిష్ఠిరుఁడు "తాతా! ఎట్టిలక్షణములు గల గోవులు దానయోగ్యములు? ఎట్టివానిని విడువవలయును? ఎట్టివారి కీయవలయును? ఎట్టివారి కీయఁగూడదు?" అని ప్రశ్నించెను. అదివిని గాంగేయుఁడు, "ఓధర్మజా! సద్వృత్తిహీనుఁడును, పాపుఁడును, లుబ్ధుఁడు, నసత్యవాదియు, హవ్యకవ్యములుచేయనివాఁడును, గోదాన పరిగ్రహమున కెన్నఁడును పాత్రులు గాఁజాలరు. భిక్షువు, బహు పుత్రుఁడును, నాహితాగ్నియు, శ్రోత్రియుఁడు నగువానికిఁ బది యా వుల నిచ్చినవాఁడు సర్వోత్తమములగు లోకముల నొందుచున్నాఁడు. ధర్మముచేయువానికి దాన మొనర్చినచో నాపరిగ్రహీత ధర్మఫలమెల్ల నాదాత కగుచున్నది. లోకమునఁ దన్నుఁ గన్నవాఁడును, భయము నుండి కాపాడినవాఁడును, దగువృత్తినొసంగినవాఁడును దండ్రు లనఁ బడుచున్నారు. గురుశుశ్రూషచేఁ గల్మషముడఁగును. మానము మహా యశము నడంచును. పుత్రులపుత్రత్వమును దొలఁగింతురు. పది యావులు వృత్తిలోపమును బోఁగొట్టును. మఱియు నెవఁడు, వేదాంత

నిష్ఠుఁడును, బహుశ్రుతుఁడును, జ్ఞానతృప్తుఁడును, జితేంద్రియుఁడును, శిష్టుఁడును, దాంతుఁడును, యతచిత్తుఁడును, సకలభూతప్రియవాది యునై యాకలిచే బీడితుఁడయ్యు దుష్కర్మమాచరింపక మృదుస్వభావుఁడై శాంతముగాఁ బ్రవర్తించుచు నతిథిప్రియుఁడై యుండునో, యట్టివిప్రునకు దానము చేయవలయును. వాఁడు తుల్యశీలుఁడును బుత్రవంతుఁడునై యుండవలయును. యుక్తపాత్రమునఁ జేసిన గోదానమున నెట్టిసుగుణములు గలవో, బ్రాహ్మణధనాపహారమున నట్టిదోషములును గలవు. బ్రాహ్మణధనమును బ్రాహ్మణపత్నులను దూరముగాఁ బరిహరింపఁదగుదురు. విప్రులభార్యాధనము లపహృతములు గాకుండ సమర్థులై యెవ్వరు రక్షింతురో, వారికి నమస్కారము. ఎవ్వరు శక్తులై యుండియుఁ బాలింపరో, వారు మృతతుల్యులు. అట్టివారి నాయముఁడు శిక్షించుచు భయపెట్టుచు నరకములనుండి విముక్తులఁ గావింపఁడు. అటులే గోపరిత్రాణమందును గోపీడనమందును శుభాశుభము లగుచున్నవి. అందును విప్రులగోవులును గృహములును రక్షితములగునేని మఱియు సుకృతమగుచున్నది." అని తెలిపి భీష్ముఁడు మఱియు నిట్లనియె.

## నృగోపాఖ్యానము

"ఓయుధిష్ఠిరా! బ్రాహ్మణధనాపహారమున నృగునకు సంభవించిన గొప్పకష్టమును బండితులు తెలుపుచున్నారు. దాని నెఱిఁగించెదను వినుము. ద్వారవతీపురమునఁ దృణలతావృతమగు నొకమహాకూపము గలదని వినికి. జలార్థులు కొంద ఆనూతినుండి జలముగొనఁ బ్రయత్నముచేయుచు బహుప్రయాసమునొందిరి. వారి కాతృణావృతమగు నూత నొక గొప్పమేనుగల తొండ గానిపించెను. అపుడు వేలకొలఁదిగా నందులకు వచ్చి దానిని పైకిఁదీయఁ బ్రయత్నించిరి. కాని వారి కది శక్యముగాకుండుట జనార్దను సమీపమున కేఁగి, 'దేవా! మేము చూచిననూతిలోని భాగమునెల్ల నావరించి యొకకృకలాస మున్నది. దాని నెవ్వఁడును నుద్ధరింపలేకున్నవాఁడు' అని విన్నవించిరి. అంత నవ్వాసుదేవుఁ డందుల కరిగి, దానిని బైకిఁదీసి 'నీవెవ్వఁడవని ప్రశ్నింప, నది తన్ను నృగునిఁగా నెఱిఁగించెను. మఱియుఁ దాను

వేయిభాగము లొనర్చితి ననియుఁ గాక కీర్తి నైతి ననియుఁ దెలిపెను. అదివిని యమ్మాధవుఁడు వానిఁ జూచి 'ఓయీ! నీవు సుకృతకర్మముఁ నే చేసితివిగాని పాపమొనర్చలేదే? ఓ రాజా! నీకిట్టిదుర్గతి యేలగల్గెను? తెలుపుము ఓనరేంద్రా! నీవు బ్రాహ్మణుల కొకకోటి గోసహస్రమును, మఱియు నొకపరి లక్ష గోవులను, మఱియును నెన్నియో గోశతములను నొసంగితివిగదా! ఆఫలమెల్ల నెందులకు బోయెను?' అని ప్రశ్నించెను. అది విని యాన్నృగుఁడు వాసుదేవునితో 'దేవా! నేనొకటి విన్నవించుకొనెదను వినుము. ఒకపుడు, నిత్యాగ్నిహోత్రియగు నొక బ్రాహ్మణుఁడు పరదేశమునకుఁ బోయినసమయమున నాతనిగో వొకటి దారితప్పివచ్చి నాగోధనములోఁ గలిసెను. అపుడు నాగోపాలకులు దానిని నాగోసహస్రములో లెక్కవెట్టిరి. అంత నొకబ్రాహ్మణుఁడు వచ్చి నన్ను యాచింపఁగా, నే నాతని కద్దానినే యొసంగితిని. పిమ్మట నాగోవుగల బ్రాహ్మణుఁడు తనధేనువును వెదకుచు నొకనియింట దానినిఁ గాంచి, యది తనదని చెప్పెను. అపుడు వారిరువురును దానికై వివాదము లాడుకొని పరితప్తచిత్తులై నాయొద్దకువచ్చి 'రాజా! నీవు దీనిని నాకిచ్చితివి గాదే!, అని యొకఁడును, 'నీవు నాగోవు నపహరించితివా?' అని యొకఁడును బలుకసాగిరి. అపుడు నే నాపరిగ్రహీతతో 'నీకు నూఱుగోవుల నిచ్చెదను. నేనిచ్చినగోవును నాకు మరల నొసంగుము' అని కోరఁగా నాబ్రాహ్మణుఁడు 'రాజా! ఇది నాకు దేశకాలోపసంపన్నయై శాంతస్వభావముతో వాత్సల్యముగలిగి సమృద్ధిగాఁ బాలిచ్చుచున్నది. దీనిపాలు మిక్కిలి రుచిగలవి. శుభలక్షణములుగల యిది నిత్యము నాగృహమున నుండవలయును. మఱియు నిది స్తన్యక్షీరములేక కృశుఁడైయున్న నాపుత్రునిఁ బోషించుచున్నది. నీవెన్ని చెప్పినను, నెన్నిగోవులనిచ్చినను నిది నీకీయఁబడదు' అని పలికి వాఁడు వెడలిపోయెను. పిదప నేను రెండవవిప్రునకు గోశతసహస్రమును, వానిగోవునకు బదులుగా నర్పింతునని ప్రార్థించితిని. అంత నతఁడు నాతో 'ఓరాజా! నేను రాజుల నుండి ప్రతిగ్రహము సేయను. నాదియే నాకుఁ గావలయును. కావున నాయావునే నాకు వడిగా నిప్పింపుము.' అని పలికి, నేను సువర్ణమును, గుఱ్ఱములను, రజతమును, రథములను నెన్నిటి నొసంగినను దీసికొనక యతఁడు వెడలిపోయెను. ఓమాధవా! అంతలో నంతకునిచేఁ

ప్రేరితుఁడనై పితృలోకమునకుఁ బోయి యముని సమీపించితిని. అప్పు డాయన నన్నుఁ జూచి నాతో 'ఓ రాజా! నీవార్జించిన పుణ్యకర్మమునకుఁ బరిమితి లేదు. అయినను తెలియక నీవొక పాపము జేయక పోలేదు. అటులగుట నీవు మున్నుగాఁ బాపఫల మనుభవింతువా? పుణ్యఫల మనుభవించినపిదప ననుభవింతువా? నీయిష్టము నెఱిఁగింపుము. రక్షించెద నయ్యెదనని ప్రతిజ్ఞ యొనర్చి చేయక యనృతవాదివైతివి. బ్రాహ్మణధన మపహరించి పాతకివైతివి. ఈ రెండుపాపములును నిన్నుఁ జుట్టుకొన్నవి. కావునఁ బుణ్యపాపములలో దేని ననుభవింతువో తెలుపు' మని యడిగెను. అంతనే నాతనితో 'మున్నుగాఁ బాపమునే యనుభవించి పిదప శుభమొందువాఁడ' నని పలికితిని. అటులు పలుకుచునే పుడమిఁబడితిని. అటులు నేను బుడమిఁబడుచున్నపుడే, యముఁడు 'ఓయీ! నిన్నా వాసుదేవుఁడగు జనార్దనుఁ డుద్ధరించును' అని బిగ్గరగాఁ బలుక వింటిని. మఱియు నాయముఁడు, 'వేయేండ్లు నిండినపిమ్మట నీదుష్కృతము క్షీణించును. అపుడు నీవు నీసుకృతకర్మముచే శాశ్వతములగు నుత్తమలోకముల నొందుదువు.' అని తెలిపెను. ఆమాటలు వినుచునే, నేను దల క్రిందై నూతఁబడిన నన్నుఁ గనుఁగొని, వెంటనే తిర్యగ్యోనిగతుఁడనైతిని. కాని నాకుఁ బూర్వజన్మస్మృతిమాత్రము తప్పిపోలేదు. ఇపుడు నీయనుగ్రహముచే నిటు లుద్ధరింపఁబడితిని. ఇది నాతపోబలముగాక వేఱేమున్నది? ఓకృష్ణా! నన్నిఁక ననుగ్రహింపుము. స్వర్గమునకుఁ బోయెదను." అని పలికి యతఁ డావాసుదేవు ననుజ్ఞ వడసి యాతనికి నమస్కరించి దివ్యవిమాన మధిష్ఠించి దివికేఁగెను. ఓయుధిష్ఠిరా! అతఁ డటులు స్వర్గమునకుఁబోఁగాఁ, గృష్ణుఁ డీశ్లోకములను దెలిపెను.

"ప్రాజ్ఞుఁడగువాఁ డెన్నఁడును బ్రాహ్మణధనము నపహరింపరాదు. నృగునిఁ జెఱచినట్టులే బ్రాహ్మణధనము, హర్తను జెఱుచుచున్నది."

ఓధర్మజా! సజ్జనులకు సజ్జనసమాగమ మెన్నఁడును నిష్ఫలము గాదు. సాధుసమాగమమువలన నృగుఁ డెట్లు పాపవిముక్తుఁడయ్యెనో చూడుము. దాన మెపుడును ఫలజనకమును, ద్రోహము

ఫలశూన్యమును నగుచున్నవి. ఓయుధిష్ఠిరా! కావున గోవుల నెన్నఁడును నపహరింపరాదు" అని తెలుపఁ విని యుధిష్ఠిరుఁడు మఱియు ని ట్లనియె.

— నాచికేతోపాఖ్యానము —

ఓయనఘా! పితామహా! గోదానఫలప్రాప్తి విస్తరించి తెలుపుము. ఎంత వినినను తృప్తి గలుగకున్నయది.

అది విని భీష్ముఁడు "ఓధర్మరాజా! నీవడిగినయర్థమున కుదాహరణముగా నొక పురాతనేతిహాసము గలదు. అయ్యది యుద్దాలకసుతునకును నాచికేతునకును జరగిన సంవాదము. దానిం దెలిపెదను వినుము. ఒకపు డౌద్దాలకిఋషి దీక్షాపరుఁడై తనతనయుఁడగు నాచికేతునిఁ దన కుపచారము చేయుచుండుమని పలికి, మఱియుఁ దన నియమము సమాప్తమగుటయుఁ, బుత్రునితో 'ఓనందనా! ఉపస్పర్శనసక్తియు, స్వాధ్యాయాభిరతియుఁ గలుగుట నే నానదీతీరమున సమిధలు, దర్భలు, పూవులు, కలశము, జలము మఱచితిని. వానిని దీసికొనిరమ్ము.' అని తెలిపెను. అది విని నదీవేగముచేఁ గొట్టికొనిపోయిన యావస్తువుల నెఱుఁ డందుఁ గానక మరలి వచ్చి 'తండ్రీ! అవి నాకందుఁ గానరాలేదు' అని తెలిపెను. అందులకాయౌద్దాలకి, తన్నాఁకలియు దప్పియుఁ బీడించుట, నోడలు తెలియక కోపావేశపరవశుఁడై 'ఓరీ! నీవు యమునిఁ జూడుము.' అని శపించెను. అటు లామునితనయుఁడు తనతండ్రి ప్రయోగించిన వాగ్వజ్రముచే నభిహతుఁడై చేతులు మొగిడ్చి 'నాయనా! ప్రసన్నుఁడ వగుము' అని పలుకుచునే గతసత్త్వుఁ డై పుడమిఁ బడియెను. అటులు కూలిన నాచికేతునిఁ జూచి యాయౌద్దాలకి దుఃఖపరవశుఁడై 'అయ్యయ్యో! నేనేమి చేసితిని' అని పలికి పుడమిఁ బడియెను. పుత్రశోకపీడితుఁడై యతఁ డట్లు దుఃఖించుచుండఁగా, నాఁటిపగలు గడచెను. అతఁ డుగ్రమగు రాత్రి వచ్చునంతకు నేడ్చుచుండెను. అపుడు తనకన్నీటిబొట్టులచేఁ దడిసి, దర్భలపై శయనించియున్న సుతుఁడును, వర్షముచేఁ దడిసినసస్యముపోలె చైతన్య మొంది కొప్పిఁ ఆలి దివ్యగంధ సమాయుక్తుఁడై నిద్రనుండి లేచినట్టు లేచుటయు, శ్లాఘ్యుఁడగు నాతనిఁ జూచి యౌద్దాలకుఁ డి ట్లనియె.

'ఓపుత్రకా! నీవక్కడి పుణ్యలోకములనెల్ల జూచితివా? నీవు నా యాగ్రహమువలన, తిరిగి వచ్చితివి. నీయది మానుష శరీరము గాదు.'

మహాత్ముడగు తనతండ్రిచే నటుల ప్రశ్నింపబడి, సమస్తము ప్రత్యక్షముగా జూచిన యానాచికేతుడు, తండ్రి కెదురుగాఁ గూరుచుండి, మహార్షుల మధ్యమునను, "ఓ జనకా! నీశాసనము చొప్పున వడిగా నే నావైవస్వతపురికిఁ బోయితిని. అందు విశాలమై, రుచిర కాంతులు వెలయ, వేయికోలఁడి యోజనపరిమితిగల సువర్ణ భౌమము లొప్పుచుఁ జూడఁదగు సభాస్థలమును బ్రవేశించితిని. అంత నయ్యంత కుఁడు తన కెదురుగాఁ బోవుచున్న నన్నుఁ గాంచి గృహములోనికిఁ దీసికొనిపోయి యొకయాసనము చూపి, నీనిమిత్తముగా, నతఁడు నన్నర్ఘ్యపాద్యాదులచేఁ బూజించెను. పిమ్మట నేనాసభ్యుల పూజ లంది వారు నానలు గెలంకుల నలరార, నాయమునితో మెల్లగా 'ఓధర్మరాజా! నేను నీదేశమునకు వచ్చితిని. నా కేలోకము లర్హ ములో వానిని దయసేయుము' అని పలికితిని. అంత నావైవస్వతుఁడు, నన్నుఁ గాంచి 'ఓసౌమ్యా! నీవు మృతుఁడవు గాలేదు. తపస్వియగు నీతండ్రి యమునిఁ జూడు మనియే పలికెను. నీతండ్రి, ప్రదీప్తాగ్ని సమతేజుఁడు. ఓవిప్రా! ఆతనివచన మనృతముఁజేయఁ దగదు. ఓతండ్రీ! నీకు నేను గానవచ్చితినిగదా! ఇఁక నీవు పొమ్ము. నీదేహమును జేసిన నీతండ్రి నీకై యేడ్చుచున్నాఁడు. నాకుఁ బ్రియాతిథివిగా వచ్చిన నీకోర్కులను దీర్పవలయునుగదా! నీమనోరథము నెఱిఁగింపుము. ఇచ్చుచున్నాఁడను' అని పలికెను. అటు లతఁడు తెలుపుటయు, నే నాతనితో 'ఓదేవా! మరలింపరాని నీదేశమునకు నేనువచ్చితినిగదా! కావునఁ బవిత్రమై సమృద్ధములైన యీలోకములను జూడఁగోరు చున్నాఁడను. నీకు నాపై దయగలదేని యిదియ నాకువరముగా ననుగ్రహింపుము.' అని కోరితిని. నావచనమాలించి యావైవస్వతుఁడు నన్నొకయానమందుఁ గూరుచుండఁబెట్టి కాంతులచే వెలయుచు, వాహ నములఁ బూన్చిన యారథము నడిపించి, తనలోకములనెల్ల నాకుఁ జూపించెను. ఓతండ్రీ! ఆపుణ్యకర్తలలోకములనెల్ల గాంచితిని. మహా త్ములగు వారిభవనము లన్నియుఁ దేజోమయములై యుండెను. మఱియు

నవి నానావిధరూపములు గలిగి, కింకిణీజాలావృతములై వేలకొలఁది యంతరములు గల్గి జలవనప్రదేశము లందందు వెలయ, వైడూర్యములచే సర్వప్రకాశములై రూప్యరుక్మమయములై బాలసూర్యసమతేజములై వెలయుచుండెను. అందుఁ గల స్థావరజంగమములన్నియుఁ దేజోవంతములై యుండెను. మఱియు భక్ష్యభోజ్యమయములగు పర్వతములును, వస్త్రములును, శయనములును, సకలకామఫలప్రదములగు వృక్షములును, సాభవనములయం దలరుచుండెను. మఱియు నెల్లెడల నదులును, వీథులును, సభలును, బావులును, దీర్ఘికలును పూన్పఁబడి ధ్వనిచేయుచున్న యానములును వేలకొలఁదిగా నందందుఁ గానవచ్చెను. అందలినదులు క్షీరమును బ్రవహించుచుండెను. నేయియుఁ బ్రవహించుచుండెను. నిర్మలోదకములు స్రవింపసాగెను. ఓనాయనా! నేను వానినెల్లఁగాంచి యామునితో 'దేవా! ఇందలి నదులు ఘృతమును క్షీరమును బ్రవహించుచుండెనుగదా! ఇవి యెవ్వనికి భోజ్యములై ప్రవర్తిల్లుచున్నవి?' అని ప్రశ్నించితిని. అపు డయ్యముఁడు నన్నుఁ గాంచి 'ఓనాచికేతా! ఇవి గోరసదాంతలగు సాధువులకు భోజ్యములుగాఁ బ్రవర్తిల్లునని తెలియుము. మఱికొన్నిలోకములందు గోప్రదానరతులు వీతశోకులై ప్రవర్తిల్లుదురు. దానమాత్రము ప్రశస్తముగాదు. పాత్రము కాలము విధియు, గోవిశేషమును సమకూరవలయును. ఓవిప్రా! గోవిశేషము దెలిసికొని దానముసేయవలయును. ఎవ్వఁడు స్వాధ్యాయవంతుఁడును, దపస్వియు, యాగశీలుఁడును నై యుండునో యట్టిబ్రాహ్మణుఁడు పాత్రమగుచున్నాఁడు. మఱియు శాంతుఁడును, గృతజ్ఞుఁడును, గోశరణ్యుఁడును, వృత్తిహీనుఁడును నగువాఁడు గోదానమున కర్హుఁడు. నిరోధము లేనివియుఁ, బోషణమునకై తన్నుఁజేరినవియునగు గోవిశేషములు ప్రశస్తములు, మూఁడురాత్రులు నీరుమాత్రము ద్రావి యుపవసించి, భూశాయియై, పిదప వత్సములయెడఁ బ్రీతి గలవియు, మంచిసంతానము గలవియుఁ, దృప్తిగలవియునగు గోవులను గ్రమముగా మూఁడుపగళ్లయందును దానముచేయవలయును. సువ్రతయు, సాధుదోహముగలదియు, శుభలక్షణయు, నపలాయినియునగు గోవు నిచ్చినచో, దాని కెన్ని రోమము లుండునో, యన్నివత్సరము లాగోదాత స్వర్గలోకసుఖము

ననుభవించుచున్నాఁడు. అటులే, శిశువడసి బరువుపోయినదై బలముగలిగి, క్షేత్రప్రాయము గలిగి, గొప్ప మేనుగలిగి కులానుజీవ్యమైన వృషభమును దానమొనర్చినవాఁడు, గోప్రదాత కుచితములగు లోకముల నొందుచున్నాఁడు. వృద్ధునకుఁగాని, రోగపీడితునకుఁగాని, దుర్భిక్షపీడితునకుఁగాని, కృషినిమిత్తముగఁగాని, హోమహేతువుగఁగాని, పుత్రజన్మమునఁగాని, గుర్వర్థముగఁగాని, యజ్ఞసమాప్తికిఁగాని గోదానము చేయవలసెనేని, దేశకాలములఁ జూడవలసినది లేదు.” అని పలికెను.

అది విని నాచికేతుఁడు, మఱియుఁ దనతండ్రితో ‘నాయనా! నేనావైవస్వతునివచనములను విని, ‘ఓయముధర్మరాజా! గోవులు లేనివాఁడు, గోప్రదాతలలోకముల నెట్లు పొందఁగలుగుచున్నాఁడు?’ అని ప్రశ్నించితిని. అంత నాతఁడు నాతో ‘ఓమునిపుత్రకా! గోవులు లేనివాఁడు గోవుల కనుకల్పముగా, మఱియొకటి దానము చేసి గోప్రదాత గావచ్చును. గోవులు లేనపుడు, నియతవ్రతుఁడై ఘృతగోవు నొసంగునేని, యాదాత కవి వాత్సల్యము వెలయ ఘృతవాహినులై యుపకరించును. ఆఘృతమును లభింపనపుడు శ్రద్ధాళుఁడై తిలధేనువును దానముసేయవలయును. అట్టివాఁడు, దుర్గమునుండి తరించి క్షీరనదియందు మోదించుచుఁ జరించుచున్నాఁడు. తాత్కాలికముగా నాతిలలును సంభవింపనపుడు జలధేనువును దానముసేయవలయును. శ్రద్ధతో దాని నొనర్చినవాఁడు కోర్కులను బ్రవహించునట్టి చల్లని యానది ననుభవించుచున్నాఁడు.’ అని తెలిపి యందుఁ గలవానినెల్ల నాకాయముఁడు చూపించెను. ఓతండ్రీ! నేను వానినెల్లఁ గాంచి పరమహర్ష మొందితిని. నీకీప్రియము నిపుడు విన్నవించుకొనుచున్నాను. అల్పధనసాధ్యమైన గొప్పగోదానక్రతువు గలదు. అయ్యది వేదచోదితమై ప్రవర్తిల్లెను. నాకాయమునిదర్శనము లభించుటనుబట్టి నీవొసంగినశాపము నాయెడ ననుగ్రహముగాఁ బరిణమించెనుగాదే? ఓమహాత్మా! నేనందు దానఫలమును గాంచినవాఁడ నగుట నిస్సందిగ్ధముగా దానధర్మము లొనర్చెదను. ఓమహర్షివర్యా! అయ్యముఁడు సోత్సాహముగా మఱిమఱియు దీనినిగూర్చియే నాకుఁ దెలిపెను. ‘ఎల్లపుడు దానప్రయతుఁడనై యుండుము. విశేషించి గోదానముచే

చేయుచును. ధర్మములయెడ ననాదరము సేయకుము. దేశకాలోప యుక్తమగు పాత్రమున దానము సేయవలయును. కావున నిత్యమును గోదానములు సేయఁదగినవి. ఇందు నీవించుకేని సందియమొందవలదు. మున్ను గోవులను దానపథనివిష్టులగువారు శాంతాత్ములై దానము నేసిరి. ఉగ్రతపోనిష్ఠులగువారును దానవిషయమున శంకవహింపక శక్తికొలఁదిగా దానము సేయుచునే వచ్చిరి. 'తగుకాలమునఁ' దమ తమశక్తినిబట్టి, శ్రద్ధతోఁ బరిశుద్ధాత్ములును, బుణ్యసంపాదనపరులును నై గోవులనొసంగి యీనాకలోకమునొంది వెలయుచున్నవారు. వృషభప్రదానములచే, దేవవ్రతియగును. గోయుగప్రదానముచే వేదప్రాప్తి యగును. రథశకటాదిదానముచేఁ దీర్థావాప్తి గలుగు చున్నది. కపిలగోత్రదానముచేఁ బాపోత్సర్గ మగును. న్యాయలబ్ధ మగు నొకకపిలగోవునే నొసంగినచోఁ గలుషవిముక్తుఁడగుచున్నాఁడు. గోరసమును మించినదేదియును లేదు. కావున గోదానము గొప్పదని తెలుపుచున్నారు. గోవులే లోకములఁ దరింపఁజేయునవి. అవియే లోకమున నన్నము గలిగించుచున్నవి. ఎవ్వఁడావుల హృదయమును దెలిసి వాని సంరక్షణమునెడ దయగలిగి యుండఁడో, యట్టిపాపచిత్తుఁడు నరకమును బొందుచున్నాఁడు. గోసహస్రమును గాని, శతముఁగాని, పదింటిని గాని, యైదింటినిగాని, తుద కొకటియేనిఁ గాని, సాధువగుబ్రాహ్మణున కొసంగినచో, నదియే, వాని కాముష్మికమునఁ బుణ్యతీర్థమగునది యగును. పుడమిని, బుష్టియుఁ బ్రాప్తియు లోకసంరక్షణము ననియెడి ధర్మములచే గోవులు సూర్యకిరణముల కీడై యున్నవి. గోసూర్యకిరణములను దెలుపు శబ్దము నొకటియే. కావున గోదాత సూర్యునివలె వెలయుచున్నాఁడు. గోప్రదానమున శిష్యుఁడు గురుని వరింపఁజేయవలయును. దాన నాతఁడు దప్పక స్వర్గము నొందును. విధిజ్ఞుల కిదియే గొప్పధర్మము. తక్కినవిధు లన్నియుఁ బ్రధానవిధినే గలియుచుండును.' అని నా కాతఁడు తెలిపెను. ఓనాయనా! ఆతఁ డిట్లు తెలుప విని ధర్మాత్ముఁడగు నాతని కేను నమస్కరించి యాతనిసెలవుగొని నీపాదమూలమును జరలఁ జేరితిని" అని నాచికేతుఁడు తెలిపినవిధ మెఱిఁగింప విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె.

## ఇంద్రపరమేష్ఠిసంవాదము

ఓపితామహా! నాచికేతునకు యముఁడు తెలిపినగోదానవిధానమును, గోవులమాహాత్మ్యమును దెలిపితివి. మఱియు మహాత్ముఁడగు నృగుఁడు తెలియక చేసినతప్పును బట్టి యాతనికిఁ గలిగినగొప్పదుఃఖమును ద్వారకయం దాఁటఁడు నూతినుండి కృష్ణభగవానునిచే సముద్ధరింపఁబడి తన్మూలమున మోక్షము నొందినవిధమును నా కెఱిఁగించితివి. అయినను గోలోకమును గూర్చి నాకొకసందేహ మొదవెడిని. గోదాత లెచ్చో వసింతురో యది నా కెఱిఁగింపుము.

అది విని గాంగేయుఁ డయ్యుధిష్ఠిరునితో "ఓధర్మజా! నీవడిగిన యర్థమున కుదాహరణముగా నొకపురాతనేతిహాసము గలదు. అయ్యది పరమేష్ఠికి, నింద్రునకు జరగిన సంవాదము. దానిం దెలిపెద నాకర్ణింపుము. ఒకపు డింద్రుఁడు పరమేష్ఠిని జేరి 'దేవా! గోలోకవాసులు నిజతేజముచే స్వర్గలోకవాసుల లక్ష్మిని దిరస్కరింతురని యూహింతును. నాకుఁ గల యాసందియమును దీర్పుము. ఓభగవానుఁడా! గోలోకము లెట్టివి? వానిఫలమెట్టిది? వానిలోఁగలగొప్పగుణ మేమి? మానవులు సులభముగా నందుల కెట్లు పోఁగలుగుదురు? గోదాత, తత్ఫల మెంతకాల మనుభవించును? దానము బహువిధ మెట్టిదగును? అల్ప మెట్టిదగును? పెక్కుగోవుల నిచ్చిన నెట్టిఫల మగును? కొంచె మిచ్చిన నెట్టిఫల మగును? గోవుల నీయకయు గోదాత లగుదురుగదా అది యెట్టిది? బహుగోదాత, యల్పగోదాత కెట్లు సరియగును? అల్పగోదాత, బహుగోదాతయట్టివాఁ డెట్టులగును? గోదానమున నెట్టి దక్షిణా ఫలప్రదమగును? అదియెల్ల యథార్థముగా నా కెఱిఁగింపుము' అని ప్రశ్నించెను" అని తెలిపి భీష్ముఁడు మఱియు నిట్లనియె.

## గోదానఫలప్రశంస

ఓయుధిష్ఠిరా! అది విని యాపరమేష్ఠి యింద్రునిఁ జూచి, "ఓయింద్రా! గోదానవిషయకముగా నీవడిగినట్టు లీలోకమున నెవ్వరును నన్నడుగలేదు. నీవెఱుఁగనట్టి లోకము లనేకవిధములుగా నున్నవి. నేనును బతివ్రతలును నెఱిఁగినలోకములు నీకుఁ దెలియవు. అట్టిలోకములను, శుభకర్మము లొనర్చి సువ్రతులైనమహర్షులును,

శుభమతులగు బ్రాహ్మణులును నిజశరీరములతోఁ బొందుచున్నారు. మఱియు వారు, శరీరసమాధికాలమందును, శరీరమోక్షమందును స్వప్న భూతములగు నాలోకములను గనుఁగొనుచుండుదురు. ఓసహస్రాక్షా! ఆలోకము లెట్టిగుణములు గలవో తెలిపెదను వినుము. అందుఁ గాలము నడువదు. ముసలితనము నుండదు. పాపకుఁడు లేఁడు. అటులే యం దమంగళము లేదు. మఱియు వ్యాధియు నాయాసమును లేవు. అందు గోవు లేమేమి గోరునో, దానినెల్ల వానికి సమకూర్పఁబడు చుండుట నేను బ్రత్యక్షముగా నెఱుఁగుదును. అందు గోవులు కామ గమనము గలవై, స్వేచ్ఛగాఁ జరించుచు, నిచ్చవచ్చినకోర్కుల నను భవించు చుండును. మఱియు నందు బావులును, సరోవరములును, నదులును, వివిధములగు వనములును, గృహములును, బర్వతములును, గలవు. సకలభూతోపయుక్తమై మనోజ్ఞమై ద్రవ్యములన్నియుఁ గల వనమొకటి యందుఁ గలదు. ఆలోకము లిట్టివని తెలియుము. అందు గోలోకమువంటిలోక మెందును లేదు. ఆలోకమునకు, సర్వసహు లును, శాంతులును, వాత్సల్యముగలవారును, గురుభక్తిగలవారును, నిరహంకారులునునగు మానవోత్తములు పోవుచుందురు. మఱియు నెవ్వఁ డెల్లమాంసములను భక్షింపక, ధర్మపరుఁడై సద్భావమును విడువక తలిదండ్రుల నర్చించుచు, సత్యవాదియై, బ్రాహ్మణశుశ్రూషా పరుఁడును నై ప్రవర్తిల్లునో, యనిందుఁడగు వాఁ డీలోకము నొందును. మఱియు గోబ్రాహ్మణులయం దసూయ లేక, ధర్మరతుఁ డై, గురుశుశ్రూషాపరుఁడై, బ్రదికియున్నంతకాలము ననృతమెఱుఁ గక దానప్రియుఁడై, యొకరియపరాధమును సహించువాఁడై, మృదు వర్తనుఁడై, దాంతుఁడై దేవభక్తియు, నతిథిభక్తియుఁ గలిగి, దయా శాలియైనమానవుఁ డీలోకము నొందును. ఈలోకము శాశ్వతము నవ్యయము నైనది. పరదారాప్రియుఁడును, గురుద్రోహియు, ననృత వాదియు, నపవాదశీలుఁడును, బ్రాహ్మణద్వేషియు, మఱియుఁ గల దోషములుగల దురాత్ముఁడును నీలోకము నొందఁజాలరు. అటులే మిత్రద్రోహియు, వంచకుఁడును, గృతఘ్నుఁడును, మూర్ఖుఁడును, వక్రబుద్ధియు, ధర్మవేత్తలను ద్వేషించువాఁడును, బ్రహ్మహంతయుఁ, బుణ్యార్థులకు నివాసమగు నీలోకమును, జిత్తముచే నైనఁ గనుఁ

గొనఁజాలరు. ఓసురేశ్వరా! నానేర్పుకొలఁది, నిదియెల్ల నీకెఱిఁగించితిని గదా! ఓశతక్రతూ! నీకు గోప్రదానరతులగువారి కగు ఫలము తెలిపెదను వినుము. దాయాదిలబ్ధములగు ధనములచేఁ గాని, ధర్మార్జితములగు ధనములచేఁ గాని యెవ్వఁడు గోవులను గొని దానము సేయునో, వాఁడక్షయములగు నుత్తమలోకముల నొందుచున్నాఁడు. ఎవఁడు ద్యూతముచే సంపాదించినధనముచేఁ గొనిన గోవులను దానము సేయునో, వాఁడు దివ్యాయుతవర్షములు తత్ఫలమనుభవించును. దాయాదిలబ్ధములును న్యాయోపార్జితములునగు గోవులనే దానము సేయవలయును. అయ్యవి ప్రదాతలకు స్థిరములై యుపకరించుచున్నవి. ఎవ్వఁడు తాను బ్రతిగ్రహించినగోవును బరిశుద్ధచిత్తముతో దానమొసఁగునో, వానికిని స్థిరములగు నక్షయలోకము లగునని తెలియుము ఓశచీపతీ! ఎవ్వఁడు నియతేంద్రియుఁడై పుట్టినదిమొదలుగా ననృతమాడకుండునో, గురువులయు బ్రాహ్మణులయు నపరాధముల సహించునో, శాంతము గలిగి, గోవులతోఁ గష్టసుఖములు సమముగా ననుభవించునో, యట్టి బ్రాహ్మణుఁడెన్నఁడు, నవాచ్యవాచ్యుఁడు గానేరఁడు. గోవులకుఁ జిత్తముచేనైన ద్రోహము సేయరాదు. మఱియు సంగ్రహపరుఁడు గాక గోవులయెడ దయగలిగి, సత్యధర్మనిరతుఁడై ప్రవర్తిల్లువాని కగుఫలమును వినుము. అట్టిబ్రాహ్మణుని గోవు గోసహస్రమునకు సరియగుచున్నది. అట్టిగుణములుగల క్షత్రియుని గోవు ఏడువందల యేఁబదిగోవులకు సరియగుచున్నది. అట్టివైశ్యుని గోవు అయిదువందలగోవులకు సమానమగుచున్నది. వినయశీలుఁడగు శూద్రునిగోవు రెండువందల యేఁబదిగోవులకు సరియగుచున్నది. సత్యరతుఁడును, గురుశుశ్రూషాపరుఁడును, దక్షుఁడును, శాంతుఁడును, దేవతార్థియు, నక్రోధనుఁడును, శుచియు, వివేకియు, ధర్మశీలుఁడు, నహంకారరహితుఁడు నగు బ్రాహ్మణునకు విధ్యుక్తముగాఁ బాలయావు నొసంగినచో మహాఫల మగుచున్నది. వేదాధ్యయన సంపన్నుఁడును, గోభక్తియుతుఁడును, దానశీలుఁడై గోవుల నభినందించువాఁడును, జన్మించినది మొదలుగా, గోవులకు నమస్కరించువాఁడును, నీగోదానఫలము నొందుదురు. గోదాతకు రాజసూయయాగము చేసిన

వాని కగుఫలము, బహుసువర్ణముతో యజించినవాని కగు ఫలమును నగునని సజ్జనులగు మహర్షులును సిద్ధులును దెలుపు చున్నారు. సత్యవాదియు, గోవ్రతియు, శాంతుఁడు, నలుబ్ధుఁడు నై యెవ్వఁడు గోవుల కాహారము పెట్టి, పిదపఁ దాను భుజించునో, యటు లొకసంవత్సరము చేసిన సత్యశీలునకు గోసహస్రదానఫలమగును. ఎవ్వఁడొకభ క్తమునచే గోవుసుగొని దానము సేయునో, వాఁ డాగో వున కెన్ని రోమము లుండునో, యన్నిగోవులదానము సేసినఫల మందు చున్నాఁడు. ఈనాచెప్పినది బ్రాహ్మణునకగుఫలము. ఇఁక క్షత్రియున కగుఫలము వినుము. క్షత్రియుఁ డైదువత్సరము లిటు లొనర్చినచోఁ దత్ఫలమగును. వైశ్యుఁ డటులొనర్చినచో నందు సగమును, శూద్రున కాయర్థమున సగమును ఫలమగునని తెలియుము. ఎవ్వఁ డాత్మవిక్ర యముచే గోవులను గొని దానము చేయునో, వాఁడు గోజాతి గలంత కాలమును సుకృతఫల మనుభవించుచున్నాఁడు యుద్ధమున నార్జించిన గోవుల నెవ్వఁడు దానముసేయునో, వాఁ డాగోవులకుఁ గలరోమము లన్నివత్సరము, లక్షయములగు నుత్తమలోకముల వసించును. గోవులు లభింపనపు డెవ్వఁడు యతవ్రతుఁడై తిలధేనువును దానముసేయునో, వాఁడు తన్నమ్మికొని కొనినగోవుల నిచ్చినంతఫల మందుచున్నాఁడు. మఱియు నట్టివాఁడు దుర్గములు దరించి యాధేనుక్షీరనదిని మోద మందును. వానిని దానము చేసినమాత్రమే ప్రశస్తము గాదు. పాత్రము, కాలము, గోవిశేషము, విధియు నావశ్యకములు. పాత్ర కాలగోవిశేషములఁ దెలియుట కష్టము. స్వాధ్యాయవేత్తయు, సత్కుల ప్రసూతుఁడును, శాంతుఁడును, యజ్ఞశీలుఁడును, పాపభీరువును, బహుజ్ఞుఁడును, గోసమానబుద్ధియు, పారుష్యరహితుఁడును, శరణ్యుఁ డును, వృత్తిరహితుఁడునునగు బ్రాహ్మణుఁడు పాత్రుఁడగుచున్నాఁడు. వృత్తిరహితునందును, మిక్కిలి కృశించుచున్నవానియందును, హోమ విషయమునను, గురువునిమిత్తమునగను, బాలురను పెంచుటకును, దానముచేయవలసినపుడు దేశకాలములఁ జూడనక్కఱలేదు. బలిష్ఠము లును, శీలవయస్సంపన్నములును, సుగంధముగలవియునగు గోవు లన్నియు దానయోగ్యము లగుచున్నవి. నదులలో గంగ యెట్టులు వరిష్ఠమో, గోవులలోఁ గపిల యటులు వరిష్ఠ యనఁబరగుచున్నది.

సువ్రతయు, సాధుదోహయుఁ, గళ్యాణవత్సముగలదియు, నపలాయి నియునగు గోవును దానమొనర్చినవాఁ, డాగోవున కెన్నిరోమము లుండునో యన్నివత్సరములు పరలోకసుఖ మందుచున్నాఁడు. అటులే భారమును వహింపఁగలదియుఁ, బిన్నవయసుదియు, బలిష్ఠమైనదియు, శిక్షితమైనదియు, హలమును వహించునదియునగు వృషభము నిచ్చు వానికిని గోదాతకగుఫలము గలుగుచున్నది. ఓయింద్రా! ఎవ్వఁ డడ విలో గోవులను, బ్రాహ్మణులను రక్షించి క్షేమముగా విడిపించునో, వానికగు ఫలమును దెలిపెదను వినుము. అటులు గోబ్రాహ్మణరక్షణ మొనర్చినవానికి శాశ్వతమగు నశ్వమేధఫల మగుచున్నది. మఱియు వాఁడు మృత్యుకాలమునఁ గోరికొనిన వృత్తి నొందఁగలుగును. పైని దెలిపిన సత్కృత్య మొనర్చినమానవుఁడు బహువిధములగు దివ్య లోకములను, మఱియుఁ దనచిత్తమునఁ గల సకలమును బొందు చున్నాఁడు. ఈయనుకల్పముచే నెవఁడు వనమున గోరక్షణపరుఁడై ప్రవర్తిల్లునో, వాఁడు గోవుల యనుజ్ఞవడసి యెల్లెడల మహాత్ముఁ డగుచున్నాఁడు. తృణగోమయపర్ణాశియు, నిస్పృహుఁడు, నియతుఁ డును, శుచియును నగువాఁడు, తనకు వలయులోకమునె గాక, నాలోకమందును వసించుచున్నాఁడు' అని తెలుప విని యింద్రుఁడు మఱియు ని ట్లనియె.

## గోవిక్రయాది ఫలకథనము

'ఓపద్మసంభవా! ఎవఁడు తెలిసియు గోవు నపహరించునో, లేక ధనమునకుఁగా విక్రయించునో, వాని కేమిగతి గలుగును? తెలు పుము.'

అది విని యప్పరమేష్ఠి, యయ్యమరేశునితో 'ఓయింద్రా! భక్షమునకుఁ గాని, విక్రయించుటకుఁ గాని, దానముసేయుటకుఁగాని, బ్రాహ్మణునకుఁగాని, యెవ్వఁడు గోవు నపహరించునో, వానికగుఫల మెఱిఁగించెదను వినుము. నిరంకుశముగా, విక్రయించుటకు గోవును హింసించువాఁడును, దానిని భక్షించువాఁడును, నటులు దానిని వధించువాని ననుమతించినవారును, దానిరోమము లెన్నిగలవో యన్నివత్సరములు నరకమున మునుఁగుచున్నారు. బ్రాహ్మణునియజ్ఞ

మును ధ్వంసముచేయునో వాని కెన్నిపాపములు సంభవించునో, యట్టి పాపములు, గోవిక్రయాపహారము గావించినవాని కగుచున్నవి. మఱియు నెవ్వఁడు గోవు నపహరించి బ్రాహ్మణునకు దానము సేయునో, వానికిఁ దద్దానమునఁ గల్గుఫల మెంతపరిమితిగలదియో, యంతపరిమితి గల నరకమగుచున్నది. ఓమహాతేజా! గోదానమున సువర్ణము దక్షిణగాఁ దెల్పుదురు. అదియే యుత్తమదక్షిణ యనుటకు సందియములేదు. గోదాత, వెనుకముందేడేడుతరములవారిని దరింపఁజేయుచున్నాఁడు. అట్టిగోదానమున సువర్ణమును దక్షిణగా నొసఁగినచో, నది ద్విగుణ ఫల మొసంగుచున్నది. సువర్ణదానమే పరమదానము. అదియే దక్షిణకు ముఖ్యమైనది. సువర్ణము పవిత్రత గలిగించునదియ గాక పవిత్రములైనవానిలోఁ బవిత్రమైనదని తెలియవలయును. ఓశతమఖా! సువర్ణము వంశపావన మైనదని తెలుపుచున్నారు. ఈదక్షిణావిధ మెట్టిదో సంక్షేపముగాఁ దెలిపితిని గదా!' అని పలికెను.

ఓయుధిష్ఠిరా! ఇది యింద్రున కాపరమేష్ఠి తెలిపెను. అతఁడు దశరథున కెఱిఁగించెను. అతఁడు తనతనయుఁడగు రామునకుఁ దెలిపెను. ఆశ్రీరాముఁడు తనప్రియానుజుఁడగు లక్ష్మణునకుఁ జెప్పెను. ఓయుధిష్ఠిరా! అతఁ డరణ్యవాససమయమున మహర్షుల కెఱిఁగించెను. అటులు పారంపర్యముగా వచ్చినదీనిని సంశితవ్రతులగు మహర్షులును ధార్మికులగు ధరారమణులును ధరించుచు వచ్చిరి. నాకిద్దానిని నా యుపాధ్యాయుఁ డెఱిఁగించెను. 'ఏవిప్రుఁ డిద్దానిని బ్రాహ్మణసభలో యజ్ఞకాలమునందు గోదానసమయములందును, నా రెండును గలిసి నపుడును దెలుపునో, వానికి దేవతలతోపాటు నిత్యము నక్షయలోకము లగుచున్నవి.' అనియుఁ బరమేష్ఠి వచించెను." అని తెలుప విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె.

### శాంతిసత్యాదిప్రశంస

"ఓపితామహా! నీవు దెలుపుచున్న ధర్మములయెడ నాకెంతయు విశ్వాసము గలుగుచున్నది. నాకుఁ గల సందియ మెఱిఁగించెదను. దానిందీర్పుము. వ్రతముల కెంతఫలము గలదు? అది యెట్టిది? నియమముల ఫల మెట్టిది? అధ్యయనఫల మెట్టిది? దమమునకు ఫల

మేమి? వేదధారణమునకుఁ గల ఫలమేమి? అధ్యాపనఫల మెట్టిది? అదియెల్ల నాకెఱిఁగింపుము. ఓపితామహా! ఈలోకమునఁ బ్రతిగ్రహింపకుండువాఁ డెట్టిగతి నొందును? వేదము నెవ్వఁ డొసంగునో, వాని కగుఫల మేమి? నిజకర్మనిరతులకును శూరులకును నగుఫల మెట్టిది? సత్యమునకును, బ్రహ్మచర్యమునకును గలఫలము లెట్టివి? తలిదండ్రుల సేవించినవారి కగుఫలమేమి? అటులే, యాచార్యులను గురువులను సేవించువారికిని, భూతదయోపకారబుద్ధులు గలవారికిని నగుఫలము లెవ్వి? నాయడిగినయర్థము లన్నియు యథార్థముగా, మిగులనీక యెఱిఁగింపుము. వానిని విన నాకెంతయుఁ గుతూహల మయ్యెడిని."

అది విని భీష్ముఁడు, యుధిష్ఠిరు నారసి "ఓధర్మజా! ఎవ్వఁడు యథోద్దిష్టమగు వ్రతమును లెస్సగా నారంభించి, సంపూర్ణముగా జరపునో, వానికి సనాతనలోకము లగుచున్నవి. ఓరాజా! నియమ ఫలము ప్రత్యక్షముగ, నైశ్వర్యరూపమై గానఁబడుచునే యున్నది. నియమములయుఁ గ్రతువులయు ఫలమే, నీచే నిటు లొంగఁబడినది. అధ్యయనమునకును నిహాపరములందు ఫలము గలదు. దాని కీలోకమున ధనప్రాప్తియుఁ, బరమున బ్రహ్మలోకమున సంతసించుటయు ఫలము లగుచున్నవి. దమమునకుఁ గలఫలము విస్తరించి తెలిపెదను వినుము. దాంతు లెల్లెడల సుఖితు లగుదురు. దాంతు లెల్లవిషయ ములఁ దృప్తులగుదురు. వారు సకలశత్రునిషూదనులై తమయిచ్ఛ వచ్చినచోటులఁ జరింపఁ గలుగుదురు. వారేది కోరుదురో, యదియెల్ల వారికి లభించుటలో సందియము లేదు. ఓపాండవాగ్రజా! దాంతు లెల్లచోటుల నెల్ల కామముల నొందఁ గల్గుచున్నారు. తపోవిక్ర మములవలనను, వివిధములగు దానయజ్ఞములవలనను గలుగు స్వర్గ ఫలము దాంతుల కగుచున్నది. దానముకంటె దమమే యుత్తమమైనది. బ్రాహ్మణుల కేదేని గొంచె మిచ్చువాఁడు కోపించినను గోపింప వచ్చును. కాని దాంతున కట్టిది గలుగదు కావున దానమునకన్న దమమే పరమమైనది. ఎవ్వఁడు కోపరహితుఁడై దానము సేయునో, వానికి సనాతనలోకము లగుచున్నవి. క్రోధ మెట్టిదానమునేని విఫ లము గావించును. కావున దానముకంటె దమమే మేలైనది,

ఓమహారాజా! స్వర్గమందును, సర్వలోకములందును, దేవగణలోంది నట్టివియు, మహర్షుల కగ్రామము లైనట్టివియు, స్థానము లదృశ్యములై యగుతముల కొలందిగా నున్నవి. అయినను, మహర్షులు దమముచే నొందఁదగు మహాస్థానమునే గోరుచుందురు. కావున దానముకంటె దమమే యుత్తమ మైనది. మఱియొకటి వినుము. విద్యాదానమును మించినది లేదు. వేదవిద్యలు మహాఫలజనకములు. అధ్యాపకుఁడు నిజపరిక్లేశమునుబట్టి యక్షయఫల మొందుచున్నాఁడు. విధ్యుక్తముగా హోమ మొనర్చినవానికి బ్రహ్మలోక మగును. తా నధ్యయన మొనర్చి వేదముల నధ్యాపనము చేయువాఁడును, గురుభక్తుఁడును స్వర్గము వడయుదురు. అధ్యయనమందును, యజనదానకర్మములందును సక్తుఁడై, యుద్ధమున నొరులను రక్షించువాఁడు స్వర్గవాసి యగుచున్నాఁడు. వైశ్యుఁడు నిజకర్మనిరతుఁ డగునేని దానమువలని ఫల మొందును. శూద్రుఁడు శుశ్రూష చేయుచు నిజకర్మపరుఁ డగునేని స్వర్గమున కర్హుఁడగును. శూరులు బహువిధములుగా నుందురు. వారి కగుఫలముల నెఱిఁగించెద వినుము. శూరవంశములకుఁ దెల్పఁబడిన ఫలము శూరున కగుచున్నది. యజ్ఞశూరులును, దమశూరులును, సత్యశూరులును, యుద్ధశూరులును, దానశూరులును, బుద్ధిశూరులును, శాంతిశూరులును, సాంఖ్యశూరులును, యోగశూరులును, నరణ్యవాస-గృహవాస-త్యాగ-శూరులును, శమార్జవశూరులునన మానవులు బహువిధశూరులై ప్రవర్తిల్లుదురు. మఱియు నాయానియమములచే ననేకులు శూరులయియుందురు. మఱికొందఱు వేదాధ్యయనశూరులును, నధ్యాపనశూరులు నైయుందురు. వేఱొకకొందఱు గురుశుశ్రూషాశూరులును, నింకొకకొందఱు భైక్ష్యశూరులు నై వెలయుచుందురు. మఱికొందఱు పితృమాతృశుశ్రూషాశూరులై యుందురు. ఇంకను గొందఱు, గృహవాసారణ్యవాసములందును, నతిథిపూజన మందును శూరులుగా నుందురు. నా తెలిపినవారందఱును, నిజకర్మఫలనిర్జితములగు నుత్తమలోకముల నొందుచున్నారు. సకల వేదధారణమును, సర్వతీర్థావగాహనమును, సత్యవాదికిఁ దగుఫలమును గాని, కొంచెము తక్కువఫలముగాని పొందఁజేయుచున్నది. అశ్వమేధసహస్రఫలమును, సత్యఫలమును నొకత్రులయం దుంపఁగా, నశ్వమేధసహస్రఫలమును

సత్యఫలము మిగులగున్నది. సత్యముచేతనే సూర్యుఁడు వెలుఁగు చున్నాఁడు. దానిచేతనే యగ్ని మండుచున్నది. దానివలననే గాలులు వీఁచుచున్నవి. సకలమును సత్యమందే ప్రతిష్ఠితమైయున్నది. సత్యము వలననే దేవతలు తృప్తినొందుచున్నారు. అటులే పితరులును, విప్రు లును ప్రీతులగుచున్నారు. సత్యమునే గొప్పధర్మమునుగాఁ దెలుపు దురు. కావున సత్యమును దప్పరాదు. సత్యరతులే మునులు. సత్య విక్రములే మునులు. సత్యశపథులే మునులు; కావున సత్యమే యన్ని టిని మించునది. ఓభరతవంశభూషణా! సత్యవంతులు సత్యలోకమున వసించుచుందురు. దమమునకు సత్యఫలమగునని నే నెల్లవిధములఁ దెలిపితిని. అట్టి దమముగలవాఁడు నిస్సంశయముగా స్వర్గమున మహో త్తరుఁ డగుచున్నాఁడు. ఓవసుధాధిపా! ఇఁక బ్రహ్మచర్యమున కగు ఫలమును దెలిపెద వినుము. పుట్టినది మొదలుగా మరణించునంతకు నెవఁడు బ్రహ్మచర్య మొనర్చునో, వానికిఁ బొందరాని దేదియును లేదని తెలియుము. సతతసత్యనిరతులును, దాంతులు, నూర్ధ్వరేతులు నగుమహర్షు లనేకకోటిసంఖ్యాకులు బ్రహ్మలోకమున వసించు చున్నారు. ఉపాసితమగు బ్రహ్మచర్యము సకలపాపములను బాపు చున్నది. అందును బ్రాహ్మణుఁ డొనర్చినబ్రహ్మచర్య మెన్నఁదగినది. బ్రాహ్మణుఁడగ్ని యట్టివాఁడనిగదా చెప్పఁబడును. తపస్వులగు బ్రాహ్మణు లయం దది ప్రత్యక్షఫలమగుచున్నది. బ్రహ్మచారి వెఱపించినచో శక్రుఁడును భయ మొందుచున్నాఁడు. మహర్షులబ్రహ్మచర్యఫల మిహ మున నే గానఁబడుచున్నది. ఇఁకఁ దలిదండ్రులసేవ సేయువాని కగుఫల మెఱిఁగించెదను వినుము. ఒకపుడును నసూయపడక యెవఁడు తండ్రిని, దల్లిని, భ్రాతను, గురుని, నాచార్యుని సేవించునో, వానికి పూజితమగుస్వర్గలోకస్థితియే ఫలమగుచున్నదని తెలియుము. గురు శుశ్రూషాపరుఁడగునాత్మజ్ఞుఁ డెన్నఁడును నరకమును జూడవలసినది లేదు." అని తెలుప విని యుధిష్ఠిరుఁ డి ట్లనియెను.

## గోదానఫలకీర్తనము

"ఓపితామహా! ఉత్తమమగుగోదానవిధినే యథార్థముగా మఱియు వినఁగోరుచున్నాఁడను. అటులు విధ్యుక్తముగా నొనర్చిరే

గదా! శాశ్వతములగులోకములను గోరువారు వానిని బొందఁగలుగు చున్నారు.”

అది విని భీష్ముఁడు “ఓధర్మజా! గోదానమును మించినది వేఱొకటిలేదు. న్యాయార్జితమగుగోవు, దానముసేయఁబడునేని యది యాందాతవంశమును వెంటనే తరింపఁజేయుచున్నది. సజ్జనులకార్యమునకుఁగా నేవిధి యుత్పాదింపఁబడియెనో, యది యీగోవులనుండియే లెస్సగాఁ గల్పింపఁబడినదని తెలియుము. కావున నాదికాలప్రవృత్తమగుగోదానవిధినిఁ దెలిపెదను వినుము. మున్నొకప్పు డుపనీతములగు గోవులవిషయమున నొక్కసందేహముగలిగి, మాంధాత ప్రశ్నింపఁగా నాతనికి బృహస్పతి యిట్లు తెలిపెను.

‘ఓయీ! బ్రాహ్మణులను బిలిచి, సత్కరించి, యథోక్తకాలముపవాసమొనర్చి, నియతవ్రతుఁడై రోహితవర్ణముగలగోవును దానమునకై ప్రయోగింప నెంచి, ‘సమంగా! బహులా!’ అని పిలిచి, గోమధ్యమును బ్రవేశించి యీశ్రుతి నుదాహరింపవలెను. ‘గోవు నాకుఁ దల్లి, వృషభము నాకుఁ దండ్రి. అదియే నాకు స్వర్గము, గర్భము జగతియుఁ బ్రతిష్ఠయు నగుచున్నది’ అని దానినిఁ జేరి గోవుల నడుమ నారాత్రి యుపవసించి, మఱియు గోప్రదానసమయమున నీవచనము పలుకవలయును. అటు లతఁడు గోవులతో సమవ్రతుఁడై వానిసఖ్యముచేసి, యొకరాత్రి గడపి, తదేకాయత్తచిత్తుఁడైనచో వెంటనే కలుషవిముక్తుఁ డగుచున్నాఁడు. సూర్యదర్శన సమయమున నుత్సృష్టవృషవత్సయగు గోవు నొసంగుదువేని త్రిదివము నొందుదువు. అర్థవాద మంత్రోక్తములగు నాశీర్వాదములు నీకగును. ‘బలముగలవియు, బుద్ధిగలవియు, యజ్ఞసాధన మగు హవిస్సునకు క్షేత్రభూతములును, జగతీ స్థితిహేతువులును, నైశ్వర్యకారణములును, శాశ్వతములును, బ్రవాహరూపములును, బ్రాజాపత్యములు నగుగోవు లగుఁగాక’ యనునవియే యర్థవాదాశీర్వచనములు. ‘సౌర్యములగు గోవులు నాపాపమును దొలఁగించుఁగాక. అటులే, సౌమ్యములగు గోవులు, నాస్వర్గయానమున కగుఁగాక. అవి నాయాత్మను, దల్లివలె నాశ్రయించుఁగాక. అటులే మంత్రోక్తములగు నాశీర్వాదములు నా కగుఁగాక. రోగ

నివృత్తియందును, దేహమోక్షమందును, బంచగవ్యాది కర్మము లచే సేవింపఁబడినగోవులు నదులవలె శ్రేయోదాయకము లగుఁగాక. 'ఓగోవులారా! నిత్యమును నాయెడఁ బ్రసన్నతను జూపి, సర్వపుణ్యసంపాదనీయమగునిష్టగతినిఁ బ్రసాదింతురుగాక. మీరే నేను. నేను మిమ్ము నొసంగి యాత్మప్రదాత నైతిని. 'నేను దాతను. ఇవి దేయములు' అను నభిమానమునుండి విడువంబడి, 'నేనే యివి' యనెడిస్థితినొందిన నాకు మీరు, సౌమ్యరూపము, సుత్తమదేహమును గలిగి నాకిష్టగతి నొసంగవలయును' అని పలుకవలయును. గోదాన సమయమున ముందుగా, మంత్రపూర్వభాగమును గోదాతయు, దక్షిణసగమును గోదానవిధిజ్ఞుఁడును బ్రాహ్మణుఁడు నగుప్రతిగ్రహీతయు నుచ్చరింపవలయును. గోదాత సువ్రతుఁడై 'గోవు నిచ్చుచున్నా'నని యుదకము విడుచుచుఁ బలికి, 'ఇది నీచే వహింపఁదగినది. భరింపఁదగినది ఇది వైష్ణవి' అని ప్రోత్సహింపవలెను. మఱియు యథాసంఖ్యోత్తరముగాఁ దద్గోనామసంకీర్తన మొనర్పవలయును. గోదానమున బహుఫలములు గలవు. తాను దానముచేసినగోవు ప్రతిగ్రహీతయింటికిఁ బోవునపు డెనిమిదడుగులు నడుచునప్పటికి దాత గోదానఫలముల నన్నిటి నొందుచున్నాఁడు. గోదాత శీలసంపన్నుఁడును, నర్ఘ్యదాత నిర్భయుఁడును, వసుదాత దుఃఖరహితుఁడును నగుచున్నారు. ప్రాతస్స్నాతయు, భారతవేత్తయు, విష్ణుభక్తులును జంద్రసమప్రభగలవారని దెలుపఁబడుచున్నారు. గోదానముచే మూఁడు రాత్రులు గోవ్రతముగలిగి యుండవలయును. ఒకరాత్రి వానితోఁ గలిసి యుండవలెను. కామదోహయగుగోవు నెవ్వఁడొసంగునో, వాఁడు భూమిగతములగు సకలకామముల నొందుచున్నాఁడు. అయ్యవి హవ్యకవ్యముల కుపయుక్తములైనవి. వృషభదానము గోదానమును మించునదని తెలియుము. సర్వలోకధర్మప్రదమగు నీ పరమరహస్యము, శిష్యుఁడుగానివానికిని, వ్రతహీనునకును, శ్రద్ధారహితునకును, వక్రబుద్ధికిని నుపదేశింపరాదు. ఈధర్మము నెల్లవారికినిఁ జెప్పరాదు. మానవులలో శ్రద్ధగలవారును, క్షుద్రరాక్షసులును గలరు. అటులగుట నెవ్వరు స్వల్పపుణ్యులై నాస్తికభావము నాశ్రయింతురో, యట్టివారి కిజ్ఞానినిఁ దెలుపరాదు.'

ఓయుధిష్ఠిరా! బృహస్పతి తెలిపిన యీవిషయమును విని, యేరాజు లీగోదానము లొనర్చి, పుణ్యశీలురై యుత్తమలోకముల నొందిరో, వారి నెఱింగించెదను వినుము. ఉశీనరుఁడు, విశ్వగశ్వుఁడు, నృగుఁడు, భగీరథుఁడు, మాంధాత, ముచుకుందుఁడు, భూరిద్యుమ్నుఁడు, నైషధుఁ డగుసోమకుఁడు, పురూరవుఁడు, భరతుఁడు, భరత వంశస్థులగు మఱికొందఱును, వీరుఁడగుదశరథరాముఁడును, కీర్తినిధులగు మఱికొందఱును, నటులే పుణ్యకర్ముఁడగు దిలీపుఁడును, నీ గోదానములచేఁ ద్రిదివమునొందిరి. ఓధర్మజా! అటులగుట నీవును, నా తెలిపిన బార్హస్పత్యభారతిని జ్ఞప్తియందుంచుకొని, బ్రాహ్మణోత్తములకుఁ బ్రీతిపూర్వకముగా, గోదానములు సేయుము. కురురాజ్యమును బొందితివిగాదే! కావునఁ బవిత్రములగుగోవుల నొసంగుము." అని తెలిపెను.

ఓజనమేజయా! అటులు తెలిపిన భీష్మునివచనముల చొప్పున ధర్మజుఁడు విధ్యుక్తముగా, గోప్రదానవిధి నొనర్చెను. మఱియు నామాంధాతకు బృహస్పతి తెలిపినవిషయమును జ్ఞప్తియందుంచుకొనియెను. ఓరాజా! గోదానసమయమున, గోమయములతో యవశకలములను ద్రావుచు భూమిశాయియై, శిఖియు, యతాత్ముఁడు నగుచు, మూర్తిభవించినధర్మమట్టులు వెలయుచు, గోవులను గౌరవభావముతోఁ గనుగొనుచుఁ, దురగములఁ బూన్చిన రథముతో నందందుఁ జరింపసాగెను. అని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

ఓజనమేజయా! పిమ్మట నయ్యుధిష్ఠిరుఁడు, మఱియు నాభీష్మునిఁ దనకు గోదానవిధిని విస్తరించి తెలుపుమని వినయమునై నిట్లు ప్రశ్నించెను.

"ఓపితామహా! గోప్రదానగుణములను మఱియు లెస్సగా నా కెఱింగింపుము. అమృతమయమగు దీని నెంత వినినను నాకుఁ దృప్తి యొదవకున్నది."

ఓజనమేజయా! అది విని యాశాంతనవుఁడు, గోప్రదానగుణముల నెఱింగించువాఁడై "ఓధర్మజా! వాత్సల్యముగలదియు, సద్గుణములుగలదియు, లేతప్రాయముదియు నగుగోవును వస్త్రముగప్పి,

విప్రున కొసంగినచో సకలపాపవిముక్తుఁడగును. అసూర్యములనియెడి లోకములు కొన్నిగలవు. గోదాత, యట్టిలోకములకుఁ బోఁడు. నీరు ద్రావినదియుఁ, గసవు మేసినదియుఁ, బాలు లేనిదియుఁ, నింద్రియ శూన్యమైనదియు, జరారోగయుక్తమై జీర్ణించినదియునై నీరులేనిబావి వలె నున్నగోవును దానముచేసినవాఁడు నరకగతుఁడగుచు, బ్రాహ్మణునకు శ్రమము గల్గించువాఁ డగుచున్నాఁడు. కోపముగలదియు, దోషముగలదియు, వ్యాధిపీడితయు, బలములేనిదియునగు గోవు నీయరాదు. మఱియు మూల్యమొసంగక తేఁబడినవియు దానయోగ్యములుగావు. ఎవ్వఁ డిట్టిదాన మొనరించి నిష్ఫలక్లేశమును బ్రాహ్మణుల కొదవించునో, వానికి నిస్సారములును నిష్ఫలములునగు లోకములగుచున్నవి. బలముగలవియు, శీలవయస్సంపన్నములును, సుగంధము గలవియునగు గోవులన్నియు దానయోగ్యములగును. కాని, నదులలో గంగ ప్రశస్తమైనట్టులు, గోవులలోఁ గపిల వరిష్ఠమైనది." అని తెలుప విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె.

"ఓపితామహా! సమానబహులా ప్రదానమునఁ, గపిలా ప్రదానము ప్రశస్తమని పండితులు తెలుపుదురుగదా! అందుగల మహా ప్రభావమును విశేషమును వినఁగోరుచున్నాఁడను. నీవు దెలుప సమర్థుఁడవు."

అది విని గాంగేయుఁడు, "ఓయుధిష్ఠిరా! పెద్దలు దెలుపఁగాఁ బురాతనవిషయ మొకటి వింటిని. కపిలగోవు లెటులు సృజింపఁబడినవో యదియెల్లఁ దెలిపెదను వినుము. మున్నొకపుడు దక్షుఁడు, ప్రజల సృజించుటకై పరమేష్ఠిచేఁ బ్రేరింపఁబడి, మున్నుగాఁ బ్రజలకు హితమగురీతిగా వృత్తినే సృజించెను. దేవత లమృతము నాశ్రయించి యెట్లు కాలము పుచ్చుచున్నారో, యటులే ప్రజలును దగువృత్తి నాశ్రయించి జీవింపవలయునని యభిప్రాయముతో నతండు వృత్తినే కల్పించెను. జంగమస్థావరములలో జంగమములును, నందును మానవులు నుత్తములు. వారిలో బ్రాహ్మణు లుత్తములు. వారియందు యజ్ఞములు ప్రతిష్ఠితములై యున్నయవి. ఎవఁడు యజ్ఞములచేఁ బొందనగునో, యట్టిసోముఁడు గోవులందుఁ బ్రతిష్ఠితుఁడయ్యెను. ఆగోవుల వలననే దేవతలు మోదమందుచున్నారు. ప్రజలజీవనాధార మీగోవు

లందున్నది. ప్రజలు సృజింపఁబడినతోడనే జీవనాధారమునకై యాక్రోశించిరి. ఆఁకలిదప్పులపీడనోపక తలిదండ్రులనుబోలెఁ బ్రజలు తన్నువృత్తికై వేఁడుట తెలిసికొని పరమేష్ఠి తానపుడు బలమునుగూర్చి నమృతమును ద్రావెను. అటు లతఁడు తృప్తిగా నమృతమును ద్రావుటయు నాతనికి సురభిగంధము గల్గునట్లుగాఁ ద్రేనుపు వచ్చెను. అపుడా త్రేనుపుతో నాతనివదనమునుండి సురభి జనించెను. ఆసురభియే లోకమాతలగుగోవులను వెలయించెను. ప్రజల కపుడు సువర్ణవర్ణములగు కపిలగోవులే జీవనాధారములై యెల్లెడలఁ బాలను స్రవింపఁ జేయుచుండఁగా నాయమృతమునుండి జనించినఫేనము నదులఫేనమునుబోలి వానివత్సముల ముఖములనుండి వెడలి, పుడమిఁ దపము చేసికొనుచున్న శివుని శిరముపైఁ బడియెను. అందుల కతఁడు కుపితుఁడై తనఫాలనేత్రాగ్నిచేఁ గపిలగోవులను గాల్చువాఁడై చూచెను. ఓరాజా! ఆరుద్రుని తేజముచేఁ గపిలగోవులన్నియు దివాకరుని తేజస్సంబంధమున మేఘములట్లు నానావర్ణములయ్యెను. అపు డవి సోము నాశ్రయించి యన్యవర్ణమును విడిచి యెప్పటియట్ల సువర్ణవర్ణములయ్యెను. పిదపఁ బ్రజాపతి, కుపితుఁడైన మహాదేవునితో 'ఓ దేవా! నీ వమృతముచేఁ దడుపఁబడితివి. గోవుల కుచ్ఛిష్టమున నెట్టిది? సోముఁ డమృతమును గొని, మరల దానిని స్రవింపఁజేయుచున్నాఁడు గాదే? అటులే యమృతసంభవములగు నిక్కపిలగోవులును, క్షీరము స్రవింపఁజేయుచున్నయవి. గాలియు, నగ్గియు, సువర్ణము, సముద్రమును దూష్యము లెన్నఁడును గాఁజాలవు. అమృతనిమిత్తమయిన యమృతమగు క్షీరము వత్సములచేఁ ద్రావంబడియు దూష్యము గానేరదు. ఈగోవులు హవిస్సుచేతను, బ్రస్రవముచేతను నీలోకములను బోషించుచున్నవి. శుభప్రదమై యమృతమయమైన యీ గోవులయైశ్వర్యమునే యెల్లవారును గోరుచున్నారు' అని పలికి లోకభావనుఁడగు నాభగవానుఁ డమ్మహాదేవున కొకవృషభము నిచ్చెను. అందుల కాతనిచిత్తము ప్రసన్నమయ్యెను. అటులాశంకరుఁడు ప్రీతుఁడై యావృషభమును దనకు వాహనముగను జిహ్నముగను నొనర్చికొని, యతఁడు వృషభధ్వజుఁ డయ్యెను. పిమ్మట నాతని దేవతలు పశుపతిని గావించిరి. అపు డయీశ్వరుఁ డాగోవులనడుమ

వృషభాంకుఁడై కీర్తింపఁబడియెను. ఇటు లాకపిలగోవు, లపక్వాగ్రపక్షి ములై మహాతేజములగుచుండుటను, వానిని దానముచేయుటయే ప్రథమకల్పమని చెప్పఁబడియెను. ఇయ్యవి లోకజ్యేష్ఠములును, లోక జీవనాధారములై ప్రవర్తిల్లినవియు, రుద్రోద్భూతములును, సోమ విష్యందములును, సౌఖ్యములును, పవిత్రములును, కామప్రద ములును, ప్రాణప్రదములును నై వెలయుచున్నవి. గోదాతయు సకల కామప్రదుఁ డగుచున్నాఁడు. ఉత్తమమగు నీగోప్రభవవిధానమును నిత్యమును పఠించువాఁడు శుచియు, మంగళప్రియుఁడును నై కలి కలుషమునుండి విముక్తుఁడగుచున్నాఁడు. మఱియు నట్టివాఁడు ప్రియపుత్త్రులను ధనమును పశువులను బొందుచున్నాఁడు. ఈగోవుల దానమువలన హవ్యకవ్యములును, తర్పణమును యానము వాసము వృద్ధబాలతుష్టియు మున్నగుగుణములు గలవు. గోదాత వీనినెల్లఁ బొందఁగలుగుచున్నాఁడు.” అని తెలిపెనని పలికి వైశంపాయనుఁడు ఓరాజా! భీష్మునివచనములు విని యాధర్మజుఁడు తనతమ్ములతోఁ గూడి సువర్ణవర్ణములగు వృషభములను గోవులను బ్రాహ్మణోత్తములకు దానమొనర్చెను. అటులే యజ్ఞములకు దక్షిణలుగా, వందల కొలందిగను వేలకొలందిగను గోవులను ద్విజుల కొసఁగి, లోకజయ శీలియుఁ బరమకీర్తిపరుఁడు నై యుండెను. అని పలికి మఱియు నిట్లనియె.

ఓజనమేజయా! ఇటు లాభీష్ముఁడు తెలిపి మఱియు నాధర్మజా నకు సహేతుకముగా, ధర్మవిధి నిటులు తెలుప నారంభించెను.

“ఓధర్మజా! ఇక్ష్వాకువంశమున నే యిక్ష్వాకువంశసంభవుఁడగు సౌదాసుఁడనియెడి రాజు సర్వలోకచరుఁడును, సిద్ధుఁడును, బ్రహ్మకోశ భూతుఁడును, సనాతనుఁడును, మహర్షిసత్తముఁడును, తనకుఁ బురో హితుఁడు నగువసిష్ఠుని సమీపించి, ప్రశ్నించువాఁడై నమస్కరించి ‘ఓయనఘా! మూఁడులోకములందును పవిత్రమైన దెయ్యది? మానవుఁ డెల్లపుడు దేనిని కీర్తించుచు నధికపుణ్యము వడయఁ గల్గునో దానిని నాకెఱిఁగింపుము’ అని ప్రశ్నించెను. అది విని యమ్మ హర్షి, ప్రణతుఁడైన యాసౌదాసునకు హితముగాఁ దెలుప నెంచి, గోవిషయకవిధుల నెఱిఁగినవాఁడగుటఁ శుచియై గోవులకు నమస్కరించి

యిట్లు పలికెను. 'ఓసౌదాసా! నీవడిగినదాని కెఱిఁగించెదను వినుము. గోవులు సురభిగంధముగలవియు, గుగ్గులుగంధముగలవియునై వెలయును. గోవులే భూతములకు స్థితిహేతువులు. అవియే గొప్పశుభస్థానము. అవియే భూతభవ్యములు. అవియే ప్రపంచమునకు సనాతనమగుపుష్టి. అవియే లక్ష్మికి మూలము. గోవులకుఁ బెట్టినదానికి నాశము లేదు. గోవులే మానవులకుఁ బరమాహారప్రదములు. అవియే దేవతలకుఁ బరమహావిస్సు. స్వాహాకారవషట్కారము లాగోవులందే ప్రతిష్ఠితములై యున్నవి. గోవులే యజ్ఞఫలము. యజ్ఞములు వానియందే ప్రతిష్ఠితములు. గోవులే భూతభవిష్యములు. వానియందే యన్నియుఁ బ్రతిష్ఠితములై యున్నవి. ఓమహాతేజా! సాయంప్రాతఃకాలములందు మహర్షులొనర్చుహోమముల కవియే హోమపదార్థముల నిచ్చునుగాదే. ఓప్రభూ! ఎవ్వ రట్టిగోవులను దానముసేయుదురో, వారు తామొనర్చిన యెట్టిదుష్కృతములనేని దలఁగించికొని యెట్టికష్టములనేనిఁ గడువఁగలుగుచున్నారు? పదిగోవులుగలవాఁ డొకదానిని దానము సేయవలయును. నూఱుగలవాఁడు పదియావుల నొసంగవలెను. వేయిగలవాఁడు, నూఱిఁటిని దానమొనర్పవలయును. వారందఱు నొక్కరీతి ఫలమొందుచున్నారు. నూఱుగోవులుగలవాఁ డాహితాగ్నిగాకున్నను, వేయిగోవులుగలవాఁడు యజ్వగాకున్నను, ధనసమృద్ధిగలిగియు లోభియైనను, నట్టివారు పూజార్హులుగారు. ఎవ్వరు కంచుపాత్రలకొలఁది పాలిచ్చునదియు, సువ్రతయు, సవత్సయు నగుకపిల గోవును వస్త్రముచేఁ గప్పి దానముసేయుదురో వా రుభయలోకములను జయించినవా రగుచున్నారు. మఱియు, లేఁతవయసుగలదియు, నింద్రియబలము గలదియు, శతగోయూథపతియైనదియు గొప్ప కొమ్ములు గలదియు నగువృషభము నలంకరించి, శ్రోత్రియుఁ డగు బ్రాహ్మణున కెవ్వరు దానము సేయుదురో, వారు మఱిమఱియు జనించుచు నైశ్వర్యమునందఁ గలుగుచున్నారు. గోవులను స్మరింపక శయనింపరాదు. గోవులను స్మరించుచునే మేలుకొనవలయును. మఱియు సాయంప్రాతఃకాలములయందు గోవులకు నమస్కరింపవలయును. అటులేని బుష్టివడయును. గోమూత్రపురీషముల నెన్నఁడు హేయబుద్ధితోఁ జూడరాదు. గోవులమాంస మెన్నఁడును భక్షింప

రాదు. వానిపృష్టినే యరయుచుండవలెను. గోవులను నిత్యము స్తుతింపవలె గాని నిందింపరాదు. మానవులకు దుస్స్వప్నము గలిగినపుడు గోవులను గీర్తింపవలెను. గోమయముతో నెల్లపుడును స్నానమొనర్పవలెను. గోకరీషమున నిద్రింపవలెను. వానిపై శ్లేష్మమూత్రపురీషముల విడువరాదు. మెత్తనగు గోచర్మముపై భుజింపవలెను. వరుణదిశను నిరీక్షింపవలెను. మఱియు ఘృతముచేఁ బుడమి సంస్కరించి యందు వాగ్యతుఁడై యుండవలెను. అట్టివాఁడు గోపుష్టి ననుభవించును. గోఘృత మగ్నిలో హోమమొనర్పవలయును. దానితోడనే స్వస్త్యయనము చెప్పవలయును. దానిని దానమొనర్పవలెను. దానిని భుజింపవలెను. అటులేని గోపుష్టినొందుచున్నాఁడు. గోమతియను విద్యచేఁ దిలధేనువు నభిమంత్రించి దానిని సర్వరత్నమయముగా నొసగి యెవ్వఁడు దానము సేయునో, వాఁడు కృతాకృతములందు శోకపాత్రుఁడు గానేరఁడు. హేమశృంగములు గలిగి పయోధారలను విడుచుచుఁ బరిమళముగల గోవులు, సముద్రమును జేరునదులట్లు నన్ను సమీపించుఁగాక. నేను గోవులను గాంచెదను. నన్ను గోవులు గాంచుఁగాక. మాకు గోవులును, గోవులకు మేము నగుచు గోవులెందుండునో, యందే మేముందుము.' అని రాత్రియుఁ బగలును, సమవిషమావస్థలందును, మహాభయములందును గీర్తించినమానవుఁడు భయవిముక్తుఁ డగుచున్నాఁడు' అని తెలిపి వసిష్ఠుఁడు మఱియు నిట్లనియె.

### గోప్రదానికకథనము

'ఓసౌదాసా! మున్ను పరమేష్ఠిచే సృజింపఁబడి గోవు లాతని నుద్దేశించి నూఱువేలసంవత్సరములు దుష్కరతపమొనర్చి యాతనితో 'దేవా! మాయీతపమునకు ఫలముగా వరము లొసంగుము. మేము లోకమున శ్రేష్ఠత నొందవలయును. లోకమునఁ గల దక్షిణలలో నెల్ల మేమే యుత్తమదక్షిణల మగుదుము గాక. మాకెట్టిదోషములు నంటఁగూడదు. మఱియు మాపురీషము గలిపిననీట స్నానమొనర్చి జనము పావనమగుఁగాక. దేవమానుషాలయములును మాపురీషములచేఁ బవిత్రము లగుగాక. అటులే మావలనఁ జరాచరాత్మకములగు సకలభూతములును బరిశుద్ధములు గావలయును. మమ్ము దానము చేసిన

వారు మాలోకముల నొందుదురు గాక' అని కోరికొనియెను. అపుడా పరమేష్ఠి 'అటులే యగుఁగాక. మీరులోకములను దరింపఁజేయుదురు' అని పలికెను. భూతభవ్యమాతృక లగుగోవులు మనోరథసిద్ధి వడసి యపుడు లేచి పోయినవి. కావున నట్టిగోవులకుఁ బ్రాతఃకాలమున నమస్కరించినవారికిఁ బుష్టి యగుచున్నది. అయ్యవి తపోంతమున లోకపరాయణములును బరమపవిత్రములు నయ్యెను. అటులగుట నవి సకలభూతములందు నుత్తమము లై యుండెను. అట్టిగోవులలోఁ గపిలయు సమానవత్సయుఁ బాలుగలదియు సువ్రతయు నగుధేనువు, వస్త్రమును గప్పి యెవ్వఁడు దానము సేయునో, వాఁడు బ్రహ్మలోకమునఁ బూజ్యుఁ డగుచున్నాఁడు. మఱియుఁ దుల్యవత్సయుఁ బయస్వినియు నగు లోహిత ధేనువు నెవ్వఁడు వస్త్రసంవీతముగా నొనర్చి దానము చేయునో, వాఁడు సూర్యలోకమున మహత్తరుఁ డగుచున్నాఁడు. సమానవత్సయు, సువ్రతయు, యశస్వినియు నగు కర్బురవర్ణగోవును వస్త్రసంవీతముగా నొనర్చి దాన మొనర్చినచో సూర్యలోకనివాస మగుచున్నది. తుల్యవత్సయుఁ బయస్వినియు నగుశ్వేతధేనువును దాన మొనర్చినచో, నింద్రలోకమున మహత్తరుఁ డగుచున్నాఁడు. తుల్యవత్సయుఁ బాలు గలదియు నగు నల్లనియావును వస్త్రసంవీతముగా నొనర్చి దానము చేసినచో, నగ్నిలోకమున మహత్తరుఁ డగుచున్నాఁడు. సమానవత్సయుఁ, బయస్వినియు నగుధూమ్రగోవును వస్త్రాచ్ఛాదితముగా నొనర్చి యిచ్చినచో, యమలోకమునఁ బూజితుఁ డగుచున్నాఁడు. కాంస్యపాత్రదోహనయై నీటినురుగురంగు గలధేనువును వస్త్రాచ్ఛాదితముగా నొనర్చి వత్సముతోఁ గూడ దాన మొనర్చినచో వరుణలోకసుఖ మనుభవించును. ధూళిరంగు గలదియుఁ గంచుపాత్రలకొలఁది పాలిచ్చునదియు నగుగోవును వస్త్రసంవీతముగాఁ జేసి దాన మిచ్చినచో, వాయులోకనివాసి యగుచున్నాఁడు. బంగారురంగుగలదియుఁ, గాంస్యదోహనయుఁ, బింగనేత్రయు నగుధేనువును వస్త్రాచ్ఛాదితముగాఁ జేసి వత్సముతో దానమొనర్చినఁ గుబేరలోకమగును. పలాలధూమవర్ణయుఁ, గాంస్యదోహనయు నగుధేనువును బట్టగప్పి సవత్సముగా నిచ్చినచోఁ బితృలోకమున మహత్త్వమగుచున్నది. నల్లని మెడగలిగి బలిష్ఠమైన యావు నలంకరించి సవత్సముగా

నిచ్చినచో, శ్రేష్ఠమగు విశ్వేదేవస్థానము నిర్బాధముగా నొందఁ బడును. తుల్యవత్సయు, బయస్వినియు నగు గౌరవర్ణ ధేనువును సవత్స ముగను సవస్త్రముగను దాన మొనర్చినచో వసులోక మొందఁబడును. కాంస్యదోహనయుఁ, బాండుకంబలవర్ణయు నగు ధేనువును వస్త్రసంవీత ముగఁ జేసి వత్సముతోఁ గూడ నొసంగునేని సాధ్యులలోకము ప్రాప్తించును. పెద్దమూఁపురము గలిగిన వృషభమును, సర్వరత్నాలం కృతముగా నొనర్చి దాన మొనర్చినచో మరుత్తులలోక మొందఁ బడును. మధ్యమవయసు గలదియుఁ, జక్కనియవయవములు గలదియు నగువృషభమును రత్నాలంకృతముగా నొనర్చి దాన మొనర్చినచో, గంధర్వాప్సరోలోకమును మానవుఁడొందుచున్నాఁడు. నల్లనికంతము గలిగిన వృషభమును సకలరత్నాలంకృతముగఁ జేసి యిచ్చినచోఁ బ్రజాపతిలోకము గల్గుచున్నది. 'ఓ రాజా ! గోదానరతుఁ డగువాఁడు సూర్యకాంతిగల విమానముతో, మేఘమండలమును భేదించుకొని పోయి స్వర్గమున వెలయుచుండును. గోదానరతుఁడై మానవోత్తముఁ డగునాతని, సుందరవేషములు గలిగి సుశ్రోణులైన సురకాంతలు పలువిధముల సేవింతురు. మఱియు నతఁడు, తత్సురకాంతల వీణా వల్లకీ నూపురాదిధ్వనులతోడను, హాసములతోడను నిద్రించుచు వానిచే మేలుకనుచుండును. గోదాతకుఁ దానొసంగినగోవున కెన్ని రోమము లుండునో యన్నివత్సరము, లుత్తమలోకములందుండి, స్వర్గ చ్యుతుఁ డయ్యు, మఱియు మానవలోకమున నుత్తమమైన గొప్ప యింటఁ బుట్టుచున్నాఁడు.' అని తెలిపి వసిష్ఠుఁడు మఱియు నిట్లనియె.

గోదానఫలకథనము:

'ఓసౌదాసా ! 'ఘృతక్షీరప్రదములును, ఘృతయోనులును, ఘృతోద్భవములును, ఘృతనదులును, ఘృతావర్తములు నగు గోవులు, నాయింట నుండుఁగాక. నిత్యము నాహృదయమందును, నాభియం దును ఘృతము ప్రతిష్ఠితమైయున్నది. మఱియు నాసకలగాత్రము లందును మనసునందును ఘృతమున్నది. నాముందును నావెనుకను గోవులున్నవి. నాకు నలువంకల గోవులున్నవి. నేను గోవుల నడుమ నున్నాఁడను.' అని ప్రతిప్రాతస్సాయంకాలములందును

మానవుఁ, డాచమించి జపమొనర్పవలయును. అటు లొనర్చెనేని వాఁ డానాఁ డొనర్చినపాపము పోవును. వేయిగోవులిచ్చినవారు, సువర్ణమయప్రాసాదములును, వసుధారలును గలగంధర్వాప్సరోలోకములకుఁ బోవుచున్నారు. మఱియు నట్టివారు, నవనీతపంకములును, క్షీరోదకములును, దధిశైవలములును గలనదు లెందుండునో యట్టి లోకముల నొందుచున్నారు. విధ్యుక్తముగా నూఱువేలగోవు లిచ్చినవా రుత్తమమగునభివృద్ధి గలిగి స్వర్గలోకమున సకలసౌఖ్యముల నొందుచురు. పదిగోదానము లొనర్చినవాఁడు మాతాపితృవంశములను బితామహాంలను బవిత్రులఁగాఁ జేసి, సుకృతలోకములను వారికిఁ గలిగించుటయొగాక, వంశపావనుఁ డగుచున్నాఁడు. ధేనుప్రమాణముగాఁ దిలధేనువును జేసి దానమొనర్చినవాఁడును, పానీయదాతయు, యమలోకయాతన నొకింతయేనిఁ బొందరు. పవిత్రమైనవియు, నుత్తమములును, లోకప్రతిష్ఠాభూతములును, దేవమాతలు, నప్రమేయములు నగు గోవుల, నచ్వాలంభ మొనర్చి దక్షిణముగాఁ గొంచెము నడిచి, కాలపాత్రములఁ గనిపెట్టి దానము చేయవలెను. సవత్సయు, భూరిశృంగయుఁ, గాంస్యోపదోహయుఁ గపిలయు నగుధేనువును, వసనోత్తరీయముగలదానినిగా నొనర్చి దానమిచ్చినవాఁడు, దుర్విగాహ్యమగు యమసభను నిర్భయుఁడై ప్రవేశించుచున్నాఁడు. 'సురూపములు, బహురూపములును, విశ్వరూపములును, లోకమాతలు నగుగోవులు నన్ను సమీపించుగాఁక' అని కీర్తింపవలెను. గోదానమును మించినదానమును, దానిఫలమును మించినఫలమును, దానికంటె నుత్తమ మైనదియు భూతభవిష్యములలో లేదు. మఱియు దానిచర్మము, రోమములు, శృంగములు, వాలములు, క్షీరము, మేదస్సును యజ్ఞోపయుక్తములు నగుచుండును. అటు లగుట గోవులను మించిన వేవియును లేవు. ఏయది చరాచరాత్మకమగు నీప్రపంచమునెల్ల నెల్లవిధముల వ్యాపించి యున్నదియో, యట్టిధేనువును, భూతభవ్యమాతను నేను శిరసా వహించుచున్నాఁడను. ఓసౌదాసా! గోవుల గుణసముచ్చయమున, నేకదేశమేని వచింపలేదు. ఇంత యేల? గోదానమును మించినది వేఱులేదు. దానికంటెఁ బరాయణము మఱిలేదు.' అని తెలిపెను.

ఓయుధిష్ఠిరా! ఆవసిష్ఠునివచనము విని గోదాన ముత్తమమని తలంచి మహాత్ముఁడగు సౌదాసుఁడు, నియతాత్ముఁడై ద్విజులకు బహు గోధన మొసంగి యుత్తమలోకముల నొందెను." అని తెలుప విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె.

## గోమాహాత్మ్యకథనము

"ఓపితామహా! పవిత్రమైనవానిలోఁ బవిత్రమైనదియు, లోకమున నుత్తమ మనఁదగినదియుఁ, బరమపావన మైనదియు నగుదానిని నాకెఱిఁగింపుము."

అది విని భీష్ముఁడు, "ఓధర్మజా! గోవులు గొప్పపదార్థములు. పవిత్ర మైనవి. మానవులను దరింపఁజేయునవి. హానిపయోహావిస్సులచే నీప్రజలు బ్రదుకుచున్నారు. ఓభరతసత్తమా! గోవులకంటె బరమపుణ్యమైనది వేఱొకటి లేదు. అవియే ముల్లోకములందును బవిత్ర మైనవియుఁ, బుణ్యప్రదములును, నుత్తమములు నై వెలయుచున్నవి. గోవులు దేవతలకంటె మీఁదుగా వర్తించునవని తెలియుము. వివేకులగువారు గోవుల నొసంగి, తరించి యుత్తమలోకముల నొందుచున్నారు. యౌవనాశ్వుఁడగుమాంధాతయు, యయాతి, నహుషుఁడు శతసహస్రసంఖ్యాకములగు గోవులను నిత్యమును దానముచేసి, దేవతలకును దుర్లభమగునుత్తమస్థానము నొందిరి. ఓయనఘా! మఱియు నీవిషయమునఁ గల యొకపూర్వగాథ నెఱిఁగించెదను. ఒకప్పుడు ధీశాలియగు శుకుఁడు మహర్షిసత్తముఁడగు కృష్ణద్వైపాయనునకు నమస్కరించి, కృతాహ్నికుఁడును శుచియుఁ బ్రయతచిత్తుఁడు నగుచు, లోకమునఁ గల యెల్లవిషయముల నెఱిఁగిన తండ్రితో నిట్లనియె.

'ఓనాయనా! యజ్ఞములం దెల్ల నేయది యుత్తమయజ్ఞము? ఏయది పరిష్ఠముగాఁ దెలుపఁబడుచున్నది? దేనిని జేసి మనీషులుత్తమస్థాన మొందుచున్నారు? ఓవిభూ! పవిత్రమగునెద్దాన దేవతలు స్వర్గమనుభవించుచున్నారు? యజ్ఞమునకును యజ్ఞమెయ్యది? దేనియందు యజ్ఞము ప్రతిష్ఠిత మైయుండును? దేవతలకును నేయది యుత్తమ మనఁదగినది? పవిత్రము లైనవానిలో నేయది, పవిత్రమైనదియో నాకెఱిఁగింపుము.'

అది విని పరమధర్మవేత్తయగు వ్యాసుఁడు, పుత్రునకు యథార్థముగా నంతయు నెఱిఁగించువాఁడై 'ఓపుత్రకా! గోవులే సకల భూతములకు స్థితిహేతువులు. అవియే యెల్లవారికిని బరాయణములు. అవియే పవిత్రములును పుణ్యప్రదములు నైయున్నవి. గోధనమే పావనమైనది. పూర్వము గోవులకు శృంగములు లేవని వినికి. అవి తమకు శృంగములు గలుగుటకై యవ్యయుఁడగు ప్రభు నుద్దేశించి తపమొనర్పఁగా, నా పరమేష్ఠి ప్రాయోపవేశమొనర్చియున్న యాగోవులను గాంచి, వానికిఁ బ్రత్యేకముగా, నీప్సితము నొసంగెను. అపుడు గోవులలో దేని కేది మనోగతమో యట్టిశృంగములు జనించెను. ఓపుత్రకా! అపు డవి నానావర్ణములై కొమ్ములు గలిగి విరాజిల్లెను. అటులు బ్రహ్మవలన వరప్రసాదమొంది హవ్యకవ్యప్రదములును, శుభప్రదములును, విచిత్రములును, బుణ్యప్రదములు, దివ్యసంస్థానలక్షణములు గలిగి శుభగతిగలవియు నై వెలయఁజొచ్చెను. గోవులే మహత్తరదివ్య తేజము. గోదానము ప్రశస్తమైనది. సాధువులును వీతమత్సరులు నై యెవ్వరు గోదానము లొనర్తురో, వారు పుణ్యాత్ములై సర్వదానప్రదు లగుదురని తెలుపఁబడుచున్నారు. మఱియు వారు పవిత్రమగు గోలోకమును బడయుచున్నారు. ఎందు దివ్యపుష్పఫలవంతములై మధువు గలిగినవృక్షము లుండునో, యెందు దివ్యసుగంధము లుండునో, యెందు భూమి మణిమయ మైయుండునో, మఱియు నెందలి ప్రదేశములు కాంచనవాలుకము లై సకలఋతు సంస్పర్శము గలిగి నిష్పంకములు, నీరజములు, శుభప్రదములు నై యుండునో, మఱియుఁ దరుణాదిత్యతుల్యములై హిరణ్మయము లైన మణిఖండములతోడను, రక్తోత్పల వనములతోడను జలాశయము లెందు వెలయుచుండునో, మహార్హమణి పత్రములును కాంచనప్రభ కేసరమును గలిగి, నీలోత్పలమిశ్రములైన పెక్కుపంకజములు గల సరస్సు లెందు ప్రకాశించుచుండునో, యాప్రదేశములందు గోదాతలు సుఖించుచుందురు. మఱియు వికసించిన కరవీర వనములతోడను, సహస్రావర్తసంవృతములైన సంతానక వనములతోడను, వికసించిన పుష్పవృక్షములతోడను, శోభిలుచు, నిర్మలములగు ముత్తెములతోడను, మహాప్రభములగు. మణులతోడను, సువర్ణవాలుకములగు

నదులు వెలయ, సర్వరత్నమయములై చిత్రములైన ద్రుమోత్తమములతో నలరుచున్న ప్రదేశములందు గోదాతలు వసింతురు. సర్వరత్నమయములై యున్నతములగు శృంగములతో మణిరత్నశిలోచ్చయములు గలసువర్ణపర్వతము లెందుండునో, దివ్యగంధరసములు గలపుష్పఫలములతో వెలయుచుఁ, బక్షిసంకులములైన వృక్షము లెందు విరాజిల్లునో, యట్టి మనోజ్ఞ ప్రదేశములందుఁ బుణ్యకర్ములగు గోదాతలు క్రీడించుచుందురు. మఱియు నట్టిపుణ్యాత్ములు, శోకరహితులును బరితాపశూన్యులు నగుచు, సకలకామసమృద్ధులై మనోజ్ఞములై విచిత్రములగు విమానములందు విహరించుచుఁ గీర్తినిధులై సంతసించుచుందురు. మంగళప్రదములగు నప్సరోగణములు వారిని గూడి యాడుచుండును. పైని దెలిపిన పుణ్యలోకము లన్నియు గోదాతల కగుచున్నవి. 'దేనికిఁ బూషుఁడును, బలవిషయమున బలశాలి యగుగాలియు, నైశ్వర్యమున తరుణుఁడును నధిపతులై యుండిరో, యట్టియుగంధరములగు గోవులు మమ్ము రక్షించుఁగాక. సురూపములును, బహురూపములును, విశ్వరూపములును, లోకమాతలును నగు గోవులు మమ్ము రక్షించుఁగాక' అని నిత్యము నియతవ్రతుఁడై జపింపవలయును. ఎవ్వఁడు గోవుల సేవించునో, యెవ్వఁడు వాని ననుసరించి చరించునో, యట్టివాని కెల్లదేవతలును బరితుష్టులై దుర్లభములగు వరముల నొసంగుచున్నారు. సుఖమపేక్షించువాఁడు మనసుచేనైనను గోవులయెడ ద్రోహము చేయరాదు. అదియుఁగాక వాని నెల్లపుడును నమస్కారాదులచేఁ బూజింపవలయును. అటులేని, దాంతుఁడును బ్రీతచిత్తుఁడునై గోపుష్టి నొందఁ గల్గుచున్నాఁడు. మూఁడుదినములు గోవులవెచ్చనగు మూత్రమును ద్రాగవలయును. మూఁడుదినములు వెచ్చనగుదాని పాలు ద్రాగవలయును. మఱియు మూఁడుదినములు వెచ్చనగు దానిఘృతమును ద్రాగవలయును. అటులు ఘృతముఁ ద్రావి మూఁడుదినములు వాయుభక్షకుఁడై యుండవలయును. పవిత్రమగు నెద్దాన, దేవత లుత్తమలోకసుఖము నొందుచున్నవారో, పవిత్రములగువానిలో నెయ్యది పవిత్రమైనదియో, యట్టి ఘృతమును శిరసా వహింపవలెను. ఘృతముచే నగ్నియందు హుత మొనర్పవలయును. ఘృతముచే స్వస్తివచనము చెప్పవలయును. ఘృత

మును ద్రావవలెను. ఘృతము నీయవలయును. అటులేని గోపుష్టి గలుగుచున్నది. గోమయనిర్గతములగు యవలతో యావకము లొక మాసము భక్షించినవాఁడు, బ్రహ్మహత్యాసమపాతకము నేనిఁ బాపు కొనఁ గలుగుచున్నాఁడు. దైత్యులపరాభవ మొందినదేవతల కీగోవులే శౌచముగాఁ జేయఁబడియెను. వానిచేతనే వారు సిద్ధులై మహా బలులై దేవత్వమును సైతమొందిరి. అటు లగుట గోవులు పవిత్రము లును బుణ్యప్రదములును నై గొప్పపావనపదార్థము లగుచున్నవి. అట్టిగోవులను దాన మొనర్చినవానికి స్వర్గసౌఖ్య మగునని చెప్పుటలో సందియ మేమున్నది ? గోవులమధ్యమునసుండి శుచియై గోమతీ ఋక్కును జిత్తముచే జపింపవలయును. పవిత్రములగు నుదకములచే నాచమన మొనర్చి, శుచియై యగ్నులనడుమను, గోవులనడుమను, బ్రాహ్మణసభను జపించినవాఁడు నిర్మలుఁ డగుచున్నాఁడు. పుణ్యకర్మ లగు బ్రాహ్మణులు, విద్యావేదవ్రతస్నాతులై, యజ్ఞసమ్మితమగు గోమతిని శిష్యులకుఁ జెప్పవలయును. మూఁడురాత్రు లుపవసించి గోమతిచేఁ దెలుపఁబడు నర్థమును బడసినచోఁ బుత్రకాముఁడు పుత్రుని, ధనకాముఁడు ధనమును, భర్తృకామ భర్తను, సకలకాము లగువారు సకలమును బొందుచున్నారు. గోవులు సేవితములై తుష్టి నొందెనేని సకలము నొసంగుటలో సందియము లేదు. ఓయీ! ఇక్కపిల గోవులు యజ్ఞోపయుక్తములై సకలకామముల నిచ్చునని తెలియుము. వీనినిమించు నుత్తమము లెవ్వియును లేవు' అని మహాత్ముఁడగు తన తండ్రివచనములు విని శుకుఁడు గోవులను బూజించెను. కావున నిత్యము నీవును గోవుల నారాధింపుము.” అని తెలుప విని యుధిష్ఠి రుఁడు మఱియు నిట్లనియె.

## గోలక్ష్మీసంవాదము

“ఓపితామహా! గోపురీషము, లక్ష్మిచే సేవింపఁబడియెనని విని యున్నాఁడను. అందె నాకెంతయు సందియము గలదు. దాని నిపుడు నా కెఱిఁగింపుము.”

అది విని భీష్ముఁడు “ఓయుధిష్ఠిరా! నీవడిగిన యర్థమున కుదా హరణముగా నొకపురాతనేతిహాసము గలదు. అయ్యది లక్ష్మికి గోవు

లతో జరగిన సంవాదము దానినెఱింగించెద నాకర్ణింపుము. ఒకపుడు లక్ష్మి మనోజ్ఞమగురూపముతో గోవులనడుమం బ్రవేశించెను. అపు డాగోవు లామె రూపసంపద నారసి యందులకు విస్మయావిష్టములై యిట్లు పలికెను.

గోవులు:—ఓదేవీ! నీ వెవ్వతెవు? పుడమి నిట్టి నిరుపమాన రూపము నీకెట్లు గలిగెను? ఓమహాభాగా! నీరూపసంపద నారసిన మాకెంతయు విస్మయమగుచున్నది. నిన్నుం దెలియ మాకుం గోర్కి గలిగెడిని. నీ వెవ్వతెవు? ఎందుల కేఁగెదవు?

లక్ష్మి:—మీకు శుభమగుంగాక. నేను లోకకాంతను. నాపేరు లక్ష్మి. నాచే దైత్యులు విడువంబడి పెక్కువత్సరములు నష్టమైరి. నేను జేరిన దేవతలు పెక్కేండ్లనుండి మోదమందుచున్నారు. ఇంద్రుఁడును, సూర్యుఁడు, చంద్రుఁడు, జలము, అగ్నియు, విష్ణువు, మహర్షులును, దేవతలును, నన్నుంగూడియే సిద్ధినొందుచున్నారు. ఏగోవులయందు నేను బ్రవేశింపనో యట్టిగోవులు నశించుచున్నవి. ధర్మార్థకామములు నాచే సేవింపఁబడి సుఖాన్వితము లగుచున్నవి. సుఖప్రదములగు నోగోవులారా! నే నిట్టిప్రభావము గలదాననని తెలియుఁడు. మఱియు నిత్యము మీయందు నివసింపఁ గోరుచుందును. కావుననే, మీకడకు వచ్చి ప్రార్థించుచున్నాను. మీరు శ్రీసేవిత లగుఁడు.

గో:—ఓలక్ష్మీ! నీవు చపలవు. అస్థిరవు. మఱియు బహుప్రాణిసామాన్యవు. కావున నిన్ను మే మభిలషింపము. నీకు శుభమగుంగాక. నీయిచ్చవచ్చినకడకు వెడలి విహరింపుము. మే మెల్ల చక్కనిశరీరము గలవారము. నీతో మాకేమి ప్రయోజనము? నీపని యేమో యయ్యెను. ఇఁక యథేష్టముగా నీవు పోవచ్చును?

లక్ష్మి:—ఓగోవులారా! మీరు నన్నిటు లంగీకరింపమి, యేమి యుచితము? దుర్లభనై పతివ్రత నగునన్ను మీరు ప్రతిగ్రహింపకుండుటకు హేతువేమి? ఓసువ్రతములారా! ఈలోకవాదము సత్యమై లోకమున వెలయుచున్నది. తమంతఁ దాము ప్రాప్తించిన వస్తువు లెడ నవమానము సూపుదురఁట. నిశ్చయము. మానవులు మహత్తరమై యుగ్రమైన తపమొనర్చి నన్నుం గోరుచుందురు. అటులే దేవదానవ

గంధర్వులును, పిశాచోరగరాక్షసులును నన్నుఁ గోరుచుందురు. ఓగోవులారా! నా ప్రభావ మిట్టిది. కావున నన్నుఁ బ్రతిగ్రహింపుఁడు. ఓసౌమ్యస్వభావలారా! చరాచరాత్మకమగు నీలోకత్రయమందును నే నవమానింపఁదగినదానను గాను.

గో:—ఓదేవీ! నిన్ను మే మవమానింపను లేదు. తిరస్కరింపను లేదు. నీవు చలచిత్తవు; అస్థిరవు. అటులగుట నిన్ను వర్జించుచున్నారము. వేయేల! నీయిచ్చవచ్చిన చోటుకు వెడలిపొమ్ము. మేము చక్కనిశరీరముగలవారము. మాకు నీతోఁ బనియేమి?

లక్ష్మి:—ఓగోవులారా! మీరు నన్నవమానింతురేని సర్వలోకమునకు నవజ్ఞాత నగుదును. కావున నన్నుఁ బ్రత్యాఖ్యాతగఁ జేయక నాయెడ ననుగ్రహము సూపుఁడు. మీరు మహాభాగలు, శరణాగతులకు శరణమిచ్చువారు కావున నిత్యము మిమ్ము సేవింప వచ్చి యనిందితనై యున్న నన్ను రక్షింపుఁడు. మీమున్ననే కోరుచున్నదానను. మీనీచాంగమందేని నివసింప నాకనుజ్ఞ యొసంగుఁడు. ఓపవిత్రలారా! మీయంగములందుఁ గుత్సితమైన దొకటియును గానరాదు. అన్నియుఁ బవిత్రములే. కావున నాకాజ్ఞ యొసంగుఁడు. నేను మీయంగములలో నెందుండవచ్చునో నిరూపింపుఁడు.

ఓధర్మజా! ఇటు లాలక్ష్మి పలుకుటయు, నాశుభబుద్ధిగలగోవులు కారుణ్యవాత్సల్యములు వెలయ, నన్నియును గూడి యాలక్ష్మినిఁ బిలిచి 'దేవీ! మేము నీకుఁ దప్పక గౌరవ మొసంగవలసినదియే. కావున నీవు మామూత్రపురీషములందు నిలువుము. ఓశుభచరిత్రా! అవి పవిత్రము లైనవియే యని తెలియుము' అని తెలిపెను. ఆగోవులపలుకు లాలించి, యారమాదేవి వానితో 'దైవానుగ్రహముచే మీరు నాయెడఁ బ్రసన్నచిత్తలైతిరి. అటులే గానిండు. మీచే మేలగుఁ గాక. మీచేఁ బూజింపఁబడితిని' అని పలికెను. ఓయుధిష్ఠిరా! ఇటు లాశ్రీదేవి, గోవులతో నొకనిశ్చయ మొనర్చికొని, యవి చూచుచుండఁగనే యంతర్హిత యయ్యెను. ఓపుత్రకా! గోపురీషమాహాత్మ్య మిట్టు లెఱిఁగించితినిగదా! మఱియు గోవులమాహాత్మ్యమును దెలిపెదను వినుము" అని భీష్ముఁడు మఱియు నిట్లనియె.

## దానధర్మకథనము

"ఓయుధిష్ఠిరా! ఎవ్వరు గోవుల నొసంగుదురో, యెవ్వరు హుతశేషమును భుజింతురో, వారికి, నిత్యము సత్రములు యాగములు నగుచున్నవని తెలియుము. దధిఘృతములు లేక యజ్ఞము ప్రవర్తిల్ల నేరదు గదా! అటు లగుటనే యవి యజ్ఞమునకును యజ్ఞమనియు, యజ్ఞమూలము లనియును దెలుపఁబడుచున్నవి. అన్నిదానములందును గోదానము ప్రశస్తమగుచున్నది. అయ్యవి మిగులఁ బవిత్రము లైనవియు, నుత్తమము లైనవియు నై నెల్లవస్తువులఁ బావనముగా నొనర్చునవి. వానిని సేవించినచోఁ బుష్టియు శాంతియు నగుచున్నది. మఱియు వానిపయోదధిఘృతములు సకలపాపహరము లగుచున్నవి. ఇహపరములందును గోవు లుత్తమతేజమని చెప్పఁబడుచున్నవి. ఓ ధర్మజా! గోవులకంటెఁ బరమ పవిత్రమైనది వేఱొకటి లేదు. ఇందుల కొక పురాతనేతిహాసము గలదు. అయ్యది యింద్రునకును బరమేష్ఠికిని జనగినసంవాదము. దాని నెఱిఁగించెద నాకర్ణింపుము. త్రిభువనేశ్వరుఁడగు నింద్రుఁ డొకపుడు దైత్యులను బరాభవించెను. అపుడు సత్యధర్మపరాయణులగు ప్రజలందఱును, మహర్షులును, గంధర్వులును, కిన్నరోరగరాక్షసులును, దేవతలు, నసురులును, సుపర్ణులును, ప్రజాపతులును గలిసి పితామహుని సేవించిరి. మఱియుఁ బర్వతుఁడు విశ్వావసువు, నారదుఁడు, హాహాహూహువులును దివ్యగానము లొనర్చుచు నాతని సేవింపసాగిరి. అపుడు దివ్యపుష్పవర్షములు గురిసెను. చల్లనిగాలి వీవసాగెను. ఋతువు లన్నియు సుగంధములను గలిగించెను. సకలభూతసమాగమముగల యాదేవసమాజము, దివ్యవాదిత్రఘోషము గలిగి యుండ, నింద్రుఁ డాపరమేష్ఠికి నమస్కరించి యిటులొకటి ప్రశ్నించెను.

'ఓపితామహా! లోకేశులగు దేవతలకును మీఁదుగా, గోలోక ముండుటకు నిమిత్తమేమియో తెలియఁ గోరుచున్నాఁడను. ఓదేవా! గోవులు తపమొనర్చెనా? బ్రహ్మచర్య మొనర్చెనా? ఏమి చేసెను? అవి దేవతలకు మీఁదుగా, సత్వసుఖమనుభవించుచుండుటకు నిమిత్త మేమి?'

అది విని యాపరమేష్ఠి బలనిషూదనుఁడగు నింద్రు నుద్దేశించి 'ఓయింద్రా! నీవు నిత్యమును గోవులయెడ నాదరము సూపవు. అకృతమున నీ కాగోవులమాహాత్మ్యము తెలియఁబడకున్నయది. నే నెఱిఁగించెదను వినుము. ఓసురోత్తమా! ఆగోవులప్రభావము మాహాత్మ్యమును సర్వోత్తమ మైనది. వాసవా! అవి యజ్ఞాంగములును యజ్ఞమునని తెలుపుదురు. అవి లేనిచో యజ్ఞము లెట్లును బ్రవర్తిల్ల నేరవు. గోవులే తమ పయోహవిస్సులచేఁ బ్రజలఁ బోషించుచున్నయవి. వాని సంతానము కృషి కుపయుక్త మగుచున్నది. అయ్యవియే వివిధములగు బీజములను ధాన్యములను జనింపఁజేయుచున్నవి తన్మూలముననే హవ్యకవ్యములును యజ్ఞములును బ్రవర్తిల్లుచున్నవి. మఱియు నాగోవులు పవిత్రములగు పయోదధిఘృతములను ధరించుచున్నవి. తాము క్షుత్తృష్ణా పీడితములయ్యు నొరులకు భోగములను సంపాదించుచున్నవి. మఱియుఁ దమకృత్యముచే మునులను బ్రజలను బోషించుచున్నవి. ఓవాసవా! సుకృతకర్మముచే సత్ప్రవర్తనము గల వగుట నెల్లపుడును మనకంటె మీఁదుగా నివసించుచున్నవి. ఓయింద్రా! అవి యటులుండుట కిదియే కారణము. గోవులు దేవతలకుఁ బయిస్థాన మందలి వని తెలిపితినిగదా! మఱియు వినుము. గోవులు వరదత్తములును, వరముల నొసంగునవియు నై పావనములు, పరిమిళించునవియుఁ, బవిత్రకర్మములును, శుభలక్షణములుగలవియుఁగాఁ బరిగణింపఁ బడుచున్నవి. ఓసురసత్తమా! సురభులు పుడమినొందుటకు నిమిత్త మెయ్యదియో తెలిపెదను వినుము. ఓయీ! మున్ను దేవయుగమున, మహాత్ములగు దేవేంద్రులు మూఁడులోకములను బాలించుచుండఁగా, విష్ణువు తనగర్భమునఁబడి పుత్రుఁడై జనింపవలయునని, సుదుశ్చరమై ఘోరమైన తపమునేయ నారంభించెను. అటు లొకపాదముపై నిలువఁబడి మహత్తరతప మొనర్చుచున్న యదితిమహాదేవి నారసి దక్షదుహితయగు సురభిదేవియు ధర్మపరాయణయై సోత్సాహముగా ఘోరతప మొనర్ప సాగెను. దేవగంధర్వసేవితమై మనోజ్ఞమగు కైలాసశిఖరమున నా సురభిదేవి యొకపాదముపై నిలిచి పరమయోగము నవలంబించి పదునొకొండువేలవత్సరము లొక్కరీతిగా నటులు తపమొనర్చుటయు,

మహర్షులును, మహోరగులును, దేవతలును సంతాపము నొందసాగిరి. అటు లాఘోరతపమునకుఁ దాపమొందు దేవతలు నన్నుఁ బ్రార్థింప, నేనప్పుడు వారిని వెంటఁబెట్టుకొని తపోనిష్ఠనున్న యాసురభిదేవినిఁ జేరి యామెను సేవించి 'ఓదేవీ! నీవిటు లేల ఘోరతప మొనర్చుచున్న దానవు? ఓమహాభాగా! నేను నీతపమునకు మెచ్చితిని. కావున నీకు వలయువరముఁ గోరికొనుము. ఒసంగుచున్నాఁడను' అని పలికితిని. అది విని యాసురభి, నాతో 'ఓపితామహా! ఒకవరముతో నాకేమి ప్రయోజనము? నీవిటుల నాకుఁ బ్రసన్నుఁడవగుటయే నాకొక వరము.' అని పలికెను. అంత నే నామెతో 'దేవీ! నీవేమియుఁ గోరకయే తప మిటులొనర్చుటను నేను నీకు సులభముగాఁ బ్రసన్నుఁడనైతిని. కావున నీకు నేను దేవత్వ మొసంగుచున్నాఁడను. మఱియు మూఁడులోకములకును మీఁదుగా నివసింపఁగలవు. నాయనుగ్రహముచే నీవున్నలోకము గోలోకము కాఁగలదు. మానవులందును, శుభకర్మము లొనర్చుచు భూలోకమున నీపుత్రికలు నివసింతురు. నీవు చిత్తమునఁ దలంచిన దివ్యభోగములన్నియు సిద్ధించును. స్వర్గమున నేమిసుఖముగునో, యదియెల్ల నీకయ్యెడిని.' అని పలికితిని. ఓసహస్రాక్షా! ఆసురభిదేవి లోకములు సకలకామసంపన్నములు. ఆలోకమున మృత్యువును ముదిమియుఁ బావకుఁడును జరింపనవకాశము లేదు. ఓవాసవా! అందు దైన్యము, నమంగళమును గలుగనేరవు. దివ్యారణ్యములును, దివ్యాభరణములును, సుయుక్తమ్ములై కామగమనము గలవిమానములు నెందు నెలయునో, యట్టిగోలోక మెంతయు శ్లాఘ్యముగాదే? బ్రహ్మచర్య, తపస్సత్యదమదానాది వివిధపుణ్యముల చేతను, దీర్ఘసేవచేతను, మఱియుఁ గలమహత్తరసుకృతకర్మముచేతను, నాగోలోక మొంద నగుచున్నది. ఓశక్రా! నీవు ప్రశ్నించుట నిదియెల్లఁ దెలిపితిని. ఓరాక్షససూదనా! నీ వాగోవులయెడఁ బరాభవబుద్ధి పెట్టవలదు' అని తెలిపెను.

ఓయుధిష్ఠిరా! ఆపరమేష్ఠిపలుకు లాలించి యింద్రుఁడు, గోవులయెడ నిత్యము గౌరవము గలిగియుండెను. ఓధర్మజా! పవిత్రమగు దీని నెఱిఁగించితినిగాదే? ఈగోవులమాహాత్మ్య మెంతయు శ్లాఘనీయమైనది. అటులగుట సకలపాపవిమోచనమగుదీని నిట్లు కీర్తించితిని.

ఎవఁడు సమాహితుఁడై బ్రాహ్మణులకు, హవ్యకవ్యములందును, యజ్ఞములందును, పితృకార్యములందును, దీనిని దెలుపునో, వాని పితృదేవతలకు సార్వకామికము, నక్షయ్యమునగు స్థాన మగుచున్నది. గోభక్తుఁడగు మానవుఁ డేదేది గోరునో, యదియెల్ల వాని కగుచున్నది. అటులే గోవులందు భక్తిగలకాంతలును గోవ్కలనందుచున్నారు. గోభక్తుఁడు పుత్రార్థియగునేని పుత్రుని, గన్యార్థియగునేని గన్యను బడయుచున్నాఁడు. అటులే ధనార్థియగునేని ధనమును, ధర్మార్థియగునేని ధర్మమును, విద్యార్థి విద్యను, సుఖార్థి సుఖమును బొందుచున్నారు. ఓయుధిష్ఠిరా! గోభక్తునకు లభింపని దేదియును లేదు." అని తెలుప విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె.

## సువర్ణోత్పత్తివిషయక వసిష్ఠపరశురామసంవాదము

"ఓపితామహా! గోదాన ముత్తమమనియును, ధర్మాపేతులగు రాజులకు విశేషించి యది ఫలయుననియుఁ బితామహుఁడు దెలిపెను. మఱియు నకృతాత్ములగువారికి దుర్ధరమగు రాజ్యము సంతత దుఃఖకరముగదా! అటులగుట రాజులకుఁ దఱచుగా శుభగతి గల్గుట సంభవింపదు. వారు భూదానమొనర్చి తప్పక పవిత్రులగుదురు. ఓతాతా! నీవు నాకు సకలధర్మములను దెలిపితివి. అటులే గోదానమునుగూర్చి నీవు తెలిపితివి. గోదానవిషయమున నృగనాచికేతులు దృష్టాంతభూతులు. గోవులు సకలకర్మములందును దక్షిణలుగా వేదములందును దెలుపఁబడియెను. సకలక్రతువులందును, గోవులు, భూమియు, సువర్ణము దక్షిణలుగా నిరూపింపఁబడియెనుగదా! అందు సువర్ణమే ముఖ్యదక్షిణ యని వేదము చెప్పుచున్నది. దీనియాథార్థ్య మెట్టిదియో విన(గోరుచున్నాఁడను. సువర్ణ మెట్లు జనించెను? ఏకాలమున జనించెను? ఏరూపుది? దానికి దైవమెద్ది? దానికి ఫలమేమి? అది యుత్తమ మగుటకు నిమిత్తమేమి? పండితులు సువర్ణదానమునే గౌరవింపఁ గారణమేమి? యజ్ఞకర్మములలో సువర్ణము దక్షిణలకుఁగాఁ బ్రశస్యమగుటకు నిమిత్తమేమి? భూగోదానములకంటె సువర్ణదానము పావనము, శ్రేష్ఠము నగుటయేమి? అదియెల్ల నా కెఱిఁగింపుము."

అది విని యాశాంతనవుఁడు, “ఓధర్మజా! కారణవిస్తారముగల సువర్ణోత్పత్తివిధము ననుభూతముగ నెఱిఁగించెదను. జాగరూకుఁడవై వినుము. మహాతేజుఁడగు నాతండ్రి శంతనుఁడు మరణించుటయు, నాతనికి శ్రాద్ధముసేయువాఁడనై గంగాద్వారమున కేఁగితిని. ఓపుత్రకా! అటులు వెడలి నేను శ్రాద్ధకర్మము నారంభింపఁగా, నందు నాతల్లియగు జాహ్నవి నాకు సాహాయ్యమొనర్చెను పిదప నేను తపస్సిద్ధులగుమహర్షులఁ బెక్కుర నాయెదుటఁ గూర్చుండఁబెట్టికొని, తోయదానము మొదలుగాఁగలకార్యముల నారంభించితిని. అటు లారంభించి నియతమానసుఁడనై యథోద్దిష్టముగాఁ బూర్వకర్మమునెల్ల సమాప్తము గావించి పిమ్మట విధ్యుక్తముగాఁ బిండదానముచేయ నారంభింపఁగా నాయొనర్చిన దర్భవిన్యాసమును దొలఁగించి,రుచిరాంగదముకు బ్రలంబాభరణమునగు నొకబాహువు తత్కాలసముచ్చయము పైకివెడలి గానవచ్చెను. అటులు పైకిలేచిన బాహువును గాంచి ‘నాతండ్రి ప్రత్యక్షముగా, నాయొసంగిన పిండమును బ్రతిగ్రహింప హస్తము చాచెను గాఁబోలు’నని పరమాశ్చర్యమొందితిని. అటు లచ్చెరువొంది మఱియు శాస్త్రము నాలోచించి, ‘ఇటులు వేదమందు విధింపఁబడలేదు. మానవుఁడు పితరులకుఁ బిండమును దర్భలపై నుంపవలయును. పితరు లెపుడేని మనుష్యుఁ డిచ్చినపిండములను బ్రత్యక్షముగాఁ గొనుటలేదు. దర్భలయందే పిండదాన మొనర్పవలఁయును.’ అని నిశ్చయించితిని. అట్టి నిశ్చయము నాకొదవుటను, నాతండ్రిహస్తనిదర్శనమును లక్ష్యముసేయక, పిండదానవిషయము, శాస్త్రప్రామాణ్యసూక్ష్మముగువిధినె స్మరించుచుఁ బిండదానకృత్యమునెల్ల దర్భలయందే యాచరించితిని. నేనటు లొనర్పఁగనే, నాతండ్రిహస్త మంతర్హితమయ్యెను. పిమ్మట నాకు స్వప్నమునఁ బితరు లగపడి ప్రీతులై ‘ఓశాంతనవా! మేమెంతయుఁ బ్రీతులమైతిమి. నీవిజ్ఞాన మెంతయు శ్లాఘ్యము. ధర్మవిషయమున నీవు మోహమొందలేదు. ఓపార్థివా! శాస్త్రమును బ్రమాణీకరించిన నీచే నాత్మయు, ధర్మము, శాస్త్రము, వేదములు, పితరులు, పితామహుఁడగు పరమేష్ఠియు, గురువులు, ప్రజాపతియుఁ, బ్రమాణపదము నొందింపఁబడిరి. ధర్మస్థితి స్థిరపఱుపఁబడియెను. నీవిపుడు విధ్యుక్తముగా నిష్కర్మము నారంభించితివి. కాని, భూ

గోదానములకు మాఱుగా సువర్ణదానమొనర్పుము. అటులొనర్తువేని మేమును మాపితామహులును బవిత్రులమగుదుము. ఇది మిగులఁ బవిత్రమైనదానము. మఱియు నాదానము చేసినవాఁడు, తనపూర్వులఁ బదితరములవారినిఁ దరువాతఁ బదితరములవారిని దరింపఁజేయుచున్నాఁడు.' అని నాపితరులు పలికిరి. అంత నేనాశ్చర్యమున మేలుకంటిని. వారివచనమును బట్టి నాఁటినుండి సువర్ణదానమునఁ దలంపు పెట్టితిని. ఇందుల కొకపురాతనేతిహాసము గలదు. దానిం దెలిపెద నాకర్ణింపుము. అయ్యది ధన్యము, నాయుఃప్రదము నై వెలయుచున్నది. మున్నొకపుడు తీవ్రకోపావేశపరవశుఁడగు పరశురామునిచేఁ బుడమియెల్ల క్షత్త్రియశూన్యముఁగాఁ జేయఁబడియెను. అతఁ డిరువదియొక్కమాఱులు రాజులను వెదకి వెదకి వధియించెను. అటులు పుడమినెల్ల జయించి యమ్మహావీరుఁడు బ్రహ్మక్షత్త్రపూజితమగుచు సకలకామప్రదమైన యశ్వమేధయాగము నొనర్చెను. సకలభూతములను బావనముగఁజేయునదియుఁ, దేజోద్యుతివివర్ధనమైనదియునగు తత్క్రతుఫలముచే నతఁడు దోషరహితుఁడై తనకించుకేని లోపములేకుండఁ జేసికొనియెను. అటు లమ్మహాత్ముఁడు దక్షిణలుగల యామహాక్రతు వొనర్చి, వేదసంపదగల మహర్షులను దేవతలను గాంచి సవినయముగా 'ఓమహానీయులారా! ఉగ్రకర్మముల నొనర్చుమానవులను బవిత్రులఁగాఁజేయున దెద్ది?' అని పశ్చాత్తాపము వెలయఁ బ్రశ్నించెను. అది విని వేదశాస్త్రజ్ఞులగు మహర్షులు 'ఓ రామా! వేదప్రామాణ్యమునుబట్టి చూడ, బ్రాహ్మణులను సత్కరింపవలయును. మఱియు, వారిని బావనకృత్య మెయ్యదియో ప్రశ్నింపవలయును. అపుడు వా రేమి తెలుపుదురో, యటు లొనర్పవలయును.' అని తెలిపిరి. పిదప నాభార్గవరాముఁడు, దేవర్షియగు వసిష్ఠుని, నగస్త్యునిఁ, గాశ్యపునిఁజేరి, యాయర్థమును దెలిసికొనువాఁడై 'ఓ బ్రాహ్మణోత్తములారా! నేనెట్లు పావనుఁడ నగుదునో యనువిషయమును మీవలనఁ దెలియ నాకు సంకల్పము గలిగెను. నేనెట్టికర్మము చేసి పవిత్రుఁడనయ్యెదను? ఎట్టిదాన మొనర్చి పావనుఁడనయ్యెదను? మీకు నాయెడ ననుగ్రహముగలదేని నన్నుఁ బవిత్రునిఁగఁ జేయున దెద్దియో యెఱింగింపుడు.' అని యడిగెను. అంత నమ్మహర్షు

లాతనితో 'ఓరామా! గోవులను, భూమిని, విత్తమును దానమొనర్చి నచోఁ బాపకర్తయగు మర్త్యుఁడు పవిత్రుఁడగుచున్నాఁడు' అని మేము వినినవిషయము. 'ఓబ్రాహ్మణోత్తమా! పావనమై మహోత్తరమైన మఱియొకదానము సైతము గలదు. దానిం దెలిపెదము వినుము. అగ్నిహోత్రునకు దివ్యమగు నొకయపత్యము గలదు. అయ్యది లోకములను దహించుచు నాతని వీర్యమునుండి జనించినది. అదియే సువర్ణమని ప్రసిద్ధి వడసెను. దానిని దానముచేయువాఁడు సిద్ధినొందును.' అని తెలిపిరి. అంత, సంశితవ్రతుఁడైన భగవానుఁడు వసిష్ఠుఁడు రామునితో 'ఓభార్గవా! అగ్ని ప్రభగలయాసువర్ణ మెటులు జనించెనో, యది, దాత కుత్తమఫలము నెటులొసంగునో, యెటు లది గుణావత్తరమయ్యెనో, యదియెల్లఁ దెలిపెదను. తెలిసికొనుము. ఈసువర్ణమగ్నిషోమాత్మకమని నిశ్చయముగాఁ దెలియుము. అజ మగ్నియు, మేషము వరుణుఁడును, నశ్వము సూర్యుఁడనియు శాస్త్రము. అటులే కుంజరములు నాగులనియు, మహిషము లసురలనియుఁ, గుక్కుటములు వరాహములు రాక్షసులనియు, గోవు లిడారూపములనియుఁ, బయస్సు సోముఁడు భూమియనియు స్మృతి చెప్పుచున్నది. జగమునెల్ల మథింపఁగాఁ బుట్టిన తేజోరాశియే సువర్ణము. ఈసువర్ణముతోఁ జేసినముకుటములు పలువిధములైన, యంగదములు మొదలగు నలంకారములును ధరించుచు, గంధర్వోరగరాక్షసులును బిశాచులును మానవులును విరాజిల్లుచున్నారు. కావునఁ బవిత్రములగు నెల్లవానికంటె నిది పవిత్రమని చెప్పఁబడియెను. భూమికంటెను గోవులకంటెను రత్నములకంటెను సువర్ణమే యుత్తమమైనదని తెలియుము. భూదాన గోదానములొనర్చి పిదప విశేషదాన మొనర్పవలయునేని సువర్ణదానమునే యొనర్పవలయును అక్షయకాంతిగల సువర్ణము నాశము లేనిదియుఁ బావనమైనదియు నని తెలియుము. కావున దీనినే బ్రాహ్మణుల కొసంగుము. ఉత్తమమగు నిది నిన్నుఁ బావనునిఁగా నొనర్చును. ఎల్లదక్షిణలయందును సువర్ణదక్షిణయే ప్రధానముగా విధింపఁబడుచున్నది. సువర్ణదాతలు సకలదానములొనర్చినవా రగుచున్నారు. మఱియు సువర్ణము నిచ్చినవారు దేవతల నిచ్చినవారగుదురు. సకల దేవతలు నగ్నియేగదా! అట్టి యగ్నిరూపమే సువర్ణమగుచున్నది.

కావున సువర్ణదాత, సకలదేవతల నిచ్చినవాఁ డగుచున్నాఁడు. ఓభార్గవా! దీనికంటె నుత్తమమైన దొకటి లేదు. మఱియు నా సువర్ణము మాహాత్మ్యమునే తెలిపెదను వినుము. ఓరామా! నేను ము న్నివిషయమును బురాణమందు వింటిని. ఆపురాణగాథ ప్రజాపతి తెలిపెను. మహాత్ముఁడును, శూలపాణియు, భగవానుఁడునగు రుద్రునకు, శ్రేష్ఠమగు హిమవత్పర్వతమునఁ బార్వతితో వివాహసంబంధము గలిగెను. అటులు జరిగినపిదప వారిరువురకు సమాగమము గలుగఁగా, నందఃలకు దేవతలందఱును జడిసి, రుద్రునిదర్శనమునకు వచ్చిరి. అపుడు మహాదేవుఁడును వరప్రదయగు నుమాదేవియు నాసీనులై యుండిరి. అంత నయ్యమరులు నమ్రులై యారుద్రునిఁ బ్రసన్నునిఁగావించి 'ఓదేవా! దేవితో నీకిపుడు గలుగునట్టిసమాగమము తపస్వికిఁ దపస్వినితోడను, తేజమునకుఁ దేజస్వినితోడను గలుగునట్టి సమాగమమువంటిది. నీ వమోఘతేజుఁడవుగదా! దేవియు నట్టిదే. అటులగుట, మీయిరువురకునగు సంతానముసైతము బలిష్ఠమై యట్టిదయగును. అయ్యది నిశ్చయముగా ముల్లోకములందునుగల యేకొంచెమునేని మిగులనీదు. అటులగుట నిట్లు ప్రణతులగు దేవతలకుఁ బ్రసన్నుఁడవై మూఁడులోకములకు హితముగా నొకవరము నొసంగుము. సంతానవిషయకమగు నీపరమతేజమును నిగ్రహింపుము. త్రిలోకసారులగు మీరిరువురును లోకమును దపింపఁజేయరాదుగదా! అట్టి మీయిరువురకును సంతానముగునేని, దేవతలకుఁ దప్పక పరాభవమయ్యెడిని. మీపరమతేజమును బృథివియు, నాకసము భరింపఁజాలవు. సకలమును గలిసియు నద్దానిని వహింపఁజాలవని మాయభిప్రాయము. సమస్తప్రపంచమును భవత్తేజఃప్రభావదగ్ధ మగును. కావున నో భగవానుఁడా! మ మ్మనుగ్రహింపఁ దగుదువు. ఓదేవోత్తమా! దేవికి నీవలనఁ బుత్రుఁడు సంభవింపఁగూడదు. ఉత్తమమై ప్రజ్వలించు నీతేజమును, ధైర్యమూని నిగ్రహింపుము.' అని ప్రార్థించిరి. వారిమొఱలాలించి యావృషభధ్వజుఁడగు భగవానుఁడు, 'ఓసురలారా! అటులే యొనర్చువాఁడ' నని పలికెను. అటులు పలికి వెంటనే యతఁడు, తనతేజము నూర్ధ్వగతము గావించెను. అదిమొదలుగా నతఁ డూర్ధ్వరేతుఁ డయ్యెను. అందులకుఁ బార్వతి కుపితయై

సంతానోచ్ఛేదకారకులగు నయ్యమరులఁగాంచి, స్త్రీస్వభావమునుబట్టి, బహుపరుషముగా 'ఓదేవతలారా! సంతానకాముఁడగు నాభర్త మీ వలనఁగదా నివర్తింపఁబడియెను? అటులగుట మీరెల్లరును సంతానరహితు లగుదురుగాక. మీరు నాకు సంతానము లేకుండఁ జేసితిరి గాదే? కావున మీకు సంతానము లేకుండుఁగాక.' అని పలికెను. ఓభార్గవా! అపు డం దగ్నిదేవుఁ డొక్కఁడుమాత్రము లేఁడు. ఆదేవి శాపముచే దేవతలందఱును సంతానరహితులైరి. అపుడు రుద్రుఁడు నిరుపమానమగు తేజమును నిగ్రహించెను. అటులగుట నది స్ఖలితమై యించుక పుడమిఁబడి పైకెగిరి వహ్నియందుఁగలిసి యద్భుతముగా వృద్ధినొందెను. అటు లాతేజము తేజమునఁ గలిసి యేక మొనసత్వ మందెను. అక్కాలముననే యింద్రాదిదేవతలను, దారకుఁడనియెడి రక్కసుఁడు పీడింపఁదొడంగెను. అపు డాదిత్యులును, వసువులును, రుద్రులు మరుత్తులు, నశ్వినీదేవతలు, సాధ్యులు, నారక్కసునిపరాక్రమమునకు జడిసిరి. అపు డారక్కసులచే దేవతలవిమానములును, స్థానములును, బట్టణములును, మహర్షులయాశ్రమములును నశింపఁజేయఁబడియెను. అంత నా దేవతలును, మహర్షులును దీనమానసులై విభువగు పరమేష్ఠిని శరణమందఁబోయిరి.' అని తెలిపి వసిష్ఠుఁడు మఱియు నిట్లనియె.

### వసిష్ఠుఁడు సువర్ణోత్పత్తి నెఱిఁగించుట

'ఓభార్గవా! అటులు దేవతలందఱును బరమేష్ఠినిఁజేరి 'ఓదేవా! తారకుఁ డనెడిరక్కసుఁడు నీవలన వరములు వడసి బలవంతుఁడై, మమ్మును మహర్షులను బీడించుచున్నాఁడు. కావున వానిని వధించు నుపాయము విధింపఁబడుఁగాక. ఓపితామహా! వానివలన మాకెంతయు భయ మొదవెడిని. దేవా! మమ్ము రక్షింపుము. నీవుదక్క మాకు వేఱొక్కగతి లేదు.' అని మొఱవెట్టిరి. అది విని యప్పద్మభవుఁడు 'ఓసురలారా! నేను సకలభూతములకును సముఁడను. అధర్మము నాకిష్టపడదు. మహర్షులను దేవతలను బాధించునట్టి తారకుఁడు వడిగా వధింపఁబడుఁగాక. ఓసురసత్తములారా! వేదములును ధర్మములు నుచ్ఛేదమునొందఁగూడదు. వానివధోపాయము మున్నె విధించి యుంటిని. కావునఁ బరితాపముఁ బరిత్యజింపుఁడు.' అని పలికెను. అంత

నయ్యమరులు మఱియు నాతనిఁగాంచి 'దేవా! నీవు వరములొసంగుట నాదైతేయుఁడు బలగర్వితుఁడై, మాకు వధ్యుఁడుగాఁడుగదా! వాఁడు నశించుటెట్లు ? ఓపితా ! దేవతలకును, రాక్షసులకును, నసురులకును దాను వధ్యుఁడు కాకుండునట్లుగా, వాఁడు నీవలన వరమువడసెను గాదే ? మున్ను సంతానోచ్ఛేదము చేయుటనుబట్టి, మేము సంతానరహితులముగా, భవానిచే శప్తులమైతిమి. కావున నోజగత్పతీ ! మాకెవ్వరికిని సంతానము గలుగదు" అని తెలిపిరి. అది విని యప్పరమేష్ఠి మఱియును వారితో 'సురలారా! మి మ్మాదేవి శపించునపు డందు మనయగ్నిదేవుఁడు లేఁడుగదా! ఆరాక్షసులను సంహరింపఁ దగువాఁడాయగ్నిదేవునకుఁ బుత్త్రుఁడుగాఁ బుట్టవచ్చును. అతఁడు, దేవగంధర్వదానవరాక్షసులను, గరుడనాగమానవాదులను మించినవాఁడై శక్తివెలయ నమోఘప్రసారముగల యస్త్రముచే నారక్కసుని వధించును. ఎవనివలన మీరు భయమొందుచున్నవారో, యట్టితారకుఁడే గాడు. మఱియుఁ గలరక్కసులు సైతము నాయగ్నిపుత్త్రునిచే వధింపఁబడఁగలరు. సనాతనసంకల్పమే కామమని చెప్పఁబడుచున్నది. అట్టిసంకల్పమునుబట్టి రుద్రుని రేతస్సు స్ఖలితమై యగ్నియందుఁబడి, యది గొప్పదై రెండవయగ్నినా వెలయుచున్నయది. అదియే గంగానదియందుఁబడి మీవైరులను వధింపఁదగునదై జనించును. మీశాపకాలమున నగ్నిలేకుండుటను నాతఁడు శప్తుఁడుగాలేదు. కావున నాపావకునివలన మీవెఱపు నడఁగించువాఁడు తప్పక పుట్టును. అటులగుట మీరాయగ్నిని వెదకి నాచెప్పిన తారకవధోపాయ మాతని కెఱిఁగింపుఁడు. తేజోనిధులతేజములకు శాపములెన్నఁడును దగులనేరవు. బలము లతిబలునిఁజేరి దుర్బలము లగుచుండునుగాదే? అతఁడు తపోవంతులై వరములు వడసిన యవధ్యులనేని జంపును. మఱియు జగత్పతియు, ననిర్దేశ్యుఁడు, సర్వగుఁడు, సర్వభావనుఁడు, సర్వభూతహృచ్ఛయుఁడు నై యతఁడు రుద్రునికంటె నధికుఁడైన ప్రభువు. అటులగుట నాతేజోరాశియగు హుతాశనుని మీరిపుడు వడిగా వెదకుఁడు. ఆదేవుఁడు మీ మనసులందుఁ గలకోర్కె నీడేర్పఁగలఁడు' అని తెలిపెను. అది విని యాదేవతలు సంధిగ్ధసంకల్పులై వెడలి యాయగ్నిదేవుని వెదకుచు ముల్లోకములం

దిరిగిరి. అటు లమ్మహర్షులును దేవతలును, నాయగ్ని నే తలంచుచుఁ దద్దర్శనాభిలాషులై యెల్లలోకములఁ జరించినను, జలమునఁ దడఁగియుండుట నాహుతాశనుఁడు వారికిఁ గానరాకుండెను. పిదప నగ్నిదర్శనలాలసులై భయమందుచున్న యాదేవతలపై జాలివెలయ, నాయగ్నితేజముచేఁ బ్రదీప్తమై జలచరమగు నొకమండూకము రసాతలమునుండి వెడలి వారినారసి, 'ఓసురలారా! మీరు వెదకుచున్న యగ్నిదేవుఁడు రసాతలమునం దున్నవాఁడు. తదగ్నిప్రభవమగు సంతాపము నోపక నేనిటులు వెడలివచ్చితిని. ఓ దేవతలారా! ఆభగవానుఁడగు హవ్యవాహనుఁడు నీట నిపుడు నిద్రించియున్నాఁడు. అటులగుట జలమెల్ల నాతని తేజముచేఁ దప్తమై మే మందు నివసింప నవకాశము లేకుండెను. ఓసురలారా! ఆవిభావసునిదర్శనము మీకు వలయునేని, మీ రాతనివలనఁ బనిగలదేని యందులకుఁ బొండు. మే మా యగ్నిభయ మోరువమి నెందేనిఁ బోయెదము.' అని పలికి యామండూకము వడిగా నెప్పటివోప్పున నీట మునిఁగెను. ఆమండూకము చెప్పిన కొండె మాయగ్నిదేవుఁడు తెలిసికొని వానికి రసజ్ఞానము లేకుండు నట్లుగా శపించెను. అపు డామండూకము లాయగ్నిచే నటులు శాపమొంది, మఱియొకచోట నివసింపఁ బోయెను. ఆయగ్నిదేవుఁడు దేవతలకుఁ గానరాకుండెను. ఓభృగూత్తమా! అపు డామండూకములపై దేవత లనుగ్రహముగలుగ వా రేమియొనర్చిరో తెలిపెదను వినుము. అగ్నిశాపముచే నాలుకలు లేక రసజ్ఞానబహిష్కృతములై యున్న యామండూకములను గాంచి, దేవతలు 'ఓమండూకములారా! బహువిధమగు సరస్వతి నుచ్చరింపుఁడు. కన్నములలోనుండి నిరాహారులై శుష్కించి తెలివితప్పి గతప్రాణులుగానున్న మి మ్మాభూదేవి ధరించును. చీకటిరాత్రులందును మీరు సంచరింపఁగలరు.' అని పలికి యాదేవతలు మఱియు నిమ్మహినెల్ల వెదకిరిగాని, వారి కాహుతాశనుఁ డగపడఁడయ్యెను. పిమ్మట నైరావతమునాఁదగు నొకమహాగజ మాదేవతలను గాంచి, 'ఓసురలారా! ఆయగ్నిదేవుఁడు రావిచెట్టునందున్నాఁడు' అని తెలిపెను. అది తెలిసికొని యాయగ్ని, కోపావేశపరవశుఁడై 'మీనాలుకలు మీకుఁ బ్రతికూలము లగుఁగాక' యని యాయేనుఁగులనెల్ల శపించెను. అటులు శపించి, యాయశ్వత్థమునుండి

వెడలి యాయగ్నిదేవుఁడు, నిద్రాభిలాషముచే శమీగర్భమును బ్రవేశించెను. పిదప దేవత లాయేన్గు నెట్టు లనుగ్రహించిరో తెలిపెదను వినుము. ఓభృగూత్తమా! సత్యపరాక్రములగు నాదేవత లాయేన్గులయెడఁ బ్రీతిగలిగి, 'ఓకరులారా! మీనాలుకలు ప్రతీపములయ్యు మీరు వానితో నాహారమును గొనఁగలరు. మఱియు నవ్యక్తాక్షరముగా, హెచ్చుగనుచ్చారణమును జేయఁగలుగుదురు.' అని పలికి దేవతలు మఱియు నాయగ్నిదేవుని వెదకసాగిరి. అటు లశ్వత్థమును విడిచి శమీగర్భము నాశ్రయించియున్న యగ్నివిధమును, శుక మెఱిఁగింపఁగా, దేవత లందులకుఁ బరుగెత్తిరి. అపు డాహుతాశనుఁ డా శుకముపైఁ గినిసి, వాగ్విహీనముగుదువని శపించి యాచిలుక నాలుకఁ ద్రిప్పెను. అపు డా దేవత లాయగ్నిని దర్శింపఁగలిగి, చిలుకపై దయ వెలయ, 'ఓశుకమా! మీజాతి మిక్కిలి నష్టవచనము గాఁబోదు. మీనాలుక లావృత్తములయ్యెను, మీవాక్యములు వృద్ధునకు బాలవాక్యములట్లు లెంతయు నవ్యక్తమాధుర్యాద్భుతములుగ మనోజ్ఞములై యుండును.' అని పలికి, యాశమీగర్భమందున్న యగ్నిని గాంచి యాదేవతలు, సర్వక్రియలందును నాతని కదియే పవిత్రమైన స్థానముగా నొనర్చిరి. అదిమొదలుగా హుతాశనుఁడు శమీగర్భమునందే గానవచ్చుచుండెను. మానవు లగ్నినుత్పాదించుటకు శమీశాఖనే యుపాయముగా నొందిరి. రసాతలమునందలి యుదకములు వహ్నిసంస్పృష్టములై కొండలపైని ప్రస్రవణములమూలమున వేఁడిని బైకివిడుచుచున్నవి. పావకుఁ డెంతయేని కాలము శయనించుటచే నవి యాతనితేజముచే సంతప్తములయ్యెను. పిమ్మట నగ్నిదేవుఁ డాదేవతల నారసి, వ్యథనొంది, 'సురలారా! మీరిందుల కేల వచ్చితిరి?' అని యడుగ, నమ్మహర్షులును, దేవతలును నాతనితో 'ఓపావకా! నిన్నొకకార్యమున నియోగింతుము. నీవు దాని నొనర్పవలయును. మాపని యొనర్తువేని నీకది యొకగొప్పగుణము.' అని తెలిపిరి. అదివిని యాహుతాశనుఁడు 'ఓసురలారా! మీకార్య మెయ్యదియో తెలుపుఁడు. మీరిందు సందియమునఁ బొందవలదు. మీకు నేను నియోజ్యుఁడనే యగుచున్నాఁడను,' అని తెలిపెను. అంత నా దేవతలు 'ఓవైశ్వానరా! తారకుఁడసురకులుఁడు, బ్రహ్మయొసంగిన వరములచే గర్వి

తుఁడై పరాక్రమము వెలయ మమ్ము బాధించుచున్నాఁడు. కావున వానివధమున కుపాయము విధింపుము. ఓతండ్రీ! ఈదేవగణములను, ప్రజాపతిగణములను, మహర్షులను రక్షింపుము. ఓప్రభూ! తేజో యుక్తమై పరాక్రమముగల సంతానమును జనింపఁజేయుము. ఏరక్క సునివలన మాకు భయమయ్యెడినో యట్టితారకు నిపుడు నశింపఁ జేయవలయును. ఓహవ్యవాహనా! దేవిచే శపింపఁబడిన మాకు నీ కంటె వేఱొకగతి గానరాదు. నీకంటె మాకింక పరాక్రమము లేదు. కావున మమ్ముఁ గావుము' అని పలుకుటయు, నాహవ్యవాహనుఁడు 'ఓయీ! తప్పక మీయుద్దేశము నెఱవేర్చువాఁడను.' అని పలికి, దురాధర్షుఁడగు నాతఁడు, భాగీరథియగు గంగానదినిఁ జేరి దానితోఁ గలిసి దానికి గర్భము నొనర్చెను. ఎండుగడ్డి నంటికొన్నయగ్నివలె నది వడిగా వర్ధిల్లెను. అపు డాగంగ, యాతనితేజమునకు వివశ చిత్తయై దత్తీవ్రసంతాపమును భరింపఁజాలదయ్యెను. అటు లాయగ్ని వలనఁ దేజస్సమన్వితమగు గర్భము గలుగ నాగంగలో నొకరక్క సుఁడు భైరవారావ మొనర్చెను. హఠాత్తుగా వినవచ్చిన విపులమగు నయ్యారావమునకు జడిసి, భ్రాంతనయనయు, విహ్వలచిత్తయు, విసం జ్ఞయునగుచు, నాభాగీరథి తనగర్భమును నాత్మను భరింపలేనిదయ్యెను. అటులగుట నాజాహ్నవి, తేజఃపరీతాంగయై వడఁకుచు, గర్భబలోద్ధ తయై యాజ్వలనునితో, "ఓదేవా! నీయీతేజమును ధరింపఁజాల కున్నదానను. దీనిచే నాకేమోమోహ మొదవుచున్నది. మునుపటి వలె స్వాస్థ్యము లేకున్నది. వైవశ్యము గలుగుచున్నది. మఱియు నా చిత్తమును జెడియెడిని. ఓతేజోనిధీ! ఇఁక నీగర్భమును ధరింప లేను. ఇష్టము లేకున్నను, గష్టము భరింపలేమి నిపు డీగర్భమును విడిచెదను. ఓదేవా! విభావసూ! నాకిఁకఁ దేజస్సంస్పర్శము లేదు. ఈసూక్ష్మసంబంధమేని యాపన్నివారకము గదా! ఇది మంచియే గావచ్చును. లేక చెడుగు గావచ్చును. ధర్మాధర్మములు నీయందలివే యని తలంచెదను.' అని పలికెను. అది విని యాయగ్నిదేవుఁడు గంగ నారసి 'దేవీ! ధరింపుము. ధరింపుము. నాతేజముతోఁ గూడిన నీగర్భమున మహాగుణఫలోత్పత్తిగలదు. నీ వీపుడమినెల్ల వహించుట కును బోషించుటకును దగుదువు. నీకు దీనిని ధరించుటదక్క వేఱొక్క

విధ మొందఁదగిన దేమియును లేదు.' అని పలికెను. అటు లాగంగ యాహవ్యవాహనువలనను దేవతలవలనను నివారింపఁబడియు నపు డాగర్భమును భరింపలేక మేరుగిరిచేరువఁ బరిత్యజించెను. ఓభార్గవా ! ఆభాగీరథి ధారణసామర్థ్యముగలదయ్యు రుద్రతేజః ప్రధర్షితయగుట నపుడాగర్భమును భరింపఁజాలనిదయ్యెను. ప్రదీప్తవైశ్వానరప్రభ గల యాతేజము నటులు భరింపలేక, యాభాగీరథి విడుచుటయు, హుతాశనుఁడు మరల నామెకుఁ బ్రత్యక్షమై 'ఓదేవీ ! నీగర్భము సుఖోత్పత్తి గలదయ్యెనా ? దానివర్ణ మెట్టిది? దానిరూప మెటు లుండును? ఎట్టితేజముతోఁ గూడియున్నది? ఇదియెల్ల నాకెఱిఁగింపుము.' అని ప్రశ్నించెను. అది విని యాగంగాదేవి, 'దేవా! ఆగర్భము జాత రూపము. తేజమున నిన్నుఁ బోలి యున్నయది. మఱియు నది విమల మును దీప్తమును నై సువర్ణమగుచు నామేరుగిరిని వెలయించు చున్నది. ఇంకను నయ్యది, పద్మోత్పలములుగల సరోవరముల చల్లఁ దనమును గదంబతుల్యపరిమళమును గలిగియున్నయది. సూర్యకిరణ ముతో నట్లు, లాగర్భము తేజముతోఁ బుడమియందును బర్వతము లందును గల యేయే ద్రవ్యము గలియునో యదియెల్లఁ గాంచనీ భూతమై యెల్లచోటులఁ గానవచ్చుచున్నయది. మఱియు నయ్యది నిజతేజముచే సచరాచరమగు త్రైలోక్యమును బ్రకాశింపఁజేయుచు శైలములను నదులను బ్రస్రవణములను వ్యాపించుచున్నది. ఓహవ్య వాహనా ! నీపుత్రుఁ డిట్టిరూపముగలవాఁడు. ఆనీయపత్యము సూర్య చంద్రకాంతిగలిగి వెలయుచున్నయది' అని తెలిపి, యాదేవి, యందే యంతర్ధానమునొందెను. అపు డాతేజస్వియగు పావకుఁడును, దేవతల నియోగ మొనరించి వెడలిపోయెను. ఓభృగూద్వహా ! ఇట్టికర్మగుణము లచే నగ్నిదేవునకు, హిరణ్యరేతుఁడనునామము ప్రసిద్ధమగునట్లుగా, మహర్షులును దేవతలును గీర్తించుచుండుదురు. అది మొదలుగాఁ బృథి వియు వసుమతి యనుపేర వెలయుచువచ్చెను. గాంగేయమును, పావ కోద్భవము నై మహాతేజముగల యాగర్భము, దివ్యమగు నొకశర వణమునొంది యద్భుతముగా వర్ధిలుచువచ్చెను. అందు వర్ధిల్లుచున్న యాతనిఁ గృత్తికలు గాంచిరి. అతఁడు బాలార్కసదృశద్యుతియై గాన వచ్చుచుండెను. వారటులుగాంచి, తమస్తన్యస్రవములచే నాతనిం

డెంచుచుఁ బుత్త్రునిఁగా భావించిరి. అది మొదలాతఁడు కార్త్తికేయుఁ
డను పేరుగాంచెను. తేజము స్కన్నమైన, నస్థాన జనించినవాఁడగుటఁ
స్కందుఁ డనఁబరఁగెను. గుహావాసముచే గుహుండను ప్రసిద్ధి
గాంచెను. ఇట్లు లగ్ని యపత్యముగా సువర్ణ ముత్పన్నమయ్యెను.
అందు జాంబూనద మనునది శ్రేష్ఠమై దేవతలకును భూషణ మగు
చున్నది. అది మొదలుగా నది జాతరూపమని వ్యవహరింపఁబడుచు
వచ్చెను. ఈసువర్ణము రత్నములలో నుత్తమరత్నము. భూషణము
లలో నుత్తమభూషణము. పవిత్రములలోఁ బవిత్రము మంగళము
లలో మంగళము. ఆసువర్ణము ప్రజాపతియు నీశుఁడు భగవానుఁడు
నగునగ్నియే. ఓబ్రాహ్మణోత్తమా ! అయ్యది పావనములైనవానిలోఁ
బావనమైనది. ఆజాతరూప మగ్నిషోమాత్మకముగాఁ జెప్పఁబడుచున్నది.
ఓరామా! వేదప్రసిద్ధమగు మఱియొకవిషయము మున్ను నేవినియున్న
వాఁడను. అది పరమాత్ముఁ డగు పితామహుని సంబంధించిన వృత్తము
మున్నొకపుడు, పరమేశుఁడు వారుణితనువు వహించియుండఁగా, నం
దులకు మునులందఱును, వైశ్వానరుఁడు మున్నగు దేవతలును వచ్చిరి.
మఱియు సకలవిధములగు యజ్ఞాంగములను, మూర్త్తీభవించిన వష
ట్కారమును, మూర్త్తిమంతములైన సామములను, వేలకొలఁది
యజుస్సులను పదక్రమములతోఁ గూడ ఋగ్వేదమును, మఱియు
లక్షణములు, స్వరములు స్తోభలు నిరుక్తములు స్వరవిశేషములు
ఛందోనేత్రమగు నోంకారము, నిగ్రహప్రగ్రహములు, సోపనిషద
ములగు వేదములు సావిత్రీవిద్యయు, మున్నగువానిని భూతభవ్య
ములను, భగవానుఁడగుశివుఁడు ధరించి, యపు డాత్మచే నాత్మను
హోమముచేసెను. ఆతనియజ్ఞము బహురూపమై మిగుల శోభిల్లెను.
ఈపరమశివుఁడే యాకసము, భూమియు, స్వర్గము నగుచున్నాఁడు.
సర్వవిద్యేశ్వరుఁడును, శ్రీమంతుఁడును, విభావసుఁడు నితఁడే. ఇతఁడే
బ్రహ్మయు, శివుఁడు, రుద్రుఁడు, వరుణుఁడు, అగ్ని, ప్రజాపతియు నగు
చున్నాఁడు' అని కీర్త్తింపఁబడుచుండెను. ఓభృగుకులోద్వహా! మఱియు,
దిక్కులును, దిగీశ్వరులును, దేవపత్నులును, కన్యకలును, దేవమాత
లును, గలిసి యందులకు వచ్చియుండిరి అప్పశుపతియజ్ఞము, వారి
కానందకరమై యుండెను. వారినారయుట, నాస్వయంభువునకు రేత

స్ఖలన మయ్యెను. అటులు స్ఖలితమై పుడమిఁబడిన, యాశుక్రము నిష్యందరేణువులను దీసి, పూషుఁడు తనకరములచే నాహుతాశను నందుఁ బడవైచెను. జ్వలితపావకమై యాయజ్ఞ మటులు జరగు సమయమున, హోమముచేయుచున్న యాబ్రహ్మనుండి స్ఖలితమైన శుక్రము, నతఁడు నేయివలె మంత్ర యుక్తముగా హోమముచేయుటయు, దానినుండి సారముగల భూతగ్రామము జనించెను. ఆతేజము త్రిగుణాత్మకమగుటను, దత్తేజోంశమగు రజమునుండి జంగమములన్నియు జనించెను. తమోగుణమునుండి స్థావరములన్నియుఁ బుట్టెను. సత్వాంశము తదుభయగతము నయ్యెను. సర్వభూతములందునుగల తేజోంశమగుసత్వము, గుణములలో నుత్తమ మనఁదగియుండెను. అటులు శుక్రమగ్నియందు హోమముచేయఁబడినతోడనే యందు మూవురుపురుషులు జనించిరి. వారు తమతమ కారణజములగు గుణములతోఁగూడి వెలయునట్టి శరీరములు గలిగియుండిరి అందు భర్జనమువలన భృగువు పుట్టెను. అంగారములనుండి యంగిరస్సు జనించెను. అంగారసంశ్రయమునుండి కవి జనించెను. జ్వాలతోఁగలిసి జనించి వేఁగుటను భృగువనఁబడియెను. మరీచులనుండి జనించినవాఁడు మరీచియు, మారీచుఁడు కశ్యపుఁడు నయ్యెను. కుశసమూహమునుండి వాలఖిల్యులు పుట్టిరి. 'ఇందే యిందే జనించె' నని యెవ్వనిఁ జెప్పిరో, యతఁ డత్రియయ్యెను. అటులే భస్మమునుండి బ్రహ్మర్షిగణసమ్మతులును, దపోగుణాభిలాషులును, నగు వైఖానసులు జనించిరి. అశ్రువులనుండి జనించినవారు, రూపసంపదగలిగి యాశ్విను లైరి. మిగిలిన ప్రజాపతులందఱును శ్రోత్రాదీంద్రియములనుండి జనించిరి. రోమకూపములనుండి మహర్షులు పుట్టిరి. చెమ్మటనుండి ఛందమును, బలమునుండి మనస్సును జనించెను. ఇక్కారణముననే శ్రుతసంపన్నులగుమహర్షులు 'అగ్నియే సకలదేవతాస్వరూపుఁ'డని చెప్పుచున్నారు. ఆదారువులును, వానినిర్యాసములును, మాసములు, బక్షములు, నహోరాత్రములు, ముహూర్తములును నగుచున్నవి. లోహితము, రౌద్ర మనఁదగియున్నది. ఆలోహితమునుండియే కనకమువచ్చెనని చెప్పఁబడియెను. ధూమమునుండి వసువులు గలిగిరి. ఆయగ్ని నొదవుజ్వాలలే, రుద్రులు నాదిత్యులు నైరి. ఉద్దీప్తములగు నంగారములే యాకసమం దాయాస్థానములందున్న గ్రహ

తారాదులగుచున్నవి. అగ్నియే లోకనాథుఁడు. అదియే స్థిరమగు పరబ్రహ్మమును సర్వకామప్రదము నగునని చెప్పుచున్నారు.

ఓభృగూత్తమా! ఆయజ్ఞమందు హవ్యమును వహించుచు, వరుణపవనాత్మకుఁడగు నమ్మహాదేవుఁడు 'ఓదేవతలారా! ఇది నాదివ్యసత్రము నేనిందు గృహపతిని. భృగ్వంగిరఃకవిసంజ్ఞగల యపత్యములు మూఁడును నాకుఁ దొలుతటియపత్యములు అని తెలిసికొనుఁడు. ఇందు సంశయము లేదు. ఇదియే నాయజ్ఞమునకు ఫలమని తెలియుఁడు.' అని పలికెను. అది విని యగ్నిదేవుఁడు, 'ఓయీ! మదాశ్రయకృతములై నాయంగములనుండి పుట్టిన యాసంతానములు మూఁడును నాయవి. హోమముచేయఁబడిన యాశుక్లము నాయదిగాదే' అని పలికెను. అంత నాలోకపితామహుఁడగు బ్రహ్మ 'ఓయీ! ఆయపత్యములు నాయవి నాశుక్లమేగదా అందు హోమము చేయఁబడియెను? మఱియు నేను మంత్రమును జెప్పితిని. ఆశుక్రమును హోమమొనర్చితిని. శుక్రమే కారణమందురేని, బీజ మెవ్వనిదో, ఫలమును వానిదై యుండవలయునుగాదే? అని పలికెను. పిమ్మట దేవగణము లప్పితామహునిఁజేరి, చేతులు మొగిడ్చి సవినయముగాఁ దలలు వాంచి, 'ఓభగవానుఁడా! మేమందఱమెగాక, చరాచరమగు ప్రపంచమెల్ల నీప్రసవముగాఁ దెలియుము. అటులగుట నీయగ్నియు వరుణుఁడు నీశ్వరుఁడును యభీష్టము నొందుదురుగాక' అని పలికిరి. అపుడు బ్రహ్మవలన యాదఃపతియగు వరుణుఁడు, సూర్యసమతేజుఁడును, దొలియపత్యము నగు భృగువును బరిగ్రహించెను. అగ్నివలన నంగిరసునిఁ బుత్రునిఁగా నీశ్వరుఁడు వడసెను. తత్త్వవేత్తయగు పితామహుఁడు మూఁడవవాఁడగు కవిని బుత్రునిఁగాఁ దీసికొనియెను. అందు వారుణుఁడను ప్రసిద్ధి వడసి భృగువు ప్రసవకర్మకర్త యయ్యెను. శ్రీమంతుఁడగు నంగిరుఁ డాగ్నేయుఁ డయ్యెను. మహాయశుఁడగు కవి బ్రాహ్మఁ డనఁబడియెను. లోకమున భార్గవాంగిరసప్రభావములే ప్రపంచసంతానవిమిత్తము లయ్యెను. ఈవిప్రవరులు మూవురును బ్రజాపతులైరి. పిమ్మట సకలమును వీరిసంతానమే యని తెలియుము. ఆభృగువున కేడ్వురు పుత్రులు. వారందఱును గుణములచేఁ దండ్రినిఁ బోలినవారు, చ్యవనుఁడు, వజ్రశీర్షుఁడు, శుచి, ఔర్వుఁడు, శుక్రుఁడు,

వరేణ్యుఁడు, సవనుఁడు అను పేరులతోఁ బ్రసిద్ధి వడసిరి. నీ వేవంశమున జనించితివో, యట్టి భృగువంశమునవా రెవ్వరును వారుణు లనఁబడుదురు. అంగిరసుని పుత్త్రు లెనమండ్రు. వారు వారుణులు గాకున్నను వారుణు లనఁబడుదురు. బృహస్పతి, ఉచథ్యుఁడు, వయస్యుఁడు, శాంతి, ఘోరుఁడు, విరూపుఁడు, సంవర్తుఁడు, సుధన్వుఁడు, అను పేరులతో వెలయుచున్నవారు. జ్ఞాననిష్ఠులు, నిరామయులు నగువీ రెనమండ్రును నాగ్నేయు లనఁబడుదురు. ఇఁక బ్రాహ్మణులగు కవిపుత్త్రులును, వారుణు లనఁబడుచున్నారు. వా రెనమండ్రును, బ్రహ్మవేత్తలును, శుభప్రదులు నైన కారణజయులగు గుణముతో వెలయుచున్నారు. వా రెవ్వరందు వేని వినుము. 'కవి, కావ్యుఁడు, విష్ణువు, ఉశనుఁడు, భృగువు, వరుణుఁడు, కాశ్యపుఁడు, అగ్ని' అను నామములు గల్గియున్నవారు. ఈ ప్రపంచ మెల్ల వీరిచే వ్యాప్తమై యున్నయది. ఎవ్వరిచే నీప్రజ లగుచున్నారో, యట్టి వీరెల్లఁ బ్రజాపతు లనఁబడుచున్నారు. ఇటులే భృగ్వంగిరఃకవులవంశములచే జగమంతయు వ్యాప్తమై యున్నయది. ఓబ్రాహ్మణోత్తమా! తొలుత వరుణుఁడే, కవిని భృగువును దీసికొనిపోయెను. అటులగుటనే వారిరువురును వారుణు లైరి. అటులే యగ్నిదేవుఁ డంగిరసునిఁ బరిగ్రహించెను. కావున నంగిరసు లెల్లఁ దద్వంశ్యులైరి. మున్ను దేవతలందఱును పితామహునిఁ బ్రసన్నునిఁగాఁ జేసికొని 'దేవా! జగదీశ్వరులగు వీరెల్లఁ బ్రజలచే, మమ్ముఁ దరింపఁజేయుదురు. వీరందఱును బ్రజాపతు లగుదురు. అందఱును దపస్వులగుదురు. మఱియు నీయనుగ్రహముచేఁ వీరు లోకమును శాశ్వతముగా ధరింపఁగలుగుదురు. నీతేజమును వర్ధిల్లఁజేయుచు వీరు వంశకర్తలగుదురు. మఱియు వేదవేత్తలును విచక్షణులు నగుదురుగాక. సౌమ్యులును బ్రజాపతులు నగు మహర్షులై వీరు దేవతలకు సహాయు లగుదురుగాక. అటులే యనంతమై వేదము సత్యము పరమతపమును బ్రబలును. ఓప్రభూ! మేమందఱమును నీసంతానము గాదే? ఓపితామహా! దేవతలకును బ్రాహ్మణులకును నీవ కర్తవు. నీయపత్యములలోఁ గశ్యపుని మున్నుగా నొనర్చి, భార్గవులను బిమ్మటివారిఁగాఁ జేయవలయునని కోరుచున్నారము. పిదప సుత్పత్తిప్రళయాంతమున వారు తమరూపముతోఁ దమ్మునే ప్రజలఁగా నిలుపు

చుండుదురు.' అని పలికిరి. అది విని, లోకపితామహుఁ డగు బ్రహ్మ, సంప్రీతుఁడై 'యటులే యగుఁగాక' యని పలికెను. వారును నందులకు సంతసించి యథేష్టముగా వెడలిపోయిరి. లోకాదిని మహాత్ముఁడగు నా దేవేశుఁడు వారుణతనువు ధరించినపు డిదియెల్ల నిట్టులయ్యెను. అగ్నియే బ్రహ్మయుఁ, బశుపతియు, శర్వుఁడు, రుద్రుఁడు, ప్రజాపతియు నగుచున్నాఁడు. ఈసువర్ణ మాయగ్ని యపత్యమే యనుట నిశ్చయము. వేదనిదర్శనమునుబట్టి ప్రమాణజ్ఞుఁడు, వహ్ని లేనపుడు తత్స్థానమున సువర్ణము నుంచుచున్నాఁడు. కుశస్తంబమునందును, సువర్ణమందును, వల్మీకరంధ్రమునందును నజముదక్షిణకర్ణమునందును, దీర్ఘోదకములందును బ్రాహ్మణహస్తమునందును జేసినహోమము ప్రీతికరమనియు వృద్ధికరమనియు భగవానుఁడు తలంచుచున్నాఁడు. శకటోర్వియందును హోమము చేయవచ్చునని కొందఱమతము. కావున దేవతలందఱును నగ్నిప్రధానులని వినుచున్నారము. బ్రహ్మవలన నగ్ని జనించెను. అగ్నివలనఁ గాంచనము జనించెను. కావున ధర్మదృష్టిగలయెవ్వరు కాంచన మొసంగుదురో, వారు సమస్తదేవతల నిచ్చువారగుచున్నారని వినుచున్నారము. అట్టి సువర్ణదాత, పరమగతి నొంది స్వర్లోకమున రాజరాజ్యాభిషిక్తుఁ డగుచున్నాఁడు. ఎవ్వఁడు సూర్యోదయసమయమున విధిమంత్రపురస్కృతముగా సువర్ణదాన మొనర్చునో, వానిదుస్స్వప్నదోషము లన్నియు నడఁగుచున్నవి. సూర్యుఁ డుదయించుచుండఁగనే యెవ్వఁడు కాంచనము నొసంగునో, వానిబాపములు తొలఁగును. మధ్యాహ్నకాలమున సువర్ణదానము చేయువానికి రాఁబోవుపాపములు నశించును. ఎవ్వఁడు యతవ్రతుఁడై సాయంసంధ్యాసమయమున సువర్ణదానము సేయునో, వానికి బ్రహ్మవాయ్వగ్నిసోమలోకములు గలుగుచున్నవి. మఱియు నట్టివాఁ డింద్రాది లోకములందును బ్రతిష్ఠ నొందుచున్నాఁడు. వాని కిహలోకమునఁ గీర్తిగలుగుటయెగాక పాపవిముక్తియుఁ గలుగుచున్నది. మఱియు వాఁడు నిత్యానందభరితుఁడై యుండును. పిదప మఱియుఁగల యుత్తమలోకములందును నిరుపమానుఁడై వెలయుచుండును. మఱియు వానికి నిర్నిరోధగతి గలిగి స్వేచ్ఛాసంచారసామర్థ్యము సైతము లభించును. వాని కాయుత్తమలోకములనుండి భ్రంశమును గలుగదు.

గొప్పయశము గల్గును.సువర్ణము నెవ్వఁడధికముగా దానము చేయునో, వాఁడు సంపూర్ణముగా నుత్తమలోకముల నొందుచున్నాఁడు. ఎవ్వఁడు సూర్యోదయమునందే యగ్నిని గావించి వ్రతోద్దేశముగా సువర్ణమును దానముచేయునో, వాఁడు సకలకామముల ననుభవింప నగుచున్నాఁడు. సువర్ణము నగ్నిగనే చెప్పుదురు. తద్దాన మత్యుత్తమము. ఓయనఘా! ఈసువర్ణము నుత్పత్తి యెఱింగించితినిగదా! ఇఁకఁ గార్తికేయునుత్పత్తినిఁ దెలిపెదను వినుము. అపు డటులు శరవణగతమయిన తేజము కార్తికేయుఁడై వర్ధిలుచు నెంతేని కాలమునకు, నింద్రాదిదేవతలచే సేనాపతిగాఁ గోరఁబడియెను. అటు లతఁడు వారికి సేనాపతియై దైత్యుఁడగుతారకుని, మఱియుఁ గలరక్కసులను వధించి యింద్రాదులకు హితమొనర్చెను. సువర్ణదానగుణముల నెఱిఁగించితినిగాదే? కావున బ్రాహ్మణులకు సువర్ణమును దానమొనర్చుము' అని తెలిపె" నని పలికి భీష్ముఁడు మఱియు నిట్లనియె.

"ఓయుధిష్ఠిరా! వసిష్ఠుఁ డిటులు పలుక వినియాభార్గవరాముఁడు బ్రాహ్మణులకు సువర్ణదానమొనర్చి కల్మషవిముక్తుఁ డయ్యెను. ఓరాజా! సువర్ణోత్పత్తివిధమును, సువర్ణదానఫలమును నీవు నావలనఁ దెలిసితివి గాదే? కావున నీవును విప్రులకుఁ గాంచన మొసంగుము. అటులేని సకలపాపవిముక్తి యగును."అని తెలుప విని యుధిష్ఠిరుఁ డిట్లనియె.

తారకవధోపాఖ్యానము

"ఓపితామహా! విధ్యుక్తముగ సువర్ణదానమునకుఁ గలగుణములను సవిస్తరముగా వేదములం దున్నవిధముగా నెఱిఁగించితివి. సువర్ణోత్పత్తికిఁగల నిమిత్తమునునైతముఁ దెలిపితివి. ఇఁకఁ దారకుఁడు నిధన మొందినవిధము నెఱిఁగింపుము. ఓతాతా! వాఁడు దేవతలకును వధ్యుఁడు గాఁడని తెలుపఁబడియెనుగదా! వానికి వధ మెట్లు సంభవించెనో విస్తరించి తెలుపుము. ఇది నీవలన వినుటకు నాకెంతయుఁ గుతూహలమగుచున్నది."

అది విని యాగాంగేయుఁడు "ఓయుధిష్ఠిరా! గంగ గర్భమును బరిత్యజించుటచే దేవతలును మహర్షులును భగ్నకాములై యాయపత్యమును భరించుటకై కృత్తికలను జనింపఁజేసిరి. ఆజాతవేదసుని తేజమును భరింప నాదేవతాంగనలలో నొకతెయుఁ జాలకుండెను,

కాని కృత్తికలు మాత్రము తత్తేజమును ధరింప శక్తలై యుండిరి. గర్భధారణనిమిత్తముగాఁ బావకుఁడు వారికిఁ బ్రసన్నుఁడై నిజతేజోదానము చేయుటయు, వారు గరుడీరూపముతో నారేతస్సును ద్రావిరి. వారి కార్యరకును గర్భములై యోనిముఖములందుఁ జేరెను. పిదప వారందఱును దత్తేజఃపరితాంగులై కాలము ప్రాప్తింపఁగా, నొక్కమాఱుగా నందఱును బ్రసవించిరి. పిమ్మట నాఱుస్థానములుగలగర్భ మొకటయ్యెను. కృత్తికలకుఁ జేరువగానున్న పృథివి దానిని బ్రతిగ్రహించెను. దివ్యస్థితిగలదై దీప్తిమంతమై పావకప్రభగల యాగర్భము దివ్యమగుశరవణమును జేరి, రూపవంతమై వృద్ధినొందెను. సూర్యసమతేజుఁడై వెలుఁగుచున్న యాబాలునిఁ గృత్తికలు గాంచి జాతస్నేహలై తమ స్తన్యప్రావములచే నాతనిఁ బోషించిరి. అటులగుట నతఁడు చరాచరాత్మకమగు లోకత్రయమునందును గార్తికేయుఁ డనఁబడుచువచ్చెను. స్కన్నమైన రేతస్సువలనఁ బుట్టుటచే స్కందుఁడనియు గుహావాసియగుట గుహుఁడనియుఁ బిలువఁబడుచు వచ్చెను. పిమ్మట దేవతలందఱును దిక్కులును, దిగీశులును, రుద్రుఁడును, ధాతయు, విష్ణువు, యముఁడును, పూషుఁడు, నర్యముఁడు, భగుఁడు, అంశుఁడు, మిత్రుఁడు, సాధ్యులు, వాసవుఁడు, వసువులు, నశ్వినీదేవతలు, నుదకములు, వాయువు, నాకసము, చంద్రుఁడు, నక్షత్రములు, గ్రహములు, రవి, మఱియుఁ గలదేవగణములును, జ్వలనాత్మజుఁడై యద్భుతరూపుఁడగు నాకుమారునిఁ గాంచవచ్చిరి. మహర్షులు సన్నుతించిరి. గంధర్వులు పాడిరి. ఆఱుమొగములును బండ్రెండునేత్రములునుగలిగి, పీనాంసుఁడును ద్వాదశభుజుఁడును నై పావకాదిత్యసమతేజుఁడై ద్విజప్రియుఁడై శరగుల్మమున శయనించియున్న యాకుమారునిఁ గాంచి, మహర్షులును, దేవతలును బరమానందభరితులై, తారకుఁడు హతుఁడైనట్లు తలంచిరి. పిదప దేవతలందఱును నాబాలునకుఁ బ్రియమొనర్పువారైరి. మఱియు నాఁడుకొనుచున్న యాబాలునకుఁ బక్షిగణముల నొసంగిరి. గరుడుఁడు చిత్రబర్హియై తనపుత్రుఁడైన మయూరునిఁ గానుకగా నిచ్చెను. రాక్షసు లాతనికి వరాహవృషభముల నిచ్చిరి. అరుణుఁడు వహ్నితుల్యమగు కుక్కుటము నాబాలునకొసంగెను. చంద్రుఁ డొకమేషము నిచ్చెను. ఆదిత్యుఁడు రుచిరప్రభ

నొసంగెను. గోమాతయగు దేవి వందలకొలందిని వేలకొలందినిగోవుల నొసంగెను. అగ్ని సుగుణవిశిష్టసుగునొకభాగము నొసంగెను. భూదేవి పెక్కుఫలపుష్పముల నిచ్చెను. సుధన్వుఁడు మనోహరకూబరసహిత మగు నొకరథ మొసంగెను. వరుణుఁడు వారణములగు దివ్యగజముల నిచ్చెను. సురేంద్రుఁడు సింహములను, వ్యాఘ్రములను, నేస్తులను, మఱియు దంష్ట్రలుగల మఱికొన్నిటిని నొసంగెను. సర్వప్రభుఁడగు నాతని రాక్షసులు, నసురులును, సంఘములుగా ననుసరించిరి. అటులు వర్ధిలుచున్న యక్కుమారు నెటులేని వధించుటకై తారకుఁడు ప్రయత్నించెను. కాని యతఁ డెన్నియుపాయము లొనర్చినను వధింపఁజాలఁ డయ్యెను. గుహాలయుఁడగు నాకుమారునిఁ దమకు సేనానాయకునిఁగా వరించువారై యాతారకుఁ డొనర్చినయపకారములన్నియు నాతనితో విన్నవించికొనిరి. అంత నక్కుమారుఁడు వారిమనవు లాలించి వారికి సేనాపతియై, నిజమహావీర్యమడరఁ దారకునిఁ దనశక్తిచే హతునిఁ గావించెను. అటు లాగుహునిచే నారక్కసుఁడు సులభముగా వధింపఁ బడుటయు, మరల నాసురేంద్రుఁ డెప్పటిచొప్పున దేవతల కధిపతియై పాలించెను. పిదప నతఁడు వారికి సేనాపతియగుచుఁ బ్రతాపనిధియై వెలయుచు వచ్చెను. అటు లతఁడు దేవతలకు రక్షకుఁడును, శంకరునకుఁ బ్రియకరుఁడును, హిరణ్యమూర్తియు నై పావకపుత్రుఁడగు నాభగవానుఁ డెంతయు విరాజిల్లెను. ఓయుధిష్ఠిరా! నావచనములు వింటివిగదా! కావున సువర్ణము, శుభప్రదమును, నక్షయ్యము, నుత్తమము, కార్తికేయునకుఁ దోఁబుట్టువు, వహ్నితేజమును నగుచు లోకమున వెలయుచున్నది. ఈవిషయమునే వసిష్ఠుఁడు పరశురామున కెఱిఁగించెను. కావున నోనరాధిపా! సువర్ణదానములు సేయఁ బ్రయత్నింపుము. మున్ను రాముఁడు సువర్ణదానముచేసియే కలుషవిముక్తుఁ డయ్యెను. మఱియు నతఁడు, మానవులకు సులభము గాని త్రివిష్టపస్థానమునొందెను." అని తెలుప విని మఱియు నయ్యుధిష్ఠిరుఁ డిట్లనియె.

## శ్రాద్ధకథనము

"ఓపితామహా! ధర్మాత్మా! నీవు నాకుఁ జాతుర్వర్ణ్యధర్మముల నెఱిఁగించితివి. అటులే శ్రాద్ధవిధినంతయుఁ దెలుపుము."

ఓజనమేజయా! ఇటు లాధర్మజుఁడు ప్రశ్నింపఁగా, శాంతనవుఁ డాతనికి శ్రాద్ధవిధినెల్లఁ దెలుప నారంభించెను. అది యెటులంటేని వినుము.

"ఓయుధిష్ఠిరా! శుభప్రదమగు శ్రాద్ధకర్మవిధి నెఱిఁగించెదను. అవహితుఁడవై వినుము. అయశ్వాది ధర్మప్రదమును, కీర్తిదాయకమును, బుత్రసంపత్కారమునై పితృయజ్ఞ మనఁబడుచున్నది. దేవాసురమానవులకును, గంధర్వోరగరాక్షసులకును, బిశాచులకును, కిన్నరులకును, బితరులు పూజ్యులగుచున్నారు. అమావాస్యయందుఁ బితరులఁ బూజించి ప్రతిపత్తున దేవతల నారాధింపవలయును. మానవుఁడు సప్రయత్నముగాఁ బితరుల నారాధింపవలయును. మాసిక పిండశ్రాద్ధ మన్వాహార్య మనఁబడుచున్నది. ఓమహారాజా! అట్టి యన్వాహార్యమే పితృశ్రాద్ధ మనఁబడుచున్నది. శ్రాద్ధవిధి ప్రతితిథియందును జేయవలయును. ఏతిథియం దొనర్చిన నెట్టిగుణముగునో యెఱిఁగించెదను వినుము. ప్రతిపత్తునఁ బితరులఁ బూజించినవారికి భార్య లభిరూపసంతానవతులై సరూపముగలవారు లభింతురు. విదియనాఁ డర్చించినవారికిఁ బుత్రికలు జనింతురు. తదియనాఁడు పూజించినవారి కశ్వములు గల్గును. చవితినాఁడు పితరుల నర్చించినవారికిఁ బెక్కులగుక్షుద్రపశువులు లభించును. పంచమినాఁడు గావించువారికి మంచి కొమరులు గలుగుచున్నారు. షష్ఠినాఁడు పితృపూజ గావించువారు తేజోవంతులగుదురు. ఓయీ! సప్తమినాఁ డర్చించినవాఁడు కృషిభాగముగలవాఁడును, నష్టమిదినమున నొనర్చువాఁడు వాణిజ్యలాభ మొందువాఁడును నగుచున్నారు. నవమినాఁడు శ్రాద్ధకర్మ మొనర్చినవాని కేకశఫలములు పెక్కు లభించెడిని. దశమినాఁడు శ్రాద్ధవిధి నాచరించినవానికి గోవృద్ధి గలిగెడిని. ఏకాదశినాఁ డొనర్చినవానికి వెండి బంగారు మొదలగునవి గలుగుటయేగాక వానిగృహమున బ్రహ్మవర్చస్సుగలపుత్రులు నిండియుండుదురు. ద్వాదశినిఁ బితృపూజ చేయువానికి, రజతము, బహుధనము, సువర్ణమును సమృద్ధిగాఁ గలిగెడిని. త్రయోదశినాఁడు శ్రాద్ధవిధి నొనర్చినవాఁడు తనజ్ఞాతులలో నుత్తముఁ డగుచున్నాఁడు. చతుర్దశినాఁడు పితృకర్మ మొనర్చినమానవుఁడు, యుద్ధభాగము గలవాఁడగుటయే గాక తనతోఁడివారికి గౌరవ

పాత్రుఁడగుచున్నాఁడు. అమావాస్యనాఁడు నివాప మొనర్చినవాఁడు సకలకామముల నొందుచున్నాఁడు. కృష్ణపక్షమునఁ జతుర్దశి తక్కఁ దక్కినదశమ్యాదితిథులు శ్రాద్ధకర్మమున కుత్తమములు. తక్కినవట్టివి గావేరవు. శుక్లపక్షముకంటెఁ గృష్ణపక్షము శ్రాద్ధవిధి కుత్తమ మగును. అటులే పూర్వాహ్ణముకంటె నపరాహ్ణము శ్రేష్ఠమైనదని తెలియు" మని తెలుప విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె.

## శ్రాద్ధకల్పము

'ఓపితామహా! పితృదేవతలకిచ్చి యెద్ది యక్షయమగుచున్నది? ఏది చిరకాలమునకు ఫలజనకమగును? మఱియేది యానంత్యమును గల్పించునది?"

అది విని యాభీష్ముఁడు, "ఓధర్మజా! శ్రాద్ధకల్పమున వేసిని హవిస్సులఁగా శ్రాద్ధవేత్త లెఱిఁగింతురో, కామ్యములగునట్టివానిని, వానిఫలమును దెలిపెదను వినుము. ఓరాజా! 'తిలలు, వ్రీహులు, యవలు, మాషములు, నుదకములు, కందమూలములు!' అను నీపదార్థములచే నొసంగఁబడిన శ్రాద్ధము పితృదేవతాప్రీతికర మగుచున్నయది. తిలశ్రాద్ధ మక్షయమని మనువు చెప్పియున్నాఁడు. పితృభోజ్యము లగువానియందెల్లఁ దిలలే ప్రధానములుగాఁ దెలుపఁబడియెను. పితృగణమునకు మత్స్యములచేఁ జేసిన శ్రాద్ధము రెండు మాసములు తృప్తిని గలిగించుచున్నది. ఆవికముచేఁ జేసిన శ్రాద్ధము మూఁడుమాసములును, శశముచేఁ జేసినది నాల్గుమాసములును దృప్తి నిచ్చును. అజమాంసముచేఁ బితరు లయిదునెలలు తృప్తినొందుచున్నారు. అటులే వరాహముచేఁ జేసిన శ్రాద్ధమున నాఱుమాసములును, బక్షులచేఁ జేసిన శ్రాద్ధమున నేడునెలలును దృప్తి నొందుచున్నారు. దుప్పిమాంసముచేఁ జేసిన శ్రాద్ధమున నెనిమిది నెలలును, నల్లచాఱలదుప్పిమాంసముచేఁ జేసినదానికిఁ దొమ్మిదిమాసములును దృప్తినొందుచున్నారు. గవయమృగమాంసముచేఁ బదిమాసములు తృప్తిగలిగియుందురు. మహిషమాంసముచేఁ బదునొకండు నెలలును బ్రీతిగలిగియుండుదురు. గవ్యముచేఁ జేసిన శ్రాద్ధమునకు వారొక వత్సరము తృప్తిగలిగియుందురు. గవ్య మెట్టిదియో సర్పిస్సహితమగు

పాయసమును పితృప్రీతి నొసఁగుటలో నట్టిదే యగుచున్నది. మనుఁబ్రాఁడుగల మహోక్షముమాంసముచేఁ జేసిన శ్రాద్ధము పితృదేవతలకుఁ బండ్రెండువత్సరములు తృప్తిని గలిగించుచున్నది. మృతతిథినాఁడు ఖడ్గమృగమాంసముచేఁ జేసిన శ్రాద్ధమునను పితృదేవతల కానంత్యము గలుగుచున్నది. కలిశాకము, కాంచనపృషత్పుష్పశాకాదికము, ఛాగము పితృదేవతల కానంత్యము నొసంగుచున్నది. ఓయుధిష్ఠిరా! ఈవిషయమునఁ బితృగీతగాథలను దెలుపుదును. మున్ను సనత్కుమారుఁడు వాని నా కెఱిఁగించెను. 'ఎవ్వఁడు తమవంశమున జనించునో వాఁడు, దక్షిణాయనమున మఘానక్షత్రమునను, త్రయోదశిని సర్పిస్సంయుక్తముగాఁ బైతృక మొనర్పవలయుననియు, మఱియు మఘానక్షత్రమున యతవ్రతుఁడై యజమాంసముచేఁగాని, కాంచనపుష్పశాకాదులచేఁగాని శ్రాద్ధమొనర్పవలయుననియుఁ బితృదేవతలు కోరుదురఁట. మఱియుఁ దమవంశమునఁ బెక్కురు జనింతురేని వారిలో నొకఁడేని గయకు వెళ్లుననియు నిరీక్షింతురఁట.' గయాప్రదేశమున నక్షయ్యమగువట మొకటి ప్రసిద్ధముగ నున్నదిగాదే? ఆగయలో నుదకము, ఫలము, మాంసము, అన్నము మున్నగువానిని మధుమిశ్రముగాఁ జేసి శ్రాద్ధ మొనర్చినచోఁ బితృదేవత లానంత్య మొందుచున్నారు." అని తెలిపి భీష్ముఁడు మఱియు నిట్లనియె.

### శ్రాద్ధఫలవిశేషకథనము

"ఓధర్మజా! యముఁడు మున్ను శశిబిందువునకుఁ గామ్యములగు నేయే శ్రాద్ధవిధుల నెఱిఁగించెనో వానిం దెలిపెదను వినుము. అవి యాయానక్షత్రములందొనర్చిన నొక్కొకఫలవిశేషమును గలిగించును. ఎవ్వఁడు కృత్తికానక్షత్రమున శ్రాద్ధమొనర్చునో, వాఁడగ్న్యాధాన మొనర్చి సాపత్యముగ యజ్ఞముచేయువాఁ డగుచున్నాఁడు. సంతానకాముఁడు రోహిణియందును దేజస్కాముఁడు మృగశీర్షమునందును గామ్యశ్రాద్ధ మొనర్పవలయును. క్రూరకర్ముఁడగువాఁ డార్ద్రానక్షత్రమున శ్రాద్ధమొనర్చునేని గౌరవార్హుఁ డగుచున్నాఁడు. పునర్వసువున నొనర్చినవాఁడు కృషిభాగముగలవాఁడును, పుష్యమి నొనర్చినవాఁడు పుష్టిగలవాఁడును నగుదురు. ఆశ్లేషయందు శ్రాద్ధమొన

ర్చినవాఁడు ధీరులగుపుత్త్రులను బడయును. మఘానక్షత్త్రమున, నాపప మొనర్చినవాఁడు జ్ఞాతులలో నుత్తముఁ డనఁబడుచున్నాఁడు. ఫల్గుని యం దొనర్చినవాఁడు సౌభాగ్యమొందును. ఉత్తరయందు శ్రాద్ధ మొనర్చినవాఁడు సంతానవంతుఁడును, హస్తయం దొనర్చినవాఁడు లాభమును బొందుచున్నాఁడు. చిత్త్రానక్షత్త్రమున శ్రాద్ధదానముచేయు వాఁడు. రూపవంతులగుపుత్త్రులను, స్వాతియందొనర్చినవాఁడు వాణిజ్యలాభమును బొందఁగలుగుదురు. పుత్త్రకాముఁడు, విశాఖా నక్షత్త్రమున నొనర్చినచో బహుపుత్త్రుఁడగును. అనూరాధయం దొన ర్చినవాఁడు రాజచక్రమును బ్రవర్తిల్లజేయును. జ్యేష్ఠానక్షత్త్రమున నపవర్జన మొనర్చునేని యాధిపత్యమొందును. ఓధర్మజా! శ్రద్ధాశాంతి యుక్తుఁడై మూలనక్షత్త్రమున నొనర్చునేని యారోగ్యమొందును. పూర్వాషాఢయందు శ్రాద్ధమొనర్చినవాఁ డుత్తమకీర్తిని, నుత్తరా షాఢయం దొనర్చినవాఁడు నిత్యానందమును బొందుచున్నారు. అభి జిన్నక్షత్త్రమున శ్రాద్ధమొనర్చినవాఁ డుత్తమవిద్య నొందును. శ్రవణ మున శ్రాద్ధముచేసినవాఁడు, మృతుఁడై నపిమ్మట సద్గతినొందును. ధనిష్ఠ యం దొనర్చినవాఁడు రాజ్యభాగియు, శతభిషఙ్నక్షత్త్రమున నొనర్చిన వాఁడు భిషక్సిద్ధిని బొందుచున్నారు. పూర్వాభద్రపదమున నొనర్చిన వాఁడు పెక్కుమేఁకలను గొఱియలను బడయుచున్నాఁడు. ఉత్తర భద్రపదయం దొనర్చినవాఁడు. పెక్కుగోవుల నొందును. రేవతి యందు శ్రాద్ధమొనర్చినవాఁడు, బహుకుప్యరూపవిత్తమును, నశ్విని యం దొనర్చినవాఁ డశ్వములును, భరణియం దొనర్చినవాఁ డాయు వును బొందుచున్నారు. ఈశ్రాద్ధవిధిని విని శశిబిందుఁడు విధ్యుక్త ముగా శ్రాద్ధము నొనర్చెను. అటులొనర్చుట నతఁడు సుఖముగా శత్త్రుజయము గావించి రాజ్యము నేలికొనియెను." అని తెలుప విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె.

## శ్రాద్ధనిమన్త్రణవిధానకథనము

"ఓపితామహా! శ్రాద్ధకర్మములం దెట్టిబ్రాహ్మణులను నిమంత్త్రింప వలయునో నా కెఱింగింపుము."

అది విని భీష్ముఁడు "ఓయుధిష్ఠిరా! దానధర్మవేత్తయగుక్షత్త్రి యుఁడు, దైవకర్మములందు బ్రాహ్మణునిఁ బరీక్షింపరాదు. పిత్త్రుకర్మము

లందుఁ బరీక్షించుట న్యాయమని తెలుపుచున్నారు. దేవతలు దైవ తేజముచే మానవులఁ బవిత్రులఁ జేయుదురు. కావున మానవులు దేవ తల నుద్దేశించి యెట్టిబ్రాహ్మణులకేని దానము చేయవచ్చును. ఇఁక శ్రాద్ధమునందు మాత్రము బ్రాహ్మణులను బండితుఁడగువాఁడు పరీ క్షింపవలయును. పరిగ్రహీతలగుబ్రాహ్మణులు కులశీలవయోరూపము లును విద్యయు సద్వంశమును గలిగియుండవలయును. ఆబ్రాహ్మణు లలోఁ గొందఱు పంక్తిదూషకులును, గొందఱు పంక్తిపావనులునై యుందురు. అటులగుట నోయుధిష్ఠిరా! అపాంక్తేయు లెట్టివారో, వారి నెఱిఁగించెదను వినుము. మోసము చేయువాఁడు భ్రూణహంత, క్షయరోగి, పశుపాలుఁడు, నధ్యయనశూన్యుఁడు, గ్రామసేవకుఁడు, వడ్డిచే జీవించువాఁడు, గాయకుఁడు, సర్వవస్తువిక్రేతయు, గృహము లనుగాల్చినవాఁడు, విషప్రయోగము చేసినవాఁడును, నిష్టము వచ్చిన దానినెల్లఁ దినువాఁడును, సోమవిక్రయము చేసినవాఁడును, సాముద్రి కుఁడు, రాజభృత్యుఁడు, తిలకర్మము చేయువాఁడును, కూటసాక్షియుఁ, దండ్రితో వివాదము చేసినవాఁడును, సభిశస్తుఁడును, దొంగయు, శిల్పముచే జీవించువాఁడును, వేషాంతరధారియుఁ, గొండెము చెప్పు వాఁడును, మిత్రద్రోహియుఁ, బరదారాసక్తుఁడును శూద్రులకు విద్య గఱపువాఁడును, శస్త్రములచేఁ జీవించువాఁడును, కుక్కలవెంటఁ దిరుగువాఁడును, శునకదష్టుఁడును, దమ్ముఁడు పెండ్లాడఁగాఁ దాను బెండ్లాడకున్నవాఁడును, దుశ్చర్మఁడును, గురుతల్పగుఁడును, కుశీలవుఁ డును, బూజారియు, నక్షత్రజీవనుఁడును, నపాంక్తేయులు ఇట్టి బ్రాహ్మ ణులచే భుక్తమగుహవిస్సు రాక్షసులను జేరుచున్నదని బ్రహ్మవాదులు తెలుపుచున్నారు. ఎవ్వఁడు శ్రాద్ధమున భుజించి యధ్యయనము చేయునో, మఱియు నెవ్వఁడు శూద్రాంగనాసంగమము చేయునో, యట్టివారిపురీషమునఁ బితరు లొకనెల శయనింతురు. సోమవిక్రయ మొనర్చినవానికిఁ బెట్టినశ్రాద్ధభోజనము, పితృదేవతలకు మలముగను, వైద్యునకుఁ బెట్టినది పూయశోణితమును నగుచున్నది. పూజారికిఁ బెట్టి నది నష్టమగుచున్నది. వడ్డిచే జీవించువానికిఁ బెట్టినది. ప్రతిష్ఠ లేనిదియు నగుచున్నది. వాణిజ్యము చేయువానికిఁ బెట్టినది యిహపరఫలశూన్య మగుచున్నది. పునర్భూపుత్రునకుఁ బెట్టినది బూడిదబోసినహవ్యమట్టి

దగుచున్నది. ఎవ్వరు ధర్మవ్యపేతులును జారిత్రహీనుల్కలు నగుదురో, యట్టివారికి హవ్యకవ్యముల నిచ్చినవాఁడు, వానిని నశింపఁజేసినవాఁడగుచున్నాఁడు. మఱియు నల్పబుద్ధులై యెవ్వ రట్టివారని తెలిసియు హవ్యకవ్యముల నిత్తురో వారిపితరులు పురీషమును భుజింతురనుట నిశ్చయము. పైనిదెలిపినద్విజాధము లపాంక్తేయులని తెలిసికొనవలయును. శూద్రులకు విద్య నుపదేశించునల్పబుద్ధులు నపాంక్తేయులే యగుచున్నారు. అటులే గ్రుడ్డివాఁడును, నపుంసకుఁడును, బొల్లివాఁడును, నపాంక్తేయు లగుదురు. తలకు గుడ్డచుట్టుకొనియు, దక్షిణాముఖముగాఁ గూరుచుండియుఁ, జెప్పులతోడిగికొనియు భుజించినచో నది యాసురభోజన మగుచున్నది. అసూయాసహితముగను, శ్రద్ధారహితముగను జేసినది యసురులభాగమగునట్లుగా బ్రహ్మ కల్పించెను. శ్రాద్ధాహారమును బంక్తిదూష్యులును గుక్కలును జూడరాదు. అటులగుట, నావృతప్రదేశమునఁ దిలలను జల్లవలయును. తిలరహితముగను, క్రోధసహితముగను జేసినశ్రాద్ధమును, దానియందలి హవిస్సును రాక్షసులు, పిశాచులును నశింపఁజేయుచున్నారు. పంక్తిబాహ్యుఁడగువాఁడు, భోజనముచేయువారిపంక్తిలో నెంతవఱకుఁ గాంచునో, యంతవఱకున్నవారివలనఁ గలుగుఫలము దాతకు నశింపఁజేయుచున్నాఁడు. ఓభరతకులోత్తమా! ఇఁకఁ బంక్తిపావనులగువారివిధ మెట్టిదియో తెలిపెదను వినుము. నిమిత్తములనుబట్టి వారినిఁ బరీక్షించి తెలిసికొనుము. సదాచారపరులైన విద్యావేదవ్రతస్నాతులైన బ్రాహ్మణులందఱును, బంక్తిపావను లనఁబడుచున్నారు. పాంక్తేయు లెవ్వరో తెలిపెదను దెలిసికొనుము. వారే పంక్తిపావనులు. త్రేతాగ్నిహోతయుఁ, బంచాగ్నియుఁ,ద్రిసువర్ణవేత్తయు, శిక్షాదుల నెఱిఁగినవాఁడును, వేదము నిచ్చువారిపరంపరయందుఁ బుట్టినవాఁడును, ఛాందోగ్యజ్ఞుఁడును, జ్యేష్ఠసామగుఁడును, మాతాపితృవంశ్యుఁడును, బదితరముల నుండి శ్రోత్రియత్వముగలవాఁడును, ఋతుకాలాభిగామియు, ధర్మపత్నీవ్రతనిష్ఠుఁడును, వేదవిద్యావ్రతస్నాతుఁడు నగువిప్రుఁడు పంక్తినిబావనముగఁ జేయుచున్నాఁడు. మఱియు, నథర్వశిరస్సు నధ్యయన మొనర్చినవాఁడును, బ్రహ్మచర్యవ్రతపరాయణుఁడును, యతవ్రతుఁడును, సత్యవాదియు, ధర్మశీలుఁడు, నిజకర్మనిరతుఁడును, బుణ్యతీర్థాభిషేకపరి

శ్రమగలవాఁడును, సమంత్రకయజ్ఞముల నవభృథమొనర్చినవాఁడును, క్రోధరహితులును, స్థిరచిత్తులును, శాంతులును, దాంతులును, జితేంద్రియులును, సర్వభూతహితులును నగువారిని శ్రాద్ధములందు నిమంత్రింపవలయును. ఇట్టివారి కిడిన శ్రాద్ధ మక్షయ్యమగును. వీరే పంక్తిపావనులు. మఱియు, యతులును, యోగులును, మోక్షధర్మజ్ఞులును, నితిహాసములను వినిపించువారును, భాష్యవేత్తలును, వ్యాకరణజ్ఞులును, పురాణవేత్తలును, ధర్మశాస్త్రజ్ఞులును, విధ్యుక్తముగా నధ్యయనమొనర్చినవారును, గురుకులవాసియు, బ్రహ్మవాదియు, సర్వవేదములందును సర్వప్రవచనములందును నుత్తములయినవారును పంక్తిపావనులగుచున్నారు. వేదమిచ్చినవారిపరంపరయందుఁ బుట్టినవాఁడొకక్రోశములో సగమునకు హెచ్చుగా నున్నపంక్తిని పవిత్రీకరించునని బ్రహ్మవేత్తలు తెలుపుచున్నారు. అట్టివాఁడు ఋత్విజులు నుపాధ్యాయులు నందు లేనిచోఁ బంక్తిలో నగ్రాసనము నొందవచ్చును. ఋత్విక్కులున్నను, వారియనుజ్ఞవడసి పంక్తిలోఁ గూర్చుండి యందుఁగల దోషమును హరించును. మఱియుఁ బైఁదెలిపినఁబంక్తిదోషము లేవియు లేని వేదవేత్తయుఁ, బతితుఁడు గాకుండెనేని పంక్తిపావనుఁడే యగుచున్నాఁడు. అటులగుట నెల్లవిధములఁ బరీక్షించి బ్రాహ్మణుల శ్రాద్ధములందు నిమంత్రింపవలయును. నిజకర్మనిరతులును, దాంతులును, సత్కులప్రసూతులును, బహుశ్రుతులును నిమంత్రింపఁదగియుందురు. ఎవ్వని శ్రాద్ధములును, హవిస్సులును మిత్రప్రధానములై ప్రవర్తిల్లునో, యట్టివి పితృదేవతలకును, దేవతలకును ప్రీతికరములు గాకుండుటయెగాక, కర్తకును స్వర్గసంపాదకములు గానేరవు. ఎవ్వఁడు శ్రాద్ధనిమిత్తమున సఖ్యము సంపాదింప నెంచి చేయునో, వాఁడు స్వర్గమునకుఁ బోవుత్రోవను బట్టఁజాలడు. శ్రాద్ధమున మిత్రుల నిమంత్రించువాఁడు స్వర్గచ్యుతుఁ డగుచున్నాఁడు. కావున శ్రాద్ధమున మిత్రుఁడని యాదరింపరాదు. మిత్రసంపాదనము వలయునేని వారికి వేఱొకవిధముగా ధనముల నొసంగవలయును. ఎవ్వఁడు తనకు శత్రువు మిత్రుఁడునుగాక మధ్యస్థుఁడై యుండునో యట్టివానినే హవ్యకవ్యములందు నిమంత్రింపవలయును. ఊషరక్షేత్రమునఁ బెట్టినబీజ మెట్లు జనింపదో, యటులే యనర్హులగువారిచే భుజింపఁ

బడిన శ్రాద్ధ మిహపరఫలశూన్యమై నశించును, అధ్యయనశూన్యుఁడగు బ్రాహ్మణుఁడు తృణాగ్నివలె నిస్సారుఁడగును. అట్టివానికి శ్రాద్ధమున దానము సేయరాదు బూడిదలో నెవ్వఁడేని హోమము చేయునా? పరస్పరోపకారకముగా నొనర్చికొనిన భోజనాదిదానము పిశాచ దక్షిణ మనఁబడుచు, నది దేవతలకును బితృదేవతలకును బ్రీతికరము గాకుండుటయె గాక, శాలాంతరమున వత్సము నశించినగోవువలె నం దే పుణ్యశూన్యమై చరించునని తెలియవలయును. అగ్ని చల్లారినపిమ్మట ఘృతము హోమ మొనర్చిన నెట్లు దేవతలకును బితరులకును దృప్తి కరము గాకుండునో, యటులే నర్తకునకును గాయకునకును జేసిన దానము నిష్ఫలమగును. అటులే యపాత్రున కిచ్చినదక్షిణయు నిష్ఫలమగును. అపాత్రదక్షిణ దాతృప్రతిగ్రహీతల నుభయులను బాలింపకుండుటయెగాక నశింపను జేయుచున్నది. అట్టిదాన మెవ్వఁడు సేయునో, వాఁడు మృతినొందినపితరులను దేవయానమునుండి పడఁ ద్రోయువాఁ డగుచున్నాఁడు. ఓయుధిష్ఠిరా! ఎవ్వరు మహర్షులుచేసిన సిద్ధాంతమునఁ బ్రవర్తింతురో, యట్టివారినే సకలధర్మజ్ఞులగు దేవతలు, బ్రాహ్మణులని తెలుపుచున్నారు. ఓభారతా! మహర్షులు స్వాధ్యాయ నిష్ఠులును, జ్ఞాననిష్ఠులును, దపోనిష్ఠులును, గర్మనిష్ఠులును నైనవారని తెలియవలయును. జ్ఞాననిష్ఠులగువారికే కవ్యముల నొసంగవలయును. అట్టిశ్రాద్ధములందు బ్రాహ్మణుల నాదరింపక యెవ్వరును వివాదములు పెట్టి నిందింతురో వారిని శ్రాద్ధములందు భుజింపఁజేయరాదు బ్రాహ్మణులు, నిందితులైరేని, మూఁడుతరములవఱకును వంశముల నశింపఁజేయు దురు. ఓరాజా! వేదపారగులగు బ్రాహ్మణులను దూరమునుండియే పరీక్షింపవలయునని వైఖానసమహర్షుల వచనము వినవచ్చుచున్నది. ప్రియుఁడనియు, నప్రియుఁడనియుఁ దలంపక తగినవానికి శ్రాద్ధము నొసంగవలయును. మంత్రవేత్తయగువాఁ డెల్లవారిలో నర్హుఁ డగు చున్నాఁడు" అని తెలుప విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె.

### శ్రాద్ధకర్మకథనము

"ఓపితామహా! మున్ను శ్రాద్ధ మెవ్వనిచే సంకల్పింపఁబడియెను? అదియు నేకాలమున? దానిస్వరూప మెట్టిది? భృగువులు నంగిరసులు

మాత్ర మున్నకాలమునుండి యున్నదా ? వారిలో నెవ్వఁడు కల్పించెను ? అది నాకెఱిఁగింపుము. అందును విడువఁదగిన వెవ్వి ? మూలఫలములతోఁ జేయున వెవ్వి? ధాన్యజాతిలో నేనిని విడువవలయును? అదియును నా కెఱిఁగింపుము.”

అది విని శాంతనవుఁ డాకౌంతేయాగ్రజునితో “ఓధర్మజా ! నీవడిగినవాని కెల్ల నుత్తరము లిచ్చెదను వినుము. మహాసమగ్రుఁడును, బరమర్షియు, స్వాయంభువుఁడు నగు నత్రి గలఁడు గాదే ? ఓమహారాజా ! వానివంశమున దత్తాత్రేయుఁ డనునతఁ డొకఁడు గలఁడు. ఆతనికిఁ బుత్రుఁడై తపోధనుఁడైన నిమి యనునాతఁడు వెలసెను. ఆతనికి శోభానిధియగు శ్రీమంతుఁడు పుత్రుఁడై పుట్టెను. అతఁడు దుష్కరతపమొనర్చి వేయివత్సరములు గడచినపిమ్మటఁ గాలవశుఁడై మృతినొందెను. అప్పు డాశ్రీమంతునితండ్రి యగు నిమి, తనతనయునకు విధ్యుక్తముగా, శౌచకర్మ మొనర్చి, పుత్రశోకపరాయణుఁడగుట నెంతయుఁ దీవ్రసంతాప మొందెను. పిమ్మట నమ్మహామతి యగు నిమి, చతుర్దశినాఁడు, మృష్టాన్నకశిపు ప్రభృతులగు నుపకార్యములొనర్చి, వానిఁ జింతించుచుఁ బ్రభాతమున మేలుకనియెను. అటులు మేలుకని శోకవ్యథితాత్ముఁడైన యతఁడు కొంతవడికి శోకమువిడిచి, బుద్ధి విస్తరిల్ల సమాహితుఁడై చింతించుటయు, నాతనికి నాచేఁ జెప్పఁబడినవియు, మఱియుఁ గలకొన్నియుఁ, జిత్తవీథిని బ్రస్ఫురించెను. అంత నత్తపోధనుఁ డాయమావాస్యను బ్రాహ్మణులను రావించి, గౌరవించి, వారికిఁ బ్రదక్షిణావర్తితములగు దర్భాసనములఁ గల్పించి, యం దేడ్వుర నొక్కమాఱుగా భుజింప నియమించెను. అటులొనర్చి పిదప లవణము లేకుండ శ్యామాకాన్నమును భోజ్యముగా వారి కొసఁగి, పిమ్మట విష్టరములకడ దక్షిణాగ్రములుగా దర్భలు నుంచి, మఱియు నాభుజించుచున్న బ్రాహ్మణులపాదములపై దక్షిణాగ్రములుగా దర్భలనిడి వానిపై, శ్రీమంతుని నామగోత్రముల నుదాహరించుచుఁ బ్రయతుఁడు శుచియునై పిండములను నుంచెను. అటు లొనర్చి యమ్మునిశ్రేష్ఠుఁడు, తానొనర్చినధర్మసంకరమును గూర్చి యెంతయుఁ బశ్చాత్తాపము గలుగఁ బరితపించుచు నిట్లు చింతించెను.

'అయ్యయో! మున్ను మునులు పితరుల నుద్దేశించి చేసినకర్మము నేనిపుడు పుత్రు నుద్దేశించి యొనర్చి ధర్మసాంకర్య మొనర్చితిని. ఇట్టి కృత్యము నొనర్చిననన్ను బ్రాహ్మణులు శపించి దహింతురేమో!'

ఓయుధిష్ఠిరా! అటు లాతఁ డాలోచించి తనకు వంశకర్తయగు నత్రిని స్మరించి, సమాహితుఁడై యాభగవంతునిఁ జిత్తమున ధ్యానించుచుండఁ, దోడనే తపోధనుఁడగు నయ్యత్రిమహర్షి యందులకు వచ్చి పుత్రశోకపీడితుఁడై యున్న యానిమికి దర్శనమొసంగి, ప్రీతికరములగు వచనముల నాతని నెంతయు నూఱడించువాఁడై 'ఓనిమీ! తపోధనా! నీ యీసంకల్పించిన పితృయజ్ఞము నాకెంతయు సమ్మతమైనది. ఈధర్మము, మున్ను బ్రహ్మచేతనే గనిపెట్టఁబడినది. అటులగుట స్వయంభువునకు హితమగుధర్మమే నీచే సంకల్పింపఁబడినది. ఆబ్రహ్మదక్క వేఱొక్కఁ డెవ్వఁడు శ్రాద్ధవిధిని సంకల్పింపఁగలఁడు? ఓపుత్రకా! శ్రాద్ధవిధియం దెయ్యది యుత్తమమో, దానినెఱిఁగించెదను వినుము. అయ్యది స్వయంభూవిహితమైనది. దాని నెఱిఁగించెదను నీవానర్పుము. ఓతపోధనా! మున్నుగా, నొకయగ్నిశరణమును గల్పించి పిమ్మట నగ్నికిని, సోమునకును, వరుణునకును, పితరులకును, వారితోఁ గలిసి చరించు విశ్వేదేవతలకును భాగములను గల్పింపవలయునని మున్నా స్వయంభువు విధించియున్నాఁడు. అపుడు లోకధారిణియగు పృథివిని సన్నుతింపవలయును. అటులే జలము తెచ్చునపుడు వరుణుని సన్నుతింపవలయును. ఓపుణ్యశీలా! పిమ్మట నగ్నియు సోముఁడు నారాధింపఁదగియుందురు. మున్నా బ్రహ్మచే సూక్ష్మపాయులగు నెవ్వరు నిర్మింపఁబడిరో, యట్టి పితృదేవతలకు భాగము కల్పింపఁబడియెను. వారు శ్రాద్ధవిధిచే నర్చితులై కిల్బిషమునుండి విముక్తులగుచున్నారు. పితృవంశ్య లెవ్వరు మున్నా స్వయంభువుచేఁ గనిపెట్టఁబడిరి. మఱియు, నగ్నిముఖులగు విశ్వేదేవులను మున్నే బ్రహ్మ పరిగణించియున్నాఁడు. మహాత్ములును, భాగార్హులు నగు వారినామములఁ దెలిపెదను వినుము. సహుఁడు, కృతి, విపాప్ముఁడు, పుణ్యకృత్తు, పావనుఁడు, గ్రామణ్యుఁడు, క్షేమ్యుఁడు, సమూహుఁడు, దివ్యసానువు, వివస్వంతుఁడు, వీర్యవంతుఁడు, శ్రీమంతుఁడు, కీర్తిమంతుఁడు, కృతుఁడు, జితాత్ముఁడు, మునివీర్యుఁడు, దీప్తరోముఁడు, భయంకరుఁడు, అను

కర్మ, ప్రతీతుఁడు, ప్రదాత, అంశుమంతుఁడు, శైలాభుఁడు, పరమక్రోధి, ధీరోష్ణి, భూపతి, స్రజుఁడు, వజ్రీవరుఁడు అనువారు సనాతనులగు విశ్వేదేవులు మఱియు, విద్యుద్వర్చుఁడు, సోమవర్చుఁడు, సూర్యశ్రీ, సోమపుఁడు, సూర్యసావిత్రుఁడు, దత్తాత్ముఁడు, పుండరీయకుఁడు, ఉష్ణీనాభుఁడు, నభోదుఁడు, విశ్వాయువు, దీప్తి, చమూహరుఁడు, సురేశుఁడు, వ్యోమారి, శంకరుఁడు, భవుఁడు, ఈశుఁడు, కర్త, కృతి, దక్షుఁడు, భువనుఁడు, దివ్యకర్మకృత్తు, గణితుఁడు, పంచవీర్యుఁడు, ఆదిత్యుఁడు, రశ్మివంతుఁడు, సప్తకృత్తు, సోమవర్చుఁడు, విశ్వకృత్తు, కవి, అనుగోప్త, సుగోప్త, నప్త, ఈశ్వరుఁడు అనియు నమ్మహాభాగులు కాలగతిగోచరులై కీర్తింపఁబడిరి. ఇఁక శ్రాద్ధమునకుపయోగింపని ధాన్యముల నెఱిఁగించెదను వినుము. కోద్రవములు సంపూర్ణముగాఁ దండులములులేని ధాన్యములును నిషిద్ధములు. హింగుసంస్కారము వలసిన శాకములందును, మూలములందును నెయ్యవి కూడనివో వినుము. లశునము, పలాండువు, మునగ, గుంజనకము, అలాబువును నిషిద్ధములు. కృష్ణలవణము కూడదు. మఱియు గ్రామ్యవారాహమాంసము సంప్రోక్షితము గాదేని యదియును నిషిద్ధము. కృష్ణాజము, జీరకము, శీతపాకియను శాకమును వర్జ్యములు. లవణమెల్ల వర్జ్యమైనదియే. అటులే జంబూఫలములు నిషిద్ధములు. క్షుతరోదనములచే దూషితమైన దేదియును శ్రాద్ధమున విడువఁదగినదే. సుదర్శనమను శాకము, హవ్యకవ్యములు రెండిటియందును నిషిద్ధమగుచున్నది. దానితోఁ జేసినహవిస్సును, దేవతలును బితృదేవతలును నంగీకరింపరు. నివాపసమయమునఁ జండాలశ్వపచులఁ జేరనీయరాదు. మఱియుఁ బండితులగువారు కాషాయవసనునిఁ, గుష్ఠరోగినిఁ, బతితుని, బ్రహ్మహత్యయొనర్చినవానిని సంకీర్ణయోనియగు విప్రుని బతితుని సంబంధముగలవానిని నివాపసమయమునఁ జేరనీయరు.' అని యత్రిమహర్షి తనవంశమువాఁడగు నిమికిఁ దెలిపి, తాను బితామహునిసభకుఁ బోయెను." అని తెలిపి భీష్ముఁడు మఱియు నిట్లనియె.

## శ్రాద్ధకల్పము

"ఓయుధిష్ఠిరా! ఆనిమి యటులు ప్రవర్తించుటయు, మహర్షులందఱును విధిదృష్టమగు కర్మమునూని పితృయజ్ఞము నాచరించు

చున్నారు. ధర్మనిత్యులగుమహాత్ములు నివపనము లొనర్చి, మఱియుఁ దీర్ఘోదకములచేఁ దర్పణమును సైతము గావించిరి. చాతుర్వర్ణ్యము వారును నొసంగునివాపములచేఁ బితరులును దేవతలును దృప్తులై వారి కన్నము గలిగించుచున్నారు. అటులే దేవతలును బితరులును దృప్తులగుచుఁ, గొంతకాలమున కజీర్ణపీడితులై సోమునిఁ జేరి, 'ఓదేవా! మేమన్నముచే నజీర్ణపీడ నొందుచున్నారము. మాకా నివాపాన్నము పీడగల్గించెడిని. కావున మాకు శ్రేయ మెయ్యదియో యూహింపుము.' అని ప్రార్థించుటయు, నతఁడు 'ఓసురలారా! మీకు శ్రేయ మీప్సితమేని, యాస్వయంభువుగలచోటికిఁ బొండు. అతఁడు మీకు శ్రేయము గల్గించెడిని.' అని పలికెను. అది విని యాదేవతలు పితరులఁ గూడి, మేరుశృంగమున సమాసీనుఁడై యున్న యన్నలువను జేరిరి. అందుఁ బితరులు 'ఓభగవానుఁడా! మేమెల్ల నివాపాన్నముచే నెంతయుఁ బీడితులమగుచున్నాము. మమ్మనుగ్రహించి మాకొకశ్రేయో మార్గమును గానిపింపుము.' అని యాతనిఁ బ్రార్థించిరి. వారివచనము లాలించి, యవ్వారిజోద్భవుఁడు తనప్రక్కనున్న యగ్నిదేవునిఁ జూపి, 'సురలారా! మీ కీతఁడు శ్రేయమును గల్గించును.' అని చెప్పెను. అది విని యావహ్ని 'దేవతలారా! నివాపము సమీపించుతఱి మీతోఁ గూడెదను. మనమెల్ల భుజించెదము. నాతోఁగూడి భుజింతు రేని జీర్ణాహారులగుదురు ఇందు సందియములేదు.' అని పలుకుటయుఁ బితరులు, తమసంతాపమును విడిచిరి. ఓధర్మజా! ఈహేతువుచేతనే మున్నుగా నగ్నికి నివాప మొసంగఁబడుచున్నది. అగ్నికి మున్నుగా నివాప మొసంగఁబడునేని, దానిని బ్రహ్మరాక్షసులు స్పృశింపఁజాలరు. ఆయగ్నిదేవుఁ డుండఁగా, రక్షస్సులు తొలఁగుదురుగాని యందు నిలువఁజాలరు. మఱియు నొకటి తెలిపెదను వినుము. తొలుతఁ దండ్రికిని, దరువాతఁ బితామహునకును, బిమ్మటఁ బ్రపితామహునకును బిండదానము సేయవలయునని శ్రాద్ధవిధి కల్పింపఁబడియెను. ప్రతిపిండదానవిషయమునను సమాహితుఁడై సావిత్రిని జపింపవలయును. మఱియు 'సోమాయ పితృమతే' అని పలుకవలయును. నివాస సమయమున రజస్వలయుఁ, గర్ణదోషము గలదియు సమీపింపరాదు. వండుట కన్యవంశమున జనించినదానిని దీసికొనిరాఁగూడదు. జల

తర్పణము చేయునపుడు పితామహులను గీర్తింపవలయును. నదినిజేరి పితరులకుఁ బిండతర్పణము చేయవలయును. జలతర్పణము మున్నుగా నిజవంశజులకుఁ జేసి, పిదప సుహృత్సంబంధివర్గముల కొనర్పవలయును. కల్మాషగోయుగయుక్తమగు శకటముతో జలమును దరించువాని నుండియు పితరులు నివాపమును గోరుచుందురు. నావ నధిష్ఠించియేని ప్రాజ్ఞులగువారు, సమాహితులై జలము నొసంగుదురు. నెలలో సగమగు కృష్ణపక్షమున నమావాస్యను నిర్వపణము లొనర్పవలయును. పితృభక్తివలనఁ బుష్టియు, నాయువు, వీర్యము, సిరియుఁ గలుగుచున్నవి. పితామహుఁడును, బులస్త్యుఁడు, వసిష్ఠుఁడు, పులహుఁడు, అంగిరసుఁడు, క్రతువు, కశ్యపుఁడు అను వీరు మహాయోగేశ్వరుఁ లనఁబడుచున్నారు. ఓరాజా! వీరే పితరులు. ఇదియే శ్రాద్ధవిధి. అట్టి శ్రాద్ధకర్మముచేఁ బ్రేతలు పిండసంబంధమునుండి విముక్తులగుచున్నారు. ఓ పురుషశ్రేష్ఠా! ఇదియే శ్రాద్ధోత్పత్తివిధము. పూర్వులచే నిర్దేశింపఁబడిన యిది తెలిపితినిగదా! ఇంక నేమి తెలుపవలసియున్నది." అని యడుగుటయు మఱియు నయ్యుధిష్ఠిరుఁ డిట్లనియె.

### ఉపవాసబ్రహ్మచర్యాదిలక్షణకథనము

"ఓపితామహా! వ్రతనిష్ఠులగు బ్రాహ్మణులు బ్రాహ్మణకార్యమునకుఁగా, హవిస్సును భుజింతురేని వారివ్రతము లుప్తమగునా?" అని యడుగ నతఁడు, "యుధిష్ఠిరా! ఒకరు కోరినపుడు వేదోక్తములు గాని వ్రతము లాచరించువారు భుజించినను వ్రతలోపము గలుగదు. వేదోక్తవ్రతనిష్ఠులు భుజింతురేని వ్రతలోపముగలవారగుచున్నారు." అని తెలిపెను. అంత నయ్యుధిష్ఠిరుఁడు "పితామహా! సామాన్యులుపవాసమునే తపమందురుగదా! అదియే తపమగునా? మఱియొకటేదేనిఁగలదా?" అని యడిగెను. అది విని శాంతనవుఁడు "ఓధర్మజా! ఒకనెలయు నొకపక్షము నొనర్చినయుపవాసముల నెవ్వఁడు తపముగాఁ దలంచునో, నిజశరీర నిజకుటుంబపీడాకరుఁడగు నట్టివాఁడు తపస్వియుఁ గాఁజాలఁడు. ధర్మవేత్తయును గాఁజాలఁడు. త్యాగసంపత్తియే యుత్తమతపముగా నెన్నఁబడును. సదోపవాసియు, సదా బ్రహ్మచారియు నై యుండవలయును. మఱియు విప్రుఁ డెల్లపుడును,

మౌనవ్రతముగలవాఁడును, వేదముల జపించువాఁడు నై ప్రవర్తింపవలయును. ధర్మకాముఁడును గుటుంబవంతుఁడును నిజధర్మపరుఁడు నై యుండవలయును. మఱియు మాంసాహారమును విడిచి పవిత్రవిషయమును బఠించుచుండవలయును. సత్యవాదియు, నియతుఁడును గావలయును. మఱియు విఘసాశియు, నతిథిప్రియుఁడు నై యుండవలయును. అమృతాశియు, సదాపవిత్రియుఁ గావలయును." అని తెలిపెను.

అంత నయ్యుధిష్ఠిరుఁడు "ఓశాంతనవా! సదోపవాసియన నెట్టివాఁడు? సదాబ్రహ్మచారియన నెట్టివాఁడు? విఘసాశి యెట్లగును? అతిథిప్రియుఁ డెట్లగును?" అని ప్రశ్నించుటయు, నాగాంగేయుఁడు "ఓధర్మజా! ఎవ్వఁ డుదయమును, సాయంకాలము మాత్రము భుజించి, తదితరకాలమునఁ నుఱియేమియుఁ దినకుండునో, వాఁడు సదోపవాసి యనఁబడుచున్నాఁడు. ఋతుకాలమున మాత్రము భార్యతోడనే యెవ్వఁడు సంగమమొనర్చునో, వాఁడు సదా బ్రహ్మచారి యనఁబడుచున్నాఁడు. నిత్యము సత్యము పలుకువాఁడును, దానశీలుఁడు నై యుండవలయును. వ్యర్థముగా మాంసమును దిననివాఁడు మాంసపరిత్యాగి యనఁబడును. దానము చేయువాఁడు పవిత్రి యనఁబడును. పగలు నిద్రింపనివాఁడు అస్వప్నుఁ డనఁబడును. భృత్యులు నతిథులు భుజించినపిమ్మట నెవ్వఁడు భుజించునో, వాఁడు కేవల మమృతమును భుజించువాఁడని తెలియుము. బ్రాహ్మణులు భుజించినఁగాని యెవ్వఁడు భుజింపఁడో, వానిచే స్వర్గము జయింపఁబడుచున్నది. దేవతలకును, పితరులకును, నాశ్రితులకును మున్నుగాఁబెట్టి, మిగిలినపదార్థముల నెవ్వఁడు భుజించునో, వాఁడు విఘసాశి యనఁబడుచున్నాఁడు. అట్టి వారికి బ్రహ్మసదననివాసమును, ననంతలోకములు నగుచున్నవి. అట్టి వారిని గంధర్వులతోఁగూడ నప్సరసలు సమీపింతురు. ఎవ్వఁడు పితరులకును, దేవతలకును, నతిథులకును బెట్టునో, వాఁడు పుత్రపౌత్రాభివృద్ధిగలిగి, యంతమున సర్వోత్తమగతి నొందుచున్నాఁడు." అని తెలుప విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె.

"ఓపితామహా! బ్రాహ్మణులకుఁ బలువిధములగు దానము లొసంగుదురు గదా! అందు దాతకును బ్రతిగ్రహీతకును గలభేద మేమి?"

అది విని యాగాంగేయుఁడు "ఓధర్మజా! ఎవ్వఁడు సజ్జనుని వలనఁ బ్రతిగ్రహించునో, యట్లే వాఁడు దుర్జనునివలనఁ గూడఁ బ్రతిగ్రహించును. అట్టితఱి నది గుణవంతునుండియే నల్పదోషమును, నిర్గుణునుండియే నధికదోషమును గలిగించును. ఇందుల కొక పురాతనేతిహాసము గలదు. అది వృషాదర్భికిని సప్తర్షులకును జరిగినసంవాదము, దాని నెఱిఁగించెదను వినుము. ఒకపుడు కశ్యపుఁడు, అత్రి, వసిష్ఠుఁడు, భరద్వాజుఁడు, గౌతముఁడు, విశ్వామిత్రుఁడు, జమదగ్ని, సాధ్వియగు నరుంధతియు వారందఱకును బరిచారికయగు గండయను నదియు, దానికి భర్తయగుపశుసఖుఁ డనుశూద్రుఁడును గలిసి తప మొనర్చికొనుచు, సనాతనమగు బ్రహ్మలోకమును బ్రతీక్షించుచు నిప్పుడమిని జరింపఁసాగిరి. అట్టితఱి గొప్పయనావృష్టిదోషము సంభవించెను. అపుడు లోకమెల్ల క్షుధాపీడితమై ప్రాణములను నిలిపికొనుట కష్టమయ్యెను. ఇటులుండఁగా నట్టితఱినే యొకయజ్ఞ మొనర్చి శిబిపుత్రుఁడు తనయాగమునకు దక్షిణగా, నసిలుఁడను తనపుత్రుని ఋత్విజుల కొసంగెనఁట. పిమ్మట వాఁ డల్పాయువై కాలధర్మము నొందెను. అంత నమ్మహర్షులా యాజ్యపుత్రుఁడు, గతాసుఁ డగుటఁ దెలిసి, యాఁకలిచేఁ బీడితులగుట, వానినిఁ జుట్టుకొని తెచ్చి యొకపాత్రమందుంచి వండ నారంభించిరి. ఆహార మేదియు లభింపనిమర్త్యలోకమున వారు తమప్రాణముల నిలుపుకొనఁ దలంచినవారగుట నన్నమునకై యట్టి కఠినవృత్తి నవలంబింపవలసివచ్చెను. అంత నాత్రోవను బోవుచు శైబ్యుఁడగు వృషాదర్భియను నొకరాజు, మనుష్యమాంసమును వండికొనువారై క్లేశమొందుచున్న యమ్మహర్షుల నారసి 'ఓమహర్షులారా! మిమ్మీయాపదనుండి ప్రతిగ్రహ ముద్ధరించెడిని. ప్రతిగ్రహమువలనఁ బుష్టిగల్గెడిని. ఓతపోధనులారా! నాకుఁ గల ధనమును బరిగ్రహింపుఁడు. యాచించినబ్రాహ్మణునిఁ గాంచిన నాకెంతయుఁ బ్రియము. అటులగుట మీకిపుడే నశ్వతరీసహస్ర మొసంగెదను. మఱియు నొక్కొకవృషభముతోఁగూడి, యీనినయావులను బదివేల నిచ్చెదను. ఇంకను వడిగాఁ బరువులిడు తెల్లనిగుఱ్ఱముల నర్బుదములకొలందిగా నొసంగెదను. మఱియు వంశములను భరించునవియుఁ, దెల్లనివియు ధుర్యములు నగుపదివేలవృషభముల నిచ్చె

డసు మఱియు, సు త్తమములును, సు వ్రతములు, బలిష్ఠములు, తొలు చూలుబిడ్డలును, ప్రతిసంవత్సరమును ప్రసవించునవియునగు ధేను వులఁ బెక్కిటి నొసంగెదను. కావలసెనేని వ్రీహియవరసభరితము లగు సు త్తమగ్రామముల నొసంగెదను. ఇష్టపడుదురేని మఱియు దుర్లభమగురత్నము లొసంగెదను. భక్షింపరాని దీనియెడ మీరు భావము పెట్టుకొని ప్రవర్తింతురేటికి? మీకుఁ బుష్టిగలుగుటకై యేమి కావలయునో తెలుపుఁడు.' అని పలికెను.

అది విని మహర్షులు వృషాదర్భితో 'ఓరాజా! రాజులవలనఁ బ్రతిగ్రహము మధ్వాస్వాదము విషతుల్యము నగుచున్నదిగదా! అది యెఱిఁగియు మమ్మేల యిట్లు లోభపెట్టెదవు? బ్రాహ్మణుల నాశ్ర యించిన యాక్షేత్రము దైవతమువంటిది. ఇది తపఃప్రీతమై నిర్మలమై దేవతలకుఁ బ్రీతి గలిగించుచున్నది. బ్రాహ్మణునకుఁ గలతపమును, రాజ ప్రతిగ్రహము, దవాగ్నివలె దహించును. ఓరాజా! నీకును నీదాన మునకును క్షేమమగుఁగాక. నిన్నుఁ గోరునర్థులకు నీధనముల నొసం గుము' అని పలికి వారచ్చోటినుండి వెడలిపోయిరి. పిమ్మట వారు తాము పాత్రముందుంచినమాంసము పక్వముగాకుండుటను దానిని విడిచి వన్యాహారముల నపేక్షించి యరణ్యములవైపునకుఁ బోయిరి. అనంతర మావృషాదర్భి తనమంత్రులను రావించి 'ఓమంత్రులారా! మీ రామహర్షు లరిగినచోటికిఁ బోయి, ఫలప్రదర్శనముచేసి వారిని లోభపరులఁ గావింపుఁడని పలుకుటయు, వారు సువర్ణగర్భములగు నుదుంబరములను మఱికొన్నిటిని దీసికొని యమ్మహర్షులను సమీపిం చిరి. కొంద అమ్మహర్షులను ఫలములను గ్రహింపఁజేయుటకై పరువులు వెట్టిరి. అపు డాపండ్లను గాంచి యవి మిక్కిలి బరువుగా నుండుటను బరిగ్రహింపరానివని యత్రి పలికెను. మఱియు నడఁడు తద్రాజభృ త్యుల నారసి, 'ఓయీ! మేమంతటియబుద్ధులము, మందవిజ్ఞానులము గాముసుఁడీ! ఇవి సువర్ణగర్భములని మాకుఁ దెలియును. మేము జాగరూకులమై యున్నారము. ఇవి మాచేఁ బరిగ్రహింపఁబడెనేని మృత్యనంతరమున మాకు హాని గలిగించెడిని. మరణించినపిదప సుఖింపవలెనని గోరువా రిట్టివానిని బ్రతిగ్రహింపరు.' అని పలికెను. పిమ్మట వసిష్ఠుఁడు, 'ఓయీ! ధనమును వందలుగను, వేలుగను గణిం

చుచు మఱియు హేమస్వద్రవ్యమునకుఁ బ్రతీక్షించువాఁడు పాపిష్ఠ గతికిఁ బోవును' అని పలికెను. పిమ్మటఁ గశ్యపుఁడు, 'ఓయీ! పుడమిలో వ్రీహి, యవ, హిరణ్య, పశు కాంతాదిపరికరము లెన్ని యున్నను నవియెల్ల నొక్కనికే చాలకుండును. కావునఁ బండితుఁడగువాఁడు వైరాగ్యమును వహింపవలయును' అని తెలిపెను. అనంతరము భరద్వాజుఁడు 'దుప్పి జనించి పెరుఁగుచుండఁగాఁ గొమ్ములును బెరుఁగుచున్నటులు మానవునికోర్కులును బెరుఁగుచునే యుండును. ఆశకు మేర లేదు' అని తెలిపెను.

తరువాత గౌతముఁడు 'లోకమున మానవునిలోభమును బూరించు ద్రవ్యమే లేదు. పురుషుఁడు సముద్రతుల్యుఁడై యెప్పటికిని బూరింపఁబడఁడు.' అని పలికెను. పిదప విశ్వామిత్రుఁడు, 'ఒకకోరికి గోరినవాని కదిపూర్ణమైనతోడనే వేఱొకకోరికి యాతనిఁ బీడించుచుండును.' అని తెలిపెను. మఱియు, నత్రిమహర్షి 'ఆహా! కోరిక లెన్ని యనుభవించినను నంతమాత్రమున నది శమింపదు. అయ్యది హవిస్సుచే నగ్నివలె ననుభవించినకొలఁదిని నభివృద్ధినొందుచునే యుండును' అని తెలిపెను. అంత జమదగ్ని 'ప్రతిగ్రహానియమమే ధ్రువముగాఁ దపమును నిలుపుచున్నది. ధనాశగల బ్రాహ్మణున కత్తపము నశించునది' అని పలికెను. పిమ్మట నరుంధతి, 'ధర్మార్థముగా ద్రవ్యములను సంపాదింపవలయు ననుమాట పఱమాంతరము. ద్రవ్యసంపాదనము కంటెఁ దపస్సంపాదనయే శ్రేయము' అని పలికెను. పిదప వారిపరిచారికయగుగండ, 'ఈనాస్వాము లుగ్రమగు నేదానికి భయమొందుచున్నారో, యట్టిదానికి నేను మఱియు భయమొందుచున్నాను. బలవంతులగువారే దుర్బలులట్టులు భయపడుచుండ నామాట లెక్కయేమి?' అని పలికెను. అంత, నాగండభర్తయగు పశుసఖుఁడు 'ధర్మము కంటె నెయ్యదియు నుత్తమమైనది లేదు. అట్టిదానిని బ్రాహ్మణు లెఱుంగుదురు. కావున విద్వాంసులగు నా బ్రాహ్మణులనే సవినయముగా, నా శక్తికొలందిని సేవింతును.' అని పలికెను. పిమ్మట మహర్షులందఱును 'ఎవ్వఁ డీఫలముల దానముసేయునో యట్టిరాజునకు వానిదానమునకును క్షేమమగుఁగాక. కపటముగలయీఫలములను వానిప్రజలేగదా మన కిచ్చుచున్నారు' అని పలికిరి.

ఓధర్మరాజా! ఆమ్మహర్షు లిట్లు పలికి సువర్ణగర్భములగు నప్పండ్లను విడిచి, దృఢవ్రతులై యందఱును నచ్చోటు విడిచి పోయిరి. పిదప నామంత్రులు వృషాదర్భుని సమీపించి 'ఓరాజా! మేమిచ్చినపండ్లను జూచి, యవియేమో కపటముగలవని శంకించి వానినిఁ బరిగ్రహింపక వారు వేఱొకచోటికిఁ బోయిరి. నీకృత్యము వారికిఁ దెలిసెను.' అని తెలుపుటయు, నతఁడు కుపితుఁడై, యమ్మహర్షు లొనర్చినదానికిఁ బ్రతీకారము చేయువాఁడై, యగ్నిగృహముఁ బ్రవేశించి, యాహవనీయాగ్ని సమీపమునఁ దీవ్రనియమముఁ బూని, సంస్కారవిశిష్టములగు మంత్రములతో నొక్కొకయాహుతిని హోమముచేసెను. అంత నాయగ్నినుండి లోకభయంకరముగు కృత్య యొకటి జనించెను. దానికా వృషాదర్భి, యాతుధాని యనుపేరు వెట్టెను. ఆకృత్య కాలరాత్రివలె నాతనిఁజేరి చేతులుమొగిచ్చి 'స్వామీ! ఏమియొనర్పవలసియున్నది?' అని యడిగెను. అది విని యావృషాదర్భి, 'ఓసీ! నీ వాసప్తర్షులు, నరుంధతియు, దాసియుఁ, దద్భర్తయుఁ జరించుచోటికిఁ బోయి, వారినామములనెల్లఁ దెలిసికొని జ్ఞప్తియందిడి, పిదప వారిని నశింపఁజేసి, వారు నశించినపిదప నీయిచ్చవచ్చినచోటికిఁ బొమ్ము.' అని తెలిపెను. అది విని యాయాతుధాని, మహర్షు లెందుఁ జరించుచుండిరో, తద్వనమునకుఁ బోయెను.

ఓధర్మజా! పిమ్మట నమ్మహర్షులు, మూలఫలములను భక్షించుచు, నావనమునఁ దిరుగుచుండ, వారికి మిక్కిలి బలిష్ఠములగు పాదములు, పాణులు, భుజములు, నుదరమును గలిగి స్థూలాంగుఁడై యొకకుక్కను వెంటఁబెట్టుకొని వచ్చుచున్న యొకపరివ్రాజకుఁడు గానవచ్చెను. సర్వాంగోపచితుఁడును, శుభప్రదుఁడునగు నాతనిఁ గాంచి యరుంధతి, మహర్షులతో 'మీరిట్లు కాఁజాలరేమి' యని పలికెను. అది విని వసిష్ఠుఁడు 'ఓపతివ్రతా! మావలె వీని కగ్నిహోత్రము నిర్హుతముగా లేదు. సాయంప్రాతఃకాలముల హోమమొనర్ప లేదు. అటులగుట వీఁడు బలిష్ఠుఁడై కుక్కతోఁగూడి మెలఁగుచుండెను.

అత్రి:—మావలె వీని కాఁకలిచే బలము హతముగా లేదు. కష్టతరముగు నధ్యయనముచే బలము చెడలేదు. అటులగుట వీఁడిట్లు ఉండెను.

విశ్వామిత్రుఁడు:—మావలె వీనికి మఱిమఱియు శాస్త్రాభ్యాసకృతమగు పరితాపము లేదు. వీఁ డలసుఁడును, క్షుత్పరుఁడును, మూర్ఖుఁడు నగుట నిట్లు బలిష్ఠుఁడై కుక్కనుగూడి మెలఁగుచుండెను.

జమదగ్ని:—మావలె వీనికి, వత్సరమునకు వలయు భక్తేంధనములు సంపాదింపవలసినది లేదు. అటులగుట వీఁ డిట్లుండెను.

కశ్యపుఁడు:—మాకువలె వీనికి నేదేని దెమ్మని భిక్షించు నలువురు సోదరులు లేరు. అటులగుట వీఁడిట్లు బలిసియుండెను.

భరద్వాజుఁడు:—బ్రహ్మబంధువై జ్ఞానహీనుఁడైన వీనికి మాకువలె భార్యాపవాదమువలనఁ గలిగినశోకము లేదు. అటులగుట వీఁ డిట్లు బలిష్ఠుఁడై కుక్కతోఁగూడి మెలఁగుచున్నాఁడు.

గౌతముఁడు:—మాకువలె వీనికి మూఁడువత్సరముల కొక్కటియే త్రికౌశేయమగు రాంకవము ధరింపవలసినది లేదు. అటులగుట వీఁ డింతబలిష్ఠుఁడై యున్నవాఁడు.

ఓయుధిష్ఠిరా! పిమ్మట నాపరివ్రాజకుఁ డమ్మహర్షుల నారసి తన శునకముతోఁగూడ వారి నెదుర్కొని యథాన్యాయముగాఁ బాణిస్పర్శ మాచరించెను. పిదప వాఁడును నమ్మహర్షులును బరస్పరమును, క్షుత్ప్రతీఘాతహేతువగు తమవనసంచారములను దెలిసికొని, కలిసియే బయలువెడలిరి. అటులు వెడలి వారొకకార్యమునే గోరుచు నవ్వనమునఁ జరించుచుఁ, గందమూలఫలాదులను దీసికొనుచునుండఁగా, వారికొకచో నొకపద్మసరోవరము గానవచ్చెను. అయ్యది తీరవృక్షములచే నావృతమై నిర్మలోదకములు గలిగి, బాలసూర్యబింబములునాఁదగు పద్మములతో నలరారుచు, వైడూర్యవర్ణముగల పద్మదళము వెలయ, నానావిధవిహంగములు నీటఁ దాండవమాడుచుండ, నొక్కత్రోవమాత్రము గలిగి, సామాన్యముగ నెవ్వరికిఁ జొరరానిదగుచు, బురదలేని మంచిమార్గము వెలయ నొప్పారుచుండెను. అట్టిపద్మినిని వృషాదర్భిప్రేరితయై వికృతాకారముతో యాతుధానియను నొకకృత్య పాలించుచుండెను. అంత నమ్మహర్షులు పశుసఖసహాయులై యాసరోవరమందలి తూఁడులకై కృత్యచే రక్షితమగుచున్న పద్మినిని సమీపించిరి. అపుడు తత్తీరమున వికృతదర్శనయైన యాతుధాని వారికిఁ గానవచ్చెను. వారును దాని నారసి,

'ఓసీ! నీవొక్కతె విట్టు లిందుండఁ గారణమేమి? నీవెవ్వతెవు? ఎవ్వని ప్రయోజనమూని యిట్లుంటివి? ఈపద్మినీతీరమునఁ గూరుచుంటి వేల? ఏమిచేయఁ దలంచెదు? తెలుపుము' అని ప్రశ్నించిరి. అది విని యాయాతుధాని, యిట్లు పలికెను.

యాతుధాని:—నే నెవ్వతెనైన నేమి? నన్ను మీరు ప్రశ్నింపవలసినది లేదు. ఓతపోధనులారా! నన్నీపద్మినిని రక్షించు దానినిగాఁ దెలియుఁడు.

మహర్షులు:—ఓసీ! మేమెల్ల క్షుధార్తులమైతిమి. మాకేదియు నాహారము లభింపదయ్యెను. నీయనుజ్ఞ యొసంగుదేని మేమెల్ల నిందలి తూండ్లను దీసికొందుము.

యాతుధాని:—ఓమహర్షులారా! ఇందొకయాచారము గలదు. దానిని నిర్వర్తించి మీరిచ్చవచ్చినన్ని బిసములఁ బరిగ్రహింపుఁడు. మీయందఱునామముల నొక్కొకటి దెలిపి, పిదప వడిగా నిందలి తూఁడులఁ బరిగ్రహింపుఁడు.

ఓధర్మజా! అది విని యమ్మహర్షులు, తమ్మది వధింపవచ్చిన కృత్యయనియుఁ, దమవేరులవలనఁ దమసామర్థ్యమును దెలిసికొనునదై యటు లడిగెననియు గ్రహించి, వారిలో నత్రి యిట్లు పలికెను.

అత్రి:—అర యనఁగాఁ బాపము. దానినుండి రక్షించువాఁడు అరాత్రి యనఁబడును. అరాత్రియే అత్రి. 'అద్' అనఁగా మృత్యువు పాపము నగుచున్నది. దానినుండి రక్షించువాఁ డత్రి. ఓశోభనా! అట్టి యత్రి యనువేరుగలవాఁడను.

యాతుధాని:—ఓమహాద్యుతీ! నీ వీరీతి నుదాహరించిన నామము చిత్తమున నిలుపుకొన నవకాశ మీయకున్నది పొమ్ము పద్మిని నవతరింపుము.

వసిష్ఠుఁడు:—వాయ్వాదులు వసువులు. అవి యెవ్వని కధీనములై యుండునో, యట్టి యణిమాద్యైశ్వర్యములుగల మహాయోగి వసుమంతుఁడు. అట్టి వసుమంతులలో నుత్తముఁడు వసిష్ఠుఁడు మఱియు వాసయోగ్యమగు గృహస్థాశ్రమమందున్నవారు వస్తలు, వారిలో నుత్తముఁడు వసిష్ఠుఁడు. అట్టివసిష్ఠుఁ డనెడినామము గల వాఁడనని తెలియుము.

యాతుధాని:—అతికష్టముగాఁ బలుకఁబడిన యక్షరములుగల నీనామనిర్వచన మెంతయు ధరింప శక్యముగాకున్నది. పొమ్ము. పద్మిని నవతరింపుము.

కశ్యపుఁడు:—కశ్యములనఁగా నశ్వములు. అశ్వముల యట్టి వగుట నింద్రియము లశ్వము లనంబడును. అట్టియింద్రియముల కాశ్రయములయిన శరీరములును గశ్యములే. అట్టిశరీరములను రక్షించుటను, ద్రావుటను, ననుభక్షించుటను, శోషింపఁజేయుటను గశ్యపుఁడ నగుచున్నాఁడను. కాశతుల్యుఁడ నగుటఁ గాశ్యుఁడను. ఇవియే నాపేరులు అని తెలియుము.

యాతుధాని:—ఓమహాతేజా! నీవు తెలిపిన యీ నీనామ మెంతయు ధరింప వలనుపడకున్నది. పొమ్ము. పద్మిని నవతరింపుము.

భరద్వాజుఁడు:—అపుత్రకులను భరింతును. ప్రేష్యులను భరింతును. దేవతలను భరింతును. బ్రాహ్మణులను భరింతును. అన్వ్యాజముచే భార్యను భరింతును. అటులగుట నన్ను భరద్వాజుఁ డందురు.

యాతుధాని:—కష్టముగా నుచ్చరింపఁబడిన యక్షరములుగల నీనామమును ధరింప నాకు శక్యముగాకున్నది. పొమ్ము పద్మిని నవతరింపుము.

గౌతముఁడు:—స్వర్గమును భూమిని వశముగ నొనర్చుటను గోదముఁ డనఁబడును. అధూమాగ్నితుల్యుఁడను నదమ్యుఁడను. గోదముఁడే గోతముఁడు, అట్టి గోతమునిఁగా నన్నుఁ దెలియుము.

యాతుధాని:—ఓమహామునీ! నీ వీయుదాహరించిన నామము జ్ఞప్తియందుంచుకొన వీలుకాదు. అయినను బొమ్ము. పద్మిని నవతరింపుము.

విశ్వామిత్రుఁడు:—విశ్వేదేవులు నాకు మిత్రములు. అటులే యింద్రియములకు మిత్రుఁడను. అటులగుట నాపేరు విశ్వామిత్రుఁడు అని తెలియుము.

యాతుధాని:—నీవు నిరుక్త మొనర్చిననామము, దుఃఖవ్యాభాషితాక్షరమై ధరింప శక్యముగాకున్నది. పొమ్ము. పద్మిని నవతరింపుము.

జమదగ్ని:—జాజమంతులనఁగా దేవతలు. అట్టిదేవతలును నగ్నియు జనించినకాలమునఁ బుట్టినవాఁడనగుట నన్ను జమదగ్ని యందురు. ఇదియే నానామమని తెలియుము.

యాతుధాని:—ఓమహామునీ! నీవు నీనామము నుదాహరించితివి. కాని దానిని ధరింప వలనుపడదు. పొమ్ము. పద్మిని నవతరింపుము.

అరుంధతి:—భర్త ననుసరించి, పర్వతములను భూమిని స్వర్గమును నధిష్ఠింతును. అటులగుట నాపే రరుంధతి.

యాతుధాని:—నీపేరి నిర్వచన మెంతయు దుఃఖవ్యాభాషితాక్షరమై నాకు జ్ఞప్తియందుంచుకొన నవకాశ మీయకున్నది. పొమ్ము. పద్మిని నవతరింపుము.

గండ:—గడిధాతువునకు వదనైకదేశ మర్థము. అట్టి వక్త్రమున నొకభాగ మున్నతమగుట నాపేరు గండ.

యాతుధాని:—నీనామ నిరుక్తియు దుర్గ్రాహ్యమై ధరింప రాకున్నది. పొమ్ము. పద్మిని నవతరింపుము.

పశుసఖుఁడు:—జీవులను గాంచిన సంతసింపఁజేయుదును. పశువులకు సఖుఁడను. ఈపశుసఖసంజ్ఞ నాకు గౌణముగా నగుట, నాపేరు పశుసఖుఁడు.

యాతుధాని:—దుఃఖవ్యాభాషితాక్షరమగు నీనామ నిరుక్తి నాకు ధరింప రాకున్నయది. పొమ్ము. పద్మిని నవతరింపుము.

శునస్సఖుఁడు:—ఇమ్మహర్షులు దెలిపినవిధముగాఁ బలుక నే నుత్సహింపను. ధర్మసఖులగుమునులకు సఖుఁడనగుట, శునస్సఖసఖుఁడని నన్నుఁ దెలియుము.

యాతుధాని:—సందిగ్ధవచనముగా, నీనామ, మవ్యక్తమై చెప్పబడినది. కావున మఱియొకసారి నీనామము నెఱిఁగింపుము.

శునస్సఖుఁడు:—ఓసీ! నేనొకసారి నాపేరు దెలిపితిని. నీవు గ్రహింపఁజాలవైతివి. కావునఁ ద్రిదండాభిహతవై భస్మమగుము. మఱి జాగువలదు.

ఓయుధిష్ఠిరా! అటు లాశునస్సఖుఁడు పలికి బ్రహ్మదండతుల్యమగు తనత్రిదండము నాయాతుధానితలపైఁ బ్రయోగించుటయు, దానిచే నది హతయై పుడమిఁ బడి బూడిదయయ్యెను. మహాబల

యగు నయాగ్నితుధాని నటులు వధించి యాశునస్సఖుఁడు, పుడమిని దనత్రిదండమునుంచి, యొకపచ్చికపట్టుపైఁ గూరుచుండెను. పిమ్మట మహర్షు లందఱును పద్మినిని బ్రవేశించి పద్మములను బిసములను గావలసినన్నిటిని దీసికొని సంతుష్టాంతరంగులై తీరముఁజేరి మిగుల శ్రమనొందినవారగుట నాతూఁడుల నెల్లఁ బ్రోవులుగా నత్తీరమున నుంచికొని జలతర్పణములు గావించుటకై మరల నాసరోవరము ప్రవేశించిరి. అంత నటులు వా రాకృత్యమును దీర్చికొని మరల వా రాతీరమును జేరునప్పటి కందాబిసములు వారికిఁ గానరావయ్యెను. అనంతర మహర్షులు 'ఆహా! ఆఁకలిచే నభిభూతులమై యాహారమును గోరుచున్న పాపకర్ములమగు మాబిసములను గ్రూరకర్ముఁడగు నెవ్వఁ డపహరించెను?' అని వారొకరిపై నొకరికి శంకగలుగఁ బరస్పరమును బ్రశ్నించికొనిరి. ఓధర్మజా! పిదప వారందఱును నొట్లు పెట్టికొందమని నిర్ణయించికొనిరి. ఆనిర్ణయమున కందఱును సమ్మతించి క్షుధార్తులును బరిశ్రాంతులు నగుచు శపథముల కారంభింపఁగా నందు అత్రి యిట్లు పలికెను.

అత్రి:—ఎవ్వఁ డీబిసముల నపహరించెనో, వాఁడు పాదముతో గోవును స్పృశించినవానియు, సూర్యున కెదురుగా మేహనముంచువానియు, ననధ్యయనదినముల నధ్యయనముచేయువానియుఁ బాపమునకుఁ బాలగుచున్నాఁడు.

వసిష్ఠుఁడు:—ఎవ్వఁ డీతూఁడుల నపహరించెనో, వాఁడధ్యయనములేక శ్వానముల స్పృశించుచు స్వేచ్ఛాచారియై యెల్లెడఁ జరించువానిపాపగతికిఁ బోవును. మఱియు శరణాగతుని హతునిఁ గావించినవాఁడును, దనపుత్రికచే జీవించువాఁడును, నీచునివలన ధనమును గోరినవాఁడును, బోవునట్టిగతి కీబిసాపహారి పోఁగలఁడు.

కశ్యపుఁడు:—ఎల్లచోటుల నోటికివచ్చినట్లు ప్రేలువాఁడును, దాఁచికొన్నధనము దోఁచికొనువాఁడును, కూటసాక్ష్యము చెప్పువాఁడును నొందునట్టిదుర్గతి యీబిసాపహర్తకయ్యెడిని. మఱియు, నిమిత్తము లేక మాంసమును భుజించినవాఁడును, వృథాదానము చేయువాఁడును, పగలు స్త్రీసంగమ మొనర్చినవాఁడును నొందునట్టిదోషమీతూఁడుల నపహరించువాని కగును.

భరద్వాజుఁడు:—ఎవ్వఁడు క్రూరుఁడును, బరిత్యక్తధర్ముఁడు నై స్త్రీలయెడను, గోవులయెడను, జ్ఞాతులయెడను, ధర్మము విడిచి ప్రవర్తించునో, మఱియు నెవఁడు బ్రాహ్మణులను జయింపఁదలంచునో యట్టివాఁడును నొందుగతి బిసాపహర్త కగును. మఱియు నుపాధ్యాయు నధఃకరించి యెవ్వఁడు యజుస్సులను ఋక్కులను బఠించునో, కక్షాగ్నియం దెవ్వఁడు హోమముచేయునో, యట్టివారికగు పాపము తూఁడుల దొంగిలించినవాని కగును.

జమదగ్ని:—ఎవ్వఁ డీబిసముల నపహరించెనో వాఁడు జలము లందు మలము విడిచినవానియు, గోవునకుఁ ద్రోహ మొనర్చినవానియు, ఋతుభిన్నకాలమున స్త్రీని బొందినవానియుఁ, గలహప్రియుఁడైన వానియు, భార్యవలన జీవించువానియు, బంధుమాఱుఁడైనవానియుఁ, బరస్పరాతిథ్య మొనర్చినవారియు దుర్గతికిఁ బోలగుచున్నాఁడు.

గౌతముఁడు:—ఎవ్వఁడు వేదములఁ జదివి మఱచునో, యెవఁడు మూఁడగ్నులను జెఱచునో, యెవఁడు సోమవిక్రయ మొనర్చునో, నూతినీరుద్రావుచున్న వారిగ్రామమున బ్రాహ్మణుఁడయ్యు నెవ్వఁడు శూద్రాంగనాసక్తుఁడై చరించునో యట్టివారిసాలోక్య మీతూఁడులను దొంగిలించినవాని కగును.

విశ్వామిత్రుఁడు:—ఎవఁ డీతూఁడుల నపహరించెనో, వానికి ఎవ్వఁడు తాను జీవించియుండఁగా నిజభృత్యులును గురువులును నొకనిచేఁ బోషింపఁబడుదురో, దరిద్రుఁడై యెవ్వఁడు బహుపుత్త్రుఁ డగునో, యట్టివారి కగుదుర్గతి యగును. మఱియు నీబిసము లపహరించినవాఁడు శుచిరహితుఁడై బ్రహ్మకూటుఁడును, సమృద్ధిగలిగి యహంకారియుఁ, గర్షకుఁడును, మత్సరియు, రాజభృతకుఁడును, వర్షాచరుఁడు, రాజపురోహితుఁడును, నయాజ్యునకు యాజకుఁడును నగుఁగాక.

అరుంధతి:—ఈతామరతూఁడుల నపహరించినచో, నిత్యము నత్తను దిరస్కరించునట్టియు, భర్తపై నిష్టములేనట్టియు, మధురాహారము లొంటరిగాఁ దినునట్టియుఁ, బుట్టినింట నుండియు వారిని లక్ష్యపెట్టక సాయంకాలమున సక్తువులఁ దినునట్టియు, నాఁడుది యగుఁగాక. మఱియు నభాగ్యయు వీరమాతయు నగుఁగాక.

గండ:—ఈతూఁడుల నపహరించినచో, నిత్యము నన్నృత మాడునట్టియు, బంధువులతో విరోధించునట్టియు, శుల్కముగొని కన్యనిచ్చునట్టియు, వండుకొని యొక్కఁడె తెయే తినునట్టియు, దాస్యమున జీర్ణించునట్టియు, నిజకర్మము మాని విరుద్ధకర్మముచే బ్రదుకునట్టియు నాఁడుదానిగతికిఁ బోకతప్పదు.

పశుసఖుఁడు:—దాసుఁడైనవానియు, సంతానము లేనివానియు, దరిద్రునియు, దేవతానమస్కారవిముఖునియు దుర్గతి యీతూఁడు లపహరించినవాని కగుఁగాక.

శునస్సఖుఁడు:—ఈతూఁడుల నపహరించినవానికి అధ్వర్యునకుఁ గన్యాదానమొనర్చినవానికిని, జరితబ్రహ్మచర్యుఁడగు ఛందోగుఁడైనవానికిఁ గన్యాదానమొనర్చినవానికిని నగుగతి యగుఁగాక. మఱియు నథర్వణవేదమును బఠించి నిత్యస్నాతయైనవాని కగుగతియు నగును.

మహర్షులు:—ఓయీ! నీ యీయొనర్చినశపథము బ్రాహ్మణుల కిష్టమైనదియేగదా! ఇట్లు పలికితివేమి? కావున నీవే మాతూఁడుల నపహరించితివి గాఁబోలును.

శునస్సఖుఁడు:—మీయాహారమును మీరు చూచుచుండఁగా, నేను వేఱొకచో నుంపలేదు. కాని మీరన్నది సత్యమే. అనృతము గాదు. మీబిసములను నేనే హరించితిని. నాచే మీతూఁడు లంతర్ధాన మొందింపఁబడియెను. ఇవె చూడుఁడు. ఓయనఘులారా! మిమ్ముఁ బరీక్షించుటకై యిటులొనర్చితిని. మిమ్మునెల్ల రక్షించుటకై నేనిందులకు వచ్చితిని. మిక్కిలి క్రూరకృత్యయై, కృత్యయైన యీయాతుధాని, వృషాదర్భిప్రేరితయై మిమ్ము వధింప నిందులకు వచ్చెను. తపోధనులారా! దానిని నేను వధించితిని. అగ్నియందు జనించినయీపాపచిత్త, నేనిందులకు రాకుండునేని మిమ్ము హింసింపక తప్పదు. అటులగుట మిమ్ము రక్షింపవచ్చిన వాసవునిఁగా నన్నెఱుంగుఁడు. లోభగుణము లేకుండుటను మీకు సార్వకామికములైన యక్షయలోకములు సంభవించెను. ఓద్విజోత్తములారా! ఇఁక లెండు. వడిగా నుత్తమలోకములఁ బొందుఁడు." అని పలికెను.

ఓయుధిష్ఠిరా! అది విని మహర్షులు సంతుష్టాంతరంగులై యవ్వా సవునితో నటులే యొనర్తురని పలికి యాతనితోఁ గూడి స్వర్గమున కందఱును వెడలిరి. ఓరాజా! ఇటు లమ్మహర్షులు మిక్కిలి యాఁకలిచేఁ బీడితులై, పరమభోగము లొసఁగెదనని యొకరు తమ్ముఁ బ్రార్థించి నను నాసగొనక నిశ్చలులైరి. అటులఘటనే వారికిఁ దత్క్షణము స్వర్గము లభించెను. కావున మానవుఁ డెట్టియవస్థలందును లోభ మును విడువవలయును. ఓరాజా! అదియే పరమధర్మము కావున లుబ్ధుఁడు కాఁగూడదు. ఈసచ్చరిత్రమును సంఘములలోఁ గీర్తించు మానవుఁడు ధనప్రాప్తి కర్హుఁడై దుర్గముల నెన్నఁడును బొందఁడు. మఱియు నట్టివానిపితృదేవతలును, దేవతలును బ్రీతులగుచున్నారు. మఱియు నతఁడు మరణించి ధర్మార్థభాగియుఁ గీర్తిభాగియు నగు చున్నాఁడు.” అని తెలిపి శాంతనవుఁడు మఱియు నిట్లనియె.

## దానధర్మకథనము

“ఓయుధిష్ఠిరా! తీర్థయాత్రయం దొనర్చినశపథమున నేమి జర గెనో, శపథముచేఁ గొన్ని కార్యము లెట్లు నిషేధింపఁబడియెనో, యనువిషయముల కొకపురాతనేతిహాసము గలదు. దానిం దెలిపెద నాకర్ణింపుము. ఓమహారాజా! మున్నొకపుడు మహర్షులును రాజర్షు లును బద్మమునకుఁగా, దొంగతనము చేయవలసివచ్చెను. ఒకపుడు పశ్చిమప్రభాసమున మహర్షు లందఱును గలిసి ‘మన మెల్లఁ బుడమి నెల్లఁ జరింతము. పుణ్యతీర్థములను సేవింతము. పిమ్మట నిచ్చవచ్చినట్లుగా యథాస్థానములకుఁ బోవచ్చును’ అని యాలోచించికొనిరి. శుక్రుఁడు, అంగిరసుఁడు, కవి, అగస్త్యుఁడు, నారదుఁడు, పర్వతుఁడు, భృగువు, వసిష్ఠుఁడు, కశ్యపుఁడు, గౌతముఁడు, విశ్వామిత్రుఁడు, జమదగ్ని, గాలవుఁడు, అష్టకుఁడు, భారద్వాజుఁడు, అరుంధతి, వాలఖిల్యులు, శిబి, దిలీపుఁడు, నహుషుఁడు, అంబరీషుఁడు, యయాతి, ధుంధు మారుఁడు, పూరుఁడు అనువీరెల్లరును శతక్రతుఁడగు నింద్రునిఁ బురస్కరించుకొని సకలతీర్థములందును దిరుగుచుఁ, బుణ్యసారముగల కౌశికీనదిని సమీపించిరి. పిమ్మట వారు సకలతీర్థములందును స్నాన మాచరించుట, నవధూతపాపులై పరమపవిత్రమగు బ్రహ్మసరస్తీర్థ మునకుఁ బోయిరి. అటులేఁగి య త్తీర్థమున నగ్నితుల్యులగు నమ్మహా

ర్షులు నీటదిగి యందున్న బిసములఁ దినిరి. ఓరాజా! వారిలోఁ గొంద ఱాబిసములను ద్రవ్విరి. మఱికొందఱు మృణాలములను దెంపిరి. పిమ్మట నగస్త్యునిచే సముద్ధృతమై హ్రదమునుండి వేఱొకనిచేఁ దీసి కొనిపోఁబడుచున్న యొకపద్మమును వారు చూచిరి. అపు డాయగ స్త్యుఁడు తక్కినమహర్షులను గాంచి, 'ఓమునులారా! నాచక్కనిపద్మ మెవ్వరిచే హరింపఁబడియెను. మీపై నాకు శంక గలుగుచున్నది. నాపద్మము నాకిండు. మీరు నాపద్మమును హరింపఁ బాడిగాదుసుఁడీ. కాలము ధర్మమును బీడించునని వినుచున్నాఁడను. అట్టి ధర్మపీడ యిపుడు సంభవించెను. ఇఁకఁ గొంతకాలమున కధర్మము ప్రబలెడిని. అయ్యది ప్రబలకమున్నే సురలోకమునకుఁ బోయెదను. మఱియు నిఁక వేదములు బ్రాహ్మణులు గ్రామమధ్యమున బిగ్గరగాఁ జెప్పుచు శూద్రులు వానిని వినునట్లు లొనర్తురు. మఱియు రాజగువాఁడు వ్యవహారముల నధర్మముగాఁ బరికించును. కావున నిఁక నేను బర లోకమునకుఁ బోయెదను. ఇంకను రాజు మధ్యములగువారి నుత్త ములఁగాఁ దలంచును. అపుడు తక్కినవారు వానినె యనుసరింతురు. ధర్మవిరోధ మెంతపఱకు సంభవింపకుండునో, యంతకుమున్నే నేను బరలోకమునకుఁ బోవుచున్నాఁడను. మఱియు బలవంతుఁడగు నొక నిచ్చే బలహీనులగు మానవులు పీడింపఁబడుట నాకిఁకఁ గానరానున్నది. కావున నిపుడే పరలోకమునకుఁ బోవుచున్నాఁడను కాని యిమ్మానవ లోకమున నిట్టి యధర్మమును జూడ నుత్సహింపను' అని పలికెను. అది విని యమ్మహర్షులందఱు నార్తులై యాయగస్త్యునితో 'ఓముని వరా! నీపద్మమును మేము హరింపలేదు. మిథ్యాపవాదము నీవొనర్పఁ దగదు. ఓమహర్షీ! నీవు మా యీవచనము నమ్మవేని తీవ్రములగు శపథములచేఁ దిట్టుకొందుము.' అని పలికి, ధర్మమును దలంచుచు నమ్మహర్షులును రాజులును, గ్రమముగా నొక్కొక్కరే, తమపుత్ర పౌత్రులతోఁగూడ శపథముల నిటు లొనర్పసాగిరి.

భృగువు:—ఓయీ! నీపద్మమును దొంగిలించినవాఁ డొకనిచేఁ దిట్టువడి మరలఁ దిట్టువాఁడును, నొకనిచేఁ గొట్టువడి మరలఁ గొట్టు వాఁడును, హయవృషభాదులమాంసములను భక్షించువాఁడును నగుఁగాక,

వసిష్ఠుఁడు:—నీపుష్కరమును హరించినవాఁడు, స్వాధ్యాయపరుఁడుగాక, కుక్కలను వెంటఁబెట్టుకొని తిరుగుచు నుండుఁగాక. మఱియుఁ బురమున బిచ్చమెత్తుకొనుగాక.

కశ్యపుఁడు:—నీపద్మమును దొంగిలించినవాఁ డెల్లచోటుల నెల్లవస్తువుల విక్రయించువాఁడును, దాఁచికొన్నధనము నాసించువాఁడును, కూటసాక్షిత్వమునకుఁ గుదురుకొన్నవాఁడును నగుఁగాక.

గౌతముఁడు:—నీపద్మ మపహరించినవాఁడు విషమక్రోధాదికముచే బుద్ధియం దహంకారముగలవాఁడును, గర్షకుఁడును, మత్సరియు నగుఁగాక.

అంగిరుఁడు:—నీపుష్కరము దీసికొన్నవాఁడు, బ్రాహ్మణబ్రువుఁడు, నశుచియుఁ, గుక్కల నాకర్షించువాఁడును, బ్రహ్మఘాతకుఁడును నీచుఁడు నగుఁగాక.

ధుంధుమారుఁడు:—నీపద్మమును హరించినవాఁడు, మిత్రద్రోహియు, శూద్రయందు సంతానముగన్నవాఁడును, సంపన్నుఁడయ్యుఁ దానొక్కఁడే భుజించువాఁడును నగుఁగాక.

పురూరవుఁడు:—నీపద్మమును హరించినవాఁడు చికిత్సయందుఁ బ్రవర్తించువాఁడును, భార్యచేఁ బోషింపఁబడువాఁడును, మామవలన జీవనాధారము గన్నవాఁడును నగుఁగాక.

దిలీపుఁడు:—నీపద్మమును దొంగిలించినవాఁడు, నూతినీరు ద్రావునట్టివారిగ్రామమున, బ్రాహ్మణుఁ డైయుండియు, శూద్రాంగనం గలిసి జీవించువానిలోకము నొందుచున్నాఁడు.

శుక్రుఁడు:—నీపుష్కరమును హరించినవాఁడు, నిమిత్తము లేక మాంసభక్షణము సేయువాఁడును, పగలు సంభోగము సేయువాఁడును, రాజప్రేష్యుఁడును నగుఁగాక.

జమదగ్ని:—అనధ్యయనదినముల నధ్యయన మొనర్చినవానికిని, మిత్రుని శ్రాద్ధమున భుజింపఁజేయువానికిని, శూద్రశ్రాద్ధమున భుజించినవానికిని నగుదుర్గతి నీపద్మమును హరించినవాని కగును.

శిబి:—ఓమహర్షి! నీపద్మమును హరించినవాఁడు, అనాహితాగ్నియై మరణించినవాఁడును, యాగవిఘ్న మొనర్చినవాఁడును, తపస్వులతో విరోధించువాఁడును నగునుగాక.

యయాతి:—నీపుష్కరమును హరించినవాఁడు, జటియు వ్రతియునయ్యు, ఋతుభిన్నకాలమున భార్యాసంగమ మొనర్చినవానియు, వేదముల నిరాకరించినవానియు గతినొందుఁగాక.

నహుషుఁడు:—నీపద్మమును దొంగిలించినవాఁడు యతియయ్యు గృహస్థుఁడైనవాఁడును, దీక్షవహించియు స్వేచ్ఛాసంచారము చేయువాఁడును, వేతనముగొని విద్యను జెప్పువాఁడును బొందునట్టిదోషము పాలగుఁగాక.

అంబరీషుఁడు:—ఓమునివర్యా! నీపద్మమును దీసికొన్నవాఁడు క్రూరుఁడును, దక్షత్క్షధర్ముఁడునై స్త్రీలయెడను గోవులయెడను బ్రాహ్మణులయెడను హానిగూర్చఁదలంచినవాని కగుదోషము నొందుఁగాక.

నారదుఁడు:—నీపుష్కరమును హరించినవాఁడు జ్ఞానియై గృహమందున్నవానియుఁ, బైనిశాస్త్రము చెప్పువానియు, వేదమును స్వరహీనముగాఁ బఠించువానియు, నధికుల నవమానించువానియు గతికిఁ బోవుఁగాక.

నాభాగుఁడు:— ఓమహర్షి! నీపద్మము నపహరించినవాఁడు, నిత్యము నన్నృతముపలుకువానియు, సజ్జనులతో విరోధించువానియు, శుల్కమును బుచ్చికొని కన్నియ నొసంగినవానియు, దుష్కృతము నకుఁ బాలగుఁగాక.

కవి:—గోవును బాదములతోఁ దాడన మొనర్చువాఁడును, సూర్యున కెదురుగా మేహనముంచువాఁడును, శరణాగతునిఁ బరిత్యజించువాఁడును, బోవుగతికి నీపద్మమును హరించినవాఁడు పోవుఁగాక.

విశ్వామిత్రుఁడు:— 'ఓయీ! నీపద్మము నపహరించినవాఁడు ధాన్యవిక్రేతుఁడగుచు వృష్టిప్రతిబంధము గల్గించువానియు, రాజపురోహితుఁడైనవానియు, యాగార్హతలేనివానిచే యజ్ఞముచేయించువానియు దోషమునకుఁ బాత్రుఁడగుఁగాక.

పర్వతుఁడు:— నీపద్మమును దొంగిలించినవాఁడు, గ్రామాధికారియు, గాడిద నధిష్ఠించువానియు, జీవనమునకై శునకముల నాకర్షించువానియు దోషమునకుఁ బాత్రుఁడగుఁగాక.

భరద్వాజుఁడు:— ఓయగస్త్యా! సకలపాపము లొనర్చినవాని నుండి దానప్రతిగ్రహము సేయువానియుఁ, గ్రూరుఁడు ననృతవాదియు నగువానికి దానమొనర్చినవానియు, దుర్గతికి నీపద్మమును హరించిన వాఁడు పోవుఁగాక.

అష్టకుఁడు:— నీపుష్కరము నపహరించినవాఁడు అవివేకియుఁ, గామవృత్తియుఁ, బాపకర్తయునగు రాజై పుడమి నేలుఁగాక.

గాలవుఁడు:— ఓయీ! నీపద్మమును హరించినవాఁడు జ్ఞాతి ద్రోహ మొనర్చిన పరమపాపుఁడును, దానముచేసి కీర్తించుకొనినవాఁడును బోవుగతికిఁ బోవుఁగాక.

అరుంధతి:— నిజభర్తృమాతతో నపవాద మొనర్చునదియు, భర్తృప్రతికూలమైనదియు, మధురాహారమును దానొక్కతె యనుభవించునదియునగు నాఁడుది పోవుదుర్గతికి నీపద్మమును హరించినది పోవును.

వాలఖిల్యులు:— నీపుష్కర మపహరించినవానికి, జీవనాధారమునకుఁగా నొకపాదముపై గ్రామద్వారమున నిలుచుండువానికిని, ధర్మజ్ఞుఁడయ్యు దానినిఁ బరిత్యజించినవానికినినగు దుర్గతి యగుఁగాక.

శునస్సఖుఁడు:— నీపద్మమును దొంగిలించినపాపాత్ముఁడు అగ్నిహోత్రము నాదరింపక సుఖముగా నిద్రించువానియుఁ, బరివ్రాజకుఁడై స్వేచ్ఛాప్రవృత్తిగలవానియు గతికిఁ బోవుఁగాక.

సురభి:— నీపద్మము నెవ్వరు హరించిరో వారికి గోవును దానితోకనే పాదబంధనరజ్జువుగా నొనర్చి పాలుపితుకువానియుఁ, బరవత్సమును గుడిపి పాలుపితుకువానియుఁ బాపము గల్గుఁగాక.

ఓయుధిష్ఠిరా! పిమ్మట నటులు నానావిధములుగాఁ బెక్కుశపథములచేఁ దమ్ముఁ దిట్టుకొన్న యమ్మహర్షుల నారసి యింద్రుఁడు సంతుష్టాంతరంగుఁడై, కోపనుఁడై యున్న యాయగస్త్యునకుఁ దన్నెఱిఁగించి, యాబ్రహ్మర్షులయు, దేవర్షులయు, రాజర్షులయు నడుమ నేమి తెలిపెనో, దాని నిపు డెఱిఁగించెదను. వినుము. అపు డింద్రుఁడు, తాను నాతని పద్మమును హరింపలేదని తెలుపుటకుఁగా నధ్వర్యునకుఁ గన్యనిచ్చు వానియుఁ, జరితబ్రహ్మచర్యుఁడగు సామవేదికిఁ గన్యాదాన మొనర్చిన వానియు, నథర్వణవేదమును జదివి స్నాతకుఁడైన విప్రునియు గతి

నీపుష్కరము హరించినపుణ్యశాలి కగుఁగాక. మఱియు సకలవేదములను జదివి పుణ్యశీలుఁడై ధార్మికుఁడై బ్రహ్మసదనమును జేరుఁగాక.

అగస్త్యుఁడు:—ఓబలసూదనా! నీవొనర్చినశపథ మొకయాశీర్వాదముగాని తిట్టుకొనుటకాదు. కావున నీవే నాపుష్కరము నపహరించితివి. ఇఁక దానిని నాకొసంగుము. ఇదియే సనాతనధర్మము.

ఇంద్రుఁడు:—ఓమహర్షి! నేను లోభముచే నీపద్మమును దీసికొనలేదు. మీయందఱవలన ధర్మములను వినఁగోరి యిటులొనర్చితిని. కోపింపకుము. ధర్మమునకు సేతువై యనామయమై శాశ్వతమై యవ్యయమైన యీధర్మమార్గము నే నిపుడు వింటిని. ఓబ్రాహ్మణోత్తమా! ఇదె నీపద్మము పరిగ్రహింపుము. ఓమహానీయా! నా యీయపరాధమును క్షమింపుము.

ఓధర్మజా! ఇటు లాయింద్రుఁడు పలికి యప్పద్మము నాతపస్వి కొసంగుటయుఁ గోపనుఁడగు నతఁ డద్దానినిఁ బరిగ్రహించి శాంతుఁ డయ్యెను. పిమ్మట వారందఱును నెప్పటిచొప్పునఁ దీర్థములకు బయలు వెడలి, పుణ్యతీర్థములందుఁ దమదేహములను దడుపుచు వచ్చిరి. ఓరాజా! ఎవ్వఁ డీయాఖ్యానమును బ్రతిపర్వదినమందును బఠించునో, వానికి సురూపుఁడును వివేకియునగు పుత్రుఁడు జనించును. మఱియు నట్టివాని కెన్నఁడును, నాపదయుఁ గలుగదు. శరీరమును గృశింపఁ జేయునట్టి జ్వరాదికమును సంభవింపదు. మఱియు నతఁడు నిర్దోషుఁ డునై యిహమున శ్రేయము గాంచి, మృతుఁడై నపిదప స్వర్గము నొందును. ఎవ్వఁడు మహర్షిపరిపాలితమగు శాస్త్రము నభ్యసించునో వాఁ డవ్యయమగు బ్రహ్మలోకము నొందును." అని తెలుప విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె.

## ఛత్రోపానహోత్పత్తికథనము

"ఓతాతా! శ్రాద్ధకృత్యములందు ఛత్రము, నుపానహములను దానము సేయుదురుగదా! అది యెట్లు వచ్చెను? దానిజననవిధ మెద్ది? ఆదానము నెందులకుఁ జేయుదురు? కేవలము శ్రాద్ధములందెగాక, మఱికొన్ని పుణ్యకార్యములందును దానిని జేయుదురు. తద్దానము పుణ్యప్రదమని యెంచి బహునిమిత్తములందుఁ జేయుదురని వినుచున్నాఁడను. దానివిధము విస్తరించి నాకెఱిఁగింపుము."

అది విని శాంతనవుఁ డాకౌంతేయునితో "ఓధర్మజా! ఛత్రోపానహములనుగుఱించిన విస్తారమును జాగరూకుఁడవై వినుము. అది లోకమున నెట్లు ప్రథితమైనదియు, నెట్లు ప్రవర్తిల్లినదియు, నెట్టు లక్షయ్యతనొందినదియు, నెట్లు పవిత్రమైనదియు నశేషముగాఁ దెలిపెదను. దాని కొకయితిహాసము గలదు. అది సూర్యునకును జమదగ్నికిని జరగినసంవాదము. మున్నొకపుడు భగవానుఁ డగుభార్గవుఁడు ధనుఃక్రీడ నాచరించుచు, మఱిమఱియు శరముల సంధించుచు విడుచుచుండెను. అటు లాతఁడు చిమ్ముచున్న దీప్తతేజములగు బాణములనెల్ల రేణుక మఱిమఱియుఁ దెచ్చి యాతని కందిచ్చుచువచ్చెను. అతఁడు మఱియు సంతుష్టుఁడగుచు ధనుష్టంకార మొనర్చుచు బాణములు చిమ్ముచుండ నామె మఱియుఁ దెచ్చియిచ్చుచుండెను. అప్పటికి జ్యేష్ఠామూలప్రధానముగా దివాకరుఁడు నభోమధ్యము నలంకరించెను పిమ్మట నతఁడు మఱికొన్ని సాయకములను జిమ్మి యారేణుకతో 'ఓవిశాలాక్షీ! ధనుశ్చ్యుతములై వెడలిన నాయీసాయకములను దెమ్ము. పొమ్ము. ఇంతయేల! నేను బాణములను జిమ్ముచున్నంతకును వానినెల్లఁ దెచ్చియిచ్చుచుండుము' అని తెలిపెను. ఓరాజా! ఆమెయు నామహర్షి పలు కాలించి, పోవుచు నొకవృక్షమునీడ నాశ్రయించియుండెను. ఆమె పాదములును దలయు సంతప్తములయ్యెను. భర్తృశాపభయముచే నామె యొకముహూర్తమాత్రము యటులుండి మఱియుఁ బతిప్రయుక్తసాయకముల నెప్పటిచొప్పునఁ దేర బయలువెడలెను. అటులువెడలి యామె బాణములనుబట్టికొనివచ్చి యెంతయు ఖిన్నయై, పాదములు నొప్పినొంద దుఃఖము నాపికొనుచు, భర్తృభయముచే వణఁకుచు నాతని సమీపించెను. అపు డామహర్షి యామె నారసి కుపితుఁడై మఱిమఱియు, 'ఓసీ! ఏమి యిటులు జాగుచేసివచ్చితివి' అని పలికెను. అదివిని యారేణుక, యాతనితో 'దేవా! నాతలయును బాదములును సంతప్తములయినవి. సూర్య తేజోనిరుద్ధగతినై నేనొకచెట్టునీడ నాశ్రయింపవలసివచ్చెను. అటులగుట నిట్టు కొంత జాలముగా సాయకములు దేవలసివచ్చెను. కావున నా యీవిన్నపము విని కోపము విడువుము.' అని తెలిపెను. అది విని యాజమదగ్ని 'ఓరేణుకా! దీప్తకిరణుఁడై నీకుఁ గష్టమును గలిగించిన యీసూర్యు

నిపుడే, నా యీయస్త్రాగ్ని తేజముచే నేలఁగూలఁద్రోయుదు' నని పలికెను.

ఓధర్మజా! అటు లతఁడు తెలిపి ధను వెక్కిడి పెక్కుబాణములనుబట్టుకొని, సూర్యున కెదురుగా నిలువఁబడియుండెను. పిమ్మట నటులు తన్నెదుర్కొని సన్నద్ధుఁడై యున్న యాజమదగ్ని నొక బ్రాహ్మణరూపముతో సూర్యుఁడు సమీపించి 'ఓయీ! మహర్షీ! నీకు సూర్యుఁడొనర్చిన యపరాధమేమి? అతఁ డాకసముననుండి తనకిరణములచేఁ గ్రమక్రమముగాఁ బుడమిఁగలజలము నాకర్షించుచుఁ బ్రతి వర్షాసమయమున వర్షించుచున్నాఁడుగదా! ఓవిప్రవర్యా! దానిచే మానవులకు సుఖకరముగా నన్నము లభించుచున్నదిగాదే? ఆ యన్నమే ప్రాణములని వేదములందుఁ బఠింపఁబడుచున్నది. ఓబ్రాహ్మణోత్తమా! అతఁడు మేఘములయందు నిగూఢుఁడై కిరణములచేఁ బరివృతుఁడై యీసప్తద్వీపములకు నుపయుక్తముగా వర్షించుచున్నాఁడుగాదే? ఆవర్షముచేఁగదా ఓషధులకును లతలకును బుష్పపత్రాదులు గలుగుట. ఓప్రభూ! సకలవిధాహారమును వర్షముచేఁ గలిగినది గాదే? జాతకర్మములును, సకలవిధములగు వ్రతములును, నుపనయనములును, వివాహములును, గోదానములును, యజ్ఞములును, శాస్త్రములును, సంయోగములును, ధనసంచయములును నన్నము నిమిత్తముగా నగుచున్న వనుట నీ వెఱింగినదేగదా! ఓభార్గవా! ఇప్పటికి రమణీయములై యున్నవియు, నారంభములైనవియుఁగూడ నన్నము వల్లనే నగు ననువిషయ మెల్ల వారికిఁ దెలిసినదియే. దానినే నేను జెప్పుచున్నాఁడను. నాచెప్పినదెల్ల నీ వెఱిఁగినదియే. ఓబ్రాహ్మణోత్తమా! నిన్ను బ్రతిమాలుకొనుచున్నాఁడను. సూర్యునిఁ బడద్రోసిన నీకేమి ప్రయోజనము?' అని పలికె" నని తెలుప విని యుధిష్ఠిరుం డిట్లనియె.

### ఛత్రోపానహదాన ప్రశంస

ఓపితామహా! బ్రాహ్మణరూపధారియైన సూర్యుఁ డట్లు యాచింపఁగా నపుడు మహాతేజుఁడగు జమదగ్ని యేమియొనర్చెను?

అది విని భీష్ముఁడు "ఓయుధిష్ఠిరుఁడా! అగ్నిసమప్రభుఁడైన యాజమదగ్ని తన్నాబ్రాహ్మణుఁడు ప్రార్థించినను శమింపఁడయ్యెను.

పిమ్మట నాసూర్యుఁడు కృతాంజలియై మృదుమధురోక్తులతో నమస్కారమొనర్చి 'ఓవిప్రర్షి! సూర్యుఁ డెల్లపుడును నడుచుచుండును గదా! చలమగునది నీకు లక్ష్యమగునా? అవిచ్ఛేదముగా గమనించుచుఁ జలనస్వభావముగలసూర్యు నెట్లు భేదింపఁగలవు?' అని పలికెను. అది విని జమదగ్ని 'ఓయీ! నాజ్ఞానదృష్టిచే స్థిరమైనను జలమైనను దెలిసికొనుచున్నాఁడను. నేను నీకిపు డవశ్యముగ వినయమును గూర్పవలసియున్నది. ఓదివాకరా! నీవు మధ్యాహ్న మొకయఱగడియ స్థిరముగా నాకసమున నిలుతువుగాదే? అపుడే నిన్ను భేదించెదను. ఇందు నాకేమియు విచారణము లేదు.' అని తెలిపెను.

అది విని యాసూర్యుఁడు, 'ఓధనుర్ధరోత్తమా! నీవు నిస్సంశయముగా, నన్ను వేధింపఁగలవు. అపకారినగునన్ను శరణాగతునిఁగాఁ దెలియుము.' అని ప్రార్థించెను. ఓయుధిష్ఠిరా! పిదప నాభగవానుఁ డగుజమదగ్ని సపరిహాసముగా సూర్యునితో 'ఓయీ! జడియకుము. నీవు నన్ను శరణుపొందితివిగాదే? మఱియు నొకటి వినుము. బ్రాహ్మణులయార్జవమును, పుడమికిఁగలస్థిరత్వమును, సోమునిసౌమ్యతను, వరుణుని గాంభీర్యమును, నగ్నిదీప్తిని, మేరువుకాంతిని, దపనుని ప్రతాపమును నెవ్వఁ డతిక్రమించునో, వాఁడే శరణాగతునిఁ జంపును. శరణాగతునిఁ జంపినవాఁడు, గురుతల్పగతుఁడును, బ్రహ్మహత్యాపాతకియు, సురాపానకర్తయు నగుచున్నాఁడు. కావున శరణాగతు నెవ్వఁడు వధింపరాదు. కాని, నీకిరణములచేఁ దప్తమైనమార్గ మెట్లు సుఖగతి గల్గునదో యట్టియుపాయమును జింతింపుము. నీ యీయాయపనయము నపనయింపుము.' అని తెలిపెను. ఓరాజా! ఆ భృగూత్తముఁ డిట్లు పలికి యూరకుండుటయుఁ, బిమ్మట సూర్యుఁ డాతనికి ఛత్రోపానహముల నొసంగెను. అటులొసఁగి యతఁ డా జమదగ్నితో 'ఓమహర్షివర్యా! మత్కిరణనివారణమగు నీఛత్రము నీకు శిరస్త్రాణమగును. పాదములను రక్షించుకొనుటకై యీచర్మపాదుకలను బరిగ్రహింపుము. నేఁడు మొదలుగా నీవు, పుడమిని సకలపుణ్యలోకములందును స్వేచ్ఛగాఁ జరింపఁగలవు. ఇది యక్షయ్యము నగుచున్నది.' అని తెలిపెను. ఓధర్మాత్మజా! ఛత్రోపానహము లిట్లు సూర్యునిచేఁ బ్రవర్తిల్లినవి. ముల్లోకములందు నివి పవిత్రములుగాఁ దెలుపఁ

బడినవి. కావున నీఛత్రోపానహములను బ్రాహ్మణుల కొసంగుము. వాని నిచ్చుటలో గొప్పధర్మము గలదు. అందు సందియము లేదు. ఓభరతశ్రేష్ఠా! ఎవ్వఁడు బ్రాహ్మణునకు ఛత్త్రమొసంగునో, వాఁడు మరణించినపిదప సుఖమందుచున్నాఁడు. మఱియు నతఁడు ద్విజాతులచేఁ బూజ్యమానుఁడగుచు నింద్రలోకమున నివసించును. మఱియు నాతని దేవతలును నప్సరసలును నాదరింతురు. ఎండచేఁ దపించుచున్న బ్రాహ్మణునకును, సంశితుఁడగుస్నాతకునకును నెవఁడు పాదుకలొసంగునో, యట్టివాఁడు దేవతాపూజితములగు నుత్తమలోకముల నొందుచున్నాఁడు. మఱియు నట్టివాఁడు మరణించినపిదప గోలోకమున నానందభరితుఁడై నివసించును. ఓభరతకులోత్తమా! నేను నీ కీవిషయమును సమగ్రముగా నెఱిఁగించితినిగదా! ఛత్రోపానహదానఫలము దెలిసితివి గదా!" అని పలుక విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె.

### దానధర్మకథనము

"ఓపితామహా! లోకమున మానవుఁ డెద్దాని నొనర్చి యభివృద్ధి నొందునో, యట్టి గృహస్థధర్మ మెల్ల నెఱిఁగింపుము."

అది విని గాంగేయుఁడు "ఓయుధిష్ఠిరా! నీప్రశ్నమున కుత్తరముగా నొకపురాతనేతిహాస మెఱిఁగించెదను. అయ్యది భూదేవికిని వాసుదేవునకును జరగినసంవాదము. ఒకపుడు, ప్రతాపసిద్ధియగు వాసుదేవుఁడు, భూదేవిని సంస్తుతించి, నన్ను నీవిపు డేమి ప్రశ్నించితివో దానినే యతఁడు నాభూదేవి నడిగెను. దానిం దెలిపెదను. వాసుదేవుఁడు 'ఓదేవీ! గార్హస్థ్యధర్మము నాశ్రయించిన నేనుగాని, నాయట్టివాఁడుగాని, తప్పక చేయువలసినకార్యమేమి? ఏమిచేసిన నది సఫలమగుచున్నది?' అని ప్రశ్నించెను. అది విని యాపృథివి 'వాసుదేవా! మహర్షులు, నతిథులు, దేవతలును, పితృదేవతలును, యజింపఁదగినవారును నర్చింపఁదగినవారును నగుచున్నారు. అందు యజ్ఞముచే దేవతలను, నాతిథ్యముచే మానవులను నారాధింపవలయును. నిత్యము నర్హులగువారిని వారిస్వేచ్ఛకు భంగము గలుగకుండ నొకచోటఁ జేర్పవలయును. దానిచె మహర్షిగణములు ప్రీతులగుచున్నారు. ఓ మాధవా! నిత్యము నగ్నిపరిచర్యయు, బలికర్మాచరణమును జేసిన

వానియెడ దేవతలు ప్రీతులగుచున్నారు. ప్రతిదినమును నన్నాదుల చేతను, నుదకముచేతను శ్రాద్ధమొనర్చినఁ బితృదేవతలు ప్రీతులగుచున్నారు. శుచియై సిద్ధాన్నముచే నగ్నియందు వైశ్వదేవ మొనర్పవలయును. అగ్నిహోమము, వైశ్వదేవము, ధాన్వంతర్యము అని ప్రజాపతికి వేఱువేఱుగా హోమము విధింపఁబడుచున్నది. అటులే క్రమముగా బలికర్మము నొనర్పవలయును. దక్షిణదిశయందు యమునకును, బడమటను వరుణునకును, నుత్తరదిక్కున సోమునకును, వాస్తుమధ్యమునఁ బ్రజాపతికిని బలికర్మమును జేయవలయును. ధన్వంతరికిఁ బ్రాగుత్తరమునను, బ్రాగ్దిశను నింద్రునకును బలికర్మము విధింపఁబడినది. మానవులకుఁగా గృహద్వారమున బలి నొనర్పవలయు నని తెలుపుచున్నారు. మరుత్తులకును దైవతములకును గృహమధ్యభాగమున బలి నొసంగవలయును. అటులే విశ్వేదేవులకు నాకాశమున బలి నర్పింపవలయును. నిశాచరులకును భూతములకును రాత్రి బలి నిడవలయును. ఇటుల బలికర్మమును జేసి పిదప బ్రాహ్మణునకు భిక్ష పెట్టవలయును. బ్రాహ్మణుఁడు లభింపనపుడు, తదన్నాగ్రము నించుక దీసి యగ్నియందుంపవలయును. ఎపుడు పితరులకు శ్రాద్ధమును జేయఁదలంచునో, యప్పుడా శ్రాద్ధకర్మము ముగిసినపిదప బలికర్మ మొనర్పవలయును. ఎపుడేనిఁ బితరులఁ దృప్తినొందించినపిమ్మటనే బలి నొనర్పవలయును తరువాత వైశ్వదేవమును బిమ్మట బ్రాహ్మణవాచనమును నొనర్పవలయును. పిమ్మట విశేషములగు నన్నాదులచే నతిథులఁ దృప్తినొందింపవలయును. ఓమహారాజా! మానవులను బూజాదానపురస్సరముగా నాదరించి సంతసింపఁజేయఁగలుగుచున్నాఁడు. అనిత్యముగా నుండువాఁడగుట నతిథి యనఁబడుచున్నాఁడు. 'ఆచార్యునకును, దండ్రికిని, మిత్రునకును, సఖునకును, నతిథికిని నిత్యము నాయింట నిదియే గలదని మనవిచేయవలయును. వారేమి తెలుపుదురో, దాని నొనర్పవలయును.' అని ధర్మము విధింపఁబడుచున్నది. ఓకృష్ణా! గృహస్థుఁడగుమానవుఁడు నిత్యము శిష్టాశి కావలయును. సంవత్సరము కాలము నివసించినను, రాజయాజకుని, గురుని, స్నాతకునిఁ, దనకుఁ గన్యనిచ్చినమామను మధుపర్కదానముచే నర్చింపవలయును. కుక్కలకును, బక్షులకును, శ్వపచులకును దృప్తిగాఁ బుడమి నన్నముఁ

బాఱవేయవలయును. ఇదియే వైశ్వదేవము. దీనిని బ్రాతస్సాయంకాలముల నొనర్పవలయును. ఎవ్వఁ డీగార్హస్థ్యధర్మములను శ్రద్ధాళుఁడై చేయునో, యట్టివాఁ డిహమున మహర్షులలోఁజేరి పరమున స్వర్గమున సుఖించుచున్నాఁడు.' అని తెలిపెను.

ఓయుధిష్ఠిరా! ఇట్లు తెలిపినభూదేవివచనము లాలించి, యష్టాగవుఁడు, తద్విధముగా నాచరించెను. ఓధర్మజా! నీవును నటులొనర్పుము. ఇటులు గృహస్థధర్మము నాచరించినవాఁ డీలోకమునఁ గీర్తివడసి, మృతినొందినపిదప స్వర్గము నడయుచున్నాఁడు" అని తెలుప విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె.

## సువర్ణమనుసంవాదము

"ఓపితామహా! ఆలోకదానమని తెలుపుదురుగదా! అది యెట్టిది? అది యెట్లు జనించెను? దానికి ఫలమేమి? తెలుపుము."

అది విని గాంగేయుఁ డాకౌంతేయునితో "ఓయీ! నీవడిగిన ప్రశ్నమున కుత్తరముగా నొకపురాతనేతిహాసము గలదు. అది ప్రజాపతియగు మనువునకును సువర్ణుఁడను మునికిని జరగినది. దాని నెఱిఁగించెద వినుము. సువర్ణుఁడనుముని యొకఁడుండెను. ఆతని మేను సువర్ణచ్ఛాయ గల్గియుండుట నట్టిపే రాతనికిఁ గల్గెను. మఱియు నతఁడు కులశీలగుణాన్వితుఁడును, స్వాధ్యాయగతుఁడునై గొప్ప వంశముల జనించినవారి ననేకులఁ దనగుణములచే మించియుండెను. అతఁ డొకపుడు మనువు నారసి యాతని సమీపించెను. వారుభయులును బరస్పరము కుశలప్రశ్నము నొనర్చికొని, పిమ్మటఁ, గాంచన పర్వతమగు మేరువున రమణీయమగు నొకశిలాఫలకమునఁ గలిసి కూరుచుండిరి. సత్యసంకల్పులగువా రటులు గూరుచుండి, నానావిధములగు కథలను దెలుపుకొనుచు, మఱియు బ్రహ్మర్షులయు దేవతలయు దైత్యులయుఁ బురాతనచరిత్రములను ముచ్చటించుకొనుచు నుండిరి. అపు డాసువర్ణుఁ డాస్వాయంభువమనువు నారసి, 'ఓమహానీయా! సకలభూత హితకరమగు నొకప్రశ్నమొనర్చెదను. దానికి సమాధాన మెఱిఁగింపుము. పండితులగువారు పుష్పధూపదీపాదులచేఁ బూజలొనర్తురు. అదియేమి? ఎటు లుత్పన్నమైనది. దానిఫలమేమి? తెలుపుము.' అని యడి

గెను. అది విని యమ్మను వాతనితో 'ఓమునివర్యా! దీని కొకపురాత నేతిహాసము గలదు. అయ్యది మహాత్ములగు బలిశుక్రులకు జరగిన సంవాదము. అది వినుము. ఒకప్పుడు ముల్లోకములను బాలించునట్టి విరోచనపుత్రుఁడగు బలిచక్రవర్తిసమీపమునకు భృగుకులోద్భవుఁడగుశుక్రుఁడు వచ్చెనఁట. అంత నయ్యసురాధిపుఁ డాభార్గవు నర్ఘ్యాదికముచే నారాధించి, విధ్యుక్తభూరిదక్షిణల నిచ్చి యాసనముపైఁ గూరుచుండెను. వారి కపుడు నీవు ప్రశ్నించినట్టులుగా, పుష్పధూపదీపాదిదానమునకుఁ గలఫలమేమి? అనుకథయే ప్రసక్తమైనది. అపుడు బలిచక్రవర్తి శుక్రు నిట్లు ప్రశ్నించెను. 'ఓమహాత్మా! పుష్పధూపదీపాదులచేఁ గలుగుఫలమేమి? దాని నెఱిఁగింపుము.'

అది విని శుక్రుఁడు! 'ఓదైత్యరాజా! మున్ను గాఁ దపముజనించినది. పిమ్మట ధర్మము పుట్టినది. వీనినడుమునే యోషధులును లతలును జనించెను. పుడమిలో సోమునిస్వరూపమే బహువిధములుగా వెలసెను. అమృతము, విషమును, మఱికొన్నితుల్యజాతులును జనించినవి. అమృతము వెంటనే చిత్తమునకుఁ బ్రీతిని సంతృప్తిని గల్గించును. విషము వాసనచేఁ దీవ్రమై యెల్లవారికినిఁ గ్లేశముగలిగించును. అమృతము మంగళప్రదమైనదియు, విష మమంగళప్రదమైనదియు నగునని తెలియుము. ఓషధులన్నియు నమృతసంభవములు. తేజముగువిష మగ్నిసంభవము. అమృతము మనస్సును సంతసింపఁజేయునదై శోభనుగలిగించు. కావుననే సుకృతకర్ములగుమానవులు పుష్పములను సుమనములని తెలుపుదురు. ఎవ్వఁడు శుచియై దేవతలకుఁ బుష్పము లర్పించునో, వానియెడ దేవతలు ప్రీతిగలిగి, వానికిఁ బుష్టిగలిగింతురు. ఓదైత్యరాజా! ఏయేదేవు నుద్దేశించి పుష్పము లర్పింపఁబడునో, దానిచే నతఁడు ప్రీతుఁడగుచున్నాఁడు. వానిలో నేయవి, యుగ్రములో నేయవి సౌమ్యములో నేయవి తేజోవంతములో, యనువిషయమును వేఱువేఱుగాఁ దెలిసికొనవలయును. ఓషధులు బహువిధములైనవియు బహుసారముగలవియు నైయున్నవి. వృక్షములు యజ్ఞార్హములు. వానిలో నేయవి యజ్ఞమున కుపయుక్తములు గానివో తెలిపెదను వినుము. మఱియు నసురప్రియములగుమాల్యము లెవ్వియో, దేవతాహితములైన వెవ్వియో, రక్షోయక్షోరగాదులకుఁ బ్రియమైన వెవ్వియో,

యటులే మానవులకును బితగులకును బ్రియములైన వెవ్వియో, క్రమముగా నెఱింగించెదను. వృక్షాదులు, వనములును, గ్రామ్యము లును, గర్షణమొనర్చి నాటఁబడునవియు, బర్వతాశ్రయములును, గంటకములుగలవియు, నవిలేనివియు, గంధరూపరసాన్వితమును నై వెలయుచుండును. పుష్పములందుఁ గలగంధము 'ఇష్టగంధము, అనిష్ట గంధము' అని రెండువిధములు. దేవతల కిష్టగంధములగుపుష్పము లుత్తమములని భావింపుము. ఓప్రభూ! ముండ్లులేనివృక్షములలోఁ దెల్లని వానిపూవులు దేవతల కెల్లపుడును సమ్మతములగుచుండును. గంధర్వనాగయక్షులకు నీటఁబుట్టినపద్మాదులమూలములు ప్రియము లగుట వారికి వానినే సమర్పింపవలయును. ముండ్లుగలవియు, గటువు లగునవియు, రక్తపుష్పములునునగు నోషధులను నథర్వములందు శత్రులను సంహరించుటకై యభిచారహోమముల నుపయోగింప వలయును. అటులే తీవ్రసారముగలవియు, దుర్లాలంభములును, గంట కాన్వితములును, రక్తవర్ణములును, గృష్ణవర్ణములును భూతముల కిష్టమైనవి. మనస్సంతోషకరములును, విమర్దమధురములును సురూప ములునునగు పుష్పములు, మానవులకుఁ బ్రీతికరములు. శ్మశానముల యందు, దేవతాయతనములయందును జనించినపుష్పములు పుష్టి యుక్తములగు వివాహములందును, రహస్యంయోగములందును నుప యోగింపరాదు. కొండలయందును, వానిచఱియలందును జనించిన పూవులు దేవతల కొసంగవలయును. అటు లర్పించునపుడు వానిని బ్రోక్షణముచేసెనేని యవి సౌమ్యములగుచున్నవి. గంధముచే దేవ తలును, బైరూపముచే యక్షరాక్షసులు, నుపభోగముచే నాగు లును, బైమూఁడిటిచే మానవులు సంతసించుచున్నారు. పుష్పారాధ నముచే దేవతలు వెంటనే ప్రీతులై మానవులకుఁ బుష్టిగలిగింతురు. సంకల్పసిద్ధులగువారు మానితులును బ్రీతులునై మానవులను మన్నిం తురు. అవజ్ఞాతులై రేని యథములగుమానవులను దహింంతురు. ఇఁక ధూపదానవిధికి ఫల మెఱింగించెదను వినుము. ఆధూపములలో సాధు వెయ్యదియో, యసాధు వెయ్యదియో తెలిసికొనుము. మఱియు నవి నిర్యాసములు, సారులు, కృత్రిమములు, అని మూఁడు విధములుగా నుండును. అవి కొన్నిదుష్టగంధములు, మఱికొన్ని

యనిష్టగంధములుగా నున్నవి. అందు సల్లకీనిర్యాసముదక్క దక్కినవి దేవతలకుఁ బ్రియములు. నిర్యాసములందెల్ల గుగ్గిలపుఁజెట్టుబంక శ్రేష్ఠమై యెల్లవారికిని బ్రియతమమైనది. సారులలో అగురువు శ్రేష్ఠమై యక్షరాక్షసులకును దైత్యులకును బ్రియమై యుండును. అటులే సల్లకీజమగునదియు వారికిఁ బ్రియమైయుండును. ఇఁక భూమిసంబంధమైనవి, దారుసంబంధమైనవియు నై స్వరసాదులగంధములతోడ రససంయుక్తములై తయారుచేయఁబడినవి మానవులకుఁ బ్రియములుగా నుండును. ధూపము దేవదానవులకు భూతములకును దక్షిణాము తుష్టినిఁ గలిగించును. పుష్పదానమున, నేయవి గుణహేతువులుగాఁ దెలుపఁబడియెనో ధూపములందును నవియే ప్రీతికరములని తెలియవలయును. ఇంక దీపదానమునఁ గలుగు నుత్తమఫలము దెలిపెదను వినుము. దీపదాన మేలాగునఁ జేయవలయునో, యెపుడు చేయవలయునో, యదిచేయువా రెట్టివారో యనువిషయములు తెలిసికొనుము. జ్యోతి నూర్ధ్వగతముగా నొనర్చి ప్రకాశింపఁజేయవలయును. అట్టి తేజమును దాన మొనర్చినమానవులకుఁ దేజము గలుగుచున్నది. దక్షిణాయన మంధంతమ మనునరకమార్గము. అటులగుట దీపదానమునకు నుత్తరాయణమే ప్రశస్త మనఁబడుచున్నది. దీపదాన మూర్ధ్వగతమయినపుడే చీకటులఁ దొలఁగించును. కావున నూర్ధ్వగతియగునటు లొనర్చినదీపమే యుత్తమము. దేనివలన దేవతలు తేజోవంతులును బ్రభావంతులును బ్రకాశకులును నైరో రాక్షసులు తామసులైరో యట్టిహేతువున దీపదాన మొనర్పవలయును. ఊర్ధ్వదీపదానముచే దృష్టిగలవాఁడును బ్రభాశాలియు నగుచున్నాఁడు. అటులు దీపదానము చేసి, పిమ్మట దానికి హింసనుగాని, నాశమునుగాని గలిగింపరాదు. దీపహానికరుఁడు తమోగతియు, నంధుఁడు బ్రభాహీనుఁడు నగును. దీపదానముచేయువాఁడు స్వర్గమున దీపమాలికవలె వెలయుచుండును. అయ్యది ఘృతముచే నొనర్చుట యుత్తమపక్షము. తైలముచేనొనర్చుట రెండవపక్షము. కాని క్రొవ్వు మొదలగు ప్రాణులనుండి వచ్చినచమురు దీపదానమున నుపయోగింపరాదు. దీపదానము కొండచరియపైని గహనమందును, దేవాలయములందును జేయవలయును. అట్టివానికే యైశ్వర్యము గలుగును. అట్టివాఁడు వంశప్రకాశకుఁడును విశుద్ధా

త్ముఁడునై కీర్తివడయును. దీపదాత, నక్షత్రలోకము మున్నగుజ్యోతిర్లోకముల నందుచున్నాఁడు. ఇఁక బలికర్మములందు ఫలమును గలిగించుగుణము లెవ్వియో, దేవయక్షోరగమానవాదులలో నెవ్వరి కొనర్చిన నెట్టిఫలమో యనువిషయముల నెఱిఁగించెదను. ఎవ్వరు ముందుగా, దేవతలకును, విప్రులకును, నతిథులకును, బాలురకును బెట్టక తామే భుజింతురో యట్టివారిని వషట్కారశుభశూన్యులగు నట్టి రాక్షసులఁగా దెలియుము. కావున దేవతలకుఁ బూజాపురస్సరముగా నగ్రభోజన మొసంగవలయును. మఱియు జాగరూకుఁడై సవినయముగా బలి నర్పింపవలయును. దేవతలు గృహస్థులను గోరుచు వారర్పించుపూజాదికమును బరిగ్రహింతురు. అటులే పయిచోటుల నుండి వచ్చెడియాగంతువులును, యక్షరాక్షసపన్నగులును, దేవతలును, పితృదేవతలును, గృహస్థు లొసంగినవానినుండియే జీవించుచున్నారు. వారి కటు లొసంగినఁ బ్రీతులై యాయువు, ధనమును, కీర్తినిఁ గలిగించుచున్నారు. దేవతలకుఁ బుష్పములతో బలుల నొసంగవలయును. వారి కొసంగుబలులు ప్రియదర్శనములును బవిత్రములును దధిదుగ్ధమయములునై యుండవలయును. యక్షరాక్షసులకు రక్తమాంసాన్వితము లగుబలుల నర్పింపవలయును. మఱియు వారి కవి సురాసవపురస్సరములును, లాజాలంకృతములై ప్రీతిని గలిగించును. నాగులకు నిత్యమును బద్మోత్పలవిమిశ్రితములైన బలులు ప్రియములు. గుడాసంపన్నములగుతిలలు భూతములకు బలిగా నొసంగవలయును. అగ్రదాత యగ్రభోగియు బలవీర్యసమన్వితుఁడు నగును. కావున దేవతలకుఁ బూజాపురస్సరముగా ముందు నివేదన సేయవలయును. నిత్యమును నేగృహదేవత లింట వెలయుచుందురో, యట్టిదేవతలను ముందుగాఁ బూజాదికముచే నారాధింపవలయును.' అని యాబలిచక్రవర్తితో నాశుక్రుఁడు తెలిపెను. ఇక్కథను మనువు సువర్ణునకుఁ దెలిపెను. అతఁడు నారదున కెఱిఁగించెను. నారదుఁడు నాకుఁ దెలిపెను ఓపుత్రకా! దీనివిధము నీవు తెలిసికొని యాచరింపుము." అని తెలుప విని యాధర్మజుఁడు శాంతనవుతో మఱియు నిట్లనియె.

## అగస్త్యభృగుసంవాదము

"ఓపితామహా! పుష్పధూపదానమందును, బలివిధానమందును గలఫలమును వింటిని. అయినను మఱియు దానినే విన గోరుచున్నాఁడను. గృహస్థులు ధూపదానము లెందుల కొనర్తురో, బలుల నెందుల కర్పింతురో యది విస్తరించి తెలుపుము."

అది విని భీష్ముఁడు "ఓయుధిష్ఠిరా! నీవడిగినవిషయమున కుత్తరముగా నొకపురాతనేతిహాసము గలదు. అయ్యది నహుషాగస్త్యులకు జరిగినసంవాదము. దాని నెఱిఁగించెదను వినుము. ఓమహారాజా! మహాతపుఁడగునహుషుఁ డనెడి రాజర్షి తానొనర్చినసుకృతకర్మముచే దేవరాజ్యమునొంది, యందు నియతుఁడై నివసించుచు, మానుషములును, దివ్యములునగు వివిధపుణ్యక్రియలఁ జేయుచు వచ్చెను. ఓరాజా! త్రిదివమున నమ్మహాత్ముఁడు కేవలము దివ్యక్రియలె గాక, మానుషక్రియలను జేయువాఁడై యగ్నికార్యముల నొనర్చెను. అతనియింట సమిధలు, కుశలు, పుష్పములు, లాజాన్నములును, ధూపదీపములును మున్నగు నన్నియుఁ బ్రవర్తిల్లెడివి. మఱియు నతఁ డందు జపయజ్ఞములు మనోయజ్ఞములను జేసెను. అతఁడు విధ్యుక్తముగా దైవతముల నారాధించెను. అతఁ డన్నిదైవతములను వెనుకటివలెఁ బూజింప నారంభించెను. అటులు కొంతకాల మొనరించి, పిమ్మట నతఁ డింద్రుఁడ ననునహంకారము పూనుటయు, నాతనిక్రియలన్నియు నశింప నారంభించెను. అటు లాతని కహంకార మొదవుటనే, వరదానమదాన్వితుఁడై మహర్షులను దనవాహనము మోయ నియోగించెను. అటులు హీనసత్క్రియుఁ డగుట మహత్త్వహీనుఁడై యమ్ముని ముఖ్యులచే వాహనమును మోయించుచు రాఁ బెక్కుకాలము గడచెను. అంత నొకపుడు మహాతేజుఁడును, బ్రహ్మవిద్వరిష్ఠుఁడునగు భృగువు నిజాశ్రమస్థుఁడై యున్న యగస్త్యుని సమీపించి 'ఓయీ! మహర్షివర్యా! ఇంద్రుఁడై యున్న దుర్మతియగునహుషునిచే మన మిట్టు లవమాన మొందుచుండియు, నేల సహింపవలయును?' అని పలికెను. అది విని యగస్త్యుఁడు, 'ఓమహామునీ! వాఁడొక గొప్పవరము వడసియున్నవాఁడనుట నీకుఁ దెలిసినదియెగదా! వానిని నేను శపించుట కెట్లు వలనుపడును? మఱియు వీఁడు స్వర్గమునకు వచ్చు

నపు డాదేవునివలన, దనదృష్టిపథమునఁబడినవాఁడు తనకు వశ్యుఁడగు నట్లుగా వరమువడసి యున్నవాఁడుగాదే? ఇటులగుటనే వాఁడు నీకును నాకును దగ్ధుఁడుగానేరఁడు మఱియుఁగల మహర్షిముఖ్యులకును వాఁడు దగ్ధుఁడుగాఁడు. పడఁద్రోయఁబడఁడు. వాని కాభగవానుఁడు ప్రాపుటకై యమృతమును సైతము దయచేసెను. అటులగుట నానహుషుఁడు మనచేఁ బడఁద్రోయంబడఁడు. అయ్యయో! ప్రజలకుఁ గష్టతరమగు వరము నాదైవ మొసంగెను. అక్కృతమున నానరాధముఁడు ద్విజులయెడఁ జేయరానియకృత్యములఁ జేయుచున్నవాఁడు. కావున నిపుడు మనకుఁ గర్తవ్య మేదియో దానిం దెలుపుము. నీ చెప్పిన చొప్పునఁ బ్రవర్తింతును. సందియము లేదు.' అని తెలిపెను.

అది విని యాభృగువు 'ఓయగస్త్యా బలవంతుఁడయ్యు దైవ విమోహితుఁడై యున్న యానహుషునకుఁ బ్రతీకార మొనర్ప నప్పితామహు ననుజ్ఞ వడసియే నీకడకు వచ్చితిని. దుర్బుద్ధియగు నాదేవరాజిపుఁడు నిన్ను వాహనము వహింప నియోగించును. ఇదె చూడుము. నా తేజముచే గర్వితుఁడైనవాని నిపుడే, యనింద్రునిఁగా నొనర్చెదను. మఱియు నాశతక్రతుఁడగునింద్రు నిందు నిలిపెదను. పాపకర్ముఁడును దుర్మతియునగు వాని నింద్రపదమునుండి తొలఁగించితి ననుకొమ్ము. తన వాహనము వహించుచున్న నిన్నాదుష్టదేవేంద్రుఁడు పాదముచేఁ దన్నును. వాఁడు దైవోపహతచిత్తుఁడగుట మందబుద్ధియై యాత్మనాశ మెఱుఁగక యటులొనర్చును. అటులొనర్చిన ధర్షణమున, కమర్షితుఁడనై ధర్మమును దప్పినవానిని 'అహివి గమ్ము' అని శపించెదను. పిదప దుర్బుద్ధియైన యానహుషుని ధిక్కరించి, నీవు చూచుచుండఁగనే పుడమిఁ బడఁద్రోయుదును. నీకెటు లిష్టమగునో, యటులాయైశ్వర్యబలమోహితుఁడును, బాపకర్ముఁడునగు నహుషు నధఃపతితునిఁ గావించెదను.' అని భృగువు పలుక విని యాయగస్త్యుఁ డందుల కెంతయు సంతసిల్లె"నని తెలుప విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె.

## నహుషోపాఖ్యానము

"ఓపితామహా! ఆనహుషున కెటు లాపద సంభవించెను? వాఁడెట్లు పుడమిఁ బడియెను? వాని కాయింద్రత్వ మెట్లు పోయెను? అదియెల్ల నాకెఱిఁగింపుము."

అది విని భీష్ముఁడు, "ఓధర్మజా! ఆభృగువు నగస్త్యుఁడు నిట్లు సంవాదము చేసికొనిరి. మహాత్ముఁడగు నానహుషుని దివ్యమానుష కర్మములన్నియు నెప్పటిచొప్పునఁ బ్రవర్తిల్లుచువచ్చెను. మునుపటి వలె నాతనికి సర్వోపకరణములుగల దీపదానములును, బలికర్మమును, మఱియుఁగల యుత్సవాదులును బ్రవర్తిల్లుచుండెను. దేవమానవ లోకములందుఁ గలసదాచారములన్నియు నాతనియెడఁ బ్రవర్తిల్ల నారంభించెను. ఓరాజేంద్రా! అట్టిక్రియలన్నియు, గృహస్థుని సమృద్ధికగుచున్నవి. ధూపదీపదానములును, నమస్కారములును, సిద్ధాన్నమును, గృహస్థునకు ముందుగా నొసంగుటయు, బలికర్మములును దేవతలప్రీతికి హేతువులగుచున్నవి. బలికర్మమున గృహస్థున కెట్టి సంతోషముగునో, యంతకు నూఱురెట్లు దేవతలకు సంతోషమగు చున్నది. ఇటులు సజ్జనులు నిజగుణావహముగా దేవతలకు ధూపదీపములను, నమస్కారములను నర్పించుచున్నారు. పవిత్రోదకస్నానముచేఁ జేయఁబడుకర్మము నమస్కారప్రయుక్తమగునేని దేవతలు సంతసించుచున్నారు. మఱియు మహాభాగులగు పితరులును, దపోధనులగు మహర్షులును, గృహదేవతలగు నెల్లవారును విధ్యుక్తముగా నర్చితులగుదురేని ప్రీతులగుదురు. ఓయుధిష్ఠిరా! ఆనహుషుఁ డిట్టి బుద్ధి నవలంబించి గొప్పదగు మహేంద్రత్వమునొంది యిట్టియద్భుత కృత్య మొనర్చెను. పిమ్మటఁ గొంతకాలమున కాతనికి భాగ్యనాశ సమయమువచ్చుట, నీసత్కర్మకలాపము నాదరింపక బలికర్మమును బరిత్యజించి, ధూపదీపోదకవిధుల నాచరింప మానికొనియెను. పిదప వానియజ్ఞాదికము, రక్షస్సులచే నశింపఁజేయఁబడియెను. పిమ్మట నతఁ డొకప్పుడు మహర్షిశ్రేష్ఠుఁడగు నగస్త్యునిఁ దనవాహనమును వహింప నియమించెను. అతఁ డటులు నియోగించి సరస్వతీతీరము చేరువ వడిగా నడువ నాజ్ఞాపించెను. అపుడు మహాతేజుఁడగు భృగువు మైత్రావరుణితో 'ఓమునివర్యా! నీవొకనిమేషము నేత్రములు మూసికొనుము. నేను నీజటయందుఁ బ్రవేశించెదను' అని పలికి స్థాణుభూతుఁడై యున్న యాయగస్త్యునిజటలో నాభృగువు ప్రవేశించి యానహుషునిఁ బడఁద్రోయువాఁడై ప్రతీక్షించుచుండెను. అంత నాదేవరాజు తన్ను మోయుటకుఁగా నాయగస్త్యుని నియ

మించెను. అప్పు డగస్త్యుఁడు నహుషునితో 'ఓరాజా! నిన్నెందులకు వడిగాఁ దీసికొనిపోవలయునో తెలుపుము. నీకు వలయుచోటికిఁ బోయెదను.' అని పలికెను. అది విని యాసురపతి యందులకు సమ్మతించి యాతని నడువుమని తెలిపెను. అంత నాయగస్త్యునిజటలో భృగు వెంతయు సంతోషముతో నుండెను. కాని యతఁ డాయింద్రున కగపడకయే యుండెను. అప్పు డానహుషునిచే నటులు నియుక్తుఁడైనను నాతనివర ప్రభావ మెఱిఁగినవాఁడగుట నగస్త్యుఁ డతనిపైఁ గోపము సూపకుండెను. ఓయుధిష్ఠిరా! అప్పు డానహుషుఁ డాయగస్త్యునిఁ బ్రతోదముచేఁ బ్రేరించెను. అయినను నమ్మహర్షి కోపింపఁడయ్యెను. పిమ్మట నాదేవరా జాయగస్త్యునిఁ బాదముచేఁ దన్ని నడువుమని ప్రేరించెను. అటు లాతఁడు తనవామపాదముచే నాయగస్త్యునితలఁ దన్నుటయుఁ దన్మహర్షి జటాంతర్గతుఁడై యున్న భృగువు మిగులఁ గుపితుఁడై పాపచిత్తుఁడగు నహుషునితో 'ఓయీ! నీ వమ్మహామునిని గోపమడరఁ బాదముచేఁ దలదన్నుటను, వడిగా నిపుడు సర్పమవై పుడమికిఁ బొమ్ము.' అని శపించెను. తత్క్షణ మానహుషుఁడు సర్పమై పుడమిఁ బడియెను. అప్పటికి నాభృగు వానహుషునకుఁ గానరాకుండెను. ఓధర్మజా! ఆభృగువే యారాజునకుఁ గానవచ్చెనా? పుడమిని బడఁద్రోయఁజాలఁడని చెప్పఁగలను. వాఁడు తపోనిష్ఠలు, బహువిధదానములు, నియమములు మున్నగువానిచేఁ దేజశ్శాలియైనవాఁడు గాదే! ఓయుధిష్ఠిరా! ఆనహుషుఁ డటులు పుడమిఁబడియుఁ బూర్వస్మృతి గలిగి, యాభృగువును వేఁడికొని, 'మహానీయా! నా కీశాప మెప్పుడు పోవునో సెలవి'మ్మని ప్రార్థించెను. అంత నయ్యగస్త్యుఁడు దయావిష్టుఁడై యాభృగుమహర్షినిఁ బ్రసన్నునిఁ గావించి, యానహుషునకు శాపాంతము సెలవిమ్మని కోరెను. అంత నాభృగుమహర్షియు, దయవెలయ, నానహుషునితో 'ఓయీ! వంశోద్ధారకుఁడగు యుధిష్ఠిరుఁడనియెడిరాజొకఁ డుదయించును. వానివలన నీకు శాపాంతమయ్యెడిని' అని పలికి యంతర్ధానమునొందెను. అంత మహాత్ముఁడగు నగస్త్యుఁడును శతక్రతునికార్య మటులు నిర్వర్తించి, బ్రాహ్మణులచేఁ బూజింపఁబడుచు నిజాశ్రమమునకుఁ బోయెను. ఓధర్మజా! ఆనహుషుఁడును నీవలన శాపవిముక్తుఁడై నీవు చూచుచుండఁగనే బ్రహ్మలోకము

నొందెనుగాదే? అటు లాభ్రుగు వానహుంషునిఁ బుడమిఁ బడఁద్రోసి, బ్రహ్మభవనమున కేఁగి, తానొనర్చినకృత్యమెల్ల నప్పరమేష్ఠి కెఱిఁగించెను. పిమ్మట నప్పితామహుఁడు శతక్రతుఁడగు నింద్రుని రావించి దేవతలతో 'ఓసురలారా! నేను వర మొసంగుటచే నానహుషుఁడు దేవరాజ్యమొంది, కుపితుఁడైన యగస్త్యునిచే రాజ్యభ్రష్టుఁడై పుడమిఁ బడియెను. ఓదేవతలారా! రాజొకఁడు లేక ప్రవర్తించుట కష్టతరము గదా! కావున దేవరాజ్యమున మఱియు నాశతక్రతుఁడగు నింద్రునిఁ బట్టాభిషిక్తునిఁగా నొనర్చికొనుఁడు.' అని తెలిపెను. ఓకౌంతేయా! ఇటు లప్పితామహుఁడు పలుకుటయు, నా దేవత లందులకు సమ్మతించి సంతుష్టులైరి. అపు డాపరమేష్ఠి, యింద్రు నెప్పటివొప్పున దేవ రాజ్యమున నభిషిక్తునిఁగావించెను. అంత నాయింద్రుఁడు వెనుకటివలె రాజ్యమేలుచు విరాజిల్లెను. ఓయీ! ఆనహుషుఁడు తనవ్యతిక్రమముచే నిటులై మఱియుఁ దనకర్మములచే సిద్ధినొందెను. కావున గృహస్థులగు వారు సాయంసమయముల దీపదాన మొనర్పవలయును. దీపదాత దివ్యదృష్టి నొందుచున్నాఁడు. వారటులు జన్మాంతరమున మంచిదృష్టి నొందుటయె గాక పూర్ణచంద్రసన్నిభులై వెలయుదురు. ఎన్ని తెప్ప పాటులకాలము దీపములు వెలుఁగునో, యన్నివత్సరము లాదీపదాత బలశాలియు రూపవంతుఁడునై వెలయును" అని తెలుప విని యుధిష్ఠిరుఁ డిట్లనియె.

"ఓపితామహా! మందబుద్ధులై యెవ్వరు బ్రాహ్మణధనముల నపహరింతురో, క్రూరకర్ములును మూఢులునగు నట్టివా రెట్టిలోకములకుఁ బోవుదురు?"

అది విని భీష్ముఁడు "ఓధర్మజా నీవడిగినప్రశ్నమున కుత్తరముగా నొకపురాతనేతిహాసము గలదు. అయ్యది యొకరాజునకును జండాలునకును జరగినసంవాదము. దాని నెఱిఁగించెదను వినుము. ఒకపు డొకరాజన్యుఁ డొక చండాలునిఁ గాంచి, 'ఓరీ! నీవు ముదుసలివాఁడవయ్యు బాలునివలె నేల ప్రవర్తించెదు? కుక్కలను గాడిదలనుగూడి తిరుగుచు గోవులయెడ నుద్వేగమొందెదవేల? చండాలునకుఁ బండితులగువారు గర్హితకర్మమునే విధించియున్నారు గదా! బ్రాహ్మణగోక్షీర బిందువ్యాప్తమగు నుదకకుండమున నీవు స్నానము

చేయు దేటికి?' అని ప్రశ్నించెను. అది విని చండాలుఁడు 'ఓరాజా! ఒకబ్రాహ్మణుని గోవులు త్రోవఁ బోవుచుండఁగా, వానిపరాగ మాత్రోవనున్న సోమలతపైఁబడి దానిని జెఱిచెను. దానిని గొందఱు బ్రాహ్మణులు త్రావిరి. మఱియు నొకయజ్ఞమున దానిని రాజభృత్యులును బానముచేసి నశించిరి. ఆరాజును దానినిఁ ద్రావి నరకమొందెను. ఆక్షీరబిందువులు గలిసినపరాగము వడిన యీసోమ లతను ద్రావిన యాజకులును నరకగతులైరి. మఱియు నాయజ్ఞ మున దధిఘృతక్షీరములఁ ద్రావినబ్రాహ్మణులును రాజులును నరక మునకుఁ బోయిరి. మఱియు నాగోవులు తమపాలుద్రావిన పరుల పుత్రపౌత్రాదులను బశువులను క్షీణాయువులఁగాఁ జేసెను. అపుడు నేనచ్చోట నొకజితేంద్రియుఁడనగు బ్రహ్మచారినై యుంటిని. ఆగో వుల క్షీరబిందువులచే నాభైక్ష్యము వ్యాప్తమయ్యెను. ఆభైక్ష్య మును దిని నేను జండాలుఁడ నైతిని. ఓరాజా! బ్రాహ్మణధనము గలిసి యారాజునైతము దుస్థితినొందెను. కావున బ్రాహ్మణధనము నెవ్వఁడు నపహరింపరాదు. అంతియగాక, దానినిఁ గాంచుటగాని, యనుమోదించుటగాని, యుక్తముగాదు. బ్రాహ్మణగోరజోధ్వస్తమైన ధనముచే నే నెట్లైతినో చూచితే? కావునఁ దెలిసినవాఁడు సోమ విక్రయమును జేయరాదు. ఈసోమము బ్రాహ్మణుల కుత్తమధనము. కావున సోమవిక్రయమును బండితులు నిందించుచున్నారు. ఎవ్వ రీసోమము నమ్ముదురో, యెవ్వరు గొందురో, వారెల్ల వైవస్వతలోక మునకుఁ బోయి నరకదుఃఖములపాలగుచున్నారు. బ్రాహ్మణగోరజో వ్యాప్తమైన సోమమును విధిపూర్వకముగా విక్రయించిన శ్రోత్రి యుఁడు వృద్ధిజీవనుఁడై చిరకాల ముండక నశించును. మఱియు నట్టి వాఁడు మూఁడువందలనరకములను బొంది తనమలమును దిని జీవిం చును. బ్రాహ్మణధనాపహర్త పెక్కునరకయాతనలఁ బొంది, మలము లలో నొకపురుగై కుక్కమలముచే జీవించువాఁ డగుచున్నాఁడు. నీచ సేవను, బ్రాహ్మణధనాపహారము మిత్రదారవిప్లవమును నొకతులయం దుంచునపుడు బ్రహ్మస్వహరణమే హెచ్చగుచున్నది. దానివలన, నే నెట్లు వికలుఁడను, వివర్ణుఁడను నైతినో చూచితే? బ్రాహ్మణధనాప హారమువలననే, నేనిట్టిపాపగతి నొందితిని. నేనొకధనికుఁడగు నుత్త

మునివంశమునఁబుట్టి, జ్ఞానవిజ్ఞానపారగుఁడనయ్యు నీజన్మమున నిట్టి లైతిని. ఆమునుపటిపుట్టువున నిట్టివి దోషములని తెలిసియు, గర్వముచే నుద్రిక్తుఁడనై వాహనయోగ్యములగు వానిమాంసముల భక్షించితిని. అది యెల్లవారికిఁ దెలియుట నొకవనమునుండి వేఱొకవనమునకుఁ బోవుచు, దూరగతుఁడనై విప్రులను సజ్జనులను బరాభవించుచు, గర్వించి తుద కిట్టిదురవస్థ నొందితిని. కాలవిపర్యయ మెట్టులుండెనో చూడుము. స్వాధ్యాయములచే నెట్టిమహత్తరపాపము నేని గృహస్థులు పోఁగొట్టుకొనుచున్నారు. అటులే నానావిధములగు దానములచేఁ బాపశాంతి యగుననియుఁ బండితులు తెలుపుదురు. అటులే యాశ్రమస్థుని, సర్వసంగవినిర్ముక్తునిఁగాఁజేసి, వేదములు తరింపఁజేయుచున్నవి. ఓక్షత్రియోత్తమా! నేను పాపయోనియందు జనించితిని. దీని నెట్లు తప్పించుకొనఁ గలనో తెలియకున్నవాఁడను. దేనిచే నే నీ పాపయోనినుండి విముక్తుఁడ నగుదునో, యట్టిపూర్వజన్మస్మృతియును గలదు. ప్రసన్నుఁడనగు నాకీనీసంశయమును దొలఁగింపుము. నేనెటు లీచండాలత్వమునుండి విముక్తుఁడ నగుదును? తెలుపుము’ అని ప్రశ్నించెను. అది విని యారాజన్యుఁడు, ‘ఓచండాలా! నీవు విముక్తి నొందఁ దలంతువేని, బ్రాహ్మణులనిమిత్తముగాఁ బ్రాణములఁ బరిత్యజింతునని ప్రతిజ్ఞచేయుము. అటులే నిష్టగతి నొందగలవు. బ్రాహ్మణునకుఁగా రణాగ్నిలో నీశరీరమును మాంసాహారుల కొసంగుదేని విముక్తినొందుదువుగాని వేఱొకవిధముగా నీకు మోక్షము గలుగ నేరదు.’ అని పలికెను.

ఓయుధిష్ఠిరా! బ్రాహ్మణధనము విషయమున నిట్లు తెలుపఁబడి, యాచండాలుఁడు రణముఖమునఁ బ్రాణములవిడిచి యిష్టగతినొందెను. కావున నోభరతకులోత్తమా! నీవు బ్రాహ్మణధనమును జాగరూకత మెయి రక్షింపుము. అటు లొనర్చితివేని శాశ్వతమగు నుత్తమగతి నొందఁగలవు” అని తెలుప విని యుధిష్ఠిరుఁ డిట్లనియె.

### శక్రగౌతమసంవాదము

“ఓపితామహా! పుణ్యాత్ములగువారికి స్వర్గమున ననుభవింపఁ దగినపుణ్యప్రదేశ మొక్కటియా లేక, యందుఁ బ్రదేశనానాత్వము గలదా? తెలుపుము.”

అది విని శాంతనవుఁడు, "ఓకౌంతేయాగ్రజా! మానవులు తామొనర్చినకర్మములనుబట్టి పలువిధములగులోకముల నొందుదురు. పుణ్యములు చేసినవారు పుణ్యలోకములను, పాపములొనర్చినవారు పాపలోకములను బడయుచున్నారు. దీని కుదాహరణముగా నొక పురాతనేతిహాసము గలదు. అయ్యది యింద్రునకును గౌతమునకును జరగినసంవాదము. దాని నెఱిఁగించెదను వినుము. ఒకపుడు గౌతముఁ డను నొకబ్రాహ్మణుఁ డుండెను. అతఁడు మృదుస్వభావుఁడును, దాంతుఁడును, జితేంద్రియుఁడును నై వెలయుచు, నొకపు డొకమహా వనమునఁ దల్లి లేనిగజశిశువును గాంచి జాలిపడి, ధృతవ్రతుఁడై దానినిఁ బోషించెను. అటు లది పెనుపంబడి కొంతకాలమున కెంతయు గొప్ప బలముగలిగి వెలయఁజొచ్చెను. అది మఱియు, మదించి మహానాగమై పర్వతమునాఁ దగి యొప్పుచుండుటయు, నింద్రుఁడు ధృతరాష్ట్రుఁడను పేరుగల యొకరాజురూపమూనివచ్చి యామత్తగజమును దీసికొని పోఁదొడంగెను. అటు లింద్రునిచేఁ దీసికొనిపోఁబడుచున్న తనమద గజము నారసి యాగౌతముఁ డాధృతరాష్ట్రునితో 'ఓరాజా! ఈ యేన్గును బుత్రునివలెఁ బెంచితిని. ఓయకృతజ్ఞా! దీని నపహరింపకుము. సజ్జనులతోడి మైత్రి సాప్తపదమని తెలుపుదురు. ఓరాజా! మిత్ర ద్రోహము నిన్ను స్పృశింపకుండుఁగాక. ఈమహాగజము నేను లేనపుడు నాయాశ్రమమును రక్షించుచు, నాకిధ్మములను జలములను నందిచ్చుచు, నాచార్యులయెడ వినయముగలిగి, గురుకర్మముల నియుక్తమగుచు, నుత్తమమై దాంతమై కృతజ్ఞతగలిగి, నాకెల్లపుడుఁ బ్రియమై ప్రవర్తించుచున్నది. నేనిటులు మొఱపెట్టుచుండఁగా నా యీయేన్గు నపహరింపఁ దగవుగాదు.' అని పలికెను. అది విని యా ధృతరాష్ట్రుఁ డిట్లనియె.

ధృతరా:—ఓమహర్షివర్యా! నీకు వేయిగోవులను, శతసంఖ్యాకమగుదాసీజనమును, నైదువందలనిష్కములను, మఱియు వివిధములగువిత్తములను సమర్పించెదను. బ్రాహ్మణుఁడవగు నీ కీయేన్గుతోఁ బ్రయోజన మేమి?

గౌత:—ఓరాజా! నీగోవులను, నీదాసులను, నీనిష్కములను, నీవివిధరత్నములను, నీవిత్తమును నీవే యుంచికొనుము బ్రాహ్మణుఁడ నగు నా కీధనాదులతోఁ బనియేమి?

ధృతరా:—ఓవిప్రోత్తమా! గజసమూహములు రాజులకే వల యునుగాని, బ్రాహ్మణుల కవి యేల? క్షత్త్రియుఁడనగు నాకు వాహన మగు నీనాగశ్రేష్ఠము నపహరించునాకు దోషములేదు. నీ వీయేన్గుపై నాశవిడిచికొనుము.

గౌత:—పుణ్యకర్ముఁడు మృతినొంది యెందు సంతోషించుచు నుండునో, పాపకర్ముఁడు మృతుఁడై యెందు దుఃఖించుచుండునో, యట్టి యమలోకమున నీయేన్గు నపహరించిన నీవలనఁ బ్రతిఫలము స్వీక రింతును.

ధృతరా:—ఓవిప్రవర్యా! ఎవ్వరు సత్కర్మహీనులును, నాస్తికు లును, శ్రద్ధారహితులును, పాపులును, నింద్రియార్థపరాయణులును నై ప్రవర్తిల్లుదురో, యట్టివారే యమయాతన నొందుదురు. కాని, యుత్తమ లోకము నొందఁదగు నీధృతరాష్ట్రుఁ డందులకుఁ బోఁడని నమ్ముము.

గౌతమ:—ఎందు సత్యమును, నసత్యమును బలుకఁబడకుండునో, మఱియు నెందు బలవంతులై బలహీనులను బాధింతురో యట్టి యమలోకము నీకుఁ గలుగకమానదు. అటులగుట నందు, నాయేన్గు నకుఁ బ్రతిఫలము నీవలనఁ బరిగ్రహింతును.

ధృతరా:—ఓబ్రాహ్మణోత్తమా! పెద్దదాఁడుతోఁబుట్టువును, దల్లినిదండ్రిని, మదమత్తులై యెవ్వరు శత్రునట్లు పరికింతురో, యట్టి వారి కాయమలోకమగునుగాని, యుత్తమలోకమున కేఁగు నే నందుల కేఁగువాఁడనుగాను.

గౌతమ:—ఓరాజా! భోగిజనప్రవేశ్యయు గంధర్వులకును, యక్షులకును, నప్సరసలకును ననుభవింపఁదగినదియు, మహాభాగయు నగు నావైశ్రవణుని మందాకిని యెందుండునో, యట్టిలోకమున నాయేన్గు ప్రతిఫలము నీవలనఁ బరిగ్రహింతును.

ధృతరా:—ఓమహర్షి! అతిథివ్రతులును, సువ్రతులును, బ్రాహ్మ ణుల కాశ్రయమిచ్చువారును, శిష్టాహారులును, శ్రితులకుఁ బంచి యిచ్చువారును మందాకిని నలంకరింతురుగదా!

గౌతమ:—ఓరాజా! మేర్వగ్రమున రమ్యమై సుపుష్పితమై కిన్నరీగానఘూర్ణితమై యేవనము వెలయునో, మఱియు నెందు విశాలములై జంబూవృక్షములు చూడనొప్పునో, యట్టిచోట నీవలన నాహస్తికిఁ బ్రతిఫలమును బరిగ్రహింతును.

ధృతరా:—ఓగౌతమా! మృదుస్వభావులును, సత్యవంతులును, బహుశ్రుతులును, సకలభూతహితులును, సేతిహాసపురాణాధ్యేతలును, బ్రాహ్మణులకు మధ్వాహుతిచే నాతిథ్య మిచ్చువారునగు బ్రాహ్మణులకు నీవు దెలిపినలోకమగును. ఉత్తమలోకమున కేఁగు నేనందులకుఁ బోను, నీకింకను దెలిసినచో ఱేదేని గలదేని దెలుపుము. ఇదె నేను వడిగాఁ బోవుచున్నాఁడను.

గౌతమ:—ఓరాజా! సుపుష్పితమై కిన్నరసేవితమై నారదునకుఁ బ్రియమై గంధర్వాప్సరోగణప్రియతమమై నందనవన మెందుఁగలదో, యట్టిలోకమున నీవలన నాగజప్రతిఫలమును దీసికొనెదను.

ధృతరా:—ఓవిప్రా! ఎవ్వరు నృత్యగీతకుశలులై యొకని యాచింపక, స్వేచ్ఛగా నందఱు గలిసి చరింతురో, యట్టివారి కీవు తెలిపిన లోకమగును. పరమపదమునకుఁ బాత్రుఁడనగు నేనందులకుఁ బోను.

గౌతమ:—ఓనరేంద్రా! ఎం దుత్తరకురువులు దేవతలతోఁ గూడి మోదమానమానసులై యుందురో, యగ్నియోనిజాతులును, జలయోని, పర్వతయోనిజాతులును వెలయుచుందురో, మఱియు నెందు శక్రుఁడు సకలకామములను వర్షించునో, యెందు స్త్రీలు కామచారిణులై వెలయుదురో, యెచ్చోఁ స్త్రీపురుషు లసూయ వహింపకుందురో, యట్టిలోకమున నాయేన్గును నీవు తీసికొన్నందులకుఁ బ్రతిఫలము పుచ్చికొనెదను.

ధృతరా:—ఓగౌతమా! ఎవ్వరు సర్వభూతనివృత్తకాములై మాంసాశనులుగాక, న్యస్తదండులై చరించుచు, స్థావరజంగమములందు నేనిని హింసింపక, సర్వభూతముల కాత్మభూతులై నిష్కాములును, నిరహంకారులును, వీతరాగులును, తుల్యలాభాలాభులును, తుల్యనిందాస్తుతులు నై వర్తింతురో, వారికి నీవు తెలిపినలోకమగును. పరమునొందునట్టి యీధృతరాష్ట్రుఁ డందులకుఁ బోఁడు.

గౌతము:—ఓరాజా ! నా తెలిపినలోకములనుమించి, సనాతన ములై పుణ్యగంధములును, సత్వప్రధానములును, నిశ్శోకములును నై నూదిత్యునకుఁ బదమగుచోటుల నాహాస్తిఋణము తీర్పించికొందును.

ధృతరా:—ఓబ్రాహ్మణోత్తమా ! ఎవ్వరు దానశీలురై ప్రతి గ్రహముసేయక, పరులయర్థములం దాసగొలుపక, పాత్రులకు లేదనక యొసంగుచు, నెల్లవారి కాతిథ్యము నిచ్చుచుఁ, బ్రసన్నహృదయులై గాంతిపరులై జల్పము లాడక సతతపుణ్యశీలు లగుదురో, వారి కిట్టి లోకములగును. పరమునొందు నే నందులకుఁ బోను.

గౌతము:—ఓరాజా ! అటులే మఱికొన్నిలోకములు వెలయు చున్నవి. అయ్యవి సనాతనములై తమోరహితములై వెలయును. అట్టి చోట నీవలన హాస్తిఋణము తీర్చించికొనఁగలను.

ధృతరా:—ఓవిప్రా ! స్వాధ్యాయశీలురును, గురుశుశ్రూషా రతులును, దపస్వులును, సువ్రతులును, సత్యసంధులును, నాచార్యాను వర్తనులును, నిత్యోత్థితులును, గురుకర్మప్రియులును నగువారి కీవు తెలిపినలోక మగుచున్నది. మఱియు విశుద్ధభావులును, వాఙ్మియమ విధులును, సత్యవ్రతులును, వేదవిదులును, మహాత్ములు నగువారి లోకము నందుదురు. కాని నేను బరమునొందువాఁడనై యట్టిలోక ములకుఁ బోను.

గౌతము:—ఓరాజా! మఱియు సనాతనములును, బుణ్యగంధ ములును, విశోకములునగు లోకములు గలవు. అట్టి వరుణరాజసదన మున నీవలన హాస్తిఋణముఁ దీర్పించికొందును.

ధృతరాష్ట్రుఁడు:—ఎవరు చాతుర్మాస్యము లొనర్తురో, యెవ్వ రిష్టు లనేకములుగా సాగింతురో, యెవ్వరు శ్రద్ధాపరులై వేదోక్త ముగా మూఁడువత్సరము లగ్నిహోత్రముల హోమముల నారాధిం తురో మఱియు నెవ్వరు స్వదారనిరతులును, నిజకర్మరతులును నై వర్తింతురో వారు నీవు తెలిపినయుత్తమగతి నొందుదురు. నేను బరమగతి నొందుదును గాని నీవు తెలిపిన చోటికి బోను.

గౌతము:—ఓరాజా! మఱియు మానవులకుఁ గోరఁదగి, దురత్యయములై నిశ్శోకములైన యింద్రలోకములు గలవు అట్టిభవన

మున భూరితేజుఁడవై యున్న నీవలన నాహాస్తిసంబంధమగు ప్రతిఫల మును బరిగ్రహింతును.

ధృతరా:—నూఱేండ్లు బ్రతికినవాఁడును, శూరుఁడును, వేదాధ్యయనపరుఁడును, నప్రమత్తుఁడగుయజ్వయు నింద్రలోకము నొందుదురు. ఈధృతరాష్ట్రుఁడు పరమపద మొందునుగాని యందులకుఁబోఁడు.

గౌతమ:—ఓరాజా! నాకప్పృష్ఠమునఁ బుష్కలములై వీతశోకములై మహత్తరములైన ప్రాజాపత్యలోకములు గలవు. అవి సకలలోకములవారికిని గోరఁదగియుండును. అందు నీవు పడినబుణము తీర్చికొందును.

ధృతరా:—రాజసూయాభిషిక్తులును, ధర్మాత్ములును, బ్రజారక్షకులును, నశ్వమేధావభృథస్నాతాంగులునునగు రాజుల కీవు తెలిపిన లోకములగును. కాని యీధృతరాష్ట్రుఁ డందులకుఁ బోఁడు.

గౌతమ:—వానినిమించిన సుపుణ్యగంధములును, సనాతనములును, దుఃఖరహితములును, నుత్తమలోకములు గలవు. దుర్లభము దుర్ధర్షమునగునట్టి గోలోకమున, నీవలన హస్తిబుణము నీగికొందును.

ధృతరా:—ఎవ్వరు తమకు వేయిగోవులున్నపు డొకవంద గోవులను, నూఱుగోవులున్నపుడు పదింటిని, బదిగాని యైదుగాని గోవులున్నపు డొక్కదానిని దానము సేయుదురో, మఱియు నెవ్వరు బ్రహ్మచర్యముచేఁ గృశింతురో, యెవ్వరు వేదమును రక్షింతురో, యెవ్వరు తీర్థయాత్రాపరాయణులగుదురో, యట్టివా రాగోలోకమున వసింతురు. మఱియు నెవరు ప్రభాసము, మానసతీర్థము, పుష్కరములు, మహాసరము, నైమిశతీర్థము, బాహుదయు, గంగయు, గయశిరస్సు, విపాశ, కృష్ణ, పంచనదము, మహాహ్రదము, గోమతి, కౌశికి, పంప, సరస్వతి, దృషద్వతి, యమున మున్నగునదులందు ధృతవ్రతులై స్నానము సేయఁ బోవుదురో, యట్టివారు దివ్యస్థితిగలిగి దివ్యమాల్యధరులును, దివ్యగంధాఢ్యులు నై నీవు తెలిపినలోకములందుఁ జరింతురు. ఈధృతరాష్ట్రుఁ డందులకుఁ బోఁడు.

గౌతమ:—ఎందుచుకేని చలినుండియు, వేఁడిమినుండియు, భయము గలుగకుండునో మఱియు నాఁకలిదప్పులును, నాయాసమును, సుఖదుఃఖములును గలుగవో, యెందు ద్వేష్యుఁడును, బ్రియు

డును, మిత్రుఁడును, శత్రుఁడును, జరామరణములును, పుణ్యపాపములును గలుగవో, ప్రజ్ఞాసత్త్వవ్యవస్థితమైనట్టియు, రజోరహితమైనట్టియుఁ బవిత్రమైనట్టియు, నప్పరమేష్ఠిస్థానమున నీవలన నాహస్తిఋణము తీర్చికొనఁగలను.

ధృతరా:—ఎవ్వరు సకలసంగనిర్ముక్తులై కృతాత్ములై యతవ్రతులై, యధ్యాత్మయోగనిష్ఠులై స్వర్గగతి కర్హులగుదురో, యట్టి సాత్త్వికులా పరమేష్ఠిస్థానమును బడయుచున్నారు. ఓమహామునీ! అందీధృతరాష్ట్రుఁడు నీకుఁ గానరాఁడు గాదే!

గౌతమ:—ఎందు రథంతరబృహదాదులు గానము చేయఁబడునో, యెందుఁ బుండరీకములచే వేదిక యావరింపఁబడియుండునో, సోమపానమొనర్చినవాఁ డెందు శతక్రతువు మున్నగువారిని గూడి వెలయునో, యట్టిచోట నాహస్తికిఁ బ్రతిఫలము నీవలనఁ బరిగ్రహింతును. నిన్ను నే నింద్రునిఁగాఁ దెలియుదును. నీవు నేనొక మాటచేఁగాని, మానసముచేఁగాని తప్పొనర్పలేదు.

శతక్రతుఁడు:—నేనింద్రుఁడను. గజవాదమునుఁబట్టి ప్రజల లోకవృత్త మెఱిఁగితిని. ఇఁక నీవు ప్రణతుఁడనగు నన్నేమియు శిక్షింపకుము. నీవేమి తెలుపుదువో దానినెల్లఁ జేయుచున్నాఁడను.

గౌతమ:—ఓరాజా! నాకుఁ బుత్రునివలెఁ బ్రియమై యఱువదివత్సలములుగలిగి వనముననున్న నాకు సహాయమగుచుఁ దెల్లనై వెలయు నా యీయేన్గునే నాకిమ్ము.

శతక్రతు:—ఓబ్రాహ్మణోత్తమా! నీకుఁ బుత్రుఁడనఁదగు నీ గజము నిన్నెంతయుఁ గాంచుచు మూర్కొనుచున్నది. మఱియుఁ దనతొండముచే నీపాదములను స్పృశించుచున్నది. నీకు నమస్కారము. నాకు శ్రేయము గల్గింపుము.

గౌతమ:—ఓసురేంద్రా! నీకెల్లపుడును శుభమగుఁగాక. నీకు శుభమగునట్లు ధ్యానించుచున్నాఁడను. నిన్నెల్లపుడును బూజింతును. నీవును నాకు శుభముల నొసంగుము. నీ వీయేన్గు నొసంగుదేని పరిగ్రహించెదను.

శతక్రతు:—మహాత్ములును, బండితులును, సత్యవంతులును నగు నెవ్వరిబుద్ధులందు వేదములు వెలయుచుండునో, యట్టివారిలో

నీవొక్కఁడవే నన్నుఁ దెలిసికొంటివి. కావున నీయెడ నాకుఁ బ్రీతి గల్గెడిని. ఓ బ్రాహ్మణోత్తమా! పుత్రుఁడనఁదగు నీయేన్గుతో నీవు వడిగా రమ్ము. శుభలోకములనెల్ల వడిగాఁ బడసి చిరకాల మనుభవింతువు గాక' అని పలికెను.

ఓయుధిష్ఠిరా! ఆయింద్రుఁ డట్లు పలికి, యాయేన్గుతోఁ గూడ నాగౌతముని, సజ్జనులకేని దురాసదమగు స్వర్గమునకుఁ దీసికొని పోయెను. జితేంద్రియుఁడగు నెవ్వఁడు దీనిని వినునో, పఠించునో, వాఁడు గౌతమునట్లు బ్రహ్మలోకమును బొందుచున్నాఁడు." అని తెలుప విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె.

## బ్రహ్మభగీరథసంవాదము

"ఓపితామహా! దానము బహువిధాకారమై యున్నది. అటులే శాంతి, సత్యము, అహింస, స్వదారతుష్టియుఁ దెలుపఁబడినవి. దానఫలముఁ దెలిపితివి. ఇఁకఁ దపమును మించిన దేదియేని గలదా? తెలుప వినఁగోరుచున్నాఁడను."

అది విని భీష్ముఁడు "ఓయుధిష్ఠిరా! తపస్సు నశించుసంతకును భోగ్యప్రదేశస్థితి గలుగుచున్నది. నిరశనరూపమగు తపమునుమించిన దేదియును లేదని నాయభిప్రాయము. ఇందుల కుదాహరణమగు పురాతనేతిహాస మొకటి గలదు. అయ్యది భగీరథునకును, మహాత్ముఁడగు పరమేష్ఠికిని జరగినసంవాదము. దాని నెఱిఁగించెదను వినుము. ఆభగీరథుఁడు సురలోకమును, గోలోకమును, మహర్షిలోకమును నతిక్రమించి పరమేష్ఠిలోకమునకుఁ బోయెనని వినికి. అటులు బ్రహ్మలోకమును జేరిన యాభగీరథునిఁ గాంచి, పరమేష్ఠి 'ఓరాజా! భగీరథా! సామాన్యులకు సాధ్యముగాని యీయుత్తమలోకమున కీవెట్లు రాఁగలిగితివి? ఓయీ! తపమొనర్ప దేవతలును, గంధర్వులును, మానవులును నిందులకు రాఁజాలకున్నవారుగదా! నీవెట్లు వచ్చితివి?' అని ప్రశ్నించెను.

అది విని భగీరథుఁడు 'ఓదేవా! దేవతలకును, వేలకొలఁది బ్రాహ్మణులకును నిశ్శంకముగా నన్నము బెట్టించితిని. నిత్యము బ్రాహ్మవ్రతమును బూనితిని. కాని తత్ఫలమువలన నే నిందులకు రాలేదు,

మఱియు నేకరాత్రక్రతువులను బదింటిని, బంచరాత్రములను బదింటిని, నేకాదశరాత్రములను బదునొకంటిని, జ్యోతిష్టోమములు నూఱిటిని గావించితిని. అయినను దత్ఫలమువలన నే నిచ్చోటికి రాలేదు. మఱియు జాహ్నవీతీరమున నిత్యము నివసించి నూఱుసంవత్సరములు తపమొనర్చితిని. అటులే యశ్వతరీసహస్రమును, నారీసహస్రమును దానముచేసితిని తత్కాలమున నే నిందులకు రాలేదు. అటులే పదియయుతములు గుఱ్ఱములను, నిరువదయుతములు గోవులను, బుష్కర సమయములందు వందలకొలందిని వేలకొలందిని బ్రాహ్మణుల కిచ్చితిని. మఱియు సువర్ణభూషణవిశేషణధారిణులగు వేవురుకన్నియలను దానముచేసితిని. ఇంకను సువర్ణ భూషణభూషితాంగులగు నలువది వేవురుకన్నియలనిచ్చితిని. కాని, దానిచే నా కీలోకము ప్రాప్తింపలేదు. ఓలోకనాథా! గోసవయాగములం దొక్కొక బ్రాహ్మణునకుఁ బదిపది చొప్పునఁ బదియర్బుదములు గోవులను దానముచేసితిని మఱియు సవత్సరములును, బయస్సమన్వితములును, సువర్ణకాంస్యపాత్రలకొలఁది పాలిచ్చునట్టివియునగు గోవులఁ బెక్కింటి నొసంగితి. కాని, వానిచే నే నిందులకు రాలేదు. ఇంకను సోమయాగములందుఁ బదేసిగోవుల నిచ్చితిని. రోహితవర్ణములై ప్రతివత్సరముఁ బ్రసవించునట్టి పాలుగల యావులను వందలకొలంది దానమొనర్చితిని సువర్ణమాలికలు గలిగి, బాహ్లికదేశజములగు తెల్లనిగుఱ్ఱములఁ బదియయుతములను దానము చేసితిని. కాని, తత్ఫలముచే నిందులకు రాలేదు మఱియు నొక్కొక క్రతువునఁ బ్రతిదినమునను బదియు నెనిమిదికోట్ల సువర్ణముద్రికల నొసంగితిని. అయినను, దత్ఫలముచే నేనిందులకు రాలేదు. మఱియు శ్యామకర్ణములును, హరితవర్ణములునై సువర్ణమాలికలుగల గుఱ్ఱములను బదునేడుకోటుల బ్రాహ్మణుల కొసంగితిని. మఱియుఁ బని చేయ సమర్థమైనవియు, గొప్పమేనుగలవియు, సువర్ణస్రగ్విభూషితములును, బద్మచిహ్నములు గలవియునగు గుఱ్ఱములఁ బదునేడువేల దాన మొనర్చితిని ఓదేవేశా! దివ్యభూషణాలంకృతము లగు సువర్ణ రథములఁ బదివేలను బ్రాహ్మణుల కిచ్చితిని. మఱియు యజ్ఞదక్షిణోపయుక్తములై యలంకృతములగు గుఱ్ఱములచేఁ బూన్పఁబడిన మఱియేడువేల రథములను దానము చేసితిని. వాజపేయములందుఁ

బదివేలగుఱ్ఱముల నొసంగితిని. ఇంకను, యుద్ధజితులై విక్రమవంతులగు క్షత్రియులను, నిష్కంటకులను, వేవుర బ్రాహ్మణులకు యాగదక్షిణగా దానమొనర్చితిని. కాని, వానిచే నేనిందులకు రాలేదు. ఓజగన్నాయకా! గంగాప్రవాహ మెంతవఱకుఁ బ్రవహించుచున్నదో యంతవరకును యాగము లొనర్చి దక్షిణల నిచ్చితినిగాని, దన్నిమిత్తమునను నేనిందులకు రాలేదు. సువర్ణశతభూషితములగు రెండువేలగుఱ్ఱములను, వందగ్రామములను, నొక్కొక తిథియందు బ్రాహ్మణులకర్పించితిని. మఱియుఁ దపస్వినై నియతాహారుఁడనై శాంతిపూని మౌనమువహించి, పెక్కుకాలము గంగకై తపమొనర్చితిని. అమ్మహాదేవునకుఁ బ్రణతుఁడనై యారాధించితిని. కానితత్ఫలముచే నేనిందులకురాలేదు. శమ్యాక్షేపములనెడియాగములచేతను, నయుతములకొలఁది క్రతువులచేతను దేవతలనారాధించితిని. ద్వాదశత్రయోదశాహములగు పౌండరీకములచే దేవతలయజించితిని కాని, దానివలనను నేనిందులకురాలేదు. మూఁపురములుగల తెల్లని యెనిమిదివేలవృషభములను బ్రాహ్మణులకొసంగితిని. ఆవృషభములతోపాటుగాఁ, గాంచనశృంగాన్వితములగు గోవులను సైతము దానముచేసితిని. మఱియు హిరణ్యరత్ననిచయములను, రత్నపర్వతములను, ధనధాన్యసమృద్ధములగు గ్రామములను, వందలకొలందిగను, వేలకొలందిగను దానముచేసితిని. మఱియు ననేకములగు యాగములొనర్చి లక్షగోవులను దానమొనర్చితిని కాని, దానిఫలముచే నేనిందులకు రాలేదు. పదునొకండుదినములును, నిరువదిరెండుదినములును జేయదగినసదక్షిణాకములగు నశ్వమేధములచే దేవతలనారాధించితిని. దానిఫలముచేనైన నేనిందులకు రాలేదు. ఒకయోజనము వెడల్పును, నంతియపొడవునుగలిగి, కాంచనమయములై, నిష్కంటకములై, రత్నవిభూషితములైన చూతవృక్షముల వనము దానముచేసితిని. కాని తత్ఫల మిందులకు నన్నుఁ దీసికొని రాలేదు. మఱియు శాంతిధనుఁడనై తురాయణ మనెడివ్రతమును ముప్పదేండ్లు చేసితిని. ప్రదినమును దొమ్మిదివందలగోదానము లొనర్చితిని. మఱియుఁ బాలుగలగోవులను, నటులే వృషభములను వందలకొలంది, నిత్యము బ్రాహ్మణుల కర్పించితిని. కాని వానిఫలముచేనైనను నేనిందులకు రాలేదు. ఓదేవా! ముప్పదియగ్నిచయనము

లను యజించితిని. ఎనిమిదిసర్వమేధములను, నేడునరమేధములను, బదివిశ్వజిద్యాగములను జేసి దేవతల నారాధించితిని కాని, వాని ఫలమువలన నే నిందులకు రాలేదు. సరయూ, బాహుదా, గంగా, నైమిశాదిపుణ్యప్రదేశముల శతాయుతము లగుగోవులను విప్రుల కిచ్చితిని. కాని, వానిఫలముచే నే నిందులకు రాలేదు. ఓహుహోత్తా! దేని నింద్రుఁడు రహస్యముగా నుంచిన భార్గవుఁడు తనతపముచేఁ దెలిసికొనిగెనో, యట్టి సర్వభోగత్యాగాత్మకమై బ్రాహ్మణతర్పణమైన కృత్యమును సాధించితిని. అట్టికృత్యము సాధింపఁబడినతోడనే బ్రాహ్మణులు సంతుష్టులైరి. అటులు సంతుష్టినొందిన యమ్మహర్షులు బ్రహ్మలోకమునకుఁ బొమ్మని నన్నుద్దేశించి పలికిరి. ఆబ్రాహ్మణసహస్రము సంతుష్టమై నటులు పలుకుటయు నే నిందులకు వచ్చితిని. ఇందు సందియము లేదు. కావున వైరాగ్యరూపమైనతపమును మించినతపము వేఱొకటి లేదని నాయభిప్రాయము' అని భగీరథుఁడు తెలిపెను.

ఓయుధిష్ఠిరా! ఇట్లు పలికిన యాభగీరథు నప్పరమేష్ఠి విధ్యుక్తముగాఁ బూజించెను. కావున నీవును నా యీ తెలిపిన నిరశనవ్రతమూని, నిత్యము విప్రులను బూజింపుము. బ్రాహ్మణులవచనములచే నిహాపరఫలములు రెండును సిద్ధించుచున్నవి. అన్నవస్త్రములచేతను, గోగృహాదిదానములచేతను, సంరక్షణములచేతను బ్రాహ్మణులు సంతసింపఁజేయఁదగియున్నవారు. ఇదియే పరమరహస్యము. లోభములేక దీని నాచరింపుము.'' అని తెలుప విని యుధిష్ఠిరుఁ డిట్లనియె.

## ఆయుష్యాఖ్యానము

''ఓపితామహా! లోకమున మానవుఁడు, శతాయువుగను, శతవీర్యుఁడుగను జెప్పఁబడియెను గదా! కొందఱు బాలురుగా మృతినొందుటకు నిమిత్తమేమి? మానవుఁ డల్పాయువయ్యె నెటులా యుష్మంతుఁడు కానోపును? అటులే యశ మెట్లానఁ గలుగును? సిరి యెట్లు గలుగును? తపము, బ్రహ్మచర్యము, జపము, హోమము, ఔషధములు, మనోవాక్కర్మములు అను వానిలో దేనిచే నాయడిగినవి సిద్ధించునో తెలుపుము.''

అది విని శాంతనవుఁ డాకౌంతేయునితో ''ఓధర్మజా! అల్పాయువగుమానవుఁడు దీర్ఘాయు వెట్లగునో తెలిపెద వినుము. మఱియుఁ

కీర్తియు, సిరియు నెటులు సిద్ధించునో, యెటులు ప్రవర్తించిన శ్రేయ మగునో యెఱింగించెదను. సజ్జనులు ప్రవర్తించినమార్గము ననుసరించి చరింపవలయును. దానిచే నాయువు సిరియుఁ గల్గుచున్నవి. దానివల ననే కీర్తియు లభించును. దురాచారుఁడగుపురుషున కాయువు నిలువదు. అట్టివానినుండి భూతములు జడియును. వాని నవిపరిభవించును. కావున శ్రేయముఁ గనవలయువాఁడు సదాచారము నాచరింపవలయును. అయ్యది, పాపశరీరుఁడగువాని యపలక్షణమునేని పోఁగొట్టును. ఆచారమూలమే ధర్మము. సుచారిత్రముగలవారు సత్పురుషులు. సత్పురుషు లాచరించినదియే యాచారము. వినికివలననే యది తెలియును. నిజకర్మాచరణశీలుఁడై ధర్మము నాచరించుమానవు నెల్లరును బ్రియునిఁగాఁ బరికింతురు. ఎవ్వరు సత్క్రియాహీనులై నాస్తికత్వమూని, గురుశాస్త్రాతిక్రమణ మొనర్చుచు, ధర్మ మెఱుఁగక దురాచారులై వర్తింతురో, యట్టివారు క్షీణాయుష్కులై చెడుదురు. ఎవరు శీలహీనులై మర్యాదదప్పి నిత్యమును, సంకీర్ణమైథునులై వర్తింతురో, వారల్పాయువులగుటయె గాక, నరకమునకుఁ బోవుదురు. సకలలక్షణహీనుఁడయ్యు సదాచారసంపన్నుఁడగువాఁడును, శ్రద్ధాళుఁడును, ననసూయారహితుఁడును దీర్ఘాయువులగుదురు. మఱియు నక్రోధనుఁడును, సత్యవాదియు, నహింసకుఁడును, నీర్ష్య లేనివాఁడును, ఋజుబుద్ధియు నూఱేండ్లు జీవించును. ప్రయోజనము లేక లోష్టమర్దనము, తృణచ్ఛేదనము, నఖఖాదనము చేయువాఁడును, నిత్యోచ్ఛిష్టుఁడును, నస్థిరచిత్తుఁడును, నల్పాయువు లగుచున్నారు. బ్రాహ్మముహూర్తమున మేలుకని ధర్మార్థములను జింతింపవలయును. ప్రతిదినము ప్రాతఃకాలము కృతాంజలియై పూర్వసంధ్యను నటులే యపరసంధ్యను నుపాసింపవలయును. మఱియు నుదయించునపుడును, నస్తమించునపుడును సూర్యునిఁ జూడరాదు. అటులే జలప్రతిబింబితుఁడైనట్టియు, నభోమధ్యగతుఁడైనట్టియు సూర్యునిఁ జూడరాదు. మహర్షులు నిత్యసంధ్యోపాసన చేయుటఁ బట్టియే దీర్ఘాయుష్కు లగుచున్నారు. కావున నెల్లపుడును రెండు సంధ్యలను నుపాసింపవలయును. ఏ బ్రాహ్మణు లిరుసంజల నుపాసింపరో, యట్టివారి నెల్ల ధార్మికుఁడగు రాజు శూద్రకర్ములనుగా నొనర్పవలయును. ఏవర్ణమువారును బరదారాగమన మొనర్పరాదు. ఆయువును

క్షీణింపఁజేయుటలో నిట్టి దేదియును లేదు. కావునఁ బురుషుఁడు పరదారాసంగము నొనర్పరాదు. అట్టిపరదారానిరతులు లా స్త్రీల కెన్ని రోమకూపములుండునో యన్ని వేలేండ్లు నరకదుఃఖముల ననుభవింతురు. తలదువ్వుకొనుట, కాటుకయుంచుకొనుట, దంతధావనము పూర్వాహ్ణముననే కర్తవ్యములు. అటులే దేవతాపూజనమును నపుడే చేయవలయును. పురీషమూత్రములను జూచుటయుఁ, ద్రొక్కుటయుఁ, దగదు. కేవల ప్రాతఃకాలము, కేవలసాయంకాలము, మధ్యాహ్నము త్రోవ నడువరాదు. అటులే తెలియనివారితోడను, శూద్రులతోడను గూడి ప్రయాణము చేయరాదు. బ్రాహ్మణునకు, గోవులకు, రాజునకు, వృద్ధునకు, భారము మోయువానికి, గర్భిణికి, బలహీనునకును ద్రోవ నొసంగవలెను. తనకుఁ దెలిసినవృక్షములకుఁ బ్రదక్షిణ మొనర్పవలయు. సకలచతుష్పదములును గుడివైపుగా నుంచిపోవలయును. మధ్యాహ్నము, మధ్యరాత్రము, అర్ధరాత్రము, ఉభయసంధ్యలు, ఇట్టివేళల నాల్గుత్రోవలు గలిసినచోట నిలువరాదు. ఇతరులు ధరించినవస్త్రమును బాదుకలును, వాడుక చేయరాదు. నిత్యము బ్రహ్మచారియై యుండవలయును. పాదముచేఁ బాదమును ద్రొక్కరాదు. అన్ని పక్షములందును, నమావాస్య, పౌర్ణమి, చతుర్దశి, అష్టమి అను తిథులయందును బ్రహ్మచర్య మొనర్పవలయును. వ్యర్థముగా మాంసము దినుటయు, వాహనము లగువానిమాంసము దినుటయుఁ గూడదు. అటులే యొకరిని దిట్టుటయు, నొకరితో వివాదము సేయుటయుఁ, గొండెము చెప్పుటయుఁ దగదు. ఒకరిమర్మము నుద్ఘాటింపరాదు. పరుషముగను, నీచముగను బలుకరాదు. దేనిచేఁ నొకఁడు జడియునో, యట్టిదోషయుక్తమును బాపలోకనిమిత్తము నగువచనము పలుకరాదు. ఏయవి మనసునఁదగిలి యొకఁడు రేపవలు దుఃఖించునో, యేయవి యొకనిమర్మముల నొప్పించునో, యట్టిపలుకులాడరాదు. బాణములచేతను, బరశువుచేతను నఱుకఁబడినవన మేని మరలఁ బుట్టును. కాని, మాటచేఁ జెడినమనసు మఱి యంకురింపనేరదు. మేనఁ గ్రుచ్చికొన్న కర్ణి నాళీకనారాచములఁ బెల్లగింపవచ్చును గాని, మనసున నాటినమాటలఁ బెల్లగింప వలనుపడదు. హీనాంగులను, నధికాంగులను, విద్యాహీనులను, నిందితులను, రూపధనరహి

తులను, సత్యహీనులను నిందింపరాదు. మఱియు నాస్తికత్వము, వేదనిందయు, దేవతానిందయు, ద్వేషము, నభిమానము, దీవ్రతయు నుండఁదగదు. కుపితుఁడై యొకని శిక్షించుటయు, శిక్షింపఁ జేయుటయుఁ గూడదు. పుత్రుని, శిష్యునిఁదక్కఁ దక్కినవారిని శిక్షార్థమై కొట్టఁగూడదు. బ్రాహ్మణులతో వివాదము సేయుటయు, నక్షత్రముల నిర్దేశించుటయుఁ గూడదు. మూత్రపురీషముల విడిచియు, వీథిలోనుండి వచ్చియుఁ బాదప్రక్షాళన మొనర్ప వలయును. అటులే స్వాధ్యాయ మొనర్చునపుడును, భోజన సమయమునను బాదములను గడిగికొనవలయును. దేవతలు బ్రాహ్మణులకు, శూద్ర రజస్వలాదులచేఁ జూడఁబడకుండినవియు, జలముచేఁ దడుపఁబడినవియు, సన్నుతింపఁదగినవియునగు మూఁడువస్తువులే పవిత్రములుగాఁ గల్పించిరి. జంతికలు, చక్కిలములు, పులగము, మాంసము, పాయసము అను నీపదార్థములను దనకుఁగా వండికొన రాదు. వానిని దేవతల కర్పింపవలయును. నిత్యము నగ్నిపరిచర్య సేయవలయును. బిచ్చము లేదనరాదు. దంతధావనసంధ్యావందన మలోత్సర్జనసమయములందు మౌనమూనవలయును. సూర్యోదయమైనపిదప నిద్రింపరాదు. అటులు నిద్రించెనేని ప్రాయశ్చిత్తార్హుఁడగును. తలిదండ్రులకంటె ముందుగ లేచి వారికి నమస్కరింపవలయును. లేదేని యాచార్యునకుఁగాని, మఱియొక యుత్తమునకుఁగాని నమస్కరింపవలయును. అటులేని యాయుష్మంతుఁ డగుచున్నాఁడు. వర్జింపఁదగిన దంతకాష్ఠములను వర్జింపవలయును. శాస్త్రోక్తములగు వానినే భక్షింపవలెను. పర్వదినములందు భుజింపరాదు. ఎల్లపుడు నుత్తరాభిముఖముగనే శౌచ మొనర్పవలయును. దైవధ్యానము సేయక దంతధావనము సేయరాదు. గురుని, వృద్ధుని, ధార్మికుని, బండితునిఁదక్కఁ దక్కినవారిని దేవపూజసేయక యెదుర్కొనఁబోవరాదు. బుద్ధిమత్తరులు మలినమగునద్దమును దర్శింపరాదు. తనకు ఋతుమతి యగుట దెలియనికాంతను, గర్భిణియగుకాంతను గలియరాదు. ఉత్తరముగను బశ్చిమముగను దలనుంచి పరుండరాదు. తూర్పుగాఁగాని, దక్షిణముగాఁగాని శిరముంచి నిద్రింపవలయును. భంగములేనట్టియు శిథిలముగానట్టియు శయనమునఁ బరుండవలయును. అటులే యంధ

కారముగలచోటను, స్త్రీలుగలచోటను బరుండరాదు. పాదముచేఁ ద్రొక్కి యాసన మధివసింపరాదు. దిగంబరుఁడై స్నానము సేయుటయు, రాత్రి సేయుటయుఁ దగదు. స్నానముచేసి గాత్రములను గ్రిందినుండి తుడిచికొనరాదు. స్నానము చేయక చందనాదులఁ బూసికొనరాదు. నిత్యము తడిబట్టలను గట్టికొనరాదు. మాలికలను గ్రిందినుండి లాగఁ గూడదు. ముట్టుతతో మాటాడుట తగదు. గ్రామసమీపక్షేత్రమునఁ బురీషము విడువరాదు. మూత్రపురీషముల నుదకములందు విడువరాదు. అన్నము దినుటకుముందు, మూఁడుమాఱు లాచమన మొనర్పవలయును. అన్నము దినినపిమ్మట మూఁడుమాఱు లాచమన మొనర్చి, రెండుమాఱులు మార్జన మొనర్పవలయును. నిత్యముఁ బ్రాఙ్ముఖుఁడై యన్నమును గర్హింపక మౌనముగాని భుజింపవలయును. భుజించినపిమ్మటఁ గొంచెము పరిత్యజింపవలయును. భుజించి చిత్తమున నగ్నిని జింతింపవలయును. ప్రాఙ్ముఖముగా భుజించినచో నాయుష్యమును, దక్షిణాభిముఖుఁడై భుజించినఁ గీర్తియును గలదు. అటులే ప్రత్యఙ్ముఖుఁడై భుజించిన ధన్యతయు, నుదఙ్ముఖముగ భుజించిన సత్యఫలమును బొందనగును. జలముచే నగ్నిని జల్లార్చినపుడు నాసాదిరంధ్రములను మూసికొనవలయును. అటులే సకలగాత్రములను నాభిని బాణితలముల నుపస్పర్శన మొనర్పవలయును. కేశభస్మకపాలికలను, నుముకను ద్రొక్కరాదు. అన్యునిస్నానజలమునకు దూరముగఁ దొలఁగవలయును. శాంతులు హోమము లొనర్పవలయును. సావిత్రములనెడి మంత్రవిశేషములను జపింపవలయును. ఏదేనిఁ గూర్చుండి తినవలయునుగాని, నడుచుచుఁ దినరాదు, నిలువఁబడి మూత్రము విడుచుటయు, భస్మమునందును, గోశాలయందును మూత్రము విడుచుటయుఁ దగనిపనులు. ఆర్ద్రపాదుఁడై భుజించుటయుఁ, బాదములఁ దడి లేకుండఁ దుడిచికొని నిద్రించుటయు నుచితము. పాదములతడి యిగురకుండ భుజించినవాఁడు నూఱేండ్లు జీవించును. అగ్నియు, గోవు, బ్రాహ్మణుఁడు అను నీమూఁడు తేజములను నుచ్ఛిష్టుఁడై స్పృశింపరాదు. అటులు స్పృశింపకుండెనేని యాయువు చెడదు. సూర్యుఁడు, చంద్రుఁడు నక్షత్రములు అనియెడి మూఁడు తేజముల నొకప్పుడును నుచ్ఛిష్టుఁడై చూడరాదు. పెద్దలువచ్చినపుడు పిన్నవానిప్రాణము

లూర్ధ్వముగా వెడలును. అప్పు డాయువకుఁ డావృద్ధునకుఁ బ్రత్యుత్థానాభివాదనము లొనర్చి మరలఁ దనప్రాణముల నిలుపుకొనవలయును. మఱియు వృద్ధులకు నమస్కరించి, తనంతఁదా నాసన మొసఁగి చేతులు మొగిడ్చి, యాతని నాదరింపవలయును. అతఁడు వెడలునప్పు డాతని కంపక మొనర్పవలయు. పగిలినయాసనముపైఁ గూర్చుండఁదగదు. భిన్న కాంస్యమును బరిత్యజింపవలయును. ఒకవస్త్రముతో భుజింపరాదు. దిగంబరుఁడై స్నానమొనర్చుట తగదు. దిగంబరుఁడై నిద్రించుటయు, నుచ్ఛిష్టుఁడై నిద్రించుటయుఁ దగదు. ఉచ్ఛిష్టుఁడై తలనంటరాదు. ప్రాణములన్నియుఁ దదాశ్రయములై యుండును. జుట్టుపట్టుకొనుటయుఁ, దలపైఁ గొట్టుటయుఁ గూడదు. రెండుచేతులతోఁ దలను గోఁకికొనరాదు. మిక్కిలిగా శిరస్స్నానము తగదు. అట్టులే నాయువు చెడదు. తైలములచే శిరస్స్నానము చేసినవాఁ డంగముల నించుకేని ముట్టరాదు. తిలపిష్టమును దినరాదు. అటుల దినకున్నచో నాయువు నశింపదు. ఉచ్ఛిష్టుఁడై యధ్యయన మొనర్చుటయు, నధ్యాపన మొనర్చుటయుఁ దగదు. పూతిగంధముగలవాతమునఁ గూర్చుండి, వేదమునుస్మరింపనైనఁగూడదు. ఈవిషయమున యమోద్గీతములగు గాథలను బెద్దలు తెలుపుచున్నారు. 'ఉచ్ఛిష్టుఁడై యెవ్వఁడు పరువెత్తునో, యెవఁడు స్వాధ్యాయ మొనర్చునో, మఱియు ననధ్యయనదివసముల వేదాధ్యయన మొనర్చునో, యట్టిద్విజుని వేదము నశించుటయేగాక వానియాయువుసైతము నశించుచున్నది. ఎవ్వరు, సూర్యునకును, నగ్నికిని, గోవునకును, బ్రాహ్మణులకును నెదురుగా మూత్రము విడుతురో, వారు క్షీణాయుష్కులగుచున్నారు. అటులే మార్గమధ్యమునను మూత్రము విడువరాదు. మూత్రపురీషోత్సర్జనములను బగలుత్తరముఖముగను, రాత్రి దక్షిణాభిముఖముగను జేయవలయును. అట్టులే నాయువు క్షీణింపదు. చిరకాలము జీవింపఁదలఁచియున్నవాఁడు, కృశత్వ మొందుచున్నబ్రాహ్మణుని, క్షత్త్రియుని, సర్పమును నవమానింపరాదు. సర్పముతోఁగూడ బ్రాహ్మణక్షత్త్రియు లాశీవిషులగుచున్నారు. సర్పము కుపితమగునేని దనకంటఁబడినప్పుడు నశింపఁజేయును. క్షత్త్రియుఁడు కుపితుఁడైనచోఁ దేజముచే దహించుచున్నాఁడు. బ్రాహ్మణుఁడు కుపితుఁ డగునేని ధ్యానముచేతనే తనకుఁ గోపము గల్గించినవానికుల

మును జెలువుచున్నాఁడు. కావున వివేకముగలవాఁడు బ్రాహ్మణ క్షత్త్రియులను, సర్పమును సేవింపవలయును. ఒకపుడును గురునితో వైరము తెచ్చికొనరాదు. ఓయుధిష్ఠిరా! కుపితుఁడైనగురుని బ్రసన్నునిఁగావించుకొని శుశ్రూషింపవలయును. గురువొకపుడు మిథ్యాప్రవర్తన మొనర్చినను, నాతనియెడ లెస్సగనే వర్తింపవలయును. గురునింద, మానవునాయువు నశింపఁజేయుననుటలో సందియము లేదు. మేలుగోరువాఁడు మూత్రోత్సర్జనమును, నుచ్ఛిష్టోత్సర్జనమును, బాదావసేచనమును, గృహమునకు దూరముగనే సేయవలయును. పండితుఁడగువాఁడు శుక్లమాల్యమునే ధరింపవలయునుగాని, రక్తమాల్యమునుధరింపరాదు. కమలము, కలువయుఁదక్కఁ దక్కినరక్తకుసుమములను దలయందు ధరింపవచ్చును. అటులే వనపుష్పమును దలను ధరింపవచ్చును. సువర్ణమాలిక యెన్నఁడును దూష్యముగాదు, స్నానమొనర్చినవానికి నిత్యము నార్ద్రచందన మొసంగవలయును బుద్ధిమంతుఁడగువాఁడు త్తరీయమును, గట్టువస్త్రముగను గట్టుకొనుదానిను త్తరీయముగను నొనర్పరాదు. అటులే యన్యధృతముగునదియు, నతివికృతమైనదియు నగువస్త్రములు ధరింప నర్హములుగావు. ఓనరాధిపా! శయనీయమున వేఱొకశస్త్రము నుపయోగింపవలయును. అటులే వీథులందుఁ బోవునపు డొకటియు, దేవార్చన మొనర్చునపుడు మఱియొకటియు ధరింపవలయును. కుంకుమ చందన కేసరాదులచే వేఱువేఱుగా లేపనమొనర్పవలయును. స్నాతుఁడును, శుచియు, నలంకృతుఁడునై యుపవాస మొనర్పవలెను. సర్వకాలములందెల్ల బ్రహ్మచర్య మొనర్పవలెను. ఒకనితో నొకపాత్రమున నన్నము భుజింపరాదు. అవలీఢము, సపజ్ఞాతము, నాఘ్రాతము నైనవస్తువును భుజింపరాదు. అటులే సారముచెడినవానిని దినరాదు. ఒకరు చూచుచున్నపుడు వారికీయక తినరాదు. అటులే కూర్చుండకయు, నశుచిరై యుండియుఁ దినరాదు. తగువారినడుమఁ దినరాదు. శ్రాద్ధాదులందుఁ బ్రతిషిద్ధములగువానిని భుజింపరాదు. భవార్థియగుపురుషుఁడు పిప్పల వటశణశాకోదుంబరములఁ దినరాదు. అజగోమయూరమాంసములను, శుష్కమాంసమును, బర్యుషితమాంసమును దినరాదు. లవణము హస్తమున వేయించుకొనరాదు. రాత్రులందు లవణ ముపయోగింపరాదు.

దధిసక్తువులను భుజించుటయు, వ్యర్థముగా మాంసము దినుటయుఁ దగదు. ఉదయము సాయంకాలము మాత్రమ భుజింపవలయునుగాని, నడుమను దినరాదు. వెండ్రుకలుగలిసినది దినఁదగదు. పరశ్రాద్ధభోజన మయుక్తము. ఉత్తరీయము ధరించి మౌనముతోఁ గూరుచుండి యాహారము తినవలయును. భూమియందే తినవలెను. కూర్చుండకయు, మాటలాడుచుండియుఁ దినరాదు. మానవుఁ డుదకపూర్వకముగా నతిథుల కన్నముపెట్టి పిమ్మట నిశ్చలచిత్తుఁడై భుజింపవలయును. అతిథితో నొక పంక్తియందు భుజింపవచ్చును. ఎవ్వఁడు పానీయరసమును, పాయసమును, సక్తువులను, దధిని, నేయిని, తేనెను స్నేహితులకుఁ బెట్టక తానొక్కఁడును దినునో, వాఁడు విషమునే తినువాఁ డగుచున్నాఁడు. వానిలో మిగిలినవాని నెవ్వరికిని బెట్టరాదు. తానొక్కపదార్థమునుదినుచు శంకింపరాదు. ఒకహస్తముచే నాచమించి, జలము చల్లికొని దక్షిణచరణాంగుష్ఠమును జలముచే స్పృశించి, హస్తమును దలపైనుంచి యగ్నిని స్పృశించి నిశ్చలచిత్తుఁడైనచోఁ దనవారిలో నుత్తముఁ డగుచున్నాఁడు. జలముతో నాసాదిరంధ్రములస్పృశించి, యటులే నాభిని పాణితలములను స్పృశింపవలయును; కాని యార్ద్రపాణియై వెడలరాదు. బ్రాహ్మతీర్థ మంగుష్ఠాంతరాళమునుండియు, దేవతీర్థము కనిష్ఠిక వెనుకనుండియుఁ, బితృతీర్థమును నంగుష్ఠప్రదేశినులనడుమనుండియు విడువవలయును. అప్రియమును బరాపవాదమును బలుకరాదు. గృహస్థు కోపము తెచ్చికొనరాదు. పతితుల దర్శనసంభాషణములఁ గోరఁదగదు. అట్టివారితో సంసర్గమును జేయరాదు. అటులొనర్చెనేని క్షీణాయుష్కుఁడగుచున్నాఁడు. పగలు మైథునమొనర్చుటయుఁ, గన్యక, బంధకి ఋతుస్నాతగానిదియు నగువారితో మైథునమొనర్చుటయుఁ దగదు. అటులొనర్పకుండెనే నాయువుగలవాఁడగుచున్నాఁడు. తానొక కార్యముచేయఁదలంచినపుడు తీర్థమున నాచమనముగా మూఁడుమాఱు లుదకముద్రావి రెండుమాఱులు మార్జన మొనర్చి కృతశౌచుఁడు కావలయును. బాహ్యేంద్రియముల స్పృశించి మూఁడుమాఱు లాచమన మొనర్చి, పిదపఁ బిత్ర్యము దైవము నగు కర్మమును విధ్యుక్తముగా నొనర్పవలయును. బ్రాహ్మణకార్యమునకుఁగా నెట్టిశౌచ మొనర్పవలయునో తెలిపెదను వినుము. సర్వశౌచము

లందును బ్రాహ్మతీర్థముచే నుపస్పర్శన మొనర్పవలయును. ఉమియుటయుఁ దుమ్ముటయు సంభవించినపుడు, జలమును స్పృశించి శుచిగావలయు. వృద్ధుఁడు, జ్ఞాతియు, మిత్రుఁడు, దరిద్రుఁడు నగువారిని గృహమున నుంచుకొనవలయును. అటులేని యాయుర్వృద్ధిగలుగును. ఇంటిలోఁ బారావతములును, చిలుకలుఁ శారికలు నుండదగియున్నవి. గబ్బిలములట్టు లవియును నింటనుండుట పాపహేతువుగాదు. కొండచీమలు, గ్రద్ధలు, కపోతములు, భ్రమరములు నింటఁ బ్రవేశించెనేని దానికి శాంతి నొనర్చికొనవలయును. ఇయ్యవి యమంగలము కూర్చునవి. అటులే, లకుముకిపిట్టల ప్రవేశమునకు శాంతివలయును. మిక్కిలి రహస్యములగునవి కొన్ని దెలుపరానివి గలవు. అగమ్యాగమన మొనర్చుటయు, రాజపత్నీసఖిగమన మొనర్చుటయుఁ దగనివి. అటులే వైద్యులయు, బాలురయు, వృద్ధులయు, భృత్యులయు, బంధువులయు, బ్రాహ్మణులయు, రక్షణముగోరువారియు, సంబంధులయు స్త్రీలను గోరరాదు. అట్టులు గోరకున్నచో నాయువు నొందుచున్నాఁడు. బ్రాహ్మణుఁడు స్థపతియు, నూహించి నిర్మించిన నివేశమందే ప్రాజ్ఞుఁడగు వాఁడు నివసింపవలయును. ఓయుధిష్ఠిరా! సంధ్యాసమయమున నిద్రించుటయుఁ జదువుటయుఁ దగదు. అటులే భోజన మొనర్చుటయుఁ గూడదు. అవి యాయువునకు హానిగల్గించును. శ్రేయముఁగోరువాఁడు పితృకర్మములను రాత్రి సేయరాదు. భుజించినపిదపఁ గేశసంస్కారాదులు సేయరాదు. రాత్రి స్నానక్రియ లొనర్పరాదు. ఓధర్మరాజా! రాత్రి సక్తుభోజనము వర్జింపవలయును. మిగిలినవి పరిశుద్ధములు. భోజనసమయమునఁ బానియసేవ యుత్తమము. హెచ్చుగాఁ దినరాదు. రాత్రి చరింపరాదు. బ్రాహ్మణహాని సేయరాదు. భుజించి చరింపరాదు. మఱియుఁ బ్రాజ్ఞుఁడగువాడు మహాకులప్రసూతయు, సులక్షణప్రశస్తయు, సుచితవయోవతియు నగుకన్నియనే పెండ్లిచేసికొనవలయును. పిదపఁ బుత్రునిఁ బుట్టించి కులము నిలుపవలయును. అటులు జనించినపుత్రులను గులధర్మజ్ఞుల కర్పింపవలెను. కన్నియను గని సద్వంశమున జనించిన బుద్ధిమంతున కీయవలయు. మఱియుఁ బుత్రులు సత్కులసంబంధముచే వివాహ మొనర్పదగుదురు. శిరస్స్నాన మొనర్చియే దైవపితృకర్మములు, సేయవలయును. తాను జన్మించిన

నక్షత్రమునందును, ప్రోష్ఠపదనక్షత్రములందును, కృత్తికానక్షత్రమునందును, మఱియు దారుణములగు సర్వతిథ్యాదులందును, పంచమతారయందును గార్యమొనర్పరాదు. మఱియు జ్యోతిషమున, దెలుపఁబడినవన్నియును వర్జింపవలయును. ప్రాఙ్ముఖుఁడై శ్మశ్రుకర్మమొనర్పవలెను. లేదా యుదఙ్ముఖుఁడై యుండియైన చేయించుకొనవలయును. అటులేని యాయువునగును. ఇతరులయుఁ, దనయొక్కయుఁ బరివాదమును బలుకరాదు. ఓయుధిష్ఠిరా! పరివాదముచే నధర్మమగుచున్నది. కొన్ని యంగములు లేనిదియుఁ, గన్యకయు, సమగోత్రయు, విరుద్ధాంగియు, మాతృవంశజాతయు, వృద్ధయుఁ, బ్రవ్రజితయుఁ, బతివ్రతయు, నజ్ఞాతకులయును, నీచకులయు నగువాఁడు దానిం గూడరాదు. పింగళయుఁ, గుష్ఠినియు, నపస్మారివంశజాతయుఁ, గులహీనయు నగు కన్నియను బెండ్లాడరాదు. శ్విత్రము, క్షయరోగమును గలవానికన్నియను బెండ్లాడరాదు. శుభలక్షణములుగలదియుఁ, జూచుటకుఁ దగిన రూపముగలదియు నగుదానినే పెండ్లాడవలెను. ఓయుధిష్ఠిరా! తగిన మహాకులముననే కన్నియను బ్రవేశపెట్టవలయును. శ్రేయముగోరువాఁ డధమయుఁ బతితయు నగుదానిని బరిగ్రహింపరాదు. బ్రాహ్మణులు వేదమందుఁ దెలిపిన యేసత్క్రియలుగలవో, వానినెల్ల నగ్ని నుత్పాదించి యొనర్పవలయును. స్త్రీలయం దసూయ సేయరాదు. నిజదారలు రక్షింపఁ దగియున్నవారు. ఈర్ష్యవలన నాయువు క్షీణించును. కావున నీర్ష్యను విడువవలయును. పగటినిద్ర యాయువును దరుగఁజేయును. సూర్యోదయమైనపిదప నిద్రనుండి లేచుటయు నట్టిదే. అటులే ప్రాతస్సాయంకాలములందును నిద్రింపరాదు. ఉచ్ఛిష్టులై నిద్రింపఁదగదు. పరదారాసక్తి యనాయుష్కరము. క్షురకర్మ మొనర్చి స్నానమొనర్పకుండుటయు నట్టిదేయగును. ఓయుధిష్ఠిరా! ప్రయత్నపూర్వకముగా, నత్యాహారమును. విడువవలయును. సంధ్యాసమయమున భోజనస్నానపఠనములఁ బరిత్యజింపవలయును. ఆసమయమునఁ బ్రయతుఁడై యుండవలయును గాని, యేపనియుఁ జేయరాదు బ్రాహ్మణులను బూజింపవలయును. అటులే స్నానమొనర్చి దేవతల నారాధింపవలయును. స్నాతుఁడై గురువుల కభివందన మాచరింపవలెను. పిలువనిచోటికిఁ బోరాదుగాని యజ్ఞమునకు మాత్రము చూడఁబోవచ్చును. గౌరవింపఁబడకుండియుఁ

బోయిన ననాయుష్యమగును. ఒక్కఁడును ద్రోవఁబోవుటయు, రాత్రి ప్రయాణ మొనర్చుటయుఁ దగదు. సంధ్యాకాలము రాకపూర్వమే గృహమును జేరవలయును. తలిదండ్రులయు, గురువులయు శాసన మనువర్తింపవలయును. వారివచనము హితమేని, యహితమేనైనను దానిని విచారింపక యొనర్పవలయును. ఓనరాధిపా! ధనుర్వేద మందును వేదమందును యత్నము చేయవలయును. ఓరాజేంద్రా! ఏన్గు నెక్కుటయు, నశ్వ మారోహించుటయు, రథముల నడుపుటయుఁ బ్రయత్నపూర్వకముగా నభ్యసింపుము. సుఖ మొందుదువు. శత్రువుల కును, భృత్యులకును, స్వజనమునకును బ్రసన్నుఁడై ప్రజాపాలన మొనర్చుభూపతి, క్షతిలేక విరాజిల్లును. ఓనరాధిపా! యుక్తిశాస్త్రము శబ్దశాస్త్రమును నభ్యసింపుము. గాంధర్వశాస్త్రము కలలును నీచే నభ్యసింపఁదగినవి. మఱియుఁ బురాణములు, ఇతిహాసములు, నాఖ్యా నములు, మహాత్ములచరిత్రములును వినఁదగినవి. రజస్వలయై యున్న భార్యను సమీపించుటయుఁ, బిలుచుటయుఁ దగదు. స్నాతయగు నామెను జతుర్థదివసమునఁ దప్పక గలియవలయును. పంచమదివసమున గలిసినచో నాఁడుదియు, నాఱవదినమునఁ గలిసినఁ బురుషుఁడును గల్గును. ఈవిధముగా భార్యను గలియవలయును. జ్ఞాతి, సంబంధి, మిత్రు లెల్లవిధములఁ బూజనీయులు. వివిధదక్షిణలుగలయజ్ఞము లొనర్పవలయును. ఓనరాధిపా! పిమ్మట వానప్రస్థాశ్రమ మూనవల యును. ఆయుష్యము గోరువారి లక్షణము లెఱిఁగించితిని గదా! మిగిలిన విషయము త్రైవిద్యులగు వృద్ధులవలనఁ దెలిసికొనఁదగును. ఆచార మైశ్వర్యము నిచ్చును. అదియే యశము గూర్చును. దాని నుండియే యాయువు వర్ధిల్లును. ఆచారమే ముఖ్యకర్తవ్యము. ఆగ మము లన్నిటియందు నాచారమే శ్రేష్ఠమని చెప్పఁబడుచున్నది. ధర్మ మాచారమువలనను, ధర్మమువలన నాయువును వర్ధిల్లును. ఇదియే కీర్తిని, నాయువును, స్వర్గమును, శుభమును గల్గించును. సర్వవర్ణముల వారి ననుగ్రహించి పరమేష్ఠిచే నివ్విధి తెలుపఁబడియెను” అని తెలుప విని యుధిష్ఠిరుఁ డిట్లనియె.

జ్యేష్ఠకనిష్ఠధర్మప్రశంసనము

ఓపితామహా! జ్యేష్ఠుఁడు కనిష్ఠులయం దెట్లు వర్తింపవలయునో, కనిష్ఠులు జ్యేష్ఠునెడ నెటులు ప్రవర్తింపవలయునో తెలుపుము.

అది విని భీష్ముఁడు "ఓయుధిష్ఠిరా! నీవు సర్వజ్యేష్ఠుఁడవగుటను జ్యేష్ఠునివలెఁ బ్రవర్తింపుము. గురువునొద్ద శిష్యుఁడు ప్రవర్తించుట యనునది గొప్పపని. అకృతప్రజ్ఞుఁడగు గురునియెడ వర్తించుట, మఱియుఁ గష్టతరము. శిష్యుఁడు గురువునొద్ద దీర్ఘకాలము ప్రవర్తింపవలయునుగదా! (మఱియు శిష్యుఁ డంధవేళయం దంధుఁడై యుండవలయును. బుధుఁడయ్యు జడునివలె వర్తింపవలయును.) గురువులు వ్యతిక్రమమొనర్చినను దానిని బరిహరింపవలయును. కనిష్ఠులు శిష్యులవలెఁ జరింపవలయును. జ్యేష్ఠుఁడు కులమునకు వృద్ధిచేయువాఁడును, దానిని నశింపఁజేయువాఁడును నై యుండును. అతఁడు దుర్వినయముగలవాఁడేని తఱుచుగా సకలమును నశింపఁజేయును. ఏజ్యేష్ఠభ్రాత కనిష్ఠుల నిరాకరించునో వాఁడు జ్యేష్ఠుఁ డనిపించుకొనకుండుటయెగాక, భాగహీనుఁడును, రాజశిక్షార్హుఁడు నగుచున్నాఁడు. లోకుల నిరాకరించువాఁడు నిస్సంశయముగాఁ బాపభాజనుఁ డగును. అట్టివాఁడు తండ్రికిఁ బుత్రత్వమునెడ వ్యర్థత నొందుచున్నాఁడు. అట్టిపాపపురుషుఁడు తలిదండ్రులవంశమున కనర్థప్రదుఁడై జనించినవాఁడగును. మఱియు నట్టివాఁడు తనకీర్తినిఁ జెఱుచుకొనుటయెగాక, యపకీర్తికిని భాజనుఁ డగును. నిజకర్మహీనులగు సోదరులందఱును భాగమున కర్హు లగుచున్నారు. నీతిలేని జ్యేష్ఠుఁడు జ్యేష్ఠుఁడు గాకుండుటయెగాక విశేషించి కనిష్ఠుఁ డనఁబడును. జ్యేష్ఠుఁడు కనిష్ఠుల కొసంగక, తాను వేతనమును దీసికొనఁగూడదు. తండ్రియొసంగినదానిని జెఱుపక జ్యేష్ఠుఁడు, జంఘాశ్రమఫలముగల మార్గస్థుఁడై, స్వలాభమునుగోరక కనిష్ఠుల కొసంగవలయును. అవిభక్తులగుపుత్రులు విభాగమును గోరుదురేని తండ్రి వారికి విషమముగా భాగమొసంగరాదు. జ్యేష్ఠుఁడు శ్రేష్ఠుఁడైనను, జెడుగైనను వానినిఁ గనిష్ఠు లవమానింపరాదు. పెద్దవారితప్పు క్షమింపఁదగినదియగాదే? స్త్రీగాని, కనిష్ఠుఁడుగాని దుష్కృతులైనను వారికి శ్రేయమే సేయవలయును. ధర్మమే శ్రేయమని ధర్మవేత్తలు

తెలుపుదురు. ఆచార్యునికంటెఁ బదిరెట్లు ఉపాధ్యాయుని, నుపాధ్యాయునికి బదిరెట్టులు తండ్రినిఁ, దండ్రికిఁ బదిరెట్టులు తల్లిని గౌరవింపవలయును. పృథివియెల్లఁ దల్లియే. తల్లియట్టిపూజ్యపదార్థము వేఱొకటిలేదు. జ్యేష్ఠభ్రాత తండ్రియట్టివాఁడు. తండ్రిలేనపు డన్నయే తండ్రి. అతఁడే కనిష్ఠులకు జీవనదాతయై వారినిఁ బాలించును కావునఁ గనిష్ఠులు జ్యేష్ఠు నిష్టముచొప్పునఁ బ్రవర్తిల్లుచుండవలయును. తండ్రినట్టులు కనిష్ఠు లన్ననాశ్రయించి జీవింపవలయును. తలిదండ్రులు తనశరీరమును సృజింతురు. కాని యాచార్యసృష్టమగు జన్మము సత్యమైనదియు, జరామరణవర్జితమైనదియు నై వెలయుచున్నది. జ్యేష్ఠునిభార్య తల్లి యట్టిదగుచున్నది. ఎవ్వతె స్తన్యమును దాను ద్రావవచ్చునో, యట్టి జ్యేష్ఠునిభార్య తల్లి యట్టిదే యగుచున్నది." అని తెలుప విని యుధిష్ఠిరుం డిట్లనియె.

### ఉపవాసవిధి

ఓపితామహా! సకలవర్ణములవారికిని, మ్లేచ్ఛులకును నుపవాసమున బుద్ధిగలుగుచుండునుగదా! అందులకుఁ గారణము తెలియకున్నది. బ్రాహ్మణక్షత్రియులే నియమము లొనర్పవలయునని మేము వినియున్నారము. వా రుపవాస మెటులొనర్పవలయును! మఱియు నెల్లవారి యుపవాసనియమములవిధ మెఱిఁగింపుము. ఉపవాసపరాయణున కగుగతి యెట్టిది? ఉపవాసము పరమపుణ్యమనియు, నదియే యుత్తమమనియుఁ దెలుపుదురుగదా! ఉపవాస మొనర్చినవానికిఁ గల్గుఫల మెట్టిది? ఎట్టియుపవాసవిధిచేఁ బాపము తొలఁగునో, దేనిచే ధర్మమగునో, పుణ్యము స్వర్గము నెటులు లభించునో తెలుపుము. ఉపవాస మొనర్చినవాఁ డీయఁదగినదేది? ఎట్టిధర్మముచే సుఖములును లాభములు నగునో, యద్దాని నెఱిఁగింపుము.

ఓజనమేజయా! ధర్మజుఁ డిట్లు ప్రశ్నించుటయు, ధర్మవేత్త యగుశాంతనవుఁడు "ఓయుధిష్ఠిరా! ఉపవాసవిధికిఁగల గుణము లెవ్వియో, వానిని నేను జిరకాలముక్రిందట వినియున్నాఁడను. పూర్వ మొకపు డీవిషయము నంగిరసు నడిగితిని. తపోధనుఁడగు నాయగ్నిసంభవుఁ డానాప్రశ్నమును విని యుపవాసవిధికిఁ గలఫలమిటు లెఱిఁగించెను. దానిం దెలిపెదను వినుము.

అంగిరసుఁడు:—ఓశాంతనవా! బ్రాహ్మణక్షత్రియులకు మూఁడు రాత్రు లుపవాసము విహితము. అటులే రెండురాత్రులును నొక రాత్రియుఁగూడ వా రుపవాస మొనర్పవచ్చును. వైశ్యులును, శూద్రులును వివేకహీనులై యుపవాసవిధి నొనర్తురేని, యట్టి వారి ద్విరాత్ర త్రిరాత్రోపవాసవిధికి ఫలములేదు కాని యా వైశ్యులకును శూద్రులకును ద్విరాత్రాభోజనము విహితమైయున్నది. ధర్మజ్ఞులగు వారు త్రిరాత్రోపవాసము వైశ్యశూద్రులకు విధింపఁబడియుండెనని చెప్పలేదు. పంచమి, షష్ఠి, పౌర్ణమి అనియెడితిథులయం దుపవాసవిధి నేకభుక్తముగా నియతుఁడై యొనర్చి, జితేంద్రియుఁడును, శాంతుఁడు నై యుండునేని, రూపసంపన్నుఁడును విద్యాశాలియునై జనించును, మఱియు నట్టివాఁ డనపత్యుఁడును, దరిద్రుఁడు నొకపుడును గానేరఁడు. పంచమియందును షష్ఠియందును దేవతాపూజాశీలుఁ డగు వాఁడు తనవంశమున మహాన్నదాత యనఁబడుచున్నాఁడు. ఓశాంతనవా! అటులే, కృష్ణపక్షమున నష్టమీచతుర్దశులం దుపవాసవిధి నొనర్చినవాఁ డెట్టివ్యాధియు లేక బలశాలియై వెలయును. ఎవ్వఁడు మార్గశీర్షమాసమెల్ల నేకభుక్తముతోఁ గడపుచుఁ, దుదిని బ్రాహ్మణులకు భక్తితో భుక్తినొసంగునో, వాఁ డెట్టివ్యాధులకును గిల్బిషములకును లోనుగాక, సకలకళ్యాణసంపూర్ణుఁడును సర్వౌషధిసమన్వితుఁడును నై యలరారును. పుష్యమాసమునెల్ల నేకభుక్తముతోఁ గడపు వాఁడు వ్యాధిరహితుడును, వీర్యశాలియు నగును. మాఘమాసమంతయు, నేకభుక్తము గావించినవాఁడు సురూపసంపన్నుఁడును, కీర్తినిధియునై జనించును ఫాల్గునమాసము నేకభుక్తముతోఁ గడపు వాఁడు, గొప్పవంశమునఁ బుట్టి, జ్ఞాతులలో మహత్త్వముఁగలవాఁడగును. చైత్రమాసమెల్ల నేకభక్త మొనర్చినవాఁడు స్త్రీప్రియుఁడును, స్త్రీలకుఁ బ్రియుఁడు నై వెలయును. వైశాఖమును నేకభుక్తముతోఁ గడపినవాఁడు సువర్ణమణిముక్తాదులుగల గొప్పధనికులింట జనించును. జ్యేష్ఠమాసమున నేకవారాశనుఁడై యున్న యాఁడుదిగాని, మగవాఁడుగాని తమవంశములోనివారిలో నుత్తములుగాఁ గీర్తి వడయుదురు. జాగరూకుఁడై యాషాఢమున నేకవారాశన నియమ మొనర్చిన స్త్రీపురుషు లెవ్వరేని నిరుపమానైశ్వర్యమును, నుత్తమత్వ

మును బొందుదురు. శ్రావణమాసమెల్ల నేకభుక్తముతోఁ గడపినవాఁడు, బహుధాన్యబహుధన బహుపుత్రాదిసంపన్నుఁడై జనించును. భాద్రపదమాసమున నేకవారాహారుఁడైనవాఁడు జ్ఞాతివర్ధనుఁడై సకలజనపూజనీయుఁడగుచున్నాఁడు. అటులే యాశ్వయుజమాసమును, నేకభుక్తముగాఁ గడపినవాఁడు, స్థిరమై ధనాఢ్యమైనగ్రామైశ్వర్యము నొందును. కార్తికమాసమున నేకవారాశనుఁడై ప్రవర్తిల్లువాఁడు పరిశుద్ధుఁడును, వాహనాఢ్యుఁడును, బహుపుత్రుఁడునై జనించును. మఱియు నట్టివాఁడు శూరుఁడును, బహుభార్యుఁడును, కీర్తినిధియు నగును. ఓరాజా! మాసములందే యవి, యుపవాసవిధిచే నట్టిఫల మొసంగునదియు నెఱిఁగించితినిగదా! ఇఁక నాయాతిథులందు నియమ మొనర్చిన నేమిఫలమో తెలిపెదను వినుము. ప్రతిమాసమందు నొకపక్షము పోఁగా రెండవపక్షమున నెవ్వఁ డేక వారాశన మొనర్చునో, వాఁడు గోధనాఢ్యుఁడును బహుపుత్రుఁడును, దీర్ఘాయుష్కుఁడు నగుచున్నాఁడు. మఱియుఁ బ్రతిమాసమందును త్రిరాత్రోపవాసవిధిని బండ్రెండువత్సరములు వరుసగా నొనర్చిన వాఁడు నిరాటంకమగుగణాధిపత్యమును నొందుచున్నాఁడు. ఈ నాతెలిపిన నియమము లన్నియుఁ బదిరెండువత్సరములు క్రమముగా సాగింపవలయును. ఎవ్వఁ డహింసానిరతుఁడై, నిత్యాగ్నిహోత్రము లొనర్చుచుఁ, బ్రాతస్సాయంకాలములందుమాత్రమ భుజించుచు, వానినడుమ నీరైనఁ ద్రావకుండఁ బ్రవర్తిల్లుచు నాఱువత్సరములు గడపునో, వాఁడు సిద్ధినొందుచున్నాఁడు. ఇందు సందియము లేదు. మఱియు నట్టివాఁడగ్నిష్టోమయాగఫల మొంది, నృత్యగీతవినాదితమగు నప్సరోలోకమున సుకృతియై స్త్రీసహస్రముతోఁ గ్రీడసలుపుచుండు వాఁడగును. వానికిఁ దప్తకాంచన విమానాధిరోహణాసైతము సంభవించును. అటులు విరాజిల్లుచు వేయేండ్లు బ్రహ్మలోకమున మహాత్తరుఁడై నివసించును. అట్టిపుణ్యము క్షీణింపఁగనే వచ్చి పుడమిని మహత్త్వ మొందుచున్నాఁడు. ఎవ్వఁ డొక్కవత్సరము పూర్ణముగా నేకవారాశనుఁడై వర్తిల్లునో, వాఁ డతిరాత్రయజ్ఞఫల మనుభవించుచు, ముప్పదివేలేండ్లు స్వర్గమున నివసించును. అది ముగిసినపిమ్మటఁ బుడమిని మహత్తరుఁ డనఁబడి వెలయును. ఎవ్వఁ డొక

వత్సరము సంపూర్ణముగా ద్విరాత్రోపవాస మొనర్చుచు, నహింసాపరుఁడై సత్యవచనుఁడును జితేంద్రియుఁడు నై ప్రవర్తిల్లునో, యట్టివాఁడు వాజపేయయజ్ఞఫల మొందుచున్నాఁడు. మఱియు నట్టివాఁడు ముప్పదివేలేండ్లు స్వర్గమున నివసించును. సాయంకాలము దాఁటినపిమ్మట భుజించుచు, నొకవత్సరము పూర్ణముగా నెవఁడు నియమ మొనర్చునో, వాఁ డశ్వమేధయాగఫల మొంది, చక్రవాకప్రయుక్తమగువిమాన మధిరోహించి చరించును. మఱియు నమ్మహాత్ముఁడు నలువదివేలేండ్లు స్వర్గమున సంతుష్టుఁడై వర్తిల్లును. నాల్గురాత్రు లుపవసించి, పిదప భుజించుచు నొకవత్సరము నియమ మొనర్చిన వాఁడు గోమేధఫల మొంది, హంససారసయుక్తమగు విమానముతోఁ జరించుచు నేఁబదివేలేండ్లు స్వర్గమున నివసించును. ఒకపక్షము గడువఁగా రెండవపక్షమున ననేక వారాశనముగా నెవ్వఁడొకవత్సరము నియమ మొనర్చునో వాఁడు షష్ఠాసోపవాసఫలము నొందును." అని అంగిరుఁడు పలికెను.

ఓయుధిష్ఠిరా! అట్టివాఁ డఱువదివేలేండ్లు స్వర్గమున నివసించుచు, మధురములగు వీణావల్లకీవేణునాదములతో నిద్రించి వానిచే మేలుకొలుపఁబడును. ప్రతిమాసమందును దినమున కొక్కమాఱు చొప్పున నీరుద్రావుచు సంవత్సరము గడపువాఁడు, విశ్వజిద్యాగఫలమునకుఁ బాత్రుఁడై, సింహవ్యాఘ్రప్రయుక్తమగు విమానముతోఁ జరించుచు, డెబ్బదివేలేండ్లు స్వర్గమున నుండును. ఓరాజా! ఒకనెలకు మించినయుపవాసము విధింపఁబడలేదు. మఱియు ధర్మవేత్త లనశనవిధి నిట్లు చెప్పియున్నారు. ఆర్తుఁడును వ్యాధితుఁడు నయ్యు నెవ్వఁ డుపవాస మొనర్చునో, వాఁడు నూఱువేలేండ్లు స్వర్గమున వసించి, కాంచీనూపురశబ్దముచే నిద్రనుండి మేలుకొలుపఁబడును. మఱియు నతఁడు సహస్రహంసవిమాన మధిరోహించి స్త్రీశతముతోఁ గ్రీడించును. వ్యాధిరహితుఁడు, ననార్తుఁడు నై యెవ్వఁ డనశనవ్రతమూనునో, వాఁ డనేక యాగఫల మందుచున్నాఁడు. మఱియు వానికి హంసప్రయుక్తవిమానగమనమును లభించుటయగాక, లక్షవత్సరములు స్వర్గసౌఖ్యముగల్గి నూర్వురప్సరఃకన్యకలతోఁ గ్రీడించుటయు సంభవించును. అనశనవ్రత మొనర్చినవాఁడు నిజదేహత్యాగానంతరమున

బాలసూర్యసన్నిభమై సువర్ణవర్ణముగల్గి వైడూర్యముక్తాఖచితమును, వీణామురజనాదితమును, బతాకాదీపికావ్యాప్తమును, దివ్యఘంటానాదితము నగువిమానమెక్కి, వేలకొలఁది స్త్రీలనుగూడి సుఖముగా నుండును. ఇంతయేల! వానిమేన నెన్నిరోమకూపము లుండునో యన్నివేలవత్సరములు వాఁడు స్వర్గనివాససౌఖ్య మనుభవించును. వేదమును మించిన యుత్తమశాస్త్రము, తల్లినిమించిన యుత్తమపూజ్య పదార్థము, ధర్మమునుమించిన లాభము, నుపవాసమునుమించిన తపమును లేవనుట నిశ్చయము. స్వర్గభూలోకములందు బ్రాహ్మణులను మించిన పవిత్రపదార్థము లేదు. ఉపవాసముతో సరియగుతపము వేఱొకటి లేదు. విధ్యుక్తముగా నుపవాసమొనర్చినవారే దేవతలై త్రిదివమునొందిరి. మహర్షులును నుపవాసములచేఁ బరమసిద్ధినొందిరి. ధీమంతుఁడగు విశ్వామిత్రుఁడు దివ్యవర్షసహస్రము లుపవాసవిధి నొనర్చియే విప్రత్వము వడసెను. మఱియుఁ జ్యవనుఁడు, జమదగ్ని, వసిష్ఠుఁడు, గౌతముఁడు, భృగువు మున్నగుమహర్షులందఱును నుపవాసవిధి నొనర్చియే స్వర్గమునొందిరి. ఈనాతెలిపినదెల్ల మున్నాయంగిరసుఁడు మహర్షుల కెఱిఁగించెను. దీని నెవ్వఁడు నిత్యము దలంచునో వాఁడు దుఃఖములపాలు గానేరఁడు. మున్నాయంగిరసుఁ డీవిధిని యథాక్రమముగాఁ బ్రవర్తింపఁజేసెను. ఎవ్వఁడు దీనిని నిత్యము పఠించునో, వినునో వానిపాపములన్నియుఁ బాయుచున్నవి. మఱియు వాఁడు సర్వసంకటవిముక్తుఁడై యేదోషములకును లోనుగాకుండును. ఇంకను నట్టివానికిఁ బక్షులరుతమునందలి విషయము తెలియును. కీర్తి గలుగును" అని తెలుప విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె.

## ఉపవాసఫలకథనము

"ఓమహాత్మా! పితామహా! విధ్యుక్తయాగములవిధమంతయుఁ దెలిపితివి. వానికిఁ గలగుణములు, నవి యిహపరములందుఁ గూర్చు ఫలమును నెఱిఁగించితివి. అయినను, దరిద్రులగువారు వాని నాచరించుట కష్టతరముగదా! వానికిఁ బెక్కుసంభారము లుండవలయును. వాని కనేకోపకరణములు గావలయును. వానిని రాజపుత్రులుమాత్రమే చేయఁగలిగియుందురుగాని, యసహాయులును, నైకమత్యములేని

వారును, దక్కువవారును, సర్థహీనులును జేయఁజాలరని నాయభిప్రాయము. కావున దరిద్రులు మున్నగువారు చేయఁదగి, యజ్ఞఫల తుల్యఫలమై యెయ్యది వెలయునో యట్టివిధి నా కెఱిఁగింపుము.”

అది విని భీష్ముఁడు “ఓధర్మజా! ఇట్టివిధి యుపవాసమే యనియు, నది యజ్ఞఫల మొసంగుననియు నంగిరుఁడు తెలిపెను. దాని నెఱిఁగించెదను. ఆఱువత్సరములు వరుసగా నెవ్వఁడు ప్రాతస్సాయంకాలములందుఁదక్కఁ దక్కినకాలముల నీరైనఁ ద్రావక ప్రవర్తించుచు, నగ్నిహోత్రపరుఁడై యహింసావ్రతమూని చరించునో, వానికి సిద్ధి గలిగి, తప్తకాంచనవర్ణమగు విమానము లంభించును. మఱియు నట్టివానికి నృత్యగీతనాదితమగు దేవతాస్త్రీలనడుమ నునికి గలుగును. మూఁడువత్సరములు వరుసగా నెవ్వఁ డేకవారాశనము సేయునో, ధర్మపత్నీరతుఁడగునట్టివాని కగ్నిష్టోమఫలము గలుగును. మఱియు బహుసువర్ణములు గలయజ్ఞమును వాసవప్రియముగా నొనర్చినవాఁ డగుచున్నాఁడు. సత్యవచనుఁడును, దాతయు, బ్రహ్మణ్యుఁడును, ననూయారహితుఁడును, క్షాంతుఁడును, దాంతుఁడును, జితక్రోధియు నైనవాఁ డుత్తమగతి నొందుచున్నాఁడు. మఱియు నాతనికి హంసలక్షణమై శ్వేతాభ్రతుల్యమగువిమానమున నధిష్ఠింపఁగల్గుటయేగాక రెండుపద్మములుసంఖ్యగలకాల మప్సరసలతో స్వర్గమున నివాసము నైతము సిద్ధించును. ఎవ్వఁడు ద్వితీయదివసమున నేకవారాశన మొనర్చుచుఁ, బండ్రెండునెలలును నగ్ని నారాధించుచుఁ, బ్రాతఃకాలప్రబోధనుఁ డగునో వాఁ డగ్నిష్టోమయాగఫలమొంది, హంససారయుక్తమగువిమాన మధిరోహించి చరించుచు, నింద్రలోకమున నుత్తమకాంతలఁగూడి విహరించువాఁ డగును. ఎవ్వఁడు పండ్రెండునెలలును నగ్నికార్యపరుఁడై నిత్యము హోమ మొనర్చుచుఁ, గల్యప్రబోధనుఁడై తృతీయదివసమున నేకవారాశనుఁడై వర్తిలునో, వాఁ డుత్తమతమమగు నతిరాత్రయాగఫలపాత్రుఁడై మయూరహంససంయుక్తమగు విమానము వడసి, యెల్లప్పుడును సప్తర్షిలోకమున నప్సరసలంగూడి నివసించును. వాని కాయుత్తమలోకమునుండి మూఁడుపద్మముల సంఖ్యగల వత్సరములకు నివర్తనము గల్గును. ఎవ్వఁడు పండ్రెండు మాసములు నగ్నికార్యరతుఁడై చతుర్థదివసమున నొక్కమాఱు

భుజించువ్రతము పూని ప్రవర్తిల్లునో, వాని కత్యుత్తమమగు వాజపేయయాగఫలముగలిగి, యింద్రకన్యాధిరూఢ మగువిమానము లభించుటయె గాక, వాసవలోకవాసమును గలుగ, వాఁడు నిత్యము దేవరాజక్రీడల నరయుచుండును. మఱియు నెవ్వఁడు పండ్రెండునెలలు నగ్నికార్యనిరతుఁడై యలుబ్ధుఁడును, సత్యవాదియు, బ్రహ్మణ్యుఁడును, నహింసారతుఁడు, ననసూయాశీలుఁడును, పాపరహితుఁడు నై పంచమదివసమున నొక్కమాఱు భుజించునో, వాఁడు వాజపేయఫలమునొంది హంసలక్షణమగు సువర్ణవిమానాధిరూఢుఁడై, సూర్యమాలికాసమకాంతి గలయుత్తమనివాసమున నివసించును. అందటు లేఁబదియొకపద్మసంఖ్యగలవత్సరము లుండును. ఎవ్వఁడు పండ్రెండుమాసములును నగ్నికార్యము లొనర్చుచుఁ ద్రిషవణస్నాతుఁడు, బ్రహ్మచారియు, ననసూయారహితుఁడు నై యాఱవదివసమున నేకవారాశన మొనర్చునో, వాఁడు గోమేధఫలపాత్రుఁడై యగ్నిజ్వాలాతుల్యకాంతి గలిగి, హంసమయూరయుక్తమై సువర్ణమయమగు నుత్తమయానము వడసి, యప్సరసల నృత్తగీతాదులచే మేలుకొలుపఁబడుచుండును. అటు లసంఖ్యాకములగువత్సరము లాయుత్తమలోకమున వసించి, మఱియు భల్లూకశతరోమసంఖ్యగలవత్సరములు బ్రహ్మలోకమున మహత్తరుఁడై వెలయును. ఎవ్వఁడు పండ్రెండునెలలు నగ్నిరతుఁడై హోమము సేయుచు సరస్వతిని రక్షించుచు, బ్రహ్మచారియై సుమనోవర్ణమధుమాంసముల వర్జించి, సప్తమదివసమును నేకవారాశన మొనర్చునో, వాఁడు మరుల్లోకము నింద్రలోకమును బడసి, సిద్ధిసంపన్నుఁడై యందందు దేవకన్యలచే నర్చితుఁడగుచు, బహుసువర్ణయాగఫలభాజనుఁడై, సంఖ్యాతీతవత్సరము లాపుణ్యలోకముల మోదమానమానసుఁడై నివసించును. ఎవ్వఁడు దేవకార్యపరుఁడై యగ్నికార్యము లొనర్చుచు, సంవత్సరమును శాంతివెలయ వర్తిలుచు, నెనిమిదవదినమున నేకవారాశన మొనర్చునో, వాఁడు పౌండరీకఫలభాగియై పద్మవర్ణముగలవిమాన మధిరోహించి, సువర్ణశ్యామకృష్ణవర్ణములు వయోరూపవిలాసములును గలకాంతలు గొలువ నుత్తమలోకముల నలరుచుండును. అందులకు సందియము లేదు. ఎవ్వఁ డెల్లపుడును నగ్నికార్యపరుఁడై నవమదినమున నేకవారాశన మొనర్చునో, వాఁ డత్యు

త్తమమగు నశ్వమేధయాగసహస్రఫలపాత్రుఁడై, పుండరీకకాంతిగల విమానము నారోహించి, దీప్తసూర్యవహ్నితేజస్కులును, దివ్యమాలాధారిణులు నగురుద్రకన్యక లంతరిక్షమునకుఁ దన్నుఁ దీసికొనిపోఁబోయి వారిఁ గూడి విహరించును. అం దనంతమగు కాలము సంతుష్టాంతరంగుఁడై యుండును. ఎవ్వఁడు పండ్రెండుమాసములును నగ్నిచర్యాపరుఁడై దశమదినమున నేకాహారాశన మొనర్చునో, వాఁ డశ్వమేధయాగసహస్రఫలము వడసి సకలభూతమనోజ్ఞమగు బ్రహ్మకన్యానివాసమున, రూపవతులగు కన్నియలు తన్నుఁ గొలువ, నీలోత్పలరక్తోత్పలవర్ణములుగల విమానమును బడసి, విచిత్రమణిమాలాభూషితమును, శంఖనాదనినాదితము, స్ఫటికవజ్రస్తంభయుక్తము నగు వేదికపైఁ గూడుచుండి విహరించుచుఁ బెక్కువేలేండ్లు దేవలోకమున సంతసించుచుండును. ఎల్లకాలమును నగ్నిహోత్రము నర్చించుచు, మనోవాక్కర్మములలో దేనిచేనేనిఁ బరస్త్రీని బొందక, సత్యవాదియు మాతాపితృభక్తుఁడు నై యెవఁడు పదునొకండవదినసమున నేకాహాశన మొనర్చునో, వాఁ డశ్వమేధయాగసహస్రఫలభాగియై విమానస్థుఁడై మహాదేవు నెదుర్కొని, తనకుఁగా వచ్చినస్వాయంభువవిమానము నధిరోహించి, సువర్ణసమవర్ణలును రూపవతులునగు కుమారికలు కొలువ, దివ్యము మనోజ్ఞమునగు రుద్రావాసమున, యుగాంతాగ్నిసమప్రభుఁడై యెంతేని కాలము నివసించి రుద్రుని సేవించుచుండును. ఆమహాదేవుఁ డాపుణ్యశీలునకుఁ బ్రతిదినము దర్శన మొసంగును. ఎవ్వఁడు పండ్రెండునెలలును ద్వాదశదినమున మాత్ర మొక్కమాఱు భుజించుచుండునో వాఁడు సర్వమేధఫలమొంది, మణిముక్తాప్రవాళాలంకృతమై, హంసమాలికావ్యాప్తమై, నాగవీథీసమాకులమైన యుత్తమవిమానమును, ద్వాదశాదిత్యులును దన కొసంగ, మయూరచక్రవాకాదినాదపూరితమైన మహత్తరాట్టాలకప్రదేశములుగల బ్రహ్మలోకమున మోదమానమానసుఁడై విహరించును. అట్టి వారికి నరనారీసమాకులమగు నావసథము నిత్యము నివాసముగా నుండునని మహర్షియగు నంగిరుఁడు పలికెను. ఎవ్వఁడు, పండ్రెండు మాసములును త్రయోదశదినమునమాత్ర మేకాహారాశన మొనర్చుచుండునో వాఁడు దేవసత్రయాగఫలముగలుగ, రక్తపద్మోదయమను విమాన

మొంది, సువర్ణమయమును, రత్నసంచయభూషితమును, దివ్యాభరణాలంకృతమును, దేవకన్యాకీర్ణమును, బుణ్యగంధవాసితమును, దివ్యవాదిత్రశోభితమునగు నవ్విమానమున విహరించుచుఁ, బరిగణింపలేనంతకాల మచ్చో నివసించును. మఱియు నాతని, గీతభేరీపణవనిస్స్వనాదులతో దేవకన్యకలు నిత్యము సేవింతురు. ఎవ్వఁడు పండ్రెండు నెలలును జతుర్దశదివసమున నేకవారాశన మొనర్చునో, వాఁడు మహామేధఫలపాత్రుఁడై, యలంకృతలై దెలుపరానివరరూపములుగల దేవకన్యకలు తనకై విమానములు దేఁగా, నందుఁ గూర్చుండి, కలహంసధ్వనులుగల వారినూపురకాంచీనినాదములచే మేలుకొలుపఁబడుచు, దేవకన్యానివాసమున నివసించి, గంగాతీరభూముల విహరించుచుండును. ఎవ్వఁడు జితేంద్రియుఁడై పండ్రెండు నెలలును నగ్నిహోత్రము లొనర్చుచుఁ, బదునైదవదినమున మాత్రమేకవారాశన మొనర్చునో, వాఁ డత్యుత్తమమగు రాజసూయసహస్రఫలము వడసి, హంసమయూరసేవితమగు విమాన మధిరోహించి, మణిమండలచిత్రితమై సువర్ణమయమగు నవ్విమానమునొంది, దివ్యాభరణభూషితలగు నుత్తమకాంతలంగూడి యేకస్తంభమును, జతుర్ద్వారమును, సప్తభౌమమును నై వైజయంతీసహస్రశోభితమగు ప్రదేశవిశేషమున గీతనిస్స్వనాదులచే సుఖించుచు, యుగసహస్రములకాల మచ్చో నివసించును. ఎవ్వఁడు పండ్రెండు నెలలును వరుసగాఁ బదునాఱవదినమునమాత్ర మేకవారాశన మొనర్చుచుండునో, వాఁడు సోమయాగఫలపాత్రుఁడై సోమకన్యానివాసమున నివసింపఁబోయి, సౌమ్యగంధానులేపనుఁడును, గామసంచారియు నై మనోజ్ఞలును, మధురస్వభావలునగు మానినులచే సేవింపఁబడుచు, విమానస్థుఁడై కామభోగశాలియగుచు వెలయును. వాఁ డెన్నియేని మహాకల్పములచ్చో నటులు నివసించును. ఎవ్వఁడు పండ్రెండు నెలలును నగ్నిచర్యాపరుఁడై పదునేడవదివసమున నేకవారాశన మొనర్చునో, వాఁడు వారుణస్థానమును నింద్రస్థానమును బడసి, రుద్రునిఁ జేరును. మఱియు నాతనికి మారుతశయనమును బ్రహ్మలోకమును గలుగుచున్నవి. అందు దేవతాకన్యకలచే నతఁ డాదరింపఁబడును. మఱియు నతఁడు దేవర్షియై విశ్వరూపమును జూడఁగల్గును. అందు దేవాధిదేవుని

త్తమమగు నశ్వమేధయాగసహస్రఫలపాత్రుఁడై, పుండరీకకాంతిగల విమానము నారోహించి, దీప్తసూర్యవహ్ని తేజస్కులును, దివ్యమాలాధారిణులు నగురుద్రకన్యక లంతరిక్షమునకుఁ దన్నుఁ దీసికొనిపోఁ బోయి వారిఁ గూడి విహరించును. అం దనంతమగు కాలము సంతుష్టాంతరంగుఁడై యుండును. ఎవ్వఁడు పండ్రెండుమాసములును నగ్నిచర్యాపరుఁడై దశమదినమున నేకవారాశన మొనర్చునో, వాఁ డశ్వమేధయాగసహస్రఫలము వడసి సకలభూతమనోజ్ఞమగు బ్రహ్మకన్యానివాసమున, రూపవతులగు కన్నియలు తన్నుఁ గొలువ, నీలోత్పలరక్తోత్పలవర్ణములుగల విమానమును బడసి, విచిత్రమణిమాలాభూషితమును, శంఖనాదనినాదితము, స్ఫటికవజ్రస్తంభయుక్తము నగువేదికపైఁ గూర్చుండి విహరించుచుఁ బెక్కువేలేండ్లు దేవలోకమున సంతసించుచుండును. ఎల్లకాలమును నగ్నిహోత్రము నర్చించుచు, మనోవాక్కర్మములలో దేనిచేనేనిఁ బరస్త్రీని బొందక, సత్యవాదియు మాతాపితృభక్తుఁడు నై యెవఁడు పదునొకండవదినసమున నేకవారాశన మొనర్చునో, వాఁ డశ్వమేధయాగసహస్రఫలభాగియై విమానస్థుఁడై మహాదేవు నెదుర్కొని, తనకుఁగా వచ్చినస్వాయంభువవిమానము నధిరోహించి, సువర్ణసమవర్ణలును రూపవతులునగు కుమారికలు కొలువ, దివ్యము మనోజ్ఞమునగు రుద్రావాసమున, యుగాంతాగ్నిసమప్రభుఁడై యెంతేని కాలము నివసించి రుద్రుని సేవించుచుండును. ఆమహాదేవుఁ డాపుణ్యశీలునకుఁ బ్రతిదినము దర్శన మొసంగును. ఎవ్వఁడు పండ్రెండునెలలును ద్వాదశదినమున మాత్ర మొక్కమాఱు భుజించుచుండునో వాఁడు సర్వమేధఫల మొంది, మణిముక్తాప్రవాళాలంకృతమై, హంసమాలికావ్యాప్తమై, నాగవీథిసమాకులమైన యుత్తమవిమానమును, ద్వాదశాదిత్యులును దన కొసంగ, మయూరచక్రవాకాదినాదపూరితమైన మహత్తరాట్టాలకప్రదేశములుగల బ్రహ్మలోకమున మోదమానమానసుఁడై విహరించును. అట్టివారికి నరనారీసమాకులమగు నావసథము నిత్యము నివాసముగా నుండునని మహర్షియగు నంగిరుఁడు పలికెను. ఎవ్వఁడు, పండ్రెండుమాసములును త్రయోదశదినమునమాత్ర మేకవారాశన మొనర్చుచుండునో వాఁడు దేవసత్రయాగఫలముగలుగ, రక్తపద్మోదయమను విమాన

మొంది, సువర్ణమయమును, రత్నసంచయభూషితమును, దివ్యాభరణాలంకృతమును, దేవకన్యాకీర్ణమును, బుణ్యగంధవాసితమును, దివ్యవాదిత్రశోభితమునగు నవ్విమానమున విహరించుచుఁ, బరిగణింపలేనంతకాల మచ్చో నివసించును. మఱియు నాతని, గీతభేరీపణవనిస్స్వనాదులతో దేవకన్యకలు నిత్యము సేవింతురు. ఎవ్వఁడు పండ్రెండు నెలలును జతుర్దశదివసమున నేకవారాశన మొనర్చునో, వాఁడు మహామేధఫలపాత్రుఁడై, యలంకృతలై దెలుపరానివయోరూపములుగల దేవకన్యకలు తనకై విమానములు దేఁగా, నందుఁ గూర్చుండి, కలహంసధ్వనులుగల వారినూపురకాంచీనినాదములచే మేలుకొలుపఁబడుచు, దేవకన్యానివాసమున నివసించి, గంగాతీరభూముల విహరించుచుండును. ఎవ్వఁడు జితేంద్రియుఁడై పండ్రెండు నెలలును నగ్నిహోత్రము లొనర్చుచుఁ, బదునైదవదినమున మాత్రమేకవారాశన మొనర్చునో, వాఁ డత్యుత్తమమగు రాజసూయాసహస్రఫలము వడసి, హంసమయూరసేవితమగు విమాన మధిరోహించి, మణిమండలచిత్రితమై సువర్ణమయమగు నవ్విమానమునొంది, దివ్యాభరణభూషితలగు నుత్తమకాంతలంగూడి యేకస్తంభమును, జతుర్ద్వారమును, సప్తభౌమమును నై వైజయంతీసహస్రశోభితమగు ప్రదేశవిశేషమున గీతనిస్స్వనాదులచే సుఖించుచు, యుగసహస్రముల కాల మచ్చో నివసించును. ఎవ్వఁడు పండ్రెండు నెలలును వరుసగాఁ బదునాఱవదినమున మాత్ర మేకవారాశన మొనర్చుచుండునో, వాఁడు సోమయాగఫలపాత్రుఁడై సోమకన్యానివాసమున నివసింపఁబోయి, సౌమ్యగంధానులేపనుఁడును, గామసంచారియు నై మనోజ్ఞలును, మధురస్వభావలునగు మానినులచే సేవింపఁబడుచు, విమానస్థుఁడై కామభోగశాలియగుచు వెలయును. వాఁ డెన్నియేని మహాకల్పములచ్చో నటులు నివసించును. ఎవ్వఁడు పండ్రెండు నెలలును నగ్నిచర్యాపరుఁడై పదునేడవదినమున నేకవారాశన మొనర్చునో, వాఁడు వారుణస్థానమును నింద్రస్థానమును బడసి, రుద్రునిఁ జేరును. మఱియు నాతనికి మారుతశయనమును బ్రహ్మలోకమును గలుగుచున్నవి. అందు దేవతాకన్యకలచే నతఁ డాదరింపఁబడును. మఱియు నతఁడు దేవర్షియై విశ్వరూపమును జూడఁగల్గును. అందు దేవాధిదేవుని

కుమారికలాతని సేవింతురు. అతఁడు సూర్యచంద్రులు చరించునంత కాలము సుధాహారుఁడై యటు లుండును. ఎవ్వఁడు పండ్రెండుమాసములును వరుసగాఁ, బదునెనిమిదవదివసమునమాత్ర మేకవారాశన మొనర్చునో, వాఁడు సప్తలోకములను గాంచఁగలిగి, నందిఘోషములు గలరథములు తనవెంటరా, వ్యాఘ్రసింహప్రయుక్తమును, మేఘధ్వాననినాదితము నగునుత్తమవిమాన మారోహించి, యారుద్రకన్యకలతోఁ గల్పసహస్రవత్సరకాలము సంతసించుచు, సుధారసమనుభవించుచుండును. ఎవ్వఁడు పండ్రెండునెలలును బందొమ్మిదవ దివసమునమాత్ర మేకవారాశన మొనర్చునో, వాఁడు సప్తలోకముల నారయఁగలిగి, యప్సరోగణసేవితమగు నుత్తమస్థానమును బడసి, సూర్యతేజమును గంధర్వోపగీతము నగువిమానమునఁ జరించుచు, నేచింతయు లేక, దివ్యాంబరధారియై యందుత్తమకాంతలతో నమేయమగుకాలము నివసించును. ఎవ్వఁడు పండ్రెండునెలలును, ధృతవ్రతుఁడై సత్యవాదియు, మాంసాహారవర్జితుఁడు, బ్రహ్మచారియు, సర్వభూతహితుఁడును నై యిరువదవదివసమున నేకవారాశన మొనర్చునో, వాఁడు విపులములై మనోజ్ఞములగు నాదిత్యలోకముల నొంది, దివ్యమాల్యానులేపనులగు గంధర్వులును, నప్సరసలును దన్నుఁ గొలుచుచుఁ గాంచనవిమానములతో వెంటరా, నుత్తమలోకముల విహరించును. ఎవ్వఁడు సంవత్సరమును నియతుఁడై యగ్నికార్యముల విడువక యిరువదియొకటవదివసమున నేకవారాశన మొనర్చునో, వాఁడు దివ్యమగుశుక్రలోకమును, శక్రలోకమును బడసి, మఱియు నాశ్వినమరుల్లోకమున విహరించుచు, విమానారూఢుఁడై యేదుఃఖములను దెలియక దివ్యస్త్రీలచే సేవింపఁబడుచు, నిత్యసుఖియై క్రీడించుచుండును. ఎవ్వఁడు సంవత్సరమును నగ్నికార్యము లొనర్చుచు, నహింసాధర్మమూని, సత్యవాదియు, ననసూయారహితుఁడు నై యిరువదిరెండవదివసమున నేకవారాశన మొనర్చునో, వాఁడు దివాకరసమప్రభుఁడై వసువులలోకములు వడసి విమానారూఢుఁడై కామచారియు సుధాహారియు నగుచు, దివ్యాభరణభూషితుఁడై వేల్పుకన్నియలంగూడి విహరించుచుండును. ఎవ్వఁడు పండ్రెండుమాసములును జితేంద్రియుఁడును మితాహారుఁడు నై యిరు

పదిమూఁడవదివసమున నేకవారాశన మొనర్చునో, వాఁడు వాయు రుద్రశుక్రలోకముల నొందును. మఱియు నతఁ డప్సరోగణసేవితుఁ డగుచుఁ గామచారియుఁ, గామగమనుఁడును నై విమానారూఢుఁడై యనేకయుగములు దివ్యాభరణభూషితుఁడై దేవకన్యకలతో విహరించుచుండును. ఎవ్వఁడు వత్సరమెల్ల నగ్నికార్యరతుఁడై నెలలో నిరువదినాల్గవదివసమున నేకవారాశన మొనర్చునో, వాఁ డాదిత్యుల లోకమునఁ జిరకాలము నివసించుచు, దివ్యమాల్యాంబరధరుఁడును, దివ్యమాల్యానులేపనుఁడును నై వెలయుచు, హంససంయుక్తమై మనోజ్ఞమైన దివ్యకాంచనవిమానమున దేవకన్యాసహస్రములతో విహరించుచుండును. ఎవ్వఁడు సంవత్సరమును నియతుఁడై యిరువదైదవ దివసమున నేకవారాశన మొనర్చునో, వాఁడు సింహవ్యాఘ్రప్రయుక్తములును, మేఘధ్వాననినాదితములును, నందిఘోషములును గల రథములు తన్ను వెంబడించిరా, దేవకన్యకలు సేవింప నుత్తమవిమానమధిరోహించి, స్త్రీశతావృతుఁడై, యందు వేలకోఁటికల్పముల కాలము నివసించును. మఱియు నిత్యము నతఁడు సుధారసపాన మొనర్చుచునుండును. ఎవ్వఁడు పండ్రెండునెలలు నొక్కరీతిగ నియతుఁడును నియతాహారుఁడు నై జితేంద్రియుఁడు వీతరాగుఁడు నగుచు, నగ్నికృత్యము లొనర్చుచు నిరువదియాఱవదివసమున నేకవారాశన మొనర్చునో, వాఁడు మహాభాగుఁడై యప్సరోగణములు గొలువ, సప్తమారుతలోకములను, వసులోకములను జేరి, సర్వరత్నాలంకృతములగుచు స్ఫటికమయములైన దివ్యవిమానము నధిరోహించి నిత్యము గంధర్వగీతమోదమానమానసుఁడై రెండువేలదివ్యయుగముల కాలముదివ్యతేజముతో వెలయుచుండును. ఎవ్వఁడు సంవత్సరము నగ్నిదేవు నారాధించుచు నిరువదియేడవదివసమున నేకవారాశన మొనర్చునో, వాఁడు విపులఫలభాజనుఁడై దేవలోకపూజ్యుఁడై యమృతాహారుఁడై సంతసించుచు, దేవర్షులయు రాజర్షులయు నుత్తమలోకముల నధివసించువాఁడై, యుత్తమవిమానమారోహించి, మనోహరాకారలగు కాంతలఁగూడి క్రీడించుచు, సుఖముగా మూఁడువేల యుగకల్పములకాల మటులు నివసించును. ఎవ్వఁడు పండ్రెండునెలలును జితేంద్రియుఁడు జితాత్ముఁడు నై యిరువదియెనిమిదవదివసమున

నేకవారాశన మొనర్చునో, వానికి దేవర్షులకగు సుక్షేత్రముఫలము గలుగ, భోగశాలియుఁ దేజశ్శాలియునై సహస్రాంశువలె వెలయుచు, సురూపవతులగుసతులు తన్నుఁ గొలువ, మనోజ్ఞము సూర్యసిభము నగు విమాన మారోహించి చరించుచుఁ, గల్పాయుతశతసంవత్సరములు సుఖముగా నుండును. ఎవ్వఁడు పండ్రెండు నెలలును సత్యవ్రతపరాయణుఁడై యిరువదితొమ్మిదవదివసమున నేకవారాశన మొనర్చునో, వాఁడు రాజర్షిపూజితములై, శుభప్రదములగు దివ్యలోకముల కర్హుఁడై, దివ్యమై సూర్యచంద్రసన్నిభముగు విమాన మారోహించి, సువర్ణమయమును సకలరత్నవిభూషితమునగు నవ్విమానమున నప్సరసలును, గంధర్వులును సేవింప, దివ్యాభరణభూషితులై, మనోహరాకృతులగు కాంతలు తన్ను సంతసింపఁజేయ, భోగపరుఁడును దేజశ్శాలియునై దివ్యశరీరముచే నగ్నివలె వెలయుచు, వసువులయు, మరుత్తులయు, సాధ్యులయు, నశ్వినీదేవతలయు, రుద్రులయు లోకములనొంది, మఱియు బ్రహ్మలోకము నొందుచున్నాఁడు. ఎవ్వఁడు సంవత్సరము సముచితుఁడై వర్తిల్లుచు మాసము పూర్ణమైనపిమ్మట నేకవారాశన మొనర్చునో, వాఁడు బ్రహ్మలోకవాసియై సుధారస పానముసేయుచు, మనోహరుఁడై, తేజము శరీరసౌష్ఠవము శోభయుఁ గలిగి సహస్రరశ్మివలె విరాజిల్లుచు దివ్యమాల్యాంబరధరుఁడును, దివ్యగంధానులేపనుఁడును నై దుఃఖమును నెఱుఁగక సుఖియు యోగియు నై స్వయంప్రకాశమానలగు మానవతులు తన్ను సేవింప రుద్రదేవర్షికన్యకలచే సత్కృతము సేవింపఁబడుచు, సూర్యసన్నిభమై గగనాకారమై వెనుకప్రక్క సోమసంకాశమై యుత్తరమున మేఘసన్నిభమై దక్షిణమున రక్తకాంతి వెలయఁ, గ్రింద నీలమండలమైన విమానము నారోహించి, మధురవాణులును మనోహరాకృతులు కుశలమతులునగు సతులు తన్నుఁ గొలువ, బహుపూజితుఁడై యనంత కాలము బ్రహ్మలోకమున నివసించును. ఇంతయేల! అట్టివాఁడు వర్షకాలమునఁ బుడమిపైఁబడు జలబిందువు లెన్ని యుండునో, యన్నివత్సరము లా బ్రహ్మలోకమున నుండును. మాసోపవాసము పదివత్సరము లొనర్చినచో స్వర్గప్రదమును, నత్యుత్తమమునునగు మహర్షిత్వమునొంది, సశరీరస్వర్గగతి గాఁగలఁడు. మఱియు నెవఁడు మానియు,

దాంతుఁడును, జితక్రోధియు, జితశిశ్నోదరుఁడును, నగ్న్యారాధనపరుఁడును, నియతసంధ్యోపాసకుఁడును, శుచిభోజనుఁడును నై ప్రవర్తిల్లునో, వాఁడు స్వశరీరముతో స్వర్గమును జేరి, యమరులట్లు విరాజిల్లును. మఱియు నట్టివాఁడు పవిత్రమగు స్వర్గసౌఖ్యమును స్వేచ్ఛగా ననుభవించును. ఓయుధిష్ఠిరా! యాగఫలముగలవిధిని నీకుఁ దెలిపితిని. ఉపవాసఫల మెట్టిదో యెఱిఁగించితిని. దరిద్రులగుమానవు లిట్లొనరించి యజ్ఞఫల మొందవచ్చును. ఇట్టియుపవాసము లొనర్చినవాఁడుత్తమగతి నొందును. దేవద్విజపూజాపరునకును నుత్తమగతి యగును. ఉపవాసవిధి సవిస్తరముగా నెఱిఁగించితినిగాదే? నియతులు, నప్రమత్తులు, శౌచనిధులు, మహాత్ములు, దంభద్రోహరహితులు, కృతబుద్ధులు, స్థిరస్వభావులు నై ప్రవర్తిల్లువా రిట్టియుత్తమగతి నందుట యం దించుకేని సందియము లేదు." అని తెలుప విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె.

శౌచవిధికథనము

"ఓపితామహా! సర్వతీర్థములలో నెయ్యది యుత్తమమో, యెందధికశుచిత్వమగునో, దానిని నాకెఱిఁగింపుము"

అది విని యాశాంతనవుఁ డాకౌంతేయునితో, "ఓయీ! ధర్మజా! పండితుఁడగువాని కన్ని తీర్థములును, గుణవత్తరములే. అయినను నందెయ్యది శుచియో దాని నెఱిఁగించెదను వినుము. అగాధమై విమలమై పరిశుద్ధమై సత్యతోయమైన మానసతీర్థమున స్థిరమగుసత్త్వమవలంబించి స్నానమొనర్చుట శ్రేయము. తపము, జ్ఞానము, మృదుభావము, సత్యము, ఋజుత్వము, అహింస, అక్రౌర్యము, దమము, శమము అనునవి తీర్థశౌచములు. నిర్మములు, నిరహంకారులు, నిర్ద్వంద్వులు, నిష్పరిగ్రహులు, శుచులు నగువారు తీర్థభూతులు. మఱియు నెవరు భైక్ష్యము భుజింతురో, వారును దీర్థభూతులే యనబడుదురు. తత్త్వవేత్తయు, నహంబుద్ధిశూన్యుఁడును దీర్థభూతు లనఁబడుచున్నారు. ఇదియే శౌచలక్షణము. ఎవ్వరియాత్మచే సత్త్వరజస్తమములు నిర్ధూతములగునో, యదియు నాచారశుద్ధియు, నిజమార్గానుసరణమును దీర్థములగుచున్నవి. సర్వత్యాగాభిరతులును, సర్వజ్ఞ

లును, సర్వదర్శులును, శౌచాభిరతులును, దీర్ఘశుచులగుచున్నారు. జలముచే మేను దడిసినంత మాత్రమున స్నాతుఁడు గానేరఁడు. దమస్నాతుఁడే స్నాతుఁడును బాహ్యాంతరశుచియు నై వెలయును. ఎవ్వరు గడచినదానికి వగవక, ప్రాప్తించినవానియెడ నిర్మములై దేనిని గోరకుందురో, వారి కట్టిసిరభిలాషమే శౌచ మనఁబడును. శరీరమునకుఁ బ్రజ్ఞానమే శౌచమగును. అటులే మనఃప్రసన్నతయు, నిష్కించనత్వమును శౌచమగుచున్నవి. వృత్తశౌచము, మనశ్శౌచము, తీర్థశౌచము, జ్ఞానశౌచము అనునవి యుత్తమశౌచములు. ప్రదీప్తమగుమానసముచే జ్ఞానబలమూని యెవ్వఁడు మానసతీర్థమున స్నానము సేయునో, వాఁడే స్నాతుఁ డనఁబడును. నిత్యభావసమాహితుఁడై శుచిత్వముగలిగి కేవలము గుణసంపన్నుఁడగువాఁడు శుచి యనఁబడును. ఓయుధిష్ఠిరా! ఇవి శరీరస్థములగు తీర్థములుగాఁ జెప్పఁబడెను. ఇఁకఁ బృథివినిగల పుణ్యతీర్థముల నెఱిఁగించెదను వినుము. శరీరమున నవయవములు కొన్ని యెట్లు పవిత్రములో, యటులే పృథివీభాగములును సలిలములును బవిత్రములైనవి గలవు. తీర్థకీర్తనము, తీర్థస్నానము పితృతర్పణము పాపప్రణాశకము లగుచున్నవి. ఎవ్వరు తీర్థయాత్ర లొనర్తురో, వారు సుఖముగా స్వర్గము నొందుచున్నారు. సజ్జనసంరక్షణముచేతను, బృథివీతేజముచేతను, సలిలతేజముచేతను మిక్కిలి పుణ్యభాగులగుచున్నారు. మానసపృథివీతీర్థములు పవిత్రములైనవి. అటులగుట వాని రెండింటియందును స్నానమొనర్చినవాఁడు శీఘ్రముగ సిద్ధివడయును. క్రియాహీనమై ఫలమును, ఫలహీనమై క్రియయును గార్యమును సాధింపఁజాలదు. రెండును గలసినచో సిద్ధికి హేతువులగును. ఇటులే శరీరశౌచము తీర్థశౌచమును గలిగినచో శుచియగునుగాని, యొకశౌచముచే శుచిగానేరఁడు. రెండుశౌచములు నుత్తమ మనఁబడును." అని తెలుపు విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె.

విష్ణుద్వాదశీ నామకథనము.

"ఓపితామహా! ఉపవాసము లన్నిటిలో నేది శ్రేయస్కరమును, మహోత్తరఫలజనకము నగునో, దానిని నా కెఱిఁగింపుము."

అది విని భీష్ముఁడు "ఓయుధిష్ఠిరా! నీవడిగిన యీవిషయమునఁ బరమేష్ఠి తెలిపిన వచనము గలదు. తద్విధముగా నొనర్చినవాఁడు నిర్వృతుఁ డగుచున్నాఁడు. అందు సందియము లేదు. మార్గశీర్షమాసమున ద్వాదశీదినమున నెవ్వఁ డహోరాత్రము కేశవు నారాధించునో, వాఁ డశ్వమేధయాగఫల మొంది పాపములనుండి విముక్తుఁడగును. అటులే పుష్యమాసమున ద్వాదశిని నారాయణునిఁ బూజించినచో, వాజపేయఫల మొంది సిద్ధుఁడగుచున్నాఁడు. మాఘమాసమున ద్వాదశి నహోరాత్రము మాధవు నారాధించువాఁడు రాజసూయయజ్ఞ ఫలమునొంది కులము నుద్ధరించువాఁడగును. అటులు ఫాల్గునమాసమున 'గోవిందా' అని పూజింపవలయును. అట్టివాఁ డతిరాత్రయాగ ఫల మొంది సోమలోకమునకుఁ బోవును. అటులే చైత్రమున ద్వాదశి, నహోరాత్రము, విష్ణునామస్మరణ మొనర్చుచు, నాతనిఁ బూజించునేని, పౌండరీకఫలభాజనుఁడై దేవలోక మొందును. వైశాఖమాసద్వాదశిని రేవవలు మధుసూదనస్మరణ మొనర్చునే, నగ్నిష్టోమఫలమును బడసి సోమలోకము నొందును. ఎవఁడు జ్యేష్ఠమాసమున ద్వాదశి, నహోరాత్రము త్రివిక్రమపదోచ్చారణ మొనర్చునో, వాఁడు గోమేధఫల పాత్రుఁడై యప్సరసలతోఁ గ్రీడింపఁగలుగును. ఆషాఢమాసద్వాదశిని రేవవలు, 'వామనా' అని స్మరించువాఁడు నరమేధఫల మొందును. శ్రావణమాసద్వాదశి, రాత్రియుఁ బవలు నెవ్వఁడు శ్రీధరస్మరణ మొనర్చునో, వాఁడు పంచయజ్ఞఫల మొంది, విమానచరుఁడై సంతసించును. అటులే భాద్రపదద్వాదశిని, రేవవలు హృషీకేశపదోచ్చారణము చేసినవాఁడు సౌత్రామణిఫలమువడసి పూజితుఁడగును. ఆశ్వయుజ ద్వాదశి నహోరాత్రము పద్మనాభపదోచ్చారణ మొనర్చినచో, గోసహస్రదానఫల మొందుటలో సందియము లేదు. కార్తికమాస ద్వాదశిని రాత్రియుఁ బవలును దామోదర నామోచ్చారణముచేసి నచో సర్వయజ్ఞఫలపుణ్యమందునని చెప్పవచ్చును. ఇటులు వత్సర మెల్లఁ బుండరీకాక్షు నెవ్వఁ డ్డురించునో, వాఁడు పూర్వజన్మస్మరణము నొందుటయేగాక బహుసువర్ణము గలవాఁడగును. ప్రతిదిన మిటు లొకవత్సర మొనర్చి, చివరను బ్రాహ్మణులకుఁ దృప్తిగా భోజనము పెట్టవలయును. లేదా బహుధనమే నొసంగవలయును. ఇంతేకు

మించిన యుపవాసము లేదని, భగవానుఁడగు నారాయణుఁడే చెప్పెను." అని భీష్ముఁ డెఱిఁగించెనని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

## అంగవిధి

ఓ జనమేజయా! అమ్మహాప్రాజ్ఞుఁడగు యుధిష్ఠిరుఁడు శరతల్పగతుఁడైన వృద్ధుఁడగు భీష్ముని సమీపించి "ఓ తాతా! అజ్ఞులగు వారికి, రూపసౌభాగ్యమును, మంచితనము నెట్లు గల్గును? అట్టివాఁడు ధర్మార్థకామసంయుక్తుఁడును సుఖభాగియు నెట్లగును.?" అని ప్రశ్నించెను. అది విని భీష్ముఁ డాతనితో "ఓ యుధిష్ఠిరా! మార్గశీర్షమున శుక్లప్రతిపత్తునఁ జంద్రవ్రత మారంభింపవలెను. నాఁడు చంద్రుఁడు మూలానక్షత్రముతోఁ గూడియుండఁ దద్వ్రత మారంభించి, నిజదేవతాసహితముగ తన్మూలానక్షత్రము నా చంద్రుని పాదములుగాఁ గల్పింపవలయును. అటులే నిజదేవతాసహితముగ రోహిణి నాతని జంఘలుగను, నశ్వినిని సక్థులుగను, నాషాఢానక్షత్రములను నూరువులుగను, పూర్వఫల్గునమును గుహ్యముగను గల్పింపవలయును. మఱియుఁ గృత్తికను గటిప్రదేశముగను, భద్రపదములను నాభిగను, రేవతిని గుక్షిగను, ధనిష్ఠానురాధలను బృష్ఠముగను విశాఖను బాహువులుగను, హస్తనక్షత్రమును హస్తములుగను నూహింపవలయును. అటులే పునర్వసువు నంగుళులుగను, నాశ్లేషను నఖములుగను, జ్యేష్ఠను గంఠముగను, శ్రవణమును గర్ణములుగను, బుష్యమును ముఖముగను గల్పింపవలయును. మఱియు స్వాతిని దంతోష్ఠములుగను, శతభిషమును హాసముగను, మఘను నాసికగను, మృగశీర్షమును నేత్రములుగను, చిత్రానక్షత్రమును లలాటముగను, భరణిని శిరముగను, నార్ద్రను గేశపాశముగను గల్పింపవలయును. అటు లూహించి యారాధించి వ్రతసమాప్తిని వేదపారగుఁడగు బ్రాహ్మణునకు ఘృతము నొసంగవలయును. అటులొనర్చినవాఁడు సుభగుఁడై దర్శనీయుఁడై జ్ఞానముగలవాఁడు నగును. పౌర్ణమీచంద్రునట్లు పరిపూర్ణాంగుఁడు నగుచున్నాఁడు" అని తెలుప విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె.

## సంసారచక్రకథనము

"ఓపితామహా! సర్వశాస్త్రజ్ఞా! మానవులసంసారవిధి యెట్టిదో నా కెఱింగింపుము. మనుష్యులు పుడమి నెట్టివృత్తముగలిగి స్వర్గ మొందుదురు? ఎటులు ప్రవర్తించి నరకమును జేరుదురు? జనులు కాష్ఠలోష్టసమముగు మృతకళేబరమును విడిచి పరలోకమునకుఁ బోవు చుందురుగదా! అపుడు వారి ననుసరించిపోవువా రెవ్వరు?"

అది విని శాంతనవుఁ డయ్యుధిష్ఠిరునితో "ఓధర్మజా! బుద్ధిశాలి యగు బృహస్పతి యిదె యిందులకు వచ్చుచున్నవాఁడు. మహాభాగా! భగవానుఁడగు నాతని, నీసనాతనరహస్యమును బ్రశ్నింపుము. అతఁడు దక్క వేఱొక్కఁ డీరహస్యము నెఱింగించువాఁడు లేఁడు. వక్తలలో బృహస్పతితో సరియగువాఁ డెందును లేఁడనవచ్చును." అని పలికెను.

ఓజనమేజయా! వారిరువు రటులు సంభాషించుచుండఁగనే విశుద్ధాత్ముఁడగుబృహస్పతి స్వర్గమునుండి యందులకు విచ్చేసెను. పిమ్మట నమ్మహనీయుని, ధృతరాష్ట్రునితోఁగూడి ధర్మరాజాదు లెదు రేఁగి, నిరుపమానగౌరవములఁ బూజించి తోడ్కొనివచ్చిరి. పిదప నయ్యుధిష్ఠిరుఁ డాభగవానుఁడగు బృహస్పతిని సమీపించి సవినయముగ "దేవా! నీవు సర్వధర్మజ్ఞుఁడవు, సర్వశాస్త్రవిశారదుఁడవు, అటులగుట నిన్నొకటి ప్రశ్నించెదను. మానవునకు సహాయుఁడగువాఁ డెవ్వఁడు? తండ్రియా? తల్లియా? గురుఁడా? లేక కుమారుఁడా? అటులుగాక జ్ఞాతిసంబంధివర్గము సహాయమగునా? మిత్రులు తోడు పడుదురా? మానవుఁడు మృతశరీరమును గాష్ఠలోష్టసమముగాఁ బుడమివిడిచిపోవునుగదా! అపుడు వానికి సహాయముగాఁ బోవువాఁ డెవ్వఁడు?" అని ప్రశ్నించెను. అది విని యాబృహస్పతి "ఓధర్మపుత్రా! మానవుఁ డొక్కఁడుగనే జనించి యొక్కఁడుగనే నశించుచున్నాఁడు. మఱియుఁ దానొక్కఁడే కష్టములను దరించుటకును, దుర్గతినొందుట కును గర్తయై యున్నవాఁడు. ఓరాజా! తల్లియుఁ, దండ్రియు, సోదరులు, పుత్త్రుఁడు, గురుఁడు, జ్ఞాతిసంబంధివర్గము, మిత్రవర్గమును గాష్ఠలోష్టసమముగా నున్నమృతశరీరము చేరువను ముహూర్త మాత్రము రోదనమొనర్చి, పిమ్మట బరాఙ్ముఖులై వెడలిపోవుచున్నారు.

అటులు వారెల్ల మానవుని మృతశరీరమును విడిచిపోఁగా, వానిధర్మ మొక్కటియే వాని ననుసరించిపోవును. కావున నోరాజా! ధర్మ మొకటియే తనకు సహాయపడునని యెల్లప్పుడును దలంపవలయును. ప్రాణి, ధర్మ మాచరించియే, తత్కాలమున స్వర్గాద్యుత్తమగతి నొందును. అటులే యధర్మ మొనర్చెనేని, నరకమునకుఁ బోవును. కావున వివేకియగువాఁడు న్యాయార్జితములగు ధనములచే ధర్మము గావింపవలయును. మానవులకుఁ బరలోకసహాయ మొనర్చునది ధర్మ మొక్కటియే. అవివేకియగువాఁడు లోభమోహక్రోధభయాదులలో దేనిచేనేనిగాని యకృత్యము లొనర్చుచుండును. లోభమోహితుఁడై పరార్థమును గనిపెట్టనేరఁడు. జీవితమునకు ధర్మార్థకామములు మూఁడును ఫలములగుచున్నవి. కావున, నధర్మ మొనర్పకుండఁ బైమూఁడిటిని సేవింపవలయును." అని తెలిపెను.

అది విని యుధిష్ఠిరుఁడు మఱియు నాతని "ఓమహనీయా! మిక్కిలి హితము, ధర్మసహితము నగుతమవచనమును వింటిని. ఇఁక మీవలన శరీరనిశ్చయముఁ దెలియఁ గోర్కి గలుగుచున్నది. మానవునిమృతశరీరమున సూక్ష్మ మవ్యక్తత్వమొంది దృష్టిగోచరము గాకుండునుగదా! అట్టిదానిని ధర్మ మనుసరించిపోవు ననుటెట్లు?" అని ప్రశ్నించెను.

అందుల కాబృహస్పతి "ఓయుధిష్ఠిరా! పృథివ్యప్తేజోవాయ్వాకాశములును బుద్ధియు నాత్మయుఁ గూడి మానవునిధర్మము నరయుచుండును. అటులే నిత్యమును. మానవునిధర్మాధర్మములకు రాత్రియుఁ బవలును సాక్షిభూతములై యుండును. వానితోఁగూడ ధర్మము నైతము జీవు ననుసరించియే యుండును. ఓమహామతీ! జీవితశూన్యమగు నీశరీరమును త్వగస్థిమాంసశోణితశుక్రములును బరిత్యజించి తొలఁగును పిమ్మట ధర్మసమాయుక్తుఁడై జీవుఁడు సుఖమనుభవించును. ధర్మసహాయముగలవాఁ డిహపరములందును సుఖియగు. నీవింకను వినవలసిన దేమియో తెలుపుము" అనిపలికెను. అది విని యుధిష్ఠిరుఁడు, "ఓదేవా! మానవుని ధర్మ మెట్టు లనుసరించునో యనువిషయ మెఱిగించితివి. రేత మెట్లు ప్రవర్తిల్లుచున్నదో తెలుపు" మనుటయు, బృహస్పతి "ఓయీ! రాజా! దేవతలు శరీరమందుండి యన్నమును భుజిం

తురు. దానిచేఁ బృథివ్యప్తేజోవాయ్వాకాశములును మనస్సును దృప్తినొందును. మనస్సహితములనునవి యటులు దృప్తినొందఁగా, మహత్తరమగు రేతస్సు గలుగును. పిమ్మట స్త్రీపుంసయోగమున గర్భము సంభవించును. ఇది యిట్టులగుటఁ దెలిపితినిగదా! ఇఁక నేమి వినఁ గోరెదు?" అని యడిగెను. అది విని యాధర్మజుఁడు, "ఓమహాత్మా! గర్భ మెట్లు సంభవించునో యనునది తెలిపితివి. ఇఁకఁ బురుషుఁ డెట్టు లగునో తెలుపుము" అని ప్రశ్నించెను. అది విని యాబృహస్పతి, "ఓయుధిష్ఠిరా! పురుషునకుఁ బంచభూతములసామీప్యము గలిగి నంతనే వానివలన నభిభూతుఁడై వానితోఁగూడి వేరొకయవస్థ నొందును. అదియే జీవుఁడు. అటులగుట నాభూతములందున్న దేవత లాతనికర్మములనెల్లఁ గాంచుచుండుదురు. ఇఁక నేమి వినఁగోరెదవో తెలుపు"మనుటయు,యుధిష్ఠిరుఁడు మఱియు నాతని "ఓభగవానుఁడా! త్వగస్థిమాంసములను విడచి, సర్వభూతనివర్జితుఁడైన యాజీవుఁ డెచ్చోటనుండి సుఖదుఃఖము లనుభవించును?" అని ప్రశ్నించెను. అది విని యాబృహస్పతి, "ఓధర్మపుత్రా! జీవుఁడు నిజకర్మసమా యుక్తుఁడై వడిగా శుక్రత్వమందును. అటులు రేతోరూపుఁడై స్త్రీల పుష్పమునొంది కాలమురాఁగా జనించుచుండును. అటులు పుట్టి యాయాకర్మము లొనర్చి యమభటులచేఁ గ్లేశమును వధమును బొందుచు సంసారచక్రమునఁ దిరుగుచు మఱియు, గ్లేశ మనుభవించుచు వచ్చును. ఓపార్థివా! అట్టిప్రాణి యిహలోకమునఁ దాను జనించినది మొదలుగా, నిజకర్మఫలమునే యనుభవించును. అటులుగాక తాను బుట్టినది మొదలుగా ధర్మమునే యాచరించినచో, నట్టివాఁడు పురు షుఁడై పుట్టియు నిత్యము సుఖమే యనుభవించును లేక ధర్మము చేసియు, నడుమ నధర్మ మొనర్చెనేని, సుఖానంతరమున దుఃఖ మను భవించును. అటులుగాక కేవల మధర్మమే చేసిన యమపుర ప్రవిష్టుఁడై గొప్పదుఃఖ మనుభవించి మరలఁ దిర్యగ్యోనులజనించును. ఇఁక జీవుఁడు మోహానసమాయుక్తుఁడై యేయేకర్మ మొనర్చి యేయేయోనియందు జనించునో, తద్విషయ మెఱిఁగించెదను వినుము. మర్త్యుఁడు ఘోర మగుయమలోకమును జెందుననువిషయము శాస్త్రమందును, నితిహాస మందును, వేదమందును దెలుపఁబడుచున్నది. ఇందును, దిర్యగ్యోన్యతి

రిక్తములై దేవతుల్యములగు పుణ్యస్థానములు గలవు. కావున నాయా గుణములచే బ్రహ్మలోకసమమగు నీయమలోకమందు వారివారి నియతకర్మములకు బద్ధులై మానవులు దుఃఖ మనుభవించుచుందురు. పురుషుఁ డేయేకర్మముచే నేయేపరుషగతి నొందునో, దాని నీకెఁ దెలిపెదను వినుము. నాలుగువేదములను జదివినద్విజుఁడు, మోహ సమన్వితుఁడై పతితుఁడగువానినుండి ప్రతిగ్రహ మొనర్చునేని, యట్టివాఁడు ఖరయోనియందు జనించుచున్నాఁడు. వాఁ డటుల ఖర మైపుట్టి పదునైదువత్సరములు జీవించి, మృతుఁడై, పిమ్మట వృషభమై మఱియేడువత్సరములు బ్రతికి, పిమ్మట బ్రహ్మరాక్షసుఁడగును. అటులు బ్రహ్మరక్షస్సుగా మూఁడుమాసములుండి, పిదప బ్రాహ్మణుఁడగును. పతితునిచే యాగముచేయించినవాఁడు కృమియోనియందుఁబుట్టి యటుల పదునైదేండ్లు జీవించి, పిదప నాకృమిత్వమువదలి, గర్దభమై యైదేండ్లు బ్రదికి పిమ్మట సూకరమై యైదువత్సరములు బ్రదికి, తజ్జన్మమువిడిచి కుక్కుటమై యైదేండ్లు జీవించి దానినుండి విముక్తుఁడై జంబుకమై మఱియైదువత్సరములు బ్రదికి, పిదప గుక్కయై యొక్కవత్సరము జీవించి, పిమ్మట మానవజన్మమందును. శిష్యుఁడై గురుపత్నియెడ నెవ్వఁడు పాపమొనర్చునో, వాఁడు తొలుత వృకమై జనించి, పిమ్మట రాక్షసుఁడై తరువాత గాడిదయై యిట్లు మూఁడుశరీరములందుండి, పిమ్మటఁ బ్రేతత్వమొంది, తరువాత, బ్రాహ్మణుఁడై పుట్టును. ఎవ్వఁడు గురుభార్యను మనసునందేనిఁ దలంచునో, యట్టిపాపాత్ముఁడు భయంకరములగు యోనులందుఁ బుట్టి, పిదప నధర్మబుద్ధియే శునకమై జనించి మూఁడువత్సరములు జీవించి, మృతుఁడై కృమియోనియం దుద్భవించి యక్కృమిగా నొక్కవత్సరము బ్రదికి, యాశరీరము నశించినపిమ్మట బ్రాహ్మణయోనిసంజాతుఁడగును. ఇఁక గురువు కారణము లేకయే తన యిచ్చవచ్చినట్లు శిష్యునిఁ బుత్రతుల్యుఁడని తలంపక కొట్టునేని, యట్టి వాఁడును గ్రూరయోనియందుఁ బుట్టును. ఎవ్వఁడు తల్లిని దండ్రిని నవమానించునో, వాఁడు మృతుఁడై తొలుత గాడిదయై పుట్టి, పది వత్సరములు బ్రదికి, పిమ్మట మొసలియై యొకవత్సరముసుండి, పిదప మానవుఁడగును. ఎవ్వనిపైఁ దలిదండ్రులును గురుఁడును గోపింతురో, వాఁడును మృతుఁడై గాడిదగా జనించి పదిమాసములా మేనితో

బ్రదికి, పిమ్మట శునకమై పదునాల్గుమాసములు జీవించి, యనంతరము మార్జారమై యేడునెలలు జీవించి, యామేను విడిచి, పిమ్మట మానవుఁడై పుట్టును. తలిదండ్రులను దిట్టినవాఁడు శారికమై జనించును. వారినే తాడన మొనర్చినవాఁడు కచ్ఛపమగును. అటులు కచ్ఛపమై పదివత్సరములుండి, పిమ్మట శల్యకమై మూఁడువత్సరములుండి, పిదప వ్యాళముగా జనించి, యాఱుమాసములు జీవించి, యంతట నమ్మేను విడిచి మానుషుఁ డగును. ఎవ్వఁ డొకసియన్నము దినుచు, వాని శత్రువులఁ గూడునో, మోహసమన్వితుఁ డగునట్టివాఁడు మృతుఁడై, వానరమై జనించి, యామేనితోఁ బదివత్సరములు బ్రదికి, పిదప మూషికమై యైదేండ్లు బ్రదికి, పిదపఁ గుక్కయై యాఱునెలలు జీవించి, పిమ్మట మానవుఁడై పుట్టును. దాఁచికొనినసొమ్ము దోఁచికొన్నవాఁడు యమపురమునకుఁబోయి, యచ్చోటినుండివచ్చి నూఱుకష్టజన్మముల నొంది, తుదకు కృమియోనియం దుద్భవించి, యందుఁ బదునైదేండ్లు బ్రతికి యపుడే తనపాప మనుభవించి, పిమ్మట మానవుఁడై జనించును. అసూయగలవాఁడు మృతుఁడైనపిదప, శార్ఙ్గకమై జనించును. భూమిని హరించినవాఁడు మీనమై పుట్టును. అటులు మీనమై యెనిమిదేండ్లు జీవించి, పిమ్మట మృగమై జనించును. అటులు మృగమై నాల్గుమాసములు బ్రదికి, పిమ్మట మేఁకయై పుట్టి, యొకవత్సర మామేనితో జీవించి, మృతినొందినపిదపఁ, గీటమై పుట్టి, యమ్మేను నశించినపిదప, మానవుఁడై పుట్టును. ధాన్యమును, యవలను, దిలలను, మాషములను, గుళుత్థములను, సర్షపములను, సెనగలను, గుండ్రసెనగలను, పెసలను, గోధుమలను, నవిసెలను, మఱియుఁగల యన్యసస్యమును హరించినవాఁడు మూషికమై పుట్టి, ప్రేతత్వమొంది పిదప సూకరమై పుట్టినతోడనే రోగపీడితుఁడై చచ్చి, తత్కర్మముచే మూఢమగుకుక్కయై, యైదు వత్సరములు జీవించి, పిమ్మట మానవుఁడుగాఁ బుట్టును. పరదారాభిమర్శ మొనర్చినవాఁడు వృకమై పుట్టి, పిమ్మట వరుసగాఁ గుక్కయు, నక్కయు, గ్రద్దయు, వ్యాళము, కంకము, బకమునుగా జనించును. ఎవ్వఁడు పాపాత్ముఁడై, భ్రాతృభార్యను మోహించి బలాత్కరించునో, వాఁడు పుంస్కోకిలమై పుట్టి, యొకసంవత్సరము జీవించును. అటులే

మిత్రునిభార్యను, గురుభార్యను, రాజభార్యను గామపీడితుండై బలాత్కరించినవాఁడు మృతుండై, సూకరముగాఁ బుట్టి, యా సూకరజన్మమున నైదువత్సరము లుండి, పిదప వృకమై పదివత్సరములు జీవించి, పిమ్మట బిడాలమై యైదేండ్లు బ్రదికి, పిదపఁ గుక్కుటమై పదేండ్లు బ్రదికి, యనంతరము పిపీలికయై మూఁడుమాసములుండి, పిమ్మటఁ గీటమై యొకనెల జీవించి, పైఁ దెలిపిన దేహములందుఁ గష్టములొంది, పిమ్మటఁ గృమియోనియందు జనించి, పదునాల్గునెలలు జీవించి, యప్పటికిఁ దనకర్మ మెల్ల నశింప మానవుఁడై పుట్టును. వివాహమునకును, యజ్ఞమునకును, దానమునకును నెవ్వఁ డజ్ఞానముచే విఘ్నముగలిగించునో, వాఁడు మృతుండై నపిదపఁ గృమియై జనించి, పదునైదేండ్లు బ్రదికి, తనయధర్మ మనుభవింపఁబడినతోడనే మఱియు, మానవుఁడై పుట్టును. ఎవఁడు ముందుగా నొకనికిఁ గన్నియ నిచ్చియు, దానినే వేఱొకని కీయఁదలంచునో, వాఁడు మృతుండైనపిదపఁ గృమియోనియందు జనించి, యాకృమిగనే పదుమూఁడేండ్లు బ్రదికి, తనయధర్మము నశించినతోడనే మానుషుఁడై పుట్టును. ఎవ్వఁడు దేవకార్యమును, పితృకార్యమును నిర్వర్తింపక ముందుగాఁ భుజించునో, వాఁడు మృతుఁడైనయనంతరము వాయసముగాఁ బుట్టి నూఱేండ్లు బ్రదికి, పిమ్మటఁ గుక్కుటమై జనించి, పిమ్మట వ్యాళమై యొకనెల బ్రదికి, తరువాత మానవుఁడుగాఁ బుట్టును. పితృసముఁడగు జ్యేష్ఠభ్రాత నెవ్వఁ డవమానించునో, వాఁడు మరణమొంది క్రౌంచయోనిజాతుఁడై రెండువత్సరములు బ్రదికి, పిమ్మట మృతుఁడై మానుషత్వ మొందును. శూద్రుఁడు బ్రాహ్మణస్త్రీసంగమ మొనర్చెనేని, కృమియోనిజాతుఁడై యాయువు నశింప, సూకరమై కొంతకాలముండి, మఱియు సూకరముగాఁ బుట్టి, వెంటనే రోగపీడితుఁడై మరణించును. అటులు మృతుఁడై, పిదపఁ గుక్కురమై, యామూఢుఁడు నిజకర్మముచే మరలఁ గుక్కురమై, తద్దేహానంతరమున మానవుఁడై పుట్టును. ఆమానవజన్మమున సంతానము గని మృతుఁడై మరల మూషికమగును ఉపకారము మఱచినవాఁడు యమపురముఁజేరి కుపితులైన యమభటులపోటులపాలై, మఱియు దండమును, ముద్గరమును, శూలమును, దారుణమగు నగ్నికుంభమును, ఘోరమగు నసిపత్రవనమును, వాలుకమును, గూటశాల్మలినిఁ జేరి

వానివలనఁ బెక్కుకష్టము లనుభవించి, మఱియు నెన్నియేని యుగ్రములగుయాతనలకుఁ బాత్రై, పిదప సంసారచక్రమునఁ బడి, కృమియోనియందు జనించును. అటులు కృమియై పదునైదువత్సరములు జీవించి, పిదప గర్భమును బొంది యందే నశించును. పిదప నెన్నేని గర్భములందుఁ బడి, పెక్కుజన్మములొంది, పిదపఁ దిర్యగ్యోనిసంజాతుఁ డగును. మఱియు నెంతేని దుఃఖ మనుభవించి, కొంత కాలమునకుఁ గూర్మమై జనించును. పెరుగు దొంగిలించినవాఁడు బక మగును. పచ్చిచేపల నపహరించువాఁడు కప్పయగును. దుర్బుద్ధియై తేనెను హరించినవాఁ డడవియీఁగ యగును. ఫలమునుగాని, మూలకమునుగాని, యపూపమునుగాని యపహరించినవాఁడు పిపీలిక యగును. రాజమాషమును హరించినవాఁడు దీర్ఘపుచ్ఛమై, గోళరూపముగల కీటమై పుట్టును. పాయసము నపహరించినవాఁడు తిత్తిరిపక్షి యగును. పిష్టమయమగుభక్ష్యమును దొంగిలించినవాఁడు కుంభోలూకమై పుట్టును. దుర్బుద్ధియై యినుము దొంగిలించినవాఁడు వాయసముగా జనించును. దుర్మతియై కాంస్యము నపహరించినవాఁడు హారీతపక్షి యగును. రాజతభాజనమును దొంగిలించిన వాఁడు కపోతమై జనించును. కాంచనపాత్రమును హరించినవాఁడు కృమియోనియందుఁ బుట్టును. ముఱికిలేనిపట్టుచీర నపహరించినవాఁడు తొండ యగును. కౌశికము నపహరించినవాఁడు వర్తకపక్షి యగును. అటులే వస్త్రమును హరించినవాఁడు చిలుకయు, దుకూలము నపహరించినవాఁడు మృతుఁడై హంసయు నగుదురు. ప్రత్తి నెత్తుకవచ్చినవాఁడు క్రౌంచ మగును. అటులే పట్టునూలుగాని, కంబళములు నేయు రోమపదార్థముగాని, క్షౌమవస్త్రమునుగాని దొంగిలించినవాఁడు చెవులపిల్లి యగును. రంగులను హరించినవాఁడు నెమిలియు, రక్తవస్త్రముల నపహరించినవాఁడు చకోరపక్షియుఁ, జందనాదిసుగంధపదార్థహర్త గంధమూషికము నగుదురు. వాఁ డటులు చుంచెలుకయై పదునైదువత్సరములు బ్రదికి, యధర్మము క్షీణించినతోడనే మానవుఁ డగును. పాలు దొంగిలినవాఁడు బలాకయై జనించును. తైలనాగ్థ మృతుఁడై గబ్బిలమై పుట్టును. శస్త్రముగల క్రూరుఁడు శస్త్రహీనుఁడగువానిని సంహరించి, వానియర్థమును దీసికొనెనేని వాఁడు మృతుఁడై, గాడిదగాఁ బుట్టి

రెండువత్సరములు బ్రదికి పిదప శస్త్రహతుఁడగును. పిదప మరల వాఁడు మృగయోనిజాతుఁడై నిత్యము భయశీలుఁడై చరించుచు, నందును శస్త్రవధ మొంది మృతుఁడై, పిదప నొకమీనమై వలలోఁ బడి వధ్యుఁడై, యాచేపమేనితో నాల్గుమాసములు బ్రదికి, పిమ్మట నొకశ్వాపదమై పదివత్సరములు బ్రదికి, పిదపఁ బులియై యైదువత్సరములు జీవించి, కాలవశముగా నిధనమొంది, యప్పటికిఁ దనపాపము నశింపఁగా, నపుడు మానవుఁ డగును. స్త్రీవధ మొనర్చినపాపాత్ముఁడు యమపురమునకుఁ బోయి, యందు బహుక్లేశము లనుభవించి, యిరువదియొక్కమారులు నీచజన్మముల గాంచి గాంచి, తుదకుఁ గృమియోనిసంజాతుఁడై, యటు లిరువదివత్సరములుండి, పిదప మానవుఁ డగును. భోజన మపహరించినవాఁడు మక్షికమై యీఁగలసంఘమునఁ గలిసి, యటులు పెక్కునెలలు జీవించి, పాపక్షయమైనతోడనే మానుషత్వ మొందును. ధాన్యహర్త వూతిమార్జారమగును. అటులే తెలికపిండితోఁ జేసినయాహారమును హరించినవాఁడు దారుణమూషికమై మానవులఁ గఱచుచు నుండును. ఘృతహర్త జలకాకముగను, మత్స్యమాంసహర్త కాకముగను, లవణహర్త చిరకాకముగను జనింతురు. నమ్మకముచేఁ దనయొద్దనుంచినదానిని దాచినవాఁడు, మృతుఁడై మత్స్యయోనియందుఁబుట్టి, మృతుఁడై మానుషత్వమొంది యల్పాయువగును. మఱియుఁ బాపములొనర్చినవారు తిర్యగ్యోనులందుఁ బుట్టుదురు. నిజదేహత్యాగానంతరమున సహాయమొనర్చుధర్మమును మానవులు తెలియరు. ఎవ్వరు పాపములొనర్చియు, వానిని వ్రతములచేఁ బోఁగొట్టుకొందురో, వారు సుఖదుఃఖములకు లోనై వ్యాధితులై జీవింతురు. అట్టివారు పురుషులుగాకుండియు, లేక మ్లేచ్ఛులయ్యు జనింతురు. లోభమోహసమన్వితులై యెవరు పాపసమాచారులగుదురో వారు మ్లేచ్ఛులగుదురు. మఱి యెవ్వరు పుట్టినదాదిగాఁ బాపమొనర్పరో వారు నీరోగులుగను, రూపవంతులుగను, ధనికులుగను జనింతురు. స్త్రీలును నిటులే పాపము లొనర్తురేని, పైఁదెలిపిన నీచజన్మములవారికి భార్యలై జనింతురు. పరధనాపహరణమునఁ గల దోషము లన్నిటిని దెలిపితిని. ఈ నా తెలిపినది మిక్కిలి యల్పము. వేఱొకసందర్భమున మఱియుఁ దెలిపెదను, వినుదువుగాక. ఇది దేవ

ష్ఠలనడుమ నొకబ్రాహ్మణుఁడు చెప్పుచుండఁగా వింటిని. అదియే నీకెఱిఁగించితిని కావున నీవు ధర్మమునందే బుద్ధి నిలుపుము" అని తెలుప విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె.

### అన్నదానకథనము

"ఓమహానీయా! అధర్మగతి యెట్టిదో నా కెఱిఁగించితివి? ఇఁక ధర్మగతి యెట్టిదియో తెలుపుము, వినఁగోరుచున్నాఁడను. పాపకర్మము లొనర్చియు, శుభగతి నెట్టులొందఁగలరు? ఎట్టికర్మ మొనర్చినవారికి శుభగతి గల్గెడిని?"

అది విని యాబృహస్పతి "ఓధర్మతనయా! విపరీతచిత్తుఁడై పాపములొనర్చినవాఁ డధర్మవశుఁడై నరకమునకుఁ బోవును. అవివేకముచేఁ నధర్మమొనర్చి, పిదప నెవఁడు పశ్చాత్తాపపడునో, యట్టి మనస్సమాధియుక్తుఁ డగువాఁడు పాపవిముక్తుఁ డగుచున్నాఁడు. మఱియు నట్టివానిచిత్త మెట్లెట్టిపాపమును నిందసేయునో, యట్టట్టుగాఁ, బాపమునుండి తొలఁగును. పాపమొనర్చినవాఁడు తనపాపమును ధర్మవేత్తలతోఁ దెలిపెనేని, వడిగాఁ దనయధర్మకృతమగు నపవాదమునుండి తొలఁగును. మానవుఁడు పాపముచేసియుఁ దన పాపము పలుమఱు చెప్పికొన్నచో, వాని కాపాపము పోవును. పూర్వభుక్తమై పశ్చాత్తాపయుక్తమైన పాపమునుండి తొలఁగవలయు నన్నచో, సమాహితుఁడై విప్రులకు దానములొసఁగెనేని సర్పము, పొరనుండివలెఁ దొలఁగుచున్నాఁడు. పశ్చాత్తాపయుక్తుఁడైనవాఁడు సుగతి నొందుచున్నాఁడు. పాపము లొనర్చియు, నెట్టిదానములొనర్చి ధర్మమొందునో, యట్టిదానములను దెలిపెదను వినుము. అన్నిదానములలో నన్నదానము శ్రేష్ఠమైనది. ధర్మమును గోరువాఁడు ఋజుబుద్ధియై, ముందుగా నన్నదానము సేయవలయును. మానవుల కదియే ప్రాణములు. ఆయన్నమునుండియే జంతువు జనించుచున్నది. లోకములన్నియు నన్నమందే ప్రతిష్ఠితములై యుండుట నదియే ప్రశస్తమనఁ బడుచున్నది. దేవతలును, మహర్షులును, పితృదేవతలును, మానవులును నన్నమునే కొనియాడుదురు. అన్నదానముచే రంతిదేవుఁడు స్వర్గము నొందెను. న్యాయలబ్ధమగునన్నమునే బ్రాహ్మణులకుఁ బెట్టవలయును. మఱియు స్వాధ్యాయవేత్తలగువారికి సంతోషపూర్వకముగా నన్నము

పెట్టినఁ బరమధర్మమగును. వేవురు బ్రాహ్మణుల కెవ్వఁడు సంతోషముతో నన్నము పెట్టునో, వాఁడు పాపమొనర్చియుఁ దివ్యయోని యందుఁబుట్టెడు. యోగాభిరతుఁడై పదివేవురుబ్రాహ్మణులకు భోజనము పెట్టినవాఁ డఘవిముక్తుఁడగుచున్నాఁడు. భైక్ష్యముచే నన్నము సంపాదించి బ్రాహ్మణులకుఁ బెట్టవలయును. స్వాధ్యాయనిరతుఁ డగు విప్రుని కన్నము పెట్టినవాఁడు సుఖమొందుచున్నాఁడు. బ్రాహ్మణధనములకు హింస యొనర్పక న్యాయముగాఁ బరిపాలించుచుఁ, దనకుఁ బ్రాప్తమైనయన్నమును సమాహితమతియై వేదవృద్ధులగు బ్రాహ్మణుల కొసంగునట్టిక్షత్రియుఁడు, తనదుష్కృతమునుండి తొలఁగుచున్నాఁడు. వ్యవసాయ మొనర్చి, యందుఁ బరిశుద్ధమైన యాఱవభాగముచే నార్జింపఁబడినదానిని వైశ్యుఁడు బ్రాహ్మణుల కిచ్చినచో, వానిపాపము లెల్ల నశించును. ప్రాణసందేహమునొంది కష్టముగా నార్జించినయాహారమును బ్రాహ్మణుల కొసంగెనేని, శూద్రుఁడు పాపవిముక్తుఁడగును. ఒకరిని హింసింపక తనశరీరబలముచేఁ నార్జించి బ్రాహ్మణుల కన్నము పెట్టినవాఁడు సర్వకష్టములనుండి తొలఁగును. న్యాయార్జితమగునన్నమును, వేదవృద్ధులగు విప్రుల కిడినవాఁడు పాపవిముక్తుఁడగును. అటులే సజ్జనులమార్గము ననుసరించి ప్రవర్తించినఁ బాపములు పోవును. బలకరమగు నన్నము పెట్టినవాఁడు బలశాలియగును. పండితసమ్మతమగు నీమార్గమును దాతలొనర్చిరి. అన్నదాతలే ప్రాణదాతలు. వారికే సనాతనధర్మమగును. మానవుఁ డెట్టియవస్థలందైనను ద్రోవదప్పక న్యాయార్జితమగు నన్నమును నిత్యము సత్పాత్రమునకుఁ బెట్టవలయును. అన్నమే పరమగతి. అన్నదానముచే మానవునికష్టము తొలఁగును. కావున న్యాయార్జితమగు నన్నము దాన మొనర్పవలయును. గృహస్థు బ్రాహ్మణునకుఁ బెట్టియే తాను భుజించుటకుఁ బ్రయత్నింపవలయును. మానవుఁ డన్నదానముచేయక దివసమును వ్యర్థపఱుపరాదు. కావున వేదవేత్తలగువేవురకు భోజనము పెట్టవలయును. మఱియు న్యాయధర్మవేత్తలును, నితిహాసవేత్తలును నగువారికి భోజనమిడువాఁడు ఘోరనరకవిముక్తుఁడై, సంసారదూరుఁడగును. అట్టివాఁడు సకలకామసమాయుక్తుఁడై మరణించినపిదప సుఖియగును. నాతెలిపినవిధమునఁ బాపియైనను బశ్చాత్తాపియైనవాఁడు, సురాపియగుటయెగాక కీర్తి

ధనములను సంపాదించువాఁడగును. ఇటు లన్నదానఫల మెఱిఁగించితినిగదే? ఓధర్మజా! దానధర్మములన్నిటికిని నిదియే మూలము" అని తెలుప విని యుధిష్ఠిరుఁ డిట్లనియె.

దానధర్మకథనము

"ఓమహనీయా! అహింసయు, వేదోక్తకర్మాచరణము, నింద్రియ నిగ్రహము, తపము, గురుశుశ్రూషయు, మానవున కెట్టిశ్రేయమును గలిగించును?"

అది విని బృహస్పతి యాభూపతితో "ఓయుధిష్ఠిరా! ఇవియెల్ల భిన్న భిన్నములగుధర్మమార్గములే. ఈయాఱుధర్మమార్గములను దెలిపెదను వినుము. ఎవ్వఁడు హింసారహితముగుధర్మమును సాధించుచుఁ, గామక్రోధముల నియమించి, సర్వభూతహితము నొనర్చునో, వాఁడు సిద్ధినొందును. హింస చేయనిభూతముల నెవ్వఁడు దండించునో, వాఁడు మృతుఁడై సుఖింపనేరఁడు. ఎవ్వఁడు భూతముల నెల్లఁ దనతో సమానముగా నరయునో, యహింసకుఁడును, క్రోధరహితుఁడు నగునట్టి వాఁడు మృతుఁడై సుఖించుచున్నాఁడు. సకలభూతాత్మభూతుఁడై సర్వభూతముల నరయువాని మార్గమును దేవతలును దెలియఁజాల కుందురు. దానప్రత్యాఖ్యానములందు సుఖదుఃఖములందును, బ్రియాప్రియములందును, నెవ్వఁడు భూతము నెల్లఁ దనతోఁ దుల్యముగాఁ గనుఁగొనునో, వాఁడు ప్రమాణపదము నొందును. ఒకఁ డితరులయెడ నెట్లు ప్రవర్తించునో, యితరులును వానియెడ నటులే ప్రవర్తింతురు. జీవలోకమునఁ దనతోడి సాదృశ్యమును భావించుటయే నిపుణధర్మముగా నిరూపింపబడియెను" అని తెలిపె నని చెప్పి వైశంపాయనుఁడు ఓజనమేజయా! బృహస్పతి యిట్టు లాయుధిష్ఠిరున కెఱిఁగించి యందఱివారందఱు నరయుచుండఁగనే స్వర్గమునకుఁ బోయెను. అని తెలిపి మఱియు నిట్లనియె.

మాంసవర్జనకథనము

ఓజనమేజయా! అనంతర మాయుధిష్ఠిరుఁడు శరతల్పగతుఁడై యున్న పితామహునే మఱియుఁ బ్రశ్నించువాఁడై "ఓతాతా! వేదప్రామాణ్యమునుబట్టి దేవతలును, మహర్షులును, బ్రాహ్మణులును నహింసా

ధర్మ మ్ముత్తమమని మెత్తురు. మనోవాక్కర్మములచే మానవుఁ డేదేని హింసచేయక తప్పదు గదా! అట్టితఱి నాతనికి దుఃఖవిముక్తి యెటు లయ్యెడిని?"

అది విని భీష్ముఁడు "ఓధర్మపుత్రా! నీవడిగిన యీయహింస, నాల్గువిధములుగా బ్రహ్మవాదులచే నిర్దేశింపఁబడియెను. మనసు, వాక్కు, కర్మము, భక్షణము అనునాల్గిటిచేఁ గల్గుహింసలలో నొక్కటి లేకున్నంతమాత్ర మహింస యనిపించుకొనదు. నలువిధములగుహింసలు లేకుండవలయును. నాల్గుపాదములుగలజంతువు మూఁడుపాదములపై నిలువఁగలుగునా? అటులే యిదియు నాల్గువిధములహింసయు లేకున్నపుడే, యగుచున్నది. ఏన్గుపాదములోఁ దక్కినజంతువుల పాదములన్నియు నిముడునట్లుగా, నెల్లధర్మములును నహింసాధర్మమున నిమిడియున్నవి. మనోవాక్కర్మములలో దేనిచే నహింస యొనర్చినను బాపలేపము గలుగకమానదు. వానిలోఁ దొలుత మానసముచే నహింసను విడిచి, పిదప వాక్కుచేతను, బిమ్మటఁ గర్మముచేతను, నహింస యొనర్పవలయును. మాంసము నీమూఁడిటిచే విడిచినవాఁడే విముక్తుఁడగును. ఈమూఁడును గారణములని బ్రహ్మవాదులు చెప్పుచున్నారు. మనోవాక్కర్మముల మూఁడిటియందును దోషముండుటం బట్టియే తపోధనులు మాంసభక్షణము పరిత్యజించిరి. ఇఁక మాంసభక్షణమునఁ గలదోషము తెల్లముగ వివరించెదను వినుము. అవివేకియై యెవ్వఁడు మాంసమును దినునో, వాఁడు పుత్రమాంసమును దినునట్టివాఁడై యధముఁ డనఁబడును. పితృమాతృసమావేశముచేఁ బుత్రత్వమును గల్గునట్లుగా, నవశుఁడైనను హింసనొనర్చినచోఁ, బాపము ప్రబలక తప్పదు. రసజ్ఞానము జిహ్వచే గల్గునట్లు శాస్త్రములయందు దభిలాషము నిత్యానుభవముచే నగుచున్నది. సంస్కృతాసంస్కృతములును లవణాలవణములు నగుపక్వములట్లు భావములును భిన్న భిన్నములై మానసమును నిరోధించును. మాంసభక్షులై మందులైనమానవులు భేరీమృదంగశబ్దములను, దంష్ట్రిశబ్దములను నెట్లు సేవింపఁగలుగుదురు? రసలోభముచేఁ గొందఱు మాంసమును బ్రశంసింతురుగాని, యది యనిర్దిష్టము నసంకల్పితము నగుచున్నది. మాంసప్రశంస దోషకర్మఫలముతోఁ గూడినదని తెలియవలయును, అనేకులు సజ్జనులు

జీవితమును విడిచియు, నిజమాంసములచేఁ బరమాంసములఁ బొలెంచుచున్నారు. ఓమహారాజా! సర్వధర్మసంగ్రహముగు నీయహింసాధర్మమిట్లు నాల్గు కారణములుగలదై యుండు”నని తెలుప వినియుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె.

“ఓపితామహా! అహింసయే పరమధర్మమని పలుమఱు తెలిపితివి. శ్రాద్ధములందుఁ బితరులు మాంస మపేక్షింతురనియు నీవే తెలిపితివి. మున్నొకసందర్భమున బహువిధమాంసములచే శ్రాద్ధవిధి యొనర్పవలయుననియుఁ జెప్పితివి. ఒక ప్రాణికి హింసచేయకుండ నేని మాంసము లభింపదుగదా! ఇది నాకు విరోధముగా నగపడుచున్నది. మాంసవర్జనము గలధర్మమునెడ నాకెంతయు సందియ మొదవెడిని. మాంసభక్షణ మొనర్చినవాని కెట్టిదోషము? మాంసము దినకున్నవాని కెట్టిగుణము? అందు నొకదానిని జంపి తినినవానికిని, బరునిచే హతమైనదాని మాంసము తినువానికిని, నొకనికిఁగా నొక ప్రాణిని హింసించినవానికిని, మాంసము ధనమిచ్చి కొని తినువానికిని గలభేద మేమి? దీనిని నీవు తెలుపఁగా వినఁగోరుచున్నాఁడను. ఈసనాతన ధర్మమును నిశ్చయముగాఁ జేయఁదలంచియున్నాఁడను. మఱియు నాయు వెట్లు గలుగును? సత్త్వవంతుఁ డెట్టులగును? ఏమి యొనర్చిన నంగలోప మొదవకుండును? రూపవంతుఁ డెట్టులగును?”

అది విని భీష్ముఁడు “ఓయుధిష్ఠిరా! మాంసభక్షణ మొనర్పకున్న నెట్టిధర్మమగునో, దీనికగునుత్తమవిధి యెట్టిదియో, యందలి యథార్థ మెఱిఁగించెదను వినుము. అంగలోపము లేకుండుటయు, సురూపము, నాయువు, బుద్ధిసత్త్వము, బలము, స్మృతి మున్నగు వానినిఁ బొందఁదలఁచినమహాత్ములచే హింస పరిత్యజింపఁదగినది. ఈవిషయమున మహర్షులకుఁ బలుమఱు పెక్కుసంవాదములు జరగెను. అట్టి సంవాదమున వారికి సమ్మతమగుదాని నెఱిఁగించెదను వినుము. ప్రతిమాసమందును యతవ్రతుఁడై యెవ్వఁడు వాజిమేధ మొనర్చునో వాఁడును, మధుమాంసముల వరించినవాఁడును సము లనఁదగియుందురు. ఓరాజా! పండితులగుసప్తర్షులును, వాలఖిల్యులును, మరీచిపులును మాంసభక్షణవర్జమే ప్రశస్తమని పొగడిరి. ఎవ్వఁడు మాంసమును భక్షింపకయు, జంతువును జంపకయు, హింసింపకయు నుండునో,

వాఁడు సకలభూతములకును మిత్రుఁడని స్వాయంభువమనువు చెప్పియున్నవాఁడు. మాంసమును వర్జించినవాఁడు సకలభూతములకు నమ్మఁదగినవాఁడును, నధృష్యుఁడును, సాధుసమ్మతుఁడును నై వెలయును. పరమాంసముచే నెవ్వఁడు స్వమాంసమును వృద్ధినొందింప నెంచునో, వాఁడు తప్పక నశించుచున్నాఁడని ధర్మాత్ముఁడగు నారదుఁడు పలికెను. మధుమాంసవర్జనముచేఁ దపస్వియు, దాతయు, యాగకర్తయు ఫలమొంద నగుచున్నది. ఎవ్వఁడు నూఱువత్సరములు వరుసగాఁ బ్రతిమాసమందును నశ్వమేధ మొనర్చునో, వానికగు ఫలము మాంసభక్షణము పరిత్యజించినవానికగును. మధుమాంసవర్జనము చేసినవాఁడు సదాదాతయు, సదాతపస్వియు, సదాయాగకర్తయు ననఁబడును. ఎవ్వఁడును మాంసభక్షణము సేయవచ్చునని వేదములు, యజ్ఞములును విధానము చేయఁజాలవు. మాంసరసము నెఱిఁగినపిదప దానిని పరిత్యజించుట దుష్కరము. సకలప్రాణుల కభయము నిచ్చునట్టి యీ మాంసపరివర్జన మనియెడి పుణ్యవ్రతము చేయుట శ్రేయస్కరము. ఎవ్వఁడు వివేకియై సకలభూతములకు నభయదక్షిణ నొసంగునో, వాఁడు లోకమునఁ బ్రాణదాత యనుటలో సంశయము లేదు. వివేకులగువారు దీనిని పరమధర్మమునుగాఁ బ్రశంసించుచున్నారు. తనకుఁ బ్రాణము లెట్టు లభీష్టములో తక్కిన ప్రాణులకును నటులే గదా! అట్టివిషయమున బుద్ధిమంతులగువారు తమసాదృశ్యము నేల చూడరాదు? మృత్యువువలన భయముగలదని తెలిసిన శ్రేయోభిలాషులు, జీవితాభిలాషగల ప్రాణులను జంపరాదని వేఱుగ నొక్కి వక్కాణింపవలయునా? మాంసోపజీవులై పాపులు, రోగరహితములై యేపాపమెఱుఁగనిజంతువుల హింసించుట యేమిపని? ఓమహారాజా! కావున మాంసపరివర్జన ముత్తమమని తెలియుము. ఇయ్యది ధర్మాయతనమును, శ్రేష్ఠమును నై స్వర్గమునకును, సుఖమునకును నిమిత్తమగుచున్నది. అహింసయే పరమధర్మము. అదియే పరమతపము. అదియే పరమసత్యము. దానినుండియే ధర్మము ప్రవర్తిల్లుచున్నది. మాంసము తృణమునుండిగాని, కట్టెనుండిగాని, పాషాణమునుండిగాని లభింపదు గదా! జంతువును జంపుటవలనఁగదా మాంసము లభించును. కావున మాంసభక్షణమున దోషము గలదు. సత్యార్జవప్రియులగు దేవతలు

స్వాహాస్వధామృతభోజనులు. జిహ్వారసపరాయణులగు క్రవ్యాదులను రాజసులఁగాఁ దెలియుము. ఘోరకాంతారములందును, గహనదుర్గములందును, రాత్రియుఁ బవలును, సంధ్యలయందును, జత్వరములందును, సభలందును, మృగవ్యాధభయప్రదములగుశస్త్రము లెత్తిన వేళలందును, మాంసభక్షణము లేకున్నచో భయమనునది గలుగదు. మాంసభక్షకులు లోకమున లేకున్నచో, మానవుఁడు సర్వభూతశరణ్యుఁడును, సర్వజంతువిశ్వాస్యుఁడును నై యెవ్వనికిని భయమొదవింపఁడు. అట్టిపట్టున ఘాతకుఁడే లేకుండుటను లోక మెవ్వనినుండియు నుద్వేగ మొందదు. మాంసము దినువాఁడే లోకమున లేకున్నచో, వానికిఁగా జంతువులను జంపుఘాతకుఁడును లేకుండును. మాంసము భక్ష్యముగాదనునప్పుడే హింస తొలఁగుచున్నది. ఖాదకులకుఁగా, మృగహింస జరుగుచుండును. మాంసము హింసకులయాయువు మ్రింగును. అటులగుట శ్రేయముఁ గోరువాఁడు మాంసవర్జన మొనర్పవలయును. క్రూరులగుప్రాణిహింసకులకు రక్షకులుండరు. అదియుఁగాక వారు సకలభూతములకును, వ్యాళమృగములట్లు భూతభయంకరులుగా నుందురు. లోభమువలనఁగాని, బుద్ధిమోహమువలనఁగాని, బలవీర్యార్థముగాఁగాని, పాపాత్ములసంసర్గముచేఁ గాని మానవుల కధర్మమున రుచిగలుగుచుండును. ఎవ్వఁడు పరమాంసముచే నిజశరీరమాంసమును వృద్ధినొందింప నెంచునో, యెందెందుఁబోయినను వాఁడు భయపడుచునే యుండవలయును. నియతమానసులగు మహర్షులు మాంసభక్షణవర్జనమును ధన్యముగను, కీర్తికరముగను, నాయుష్కరముగను, శుభప్రదముగను, స్వర్గకరముగను దెలుపుచున్నారు. ఓకౌంతేయా! మాంసభక్షణమున నెట్టిదోషములు గలవో వానిని మార్కండేయుఁడు తెలుపుచుండఁగా మున్ను నేను వింటిని. జీవితాభిలాషముగల ప్రాణులమాంసముల నెవ్వఁడు భక్షించునో, వాఁడొకనిచే హతములై మృతములైన వానిమాంసము దిన్నను, ఘాతకునిపాతక మాతనికిఁ గలుగకపోదు. ధనమిచ్చి, కొనినవర్తకుఁడును, దానికి ద్రవ్యమిచ్చి కొని దినినభోగియు, నమ్మాంసముగల జంతువును వధబంధములఁ జంపినఘాతకుఁడును దుల్యులే. అమ్మాఁడును వధములే యగుచున్నవి. ఒకప్పుడు మాంసమును దినకున్నను,

భావదోషముచే జంతుహింసను సమ్మతించినవాఁడును, తద్దోషభాజనుఁడగుచున్నాఁడు. ప్రాణులయెడ దయగలిగి, మాంసభక్షణవర్జన మొనర్చినవాఁడు సకలభూతములకు నమ్మఁదగినవాఁడును, నీరోగియు సుఖియు నగుచున్నాఁడు. సువర్ణభూమి గోదానఫలముకంటెను, మాంసభక్షణధర్మ మెక్కుడని నొక్కి వక్కాణింపవచ్చును. విధిహీనమును నప్రోక్షితమును నగుమాంసము దినరాదు. అటులే వ్యర్థముగా మాంసమును దినరాదు. అటులుగాక భక్షించునేని నిరయగతుఁడగుటలో సందియము లేదు. ప్రోక్షితము నభ్యుక్షితము నైనదియు, బ్రాహ్మణునికోర్కెపైఁ దెచ్చినదియు నగుమాంసము దిన్నచో నల్పదోషమగుననియును, నటులుగానిమాంసమును దిన్నచో దోష మధికమనియుఁ దెలుపుదురు. పురుషాధముఁడగు నెవ్వఁ డొకనికిఁగా జంతువును హింసించునో, యట్టిహింసయం దాఘాతకుఁడే దోషకరుఁడగునుగాని, ఖాదకుఁడు దోషపాత్రుఁడు గాఁడని కొందఱిమతము. దేవపూజయు, యాగము మున్నగు వేదోక్తమార్గములు మిషముగా, నామిషము నేయధముఁడు భుజింప నెంచి జంతువధ మొనర్చునో, వాఁడు తప్పక నరకగతుఁడగును. ఎవ్వఁడు మాంసమును దినియు, బుద్ధి మరలించుకొని మాంసభక్షణమునుండి నివర్తిల్లునో, వానికెంతయు ధర్మమగుచున్నది. మాంసమును దెచ్చినవాఁడును, దాని ననుమతించినవాఁడును, చంపినవాఁడును, గొనినవాఁడును, సంస్కరించినవాఁడును, భుజించినవాఁడును ఘాతకులే యనఁబడుచున్నారు. విధినిర్మితమగు వేదోక్తప్రమాణమును దెలిపెదను వినుము. అయ్యది పరమప్రాచీనమై మహర్షులకును దేవతలకును సమ్మతమైనది. ప్రజార్థులగువారిచేఁ బ్రవృత్తిలక్షణధర్మమై యది చెప్పఁబడియెను. దానిని మోక్షాపేక్షగలవాఁ డాచరింపఁరాదు. వేదోక్తమార్గముచేఁ బితృక్రియలయందు మంత్రములచేఁ బ్రోక్షితము, నభ్యుక్షితము నై సంస్కరింపఁబడినమాంసము హవిస్సుగాఁ బరిణమించి శుచియగుచున్నది. అందులకు విరుద్ధముగా వృథామాంసభక్షణము సేయరాదని మనువు చెప్పియున్నాఁడు. విధిహీనమగు మాంసమును భక్షించుట, నస్వర్గ్యము, నపకీర్తికరము నగుట మాంసభక్షణము సేయరాదు. ఎవ్వఁడు తనకు హానిగలుగకుండఁ బ్రవర్తింపనెంచునో,

వాఁడు విధిహీనమును, నప్రోక్షితమును, బ్రయోజనశూన్యము నగు మాంసము దినరాదు. పూర్వకల్పమున మానవులకు బ్రీహిమయ పశువే విధింపఁబడియెను. అట్టిదానిచే యాగమొనర్చినయాజకులే పుణ్యలోకపరాయణు లగుచున్నారు. మున్నొకపుడు చేదిపతి యగు వసువనువాఁడు మహర్షులచేఁ బ్రశ్నింపఁబడి యభక్ష్యమగుమాంస మును భక్ష్యమని పలికి స్వర్గమునుండి పుడమిపైఁబడియెను. పిదప నతఁడు మఱియును, నామాటనే చెప్పి రసాతలమునకుఁ బోయెను. మహాత్ముఁడగునగస్త్యుఁడు ప్రజాహితముగా, సర్వదేవతా ప్రీతిగల్గు నట్లుగా, నారణ్యకమృగములను బ్రోక్షించి వధించెడివాఁడు, దేవ తలకును బితృదేవతలకునుగాఁ జేసినయట్టిక్రియలు హీనములుగావు. అయినను, ఓరాజా! మఱియొకటి వినుము. మాంసభక్షణపరిత్యాగ ముచే సర్వసుఖము లగుచున్నవి. ఎవ్వఁడు నూఱేండ్లు సంపూర్ణముగా దారుణ తపమొనర్చునో వాఁడును, మాంసభక్షణము పరిత్యజించిన వాఁడును దుల్యులగుచున్నారని నాయభిప్రాయము. అందును శుక్ల పక్షమున విశేషించి మధుమాంసముల వర్జించుటధర్మప్రదముగా విధింపఁ బడుచున్నది. ఎవ్వఁడు నాల్గువత్సరములు నాల్గుమాసములును మాంస మును బరిత్యజించునో, వాఁడు కీర్త్యాయుర్యశోబలము లనియెడి నాల్గుశుభముల నొందుచున్నాఁడు. లేదా! ఎవ్వఁడు తుద కొకమాస మేని సకలమాంసములను బరిత్యజించునో, వాఁడు సకలదుఃఖములను గడచి సుఖియై, నిరామయుఁడై జీవించును. ఎవ్వఁడు నెలలకొలఁదిని, బక్షములకొలఁదిని మాంసమును మానునో, వాఁడు హింసా నివృత్తుఁడై బ్రహ్మలోకమునకుఁ బోఁగలుగుచున్నాఁడు. ఉత్తమార్థ వేత్తలును సర్వభూతాత్మభూతులు నగురాజులచే శుక్లపక్షమున మాంసము పరిత్యజింపఁబడియెను. నాభాగుఁడు,అంబరీషుఁడు, గయుఁడు, ఆయువు, అనరణ్యుఁడు, దిలీపుఁడు, రఘువు, పూరువు, కార్తవీర్యుఁడు, అనిరుద్ధుఁడు నహుషుఁడు, యయాతి, నృగుఁడు, విష్వక్సేనుఁడు, శశి బిందువు, యువనాశ్వుఁడుఁ, శిబి, ముచుకుందుఁడు, మాంధాత, హరి శ్చంద్రుఁడు, నాచెప్పినచొప్పున మాంసమును బరిత్యజించిరి. సత్యమునే పలుకవలయును. సత్యము సనాతనధర్మము. సత్యమువలననే హరి శ్చంద్రుఁడు స్వర్గమునఁ జంద్రునట్లు వెలయుచున్నాఁడు. మఱియు,

శ్యేనచిత్రుఁడు, సోమకుఁడు, వృకుఁడు, రంతిదేవుఁడు, వసువు, సృంజయుఁడు, కృపుఁడు, భరతుఁడు, దుష్యంతుఁడు, కరూషుఁడు, రాముఁడు, అలర్కుఁడు, నళుఁడు, విరూపాశ్వుఁడు, నిమి, జనకుఁడు, పృథువు, వీరసేనుఁడు, నైక్ష్వాకుఁడగు శంభుఁడు, శ్వేతుఁడు, సగరుఁడు, అజుఁడు, దుందువు, సుబాహువు, హర్యశ్వుఁడు, క్షుపుఁడు, భరతుఁడు మఱియుఁ గల యనేకులును, శుక్లపక్షమున మాంసమును బరిత్యజించి స్వర్గము నొందిరి. వారు మఱియు శోభాశ్రయులై బ్రహ్మలోకమునఁ బ్రజ్వరిల్లుచున్నారు. వారి నప్సరసలును గంధర్వులును సేవించుచున్నవారు. అహింసాలక్షణమగు నీధర్మ ముత్తమమైనది. మధుమాంసముల నెవ్వరు వర్జింతురో, ధార్మికులును మహాత్ములునగువారు స్వర్గమున సుఖనివాస మందుదురు. పుట్టినది మొదలుగా, మద్యమాంసములవిడిచినవారు మునులుగాఁ జెప్పఁబడుచున్నారు. మాంసభక్షణరహితమగు నీధర్మము నెవ్వఁ డాచరించునో, మఱియు నెవ్వఁడు వినిపించునో, వాఁడు దురాచారుఁడయ్యు నరకదూరుఁ డగుచున్నాఁడు. ఓరాజా! దీని నెవ్వఁడు పఠించునో, వినునో, వాఁడు సర్వపాపవిముక్తుఁడై సర్వకామసంపూర్ణుఁ డగుచున్నాఁడు. మఱియు నట్టివాఁడు తనవారిలో నుత్తమతఁ గాంచుచున్నాఁడు. ఆపన్నుఁడగువాఁ డాపదనుండియు, బద్ధుఁడగువాఁడు బంధమునుండియు విముక్తులగుదురు. అటులే యీ ధర్మము నెఱిఁగినవాఁడు రోగియేని రోగమునుండియు, దుఃఖితుఁడేని దుఃఖమునుండియు విముక్తుఁడై, యున్నటికిని దిర్యగ్యోనిగతుఁడుగాక రూపవంతుఁడును, బుద్ధిమంతుడును నై మిక్కిలి కీర్తిని నైతము వడయును. మాంసపరివర్జనమునుగూర్చి ప్రవృత్తినివృత్తులం దెట్టి విధియో వివరించితిని" అని తెలుప విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె.

### అహింసాఫలకథనము.

"ఓపితామహా! ఈమానవులు వివిధములగుభక్ష్యములను బరిత్యజించి రాక్షసులట్లు క్రూరులై మాంసాభిలాషులగు టేమి? అనేకవిధములగు నపూపములు గలవు. సకలవిధములైనశాకములు గలవు. ఖాండవములగు రసవత్పదార్థములు గలవు. వానినన్నిటిని మాంసమట్లు గోరకుందురేమి? దీనిని దెలిసికొనుటలో నాబుద్ధి వ్యామోహ

మందెడిని మాంసములో రసముకంటె మత్తేమియు లేదనితలంచె
దను. కావున మాంసభక్షణపరివర్జనమునఁ గలగుణము లెవ్వియో
మఱియు వినఁగోరుచున్నాఁడను. అటులే మాంసభక్షణమునఁ గల
దోషములను వినవలయును. మఱియు భక్ష్యాభక్ష్యముల నెఱిఁగిం
పుము. ఏయేభక్ష్య మెట్టిదో, దేనిగుణ మెట్టిదో, దేనియం దెట్టి
దోషమో యనువిషయముల నెఱిఁగింపుము.''

అది విని యాశాంతనవుఁ డాకౌంతేయునితో "ఓధర్మసుతా!
రసమునుబట్టి చూడఁగా మాంసమునుమించిన దిష్పుడమిని వేఱొకటి
లేదు సుమీ! కృశులు, క్షీణులు, తప్తులు, గ్రామ్యధర్మరతాత్ములు,
మార్గక్లేశదుఃఖితులు నగుమానవులకు మాంసమునుమించిన మంచి
పదార్థము మఱియొకటి లేదనుట సత్యము. అయ్యది తత్క్షణమ ప్రాణ
ములను బుష్టినిఁ గలుగఁజేయును. భక్ష్యములలో దానినిమించినది
లేదని చెప్పుట కల్లగాదు. అయినను ఓకురునందనా! దానిని వర్జించిన
పెక్కుగుణములు లేకపోలేదు. వానిని వివరించెదను వినుము. పర
మాంసముచే నిజమాంసము నెవఁడు వృద్ధినొందింప నెంచునో,
వానిని మించినక్షుద్రుఁడును గ్రూరుఁడును లేఁడనుట సత్యము. లోక
మునఁ బ్రాణములనుమించిన ప్రియతరవస్తు వుండదుగదా! కావునఁ దన
యం దెట్టులు దయగలిగియుండునో, మానవుఁ డటులే పరునియందును
దయగలిగి వర్తింపవలయును. మాంసము శుక్రమువలనఁ బుట్టుచున్న
దనుటలో సందియము లేదుగదా! కావున దానిభక్షణమున గొప్ప
దోషమును, దానిని బరిత్యజించిన గొప్పసుకృతమును గలుగును.
వేదోక్తవిధినిబట్టి యొకపుడు భుజించిన దోషము లేదని తెలియుము
పశువులు యజ్ఞమునకుఁగా సృజింపఁబడియెనని వేదములు ఘోషించు
చున్నవి. నిజబలముచే నార్జించినమాంసమును దినిన దోషము లేదు.
మున్ను మహాత్ముఁడగునగస్త్యుఁడు సకలదేవతాప్రీతికరముగా నార
ణ్యకమృగములనెల్లఁ బ్రోక్షించి మృగయావినోద మతఁ డాద
రించెను. నిజప్రాణపరిత్యాగము నంగీకరించియే గదా మృగ
యావినోద మొనర్పవలసియుండును? భూతసమత్వముగల్గియే యొక
దానిని జంపుటకో, లేక దానిచేఁ జచ్చుటకో నిశ్చయించు
కొనును. కావుననే రాజర్షులందఱును, మున్ను వేఁటయం దాసక్తి

గలిగియుండిరి. దీనిచేఁ బాపలేపము గలుగదని తెలియుచున్నారు. కావున లోకమున నిది యెన్నఁడగియే యున్నది. ఓకురునందనా! అయినను సకలభూతదయ యుండెనేని, యేప్రాణియు నాదయావంతునియెడ భయమునొందదు. దయావంతునకుఁ దపస్విలకగులోకములు సిద్ధించును. అహింసాలక్షణధర్మము పరమధర్మమనియే పలుకుదురు. కావున వివేకముగలవా రహింసాత్మకమగుసత్కర్మమునే చేయవలయును. పితృదైవతపూజలందుఁ బ్రోక్షితమగుహవిస్సు నర్పింపవలయు ననియే చెప్పఁబడుచున్నది. స్వభూతములకు నభయ మొసంగువాఁడే దయాపరుఁడగుచున్నాఁడు. సకలభూతాభయమే శ్రుతులయందున్నది. ఎట్టి యవస్థలందును సకలభూతములును, క్షతుని, స్ఖలితునిఁ, బతితుని, హతునిఁ గ్లేశమందినవానిని రక్షింపఁజూచుచుండును. అట్టిదురవస్థలోనున్న ప్రాణి క్రూరమృగముగాని, పిశాచములుగాని, రాక్షసులుగాని చంపఁజూడరు. భయకాలములందు విడువవలయును. ప్రాణదానమును మించినదాన మొకటిలేదని నమ్మవచ్చును. నిజశరీరమును మించిన ప్రియవస్తువు లేదనుట నిశ్చయముగదా! ఓధర్మజా! అటులే సకలభూతములకును మరణ మిష్టపడదనుట సత్యముగదా! భూతములకన్నిటికిని మృత్యుకాలమునఁ దప్పక తత్క్షణము వణఁకు పుట్టును. ఈ సంసారసాగరమున, వ్యాధి జన్మజరాదుఃఖములచే నిత్యము ప్రాణులు క్లేశముగఁ బరివర్తించుచుండియు మరణమనిన జంకుచుండును. గర్భవాసమున క్షారామ్లకటుకరసములచేఁ గ్లేశమందుచు, మఱియు దారుణములగుమూత్రశ్లేష్మపురీషములకు లోనై యందు దుఃఖితులగుచుఁ, బుట్టియు నవశులై మాంసము నభిలషింతురు. అట్టిమానవు లాయా నీచయోనిసంజాతులై మరణించినపిదప బలాత్కారముగాఁ గుంభీపాకాదినరకములందు మఱిమఱియుఁ గ్లేశమందుదురు. పుడమినున్నవానిలో నాత్మను మించినప్రియవస్తు వొకటియుండదు. కావున సకలప్రాణులయందును దయావంతుఁడు గావలయును. ఓరాజా! తన జీవితకాలములో, దేనిమాంసమో, నెవ్వఁడు భక్షింపకుండునో వాఁడు స్వర్గమున నుత్తమస్థానము నొందునని తెలుపుటకు సందియమందనక్కఱలేదు. బ్రతుకఁ దలఁచియున్న ప్రాణులమాంసముల నెవ్వరు భక్షింతురో, వారును నాయాభూతములచే భక్షింపఁబడు

దురనియే నాయభిప్రాయము నన్ను వాఁడు పూర్వజన్మమున భక్షించుటనుబట్టి నేను వానిని భక్షించెదను అను పలుకుబడినిబట్టియే దీనికి మాంసమని పేరువచ్చెను. ఘాతకుఁడు తప్పక వధింపఁబడును గదా! అటులగుట మాంసభక్షకునకును వధము తప్పదు. తనపైఁ గోపముగలవానినిఁ దిట్టుటయుఁ దాను ద్వేషించినవాఁడు తనపై వైర మూనుటయు సంభవమెగదా! అటులగుట నేయేశరీరముచే, నేయే కర్మముచేయునో, తా నాయాశరీరముతో నాయాఫలమును మానవుఁ డనుభవించును. కావున, నహింసయే పరమధర్మము. అదియే యుత్తమ దమగుణము. అదియే యుత్తమదానము. అదియే పావనతపము. అహింసయే పరమయజ్ఞము. అదియే పరమబలము. అదియే పరమమిత్రమును, బరమసుఖమును నగుచున్నది. అదియే పరమసత్యము. అదియే పరమ వేదము. సర్వయజ్ఞఫలమును, సకలతీర్థస్నానఫలమును, నహింసకు సాటిరాఁజాలవు. అహింసకున కక్షయ్యసుఖ మగును. అహింసకుఁడే సదా యాగకర్తయగును. అట్టివాఁడే సకలభూతములకును దల్లియుఁ దండ్రియు నగును. ఓకురువర్యా! అహింసాఫల మిట్టిదై యున్నది. దానియందుఁ గలగుణములు నూఱేండ్లకేని వర్ణింప వలనుపడవు." అని తెలుప విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె.

## కీటోపాఖ్యానము

"ఓపితామహా! ఇష్టమున్నవారును లేనివారునుగూడ మహా రణరంగమున మడియుచుందురుగదా! వారి కెట్టిగతి గలుగునో, తెలుపుము. మానవులకు మహారణరంగమునఁ బ్రాణములను బరిత్యజించుట మహాకష్టము. ఓమహాప్రాజ్ఞా! ప్రాణపరిత్యాగ మతిదుష్కరమగుట నీవును నెఱుంగుదువు. సమృద్ధియున్నను లేకున్నను, సుఖమున్నను లేకున్నను, బ్రదుకవలయుననియే ప్రాణి కోరుచుండును. నీవు సర్వజ్ఞుఁడవగుట నందుఁ గలకారణ మెద్దియో నాకెఱిఁగింపుము"

అది విని భీష్ముఁ డయ్యుధిష్ఠిరునితో "ఓయీ! సమృద్ధియున్నను లేకున్నను, సుఖమైనను, గష్టమైనను సంసారమునఁబడిన మానవులు దానియందు సక్తులైయుండుటకుఁ గారణమేమియో తెలిపెదను వినుము. నీవిపుడు మంచి ప్రశ్న మొనర్చితివి. ఇందులకుఁ దగు నొక

పురావృత్తమును దెలిపెదను. అయ్యది వ్యాసునకు నొకకీటముతో జరగినసంవాదము. కృష్ణద్వైపాయనమహర్షి బ్రహ్మభూతుఁడై చరించుచు, వడిగాఁ దనసమీపమున నొకమార్గమునఁ బరుగిడుచున్న యొకకీటమును గాంచి సర్వభూతగతిజ్ఞుఁడును, సకలప్రాణిభాషావేత్తయు సర్వజ్ఞుఁడును నగుట దానితో 'ఓకీటమా! నీవు జడిసిన యట్టిదానిపోలె వడిగలిగి చూడఁబడుచున్నాఁడవు. నీ వెందులకుఁ బరువులిడుచున్న వాఁడవు? నీ కేప్రాణివలన భయము గలిగెను?' అని ప్రశ్నించెను. అది విని యాకీటము 'ఓమహానీయా! అదె యేదో యొకగొప్పబండి వచ్చుచున్నది. దాని గొప్పచప్పుడు నాకు భయము గలిగించెను ఆదారుణారావమును నీవును వింటివిగాదే? దానివలన నాకుఁ బ్రమాదము గలుగునేమో యని తొలఁగిపోవుచున్న దానను. ప్రతోదప్రహారము లొందుచు, గొప్పబరువు మోయుచు నిట్టూర్పు లిడుచున్న వృషభములచప్పు డీసమీపముననే వినవచ్చుచున్నది. మానవు లెవ్వరో వానినిఁ దోలుచున్నట్లును బలువిధముగా ధ్వని వినిపించెడిని. కీటయోనినగు నాయట్టిదాని కాకట్టిడిచప్పుడు వినుటకును వీలుపడకున్నది. కావున దారుణమగు నీభయమునుండి తప్పించుకొని పోవలసియున్నది. భూతములకు మృత్యువనునది బహుదుఃఖకరము. జీవితము దుర్లభముగదా! అటులగుట జడిసి పోవుచున్నాను. సుఖము నుండి యసుఖమునకుఁ బోజాలను.' అని ప్రత్యుత్తరమిచ్చెను. అంత నాతఁడు, మఱియు నాకీటముతో 'ఓపురుషా! నీకు సుఖమన నెట్టిది? తిర్యగ్యోనియందుఁ బుట్టిన నీకు మరణమే సుఖమని తలంచెదను. శబ్దస్పర్శరసగంధములను, బహువిధములగు భోగములను నొకపుడేని గుఱుతెఱుంగవుగదా! ఇట్టి నీకు మరణమే శ్రేయముగాదే?' అని పలికెను. అందుల కాకీటము 'ఓమహాత్మా! జీవున కెల్లయెడలను సుఖమే. కావున నాకీబొందియు సుఖముగనే యున్నది. ఓమహాప్రాజ్ఞా! ఇదియే నానిశ్చయము. కావున జీవింపనే కోరుచున్నాను. దేహమునకు పలయున దెల్ల నిందును గలిగియేయున్నది. మానుషభోగములు విశేషించి భిన్నములుగా నుండును. నేను మున్ను మానవులలో బహుధనముగలశూద్రుఁడనై యుంటిని. బ్రాహ్మణద్వేషినై క్రూరుఁడనై లుబ్ధుఁడనై వృద్ధిచే జీవించుచుఁ, బరుషభాషణములఁ బలుకుచు, నికృతిప్రజ్ఞుఁ

డనై యెల్లవిధముల నెల్లవారికిని వైరినై రహస్యముగాఁ బరధనముల నపహరించుచుఁ బ్రవర్తించితిని. నేను నాయింట నాభృత్యులను, నతిథులను నాదరింపక చరించితిని. మఱియు, మాత్సర్యమును బట్టియుఁ, గ్రౌర్యముఁబట్టియు నాఁకలిచేఁ దినవలయునని దేవతలకును, బితృదేవతలకును బెట్టకయే భుజించితిని. శ్రాద్ధ మొనర్పనైతిని. ధన లోభముచే నెవ్వరికిని నేనన్నము పెట్టనైతిని. మఱియు, భయవేళల నన్నభయమునుగోరి శరణునొందిన వారికి శరణ మొసంగి, యకస్మాత్తుగా వారినిఁ బరిత్యజించితిని. మానవులధనధాన్యములను, బ్రియదారలను, పానవాసములను సిరిని గాంచి నిరర్థకముగా నసూయ వహించుచు వచ్చితిని. ఇంకను నితరులసుఖ మోరువఁజాలక యొకనికిఁ బెట్టక ధర్మ కామార్థహంతనై కేవల నిజభోగపరాయణుఁడనై ప్రవర్తిలుచుఁ గ్రూరగుణభూయిష్ఠముగాఁ బూర్వజన్మమునఁ బాపకర్మ మొనర్చితిని. అటులు కొంతకాలమున గడచుటయుఁ, దెలివిదెచ్చికొని దానికిఁ బశ్చాత్తాప మొంది తన్మార్గమును విడిచి కృతములగు శుభకర్మములఫల మును బ్రియాత్మజునట్టులు వెదకియుఁ దెలియఁజాలనైతిని. పిదప ముదుసలియగుతల్లినిఁ బూజించితిని. బ్రాహ్మణుఁడు పూజింపఁబడియెను. ఇటులుండ నొకపు డొక బ్రాహ్మణుఁడు సందర్భవశమున మాయింటికి నతిథిగా వచ్చి నాచేఁ బూజితుఁడయ్యెను. అట్టి సుకృతకర్మముచే నాకుఁ బూర్వజన్మస్మృతి విడువలేదు. మఱియును శుభకర్మముచే రాఁబోవుసుఖము నపేక్షించుచున్నాను. కావున సుకృతమార్గ మెట్టిదో నాకెఱిఁగింపుము.' అని పలుక విని ద్వైపాయనుఁ డిట్లనియె.

### వ్యాసుఁడు కీటమునకు రాజ్యమిచ్చుట

'ఓకీటమా! నీవిపు డిట్లు తిర్యగ్యోనియం దపేక్షనొందకుండుట శుభకర్మమువలననే సంభవించెనని తెలియుము. నిన్నిటులు తిర్యగ్యోని యందు నిరపేక్షునిఁగా నొనర్చినది నాసత్కర్మమే. నాదర్శన మొసంగియే తపోబలముచే నన్నుద్ధరింపఁజేయుచున్నవాఁడను. తపో బలమును మించినబలము వేఱొకటి లేదుగదా? ఓపురుషా! నీవొన ర్చినపాపములచే నిన్నుఁ గీటత్వమొందుటను నేను దెలిసికొను చున్నాఁడను. ఇఁక నీవు ధర్మమును జేయఁగాఁ దలంతువేని, మరల

ధర్మము నొందఁగలవు. తాము భూమి నొనర్చిన కర్మమునే దేవతలును
ననుభవించుచున్నారు. దానినే తిర్యగ్యోనులు ననుభవించును. మాన
వుల యందే ధర్మార్థకామములును దక్షిణగుణములును గానిపించును.
వారు వివేకులై వాగ్బుద్ధిపాణిపాదములతోఁ గూడియున్నవారు.
మానవుఁడు మందుఁడై జీవించినను వాని కేమిలోపము? మానవుఁడు,
విప్రాగ్నులను జంద్రసూర్యులను బూజించుచుండునుగదా? నీవును
వారిపుణ్యకథలను జెప్పికొనుచునే మానవత్వ మొందఁగలవు. నీవు
కోరుదేని క్రమముగా బ్రహ్మత్వమును సైతము నేను బొందింతును.
అందుఁ దక్షిణభూతములలోఁ బ్రధానుఁడవై సుఖ మనుభవింపఁ
గలవు' అని తెలిపెను.

ఓయుధిష్ఠిరా! అక్కీట మాతనిమాట విని యాత్రోవనే నిలిచి
యుండెను. అంత నొకగొప్పశకటము రాఁగా, దానిచక్రముక్రిందఁబడి
యాపురుగు మరణ మొందెను. అటులు మరణించి యది యామహాత్ముని
యనుగ్రహముచేఁ దుదకది యొకయుత్తమక్షత్రియవంశమున జనిం
చెను. అది యెట్లు జరగెనో తెలిపెదను వినుము. అక్కీటక మటులు
మృతినొంది యాయాయోనుల జనించుచుఁ బ్రతిదేహముతో నున్న
పుడును నమ్మహాత్ముని దర్శింపఁ బోవుచుండెను. అది క్రమముగా నేఁదు
పంది, ఉడుము, వరాహము, మృగము, పక్షియు, శ్వపాకుఁడు,
శూద్రుఁడు, వైశ్యుఁడు నై తుదకు క్షత్రియుఁడయ్యెను. అపు డది
సత్యవాదియగు నమ్మహర్షివచనమును స్మరించి యాతనిపాదములకు
నమస్కరించి కృతాంజలియై, 'ఓమహాత్మా! నేనొకకీటమునయ్యు నీ
యనుగ్రహముచే రాజపుత్రుఁడనై యభీప్సితమగు నుత్తమస్థాన
మొందితిని. సువర్ణమాలాలంకృతములైన గొప్పబలముగల యేన్గులు
నన్ను మోయుచున్నవి. మఱియుఁ గాంభోజాశ్వములు రథములకుఁ
గట్టంబడి నన్ను వహించుచున్నయవి. మఱియు నుష్ట్రములు, నశ్వతర
ములును గట్టినయానముల నధిష్ఠించి చరించుచున్నాఁడను. మఱియు
బాంధవామాత్యసహితముగా మాంసాహార మనుభవించుచున్న
వాఁడను. గొప్పగృహములందును సుఖకరములగు శయనములందును
నమందానంద మందుచున్నాఁడను. ఓమహాభాగా! అట్టియుత్తమశయన
ములందు హాయిగా నిద్రించుచున్నాఁడను. అపరరాత్రములందెల్ల

వందిమాగధులు, దేవతలు మహేంద్రునట్టులు, నన్ను సన్నుతించుచున్నారు. సత్యసంధుఁడవు, నమేయతేజుఁడవు నగు నీయనుగ్రహముచే, మున్ను కీటమునయ్యు నిపుడేనిట్టులు రాజపుత్రుఁడనై సుఖమందుచున్నాఁడను. నీకు నమస్కారము. ఓమహాప్రాజ్ఞా! నేనేమి చేయవలయునో నన్ను శాసింపుము. నీతపోబలముచేఁగదా నేనిట్టివాఁడ నగుట' అని సవినయముగఁ బలికెను.

అది విని యావ్యాసుఁడు 'ఓరాజా! నీవిపుడు నన్నుఁ బవిత్రవచనములచేఁ బూజించితివి. జుగుప్సితమైన కీటత్వ మీవొందియు నీకుఁ బూర్వజన్మస్మృతి గల్గియుండెను. నీవు వెనుకఁ జేసినపాపమునకు నాశము గలదే? ధనప్రధానుఁడవగు శూద్రుఁడవై, క్రూరుఁడవై, యాతతాయివై చరించితివి. నాదర్శనము నీకగుటచే నిట్టిసుకృత మిపుడు లభించెను. తిర్యగ్యోనియం దీవు జనించియు నన్నుఁ బూజించుట నీకిట్టి యుత్తమస్థాన మొదవెను. ఇఁక నీవు రాజపుత్రత్వము విడిచి, బ్రాహ్మణత్వ మొందెదవు. అయ్యెడ, గోబ్రాహ్మణులకుఁగా నీవు రణరంగమునఁ బ్రాణములను విడుచుటచే సిద్ధించును. పిదపఁ బెక్కుక్రతువులొనర్చి దక్షిణలొసంగి, పిమ్మట స్వర్గమున బ్రహ్మభూతుఁడవై సుఖింతువు.' అని యతఁడు తెలిపెను. ఓయీ! తిర్యగ్యోనినుండి శూద్రుఁడును, శూద్రత్వమునుండి వైశ్యుఁడును, వైశ్యత్వమునుండి క్షత్రియుఁడును, క్షత్రియత్వమున సద్వృత్తుఁడై దానినుండి బ్రాహ్మణత్వమును గ్రమముగా నొంది, యందు సాధువృత్తుఁడగు నేని మానవుఁడు స్వర్గసుఖ మొందుచున్నాఁడు." అని తెలిపి భీష్ముఁడు మఱియు నిట్లనియె.

"ఓయుధిష్ఠిరా! ఆకీట మటులు క్షత్రియత్వము వడసి యందు గొప్పతప మాచరించెను. ధర్మార్థవేత్తయై యటు లొనర్చుచున్న యాతనితపము నారసి, యాకృష్ణద్వైపాయనుఁడు మరల నాతని సమీపించి 'ఓయీ! క్షాత్రవ్రతమువలననే భూతపరిపాలనము జరగుచున్నది. క్షాత్రమును జపవ్రతమునుగాఁ దలంచుచు దాని నిర్వర్తించి పిదప విప్రత్వ మొందుదువు. కావున నిఁక రమ్ము. శుభాశుభవేత్తవై, యాత్మవంతుఁడవై సకలప్రజల సంరక్షింపుము. అశుభభావనలుగల

కామములనుండి శుభములను విభజించి, నిజధర్మపరాయణుఁడవై యాత్మవంతుఁడవై యుండుము. అటులొనర్చి పిమ్మట క్షత్రియతనువు విడిచి విప్రత్వ మొందెదవు.' అని తెలిపెను.

ఓధర్మపుత్రా! అమ్మహర్షి వచన మాలించి, యతఁ డయ్యరణ్యము నుండి మరలి ధర్మయుక్తముగాఁ బ్రజలఁ బరిపాలించి, తుదకు మృతుఁడై, యచిరకాలముననే విప్రత్వమొందెను. పిమ్మట నమ్మహర్షి యగువ్యాసుఁ డాబ్రాహ్మణుఁడై యున్న యాకీటమును జేరి 'ఓయీ! బ్రాహ్మణోత్తమా! నీవెట్లును వ్యథ నొందకుము. శుభకర్త శుభయోను లందును, నశుభకర్త యశుభయోనులందును జనించును. తానొనర్చిన ధర్మమునుబట్టియు, వ్రతమునుబట్టియు నగుచుండును. కావున మృత్యుభయముచే వ్యథనొందకుము. నీకు ధర్మలోపభయమే గలిగియుండ వలయును. కావున సుత్తమమగుధర్మమునే యాచరింపుము.' అని తెలిపెను.

అది విని, యాబ్రాహ్మణుఁడు 'ఓభగవానుఁడా! నీయనుగ్రహముచే నేను సుఖమునుండి మఱియు నధికమగుసుఖమును బొందుచు వచ్చితిని. ధర్మమూలమగుశుభము నొందినవాఁడనగుట నాపాప మిపుడు నశించెను' అని పలికెను. ఓయుధిష్ఠిరా! అంత నమ్మహర్షి వచనముచే నాకీట మప్పటికి బ్రాహ్మణ్యమొంది, భూభాగమును యాగయూప శతములుగలదానిఁగా నొనర్చి, బ్రహ్మవిత్తముఁడగు బ్రాహ్మణుఁడై బ్రహ్మసాలోక్య మందెను. ఓధర్మజా! తమప్రభావము విడక, నీచే హతులయిన క్షత్రియపుంగవులెల్లరును బుణ్యగతిని బడసిరి. కావున వారికై శోకింపఁ బనిలేదు." అని తెలుప విని యుధిష్ఠిరుఁ డిట్లనియె.

## మైత్రేయభిక్షము

"ఓపితామహా! విద్యయుఁ దపము దానము అనువానిలో నేయది యుత్తమమో నా కెఱిఁగింపుము."

అది విని యాశాంతనవుఁ డక్కౌంతేయు నారసి "ఓరాజా! నీవడిగిన యీయర్థమున కుదాహరణముగా నొకయితిహాసము గలదు. అయ్యది కృష్ణద్వైపాయనునకును, మైత్రేయునకును జరగినసంవాదము. దాని నెఱిఁగించెద వినుము. కృష్ణద్వైపాయనుఁ డెవ్వరికిని

దెలియక చరించుచు, నొకపుడు వారాణసికి బోయి, యందు ముని శ్రేణీగృహమందున్న మైత్రేయునియొద్దకుఁ బోయెను. అంత నతఁడు తన యింటికి వచ్చి కూర్చుండియున్న యాద్వైపాయను నర్చించి యుత్తమాన్న మొసంగెను. గుణవత్తరమైనదియు, సర్వోపభోగ్యమైనదియు నగునయ్యుత్తమాన్నమును దిని, ప్రీతుఁడై వెడలిపోవుచు నవ్వెను. అటులు నవ్వుచున్న యాద్వైపాయను నారసి, యమ్మైత్రేయుఁడు 'ఓ ధర్మాత్మా! నీవేల నవ్వితివో కారణ మెఱిఁగింపుము. తపస్వివి, ధైర్యశాలివి నగు నీకిట్లు ప్రమోదము గల్గుటకు హేతువేమి? నీకు నమస్కరించి యడుగుచున్నాఁడను. నీతపోభాగ్యమును, నాసుఖభాగ్యమును భిన్నభిన్నములు. వానితారతమ్య మల్పమై యుండునని తలంతును. ఒకొక్కకసంబంధమువలన విశిష్టమైనదనియుఁ దలంతును. పరిహసింప హేతువేమి?' అని పలికెను.

అది విని యావ్యాసభగవానుఁడు 'లోకమున నత్యంతమంతర మనుదానికిని, దానిని బెక్కుగాఁ దెలుపుటకు నాకు విస్మయమగుచున్నది. 'ఈస్థానము క్రతుశతమొనర్పక లభింపదు' అనువేదవచన మసత్యము. మానవు నుత్తమునిఁగా నొనర్చునవి మూఁడుపదములు. అద్రోహబుద్ధియు, దానము, సత్యము అనువానివలన నుత్తమత్వము గలుగుచున్నది. మున్ను మహర్షులు దీనినే వేదోక్తముగాఁ గల్పించిరి. మున్ను మనము విన్నదియు, నిపు డాచరింపవలసినదియు నిదియే. అల్పదానమునైతము మహాఫలదాయకము. అసూయారహితుఁడవై హృదయపూర్వకముగా దప్పిగలవాని కీవొసంగినయల్పజలమే మహాఫల మొసంగెనుగాదే? నీవు నాకొసంగిన యీయన్నముచే దేవతలును సంతసించిరి. మహాయజ్ఞములచేవలె నీవు నాకుఁ బెట్టినయన్నముచే నుత్తమలోకములను జయించితివి. మఱియు దానమువలెఁ బవిత్రమగునీతపముచే సంతసించితిని. దూరమందున్నపుణ్యవంతుని గాలిసోఁకినను బుణ్యమగుచున్నది. నీనుండి పుణ్యగంధము వీఁచుచున్నది. పవిత్రములైన యెల్లవానిలో దాన ముత్తమమైనది. వేదోక్తములగు వీనినెల్ల నుత్తమములుగా నీవు ప్రశంసించుచున్నాఁడవు. కాని వానిలో దానమే శ్రేష్ఠమనుటలో సందియము లేదు. పండితులు చరించుమార్గము దాత లొనర్చినదియే. దాతలగువారే ప్రాణదాతలు,

వారియందే ధర్మము ప్రతిష్ఠితము. వేదాధ్యయనము, ఇంద్రియ నిగ్రహము, సర్వపరిత్యాగము నెట్టివో యట్టిదె దానము సర్వోత్తమ మైనది. ఓనాయనా! నీవు సుఖమునుండియే బహుసుఖ మొందుదువు. బుద్ధిశాలియగు మానవుఁడు సుఖమునుండియే బహుసుఖప్రాప్తి కర్హుఁ డగుచున్నాఁడు. ఇది మాకుఁ బ్రత్యక్షసిద్ధమైనదియే. ఇది నిస్సంశయ ముగా నొందఁదగినది. ధనవంతుని సర్వములన్నియుఁ జేయుచున్నవి. వాఁడు దానములు యజ్ఞములు చేయును. వానికి సుఖమగుచున్నది. మఱియు నొకటి గలదు. ఓమహాప్రాజ్ఞా! స్వభావమునుబట్టి నియత ముగా, నతిసుఖమునుండి దుఃఖము, దుఃఖమునుండియే సుఖము నగు చుండును. మానవునకుఁ ద్రివిధములగువృత్తులుండుననని పండితులు తెలుపుదురు. పుణ్యమొకటి, పాపమొకటి, పుణ్యపాపములు లేకుం డుట యొకటి. ఇవియే మానవునివృత్తులు. మఱియు యజ్ఞదానతప శ్శీలురగు మానవులే పుణ్యకర్తలు. ఎవ్వరు భూతములకు ద్రోహ మొనర్తురో వారే పాపకర్తలు. ద్రవ్యములను సంపాదించుచు దుఃఖ మొందుచుఁ బతన మొందుదురు. మఱికొన్నికర్మములు పుణ్యపాప ములు రెండును లేనివై యుండును. భోగింపుము. వృద్ధినొందుము. సంతసింపుము. ఇమ్ము. యాగము సేయుము. నిన్నెవ్వరును దిరస్కరింపఁ జాలరు.' అని తెలిపె"నని పలికి భీష్ముఁడు మఱియు నిట్లనియెను.

## దానధర్మకథనము

"ఓయుధిష్ఠిరా! ఆకృష్ణద్వైపాయనుఁ డిటులు తెలుప విని యమ్మైత్రేయుఁడు, బహుశ్రుతుఁడును, బ్రాజ్ఞుఁడును, శ్రీమంతులవంశ మునఁ బుట్టినవాఁడును నగుట నమ్మహర్షితో 'ఓమహాత్మా! నీవు పలికినది నిజమే. నీ సెలవగునేని కొంచెము మనవిచేసెదను.' అని పలికెను.

అది విని వ్యాసుఁడు 'ఓమైత్రేయా! ఎట్టెట్లు నీ వెంతవఱ కేమేమి చెప్పఁదలఁచుచున్నాఁడవో దానినెల్లఁ దెలుపుము. నీవచన ములనెల్ల వినఁగోరుచున్నాఁడను.' అని పలుకుటయు నమ్మైత్రేయుఁ డిట్లు తెలిపెను. 'ఓప్రాజ్ఞా! దానవిషయమునఁ జెప్పిన నీవచనము నిర్మలము నిర్దోషము నైనదియే. నీవు భావితాత్ముఁడవగుట సందియము

లేదు. నీవు భావితాత్ముఁడవగుట నాకు గొప్పలాభము. మఱియు నీవు గొప్పతనముగలవాఁడవని నే నూహించుచున్నాఁడను. నీదర్శనము వలన నాకు మిగుల నభివృద్ధియగుననియు, బుద్ధికర్మస్వభావమును బట్టి యది నీయనుగ్రహముచే నయినదనియుఁ దలంచెదను. తపము శ్రుతము యోనియు బ్రాహ్మణ్యకారణములే. ఈ మూఁడుగుణములును గలియునపుడే ద్విజత్వము సంభవించును. బ్రాహ్మణుఁడు తృప్తుఁడగు నేని, దేవతలును బితృదేవతలును దృప్తులగుచున్నారు. శాస్త్రజ్ఞానము గలవారి కధిక మేదియును లేదు. బ్రాహ్మణుఁడు లేనిచో లోకమెల్లఁ జీకటియై యేమియుఁ దెలియఁబడకుండును. చాతుర్వర్ణ్యమును వృద్ధి నొందదు. ధర్మాధర్మములును సత్యాసత్యములును వారు లేనిచో నెఱుఁగఁబడవు. సరియగు క్షేత్రమున మానవుఁడు ఫలము నొందినట్లు వారివలన సకలఫలము సిద్ధిచెడిని. అటులగుట శ్రుతవంతునకు దాన మిచ్చినవాఁడు తగుఫలమొందుచున్నాఁడు. శ్రుతవృత్తోపసంపన్నుఁ డగుబ్రాహ్మణుఁడు దానమునకుఁ బ్రతిగ్రహీతగా లభింపఁడేని ధని కులధనము వ్యర్థమగుచున్నది. అవివేకి యన్నమును దినుచు, దానినిఁ నశింపఁజేయుచున్నాఁడు. అనుభవింపఁబడుచు, నది వానిని నశింపఁ జేయును. ఏ హానియన్న మొకరిని రక్షించునో యదియే వానిని రక్షించును. విద్వాంసుఁ డన్నము ననుభవించుచు మఱియు దానినిఁ బుట్టించుచున్నాఁడు. దానివలననే వాఁ డీశ్వరుఁడగుచున్నాఁడు. 'దేని నొసంగుటవలన దాతకుఁ బుణ్యమగునో, దానినిఁ బ్రతిగ్రహించినవాని కిని బుణ్యమగును. ఒకచక్రముచే రథము నడువదుగాదే?' అని మహ ర్షులు తెలుపుచున్నారు. శ్రుతవృత్తసమన్వితులగు బ్రాహ్మణు లెచ్చో నుందురో యచ్చటనే దానముచేసి యిహాపరఫల మనుభవింపనగును. ఎవ్వరు విశుద్ధులై సంతతతపోనిష్ఠులై దానాధ్యయనసంపన్నులై యుండుదురో, వారే పూజ్యతములు. అట్టిసత్పురుషు లొనర్చిన మార్గమువట్టినవాఁడు మోహమొందఁజాలఁడు. యజ్ఞప్రవర్తకులై సనాతనులగునట్టివారే స్వర్గనాయకు లగుచున్నారు.'

మైత్రేయభిక్ష.

ఓయుధిష్ఠిరా! ఇటు లామైత్రేయుఁడు తెలుప విని వ్యాసుఁ డాతనితో 'ఓయీ! దైవానుగ్రహముచే నీవిట్టి వివేకివైతివి. దానిని

బట్టియే నీకిట్టిబుద్ధి గలిగెను. పూజ్యగుణములు గలవారినే లోకము ప్రశంసించుచున్నది. రూపాభిమానియు, వయోభిమానియు, ధనమానియుఁ గూడ నిన్ను దిరస్కరింపఁజాలరు. ఇది నీకిటు లగుటకు దైవానుగ్రహము నిమిత్తము. దానమువలన నెంతయు నీకేమి సిద్ధించునో, దాని నెఱిఁగించెదను వినుము. ఆగమములు శాస్త్రములు, మఱియుఁ గల ప్రవృత్తులును, వేదము నాధారముచేసికొనియే క్రమముగాఁ బ్రవర్తిల్లెను. నేను దానమును బ్రశంసించుచున్నాఁడను. నీవు తపశ్శ్రితులను మెచ్చుచున్నాఁడవు. తపమే వేదమునకుఁ బవిత్రమైనది. అదియే స్వర్గమునకు సాధనమైనది. తపముచేతను జ్ఞానముచేతను మహత్త్వము నొందునని నేను వినియున్నాఁడను. మఱియుఁ దపముచేతనే దుష్కృతమును దొలఁగింపవచ్చును. పురుషుఁ డేమేమి చిత్తమందుంచుకొని తపమొనర్చునో, దానినెల్లఁ దపముచేతను, జ్ఞానముచేతను బొందనగు నని మేము వినిన విషయము. సంబంధరహితమైనదియు, దురాపమైనదియు, దురతిక్రమమైనదియు, దుష్ప్రధర్షమైనదియుఁ గూడఁ దపముచే సాధింపఁబడుచున్నది కావునఁ దపము బలవత్తరమైనదియే. మద్యపానకర్తయు, సువర్ణాపహారియు, భ్రూణహంతయు, గురుతల్పగుఁడును, దపముచే దమతమ పాపములఁ దలఁగించుకొనుచున్నారు. విద్యాశాలి చక్షుష్మంతుఁడు. అటులే యెట్టివాఁడేని తపస్వియుఁ జక్షుష్మంతుఁ డనఁబడుచున్నాఁడు. అట్టివారిచేఁ జేయఁదగినదియే సజ్జనులమతము. వేదధనులును, నటులే తపస్వులును బూజ్యు లగుచున్నారు. అటులే దాతలును సుఖమును నైశ్వర్యమును బొందుచున్నారు. అన్నదాన మొనర్చిన సుకృతాత్ములు బ్రహ్మలోకమున సుఖింతురు. దాతలు పూజించువారును, బూజితులును, మన్నించువారును మానితులును నగుచున్నారు. దాత యెందెందుఁ బోవునో యందుఁ బొగడఁబడుచున్నాఁడు. దాతకు లభింపని లోకము లేవియు నుండవు. ఓమైత్రేయా! నీవెవ్వనికే నెట్టి యన్నపానము లొసంగుదువో యట్టి యన్నపానముల నొందుదువు. మఱియు మేధాశాలివి, శ్రుతధనుఁడవు సత్కులప్రసూతుఁడవు నగుదువు. నీవిట్టి వ్రతమున నిరతుఁడవై వర్తింపుము. గృహస్థులకు స్వధర్మమగు దీనినే తొలుతఁ బరిగ్రహింపుము. ఏగృహస్థు నిజస్త్రీ

సంతుష్టుండగునో, యే కులకాంత భర్తవలనఁ దుష్టినొందునో, యట్టి వారివంశమున స్వర్గము శుభప్రదముగనే ప్రవర్తిల్లును. జలములచే శరీరమలమునట్టులును, నగ్నిప్రభచేఁ జీకటియట్టులును, దపోదానములచేఁ బాపములనెల్లఁ దొలఁగింపనగును. ఓమైత్రేయా! నీకు శుభమగుఁ గాక. నే నిఁక నాయింటికిఁ బోయెదను. నాయీ చెప్పినది నీచిత్తమున నుంచుకొనుము. నీకుఁ దప్పక శ్రేయమయ్యెడిని.' అని పలుకుటయు నమ్మైత్రేయుఁ డాకృష్ణద్వైపాయనునకుఁ బ్రదక్షిణ నమస్కారములొనర్చి చేతులు మొగిడ్చి 'స్వస్తియగుఁగాక' యని పలికె"నని తెలుప విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె.

## హరిణకృశకాఖ్యానము

"ఓపితామహా! నీవు సర్వధర్మవేత్తవు. అటులగుట నుత్తమస్త్రీల సదాచార మెట్టిదో తెలుపుదువేని దానిని వినఁగుతూహలమగుచున్నది. అది నా కెఱిఁగింపుము."

అది విని యాభీష్ముఁ డాధర్మజునితో "ఓపుత్రకా! వినుము. మున్నొకపుడు దేవలోకమున, సర్వజ్ఞయు, సకలతత్త్వజ్ఞయు మనస్వినియు నగుశాండిలి యనుదానిం జూచి కేకయపుత్రికయగు సుమన యనునది 'ఓకళ్యాణీ! నీవెట్టిప్రవర్తనముచే, నేయాచారముచే సకలపాపముల నడంచి దేవలోకమున కిటు లరుదెంచితివి? నీవు నిజతేజముచే నగ్నిశిఖవలె వెలుఁగుచున్నదానవుగాదే? మఱియుఁ జంద్రప్రభవలె స్వర్గమునకు వచ్చితివి. మఱియు మంచివస్త్రములను ధరించి విమానాసీనవై నీతేజముచే నందఱికంటె వేయిమడుంగులు వెలయుచున్నదానవు. నీవు కొంచెమేని తపముగాని, దానముగాని, నియమము గానియొనర్చి యిందులకు వచ్చినట్టు లగపడదు. ఇందలియాథార్థ్య మెట్టిదో తెలుపుము.' అని యడిగెను.

అది విని యాశాండిలి, మందహాసవదనారవిందయై మధురముగా, 'ఓసుమనా! వినుము. నేను గాషాయవస్త్రములను గట్టలేదు. వల్కలములను ధరింపనులేదు. మఱియు ముండత్వ జటిలత్వములను బూని చరించి యిందులకు రాలేదు. కాని, నే నొకపుడును భర్తయెదుటఁ బరుషములు, నహితములునగు పలుకులు పలుకక ప్రవర్తించితిని. మఱియు జాగరూకనై దేవతలను బ్రాహ్మణులను బితృదేవతలను

భక్తిమెయిఁ బూజించుచు, అత్తమామల నాదరించుచుఁ జరించితిని. కొండెము లెన్నఁడును దెలుపరాదని నావ్రతముగా నుంటిని. ద్వారము లేనిచోట నిలుచుటయుఁ, జిరకాలము మాటలాడుటయును, అపహాసమొనర్చుటయు నావలన జరుగలేదు. రహస్యముగఁగాని, స్వేచ్ఛగాఁగాని ప్రవర్తింపలేదు. ఏదే నొకకార్యమునకుఁగాఁ బోయి మరల వచ్చినభర్తను నాసనముపైఁ గూర్చుండఁబెట్టి, భోజనముచే సంతృప్తునిఁ గావించి పూజించితిని. నాభర్త కిష్టపడనియన్నమును, భోజ్యమును, భక్ష్యమును, లేహ్యమును, మఱియు నాతఁ డంగీకరింపనిసకలమును వర్జించుచుండెడిదానను. మఱియుఁ బ్రాతఃకాలముననే లేచి, కుటుంబమునకుఁ గావలసిన యేకార్యమేని విడువక చేయుటయుఁ జేయించుటయు నావలనఁ జరగెను. నాభర్త యేదే నొకకార్యముచేఁ బ్రవాసమొనర్చినపుడు నియతవ్రతనై బహువిధములగుశుభాచారములు గలిగి ప్రవర్తించితిని. అటులే భర్త పరవాసమొనర్చియున్నసమయమునఁ గాటుక పెట్టుకొనుటయు, నభ్యంగమొనర్చుటయుఁ, బూవులను జందనముల నలంకరించుకొనుటయు, నగలుపెట్టుకొనుటయుఁ, గుంకుమ పూసికొనుటయుఁ జేయలేదు. ఎల్లపుడు భర్త సుఖసుప్తుఁ డగునంతకును నే నచ్చోటినుండి లేచి పోను. ఎపుడేనిఁ గుటుంబమునకుఁగా, భర్త కాయాసము గలిగింపలేదు. మఱియు గుహ్యమును గుప్తముగా నొనర్చియుంటిని. ఓ సుమనా! నే నిట్టిధర్మపథమును వీడక జాగరూకనై యుంటిని. స్త్రీలలో నెవ్వతేని యిట్లు ప్రవర్తించునే నరుంధతి యట్టిదై, యది స్వర్గలోకమున మహత్తరయై వెలయును.' అని తెలిపెను.

ఓయుధిష్ఠిరా! తపస్వినియగు నాశాండిలి యాసుమనతోఁ బతిధర్మము నిట్లు పలికి యంతర్ధానము నొందెను. ఎవ్వఁ డీయాఖ్యానమును బ్రతిపర్వదినమందును బఠించునో, వాఁడు దేవలోకమునొంది, నందనవనమున సుఖియై మెలఁగుచుండును." అని తెలుప విని యుధిష్ఠిరుఁ డిట్లనియె.

## రాక్షసబ్రాహ్మణసంవాదము

"ఓపితామహా! సామదానములలో నెయ్యది పెద్దయో, దేని నేది యతిక్రమించునో నాకెఱిఁగింపుము."

అది విని భీష్ముఁ డాతనితో "ఓధర్మజా! ఒకఁడు సామముచేఁ బ్రసన్నుఁడగును. మఱియొకఁడు దానముచేఁ బ్రసన్నుఁడగును. పురుషుఁడు ప్రకృతిగతుఁడై యీ రెండిటిలో నొకదాని నొందును. ఓభరతోత్తమా! సామమున నెట్టిగుణములు గలవో వాని నెఱిఁగించెద వినుము. ఎట్టిక్రూరప్రాణు లేని ప్రియవచనములచేఁ బ్రసన్నము లగు ననుటలో సందియము లేదు. ఇందుల కొకయుదాహరణము దెలిపెదను. ఒకపుడు, వాగ్బుద్ధిసంపన్నుఁడగు నొకబ్రాహ్మణుఁ డొకవిజనారణ్యమునఁ జరించుచుండఁగా, వానిని భక్షించువాఁడై యొకరాక్షసుఁడు పట్టుకొనియెను. అటులు పట్టికొనంబడి యాబ్రాహ్మణుఁడు భయంకరుఁడగు నారాక్షసునిఁ గాంచి, బుద్ధిశ్రుతిసంపన్నుఁడగుట నత్తఱి, మోహమును వ్యథను వహింపక ప్రియవచనము లుపయోగింపఁగా, నారక్కసుఁడును మంచిమాటలచే వాని నాదరించి 'ఓబ్రాహ్మణోత్తమా! నేను నిన్నొకప్రశ్న మడిగెదను. దానికి సమాధానమొసంగెదేని నిన్ను విడిచెదను. వినుము. నేనిట్లు తెల్లపారి కృశుఁడ నగుటకు హేతువేమి?' అని పలికెను.

ఓధర్మజా! ఆబ్రాహ్మణుఁ డామాట విని కొంత చింతించి జంకక, వాని ప్రశ్నమున కుత్తరముగాఁ గొన్ని గాథలచే నిట్లు బదులు పలికెను. 'ఓయీ! నీవు విదేశములఁ జరించుచు, నన్నిటిని గనుచు, మిత్రులను బరిత్యజించి నిరుపమానసుఖముల ననుభవించితివి. అటులగుట నిట్లు కృశించితివి. నీమిత్రులు నీచే లెస్సగా నాదరింపఁబడియు నిజదోషముచే నపరక్తులైరి; దానిచే నిట్టులైతివి. నీవు గుణవంతుఁడవై గుణహీనులగు నసుయ్యలను సత్కరించితివి. ప్రాజ్ఞుఁడవయ్యు నప్రాజ్ఞుల నాదరించితివి; అక్కృతమున నిట్లు కృశించితివి. పరకార్యాధికారముగల్గి సద్గుణహీనులైన మానవులు నిన్నవమానింపఁగా నిట్టులైతివి. వృత్తిలేక క్లేశమొందుచుండియు, నేవృత్తినే నాదరింపక, మాహాత్మ్యమును బూని, వ్యథనొందుచుండుట నిట్లు కృశించితివి. ఆఢ్యుఁడవై నీవు పీడపడియు నొకనికి లోఁగి వానిచే జితునిఁగా దలంచుట నిట్టులైతివి. అపమార్గములఁబడి, కామక్రోధావృతమానసులై క్లేశమందుచున్న వారిని దయతో నారసితివి. అట్టులగుట నిట్లు కృశించితివి. ప్రజ్ఞాసంభావితుఁడవయ్యుఁ బ్రజ్ఞాహీనులచే నుపహతుఁడవై దుర్వృత్తులగు

వారిచేఁ దక్కువచేయఁబడి యిట్లు కృశించితివి. నిశ్చయముగా మిత్రముఖుఁడగు శత్రువు తగినవానివలెఁ బ్రవర్తిల్లుచుఁ, దుదకు నిన్ను వంచించి పోయెను. అటులగుట నీవిట్లు కృశుఁడవైతివి. రహస్యకుశలుఁడవు, కృతివినయుఁడవు, ప్రకాశార్థగతివై ప్రాజ్ఞులచేఁ బూజింపఁబడక కృశుఁడవైతివి. అసజ్జను లున్నసమయమున నీవు నీయంతన నీగుణములఁ దెలుపుకొనమి నీగుణములు ప్రకాశింపలేదు. అటులగుట నిట్టులైతివి. ధనబుద్ధిశ్రుతములు లేకయుఁ గేవలము తేజముచేమాత్రము మహత్త్వమును గోరుటచే నిట్టులైతివి. తపఃప్రణిహితాత్ముఁడవై యరణ్యమును గాంక్షించిన నిన్ను బంధువర్గము సమ్మతింప నిట్టులైతివని తలంతును. మహాధనుఁడును, యువకుఁడును, సుందరుఁడునగు నీపొరుగింటివాఁడు, కాముకుఁడై యిష్టభార్యుఁడవగు నీకుఁ బ్రియుఁడు గాకుండుట నిట్టులైతివి. ధనవంతులున్నచోటఁ దగుకాలమున నీయుత్తమవచనములు దెలుపఁబడమి నిట్టులైతివి. సరిగా మున్ను దెలిసినవాఁడును, మూర్ఖుఁడును, గుపితుఁడును, హృదయప్రియుఁడును నగువాని ననునయింపఁ బ్రయత్నించియు సమర్థుఁడవు గాకుండుట నిట్టులైతివి. నిన్నొకఁ డొకయీప్సితార్థమున సక్తునిఁ గావించి యందులకుఁగా నిత్యము నిన్నర్థించుచుండుట నిట్టులైతివి సుగుణాపేక్షచే సుహృజ్జనమును బూజించునట్టి నిన్ను మాయావిఁగాఁ బ్రజలు తలంచుట నిట్లు కృశుఁడవైతివి. నీవు లజ్జచే నంతర్గతాభిప్రాయము వెల్లడింపనేరక శైథిల్యమొందుటను నిట్టులు కృశుఁడవైతివి. పలువిధములగుబుద్ధులు గలమానవులనెల్లఁ బరిశీలింపక వారినెల్లఁ బరిగ్రహింప నెంచితివి. అటులగుట నీవిట్టులైతివి. వివేకము లేకుండియు భయస్వభావము గలిగియు, నల్పకార్యమొనర్చియే, విద్యావిక్రమదానములచే సంపాదింపఁదగు గొప్పయశమును గోరుట నిట్టులైతివి. చిరకాలమునుండియుఁ గోరంబడినఫలము ప్రాప్తింపకుండుటను, నీవుపకార మొనర్చినవారు నీ కపకార మొనర్చుటను నీవిట్టులైతివి. నీవు నిజదోషమును బరిశీలించుకొనలేక యకారణముగా లోకముచే నిందితుఁడవైతివి. అటులగుటఁ గృశుఁడవైతివి. మిత్రులదుఃఖమును, నాత్తులగువారియార్తిని దొలఁగింపఁదలంపకుండుట నిట్టులైతివి. ధర్మార్థకామోపయుక్తముగను, దేశోపయుక్తముగను నీవు పలుకమి నిట్టు

లైతివి. బుద్ధిమంతుఁడవయ్యు, నకుశలులగు వా రొసంగెడుధనములచే జీవింపనెంచినవాఁడవగుట నిట్టు కృశుఁడవైతివి. మిగుల వృద్ధినొందుచు నుత్తమాసనాసీనులై యున్న పాపాత్ములను గర్హించుట నిట్టులైతివి. పరస్పరవిరోధముగలవారికిఁ బ్రియమొనర్చ, మిత్రుల నుపరోధించి తివి; అటులగుట నిట్టులైతివి. శ్రోత్రియులను, దుష్కర్ములను, బ్రాజ్ఞులను, నింద్రియ నిగ్రహశూన్యులను నొక్కరీతిగాఁ దలంచుటనిట్టులైతివి.' అని పలికెను. ఇటు లాదరణపూర్వకముగాఁ బలుకఁబడి యా రక్కసుఁ డావిప్రు నాదరించి తనకు మిత్రునిఁగా నొనర్చి, యాతని కెక్కుడుగా నర్థములనుసైతము గలిగించె" నని తెలుప విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె

## శ్రాద్ధధర్మకథనము

"ఓపితామహా! కర్మక్షేత్రమై మిక్కిలి దుర్లభమైన మనుష్యజన్మమొంది దరిద్రుఁడయ్యు శ్రేయమును గోరువాఁ డేమిచేయవలసి యుండును? దానములలో నుత్తమమైనదెద్ది? ఏదాన మెట్టెట్టు చేయవలయును? ఆరహస్య మెఱిఁగింపుము."

ఓజనమేజయా! ధర్మపుత్రుఁ డిట్లు ప్రశ్నించుటయు శాంతనవుఁ డీపరమధర్మరహస్యమగు నివిషయమును దెలుపువాఁడై "ఓ ధర్మజా! వినుము నీవడిగిన ధర్మరహస్యములు. వీనిని మున్ను వ్యాస భగవానుఁడు నా కెఱిఁగించెను. ఈదేవరహస్యము నియమస్థుఁడై యోగనిష్ఠుఁడైన యమునిచేఁ బ్రాప్తమైనది. ఎట్టికర్మముచే దేవుఁడును, పితృదేవతలును, మహర్షులును, ప్రమథులును, లక్ష్మియుఁ, జిత్రగుప్తుఁడును బ్రీతివహింతురో, మహాఫలమై సరహస్యమైన ఋషిధర్మము దేనివిషయమున స్మరింపఁబడియెనో, యట్టి మహాదానఫలమును, యజ్ఞఫలమును దెలిపెదను. దీని నెవ్వఁడు తెలిసికొని యాచరించునో, వాఁడు సదోషుఁడేగాని, యదోషుఁడేగాని గుణవంతుఁ డగుచున్నాఁడు. పదుగురు పశుఘాతకుల కొక గవుండ్లవాఁడును, పదుగురు గౌండ్లవారల కొక సురాపాయియుఁ, బదుగురు సురాపాయుల కొక వేశ్యయుఁ, బదుగురువేశ్యల కొక క్షుద్రభూపతియుఁ దుల్యులగుదురు. అయిన, నర్థముచే నృపతి యధికుఁడని తెలుపఁబడుచున్నాఁడు.

మఱియు వినుము. పుణ్యలక్షణమగు ధర్మకామశాస్త్రము పవిత్రమైనది. రహస్యశ్రవణము, మహోత్తరమునగు ధర్మవివరణము పవిత్రమైనవి. దేవతలచే స్వయముగా విధింపఁబడినధర్మవిధి వినఁదగియున్నది. ఎందు దేవతలయుఁ, బితృదేవతలయు రహస్యములు తెలుపఁబడియెనో, యదియెల్ల నిపుడు తెలుపఁబడుచున్నది. సరహస్యమై మహాఫలజనకమైన ఋషిధర్మమును, మహాయజ్ఞఫలమును, మహాదానఫలమును నెందు స్మరింపఁబడియెనో, యట్టి యీశాస్త్రమును బఠించువారును, వినువారును, ఫల ముగ్గడించువారును నారాయణతుల్యు లనఁబడుదురు. ఎవ్వఁ డతిథిపూజ నాచరించునో, వానికి గోదానఫలమును, దీర్ఘయాత్రాఫలమును, యాగఫలమును గలుగుచున్నవి. ఎవ్వరు శ్రద్ధాళులై, శుద్ధమానసులై ధర్మశ్రవణ మొనర్తురో, వా రెల్లలోకములను జయింతురు. మఱియు నట్టివారికిల్బిషము లడఁగి ధర్మనిత్యులగుదురు. ఓయుధిష్ఠిరా! ఒకప్పు డొకదేవదూత యంతర్హితుఁడై యుండి, యింద్రునితో 'ఓవాసవా! కామగుణోపేతులును, భిషగ్వరులు నగు నశ్వినీదేవతలయాజ్ఞచే మానవులయుఁ, బితృదేవతలయు నుద్దేశించినధర్మమును దెలిసికొన వచ్చితిని. అటులగుట నిన్నుఁ గొన్ని ప్రశ్నము లొనర్చెదను. శ్రాద్ధమున దాతయు, భోక్తయు, మైథునము వర్జింప నేటికి? పిండములు మూఁడుగా విభజించుటకు నిమిత్తమేమి? అందు మొదటి దెవ్వని కీయఁదగినది? రెండవ దెవ్వనికి? మూఁడవ దెవ్వనికిఁ దెలుపఁబడియెను? దానిని వినఁగోరుచున్నాఁడను.' అని పలికెను. శ్రద్ధాళుఁడై ధర్మయుక్తముగాఁ బలికిన దేవదూతమాటను మన్నించి, పితరు లిట్లు పలికిరి.

'ఓయీ! నీకు స్వాగతమా! నీకు శుభమగుఁగాక. ఓఖేచరోత్తమా! వినుము. గూఢార్థమగు గొప్పప్రశ్న మొనర్చితివి దీని కుత్తర మొసంగెదము. శ్రాద్ధ మొనర్చినవాఁడును, భుజించినవాఁడును స్త్రీని గలిసినచో, వానిపితృదేవత లామాసమున వాని రేతస్సులో నడఁగవలసివచ్చును. ఇఁకఁ బిండప్రవిభాగమునుగుఱించి తెలిపెదము వినుము. ప్రథమపిండము క్రిందికిఁ బోవుచు జలములఁ బ్రవేశించి పవిత్రమగును. మధ్యమ పిండమును బత్ని భుజించుచున్నది. మూఁడవపిండము వైశ్వానరున కర్పణ మొనర్పవలయును. ధర్మలోప

మొదవకుండ శ్రాద్ధవిధి తెలుపఁబడియెనుగాదే. అట్టిశ్రాద్ధవిధికి సంతుష్టాంతరంగులై పితరులు తృప్తి నొందుదురు. మఱియు శ్రాద్ధకర్తకు సంతాపమును, నక్షయసుఖమును గలిగెడిని.'

ఓయుధిష్ఠిరా! అప్పుడది విని దేవదూత వారితో, 'వేఱు వేఱుగాఁ బిండవిభాగక్రమ మెఱిఁగింపఁబడియెను, కాని, వానిలో నొకటి సముద్ధృతమై క్రిందికిఁ బోయి యెవ్వని కగ్ర్యుఁడిని? దానివలన నేదేవత తృప్తినొందును? అది పితృదేవతల నెట్లు తరింపఁజేయును? అనుజ్ఞవడసియే మధ్యమపిండమును బత్ని భుజించునుగదా? ఏల భుజించును? దానిని బితరులెట్లు భుజింతురు? మూఁడవపిండము వైశ్వానరునందు హోమ మొనర్పవలయునుగదా! దానికి గతియేమి? అది యెవ్వని కగును? అటు లామూఁడుపిండములకును గతి యెట్టిదియో తెలుప వినఁగోరుచున్నాఁడను.' అని ప్రశ్నించెను. అది విని పితరులు 'ఓయీ! నీవు గొప్పప్రశ్న మొనర్చితివి. ఓఖేచరా! ఈ నీరహస్యప్రశ్నమును దేవతలును మునులును బ్రశంసించుచున్నారు. వారును బితృకార్యవినిశ్చయమును దెలియకున్నవారు. అమ్మునులలో మహాత్ముఁడగు మార్కండేయుఁడుమాత్ర మిది యెఱుంగును. ఎవ్వఁడు మహాయశుఁడై పితృభక్తుఁడై పిండత్రయవిధిని వినునో, వాఁడు భగవద్గతి నొందును.' అని తెలిపిరి. ఓధర్మజా! పిండత్రయగతి నుద్దేశించి దేవదూత యొనర్చినప్రశ్నమున కుత్తర మెఱింగించెద వినుము. 'ఉదకములనుబొందిన మొదటిపిండము చంద్రుని సంతసింపఁజేయును. ఆచంద్రుఁడు తృప్తుఁడై దేవతలను బితృదేవతలను సంతసింపఁజేయుచున్నాఁడు. పత్ని, యనుజ్ఞాతయై మధ్యమపిండమును భుజించును గాదే? పుత్రకామ యగుదానికిఁ బితామహులు పుత్రు నొసంగుచున్నారు. ఇఁక హవ్యవాహనున కొకపిండ మొసంగఁబడునుగదా! దానినిగుఱించి తెలిపెదను వినుము. దానిచేఁ బితృదేవతలు ప్రీతులై కోర్కులనిచ్చుచున్నారు. పిండత్రయమునకును గలగతియెల్లఁ దెలిపితిని. మఱియొకటి వినుము. భోక్త యజమానుని పితరులరూప మొందుచున్నాఁడు. కావున, నానాఁడు వానికి నిజకాంతయుఁ బరదారయుగుట మైథునము వర్జింపవలయును. మఱియు శ్రాద్ధమును భుజించినవాఁడు భోక్తృత్వమును వరించినది మొదలుగా శుచియైయుండి శ్రాద్ధమును

భుజింపవలయును.' అని వారు తెలిపిరి. నా యీ తెలిపినదోషము లన్నియు, నిశ్చయము లేగాని మఱియొకవిధముగాఁ గానేరవు. కావున విప్రుఁడు స్నాతుఁడై శుచియై శాంతుఁడై శ్రాద్ధభోజన మొనర్పవలయును. ఈవిధముగా శ్రాద్ధ మొనర్చిన వానివంశము వర్ధిల్లును. పిమ్మట విద్యుత్ప్రభుఁ డనియెడిమహాతపుఁడగు నొకమహర్షి యప్పుడొకటి తెలిపెను. రవితేజముచే దీప్తరూపుఁడై యున్న యమ్ముని కొన్ని ధర్మ రహస్యములను వినియున్నవాఁడగుట నింద్రునితో 'వాసవా! మానవు లవివేకులై తిర్యగ్యోనిగతములగు సత్త్వములను హింసించుచున్నారు. మఱియుఁ గీటములను, బిపీలికములను, సర్పములను జంపుదురు. అటులే మేఁకలను, మృగములను, బక్షులను వధింతురు. అటు లొనర్చి వారు బహుపాప మొందుదురుగదా! అట్టిపాపములకుఁ బ్రతిక్రియ యేమి?' అని యడిగెను. పిదప దేవతలును, దపోధనులగుమహర్షులును, మహాభాగులగుపితృదేవతలును నమ్మునిని బూజించిరి. అపుడింద్రుఁ డిట్లు పలికెను. 'ఓయీ! కురుక్షేత్రముఁ, గయ, గంగ, ప్రభాసము, పుష్కరములు అనువీనిని మానసమున ధ్యానించి, పిమ్మట నుదకముల నవగాహింపవలయును. అటులేని, రాహువిముక్తచంద్రునట్లు, పాపవిముక్తుఁడగును. మూఁడుదినము లెవ్వఁడు గోపృష్ఠమును స్పృశించి, దానితోఁకకు నమస్కరించునో, వాఁడు స్నానోపవాసఫల మొందుచున్నాఁడు.'

మఱియు నపుడు విద్యుత్ప్రభుఁడు వాసవు నుద్దేశించి, 'ఓయింద్రా! ఇది మఱియొకసూక్ష్మమగుధర్మము. దీని నెఱిఁగించెదను వినుము. వటజటాకషాయము రాచికొని, మహాసర్షపముల ననులేపముగఁ జేసికొని, క్షీరయుక్తముగా షష్ఠికాన్నమును భుజించినచో సకలపాపవిముక్తి యగును. మహర్షి చింతితమగు మఱియొకరహస్యము దెలిపెద వినుము. మహాదేవస్థానమున బృహస్పతి తెలుపఁగా నేను దానిని వింటిని. పర్వతమెక్కి యొకపాదముపై నిలిచి, నిరాహారుఁడు నూర్ధ్వబాహుఁడు నగుచు, చేతులు మొగిడ్చి సూర్యునిఁ జూడవలయును. అటులేని మహత్తరతప మొనర్చి యుపవాసములు చేసినవానికగుఫల మగుచున్నది. సూర్యకిరణములచేఁ బరితప్తుఁడగువానిపాపము లన్నియుఁ బరిహృతము లగుచున్నవి. గ్రీష్మశీతకాలముల నిట్లు

సూర్యునిఁ జూడవలయును. ఇటు లొనర్చినవాఁడు పాపవిముక్తుఁడగు టయెగాక తేజశ్శాలియు నగును.' అని పలికెను. పిమ్మట నా త్రిదశుల నడుమనున్న బృహస్పతినిఁ గాంచి, యింద్రుఁడు బహుమధురముగా 'ఓమహనీయా! మానవులకు సుఖావహమైన ధర్మరహస్యమును, మఱియు రహస్యములగు దోషములను దెలుపు' మని పలికెను. అది విని బృహస్పతి 'ఓవాసవా! ఎవ్వరు సూర్యున కెదురుగా మేహన మొనర్తురో, యెవ్వరు గాలి నెదుర్కొందురో, మఱియు మండుచున్న జ్వాలలో నెవఁడు హోమ మొనర్పకుండునో, బాలవత్సయగు ధేనువు నెవ్వఁడు పాలకై పూర్తిగాఁ బితుకునో వారిదోషములన్నియు నెఱిఁగించెదను వినుము. సూర్యుఁడు, నగ్నియు, వాయువు, లోకమాతలగు గోవులును లోకములను దరింపఁజేయుటకై విధాతచే సృజింపఁబడియెను. ఈనా తెలిపిన రవ్యాదులు మానవులకు దేవతలై వెలయుచున్నారు. ఒక్కొకధర్మనిశ్చయమును మీ రెల్ల వినుఁడు. ఏస్త్రీలుగాని, యేపురుషులుగాని సూర్యున కెదురుగా మూత్రమును విడుతురో, వా రెనుబదియాఱువత్సరములు పాప మొనర్చినవారును, కులపాంసనులును నై చరింతురు. వాయుద్వేష మొనర్చినవారిసంతానము గర్భమునుండి జాఱును. దీప్తాగ్నిలో నెవ్వరు సమిధల నుంచరో, వారి యగ్నికార్యములం దతఁడు హవ్యమును భుజింపఁడు. ఎవ్వరు బాలవత్సములకు మిగులకుండ ధేనువులపాలు పితుకుదురో, వారికిఁ గులవర్ధనులై పాలుత్రాగుపిల్లలు జనింపరు. జనించియు నశింతురు. మఱియు నట్టివారివంశము వర్ధిల్లదు. కులవృద్ధు లగు బ్రాహ్మణులచే నీవిషయము కనిపెట్టఁబడినది. కావున విడువఁదగిన వెవ్వియో వానిని విడిచి, చేయఁదగిన దెద్దియో దానిని జేయవలయును. శ్రేయఃకాముఁడగు మానవుఁడు దీనినొనర్చిన తప్పక సిద్ధిపడయును. ఇది సత్యమని నమ్ముఁడు.' అని పలికెను. పిమ్మట మహాభాగులగు దేవతలందఱు, మహాభాగులగుమహర్షులును, బితరుల నొక ప్రశ్నము చేయువారై 'ఓమహానుభావులారా! అల్పబుద్ధులగుమానవుల యెట్టికృత్యముచేఁ బితరులు సంతసింతురు? శ్రాద్ధదాన మెటు లక్షయమగును? ఎట్టికర్మము చేసి మానవులు పితృదేవతలఋణము తీర్చినవార గుదురు? మాకు దీనిని వినఁ గౌతూహలమగుచున్నది.' అని యడిగిరి. అది విని పితరులు,

'దేవతలారా! న్యాయముగా సంశయమే మీచే నుదాహరింపఁబడి యెను. సాధుకర్ములగుమానవుల యెట్టికృత్యముచే మేము సంతసిం తుమో తెలిపెదము వినుము. నీలవృషభ ప్రమోక్షణము చేసియు, నమావాస్యనాఁడు తిలోదకము లొసంగియు, వర్షకాలమున దీపములు పెట్టియుఁ బితరులఋణము తీర్చినవారగుదురు. నిష్కపటమగు నీ శ్రాద్ధదానమే యక్షయమహాఫలప్రదమై మాకు సంతోషమును గలి గించును. ఎవ్వరు శ్రద్ధావంతులై శ్రాద్ధకృత్యము లొనర్చి సంతతినిఁ బడయుదురో, వారు పితామహులను నరకమునుండి తరింపఁజేయు దురు.' అని పలికిరి. ఆ పితరులవచనము లాలించి, మేను గగు ర్పొడువఁ దపోధనుఁడగు వృద్ధగార్గ్యుఁడు 'ఓపితరులారా! నీల వృషభమోచనముచేఁ గల్గుగుణము లెవ్వి? అటులే తిలోదకదానము చేతను, వర్షకాలదీపదానముచేతను గల్గుగుణము లెవ్వి?' అని ప్రశ్నిం చెను. అప్పు డప్పితరులు 'ఓయీ! గార్గ్యా! అట్లు విడువఁబడిన నీల వృషభము, లాంగూలమును దోయమున ముంచి యెత్తినచో దానిచే నఱువదివేలేండ్లు పితరులు తృప్తినొందుదురు. మఱియు నది నిజశృంగ గతమగుపంకముతోఁ దీరమునుండి వెడలినచో, దానిచేఁ బితరులు సోమలోకమును బొందుచున్నారు. ఇది నిశ్చయము. వర్షకాల దీపదానముచేఁ జంద్రునివలె మానవుఁడు విరాజిల్లును. మఱియు నట్టివాని కెన్నఁడును దమోరూప ముండదు. అమావాస్యయందుఁ దిలోదకదానము చేసినవారికి రాగిపాత్రము గొని, మధుమిశ్ర ముగా నొనర్చిన శ్రాద్ధమున కగుఫలము సిద్ధించును. రహస్యమగు నిది యథార్థమని తెలియుఁడు. మఱియు నట్టివారికి మంచిసంతానము నైతము గలుగును. పిండదాతకు వంశాభివృద్ధి యగుచున్నది. అట్టి శ్రాద్ధముచేఁ బితరులఋణము తీరుచున్నది. శ్రాద్ధకాలక్రమము, విధియుఁ, బాత్రము, ఫలము వ్యక్తముగాఁ దెలుపఁబడియెను' అని తెలిపి" రని పలికి భీష్ముఁడు మఱియు నిట్లనియె.

## దానధర్మకథనము.

"ఓయుధిష్ఠిరా! ఇంద్రుఁడు విష్ణునిఁ గాంచి 'ఓదేవా! నీకు దేనిచేఁ బ్రీతి గలుగును? నీవెట్లు తుష్టి నొందుదువు?' అని యడు

గుటయు, నా నారాయణుఁడు 'ఓవాసవా! బ్రాహ్మణులతో నపవాదము సేయుట నాకెంతయు ననిష్టము. బ్రాహ్మణులు పూజితులగుదురేని నేను బూజితుఁడ నగుదును. ఇందు సందియము లేదు. నిత్యమును బ్రాహ్మణులకు నమస్కరించువారు నాకు సంతోషమును గలిగింతురు. నాచక్రమును నాపాదములను శిరసావహించువాఁడు నాకిష్టుఁడు. వామనుఁడగు బ్రాహ్మణుఁడును, జలోత్థితమగు వరాహమును, సముద్ధృతమగుభూమియుఁ గానవచ్చినపు డెవ్వఁడు శిరసావహించునో, వాఁ డెట్టి యశుభమును గాని, కిల్బిషమును గాని పొందఁడు. అశ్వత్థమును, నుత్తమస్త్రీని, గోవును బూజించినవాఁడు దేవాసురమానవుల నెల్లఁ బూజించినవాఁడగును. వానిపూజను నేను నిజరూపముచేఁ బరిగ్రహించుచున్నాఁడను. లోకము లున్నంతవఱకును వారొనర్చుపూజ నాదియేగాని వేఱొకనిఁ జేరదు. అల్పబుద్ధులై వేఱొకవిధముగా నన్నుఁ బూజింతురుగాని యది వ్యర్థము. అట్టి దానిని నేను బ్రతిగ్రహింపను. అట్టిపూజచే నేను దుష్టినొందను. అని పలికెను. అది విని యింద్రుఁడు, 'ఓదేవా! చక్రమును, బాదములను, వరాహమును, వామనుఁ డగు బ్రాహ్మణుని, సముద్ధృతమగు భూమిని నీవేల ప్రశంసించుచున్నవాఁడవు? నీవే భూతములను సృజించుచున్నాఁడవు. వానిని నీవే సంహరించుచున్నవాఁడవు. మఱియు సకలభూతములకును, మర్త్యులకును నీవే సనాతనప్రకృతివి గాదే? అట్టి నీవు వానిని బొగడ నేల?' అని ప్రశ్నించెను.

ఓయుధిష్ఠిరా! అది విని యానారాయణుఁడు నగి 'ఓయింద్రా! నాచక్రముచే దైత్యులు చంపఁబడిరి. నాపాదములచేఁ బుడమిని ద్రొక్కితిని. వరాహరూపమూని హిరణ్యాక్షుని వధించితిని. వామనరూపమొంది, బలిని జయించితిని. కావున వానిని బూజించిన మానవులకుఁ బరితుష్టుఁడ నగుచున్నాఁడను. నన్నుఁ బూజించినవారికిఁ బరాభవ మెన్నఁడును గలుగ నేరదు. ప్రాతస్సంధ్య నుపాసించి యాదిత్యాభిముఖుఁడై యున్నవాఁడు సకలతీర్థస్నానఫలమొంది పాపవిముక్తుఁడగును. ఈరహస్యమెల్ల నీకెఱిఁగించితినిగదా! ఇంక నేమిచెప్పవలయును?' అని పలికెను. పిమ్మట బలదేవుఁడు, 'ఓయీ వినుఁడు. మానవులకుఁ బరమసుఖావహమైన దొకరహస్యము గలదు.

దానిని దెలియక మూర్ఖులై కొందఱు భూతపీడితు లగుచుందురు. ఎవ్వఁడు ప్రాతఃకాలమునన లేచి గోవును, ఘృతమును, పెరుఁగును, సర్షపమును, ప్రియంగువును స్పృశించునో, వాఁడు కల్మషరహితుఁ డగుచున్నాఁడు. సకలభూతములును, ముందును వెనుకను ఛిద్రములం దుచ్ఛిష్టమును దొలఁగించుకొనుచుండవలెను' అని తెలిపెను. పిదప దేవతలు 'ఓయీ! తోయపూర్ణమగు నుదుంబరపాత్రమును బట్టికొని యుదఙ్ముఖుఁడై యుండి, యుపవాసవిధి యొనర్పవలయును. లేదా! ఏదే నొక వ్రతము నేని సంకల్పింపవలయును. అటులొనర్చినవానికి దేవతలు ప్రసన్నులగుదురు. వానికోర్కియు సిద్ధించెడిని. కొంద ఱటులుగాక యల్పబుద్ధులై వ్యర్థముగా నొనర్తురు. ఉపవాసవిధి యందును, బలియందును దామ్రపాత్రము ప్రశస్తమగుచున్నది. బలియు, భిక్షయు, నర్ఘ్యము, పితృతిలోదకము ననునవి తామ్ర పాత్రముచే నీయఁదగియున్నవి. అటులుగానిచో నవి నిష్ఫలములగును. ఇది యతిరహస్యము. దీనికి దేవతలు తుష్టులగుదురు.' అని పలికెను. పిమ్మట ధర్ముఁడు 'ఓయీ! రాజపురుషుఁడగు విప్రునకును, రాగ వాద్యాదులచే జీవించువానికిని, బరిచారకుఁడైనవానికిని, గోరక్షకున కును, వర్తక మొనర్చువానికిని, శిల్పనాట్యము లొనర్చువానికిని, మిత్రద్రోహికిని, నధ్యయనహీనునకును, శూద్రకాంత నుంచుకొన్న వానికిని దైవపితృకార్యములం బెట్టిదానములు జేయరాదు. అట్టి వానికిఁ బిండదులు నశింతురు. వాఁడు పితృదేవతలను బ్రీతులఁ జేయఁ జాలఁడు. ఎవ్వనియింటినుండి యతిథి భగ్నాశుఁడై వెడలిపోవునో, వాని పితరులును, దేవతలును, నగ్నులును నిరాశులై మరలిపోవు చున్నారు. అతిథి నర్చింపనివాఁడు, స్త్రీలను గోవులను జంపినవారి తోడను, గృతఘ్నులతోడను, బ్రహ్మఘ్నులతోడను, గురుతల్పగుల తోడను దుల్యదోషుఁ డగుచున్నాఁడు.' అని పలికెను. పిమ్మట నగ్ని దేవుఁడు 'ఓయీ! ఏమానవుఁడు దుర్మతియై పాదమెత్తి గోవును దన్నునో, యటులే బ్రాహ్మణుని, దీప్యమానమగునగ్నిని బాదముతో స్పృశించునో, యట్టివానిదోషములఁ దెలిపెదను వినుము. వాని యపశబ్దము మిన్నుముట్టును. వాని పితరులు జడియుదురు. వాని యెడ దేవతలకు వైమనస్యము గలుగును. వానిహవ్యమును వహ్ని

పరిగ్రహింపఁడు. వాఁడు నూఱుజన్మములవఱకును, నరకమునఁ గ్లేశమందుచుండును. వానికి నిష్కృతియును గలుగదు. మఱియు వాని నెవ్వరును సమ్మతింపరు. కావున గోవును, బాదముతో నొకప్పుడును స్పృశింపరాదు. అటులే తేజోనిధియగుబ్రాహ్మణుఁడును మండుచున్న యగ్నియుఁ బూజ్యపదార్థములు శ్రేయము గోరునట్టిమానవుఁడు గోబ్రాహ్మణాగ్నులను బూజింపవలయును. స్త్రీలను బాదముతోఁ దన్నినవానికిని నిట్టిదోషము లే యగును.' అని పలికెను. పిమ్మట విశ్వామిత్రుఁడు, 'ఓయీ! ధర్మయుక్తమగు మఱియొకపరమరహస్య మెఱిఁగించెదను వినుఁడు. ఎవ్వఁడు తూర్పుదిక్కున గజచ్ఛాయగలిగి యుండఁగా గుతపకాలమున దక్షిణాభిముఖుఁడై భాద్రపదమాసమున బహుళపక్షమున మఘయందుఁ బితరులకుఁ బరమాన్నముతో, నొపహారిక మొసంగునో వానికగు, గుణవిస్తారమును వినుఁడు. అటులొనర్చిన వానికిఁ బదుమూఁడువత్సరములు శ్రాద్ధకృత్య మొనర్చిన వాని కగుఫల మగుచున్నది.' అని పలికెను. పిమ్మట గోవులు 'ఓయీ! గోవు నెవ్వఁడు 'బహులే, సమంగే, అకుతోభయే' అను మొదలగు వాక్యములతో నభినందించునో, వాఁడు పాపకర్మవిముక్తుఁడై పురందరలోకములనొంది గోఫలమును, జంద్రకాంతిని బొందుచున్నాఁడు. మఱియు దేవతాప్రీతికరములగు నిమ్మంత్రమును గోవులనడుమ నెవ్వఁడు పఠించునో, వాని కెన్నఁడును భయముగాని, పాపముగాని, శోకముగాని గలుగకుండుటయగాక యింద్రలోకము సైతము లభించుచున్నది.' అని తెలిపినవి.

ఓయుధిష్ఠిరా! పిమ్మట మహాభాగులగు సప్తమహర్షులును, బద్మసంభవుఁడగు బ్రహ్మకుఁ బ్రదక్షిణమొనర్చి ప్రాంజలులై నిలువఁబడిరి. అపుడు వారిలో వసిష్ఠుఁడు సర్వప్రాణిహితకరమై, యందును బ్రహ్మక్షత్రియులను విశేషించి శ్రేయస్కరమైన ప్రశ్నముచేయువాఁడై 'దేవా! సాధువృత్తులయ్యు ద్రవ్యహీనులై దరిద్రులై మానవులు, యాగఫలమును గోరుదురేని, వారి కది యెట్టికర్మముచే నగును?' అని పలికెను. అది విని యప్పరమేష్ఠి, 'ఆహా! ఓమహాభాగులారా! గూఢార్థమై పరమశుభకరమగుప్రశ్న మొనర్పఁబడియెను. మఱియు నిది సూక్ష్మమై శ్రేయస్కరమై యున్నది. తపోధనులారా!

సమస్తమును దెలిపెదను వినుఁడు. మానవునకు యజ్ఞఫల మెట్లు గలుగునో నావచనములచేఁ దెలియును. అందు సంశయము లేదు. పుష్యమాసమున శుక్లపక్షమున రోహిణీనక్షత్రము గలిసినదినమున, నాకాశశయనుఁడై, యేకవస్త్రుఁడును, శుచియు, స్నాతుఁడు, శ్రద్ధావంతుఁడును నై చంద్రకిరణములఁ ద్రావినచో వానికి యాగఫలము గలుగుచున్నది. ఋషిప్రోత్తములారా! పరమరహస్యమగు దీనిని మీకు కెఱిఁగించితిని.' అని తెలిపె" నని పలికి భీష్ముఁడు మఱియు నిట్లనియె.

దైవరహస్యము

"ఓధర్మజా! పిమ్మట నగ్నిదేవుఁడు, 'ఓయీ! పౌర్ణమినాఁడు చంద్రుఁ డుదయించుచుండఁగాఁ, బూర్ణజలాంజలియై నేయిఁగలిపిన యక్షతలను బట్టికొని చంద్రున కెదురుగా నిలువఁబడి బలి నర్పింపవలయును. అట్టివాని కగ్నికార్యఫలము గలుగుటయేగాక యగ్నిత్రయము నారాధించినవాని కగుఫలమును గలుగుచున్నది. అమావాస్యనాఁడు బుద్ధిహీనుఁడై యెవ్వఁడు వృక్షమును గొట్టునో, యట్టి కృత్యమున నావృక్షమునందలి యొకపత్రము పడినను వానికి బ్రహ్మహత్యాదోషమగుచున్నది. మఱియు నమావాస్యనాఁడు, వివేకహీనుఁడై యెవ్వఁడు దంతకాష్ఠమును నమలునో, వాఁడు చంద్రుని హింసించినవాఁడగును. దానివలనఁ బితరుల కుద్వేగము గలుగును. పర్వములందు వాఁడిచ్చిన హవ్యములను దేవతలు పరిగ్రహింపరు. వానిపైఁ బితరులకుఁ గోపము గలిగి వానివంశము క్షీణించును' అని తెలిపెను. పిమ్మట లక్ష్మి 'ఓయీ! ఎవ్వనియింటఁ బాత్రములు చెదరియుండునో, మఱియుఁ బాత్రములు నాసనములును భిన్నములై యుండునో, యేయింట స్త్రీలు తాడితలగుదురో, యేగృహము కశ్మలోపహతమగునో, యట్టియింటినుండి, పర్వదినములందును, నుత్సవదినములందును, దేవతలు నిరాశులై పోవుదురు' అని పలికెను. పిమ్మట నంగిరుఁడు 'ఓయీ! ఎవ్వఁ డొక సంవత్సరము పూర్ణముగా, సువర్చలాలతాపూలహస్తుఁడై కరంజకమను చెట్టుతోఁజేసినపాత్రమున దీపముంచునో, వానికి సంతానము వర్ధిల్లును' అని పలికెను. అనంతరము గార్గ్యుఁడు 'ఓయీ! నిత్యము నెవ్వఁ డతిథిపూజ సేయునో, యెవ్వఁడు సత్తరువులందు దీపముంచునో,

రెవ్వాఁడు పగలు నిద్రింపకుండునో, ఎవ్వాఁడు మాంసభక్షణము పరిత్యజించునో, ఎవ్వాఁడు గోబ్రాహ్మణుల హింససేయకుండునో, యెవ్వాఁడు పుష్కరములఁ బొగడునో, యట్టి వాఁడే ధర్మపరుఁడనియు, వాఁడొనర్చినదియే యుత్తమధర్మమనియుఁ దెలియవలయును. ఇది మహాఫలమగు పరమరహస్యము. క్రతువులు నూఱుచేసినను వాని ఫలము క్షీణించునుగాని, శ్రద్ధాళుఁడై నాతెలిపినధర్మము లొనర్చిన వారి కగుఫలము నశింపదు. మఱియు నొకటి చెలిపెదను. అది పరమ రహస్యమని తెలియుఁడు. తీర్థములందును, బస్వములందును, చైత్య కములందును, దైవకార్యములందును, రజస్వలయు, బొల్లిదియు, సంతానము లేనిదియుఁ గానవచ్చినచో దేవత లాకార్యములందలి హావిస్సును భుజింపరు. అట్టివానికృత్యమునకుఁ బదుమూఁడువత్సర ములవఱకును బితరులు సంతసింపకుండురు. శుక్లవసనుండును, శుచియు నై బ్రాహ్మణులచే స్వస్తివాచనము చేయింపవలయును. భారతమును బఠింపవలయును. అటు లేని యట్టివానిహవిస్సు అక్షయమగుచున్నది.' అని పలికెను. పిమ్మట ధౌమ్యుఁడు, 'ఓయీ! భిన్నభాండము, మంచము, కుక్కుటము, శునకము, గృహమున వృక్షములును, నప్రశస్తములు. భిన్నభాండమునఁ గలి యుండును. మంచమున్నచో ధనక్షయ మగును. కుక్కుటశునకము లుండెనేని యందు దేవతలు హావిస్సు గొనరు. వృక్షమున్నచోఁ దన్మూలమున వృశ్చికసర్పాదులు చేరును. కావున వృక్షములను గృహమున నాఁటరాదు.' అని పలి కెను. అంత జమదగ్ని 'ఓయీ! ఎవ్వఁడేని వాజపేయాశ్వమేధములు చేసినను, దలక్రిందై వ్రేలాడియున్నను సత్రమొనరించినను, హృదయము శుద్ధముగాకుండెనేని వానికి నరకము తప్పదు. యజ్ఞము, సత్యము, హృదయశుద్ధియుఁ దుల్యములు. శుద్ధమానసముతో నొకబ్రాహ్మణున కొకప్రస్థము సక్తు వొసంగినవాఁడు బ్రహ్మలోకము నొందును. ఇది నిశ్చయము.' అని పలికె'' నని తెలిపి భీష్ముఁడు మఱియు నిట్లనియె.

## దానధర్మకథనము.

''ఓయుధిష్ఠిరా! పిమ్మట వాయుదేవుఁడు 'ఓయీ! మానవులకు సుఖావహమగు నొకధర్మము నెఱిఁగించెదను. మఱియు రహస్యము

లగుదోషములను దెలిపెదను సమాహితుఁడవై వినుఁడు. అగ్నికార్య మొనర్చుటయుఁ, బరమాన్నభోజన మొసంగుటయు, దీపదానము సేయుటయుఁ, బితరులకుం దిలోదకము లిచ్చుటయు శ్రేయస్కరములు. ఇట్టివిధి నాశ్రయించి శ్రద్ధాళువు సమాహితుఁడునై వర్షకాలమున నాల్గునెలలు తిలోదకము లర్పించుచు, నెవఁడు యథాశక్తిగా వేద పారగుఁడగు బ్రాహ్మణునకు భోజన మొసంగునో, వానికి శతయాగ ఫలమగుచున్నది. ఇది యొకరహస్యము. ఇది ప్రశస్తముగాదని తెలియుఁడు. ఒకచోటినుండి వేఱొకచోటి కగ్నిని శూద్రుఁడు తెచ్చుటయుఁ, దెలియనిస్త్రీలు హవిస్సును దెచ్చుటయు ధర్మమని యెవ్వఁడెంచునో, వాఁ డధర్మముపాలగుచున్నాఁడు. అట్టివానిపై నగ్నులకుఁ గోపము గల్గును. వాఁడు శూద్రయోని నొందును. పితరులును, దేవతలును వానికృత్యమునకు సంతసింపరు. దానికిఁ బ్రాయశ్చిత్తము నెఱిఁగించెదను వినుఁడు. ఆప్రాయశ్చిత్తము చేసినవాఁడు పరితాపహీనుఁడై సుఖియగుచున్నాఁడు. గోమూత్రపురీషములతోడను, గోక్షీరఘృతములతోడను మూఁడుదినములు నిరాహారుఁడై, నిశ్చలచిత్తుఁడై యగ్నికార్య మొనర్పవలయును. పిదప సంవత్సరము నిండఁగనే దేవతలు వానిహవిస్సును బ్రతిగ్రహింతురు. శ్రాద్ధకాలము వచ్చినపుడు పితరులును దృప్తినొందుదురు. ఇది యొకధర్మాధర్మరహస్యమని తెలియుఁడు' అని పలికె" నని తెలిపి భీష్ముఁడు మఱియు నిట్లనియె.

## లోమశరహస్యము.

"ఓయుధిష్ఠిరా! అనంతరము లోమశుఁడు 'ఓయీ! ఎవ్వఁడు దారసంగ్రహముసేయక పరదారసక్తుఁడగునో, యట్టివాఁ డొనర్చు శ్రాద్ధములకు నిరాశులై పితరులు మరలుదురు. పరదారసక్తుఁడును, వంధ్యారతుఁడును, బ్రాహ్మణధనాపహర్తయుఁ దుల్యులగుచున్నారు. వారు పితృదేవతలకు సంభాషింపఁదగినవారు గారనుటలో సందియము లేదు. మఱియు నట్టివారిహవిస్సును, దేవతలును, బితృదేవతలును బరిగ్రహింపరు. కావునఁ బరదారను, వంధ్యను, బ్రాహ్మణధనమును బరిహరింపవలయును. ధర్మయుక్తమగు మఱియొకరహస్య మెఱిఁగించెదను వినవలయును. శ్రద్ధాళువై గురువచనముల నాదరింపవలయును.

ప్రతిమాసమందును, ద్వాదశీపౌర్ణమాసులయందు ఘృతాక్షతములను బ్రాహ్మణుల కొసంగెనేని పుణ్యమగునని తెలియుఁడు. దానిచేఁ జంద్రుఁడును మహాసముద్రమును వర్ధిలును. మఱియు వాని కశ్వమేధయాగమున నాల్గవభాగమును స్ఫురింపఁబడును. అట్టిదానముచేఁ దేజస్వియు, వీర్యశాలియు నగును. మఱియుఁ జంద్రుఁడు ప్రీతుఁడై యిష్టముల నొసంగును. సరహస్యము మహాఫలము నగు మఱియొకధర్మము గలదు వినుఁడు. కలియుగమానవుల కిది సుఖావహమైనది. ప్రాతఃకాలముననే లేచి యెవ్వఁడు స్నాన మొనర్చి శుక్లవస్త్రధారియై శ్రద్ధతో బ్రాహ్మణులకుఁ దిలపాత్ర మొసఁగి, పితరులకు మధుమిశ్రముగాఁ దిలోదకముఁ నొసంగునో, యెవ్వఁడు దీపదానము చేయునో, వాని కగుఫలమును దెలిపెదను వినుము. తిలపాత్రదానమున శాశ్వతమైన గోభూమిదానఫలమగునని పాకశాసనుఁడు తెలిపెను. మఱియుఁ దద్దానమున, బహుదక్షిణలతో నగ్నిష్టోమయాగ మొనర్చినవాని కగుఫలము తిలపాత్రదానముచే నగునని దేవతలు తలంచుచున్నారు. శ్రాద్ధమునఁ దిలోదకమును నక్షయముగాఁ బితరులు తలంతురు. అటులే దీపమునకు గుడమిశ్రతిలపిష్టమునకు దృప్తులగుచున్నారు. పితరులును, దేవతలును పితృస్వర్గలోకముల నట్టివాని నాదరింతురు. ఇది మహర్షిదృష్టమగు పురాతనధర్మము.' అని పలికె" నని తెలిపి భీష్ముఁడు మఱియు నిట్లనియె.

## చిత్రగుప్తరహస్యము.

"ఓయుధిష్ఠిరా! పిమ్మట మహర్షులందఱును, పితరులును, దేవతలును నిశ్చలచిత్తులై తపోవృద్ధయగునరుంధతిని ధర్మ మెఱిఁగింపు మని యడిగిరి. అది విని యరుంధతి, 'ఓమహాత్ములారా! మిమ్ము స్మరించుటచే నాతపము వృద్ధినొందెను. మీయనుగ్రహముచే శాశ్వతధర్మములను దెలిపెదను. రహస్యములగువాని నెఱిఁగించెదను వినుఁడు. శుద్ధచిత్తుఁడును శ్రద్ధావంతుఁడునై ధర్మ మొనర్పవలయును. శ్రద్ధాహీనుఁడును, నహంకారియు, బ్రహ్మఘ్నుఁడును, గురుతల్పగుఁడును ననియెడినలుగురును నసంభాష్యు లగుచున్నారు. వారికి ధర్మమును దెలుపరాదు. ప్రతిదినమును గపిలగోవును దానము చేసినవాని

కిని, ప్రతిమాసమును బండ్రెండువత్సరములు వరుసగా యాగము చేసినవానికిని, గోసహస్రదాతకును నగుఫలముకంటె మించినఫల మతిథిఁ బూజించువారి కగుచున్నది. మానవసుఖావహమగు మఱియొకధర్మమును వినుఁడు. రహస్యమై మహత్తరఫలజనకమగు దీనిని శ్రద్ధతో నాచరింపవలయును. ప్రాతఃకాలమున లేచి, గోవులనపుడు నుదకములతో దర్భలను బట్టికొని, యందే యాజలముచేఁ దనతల తడుపుకొని, నిరాహారుఁడై నిరీక్షింపవలయును. దానికగుఫలమును వినుఁడు. ఈగోశృంగోదకస్నానము సిద్ధచారణులకును, బందితులకును సేవ్యములగు త్రిలోకతీర్థములందును స్నానమొనర్చినవాని కెట్టిఫల మగునో యట్టిఫల మొసంగును.' అని తెలిపెను. దానికి దేవతలును, పితృదేవతలును, భూతకోటియు సంతుష్టులై యారుంధతిని మేలు మేలని పొగడిరి. పిమ్మటఁ బద్మభవుఁడు 'ఓమహాభాగా! అరుంధతీ! నీవు రహస్యధర్మమును దెలిపితివి. నీకొకవర మొసంగెదను. నీతపము వర్ధిల్లుఁగాక' అని పలికెను. పిదప యముఁడు 'ఓయీ! మీవలన మనోజ్ఞప్రసంగమును వింటిని. నాకుఁ బ్రియమగుచిత్రగుప్తభాషితము వినిపించెదను వినుఁడు. అగస్త్యాది ధర్మయుక్తమైనరహస్యమగుట మహాత్ములు వినఁదగినది. హితముగోరు మానవుఁడు శ్రద్ధతో దాని నాచరింపవలయును. పుణ్యపాపములు రెండును, గొంచమేని నశింపవు. పర్వకాలమున నొసర్చిన దాదిత్యు నొందును. అట్టిపుణ్యము మానవుఁడు ప్రేతలోకమును బొందినపుడు పుణ్యాత్ముఁడగు సూర్యునిచే స్మరింపఁబడి యామానవున కుపయుక్తమగుచున్నది. చిత్రగుప్తమై శుభమైనయొకధర్మమును దెలిపెదను. పానీయమును, దీపమును, జెప్పులను, ఛత్రమును, గపిలగోవును నొసంగవలయును. పుష్కరమున వేదపారగుఁడగు బ్రాహ్మణునకుఁ గపిలగోదానము సేయవలయును. నిత్యము నగ్నిహోత్రమును గాపాడవలయును. మఱియొకధర్మము చిత్రగుప్తుఁడు పలికినది గలదు. దీనిఫలమును వేఱువేఱుగా వినుఁడు. కాలక్రమమున సకలభూతములును ప్రళయ మొందవలసినదియే. అటులు మృతులై దుర్గమస్థలములనొంది, యాఁకలిదప్పులకు లోనై దహ్యమానులై కష్టములపాలగుదురు. అందుఁ బయవిడిపోవుటకు వలనుపడదు అల్పబుద్ధులై ఘోరమగునంధకారమును ప్రవేశింతురు.

అట్టికష్టములను వారు తరించుటకుఁ దగుధర్మ మొకటి తెలిపెదను. నా తెలిపిన దల్పవ్యయము మహాఫలమునై వ్యాప్తినొందినపిదప సుఖమును గలిగించునది. పానీయగుణములు దివ్యములు. ప్రేతలోకమున విశేషించి యుపయుక్తములు. ఆయమలోకమునఁ బుష్పోదకమనియెడి నది వారికి విధింపఁబడినది. అం దమృతోపమమై చల్లనియత యోదకముండును. పానీయదానమొనర్చినవాఁ డానదియందలి నీరు ద్రావును. ఇఁకఁ బ్రదీపదానముచే నగుగుణములను వినుఁడు. ఆ లోకమందున్న యంధకారము దీపదాతకుఁ గానరాదు. సూర్యచంద్రులును బావకుఁడును నాతనికిఁ గాంతి నొసంగుదురు. వానిని దేవతలు సమ్మతింతురు. దిశలు నిర్మలములుగా నాతనికిఁ గానవచ్చును. అట్టివాఁడు ప్రేతలోకగతుఁడై యాదిత్యునట్లు వెలయును. కావునఁ బానీయమును దీపమును దప్పక యొసంగవలయును. వేదపారగుఁడగు బ్రాహ్మణున కెవ్వఁడు కపిలగోవును పుష్కరమున దానముచేయునో, వానికగుఫల మెఱింగించెదను. అట్టివానికి వృషభములతోఁగూడిన గోశతము నిచ్చినవాని కగుఫల మగుచున్నది. బ్రహ్మహత్యాతుల్యమగుపాప మేదేనొనర్చినను, నొకకపిలగోవును దానముచేసినవాఁడు గోశతము నిచ్చినట్లు పాపవిముక్తుఁ డగును. కావున జ్యేష్ఠపుష్కరమున శుక్లపక్షమునఁ గపిలగోవును దానముసేయవలయును. అట్టివాని కెట్టికష్టమును నెట్టిదుఃఖమును నెట్టికంటకములును గలుగనేరవు. పాత్రుఁడగుద్విజోత్తమున కుపానహములు నొసంగవలయును. ఛత్రదానమునఁ బరలోకగతుఁడైనప్పుడు సుఖచ్ఛాయ లభించును. దత్తమగుదానమునకు నాశము లేదనుట చిత్రగుప్త సమ్మతమని యముఁడు తెలుపఁగా విని, విభావసుఁడును దెలుపునట్టివాఁడై యాదేవతలను బితృదేవతలను నుద్దేశించి 'ఓమహాత్ములారా! చిత్రగుప్తధర్మరహస్యమును వింటిని. ఎవ్వరు మహాత్ములగు బ్రాహ్మణులకుఁ బైఁ దెలిపినదానములను శ్రద్ధాళులై చేయుదురో, వారి కెట్టి భయమును గలుగనేరదు. మఱి యైదుధర్మదోషములు గలవు. వానికి నిష్కృతిసైతము లేదు. బ్రహ్మఘ్నుఁడు, గోఘ్నుఁడు, పరదారరతుఁడు, శ్రద్ధాహీనుఁడు, స్త్రీ ననుసరించి జీవించినవాఁడును, వర్జనీయులగు నరాధములు. మఱియు, నసంభావ్యాచారులు ననఁబడుదురు. పాప

కర్ములగునట్టివారు ప్రేతలోకగతులై నరకమున బూయశోణితభోజనులై మీనములట్లు పరితపింతురు. ఆయేవురును దేవతలకును, పితృదేవతలకును నసంభాష్యులగుచున్నారు. మఱియు నట్టివానిని స్నాతకులును, విప్రులును, దపోధనులును నాదరింపరు.' అని పలికె'' నని తెలిపి భీష్ముఁడు మఱియు నిట్లనియె.

ప్రమథరహస్యము

''ఓధర్మజా! పిమ్మట మహాభాగులగు దేవతలును, పితరులును, మహర్షులును బ్రమథుల నుద్దేశించి 'ఓమహనీయులారా! మీరు మహాభాగులును, నపరోక్షముగ రాత్రిఁ జరించువారుగదా! అశుచులై యుచ్ఛిష్టులగుక్షుద్రమానవుల నెట్లు హింసించుచుందురు. ఎట్టికర్మ మొనర్చినమానవులకు మీరు హింసింపకుందురో, యట్టిపాపప్రతీకారము లెవ్వి? గృహాగతములగురక్షస్సు లెట్టికృత్యము లొనర్చిన నశించును? ఓరాత్రిసంచారులారా! మీవలన నీవిషయముల వినఁ గోరుచున్నారము' అని యడిగిరి. అది విని యాప్రమథులు, 'ఓమహనీయులారా! మైథునము, శ్లేష్మావమానము, మాంసభక్షణము, వృక్షమూలనిద్రయు, మాంసమును దలనుధరించుటయుఁ, బాదము లుంచుకొనువైపు తలనుంచుటయు నుచ్ఛిష్టములు. మానవులు పెక్కుఛిద్రములు గలిగియుందురు. వారు జలమున నమేధ్యములను శ్లేష్మమును వైతురు. అట్టివారు మాకు, భక్ష్యులును వధ్యులు నగుచున్నారు. అందు సందియము లేదు. ఇట్టి యాచారములుగలవారినే మేము బడిపింతుము. ఇఁక నట్టివారిని మేము హింసింపఁజాలకుండుటకుఁ దగుప్రతీకారముల నెఱిఁగింతుము వినుఁడు. గోరోజనము పూసికొనుటయు, ఘృతాక్షతల నొసంగుటయు మాంసము దినకుండుటయుఁ గలవారిని మేము హింసింపఁజాలము. మఱియు, నెవ్వని గృహమున నిత్యమును నగ్నిహోత్రముండునో, యటులే, పులితోలును, బులిగోళ్లును, స్థలకూర్మమును, నాజ్యధూమమును, బిడాలమును, నల్లమేఁకయు నుండునో, యట్టిగృహస్థునింట, దారుణపిశితాశనులకుఁ బ్రవేశింప వలనుపడదు. మాయట్టివారు లోకమున యథాసుఖముగాఁ జరించుచుందురు. అటులగుట వారు సంచరింపకుండుటకై

రక్షోఘ్నములగు నియ్యవి గృహములం దుండవలయు. ఈవిషయమున మీసంశయమెల్లఁ దీర్చితిమిగదా' అని పలికి" రని తెలిపి భీష్ముఁడు మఱియు నిట్లనియె.

దిగ్గజరహస్యము.

"ఓధర్మనందనా! పిమ్మటఁ బద్మోద్భవుఁడగుపరమేష్ఠి, దేవతలను, దేవేంద్రునిఁ గాంచి 'ఓయీ! ఇదె బలశాలియై పాతాళసంచారియై తేజస్సత్త్వపరాక్రమములు గలరేణుక మనియెడిగజముగలదు. మఱియు నధికతేజములై మహావీర్యముఁగల మహాగజములు, శైలవనకాననములతోఁగూడిన పుడమినెల్ల మోయుచున్నవి. మీ రీరేణుకమునకు సెలవొసంగి యాదిగ్గజములకడ కనిపి వానివలన ధర్మరహస్యములనెల్లఁ దెలిసికొనివచ్చుటకై పంపుఁడు' అనిపలికెను. ఆపరమేష్ఠిపలుకు లాలించి, యాదేవత లపు డారేణుకమును దిగ్గజములకడ కనిపిరి. అంత నా రేణుక మాదిగ్గజములఁ జేరి 'ఓమహాగజములారా! దేవతలును బితృదేవతలును నన్నుఁ బంప మీవలన ధర్మరహస్యముల వినఁగోరివచ్చితిని. ఓమహాభాగులారా! మీ కెయ్యది యిష్టమో దాని నెఱిఁగింపుఁడు' అని పలికెను. అది విని దిగ్గజములు, 'ఓరేణుకమా! కార్తికమాసమున బహుళాష్టమి శుభప్రదమైనది. అది యాశ్లేషతోఁ గలిసినపుడు 'బలదేవప్రభృతయో యేనాగా బలవత్తరా' అను మన్నగుమంత్రము నుచ్చరించుచు గుడోదనమును, వల్మీకమున బలిగా నర్పింపవలయును. అది సూర్యుఁడ స్తమించుచుండఁగాఁ గుసుమాకీర్ణముగను, నీలవస్త్రానులేపముగనుగా వల్మీకమున నర్పింపఁబడవలయును. అటులేని క్రింద భూభారపీడితులమైయున్న మేము సంతసింతుము. భూమిని ధరించుచున్నను శ్రమనొందము. బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులు పోషితులై యొకవత్సరమొనర్చినచో నాదానము బహుఫలజనకమయ్యెడిని. వల్మీకబలిదానముచే మహత్తరఫలమగునని మామతము. ముల్లోకములందును మహావీర్యముగల యేయేగజములు గలవో, యవియెల్ల వల్మీకబలిదానముచే నూఱువత్సరములు కృతాతిథ్యము లగుచున్నవి' అని పలికెను. ఆదిగ్గజములవచనము లాలించి దేవతలును బితృదేవతలును మహర్షులును రేణుకమును బూజించిరి." అని తెలిపి భీష్ముఁడు మఱియు నిట్లనియె.

## మహాదేవరహస్యము.

"ఓధర్మజా! పిమ్మట మహేశ్వరుఁడు వారినెల్లఁగాంచి 'ఓయీ! మీరు ధర్మసారమును దీసి యుదాహరించితిరి. ఇఁక మీరందఱును నావలన నీధర్మరహస్యమును వినుఁడు. ఎవ్వరిబుద్ధిధర్మము నాశ్రయించి యుండునో, యెవ్వరు శ్రద్ధావంతులై యుందురో, వారికే ధర్మముప దేశింపవలయును. ఎవ్వఁ డాకమాస మించుకేని యుద్వేగము లేకుండ గోదానాదిక మొనర్చునో మఱియు నటులే యేకభుక్త మాచరించునో, వానికగుఫలము దెలిపెదను వినుఁడు. మహనీయములగు గోవులు పరమపవిత్రములుగాఁ దెలుపఁబడినవి. మఱియు దేవాసుర మానవులతోఁగూడిన మూఁడులోకముల నివియే పోషించుచున్నవి. అటులగుట నాగోవుల సేవించుటచే మహత్తరపుణ్యము మహాఫలము నగును. వానిసేవవలనఁ బ్రతిదినము ధర్మమగుచుండును. మున్ను కృతయుగమున నివి నాయాజ్ఞలో మెలంగుచుండెడివి. పిమ్మట బ్రహ్మ యొకవృషభమును దెచ్చి వ్రజస్థానమున నుంపఁగా, నది వాని కధిపతియై యుండెను. నేను నిత్యము గోవులతో నాడుకొనుచుండెడి వాఁడను అటులగుట నవి పవిత్రములు. మఱియు నయ్యవి సేవించిన వారికిఁ దమమహాప్రభావముచే వరముల నొసంగును. ఎవ్వఁడు గోవు నొసంగునో, వానికి సకలసత్కార్యములందును గలనాల్గవభాగము ఫలము సిద్ధించును' అని పలికె"నని తెలిపి భీష్ముఁడు మఱియు నిట్లనియె.

## దేవరహస్యము.

"ఓధర్మనందనా! పిమ్మట స్కందుఁడును ధర్మ మెఱిఁగించు వాఁడై 'ఓయీ! నాకు సమ్మతమగుధర్మము దెలిపెదను. సమాహితులై వినుఁడు. ఎవ్వఁడు నీలవృషభశృంగములనుండి మృత్తికను దీసి, దానితో మూఁడుదినములు స్నానము చేయునో వానికగుఫల మెఱిఁగించెదను. దానివలన నశుభము తొలఁగును. పిమ్మటి జన్మమున నాధిపత్యము గలుగును. మఱియు నట్టివాఁడు జనించినది మొదలుగా శూరుఁడగును. మఱియొక పరమరహస్యమును దెలిపెదను. పౌర్ణమి నాఁడు చంద్రుఁ డుదయించుచుండఁగా, రాగిపాత్రముతో మధుమిశ్రితమగు పక్వాన్నమును బలి నొసంగవలయును. వానికగుఫల

మును శ్రద్ధాళులై వినుఁడు. సాధ్యులును, రుద్రులు, నాదిత్యులు, విశ్వేదేవులు, నశ్వినీదేవతలు, మరుత్తులు, వసువులును, దర్భలిని బరిగ్రహింతురు. ఆబలిచేఁ జంద్రుఁడును మహోదధియు, వర్ధిల్లును. సరహస్యమై సుఖావహమైన యీధర్మము నాచే నుద్దిష్టమైనది' అని తెలిపెను. అనంతరము, విష్ణువు 'ఓయీ! మహాత్ములగు దేవతలు తెలిపిన యీరహస్యములను, మహర్షులరహస్యములను, యెవ్వఁడు నిత్యము పఠించునో, శ్రద్ధాళుఁడు సమాహితుఁడునై వినునో, వానికి విఘ్నము, భయమును గలుగవు. ఏయవి రహస్యములై పవిత్రములై శుభధర్మములై వెలయునో వానిని బఠించువారి కగుధర్మఫలము తెలిపెదను వినుఁడు. అట్టివానికిఁ బాపభయము గలుగదు. అటులే యొకని కీధర్మమును వినిపించినవానికిని వినినవానికినిఁ దత్ఫలమగును. మఱియు వానిహవ్యకవ్యములను దేవతలును, బితృదేవతలును భుజింతురు. పర్వదినములం దెవ్వఁడు నియతుఁడై బ్రాహ్మణోత్తములకిది వినిపించునో, వాఁడు మహర్షులకును దేవతలకును బితృదేవతలకును నభిమతుఁడై ధర్మనిష్ఠుఁడును శ్రీమంతుఁడు నగుచున్నాఁడు. మహాపాతకములుదక్కఁ దక్కినపాపము నెల్ల నీధర్మరహస్యము వినినవాఁడు తొలఁగించుకొన నగుచున్నాఁడు' అని పలికెను.

"ఓయుధిష్ఠిరా! దేవతల యీధర్మరహస్యము వ్యాసోద్దిష్టము. సర్వదేవసమ్మతమైనదనియే దీనిని నీకెఱిఁగించితిని. రత్నసంపూర్ణమగు పృథివియు, సర్వోత్తమమగుజ్ఞానమును గలమానవుఁ డిదియే వినఁదగిన ధర్మమని తలంపవలయును. శ్రద్ధాహీనుఁడును, నాస్తికుఁడును, నష్టధర్ముఁడును, దయాహీనుఁడును, హేతుదుష్టుఁడును, గురుద్రోహియు, ననాత్మభూతుఁడు నగువాని కీధర్మరహస్య మెఱిఁగింపరాదు." అని తెలుప విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె.

## భోజ్యాభోజ్యాన్నకథనము

"ఓపితామహా! బ్రాహ్మణున కెవ్వరు భోజ్యులు? అటులే క్షత్రియునకును, వైశ్యునకును, శూద్రునకును భోజ్యు లెవ్వ రెవ్వరు?"

అది విని శాంతనవుఁ డక్కౌంతేయునితో "ఓయుధిష్ఠిరా! బ్రాహ్మణునకు బ్రాహ్మణక్షత్రియవైశ్యులు భోజ్యులై యుందురు. కాని

శూద్రు నన్నము దినరాదు. క్షత్రియుఁడు బ్రాహ్మణ క్షత్రియ వైశ్యాన్నములఁ దినవచ్చును. కాని, సర్వభక్షులును, కర్మరహితులునగు శూద్రులయన్నమును మాత్రము దినరాదు. నిత్యాగ్నిపరులును జాతుర్మాస్యరతులును, బవిత్రులునగు వైశ్యులు బ్రాహ్మణులకును క్షత్రియులకును భోజ్యులు. శూద్రాన్నము నెవ్వఁడు భుజించునో, వాఁడు పృథివీమలమును దినువాఁడగును. మఱియు నట్టివాఁడు, సకలజనమలము భుజించినవాఁడగును. శూద్రాన్నభోజులగు ద్విజులు మలమును దినువారగుదురు. శూద్రునకుఁ గర్మనిష్ఠగలిగనేని, వాఁడు వికర్మస్థుఁడై చెడును. బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు నిజకర్మహీనులై నరకతాపము నందుదురు. బ్రాహ్మణులు స్వాధ్యాయనిరతులును, స్వస్తిప్రదులును గావలయును. క్షత్రియుఁడు మానవరక్షణపరుఁడై యుండవలయును. వైశ్యునికర్మము పుష్టికరమై యుండవలయును. వానికృత్యమునుబట్టియే లోకము జీవించును. కావునఁ గృషిగోరక్షణ వాణిజ్యములు వైశ్యకర్మములై యున్నవి. ఎవ్వఁడు నిజకర్మమును బరిత్యజించి శూద్రకృత్య మొనర్చునో, వాఁడు శూద్రుఁడు నాఁదగి భోజ్యుఁడు గాకుండును. అటులే వైద్యుఁడును, నధమజీవియుఁ, బురాధ్యక్షుఁడును, బురోహితుఁడును, జ్యోతిషుకుఁడును, వృథాధ్యాయియు, శూద్రసము లనఁబడుదురు. శూద్రకర్ములగు వీరి యన్నము నెవ్వఁడు నిర్లజ్జుఁడై భుజించునో, వాఁడభోజ్యభోజన మొనర్చినవాఁడగుట దారుణభయము నొందువాఁడగును. మఱియుఁ జికిత్సకు నన్నము పురీషమువంటిదిని, లంజయన్నము మూత్రమట్టిదిని, శిల్పియన్నము శోణితమట్టిదిని నగుచున్నది. విద్యవలన జీవించువాని యన్నము శూద్రాన్నమువంటిదగుట సాధుసమ్మతుఁ డగువాఁ డట్టి దానిని భుజింపరాదు. నిందార్హుఁడగువానియన్నము రక్తమట్టిది. కొండెగాని యన్నము బ్రహ్మహత్యాదోషమును గలిగించును. అవమానముగలిగి సత్కారహీనమైన యన్నము నెన్నఁడును భుజింపరాదు. అటులు భుజించినవాఁడు వ్యాధిని గులక్షయమును వడిగా నొందును. నగరపాలకునియన్నము శ్వపాకాన్నమువంటిది. గోఘ్నుఁడును, బ్రహ్మఘ్నుఁడును, సురాపానకర్తయు, గురుతల్పగుఁడు నగువారియన్నమును దిన్నవాఁడు రాక్షసుఁడై జనించును. దాఁచినసొమ్ము

దోఁచుకొనినవానియుఁ, గృతఘ్నునియు, నపుంసకునియు న్ననము దిన్నవాఁడు మధ్యదేశబహిష్కృతమైన శబరగృహమున జనించుచున్నాఁడు. ఓధర్మజా! భోజ్యు లెవ్వరో, యభోజ్యు లెవ్వరో తెలిపితినిగదా! ఇంక నావలన నీవేమి వినఁగోరెదో తెలుపుము.'' అని పలుక విని యుధిష్ఠిరుం డిట్లనియె.

—— ప్రాయశ్చిత్తకథనము ——

“ఓపితామహా! భోజ్యు లెవ్వరో, యభోజ్యు లెవ్వరో తెలిపితివి. నాకిం దొకసందియ మొదవెడిని. దానిని దీర్పుము. అందును బ్రాహ్మణుల హవ్యకవ్యప్రతిగ్రహమునందు నానావిధములగుభోజ్యములలో నేయేప్రాయశ్చిత్తము విధింపఁబడియెనో తెలుపుము.”

అది విని భీష్ముఁడు “ఓయుధిష్ఠిరా! బ్రాహ్మణులప్రతిగ్రహములందును, భోజ్యమందును, నెట్టిప్రాయశ్చిత్తముచేఁ బాపవిముక్తియగునో తెలిపెదను వినుము. ఘృతప్రతిగ్రహమునందు సావిత్రీజపము, సమిదాహుతియుఁ బ్రాయశ్చిత్తము. అటులే తిలప్రతిగ్రహమునను బ్రాయశ్చిత్తమని తెలియవలయు. మాంసప్రతిగ్రహమందును, మధులవణముల బ్రతిగ్రహించినపుడును సూర్యుఁ డుదయించుచుండఁగా నెదురుగా నిలువఁబడి యుపస్థానమొనర్చుట ప్రాయశ్చిత్తమగుచున్నది. సువర్ణప్రతిగ్రహమునకు గురుశ్రుతిజపమును, గృష్ణాయతప్రతిగ్రహమునకు దానిని వ్యక్తముగా ధరించుటయుఁ బ్రాయశ్చిత్తములు. ఇటులే ధనము, వస్త్రము, వనితయు, సువర్ణము, అన్నము, పాయసేక్షురసములు, తైలము, ఇక్షువు ప్రతిగ్రహింపఁబడినపుడు త్రిసంధ్యలయందు నీటమునుఁగుట ప్రాయశ్చిత్తము. వ్రీహి, ఫల, పుష్పములును, బిష్టమయజలము, యావకదధిదుగ్ధములును బ్రతిగ్రహింపఁబడినపుడు నూఱుమాఱులు సావిత్రిని జపింపవలయును. శ్రాద్ధకార్యమందు వస్త్రమును జెప్పులను బ్రతిగ్రహించినచో, నిష్ఠమెయి నూఱుమారులు సావిత్రిని జపించినచోఁ, దత్పాపము పరిహృతమగుచున్నది. క్షేత్రమును బ్రతిగ్రహించియుఁ, గారాగారస్థసూతకుల నుండి ప్రతిగ్రహమొనర్చియుఁ, మూఁడురాత్రు లుపవాసమొనర్చి తత్పాపమును బరిహరించుకొననగును. కృష్ణపక్షమున నెవఁడు పితృ

శ్రాద్ధాన్నమును భుజించునో, వాఁడొకయహోరాత్రము గడచు నంతకును బవిత్రుఁడు గానేరఁడు. అట్టివాఁ డంతవఱకు సంధ్యోపాస నకును, జప మొనర్చుటకును నర్హుఁడు గాఁజాలఁడు. వాఁడు మఱియు నన్న సంకరము చేయరాదు. పితృశ్రాద్ధమున కపరాహ్ణము యుక్తకాల మని చెప్పఁబడియెను. మృతుఁడగువాని మూఁడవదివసమున వాని యన్న మెవఁడు తినునో, వాఁడు మూఁడువేళలయందును స్నానము చేయుచుఁ, బండ్రెండవదివసమున శుద్ధుఁడగును. అటు లాద్వాదశాహ మున శుద్ధుఁడై మఱునాఁడు శౌచ మొనర్చికొని, బ్రాహ్మణుల కన్న మొసఁగి తత్పాపమునుండి విముక్తుఁడగుచున్నాఁడు. మృతునిదశ రాత్రాన్నభోజన మొనర్చినవానికి సావిత్రీజపము, పవిత్రేష్టియుఁ,గూశ్మాం డవిధియు, నఘమర్షణస్నానమును బ్రాయశ్చిత్తములు. మృతసముద్దిష్ట మైన త్రిరాత్రభోజన మొనర్చినవాఁడు త్రిషవణస్నాన మేడునాళు లొనర్చినఁ బరిశుద్ధుఁడగును. బ్రాహ్మణుఁడు శూద్రులతో, నేకభోజన మొనర్చినవానికి విధ్యుక్తమగు ప్రాయశ్చిత్తమే లేదు. వైశ్యులతో, నేకభోజన మొనర్చిన బ్రాహ్మణుఁడు త్రిరాత్రదీక్షయొనర్చి పాపవిముక్తుఁ డగుచున్నాఁడు. క్షత్రియులతో నేకభోజన మొనర్చిన బ్రాహ్మణుఁడు సచేలస్నాన మొనర్చి శుద్ధుఁడగును. శూద్రునన్నము వంశనాశ మొన ర్చును. వైశ్యునన్నము పశుబాంధవులను బాధచేయును. క్షత్రియు నన్నము సిరిని హరించును. బ్రాహ్మణునన్నము తేజమును హరించును. అభోజ్యభోజనములకుఁ బైప్రాయశ్చిత్తము లొనర్చుకొనవలయునని తెలియుము.” అని తెలుప విని యుధిష్ఠిరుఁ డిట్లనియె.

దానఫలకథనము

“ఓపితామహా! దానముచేతను, వపముచేతను గలుగుఫలము దెల్పి నామనస్సంశయమును దొలఁగింపుము.”

అది విని భీష్ముఁడు, “ఓధర్మజా! ధర్మనిరతులై తపోభావితాత్ము లగువారును, దానపరులగునృపులును నుత్తమలోకముల నొందిరి. అందు సందియము లేదు. ఆత్రేయుఁడు సత్కృతుఁడై శిష్యులకు నిర్గుణ బ్రహ్మము నుపదేశించి యుత్తమలోకముల నొందెను. ఉశీనరపుత్రుఁ డగుశిబి, బ్రాహ్మణునకుఁగాఁ బ్రియపుత్రుని ప్రాణము లర్పించి స్వర్గ

మొందెను. కాశిరాజగు ప్రతర్దనుఁడు తనతనయుని బ్రాహ్మణునకిచ్చి నిరుపమానకీర్తి నిహపరములం దనుభవించెను. సంకృతిపుత్త్రుఁ డగు వసిష్ఠుఁడు మహాత్ముఁడగు వసిష్ఠునకు విధ్యుక్తముగా నర్ఘ్యమొసఁగి యుత్తమలోకముల నొందెను. దేవావృధుఁడు, బ్రాహ్మణునకు యజ్ఞార్థముగా, దివ్యములగు కాంచనశలాకలశత మొసఁగి స్వర్గమొందెను. భగవానుఁడగు నంబరీషుఁడు తేజోనిధియగు బ్రాహ్మణునకు రాష్ట్రము నిచ్చి యింద్రలోకమొందెను. జనమేజయుఁ డనురాజు దివ్యకుండలములను, యానమును బ్రాహ్మణునకు దానమొనర్చి, యుత్తమలోకములకుఁ బోయెను. వృషాదర్భి యనురాజర్షి వివిధములగు రత్నములను, రమ్యములగు గృహములను బ్రాహ్మణుల కొసఁగి స్వర్గమొందెను. వైదర్భియగునిమి తనరాష్ట్రమును, గన్యను మహాత్ముఁడగు నగస్త్యున కొసంగి, పుత్త్రపశుబాంధవసమేతముగా స్వర్గమొందెను. జమదగ్ని తనయుఁ డగురాముఁడు బ్రాహ్మణునకు భూమినెల్ల నొసంగి యక్షయలోకములఁ బడసెను. ఒకప్పుడు పర్జన్యుఁడు వర్షింపకుండఁగా, బ్రాహ్మణరాజగువసిష్ఠుఁడు సకలభూతములను జీవింపఁజేసి యక్షయగతి నొందెను. ఎవ్వని మహత్తరకీర్తి లోకమున వ్యాపించెనో, యట్టి దశరథరాముఁడు యజ్ఞములందుఁ బెక్కుధనము లొసఁగి యక్షయలోకముల నొందెను. కక్షసేనుఁ డనురాజర్షి మహాత్ముఁడగు వసిష్ఠునకు విధ్యుక్తముగా దానముచేసి యుత్తమగతినొందెను. కరంధమపౌత్త్రుఁడును, నవిక్షిత్తునకుసుతుఁడునగు మరుత్తుఁడు తనకన్నియ నంగిరసున కొసఁగి, స్వర్గమును జేరెను. రాజధర్మవేత్తయైన పాంచాల్యుఁ డగు బ్రహ్మదత్తుఁడు శంఖనిధి కనుజ్ఞయొసఁగి పరమగతినొందెను. మిత్రసహుఁ డనురాజు మహాత్ముఁడగు వసిష్ఠునకు దమయంతిని భార్యగా నొసఁగి త్రిదివము నొందెను. మనుపుత్త్రుఁడగు సుద్యుమ్నుఁడు మహాత్ముఁడగు లిఖితునకు ధర్మయుక్తమగు శిక్షనొసఁగి యుత్తమలోకముల నొందెను. మహాయశుఁడగు సహస్రచిత్యుఁ డనియెడి రాజర్షి బ్రాహ్మణులకార్యమునకుఁగా నిష్టములగుప్రాణములఁ బరిత్యజించి యుత్తమగతి నొందెను. శతద్యుమ్నుఁ డనియెడిభూపతి సకలకామసంపూర్ణమై సువర్ణమయమగుగృహమును మౌద్గల్యున కిచ్చి స్వర్గమొందెను. మున్ను భూమన్యుఁ డనెడిరాజు, శాండిల్యునకు పర్వత

తుల్యములగు భక్ష్యభోజ్యరాశుల నొసంగి దివ మారోహించెను. ద్యుతిమంతుఁ డను రాజు ఋచీకునకు రాజ్య మొసఁగి, యుత్తమలోకముల నొందెను. మదిరాశ్వుఁ డను రాజోత్తముఁడు సుమధ్యమ యను కన్నియను హిరణ్యహస్తుఁ డనువానికిచ్చి దేవాధిష్ఠితములగు లోకములనొందెను. లోమపాదుఁ డను రాజర్షి, ఋశ్యశృంగునకు శాంత యనుకన్నియ నిచ్చి సకలకామముల నొందెను. రాజర్షియగు భగీరథుఁడు కౌత్సునకు హంసి యనుకన్నియ నొసఁగి యక్షయలోకముల నొందెను. రాజగుభగీరథుఁడు కోహలునకు వత్సములతోఁగూడిన గోశతసహస్ర మొసంగి యుత్తమలోకముల నొందెను. ఓయుధిష్ఠిరా ! వీరును, మఱికొందఱును ననేకులు తపోదానములచే స్వర్గమునొంది మఱిమఱియు మరలుచున్నారు. వారికీర్తి భూమి యున్నంతకును బ్రతిష్ఠితమైయున్నది. గృహస్థులగువారు తా మొనర్చినతపోదానములచే నుత్తమలోకముల జయించినవిధ మెఱిఁగించితిని. నా తెలిపినవారు దానయాగప్రజాపాలనములచే స్వర్గ మొందిరి. దానయజ్ఞక్రియాసక్తమగుబుద్ధి ధర్మమును వృద్ధినొందించును. ఓధర్మజా! నీకింకను సందేహముగలదేని రేపటియుదయ మెఱిఁగించెదను. ఇపుడు సంధ్యాకాలమైనది" అని పలుక విని యుధిష్ఠిరుఁ డిట్లనియె.

### దానధర్మకథనము

"ఓపితామహా ! సత్యవ్రతపరాక్రమా ! దానధర్మముచే నేయే రాజర్షులు స్వర్గమొందిరో నీవలన వింటిని. అయినను మఱికొన్నిటిని వినఁగోరుచున్నాఁడను. దేయమగుదాన మెన్నివిధములు గలది ? దానికిఁ గల్గుఫల మెట్టిది? ఎవ్వరికిచ్చిన నెట్టిధర్మమగును? ఏయేకారణములచే నది యెన్నివిధములుగా నుండును ?"

అది విని శాంతనవుఁ డాకౌంతేయునితో "ఓయీ! దానమును గూర్చిన యథార్థ మెఱిఁగించెదను వినుము. సకలవర్ణములందును నెట్లు దాన మొనర్పవలయునో వినుము. ధర్మార్థకామనిమిత్తముగను, భయకారుణ్యముల నిమిత్తముగను నై దాన మైదువిధములుగా నుండును. 'అసూయారహితుఁడై బ్రాహ్మణునకు దాన మొనర్చినవాఁ డిహమునఁ గీర్తివడసి మరణించి సుఖమందుచున్నాఁడు.' అని దాన

మొనర్పవలెను. 'అతఁడు దానముచేయుచున్నాఁడు. అతఁడు దానము చేయును. నాకిదె యతఁడు దాన మొసంగెను.' అనురీతిగా యాచకులు పలుకుచుండ వినుచు, మఱియు దానముచేయవలయును. 'వీఁడు నావాఁడు గాఁడు. వీనికి నేనుగాను. వీఁ డవమానింపఁబడెనేని నాకుఁ బాపముగలుగును.' అని భయమునొందియు, మూఢునకేని దానము చేయవలయును. 'వీఁడు నాకుఁ బ్రియుఁడు వీనికి నేను బ్రియుఁడను' అని యాలోచించి మిత్త్రునకు దాన మొనర్పవలయును. 'వీఁడు దీనుఁడై నన్ను యాచించుచున్నాఁడు. కొంచె మిచ్చినను సంతసించును.' అని తలంచి కారుణ్యముచే దరిద్రునకు దానముసేయవలయును. ఓయుధిష్ఠిరా! పుణ్యకీర్తివివర్ధనమై దాన మిట్టులైదువిధములుగా నున్నది. దానము యథాశక్తిగాఁ జేయవచ్చునని ప్రజాపతి పలికెను." అని తెలుప విని ధర్మనందనుఁడు మఱియు నిట్లనియె.

## ఋషివాసుదేవసంవాదము

"ఓపితామహా! సర్వశాస్త్రజ్ఞా! మాయుత్తమవంశమున నీవు బహువిధశాస్త్రముల నెఱిఁగినవాఁడవు. నీవలన ముందును ధర్మార్థసహితమగు సుఖోదయము గలిగించునదియు, లోకాశ్చర్యభూతమైనదియునగువిషయము వినఁగోరుచున్నాఁడను. నా మొదలగు జ్ఞాతులకును, బాంధవులకును దుర్లభమగుకాలము లభించియున్నది. నీవు దక్క నన్ను శాసించువాఁడు వేఱొక్కఁడు లేఁడు. నేనును, నా సోదరులును నీయనుగ్రహమునకుఁ బాత్రులమేని, నిన్నడిగినప్రశ్నముల కుత్తరము లొసంగవలయును. శ్రీమంతుఁడగు మన యీనారాయణుఁడు సకలపార్థివసమ్మతుఁడు. ఇట్టి యీతఁడు నైతము నిన్ను సగౌరవముగను, సవినయముగను సేవించుచున్నాఁడు. ఇతఁడును, దక్కుంగలపార్థివులును, నాసోదరులును నీదయ నపేక్షించియున్నవారు. కావున వీరియెడ స్నేహము సూపి యుత్తమాంశము దెలుపనర్హుఁడవు." అని ప్రశ్నించెను.

ఓజనమేజయా! ఆయుధిష్ఠిరు నవ్వచన మాలించి స్నేహపరవశమానసుఁడై యాగాంగేయుఁ డిట్లు తెలుపఁదొడంగెను. "ఓధర్మనందనా! నీకొకమనోహరమగుకథను దెలిపెదను. ఈనారాయణుని

ప్రభావము నేను మున్ను వినియున్నాఁడను. దానిని, మఱియు నావృషభవాహనుని ప్రభావమును, పార్వతికిఁ గలిగినసంశయమును, మఱియు నాదంపతులచరిత్రమును దెలిపెదను వినుము. ఒకప్పుడీకృష్ణభగవానుఁడు ద్వాదశవార్షికవ్రత మాచరింప దీక్షవహించి యుండెను. అప్పుడీతనిఁ గాంచుటకు నారదపర్వతులు లరుదెంచిరి. మఱియుఁ గృష్ణద్వైపాయనుఁడును, ధౌమ్యుఁడును, దేవలకాశ్యపులును, హస్తికాశ్యపుఁడును, దీక్షాశాంతిసమన్వితులగు మఱికొందఱు మహర్షులును వచ్చిరి. మఱియుఁ దపోధనులై సిద్ధులై దేవకల్పులగు మహర్షిశిష్యులును నందుల కరుదెంచిరి. అంత నా దేవకీసుతుఁడు వారి కెల్లఁ దగునతిథిసత్కారమును, గులోచితమగుపూజను, దేవతుల్యముగా సమర్పించెను. పిమ్మట వారెల్లరును దమకుఁ దగు నాసనములపైఁ గూరుచుండిరి. పిదప నాసభలో దేవతలయు, రాజర్షులయుఁ, దపోధనులయు ధర్మయుక్తములై మధురములైన కథ లారంభింపఁబడియెను. పిదప నద్భుతకర్ముఁడగు కృష్ణునివదనమునుండి బ్రహ్మాచర్యేంధనోత్థితమై నారాయణతేజ మొకటి వెడలెను. అటులు వెడలిన యాయగ్నిచే లతలతోడను, వృక్షములతోడను, పక్షిమృగసంఘాతములతోడను గూడిన యాశైలము దహింపఁబడియెను. మఱియు దానిశిఖరము నలఁగి దీనదర్శనమయ్యెను. మహాజ్వాలలుగల యావహ్ని యటు లాయశేషమును దహించి, విష్ణునిఁ జేరి శిష్యునట్టు లాతనిపాదములను బట్టికొనియెను. అంత నావిష్ణువు నిశ్శేషముగా దగ్ధమైన యాపర్వతమును గాంచి, సౌమ్యబుద్ధి వెలయ దాని కెప్పటివొప్పునఁ బ్రకృతస్థితి గలిగించెను. అటులగుట నప్పర్వతము మునుపటివలెఁ బుష్పములు వెలయు లతాద్రుమములును, పక్షిగణములును గలిగి, శ్వాపదసరీసృపసహితమై గానవచ్చెను. అచింత్యమగు నమ్మహాద్భుతము నారసి, యమ్మునిగణము విస్మయావిష్టమై మేనులు గగుర్పొడువ నస్రకలుషితనేత్రమై యుండెను. అట్లు విస్మయమొందియున్న యమ్మహర్షుల నారసి, యానారాయణుఁడు స్నిగ్ధముగను, మధురముగను బ్రశ్నించువాఁడై 'ఓమహర్షులారా! నిత్యము త్యక్తసంగులును, నిర్మములును, సర్వశాస్త్రజ్ఞులును నగు మీయందఱ కట్లు విస్మయము గలుగుటకు నిమిత్తమేమి? ఓతపోధనులారా! ఇందలినిశ్చయ మెఱిఁగింపుఁడు.' అని పలికెను.

అది విని యమ్మహర్షులు, 'ఓదేవా! నీవు లోకములను వెలి పుచ్చుచున్నాఁడవు. మఱియు నుపసంహరించుచున్నాఁడవు. నీవే శీతము, నుష్ణము నగుదువు. నీవే వర్షించుచున్నాఁడవు. పుడమిఁగల జంగమస్థావరభూతములన్నిటికిని నీవ తండ్రివి, నీవ తల్లివి, నీవ ప్రభుఁడవు. వానికిఁ బ్రభవము నీవ. ఇదియే మాకు విస్మయకరమగు సంశయము. నీవదనమునుండి వహ్ని వెడలుటకుఁ దగునిమిత్తమును నీవ తెలుప నర్హుఁడవు. దాని నెఱింగింతువేని మేము నిర్భయులమగు దుము. ఓహరీ! మేము విన్నదియుఁ, గన్నదియుఁ దెలిపికొందుము.' అని పలికిరి.

అది విని యవ్వాసుదేవుఁడు, 'ఓమహర్షులారా! నావదనము నుండి వెలువడినది వైష్ణవతేజము. యుగాంతాగ్నితుల్యమగు నావ హ్నిచే నీకొండయెల్ల దగ్ధమయ్యెను. మఱియు దానిచే, దేవకల్పు లును, దపోధనులు, జితేంద్రియులునగు మీరందఱును బీడితులైతిరి. తపస్వివ్రతసేవాపరుఁడనైన నావదనమునుండి వహ్ని జనించెను. కావున నింతమాత్రమున మీరు వ్యథనొందకుఁడు. శుభప్రదమగు నీపర్వతమునకేను వ్రతమాచరించువాఁడనై వచ్చితిని. పరాక్రమముచే నాకు సరియగుతనయునిఁ బడయుటకై నే నిట్టివ్రతము పూనివచ్చితిని. అంత నాదేహమందున్న యాత్మ యగ్ని రూపమున వెడలి వరదుఁడగు సర్వలోకపితామహుని దర్శింప నేఁగి, యతఁడందర్ధభాగము పుత్రుఁ డగునట్లు వరమొసంగుటయు, మఱియు నావహ్ని మరలివచ్చి శిష్యు నట్లు నాపాదమూలమును జేరి, శాంతమై ప్రకృతినొందెను. ఇదియే యిందలిరహస్యము. మీరు భయవిస్మయము లందకుఁడు. ఓతపోధను లారా! దీర్ఘదర్శులగు మీకెందును నిరోధ ముండదుగదా! తపో వ్రతసందీప్తులును, జ్ఞానవిజ్ఞానశోభితులునగు మీరు, భూలోకస్వర్గ లోకములందుఁ జూచినదియు, నద్భుతమైనదియు, విన్నదియుఁ నేదేని గలిగెనా? దానిని దెలుపుఁడు. తపోవనవాసులగు మీ వాగమృత మును గ్రోలఁగోరుచున్నాఁడను. అద్భుతమై దివ్యమై నేను జూడని దేదేని యెందేని యుండవచ్చునని తలంచెదను. అదియు నాపరాప్ర కృతియేయై యెందును హానిలేక యుండును. ఆత్మగతమగు నైశ్వర్య మేమియు నాకాశ్చర్యముగఁ దోఁపదు. అయినను సజ్జనశ్రవణగతమై

నమ్మఁదగినయర్థము చెప్పంబడి, పర్వతమం దర్పింపఁబడినలేఖ్యమట్లు స్థిరమై యుండును. సజ్జనులు గలిసినపుడు వారినోటినుండి వెడలిన వచనములు మానవులకు బుద్ధిప్రదీప్తి గల్గించునుగదా!' అని పలికెను. పిమ్మట నమ్మహర్షు లమ్మధుసూదనుసన్నిధి నెంతయు విస్మితులై విప్పుగల కన్నవలతో నాతని నరయుచు, నొకరినొకరు ప్రోత్సహించుకొనుచు, నొకరినొకరు గౌరవించుకొనుచు, భూషితార్థములగు భాషితములచే నమ్మహాత్ముని సన్నుతించుచు వచ్చిరి. అటులు కొంత గడచినపిమ్మట నమ్మహర్షులు, దేవదర్శనుఁ డగునారదునిఁ గాంచి, వాక్యకోవిదుఁడగుట నతఁడే, యేదేనిఁ దెలుప వలంతియని యెంచి 'ఓనారదా! హిమవత్పర్వతమున నచింత్యమై యాశ్చర్యకరమై నీకనుభూతమగు నేదేని గలిగినఁ దెలుపుము. మహర్షి సంఘమునకు హితమై నీవు చూచిన దేదేని యీహృషీకేశుసన్నిధి నెఱిఁగింపుము' అని కోరిరి. ముని యటులు పలుక విని, యమ్ముని మున్నొకపుడు జరిగిన యొకకథను దెలిపెను." అని పలికి శాంతనవుఁడు మఱియు నిట్లనియె.

## ఉమామహేశ్వరసంవాదము

"ఓయుధిష్ఠిరా! పిమ్మట నారాయణమిత్రుఁడగు నారదమహర్షి, శంకరునకుఁ బార్వతితో జరగినసంవాదము తెలుపువాఁడై యిట్లు పలికెను—

'ఒకపుడు సిద్ధచారణసేవితమగుచుఁ బవిత్రమైన హిమవత్పర్వతమున ధర్మాత్ముఁడై వృషభధ్వజుఁడగు నమ్మహేశ్వరుఁడు తపముసేయ నారంభించెను. అచ్చోటు నానాలతాయుతమై మనోహరమై నానావిధపుష్పభరితమై యప్సరోగణాకీర్ణమై యెల్లభూతములు సేవింప వెలయుచుండెను. అందమ్మహాదేవుఁడు నానారూపములును, సద్భుతదర్శనములును, వి రూపములును దివ్యములు నగుభూతసంఘములు తన్నావరింప వానినడుమఁ జూపట్టుచుండెను. అందుఁ గొందఱు సింహవ్యాఘ్రగజాకృతులును, సర్వజాతిసమన్వితులై యుండిరి. మఱికొందఱు క్రోష్టుకద్వీపిముఖులును, భల్లూకముఖులు నై యుండిరి. వేఱొకకొందఱు వృకశ్యేనముఖులు, నులూకవదనులు నై యుండిరి. ఇంకను గొందఱు నానావర్ణములుగలిగి, మృగముఖులై యుండిరి

వారును, మఱియు యక్షగంధర్వకిన్నరులును, రక్షోగణములును నాతని సేవించుచుండిరి. మఱియు నాతనిపరిసరము, దివ్యపుష్పసమాకీర్ణ మును, దివ్యజ్వాలామయమును, దివ్యచందనాలంకృతమునై వెలయుచు నలువంకల దివ్యధూపములు ప్రబల, దివ్యవాదిత్రములు మొఱయ, మృదంగపణవోద్ఘుష్టమును, సకలభేరీనినాదితమునై వెలయుచుండును. ఆతనిచుట్టును మయూరములు భూతసంఘములును నాట్య మొనర్చు చుండెను. అప్సరస లాడుచుండిరి. దేవర్షిగణము సేవించుచుండెను. ఆ ప్రదేశము దివ్యము నద్భుతదర్శనమునై యిట్టిదని తెలుప వలనుపడక చూడనింపై యుండెను. ఆతనితపముచేఁ దత్పర్వత మెంతయు విరా జిల్లెను. స్వాధ్యాయపరులగువిప్రులొక్కచో వేదఘోషములఁ గావిం చుచువచ్చిరి. మఱియుఁ దుమ్మెదలనినాదములచే నప్పర్వతము నిరుప మానమైయుండెను. ఓజనార్ధనా ! దానిని గాంచినమునిగణమున కెంతయుఁ బ్రీతిగలుగఁజొచ్చెను. మహాభాగులగుమహర్షులును, నూర్ధ్వ రేతులగుసిద్ధులును, మరుత్తులు, వసువులు, సాధ్యులు, విశ్వేదేవులు, యక్షులు, నాగులు, లోకపాలకులు, పిశాచులు, నగ్నులు, వాయు వులు నందు నివసించియుండెను. ఋతువులు సర్వపుష్పభరితములై సుగంధములఁ జల్లుచుండెను. ఓషధులు ప్రకాశించుచు నవ్వనమును వెలయింపఁజొచ్చెను. పక్షులు మొఱయుచు నాట్య మొనర్పసాగెను. దివ్యధాతువిభూషితమగు నప్పర్వతతటమునఁ బర్యంకమునఁ బోలె నమ్మహాదేవుఁడు, వెలయుచుఁ గూరుచుండెను. వ్యాఘ్రచర్మాంబర ధారియు, సింహచర్మోత్తరచ్ఛదుఁడును, నాగయజ్ఞోపవీతియు, లోహిత కేయూరాలంకృతుఁడు, హరిశ్మశ్రుఁడును, జటాధారియునై రక్క సులకు వెఱపుగొలుపుచు,భక్తులగు నెల్లవారికి నభయప్రదుఁడై యొప్పు చుండెను. అట్టిమహానీయు నారసి మహర్షులందఱును సవినయముగా మ్రొక్కి సకలపాపవిముక్తులును శాంతులును నై దోషరహితు లగుచువచ్చిరి. ఆభూతేశ్వరుస్థాన మతిభయంకరమై చూపట్టెను. మహో రగసమాకులమైయున్న యాసభ యొకనిమేషమున నద్భుతావహమై గానిపించెను. అంత నచ్చోటికి, భూతస్త్రీగణసమేతయై తెల్లనివస్త్ర మునుగట్టి శంకరసమానవ్రతయై, సకలతీర్థజల ప్రభూతమగు సువర్ణ కలశమును బట్టికొని, తనవెంట నదులన్నియు నడిచి వచ్చుచుండఁ,

పుష్పవర్షమును గురియుచు, బహువిధగంధములు వెలయఁ బార్వతి వచ్చి, యాహిమవత్పార్శ్వముననున్న యాశంకరుని సమీపించెను. అటులు వచ్చి యాసతి వికసితముఖియై నగుచుఁ బరిహాసమునకుఁగాఁ, దనపాణితలముల నాశంకరుని కన్గవమూసెను. అటులాతనికన్గవమూయఁ బడఁగనే జగమంతయుఁ దమోభూతమై నిశ్చేతనమై హోమములు, వషట్కారములును లేక నిశ్చలమై యుండెను. మఱియు జనమెల్ల వైమనస్య మొదవ భయభ్రాంతమై యుండెను. భూతపతి యటులు నిమీలితనేత్రుఁడగుటయు సూర్యుఁడు లేనట్టులయ్యెను. పిమ్మట లోక మొకక్షణములోఁ దమోమయ మయ్యెను. అనంతర మాతని లలాటమునుండి యొక ప్రదీప్తజ్వాల వెడలెను. అపుడే యాతనికి, రవితుల్యమై మూఁడవనేత్ర మొకటి జనించెను. అప్పర్వతమెల్లఁ గలఁతనొందునట్టి దీప్తిగలిగి యావహ్ని, యుగాంతాగ్ని తుల్యమై చూపట్టెను. పిదప నప్పార్వతి, దీప్తాగ్ని సదృశదృష్టి యగు శంకరుని జూచి, సవినయముగా నమస్కరించి దీర్ఘలోచనయై కనుఁగొనియెను. అంత నాలలాటాగ్నిచేఁ దమాలసరళచందనభూయిష్ఠమును, దివ్యౌషధిప్రదీపితము నగుచు మనోహరమైన యవ్వనము దగ్ధమగుచునుండ, నందలిమృగయూథములన్నియు భయమొంది పరువులిడుచు, హరునిపార్శ్వమును జేరి శరణముగానక యుండెను. ఆసభయెల్ల నప్పుడు సంకులమయ్యెను. పిమ్మట మింటినంట మంటలతోఁ బెచ్చుపెరిఁగి, ద్వాదశాదిత్యతుల్యమై రెండవయుగాంతాగ్నివలె వెలుఁగుచు, మెఱుపువలెఁ గదలుచున్న యాయగ్నిచే నొకక్షణములో నాహిమవత్పర్వతమెల్ల దగ్ధమై గానవచ్చెను. ధాతుశిఖరాభోగశూన్యమై దగ్ధవనౌషధియై మథితమైన యప్పర్వతమును గాంచి, యాశైలరాజపుత్రి, భక్తి వెలయ నాభగవంతుని యెదుటఁ జేతులు మొగిడ్చి ప్రార్థించుచు నిలువఁబడియుండెను. స్త్రీభక్తిచే మృదుస్వభావముగల యప్పార్వతిని జూచి శంకరుఁడు, 'తండ్రి దైన్యమును బార్వతి సహింపలేక యట్లు ప్రార్థించెనని తలంచి దయతో నప్పర్వతమును గనుఁగొనియెను. అంత నొకక్షణముననే యాహిమవద్గిరియెల్ల యప్పటియట్టులై, చూడ మనోహరమై గానవచ్చెను. వృక్షములన్నియుఁ బల్లవపుష్పభరితములయ్యెను. పక్షులు కిలకిలారావము లొనర్పఁజొచ్చెను. అటు లప్పర్వ

తము ప్రకృతినొందుటఁ గాంచి యాపార్వతి పరమానందభరితయై సర్వలోకపతియగు తనపతి నతిభక్తి వెలయఁ జూచి, 'ఓభగవానుఁడా! సర్వభూతపతీ! శూలపాణీ! మహావ్రతా! నాకొక గొప్ప సంశయ మొదవెను. దానిని నాకెఱిఁగింపుము. నీఫాలము మూఁడవ నేత్ర ముత్పన్నమగుటకు నిమిత్తమేమి? పక్షిగణకాననములతోఁ గూడిన యిప్పర్వత మేల దగ్ధమయ్యెను? మఱియు నిట్లు వెంటనే యిది ప్రకృతినొందె నెట్లు? నాతండ్రి నీయనుగ్రహముచేఁ దక్షణము వృక్షసంఛన్నుఁడయ్యెనుగాదే? ఇది యెట్లు?' అని ప్రశ్నించెను.

అది విని యమ్మహాదేవుఁడు 'దేవీ! నీవు బాల్య చాపల్యముచే నాకనులు మూసితివిగాదే? దానివలన లోకమెల్ల నష్టాలోకమయ్యెను. ఓనగపుత్రీ! అటులు సూర్యుఁడు లేకపోవుట గలిగినవెంటనే చీకటు లావరించెను. వానిని వారించి ప్రజలను రక్షించుటకై నామూఁడవ కన్ను దీప్తమై యుదయించెను. దానినుండి యుదయించిన తేజమే యిప్పర్వతమును మథించెను. మఱియు నీకుఁ బ్రియమొనర్ప, నీపర్వతమును బ్రకృతస్థితికిఁ దెచ్చితిని.' అని బదులు చెప్పెను.

అంత నప్పార్వతి, 'ఓదేవా! నీవు చతుర్ముఖుఁడ వగుటకు నిమిత్తమేమి? వానిలోఁ బూర్వపశ్చిమోత్తరములగు మోములు చంద్రునివలెఁ బ్రియదర్శనములై వెలయుటకును, దక్షిణమగు మొగము రౌద్రమై యుండుటకును హేతువేమి? ఈ నీజడ లూర్ధ్వములై కపిలములగుటకుఁ గతమేమి? అటులే నీకంఠము నల్లగా నుండుటకును, నీ నిరతమును బినాకము చేతఁ బట్టుకొనుటకును గారణమేమి? నిత్యము జటాధారివగుటకును బ్రహ్మచారివై యుండుటకును నిమిత్తమేమి? ఓప్రభూ! ఈ నాసంశయములెల్లఁ దీర్పఁదగుదువు. ఓవృషధ్వజా! నేను నీకు సహధర్మచారిణిని, భక్తురాలనుగాదే?' అని పలికెను.

ఓధర్మజా! అది విని యాభగవానుఁడు తత్పర్వతరాజపుత్రి ధైర్యమునకును, బుద్ధికిని మెచ్చి 'ఓసుందరీ! నా కివియెల్లఁ గలుగుటకు నిమిత్తము లెవ్వియో తెలిపెదను వినుము' అని పలికి మఱియు నతఁ డిట్లనియె.

పార్వతీపరమేశ్వరసంవాదము

ఓధర్మజా! భగవానుఁ డగునమ్మహాదేవుఁడు మఱియు నద్దేవితో 'ఓపార్వతీ! వినుము. మున్నొకప్పు డొక్కకార్యమునకుఁగాఁ బరమేష్ఠి యుత్తమవస్తువు లన్నింటినుండియుఁ దిలబీజ మంతటిభాగములఁ దీసి తిలోత్తమ యనుదానిని సృజించెను. అతులమగుట నిరుపమాన రూపముగల యాయువతి నన్ను సమీపించి, ప్రదక్షిణ మొనర్చుచుండఁ దద్రూపలోభమున నామె యేప్రక్కకువచ్చినపుడును జూచునట్లుగా నలువైపులను మొగములఁ బూనితిని. నాయుత్తమయోగ బలమున నటులు నలుమొగములఁ బూని, యందుఁ బూర్వవదనముచే నింద్రత్వమూని శాసించితిని. ఉత్తరవదనముచే నీతోఁ గూడి క్రీడించుచున్నాఁడను. నాపశ్చిమముఖము సౌమ్యమై సర్వప్రాణి సుఖావహమైనది. ఇఁక నాదక్షిణముఖము రౌద్రమై భయముగొలుపుచుఁ బ్రజలను సంహరించుచుండును. లోకహితమొనర్ప జటాధారిని, బ్రహ్మచారినినై మెలగుచున్నాఁడను. దేవకార్యములను సాధించుటకై నేనెపుడును బినాకమును ధరించియుందును. మున్నొకపుడు శ్రీకాముఁడగునింద్రుఁడు తన వజ్రమును వైవ, నది నాకంఠమును దహించి వెడలుటచే నేను శ్రీకంఠుఁడనైతిని' అని తెలిపెను. అది విని యయ్యుమాదేవి, 'ఓదేవా! శోభావంతములగు వాహనములు మఱికొన్ని పెక్కులుండఁగా, నీవు వృషభమును వాహనముగా నొనర్చికొంటి వేమి?' అని యడుగుటయు, నమ్మహేశ్వరుఁడు 'దేవీ! వినుము. మున్ను పరమేష్ఠి పాలనిచ్చు దేవధేనువగుసురభిని సృజించెను. అది యటులు సృష్టమై క్షీరామృతమును స్రవించుచు బహువిధములుగా నుండెను. అంత దాని వత్సము మొగమునుండి వెడలినసురువు నామేనఁ బడియెను. అనంతరము నేను గుపితుఁడనగుట గోవులన్నియు దగ్ధములై నానావర్ణములుగలవయ్యెను. పిమ్మటఁ గార్యవేత్తయగు బ్రహ్మ నన్ను నయించి, యొకవృషభమును సృజించి నాకు వాహనముగను, జిహ్నముగను నొసంగెను' అని తెలిపెను. అదివిని మఱియు నప్పార్వతి, 'దేవా! బహువిధములై సకల గుణాన్వితములగు పెక్కునివాసములు నీకు స్వర్గమునఁ గలిగియుండఁగా, నీవు శ్మశానమునఁ గ్రీడింతు వేటికి? ఆశ్మశానము వెండ్రుకలకును, నెమ్ముకలకును నిలయమై, భయంకరమై,

కపాలఘటసంకులమై గ్రద్దలు, నక్కలును నిండియుండఁ, జితాగ్నిశత సమాకులమై, మాంసకలిలమై, యపవిత్రమై, వసాశోణితపంకిలమై ప్రేవులయు, నెముకలయుఁబ్రోవు లెల్లయెడలఁ జూపట్టి, నక్కల మొఱలు పిక్కటిల భయంకరమై యుండునుగాదే! అది నీకు నివాస మేమి ?' అని యడిగెను. అంత నమ్మహేశ్వరుఁడు 'దేవీ! పవిత్రము లగువానియెడ ద్వేషములేక నేను నిత్యము చరింతును. అటులు పుడమినెల్లఁ జరించు నాకు శ్మశానమును మించిన పవిత్రస్థాన మొకటి లేదని నిశ్చయము గలిగెను. కావున, నఖిలనివాసములలో శ్మశానమే శుభనివాసముగా నాకు రుచించెను. మఱియు నందే యీభూతసంఘము లెల్ల బ్రీతిమైఁ జరించును. ఓమందహాససుందరవదనా! భూతగణము లను విడిచి, నేనెందును నివసింపనొల్లను. ఆనివాసమే నాకుఁ బవిత్ర మైనదియు, స్వర్గప్రదమైనదియుఁగా నిష్టపడియెను. ఉత్తమము, పవి త్రమునగు శ్మశానమే పవిత్రకాములచే సేవింపఁబడుచుండును' అని తెలిపెను.

అది విని యాశైలపుత్రి 'ఓమహానీయా! సర్వధర్మజ్ఞా! సకల భూతనాథా! పినాకధారీ! వరప్రదా! మఱియు నాకొక మహాసంశయ మొదవెను. దాని నెఱిఁగింపుము. ఇమ్మునిగణమంతయుఁ దప మొన ర్చెను. మఱియు లోకమున బహువిధాకారములతోఁ దపమునకై ప్రయత్నించుచుండుట గలదు. దానిరూప మెద్ది? దానికిఁ గల్గుఫల మేమి? ఇమ్మహర్షులకును, నాకును బ్రియమొనర్చువాఁడవేని యీవిష యము నెఱిఁగింపుము.' అని ప్రశ్నించెను. ఆమెవచనముల కందలి మునిగణమెల్ల సంతసించి, వాగ్భూషితములు, నర్థవంతములునగు సన్నుతులచే నామెను మన్నించిరి అంత నమ్మహాదేవుఁ డమ్మహేశ్వ రితో 'దేవీ! వినుము. అహింసయు, సత్యవచనము, సర్వభూతదయయు, శమము, దానము శక్తికొలఁదిగా గృహస్థధర్మము నాచరించుటయుఁ, బరదారవైముఖ్యముఁ దనయొద్ద నొకరుంచినన్యాసమును స్త్రీలను రక్షించుటయు, నిచ్చినది పుచ్చికొనకుండుటయు మధుమాంసవర్జన మును ధర్మములు. అందు గృహస్థునకుఁ బరదారవైముఖ్యాదులైదును నుత్తమధర్మములు. దేహధారులు ధర్మపరాయణులై చరింపవలయును.' అని తెలిపెను, మఱియుఁ బార్వతి 'ఓభగవానుఁడా! మఱియొకసంశ

యము నాకుఁ గలదు. దానిం దెలుపుము. నాల్గువర్ణములవారికిని దమతమధర్మములనుబట్టి యేదేది సుఖావహము? బ్రాహ్మణున కెయ్యది ధర్మము? క్షత్త్రియున కెయ్యది? వైశ్యున కెద్ది? శూద్రున కేది?' అని యడిగెను. అందుల కుత్తరముగా, నాభగవానుఁ 'డో దేవీ! వినుము. న్యాయముగా నీవెల్లవిధములఁ బ్రశ్నించితివి? లోకమున బ్రాహ్మణులు మహాభాగులు, భూమిదేవులు నగుచున్నారు. బ్రాహ్మణునకు సదోపవాసము ధర్మమనుటలో సందియము లేదు. ధర్మార్థసంపన్నుఁ డగునట్టి బ్రాహ్మణుఁడు బ్రహ్మభూయమున కర్హుఁ డగుచున్నాఁడు. ఆతనికి వ్రతోపనయనములును, బ్రహ్మచర్యమును ధర్మక్రియలు. వానిచేతనే ద్విజత్వ మగుచున్నదిగదా? మఱియు బ్రాహ్మణునకు గురుదైవతపూజయు, వేదాధ్యయనమును ధర్మములు.' అని తెలిపెను.

అది విని యయ్యుమాదేవి 'దేవా! నాకు మఱియొకసంశయ మొదవెడిని. దానిం దీర్పుము. చాతుర్వర్ణ్యధర్మమును విపులముగా నెఱిఁగింపుము.' అని యడుగుటయు, నమ్మహేశ్వరుఁడు 'దేవీ! వినుము. ధర్మరహస్యశ్రవణము, వేదవ్రతసేవనము, అగ్నికార్యము, గురుకార్యనిర్వర్తనము, భైక్షచర్యయును విప్రునకు ధర్మములు. అటులే బ్రాహ్మణుఁడు నిత్యస్వాధ్యాయపరుఁడై బ్రహ్మచర్యమూని, గురుననుజ్ఞ వడసి, గృహస్థధర్మస్వీకార మొనర్పఁ బ్రయత్నింపవలయును. పిదప ననురూపయగుభార్యను యథావిధిగాఁ బరిగ్రహింపవలెను. మఱియు శూద్రాన్నవర్జనముగా సన్మార్గసేవన మొకటి ద్విజునకు ధర్మము. అటులే నిత్యోపవాసము బ్రహ్మచర్యమును ధర్మములు. ఆహితాగ్నియు, నధ్యయనపరుఁడును నై హోమ మొనర్చుచు, నియతేంద్రియుఁడును, విఘసాశియు, నియతాహారియు, సత్యవచనుఁడును, శుచియు, గృహస్థధర్మపరుఁడు నై వర్తించుట ధర్మము. అటులే యతిథిపూజయుఁ, త్రేతాగ్నిధారణము, ఇష్టులును, యాగవిశేషములును నతని కాచరణీయములు. మఱియు యజ్ఞము, ప్రాణ్యహింసయును ధర్మములై యున్నవి. శ్రోత్రియగృహస్థు పరిజనులకుఁ బెట్టి తాను భుజించుట ధర్మము. దంపతులు సమస్వభావులై యుండుటయు, గృహదేవతలకు నిత్య పుష్పబలికరణమును, నిత్యోపలేపనము, నిత్యోపవాసితయు, నాజ్యధూమప్రసారమును ధర్మములు. ద్విజులకు లోకధారణమగు

గార్హస్థ్య ముత్తమవిధి. ఓదేవీ! నీవు క్షత్రియగతధర్మమును సైతము ప్రశ్నించితివి గదా! దాని నెఱిఁగించెదను. సమాహితవై వినుము. క్షత్రియునకు మొదటిధర్మము ప్రజాపరిపాలనము. నిర్దిష్టఫలభోక్త యగురాజు ధర్మవంతుఁ డగుచున్నాఁడు. ఎవ్వఁడు ధర్మయుక్తముగాఁ బ్రజాపరిపాలన మొనర్చునో, వానికి ధర్మార్జితములగు లోకములు ప్రాప్తించును. అటులే దమమును, స్వాధ్యాయమును రాజునకు ధర్మములు. అగ్నిహోత్రకరణము, దానాధ్యయనములును, యజ్ఞోపవీతధారణమును, యాగమును ధర్మక్రియలు. అటులే భృత్యభరణము, నమోఘకర్మమును నాతనికి ధర్మములు. మఱియు మంచిప్రవర్తనమును వేదోక్తక్రతుక్రియయును, వ్యవహారనిపుణతయు, సత్యవచనము నాతనికి ధర్మములు. ఆర్తత్రాణపరాయణుఁడగు భూపతి యిహపరమున మహాత్ముఁ డనఁబడుచున్నాఁడు. గోబ్రాహ్మణులకుఁగా విక్రమించినట్టియు, సంగ్రామనిహతుఁ డైనట్టియు, క్షత్రియుఁ డశ్వమేధయాగలబ్ధములగు లోకముల నొందుచున్నాఁడు. వైశ్యునకుఁ బాశుపాల్యమును, గృషియు సంతతధర్మములు. మఱియు నాతని కగ్నిహోత్రపరతయు, దానాధ్యయనములును, వాణిజ్యమును, సన్మార్గానువర్తనము, నతిథిపూజయు, శమదమములు, విప్రభక్తియుఁ, ద్యాగమును సనాతనధర్మములు. వైశ్యుఁడు తిలలను, గంధములను, రసములను విక్రయింపరాదు. సత్పథానువర్తియై వాణిజ్యము నాశ్రయించి, సకలజనాతిథ్య మొనర్చుచు, యథాశక్తిగాఁ ద్రివర్గముచు వైశ్యుఁడు సంపాదింపవలయును. శూద్రధర్మ మిఁకఁ దెలిపెదను. శూద్రులు తక్కిన మూఁడుజాతులవారిశుశ్రూష యొనర్చుచుండవలయును. శూద్రుఁడు సంశితవ్రతుఁడును, సత్యవాదియు, జితేంద్రియుఁడు నై దేవతాద్విజపూజలుసేయునేని యిష్టధర్మఫలభాజనుఁ డగుచున్నాఁడు. ఓపార్వతీ! నాల్గువర్ణములవారిధర్మమునుగూర్చి యంతయుఁ దెలిపితినిగాదే! ఇఁక వీరిలో నొక్కొక్కనిఁగూర్చి మఱియేమి వినఁగోరెదు?" అని పలికెను.

అది విని యమ్మహేశ్వరి 'ఓదేవా! నాల్గువర్ణములవారికిని హితము, శుభప్రదమునగు వేలువేలుధర్మమును నీవెఱిఁగించితివి. వారికెల్లరకుఁ దగుధర్మమెద్దియో తెలుపుము.' అని ప్రార్థించుటయు

నమ్మహేశ్వరుఁడు 'దేవీ! గుణాఢ్యుఁడై పరమేష్ఠి, లోకమందలిసారమును సంగ్రహించి బ్రాహ్మణులను సృజించెను. భూదేవతలగువారు సకల లోకములను దరింపఁజేయువారై మానవులందు వెలయుచున్నారు. వారిధర్మకర్మఫలోదయమును దెలుపుచున్నాఁడను. బ్రాహ్మణులధర్మ మెద్దియో యదియే పరమధర్మ మనఁదగియున్నది. మఱియు నప్పరమేష్ఠి లోకధర్మమునకుఁగా వేదోక్తమును, శాస్త్రోక్తమును, శిష్టాచారసిద్ధము నగునవియే సనాతనపరమధర్మములుగాఁ గల్పించెను. త్రైవిద్యుఁడును, త్రికర్ముఁడును, త్రిపరిక్రాంతుఁడును నై యధ్యయనమును జీవనాధారముగఁ జేయక విద్వాంసుఁడై బ్రాహ్మణుఁడు మైత్రి గలిగి యుండవలయును. భువనేశ్వరుఁడగు పరమేష్ఠి బ్రాహ్మణులవృత్తికిఁగా, యజన యాజనాధ్యయనాధ్యాపనదానప్రతిగ్రహములనియెడి కర్మములాఱిటిని గల్పించెను. ఈయాఱుకర్మములను బూనినద్విజుఁడు ధర్మభాగి యనఁబడును. వారికి నిత్యస్వాధ్యాయితయు, సనాతనమగు యాగమును ధర్మములు. ఆతనికి యథాశక్తిగను, యథావిధిగను, దానము సేయుటయుఁ గర్తవ్యమే! విశుద్ధులగు గృహస్థులకు శమము, సదాచారనిర్వర్తనమును బరమధర్మములు. మనశ్శుద్ధియుఁ, బంచయజ్ఞాచరణమును, సత్యభాషణము, అసూయారాహిత్యము, దానము, బ్రాహ్మణసత్కారమును, గృహసంశుద్ధియు, మానవర్జనము, ఋజుబుద్ధియు, మృదువచనము, నతిథ్యభ్యాగతప్రీతియుఁ, దచ్ఛేషాన్నభోజనమును, మఱియు, నతిథులకు నర్ఘ్యపాద్యాసనశయనాదిదానమును, దీపప్రతిశ్రయములును ధార్మికగుణములు. గృహస్థు ప్రాతఃకాలమున లేచి యాచమన మొనర్చి, భోజనమునకుఁ బిలిచి సత్కరించి యంపకము సేయుట యాతనికి సనాతనధర్మము. ఎల్లప్పుడును యథాశక్తిగ నెల్లవారికి నాతిథ్య మొనర్చుటయు నాతనికిఁ బరమధర్మమే. బ్రాహ్మణక్షత్రియవైశ్యశుశ్రూష శూద్రధర్మమని తెలిపితిని. గృహస్థునకుఁ బ్రవృత్తిధర్మమే విధింపఁబడుచున్నది. సకలభూతహితమై శుభప్రదమైన యాప్రవృత్తిధర్మమునే తెలిపెదను. శక్తికొలఁదిగా మఱిమఱియు, దాన మొనర్పవలయు. అటులే మాటికిని యజింపవలయును. శ్రేయముఁ గోరువాఁడు పౌష్టికకర్మమును సైతము సేయవలయును. ధనము ధర్మయుక్తముగనే సంపాదింప

వలయును. అటులు ధర్మలబ్ధమగుధనమును మూఁడువిధములుగా నొనర్చి, వానిచేఁ బరమధర్మ మార్జింపవలయును. వానిలో నొకభాగముచే ధర్మార్థములను, వేఱొకభాగముచేఁ గామమును సంపాదించి, మూఁడవభాగమును వృద్ధినొందింపవలయును. ఇది ప్రవృత్తిధర్మము. నివృత్తిలక్షణధర్మ మొకటి గలదు. అది మోక్షనిమిత్తమగుచున్నది. ఓదేవీ! నివృత్తుఁడగువానివిధ మెఱిఁగించెదను వినుము. సకలభూతదయయును, ధర్మచింతయు, నొకచోట నివసింపకుండుటయు, నాశాపాశమును గోసికొనుటయు, మోక్షకాంక్షియగువానికిఁ బ్రశస్తము లనఁబడుచున్నవి. కుండికయందును జలమందును సక్తి విడిచి, యాసనాంబరాదులఁ బరిత్యజించి, త్రిదండశయనము లపేక్షింపక, యగ్నులను నివాసములను గోరక, యథ్యాత్మగతమానసుఁడై తత్పరత్వమునఁ దదేకనిష్ఠగలిగి, యోగమూని, వృక్షమూలమునఁగాని, శూన్యాగారమునఁగాని, నదీపులినములందుఁగాని శయనించుచు, నదులయొద్దననే నివసించుచు, బ్రాహ్మణుఁడు సర్వసంగసకలబంధవిముక్తుఁడగును. అట్టివాఁడు నిత్యము నాత్మయందు నాత్మను నిలుపవలయును. అటులు నిలిపి స్థాణుభూతుఁడై మోక్షవిధ్యుక్తమగు కర్మమూని నిరాహారుఁడై యెవ్వఁడు యోగనిష్ఠగలిగి పరివ్రజన మొనర్చునో, వాఁడు సనాతనధర్మపరుఁ డగుచున్నాఁడు. మఱియు నట్టివానికి, దేనియందును సక్తితగదు. వాఁడొకచోట నిలువక, యొక గ్రామమున నుండక, యొకపులినమున శయనింపక తిరుగుచుండుట ముక్తధర్మము. ఇదియే మోక్షవేత్తలధర్మమును వేదోక్తసనాతనసన్మార్గమునై వెలయుచున్నది. భిక్షుకులు కుటీచక, బహూదక, హంస, పరమహంసులను భేదములచే నలువిధములుగా నుందురు. వారిలో వెనుకటివారు క్రమముగా నుత్తములు. వారిధర్మమును మించినధర్మ మొకటిలేదు. సుఖదుఃఖరహితమై సౌఖ్యము, జరామరణవర్జితము, నవ్యయమునగుపదము వారి కగుచున్నది.' అని తెలుప విని-యయ్యుమాదేవి మఱియు నిట్లనియె.

'ఓదేవా! సజ్జనాచరితములగు గార్హస్థ్యమును మోక్షధర్మమును జీవలోకమున కుత్తమమార్గములును, శ్రేయస్కరములు నై తెలుపఁబడుచున్నవి. వానిని నీవు తెలుపఁగా వింటిని. ఓధర్మజ్ఞా! ఋషిధర్మ

మెట్టిదో తెలుపుము. తపోవనవాసులధర్మమును విన నాకు నిత్యము కుతూహలమగుచున్నది. వారియాశ్రమ మాజ్యధూమగంధమై వెలయుచుండును. దానిని గాంచిన నాకెంతయు సంతసమొదవుచుండును. కావున మునిధర్మమునెడ నాకుఁ గలసందియముం దీర్పుము. ఓసకలధర్మార్థతత్త్వజ్ఞా! దేవదేవా! నాయడిగినదానికి సమాధానము సమగ్రముగా నెఱిఁగింపుము.

అది విని యమ్మహాదేవుఁడు 'దేవీ! సర్వోత్తమమగుమునిధర్మము దెలిపెదను వినుము. దాని నొనర్చియేగదా వారు పరమసిద్ధి నొందుచున్నారు. వారిలో ఫేనపాయులగుమహర్షులధర్మమును మొదటినుండియుఁ దెలిపెదను వినుము. బ్రహ్మపీతమై యధ్వరప్రసృతమగుచు నమృతమనఁబడుదధి బ్రాహ్మమగుఫేనము. దానిని ద్రావువారు ఫేనపాయులు. తపస్సిద్ధులగువాలఖిల్యమునులు శకునవృత్తి నాశ్రయించి యుంఛవృత్తిపరులై మృగనిర్మోకవసనులును, జీరవల్కలధరులు నగుచు నిర్ద్వంద్వులై సన్మార్గము నాశ్రయించి వర్తిల్లుచుందురు. వారిలోఁ గొందఱు కాలిబొటనవ్రేలిపై నిలువఁబడి తపమొనర్తురు. వారిధర్మఫలమెంతయు మహత్తరమై యుండును. మఱియు వారు సుకరార్థసిద్ధులై తపోదగ్ధకిల్బిషులై దెసల వెలిఁగించుచు దేవతలతోఁ దుల్యులై ప్రవర్తిల్లుచుండుదురు. మఱియుఁ జక్రచరులు,సోమలోకచరులును బితృలోకమునకుఁ జేరువవారునై యుంఛవృత్తిపరులగుచు, సంప్రక్షాళకులు నశ్మకుట్టులు, దంతోలూఖలికులునాఁ గొందఱుందురు. సోమపులు నూష్మపులు నగువా రుంఛవృత్తిపరులై భార్యలతోఁ గూడియు జితేంద్రియులై యగ్నికార్యమును బితృదేవతారాధనమును జేయుచుందురు. వారికిఁ బంచయజ్ఞాచరణమును ధర్మమే యగుచున్నది. దేవీ! ఈఋషిధర్మము చక్రచరులును దేవలోకచరులునగుద్విజులచే నాచరింపఁబడినది. సర్వవిధములగు ఋషిధర్మములందును జితేంద్రియత్వము గలిగి, యాత్మజయ మావశ్యకము. అటులే కామక్రోధములనుసైతము వారు జయింపవలయును. మఱియు యజ్ఞము, నిత్యక్రియాచరణము పితృదేవార్చనము, సర్వాతిథిపూజనము, ఉంఛవృత్తిజీవనము, భోగనివృత్తియు, శమప్రియత్వము, స్థండిలశయనము, శాకపర్ణనిషేవణము,

ఫలమూలాహారమును, శైవలభక్షణమును ఋషుల నియమములై యున్నవి. అట్టి నియమములచే వారు దుర్జయమగుగతిని జయించు చున్నారు. మఱియు స్తంభ, మాన, విస్మయ, ప్రసన్నతలు లేక విరోధ స్నేహములు సమముగా భావించుట యుత్తమధర్మ మనఁబడును.' అని తెలుప విని మఱియు నయ్యుమాదేవి యిట్లనియె.

**నివృత్తిధర్మఫలకథనము**

'ఓ దేవా! రమణీయప్రదేశములందును, నదీతటములందును, నికుంజములందును, బర్వతములందును, వనములందును, ఫలవంతము లగు పవిత్రదేశములందును, మూలములుగల పుణ్యస్థలములందును నియతవ్రతులై చరించువారిపుణ్యావిధిని వినఁగోరెదను.'

అది విని యమ్మహేశుఁడు, దేవీ! నీవడిగిన స్వశరీరోపజీవులగు వానప్రస్థులధర్మమును సమాహితవై వినుము. అటులు విని నిశ్చల చిత్తవును, ధర్మబుద్ధిపరవు నగుము. వనవాసముచేయు వానప్రస్థులు సంసిద్ధములగు మంచినియమములూని, యేమేమి చేయవలయునో తెలి పెదను వినుము. వారు త్రికాలస్నానమును, బితృదేవార్చనమును, నగ్నిహోత్రకృత్యమును, నిష్టిని, హోమవిధిని జేయవలయును. మఱియు వారికి నీవారస్వీకారము, మూలఫలసేవనము, నింగుదైరండ తైలములసేవనమును గృత్యములు. మఱియుఁ గామక్రోధముల విడిచి, యోగచర్యాపరులగుచు వీరస్థానోపసేవ్యులై వీరశయ్య నాశ్రయించి, గ్రీష్మకాలమునఁ బంచాగ్నులనడుమఁ దపమొనర్పవలయును. మండూక యోగనియతులై వీరాసనమూని, నిత్యము స్థండిలశయనులై ధర్మ బుద్ధితో శీతజలాగ్నియోగముగలిగి వర్తింపవలయును. మఱియు, వారు జలభక్షులును, వాయుభక్షులును, శైవాలభక్షులును నై యశ్మ కుట్టులు, దాంతులగు సంప్రక్షాళులు నగుచుఁ జీరవల్కలములఁ బూని, మృగచర్మముల నివసించుచు, యథావిధిగను, యథాధర్మముగను, గాలానుకూలముగను జీవయాత్ర గడుపుకొనవలయును. వారు నిత్య మును వనవాసమె సేయుచు, వనముననే చరించుచు, నందే గాన వచ్చుచు గురువులఁగూడి యుందుండవలయును. వారికి హోమ క్రియయుఁ, బంచయజ్ఞసేవనమును, వేదోక్తమగు పంచయజ్ఞభాగము

ననుపాలించుటయు, సప్తమీాయజ్ఞకృత్యము, చాతుర్మాస్యసేవనము, పౌర్ణమాసాదియాగకరణము, నిత్యయజ్ఞాచరణమును ముఖ్యధర్మములు. మఱియు వారు భార్యాసంయోగము పరిత్యజించి, సర్వసంగవిముక్తులై మునివృత్తి నాశ్రయించి, సకలపాపవిముక్తులై వనమునఁ జరించుచు, సృగ్భాండరతులును, త్రేతాగ్నిశరణులై సన్మార్గము నాశ్రయించి వర్తిలుచుఁ బరమగతి నొందుదురు. సత్యధర్మాశ్రయులై సిద్ధులైనయట్టిమునులు మహాపుణ్యములగు బ్రహ్మలోకమును, శాశ్వతమగు సోమలోకమును బొందుచున్నారు. 'ఓదేవీ! వానప్రస్థాశ్రితమగు ధర్మమెల్ల సవిస్తరముగాఁ దెలిపితిని. ఇఁక నేమి వినఁగోరెదు?' అని పలికెను.

అది విని యాపార్వతి 'ఓమహాదేవా! సిద్ధివాదపరులగు మునుల ధర్మ మెద్ది? వారు దారలఁగూడి స్వేచ్ఛాసంచారులై వనములఁ జరింతురుగదా! వా రొనర్పవలసినకృత్యము లెవ్వి!' అని ప్రశ్నించెను. అందుల కాభగవానుఁడు 'దేవీ! స్వైరచారులగు తాపసులందఱును భార్యలఁగూడి చరించుచు, మౌండ్యకషాయవసనధారణములు గలిగి త్రికాలస్నాన మొనర్చుచు, ఋషికృతమగు నగ్నికృత్యమును, సమాధియుఁ బూని, సన్మార్గమును దప్పక, వెనుక వనవాసులకుఁ జెప్పినధర్మముల నాచరింతురేని తపఃఫల మొందుదురు. దంపతీధర్ములగు మఱి కొందఱు నిజదారనియతేంద్రియులై ఋతుకాలములందుమాత్రమె భార్యాయోగ మొందుచు విధ్యుక్తముగాఁ బ్రవర్తింతురు. అట్టి వారును ఋషికృతధర్మము నొందుచున్నారు. ధర్మమెఱిఁగినవారు బుద్ధిపూర్వకముగా నొకకామము సేవింపఁదగదు. సకలభూతముల కభయమొసంగుచు, హింసాదోషదూరాత్ముఁ డగువాఁడు ధర్మయుక్తుఁ డగుచున్నాఁడు. మఱియు నెవఁడు సకలభూతానుకంపియై, సర్వప్రాణులయెడను ఋజుభావము జూపుచు, సర్వభూతాత్మభూతుఁడై ప్రవర్తిల్లునో వాఁడును ధర్మయుక్తుఁడగును. సర్వవేదస్నానమును, సకలభూతార్జవమును ననునవి తుల్యములుగా వచ్చును. లేదాసకలభూతార్జవమే ఘనమైనదియుఁ గావచ్చును. ఆర్జవము ధర్మమనియు,వక్రబుద్ధి యధర్మమనియుఁ దెలుపఁబడుచున్నది. ఆర్జవముగలమానవుఁడే ధర్మయుక్తుఁ డగుచున్నాఁడు. ఋజుబుద్ధిసక్తుఁ డగువాఁడు నిత్యము దేవసాన్నిధ్యఁ

మొందును. కావున ధర్మసంపాదనాపరుఁ డగువాఁడు ఋజుబుద్ధిగలిగి వర్తింపవలయును. మఱియు శాంతుఁడును, దాంతుఁడును, జితక్రోధియు ధర్మాత్ముఁడును, నహింసకుఁడునునగు మానవుఁడు ధర్మఫలయుక్తుఁడగును. లోభరహితమును లేక యథాశక్తిగా సత్పథము నాశ్రయించి ధర్మాత్ముఁడై సౌశీల్యము గలిగి వివేకముతో వర్తించినవాఁడు బ్రహ్మభూయమున కగుచున్నాఁడు' అని తెలిపెను.

అది విని మఱియు నయ్యుమాదేవి 'దేవా! ఆశ్రమాభిరతులై తపోధనులైన తాపసు లేయేసుకృతముచే నెట్టిఫలము నొందుదురు? నిర్ధనులగు నాతపస్వులు మహాధనికులును రాజులును రాజపుత్త్రులు నెట్టికర్మ మొనర్చిన నగుదురు? వనచారులై చరించిన యాతాపసుల కేయేకర్మముచే దివ్యచందనభూషితత్వమును నిత్యస్థానోపగతియు నగును? తపశ్చర్యాశ్రితము, శుభమునగు నా యీసంశయమును దీర్పుము' అని ప్రశ్నింప, నమ్మహాదేవుఁడు 'దేవీ! ఉపవాసవ్రతక్లిష్టులు, నహింసాపరులును సత్యవాదులు నై చరించినసిద్ధులు మరణించిన పిదప ననామయులై గంధర్వులఁగూడి మోదమందుదురు. యథావిధిగను, యథాన్యాయముగను, మండూకయోగశయనుఁడై దీక్ష వహించినమహాత్ముఁడు, నాగులతో నానంద మొందుచుండును. మృగములు తిని విడిచిన బాలతృణమును భుజించుచు మృగములఁ గూడి చరించుచు, దీక్షపూనియున్నవాఁ డమరావతికిఁ బోవును. శైవాలమును, రాలిపడినపత్త్రములను భుజించుచు వ్రత మొనర్చినవాఁడును, నిత్యము శీతయోగమును వహించినవాఁడును బరమగతికిఁ బోవుదురు. వాయుభక్షుఁడును, జలభక్షుఁడును, ఫలమూలాహారుఁడు నగుచు వ్రత మొనర్చినవాఁడు, యక్షులఁ గూడి యైశ్వర్య మొంది యప్సరసలతో సంతసించుచుండును. విధ్యుక్తముగా గ్రీష్మకాలమున నగ్నియోగదీక్షాపరుఁడై పండ్రెండువత్సరములు వ్రత మొనర్చినవాఁడు రాజగును. మఱియు నాహారనియమమూని మునియై పండ్రెండేండ్లు నిర్జలప్రదేశమందు వ్రత మొనర్చినవాఁడు పార్థివుఁ డగును. నిరావరణమగు స్థండిలమున శయనించి పండ్రెండువత్సరములు దీక్షవహించి నిరాహారుఁడై దేహమును బరిత్యజించినవాఁడు స్వర్గమున సుఖించుచున్నాఁడు. స్థండిలశయన మొనర్చినవాని

ను త్తమయానములును, శయనములును, గృహములును ఫలములుగాఁ దెలుపుచున్నారు. ఎవ్వఁడు నియతాశనుఁడై శరీరమును బోషించుకొనుచు స్థండిలశయనమున దేహమును బరిత్యజించునో వాఁడు స్వర్గము నొందుచున్నాఁడు. పండ్రెండువత్సరములు దీక్షవహించి శరీరధారణము సేయుచుఁ, దుదను మహార్ణవమున దేహమును విడిచినవాఁడు వారుణలోక మనుభవించును. పండ్రెండువత్సరములు దీక్షపూని, శరీరము నిలుపుకొని, తుదకుఁ బాషాణముచేఁ జరణముల భేదించికొని మరణించిన వాఁడు గుహ్యకులఁ గూడి సంతసించుచున్నాఁడు. మఱియు నెవ్వఁడు పండ్రెండువత్సరములు దీక్షపూని శరీరమును నిలిపికొని, యగ్నియందుఁ దద్దేహమును హోమ మొనర్చునో, వాఁడు బ్రహ్మలోక మొందుచున్నాఁడు. ఆత్మచే నాత్మను సాధించి, నిర్ద్వంద్వుఁడును నిష్పరిగ్రహుఁడునై, తనకిష్టమగుదీక్షనువహించి పండ్రెండువత్సరములు నడిపినవాఁడు స్వర్గమునొంది, దేవతలతో సంతోషమనుభవించును. దేవీ! ఎవ్వఁడు యథాన్యాయముగా దీక్షపూని, యాత్మచే నాత్మను సాధించి, ధర్మప్రియుఁడై నిర్మమత్వమునఁ బండ్రెండువత్సరములు వరుసగాఁ దన యిష్టమువచ్చినవ్రత మొనర్చువాఁడై యనావృతదేశమందుండి, వీరాసనగతుఁడై వర్తించునో, వాఁడు వీరులగతి నొందును. వాని కింద్రలోకము ప్రాప్తింపఁగా, నందు సకలభోగము లనుభవించుచు, దివ్యపుష్పసమాలంకృతుఁడును, దివ్యచందనభూషితుఁడునై దేవగణములతో వాఁడు నిత్యము స్వర్గసౌఖ్య మనుభవించును.' అని తెలుప విని యుమాదేవి మఱియు నిట్లనియె.

### చాతుర్వర్ణ్యకథనము

'ఓభగవానుఁడా! భగనేత్రహరా! పూషదంతవినాశనా! దక్షక్రతుధ్వంసా! నాకొక గొప్పసంశయమయ్యెడిని. మున్ను భగవానుఁడగుపరమేష్ఠి చాతుర్వర్ణ్యమును సృజించెను. ఎట్టి కర్మపరిపాకముచే వైశ్యుఁడు శూద్రత్వ మొందును? ఏకర్మవిపాకముచే క్షత్త్రియుఁడు వైశ్యుఁడగును? అటులే బ్రాహ్మణుఁడు క్షత్త్రియుఁ డెటులగును? ఈ ప్రతిలోమధర్మము నెట్లు నివర్తింపనగును? మఱియు నెట్టికర్మముచే విప్రుఁడు శూద్రయోనిసంజాతుఁడగును? అటులే యేకర్మముచే

క్షత్రియుఁడు శూద్రుఁడగును? మూఁడువర్ణములవారును సహజముగా బ్రాహ్మణ్య మొందు టెట్లు?'

అది విని యాభూతపతి దేవీ! బ్రాహ్మణ్యము దుర్లభము. బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులు సహజముగా నగుచున్నారని నాయభిప్రాయము. కాని దుష్కృతకర్మముచేసి బ్రాహ్మణుఁడు నిజస్థానమునుండి భ్రష్టుఁడగుచున్నాఁడు. కావున జ్యేష్ఠవర్ణము నొందియు, నది చెడకుండ బ్రాహ్మణుఁడు కాపాడికొనవలయును. బ్రాహ్మణధర్మమందుండి బ్రాహ్మణ్యము ననుసరించి జీవించినక్షత్రియుఁడును, వైశ్యుఁడును బ్రహ్మత్వ మొందుచున్నారు. ఎవ్వఁడు బ్రహ్మత్వమును విడిచి, క్షాత్రధర్మ మాశ్రయించునో, వాఁడు బ్రాహ్మణ్యమునుండి భ్రష్టుఁడై క్షత్రియయోనియందు జనించుచున్నాఁడు. మఱియు నెవఁడు లోభమోహాశ్రయుఁడై వైశ్యధర్మమును బూనునో, వాఁడు దుర్లభమగు బ్రాహ్మణ్యమును బోవిడిచి యల్పబుద్ధియగుట వైశ్యయోనిసంజాతుఁడగును. అటులే వైశ్యుఁడు నిజధర్మపరిభ్రష్టుఁ డైనచో శూద్రత్వ మొందును. నిజధర్మచ్యుతుఁడగు విప్రుఁడు శూద్రుఁడగును. మఱియు నట్టివాఁడు నిరయగతుఁడై బ్రహ్మలోకపరిభ్రష్టుఁడగుచు శూద్రుఁడై జనించును. అటులే క్షత్రియవైశ్యులును, దమతమకర్మములను బరిత్యజించి శూద్రకర్మము నొనర్తురేని శూద్రత్వ మొందుదురు. నిజస్థానపరిభ్రష్టుఁడగుచు వర్ణసంకరత్వ మొందిన బ్రాహ్మణుఁడును, క్షత్రియుఁడును, వైశ్యుఁడును శూద్రులగుచున్నారు. ఎవ్వఁడు వివేకియై, జ్ఞానవిజ్ఞానశాలియై శుచియగుచు నిజధర్మనిరతుఁడగునో, వాఁడు ధర్మఫలమునొందును. ఓదేవీ! పరమేష్ఠి మఱియొకటి తెలిపియున్నాఁడు. ఉగ్రాన్నము, గణాన్నము, శ్రాద్ధాన్నము, సూతకాన్నము, దుష్టాన్నము, శూద్రాన్నమును గర్హితములై భుజింపఁదగవు దేవీ! గర్హితమగుశూద్రాన్న మెన్నఁడును మహాత్ములగుదేవతలు పరిగ్రహింపరు. ద్విజుఁడు తనజఠరమున జీర్ణముకాఁగా మిగిలినశూద్రాన్నముచే మృతినొందుచున్నాఁడు. అటులే యాహితాగ్నియగు యజ్వయును శూద్రాన్నసేవనముచే శూద్రగతి నొందును. ఆశూద్రాన్నశేషముచే బ్రాహ్మణుఁడు బ్రహ్మస్థానమునుండి భ్రష్టుఁడై శూద్రుఁడగుటలో సందియములేదు. బ్రాహ్మణుఁ డెవ్వనియన్నశేషముగలిగి మృతినొందునో,

వానివాని యోనియందు జనించుచున్నాఁడు. ఎవ్వఁడు దుర్లభమును శుభమునగు బ్రాహ్మణ్యము నవమానించునో, మఱియు నభోజ్యాన్నములను భుజించునో, యట్టిద్విజుఁడు ద్విజత్వమునుండి భ్రష్టుఁడగుచున్నాఁడు. అటులే సురాపానకర్తయు, బ్రాహ్మణహంతయు, శూద్రకర్మపరుఁడును, దస్కరుఁడును, భగ్నవ్రతుఁడును, నపవిత్రుఁడును, స్వాధ్యాయవర్జితుఁడును, పాపుఁడును, లుబ్ధుఁడును, మూర్ఖుఁడును, గొండెగాఁడును, వ్రతహీనుఁడును, వృషలీభర్తయుఁ, గుండాశియు, సోమవిక్రయకర్తయు, హీనసేవకుఁడునునగు విప్రుఁడు బ్రహ్మయోనినుండి పరిభ్రష్టుఁడగుచున్నాఁడు. మఱియు గురుతల్పగుఁడును, గురుద్వేషియు, గురునిందాపరుఁడును, బ్రహ్మవేత్తయగు బ్రాహ్మణుఁడయ్యుఁ బతితుఁడగుచున్నాఁడు. శుభప్రదములగు కర్మము లాచరించిన శూద్రుఁడు బ్రాహ్మణత్వ మొందును. వైశ్యుఁడు క్షత్రియత్వమును బొందుచున్నాఁడు. జ్యేష్ఠవర్ణములవారికిఁ, బ్రయత్నపూర్వకముగాఁ బరిచర్యసేయుట శూద్రకృత్యము. మఱియు శూద్రుఁడు సతతము సత్పథప్రవర్తనుఁడై దేవద్విజులను సత్కరించుచు, సకలజనాతిథ్యకృతవ్రతుఁడై ఋతుకాలాభిగామియు, నియతాహారుఁడును, బరిశుద్ధుఁడును, బరిశుద్ధజనాన్వేషియు, నగుచు, శేషాన్నభోజనుఁడై వ్యర్థముగా మాంసమును భుజింపక ప్రవర్తించునేని వైశ్యుఁడగును. అటులే సత్యవచనుఁడును, నహంవాదరహితుఁడును, నిర్ద్వంద్వుఁడును, శాంతిపరుఁడును నై, స్వాధ్యాయపరుఁడును శుచియునై యాగములొనర్చుచు, దాంతుఁడు బ్రాహ్మణసత్కర్తయు నగుచు, సకలవర్ణప్రియుఁడై గార్హస్థ్యమొనర్చుచు, రెండుమాఱులు మాత్రము భుజించుచు, శేషాశియు, నియతాహారుఁడుచు, నిష్కాముఁడును, నిరహంకారియు, నగ్నిహోత్రపరుఁడును, సకలాతిథిజనపూజకుఁడునునై, త్రేతాగ్నిహోత్రోపాసకుఁ డగువైశ్యుఁడు ద్విజుఁ డగుచున్నాఁడు. అట్టివైశ్యుఁడు పవిత్రుఁడై, మహత్తరమగు క్షత్రియవంశమందు జనించును. అటులు క్షత్రియుఁడై జనించి, జనించినది మొదలుగా నుపనయనాదిసంస్కారములు వడసి, వ్రతపరుఁడై ద్విజుఁడగుచు, దానమును బహుదక్షిణలుగల యాగములను జేయుచుఁ, ద్రేతాగ్నిశరణుఁడై యార్తుల కభయ మొసంగుచు, నిత్యము ప్రజలను ధర్మయుక్తముగఁ

బాలించుచుండవలయును. మఱియు సత్యవ్రతుఁడై సత్యప్రతిజ్ఞలఁ జేయుచు, ధర్మయుక్తమగుదండ మొసర్చుచు ధర్మానుశాసకుఁడై, షడ్భాగకృతలక్షణములగు కార్యకరణములచే నియంత్రితుఁడై గ్రామ్యధర్మల నాదరింపక, స్వయముగా నర్థములఁ దెలిసికొనుచు, ఋతుకాలమున ధర్మపత్నీసమాగమ మొనర్పవలయును. మఱియు నతఁడు సదోపవాసియు, స్వాధ్యాయనిరతుఁడును, శుచియు నగుచు, దర్భలతో నిండిన యగ్నిగృహమున శయనించుచు, నిర్మలచిత్తుఁడై వర్ణత్రయమున కాతిథ్య మిడుచు, నన్నకాములగు శూద్రులకు సిద్ధాన్నమును బెట్టుచు, నర్థకామముల నపేక్షించి దేనిని బరికింపక, పిత్రతిథిపూజకుఁడై తనయింటనే భైక్ష్యాన్నమును గొనుచుఁ ద్రికాలాగ్నిపరుఁడై హోమచేయుచు, గోబ్రాహ్మణహితముగా రణరంగమున మరణించి మంత్రపూతమగుత్రేతాగ్నిని బ్రవేశించినచో వానికి ద్విజత్వము గలుగును. అటులు గలిగినపిదప జ్ఞానవిజ్ఞానసంపన్నుఁడై, వేదపారగుఁడై క్షత్రియుఁడు నిజకర్మముచేతనే విప్రుఁ డగుచున్నాఁడు. ఇట్టియుత్తమకర్మఫలములచే నీచకులోత్పన్నుఁడగు శూద్రుఁడును, నాగమసంపన్నుఁడై సంస్కరింపఁబడి ద్విజుఁడగును. బ్రాహ్మణుఁడయ్యును సర్వసంకరభోజనుఁడై సద్వృత్తి విడిచినచో, బ్రాహ్మణ్యమును బోఁగొట్టుకొని శూద్రుఁడగును. పవిత్రకర్మములచే శుద్ధాత్ముఁడును, జితేంద్రియుఁడును నైన శూద్రుఁడును ద్విజునివలె భావింపఁబడవలయునని బ్రహ్మానుశాసనము సహజమైన శుభకర్మము శూద్రునియం దున్నచో, వాఁడు ద్విజునికంటె విశిష్టుఁడని నాయభిప్రాయము. యోనిగాని, సంస్కారముగాని, శ్రుతముగాని, వంశముగాని ద్విజత్వమునకుఁ గారణములు కాఁజాలవు. నిజవృత్తమే ద్విజత్వమునకు నిమిత్తము. లోకముచే సమస్తబ్రాహ్మణ్యము వృత్తమునుబట్టి నిర్ణయింపఁబడుచున్నది. సద్వృత్తస్థితుఁడగు శూద్రుఁడును బ్రాహ్మణత్వ మొందుచున్నాఁడు. ఓకళ్యాణీ! బ్రాహ్మణస్వభావ మంతటను సమమై యుండునని నాయభిప్రాయము. నిర్గుణము, నిర్మలము నగుబ్రహ్మ మెందుండునో, యందు ద్విజత్వ ముండును. లోకమున బ్రాహ్మణుఁడు పాదములుగల గొప్పక్షేత్రమై చరించుచున్నాఁడు. కావున నట్టిక్షేత్రమున బీజ ముంచినచో, నది వేఱొకజన్మమునకు ఫల మొసంగెడిని. శ్రేయము

గోరునట్టివాఁడు విఘసాశియు, సత్పథావలంబియునై బ్రాహ్మణమార్గమునుబట్టి ప్రవర్తింపవలయును. గృహస్థుఁడై తనయింటనే వేదాధ్యయన మొనర్పవలయునుగాని, యధ్యయనము జీవిక కుపయోగింపరాదు. విప్రుఁ డిట్టిసన్మార్గమునుబట్టి యాహితాగ్నియు, నధ్యయనవేత్తయు నగునేని, బ్రహ్మభూయమున కగుచున్నాఁడు. బ్రాహ్మణ్యమునే సంపాదించి నియతాత్ముఁడై దానిని బోకుండ రక్షించుకొనవలయును. దేవీ! శూద్రుఁడు బ్రాహ్మణుఁ డెట్టులగునో, బ్రాహ్మణుఁడు శూద్రత్వ మెట్టులందునో యనురహస్యవిషయము నెఱిఁగించితిని గదా!' అని పలుక విని యయ్యుమాదేవి మఱియు నిట్లనియె.

### కర్మఫలకథనము

'ఓసకలభూతేశా! సురాసురనమస్కృతా! మానవుల ధర్మాధర్మములను దెలుపుము. మానవుఁడు మనోవాక్కర్మముల మూఁడిటి చేతనే బద్ధుఁడును, ముక్తుఁడు నగుచున్నాఁడుగదా! ఎట్టిస్వభావముచే, నెట్టికర్మముచే, నెట్టిసదాచారములచే, నెట్టిగుణములచే, నెట్టివచనములచే మానవులు స్వర్గ మొందుచున్నారు?'

అది విని యాదేవదేవుఁడు 'ఓశైలతనయా! నీవు ధర్మార్థతత్త్వజ్ఞవును, ధర్మనిత్యవు నగుట, సర్వప్రాణిహితమగు ప్రశ్న మొనర్చితివి. ఇయ్యది బుద్ధివర్ధనమైనదియు నగుచున్నది. సత్యధర్మరతులై సకలచిహ్నావర్జితులై ధర్మలబ్ధములగు నన్నముల భుజించువారు స్వర్గమునకుఁ బోవుదురు. ప్రళయోత్పత్తితత్త్వజ్ఞులును, సర్వజ్ఞులు నగువారు సంశయరహితులై ధర్మాధర్మములలో దేనిచేనైనను గట్టువడకుందురు. అటులే వీతరాగులగువారును గర్మబంధనములనుండి విముక్తులగుచున్నారు. ఎవ్వరు మనోవాక్కర్మములందు దేనిచేనైన నించుకేని యొకప్రాణికి హింసగలిగింపరో, యెవ్వ రెందును సక్తులుగాకుందురో, వారు కర్మపాశబద్ధులుగారు. మఱియు విరక్తులై సౌశీల్యదయాన్వితులై శత్రుమిత్రులందు సమభావముగలిగి దాంతులైనవారు కర్మబంధనములనుండి విముక్తులగుచున్నారు. సర్వభూతదయగలిగి సకలజంతువులకు నమ్మఁదగి, హింసాదూరులును, సదాచారులు నగువారు స్వర్గమును జేరుదురు. పరదారలం దాసగొలుపక, పరధనముల నవే

క్షింపక, ధర్మలబ్ధములగు అన్నముల భుజించుచుఁ బ్రవర్తించువారు స్వర్గతులగుదురు. ఎవ్వరు పరకళత్రములను దల్లులుగను, జెల్లెండ్రుగను, కూఁతులుగను దలంతురో వారు స్వర్గగాము లగుదురు. నిజధనసంతుష్టులై చౌర్యము సేయక, నిజదారాభిలాషులై యుండువారును స్వర్గము నొందుదురు. ఎవ్వరు జితేంద్రియులై పరదారలనుండి తమ దృష్టిని మరలింతురో, సుశీలసంపన్నులగునట్టివా రుత్తమగతి నొందుదురు. నా యీ తెలిపినది దేవతలొనర్చినమార్గ మగుటఁ బండితులగువారు దీనినే సేవింపవలయును. సంగరహితమార్గమే సేవింపఁదగినది. ఎవ్వరు నిజదారనిరతులై ఋతుకాలాభిగమనము సేయుచు గ్రామ్యసుఖాభిలాషులు గాకుందురో, వారు స్వర్గము నొందుదురు. దాన ధర్మనిరతుఁడును, శీలశౌచదయాన్వితుఁడును నై వివేకి తనజీవనమునకును ధర్మమునకును బ్రవర్తింపవలయును. స్వర్గమును గోరువారు నా యీ తెలిపిన వానికి భిన్నముగాఁ బ్రవర్తింపరాదు.' అని తెలిపెను.

అంత మఱియు నప్పార్వతి శంకరు నారసి, 'దేవా! వచనము చేతనే యెవ్వఁడు బద్ధుఁడును, ముక్తుఁడు నగునో, యట్టికర్మము లెవ్వియో నాకెఱిఁగింపుము.' అని యడుగ, నమ్మహేశ్వరుఁడు 'దేవీ! తనకుఁగాని, యొకనికై గాని, పరిహాసమునకేనిగాని యెవ్వ రనృత మాడరో, వారు స్వర్గగాములగుచున్నారు. మఱియు, దమజీవనమునకుఁగాని, ధర్మమునకుఁగాని, యొకకోర్కి గలిగిగాని యెవ్వరసత్యము వలుకరో, వారు స్వర్గగాములగుదురు. మృదువుగను, నొకనికి బాధకము గాకుండఁగను, దోషరహితముగను, మధురముగను, కుశలపూర్వకముగా నెవ్వరు సంభాషింతురో, వారు స్వర్గము నొందుదురు. మఱియుఁ బరుషముగను, నిష్ఠురముగను, గటువుగను భాషింపక, కొండెములు పలుక నిచ్చగింపక వర్తించువారు స్వర్గమునొందుదురు. అటులే మిత్రభేదము గల్గించునట్టియు, నపవాదము గలట్టియు మాట వలుకక సత్యము మైత్రము నగువచనము పలుకువాఁడే స్వర్గమొందును. ఎవ్వరు పరద్రోహకరమగుపరుషమును బరిత్యజించి, సర్వభూతసములును శాంతులునై వర్తింతురో వారు స్వర్గార్హులగుదురు. మఱియు నసత్ప్రలాపములకుఁ బోక, విరుద్ధవాదములు సేయక సౌమ్యముగ సంభాషింతురో, వారు స్వర్గతి నొందుదురు. ఎవ్వరు కోపమువచ్చినను పర

హృదయభేదకముగాఁ బలుకరో, క్రుద్ధులయ్యుఁ బ్రియమునే పలుకుదురో వారు స్వర్గతి నొందుచున్నారు. ఓ దేవీ! వచనకృతశుభధర్మమిదియే. దీనినే మానవు లెల్లప్పుడును సేవింపవలయును. శుభప్రదమగు సత్త్వగుణమునేపూని, యనృతమును బరిత్యజింపవలయును.' అని తెలిపెను. అది విని మఱియు నయ్యుమాదేవి, 'ఓ మహాదేవా! మానసమగు నెట్టికర్మముచే మానవుఁడు బద్ధుఁడగునో దానిని నా కెఱిఁగింపుము.' అని ప్రశ్నించెను.

అందుల కాశంకరుఁడు 'పార్వతీ! ఎల్లప్పుడును మానసధర్మము గలమానవులు తప్పక స్వర్గమొందుదురు. దానిని దెలిపెదను వినుము. అపమార్గప్రవిష్టచిత్తుఁడగువాఁడు మనోబద్ధుండగును. నిర్జనారణ్యమున నున్న పరధనమును గాంచినపుడును నెవ్వనిచిత్తము దానిపై సక్తముగాకుండునో యట్టివాఁడు స్వర్గగామి యగును. జనులులేని గ్రామమందలి ధనమునుగాని, యట్టినిర్జనగృహస్థద్రవ్యమునుగాని పరకీయమని దాని నెవనిచిత్తము వాంఛింపదో వాఁడు స్వర్గతినొందును. అటులే, కామవృత్తులైనను బరదారల నెవఁడు గోరకుండునో యట్టివాఁడు స్వర్గతుఁడగును. శత్రుని మిత్రునిఁ దుల్యముగా నెవ్వరరయుదురో, యట్టివారు స్వర్గము నొందుదురు. మఱియు శ్రుతవంతులును, దయావంతులును, సత్యప్రతిజ్ఞులును, బవిత్రులును నై తమ యర్థములచే సంతుష్టులగుచు వర్తిల్లువారు స్వర్గతులగుచున్నారు. వైరమెవ్వరితోఁ జేయక యసూయారహితులై సకలజనమైత్రిగలిగి సర్వభూతదయావంతులైనమానవులు స్వర్గగాములగుచున్నారు. మఱియు శ్రద్ధావంతులును, బరిశుద్ధులును, బరిశుద్ధులకు మిత్రులును నై ధర్మాధర్మవేత్తలగువారు స్వర్గగాములగుచున్నారు. శుభాశుభకర్మఫలసంచయవిపాకజ్ఞులగువారును స్వర్గతినొందుదురు. న్యాయోపేతులును, గుణోపేతులునై దేవద్విజప్రియత వెలయ మెలఁగువా రుత్తమగతి నొందుచున్నారు ఓ దేవీ నా యీ తెలిపిన శుభకర్మఫలములచే స్వర్గమార్గ మెవ్వరనుసరింతురో తెలిపితినిగదా! ఇఁక నేమి వినఁగోరెదు?' అని పలికెను.

అది విని యాశైలరాజపుత్రి యాకైలాసవాసునితో 'దేవా! మానవులనుగూర్చి మఱియొక గొప్పసంశయ మయ్యెడిని. దానిని

నీనై పుణ్యమేర్పడ వివరించి తెలుపుము. ఓ ప్రభూ! పురుషుఁ డెట్టి కర్మముచే దీర్ఘాయువగును? ఎట్టితపముచే మహాత్తరాయువు గల్గెడిని? ఎట్టికర్మముచే క్షీణాయువగును? మఱియుఁ గొందఱు మహాభాగులును, మఱికొందఱు మందభాగ్యులును, గొందఱు కులీనులును, మఱికొందఱు నీచకులులును, గొందఱు కఱ్ఱబొమ్మలట్లు దుర్దర్శులును, వేఱొకకొందఱు ప్రియదర్శనులును, గొంద ఱల్పబాధులును, మఱికొందఱు మహాబాధులునై యగపడుచుండుదురుగదా! అటులగుటకు నిమిత్తము లెవ్వియో నా కెఱిఁగింపుము.' అని ప్రశ్నించెను.

అందుల కాశంకరుఁడు 'ఓశాంకరీ! కర్మఫలోదయ మెఱిఁగించెదను వినుము. ఎవ్వఁడు కుపితుఁడై ప్రాణహాని యగుననియును సంశయింపక, దండహస్తుఁడై భూతగణములను హింసించుచు, సర్వభూతనిర్దయుఁడును, సకలభూతోద్వేగకారకుఁడును, నగుచుఁ గీటపిపీలికాదులయెడ నిష్కరుణుఁడై ప్రవర్తించునో, వాఁడు నరక మొందుచున్నాఁడు. పైఁదెలిపినగుణములు లేక ధర్మాత్ముఁడై ప్రవర్తిల్లినచో, రూపవంతుఁడై జనించును. హింసాత్మకుఁడు నరకమును, నహింసాత్మకుఁడు స్వర్గమును బొందుట నిశ్చయము. అటులు నిరయ మొందినవాఁడు, భయంకరమగుకష్టము నొందుచున్నాఁడు. ఎవ్వఁడే నట్టినిరయమునుండి యొకప్పుడు తరించినపుడు మానవత్వ మొంది హీనాయువై జనించును. మఱియు హింసాపరుఁడై పాపకర్మబద్ధుఁడై సకలభూతముల కప్రియ మొనర్చువాఁడు హీనాయువగును. ఎవ్వఁడు పరిశుద్ధవంశ్యుఁడై ప్రాణిఘాత మొనర్పక దండశూన్యుఁడై, తాను దేనిని గొట్టక యొకనిచేఁ గొట్టింపక, కొట్టుచున్నవాని ననుమోదింపక సర్వభూతప్రియుఁడై యెల్లప్రాణులఁ దన్నువలె భావించుచు నుండునో, యట్టివాఁడు దేవత్వమందుచున్నాఁడు. అటులు దేవత్వ మొందియందు సుఖము లనుభవించి పిదప మానుషలోకమును బొందవలసి వచ్చినపుడు దీర్ఘాయువై పుట్టి సుఖమందుచున్నాఁడు. సద్వృత్తులు సత్కర్ములు నగుదీర్ఘాయువుల కిదియే మార్గము. ప్రాణిహింస చేయనివాఁడే దీర్ఘాయు వగునని బ్రహ్మ చెప్పియున్నాఁడు.' అని తెలుప విని యుమాదేవి మఱియు నిట్లనియె.

## కర్మఫలకథనము

'ఓమహాదేవా! ఎట్టి శీలసమాచారములుగలిగి, యెట్టికర్మములచే మానవుఁడు స్వర్గమొందును? ఎట్టిదానముచే స్వర్గమొందును?

అది విని యామహాదేవుఁడు 'దేవీ! ఎవ్వఁడు దానశీలుఁడై బ్రాహ్మణుల సత్కరించుచు, దీనాంధకృపణాదుల కన్నపానభక్ష్యభోజ్యాదుల నిడుచు, వస్త్రముల నొసంగుచు, మఱియుఁ బ్రతిశ్రయములను, సభలను, కూపములను, బ్రపలను, బావులను, నెల్లవారికి నిత్యము వలయు మఱికొన్నిటిని లోకోపకారముగా సమకూర్చునో, యటులే శయనాసనయానములను, ధనరత్నగృహములను, సకలసస్యజాతములను, గోవులను, భూములను, కన్యకలను దానముసేయునో వాఁడు దేవలోకవాసియై యందుఁ జిరకాలము సర్వోత్తమములగు భోగము లనుభవించుచు, నందనవనాదులం దప్సరసలతో నానంద మందుచుఁ, బిమ్మట స్వర్గమునుండి జాఱి మానుషలోకమున జనించుటలో మహాభోగయుతమై ధనధాన్యసమన్వితమై వంశమునఁ బుట్టును. అటులు పుట్టి సకలసౌఖ్యము లనుభవించి సమ్మోదమానమానసుఁడగుచు, మహాభాగ్యశాలియు, మహాకోశాధీశుఁడు నై వెలయును. ఓదేవీ! దాతలగువా రిట్లు మహాభాగ్యనిధులగుదురని మున్నాపరమేష్ఠి తెలిపెను. పార్వతీ! మఱికొందఱు మానవులు ధనికులయ్యు నవివేకులై తమ్ము బ్రాహ్మణులు యాచించునపుడు ప్రదానకృపణులై యొసంగరు. మఱియుఁ గొందఱు దీనులు, నంధులు, కృపణులు మున్నగుభిక్షుకులను గాంచి, వారు తమ్ము యాచింతురను భయముచే లోభగుణసమావిష్టులై మరలుదురుగాని' వారికి వస్త్రములనుగాని, ధనమునుగాని, యన్నమునుగాని, సువర్ణమునుగాని యొసంగకుందురు. అట్టిదానశూన్యులై నాస్తికులై లుబ్ధులైన యవివేకులు నరకగతులగుచున్నారు. వారటులు నరకబాధ లనుభవించి మానవత్వ మొందినపుడు, దరిద్రులవంశమున జనించి యల్పబుద్ధులై క్షుత్పిపాసాపీడితులై సర్వజన హేయులగుచు సకలభోగనిరాశులై యధమజీవనులై జీవింతురు. ఓదేవీ! దానహీనులగువా రల్పభోగవంశమునఁ బుట్టి యల్పభోగులై ధనహీనులగుచున్నారు. మఱికొందఱు ధనగర్వితులై మొద్దుపాఱి యాసనార్హులగువారు వచ్చినను

వారి కాసన మొసంగరు. అటులే మార్గార్హుఁడగువానికి మార్గ మొసంగకయు, నర్ఘ్యపాద్యార్హులగువారి కర్ఘ్యపాద్యము లొసంగకయు, నాచమనీయార్హుల కాచమన మొసంగకయు, గురు నభినందింపకయుఁ బ్రవర్తింతురు. అట్టి లోభాభిమానపూరితులగువారు మాన్యులగువృద్ధుల నటులు పరిభవించుటచేఁ దప్పక నరకగాము లగుదురు. వారు నరకమునుండి వెడలి మానవత్వ మొందవలసినపుడు, కుత్సితులై వివేకహీనులగు శ్వపాకపుల్కసాదుల కుత్సితకులమున జనించి నీచులగుదురు. స్తంభమానరహితుఁడై దేవతలను ద్విజులను బూజించుచు, లోకపూజ్యుఁడును వినయశాలియు, మధురవచనుఁడు నై, సకలవర్ణప్రియకరుఁడై, సర్వభూతహితుఁడై వైరము వహింపక ప్రసన్నుఁడై, మృదుస్వభావుఁడై, మృదువచనుఁడై, యహింసకుఁడై యథార్థముగాఁ బూజ్యులను బూజించుచు నెవ్వఁడు ప్రవర్తించునో, మఱియు గురునకు నర్చనలను, మార్గార్హునకు మార్గమును గలిగించుచు, నతిథిపూజకుఁడై యభ్యాగతప్రియుఁడై, ప్రవర్తించువాఁడు స్వర్గతి నొందుచున్నాఁడు. అటులు స్వర్గ మొంది, పిదప మానుషత్వ మొందినపుడు విశిష్టవంశసంజాతుఁడై విపులభోగముల ననుభవించుచు సర్వరత్నసమన్వితుఁడై మఱియు దాతయు ధర్మపరుఁడై వర్ధిల్లును. అట్టివానిని సకలభూతములు నాదరించును. వాఁడు సకలభూతసమ్మతుఁడై నిజకర్మఫల మనుభవించును. నా యీ తెలిపినధర్మము పరమేష్ఠి స్వయముగాఁ జెప్పినదియే. దేవీ! ఎవ్వఁడు రౌద్రసమాచారుఁడై సకలసత్త్వభయంకరుఁడై హస్తములు, పాదములు, త్రాళ్లు, దండము, లోష్టములు, స్తంభములు మున్నగుసాధనములచే జంతుబాధయొనర్చునో, మఱియు నెవఁడు నీచబుద్ధియై, యొకరికి హింసయగునట్లుగా భయము గలిగించుచు, జంతుహింస కుపక్రమించునో, యట్టివాఁడు నరకగతుఁడై దుఃఖము లనుభవించి, పిదపఁ గాలవిపర్యయమున మానవత్వ మొందవలసివచ్చినపుడు, బహుబాధాపరిక్లిష్టమగు నీచకులమున జనించి లోకవిరోధియై పురుషులలో నధముఁడై నిజకృతకర్మఫల మనుభవించును. ఓదేవీ! మానవులలో నొక్కొక్కఁడు జ్ఞాతిబంధువులలో వివేకియై సకలభూతదయగలిగి, మైత్రిచేఁ బితృతుల్యుఁడై నియతేంద్రియుఁడై యెవ్వరితో వైరముగొనక, భూతములకు భయము గల్గింపక,

పరులఁ బరిహసింపక, సకలజంతువులకును నమ్మఁదగి, దండాదులచే నేప్రాణులను దండింపక ప్రవర్తిల్లును. అట్టివాఁడు స్వర్గవాసియై యాచోట దివ్యభవనముల నివసించుచుఁ, గర్మఫలక్షయమైన పిదప మానవత్వ మొందువాఁడై, నిర్బాధకమై నిరాతంకమైన మంచికులమున జనించి సుఖించును. అటులు సుఖితుఁడై, మఱియు నెవ్వరికి భయము గొలుపక పూజ్యుఁడై చరించును. దేవీ! నిర్బాధకమగుసన్మార్గ మిదియే' అని తెలిపెను.

అది విని మఱియుఁ నయ్యుమాదేవి, 'మహాదేవా! మానవులు కొందఱు జ్ఞానవిజ్ఞానసంపన్నులును, నూహాపోహావిశారదులును, బ్రజావంతులును, నర్థకోవిదులు నై యుందురు. మఱికొందఱు దుష్ప్రజ్ఞులును, దేవజ్ఞానవిజ్ఞానహీనులును నై యుందురు. ఎట్టికర్మవిపాకముచే మానవుఁడు ప్రజ్ఞాశాలియగును? ఎట్టికర్మముచే బుద్ధిహీనుఁడగును? సర్వధర్మజ్ఞా! ఈ నాసంశయమును దీర్పుము. దేవా! కొందఱు పుట్టుగ్రుడ్డివారగుదురు. మఱికొందఱు రోగార్తులగుదురు. మఱియు నపుంసకులుగాఁ గొందఱుందురు. ఇట్టులగుటకు నిమిత్తమేమి?' అని పార్వతి యడుగుటయు, నమ్మహేశ్వరుఁడు 'దేవీ! వేదవేత్తలగుబ్రాహ్మణులను ధర్మవేత్తలగువారిని బ్రతిదినము క్షేమమార్గము నడిగి తెలిసికొనుచు, నశుభకర్మములఁ బరిత్యజించుచు, శుభకర్మములనే సేయుచుఁ బ్రవర్తించినవాఁడు, స్వర్గతుఁడై సుఖ మనుభవించి, పిమ్మట మానుషత్వ మొందినపుడు, మేధావియై జనించి, తనప్రజ్ఞ కనుగుణమగు శాస్త్రమును గ్రహించి శుభ మొందును. మూఢులై యెవ్వరు పరదారలందు దృష్టి పఱపుదురో, యట్టిదుష్టస్వభావముగలవారు జాత్యంధులగుచున్నారు. మఱియు మనోదృష్టులచే నగ్నయైయున్న కాంత నెవ్వరు గనుఁగొందురో, యట్టిపాపులు రోగార్తులగుచున్నారు. మూఢులై యెవ్వరు దురాచారముగా వియోనియందును, బురుషునందును మైథున మొనర్తురో, వారు నపుంసకు లగుచున్నారు. పశుఘాతకులును, గురుతల్పగులును, నానాజాతిమైథునులు నగువారును నపుంసకులగుదురు.' అని తెలిపెను.

అది విని యాదేవి, యామహాదేవునిఁ గాంచి 'దేవా! నిరవద్యమగుకర్మ మెద్ది? నిందితమగుకర్మ మెద్ది? దేని నొనర్చి మానవుఁడు

శ్రేయమొందెడిని?' అని ప్రశ్నించుటయు, నమ్మహాదేవుఁడు 'దేవీ! శ్రేయోమార్గములను బ్రాహ్మణుల నడిగి తెలిసికొనుచు, ధర్మాకాంక్షియు, గుణాన్వేషియు నగువాఁడు స్వర్గమొంది, పిదప మానవత్వ మొందునపుడు మేధావియు, ధారణాయుక్తుఁడును నై జనించి ప్రాజ్ఞుఁడై వెలయును. ఈధర్మము భూతిప్రదమని తలంచి, మానవులకు హితముగునట్లుగా దీనిని నీకెఱిఁగించితిని.' అని తెలిపెను. అది విని మఱియు నామె యామహితునితో 'ఓ ప్రభూ! కొంద ఱల్పవిజ్ఞానులై ధర్మవిద్వేషమూని, వేదవేత్తలగు బ్రాహ్మణుల నుపసర్పింపఁ దలంపరు. మఱికొందఱు శ్రద్ధావంతులును, ధర్మపరులు నై వ్రతములూని ప్రవర్తింతురు. వేఱొకకొందఱు వ్రతహీనులును, భ్రష్టనియములు నై రాక్షసులునాఁ దగియుందురు. అటులే కొందఱు యజనశీలురును, మఱికొందఱు హోమశూన్యులు నై యుందురు. ఏయేకర్మవిపాకముచే నట్టివారగుదురు?' అని ప్రశ్నించుటయు, నతఁడు 'దేవీ! ఆగమములన్నియు లోకధర్మము నతిక్రమింపకుండఁ బూర్వులచే నిర్మింపఁబడినవి. అవి ప్రామాణ్యముగా గ్రహింపఁబడుచున్నవి. దృఢవ్రతులగువారు, వాని ననుసరించుచున్నారు. ఎవ్వరు మోహావశులై యధర్మమును ధర్మమునుగాఁ దెలుపుదురో, వ్రతహీనులును, నష్టమర్యాదులు నగువారు బ్రహ్మరాక్షసు లనఁబడుచున్నారు. అట్టివారు మృతులై మఱియు మానవత్వమొందినచో, హోమశూన్యులును, వషట్కారరహితులు నగుచున్నారు. దేవీ! సకలసంశయవిచ్ఛేదముగా మానవులకుఁ గుశలాకుశలములు గావించుమార్గ మెఱిఁగించితిని" అని తెలిపె'నని పలికి నారదుఁడు మఱియు నిట్లనియె.

### ఉమామహేశ్వరసంవాదము

'ఓమహర్షులారా! ఇటు లామహాదేవుఁ డెఱిఁగించి, పార్శ్వస్థయై ప్రియయు, ననుకూలయునగు నామెవలన ధర్మము వినువాఁడై, 'ఓతపోవనవాసినీ! ధర్మజ్ఞా! సాధ్వీ! ధర్మచారిణీ! నేను నిన్నొకటి యడుగుచున్నాఁడను. నాకిష్టమగు సద్ధానిని తెలుపుము. దేవీ! బ్రహ్మకు సావిత్రియు, నింద్రునకు శచియు, మార్కండేయునకు ధూమోర్ణయు, వైశ్రవణునకు బుద్ధియు, వరుణునకు గౌరియు, సూర్యునకు సువర్చ

లయుఁ, జంద్రునకు రోహిణియు, నగ్నికి స్వాహాయుఁ, గశ్యపున కదితియుఁ బతిదేవతలై ప్రవర్తిల్లిరి. వారినెల్ల నీవు నిత్యము గౌరవించుచుందువు. అటులగుట నిన్నీప్రశ్న మడిగెదను. ఆదినుండియు స్త్రీధర్మ మెట్టిదో నాకెఱిఁగింపుము. నీవు నాకు సహధర్మచారిణివి. మఱియు సమశీలవు, సమవ్రతవు, సమానసారవీర్యవు నై వెలయుదువు. తీవ్రతప మొనర్చినదానవు నీవు దెలిపినది విశేషించి గుణవత్తర మగుచున్నది. అది లోకమున మానవులకుఁ బ్రమాణీకరింపఁదగి యుండును. స్త్రీ లేగదా స్త్రీలగతికి దర్శకలు గావలయును. అదియుఁ గాక నీవు నాయర్ధశరీరమవు గాదే? నీవే దేవతలకార్యము లొనర్చుదానవును, లోకసంతానకర్త్రివి నై వెలయుదువు. శాశ్వతమగు స్త్రీధర్మమెల్ల నెఱిఁగినదానవు. కావున నిజధర్మమునంతయు విస్తరించి తెలుపుము.' అని ప్రశ్నించెను.

అది విని యాదేవి 'దేవా! సర్వభూతేశా! భూతభవ్యభవోద్భవా! నీయనుగ్రహమువలననే నాకు వచనప్రసారమును గలుగుచున్నది. ఓదేవేశా! సకలతీర్థోదకములతోఁగూడి యీనదులన్నియు నుపస్పర్శనమునకుఁగా నిన్ను సమీపించుచున్నవి. వీనితో నాలోచించి క్రమముగా నీకుఁ దెలిపెదను. ఎవ్వఁ డహంకారశూన్యముగాఁ బలుకునో, వాఁడే యుత్తమపురుషుఁ డనఁబడుచున్నాఁడు. లోకమున నిత్యము స్త్రీ స్త్రీనే యనుసరించునుగదా! నాచే నీయుత్తమనదులు సన్మానింపఁబడవలయును. ఇదె పవిత్రయగు నీసరస్వతి నదులలో నుత్తమమైనది. సాగరగామినియగు నిది యెల్లనదులలోఁ దొలుతటిది. అటులే యీవిపాశయు, వితస్తయుఁ, జంద్రభాగయు, నిరావతియు, శతద్రువు, దేవిక, సింధువు, కౌశికి, గోమతి, సకలతీర్థాభిసంవృతయగు నీగంగయు వచ్చియున్నవి. ఈగంగ గగనమునుండి వచ్చియున్నది.' అని తెలిపి, యాదేవదేవపత్ని మందహాసపూర్వకముగా, నానదుల నెల్ల స్త్రీధర్మమును బ్రశ్నించి, 'ఓయుత్తమనదులారా! ఈభగవానుఁడు స్త్రీధర్మము నాశ్రయించిన ప్రశ్న మొకటి యొనర్చెను. దీనిని గూర్చి మీతో నాలోచించి యీతని కుత్తర మొసంగఁ దలంచుచున్నదానను. ఎట్టి విజ్ఞానమేని యొక్కరికి సాధ్యము గాదుగదా! అందులకుఁగా సాగరగామినులగు మిమ్మెల్ల మన్నించుచున్నదానను.' అని

పలుకుటయుఁ, బవిత్రములును, శుభప్రదములునగు నానదులన్నియు, నందుల కానంద మొందెను. పిమ్మట దేవనదియగుగంగ సగౌరవముగా నియోగింపఁబడి బహుబుద్ధిస్ఫీతయు, స్త్రీధర్మజ్ఞయుఁ, శైలరాజపుత్రియుఁ, బవిత్రయుఁ, బాపభయాపహయు నగుట శుచిస్మితయై, ఓదేవీ! నీవు నన్నిటు లనుగ్రహించుట నెంతయు ధన్య నగుచున్నదానను. సకలజగత్పూజ్యవగు నీవిట్లు నదినగునన్ను గౌరవించుట ఘనతగాదే? ఎవ్వఁడు గౌరవపురస్సరముగాఁ బ్రశ్నించునో, వాఁడు ధర్మాత్ముఁడును, బండితుఁడు నగుచున్నాఁడు. జ్ఞానవిజ్ఞానసంపన్నులు, నూహాపోహవిశారదులు, వక్తలు నగువారిని బ్రశ్నించి తెలిసికొనినవాఁ డాపదకుఁ బాలుగాఁడు. అటులుగాదేని బహుబుద్ధిశాలియు సభలో వాక్యమును బలికి గౌరవపాత్రుఁడు గానేరఁడు. అహంకారముతోఁ బలుకువారివచనము దుర్బలమగును. ఓదేవీ! దివ్యజ్ఞానవు, దివ్యోత్థానవునగు నీవే స్త్రీధర్మమును దెలుపఁదగినదానవు.' అని పలికెను.

ఓధర్మజా! అటులు బహువిధములుగా నాగంగాదేవిచే నారాధితయై, యాదేవి స్త్రీధర్మమెల్లఁ దెలుపునదియై, 'దేవా! నాకు స్ఫురించినట్లుగా స్త్రీధర్మ మెఱిఁగించెదను. శ్రద్ధమెయి వినుము. బంధుకృతమగువివాహమే మొదటిదగు స్త్రీధర్మము. అగ్నిసమీపమున భర్తతో సహధర్మము నాచరించునదైన స్త్రీ; సుస్వభావయు, సువచనయు, సువృత్తయు, సుఖదర్శనయు నై పుత్రవక్త్రమునుబోలె భర్తృవచనమును బ్రతీక్షించుచు నెవ్వతె సాధ్వియు, నియతాచారయు నై వర్తిల్లునో, యదియే సహధర్మచారిణి. మఱియు నెవ్వతె ధర్మపరాయణయై భర్తృవ్రతమూని, భర్తను దేవునట్లు నిత్యము భావించుచు, దేవతుల్యునిఁగాఁ దలంచి, యాతనిపరిచర్యను, శుశ్రూషను జేయుచు, నాతనికి వశయై, ప్రియదర్శనయై, యనన్యచిత్తయై, ప్రసన్నాత్మయై ప్రవర్తిల్లునో, యదియే సహధర్మచారిణి. భర్త తన్నుఁ బరుషోక్తులు పలికినను, గుపితుఁడై చూచినను, బ్రసన్నముఖియై యెవ్వతె యుండునో, యదియే పతివ్రత. భర్త, దరిద్రుఁడుగాని, వ్యాధితుఁడుగాని, దీనుఁడుగాని మార్గాయాసపీడితుఁడుగాని యైనపుడాతనిఁ బుత్రునట్లు ప్రేమించునదియే సహధర్మచారిణి. మఱియు నెవతె, నియతమాన

సయు, సమర్థయుఁ, బుత్రవతియునై, పతివ్రతయగుచుఁ బతిప్రాణములు తనప్రాణములుగాఁ దలంచునో యదియే సహధర్మచారిణి. మనోవైకల్యము లేక యెవ్వతె పతిశుశ్రూషాపరిచర్యాదులఁ జేయుచు, సుప్రీతయు, వినయవతియు నై ప్రవర్తిల్లునో యదియే ధర్మచారిణి. మఱియు నిత్యము సన్నప్రదానముచేఁ గుటుంబమును బెంచుచుఁ గామములందును, భోగములందును, నైశ్వర్యమందును సుఖమునందును నాసగొలుపక యెవ్వతె భర్తయందే వాంఛగలిగియుండునో, యదియే సహధర్మచారిణి. ప్రతిదినము ప్రాతఃకాలమున లేచి గృహకృత్యపరాయణయై గృహశోధన మొనర్చి, గోమయమును లేపన మొనర్చి, యెల్లప్పుడును నగ్నికార్యపరత్వమును, బుష్పబలిప్రదత్వమును గలిగి, భర్తతోఁ గూడ దేవతాతిథిభృత్యులకుఁ బెట్టి తచ్ఛేషాన్నమును భుజించుచు, యథావిధిగను, యథాన్యాయముగను బరిజనమునకుఁ దుష్టియుఁ బుష్టియుఁ గలిగించినకాంత సహధర్మచారిణి యగును. మఱియు నెవ్వతె యత్తమామలపాదసేవ సేసి వారిని సంతోషపెట్టుచు, మాతాపితృభక్తిగలిగి, నిత్యము ప్రవర్తిల్లు నదియే తపోధన యగుచున్నది. మఱియు బ్రాహ్మణులు, దుర్బలులు, ననాథులు, దీనులు, కృపణులు మున్నగువారిని నన్నాదికముచే నెవ్వతె యాదరించునో, యది పతివ్రత యనఁబడును. నిత్యము దుశ్చరమగు వ్రతమూని, పతిమానసయుఁ, బతిహితయు నై ప్రవర్తిల్లునో, యది పతివ్రత యనఁబడుచున్నది. ఏకాంత, భర్తృపరాయణయుఁ, బతివ్రతయు నై ప్రవర్తిల్లునో, యట్టివర్తన మే యామెకుఁ బుణ్యమును, దపమును, స్వర్గమును నగుచున్నది. కాంతలకుఁ బతియే దేవుఁడు. పతియే బంధువు. అతఁడే గతి. భార్యకుఁ బతితోఁ దుల్యమగుగతియు, దైవతము వేఱొకటి లేదు. పతియనుగ్రహమునకుఁ దుల్యమైనదియు, దానిని మించినదియునగు స్వర్గము వేఱొకటి నారికి లేదు. ఓదేవా! నీవు ప్రీతినొందకుందువేని నే నా స్వర్గమును నైతము వాంఛింపను. భర్త కిష్టమైనది యధర్మమైనను, నకామ్యమైనను, బ్రాణనాశనమైనను నారిమణి కిష్టపడవలయును. భర్త దరిద్రుఁడేగాని, వ్యాధితుఁడేగాని, యాపన్నుఁడేగాని, వైరిపీడితుఁడేగాని, బ్రహ్మశప్తుఁడేగాని వానిని బరిత్యజింపక నిశ్శంకముగా నాపద్ధర్మము ననుసరించి యాఁడుది ప్రవర్తింపవలయును. ఓదేవా!

నీసెలవుచొప్పున స్త్రీధర్మము నెఱిఁగించితిని. ఎవ్వతె యిట్లు చరించునో యదియే పతివ్రత' అని పలికెను.

ఓయుధిష్ఠిరా! ఇటు లాయుమాదేవి పలుక విని యాగిరిపుత్రి వచనముల గౌరవించి, పిదప నమ్మహాదేవుఁడు తనయనుచరులతోఁ గూడఁ దక్కినవారినెల్ల సెలవిచ్చి పంపెను. పిదప భూతగణములును, నదులును, గంధర్వాప్సరోజనమును దమతమయిచ్చవచ్చినవిధముగా నాతనికి నమస్కరించి వెడలిపోయెను. పిమ్మట మహర్షులు శంకరు నిట్లు ప్రశ్నించిరి.

## ఋషులకు శివుఁడు హరిమాహాత్మ్యము నెఱిఁగించుట

'ఓమహాదేవా! సర్వలోకనమస్కృతా! నీవలన వాసుదేవమాహాత్మ్యమును వినఁగోరుచున్నారము' అని ప్రార్థించిరి. అది విని యాశంకరుఁడు 'ఓయీ! వాసుదేవుఁడు పితామహునికంటెఁ బరుఁడై శాశ్వతుఁడైనవాఁడు. అతఁడు బంగరుకాంతులు వెలయ, నిర్మేఘమగు నాకసమున నుదయించినసూర్యునట్టు లెంతయు నలరారుచు, దశబాహుండును మహాతేజుఁడునై, రాక్షసాంతకుఁడై, శ్రీవత్సాంకము వెలయ, సకలదైవతపూజ్యుఁడై వెలయుచున్నాఁడు. బ్రహ్మ యాతని యుదరమునుండియు, నే నాతనిశిరమునుండియు జనించితిమి. ఆతని శిరోరుహములనుండి నక్షత్రాదులును, రోమకూపములనుండి సురాసురులును జనించిరి. మఱియు మహర్షులును, శాశ్వతములగులోకములును నాతనిదేహమునుండి జనించినవి. పితామహునకును, సకలదేవతలకును నతఁడే స్థానము. సమస్తమగు నిప్పుడమికిని ద్రిభువనేశ్వరుఁడగు నతఁడే సృష్టికర్త. మఱియుఁ జరాచరములగుభూతములకు సంహర్తయు నాతఁడే. అతఁడే దేవోత్తముఁడును, దేవనాథుఁడును, బరంతపుఁడును, సర్వజ్ఞుఁడును, సర్వవ్యాపియు, సర్వతోముఖుఁడు నైనవాఁడు. పరమాత్ముఁడును, హృషీకేశుఁడును, సర్వగుఁడును, మహేశ్వరుఁడు నతఁడే. ముల్లోకములందును నాతనిమించినపరమభూత మొక్కటి లేదు. అతఁడు సనాతనుఁడును, మధుహంతయునై గోవిందుఁడని ప్రసిద్ధినొందెను. అతఁడే పార్థివులనెల్ల రణరంగమునఁ జంపించెడువాఁడు. దేవతలకార్యమునకుఁగా నతఁడు మానవదేహము నాశ్ర

యించెను. అతఁడు లేకుండిన దేవతలందఱు నసమర్థులు గావలసిన దే. సకలభూతనాయకుఁడును, సర్వదేవనమస్కృతుఁడు నతఁడే. దేవకార్యసక్తుఁడును, దేవనాథుఁడును, బ్రహ్మభూతుఁడును, దేవర్షిశరణ్యుఁడును నగు నాతనిశరీరమున గర్భస్థుఁడై బ్రహ్మ నివసించుచున్నాఁడు. ముఖస్థితుఁడై శర్వుఁడు సుఖముండెను. మఱియు నాతని దేహమున దేవతలందఱును సుఖితులై యున్నవారు. అతఁడు పుండరీకాక్షుఁడును, శ్రీగర్భుండును, శ్రీసహితుఁడు నై వెలయుచుండును. శార్ఙ్గచక్రాయుధుఁడును, నందకధారియు, గరుడధ్వజుఁడును, నై యతఁడు పవిత్రశీలముతోడను, శమదమములతోడను, పరాక్రమముతోడను, బలముతోడను, శరీరసౌందర్యపరిమాణములతోడను, ఋజుసంపదతోడను, రూపాకార్యములతోడను గూడి యొప్పుచుండును. అతఁడు సకలాస్త్రములతో జనించి, యద్భుతరూపుఁడై యోగమాయుఁడును, సహస్రాక్షుఁడును, మహాగంభీరుఁడును, నిరపాయుఁడును, వీరుఁడును, మిత్రజనశ్లాఘియు, బంధుజనాగ్రగామియు, శాంతియుతుఁడును, నసహంవాదియు, బ్రహ్మణ్యుఁడును, బ్రహ్మనాయకుఁడు నై వెలయుచున్నవాఁడు. మఱియు భయార్తులగువారి కభయ మొసఁగువాఁడును, మిత్రుల కానందదాయకుఁడును సర్వభూతశరణ్యుఁడును, దీనపరిపాలకుఁడును, శ్రుతవంతుఁడు, నర్థసంపన్నుఁడును, సర్వభూతనమస్కృతుఁడును, ధర్మవేత్తయు నై యాశ్రయించినశత్రువులనేని రక్షించువాఁడు. మఱియు నీతిజ్ఞుఁడును, నీతిశాలియు, బ్రహ్మవాదియు, జితేంద్రియుఁడును నగుచు నతఁడు దేవకార్య మొనరింపఁ బరమప్రీతితోఁ బ్రాజాపత్యమగుశుభమార్గమున ధర్మయుక్తమగుమానవవంశమున మఱియు జనించును. తొలుత మనుపుత్రుఁడగు నంగుఁడు, పిదప నంతర్ధాముఁడు నాతనికి హవిర్ధాముఁడును జనింతురు. ఆహవిర్ధామునకుఁ బ్రాచీనబర్హి యుదయించును. ఆతనికిఁ బ్రచేతః ప్రభృతులగు పదుగురుపుత్రులు జనింతురు. అందుఁ బ్రచేతునకు దక్షప్రజాపతి పుట్టును. పిదప దాక్షాయణివలన నాదిత్యుఁడును, నాతనివలన మనువు, వాని కిళాసుద్యుమ్నుఁడును జనింతురు. ఆసుద్యుమ్నునకు బుధుఁడు, వానికిఁ బురూరవుఁడు, వాని కాయువు గలుగుదురు. వానివలన

నహుషుఁడు, వానివలన యయాతి, వానికి యదువు, వానికిఁ గ్రోష్టయు జనింతురు. అతనికి వృజినీవంతుఁడు, నాతని కుషంగువు, నాతనికిఁ జిత్రరథుఁడు నుదయింతురు. వానికిఁ గనిష్ఠపుత్త్రుఁడై శూరుఁ డనువాఁడు జనించును. విఖ్యాతవీర్యులును, జరిత్రగుణశాలులును, యజ్వలును, విశుద్ధులు నగువారివంశము బ్రాహ్మణసమ్మతమై వెలయును. క్షత్త్రియోత్తముఁడై కీర్తినిధియు, మహావీర్యశాలియు నగునా శూరుఁడు నిజవంశవిస్తారకరుఁడగు వసుదేవుఁ డనువానిని గనును. ఆతనికిఁ జతుర్బాహుఁడై వాసుదేవుఁడు జనించును. ఆతఁడు దాతయు, బ్రాహ్మణసత్కర్తయు, బ్రహ్మభూతుఁడును, ద్విజప్రియుఁ డును నై మాగధపరాజితులై సంరుద్ధులైన రాజులను విడిపించును. మఱియు నతఁడు గిరిగహ్వరమున జరాసంధుఁ డనెడిరాజును జయించి, సకలరాజన్యశ్రేష్ఠుఁడై యెవ్వరికిని జయింపరాక విక్రమ సంపన్నుఁడును, సర్వపార్థివపార్థివుఁడు నై ప్రవర్తిల్లును. అతఁడు శూరసేనులలో నొకఁడై ద్వారకయందు నివసించుచుఁ, బుడమి నెల్ల జయించి భూపరిపాలకుఁ డగును. ఆతనిని మీరెల్ల నాశ్ర యించి శుభప్రదములగు నుత్తమవచనములచే నర్చించుచు, శాశ్వత బ్రహ్మమునట్లు భావింతురుగాక. ఎవ్వరేని నన్నును బ్రహ్మను దర్శింపఁ గోరుదురు. అట్టి మేమిరువురముఁ బ్రతాపశాలియగు నావాసుదేవుని దర్శింపఁగోరుదుము. అతఁడు చూడఁబడియెనేని నేను జూడఁబడితి ననియే తలంపవచ్చును. అందు నాకు సందియములేదు. అటులే యాతనిఁ జూచినఁ బితామహునిఁ గాంచినట్టు లగునని తెలియుఁడు. ఓతపోధనులారా! ఆపుండరీకాక్షుఁ డెవ్వనియెడఁ బ్రీతియుక్తుఁ డగునో, వానికి దేవగణమెల్లఁ బ్రసన్నమైయుండును. మానవలోక మున నెవ్వఁ డాకేశవు నాశ్రయించునో, వానికిఁ గీర్తియు, జయము, తపము, స్వర్గము నగుచున్నది. మఱియు నట్టివాఁడు ధర్మదేశికుఁడై ధర్మమొందును. ధర్మవేత్తలగువారెల్లరు నెల్లపుడు నాదైవేశునకు నమస్కరింపవలయును. ఆవిభుఁ డర్చితుఁడగునేని మిక్కిలి ధర్మమగు టలో సందియములేదు. మహాతేజుఁడగు నద్దేవుఁడు ప్రజాహిత మొనర్చువాఁడై ధర్మమును గోరి మహర్షికోటులను సృజించెను. ఆ

మహానీయునిచే గంధమాదనమున సృజింపఁబడిన సనత్కుమార ప్రభృతులగు నమ్మునులు తపోధనులై యున్నవారు. కావున నోద్విజపుంగవులారా! ధర్మజ్ఞుఁడగు నాతనికి నమస్కరింపుఁడు. భగవానుఁడగు నాతఁడు సాక్షాన్నారాయణుఁడగు హరియే. అతఁడు వందితుఁడై వందన మొనర్చును. మానితుఁడై మన్నన యొనర్చును. అర్చితుఁడై యర్చలొనర్చును. పూజితుఁడగునేని పూజించును. దర్శనముఁగోరు వారిదర్శనముఁ గోరును. ఆశ్రయించినవారి నాశ్రయించును. అనవద్యచరిత్రుఁడగు నావిష్ణున కిదియే పరమవ్రతము. ఆసనాతనుఁడు నిత్యమును దేవతలచేఁ బూజితుఁడై, వారికిఁ దగు నభయ మొసంగుచుండును. అతఁడెల్లపుడు ద్విజులకు మనోవాక్కర్మములచే నమస్కరింపఁదగియున్నవాఁడు. ప్రయత్నపురస్సరముగా నా దేవకీనందనుఁడు దర్శింపఁదగినవాఁడు. ఓమునిసత్తములారా! మీకు నే నీమార్గముఁ దెలిపితినిగదా! దానిని గనిపెట్టితిరేని దేవతలను గాంచినవారగుదురు. ఆదివరాహరూపుఁడును, సర్వలోకపితామహుఁడును, జగత్పతియు నగునాతని నిత్యము నేనును నమస్కరించుచున్నాఁడను. ఆతనియందు ముమ్మూర్తులును గాననగును. నా మొదలగు సకల దేవతలు నాతనియం దుండువారము. కైలాసతుల్యకాంతిభాసురుఁడై యాతని యన్న బలుఁడనుపేరితో వెలయును. ఆబలునకు సువర్ణమయమై మూఁడుతలలుగల తాలవృక్షము ధ్వజస్తంభమై యుండును. గొప్ప పడగలుగల పాములచే నాతనిశిరము వ్యాప్తమైయుండును అతఁడు తలంచినంతనే యస్త్రములును, శస్త్రములును బ్రత్యక్షములగును. అతఁ డనంతుఁడని ప్రఖ్యాతివహించును. ఆతని దర్శించి రమ్మని దేవత లాజ్ఞాపింపఁ, గశ్యపాత్మజుఁడగు సుపర్ణుఁడు ప్రయత్నించియు, నా దేవునియంతమును దెలియఁజాలఁడయ్యెను. తనపడగచేఁ బుడమిని బట్టికొని యతఁ డంతర్భాగముననుండును. శేషుఁడే యాబలరాముఁడై చరించును. ఆరాముఁడె హృషీకేశుఁడు, అహృషీకేశుఁడే యారాముఁడు. పురుషవ్యాఘ్రులై దివ్యులై దివ్యపరాక్రములై చక్రలాంగలధారులై మాననీయులగువారిరువురును దర్శింపఁదగినవారు. ఓతపోధనులారా! పవిత్రమగు నీవిషయము మీకెఱిఁగించితిని గదా!

యదుశ్రేష్ఠుఁడగు నాతని మీ రెల్లఁ బూజింపవలయును.' అని తెలిపె నని పలికి నారదుఁ డిట్లనియె.

కృష్ణునిమహిమను దెలుపుట

ఓ దేవా! అంతట నాకసమున, మెఱపులతోను, మేఘములతోను నొకగొప్పచప్పుడుప్పతిల్లెను. మబ్బులు గ్రమ్మి యాకసము నల్లనడియెను. అపుడు గాఢాంధకారము వ్యాపించి దిక్కులు గానరాకుండెను. అపుడు సనాతనమై, పవిత్రమై, మనోజ్ఞమగు నాదేవగిరిపై నాశంకరుఁడును భూతసంఘమును మునులకుఁ గానరాకుండెను. తత్క్షణమ యాకసము మేఘశూన్యమయ్యెను. అపుడు కొందఱు విప్రులు తీర్థయాత్రకై వెడలి, త్రోవగాఁ బోవుచు, నచింత్యమగు నయ్యద్భుతమును గాంచి విస్మితులై, నీకథ నాశ్రయించిన పార్వతీపరమేశ్వర సంచారమును విని యచ్చెరువడిరి. ఓపురుషవ్యాఘ్రా! నీవు సనాతనుఁడవును, బ్రహ్మభూతుఁడవును నై వెలయుచున్నాఁడవు. మహాత్ముఁడగు శంకరుఁడు నిన్ను భజింపుమనియే మాకు శాసించెను. అదియొక యద్భుతముగదా! నీవిపుడు నీతేజము చూపి రెండవయద్భుతము ప్రదర్శించితివి. దీనిని గాంచుట నది మాకు స్మృతిపథమునకు వచ్చెను. అదియే యాదేవదేవునిమాహాత్మ్యము.' అని తెలిపెను. ఓయుధిష్ఠిరా! తపోవనవాసులగు మహర్షు లిట్లు పలుక విని, వారినెల్ల నాదేవకీనందనుఁడు సమ్మానించెను. పిమ్మట నమ్మహర్షులు సంతుష్టాంతరంగులై మఱియు నమ్మధుసూదనుతో 'దేవా! నీవు మాకు మఱిమఱియు దర్శన మొసంగుచుండవలయును. నీదర్శనముచేఁ గలుగుసంతోష మా స్వర్గమందేని మాకుఁ గలుగనేరదు. ఓమహాబాహూ! భగవానుఁడగుభవుఁడు మాకుపదేశించినది సత్యమే. ఈ రహస్యమునెల్ల విన్నవించుకొన్నారము. అర్థతత్త్వజ్ఞుఁడవగు నీవే మాచేఁ బ్రశ్నింపఁబడి మమ్మే నీవడుగుటను నీకుఁ బ్రియమగునట్లుగా నిద్దానిని విన్నవించికొంటిమి. మూఁడులోకములందును నీకుఁ దెలియని దించుకేని గలుగదుగదా! మేమెంతయుఁ జపలులమగుట రహస్యధారణము సేయఁజాలము. అటులగుట నీవున్నపుడును లఘుబుద్ధిచే నేమేమో ప్రేలె

దము. నీ వెఱుఁగనియాశ్చర్య మిందేమియు లేదు. భూస్వర్గలోకములందుఁగల యెల్లవిషయము నీ వెఱిఁగినదియే. ఓకృష్ణా! మే మిఁకఁ బోవుదుము. పుష్టిని, బుద్ధిని బొందుదువుగాక. నీకుఁ బుత్త్రుఁడు గలిగి నీకుఁ దుల్యుఁడుగాని, నిన్నుమించినవాఁడుగాని యగును. అతఁడు మహాప్రభావయుక్తుఁడును, దీప్తిమంతుఁడును, గీర్తికరుఁడును, బ్రభుఁడు నగును' అని పలికిరి. ఓధర్మజా! పిమ్మటఁ బురుషోత్తముఁడును, యాదవేంద్రుఁడునగు నాదేవేశునకుఁ బ్రదక్షిణ నమస్కారము లొనర్చి యమ్మహర్షులు వెడలిపోయిరి. ఓధర్మజా! పరమతేజోనిధియగు నా నారాయణుఁడే యీశ్రీకృష్ణుఁడు. ఇతఁడవ్వ్రతమును విధ్యుక్తముగా నెరవేర్చి మరల ద్వారక కరుదెంచెను. పిదపఁ బదిమాసములు పూర్ణమైనతోడనే రుక్మిణియందుఁ బరమాద్భుతుఁడును, వంశకరుఁడును, శూరుఁడునగు పుత్త్రుఁ డుదయించెను. అట్టిమహనీయుఁడగు నితఁడు, సకలభూతములకు వరప్రదుఁడై, సర్వభాగవతుఁడై, సురాసురాంతర్గతుఁడై చరించుచున్నాఁడు. మేఘవర్ణుఁడును, జతుర్భుజుఁడునునగు నీపురుషశార్దూలుఁడు, శ్రితులై పాండవులగు మిమ్ము నాశ్రయించెను. త్రివిక్రముఁడు, విష్ణువు నగు నితఁ డెందుండునో యందుఁ గీర్తియు, లక్ష్మియు, ధృతియు స్వర్గమార్గము నగుట నిశ్చయము. ఇంద్రాదులగు ముప్పదిమూఁడుకోట్లదేవతలు నితఁడే యగుటలో సందియము లేదు. ఇతఁ డాదిదేవుఁడును, మహాదేవుఁడును, సకలభూతాశ్రయుఁడును, నాద్యంతరహితుఁడును, నవ్యక్తుఁడును, మహాత్ముఁడును, మధుసూదనుఁడును నై వెలయుచున్నాఁడు. మఱియు నితఁడు సురకార్యార్థియై మహాతేజము వెలయ నవతరించెను. దుస్తరార్థతత్త్వము నెఱిఁగించువాఁడును, దుస్తరార్థకర్తయునై నీకీజయము గలిగించెను. నీకు నిరుపమానకీర్తియు నీతనినుండియే కలిగెను. నీవీనారాయణు నాశ్రయించుటఁబట్టియే పృథివియెల్ల వశపడియెను. అచింత్యుఁడగు నీనారాయణుఁడే నీకుఁ బరమగతి. నీవు మహత్తరమైన, యుగాంతాగ్నితుల్యమైన యీశ్రీకృష్ణస్రువము నాధారము చేసికొని, యుపాధ్వర్యుఁడవై రణాగ్నిలో నృపులనెల్ల హోమము చేసితివి. ఈ సుయోధనుఁడు భ్రాతృపుత్త్రబంధుసహితముగా వివేకరహితుఁడై, కోపము

నాపికొానలేక హరికిరీటులతో విరోధమొనర్చి నశించెను. మహా కాయులు, మహాబలులునగు దైత్యదానవులుసైతము, దావాగ్నిలోఁ బడిన శలభములట్లు చక్రాగ్నిలోఁబడి క్షయమునొందిరిగదా ! సత్వ శక్తిబలాదివిహీనులగు మానవు లీతని రణరంగమున మార్కొని యుద్ధముచేయు టెట్లు ? యోగియు, యుగాంతాగ్నిసదృశుఁడును, జయప్రదుఁడు నగునితఁడు సవ్యసాచియు, రణాగ్రగతుఁడు నై తన తేజముచే సుయోధనుసైన్యమునెల్ల నశింపఁజేసెను. మున్నాహిమవ త్పార్శ్వమున నమ్మహర్షులకు శంకరుఁడు తెలిపినదియే నేను దెలిపె దను. తుష్టియుఁ, దేజము, వీర్యము, పరాక్రమము, ప్రభావము, సన్నతియు మున్నగునవి యాకృష్ణునందే గలవనియు, నతఁడు త్రిగుణ మయుఁడనియుఁ దన్మహాదేవుఁ డెఱిఁగించెను. అతనివచనము నన్యథా కరింప నెవ్వనికిని వలనుపడదు. శ్రీకృష్ణుఁ డెందుండునో యందు మిగులఁ బుష్టి గలిగెడిని. మే మీయుద్ధవిషయమున నస్వతంత్రులము. అల్ప మతులమగు మేము నిస్సారులము. తెలిసియే యవ్యయమగు మృత్యు మార్గము నాశ్రయించితిమి. నీవు ఋజుమతివై మొన్నొకప్రతిజ్ఞను జేసి, తత్ప్రతిజ్ఞాపాలనమునకై రాజవృత్తము నాశ్రయింపవైతివి. నీ వాత్మవధము నేని బహుమానించితివికాని చేసినప్రతిజ్ఞను దప్పవైతివి. కాలవశమై యీజనమెల్ల రణరంగమున నిట్లు నిహతమయ్యెను. మేమును గాలవశముగనే హతులమైతిమి. కాలమే పరమేశ్వరుఁడు. కాలజ్ఞుఁడగువాఁడు కాలస్పృష్టుఁడై శోకించుట పాడిగాదుగదా! కావున నీ వీజ్ఞాతివధమునకై శోకింపఁ బనిలేదు. నీవిఁక నిత్యము దుఃఖరహితుఁడవై ప్రవర్తిల్లుము. మహాత్ముఁడగు నిమ్మాధవునిమాహా త్మ్యమును నేను దెలుపఁగా వింటివిగదా ! సజ్జనగోచరమగునదియే యిందులకుఁ జాలియున్నది. వ్యాసవచనమును, నారదవచనమును విని, పూజ్యుఁడగు నిమ్మహాత్ముని ప్రభావమును నీ కెఱిఁగించితిని. ఎవ్వఁ డిప్పార్వతీపరమేశ్వరసంవాదమును విని జ్ఞప్తియం దుంచుకొానునో, మఱియుఁ బఠించునో వాని కెంతయు శ్రేయమయ్యెడిని. అటు లొాన ర్చినవానికి యథేప్సితములగు కామములెల్ల లభించును. మఱియు నట్టివాఁడు మరణించి స్వర్గమును సైతము నొాందుటలో సందియము లేదు. శ్రేయము గోరువాఁ డీజనార్దను నాశ్రయింపవలయును. అవ్య

యుఁడగు నితనినే విప్రులు సన్నుతింతురు. మహేశ్వరుఁడు తెలిపిన ధర్మములన్నియు, నీవు నిత్యము చిత్తమునం దుంచుము. అటులుంచి కొని న్యాయదండధరుఁడవై ప్రవర్తిల్లుదువేని, ప్రజాపాలనదక్షుఁడ వగు నీకు స్వర్గము తప్పక సిద్ధించెడిని. ధర్మయుక్తముగాఁ బ్రజలను బరిపాలింపుము. న్యాయదండమే సద్ధర్మమని చెప్పఁబడుచున్నది. పార్వతీ పరమేశ్వరులకు జరగిన ధర్మసహితమగు నీసంవాదము సజ్జనసన్నిధిని నేను దెలిపితిని. దీనిని వినినవాఁ డావృషభధ్వజు నర్చింపవలయును. అటులు శుద్ధభావముతో నాతని నారాధించినవాఁడు శ్రేయ మొందును. ఈనారదోపదేశమునుబట్టి ప్రవర్తింపుము. ఈయత్యద్భుతమగు వాసుదేవశంకరులవృత్తము పవిత్రమైనది. ఈకృష్ణుఁడు పదివేలవత్సరములు బదరికాశ్రమమున మన యీగాండీవధరునితోఁగూడి తపమొనర్చెను. ఈనారదవ్యాసమహర్షులవలన నీవాసుదేవధనంజయులు ముమ్మాఱు జంటలై ప్రవర్తిల్లువారని వినియున్నాఁడను. ఇమ్మహాబాహుఁ డగుపుండరీకాక్షుఁడు బాలుఁడై నప్పు డీజ్ఞాతులను గాపాడుటకై కంసునితోఁ బోరాడెను. ఓకౌంతేయా! ఈతనికృత్యము లపారము నెఱిఁగింపఁజాలరు. ఇతఁడు శాశ్వతుఁడు, పురాణపూరుషుఁడు నైనవాఁడు. నీకు నిత్యమగుశ్రేయము గలుగును. పురుషవ్యాఘ్రుఁడగు నితఁడు నీకు మిత్రుఁడై యుండ లోపమన నెట్టిది ? ఎవ్వనిమూలమున హయగజాదిసైన్యములతోఁగూడఁ బెక్కురు నశింతురో, దుర్మతియగు నట్టిసుయోధనునికై చింతిల్లెదను. ఆసుయోధనుఁడును, కర్ణుఁడును, శకునియు, దుశ్శాసనుఁడును గూడి కౌరవనాశనమునకుఁ గారణమయిరి" అని తెలిపెను.

ఓజనమేజయా! పురుషవర్యుఁడగు గాంగేయుఁ డిట్లు తెలుపఁగా, విని యమ్మహాత్ములనడుమ నాయుధిష్ఠిరుఁ డూరకుండెను. అది విని ధృతరాష్ట్రాదులగురాజులందఱును విస్మితులై, తమచిత్తముల నా శ్రీకృష్ణునిఁ బూజించి చేతులు మొగిడ్చిరి. అపుడు నారదాదులగు మహర్షులును నాభీష్మునివచన మాలించి యాతనిఁ బూజించిరి. భీష్మానుశిష్టమై పవిత్రమైన యిమ్మహాశ్చర్యమును దనతమ్ములతో ధర్మజుఁడును విని మఱియు నమ్మహాత్ము నిట్లు ప్రశ్నించెను.

## విష్ణుదివ్యసహస్రనామకథనము

ఓజనమేజయా! పావనములగు సకలధర్మములను విని యాధర్మజుఁడు మఱియు శాంతనవునిం గాంచి "ఓపితామహా! లోకమున నేకదైవత మెద్ది? పరాయణ మెయ్యది? ఏదైవతమును సన్నుతించుచుఁ బూజించుచు మానవులు శుభమునందుదురు? సకలధర్మములలో నేది యుత్తమధర్మమని నీయభిప్రాయము? దేనిని జపించి మానవుఁడు సంసారబంధమునుండి ముక్తుఁడగుచున్నాఁడు?" అని ప్రశ్నించెను.

అది విని యాశాంతనవుఁడు "ఓకౌంతేయాగ్రజా! జగత్ప్రభుఁడు, దేవదేవుఁడు, ననంతుఁడునగు పురుషోత్తము నామసహస్రము నెల్లపుడును జాగరూకుఁడై జపించుచు, భక్తి వెలయ, నవ్యయుఁడగు నాతనినే యర్చించుచు, నతనినే స్తుతించుచు, ధ్యానించుచు, నమస్కరించుచు, నతనినే పూజించుచు, ననాదినిధనుఁడును, సకలలోకేశ్వరుఁడు నగు నావిష్ణునే నిత్యముఁ బొగడుచుఁ, బ్రవర్తించినవాఁడు సకల విధదుఃఖముల దాఁటినవాఁడగుచున్నాఁడు. మఱియు లోకమున బ్రహ్మణ్యుఁడును, సర్వధర్మజ్ఞుఁడును, కీర్తివర్ధనుఁడును, లోకనాథుఁడును, మహద్భూతుఁడును, సకలభూతభవోద్భవుఁడు నగును. ఓ ధర్మజా! ఇదియే సకలధర్మములలో నుత్తమధర్మమని నాయభిప్రాయము. అటులగుట మానవుఁడు భక్తిమెయి నప్పుండరీకాక్షుని భజింప

శ్రీవైశంపాయన ఉవాచ:—శ్రుత్వా ధర్మానశేషేణ పావనాని చ సర్వశః, యుధిష్ఠిరశ్శాన్తనవం పునరేవాభ్యభాషత. ౧. యుధిష్ఠిర ఉవాచ:—కిమేకం దైవతం లోకే కిం వాఽప్యేకం పరాయణమ్, కం స్తువన్తః కమర్చన్తః ప్రాప్నుయుర్మానవాశ్శుభమ్. ౨. కో ధర్మస్సర్వధర్మాణాం భవతః పరమో మతః, కిం జపన్ముచ్యతే జన్తుర్జన్మసంసారబన్ధనాత్. ౩. శ్రీభీష్మ ఉవాచ:—జగత్ప్రభుం దేవదేవ మనన్తం పురుషోత్తమమ్, స్తువన్నామసహస్రేణ పురుషస్సతతోత్థితః. ౪. తమేవ చార్చయన్నిత్యం భక్త్యా పురుషమవ్యయమ్, ధ్యాయన్స్తువన్నమస్యంశ్చ యజమానస్తమేవ చ. ౫. అనాదినిధనం విష్ణుం సర్వలోకమహేశ్వరమ్, లోకాధ్యక్షం స్తువన్నిత్యం సర్వదుఃఖాతిగో భవేత్. ౬. బ్రహ్మణ్యం సర్వధర్మజ్ఞం లోకానాం కీర్తివర్ధనమ్, లోకనాథం మహద్భూతం సర్వభూతభవోద్భవమ్, ౭. ఏష మే సర్వధర్మాణాం ధర్మోఽధికతమో మతః, యద్భక్త్యా పుణ్డరీకాక్షం స్తవై రర్చే న్నరస్సదా. ౮. పరమం యో మహత్తేజః పరమం యో మహ

ఎవ్వఁడు మహాతేజమై, పరమై, మహాతపమై, మహత్తర పరాయణమై, పవిత్రములలోఁ బవిత్రమై, మంగళములలో మంగళమై, దైవతములలో దైవతమై, భూతముల కవ్యయమగుపితయై వెలయునో, యాదియుగారంభమున నెవ్వనినుండి సకలభూతములు నుదయించుచున్నవో, మఱియు యుగక్షయమున నెవ్వనియం దయ్యవి యడంగుచున్నవో, యట్టిలోకప్రధానుఁడును జగన్నాథుఁడు నగు విష్ణునినామసహస్రము పాపభయమును దొలఁగించునది. వాని నెఱిఁగించెదను వినుము. గుణమయములు విఖ్యాతములగు నమ్మహాత్ముని నామములను మహర్షులు పఠించియున్నవారు. వానిని మహర్షియగు వేదవ్యాసుఁడు అనుష్టుప్ఛందముగను, భగవానుఁడగు దేవకీసుతుఁడు దేవుఁడుగను, అమృతాంశూద్భవుఁడు బీజముగను, దేవకీనందనుఁడే శక్తిగను జేసి త్రిసామహృదయముగను నొనర్చి వినియోగించెను.

ఓం విశ్వము, విష్ణువు, వషట్కారము, భూతభవ్యభవత్ప్రభువు, ప్రభువు, భూతకర్త, భూతభృత్తు, భావము, భూతాత్ముఁడు, భూతభావనుఁడు, పూతాత్ముఁడు, పరమాత్ముఁడు, ముక్తపరమగతి, అవ్యయుఁడు, పురుషుఁడు, సాక్షి, క్షేత్రజ్ఞుఁడు, అక్షరుఁడు, యోగి, యోగవిన్నేత, ప్రధానపురుషేశ్వరరూపుఁడు, నారసింహమూర్తి,

---

త్తపః, పరమం యో మహద్బ్రహ్మ పరమం యః పరాయణమ్. ౯. పవిత్రాణాం పవిత్రం యో మఙ్గళానాం చ మఙ్గళమ్, దైవతం దేవతానాం చ భూతానాం యోఽవ్యయః పితా. ౧౦. యతస్సర్వాణి భూతాని భవన్త్యాదియుగాగమే, యస్మింశ్చ ప్రళయం యాన్తి పునరేవ యుగక్షయే. ౧౧. తస్య లోకప్రధానస్య జగన్నాథస్య భూపతే, విష్ణోర్నామసహస్రం మే శృణు పాపభయాపహమ్. ౧౨. యాని నామాని గౌణాని విఖ్యాతాని మహాత్మనః, ఋషిభిః పరిగీతాని తాని వక్ష్యామి భూతయే. ౧౩. విష్ణోర్నామసహస్రస్య వేదవ్యాసో మహామునిః, ఛన్దోఽనుష్టుప్తథా దేవో భగవాన్ దేవకీసుతః. ౧౪. అమృతాంశూద్భవో బీజం శక్తిర్దేవకినన్దనః, త్రిసామాహృదయం తస్య శాన్త్యర్థే వినియుజ్యతే. ౧౫. విశ్వం విష్ణుర్వషట్కారో భూతభవ్యభవత్ప్రభుః, భూతకృద్భూతభృద్భావో భూతాత్మా భూతభావనః ౧౬. పూతాత్మా పరమాత్మా చ ముక్తానాం పరమా గతిః, అవ్యయః పురుష స్సాక్షీ క్షేత్రజ్ఞోఽక్షర ఏవ చ. ౧౭. యోగో యోగవిదాం

శ్రీమంతుఁడు, కేశవుఁడు, పురుషోత్తముఁడు, సర్వుఁడు, శర్వుఁడు, శివుఁడు, స్థాణువు, భూతాది, నిధి, అక్షయుఁడు, సంభవుఁడు, భావనుఁడు, భర్త, ప్రభవుఁడు, ప్రభువు, ఈశ్వరుఁడు, స్వయంభువు, శంభువు, ఆదిత్యుఁడు, పుష్కరాక్షుఁడు, మహాస్వనుఁడు, అనాదినిధనుఁడు, ధాత, విధాత, ధాతువు, ఉత్తముఁడు, అప్రమేయుఁడు, హృషీకేశుఁడు, పద్మనాభుఁడు, అమరప్రభువు, విశ్వకర్మ, మనువు, త్వష్ట, స్థవిష్ఠుఁడు, స్థవిరుఁడు, ధ్రువుఁడు, అగ్రాహ్యుఁడు, శాశ్వతుఁడు, కృష్ణుఁడు, లోహితాక్షుఁడు, ప్రతర్దనుఁడు, ప్రభూతుఁడు, త్రికకుత్తు, ధామము, పవిత్రుఁడు, మంగళుఁడు, పరుఁడు, ఈశానుఁడు, ప్రాణదుఁడు, ప్రాణము, జ్యేష్ఠుఁడు, శ్రేష్ఠుఁడు, ప్రజాపతి, హిరణ్యగర్భుఁడు, భూగర్భుఁడు, మాధవుఁడు, మధుసూదనుఁడు, ఈశ్వరుఁడు, విక్రమి, ధన్వి, మేధావి, విక్రమము, క్రమము, అనుత్తముఁడు, దురాధర్షుఁడు, కృతజ్ఞుఁడు, కృతి, ఆత్మవంతుఁడు, సురేశుఁడు, శరణుఁడు, శర్మము, విశ్వరేతుఁడు, ప్రజాభవుఁడు, అహస్సు, సంవత్సరము, వ్యాళము, ప్రత్యయము, సర్వదర్శనుఁడు, అజుఁడు, సర్వేశ్వరుఁడు, సిద్ధి, సిద్ధుఁడు, సర్వాది, అచ్యుతుఁడు, వృషాకపి, అమేయాత్ముఁడు, సర్వయోగవినిస్సృతుఁడు, వసువు, వసుమనుఁడు, సత్యుఁడు, సమాత్ముఁడు, సమ్మితుఁడు, సముఁడు, అమోఘుఁడు, పుండరీకాక్షుఁడు, వృషకర్ముఁడు, వృషాకృతి,

---

నేతా ప్రధానపురుషేశ్వరః, నారసింహవపు శ్శ్రీమాన్ కేశవః పురుషోత్తమః. ౧౮. సర్వశ్శర్వశ్శివస్స్థాణుర్భూతాది ర్నిధిరవ్యయః, సమ్భవో భావనో భర్తా ప్రభవః ప్రభురీశ్వరః. ౧౯. స్వయమ్భూ శ్శమ్భురాదిత్యః పుష్కరాక్షో మహాస్వనః, అనాదినిధనో ధాతా విధాతా ధాతురుత్తమః. ౨౦. అప్రమేయో హృషీకేశః పద్మనాభోఽమర ప్రభుః, విశ్వకర్మా మను స్త్వష్టా స్థవిష్ఠస్స్థవిరో ధ్రువః. ౨౧. అగ్రాహ్య శ్శాశ్వతః కృష్ణో లోహితాక్షః ప్రతర్దనః, ప్రభూతస్త్రికకుద్ధామ పవిత్రం మఙ్గళం పరమ్. ౨౨. ఈశానః ప్రాణదః ప్రాణో జ్యేష్ఠ శ్శ్రేష్ఠః ప్రజాపతిః, హిరణ్యగర్భో భూగర్భో మాధవో మధుసూదనః. ౨౩. ఈశ్వరో విక్రమీ ధన్వీ మేధావీ విక్రమః క్రమః, అనుత్తమో దురాధర్షః కృతజ్ఞః కృతి రాత్మవాన్. ౨౪. సురేశ శ్శరణం శర్మ విశ్వరేతాః ప్రజాభవః, అహస్సంవత్సరో వ్యాళః ప్రత్యయ స్సర్వదర్శనః. ౨౫. అజస్సర్వేశ్వర స్సిద్ధస్సిద్ధిస్సర్వాదిరచ్యుతః, వృషాకపి రమేయాత్మా సర్వయోగ వినిస్సృతః. ౨౬. వసు ర్వసుమనా స్సత్య స్సమాత్మా సమ్మిత స్సమః, అమోఘః పుణ్డరీకాక్షో వృష

రుద్రుఁడు, బహుశిరుఁడు, బభ్రువు, విశ్వయోని, శుచిశ్రవుఁడు, అమృతుఁడు, శాశ్వతుఁడు, స్థాణువు, వరారోహుఁడు, మహాతపుఁడు, సర్వగుఁడు, సర్వవేత్త, భానువు, విష్వక్సేనుఁడు, జనార్దనుఁడు, వేదము, వేదవేత్త, అవ్యంగుఁడు, వేదాంగుఁడు, వేదవిత్తు, కవి, లోకాధ్యక్షుఁడు, సురాధ్యక్షుఁడు, ధర్మాధ్యక్షుఁడు, కృతాకృతుఁడు, చతురాత్ముఁడు, చతుర్వ్యూహుఁడు, చతుర్దంష్ట్రుఁడు, చతుర్భుజుఁడు, భ్రాజిష్ణువు, భోజనము, భోక్త, సహిష్ణువు, జగదాదిజుఁడు, అనఘుఁడు, విజయుఁడు, జేత, విశ్వయోని, పునర్వసువు, ఉపేంద్రుఁడు, వామనుఁడు, ప్రాంశువు, అమోఘుఁడు, శుచి, ఊర్జితుఁడు, అతీంద్రుఁడు, సంగ్రహము, సర్గము, ధృతాత్ముఁడు, నియమము, యమము, వేద్యుఁడు, వైద్యుఁడు, సదాయోగి, వీరహంత, మాధవుఁడు, మధుఁడు, అతీంద్రియుఁడు, మహామాయుఁడు, మహోత్సాహుఁడు, మహాబలుఁడు, మహాబుద్ధి, మహావీర్యుఁడు, మహాశక్తి, మహాద్యుతి, అనిర్దేశ్యవపువు, శ్రీమంతుఁడు, అమేయాత్ముఁడు, మహాద్రిధారి, మహేష్వాసుఁడు, మహీభర్త, శ్రీనివాసుఁడు, సజ్జనగతి, అనిరుద్ధుఁడు, సురానందుఁడు, గోవిందుఁడు, గోవిత్పతి, మరీచి, దమనుఁడు, హంసుఁడు, సుపర్ణుఁడు, భుజగోత్తముఁడు, హిరణ్యనాభుఁడు, సుతపుఁడు, పద్మనాభుఁడు, ప్రజాపతి, మృత్యురహితుఁడు, సర్వదర్శనుఁడు, సంధాత,

---

కర్తా వృషాకృతిః. ౨౭. రుద్రో బహుశిరా బభ్రు ర్విశ్వయోని శ్శుచిశ్రవాః, అమృత శ్శాశ్వతః స్థాణు ర్వరారోహో మహాతపాః. ౨౮. సర్వగ స్సర్వవిద్భాను ర్విష్వక్సేనో జనార్దనః, వేదో వేదవిదవ్యంగో వేదాంగో వేదవిత్కవిః. ౨౯. లోకాధ్యక్ష స్సురాధ్యక్షో ధర్మాధ్యక్షః కృతాకృతః, చతురాత్మా చతుర్వ్యూహశ్చతుర్దంష్ట్రశ్చతుర్భుజః. ౩౦. భ్రాజిష్ణు ర్భోజనం భోక్తా సహిష్ణు ర్జగదాదిజః, అనఘో విజయో జేతా విశ్వయోనిః పునర్వసుః. ౩౧. ఉపేన్ద్రో వామనః ప్రాంశు రమోఘ శ్శుచిరూర్జితః, అతీన్ద్ర స్సంగ్రహ స్సర్గో ధృతాత్మా నియమో యమః. ౩౨. వేద్యో వైద్య స్సదాయోగీ వీరహా మాధవో మధుః, అతీన్ద్రియో మహామాయో మహోత్సాహో మహాబలః. ౩౩. మహాబుద్ధి ర్మహావీర్యో మహాశక్తి ర్మహాద్యుతిః, అనిర్దేశ్యవపు శ్శ్రీమా నమేయాత్మా మహాద్రిధృత్. ౩౪. మహేష్వాసో మహీభర్తా శ్రీనివాస స్సతాంగతిః, అనిరుద్ధ స్సురానన్దో గోవిన్దో గోవిదాం పతిః. ౩౫. మరీచిర్దమనో హంస స్సుపర్ణో భుజగోత్తమః, హిరణ్యనాభ స్సుతపాః పద్మనాభః ప్రజాపతిః. ౩౬. అమృత్యుస్సర్వదృక్సింహ స్సన్ధాతా

సంధిమంతుఁడు, స్థిరుఁడు, అజుఁడు, దుర్మర్షణుఁడు, శాస్త, విశ్రుతాత్ముఁడు, సురారిహంత, గురువు, గురుతముఁడు, ధామము, సత్యము, సత్యపరాక్రముఁడు, నిమిషుఁడు, అనిమిషుఁడు, స్రగ్వి, వాచస్పతి, ఉదారధి, అగ్రణి, గ్రామణి, శ్రీమంతుఁడు, న్యాయము, నేత, సమీరణుఁడు, సహస్రమూర్ధుఁడు, విశ్వాత్ముఁడు, సహస్రాక్షుఁడు, సహస్రపాదుఁడు, ఆవర్తనుఁడు, నివృత్తాత్ముఁడు, సంవృతుఁడు, సంప్రమర్దనుఁడు, అహస్సంవర్తకుఁడు, వహ్ని, అనిలుఁడు, ధరణీధరుఁడు, సుప్రసాదుఁడు, ప్రసన్నాత్ముఁడు, విశ్వదృక్కు, విశ్వభుక్కు, విభువు, సత్కర్త, సత్కృతి, సాధువు, జహ్నువు, నారాయణుఁడు, నరుఁడు, అసంఖ్యేయుఁడు, అప్రమేయాత్ముఁడు, శిష్టుఁడు, విశిష్టుఁడు, శుచి, సిద్ధార్థుఁడు, సిద్ధసంకల్పుఁడు, సిద్ధిదుఁడు, సిద్ధిసాధనుఁడు, వృషాహి, వృషభుఁడు, విష్ణువు, వృషపర్వుఁడు, వృషోదరుఁడు, వర్ధనుఁడు, వర్ధమానుఁడు, వివిక్తుఁడు, శ్రుతిసాగరుఁడు, సుభుజుఁడు, దుర్ధరుఁడు, వాగ్మి, మహేంద్రుఁడు, వసుదుఁడు, వసువు, నైకరూపుఁడు, బృహద్రూపుఁడు, శిపివిష్టుఁడు, ప్రకాశనుఁడు ఓజము, తేజము, ద్యుతిధరుఁడు, ప్రకాశాత్ముఁడు, ప్రతాపనుఁడు, ఋద్ధుఁడు, స్పష్టాక్షరుఁడు, మంత్రము, చంద్రాంశువు, భాస్కరద్యుతి, అమృతాంశూద్భవుఁడు, భానువు, శశిబిందువు, సురేశ్వరుఁడు, ఔషధము, జగత్సేతువు, సత్యధర్మపరాక్రముఁడు,

---

సన్ధిమాన్ స్థిరః, అజో దుర్మర్షణ శ్శాస్తా విశ్రుతాత్మా సురారిహా. ౩౭. గురుర్గురుతమో ధామ సత్యస్సత్యపరాక్రమః, నిమిషోఽనిమిష స్స్రగ్వీ వాచస్పతి రుదారధీః. ౩౮. అగ్రణీర్గ్రామణీ శ్శ్రీమాన్న్యాయో నేతా సమీరణః, సహస్రమూర్ధా విశ్వాత్మా సహస్రాక్షస్సహస్రపాత్. ౩౯. ఆవర్తనో నివృత్తాత్మా సంవృత స్సంప్రమర్దనః, అహస్సంవర్తకో వహ్నిరనిలో ధరణీధరః. ౪౦. సుప్రసాదః ప్రసన్నాత్మా విశ్వధృగ్విశ్వభుగ్విభుః, సత్కర్తా సత్కృతస్సాధుర్జహ్ను ర్నారాయణో నరః. ౪౧. అసంఖ్యేయోఽప్రమేయాత్మా విశిష్టశ్శిష్టకృచ్ఛుచిః, సిద్ధార్థ స్సిద్ధసఙ్కల్ప స్సిద్ధిదస్సిద్ధిసాధనః. ౪౨. వృషాహీ వృషభో విష్ణుర్వృషపర్వా వృషోదరః, వర్ధనో వర్ధమానశ్చ వివిక్త శ్శ్రుతిసాగరః. ౪౩. సుభుజో దుర్ధరో వాగ్మీ మహేన్ద్రో వసుదో వసుః, నైకరూపో బృహద్రూపః శిపివిష్టః ప్రకాశనః. ౪౪. ఓజస్తేజోద్యుతిధరః ప్రకాశాత్మా ప్రతాపనః, ఋద్ధ స్స్పష్టాక్షరో మన్త్ర శ్చన్ద్రాంశు ర్భాస్కరద్యుతిః. ౪౫. అమృతాంశూద్భవో భానుః శశిబిన్దు స్సురేశ్వరః, ఔషధం జగత స్సేతు స్సత్యధర్మ

భూతభవ్యభవన్నాథుఁడు, పవనుఁడు, పావనుఁడు, అనలుఁడు, కామహంత, కామకర్త, కాంతుఁడు, కాముఁడు, కామప్రదుఁడు, ప్రభువు, యుగాదికర్త, యుగావర్తనుఁడు, అనేకమాయుఁడు, మహాశనుఁడు, అదృశ్యుఁడు, వ్యక్తరూపుఁడు, సహస్రజేత, అనంతజేత, ఇష్టుఁడు, విశిష్టుఁడు, శిష్టేష్టుఁడు, శిఖండి, నహుషుఁడు, వృషుఁడు, క్రోధహంత, క్రోధకర్త, కర్త, విశ్వబాహువు, మహీధరుఁడు, అచ్యుతుఁడు, ప్రథితుఁడు, ప్రాణము, ప్రాణదాత, వాసవానుజుఁడు, అపాంనిధి, అధిష్ఠానము, అప్రమత్తుఁడు, ప్రతిష్ఠితుఁడు, స్కందుఁడు, స్కందధరుఁడు, ధుర్యుఁడు, వరదుఁడు, వాయువాహనుఁడు, వాసుదేవుఁడు, బృహద్భానువు, ఆదిదేవుఁడు, పురందరుఁడు, అశోకుఁడు, తారణుఁడు, తరణము, శూరుఁడు, శౌరి, జనేశ్వరుఁడు, అనుకూలుఁడు, శతావర్తుఁడు, పద్మి, పద్మనిభేక్షణుఁడు, పద్మనాభుఁడు, అరవిందాక్షుఁడు, పద్మగర్భుఁడు, శరీరభర్త, మహర్ధి, ఋద్ధుఁడు, వృద్ధాత్ముఁడు, మహాక్షుఁడు, గరుడధ్వజుఁడు, అతులుఁడు, శరభుఁడు, భీముఁడు, సమయజ్ఞుఁడు, హవిస్సు, హరి, సర్వలక్షణలక్షణ్యుఁడు, లక్ష్మీవంతుఁడు, సమితింజయుఁడు, విక్షరుఁడు, రోహితుఁడు, మార్గము, హేతువు, దామోదరుఁడు, సహుఁడు, మహీధరరూపి, మహాభాగుఁడు, వేగవంతుఁడు, అమితాశనుఁడు, ఉద్భవుఁడు, క్షోభణుఁడు, దేవుఁడు, శ్రీగర్భుఁడు, పరమేశ్వరుఁడు, కరణము,

---

పరాక్రమః. ౪౬. భూతభవ్యభవన్నాథః పవనః పావనోఽనలః, కామహా కామకృత్కాన్తః కామః కామప్రదః ప్రభుః. ౪౭. యుగాదికృద్యుగావర్తో నైకమాయో మహాశనః, అదృశ్యో వ్యక్తరూపశ్చ సహస్రజిదనన్తజిత్. ౪౮. ఇష్టో విశిష్టశ్శిష్టేష్టః శిఖండీ నహుషో వృషః, క్రోధహా క్రోధకృత్కర్తా విశ్వబాహుర్మహీధరః. ౪౯. అచ్యుతః ప్రథితః ప్రాణః ప్రాణదో వాసవానుజః, అపాంనిధి రధిష్ఠాన మప్రమత్తః ప్రతిష్ఠితః. ౫౦. స్కన్దః స్కన్దధరో ధుర్యో వరదో వాయువాహనః, వాసుదేవో బృహద్భానురాదిదేవః పురన్దరః. ౫౧. అశోక స్తారణస్తారః శూర శ్శౌరి ర్జనేశ్వరః, అనుకూల శ్శతావర్తః పద్మీ పద్మనిభేక్షణః. ౫౨. పద్మనాభోఽరవిన్దాక్షః పద్మగర్భ శ్శరీరభృత్, మహర్ధిరృద్ధో వృద్ధాత్మా మహాక్షో గరుడధ్వజః. ౫౩. అతుల శ్శరభో భీమ స్సమయజ్ఞో హవిర్హరిః, సర్వలక్షణలక్షణ్యో లక్ష్మీవాన్ సమితింజయః. ౫౪. విక్షరో రోహితో మార్గో హేతు ర్దామోదర స్సహః, మహీధరో మహాభాగో వేగవానమితాశనః. ౫౫. ఉద్భవః క్షోభణో దేవః శ్రీగర్భః పరమేశ్వరః, కరణం కారణం

కారణము, కర్త, వికర్త, గహనుఁడు, గుహుఁడు, వ్యవసాయము, వ్యవస్థానుఁడు, సంస్థానుఁడు, స్థానదుఁడు, ధ్రువుఁడు, పరర్ధి, పరమస్పష్టుఁడు, తుష్టుఁడు, పుష్టుఁడు, శుభేక్షణుఁడు, రాముఁడు, విరాముఁడు, విరజుఁడు, మార్గము, నేయము, నయము, అనయము, వీరుఁడు, శక్తిమచ్ఛ్రేష్ఠుఁడు, ధర్మము, ధర్మవిదుత్తముఁడు, వైకుంఠుఁడు, పురుషుఁడు, ప్రాణము, ప్రాణదుఁడు, ప్రణవము, పృథువు, హిరణ్యగర్భుఁడు, శత్రుఘ్నుఁడు, వ్యాప్తుఁడు, వాయువు, అధోక్షజుఁడు, ఋతువు, సుదర్శనుఁడు, కాలుఁడు, పరమేష్ఠి, పరిగ్రహుఁడు, ఉగ్రుఁడు, సంవత్సరము, దక్షుఁడు, విశ్రాముఁడు, విశ్వదక్షిణుఁడు, విస్తారుఁడు, స్థావరుఁడు, స్థాణువు, ప్రమాణము, బీజము, అర్థము, అనర్థము, మహాకోశుఁడు, మహాభోగుఁడు, మహాధనుఁడు, అనిర్విణ్ణుఁడు, స్థవిష్ఠుఁడు, భూరూపి, ధర్మయూపుఁడు, మహామఖరూపి, నక్షత్రనేమి, నక్షత్రి, క్షముఁడు, క్షాముఁడు, సమీహనుఁడు, యజ్ఞము, ఇజ్యుఁడు, మహేజ్యుఁడు, క్రతువు, సత్రము, సద్గతి, సర్వదర్శి, విముక్తాత్ముఁడు, సర్వజ్ఞుఁడు, ఉత్తమజ్ఞానము, సువ్రతుఁడు, సుముఖుఁడు, సూక్ష్ముఁడు, సుఘోషుఁడు, సుఖదుఁడు, సుహృత్తు, మనోహరుఁడు, జితక్రోధుఁడు, వీరబాహుఁడు, విదారణుఁడు, స్వాపనుఁడు, స్వవశుఁడు, వ్యాపి, నైకాత్ముఁడు, అనేకకర్మకర్త, వత్సరుఁడు, వత్సలుఁడు, వత్సి, రత్నగర్భుఁడు,

---

కర్తా వికర్తా గహనో గుహః. ౫౬. వ్యవసాయో వ్యవస్థానః సంస్థానః స్థానదో ధ్రువః, పరర్ధిః పరమస్పష్ట స్తుష్ట పుష్ట శ్శుభేక్షణః. ౫౭. రామో విరామో విరజో మార్గో నేయో నయో౽నయః, వీరశ్శక్తిమతాం శ్రేష్ఠో ధర్మో ధర్మవిదుత్తమః. ౫౮. వైకుణ్ఠః పురుషః ప్రాణః ప్రాణదః ప్రణవః పృథుః, హిరణ్యగర్భశ్శత్రుఘ్నో వ్యాప్తో వాయు రధోక్షజః. ౫౯. ఋతు స్సుదర్శనః కాలః పరమేష్ఠీ పరిగ్రహః, ఉగ్ర స్సంవత్సరో దక్షో విశ్రామో విశ్వదక్షిణః. ౬౦. విస్తారః స్థావర స్స్థాణుః ప్రమాణం బీజమవ్యయమ్, అర్థో౽నర్థో మహాకోశో మహాభోగో మహాధనః. ౬౧. అనిర్విణ్ణ స్స్థవిష్ఠో భూర్ధర్మయూపో మహామఖః, నక్షత్రనేమి ర్నక్షత్రీ క్షమః క్షామస్సమీహనః. ౬౨. యజ్ఞ ఇజ్యో మహేజ్యశ్చ క్రతు స్సత్రం సతాంగతిః, సర్వదర్శీ విముక్తాత్మా సర్వజ్ఞో జ్ఞాన ముత్తమమ్. ౬౩. సువ్రత స్సుముఖస్సూక్ష్మః సుఘోష స్సుఖద స్సుహృత్, మనోహరో జితక్రోధో వీరబాహు ర్విదారణః. ౬౪. స్వాపనస్స్వవశో వ్యాపీ నైకాత్మా నైకకర్మకృత్, వత్సరో వత్సలో వత్సీ రత్నగర్భో ధనేశ్వరః. ౬౫. ధర్మగు బ్ధర్మకృద్ధర్మీ

ధనేశ్వరుఁడు, ధర్మగోపనుఁడు, ధర్మకర్త, ధర్మి, సత్తు, అసత్తు, క్షరుఁడు, అక్షరుఁడు, అవిజ్ఞాత, సహస్రాంశువు, విధాత, కృతలక్షణుఁడు, గభస్తినేమి, సత్త్వస్థుఁడు, సింహరూపి, భూతమహేశ్వరుఁడు, ఆదిదేవుఁడు, మహాదేవుఁడు, దేవేశుఁడు, దేవభర్త, గురుఁడు, ఉత్తరుఁడు, గోపతి, గోప్త, జ్ఞానగమ్యుఁడు, పురాతనుఁడు, శరీరి, భూతభర్త, భోక్త, కపీంద్రుఁడు, భూరిదక్షిణుఁడు, సోమపుఁడు, అమృతపుఁడు, సోముఁడు, పురుజిత్తు, పురుసత్తముఁడు, విజయుఁడు, జయుఁడు, సత్యసంధుఁడు, దాశార్హుఁడు, సాత్వతపతి, జీవుఁడు, వినయిత, సాక్షి, ముకుందుఁడు, అమితవిక్రముఁడు, అంభోనిధి, అనంతాత్ముఁడు, మహోదధిశయుఁడు, అంతకుఁడు, అజుఁడు, మహార్హుఁడు, స్వాభావ్యుఁడు ,జితామిత్రుఁడు, ప్రమోదనుఁడు, ఆనందనుఁడు, నందనుఁడు, నందుఁడు, సత్యధర్ముఁడు, త్రివిక్రముఁడు, మహర్షి, కపిలాచార్యుఁడు, కృతజ్ఞుఁడు, మేదినీపతి, త్రిపదుఁడు, త్రిదశాధ్యక్షుఁడు, మహాశృంగుఁడు, కృతాంతకర్త, మహావరాహుఁడు,గోవిందుఁడు, సుషేణుఁడు, కనకాంగది, గుహ్యుఁడు, గభీరుఁడు, గహనుఁడు, గుప్తుఁడు, చక్రగదాధరుఁడు,వేధ, స్వాంగుఁడు, అజితుఁడు, కృష్ణుఁడు, దృఢుఁడు, సంకర్షణుఁడు, అచ్యుతుఁడు, వరుణుఁడు, వారుణుఁడు, వృక్షరూపి, పుష్కరాక్షుఁడు, మహామనుఁడు, భగవానుఁడు, భగహంత, నంది, వనమాలి, హలాయుధుఁడు, ఆది

---

సదసత్క్షర మక్షరమ్, అవిజ్ఞాతా సహస్రాంశు ర్విధాతా కృతలక్షణః. ౧౬. గభస్తినేమి స్సత్త్వస్థస్సింహో భూతమహేశ్వరః, ఆదిదేవో మహాదేవో దేవేశో దేవభృద్గురుః. ౧౭. ఉత్తరో గోపతిర్గోప్తా జ్ఞానగమ్యః పురాతనః, శరీరభూతభృద్భోక్తా కపీన్ద్రో భూరిదక్షిణః. ౧౮. సోమపోఽమృతపస్సోమః పురుజిత్పురుసత్తమః, విజయో జయ స్సత్యసంధో దాశార్హ స్సాత్త్వతాంపతిః. ౧౯. జీవో వినయితా సాక్షీ ముకున్దోఽమిత విక్రమః, అమ్భోనిధి రనన్తాత్మా మహోదధిశయోఽన్తకః. ౨౦. అజో మహార్హ స్స్వాభావ్యో జితామిత్రః ప్రమోదనః, ఆనన్దో నన్దనో నన్దస్సత్యధర్మా త్రివిక్రమః. ౨౧. మహర్షిః కపిలాచార్యః కృతజ్ఞో మేదినీపతిః, త్రిపద స్త్రిదశాధ్యక్షో మహా శృంగః కృతాన్తకృత్. ౨౨ మహావరాహో గోవిన్ద స్సుషేణః కనకాఙ్గదీ, గుహ్యో గభీరో గహనో గుప్త శ్చక్రగదాధరః. ౨౩. వేధాస్స్వాఙ్గోఽజితఃకృష్ణో దృఢస్సఙ్కర్షణోఽచ్యుతః, వరుణో వారుణో వృక్షః పుష్కరాక్షో మహామనాః. ౨౪. భగవాన్ భగహాఽఽనన్దీ వనమాలీ హలాయుధః, ఆదిత్యో జ్యోతి రాదిత్య స్సహిష్ణు ర్గతిసత్తమః.

త్వుఁడు, జ్యోతిరాదిత్యుఁడు, సహిష్ణువు, గతిసత్తముఁడు, సుధన్వుఁడు, ఖండపరశువు, దారుణుఁడు, ద్రవిణప్రదుఁడు, దివస్పృక్కు, సర్వదృక్కు, వ్యాసుఁడు, వాచస్పతి, అయోనిజుఁడు, త్రిసాముఁడు, సామగుఁడు, సామము, నిర్వాణము, భేషజము, భిషక్కు, సంన్యాసకర్త, శమము, శాంతుఁడు, నిష్ఠ, శాంతి, పరాయణము, శుభాంగుఁడు, శాంతిదుఁడు, స్రష్ట, కుముదము, కువలేశయుఁడు, గోహితుఁడు, గోపతి, గోప్త, వృషభాక్షుఁడు, వృషప్రియుఁడు, అనివర్తి, నివృత్తాత్ముఁడు, సంక్షేప్త, క్షేమకర్త, శివుఁడు, శ్రీవత్సవక్షుఁడు, శ్రీవాసుఁడు, శ్రీపతి, శ్రీమద్వరుఁడు, శ్రీదుఁడు, శ్రీశుఁడు, శ్రీనివాసుఁడు, శ్రీనిధి, శ్రీవిభావనుఁడు, శ్రీధరుఁడు, శ్రీకరుఁడు, శ్రేయము, శ్రీమంతుఁడు, లోకత్రయాశ్రయుఁడు, స్వక్షుఁడు, స్వంగుఁడు, శతానందుఁడు, నంది, జ్యోతిర్గణేశ్వరుఁడు, విజితాత్ముఁడు, విధేయాత్ముఁడు, సత్కీర్తి, ఛిన్నసంశయుఁడు, ఉదీర్ణుఁడు, సర్వతశ్చక్షువు, అనీశుఁడు, శాశ్వతుఁడు, స్థిరుఁడు, భూశయుఁడు, భూషణుఁడు, భూతి, విశోకుఁడు, శోకనాశనుఁడు, అర్చిష్మంతుఁడు, అర్చితుఁడు, కుంభుఁడు, విశుద్ధాత్ముఁడు, విశోధనుఁడు, అనిరుద్ధుఁడు, అప్రతిరథుఁడు, ప్రద్యుమ్నుఁడు, అమితవిక్రముఁడు, కాలనేమిహంత, వీరుఁడు, శౌరి, శూరజనేశ్వరుఁడు, త్రిలోకాత్ముఁడు, త్రిలోకేశుఁడు, కేశవుఁడు, కేశిహంత, హరి, కామదేవుఁడు,

---

౭౫. సుధన్వా ఖణ్డపరశు ర్దారుణో ద్రవిణప్రదః, దివస్పృక్సర్వదృగ్వ్యాసో వాచస్పతిరయోనిజః. ౭౬. త్రిసామా సామగస్సామ నిర్వాణం భేషజం భిషక్, సన్న్యాసకృచ్ఛమశ్శాన్తో నిష్ఠాశాన్తిః పరాయణమ్. ౭౭. శుభాంగ శ్శాన్తిదస్స్రష్టా కుముదః కువలేశయః, గోహితో గోపతిర్గోప్తా వృషభాక్షో వృషప్రియః. ౭౮. అనివర్తీ నివృత్తాత్మా సంక్షేప్తా క్షేమకృచ్ఛివః, శ్రీవత్సవక్షా శ్రీవాస శ్రీపతి శ్రీమతాంవరః. ౭౯. శ్రీద శ్శ్రీశ శ్శ్రీనివాసః శ్రీనిధి శ్శ్రీవిభావనః, శ్రీధరః శ్రీకర శ్శ్రేయః శ్రీమాఞ్లోకత్రయాశ్రయః. ౮౦. స్వక్షస్స్వఙ్గశ్శతానన్దో నన్ది ర్జ్యోతిర్గణేశ్వరః, విజితాత్మా విధేయాత్మా సత్కీర్తి శ్ఛిన్నసంశయః. ౮౧. ఉదీర్ణ స్సర్వతశ్చక్షు రనీశ శ్శాశ్వత స్థిరః, భూశయో భూషణో భూతి ర్విశోక శ్శోకనాశనః. ౮౨. అర్చిష్మా నర్చితః కుమ్భో విశుద్ధాత్మా విశోధనః, అనిరుద్ధో౽ప్రతిరథః ప్రద్యుమ్నో౽మితవిక్రమః. ౮౩. కాలనేమినిహా వీర శ్శౌరి శ్శూరజనేశ్వరః, త్రిలోకాత్మా త్రిలోకేశః కేశవః కేశిహా

కామపాలుఁడు, కామి, కాంతుఁడు, కృతాగముఁడు, అనిర్దేశ్యవపువు, విష్ణువు, వీరుఁడు, అనంతుఁడు, ధనంజయుఁడు, బ్రహ్మణ్యుఁడు, బ్రహ్మకర్త, బ్రహ్మ, బ్రహ్మవివర్ధనుఁడు, బ్రహ్మవేత్త, బ్రాహ్మణుఁడు, బ్రహ్మి, బ్రహ్మజ్ఞుఁడు, బ్రాహ్మణప్రియుఁడు, మహాక్రముఁడు, మహాకర్ముఁడు, మహాతేజుఁడు, మహోరగుఁడు, మహాక్రతువు, మహాయజ్వ, మహాయజ్ఞుఁడు, మహాహవిస్సు, స్తవ్యుఁడు, స్తవప్రియుఁడు, స్తోత్రము, స్తుతి, స్తోత, రణప్రియుఁడు, పూర్ణుఁడు, పూరయిత, పుణ్యుఁడు, పుణ్యకీర్తి, అనామయుఁడు, మనోజవుఁడు, తీర్థకరుఁడు, వసురేతుఁడు, వసుప్రదుఁడు, వాసుదేవుఁడు, సర్వాసునిలయుఁడు, హవిస్సు, వసుప్రదుఁడు, దర్పహంత, దర్పదుఁడు, దృప్తుఁడు దుర్ధరుఁడు, అపరాజితుఁడు, విశ్వమూర్తి, మహామూర్తి, దీప్తమూర్తి, అమూర్తిమంతుఁడు, అనేకమూర్తి, అవ్యక్తుఁడు, శతమూర్తి, శతాననుఁడు, ఏకరూపి, అనేకరూపి, స్తవము కింయత్తత్పదవాచ్యుఁడు, లోకబంధువు, లోకనాథుఁడు, మాధవుఁడు, భక్తవత్సలుఁడు, సువర్ణవర్ణుఁడు, హేమాంగుఁడు, వరాంగుఁడు, చందనాంగది, వీరహంత, విషముఁడు, శూన్యుఁడు, ధృతకాముఁడు, అచలుఁడు, చలుఁడు, అమాని, మానదుఁడు, మాన్యుఁడు,

---

హరిః. ౭౪. కామదేవః కామపాలః కామీ కాన్తః కృతాగమః, అనిర్దేశ్యవపు ర్విష్ణుర్వీరోఽనన్తో ధనఞ్జయః. ౭౫. బ్రహ్మణ్యో బ్రహ్మకృద్బ్రహ్మా బ్రహ్మ బ్రహ్మవివర్ధనః, బ్రహ్మవిద్బ్రాహ్మణో బ్రహ్మీ బ్రహ్మజ్ఞో బ్రాహ్మణప్రియః. ౭౬. మహాక్రమో మహాకర్మా మహాతేజా మహోరగః, మహాక్రతు ర్మహాయజ్వా మహాయజ్ఞో మహాహవిః. ౭౭. స్తవ్యస్తవప్రియ స్స్తోత్రం స్తుతిస్స్తోతారణప్రియః, పూర్ణః పూరయితా పుణ్యః పుణ్యకీర్తిరనామయః. ౭౮. మనోజవ స్తీర్థకరో వసురేతా వసుప్రదః, వసుప్రదో వాసుదేవో వసు ర్వసుమనా హవిః. ౭౯. సద్గతి స్సత్కృతి స్సత్తా సద్భూతి స్సత్పరాయణః, శూరసేనో యదుశ్రేష్ఠ స్సన్నివాస స్సుయామునః. ౮౦. భూతావాసో వాసుదేవః సర్వాసు నిలయోఽనలః, దర్పహా దర్పదోఽదృప్తో దుర్ధరోఽథాపరాజితః. ౮౧. విశ్వమూర్తి ర్మహామూర్తి ర్దీప్తమూర్తి రమూర్తిమాన్, అనేకమూర్తి రవ్యక్త శ్శతమూర్తి శ్శతాననః. ౮౨. ఏకోనైక స్సవః కః కిం యత్తత్పదమనుత్తమమ్, లోకబన్ధు ర్లోకనాథో మాధవో భక్తవత్సలః. ౮౩. సువర్ణ వర్ణో హేమాఙ్గో వరాంగశ్చన్దనాఙ్గదీ, వీరహా విషమశ్శూన్యో ఘృతాశీ రచలశ్చలః. ౮౪. అమానీ మానదో మాన్యో

లోకస్వామి, త్రిలోకధర్త, సుమేధుఁడు, మేధజుఁడు, ధన్యుఁడు, సత్యమేధుఁడు, ధరాధరుఁడు, తేజము, వృషుఁడు, ద్యుతిధరుఁడు, సర్వశాస్త్రభృద్వరుఁడు, ప్రగ్రహుఁడు, నిగ్రహుఁడు, వ్యగ్రుఁడు, అనేకశృంగుఁడు, గదాగ్రజుఁడు, చతుర్మూర్తి, చతుర్బాహువు, చతుర్వ్యూహుఁడు, చతుర్గతి, చతురాత్ముఁడు, చతుర్భావుఁడు, చతుర్వేదవేత్త, ఏకపాదుఁడు, సమావర్తుఁడు, నివృత్తాత్ముఁడు, దుర్జయుఁడు, దురతిక్రముఁడు, దుర్లభుఁడు, దుర్గముఁడు, దుర్గుఁడు. దురావాసుఁడు, దురారిహంత, శుభాంగుఁడు, లోకసారంగుఁడు, సుతంతువు, తంతువర్ధనుఁడు, ఇంద్రకర్ముఁడు, మహాకర్ముఁడు, కృతకర్ముఁడు, కృతాగముఁడు, ఉద్భవుఁడు, సుందరుఁడు, సుందుఁడు, రత్ననాభుఁడు, సులోచనుఁడు, అర్కుఁడు, వాజసనుఁడు, శృంగి, జయంతుఁడు, సర్వవిజ్జయి, సువర్ణబిందువు, అక్షోభ్యుఁడు, సర్వవాగీశ్వరేశ్వరుఁడు, మహాహ్రదుఁడు, మహాగర్తుఁడు, మహాభూతుఁడు, మహానిధి, కుముదుఁడు, కుందరుఁడు, కుందుఁడు, పర్జన్యుఁడు, పవనుఁడు, అనిలుఁడు, అమృతాంశువు, అమృతవపువు, సర్వజ్ఞుఁడు, సర్వతోముఖుఁడు, సులభుఁడు, సువ్రతుఁడు, సిద్ధుఁడు, శత్రుజేత, శత్రుతాపనుఁడు, న్యగ్రోధము, ఉదుంబరము, అశ్వత్థము చాణూరాంధ్రనిషూదనుఁడు, సహస్రార్చి, సప్తజిహ్వుఁడు, సప్తైధుఁడు, సప్తవాహనుఁడు, అమూర్తి, అనఘుఁడు, అచింత్యుఁడు, భయకర్త,

---

లోకస్వామీ త్రిలోకధృత్, సుమేధా మేధజో ధన్య స్సత్యమేధా ధరాధరః. ౯౫. తేజోవృషో ద్యుతిధర స్సర్వశస్త్రభృతాంవరః, ప్రగ్రహో నిగ్రహో వ్యగ్రోనైకశృఙ్గో గదాగ్రజః. ౯౬. చతుర్మూర్తి శ్చతుర్బాహు శ్చతుర్వ్యూహ శ్చతుర్గతిః, చతురాత్మా చతుర్భావ శ్చతుర్వేదవిదేకపాత్. ౯౭. సమావర్తో నివృత్తాత్మా దుర్జయో దురతిక్రమః, దుర్లభో దుర్గమో దుర్గో దురావాసో దురారిహా. ౯౮. శుభాఙ్గో లోకసారఙ్గ స్సుతంతు స్తన్తువర్ధనః, ఇంద్రకర్మా మహాకర్మా కృతకర్మా కృతాగమః. ౯౯. ఉద్భవ స్సున్దర స్సుందో రత్ననాభ స్సులోచనః, అర్కో వాజసన శ్శృఙ్గీ జయన్త స్సర్వవిజ్జయీ. ౧౦౦. సువర్ణబిందు రక్షోభ్య స్సర్వవాగీశ్వరేశ్వరః, మహాహ్రదో మహాగర్తో మహాభూతో మహానిధిః. ౧౦౧. కుముదః కున్దరః కున్దః పర్జన్యః పావనోఽనిలః, అమృతాంశోఽమృతవపు స్సర్వజ్ఞ స్సర్వతోముఖః. ౧౦౨ సులభ స్సువ్రత స్సిద్ధ శ్శత్రుజి చ్ఛత్రుతాపనః, న్యగ్రోధో దుంబరోఽశ్వత్థ శ్చాణూరాంధ్రనిషూదనః. ౧౦౩. సహస్రార్చి స్సప్తజిహ్వ స్సప్తైధా స్సప్తవాహనః, అమూర్తి రనఘోఽచిన్త్యో భయకృద్భయ

భయనాశనుఁడు, అణువు, బృహత్తు, కృశుఁడు, స్థూలుఁడు, గుణ భృత్తు, నిర్గుణుఁడు, మహత్తగుఁడు, అధృతుఁడు, స్వధృతుఁడు, స్వాస్యుఁడు, ప్రాగ్వంశుఁడు, వంశవర్ధనుఁడు, భారభృత్తు, కథితుఁడు, యోగి, యోగీశుఁడు, సర్వకామదుఁడు, ఆశ్రమము, శ్రమణుఁడు, క్షామము, సుపర్ణుఁడు, వాయువాహనుఁడు, ధనుర్ధరుఁడు, ధనుర్వేదము, దండము, దమయింత, దమము, అపరాజితుఁడు, సర్వసహుఁడు, నియంత, నియమము, యమము, సత్త్వవంతుఁడు, సాత్త్వికుఁడు, సత్యము, సత్య ధర్మపరాయణుఁడు, అభిప్రాయము, ప్రియార్హుఁడు, అర్హుఁడు, ప్రియ కర్త, ప్రీతివర్ధనుఁడు, విహాయసగతి, జ్యోతిస్సు, సురుచి, హుతభుక్కు, విభుఁడు, రవి, విరోచనుఁడు, సూర్యుఁడు, సవిత, రవిలోచనుఁడు, అనంతుఁడు, హుతభుగ్భోక్త, సుఖదుఁడు, అనేకదుఁడు, అగ్రజుఁడు, అనిర్విణ్ణుఁడు, సదామర్షి, లోకాధిష్ఠానము, అద్భుతుఁడు, సనాత్సనా తనతముఁడు, కపిలుఁడు, కపి, అవ్యయుఁడు, స్వస్తిదుఁడు, స్వస్తికర్త, స్వస్తి, స్వస్తిభుక్కు, స్వస్తిదక్షిణుఁడు, అరౌద్రుఁడు, కుండలి, చక్రి, విక్రమి, ఊర్జితశాసనుఁడు, శబ్దాతిగుఁడు, శబ్దసహుఁడు, శిశిరుఁడు, శర్వరీకరుఁడు, అక్రూరుఁడు, పేశలుఁడు, దక్షుఁడు, దక్షిణుఁడు, క్షమి వరుఁడు, విద్వత్తముఁడు, వీతభయుఁడు, పుణ్యశ్రవణకీర్తనుఁడు, ఉత్తారణుఁడు, దుష్కృతిహంత, పుణ్యుఁడు, దుస్స్వప్ననాశనుఁడు,

---

నాశనః. ౧౦౪. అణుర్బృహత్కృశః స్థూలో గుణభృన్నిర్గుణో మహాన్, అధృతః స్వధృతస్స్వాస్యః ప్రాగ్వంశో వంశవర్ధనః. ౧౦౫. భారభృత్కథితో యోగీ యోగీశః సర్వకామదః, ఆశ్రమః శ్రమణః క్షామ స్సుపర్ణో వాయువాహనః. ౧౦౬. ధనుర్ధరో ధనుర్వేదో దణ్డో దమయితాదమః, అపరాజిత స్సర్వసహో నియన్తానియమో యమః. ౧౦౭. సత్త్వవాన్ సాత్త్విక స్సత్య స్సత్యధర్మపరాయణః, అభిప్రాయః ప్రియార్హో౽ర్హః ప్రియకృత్ప్రీతివర్ధనః. ౧౦౮. విహాయసగతిర్జ్యోతి స్సురుచి ర్హుత భుగ్విభుః, రవిర్విరోచనస్సూర్యః సవితా రవిలోచనః. ౧౦౯. అనన్తో హుతభుగ్భోక్తా సుఖదో నైకజో౽గ్రజః, అనిర్విణ్ణ స్సదామర్షీ లోకాధిష్ఠానమద్భుతమ్. ౧౧౦. సనా త్సనాతనతమః కపిలః కపిరవ్యయః, స్వస్తిద స్స్వస్తికృత్ స్వస్తి స్వస్తిభుక్ స్వస్తి దక్షిణః. ౧౧౧. అరౌద్రః కుణ్డలీ చక్రీ విక్రమ్యూర్జితశాసనః, శబ్దాతిగ శ్శబ్దసహ శ్శిశిర శ్శర్వరీకరః. ౧౧౨. అక్రూరః పేశలో దక్షో దక్షిణః క్షమిణాంవరః, విద్వ త్తమో వీతభయః పుణ్యశ్రవణకీర్తనః. ౧౧౩. ఉత్తారణో దుష్కృతిహా పుణ్యో

వీరహాంత, రక్షణుఁడు, సంతుఁడు, జీవనుఁడు, పర్యవస్థితుఁడు, అనంతరూపుఁడు, అనంతశ్రీ, జితమన్యుఁడు, భయాపహుఁడు, చతురశ్రుఁడు, గభీరాత్ముఁడు, దిక్కులు, విదిక్కులు, వ్యాదిక్కులు, అనాది, భూవు, భవస్సు, లక్ష్మి, సువీరుఁడు, రుచిరాంగదుఁడు, జననము, జనజన్మాది, భీముఁడు, భీమపరాక్రముఁడు, ఆధారనిలయుఁడు, ధాత, పుష్పహాసుఁడు, ప్రజాగరుఁడు, ఊర్ధ్వగుఁడు, సత్పథాచారుఁడు, ప్రాణదుఁడు, ప్రణవము, పణము, ప్రమాణము, ప్రాణనిలయుఁడు, ప్రాణభర్త, ప్రాణజీవనుఁడు, తత్త్వము, తత్త్వవేత్త, ఏకాత్ముఁడు, జన్మమృత్యుజరాతిగుఁడు, స్వస్తరువు, తారము, సవిత, ప్రపితామహుఁడు, యజ్ఞము, యజ్ఞపతి, యజ్వ, యజ్ఞాంగము, యజ్ఞవాహనుఁడు, యజ్ఞభర్త, యజ్ఞకర్త, యజ్ఞి, యజ్ఞభోక్త, యజ్ఞసాధనము, యజ్ఞాంతకర్త, యజ్ఞగుహ్యము, అన్నము, అన్నాదుఁడు, ఆత్మయోని, స్వయంజాతుఁడు, వైఖానుఁడు, సామగాయనుఁడు, దేవకీనందనుఁడు, స్రష్ట, క్షితీశుఁడు, పాపనాశనుఁడు, శంఖధారి, నందకి, చక్రి, శార్ఙ్గధన్వుఁడు, గదాధరుఁడు, రథాంగపాణి, అక్షోభ్యుఁడు, సర్వప్రహరణాయుధుఁడు అని.

ఓయుధిష్ఠిరా! మహాత్ముఁడగు కేశవుని కీర్తనీయమగు దివ్యసహస్రనామములఁ దెలిపితిని. ఈనామసహస్రము నెవ్వఁడు వినునో,

---

దుస్స్వప్ననాశనః, వీరహా రక్షణ స్సన్తో జీవనం పర్యవస్థితః. ౧౧౪. అనన్తరూపోఽనన్తశ్రీ ర్జితమన్యు ర్భయాపహః, చతురశ్రో గభీరాత్మా విదిశో వ్యాదిశో దిశః. ౧౧౫. అనాది ర్భూర్భువో లక్ష్మీ స్సువీరో రుచిరాంగదః, జననో జనజన్మాది ర్భీమో భీమపరాక్రమః. ౧౧౬. ఆధారనిలయో ధాతా పుష్పహాసః ప్రజాగరః, ఊర్ధ్వగ స్సత్పథాచారః ప్రాణదః ప్రణవః పణః. ౧౧౭. ప్రమాణం ప్రాణనిలయః ప్రాణభృత్ప్రాణజీవనః, తత్త్వం తత్త్వవిదేకాత్మా జన్మమృత్యుజరాతిగః. ౧౧౮. భూర్భువ స్స్వ స్తరుస్తార స్సవితా ప్రపితామహః, యజ్ఞో యజ్ఞపతి ర్యజ్వా యజ్ఞాంగో యజ్ఞవాహనః. ౧౧౯. యజ్ఞభృద్యజ్ఞకృద్యజ్ఞీ యజ్ఞభుగ్యజ్ఞసాధనః, యజ్ఞాన్తకృద్యజ్ఞగుహ్య మన్న మన్నాద ఏవ చ. ౧౨౦. ఆత్మయోని స్స్వయంజాతో వైఖాన స్సామగాయనః, దేవకీ నన్దన స్స్రష్టా క్షితీశః పాపనాశనః. ౧౨౧. శఙ్ఖభృన్నన్దకీ చక్రీ శార్ఙ్గధన్వా గదాధరః, రథాంగపాణి రక్షోభ్య స్సర్వప్రహరణాయుధః. ౧౨౨. ఇతీదం కీర్తనీయస్య కేశ

మఱియు నెవ్వఁడు కీర్తించునో, వాఁడు తప్పక యిహపరముల శుభము వడయును. ఈనామసహస్రమును బఠించిన బ్రాహ్మణుఁడు వేదాంతగుఁడును, క్షత్రియుఁడు జయశాలియు, వైశ్యుఁడు ధనసమృద్ధుఁడును, శూద్రుఁడు సుఖియు నగుదురు. ధర్మార్థియగువాఁడు ధర్మమును, నర్థార్థి యర్థమును, గాముకుఁడు కామములను, బ్రజార్థి సంతానమును బొందఁగలుగుదురు. ఎవ్వఁడేని నిత్యము ప్రయత్నించి భక్తిశాలియై, పవిత్రుఁడై, తద్గతచిత్తుఁడై తద్వాసుదేవనామసహస్రమును బఠించునో, వాఁడు విపులమగుకీర్తిని, బ్రాధాన్యమును బొందుచున్నాఁడు. మఱియు నట్టివానికి స్థిరమగులక్ష్మియు, నుత్తమమగు శ్రేయమును గలుగును. వాని కెన్నఁడును భయము గలుగదు. తేజోవీర్యములు గల్గును. వాఁ డారోగ్యశాలియుఁ, గాంతిమంతుఁడును, బలరూపగుణాన్వితుఁడును నై వెలయును. రోగార్తుఁ డీనామసహస్రమును బఠించిన రోగవిముక్తుఁ డగును. బద్ధుఁడు బంధవిముక్తుఁ డగును. భీతుఁడు భయవిముక్తుఁ డగును. ఆపన్నుఁ డాపద్విముక్తుఁ డగును. భక్తియుక్తుఁడై యప్పురుషోత్తముని నిత్యము నామసహస్రముచే సన్నుతించువాఁ డెట్టికష్టములనేని తరింపఁగలుగును. వాసుదేవాశ్రయుఁడును, వాసుదేవపరాయణుఁడునగు మానవుఁడు, సకల

---

వస్య మహాత్మనః, నామ్నాం సహస్రం దివ్యానామశేషేణ ప్రకీర్తితమ్ ౧౨౩. య ఇదం శృణుయాన్నిత్యం యశ్చాపి పరికీర్తయేత్, నాశుభం ప్రాప్నుయాత్కించి త్సోఽముత్రేహ చ మానవః. ౧౨౪. వేదాన్తగో బ్రాహ్మణస్స్యాత్ క్షత్రియో విజయీ భవేత్, వైశ్యో ధనసమృద్ధస్స్యాచ్ఛూద్రస్సుఖమవాప్నుయాత్. ౧౨౫. ధర్మార్థీ ప్రాప్నుయాద్ధర్మ మర్థార్థీ చార్థమాప్నుయాత్, కామానవాప్నుయాత్కామీ ప్రజార్థీ చాప్నుయాత్ప్రజాః. ౧౨౬. భక్తిమాన్ యస్సదోత్థాయ శుచి స్తద్గతమానసః, సహస్రం వాసుదేవస్య నామ్నా మేత త్ప్రకీర్తయేత్. ౧౨౭. యశః ప్రాప్నోతి విపులం యాతి ప్రాధాన్య మేవ చ, అచలాం శ్రియ మాప్నోతి శ్రేయః ప్రాప్నో త్యనుత్తమమ్. ౧౨౮. న భయం క్వచి దాప్నోతి వీర్యం తేజశ్చ విన్దతి, భవ త్యరోగో ద్యుతిమా న్బలరూపగుణాన్వితః. ౧౨౯. రోగార్తో ముచ్యతే రోగా ద్బద్ధో ముచ్యేత బన్ధనాత్, భయా న్ముచ్యేత భీతస్తు ముచ్యేతాపన్న ఆపదః. ౧౩౦. దుర్గాణ్యతితర త్యాశు పురుషః పురుషోత్తమమ్, స్తువన్నామసహస్రేణ నిత్యం భక్తిసమన్వితః. ౧౩౧ వాసుదేవాశ్రయో మర్త్యో వాసుదేవపరాయణః, సర్వపాపవిశుద్ధాత్మా యాతి బ్రహ్మ

పాపవిముక్తుఁడై శుద్ధాత్ముఁడై సనాతనబ్రహ్మము నొందుచున్నాఁడు. వాసుదేవభక్తులగువారి కెన్నఁడు, నశుభము గలుగ నేరదు. అట్టి వారికి జన్మమృత్యు జరావ్యాధిభయములును గలుగవు. శ్రద్ధాభక్తులు గలిగి, యీ స్తవమును బఠించినవాఁడు, ఆత్మసుఖ, క్షాంతి, శ్రీ, ధృతి, స్మృతి, కీర్తుల నొందును. పురుషోత్తమభక్తులైన పుణ్యవంతులకుఁ గ్రోధము, మాత్సర్యము, లోభము, అశుభమతియుఁ గలుగ నేరవు. స్వర్గము, సూర్యచంద్రులు, నక్షత్రములు, ఆకసము, దిక్కులు, భూమి, మహోదధి వాసుదేవుని పరాక్రమముచే నిలుపఁబడు చున్నవి. ఆశ్రీకృష్ణునకు సురాసురగంధర్వయక్షోరగరాక్షసులతోఁ గూడిన చరాచరమగు నీజగమెల్ల వశమైయున్నది. మఱియు నింద్రియములు, మనస్సు, బుద్ధి, సత్వము, తేజము, బలము, ధృతి, క్షేత్రము, క్షేత్రజ్ఞుఁడు వాసుదేవాత్మకములని తెలుపుదురు. సకలాగమాచారమే మొదటిదిగాఁ గల్పింపఁబడుచున్నది. ఆచారప్రభవమే ధర్మము. ఆధర్మమున కచ్యుతుఁడు, ప్రభువు. మహర్షులు, పితరులు, దేవతలు, మహాభూతములు, ధాతువులు, చరాచరములు, శ్రీమన్నారాయణుని వలననే యుద్భవించినవి. అటుల యోగము, జ్ఞానము, సాంఖ్యము, విద్యలు, శిల్పాదికర్మములు, వేదములు, శాస్త్రములు, సకలవిజ్ఞానమును జనార్దనునుండియే యగుచున్నవి. విష్ణు వొక్కఁడే మహత్తర భూతము.

---

సనాతనమ్. ౧౩౨. న వాసుదేవభక్తానామశుభం విద్యతే క్వచిత్, జన్మమృత్యుజరా వ్యాధి భయం నా ప్యుపజాయతే. ౧౩౩. ఇమం స్తవమధీయానః శ్రద్ధాభక్తిసమ న్వితః, యుజ్యేతాత్మసుఖక్షాన్తిశ్రీధృతి స్మృతికీర్తిభిః. ౧౩౪. న క్రోధో న చ మాత్సర్యం న లోభో నాశుభా మతిః, భవన్తి కృతపుణ్యానాం భక్తానాం పురు షోత్తమే. ౧౩౫. ద్యౌ స్సచన్ద్రార్కనక్షత్రం ఖం దిశో భూర్మహోదధిః, వాసుదేవస్య వీర్యేణ విధృతాని మహాత్మనః. ౧౩౬. ససురాసురగన్ధర్వం సయక్షోరగరాక్షసమ్, జగ ద్వశే వర్తతేదం కృష్ణస్య సచరాచరమ్. ౧౩౭. ఇంద్రియాణి మనో బుద్ధి స్సత్త్వం తేజో బలం ధృతిః, వాసుదేవాత్మకాన్యాహుః క్షేత్రం క్షేత్రజ్ఞ ఏవ చ. ౧౩౮. సర్వాగమానామాచారః ప్రథమం పరికల్పితః, ఆచారప్రభవో ధర్మో ధర్మస్య ప్రభు రచ్యుతః. ౧౩౯. ఋషయః పితరో దేవా మహాభూతాని ధాతవః, జఙ్గమాజఙ్గమం చేదం జగన్నారాయణోద్భవమ్. ౧౪౦. యోగో జ్ఞానం తథా సాఙ్ఖ్యం విద్యా శ్శిల్పాదికర్మ చ, వేదాశ్శాస్త్రాణి విజ్ఞానమేతత్సర్వం జనార్దనాత్. ౧౪౧. ఏకో విష్ణు

వేఱుభూతములు పెక్కుగా నుండును. అవ్యయుఁడగునతఁ డొక్కఁడే మూఁడులోకములను వ్యాపించి సకలభూతాత్ముఁడై యనుభవించుచున్నాఁడు. వ్యాసకీర్తితమగు నీవిష్ణుస్తవము నెవ్వఁడు పఠింపఁ గోరునో, వాఁడు శ్రేయమును సుఖములను బొందుచున్నాఁడు. జగత్ప్రభువుఁడు, నవ్యయుఁడు, విశ్వేశ్వరుఁడు, దేవుఁడు, అజుఁడు నగు పద్మాక్షు నెవ్వరు భజింతురో, వారి కెట్టిపరాభవమును గలుగనేరదు." అని తెలుప విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె.

## సావిత్రీవ్రతకథనము

"ఓపితామహా! సర్వశాస్త్రవిశారదా! మహాప్రాజ్ఞా! జప్యమగు దేనిని నిత్యము జపించిన, మహత్తరధర్మఫలమగును? మఱియుఁ బ్రస్థానమందుగాని, ప్రవేశమందుఁగాని మఱియే దేని కర్మమునఁగాని, దైవపైతృకకర్మములందుఁగాని కర్మసాధనమగుజప్య మెద్ది? మఱియు శాంతికము, పౌష్టికము, రక్షాకరము, శత్రుఘ్నము, భయనాశనము, బ్రహ్మసమ్మితము, నగుజప్య మెద్ది? అట్టిదానిని నా కెఱిఁగింపుము"

అది విని శాంతనవుఁడు, "ఓయుధిష్ఠిరా! వ్యాసప్రోక్తమగు నీమంత్రము నేకాగ్రచిత్తుఁడవై వినుము. అయ్యది సావిత్రిచే విహితమై, దివ్యమై సద్యః పాపవిమోచనమైనది. తన్మంత్రవిధినంతయుఁ దెలిపెదను. దానిని వినినవాఁడు సకలపాపవిముక్తుఁ డగుచున్నాఁడు. ఓ ధర్మజా! దీనిని బ్రతిదినము జపించెనేని పాపలేప మొందదు. దానిని వినిన వాఁడాయుష్మంతుఁడును, సిద్ధార్థుఁడునై మరణించియు నుత్తమగతినొందును. రాజర్షిసత్తములు, క్షత్రధర్మపరులును, సత్యవ్రతపరాయణులును నగుచు, నిత్యము జాగరూకతతో దీని నాహ్నికముగాఁ జేయుచు, నుత్తమశ్రీపాత్రు లగుచున్నారు. మహావ్రతుఁ డగు వసిష్ఠునకు నమస్కరించి, వేదనిధియగుపరాశరునకు మ్రొక్కి తెలిపెదను.

---

ర్మహాద్భూతం పృథగ్భూతాన్యనేకశః, త్రీఁల్లోకాన్ వ్యాప్య భూతాత్మా భుఙ్క్తే విశ్వభుగవ్యయః. ౧౪౨. ఇమం స్తవం భగవతో విష్ణోర్వ్యాసేన కీర్తితమ్, పఠేద్య ఇచ్ఛేత్పురుషః శ్రేయః ప్రాప్తుం సుఖాని చ. ౧౪౩. విశ్వేశ్వరమజం దేవం జగతః ప్రభుమవ్యయమ్. భజన్తియే పుష్కరాక్షం న తే యాన్తి పరాభవమ్. ౧౪౪.

శ్రీ విష్ణుసహస్రనామస్తోత్రం సమాప్తమ్.

మహోరగమగు ననంతునకు నమస్కారము. అక్షయులగు సిద్ధులకు నమస్కారము. మహర్షులకు నమస్కారము. పరములకుఁ బరుఁడును, దేవతలకు దేవుఁడును, వరులకు వరదుఁడును నగువానికి నమస్కారము. సహస్రశీర్షుఁడును, సహస్రనాముఁడును, శివుఁడునగు జనార్దనునకు నమస్కారము. అజుఁడు, ఏకపాదుఁడు, అహిర్బుధ్న్యుఁడు, పినాకి, అపరాజితుఁడు, ఋతుఁడు, త్ర్యంబకుఁడు, వృషాకపి, శంభుఁడు, హవనుఁడు, ఈశానుఁడు అని త్రిభువనేశ్వరులగు రుద్రులు పదునొకొండుగురు. శతరుద్రీయమున రుద్రులు నూర్వురుగాఁ దెలుపఁబడిరి. అంశుఁడు, భగుఁడు, మిత్రుఁడు, వరుణుఁడు, ధాత, అర్యముఁడు, జయంతుఁడు, భాస్కరుఁడు, త్వష్ట, పూషుఁడు, ఇంద్రుఁడు, విష్ణువు, అని కాశ్యపేయులగు నాదిత్యులు పండ్రెండుగురు. ధరుఁడు, ధ్రువుఁడు, సోముఁడు, సావిత్రుఁడు, అనిలుఁడు, అనలుఁడు, ప్రత్యూషుఁడు, ప్రభాసుఁడు అని వసువులు ఎనమండ్రు. నాసత్యుఁడు దస్రుఁడు అని యశ్వినీదేవత లిరువురు. వీరిరువురును మార్తాండుని యశ్వరూపముగు నాసికనుండి వెడలినవారు. లోకులకర్మములకు సాక్షులైనవారిని గూర్చి తెలిపెదను. యజ్ఞమును, దత్తమును, సుకృతమును దెలిసికొనుచు, సకలభూతములందును నదృశ్యులై త్రిదశేశ్వరులు గనుఁగొనుచుందురు. మఱియు మృత్యువు కాలము, మానవులశుభాశుభకర్మములఁ గనుగొనుచుండును. విశ్వేదేవులు, పితృగణములు, తపోధనులగు మునులు, తపోమోక్షపరాయణులగు సిద్ధులును కీర్తిమంతులగు మానవులకు శుభ మొసంగుచుందురు. సకలసత్కర్మప్రయతులగువారు తమదివ్యతేజముచేఁ బ్రజాపతికృతములగు లోకములందు నివసించుచున్నారు. ప్రాణముల కీశ్వరులగు నాయీ తెలిపిన దేవతలను కీర్తించినమానవుఁడు ధర్మార్థకామములతో నిత్యము పరిపూర్ణుఁ డగుచున్నాఁడు. మఱియు వానికి విశ్వేశ్వరకృతములగు లోకములును లభించును. సకలభూతగణేశ్వరులగు దేవతలు ముప్పదిమూఁడుకోట్లు. మహాకాయుఁడగు నందీశ్వరుఁడు, గ్రామణియగు వృషభధ్వజుఁడు, సర్వలోకేశ్వరులగు గణేశ్వర, వినాయక, సౌమ్య, రౌద్రగణములవారును, యోగభూతగణములవారును, నక్షత్రములు, నదులు, వ్యోమము, పతగేశ్వరుఁ డగు గరుడుఁడు, పుడమిఁగల తపస్సిద్ధులును,

జరాచరములును, హిమవంతుఁడును, సకలపర్వతములును, నాలుగు సముద్రములును, భవతుల్యపరాక్రములగు శివానుచరులును, విష్ణుదేవుఁడును, జిష్ణువగు స్కందుఁడు మున్నగు వారినెల్లఁ గీర్తించినవాఁడు సర్వపాపవిముక్తుఁ డగును. ఇఁక మానవు లగుమహర్షులను దెలిపెదను వినుము. యువక్రీతుఁడు, రైభ్యుఁడు, ఔషిజుఁడగు కక్షీవంతుఁడు, భృగ్వంగిరుఁడు, కణ్వుఁడు, మేధాతిథి, బర్హి అనుగుణసంపన్నులగు వీరు తూర్పుదిక్కు నాశ్రయించి యున్నవారు. లోకభావనులగువీరు రుద్రానలసమప్రభులై భూలోకమున శుభకర్మము లొనర్చి, స్వర్గమున దైవతములతో సంతసించుచు సుఖించుచున్నారు. వీ రేడ్వురును మహేంద్రునకు గురువులు. వీరిని గీర్తించినవాఁ డింద్రలోకమున మహాత్తరుఁ డగుచున్నాఁడు. ఉన్ముచుఁడు, ప్రముచుఁడు, స్వస్త్యాత్రేయుఁడు, దృఢవ్యుఁడు, ఊర్ధ్వబాహువు, తృణసోమాంగిరుఁడు, మిత్రావరుణపుత్రుఁ డగునగస్త్యుఁడును, యమునిగురువు లగుమహర్షులు వీ రేడ్వురును దక్షిణదిక్కు నాశ్రయించి, యున్నవారు. దృఢేయుఁడు, ఋతేయుఁడు, పరివ్యాధుఁడు, ఏకతుఁడు, ద్వితుఁడు, త్రితుఁడు, అత్రిపుత్రుఁ డగుసారస్వతుఁడు వరుణుని యాజ్ఞికులు. వీరు పశ్చిమదిక్కు నాశ్రయించియున్నవారు. అత్రి, భగవానుఁ డగువసిష్ఠుఁడు, కశ్యపుఁడు, గౌతముఁడు, భరద్వాజుఁడు, కౌశికుఁ డగువిశ్వామిత్రుఁడు, ఋచీకపుత్రుఁ డగుజమదగ్ని కుబేరుని ఋత్విజులు వీరుత్తరదిక్కు నాశ్రయించియున్నవారు. మఱికొందఱు, మునులు సకలదిశల నాశ్రయించి యున్నవారు. లోకభావనులగువీరు కీర్తితులై, మానవులకుఁ గీర్తిశ్రేయముల నొసంగుదురు. ధర్ముఁడు, కాముఁడు, వసువు, వాసుకి, అనంతుఁడు, కపిలుఁడును ధరణిని ధరించుచున్నారు. దిక్పాలకులు కీర్తితులై శాంతిని, శ్రేయమును గూర్తురు. మానవు లేయేదిక్కున నుండువారిని గీర్తింతురో, యాయాదిక్కున కభిముఖులై వారిని శరణ మొందవలయును. రాముఁడు, వ్యాసుఁడు, ద్రోణపుత్రుఁ డగు నశ్వత్థామయు, లోమశుఁడును దివ్యమునులు. వీరి నొక్కొక్కరి నేడు మాఱులు కీర్తింపవలయును. సర్వభూతస్రష్టలు, లోకపావనులు నగు సంవర్త మేరుసావర్ణ మార్కండేయులు కీర్తింపఁబడుదు రేని శ్రేయ మొసంగుదురు. సాంఖ్యయోగులైన నారదదుర్వాసు లత్యంతతపస్వి

లును, దాంతులు నై లోకమునఁ బ్రసిద్ధివహించిరి. రుద్రసంకాశులును, బ్రహ్మలోకనివాసులగు మఱికొందఱు మునులును బ్రసిద్ధులై యున్నారు. వీరిని బఠించినచోఁ బుత్రులులేనివారికిఁ బుత్రులును, దరిద్రులకుధనమును గలుగును. మఱియు వారికి ధర్మకామార్థసిద్ధి గలుగుచున్నది. అటులే పృథివి యెవ్వనిపుత్రికయో, యట్టులే సత్పుత్రుఁడగు పృథునిఁ గీర్తింపవలయును. సూర్యవంశజుఁడును, మహేంద్రసమవిక్రముఁడును, త్రిలోకవిశ్రుతుఁడును, నైలుఁడు నగుపురూరవసుని బుధపుత్రుఁడును, త్రిలోకవిశ్రుతుఁడును, వీరుఁడునగు భరతునిఁ గీర్తింపవలయును. కృతయుగమున నెవఁడు పరమతేజుఁడై మహాదేవునిఁ గూర్చిగోమేధ మొనర్చెనో, యట్టిరంతిదేవునిఁ గీర్తింపవలయును. విశ్వజిత్తపోన్వితుఁడును, లక్షణ్యుఁడును, లోకపూజితుఁడు, పరమద్యుతియునగు శ్వేతుఁ డనెడిరాజర్షిని గీర్తింపవలయును. ఎవ్వనిచే సగరపుత్రులు తరింపఁజేయంబడిరో, యట్టిభగీరథుని, మఱియుఁ గీర్తివర్ధనులును, మహాకాయులు, మహాసత్త్వులునగు క్షత్రియులను కీర్తింపవలయును. ఇంకను జగదీశ్వరులగు దేవతలను, మహర్షులను, రాజన్యులను గీర్తింపవలయును. అటులే సాంఖ్యయోగములును, బరమములగుహావ్యకవ్యములును, సకలశ్రుతిపరాయణమగు పరబ్రహ్మమును గీర్తింపఁబడి, సకలభూతములకు శ్రేయము గూర్చెడిని. పవిత్రములగు వీనిని స్మరించుట, సర్వకర్మపౌష్టికము, వ్యాధిప్రశమనము నై వెలయును. ఓయుధిష్ఠిరా! నా యీతెలిపినవానిని, సాయంప్రాతఃకాలములయందు స్మరింపవలయును. వీరు వర్షప్రకాశవాయ్వాదులఁ గల్గించువారు. మఱియు వీరు దక్షులు, శ్రేష్ఠులు, జితేంద్రియులు, నాయకులునై తమ్ముఁ గీర్తించినవారియశుభములఁ దొలఁగింతురు. మఱియు వీరు పుణ్యపాపములకు సాక్షులై వెలయుచున్నారు. కావున వీరిని బ్రాతఃకాలమున స్మరించువారియశుభములు తొలఁగుచున్నవి. అటులు స్మరించినవారికి మార్గనిరోధముగాని, యగ్నిచోరభయములుగాని గలుగనేరవు. వీరిని స్మరించువారికి దుఃస్వప్నదోషము తొలఁగును. మఱియు సకలపాపవిముక్తి యగును. స్వస్తియు నగును. రోగార్తుఁడును, వ్యాధియుక్తుఁడును, వీరినామములఁ గీర్తించిన దోషవిముక్తులగుదురు. వాస్తుమధ్యమునఁ బఠించినచో నాగృహము శుభావహ మగును. క్షేత్ర

మధ్యమునఁ జపించినచో, నది సర్వసస్యముల ఫలించును. గ్రామాంతరమునకుఁ బోవువాఁడు పఠించెనేని క్షేమముగాఁ జేరును. తనపుత్రులకును, దారలకును, ధనమునకును, బీజములకు, ఓషధులకును, రక్షకముగా నీవిధి నాచరింపవలయును. సంగ్రామకాలమున వీరిని కీర్తించిన క్షత్రియుని వైరులు నాశమొందుదురు. వానికి క్షేమమును గలిగెడిని. మఱియు దైవపైతృకకర్మములందు వీరిని బఠించినచో, దేవతలును బితరులును హవ్యకవ్యముల భుజింతురు. అట్టివానికి వ్యాధులనుండిగాని, శ్వాపదములనుండిగాని, గజములనుండిగాని, తస్కరులనుండిగాని భయము గలుగనేరదు. వానిపాపము శేలికర్ణై తొలఁగుచున్నది. మఱియు, నోడప్రయాణమునఁగాని, రథప్రయాణమునఁగాని పరదేశమునఁగాని, రాజగృహమునఁగాని యీసావిత్రిని బఠించుచు నుత్తమసిద్ధి నొందును. సావిత్రి యెందుఁ బఠింపబడునో, యం దగ్ని కట్టెలను గాల్పలేఁడు. మఱియు నందు బాలమరణములు సంభవింపవు. పాములవలనిభయమును గలుగదు. వానికి రాజభయము, రాక్షసపిశాచభయమును గలుగదు. మఱియు నగ్నిజల వ్యాళాదులనుండియు హాని గలుగదు. నాల్గువర్ణములవారికిని, నాలుగాశ్రమములవారికిని నీసావిత్రీజప మత్యుత్తమమై నిత్యశాంతిని గలుగఁజేయుచున్నది. వారి కెన్నఁడును దుఃఖము గలుగమియెగాక, యుత్తమగతియుఁ గలుగుచున్నది. మహత్తరమై బ్రహ్మమనఁదగు సావిత్రీగుణకీర్తనము నెవ్వరు పరిగ్రహింతురో, వా రుత్తమగతి నొందుదురు. గోవులనడుమఁ బఠించినచో గోవులు పెంపునొందును. ప్రస్థానప్రవాసములందును దీనిని బఠింపవలయును. జపశీలురకును, హోతలకును, బ్రియతాత్ములగుమహర్షులకు నిది రహస్యమగుజప్యమై యున్నది. మఱియుఁ బురాతనమగు నీసిద్ధేతిహాసము మున్నాయింద్రునకుఁ దెలుపఁబడెను. పరాశరమతమగుదానిని నే నిపుడు తెలిపితిని. ఇది సనాతనబ్రహ్మమై సర్వభూతహృదయమై సనాతనశ్రుతియగుచున్నది. సోమాదిత్యవంశజాతులగు రాఘవకౌరవు లీపరమగతియగుసావిత్రిని శుచులై పఠించుచున్నారు. దేవతలయు, సప్తర్షులయుఁ గీర్తనము సర్వకష్టనివారక మగుచున్నది. వృద్ధులగు కాశ్యపగౌతమప్రభృతులును, భృగువు, అంగిరుఁడు, అత్రి, శుక్రాగస్త్యబృహస్పతిప్రభృతు

లును, బ్రహ్మర్షులును సేవించినట్టియు, భారద్వాజునిచే నుతిఁ నట్టియు, ఋచీకతనయులచేఁ బొందఁబడినట్టియు, వసిష్ఠునిచే సన్నుతింపఁ బడినట్టియు నీసావిత్రీజపము నవలంబించియే మున్ను శక్రుఁడును వసువులును దానవుల జయించిరి. ఎవ్వఁడు కనకశృంగములుగల గోశతమును వేదవేత్తయై బహుశ్రుతునకు దానము సేయునో, వానికిని, దివ్యమగు భారతకథను బఠించినవానికిని బరమపుణ్యఫలము గల్గుచున్నది. భృగుపరికీర్తనముచే ధర్మమును వసిష్ఠపరికీర్తనముచే వీర్యమును వర్ధిల్లుచున్నవి. రఘువంశస్థునికి నమస్కరించినవానికి సంగ్రామజయము గలిగెడిని. అశ్వినీదేవతల స్మరించినవాఁ డారోగ్యవంతుఁడగును. శాశ్వతబ్రహ్మమగుసావిత్రిని నీ కెఱిగించితిని. ఇఁక నేమి వినఁ గోరెదో తెలుపుము. ఎఱిగించెదను" అని పలుక విని మఱియు నయ్యుధిష్ఠిరుఁ డిట్లనియు.

## బ్రాహ్మణప్రశంస

"ఓపితామహా! పూజ్యు లెవ్వరు? నమస్కార్యు లెవ్వరు? ఎవ్వరియం దెట్లు వర్తింపవలయును? ఎట్టివారియం దెట్లు ప్రవర్తింపవలయును?"

అది విని శాంతనవుఁడు "ఓయుధిష్ఠిరా! బ్రాహ్మణపరిభవము దేవతలనేని నశింపఁజేయును? బ్రాహ్మణులకు నమస్కరించినచో, వృద్ధి నొందును. బ్రాహ్మణులే పూజ్యులు, వారే నమస్కార్యులు. వారియెడఁ బుత్రునట్లు వర్తింపవలయును. బ్రాహ్మణులమూలముననే యీలోకము లన్నియును నిలుచుచున్నవి. మనీషులగు విప్రులే సకలలోకములకును గొప్పధర్మసేతువులు. మఱియు, ధనత్యాగరతులును, వాక్సంయమ సమన్వితులును, సకలభూతమనోజ్ఞులును, నియమధృతవ్రతులును, లోకశాస్త్రప్రణేతలును, కీర్తినిధులును నై తపమే ధనముగను, విప్రుల వచనమే బలముగను బ్రవర్తిలుచు, ధర్మప్రభవులై, ధర్మజ్ఞులై సూక్ష్మదర్శులై బ్రాహ్మణులు వెలయుచుందురు. ధర్మకాములై, సుకృతధర్మపరులై, ధర్మసేతువులై, చతుర్విధప్రజాజీవనాశ్రయులై, యెల్లవారిని నడిపించునట్టిమార్గములై, సనాతనులై, యజ్ఞోద్ధారకులై పిత్రుపైతామహమగుభారము నావిప్రులు వహించుచున్నారు. సద్వృషభము లట్లు వారెట్టివిషమభారమందును వెనుదీయరు. మఱియు వారు, పితృ

దేవాతిథిముఖులును, హవ్యకవ్యాగ్రభోజులునై, తమభోజనము వలననే మూఁడులోకములను నైష్టిభయమునుండియు రక్షింతురు. వారు సర్వలోకమునకు దీపము, చక్షుష్మంతులకుఁ జక్షువు, మఱియు సకలశిల్పాదినిధులును, నిపుణులును, మోక్షమార్గదర్శులును, సకల లోకగతిజ్ఞులును, నధ్యాత్మగతిచింతకులును, నాదిమధ్యాంతజ్ఞాతలును, ఛిన్నసంశయులునై యొప్పుచుందురు. మఱియుఁ బరావరవిశేషజ్ఞులును, బరమగతిగాములును, విముక్తులును, ధూతపాపులును, నిర్ద్వంద్వులును, నిష్పరిగ్రహులును, మానార్హులును, మానితులును నై వెలయుచుందురు. వారు చందనమును, మలపంకమును, భోజనమును, నుపవాసమును దుల్యముగాఁ గనుఁగొందురు. వారు దుకూలమును, శాణక్షౌమాజినములను సమానముగా భావింతురు. మఱియు వారెన్నియేనిదినములు భుజింపకయే యుండఁగలరు. సంయతేంద్రియులై స్వాధ్యాయములచే నవయవములఁ గృశింపఁజేసికొందురు. అదైవమును దైవతముగను, దైవతము నదైవతముగను వారు చేయఁగలరు. వారు కుపితులగుదురేని లోకములను లోకపాలకులను సృజింపఁగలరు. వారిశాపమువలన సాగరజలము ద్రావరానిదయ్యెను గాదే? మహాత్ములగువారికోపాగ్ని నేఁటికిని దండకారణ్యమున శమింపక చూపట్టుచున్నది. వారు దేవతలకును దేవతలును, కారణమునకును గారణభూతులును, ప్రమాణమునకును వారు ప్రమాణము. వివేకియగువాఁ డెవ్వఁడు వారిని బరిభవించును? ఆబ్రాహ్మణులలో బాలుఁడును వృద్ధుఁడును నొక్కరీతిగా సమ్మానింపఁదగినవారు. తపోవిద్యావిశేషమువలన వారు పరస్పరమును గౌరవించుకొనుచుందురు. బ్రాహ్మణుఁడు, విద్వాంసుఁడు గాకున్నను బాత్రుఁడును బావనుఁడును మహాత్తరుఁడునై వెలయును. విద్వాంసుఁడగునేని పూర్ణసాగరసన్నిభుఁడై మఱియు నధికుఁడుగా భావింపఁబడును. బ్రాహ్మణుఁడు విద్వాంసుఁడే నవిద్వాంసుఁడేని మహత్తరదైవత మనఁబరఁగుచున్నాఁడు. అతఁడు సంస్కరింపఁబడియుఁ గాకుండియు, నగ్నివలె మహత్తరదైవతమనుటలో సందియము లేదు. తేజస్వియగునగ్నిదేవుఁడు శ్మశానస్థుఁడయ్యు దూషింపఁబడునా? విధ్యుక్తమగుహవిస్సు యజ్ఞమందును, గృహమందును నొక్కరీతిగ శోభించును గాదే? కావున

బ్రాహ్మణుఁ డెల్లవిధములఁ బూజ్యుఁడు. అతఁడే పరమదైవతముగా భావింపుము.” అని తెలుప విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె.

పవనార్జునసంవాదము

“ఓపితామహా! బ్రాహ్మణపూజయం దెట్టివృద్ధిని, నెట్టికర్మఫలమును గాంచి, వారి నర్చించుచున్నాఁడవు?”

అది విని భీష్ముఁడు, ఓయుధిష్ఠిరా! నీవడిగినయర్థమున కుదాహరణముగా నొకపురాతనేతిహాసము గలదు. అయ్యది పవనునకు, అర్జునునకు జరగినసంవాదము దాని నెఱిఁగించెదను వినుము. మున్నొకపుడు, వేయిభుజములు వెలయ శ్రీమంతుఁడై కార్తవీర్యార్జునుఁడను ప్రభువుండెను. అతఁడు మహాబలుఁడై యీలోకము నెల్లఁ బాలించుచు మాహిష్మతియం దుండెను. ఆమైహయుఁడు, సత్యవిక్రముఁడై సకలసాగరద్వీపములుగల పృథివి నెల్లఁ బాలించుచుండెను. అతఁ డొకనిమిత్తమున దత్తాత్రేయునకుఁ దనవిత్తము నెల్ల నిచ్చి, వినయమును శ్రుతమును క్షత్రధర్మమును బురస్కరించుకొని యాతని నారాధించెను. అటు లారాధింపఁగా, నమ్ముని సంతుష్టుఁడై మూఁడు వరములు గోరికొమ్మనుటయు, నాయర్జునుఁడు ‘ఓమునివర్యా! నేను సేనామధ్యమునను, నింటను సహస్రబాహుఁడనై వెలయవలయును. రణరంగమున నావేయిబాహువులను సైనికులు గనుఁగొందురుగాక. నావిక్రమముచే నిప్పుడమి నెల్ల జయింపవలయును. అటులు జయించిన పుడమి వడసి ధర్మయుక్తముగాఁ బాలించెదను. ఓద్విజసత్తమా! ఇమ్మూఁడువరములును గాక, నాల్గవవరమును నిన్ను యాచించుచున్నాఁడను. దానినిసైతము నీవు నాకనుగ్రహింపఁ దగుదువు. త్వదాశ్రయుఁడనైననేను, మిథ్యోద్వృత్తుఁడ నైనపుడు నన్నుఁ బండితులు శాసింతురు గాక.’ అని ప్రార్థించెను. అది విని యమ్మౌని యటులే యగుఁగాక యని పలికెను. దీప్తతేజుఁడగునాతని కావరము లటులే ఫలించెను. పిమ్మట నయ్యర్జునుఁడు, జ్వలనార్కతుల్యకాంతి గలరథము నధిష్ఠించి, బలగర్వముచే ‘నాతో సమానుఁ డెవ్వఁడు? నాకుఁ గలధైర్యము, వీర్యము, తేజశ్శౌర్యపరాక్రమములును గలవాఁ డెవ్వఁడు?’ అని పలుకుచుండఁగనే యంతరిక్షమున నొకయశరీర

వాక్కు వినవచ్చెను. 'ఓరీ! నీవు మూఢుఁడవగుట, దెలియకున్నాఁడవు. క్షత్త్రియునికంటె బ్రాహ్మణుఁ డుత్తముఁడు సుమీ! క్షత్త్రియుఁడవగు నీవు బ్రాహ్మణునిఁ గూడియే ప్రజలను బాలించుచున్నాఁడవు. అది నీవెఱుఁగుదువా?' అని యశరీరవాణి పలికెను.

అది విని యాయర్జునుఁడు 'నేను సంతుష్టుఁడ నగుదునేని భూతములను సృష్టింపఁగలను. అపనయము గలిగినపుడు కుపితుఁడ నగుదునేని నశింపఁజేయఁగలను. ద్విజుఁడు నాకంటె నుత్తముఁడు గాఁడని మనోవాక్కర్మలచే నిశ్చయించి తెలుపుదును. బ్రాహ్మణోత్తర వాదము మొదటిదనియు, క్షత్త్రియోత్తరవాదము రెండవదనియు, తెలిపినవచనములు హేతుయుక్తములు గావచ్చును. అయిన సందొక విశేషము గలదు. బ్రాహ్మణులు క్షత్త్రము నాశ్రయింతురుగాని, క్షత్త్రియులు బ్రాహ్మణుల నాశ్రయింపరు. వేదము యజ్ఞము ననియెడి పేరు పెట్టికొని బ్రాహ్మణులు క్షత్త్రియుల నాశ్రయించి జీవించుచున్నవారు. ప్రజాపరిపాలనధర్మము క్షత్త్రియుల నాశ్రయించియున్నది. బ్రాహ్మణులకు క్షత్త్రియులనుండియే జీవనవృత్తిగదా! వారు క్షత్త్రియులకంటె నుత్తము లగుటెట్లు? సకలభూతప్రధానులయ్యు భైక్షవృత్తిగలయా బ్రాహ్మణులను, నేను నావశముగాఁ జేసికొనుచున్నాఁడను. ఈ యాకాశవాణి యసత్యము పలికెను. చర్మపసములై యవశులైన బ్రాహ్మణుల నెల్ల నేను జయింతును. మూఁడులోకములందును నన్ను రాజ్యభ్రష్టునిఁ గావించువాఁ డెవ్వఁడు! మానవుఁడేగాని, దేవుఁడేగాని నన్ను రాజ్యమునుండి తొలఁగింపలేరు. కావున బ్రాహ్మణునికంటె నేన యుత్తముఁడను. ఇక బ్రహ్మోత్తరమగులోకమును క్షత్త్రియోత్తరముగా నొనర్చెదను. యుద్ధమున నాబలము నోర్చువాఁ డెవ్వఁడును లేఁడు గదా!' అని పలికెను.

అంత నాయర్జునువచనము లాలించి, యాకాశవాణి భయమొందెను. పిదప నంతరిక్షగతుఁడై పవనుఁడు 'ఓయర్జునా! ఇక్కలుషభావమును బరిత్యజించి బ్రాహ్మణులకు నమస్కరింపుము. వారియెడఁ బాప మొనర్చినవారికి రాజ్యనాశనమయ్యెడిని. అదియుఁగాక, బ్రాహ్మణులు నిన్ను నశింపఁజేయను గలరు. మహాబలులగు బ్రాహ్మణులు,

హాతోత్సాహుండవై నన్ను రాజ్యభ్రష్టునిఁ గావింతురు.' అని పలుకుటయు, నతఁడు 'ఓయీ! నీ వెవ్వఁడ'వని యడిగెను. అది విని, యావాయుదేవుఁడు 'ఓరాజా! నేను దేవదూత నగుపవనుఁడను. నీకు హితమెఱింగించుచున్నాఁడను.' అని మఱియుఁ దెలిపెను. అంత నయ్యర్జునుఁడు 'ఓపవనా! నీవిపుడు బ్రాహ్మణులయెడ భక్తి చూపుచున్నాఁడవు. పృథివ్యాత్మకుఁడగు బ్రాహ్మణు, నట్లుగనే తెలుపుము. కాని బ్రాహ్మణోత్తముని వాయుసదృశునిఁగాఁ దెలుపుదువా? జలసదృశుఁ డందువా? వహ్నిసూర్యసదృశుఁ డందువా? నభస్తుల్యుఁ డందువా?' అని పలుక నివి వాయువు మఱియు నిట్లనియె.

## పవనార్జునసంవాదము

'ఓరాజా! నీవు మూఢుఁడవు. మహాత్ములగు బ్రాహ్మణులగుణములఁ గొన్నిటిని దెలిపెదను వినుము. నీవు తెలిపినవాని కన్నిటికంటె బ్రాహ్మణుఁ డుత్తముఁడు. కాశ్యపునియెడఁ గలస్పర్ధచేఁ బుడమి మహీత్వమును విడిచి నాశ మొందుటయు, నపుడు దానిని గశ్యపుఁడు నిలిపెను. ఓరాజా! బ్రాహ్మణులు నిత్యము భూమ్యాకాశములందును నజేయులు. ముఖ్యాంగిరుఁడు నిజతేజముచే నుదకములఁ ద్రావెను. అటులు క్షీరమట్లు వానినెల్లఁ ద్రావుచును దృప్తినొందఁడయ్యెను. మఱియు నతఁ డాయుదకముచేఁ బుడమినెల్లఁ బూరించెను. అతఁడు కుపితుఁడైనపుడు, నేనును లోకమును బరిత్యజించి పోయితిని. అపు డాతనిభయముచే నెంతేనికాల మగ్నియం దుంటిని. మఱియు నొకటి వినుము. అహల్యను గామించి, భగవానుఁడగు పురందరుఁడు గౌతమునిచే శపింపఁబడియెను గాదే? ఆగౌతముఁడు ధర్మభంగముగునని వానిని హింసింపక యట్లు శపించి విడిచెను. ఓరాజా! జలసమృద్ధమై వెలయుసముద్రము బ్రాహ్మణశప్తమైగాదే లవణోదకముగలదయ్యెను. సువర్ణవర్ణుఁడును, నిర్ధూముఁడును, నూర్ధ్వశిఖుఁడు నగునగ్ని కుపితుఁడైన యంగిరసునిచే శప్తుఁడై పైఁ దెలిపినగుణములఁ బోఁగొట్టుకొనియెనుగాదే? ఎవ్వ రీమహాసముద్రునిఁ గావించిరో, యట్టిసగరపుత్రులందఱును సుత్తమవర్ణధారియగు కపిలునిచేఁ జూర్ణితులైరిగాదే?

చూడుము. ఓనరాధిపా! నీవు బ్రాహ్మణులతో నెన్నఁడును దుల్యుఁడవు గావు. శ్రేయస్కరమగు నాపలు కాలింపుము. ప్రభుఁడైన వాఁడును, గర్భస్థులగు బ్రాహ్మణులకేని నమస్కరించును. దండకులనెడి వారి గొప్పరాజ్యము బ్రాహ్మణునిచే నశింపఁజేయఁబడియెను. మహాక్షత్రియుఁడగు తాలజంఘుని నౌర్వకుఁడను బ్రాహ్మణుఁడు నశింపఁజేసెనుగాదే! నీ వీవిపులమగు రాజ్యమును, బలమును, ధర్మమును, శ్రుతమును దత్తాత్రేయునను గ్రహముచేఁ బడసితివిగాదే! ఓయర్జునా! అటులేని నీవు నిత్యము బ్రాహ్మణాగ్నిని యజింతు వేటికి? ఆ బ్రాహ్మణుఁడు సర్వలోకమునకును హవ్యవాహనుఁడనుట యెఱుఁగవొకో? అనుభూతానుపాలకుఁడగు బ్రాహ్మణశ్రేష్ఠుని జీవలోకకర్తనుగా నెఱిఁగియు, నేల యిట్లు మోహమందుచున్నాఁడవు? అటులే యవ్యక్తప్రభవుఁడు, నవ్యయుఁడు, చరాచరవిపులవిశ్వకర్తయునగు ప్రజాపతియు బ్రాహ్మణుఁడే. అపండితులు కొందఱు బ్రహ్మ నండజాతునిఁగాఁ దెలియుదురు. భిన్నమగు నండమునుండి శైలములు, దిక్కులు, జలము, పృథివి, యాకసమును వెడలి గానవచ్చెను. వానిని గాంచి యజుఁడైన యాతఁడు జనించినవాఁ డెట్లగును? ఆకాశమే యండము. దాని నుండియే యతఁడు జనించెను. అయిన నెట్లు నిలిచియుండును? అని యడిగెదేని, యపు డేమియు లేదు. సర్వతేజోగతుఁడగు నా ప్రభుఁ డహంకారమని చెప్పఁబడును. తదండమునుండియే లోకభావనుఁడగు బ్రహ్మ జనించెను.' అని పలుక విని యర్జునుఁ డూరకుండుటయు వాయువు మఱియు నిట్లనియె.

'ఓయర్జునా! మున్నంగుఁడనెడి రాజు యాగదక్షిణగా నిప్పుడమి నెల్ల నీయఁదలంచుటయు, నపుడు భూమి చింతాక్రాంతయై 'ఈనృపోత్తముఁడు, సకలభూతధారిణి నగు నన్ను బొందియు, బ్రహ్మపుత్రిక నగు నన్ను బ్రాహ్మణుల కీయఁదలంచుచున్నాఁ డేమి? కావున నేనిఁక భూమిత్వమును బరిత్యజించి బ్రహ్మపదమునకుఁ బోయెదను. ఈభూపతి రాష్ట్రవిహీనుఁడగుఁగాక.' అని పలికి వెడలిపోయెను. పిమ్మటఁ గశ్యపుఁడు, వెడలిపోవుచున్న యప్పుడమిని గాంచి, వెంటనే సమాధినిష్ఠుఁడై శరీరమును బరిత్యజించి భూమిని బ్రవేశించెను. ఆవిషయ మెఱిఁగి, యది ధర్మోత్తరయగుట, భయము విడిచి, మరలఁ దృణౌషధి

సమన్వితయగుచుఁ బుడమి యయ్యెను. అటులైౖ ముప్పది దివ్యవర్ష సహస్రములు కాశ్యపినాఁబరఁగుచు వచ్చెను. పిమ్మట నొకపు డకాక్ష్యపి, కశ్యపునిఁ జేరి నమస్కరించి, యమ్మహాత్మునకుఁ బుత్రికయై వెలయఁజొచ్చెను. ఓరాజా! ఇక్కశ్యపుఁడు నీవన్న బ్రాహ్మణుఁ డగునా? నీవు కశ్యపునిమించినక్షత్రియు నొక్కనిఁ దెలుపుము' అని పలుక విని యారా జూరకుండెను. అంత మఱియు నప్పవనుఁడు 'ఓరాజా! ఇఁక నంగిరునివంశమున జనించిన యుతథ్యునిఁగూర్చి తెలిపెదను వినుము. సోమునకు, మిగుల సౌందర్యముగల భద్రయను నొకకన్నియ యుండెను. ఆమెకుఁ దగినమగఁ డెవ్వఁడని వెదకుచు నాసోముఁ డయ్యుతథ్యునిఁ దగినవానిఁగా నెంచెను. అపు డమ్మహాభాగయుఁ, గీర్తిమతియునగు నాభద్ర, తీవ్రమగుతప మారంభించి, యెటులే నాయుతథ్యునిఁ బొందవలయునని గొప్పనియమ మూని యుండెను. అంత నాసోమునితండ్రియగు నత్రి యుతథ్యుని రావించి, విధ్యుక్తముగా భూరిదక్షిణలతో కన్నియనొసంగ, నతఁ డామెను భార్యనుగాఁ బరిగ్రహించెను. అంతకుమున్నే, యామెను, శ్రీమంతుఁ డగువరుణుఁడు కామించియుండుటను, యమునాతీరవనమును జేరి, యామె నపహరించి నిజనగరమునకుఁ దీసికొనిపోయెను. ఆతనిపత్తనము పరమాద్భుతప్రకాశమై, షట్సహస్రశతప్రదమై మనోజ్ఞమై యుండెను. దానిని మించినపత్తనమే లేదనవచ్చును. అయ్యది దివ్యప్రాసాదములతోడను దివ్యభోగములతోడను వెలయుచుండెను. ఓరాజా! అందావరుణదేవుఁ డాభద్రతోఁగూడి బహువిధసుఖము లనుభవింప నారంభించెను. పిమ్మట నారదుఁ, డుతథ్యునికడ కేఁగి తత్పత్నీబలాత్కారము నాతని కెఱిఁగింప విని, యతఁ డానారదునితో 'ఓమునీంద్రా! నీ వావరుణునికడ కేఁగి, పరుషోక్తులతో, నావచనములుగా నిట్లు పలుకుము. 'ఓరీ! నీవు నాభార్య నపహరించి తేల. దాని నింక నేని, విడువుము. నీవు లోకపాలకుఁడవయ్యు లోకమునకు లోపము గలిగింపవచ్చునా? సోమదత్తమగు నిది నాకు భార్య యయ్యెనుగదా! నీవిపుడు దీని నపహరించితేటికి?' అని తెలుపు' మన, నారదుఁ డటులే వరుణునితోఁ బలికెను. అటులు నారదుఁడు పలికిన యావచనము లాలించి యాజలేశ్వరుఁడు, 'ఓమునివర్యా! ఈమె

నాకెంతయుఁ బ్రియమైనదియు, భీరువు నగుట, దీనిని బరిత్యజింపఁ జాలను.' అని బదులుచెప్పెను. అదివిని యానారదుఁడు మరలి యుతథ్యుని సమీపించి, యెంతయుఁ దన మోమున దైన్యము దోఁప, 'ఓమహామునీ! అవరుణుఁడు నా మెడను జేతఁబట్టి త్రోసివైచెను. ఇఁక నతఁడు నీభార్యను నీకొసంగడు, నీకిఁకఁ జేతనైనపని చేసికొన వచ్చును.' అని పలికెను. అంత నయుతథ్యుఁడా నారదునివచనము లాలించి కుపితుఁడై, నిజతేజోబలముచే జలమునెల్లఁ ద్రావుటయు, నవ్వరుణుఁడు మిత్రులతోఁగూడ క్షోభ నొందియు, నాభద్రను బరిత్యజింపఁడయ్యెను పిమ్మట నయుతథ్యుఁ డెంతయుఁ గోపమడర భూమితో 'ఓదేవీ! షట్సహస్రశతహ్రదమగు వరుణునిస్థలమును నాకుఁ గాని పింపుము.' అనిపలికెను. అంత నచ్చోటివసముద్రము తొలఁగెను. మఱియు నందున్నసరస్వతిని జూచి 'ఓసరస్వతీ! నీవిచ్చోటినుండి పొమ్ము. ఎవ్వరికిని గానరాకుండుము. అటులు నీచే విడువఁబడి యీదేశ మపవిత్రమగుగాక' యని యానదిని దొలఁగించెను. అటు లాదేశము శోషింపఁజేయఁబడుటయు, నప్పుడు వరుణుఁడు భద్రను దెచ్చి యుతథ్యున కర్పించి శరణము వేఁడికొనియెను. పిదప నుతథ్యుఁ డును దనభార్యను బరిగ్రహించి స్వస్థచిత్తుఁడయ్యెను. ఓయర్జునా! అటు లతఁడు తనభార్యను బడసి, వరుణలోకమును దుఃఖవిముక్తము కావించి, పిదప వరుణునిఁ జూచి యుతథ్యుఁడు 'వరుణా! నీవు పరిత పించుచుండఁగా, నాతపోబలముచే నా యీభద్ర నాకు లభించెను గాదే?' అని పలికి, యామెను నిజభవనమునకుఁ గొనిపోయెను. ఓరాజా! బ్రాహ్మణోత్తముఁడగు నుతథ్యుఁ డిట్టివాఁడుగదా! ఈయుత థ్యునికంటె క్షత్రియు నుత్తమునిగాఁ దెలుపుదువా?' అని పలికె" నని తెలిపి భీష్ముఁడు మఱియు నిట్లనియె.

## పవనార్జునసంవాదము

"ఓయుధిష్ఠిరా! అది విని యారాజారకుండుటయు, మఱియు నవ్వాయుదేవుఁ డాతనితో 'ఓయర్జునా! మహాత్ముఁడగు నగస్త్యుని మాహాత్మ్యము వింటివా? ఒకప్పుడు దేవతలు రాక్షసులచేనోడి నిరుత్సా హులై యుండిరి. అప్పుడు దేవతలకు యాగములు లేకుండెను. పితరు

లకు స్వధ లేకుండెను. మఱియు దానవులచే మానవులకర్మములు నశిం
చెను. అంత నద్దేవతలు భ్రష్టైశ్వర్యులై పుడమిని జేరికొనిరని వినికి.
పిమ్మట నొకప్పుడు వారు, రవి తేజుఁడై వెలయుచు, విపులవ్రతుఁడై యున్న
యగస్త్యునిఁ గాంచి, యాతనికి నమస్కరించి కుశలమడిగి తత్కాలాను
కూలముగా, నాతనితో 'ఓమునీంద్రా! మేము దానవులకోడి, రాజ్యభ్రష్టు
లమైతిమి. ఓమునిపుంగవా! అట్టి మమ్ము నత్తీవ్రభయమునుండి యెటు
లేనిఁగాపాడుము.' అని తెలిపిరి. అది విని యాయగస్త్యుఁ డందుల కెంత
యుఁ గుపితుఁడై ప్రళయకాలాగ్నివలెఁ బ్రజ్వలించి, యాదీప్తిజాలముచే
దానవులనెల్ల దహింపఁజేసెను. అప్పు డారక్కసు లగస్త్యతేజముచే
దహ్యమానులగుచు నంతరిక్షమున కెగఁబ్రాకి, యందును నాతనితేజ
ముచే దగ్ధులగుట, నపుడు వా రాయుభయలోకములను విడిచి, దక్షిణ
దిశకుఁ బోయిరి. అపుడు బలిచక్రవర్తి పుడమి నాశ్రయించి యశ్వ
మేధయాగము చేయుచుండెను. అపుడు మఱికొంద ఱధోలోక
వాసులును భూలోకగతులు నగుమహాసురులు నాయగస్త్యుని తేజముచే
దగ్ధులైరి. అంత నా దేవతలు నిర్భయులై తమలోకము నెప్పటిచొప్పునఁ
జేరికొనువారై మఱియు నాతనితో 'భూమిగతులగు రక్కసులను
సైతము నశింపఁజేయు' మని కోరిరి. కాని యాయగస్త్యుఁడు దేవతలతో
'భూగతులగువారిని నేను దహింపను. దానిచే నాతపము చెడును.'
అని ప్రత్యుత్తరమిచ్చెను. ఓయర్జునా! ఇటు లాయగస్త్యునితేజముచే
దానవులందఱును దగ్ధులైరి. తపోభావితాత్ముఁడగు నగస్త్యునివిధము
తెలిపితినిగదా! ఈతనికంటె క్షత్త్రియు నధికునిఁగాఁ జెప్పగలవా?' అని
పలికెను.

ఓయుధిష్ఠిరా! అది విని యాహైహయుఁ డూరకుండుటయు,
మఱియు నప్పవనుఁ డిట్లు పలికెను. 'ఓరాజా! మఱియు వినుము.
యశస్వియగు వసిష్ఠునిముఖ్యకృత్య మొకటి తెలిపెదను. ఒకపుడు
వైఖానససరస్సు చేరువ నాదిత్యులు సత్త్రయాగము నారంభించి,
వసిష్ఠుని గౌరవ మెఱిఁగినవారగుట, నాతనిఁ దమచిత్తములఁ దలంచిరి.
అటులు దీక్షపూని యాగముచేయువారై యున్న యా దేవతలను
గాంచి, బలవంతులై శైలాకారులగుకొందఱు రక్కసులు, వారిని జంప
నుద్యుక్తులై, మఱిమఱియు హతులగుచుండియు నందులకుఁ, జేరువగా

నున్న బ్రహ్మదత్తవరముగల సరోవరమున స్నానముచేసి జీవించుచు మహాఘోరములగు పర్వతములను, బరిఘములను, వృక్షములను బట్టికొని యాసరోజలమును నూఱు యోజనములవఱకును వెడలునట్లుచేసి మిక్కిలి క్షోభము గలిగించిరి. అంత భీతులైన దేవతలను నారక్కసులు వేలకొలఁదిగా వెడలి వెంటఁ దఱుముటయు, వారెంతయుఁ బీడితులై శతక్రతుని శరణఁజొచ్చిరి. అంత నయ్యింద్రుఁడును వ్యథాకులచిత్తుఁడై వసిష్ఠుని శరణమందెను. అపుడవ్వసిష్ఠుఁడు, వారికభయ మొసఁగి వారెంతయు దుఃఖితులైయుండుట తెలిసికొని, తనతేజోబలముచే నారక్కసులనెల్ల సులభముగా దహించెను. అటులు దహించి, పిదప నారక్కసులచేఁ జెఱుపఁబడిన యాసరోవరమును బూరించుటకై కైలాసమునకుఁ బోవుచున్న గంగానదిని దెచ్చెను. అపుడానదీజలము పట్టక యాసరస్సు భిన్నమైనదియై సరయువని పేరొందెను. బలవంతులగురక్కసు లచ్చోట దగ్ధులగుటచే నాదేశము బలినమని ప్రసిద్ధినొందెను. ఓరాజా! ఇంద్రాదులగు దేవతలిట్లు వసిష్ఠునిచే రక్షింపఁబడిరి. బ్రహ్మదత్తవరులయ్యు నారక్కసులమ్మహాత్మునిచే హతులైరిగదే? వసిష్ఠునిఘనకృత్యము నెఱిఁగించితిని గదా! ఆవసిష్ఠునికంటె క్షత్రియు నుత్తముగాఁ బలుకుదువా? అని పలికె"నని తెలిపి భీష్ముఁడు మఱియు నిట్లనియెను.

ఓయుధిష్ఠిరా! అది వినియు నర్జునుఁ డూరకుండుటయు, మఱియు నప్పవనుఁ డాతనితో 'ఓరాజా! మహాత్ముఁడగు నత్రిమహర్షి ఘనకృత్యము నెఱిఁగించెద వినుము. ఒకపుడు దేవదానవులు, ఘోరాంధకారమున యుద్ధము చేయవలసివచ్చెను. ఆయుద్ధమున రాహువు, సూర్యచంద్రులను సాయకములచే నొప్పించెను. అటులగుటనే దేవతలాయుద్ధమునఁ దమోగ్రస్తులైరి. అంత నద్దేవతలారక్కసులచేవధ్యమానులగుచు క్షీణబలులై తపోధనుఁడై తప మొనర్చికొనుచున్న యత్రిని గాంచి, క్రోధరహితుఁడును జితేంద్రియుఁడు నగునాతనితో 'ఓమునీంద్రా! మాయీసూర్యచంద్రులు రక్కసునిచే విద్ధులైరి. వారు హతులగుటఁ జుట్టుకొన్న చీకటులందు మేమెల్లరము రక్కసులచే హతులగుచున్నవారము. మాకించుకేని శాంతి గలుగకున్నది. ఓప్రభూ! మమ్మెటులేని రక్షింపుము.' అని ప్రార్థించిరి. అది

విని యమ్మహర్షి 'నేను మిమ్మెట్టులు రక్షింపఁగల'నని పలుక, నప్పుడు దేవతలు, 'నీవు చంద్రుఁడవగుము అటులే చీకటులను బోఁగొట్టు నట్టి సూర్యుఁడవై దస్యుహంతవు గమ్ము' అని పలికిరి. అందులకు సమ్మతించి యాయత్రిమహర్షి చీకటులను దొలఁగించుచు చంద్రుఁడై సౌమ్యభావముచేఁ జంద్రునివలెఁ బ్రియదర్శనుఁడై యుండి, యాసోముని ప్రభ చాలదని తలంచి, మఱియు సూర్యుఁడై తనతపోబలముచే నాసంయుగమునఁ బ్రకాశమును గలిగించెను. అపుడు జగము నిస్తి మిరమై ప్రకాశముగలిగియుండెను. అంత నతఁడు మఱియుఁ దన తేజ ముచే నారక్కసులను జయించుచుండుటయుఁ గాంచి, దేవతలును దత్రక్షితులగుచు రక్కసులను వధింపసాగిరి. సూర్యుఁడు ప్రకాశిం చెను. దేవతలు రక్షింపఁబడిరి. రక్కసులు హతులైరి. ఓరాజా! చూచితే? అగ్నిసహాయుఁడును, ఫలాహారుఁడును, జర్మవసనుఁడును, ద్విజుఁడునగు నత్రి, తనతేజముచే నెట్టిసామర్థ్యమును జూపెనో? ఆతని ఘనకార్యమును దెలిపితినిగదా! ఆయత్రికంటె క్షత్రియుఁ డధికుఁ డని తెలుపుదువా?' అని పలుకుటయు, నయ్యర్జునుఁడు మఱుమాట లేక యూరకుండెను.

ఓయుధిష్ఠిరా! మఱియు నప్పవనుఁ డయ్యర్జునుతో 'ఓరాజా! మహాత్ముఁడగు చ్యవనుని ఘనకృత్యమును దెలిపెదను వినుము. ఒకపుడు చ్యవనుఁ డశ్వినీదేవతలకు సోమపానభాగ మొసంగుదునని ప్రతినచేసి, యింద్రునికడకేఁగి 'ఓపాకశాసనా! నీవు దేవతలతోపాటుగా నియ్యశ్వినీ దేవతలకును సోమపాన మిప్పింపు'మని పలికెను. అది విని యింద్రుఁడు 'ఓమునీంద్రా! వీరు మాయెల్లరచే నిందితులైరిగదా! వీరు సోమపు లెట్టులగుదురు? వీరు దేవతలచే సమ్మతింపఁబడలేదు. కావున నీవిట్లు కోరవలదు. వీరితోఁగలిసి మేము సోమపానము చేయనొల్లము. మఱి యేదేనిఁ గోరుదేని దానిని గావింతుము' అని పలికెను.

చ్యవనుఁడు:—ఓసురేశ్వరా! వీరు మీతోఁగూడి సోమపాన మొనర్పఁగలయును. వీరిరువురును సూర్యపుత్రులగుట దేవతలగు చున్నారు. ఓయింద్రా! ఓదేవతలారా! నామాటచొప్పున వీరికి సోమ పానము గలిగింపుఁడు; అటులేని మీకు శ్రేయము గలిగెడిని. అటు లొనర్పరేని శ్రేయము గలుగనేరదు.

ఇంద్రుఁడు:—ఓద్విజోత్తమా! నే నీయశ్వినీదేవతలతోఁ గూడి సోమపానము చేయను, వారికిష్టమేని దక్కినవారు చేసినను జేయుదురుగాక, నేను మాత్ర మిందుల కంగీకరింపను.

చ్యవనుఁడు:—ఓబలసూదనా! నా యీవచనము సమ్మతించి యిప్పుని చేయవేని, నాచేఁ బీడితుఁడవై వెంటనే యట్లు చేయుదువు.' అని పలికెను.

ఓహైహయా! అంత నాచ్యవనుఁ డట్లు పలికి, యయ్యశ్వినీ దేవతలహితము గావించువాఁడై యందులకుఁ దగుకర్మము నారంభించెను. పిదప నాతనిమంత్రములచే దేవతలు దిరస్కృతులైరి. అటు లారంభించిన యాచ్యవనునికృత్యమునకుఁ గుపితుఁడై యింద్రుఁడు, ఘనతరమగు నొకశైలమును బట్టుకొని చ్యవనునిపై వెడలి, యమర్షాకులితనేత్రుఁడై వజ్రాయుధము గదలించుచుఁ బరువిడసాగెను. అంత నటులు తనపైకి వచ్చుచున్న యాయింద్రునిఁ గాంచి యాచ్యవనుఁడు తపోనిధియగుట, నుదకములు మంత్రించి చల్లి వానిచే వజ్రాయుధముతోఁగూడ వాసవుని స్తంభింపఁజేసి, మఱియు, నప్పర్వతముతోఁ గూడియున్న యింద్రునకుఁ దగునట్లుగా, నాహుతిమయుఁడగు మదుఁడను నొకశత్రువుని సృజించెను. అపు డామదుఁడు, నోరు తెరచి, శతయోజనపరిణతిగల యద్దాఁ బరమదారుణములై ద్వియోజనశతపరిమాణముతో దంష్ట్రలు భయముఁగొలుప, దాఁడలలో నొకటి పుడమిని, వేఱొకటి యాకసమును స్పృశింప వికృతాకారుఁడై యుండెను. వాని జిహ్వామూలమున దేవేంద్రదేవతాదులెల్ల నుండిరి. అపుడు వారు మహార్ణవమునఁ దిమిముఖగతములగు మత్స్యములట్లు గానవచ్చిరి. అటు లామదుని, వదనగహ్వరగతులైన దేవతలందఱును గూడి యాలోచించుకొని యింద్రునితో, 'ఓదేవేశా! ఈబ్రాహ్మణోత్తమునకు నమస్కరింపుము. ఇంక మనము చింతవిడచి యశ్వినీదేవతలఁ గూడి సోమపానమొనర్తము' అని పలికిరి. అంత నయ్యింద్రుఁడు ప్రణతుఁడై యాచ్యవనునకు నమస్కరించెను. అంత నాచ్యవనుఁ డశ్వినీ దేవతలకు సోమపానము గలిగించెను. పిదప నాచ్యవనుకృత్యము ముగింపబడియెను. అనంతర మమ్ముని యామదుని విభజించి, పాచికలందును, వేఁటయందును, సురాపానమందును, స్త్రీలయందును నుం

చెను. ఈదోషములచే మానవులు నశింతురు. అందు సందియము లేదు. గావున మానవుఁడు వానిని దూరముగా వర్జింపవలయును. ఓహైహయా! ఆచ్యవన నిష్కృత్యమును దెలిపితినిగదా! ఇఁకనైనను బ్రాహ్మణునికంటె క్షత్త్రియుఁ డధికుఁడనఁగలవా?' అని పలికె"నని తెలిపి భీష్ముఁడు మఱియు నిట్లనియె.

ఓధర్మజా! అప్పవనునిపలుకు లాలించి యర్జునుఁ డూరకుండుటయు, మఱియు నతఁ డా హైహయునితో 'ఓరాజా! బ్రాహ్మణుల యందే ముఖ్యకర్మము గలదు. ఇంద్రాదిదేవత, లామదునివదనమం దున్నపుడే చ్యవనునిచే వారివసుంధర యపహరింపఁబడియెను. అపు డుభయలోకములు హరింపఁబడియెనని తలంచి దేవత లెంతయు దుఃఖితులై మొఱలు వెట్టుచుఁ బరమేష్ఠిని శరణమొందిరి.

దేవతలు:—ఓలోకపూజితా! మే మామదునివదనగహ్వరమున జిక్కియున్నతఱిఁ, జ్యవనుఁడు పుడమి నపహరించెను. కపులను సురలచే స్వర్గ మపహరింపఁబడియెను.

బ్రహ్మ:—ఓయింద్రాదిదేవతలారా! మీరిఁక వడిగా విప్రుల శరణముందుఁడు. అటులేని వారు ప్రసన్నులై యెప్పటిచొప్పున మా కుభయలోకములును గలుగునట్లు సేయుదురు.' అని పలికెను. అది విని యా దేవతలు విప్రుల శరణుచొచ్చిరి. అంత నా బ్రాహ్మణులు 'దేవతలారా! మీకుఁగా, మే మెవ్వరిని జయింపవలయును?' అని యడుగుటయు, నా దేవతలు 'విప్రులారా! కపులనియెడిసురల జయింపుఁడు.' అని కోరిరి. అది విని విప్రులు, 'మేము భూగతులగువారిని జయింపఁ గలమని పలికిరి. పిదప కపినాశనకరమగు కర్మ మారంభింపఁబడియెను. అటులు వారారంభించుట తెలిసి కపు లాబ్రాహ్మణులకడకు ధనియను నొకదూత నంపిరి. వాఁడు భూగతులగు బ్రాహ్మణులతో, కపులవచనముగా నిట్లు పలికెను.

'ఓబ్రాహ్మణులారా! కపులనెడివారందఱును మీతో సమానులే. వారును మీవలె వేదవేత్తలును, బ్రాజ్ఞులును, గ్రతుయాజులును, సత్యవ్రతులునై యందఱును మహర్షితుల్యులై యున్నవారు.

మఱియు వారిని సిరి వరింప, వారును శ్రీగలిగియున్నవారు. ఋతుభిన్నకాలములందు భార్యలను బొందరు. నిష్ప్రయోజనముగా మాంసము భుజింపరు. మఱియు దీప్తాగ్నియందే హోమముచేయుదురు, గురువచనములఁ బ్రవర్తింతురు. వారందఱును నియతాత్ములును, బాలురకుఁ బెట్టియే భుజించువారును నై యుందురు. వారును రజస్వలను ముట్టుకొనరు. అటులే శుభకర్ములై స్వర్గతిని బొందుచున్నారు. గర్భిణులు వృద్ధులు మున్నగువారికిఁ బెట్టక వారును భుజింపరు. పూర్వాహ్ణములం దాడుకొనరు. పగలు నిద్రవోరు. మఱియు నిటులే పెక్కుమంచిగుణములు వారును గలిగియున్నవారు. అట్టికపులను మీ రెట్లు జయింపఁగలరు? కావున నీట్టికృత్యమునుండి మరలుఁడు, అటులేని మీకు శుభమయ్యెడిని.'

అది విని బ్రాహ్మణు లాధనియనుదూతను గాంచి 'ఓయీ! మేము కపులను జయింపఁగలము. ఎవ్వరు దేవత లనఁబడుదురో, వారే మేమని తెలియుము. కావున వారు మాకు వధసాధ్యులుగాక పోరు. నీవిఁక వచ్చినత్రోవఁ బొమ్ము' అని ప్రత్యుత్తరమిచ్చిరి. అపు డాధని కపులకడకేఁగి 'ఓయీ! మీకు విప్రులు ప్రియమొనర్పరు. కావున మీరస్త్రములు పూని వారిపై వెడలుఁడు.' అని పలుకుటయు, వారటు లొనర్పువారై వెడలిరి. సముదగ్రధ్వజాదులతో వెడలి వచ్చుచున్న కపులను గాంచి, బ్రాహ్మణులందఱును, గపులప్రాణముల నశింపఁజేయునట్టి ప్రజ్వలితాగ్నులను వారిపైఁ బ్రయోగించిరి. ఓ నరాధిపా! అపు డా బ్రాహ్మణప్రయుక్తములై సనాతనములైనయగ్నులు కపులను హతులఁ గావించి, యాకసమున మేఘములట్లు విరాజిల్లెను. అపుడు దేవతలందఱును గూడి దానవులను జయించుచుండుటను, వారికి బ్రాహ్మణులచేఁ గపులు నిహతులగుట తెలియకుండెను. అంత, మహాతేజుఁడగు నారదుఁడు వచ్చి, మహాభాగులగు బ్రాహ్మణులచేఁ గపులు హతులగుట తెలిపెను. ఆనారదునివచన మాలించి, యా దేవతలందఱును బ్రీతులై కీర్తినిధులగు బ్రాహ్మణులను బ్రశంసించిరి. అపు డా దేవతలకుఁ దేజోవీర్యములు వృద్ధినొందెను. మఱియు వారమరత్వమును, త్రిలోకపూజ్యతను బడసిరి' అని పవనుఁడు తెలుప వినికార్తవీర్యార్జునుం డిట్లనియె.

'ఓమహాబాహూ! నన్నాదరించి నావచన మొక్కటి యాలింపుము. నేనిఁక నెల్లవిధముల బ్రాహ్మణులకుఁగా జీవించెదను మఱియు బ్రాహ్మణప్రియుఁడనై బ్రాహ్మణులకు నిత్యము నమస్కరించెదను. నా కాదత్తాత్రేయు నను గ్రహముచేఁ గాదె, యీధనము బలము గలిగినది? మఱియు లోకమునఁ గీర్తియు ధర్మమును, మహాచరిత్రమును, నాకతనిమూలముననే లభించినవిగదా! ఓమారుతా! బ్రాహ్మణకృత్యము లెట్టియద్భుతము లై యున్నవి? వానినెల్ల నీవు సంపూర్ణముగా నా కెఱిఁగించితివి' అని.

అంత నప్పవనుఁడు 'ఓయర్జునా! నీవు క్షత్త్రియధర్మమును దప్పక, బ్రాహ్మణులను నీయింద్రియములను గాపాడుచుండుము. నీకు భృగువులనుండి భయము సంభవించును. అదియుఁ గాలాంతరమున నగును.' అని పలికె" నని తెలిపిన విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె.

## భగవన్మాహాత్మ్యకథనము

"ఓపితామహా! శంసితవ్రతులగు బ్రాహ్మణులను, నీవెల్లపుడును గౌరవించుచున్నాఁడవు గదా! ఎట్టికర్మఫలప్రాప్తినిబట్టి, వారిని నీ వర్చించుచున్నాఁడవు? ఓమహావ్రతా! బ్రాహ్మణపూజయందు నీవేమి వృద్ధిని గనిపెట్టి పూజించుచున్నాఁడవో యదియెల్ల నా కెఱిఁగింపుము."

అది విని శాంతనవుఁ డాకౌంతేయునితో "ఓయీ! నీ కీవిషయ, మీమహామేధాశాలియగు కేశవుఁ డెఱిఁగించును. బ్రాహ్మణపూజయం దెట్టిఫలము గలుగునో, యతఁ డనుభవపూర్వకముగా నెఱుఁగును. నాకిపుడు బలము, వినికి, వాక్కు, మనసు, చక్షువు, జ్ఞానమును నంత శుద్ధములుగా లేవు. నా దేహత్యాగమును నచిరకాలముననే జరగునని నానిశ్చయము. పగ లెప్పటికిని ముగియకున్నటు లున్నది. పురాణమున, బ్రాహ్మణక్షత్త్రియవైశ్యులకుఁ జెప్పఁబడినధర్మములును, శూద్రధర్మములును దెలిపితిని. ఓపార్థా! ఇఁక మిగిలినవాని నీశ్రీకృష్ణునివలన నేర్చికొనుము. నే నీకృష్ణుఁ డెట్టివాఁడో, యీతని ప్రాచీనమగుబల మెట్టిదియో, యనువిషయము లన్నియు యథార్థముగా నెఱుఁగుదును. ఓకౌరవేంద్రా! ఇక్కేశవుఁ డమేయాత్ముఁడు. ఇతఁడే ధర్మములకు సంశయము గలిగినపుడెల్ల వానిని రక్షించువాఁడు.

ఇతఁడే భూమ్యాకాశములను స్వర్గమును గల్పించినవాఁడు. ఈతని దేహమునుండియే మేదిని సంభవించినది. ఇతఁడు భీమబలముగల వరాహరూపమూని, పర్వతములను దిక్కులను సృజించెను. ఈతని నుండియే వాయువు, దివము, అంతరిక్షము, నాల్గుదిక్కులును, విదిక్కులును గలిగెను. సృష్టి యీతని ననుసరించి కలిగెను. పురాణుఁడగు నితఁడే విశ్వమునెల్ల సృజించెను. ఎం దాయమితతేజుఁడగు స్వయంభువు జనించెనో, యట్టిపుష్కరము మహాత్ముఁడగు నీశ్రీకృష్ణు నాభి యందుఁ బుట్టెను. ఓపార్థా! ఏమహాంధకారమున సముద్రములన్నియు నడఁగియుండెనో, యట్టి గాఢాంధకారము, నితఁడే యడంచినవాఁడు. కృతయుగమున ధర్మము సమగ్రమై యుండెను. త్రేతాయుగమున యజ్ఞము ప్రబలమై యుండెను. ద్వాపరమున బల ముత్తమమై యుండెను. అటులయినదెల్ల శ్రీకృష్ణుఁడే. కలియుగమున నధర్మము బలమై క్షితిని జేరికొనియెను. అతఁడు పూర్వదేవుఁడును, సమ్రాట్టును నై, పూర్వము దైత్యులనెల్ల నడంచెను. ఆతఁడే భూతభావనుఁడును, భూతభవ్యరూపియు, విశ్వజగత్కర్తయు నై వెలయుచున్నాఁడు. దేవతలధర్మ మెపుడు చెడుచుండునో, యపుడెల్లఁ గృష్ణుఁడు మానవు లందు జనించుచుండును. అతఁడు ధర్మము దప్పక, పరాపరలోకసమూహమునెల్ల సంరక్షించుచుండును. మఱియుఁ ద్యాజ్యులగువారిని ద్యజించి యసురవధమునకుఁ గార్యాకార్యకారణములు తానయై రక్షించుచు, భూతభవిష్యద్వర్తమానములఁ గల్గించుచు నుండును. ఈశ్రీకృష్ణుని రాముఁడుగను సోమునిఁగను నింద్రునిఁగను దెలియుము. మఱియు నితఁడే, విశ్వకర్మయు, విశ్వస్రష్టయు, విశ్వభోక్తయు, విశ్వరూపుఁడును నగుచున్నాఁడు. శూలభర్తయు, శోణితభర్తయుఁ, గరాళుఁడు నగునాతనిఁ గర్మవిదితునిఁగా సన్నుతించుచున్నారు. మఱియు విబుధగంధర్వాప్సరోనివహము లాతని ననుసరించియుండును. రాక్షసు లాతనితో సంవాదము సేయుచుందురు. రాజసుర్యలనెల్ల జయించువాఁ డతఁడొక్కఁడే. అధ్వరములం దాతని, ఋత్విజులు స్తుతించుచున్నారు. రథంతరమున సామగులు సన్నుతించుచున్నారు. బ్రాహ్మణులు బ్రహ్మమంత్రములచే నాతనిఁ బొగడుచున్నారు. అధ్వర్యు లాతనికే హవిస్సు కల్పించుచున్నారు. గోవర్ధనోద్ధరణకాలమున నింద్రాదు

లాతనిఁ బొగడిరి. అతఁడే జీవరాశుల కీశుఁడు. అతఁడు పురాణ మగు బ్రహ్మగుహను బ్రవేశించియున్నవాఁడు. ఉత్తమకర్ముఁడగు నతఁడే సకలదైత్యాసురులను గలగుండువెట్టి, భూమి నుద్ధరించిన వాఁడు. ఆతని కన్నియు భక్ష్యములనుగాఁ దెలుపుచున్నారు. యుద్ధమున నతఁడే జయప్రదాత యనుచున్నారు. శాశ్వతుఁడగు నతనికిఁ బృథివియు, నంతరిక్షము, దివమును వశమై యుండును. ఎందు మహర్షి యగువసిష్ఠుఁడు జనించె నందురో, యట్టికుంభమున మిత్రావరుణుల రేతమును సృజించినవాఁ డతఁడే. విభుఁడగుమాత రిశ్వుఁడు నతఁడే. రశ్మివంతుఁడగు సవితయు నతఁడే. అసురులనెల్ల నతఁడే జయించెను. ఇతనిపాదవిక్షేపములచే మూఁడులోకములు జయింపఁబడియెను. దేవతలకును, బితరులకును, మానవులకును నతఁడే దేవుఁడు. యజ్ఞవేత్తల యజ్ఞమతఁడే. అతఁడే కాలమును విభజించుచు, నుదయించుచున్నాఁడు. దక్షిణోత్తరాయణము లాతనివే. ఆతనికిర ణములే క్రిందికిని మీఁదికిని, నెల్లయెడలకును వ్యాపించి పుడమిని వెలయించుచున్నవి. వేదవేత్తలగు బ్రాహ్మణు లాతనినే సేవింతురు. ఆతనితేజ ముపయోగించియే సూర్యుఁడు వెలుగుచున్నాఁడు. ప్రతి మాసమందు నధ్వరముచేయు నధ్వరకర్త యతఁడే. అధ్వరమున వేద వేత్త లాతనినే పఠించుచున్నారు. త్రినాభియై సప్తాశ్వయుక్తమగు నీచక్రమును వహించుత్రిధాముఁ డతఁడే యని చెప్పఁబడియెను. మహాతేజుఁడును, సర్వగుఁడును, సర్వోత్తముఁడు నై కృష్ణుఁ డొక్కఁడే లోకములను ధరించుచున్నాఁడు. ఓధర్మజా! ఆకృష్ణునే తమోహంతయగు హంసునిగను గర్తగను దెలియుము. మహాత్ముఁ డగునతఁడే యొకపుడు ఖాండవమునఁ గతుగతుఁ డైనయగ్నియై సంతుష్టినొందెను. అతఁడే రాక్షసులను, నురగులను జయించి, సర్వ వ్యాపియై, సకలమును నగ్నియందు హోమముచేసినవాఁడు. అతఁడే మనయర్జునునకు శ్వేతాశ్వముల నిచ్చెను. అతఁడే యశ్వములనెల్లఁ గల్పించినవాఁడు. ఆతనిరథము, బంధురము, త్రిచక్రము, త్రివృచ్ఛి రము, త్రినాభియు నై వెలయుచుండును. అతఁడు పంచభూతాశ్ర యుఁడై యాకసమును గల్పించెను. అటులే పుడమియు నంతరిక్షము దివము నాతనిచే నిర్మింపఁబడియెను. అమేయదీప్తాగ్ని తేజుఁ డగునతఁడే

పర్వతములను నరణ్యములను సృజించినవాఁడు. హింసించువాఁడై వజ్రమును బ్రహరించుశక్రు నతఁడే పరిభవించెను. ప్రాచీనములగు ఋక్సహస్రములచే, విప్రులు మహేంద్రుఁడగు నాతని నొక్కనే సన్నుతింతురు. మహత్తరతేజుఁడగు దుర్వాసు నతఁడుదక్క వేఱొక్కఁ డెవ్వఁడు గృహమున నిలిపికొనఁగలఁడు? అతనిని బురాణమహర్షినిఁగాఁ దెలుపుదురు. విశ్వకర్తయగునతఁ డాత్మభావములను గల్పించుచున్నాఁడు. అధిదేవుఁడై యెవ్వఁడు వేదములను దెలియఁజేయుచున్నవాఁడో, యెవ్వఁ డగ్నిహోత్రాదుల నాశ్రయించి యున్నవాఁడో, యట్టివాఁ డావిష్వక్సేనుండే యని తెలియుము. సకలలోకములందుఁ గల పరిశుద్ధజ్యోతిస్సులును, మూఁడులోకములును, మూవురులోకపాలురును, మూఁడగ్నులును, మూఁడువ్యాహృతులును, సకలదేవతలును నాదేవకీపుత్త్రుఁడే యని తెలియుము. సంవత్సరము, ఋతువు, మాసము, పక్షము, అహోరాత్రములు, కలలు, కాష్ఠలు, మాత్రలు, ముహూర్తములు, లవములు, క్షణములు నావిష్వక్సేనుఁడే యగుచున్నాఁడు. మఱియుఁ జంద్రాదిత్యులును, గ్రహములు, నక్షత్రములు, తారకలు, సర్వపర్వములు, పౌర్ణమాసము, నక్షత్రయోగముగల ఋతువులు నావిష్వక్సేనునివలననే జనించెనని తెలియుము. రుద్రులు, నాదిత్యులు, వసువులు, నశ్వినీదేవతలు, సాధ్యులు, విశ్వేదేవులు, మరుద్గణములును, బ్రజాపతియు, దేవమాతయగు నదితియు, సప్తర్షులును శ్రీకృష్ణునుండియే యగుట తెలియుము. అతఁడు వాయువై విశ్వమును గదల్చుచున్నాఁడు. అగ్నియై దహించుచున్నాఁడు. జలమై సకలజగమును ముంచుచున్నాఁడు. బ్రహ్మయై సకలప్రాణిసంఘములను సృజించుచున్నాఁడు. వేదప్రతిపాద్యమగు వేదము విధ్యాశ్రయమగు విధేయము, ధర్మ వేద బలములందుఁ గలచరాచరాత్మకమంతయు నక్కేశవుఁడే యగునని తెలియుము. పరముఁడగునతఁడు ముందుగా జ్యోతిర్భూతుఁడై విశ్వరూపుఁడై నిజప్రభచే నెల్లవానిని బ్రకాశింపఁ జేయుచున్నాఁడు. సకలభూతాత్మ యోనియగు నతఁడు మున్నుగ జలముల సృజించి పిదప విశ్వమంతయు సృజించెను. ఋతువులును వివిధములై యద్భుతములైన మేఘములును, నైరావతాది విద్యుత్తలును, మఱియు స్థావరజంగమాత్మకమగునంతయు శ్రీకృష్ణునుండియే

యగుచున్నది. ఆతని విశ్వాత్మuని, విశ్వముగను దెలియుము. అతఁడు తన్ను విశ్వావాసునిఁగను, నిర్గుణుఁగను, వాసుదేవుఁగను, సంకర్షణుఁ గను, జీవభూతుఁగను దెలుపుచున్నాఁడు. అటులే ప్రద్యుమ్నునిఁ గను, ననిరుద్ధునిఁగను మహాత్ముఁడగునాత్మయోని యాజ్ఞాపించు చున్నాఁడు. పంచగుణోపపన్నమగు నీవిశ్వము నైదువిధములుగా సృజించువాఁడై పృథివ్యప్తేజోవాయ్వాకాశములను సృజించెను. చతుర్విధమై స్థావరజంగమాత్మకమగు లోకమునుజేసి భూమిని బంచ బీజముగా నొనర్చెను. దానిచే జగమెల్లఁ జేయఁబడెను. ఆత్మయోని యగు నతఁడు తనచే దానిని జీవయుక్తముగఁ జేయుచున్నాఁడు. పిదప దేవతలను, దానవులను, నసురులను, మహర్షులను, బితరులను, బ్రజలను, మఱియు సంక్షేపముగా సకలలోకములను సృజించువాఁడై శుభాశుభమగుస్థావరజంగమప్రపంచమును జేయుచున్నాఁడు. జరగు చున్నదియు జరగఁబోవునదియు నెల్లఁ గేశవుఁ డనియే తెలియుము. అంతకాలమునఁ బ్రాణులకగుమృత్యువును గృష్ణుఁడే యని తెలియుము. ఇందు మన మెఱుఁగనిదినైత మతఁడే యని తెలియుము. మఱియు లోకమునఁగల ప్రశస్తవస్తువు, శుభాశుభములును, గేశవుఁడే యగుచున్నాఁడు. ఇట్లుగాదనుట విపరీతమే. కేశవుఁ డిట్టివాఁడని తెలి యుము. మఱియు నితఁడే నారాయణుఁడు, పరముఁడు, అవ్యయుఁడు, నాదిమధ్యాంతములుగల జగత్తునకుఁ బ్రభవుఁడును నై వెలయు చున్నాఁడు" అని తెలుప విని యుధిష్ఠిరుఁ డిట్లనియె.

## దుర్వాసునిభిక్షావిధము

"ఓమాధవా! బ్రాహ్మణపూజయందుఁ గలఫలమును, దెలిపిన వాఁడవు. మఱియుఁ గార్యజ్ఞుఁడవు. అని యీ మాపితామహుఁ డెఱిఁగించెనుగాదే? కావున నది యెట్టిదో నా కెఱిఁగింపుము."

అది విని యవ్వాసుదేవుఁ డాధర్మజు నారసి "ఓయుధిష్ఠిరా! అటులేని జాగరూకుఁడవై వినుము. బ్రాహ్మణులగుణముల నెఱిఁగించె దను. నేనొకపుడు ద్వారవతియందు సుఖాసీనుఁడనై యుండఁగా, బ్రాహ్మణపరికోపితుఁ డైన ప్రద్యుమ్నుఁ డీవిషయమునే 'బ్రాహ్మణుల పూజయందుఁ గలఫలమును, వారియం దిహాపరములలోఁ గల

యీశ్వరత్వమును, నది గల్గుటకు నిమిత్తమును స్పష్టముగాఁ దెలుపుము. అందు నాకెంతయు సందియము గలదు.' అని నన్నుఁ బ్రశ్నించెను. అటు లా ప్రద్యుమ్నుఁడు ప్రశ్నింపఁగా, నే నపు డాతని కెఱిఁగించిన దేదియో దాని నెఱిఁగించెదను వినుము. నే నాతని కిట్లు తెలిపితిని.

'ఓప్రద్యుమ్నా! బ్రాహ్మణపూజవలనఁ ద్రివర్గమును, నపవర్గమును, నారోగ్యమును నగును. దేవతాపితృపూజలందు నాకు బ్రాహ్మణులే సంతసింపఁజేయఁదగినవారు. ఓపుత్రకా! వీరు సోమరాజులై సుఖదుఃఖములను స్వవశముగఁ జేసికొనినవారు. ఓకుమారా! ఈలోకమందును, బరలోకమందును సౌమ్యమైనదెల్ల బ్రాహ్మణప్రభవమనియే నానిశ్చయము. అందు నాకించుకేని సందియము లేదు. అటులే కీర్తియు, నాయువు, బలమును బ్రాహ్మప్రభవములే. లోకాలోకేశ్వరులందఱును బ్రాహ్మణపూజకులే యని తెలియుము. అటులగుట నే నీశ్వరుఁడనని తలంచి వారి నేల యాదరింపకుండుదును? ఓమహాబాహూ! బ్రాహ్మణులయెడ నీవెన్నఁడును గోపము చేయఁదగదు. వా రిహాపరములందును మహాత్తరులు. వారు కుపితులగుదురేని ప్రత్యక్షముగా లోకమును భస్మముగావింతురు. మఱియు వారు వేఱగులోకములను లోకేశ్వరులనుగూడ సృజింపఁగలరు. అట్టితేజోనిధులగువారిని జ్ఞానముగలవా రెవ్వ రనువర్తింపరు? ఓపుత్రకా! ఒకపు డొకబ్రాహ్మణుఁడు నాయింట నివసించెను. వానినిగూర్చి తెలిపెదను వినుము. అతఁడు హరిపింగళుఁడు, చీరవసనుఁడు, బిల్వఖండుఁడు, దీర్ఘశ్మశ్రుఁడు, కృశుఁడు నై యుండెను. మిక్కిలి పొడవుగలమానవులకంటెను బొడవైనవాఁడు. అతఁడు దేవతలయు మానవులయు లోకములన్నియు సంచరించుచుండును. మఱియు నతఁడు చత్వరములందును, సభలందును, నీగాథను బాడుచుఁ జరించుచుండును. 'ఎవ్వఁడు బ్రాహ్మణుఁడగు దుర్వాసు నింట నుంచుకొనును? సకలభూతములందును నతఁడు మిగులఁ గోపముగలవాఁడు. ఇంచుకతప్పునేని సహింపఁడు. అట్టి నా యీవచనము విని యాశ్రయ మెవ్వఁడిచ్చునో తెలుపుఁడు? నాకావాస మొసంగినవానికిఁ గోపముండఁగూడదు. అటులగుటనే నను నెవ్వరును నాదరింపరు.' అని ఓపుత్రకా! నే నాతని కావాస

మొసంగితిసని తెలిపితిని గాదే? అతఁ డొకపుడు పెక్కువేలజనము దినునంత భుజించుచుండెను. ఒకపు డల్పముగాఁ దినుచుండెను. ఒకపు డింటికే రాకయుండెను. ఒకపు డకారణముగ నగుచుండెను. వే ఱొకపు డటులే యేడ్చుచుండెను. ఆతనివయ సిప్పుడమి నెవ్వనికిని లేదు. పిమ్మట నొకపు డతఁడు తనబసకు వెళ్లి శయ్యాస్తరణములను గాల్చి యచ్చోటినుండి తొలఁగి, పిమ్మట నాకడకు వచ్చి, 'కృష్ణా! మాకిపుడు పాయసము గావలయు' నని త్వరపడియెను. ఆతనిచిత్తము నెఱిఁగినవాఁడనగుటచే నంతకుమున్నే సకలవిధాన్నపానభక్ష్యాదుల సిద్ధముగా నుండునట్టు లేర్పాటులు గావించి యుంటిని. అటులగుటఁ దత్క్షణ మాతనికి వేడిపాయస మర్పించితిని. ఆతఁ డది వడిగా భుజించి నాతో 'కృష్ణా! ఈపాయసము నీయొడలఁ బూసికొను' మని పలికెను. నే నపుడు దాని కాలోచింపకయే, యాయుచ్ఛిష్టపాయస మును దలయందును, గాత్రములందును బూసికొంటిని. అంత నతఁ డాచేరువనున్న నీతల్లియగురుక్మిణి నారసి, శుభాననయగు నామెను బరిహసించుచు, నాపాయసమును బూసి, వడిగా నప్పుడే పాయసదిగ్ధాంగియై యున్న యామెను రథమునకుఁగట్టి, తద్రథ మధి రోహించి, వెంటనే యచ్చోటినుండి వెడలి, యగ్నివర్ణుఁడై ప్రజ్వ లించుచు, నేను జూచుచుండఁగనే రథాశ్వములనుబోలె నామెను మునికోలచేఁ గొట్టెను. కాని నాకప్పటికి నిశ్శ్యాకృతమగుదుఃఖము గలుగలేదు. మఱియు నతఁడు రాజమార్గమునుబట్టి పైకి వెడలఁగా, మనయాదవులందఱును గాంచి కుపితులై వారిలో వారు, 'ఇఁక నందఱును బ్రాహ్మణులుగాఁ బుట్టవలయును. వేఱొకవర్ణమున జనింపఁ గూడదు. ఈరథము నధిష్ఠించి యితఁడు జీవించెనుగాని, వేఱొకఁడు జీవింపఁగలఁడా? లోకమున సర్పవిషమే తీక్ష్ణమైనది. అంతకంటెను విప్రుఁడు తీక్ష్ణతరుఁడు. బ్రాహ్మణవచోదగ్ధుఁ డగువానిని బ్రతికింప వైద్యుఁడు లేఁడు.' అని చెప్పికొనిరి. పిమ్మట దుర్ధర్షమగు నమ్మార్గ మున నతఁడు వెళ్లుచుండఁగా, నీతల్లి యించుక తొట్రుపాటొందెను. అందుల కతఁ డలిగి, వడిగా నడువుమని ప్రేరించుచు, నంతకును గోప మాపుకొనలేక, వడిగా రథము డిగి, పదాతియై వేఱొకత్రోవను దక్షిణాభిముఖముగాఁ బరువిడసాగెను. అటు లుత్పథగామియై పరు

విడుచున్న యమ్మునీంద్రుని, నేను బయోదిగ్ధాంగములతోడనే వెంబడించి, ప్రసన్నునిఁగమ్మని వేడితిని. అపు డతఁడు 'ఓమహాభుజా! కృష్ణా! నీవు కోపమును బరిత్యజించితివి. ఓసువ్రతా! నీవలనఁ దప్పించుకయుఁ గానరాకుండెను. కావున నీయెడ నాకెంతయుఁ బ్రీతి గలిగెను. నీకు వలయుకోర్కుల నొసంగెదను కోరికొనుము. నేను బ్రసన్నుఁడ నగుటవలన నీకుఁ గలిగినసమృద్ధి యెట్టిదియో పరికించితివా? ఎంత కాల మన్నమున, దేవతలకును మానవులకు నెట్టిభావముండునో, యట్టిభావము నీయందు వారి కగును. లోకమునఁగల పుణ్యకీర్తియెల్ల నీకగును. మూఁడులోకములందును సంపూర్ణముగుగౌరవ మందుదువు. ఓజనార్దనా! లోకమునకెల్లఁ బ్రియుఁడవగుదువు. నాచే భిన్నము దగ్ధమునైన నీదంతయు నెప్పటివలెఁ జూడఁగలుగుదువు. ఓమధుసూదనా! నీ యీగాత్రములందుఁ బాయసమును బూయుటవలన, నీవిష్టపడునంతకును నీకు మృత్యుభయము గలుగదు. ఓపుత్రకా! నీవు పాదతలములఁ బాయసము పూసికొనకుంటివేమి? అదియే నాకు సమ్మతముగాలేదు.' అని పలికి ప్రీతుఁడై శోభాయుక్తమగు నాశరీరమెల్లఁ గాంచెను. పిమ్మట రుక్మిణిని గాంచి, ప్రియమడర, 'దేవీ! నీవు సకలస్త్రీజనమందును, నుత్తమత్వము వడసి, లోకమున నుత్తమకీర్తి నొందుదువు. ఓభామినీ! నీవు రోగములును, ముదుసలితనము, వైవర్ణ్యమును బొందవు. పవిత్రగంధవై శ్రీకృష్ణు నారాధింపఁగలవు. మఱియుఁ బదునాఱువేలకాంతలలో నుత్తమవై కేశవున కాదరణపాత్రమవు, సలోకవు నగుదువు.' అని పలికి, యతఁడు మఱియు నాతో 'కేశవా! బ్రాహ్మణులనుగూర్చి నీకిట్టిబుద్ధియే యగుఁగాక' యని పలికి వెడలి యగ్నివలెఁ బ్రజ్వరిల్లుచు నతఁ డందే యంతర్ధానమొందెను. అతఁడటు లంతర్హితుఁ డయినపిమ్మట నేను, బ్రాహ్మణుఁ డేమి చెప్పినను దానిని దప్పక చేయువాఁడనని గొప్పవ్రతము పూని నీతల్లితోఁగూడ సంతుష్టాంతరంగుఁడనై యింటికి వచ్చితిని. నేనింటికి వచ్చునప్పటికతఁడు చెప్పినచొప్పున, భిన్నమై దగ్ధమైనదెల్లఁ గ్రొత్తగా నాకుఁ గానవచ్చెను. అపు డట్లు నవము, దృఢమునై చూపట్టు నద్దానినెల్లఁ జూచి నేనెంతయు విస్మయమంది బ్రాహ్మణులను మనఃపూర్వకముగాఁ బూజించితిని.'

ఓధర్మజా! బ్రాహ్మణప్రభావమును బ్రశ్నించిన ప్రద్యుమ్నున కీవిధముగాఁ దెలిపితిని. ఓకౌంతేయా! నీవును నిత్యము గోధనాదులచే మహాభాగులగు బ్రాహ్మణులను బూజింపుము. బ్రాహ్మణులయనుగ్రహముచే నాకిట్టి సమృద్ధి గలిగెను. ఈశాంతనవుఁడు నాతో నేమి తెలిపెనో యదియెల్ల సత్యమని నమ్ముము" అని పలుక విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె.

## ఈశ్వర ప్రశంస

"ఓమధుసూదనా! దుర్వాసునను గ్రహముచే శంకరునంశమగు నీకెట్టివిజ్ఞానమును గలిగెనో, యదియెల్ల నాకెఱిఁగింపుము. మఱియు మహాత్ముఁడగు నాశంభునిమహాభాగ్యమును, నామములను యథార్థముగాఁ దెలియఁగోరుచున్నాఁడను."

అది విని యావాసుదేవుఁడు "ఓయుధిష్ఠిరా! నే నామహాత్మునకు నమస్కరించి, దుర్వాసునివలన నార్జించినశ్రేయమును, గీర్తిని దెలిపెదను. నేను బ్రతిదినమును బ్రాతఃకాలమున లేచి ప్రయతుఁడనై ప్రాంజలినై దేని నధ్యయనము సేయుచుందునో, యట్టిశతరుద్రీయము నెఱిఁగించెదను వినుము. మున్ను మహాతపుఁడగు ప్రజాపతి తనతపోవసానమున దానిని సృజించెను. ఓధర్మజా! స్థావరజంగమాత్మకమగు ప్రపంచము నామహాదేవుఁడే సృజించెను. అమ్మహాదేవునిమించిన వేఱొకమహత్తరభూత మేదియును లేదు. మూఁడులోకములందును గలభూతములలో నతఁడే యుత్తముఁడు. అమ్మహాత్ము నెదుట నెవ్వఁడును స్థైర్యముగా నిలువ నుత్సహింపఁజాలఁడు. మూఁడులోకములందు నాతనికిఁ దుల్యమగుభూత మొకటి లేదని చెప్పవచ్చును. కుపితుఁడగు నతని గాలి సోకినను, శత్రువులు నిశ్చేష్టులై హతభూయిష్ఠులై చలించి పతనమొందుదురు. పర్జన్యారావతుల్యమగు నాతనిభయంకరారావము వినినయంతనే దేవతలహృదయమేని విదళితము గాకపోదు. ఆపినాకధారి కుపితుఁడై ఘోరాకారముతో నెవ్వారి నారయునో, వారు సురలెగాని, యసురులెగాని, గంధర్వులెగాని, పన్నగులెగాని నిలువఁజాలరు. దక్షప్రజాపతి యాగముచేయు

చుండఁగా, నతఁడు కుపితుఁడై నిర్భయముగా ధనువునుండి బాణము విడిచి దానిం జెఱిచి, భయంకరముగా ధ్వని యొనర్చెను. దానిచే నందలి దేవతలకు శాంతి గలిగెనా? లేదు. మఱియు వారు విషాద మొందిరి. అటు లతఁడు కుపితుఁడై యజ్ఞమును జెఱిచి, ధనుష్టంకార మొనర్చుటయు, లోకములన్నియు సమాకులములయ్యెను. సురాసురులందఱు నవశులై విషాదమందసాగిరి. జలాశయములన్నియుఁ గలఁతనొందఁజొచ్చెను. పుడమి వడఁకెను. కొండలు చలింప మొదలిడెను. ఆకసము బ్రద్దలైనట్టు లయ్యెను. లోకములన్నియు నంధకారబంధురములై ప్రకాశింపకుండెను. ఓధర్మజా! సూర్యునితోఁగూడఁ జంద్రాదుల కాంతి నష్టమయ్యెను. అపుడు మహర్షులు భీతులై సకలభూతహితముగా స్వస్త్యయనములను శాంతినిఁ జేయసాగిరి. పిమ్మట రుద్రుఁడు రౌద్రపరాక్రముఁడై దేవతలను వెంటఁదఱుమఁజొచ్చి, భగునినయనముల నొకప్రహారముచేఁ గోపమడర నశింపఁజేసెను. మఱియుఁ గుపితుఁడై పూషునిఁ బాదముచే మెట్టి, పురోడాశము భక్షించుచున్న యాతనిదంతము లూడునట్లు ప్రహరించెను. అపుడద్దేవతలు వడఁకుచు శంకరునకు నమస్కరించిరి. మఱియు నతఁడు ప్రదీప్తమై వాఁడియైనశర మొకటి సంధించెను. అంత నాదేవతలును మహర్షులును నారుద్రునివిక్రమముఁ గాంచి జడిసి, మఱియు నందఱు గూడి యతనిఁ బ్రసన్నునిఁ గావించువారై, చేతులు మొగిడ్చి శతరుద్రీయమును బఠించిరి. అంత నాదేవతలసంస్తుతులకు సంతసించి మహేశ్వరుఁడు ప్రసన్నుఁడయ్యెను. అపుడు వారా రుద్రునకు యజ్ఞమున విశిష్టభాగమును గల్పించిరి. అటులు భాగమిచ్చుటయె గాక, భయభ్రాంతులగుట శరణమొందిరి. అపు డాదక్షునిచే యజ్ఞము సమకూర్పఁబడియెను. ఆయాగమున నంతకుము న్నపహరింపఁబడినదెల్ల మరల యథాప్రకారముగ నమర్పఁబడియెను. ఓయుధిష్ఠిరా! మఱియొకటి దెలిపెదను. మున్నొకపుడు పరాక్రమవంతులగు రాక్షసులకు మూఁడుపట్టణము లుండెను. ఆకాశగతములగు నయ్యవి యాయస, రాజత, సౌవర్ణములై వెలయుచుండును. ఇంద్రుఁడు తనసకలాయుధములచేతను వానిని భేదింపఁజాలఁడయ్యెను. అపుడందఱును బీడితులై,

మహారుద్రుని శరణమందిరి. అంత మహాత్ములగు దేవతలందఱును గూడి 'ఓరుద్రదేవా! ఇఁక సకలకర్మములందును రౌద్రపశువులే యుపయోగింపఁబడును. కావున నిప్పురములతోఁ గూడ దైత్యులను నశింపఁ జేయుము. లోకములను రక్షింపుము.' అని ప్రార్థించిరి. అంత నతఁడందులకు సమ్మతించి, నారాయణుని నారాచముగా నొనర్చి, యగ్నిని బాణాగ్రముగఁ జేసి, యముని పుంఖముగఁ గల్పించి, సకలవేదములను ధనువుగను, సావిత్రి నల్లెత్రాడుగను జేసి, బ్రహ్మను సారథిగా నొనర్చి, త్రిపర్వము త్రిశల్యమునగు నాసాయకముచేఁ దగుకాలము కనిపెట్టి, యాపత్తనములను ఛేదించెను. ఓధర్మజా! ఆరుద్రుని యాదిత్యవర్ణమై కాలాగ్నిసమతేజమైన సాయకముచే బురములతోఁగూడి యారక్కసులు దగ్ధులైరి. మఱియొకపుడు బాలుఁడై యతఁడు పంచశిఖుఁడై యంకగతుఁడగుటఁ గాంచి యుమాదేవి, 'వీఁ డెవ్వఁడని సందేహించెను. అపుడింద్రుఁ డసూయపడి, వజ్రాయుధముచేఁ బ్రహరింప నెంచుటయుఁ, బరిఘతుల్యమై వజ్రాయుధముతోఁ గూడిన యాతనిబాహువు స్తంభింపఁజేయబడియెను. అటు లొనర్చినవాఁ డా త్రిభువనేశ్వరుఁడని దేవతలు తెలియరైరి. ప్రజాపతులు మున్నగువారందఱును నయ్యీశ్వరునిపట్ల మోహమందిరి. పిమ్మట భగవానుఁ డగుపరమేష్ఠి యమేయతేజుఁడగు నామహాదేవుని ధ్యానించి యాబాలుఁ డుమాపతియేయని తెలిసికొని నమస్కరించెను. అనంతర మాదేవత, లయ్యుమను రుద్రునిఁ బలువిధముల సన్నుతించిరి. పిదప నాయింద్రునిబాహువెప్పటియట్లు లయ్యెను. ఓయుధిష్ఠిరా! అతఁడే సారముగలదుర్వాసుఁడను బ్రాహ్మణోత్తముఁడై ద్వారవతియనియెడి పత్తనమునఁ జిరకాలము నివసించెను. అటులు నాయింటనుండి యతఁ డనేకములగు వికారము లొనర్చెను. దుస్సహములగు వానినెల్ల నే నతిగంభీరభావముతో సహించితిని. అతఁడు రుద్రుఁడును, పశుపతియు, శివుఁడు, అగ్నియు, శర్వుఁడు, సర్వజేతయు ననఁబడుచున్నాఁడు. మఱియు నతఁడే యింద్రుఁడును, వాయువును, నశ్వినీదేవతలును, మెఱుపులును, చంద్రుఁడును, నీశానుఁడు నగుచున్నాఁడు. అతఁడే సూర్యుఁడు, అతఁడే వరుణుఁడు, అతఁడే కాలము, అతఁడే మృత్యువు, అతఁడే

యముఁడును, దేవవలు నగుచున్నాఁడు. అతఁడే మాసార్ధమాస ములును, ఋతువులును, సంధ్యలును, సంవత్సరమును, ధాతయు, విధాతయు, విశ్వకర్ముఁడును, విశ్వవేత్తయు నగుచున్నాఁడు. మఱియు నక్షత్రములును, గ్రహములు, దిక్కులు, విదిక్కులును నతఁడే యగుచున్నాఁడు. ఆభగవానుఁడు విశ్వమూర్తియు నమేయాత్ముఁడు నై యొకవిధముగను, ద్వివిధముగను, బహువిధముగను నగుచున్నాఁడు. మఱియు నతఁడే వేయివిధములుగను, లక్షవిధములుగను నగుచున్నాఁడు. అమ్మహాదేవుఁ డిట్టివాఁడు. ఆభగవానుఁ డజుఁడు. ఇంతయేల? ఆతనిసద్గుణమును వందలకొలఁదివత్సరములకైనను వర్ణింప నలవిగాదు" అని తెలిపి వాసుదేవుఁడు మఱియు నిట్లనియె.

"ఓయుధిష్ఠిరా! మఱియు నమ్మహాత్ముఁడగు మహాదేవుని మహాభాగ్యమును వివరించెదను వినుము. బహురూపుఁడు, బహునాముఁడు నగురుద్రునివిధ మెఱిఁగించెదను. అతఁ డగ్నియు, మహాదేవుఁడు, స్థాణువు, మహేశ్వరుఁడు, ఏకాక్షుఁడు, త్ర్యంబకుఁడు, విశ్వరూపుఁడు, శివుఁడు ననఁబడుచున్నాఁడు. ఆదేవునితనువులు రెండని వేదజ్ఞులగుబ్రాహ్మణులు తెలుపుచున్నారు. అందొకటి ఘోరతనువును, మఱియొకటి శివతనువు నై, మఱియు బహువిధములుగను నుండును. ఉగ్రము, ఘోరము నగు నాతని తనువు, వహ్నివిద్యుద్భాస్కర రూపమై యున్నది. సౌమ్యమగు రెండవరూపము ధర్మము, ఉదకములు, చంద్రుఁడు నగుచున్నది. మఱియు నాతనితనువు సగ మగ్నియు, సగము చంద్రుఁడునుగాఁ జెప్పఁబడుచున్నది. ఒకమూర్తి బ్రహ్మచర్యమును జేయుచున్నది. రెండవది పార్వతియై యున్నది. ఆతనిఘోర తనువు జగమును సంహరించుచుండును. ఈశ్వరత్వము మహాత్వమును గలుగుట నతఁడు మహేశ్వరుఁ డనఁబడుచున్నాఁడు. తీక్ష్ణుఁడును, నుగ్రుఁడును, ప్రతాపవంతుఁడును, మాంసశోణితమజ్జాదుఁడును నై దహించుచుండుటను, రుద్రుఁడనఁబడుచున్నాఁడు. అతఁడు దేవతలలో మహత్తరుఁడగుటను, నాతనివిషయము మహత్తరమగుటను, మహత్తర మగువిశ్వమును రక్షించుచుండుటను మహాదేవుఁ డనఁబడియెను. ఆతని జటారూపము ధూమ్రమైయుండుటను, నతఁడు ధూర్జటి యనఁబరఁగు

చున్నాఁడు. సకల కర్మములచే నెల్లమానవులశుభమును గోరుచు సమృద్ధిగలిగించుటను శివుఁ డనంబడుచున్నాఁడు. ఊర్ధ్వస్థితుఁడై మానవుల ప్రాణములను దహించుటను, స్థిరుఁడగుటను, స్థిరలింగుఁడగుటను, స్థాణువని చెప్పఁబడుచున్నాఁడు. భూతభవిష్యద్వర్తమానముల నాతని జంగమస్థావరరూపము బహువిధములై యుండుట బహురూపుఁ డని చెప్పఁబడియెను. సకలదేవత లాతనియం దుండుటను విశ్వరూపుఁ డనఁబడును. మఱియు నతఁడు సహస్రాక్షుఁడును, నయుతాక్షుఁడును, సర్వతోఽక్షిమయుఁడును, జక్షుగ్ప్రభవతేజము నగుట సర్వచక్షు వగుచున్నాఁడు. ఎల్లవిధములఁ బశువులఁ బాలించుచు, వానితో నాడుకొనుచు, వాని కధిపతియై యుండుటను బశుపతి యనఁబడెను. నిత్యబ్రహ్మచర్యముచే నీతని లింగముండుట నతఁడు గూఢలింగుఁ డనఁబడును. ఆతనివిగ్రహమగులింగమును బూజించువాఁడు మహత్తరమగు సిరుల నొందుచున్నాఁడు. మహర్షులును, దేవతలును, గంధర్వులు, నప్సరసలును నూర్ధ్వస్థితమై యున్నలింగమునే యర్చించుచున్నారు. ఆలింగము పూజింపఁబడునేని యతఁడు సంతసించుచున్నాఁడు. భక్తవత్సలుఁడగునతఁడు ప్రీతుఁడై భక్తులకుసుఖ మొసంగుచున్నాఁడు. అతఁడే శ్మశానములందు వసించుచు దహించుచున్నాఁడు. అచ్చోట నాతనిఁ బూజించువారు వీరస్థానసేవకు లగుచున్నారు. అతఁడే శరీరములందు విషమస్థుఁడై ప్రాణులకు మృత్యువగుచున్నాఁడు. అతఁడే శరీరుల శరీరములందుఁ బ్రాణపాలకుఁడైనవాయు వగుచున్నాఁడు. లోకమున దీప్తములు, ఘోరములు, బహువిధములునై యాతని రూపము లెన్నిగలవో, యేయవి పూజింపఁబడుచున్నవో, వానిని విప్రులు తెలియుచున్నారు. దేవతలం దాతనినామములు యథార్థములై పెక్కుగానవచ్చుచున్నవి. అటులగుట నవి యాతనికర్మములను బట్టియుఁ, జరిత్రములనుబట్టియు నిరుక్తములగుచున్నవి. ఆతని శతరుద్రీయమును వేదమున విప్రులు తెలియుచున్నారు. అమ్మహాత్ముని యుపస్థాన మావ్యాసునిచేఁ జెప్పఁబడినది. అతఁడు సర్వలోకప్రదాతయనియు, మహత్తనియు, విశ్వమనియుఁ జెప్పఁబడుచున్నాఁడు. బ్రాహ్మణులును, మహర్షులును నాతని జ్యేష్ఠునిఁగాఁ దెలుపుచున్నారు.

దేవతలలో నతఁడు ప్రథముఁడై ముఖమునుండి యగ్నిని జనింపఁ జేసెను. బహువిధములగు గ్రహములచే నిరుద్ధములగు ప్రాణములను విడిపించుచున్నాఁడు. పుణ్యాత్ముఁడగు నతఁడు శరణ్యుఁడై శరణాగతు లగువారిని విడిచిపెట్టఁడు. మానవుల కారోగ్యము, నాయువు, నైశ్వర్యము, విత్తము, పుష్కలములగు కామములు మున్నగువాని నిచ్చువాఁడును, మఱియుఁ దీసికొనువాఁడు నతఁడే యైయున్నాఁడు. ఇంద్రాదులగు దేవతలం దాతనియైశ్వర్యము మహత్తరమై చెప్పఁబడుచున్నది. లోకత్రయమునఁ గలశుభాశుభములం దతఁడే వ్యాపించి యున్నవాఁడు. సకలకామాధీశుఁడగుట నీశ్వరుఁ డనఁబడుచున్నాఁడు. లోకముల మహత్తరములగువాని కీశ్వరుఁడై మహేశ్వరుఁడయ్యెను. బహువిధరూపములతో నీలోకమును వ్యాపించియున్న యమ్మహాదేవునివక్త్రము సముద్రగతమగు బడబాముఖమైయున్నది." అని తెలిపెనని చెప్పి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

## ధర్మకథనము

ఓజనమేజయా! ఆదేవకీనందనుఁడగు శ్రీకృష్ణుఁ డిట్లు తెలుపఁగా, విని యుధిష్ఠిరుఁడు మఱియు నాశాంతనవునిఁ జూచి, "ఓమహాబుద్ధీ! సర్వధర్మజ్ఞా! ప్రత్యక్షము, శ్రుతి అనురెండిటిలో నేయది ప్రమాణమో, వానిలో నేయది బలవత్తరమో తెలుపుము." అని ప్రశ్నించెను.

అది విని యాశాంతనవుఁడు "ఓధర్మజా! ఇందు సంశయింపఁ దగినది లేదని నాయభిప్రాయము. ప్రాజ్ఞా! మంచిప్రశ్న మొనర్చితివి. తెలిపెదను వినుము. అందు సంశయము సులభముకాని, నిర్ణయము దుర్ఘటము' ఎచ్చట సంశయమొదవునో, యందు శ్రుతప్రత్యక్షములు రెండును దోఁచుచుండును. ప్రాజ్ఞులగువారు ప్రత్యక్షకారణము హైతుకమని, యాగమమునే సత్యమునుగా నిశ్చయించుచున్నారు. అది సరిగాదని పండితమానులగుబాలురు నిశ్చయించుచున్నారు. లేక శ్రుతమొక్కటి కారణ మెట్లగునని సంశయింతువేని, దీర్ఘకాలము యోగబలముచే నది తెలిసికొనుటకు శక్యమగుచున్నది. బహువిధ

మగు జీవయాత్రను గల్పించుచున్నయాపదునకే యది తెలియవగును గాని, వేఱొక్కనికిఁ దెలియదు" అని తెలుప విని యుధిష్ఠిరుఁ డిట్లనియె.

"ఓతాతా! ప్రత్యక్షము, అనుమానము, ఆగమపూర్వకమగు శిష్టాచారము అని ప్రమాణములు పలుతెఱఁగులై యుండును. అందు బలవత్తర మెయ్యదియో తెలుపుము."

అది విని భీష్ముఁడు, "ధర్మజా! దురాత్ములు బలవంతులై ధర్మమును జెఱుచునపుడు, ప్రయత్నపురస్సరముగా నొనర్చినవ్యవస్థయును భేదింపఁబడుచున్నది. తృణములచేఁ గూపమట్లు లధర్మము ధర్మరూపముతో నావరించియుండును. అటులగుట ధర్మహీనులచే శిష్టాచారము చెడుచుండును. ఎవ్వరు శ్రుతిత్యాగపరాయణులై శిష్టాచారవిహీనులగుదురో, యట్టిధర్మద్వేషులు మందబుద్ధులు నగువారికి వానియెడ సంశయ మగును. సజ్జనులమార్గమునెడఁ దృష్టిగొనక శాస్త్రబుద్ధులై ప్రమాణసంతుష్టులగువారిని సేవించి ప్రశ్నింపుము. మఱియు లోభమోహానుసారులగు కామార్థములను వెనుకఁబెట్టి యెవ్వరు ధర్మమునే తెలిసికొందురో, వారిని సేవించి ప్రశ్నింపుము. వారిశిష్టాచారమును యజనస్వాధ్యాయకర్మమును జెడవు. అట్టివారి కమ్మూఁడును గలిసియే ధర్మమును సాధింప నగుచున్నవి" అని తెలిపెను.

అంత నయ్యుధిష్ఠిరుఁడు "తాతా! మఱియు నాబుద్ధి సంశయమగ్నమగుచున్నది. అపారమగుసంశయాబ్ధిలో మునుఁగుచుఁ, దీరమును గానకున్నవానికిఁ బ్రత్యక్షము, ఆగమము, ఆచారము అను ప్రమాణములలో నొకటియే ధర్మజనకమగునేని, యపుడు మూఁడును గలిసి ధర్మజనక మను టెట్లు?" అని యడుగ శాంతనవుఁడు, "ఓధర్మజా! దురాత్ములు బలవంతులై ధర్మమును జెఱుచుచున్నపుడు, మూఁడు ప్రమాణములు గలియనక్కఱయుండునా యని తలంతువే, నపు డొకటియే ధర్మజనక మగునని తెలియుము. నామతమున మూఁడిటికిని, నొక్కొక దానికిని ధర్మజనకత్వమున్నది. మూఁడుధర్మమార్గములఁ దెలిపితినిగదా! తర్కించి ధర్మజిజ్ఞాస చేయఁదగదు. ఇందు నీకు సందియమొందఁ బనిలేదు. అంధునట్లును, జడునట్లును శంకవిడిచి నాచెప్పినచొప్పున నాచరింపుము. అహింసయు, సత్యము, శాంతియు, దానము ననియెడినాల్గిటిని

సేవింపుము. అదియే సనాతనధర్మము. పితృపైతామహోచితమగు బ్రాహ్మణభక్తిని సంపాదింపుము. వారే ధర్మోపదేశికులు. అవివేకియై యెవ్వఁడు ప్రమాణము నప్రమాణముగఁ జేయునో, వాఁడు ప్రామాణ్యార్హుఁడు గానేరఁడు. మఱియు విషాదజనకుఁడు నగుచున్నాఁడు. కావున బ్రాహ్మణులనే సత్కరించి బహుమానపురస్సరముగా సేవింపుము. వారియందే సకలలోకము లున్నవని తెలిసికొనుము." అని తెలుపుటయు, మఱియు నయ్యుధిష్ఠిరుఁడు "పితామహా! ఎవ్వరు ధర్మమునెడ నసూయవహింతురో, వారును, ధర్మమును సేవించువారును నెట్టి గతుల నొందుదురో నాకెఱిఁగింపుము." అని ప్రశ్నించెను. అందులకతఁడు "ఓధర్మజా! రజస్తమోభిభూతులై ధర్మవిద్వేషులగువారు నరకమును బొందుచున్నారు. సత్యార్జవపరులై ధర్మమును నిత్యము నభిలషించువారు స్వర్గభోక్తలగుదురు. ఎవ్వరు ధర్మమును సేవింతురో, యట్టివారి కాచార్యోపాసనమే ధర్మగతియై వారు దేవలోక మొందుదురు. దేవతలేగాని మానవులేగాని, శరీరము నెవ్వరు దపింపఁజేయుదురో, వారు లోభద్వేషవివర్జితులగుచు సుఖమనుభవింతురు. ధర్మమును బ్రహ్మకుఁ బ్రథమపుత్త్రునిఁగాఁ బండితులు తెలుపుచున్నారు. భోజనప్రియులు పక్వఫలమునట్లు ధర్మశీలురు ధర్మమునే సేవించుచుందురు" అని తెలిపెను. అంత నయ్యుధిష్ఠిరుఁడు, "ఓతాతా! దుష్టుల విధ మెట్టిది? సజ్జను లేమిచేయుదురు? సజ్జనులయు, నసజ్జనులయు విధ మెట్టిదో నాకెఱిఁగింపుము." అందుల కప్పితామహుఁడు "ఓధర్మజా! అసజ్జనులు, దురాచారులును, దుర్ధర్షులును, దుర్ముఖులునై చూపట్టుదురు. సాధువులు శీలసంపన్నులును, శిష్టాచారవంతులునై వెలయుచుందురు. ఓరాజేంద్రా! రాజమార్గమందును, గోవులనడుమను, ధాన్యమధ్యమందును ధర్మవంతులగువారు మలమూత్రములను విడువరు. మఱియుఁ బంచయజ్ఞములు గావించి, పిదప నతిథిశేషాన్నమును భుజింతురు. భుజించునపుడు మాటలాడరు. ఆర్ద్రహస్తులై నిద్రింపరు. అగ్నిని, వృషభమును, దేవుని, గోష్ఠమును, జతుష్పథమును, బ్రాహ్మణుని, ధార్మికుని, వృద్ధునిఁ గాంచినపుడు, వారికిఁ బ్రదక్షిణము సేయుదురు. ఇంకను సజ్జనులు, వృద్ధులకును భారతప్తులకును, స్త్రీలకును,

బాలురకు, నాతురులకు, బ్రాహ్మణులకు, గోవులకు, రాజులకు మార్గము నొసంగుదురు. మఱియు నతిథులకును, సకలవిధప్రేష్యులకును, స్వజనములకును, శరణాగతులకును స్వాగత మొసఁగి వారిని రక్షించుచుందురు. మానవులకు సాయంప్రాతఃకాలములయందే భుజించుట దేవకల్పితము. వానికి నడుమ భోజనముచేయుట యెందును గానఁబడదు. అది యుపవాసవిధి యనఁబడుచున్నది. హోమకాలమున నగ్ని యెట్లు హోమమునకుఁ బ్రతీక్షించునో, యటులే ఋతుకాలమునఁ గాంతఋతువును బ్రతీక్షించుచుండును. ఋతుకాలమునఁ దక్క వేఱొక్కకాలమున స్త్రీసంగమము సేయకుండుట బ్రహ్మచర్య మనఁబడును. అమృతము, బ్రాహ్మణులు, గోవులు, అనియెడిమూఁడును సమానము. కావున యథావిధిగా నిత్యము బ్రాహ్మణు నర్చింపవలయును. యజుస్సుచే సంస్కరింపఁబడినమాంసమును దినినను దోషము లేదు. పృష్ఠమాంసభోజనము, వృథామాంసభోజనము, పుత్రమాంసభోజనమును దుల్యములు. నిజదేశమునఁగాని, పరదేశమునఁగాని, యతిథి కభోజనము గలిగింపఁగూడదు. గురు నియుక్తమగు కృత్యమును సఫలము గావించి, యాతని కెఱిఁగింపవలయును. గురులగువారిని బూజించి, నమస్కరించి యాసన మొసంగవలయును. గురుల నారాధించినవారి కాయువుఁ, గీర్తియు, సిరియు వర్ధిల్లుచుండును. వృద్ధులతో నతివాదముసేయుటయు, వారికిఁ గార్యము నియోగించుటయు, వారు నిలువఁబడియుండఁ గూర్చుండుటయుఁ దగదు. అటులొనర్చిన వానియాయువు క్షీణించును. వస్త్రవిసర్జనము చేసి యున్నస్త్రీపురుషులను జూడరాదు. మైథునము, నాహారమును రహస్యముగా నొనర్పవలయును. గురువులే, తీర్థములలో నుత్తమతీర్థ మనఁబడుదురు. పవిత్రములలో హృదయపవిత్రతయే పవిత్రము. కనిపెట్టఁదగినవానిలో జ్ఞానము కనిపెట్టఁదగినది. నిత్యసంతోషమే పరమ సుఖము. సాయంప్రాతఃకాలములందు వృద్ధుల పవిత్రవచనముల వినవలయును. వృద్ధసేవచే మానవుఁడు శ్రుతము నొందుచున్నాఁడు. స్వాధ్యాయమందును, భోజనమందును యజ్ఞోపవీతి గావలయును. వాఙ్మానసములను, నింద్రియములను నిత్యము నియమింపవలయును,

శ్మశ్రుకర్మమున మంగళవచనమును, దుమ్మునపుడు 'చిరంజీవ' యనుటయు, వ్యాధితులయెడ నాయువును గోరుటయుఁ గర్తవ్యములు. మిగుల నాపదలో నున్నపుడును 'నీ'వని పలుకరాదు. త్వంకారమునకును వధమునకును భేదములేదని వివేకులమతము. అట్టిపదము పండితులయెడ నుపయోగింపఁదగదు. తనకంటెఁ దక్కువవారియెడను, శిష్యులయెడను, దనతోసమానులగువారియెడను దాని నుపయోగింపవచ్చును. పాపకర్మనిశ్చయము నిత్యము పాపమునే తెలుపుచుండును. అప్పాపకర్మలు తమకుఁ దెలిసిచేసియు, వానిని గప్పిపుత్తురు. అట్లు తెలిసిచేసినదానిని బెద్దలయెడ దాఁచినవారు నశించుచున్నారు. వారు తామొనర్చినదానిని మానవులును, దేవతలును దెలిసికొనలేరని తలంచి యట్లు చేయుదురుగాని యది యనుచితము. వానిపాపమే వానిని దెలియఁజేయును. వాఁడు పాపమునే చేయును. వడ్డికిచ్చిన వానిధనము దినదినమునకును బెరిఁగినట్లు వానిపాపము పెరుఁగుచుండును. ధర్మముచేఁ గప్పఁబడినపాపము ధర్మమునే వర్ధిల్లఁజేయును. లవణము జలములోఁ గలసి యడఁగునుగాదే! పాపము ప్రాయశ్చిత్తముచే హతమై వెంటనే నశించుచున్నది. కావునఁ బాపమును దాఁచుకొనఁగూడదు. అటులే నది వృద్ధినొందును. ఒకపుడు పాపమొనర్పఁబడెనే, నద్దానిని సజ్జనుల కెఱిఁగించినచో, వారద్దానిని నశింపఁజేయుదురు. దురాశచే సంపాదింపఁబడినద్రవ్యము కొంతకాలమున కనుభవముచేనైనఁ దరిగిపోవును. లేదా, ఆసంపాదకుఁడు నశించినపిమ్మట దాని నన్యులు స్వీకరింతురు. ధర్మమే సకలభూతములకును మన్నింపఁదగినదని పండితులు తెలుపుచున్నారు. కావున సకలప్రాణులును ధర్మమునే యాచరింపవలయును. అసహాయుఁడగుచు ధర్మమాచరింపవలయునుగాని, చిహ్నములచే ధర్మమును దెలియఁజేయ నక్కఱలేదు. ఎవ్వరు ధర్మఫలమనుభవింతురో, వారు ధర్మవణిజు లనఁబడుదురు. దంభములేకుండ దేవతల నర్చింపవలయును. అసూయారహితముగా గురుని సేవింపవలయును. పరలోకమున కుపయుక్తముగాఁ బాత్రప్రయుక్తమై దానశబ్దబోధితమగునిధి నుంచుకొనవలయును" అని తెలుప విని యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె.

నీతికథనము

"ఓపితామహా! బలవంతుఁడైనను భాగ్యహీనుఁడు ధనమును బొందఁజాలఁడు. అదృష్టమున్నచోఁ గృశుఁడును బాలుఁడునయ్యు ధనమును బొందుచున్నాఁడు. అటులే యెంత ప్రయత్న మొనర్చినను, లాభకాలము రానపుఁడు ధనము లభింపదు. లాభకాలము వచ్చినపుడు ప్రయత్నము చేయకున్నను విపులమగు ధనము లభించుచున్నది. వందల కొలంది మానవులు ప్రయత్న మొనర్చియు, విఫలమనోరథులైనవారగపడుచున్నారు. అటులే ప్రయత్నము లేకయే పెక్కురు వృద్ధి నొందుచున్న వారు గానవచ్చుచున్నారు. యత్నమందే మానవునకుఁ గార్యసిద్ధి. సామర్థ్యమున్నచో, వెంటనే వాని కక్కార్య మైనదనియే చెప్పవచ్చును. ఆపక్షమున విద్వాంసుఁడును, విద్యాహీనుఁడును వృత్తికై యొకని నాశ్రయింపవలసినది లేదు. మానవుల కలభ్య మెన్నఁడును లభింపదు. ప్రయత్న మొనర్చియు, మానవులు విఫలులయిన వారు గానవచ్చుచున్నారు. పురుషుఁడు జలమును బొంది పిపాసను జయించినట్టులు, విద్యచే నిష్టార్థము లభించును. కావున విద్య నెవ్వఁడును విసర్జింపరాదు. బహుసాయకములచేఁ బడఁగొట్టినను గాలము సమీపించినచో మరణింపఁడు. తృణాగ్రము గ్రుచ్చికొన్నను, గాలమువచ్చినవాఁడు జీవింపజాలఁడు."

"ఓయుధిష్ఠిరా! ప్రయత్నములొనర్చియు, ధనమును బొందఁ జాలనపుడు, భయంకరమగుతపము నొనర్పవలయును. బీజమునాటక యంకురము జనింపదుగదా! 'దానముచే భోగియు, వృద్ధసేవచే మేధావియు నగుదురు. అహింసచే దీర్ఘాయువు నగును.' అని పండితులు తెలుపుచున్నారు. కావున దానము చేయవలయునుగాని యాచింపరాదు. ధర్మవంతులను బూజింపవలయును. మంచిమాట లాడువాఁడు ప్రియకర్తయగును. ఏప్రాణినీ హింసింపనివాఁడు శుద్ధుఁ డనఁబడును. దంశకీటపిపీలికాదుల సుఖాసుఖప్రాప్తిలోఁ గర్మమె నియామకమగుటఁ దెలిసి స్థిరచిత్తుఁడవై ప్రవర్తిల్లుము" అని తెలిపి మఱియు నిట్లనియె.

—— ధర్మకథనము ——

"ఓయుధిష్ఠిరా! ఏది చేయఁబడుచున్నదో, యేది చేయింపఁబడు చున్నదో యట్టిమంచిచెడ్డలగు కృతాకృతములలో మంచినిగూర్చి సంతసింపవలయును. చెడుగునుగూర్చి చింతింపవలయును. కాలమే మిగుల శక్తిగలది. అదియే నిగ్రహానుగ్రహములనిచ్చునది. భూతముల బుద్ధియం దావేశించి, యదియే ధర్మాధర్మములను బ్రవర్తిలఁజేయు చున్నది. 'ఎపుడు మానవునకు ధర్మఫలప్రదర్శనమువలన ధర్మబుద్ధి గలుగునో, యపుడే యతఁడు ధర్మమును విశ్వసించును. అట్టిదృఢ బుద్ధిగలుగనికాలమున విశ్వాస ముంపఁడు.' అని గ్రహించుటయే ప్రాజ్ఞునిలక్షణము. కాలయుక్తుఁడై ధర్మాధర్మములను దెలిసి ధర్మము నాచరింపవలయును. ధర్మమొనర్చినవారె గదా! ప్రాప్తైశ్వర్యులై జనించుచున్నారు. కాల మెపుడును ధర్మము నధర్మముగాఁ జేయదు. కావున ధర్మనిష్ఠగలయాత్మనే విశుద్ధమునుగాఁ దెలియవలయును. కాలపరిరక్షితమగు ధర్మమును, బ్రజ్వలించునగ్నినిబోలె. నధర్మము స్పృశింపనైనఁజాలదు. కావున మనశ్శుద్ధిని, నధర్మాస్పర్శమును జేయ వలయును. ధర్మమే విజయమందుచున్నది. ఎవ్వఁడు నొక్కనిఁజేయి వట్టికొని తీసికొనిపోఁజాలఁడు. ధర్మమే యుత్తమగతికిఁ దీసికొని పోవుచున్నది. కావున శుభహేతుకములగు ధర్మములందే విశ్వాస ముంపవలయును. 'నేను శూద్రుఁడను, నాకు నాలుగాశ్రమధర్మ ములను సేవింప నధికారములేదు' అనువిజ్ఞానము బుద్ధియందుఁ గొందఱుంచుకొనరు. చాతుర్వర్ణ్యధర్మములను విశేషించి చెప్పెదను. సకలభూతములును బంచభూతాత్మకములై సమములయ్యు, ధర్మ మందును లోకధర్మమందును విశేషముగలవియై యుండును. ఎట్లును లోక మశాశ్వతము. ధర్మము, శాశ్వతము. కాల మెటుల స్థిర మైనదో, యటులే ధర్మమును స్థిరమైనదే. భూతములన్నియుఁ దుల్యదేహములును, దుల్యాత్మలు నై యుండును. అయినను ధర్మ యుక్తమగుకాలమే శ్రేయస్సంపాదన సమర్థమగుచున్నది. కావున ధర్మాచరణమున శంక యేమియు లేదు. తిర్యగ్యోనిగతమగులోకమే దానికి నిదర్శనము," అని తెలిపెనని చెప్పి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

## వంశానుకీర్తనము

జనమేజయా! అనంతర మా కుంతీతనయుఁ డా శాంతనవు నారసి సకలకల్మషాపహారమగు హితమార్గమును దెలియఁగోరి "ఓపితామహా! మానవునకు దేనివలన శ్రేయమగును? ఏమియొనర్చిన సుఖ మొందుచున్నాఁడు? ఎట్లు పాపరహితుఁడగును? ఏవి పాపముల నడంచును?" అని ప్రశ్నించెను. అది విని శరతల్పగతుఁడై యున్న యా భీష్ముఁడు "యుధిష్ఠిరా! నేనిపుడు దైవవంశమును దెలిపెదను దాని వలనఁ గల్మషనాశమయ్యెడిని. ఋషివంశసమన్వితమగు నా దైవతవంశ మును మూఁడు కాలములయందును బఠించినవారిపాపము లడంగును. మానవుఁ డేనాఁడు తనయింద్రియములచే నేపాపమును దెలిసిగాని, తెలియకగాని యొనర్చినను, మఱియు రాత్రియందును సంధ్యల యందును బాప మొనర్చినను, నవియెల్ల శుచియై యీ దేవవంశ పఠనమునచేసిన నది యడంగుచున్నది. దీనిని బఠించినవాఁ డంధుఁ డును బధిరుఁడును గాఁడు. అట్టివానికి శుభమగును. మఱియుఁ దిర్యగ్యోనినిగాని, నరకమునుగాని, సాంకర్యములనుగాని పొందఁడు. వానికి దుఃఖమును మరణదుఃఖమును గలుగవు. కావున దైవ నామకీర్తనము వినుము. దేవాసురపూజ్యుఁడు, దేవుఁడు, సకలభూత నమస్కృతుఁడు, అచింత్యుఁడు, అనిర్దేశ్యుఁడు, సర్వప్రాణభూతుఁడు, అయోనిజుఁడు, జగన్నాథుఁడునగు పితామహుఁడు వెలయును. ఆతని సతి సావిత్రి, వేదభూమి, ప్రభువు, కర్త, నారాయణుఁడునగు విష్ణువు; విరూపాక్షుఁడగు నుమాపతియు; దేవసేనాపతియు విశాఖుఁడు నగు స్కందుఁడు; అగ్ని; వాయువు; ప్రభాకరులగు చంద్రసూర్యులును విరాజిల్లుచుందురు. అటులే శచీపతియగు శక్రుఁడు, ధూమోర్ణాసహితుఁడగు యముఁడును, గౌరీసహితుఁడగు వరుణుఁడును, బుద్ధితోఁగూడిన కుబేరుఁడును నొప్పుచుందురు. అటులే సౌమ్యయగు కామధేనువు, విశ్రవుఁడను మహర్షియు, సాగరము, గంగయు, నదులు, మరుద్గణములు, తపస్సిద్ధులగు వాలఖిల్యులు, కృష్ణద్వైపాయనుఁడు, నారదుఁడు, పర్వతుఁడు, విశ్వావసువు, హాహాహూహూవులును, దుంబురుఁడు, చిత్రసేనుఁడు, దేవదూతయగు విశ్రుతుఁడు, దేవకన్యకలు, దివ్యాప్సరోగణములును, ఊర్వశియు, మేనకయు, రంభయు, మిశ్ర

కేశి, అలంబుష, విశ్వాచి, ఘృతాచి, పంచచూడ, తిలోత్తమ, ఆదిత్యులు, వసువులు, రుద్రులు, అశ్వినీదేవతలు, పితరులు, ధర్మము, శ్రుతము, తపము, దీక్షప్రయత్నము, పితామహుఁడు, రాత్రులు, దివసములు, మారీచుఁడగు కశ్యపుఁడు, శుక్రుఁడు, బృహస్పతి, అంగారకుఁడు, బుధుఁడు, రాహువు, శనైశ్చరుఁడు, నక్షత్రములు, ఋతువులు, మాసములు, పక్షములు, సంవత్సరములు, వైనతేయులు, కద్రూతనయులు, పన్నగులు, సముద్రములు, శతద్రువు, విపాశ, చంద్రభాగ, సరస్వతి, సింధువు, దేవిక, ప్రభాసము, పుష్కరములు, గంగ, మహానది, వేణ, కావేరి, నర్మద, కులంపున, విశల్య, కరతోయ, అంబువాహిని, సరయువు, గండకి, మహానదము, లోహితము, తామ్రారుణ, వేత్రవతి, పర్ణాశ, గౌతమి, గోదావరి, కృష్ణవేణి, అద్రిజ, దృషద్వతి, వేణ్య, వంక్షువు, మందాకిని, ప్రయాగము, ప్రభాసము, నైమిశము, విశ్వేశ్వరస్థానము, విమలసరస్సు, పుణ్యతీర్థకీర్తితమైన కురుక్షేత్రము; సింధువు, తపము, దానము, జంబూమార్గము, హిరణ్వతి, వితస్త, ప్లక్షవతి, వేదస్మృతి, వేదవతి, మాలవ, అశ్వవతి మున్నగునామములు పరమపావనములు, అటులే పుణ్యములగు మఱికొన్ని భూభాగములును గంగాద్వారము, ఋషికుల్య, మేధ్య, చిత్రవహ, చర్మణ్వతి, కౌశికి, యమున భీమరథి, బాహుద, మహేంద్రవాణి, త్రిదివ, నీలిక, సరస్వతి, నంద, అపరనంద, తీర్థమహాహ్రదము, గయ, ఫల్గుతీర్థము, ధర్మారణ్యము, దేవనది, బ్రహ్మసరము, దివ్యౌషధిసమన్వితమగు హిమవత్పర్వతము, తీర్థౌషధిసమన్వితమై విచిత్రాంగమగువింధ్యము, మేరువు, మహేంద్రము, మలయము, రజతాన్వితమగు శ్వేతము, శృంగవంతము, నందనము, నీలము, నిషధము, దుర్దరము, చిత్రకూటము, అంజనాభము, గంధమాదనము, సోమగిరి, సకలమహీధరములు, దిక్కులు, విదిక్కులు, భూమి, సమస్తవృక్షములు, విశ్వేదేవులు, నభము, నక్షత్రములు, గ్రహములు శ్రేష్ఠములైనవి. దేవతలు కీర్తులైనను గాకున్నను మమ్మురక్షింతురుగాక. పైఁదెలుపఁబడినవ్యక్తులను కీర్తించువాఁడు సకలపాపవిముక్తుఁడగుచున్నాఁడు. మఱియు, వాని నభినందించువారును సకలభయవిముక్తులగుదురు. ఈ దేవతాస్తవము నభినందించువాఁడు సకలసంకర బాపవిముక్తుఁ

డగును. ఓయుధిష్ఠిరా! దేవతాస్తవమువిధ మెఱింగించితిని గదా! ఇఁకఁ దపోధికులును దపస్సిద్ధులునగు విప్రుల నెఱిఁగించెదను. వారు సకలపాపప్రమోచనులు. యవక్రీతుఁడు, రైభ్యుఁడు, కక్షీవంతుఁడు, భృగువు, అంగిరుఁడు, కణ్వుఁడు, మేధాతిథి, గుణసంపన్నుఁడగుబర్హి, ప్రాగ్దిశ నాశ్రయించియున్నారు. ఉన్ముచుఁడు, ప్రముచుఁడు, ముముచుఁడు, స్వస్త్యాత్రేయుఁడు, మిత్రావరుణపుత్త్రుఁడగు నగస్త్యుఁడు, దృఢాయువు, నూర్ధ్వబాహువును దక్షిణదిక్కు నాశ్రయించి యున్నవారు. సోదరసహితుఁడగు నుషంగుఁడు, పరివ్యాధుఁడు, దీర్ఘతమసుఁడు, గౌతముఁడు, కాశ్యపుఁడు, ఏకతుఁడు, ద్వితుఁడు, త్రితుఁడు, అత్రిపుత్త్రుఁడగు సారస్వతుఁడు, పశ్చిమదిశ నాశ్రయించి యున్నవారు. అత్రి, వసిష్ఠుఁడు, శక్తి, పారాశర్యుఁడు, విశ్వామిత్రుఁడు, భరద్వాజుఁడు, జమదగ్ని, పరశురాముఁడు, ఔద్దాలకియగు శ్వేతకేతువు, కోహాలుఁడు, విపులుఁడు, దేవలుఁడు, దేవశర్మ, ధౌమ్యుఁడు, హస్తికాశ్యపుఁడు, లోమశుఁడు, నాచికేతుఁడు, లోమహర్షణుఁడు, ఉగ్రశ్రవుఁడు, భార్గవుఁడగుచ్యవనుఁడు నుత్తరదిక్కు నాశ్రయించియున్నవారు. మహర్షిదేవసమన్వితమగు నీసమవాయమును గీర్తించినవానికి సకలపాపవిముక్తి యగుచున్నది. నృగుఁడు, యయాతి, నహుషుఁడు, యదువు, పూరువు, సాగరుఁడు, దుందుమారుఁడు, దిలీపుఁడు, కృశాశ్వుఁడు, యౌవనాశ్వుఁడు, చిత్రాశ్వుఁడు, దుష్యంతుఁడు, భరతుఁడు, చ్యవనుఁడు, జనకుఁడు, దృష్టరథుఁడు, రఘువు, దశరథుఁడు, రాముఁడు, శశిబిందువు, భగీరథుఁడు, హరిశ్చంద్రుఁడు, మరుత్తుఁడు, దృఢరథుఁడు, మహోదయుఁడు, అలర్కుఁడు, ఐలుఁడు, దక్షుఁడగు నంబరీషుఁడు, కుకురుఁడు, రేవతుఁడు, కురువు, సంవరణుఁడు, మాంధాత, ముచుకుందుఁడు, జహ్నువు, ఆదిరాజు, వైన్యుఁడునగు పృథువు, మిత్రభానువు, త్రసదస్యుఁడు, శ్వేతుఁడు, మహాభిషుఁడు, నిమి, అష్టకుఁడు, ఆయువు, క్షుపుఁడు, కక్షేయుఁడు, ప్రతర్దనుఁడు, దివోదాసుఁడు, కోసలేశ్వరుఁడగు సుదాసుఁడు, ఐలుఁడగు ననలుఁడు, మనువు, హవిధ్రుఁడు, పృషధ్రుఁడు, ప్రతీపుఁడు, శంతనుఁడు, అజుఁడు, ప్రాచీనబర్హి, ఇక్ష్వాకువు, అనరణ్యుఁడు, జాలజనఘుఁడు, కక్షసేనుఁడు మున్నగువారు రాజర్షులు. ఈరాజోత్తములను, మఱియుఁగలరాజులను,

నెవ్వఁడు నిత్యము రెండుసంధ్యలయందును బఠించునో, యతఁడు పవిత్రుఁడై పునరావృత్తిరహితమగు ధర్మఫలము నందును. దేవతలును, దేవర్షులును, రాజర్షులును కీర్తింపఁబడి యాయువు, పుష్టి, యశము, స్వర్గము మున్నగువానిని గలిగించుచున్నారు. విఘ్నము, పాపము, శత్రువులు మాకుఁ గలుగఁగూడదు. మాకు నిత్యము జయము గలుగవలయును. పరలోకశుభగతియు నగుఁగాక" అని పై దేవర్షివంశకథన మొనర్పవలయునని తెలిపె నని పలుక విని జనమేజయుఁడు వైశంపాయనున కిట్లనియె.

## భీష్మానుజ్ఞ

ఓవైశంపాయనా! కౌరవధురంధరుఁడైన భీష్ముఁడు శరతల్పగతుఁడై వీరశయనమున శయనించియుండఁగాఁ బాండవులు సమీపించి, యందు మాపితామహుఁడును మహాప్రాజ్ఞుఁడునగు యుధిష్ఠిరుఁడాశాంతనవువలన సకలసంశయములు తొలఁగ, ధర్మములనెల్ల విని, దానవిధుల నెఱిఁగి, పిదప నేమియొనర్చెనో నాకుఁ దెలుపుము.

అది విని వైశంపాయనుఁడు, ఓజనమేజయా! రెండుగడియల సేపు, తద్రాజసమూహ మెల్లఁ బటమం దర్పించినచిత్రమట్లు స్తిమితమై మాటలాడక యూరకుండెను. అటు లూరకున్నపిమ్మటఁ గొంతవడి ధ్యానించి సత్యవతీసుతుఁడగు వ్యాసుఁడు, శరతల్పగతుఁడై యున్న శాంతనవునిఁ గాంచి "ఓరాజా! కురురాజగు యుధిష్ఠిరుఁడు, స్వస్థచిత్తుఁడయ్యెను. అటులే యాతనిభ్రాతలును, భూతలనేతలును, మఱియుఁ గలయనుచరులును నెమ్మదినొందిరి. మఱియు నతఁడు ధీమంతుఁడగు శ్రీకృష్ణునితోఁ గూడ నిన్ను సేవించుచున్నవాఁడు. కావున నిఁక నయ్యుధిష్ఠిరుఁడు నిజపురప్రయాణ మొనర్ప ననుజ్ఞ యొసంగుము." అని పలుక విని యాగాంగేయుఁడు, సహామాత్యుఁడగు యుధిష్ఠిరునకు ననుజ్ఞయొసంగి, మఱియు మధురముగా, "ఓయుధిష్ఠిరా! నీవిఁకఁ బురమునకుఁ బొమ్ము. పరితాప మిఁక విడువుము. పలువిధములగుయాగము లొనరింపుము. శ్రద్ధాశాంతిసమన్వితుఁడవై బహ్వన్నములును, నాప్తదక్షిణములునగు యాగము లొనర్చి యయాతివలె క్షత్రధర్మరతుఁడవై పితరులను దేవతలను యజింపుము. ఓపార్థా! అటులేని నీకు

శ్రేయము సమకూరెడిని. నీమనోజ్వరము తీఱుఁగాక. ప్రజలను రంజింపఁజేయుము. ప్రకృతులను బాలింపుము. ఫలగౌరవములచే మిత్రులను యథార్థముగా నాదరింపుము. ఓనాయనా! నిన్ననుసరించి నీమిత్రులును సుహృదులును జీవింతురుగాక. చైత్యస్థానస్థితమై ఫలవంతమైన వృక్షము నాశ్రయించినపక్షులట్లు ఎల్లవారును నీవలన బ్రదుకుదురుగాక. ఓపార్థివా! సూర్యుఁడు మరలి యుత్తరాయణ మారంభమైన సమయమున నీవు నావద్దకు రావలయును." అని తెలిపెను. అది విని యుధిష్ఠిరుఁ డప్పితామహునకు నమస్కరించి, సపరివారముగా హస్తినాపురమునకు వెడలి, గాంధారీధృతరాష్ట్రులను మున్నిడికొని, మహర్షులును, భ్రాతలును, వాసుదేవుఁడును దోడరా మంత్రులును, పౌరులును, జానపదులును గొలువఁ బురప్రవేశ మొనర్చెను. అని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

## భీష్మప్రార్థన

ఓజనమేజయా! పిమ్మట నాకుంతీనందనుఁడు పౌరజానపదుల నెల్ల గౌరవించి, యథాన్యాయముగా, వారిండ్లకుఁ బో సెలవొసంగెను. మఱియు నతఁడు, పతులును, సుతులును నశించిననారీమణుల నూఱడించి, విపులములగునర్థముల వారికొసఁగి యాదరించెను. పిమ్మట నాయుధిష్ఠిరున కభిషేకము గావింప, నతఁడు సకలప్రకృతివర్గమును రప్పించి, బ్రాహ్మణులయు, జనముఖ్యులయు, నిగమవేత్తలయు నాశీర్వాదములఁ బరిగ్రహించి, ధర్మజ్ఞోత్తముఁడై యతఁ డానగరోత్తమమున, నేఁబదిరాత్రులుండి కౌరవోత్తముఁడగు పితామహుని స్వర్గారోహణసమయమును స్మరించి సపరివారముగా, వాహనములతోఁ దత్పురమునుండి వెడలెను. ఆదిత్యుఁడు నివృత్తుఁడై యుత్తరాయణ ప్రవర్తుఁడగుటఁ గాంచి, ఘృతమాల్యగంధద్రవ్య క్షౌమచందనాగురుప్రభృతి ముఖ్యద్రవ్యములను భీష్మసంస్కారమునకై ముందుగాఁ బంపి, గాంధారీధృతరాష్ట్రులను మున్నిడికొని వెడలెను. పురుషవ్యాఘ్రులగుసోదరులును దల్లియు నాతనితోడ వెడలిరి. మఱియు జనార్దనుఁడును, ధీమంతుఁడగు విదురుఁడును గౌరవ్యుఁడగు యుయుత్సుఁడును, సాత్యకియు వెంటనంటి బయలువెడలిరి. అటు లతఁడు

మహారాజార్హమగు శ్వేతచ్ఛత్రాదిసమృద్ధిగలిగి, సంస్తూయమానుఁడై
మహత్తరతేజమడర భీష్మాగ్నుల ననుసరించుచు, నింద్రునివలెఁ బత్తన
మునుండి ప్రయాణమై కొంతవడికిఁ గురుక్షేత్రమందున్న శాంతనవుని
సమీపించెను. అప్పితామహు నచ్చో ధీమంతుఁడగువ్యాసుఁడును,
నారదుఁడును, దేవలాసితుఁడును సేవించుచు నుండిరి. మఱియుఁ
జావఁగా మిగిలిన నానాదేశాధీశులును రక్షకులును నప్పితామహుని
రక్షించుచు వచ్చిరి. వీరశయనమున శయనించియున్న యాగాంగే
యుని యుధిష్ఠిరుఁడు గాంచి, తనతమ్ములతోఁ గూడ రథావరోహణ
మొనర్చి, యరిందముఁడగు కురుపితామహునకు నమస్కరించి,
వ్యాసాదులగువిప్రుల కభివాదన మొనర్చి, వారెల్లఁ దన్నభినందింప,
బ్రహ్మకల్పులగు ఋత్విజులును, భ్రాతలును, మహర్షులును జుట్టికొన,
శరతల్పగతుఁడై యున్న యాభీష్మునితో, "ఓతాతా! నేను యుధిష్ఠి
రుఁడను. ఓగాంగేయా! ఇదె నీకు నమస్కరించుచున్నవాఁడను.
ఓమహాబాహూ! నామాట వినఁబడియెనా? నీకేమికావలయునో
తెలుపుము. చేసెదను. ఓవిభూ! ఇదె నీ యాయగ్నులను బట్టికొని
వచ్చితిని. వీరె నాయాచార్యులు. వీరె బ్రాహ్మణులు. వీరె ఋత్విజులు.
వీరె నాభ్రాతలు. ఇతఁడే నీపుత్రుఁడు ధృతరాష్ట్రమహారాజు. సహా
మాత్యుఁడై వాసుదేవుఁ డిదె వచ్చియున్నవాఁడు. హతశిష్టులైన
కురుజాంగలులందఱును వీరె వచ్చియున్నవారు. కనుఁగవఁ దెఱచి
వీరినెల్ల నారయుము. నీకు వలసినసామగ్రియెల్ల సంపాదించితిని. నీకు
సమయము వచ్చినపుడు నీకుఁ గావలసినది నీవు చెప్పినట్టులు చేసె
దను" అని విన్నవించెను.

ఓజనమేజయా! ధీమంతుఁడగుకౌంతేయుఁ డట్లు పలుక విని
గాంగేయుఁడు, తన్నుఁ జుట్టికొనియున్న భరతవంశ్యులనెల్ల నారసి,
యాధర్మజునిభుజము పట్టికొని, మేఘగంభీరస్వరము వెలయ, నాత
నితో "ఓకౌంతేయా! మంత్రులతోఁ గూడ వచ్చితివా? మంచిపని.
సహస్రాంశుఁడు భగవానుఁడునగు దివాకరుఁడు పరివృత్తుఁడయ్యెను.
నిశితాగ్రములగుశరములచే నిర్మించినతల్పముపైఁ బరుండిన నాకేఁ
బదెనిమిదిదినములు గడచెను. ఇక్కాల మొకవత్సరమట్టు లయ్యెను.
ఓయుధిష్ఠిరా! ఇదె పవిత్రమగు మాఘమాసము వచ్చినది. ఇఁక నీకుక్క

పక్షము త్రిభాగశేషమై కానున్నది.” అని తెలిపి, మఱియు నాధృత రాష్ట్రునిఁ బిలిచి “ఓరాజా! నిస్సంశయముగా, ధర్మార్థముల నెఱిఁగిన వాఁడవు. బహుశ్రుతులగువిప్రుల ననేకులను సేవించియున్న వాఁడవు. మఱియు వేదశాస్త్రములను, సూక్ష్మములగుధర్మములను, మఱియుఁ గలరహస్యములను దెలిసినవాఁడవు. కావున నీవు దేనికిని శోకింపఁ జనదు. కాఁదగిన దెపుడును గాక తప్పదు. వ్యాసునివలన నీవు దేవ రహస్యమును వింటివి గాదే? ఈయుధిష్ఠిరాదు లప్పాండునకువలె నీకును ధర్మమునుబట్టి పుత్రులు గాకపోరు. గురుశుశ్రూషారతులును ధర్మయుతులు నగువారిని బాలింపుము. శుద్ధాత్ముఁడగు నీధర్మజుఁడు నీయాజ్ఞలో మెలంగువాఁడు. ఇతఁడు క్రౌర్యరహితుఁడు గురుభక్తుఁడు నగుట నే నెఱుఁగుదును. క్రోధలోభపరాయణులై దురాత్ములైన నీపుత్రు లసూయాగ్రస్తులై తమదుర్వృత్తముచే నశించిరి. కావున వారికై శోకింపఁ దగదు.” అని తెలిపెను.

ఓజనమేజయా! ఆగాంగేయుఁ డామనీషియగు ధృతరాష్ట్రునితో నిట్లు పలికి, మహాబాహుఁ డగువాసుదేవునితో “ఓభగవానుఁడా! దేవదేవేశా! సురాసురనమస్కృతా! త్రివిక్రమా! శంఖచక్రగదా ధరా! నీకు నమస్కారము. వాసుదేవుఁడు, హిరణ్యాత్ముఁడు, పురుషుఁడు, సవిత, విరాట్టు, జీవభూతుఁడగువేల్పు నీవ గాదే? నీవు పరమాత్ముఁడవును సనాతనుఁడవు నై యున్నవాఁడవు. ఓపురుషోత్తమా! నేను నీవని నమ్మి, త్వదేకగతచిత్తుఁడనై నిష్పరిగ్రహుఁడనై సంసారమును విడిచితిని గాదే! కావున నన్ను రక్షింపుము. ఓకృష్ణా! పుండరీకాక్షా! నాకనుజ్ఞ యొసంగుము వారికి నీవ పరాయణము వగుటఁ బాండవులు రక్షింపఁదగియున్నవారు. మందుఁడు దుర్బుద్ధియు నగుసుయోధను నిఁగూర్చి నేను మున్ను తెలిపియుంటినిగాదే! కృష్ణుఁ డేపక్షము నాశ్రయించునో తత్పక్షమునకు జయముగునని నే నాసుయోధనున కెఱిఁగించితిని. వాసుదేవుఁడను తీర్థమునుబట్టి పాండవులతో సంధింపుమని చెప్పితిని. ఇది నీకుఁ దగుసంధికాలమనియుఁ దెలిపితిని. మందబుద్ధి యగుట వాఁడు నామాటచొప్పున వర్తింపఁడయ్యెను. అయ్యయో! ఆమూర్ఖుఁడు పుడమినెల్లఁ బాడుచేసి తుదికి వాఁడును మరణించెను. నిన్నుఁ బురాణమహర్షి వర్యుఁడవగు దేవునిఁగా నెఱుఁగుదును. నీవు

నరునితోఁగూడ బదర్యాశ్రమమునఁ జిరకాలము నివసించియుంటఁ దెలిసికొంటిని. ఆవిషయము, మహాతపుఁడగు వ్యాసుఁడును, నారదుఁడును నాకెఱిఁగించిరి. ఓకృష్ణా! నే నిఁక శరీరమును బరిత్యజించెదను. నాకనుజ్ఞ యొసంగుము. నీవనుజ్ఞ యొసంగుదేని నేనుత్తమగతి నొందెదను.” అని పలికెను.

అది విని యవ్వ్యాసుదేవుఁడు “ఓపార్థివా! నీకు నే ననుజ్ఞ యొసంగుచున్నాఁడను. నీవు వసువులను బొందుము. ఓమహాతేజా! నీ వీదేహమున నించుకేనిఁ బాపముచేసి యెఱుఁగవు. ఓరాజర్షి! నీవు రెండవమార్కండేయునట్లు పితృభక్తుఁడ వైనవాఁడవు. కావుననే, నీకు మృత్యువు భృత్యువట్లు వశమైయున్నది.” అని తెలిపెను.

ఓజనమేజయా! అనంతర మాగాంగేయుఁడు పాండవులను గాంచి, యటులే ధృతరాష్ట్రాదులను దక్కినమిత్రులను జూచి, “ఓయీ! నేను బ్రాణముల విడువఁ దలంచుచున్నాఁడను. కావున నాకనుజ్ఞ యొసంగుఁడు. మీరందఱును సత్యమార్గప్రవర్తనమునకు యత్నింపుఁడు. సత్యమే పరమబలము. మఱియు మీరు నియతాత్ములరై హింసాదూరులై వర్తింపుఁడు. బ్రాహ్మణప్రియులును, ధర్మశీలురును, తపోనిత్యులు నై మీరు ప్రవర్తించుట నాకు సమ్మతము.” అని పలికి వారినెల్లఁ గవుంగిలించికొని మఱియును యుధిష్ఠిరునితో “ఓజనాధిపా! బ్రాహ్మణులును, నందును బ్రాజ్ఞులును, నాచార్యులును, ఋత్విజులును బూజింపఁదగియున్నవారు సుమీ!” అని తెలిపె నని పలికి మఱియు వైశంపాయనుం డిట్లనియె.

## భీష్మస్వర్గారోహణము

ఓజనమేజయా! ఆశాంతనవుఁ డిట్లు పలికి రెండుగడియ లూరకుండి, యాత్మధారణ మొనర్చుటయు నమ్మహాత్ముని ప్రాణములు సన్నిరుద్ధములై యూర్ధ్వముగా వెడలెను. అపు డాశాంతనవుఁడు, తనగాత్రములలో నేయేదానిని బరిత్యజించుచుండెనో యదియెల్ల విశల్యమగుచు వచ్చెను. యోగయుక్తుఁడగు నమ్మహాత్ముని తత్కృత్యమునకు వారెల్ల నాశ్చర్య మొందిరి. వ్యాసాదిమహర్షులందఱును గాంచుచుండఁగనే యొకక్షణములో నతఁడు విశల్యుఁ డయ్యెను, అందులకు

వాసుదేవాదులందఱును నాశ్చర్యభరితులైరి. అతఁ డట్లు సర్వాయతనములందును నాత్మను నిరోధింప, నది మూర్ధమును భేదించి స్వర్గము నధిరోహించెను. అపుడు పుష్పవర్షములతోఁ గూడ దేవదుందుభులు చెలరేఁగెను. బ్రహ్మర్షులును, సిద్ధులును మేలుమేలని ప్రశంసించిరి. అంత నాభీష్మునిజ్యోతి మహోల్కవలెఁ దలను భేదించి, యాకసమంతటి యొకక్షణములో నంతర్ధానమొందెను. ఓజనమేజయా! రాజశార్దూలుఁడగు నాశాంతనవుఁ డట్లు కాలవశుఁ డయ్యెను. అంత దారువులను, వివిధములగు గంధములను దెప్పించి, పాండవులును, విదురుఁడును, చితి నేర్పఱచిరి. యుయుత్సుఁడు మున్నగువారందఱును ప్రేక్షకులై యుండిరి. అపుడు విదురయుధిష్ఠిరులు భీష్మునకు క్షౌమవసనములను, మాల్యములను గప్పిరి. యుయుత్సుఁ డాగాంగేయు నుత్తమచ్ఛత్రమును బట్టికొనియెను. భీమసేనార్జును లిరువురును నాతని తెల్లనగు చామరవ్యజనములను బట్టికొనిరి. నకులసహదేవు లుష్ణీషమును బట్టికొనిరి. యుధిష్ఠిరధృతరాష్ట్రు లాతనిపాదములు పట్టికొనిరి. కౌరవవృద్ధాంగనలు కురుకులోద్వహుఁడగు నాతనికిఁ దాలవృంతములతో వీవసాగిరి. పిమ్మట నాతనికి విధ్యుక్తముగాఁ బితృమేధము చేయఁబడియెను. యాజకు లగ్నిలో హోమము నేసిరి. సామగులు సామములు చదువసాగిరి. పిదపఁ జందనాగురుకాష్టములతోడను, బలువిధములగు గంధద్రవ్యములతోడను, నాభీష్మునిదేహమును గప్పి యగ్ని నంటించిరి. ధృతరాష్ట్రుఁడు మున్నగువా రపసవ్యముగానుండి కురుశ్రేష్ఠుఁ డగు గాంగేయుని సంస్కరించి, పిదపఁ బవిత్రమును మహర్షిసేవితము నగు భాగీరథికిఁ బయనమైరి. వారిని వ్యాసనారదాసితు లనుగమించిరి. వాసుదేవుఁడును వారితో వెడలెను. మఱియు స్త్రీలును, పౌరులును నందులకుఁ బయనమైరి. అంత నాజనమెల్ల విధ్యుక్తముగా మహాత్ముఁడగుగాంగేయున కుదకక్రియలు నిర్వర్తించిరి. పిమ్మట, నటులు తన తనయున కుదకక్రియలు చేయఁబడుట గాంచినదగుట భాగీరథి, యుదకమునుండి లేచివచ్చి శోకాకులయై యేడ్వసాగెను. అటు లేడ్చుచు, నామె కౌరవుల నారసి “ఓయనఘులారా! జరిగినవిధముగ నే తెలిపెదను వినుఁడు. ఎవ్వఁడు రాజవృత్తసంపన్నుఁడు, ప్రజ్ఞానిధియు, నుత్తమవంశ్యుఁడు, కురువృద్ధకర్తయు, మహావ్రతుఁడును, బితృభక్తుఁ

డును నై మున్నా పరశురామునకు సైతము లోఁగక విక్రమించెనో, యట్టిదివ్యాస్త్రసంపన్నుఁడును, మహావీర్యుఁడును నేఁడు శిఖండిచేహతుఁడయ్యెనా? ఓపార్థివులారా! నాహృదయము పాషాణమయమగుట నిశ్చయము. అట్టినాపట్టి నాకుఁ గానరాకున్నను నాగుండియ లవియకున్నవి గదా! మున్ను కాశీపురాధీశుని దుహితస్వయంవరకాలమున క్షత్రియులందఱు నొక్కచోఁ గలియఁగా, నపుడీతఁ డసహాయవీరుఁడై, యొక రథముతో నొక్కఁడే వారిని జయించి, కన్నియలను దెచ్చెను గాదే? ఇప్పుడమి నప్పరమవీరునకు సాటియగువీరుఁ డున్నవాఁడా? అట్టివాఁడు శిఖండిచే హతుఁడగుట వినియును నాగుండియలు వ్రీలకుండుట వింత కాకపోదు. మహాత్ముఁడగు నెవ్వానిచే నతిప్రయత్న మొనర్చిన పరశురాముఁడును బరాభవింపఁబడియెనో యట్టిభీష్ముఁ డిక్కురుక్షేత్రమున శిఖండిచే హతుఁడయ్యెనా?" అని పలువిధముల నేడ్చుచున్న భాగీరథిని గాంచి, వాసుదేవుఁడు ప్రియోక్తులతో నూఱడించువాఁడై "ఓభద్రశీలా! చింతింపకుము. ఊరకొనుము. నీపుత్త్రుఁ డుత్తమలోకము నొందెను. అందు సందియము లేదు. మహాతేజుఁడగునితఁడు వసువులలో నొకఁడయ్యు, శాపవశమునగా మానవుఁడై జనించెను. కావున నీతనిఁ గూర్చి పరితపింపఁబనిలేదు. ఇమ్మహానీయుఁడు క్షత్త్రియధర్మము ననుసరించి రణాంగణమున యుద్ధమొనర్చి యర్జునునిచే హతుఁడయ్యెను గాని, శిఖండిచే హతుఁడు గాలేదు. మహారణరంగమున నుద్యతాయుధుఁడైన కురుశార్దూలుఁడగు నీభీష్ము నెదుర్కొని యాశతక్రతుఁడేని జయింపఁజాలునా? ఓశుభాననా! ఇతఁడు స్వేచ్ఛగా మరణించి స్వర్గము నలంకరించెను. కాదేని దేవతలందఱును గలిసియు నాతని నోర్వఁగలరా? కావున నోదేవీ! నీవిక్కురునందనునకై వగవకుము. ఓదేవీ! ఇతఁ డెప్పటియట్ల వసువై వెడలిపోయెను. పరితాపము పరిత్యజింపుము." అని పలికెను. ఓజనమేజయా! అటులా వాసుదేవుఁడును, వ్యాసుఁడును నూఱడింప, నాగంగయుఁ బరితాపమును విడిచి ప్రకృతి నొందెను. అంత నాశ్రీకృష్ణాదులామెను గౌరవించి, యామెయనుజ్ఞ వడసి యందఱును మరలిరి. అని తెలిపెను.

ఆనుశాసనికపర్వము సమాప్తము.

---

శ్రీ ర స్తు.

# శ్రీ మ దాం ధ్ర

# వ చ న మ హా భా ర త ము

## ఆ శ్వ మే ధి క ప ర్వ ము.

శ్లో. "నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమం,
దేవీం సరస్వతీం వ్యాస స్తతో జయ ముదీరయేత్."

ఓజనమేజయా! అప్పు డాయుధిష్ఠిరుఁడు, జలదానమును నిర్వ ర్తించిన ధృతరాష్ట్రమహారాజును ముందిడికొని కనుల నీరువెట్టుచు గంగయొడ్డుచేరి, వ్యాకులచిత్తుఁడై, వ్యాధవిద్ధమైనద్విపమట్లు తత్తీర మునఁ గూలఁబడి పరితపించుటఁ గాంచి, వాసుదేవుఁడు భీమునిఁ జూచి "వృకోదరా! మీయన్న నూఱడింపు" మని పలికి, "యిటులు పరితపింపఁదగ" దని తానును నాతని నోదార్చెను. అటు లార్తుఁడై పుడమిఁబడి వేడినిట్టూర్పులు పుచ్చుచున్న యాధర్మపుత్రు నపాం డవులెల్లఁ గాంచి, శోకాకులితమానసులై మఱియు వారును దత్తీర మునఁ గూరుచుండిరి. అంత నాధృతరాష్ట్రుఁడు పుత్రశోకపీడితుఁడగుచు బుద్ధిశాలియుఁ, బ్రజ్ఞాచక్షువు నగుట నించుక ధైర్యమునొని యిటులఁగు రాల్పడ, "ఓధర్మజా! లెమ్ము కురుశార్దూలా! అనంతరకార్య మొన రింపుము. ఓకౌంతేయా! నీవు క్షత్రధర్మము ననుసరించి యిప్పుడమిని జయించితివి. కావున నీవు నీమిత్రులను, భ్రాతలనుగూడి దీని ననుభ వింపుము. ఓనరేశ్వరా! నీకిపుడు శోకింపవలసినది నాకేమియుఁ గాన రాదు. ఓమహీపతీ! మాకు లభించినపుత్రశతమును స్వప్నలబ్ధమైన ధనముట్టులు, నష్టమగుట నేనును, నీతల్లి గాంధారియు శోకింపవలసి

యున్నదిగాని, నీవు పరితపింపఁబనిలేదు. అయ్యయ్యో! మహాత్ముఁడును, నాహితమును గోరినవాఁడు నగు మనయీవిదురుని యర్థవంతము లగువచనములు పెడచెవిఁ బెట్టి, దుర్మతినై యిపు డిట్లు పరితపించుచున్నాఁడను. 'దుర్యోధనుఁ డొనర్చినతప్పుచే నీకులము పొలియును' అని దివ్యదర్శనుఁడును ధర్మాత్ముఁడునగు నీవిదురుఁడు నాకుఁ జెప్పకపోలేదు. మఱియు నితఁడు నాతోఁ బెక్కుమాఱులు, 'ఓరాజా! నీవు నీవంశమునకు శ్రేయము గోరుదేని నామాట నమ్మి, దుష్టాత్ముఁడగు నీదుర్యోధనుఁ బరిత్యజింపుము. వీఁడు మందుఁడు. కర్ణుఁడును, శకునియు నీతనయునిఁ గనుఁగొనకుందురుగాక. ఈయపవాదమునుండి నీ వీద్యూత సంఘాతమును మరలింపుము. ధర్మపుత్త్రుఁడగుయుధిష్ఠిరుని రాజుగా నభిషేకింపుము. అటులేని, యితఁడు పుడమిని న్యాయముగాఁ బాలించును. ధర్మాత్ముఁడగు నీతని రాజుఁ జేయ నీకిష్టములేదేని, నీబుద్ధిబలము నాధారముగాఁ గొని నీవు స్వయముగా రాజ్యమును బాలింపుము. ఓనరాధిపా! నీవు సకలభూతములందు సమబుద్ధిగల్గి సంరక్షింప, భ్రాతలతోఁగూడి జ్ఞాతులందఱును నిన్ననుసరించి జీవింతురుగాక.' అని తెలిపెను. ఓయుధిష్ఠిరా! దీర్ఘదర్శియగువిదురుఁ డటులు చెప్పినను వినక దుష్టుఁడగుదుర్యోధను ననువర్తించితిని. నామతి చెడియెను. పండితుఁడగు నీతనిమధురవచనముల మన్నింపనైతిని. ఇపుడు దానికిఁ దగు మహాదుఃఖమును బొంది శోకసాగరమున మునిఁగితిని. ఓరాజా! ఇపుడు వృద్ధులమై దుఃఖితులమైన యీనీతల్లిదండ్రుల నరయుము. ఓజనాధిపా! నీవు శోకింపఁబనిలేదని నాయభిప్రాయము" అని తెలిపెనని పలికి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

## శ్రీకృష్ణుఁడు ధర్మజు నోదార్చుట

ఓజనమేజయా! ధీమంతుఁడగు ధృతరాష్ట్రుఁ డిట్లు తెలుప వినియు, శోకాకులచిత్తుఁడై యూరకున్నధర్మజునిఁ గాంచి, మేధావి యగువాసుదేవుఁ డాతనితో "ఓధర్మజా! ఈధృతరాష్ట్రుఁడు శోకాకులమానసుఁడై మున్ను మరణించిన పితామహాదులను బరితపింపఁజేయుచున్నవాఁడు. కావున నీవిఁక శోకము విడిచి, విధ్యుక్తముగా, బహుదక్షిణములగు వివిధయాగము లొనర్పుము. సోమముచే దేవతలను, స్వధచేఁ బితృదేవ

తలను దృప్తినొందింపుము. మఱియు నన్నపానాదిదానముచే నతిథులను, మఱికొన్నిటిచే నితరులను సంతసింపఁజేయుము. తెలియఁదగినదేమో నీవెఱుంగుదువు. చేయఁదగినదే చేసితివి. గంగానందనుఁడగు భీష్మునివలన రాజధర్మములెల్ల వినియున్నాఁడవు. అటులే కృష్ణద్వైపాయనుఁడును, విదురుఁడును, నారదుఁడును నీకు ధర్మము లెఱిఁగించినవారుగాదే? మూఢు లందఁదగిన యీదైన్యవృత్తి నవలంబించుట నీకుఁ బాడిగాదు. నీపితృపితామహులనుండి వచ్చుచున్న వృత్తి నాశ్రయించి యీరాజ్యభారమును వహింపుము. ఇహమునఁ గీర్తివడసి, మఱియు నిస్సంశయముగా స్వర్గమునందుట క్షత్త్రధర్మమే యుక్తమైనది. ఈ రణరంగమున శూరులై పోరాడిరిగాని, యొకఁడును బరాఙ్ముఖుఁడై మరణింపలేదు. ఓమహారాజా! భవితవ్యమే యిటులైనది. కావునఁ బరితాపము పరిత్యజింపుము. నీచే సంగ్రామరంగమున సమసినశూరులు నీకు మఱి కానరా నవకాశము లేదుగదా!" అని పలికి యాగోవిందుఁడు విరమించెను.

అది విని మహాతేజుఁడగు యుధిష్ఠిరుఁ డాతనితో "ఓగోవిందా! నీకు నాయెడఁగలదయ యెట్టిదో నేనెఱుంగకపోలేదు. నీవు నాయెడ నిత్యము సౌహార్దము, ప్రేమ గలిగి ప్రవర్తించుచున్నాఁడవు. ఓచక్రగదాధరా! నీవు నాకెంతయుఁ బ్రియము చేకూరవలయుననియే మహోపకార మొనర్చితివి. ఓశ్రీనాథా! నీచిత్తము నాయెడఁ బ్రీతియుక్తమై యుండుటయుఁ గల్లగాదు. అయినను నీవంగీకరింతువేని తపోవనమునకుఁ బోయెదను. పితామహునిఁ బడఁద్రోయించిన నాకు శాంతి యెట్లు? అయ్యో! సంగ్రామస్థిరుఁడై పురుషవ్యాఘ్రుఁడయిన కర్ణునిఁ జంపించితినిగాదే! నేనేమి యొనర్చిన నా యీక్రూరకృత్యమునుండి విముక్తుఁడనగుదునో తెలియకున్నది? ఓవాసుదేవా! నామనశ్శుద్ధి యెట్లు గలుగునో యట్టివిధ మొనర్పుము." అని పలికెను. అది విని ధర్మజ్ఞుఁడగు వ్యాసుఁ డయ్యుధిష్ఠిరు నూఱడించువాఁడై, యర్థవంతములగు సదుక్తులతో "ఓనాయనా! నీమతి వివేకయుక్తమై యుండియు, మఱియు మౌఢ్యము వహించియే ప్రవర్తిల్లుచున్నాఁడవు. ఓతండ్రీ! మామొఱలన్నియు నాకసముపాలు చేయుచున్నాఁడవేమి? రాజులకు యుద్ధమే జీవిక యని క్షత్త్రధర్మజ్ఞుఁడవగు నీవెఱుఁగనిది

గాదు. నిజధర్మానువర్తియగు నరపతి క్లేశపీడయుఁ గలుగదు. మఱియు మోక్షధర్మములనున్నైతము వింటివి. నీవడిగిన సందేహములన్నియుఁ దొలఁగ, నేను మఱిమఱియు వివరించి తెలిపితిని గాదే? అయినను మతిచెడి శ్రద్ధాహీనుఁడవై వినుటచేఁ గాఁబోలు, స్మృతిచెడియున్న వాఁడ వనుట నిశ్చయము. ఇటులగుట తగదు. ఈయజ్ఞానము నీ కుచితముగాదు. ఓయనఘా! నీకు సకలప్రాయశ్చిత్తములును దెలియును గదా! మఱియు రాజధర్మములును, దానధర్మములును దెలియును. సకలధర్మజ్ఞుఁడవును, సర్వాగమవేత్తవునగు నీవు మఱియు నిట్లు లజ్ఞానాంధకారమగ్నుఁడ వగుట న్యాయముగాదు." అని పలికి వ్యాసుఁడు మఱియు నిట్లనియె.

సంవర్తమరుత్తీయము

"ఓయుధిష్ఠిరా! నీప్రజ్ఞాబలము సరిగాదని నాయభిప్రాయము. మానవుఁ డెవ్వఁడును స్వతంత్రముగా నేకార్యమును జేయఁగలుగునా? మంచిచెడ్డ లేవియేని యీశ్వరప్రేరితుఁడగుచునే మానవుఁ డొనర్చుట సత్యము. అట్టు లవశుఁడై కర్మ మొనర్చుమానవున కందుఁ బరితపింపవలసిన దేమున్నది? నీవు నిన్నుఁ బాపకర్మునిఁగాఁ దలంచుకొనుచున్నాఁడవుగదా! అటులగుట నీకప్పాప మెట్లు విముక్తియగునో తెలిపెదను వినుము. ఓయుధిష్ఠిరా! తపోయాగదానములచే మానవులు పాపసాగరమునుండి తరించుచున్నారు. ఓనరశార్దూలా! పాపకర్ములగువారు తత్తపోదానయాగములచేఁ బవిత్రులగుటలో సందియములేదు. మహాత్ములగు దేవతలును, రాక్షసులును బుణ్యమునకుఁగా యాగక్రియలొనర్పఁ బ్రయత్నించుచున్నారు. కావున యాగమే పరాయణము. ఆయజ్ఞములమూలముననే దేవత లధికులును మహాత్ములునైరి. వారట్టిసత్క్రియ లాచరించుటనే దానవులను దిరస్కరింపగలిగిరి. ఓయుధిష్ఠిరా! రాజసూయాశ్వమేధములను, సర్వమేధమును, నరమేధమును గావింపుము. ఓమానవనాథా! విధ్యుక్తముగా నీ విపుడు బహుదక్షిణలు గల్గునట్లుగా నశ్వమేధయాగ మొనర్పుము. మున్ను రాముఁడును, దుష్యంతపుత్రుఁడగు భరతుఁడును బహుకామాన్నవిత్తములతో నాయాగ మొనర్చిరిగాదే?" అని తెలుపుటయు నయ్యుధిష్ఠిరుఁ డిట్లనియె.

"ఓమహర్షివర్యా! నీవు సెలవిచ్చినట్లు నిస్సంశయముగా నశ్వమేధముచేఁ బృథివీపతి పవిత్రుఁడగును. కాని నాయభిప్రాయ మొకటి వినఁదగియున్నది. ఓద్విజోత్తమా! నే ననేకుల జ్ఞాతులను జంపి యిపు డల్పముగా దానము సేయనొల్లను. అధికముగా నొసంగుటకు నాకు ధనము లేదు. బాలురును దీనులు నైయున్న యిప్పటి ప్రజలను యాచింప నాకు రుచింపలేదు. అటులే, యార్ద్రవ్రణులై కష్టదశలో నున్న యీరాజపుత్రుల నెట్లు యాచింతును? ఓమహానీయా! నాయంతన నేను బుడమినెల్ల నశింపఁజేసి, శోకపరాయణుఁడనై యిపుడు యజ్ఞమునకుఁగాఁ బన్ను నెట్లు తీసికొందును? ఓమునివర్యా! దుర్యోధనునితప్పుచేఁ బుడమిఁగలరాజులెల్లరును మమ్ము నపకీర్తి సాగరమున ముంచి నశించిరిగాదే? ధనాభిలాషచే సుయోధనుఁడు పుడమినెల్ల నశింపఁజేసెను. దుర్మతియగు నాదుర్యోధనుని, ధనాగారమెల్ల శూన్యమయ్యెను. ఈయశ్వమేధయాగమునకుఁ బృథివియే దక్షిణగాఁ జేయుట ముఖ్యపక్షమని పండితులయభిప్రాయము. వేఱొకవిధముగా నొనర్చుట విధివిపర్యాసము. ఓతపోధనా! అట్టి ముఖ్యపక్షమును మాని, యనుకల్పముసేయుట కేనిష్టపడను. ఓభగవానుఁడా! ఈయాగమున నీవు నాకు సాచివ్య మొనర్పవలయును."

ఓజనమేజయా! ఇటు లాయుధిష్ఠిరుఁడు పలికి, వినతుఁడై యుండ, నాకృష్ణద్వైపాయనుఁడు రెండుగడియలసే పాలోచించి, "ఓధర్మరాజా! నే నొకయుపాయ మెఱిఁగించెదను. పాడువడిన నీకోశము నైతము నాచెప్పినయుపాయముచేఁ బరిపూర్ణమయ్యెడిని. మున్ను మహాత్ముఁడగు మరుత్తుఁడు చేసిన యాగమునఁ బుచ్చుకొన్నధనములు బ్రాహ్మణులచే హిమవత్పర్వతమున విడువఁబడియున్నవి. ఓకౌంతేయా! వానిని దెప్పింపుము. అవి నీకు సమృద్ధముగాఁ జాలియుండును." అని తెలిపెను. అది విని యుధిష్ఠిరుఁడు "ఓమహానీయా! ఆమరుత్తుఁ డంతధన మెటులొసంగెను? అతఁ డేకాలమున రాజై పరిపాలించెను?" అని ప్రశ్నించుటయు, వ్యాసుఁడు "పార్థా! కారంధముఁడగు నా మరుత్తుఁ డేకాలమున మహాధనుఁడై మహాపరాక్రమమడరఁ బుడమిఁ బరిపాలించెనో యట్టివిధము వినఁగోరెదేని వినిపించెదను వినుము" అని పలుక విని యుధిష్ఠిరుం డిట్లనియె.

## —— మరుత్తచరిత్రము ——

"ఓధర్మజ్ఞా! ఆరాజర్షి చరిత్రమును వినఁగోరుచున్నాఁడను. అతని కథ నెఱిఁగింపుము."

అంత నావ్యాసుఁడు "ఓయుధిష్ఠిరా! మున్ను కృతయుగమున, దండవిధాయకుఁడగు ప్రభువై మనువు విరాజిల్లెను. అతని సుతుఁడు, ప్రసంధియనుపేరఁ బ్రసిద్ధుఁడై ప్రవర్తిల్లెను. వానికి సూనుఁడై క్షుపుఁడు కీర్తివడసెను. ఆక్షుపున కిక్ష్వాకువు పుత్త్రుఁడై మహిని బరిపాలించెను. ఆతనికిఁ బరమధార్మికులై నూర్వురుపుత్త్రు లుదయించిరి. వారినెల్ల నాయిక్ష్వాకుఁడు మహీపాలకులఁగా నొనర్చెను. వారిలో వింశుఁడనువాఁడు జ్యేష్ఠుఁడై ధనుర్ధరోత్తముఁడునై విరాజిల్లెను. ఆ వింశునకుఁ గళ్యాణమూర్తియై వివింశుఁడనుపుత్త్రుఁడు పుట్టెను. ఓరాజా! ఆవివింశునకుఁ బదునేవురుపుత్త్రు లుదయించిరి. వారెల్లరును విక్రమోదగ్రులును, బ్రహ్మణ్యులును, సత్యవాదులునై దానధర్మరతులును, శాంతులు, ప్రియవాదులునై ప్రసిద్ధివహించిరి. వారిలోఁ దొలుతటివాఁడగు, ఖనీనేత్త్రుఁడు విక్రమశాలియై వారినెల్లఁ బీడించి, జయించి నిష్కంటకముగాఁ బరిపాలించెను. కాని కొంతకాలమున కాతనియెడఁ బ్రజ లనురక్తులు గాకుండుటచే నతఁడు నిజరాజ్యమును రక్షింపఁజాలఁడయ్యెను. అంత నాతనిప్రజ లాఖనీనేత్త్రునిఁ దొలఁగించి తద్రాజ్యమునఁ దేజోవంతుఁడగు నాతనిపుత్త్రుని నభిషిక్తునిఁ గావించి సంతసించిరి. అంత నతఁడు తనతండ్రి వికృతకృత్యములను సహింపక, ప్రజాహితాభిలాషియై, వానిని రాజ్యమునుండి తొలఁగించెను. బ్రహ్మణ్యుఁడును, సత్యవాదియు, శుచియు, శమదమాన్వితుఁడు, ధర్మనిత్యుఁడు, మేధావియు, నగు నాతనియెడఁ బ్రజ లనురక్తులై యుండిరి. అటు లతఁడు, ధర్మప్రవృత్తుఁడై ప్రవర్తిల్లుటయు నాతనికోశవాహనాదులెల్ల క్షీణింపసాగెను. క్షీణకోశుఁడగు నాతనిఁ జూచి, సామంతనృపతు లొక్కుమ్మడిగాఁ బీడించుటయు, నతఁ డార్తుఁడై భృత్యులతోడను బౌరులతోడను బరితపించెను. ఓయుధిష్ఠిరా! అతఁడు ధర్మనిత్యుఁడై ప్రవర్తిల్లుటయు, నాతనికి బలక్షైణ్యము సంభవించినను, వైరు లాతని వధింపఁజాలరైరి. ఆతనికి దనపత్నిముతో

గూడ నెపు డెంతయుఁ బీడగలిగెనో, యపుడే యతఁడు కరములతో నూఁదుటయు, నది విని యొకసైన్యము ప్రత్యక్షమయ్యెను. దాని సహాయమున నతఁడు తనవైరులనెల్ల జయించెను. అటులగుటనే యతనికిఁ గరంధముఁ డను పేరు గలిగెను. అతనికిఁ ద్రేతాయుగారంభమునఁ బుత్త్రుఁ డొకఁ డుదయించెను. అతఁ డింద్రునకుఁ దక్కువగాక, దేవతలకును దుర్జయుఁడై ప్రవర్తిల్లెను. రాజులందఱు నాతనికి వశవర్తులై మెలంగసాగిరి. వారికెల్ల నతఁడు నిజవృత్తబలములచే నధికుఁడై సమ్రాట్టుగా విరాజిల్లుచు, 'అవిక్షిత్తు' అను పేరుఁబరఁగి ధర్మాత్ముఁడును, విక్రమశాలియు నై యింద్రుఁడునాఁ దగియుండెను. మఱియు నతఁడు మేరుధృతియు, ధర్మరతియు, యాగమతియు నై, నియతేంద్రియుఁడు నగుచుఁ, దేజముచే సూర్యుని, శాంతిచే భూమిని, బుద్ధిచే బృహస్పతిని, ధైర్యముచే హిమవంతుని మించి,శమదమాన్వితుఁడగుట, మనోవాక్కర్మములచేతను బ్రజలను సంతసింపఁజేయుచుఁ, బ్రజానురాగియై ప్రవర్తిల్లెను. ఆప్రభువు విధ్యుక్తముగా, నూఱశ్వమేధయాగము లొనర్చెను. విద్వాంసుఁడగుబృహస్పతి యాతనికి స్వయముగా యాజకుఁడై యజ్ఞములు చేయించెను. ఆతనిసుతుఁడగు మరుత్తుఁడు నిజసద్గుణగణముచేఁ దండ్రిని మించినవాఁడయ్యెను. ధర్మజ్ఞుఁడును గీర్తినిధియునగు నతఁడు వేయియేన్గులబలముగలిగి రెండవవిష్ణువునా వెలయుచు, ధర్మశీలుఁడై యాగములొనర్చి, వేలకొలఁది సువర్ణమయములగుపాత్రములఁ జేయించి, మేరుపర్వతమును సమీపించిన హిమవద్గిరి యుత్తరపార్శ్వమున సువర్ణమయమగు తత్ప్రత్యంతపర్వతమునఁ దద్యాగకర్మ మారంభించెను. అపుడు, తద్యజ్ఞోపకరణములగు, కుండ పిఠరములును, బాత్రములును, నాసనములును సువర్ణమయములై యసంఖ్యాకములుగాఁ జేయింపఁబడియెను. అందొకయజ్ఞవాటము నిర్మించి, యందాధర్మాత్ముఁడగుమరుత్తుఁడు విధ్యుక్తముగా నెల్ల రాజులతోఁగూడి యాగములొనర్చెను." అని తెలుప విని యుధిష్ఠిరుఁ డిట్లనియె.

"ఓమహానీయా! ఆమరుత్తుఁ డెట్టివీర్యముగలవాఁడు? ఆతనికట్టి సువర్ణరాశి యెట్లు సమకూరెను? ఆద్రవ్యమెల్ల నిపు డెచ్చోనున్నది? ఓతపోధనా! ఆధనము మాచే నెటులొందఁబడును?"

అది విని వ్యాసభగవానుఁడు "ఓధర్మజా! దక్షప్రజాపతికి దేవతలును, రాక్షసులు నుండిరి. వారు పరస్పరము స్పర్ధవహించి యుండిరి. అటులే యంగిరునిపుత్త్రులై వ్రతతుల్యులగు బృహస్పతిసంవర్తులును బరస్పరస్పర్ధగలిగి యెల్లప్పుడును భిన్నాభిప్రాయులై ప్రవర్తిల్లుచుండిరి. అందు బృహస్పతి, బృహత్తేజుఁడును, సంవర్తుఁడు తపోధనుఁడునై యుండ, నాబృహస్పతి, యాసంవర్తుని మఱిమఱియు బాధింపసాగెను. ఓయుధిష్ఠిరా! అటులాసంవర్తుఁడు తనజ్యేష్ఠభ్రాతచే బాధితుఁడగుచుఁ, దనకుఁగల యర్థములనెల్లఁ బరిత్యజించి, దిగంబరుఁడై వనమున నివసింప నభిలషించి వెడలెను. అపుడింద్రుఁడును రక్కసులనెల్ల జయించి, నిహతులఁ గావించి, లోకముల కింద్రత్వము నొంది, తనకుఁ బురోహితునిఁగా నంగిరుని జ్యేష్ఠపుత్త్రుఁడును విప్రోత్తముఁడునగు బృహస్పతిని గోరికొనియెను. మున్నంగిరసునకుఁ గరంధముఁ డనియెడిరాజు యాజ్యుఁడై యుండెను. అతఁడు నిరుపమానమగుపరాక్రమముచేతను, బలవృత్తములచేతను నింద్రునిఁ బోలి మిగులఁ దేజముగలిగి, ధర్మాత్ముఁడును నియతవ్రతుఁడు నగుచు వెలయఁ జొచ్చెను. అతఁడు తనముఖవాయువును గరమునఁ బూరించి ధ్యానించినంతనే, వాహనములు, యోధులు, మిత్త్రులును లభింతురు. అటులే ముఖ్యములగుమహార్హశయనాదులును నాతఁడు తలంచినంతనే లభించెడివి. మఱియు నతఁడు నిజసద్గుణములచేఁ బార్థివులనెల్లఁ దనకు వశులఁగాఁ జేసికొని, తనయిచ్చవచ్చినన్నినాళులు జీవించి స్వశరీరముతో స్వర్గము నొందెను. ఆతనిపుత్త్రుఁడు యయాతియట్లు ధర్మవేత్తయై, అవిక్షితుఁడనుపేర వెలసి, శత్త్రులనెల్ల జయించి, పుడమినెల్లఁ దనవశముగా నొనర్చికొనియెను. అప్పార్థివుఁడు విక్రమాదిగుణములచేఁ దండ్రినిబోలినవాఁడై వర్తిల్లుచుండునంత, నాతని కింద్రతుల్యుఁడై మరుత్తుఁ డనువాఁ డుదయించెను. ఆమరుత్తునియెడఁ, జతుస్సముద్రముద్రితమగు భూభాగ మనురక్తమగుటయు, నతఁ డింద్రునియెడ స్పర్ధగలిగియుండెను. పాండునందనా! ఆమరుత్తునిపై నింద్రుఁడును స్పర్ధవహించియుండెను. శుచియు, సుగుణనిధియునగు నామరుత్తుని మించుట కెంత ప్రయత్నించియు, నింద్రుఁడు సఫలమనోరథుఁడు కాఁజాలకుండెను. అటులగుట నాయింద్రుఁ డమ్మరుత్తునియాధిక్య

మును సహింపఁజాలక దేవతలతోఁ గూడి, బృహస్పతిని బిలిపించి "ఓమహనీయా! నాకుఁ బ్రియముఁ జేయందలంతువేని, యింక నా మరుత్తునిదైవపిత్ర్యకర్మములను జేయింపకుందువుగాక. ఓబృహస్పతీ! నేను మూఁడులోకములందును, దేవతలకును బ్రభువనై యింద్రత్వమునొంది యున్నవాఁడను. మరుత్తుఁడన్ననో యొకమహీపతిగదా! ఓబ్రాహ్మణోత్తమా! అమర్త్యుఁడగు సురాధీశునకు యాజకుఁడవై యుండియుఁ, మృత్యువశుఁడైన మనుష్యమాత్రుఁడగు మరుత్తునకెట్లు నిశ్శంకముగా యాజకత్వము పూనెదు? నీకు శ్రేయము వలయునా? నన్నేని గోరికొని నాకే యాజకుఁడవై యుండుము. కాదందువా? ఆమహీపతియగు మరుత్తునే వరించి యాతనికే యాజకుఁడవై యుండుము. నామాట ననుసరించి మరుత్తునిఁ బరిత్యజింపుము. నన్నే నమ్మి యుండుము.' అని పలికెను.

ఓయుధిష్ఠిరా! ఆయింద్రుఁ డిట్లు తెలుప విని బృహస్పతి, రెండుగడియలసేపు చింతించి యాదేవరాజుతో 'ఓయీ! నీవు సకలభూతాధిపతివి. నీయందే లోకములెల్లఁ బ్రతిష్ఠితములై యున్నయవి. మఱియు, విశ్వరూపనముచి, బలాసురులను వధించినబలశాలివి. ఉత్తమమగుదైత్యుల వీరలక్ష్మిని నీవొకఁడవే సంపాదించినవాఁడవు. ఓబలసూదనా! నీవే నిత్యము భూస్వర్గలోకముల భరించుచున్నవాఁడవు. ఓదేవేశ్వరా! నీకుఁ బురోహితుఁడనై యుండియు, మర్త్యుఁడగు మరుత్తునకెట్లు యాజకుఁడ నగుదును? కావున నీవిఁక నూఱడిల్లుము. నేను మర్త్యునకు యాజకుఁడనై యాతనియజ్ఞమున స్రువముఁబట్టికొనను. ఈనావచనము నమ్ముము. అగ్ని చల్లవడెనను, బుడమి తలక్రిందైనను, సూర్యుఁడు వెలుఁగకున్నను, నేనుమాత్రము నాయాడిన మాట తప్పను.' అని పలికెను. ఓజనమేజయా! బృహస్పతి యిట్లు పలుకుటయు నింద్రుఁడు గతమత్సరుఁడై యాబృహస్పతిఁ బ్రశంసించి నిజభవనమును బ్రవేశించెను" అని తెలిపి వ్యాసుఁడు మఱియు నిట్లనియె.

### బృహస్పతిమరుత్తసంవాదము

"ఓధర్మజా! ఇందుల కొకపురాతనేతిహాసము గలదు. అది యింద్రమరుత్తులకు జరిగినసంవాదము. దానిం దెలిపెద నాకర్ణింపుము.

బృహస్పతి యింద్రునివద్దఁ దానటులు ప్రతినయొనర్చెనుగాదే? ఆవార్త విని మరుత్తచక్రవర్తి తానొకయజ్ఞముసేయ సంకల్పించి, బృహస్పతిని సమీపించి, 'ఓగురూత్తమా! నేను మున్నొకపుడు నీసన్నిధికి వచ్చి యొకయజ్ఞము చేయుదునని మనవిచేసియుంటినిగాదే? దాని నిపుడు నేయఁదలంచియున్నాఁడను. వలయుసంభారములన్నియు సంపాదింపఁబడినవి. నీకు నేను యాజ్యుఁడనుగాదే? కావున నీయాజకత్వమూని నాయాగమును జేయింపుము.' అని కోరెను.

అది విని బృహస్పతి, 'ఓరాజా! నే నిఁక నీచే యాగము చేయింప నిష్టపడను. నన్నాయింద్రుఁడు యాజకుఁడుగాఁ గోరికొనియె దానికి నేనంగీకరించి, యటులే యొనర్తునని ప్రతినవట్టితి' నని తెలిపెను. అంత నామరుత్తుఁడు 'ఓమహాత్మా! నీకు నేను బిత్ర్యమగు క్షేత్రమనై యున్నవాఁడను. మఱియు నిన్ను గౌరవించుచున్నవాఁడను. నీకు యాజ్యుఁడను. కావున నన్నుఁ బరిత్యజింపకుము.' అని పలికెను. అది విని మఱియు నాబృహస్పతి, 'ఓరాజా! అమర్త్యుఁడగు ఇంద్రునకు యాగము చేయించిననేను మానవుఁడవగు నీచే నెట్లు యాగము చేయింతును? ఓయీ! నీయాజకత్వమును విడిచికొంటిని. కావున నీవిఁకఁ బోవచ్చును. లేదా నీయిష్టము. నేను మాత్రము నీకు యాజకుఁడ నిఁకఁ గాను. నీకిష్టమువచ్చినవానిని వేఱొకనిఁ గోరికొమ్ము. వానిచే నీయాగము చేయించుకొనుము.' అని తెలిపెను.

ఓధర్మజా! బృహస్పతి యటులు పలుకుటయు, నమ్మరుత్తుఁడు లజ్జితుఁడై, యుద్విగ్నమానసుఁడై మరలివచ్చుచుఁ ద్రోవనడుమ నారదమునిఁ గాంచి, చేతులుమొగిడ్చి నిలువఁబడియుండెను. అంత నారదుఁడామరుత్తునితో 'ఓరాజర్షి! నీవేమి యిట్లు ఖిన్నుఁడవై యున్నటులు గాన్పించుచున్నాఁడవు? ఓయనఘా! నీకు సేమమేగదా? ఎందుల కేఁగితివి? నీకెవనివలన నిట్టియనిష్టము సంభవించెను? ఓపార్థివోత్తమా! నేను వినఁదగినదేని నాకు వినిపింపుము. ఓనరాధిపా! ఎల్లవిధముల నీదుఃఖము దొలఁగింప నేను బ్రయత్నించువాఁడను.' అని పలుకుటయు, నమ్మరుత్తుఁడు, తనకుపాధ్యాయుఁడగు బృహస్పతివలనఁ గలిగినపరిభవమునెల్ల వినిపించువాఁడై 'ఓమునివర్యా! అంగిరునిపుత్త్రుఁడును, నమరాచార్యుఁడునగు బృహస్పతికడ కేఁగి, నాకు ఋత్విజుఁడవై

యాగము చేయింపుమని కోరఁగా, నతఁ డందులకు సమ్మతింపక, నన్నుఁ బొమ్మని పలికెను. నా కాతనివలనఁ గలిగినపరిభవముచే నే నిఁక జీవింప నొల్లను. ఓనారదా! నన్ను గురువు పరిత్యజించుటయేగాక విశేషించి దూషించెను.' అని పలికెను.

ఓధర్మజా! అమ్మరుత్తుఁ డట్లు పలుకుటయు, నమ్మునీంద్రుఁ డాతనిఁ దనవచనామృతముచే జీవింపఁజేయువాఁడునాఁడగి, 'ఓరాజోత్తమా! అంగిరునిపుత్త్రుఁడగుసంవర్తుఁ డొకఁడు గలఁడు. అతఁడు పరమధార్మికుఁడై యిపుడు దిగంబరుఁడై, పుడమిని బరిభ్రమించుచున్నవాఁడు. బృహస్పతి నిన్నొల్లఁడేని, నీ వాసంవర్తుని యాజకునిఁగా వరింపుము. మహాతేజుఁడగు నతఁడు ప్రసన్నుఁడగుట నిన్నుఁ దప్పక మన్నించును. నీచే యాగ మతఁడు చేయించును.' అని తెలిపెను. అది విని యామరుత్తుఁడు 'ఓనారదా! నీ యీవచనముచే నేను బ్రతుకఁగల్గితిని. నేనాసంవర్తుని సందర్శింతును. అతఁ డెందుండునో తెలుపుము. ఆతనియెడ నేనెట్లు ప్రవర్తింపవలయును? అతఁడు నన్నెట్లు మన్నించును? అతఁడు నన్నొకపుడు పొమ్మనెనా! మఱి బ్రతుకఁజాలను.' అని పలికెను. అందుల కానారదుఁడు 'ఓమరుత్తా! ఇపు డాసంవర్తుఁ డున్మత్తవేషుఁడై తనయిచ్ఛవచ్చినచోటఁ బరిభ్రమించుచున్న వాఁడు. ఓమహారాజా! మహేశ్వరసందర్శనార్థమై యతఁ డిపుడు వారాణసిఁ జేరి యుండవచ్చును. కావున నీవిపు డావారాణసీద్వారమును జేరి యందొకచో నొకశవము నుంచుము. ఓమహీనాథా! అతఁ డద్దానిని జూచినచో మరలును. అపు డతఁ డెందులకు మరలిపోవునో, యందులకు నీవును మరలి యతనివెంటనంటి పోవుచుండుము అటులు వెడలి యాతనిరహాస్యసమయము నీకు లభించినపుడు నీ వాతనిశరణమందుము. అపు డతఁడు నిన్నెవ్వరంపిరని ప్రశ్నించును. నీవపుడు 'నారదుఁడు పంపఁగా వచ్చితి'నని తెలుపుము. ఆసంవర్తుఁడు నన్ననుగమింప నెంచి నాతావు తెలియఁగోరెనేని, నేను వహ్నిప్రవిష్టుఁడనైయున్నట్లు లాతనితో నిశ్శంకముగా నెఱిఁగింపుము.' అని తెలిపెను.

ఓయుధిష్ఠిరా! అది విని యామరుత్తుఁ డటులే యని యందులకు సమ్మతించి యానారదు నాదరించి, యాతని సెలవుగొని వారాణసికిఁ బోయి, యానారదుఁడు చెప్పినచొప్పున, నప్పురద్వారమును జేరి

నారదవచనము స్మరించి యొకశవము నచ్చోట నుంచుటయుఁ, దత్సమయముననే యాసంవర్తుఁడు నచ్చోటికి వచ్చి యాకుణపమును గాంచి వెంటనే మరలెను. అటులు మరలి పోవుచున్న యాసంవర్తునిఁ గాంచి యామరుత్తుఁడు చేతులు జోడించి యాతని వెంబడించి యెటులేని యాతనిఁ బ్రసన్నుఁ జేసికొనువాఁడై పోవుచుండెను. పిమ్మట నాసంవర్తుఁ డొకరహస్యమ నామరుత్తునిఁ గాంచి, పాంసుకర్దమకము లాతనిపైఁ జల్లి శ్లేష్మముచే నాతనిపై నుమిసెను. అటు లామరుత్తుఁ డాసంవర్తునిచేఁ బీడింపఁబడియు, విడువక కేల్మోడ్పుతోడనే మఱియు నాతని వెంబడించి పోవుచుండెను. అప్పు డాసంవర్తుఁడు కొంతపరిశ్రాంతుఁడగుట మరలి యొకచోఁ జల్లనినీడగల యొకబహుశాఖయగు మఱ్ఱిచెట్టు క్రిందఁ గూరుచుండెను.” అని తెలిపి మఱియు నిట్లనియె.

## మరుత్తసంవర్తసంవాదము

“ఓధర్మజా! అటు లామఱ్ఱిక్రిందఁ గూరుచుండి యాసంవర్తుఁ డామరుత్తునితో ‘ఓయీ! నీవు నన్నెట్లు తెలిసికొంటివి? నా యునికి నీ కెవ్వరు చెప్పిరి? నావలనఁ బ్రియము గోరుదేని యిందలితత్త్వ మెఱిఁగింపుము. సత్యము పలికెదేని, నీసకలమనోరథములును సఫలము లగును. అటులుగాక యనృతమాడెదేని, నీతల నూఱుప్రయ్యలయ్యెడిని.’ అని పలుకుటయు నమ్మరుత్తుఁడు ‘ఓమహనీయా! మార్గవశముగాఁ బోవుచు నారదుఁడు నీయునికి నాకెఱిఁగించెను. నీవు నాకు గురుపుత్రుఁడవగుట నీయెడ నా కెంతయుఁ బ్రీతి గలిగెను.’ అని పలికెను. అది విని సంవర్తుఁడు ‘ఓరాజా! నీవు సత్యమును బలికితివి. అతఁడు నన్ను యాజకునిఁగా నెఱిఁగినవాఁడు. అతఁ డిపు డెందున్నవాఁడో నాకెఱిఁగింపుము.’ అని యడుగ విని యమ్మరుత్తుఁడు ‘దేవా! ఆనారదుఁడు నీవరిగినత్రోవ నాకుఁ దెలిపి, నాకు సెలవొసఁగి, యగ్నిప్రవిష్టుఁ డయ్యెను.’ అని తెలిపెను.

ఓయుధిష్ఠిరా! ఆమరుత్తునిమాట విని యాసంవర్తుఁడు సంతుష్టుఁడై ‘ఓరాజా! ఈమాత్రము నేనును జేయఁగలను’ అని పలికి, పిమ్మట నామరుత్తుని, మఱియు నున్మత్తునట్లు మాటచేఁ గసరువాఁడునాఁ బరుషవచనములచే భర్జించుచు, ‘ఓరాజా! నిజచిత్తవశవర్తినై, వాత

ప్రధానుఁడనై వికృతరూపుఁడనగు నాచే యాగము చేయించుకొనఁ గోరెదేల? నాయన్నయగు బృహస్పతి సమర్థుఁడును, వాసవమిత్త్రుఁడును నై వర్తిల్లుచున్నవాఁడు. అతఁడు మంచి యాజకుఁడు. ఆతనిచే యాగకర్మములను జేయింపుము. నాగార్హస్థ్యము, నాయాజ్యులు, నాసకలగృహ్యదేవతలును, నాయన్నచే నాకర్షింపఁబడిరి. నాశరీరము తప్పఁ దక్కినదెల్ల నతనిచేఁ బరిగ్రహింపఁబడియెను. ఓమరుత్తుఁడా! ఆతనిసెలవు గొనక నే నెవ్వనికేని యాగ మెట్లు చేయింపఁగల్గుదును? ఆతఁడు నాకెంతయుఁ బూజ్యతముఁడు. ఓయీ! నీవు బృహస్పతిని జేరి సమస్తమునకు సెలవుగొనిరమ్ము. నీవు నావలన యాగముచేయించుకొనఁ దలంతువేని యాతనిసెలవునొంది చేయించుకొనుము.' అని పలికెను. అంత మరుత్తుఁడు 'ఓమహానీయా! నేను మున్నుగా బృహస్పతిసన్నిధికిఁ బోఁగా, నందు జరిగినవిధ మెఱిఁగించెదను వినుము. అతఁడు వాసవునికోరికచే నాకు యాజకుఁడగుట కొల్లనని తెలిపెను. 'నా కమర్త్యుఁడు యాజ్యుఁడై యుండ మానవునకు నేనెట్లు యాజకుఁడ నగుదును? మరుత్తునకు యాగము చేయింపవలదని యింద్రునిచే నిషేధింపఁబడితిని.' 'ఓబ్రాహ్మణోత్తమా! ఆమరుత్తుఁడు నిత్యము నాతో స్పర్ధ సేయుచుండును. కావున నీవాతనికి యాజకుఁడవు గావలదు' అని వాసవుఁడు నీయన్నతోఁ బలికెను. అందులకు నీభ్రాత సమ్మతించెనఁట. అటులగుట నన్నుఁ బ్రేమమీఱ యాజ్యునిఁగా నొల్లఁడు. అతఁడు దేవరాజు నాశ్రయించెను. ఇది యటులగుటఁ దెలిసితివిగదా! కావుననే, సకలధనములచే నీవు నన్ను యాజ్యునిఁగా నొనర్ప వేఁడుచున్నవాఁడను. నీవలన నాకుఁ గలిగెడు నుత్తమగుణములచే నవ్వాసవు నతిక్రమింపఁ గోరుచున్నాఁడను. ఓబ్రాహ్మణోత్తమా! ఇఁక నాబృహస్పతిని జేర నామన మొల్లకున్నయది. నన్నుఁ జెప్పఁజాలనట్టి యవమానముచేసి తొలఁగిపొమ్మనియెను.' అని తెలిపెను.

అది విని యాసంవర్తుఁడు 'ఓమరుత్తుఁడా! నీవేమో నీయిచ్ఛ వచ్చినట్లుచేయ నెంచుచున్నవాఁడవుగదా! నీవు నాసకలాభిప్రాయములను సమకూర్పఁగలవాఁడవేని నీవన్నదెల్ల జరగును. కాని నేనొకటి తెలిపెదను వినుము. నీచే నేను యాగముచేయింతునేని, బృహస్పతిపురందరు లిరువురును నాపైఁ గోపమొందకమానరు. ఇంద్రో

కటి నే నూహించుచున్నాఁడను. నీ వీకార్యమున స్థైర్యమెట్లు విడువకుందువో, యట్లు నాకు నిస్సంశయముగా నమ్మిక గలిగింపవలయు. అటులు గాదేని కుపితుఁడనై నిన్ను సబాంధవముగా భస్మముగావించువాఁడను.' అని తెలిపెను.

అంత నామరుత్తుఁడు 'ఓగురూత్తమా! నీసంబంధమును విడుతునేని, సూర్యుఁడు ప్రకాశించునంతకును, బర్వతము లున్నంతకును, నే నుత్తమలోకము లొందకుండువాఁడను. మఱియు నీసంగతిని బరిత్యజింతునేని శుభబుద్ధిదూరుఁడనై, విషయలోలుపుఁడనై చెడుదును గాక.' అని పలికెను. అంత, మఱియు నాసంవర్తుఁడు 'ఓరాజా! నీకర్మములందు నీకు శుభబుద్ధి యొకటి తెలిపెదను వినుము. నాయాజనమును నీకగును. ఓరాజా! నాచెప్పినచొప్పున వర్తింతువేని యక్షయమగుద్రవ్యమును బొందెదవు. దానిచే దేవగంధర్వులను నింద్రునిఁ బరిభవింపఁ గలుగుదువు. నాకు ధనమందు నభిలాష లేదు. యాజ్యులు నక్కఱలేదు. నే నిపుడు నాయన్నకును నింద్రునకును విప్రియమొనర్పనున్నవాఁడను. మఱియు నింద్రునితోఁ దుల్యునిఁగా నిన్నుఁ జేయుట నిశ్చయము. నీకుఁ దప్పక ప్రియము గావించుట నిశ్చయమని పలుకుచున్నాఁడను' అని తెలిపి సంవర్తుఁడు మఱియు నిట్లనియె.

'ఓమరుత్తా! ఎచ్చో నాభగవానుఁడగు శంకరుఁడు నిత్యము తపము సేయుచుండునో, యట్టిహిమవంతము పార్శ్వమున ముంజవంతమనెడి పర్వత మొకటి గలదు. భగవానుఁడగు మహేశ్వరుఁడు మాసహాయుఁడై యాపర్వతమున, వృక్షములమూలములందును, శృంగములందును, గుహాలందును యథాసుఖముగాఁ గ్రీడించుచుండును. నానాభూతసమన్వితుఁడై మహాతేజుఁడైన యాశూలి యున్నచోటనే రుద్రులును, సాధ్యులును, విశ్వేదేవులును, వసువులును, యమవరుణకుబేరులును, భూతములును, పిశాచములును, నశ్వినిదేవతలును, నప్సరసలు, గంధర్వులు, యక్షులు, దేవర్షులు, నాదిత్యులు, మరుత్తులు, యాతుధానులును బహురూపుఁడై మహాత్ముఁడైన యాశంకరుని సేవించుచు నుందురు. ఆభగవానుఁ డందుఁ గుబే

రానుచరులఁ గూడి క్రీడించుచుండును. వికృతాకారులగువారును
నాతనితో నాడుకొనుచుందురు. ఆశూలి బాలాదిత్యసమద్యుతియై
వెలుగుచుండ, నాతనిరూపము నవయవసంస్థానమును గనుఁగొన నేరికిని
శక్యము గాకుండును. మఱియు నతని తేజస్తపములును, వీర్యమును
నిర్దేశింపరానివై యున్నవి. అచ్చో మిగుల వేఁడిమిగాని, చలిగాని,
గాలిగాని, సూర్యునిప్రకాశముగాని, యుండదు. మఱియు, జరయు,
క్షుత్పిపాసలును, మృత్యువు, భయము నచ్చోఁ గలుగనేరవు.
ఆకొండ నలువంకలను, సూర్యకిరణములునా బంగారుకాంతులు
వెలయుచుండును. ఉద్యతాయుధులగు కుబేరసహాయులచే నప్రదేశ
ములు రక్షింపఁబడుచుండును. ఆభగవానుఁడగు శర్వునకు నమ
స్కారము. వేధయు, రుద్రుఁడు, శితికంఠుఁడు, సురూపుఁడు, సువర్చ
సుఁడు, కపర్దియుఁ, గరాళుఁడు, హర్యక్షుఁడు, వరదుఁడు, త్రినే
త్రుఁడు, పూషదంతభేది,వామనుఁడు, శివుఁడు, యామ్యుఁడు, అవ్యక్త
రూపుఁడు, సద్వృత్తి, శంకరుఁడు, క్షేమ్యుఁడు, హరికేశుఁడు, స్థాణువు,
పురుషుఁడు, హరినేత్రుఁడు, ముండుఁడు, కృశుఁడు, ఉత్తారణుఁడు,
భాస్కరుఁడు, సతీర్థుఁడు, దేవదేవుఁడు, రంహోరూపి, ఉష్ణీషి,
సువక్త్రుఁడు, సహస్రాక్షుఁడు, మీఢువు, గిరిశుఁడు, ప్రశాంతుఁడు,
యతి, చీరవసనుఁడు, బిల్వదండుఁడు, సిద్ధుఁడు, సర్వదండధరుఁడు,
మృగవ్యాధుఁడు, మహత్తరుఁడు, ధన్వి, భవుఁడు, వరుఁడు, వ్యోమ
వక్త్రుఁడు, సిద్ధమంత్రుఁడు, చక్షువు, హిరణ్యబాహువు, ఉగ్రుఁడు,
దిక్పతి, లేలిహానుఁడు, గోష్ఠిరూపి, వృష్ణి, పశుపతి, భూతపతియగు
వానికి నమస్కారము. వృషుఁడు, మాతృభక్తుఁడు,సేనాని,మధ్యముఁడు,
స్రువహస్తుఁడు, మతి, ధన్వి,భార్గవుఁడు, అజుఁడు, కృష్ణనేత్రుఁడు, విరూ
పాక్షుఁడు, తీక్ష్ణదంష్ట్రుఁడు, తీక్ష్ణుఁడు, వైశ్వానరముఖుఁడు, మహా
ద్యుతి, అనంగుఁడు, శర్వుఁడు, దిశాధీశుఁడు, విలోహితుఁడు, దీప్తుఁడు,
దీప్తాక్షుఁడు, మహౌజసుఁడు,కపాలమాలి,నిత్యసువర్ణమకుటుఁడు,మహా
దేవుఁడు, కృష్ణుఁడు, త్ర్యంబకుఁడు, అనఘుఁడు, క్రోధనుఁడు, నృశం
సుఁడు, మృదువు, బాహుశాలి,ఉగ్రుఁడు,పతి, పశువు, కృత్తివాసుఁడు,
దండి, తపస్వి, అక్రూరకర్ముఁడు, సహస్రశిరస్కుఁడు, సహస్రచరణుఁడు,
త్రిపురఘ్నుఁడు, వసురూపుఁడు, దంష్ట్రియు నగువానికి నమస్కారము.

వసురేతుఁడు, సుశరీరుఁడు, అనంతుఁడు, మహాద్యుతియు, మహాదేవుఁడు, పినాకియు, మహాయోగియు, అవ్యయుఁడు, త్రిశూలహస్తుఁడు, వరదుఁడు, త్ర్యంబకుఁడు, భువనేశ్వరుఁడు, త్రిపురఘ్నుఁడు, త్రిణయనుఁడు, త్రిలోకేశుఁడు, మహౌజసుఁడు, సకలభూతప్రభవుఁడు, ధారణుఁడు, ధరణీధరుఁడు, ఈశానుఁడు, శంకరుఁడు, శర్వుఁడు, శివుఁడు, విశ్వేశ్వరుఁడు, భవుఁడు, ఉమాపతియుఁ, పశుపతియు, విశ్వరూపుఁడు, మహేశ్వరుఁడు, విరూపాక్షుఁడు, దశభుజుఁడు, దివ్యగోవృషభధ్వజుఁడు, ఉగ్రుఁడు, స్థాణువు, శివుఁడు, రౌద్రుఁడు, శర్వుఁడు, గౌరీశుఁడు, ఈశ్వరుఁడు, శితికంఠుఁడు, అజుఁడు, శుక్రుఁడు, పృథువు, పృథుహరుఁడు, వరుఁడు, విశ్వరూపుఁడు, విరూపాక్షుఁడు, బహురూపుఁడునగు నుమాపతికి నమస్కరించెదను. అనంగాంగహరుఁడును, శరణ్యుఁడు, మహాదేవుఁడు, చతుర్ముఖుఁడునగు దేవుని శరణమొందుము. ఓమరుత్తా! ఇటులా మహాత్ముఁడగు నమ్మహాదేవునకు నమస్కరించి యతనియనుగ్రహము వడయు దేని యందున్న యాసువర్ణము నొందఁగలుగుదువు. ఆసువర్ణమును దేఁగల నీపరిచారకు లందులకుఁ బోవుదురు గాక.' అని సంవర్తుఁడు తెలుప విని యామరుత్తుఁ డటులొనర్చెను. పిదప, నతిమానుషముగా యజ్ఞవిధియంతయు నారంభింపఁబడియెను. ఆయాగమునకుఁగా శిల్పులు సువర్ణభాండములను సన్నద్ధపఱచిరి. పిమ్మట నమ్మరుత్తమహీపతిసమృద్ధిని దేవతలమూలమునఁ దెలిసికొని, బృహస్పతి యెంతయు సంతాపమొందెను. అటులగుట నాతని మేను కృశింప మొగము వెల్లనై, 'అయ్యో! నాశత్రువగు సంవర్తుఁ డీక ధనవంతుఁడగును గాఁబోలు' అని పరితపించుచుండ, నాబృహస్పతివిధ మెఱిఁగి, దేవేశుఁ డమరులతోఁ గూడి వెడలి యాబృహస్పతితో నిట్లనియె.

### ఇంద్రుఁడు బృహస్పతి నూఱడించుట

'ఓబృహస్పతీ! నీవు సుఖనిద్ర నొందుచున్నాఁడవా? నీకుఁ బరిచారకులు వశులై యున్నవారు గదా! ఓవిప్రోత్తమా! నీవు దేవతల సుఖముఁగోరుచున్నాఁడవుగదా! దేవతలు నీకు రక్షకులై యున్నవారుగాదే? నీకీదుఃఖ మేటికి? ఇది నీకు మానసమా! దేహసంభవమా?

నీవిపుడు పాండువర్ణుఁడవై వెలవెలపోవుచున్నవాఁడ వేమి? ఓబ్రాహ్మణోత్తమా! నాకది యెఱిఁగింపుము. నీకుఁ గష్టము గలిగించినవారి నిపుడే వధించుచున్నాఁడను.' అని ప్రశ్నించెను.

అది విని యాబృహస్పతి 'ఓదేవరాజా! ఉత్తరదక్షిణలతోఁ గూడ మరుత్తుఁడు యజ్ఞము చేయ నున్నాఁడని తెలుపుచున్నారు. ఆ యాగమున సంవర్తుఁడు యాజకుఁడై యాగముచేయించునని వింటిని. వాఁ డామరుత్తునిచే యాగము చేయింపఁదగదని నాకోర్కి.' అని తెలిపెను. అంత నయ్యింద్రుఁడు 'ఓవిప్రోత్తమా! నీవు దేవతలకు మంత్రవేత్తవగు పురోహితుఁడవగుటచే, నీవు సకలకామసంపూర్ణుఁడ వగుటలో సందియము లేదు. ఆసంవర్తమరుత్తు లిరువురును జరామృత్యువుల నతిక్రమించినవారా! నీ కాసంవర్తుఁ డేమి చేయఁగలఁడు?

బృహ:—నీవిపుడు, దేవతలతోఁ గూడ రాక్షసులను బ్రోత్సహించి, వారిని వధింప నెంతువా! వారికిఁ గలసమృద్ధినెల్ల నశింపఁ జేయవలయును. వైరులసమృద్ధి దుఃఖనిమిత్తము గాకుండునే! ఓయింద్రా! నావైరి యామరుత్తు ననువర్తించుచున్నాఁడఁట. కావుననే, నేనిటులు వివర్ణుఁడనై తిని. ఓశతక్రతూ! నీవెన్నియుపాయములచే నైన నాసంవర్తునిఁగాని, యామరుత్తునిఁగానిఁ నిగ్రహింపవలయుఁ జుమీ!

ఇంద్రుఁడు:—అగ్నిదేవునిఁ జూచి 'ఓయీ! రమ్ము నీవిపుడు దూతవై యామరుత్తునిఁ జేరి, బృహస్పతి నామరుత్తునకు యాజకునిఁగా మార్చువాఁడవై 'ఓరాజా! ఆబృహస్పతి నీకు యాజకుఁడై మర్త్యుఁడవగు నిన్నమర్త్యునిఁజేయును' అని తెలుపుము.

అగ్ని:—ఓయింద్రా! నే నిదె దూతనై తప్పక యామరుత్తునిఁ జేరి, బృహస్పతిని యాజకునిఁగాఁ జేసికొమ్మని తెలిపి బృహస్పతి కుపచయమగునట్లుగాఁ బురుహూతునివచనము సత్యమగునట్లుగాఁ జేసెదను.

ఓయుధిష్ఠిరా! అటు లాయగ్ని తెలిపి, వెంటనే వెడలి, వనస్పతులను, లతలను మర్దించుచు, హిమాంతపరివర్తమానుఁడై కాష్ఠాతిగుఁడనుపవనునట్లు వెలుఁగుచుఁబోయెను. ఆయగ్నికిని మరుత్తునకును జరిగి నసంభాషణము తెలిపెదను వినుము.

మరుత్తుఁడు:—ఆహా! ఇపుడేమి యాశ్చర్యము. అగ్ని దేవుఁడు మూర్తీభవించి యిందులకు వచ్చెనుగాదే? ఓసంవర్తా! అర్ఘ్యపాద్యములను, నాసనమును నితని కర్పింపవలయును గాదే? వానిచే నీతని గౌరవింపుము.

అగ్ని:—ఓయనఘా! మరుత్తా! నీయర్ఘ్యపాద్యములకును, నీయాసనదానమునకును సంతసించుచున్నాఁడను. కాని, నే నింద్రునిచే నీకడకు దూతగా ననుపంబడి వచ్చితిని.

మరుత్తుఁడు:—ఓయగ్నీ! శ్రీమంతుఁడగు నా దేవరాజు సుఖియై యున్నాఁడా? ఓధూమకేతూ! మాయెడ నాతనికిఁ బ్రీతి గలదా? దేవత లాతనికి వశులై మెలఁగుచున్నవారా! అదియెల్ల నాకు సమగ్రముగా నెఱిఁగింపుము.

అగ్ని:—ఓపార్థివోత్తమా! ఇంద్రుఁ డెంతయు సుఖియై యున్నవాఁడు. నీయం దాతనికిఁ జెడని ప్రీతియుఁ గలదు. ఓరాజా! దేవతలందఱు నాతనికిఁ వశవర్తులై యున్నవారు. ఆతనిసందేశమును నీవు వినుము. ఆయింద్రుఁడు నన్ను నీసన్నిధి కెందులకుఁ బంపెనందువా? తెలిపెదను. 'మరుత్తునకు బృహస్పతిని యాజకునిఁగాఁ బరిదానము సేయువాఁడవై, యాతనితో 'నీ కీబృహస్పతి యాజకుఁడై మర్త్యుఁడవైన నిన్నమర్త్యునిఁ జేయును.' అని తెలుపుమని పలికెను.

మరుత్తుఁడు:—ఓయగ్నిదేవా! నీవన్నది తెలిసినది అయినను నాకీసంవర్తుఁడు యాజకుఁడైనఁ జాలును. ఇదె యాబృహస్పతికి నాయంజలి. ఆబృహస్పతి, యమర్త్యుఁడగు నింద్రునకు యాజకుఁడై యుండియు, మర్త్యుఁడనగునాకు యాజకుఁడై శోభిల్లునా?

అగ్ని:—ఓమరుత్తా! ఆదేవరాజు ననుగ్రహమును సంపాదింతు వేని దేవలోకమునఁగల రమ్యోద్దేశములన్నియు నీకు లభించును. నీ కాబృహస్పతి యాజకుఁడగునేని, నీవు కీర్తిసంపన్నుఁడవై తప్పక స్వర్గమును జయింపఁగల్గుదువు. అటులే బృహస్పతికిఁ యాజ్యుఁడవైతి వేని, మానుషలోకములును, దివ్యములగు ప్రజాపతిలోకములును, మఱియుఁగల యాయా మహత్తరలోకములును నీకధీనములగుటయె గాక, స్వర్గమెల్లనీస్వాతంత్ర్యమునకు లోనై యుండును.

సంవర్తుఁడు:—ఓయగ్నీ! మఱి నీవిందులకు రానక్కఱలేదు. బృహస్పతి యాతనికి యాజకుఁడును గానక్కఱలేదు. నిన్ను నాదారుణ దృష్టిచే దహించువాఁడను. నాకుఁ గోపము గలిగెనా నీవు నిలువఁ జాలవు సుమీ!

ఓయుధిష్ఠిరా! ఆసంవర్తునివచనము లాలించి, యాపావకుఁడా దేవతలకడ కేఁగెను. ఓధర్మజా! సంవర్తుఁడు తన్ను దహించునేమో యని, యశ్వత్థపర్ణమట్లు చలచిత్తుఁడై యాయింద్రునెదుట నిలువఁబడుటయు, నాతనిఁ గాంచి, మహాత్ముఁడగు నింద్రుఁడు, బృహస్పతి సన్నిధిని, యాతనితో 'ఓహవ్యవాహనా! నీవామరుత్తునికడకు దూతవై పోయితివి గదా! అతఁడు బృహస్పతినిఁ దనకు యాజకునిఁగా నొప్పుకొనెనా? యాగము చేయనున్న యాతఁడేమి పలికెను? నామాటఁ బ్రతిగ్రహించెనా?' అని యనెను.

అగ్ని:—ఓయింద్రా! నీవచన మామరుత్తునకు రుచింపలేదు. అతఁడు మనబృహస్పతి కొకయంజలి యొనర్చెదనని తెలిపెను. సంవర్తుఁడే తనకు యాజకుఁడగునని పలికెను. నేను మఱిమఱియు నాతనితో 'ఓమరుత్తా! నీకు మానుషలోకములును, దివ్యములగు ప్రజాపతిలోకములు మున్నగులోకములును గావలయునేని, బృహస్పతికి యాజ్యుఁడవగు'మనియుఁ దెలిపితిని. అయినను నతఁడందులకు సమ్మతింపలేదు.

ఇంద్రుఁడు:—ఓవైశ్వానరా! నీవు మఱియు నప్పార్థివునికడ కేఁగి, యాతనిఁ గలిసి, నేఁబలికితినని యర్థయుక్తమగు నొకమాట తెలుపుము. నీవటులు తెలిపినను నప్పార్థివుఁడు నీమాట లక్ష్యము సేయఁడేని, వానిని నావజ్రాయుధముపాలు గావించెదను.

అగ్ని:—ఓదేవా! ఈగంధర్వపతిని దూతగా నందుల కనుపుము. ఓవాసవా! నేనందులకుఁ బోవ భయపడుచున్నవాఁడను. చరితబ్రహ్మచర్యుఁడగు నాసంవర్తుఁడు, సంరంభమడరఁ దీవ్రరోషుఁడై నన్నుఁగాంచి, 'మఱియు నీవిట్లు బృహస్పతిని యాజకునిఁగాఁ గోరనరుదెంతువేని దారుణదృష్టిచే నిన్ను దహించెదనని నమ్ముము. నేను గుపితుఁడ నగుదునేని నీవు భస్మముగాకమానవు' అని పలికెను. అటులగుటఁ బోఁజాలను.

ఇంద్రుఁడు:—ఓయగ్నీ! నీవే తక్కినవస్తువులను దహించు వాఁడవు. ఒకదానిని బూడిదపాలుగావించువాఁడు నీవు దక్క వేఱొక్కఁడు లేఁడు. నీసంస్పర్శనమున నెల్లలోకములును జడియును. ఓ హవ్యవాహనా! నీవిపు డాడినమాట నమ్మఁదగనిమాట.

అగ్ని:—ఓశక్రా! నీవు నిజబలముచే స్వర్గమును సకలపృథివిని నాక్రమించియున్నవాఁడవుగదా! నీవిట్టిసమర్థతగలిగియున్నను, మున్నొ వృత్రుఁడు త్రిదివమును హరింపలేదా?

ఇంద్రుఁడు:—ఓయగ్నీ! నే నావృత్రుని మశకప్రాయునిఁగాఁ జేయఁగలిగినను, వానిని జయింప నుపేక్షించితిని. వైరిదత్తసోమమును నేను ద్రావను. బలహీనునిపై నావజ్రాయుధమును బ్రయోగింపను. మానవుఁడు నాకెదురా? నన్నుఁ గొట్టి వాఁడు సుఖించుటెట్లు? కాలకేయులను బుడమిని దొలఁగించితినిగాదే? దానవుల నంతరిక్షమునుండి తరలించితినిగాదే, స్వర్గమునకు సంతసమును సంతరించితినిగాదే? మానవుఁడు నాకెదురై సుఖించుటెట్లు?

అగ్ని:—'ఓమహేంద్రా! మున్నొకపుడు నీవు కుపితుఁడవై శర్యాతియాగమును నిషేధింపలేదా? ఆశర్యాతిచే చ్యవనుఁడు యాగముచేయించి, యశ్వినీదేవతలఁగూడి తానొకఁడే సోమపానము చేయలేదా? ఆవృత్తాంతమును స్మరింపుము. మఱియు నీవాచ్యవనునిపై వజ్రాయుధము వైవ నతిఘోరముగుదాని నావిప్రుఁడు నీబాహువుతోఁ గూడఁ, దపోబలముకలిమి నరికట్టలేదా? నీవటు లొనర్చుటచేఁ గదా ఆచ్యవనుఁడు కుపితుఁడై యెల్లవిధముల ఘోరాకారుఁడగుమదుని విశ్వరూపరాక్షసుని, జనింపఁజేసెను! వానిని గాంచి నీవు కన్నులు మూసికొంటివిగాదే? ఆమహారాక్షసుఁడు తీక్ష్ణములును, శతయోజనములునగు వేయిదంతములతో ఘోరరూపమైన వక్త్రమును దెఱచి, యొకదౌడను బుడమికి, వేఱొకదౌడ నాకసమునకుఁ జాపి నీకు వెఱపు గలిగింపలేదా? మఱియు వర్తులములును, స్థూలములును, ద్విశతయోజనపరిమాణములునగు నాలుగుదంష్ట్రలతోఁ గూడి పండ్లుకొఱుకుచు ఘోరముగు నొకశూలము నెత్తి యారక్కసుఁడు నిన్ను వెంటఁదఱుము ఘోరాకారుఁడగువానిని నీవరయుచుండ నిన్నపు డందఱును జిత్రముగాఁ గనుఁగొనలేదా! ఓదానవాంతకా! నీవపు డారక్కసు

నకు జడిసి, యమ్మహర్షికిఁ జేతులు మొగిడ్చి శరణ మొందలేదా? క్షాత్ర బలముకంటె బ్రహ్మబలము గొప్పది. దానిని మించిన వేఱొకటి లేదు. ఓయింద్రా! బ్రహ్మతేజము తత్త్వ మెఱిఁగిన నే నాసంవర్తు నెట్లు చేరఁగలను? ఎట్లు జయింపనెంతును?' అని పలుక విని యింద్రుఁ డిట్లనియె.

ఇంద్రుఁడు:—ఓయీ! బ్రహ్మబల మిటులు గొప్పదందువా? బ్రాహ్మణబలమును మించిన దొకటి లేదందువా? అటులేని క్షత్త్రియుఁడగు మరుత్తునివిభుత్వము నే నోరువనివాఁడనగుట వానిపై నాఘోరమగు వజ్రాయుధమును బ్రయోగింతును. ఓధృతరాష్ట్రా! నీవు దూతవై వడిగాఁ బోయి యాసంవర్తునితో మాకు సంగతము గలిగింపుము. బృహస్పతివిధ మాతని కెఱిఁగింపుము ఆమరుత్తునిపై వజ్రాయుధము వైతునని తెలుపుము.

ఓయుధిష్ఠిరా! అనంతర మాగంధర్వుఁడగు ధృతరాష్ట్రుఁడు మరుత్తునికడకు వెడలి యాయింద్రునివచనముగా నాపార్థివునితో 'ఓయీ! నరేంద్రా! నన్ను ధృతరాష్ట్రుఁడనెడి గంధర్వునిగాఁ దెలియుము. నేనొకటి తెలుప నీసన్నిధికి వచ్చితిని. లోకాధిపతియు మహాత్ముఁడగు నింద్రుఁడు పలికినవచన మొకటి వినుము. అతఁడు, నీతో 'బృహస్పతిని యాజకునిఁగా వరింపుము. లేదేని వజ్రాయుధము నీపైఁ బ్రయోగింతును.' అని తెలుపుమనియెను. నా యీమాట నొల్లవేని యాతఁ డన్నదియగును' అని తెలిపెను.

మరుత్తుఁడు:—ఓగంధర్వరాజా! నీవును, మీదేవేంద్రుఁడును, విశ్వేదేవులును, వసువులు, నశ్వినీదేవతలును దెలియుఁడు. లోకమున మిత్త్రద్రోహముచే నగుపాపమునకు నిష్కృతిలేదు. ఆపాపము బ్రహ్మహత్యతో సమానమైనది. బృహస్పతి మహేంద్రునిచే యాగములు చేయించునుగాక. సంవర్తుఁడే నాకు యాజకుఁడుగా నుండుఁగాక. నీ వచనము నాకు రుచింపలేదు.

గంధర్వుఁడు:—ఓరాజసింహా! నభస్థలమున వాసవుని యాఘోరగర్జననాదము వినఁబడుచున్నదా? తప్పక యమ్మహేంద్రుఁడు నీపై వజ్రాయుధము వైచును. ఓరాజా! నీవు క్షేమమార్గ మాలోచించుకొనుట కిదె తగుసమయము.

ఓయుధిష్ఠిరా ! ఆగంధర్వుఁ డటులు తెలిపినయనంతరము గర్జిలుచున్నవాసవుని నినాద మామరుత్తునకు వినవచ్చెను. అపు డతఁ డానిత్యతాపసియు ధర్మవేత్తయునగు సంవర్తునకావిషయమును దెలిపి, కర్తవ్య మాతనివలనఁ దెలిసికొనువాఁడై యిట్లు పలికెను.

మరుత్తుఁడు:—ఓవిప్రేంద్రా ! నామన మిదె చలించుచున్నది. చూడుము. అదె యాయింద్రునిమార్గము చేరువై యున్నను, గానరాకున్నది. నీనుండియే నేను శుభము నొందవలయును. ఓవిప్రముఖ్యా! ఆవాసవునుండి నాకభయ మొసంగుము. అదె పదిదెసల వెలిఁగించుచు, వాఁడె యింద్రుఁడు వచ్చుచున్నాఁడు. అమానుషమగు నీఘోరోపద్రవమున కీసదస్యులును జడియుచున్నవారు.

సంవర్తుఁడు:—ఓరాజోత్తమా ! నీ కాశక్రునివలన భయపడవలసినది లేదు. భయంకరమగు నీయుపద్రవమును నేను దొలఁగించెదను. నేను సంస్తంభినీవిద్యను బ్రయోగించెదను. నీ వావాసవుని తిరస్కారమునకు జడియకుము. నేనిప్పుడే వానిని సంస్తంభింతును. నావిద్యచే సకలదేవతలయాయుధములును నశించును. వజ్రము దెసలఁ బట్టుఁగాక. గాలి వీచుఁగాక. వర్ష మడవులందుఁ గురియుఁగాక. అంతరిక్షమున నుదకములు ప్రవహించుఁగాక. వట్టిమెఱుపులు మెఱయుఁగాక. నీకేమియు భయము లేదు. అగ్నిదేవుఁడు నీకామములను బూర్తిచేసి నిను రక్షించువాఁడు. వాసవుఁడు వర్షింపనిమ్ము. జలసమూహప్లవమానమై మహాఘోరమై వజ్రాయుధము నీవధమున కాతనిచేఁ బ్రయుక్తమగుఁగాక. నీవు భయమందవలదు.

మరుత్తుఁడు:—ఓవిప్రవర్యా ! ఆవజ్రాయుధమహారావము ఘోరమై వినవచ్చుచున్నది. అది గాలితోఁ గలిసివచ్చుచున్నది. మఱిమఱియు నాచిత్తము చలించుచున్నది. నాకు స్వాస్థ్యము గలుగకున్నది.

సంవర్తుఁడు:—ఓరాజా ! నీకిపు డాయుగ్రమగు వజ్రాయుధము వలన భయమక్కఱలేదు. నేను గాలినై యావజ్రమును దొలఁగింతును. కావున నీవు భయము విడిచి, నీయిచ్ఛవచ్చిన వేఱొకవరముఁ గోరికొమ్ము. దాని నిపుడె సాధించెదను.

మరుత్తుఁడు:—ఓబ్రాహ్మణోత్తమా! నాయాగములం దింద్రుఁడు, ప్రత్యక్షముగావచ్చి యందలి హవిస్సు ప్రతిగ్రహించుఁగాక. దేవతలు

తమతమస్థానములను స్వీకరించియుందురుగాక. మఱియు వారు హుత మగుసోమమును బ్రతిగ్రహింతురుగాక.

సంవర్తుఁడు:—అదె త్వరితులయి వచ్చుచున్న దేవతలచే సన్ను తింపఁబడుచుఁ దనగుఱ్ఱములఁ గూడి యింద్రుఁడు వచ్చుచున్నవాఁడు. ఈయాగమున నే నాతని మంత్రములచేఁ బిలిచెదను. మంత్రములచే శిథిలకాయుఁడగు నయ్యింద్రు నిదె గనుఁగొనుము.

ఓజనమేజయా! అటులు వారికిఁ బరస్పరము సంభాషణము జరగుచుండఁగనే, యశ్వముఖ్యములచేఁ బూన్పఁబడినరథములలర దేవతలఁ గూడి యింద్రుఁ డామరుత్తునియాగమునందలి సోమమును ద్రావువాఁడై యరుదెంచెను. అటులు దేవసంఘములఁ గూడి యరు దెంచుచున్నయింద్రున కామరుత్తుఁడు స్వాగతమొసంగువాఁడై పురో హితునితోఁ గూడి వెడలి, యథాశాస్త్రముగాఁ బ్రతి పుట్టినట్టులు పూజను గావించెను. అపుడు సంవర్తుఁ డిట్లనియె.

సంవర్తుఁడు:—ఓపురుహూతా! నీకు స్వాగతమా! నీవు సన్ని హితుఁడవగుటచే మా యీయాగ మెంతయు శోభవహించు చున్నది. ఓబలవృత్రఘ్నా! మఱియు నాచే హోమ మొనర్పఁబడిన సోమమును ద్రావుము.

మరుత్తుఁడు:—ఓదేవరాజా! శుభదృష్టితో నన్నుఁ జూడుము. నీకిదె నమస్కారము. నీవు నాయజ్ఞమునకు వచ్చుటచే నాజీవితము సఫలమయ్యెను. బృహస్పతితమ్ముఁడగు నీసంవర్తుఁడు నాచే యాగము చేయించుచున్నాఁడు.

ఇంద్రుఁడు:—ఓరాజా! నే నెఱుఁగుదును. తపోధనుఁడును, దీప్తతేజుఁడును, బృహస్పతికవరజుఁడునగు నితఁడు నీకు గురువగు టయు నాకుఁ దెలిసినదియే. ఓనరేంద్రా! ఇతఁడు నన్నాహ్వానించుటఁ బట్టియే నే నిందులకు వచ్చితిని. నీపైఁ గలకోపము పోయినది. ప్రీతి గలిగెను.

సంవర్తుఁడు:—ఓదేవనాథా! మాయెడ నీవు ప్రీతుఁడవైతేని, మా యీయాగమును స్వయముగా శాసింపుము. ఓసురేంద్రా! నీవే సకలభాగముల నేర్పఱుపుము. దీనిని సకలలోకమును దెలియుఁగాక.

ఓయుధిష్ఠిరా! ఇటు లాసంవర్తుఁడు తెలుప విని, యవ్వాసవుఁడు దేవతల కిటు లాజ్ఞాపించెను. 'దేవతలారా! సభలు చేయఁబడుఁగాక. చిత్రములు సమృద్ధములుగా వేలకొలఁది యావసథముఖ్యము లొనర్పఁబడుఁగాక. గంధర్వులకు, నప్సరసలకు నారోహణములను జేయుఁడు. అం దప్సరస లాడుదురుగాక. ఈయజ్ఞవాటము స్వర్గతుల్యముగాఁ జేయఁబడవలయును.'

అది విని యాదేవత లాయింద్రవాక్యానుసారముగా నొనర్చిరి. పిమ్మట నయ్యింద్రుఁ డమ్మరుత్తునితో 'ఓరాజా! నే నెంతయుఁ బ్రీతుఁడనైతిని. నీవు నన్నుఁ బూజించితివి. ఓనరేంద్రా! నీవొనర్చిన యీగౌరవమునకు నీపూర్వులందఱును సంతసించిరి. దేవతలందఱును నీహవిస్సు ప్రతిగ్రహింతురు గాక.' అని తెలిపి, మఱియు నాతనితో 'ఓరాజా! ఇఁక నాగ్నేయమగు లోహితము నాలంభన మొనర్పుము. బహురూపమగు వైశ్వదేవము నాచరింపుము. మేధ్యమగు నీలవృషభము నాలంభనము సేయుము.' అని యాజ్ఞాపించెను.

ఓధర్మజా! పిదప యజ్ఞ మారంభింపఁబడియెను. అందు దేవతలు స్వయముగా నాహారములను బరిగ్రహింప నారంభించిరి. మఱియు నందాయింద్రుఁడు బ్రాహ్మణులు తన్నుఁ బూజింపఁ దానొకసదస్యుఁడై యుండెను. అపుడు సంవర్తుఁడు యాగశాలయందుఁ బ్రజ్వలించు రెండవయగ్నినా వెలయుచు, దేవసంఘముల నాహ్వానించుచుమంత్రయుక్తముగా హవిస్సుల నగ్నిలో వ్రేల్చుచుండెను. పిదప నింద్రుఁడు సోమపాన మొనర్చెను. మఱియుఁ గలదేవతలును దమభాగములను గొని యందఱును బ్రీతులై యాతని యాజ్ఞగొని యథాసుఖముగా వెడలిపోయిరి. పిమ్మట నామరుత్తుఁడు సువర్ణరాశుల నెల్లెడలఁ బోసి కుబేరునివలె బ్రాహ్మణులకు బహువిత్తముల నొసంగుచుఁ, బిదప నుత్సాహ మడర, వివిధమగు విత్తమునుగూర్చి కోశమునఁ జేర్చి గురునాజ్ఞ వడసి, యఖిలసాగరవేలావలయితమగు భూభాగమును బాలింపఁ దొడంగెను. ఓయుధిష్ఠిరా! ఆమరుత్తుఁ డిట్టివాఁడు. ఆతనియజ్ఞమునందలి సువర్ణము యట్టు లం దధికముగా నుండెను. దానిసి నీవు దెప్పించి యజ్ఞ మొనర్చి దేవతలకుఁ దృప్తిగావింపుము" అని తెలిపెను.

ఓ జనమేజయా! అనంతర మాయుధిష్ఠిరుఁడు సంతుష్టాంతరంగుఁడై యావ్యాసమహర్షి వచనముల నాదరించి, యతఁడు తెలిపిన విత్తముచే యాగముచేయువాఁడై మఱియుఁ దనమంత్రులతో నాలోచించెనని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

## శ్రీకృష్ణుఁ డింద్రవృత్రయుద్ధము తెలుపుట

ఓ జనమేజయా! అద్భుతకర్ముఁడగు నావ్యాసమహర్షి యిట్లు తెలిపినపిమ్మట నాయుధిష్ఠిరునిఁ గాంచి, వాసుదేవుఁ డాభాషించువాఁడై నిహతజ్ఞాతిబాంధవుఁడగుట నిర్విణ్ణచిత్తుఁడును, చింతాక్రాంతవర్తనుఁడు నై రాహుగ్రస్తసూర్యునట్లును, ధూమావృతాగ్ని యట్టులును నించుకేని వెలయకయున్న యాతనితో "ఓధర్మజా! ఈసకలమును వక్రమై మృత్యుస్థానమనక తప్పదు. బ్రహ్మపద మొకటియే ఋజువైనది. ఇదియే తెలియఁదగినవిషయము. ఎందుల కిట్లు మొఱ్ఱ వెట్టెదు? కర్మము నీయధీనమై యుండలేదు. వైరులు నీచే హతులు గాలేదు. నీశరీరమందున్న నీశత్రు నేల తెలియకున్నవాఁడవు? ఈవిషయమున ధర్మయుక్తము నాయెఱిఁగిన దొకటి తెలిపెదను వినుము. అది యింద్రవృత్రయుద్ధమును సంబంధించినది. ఓయీ! మున్నొకపుడు వృత్రుఁడు పుడమినెల్ల నాక్రమించెను. వానిచే నటులు పృథివి, వ్యాప్తము కాఁగా గంధవిషయము హృతమయ్యెను. అందుల కింద్రుఁడు కుపితుఁడై, ఘోరమగు తనవజ్రాయుధ మాసురునిపైఁ బ్రయోగించెను. భూరితేజమగు నద్దానిచేఁ బ్రహతుఁడై యా వృత్రుఁడు, వడిగా నుదకములఁ బ్రవేశించి తద్విషయమగురసమును హరింప నందుల కాయింద్రుఁడు కుపితుఁడై మఱియు వజ్రాయుధమును వైచెను. ఆవృత్రుఁ డయ్యుదకములందును వజ్రప్రహారమున కోర్వఁజాలక వెడలి, వడిగా జ్యోతిర్విషయమును గ్రహించెను. అటులు, వాఁడగ్నిఁ జొచ్చి రూపమును హరింపఁగాఁ గోపావేశపరవశుఁడై మఱియు నాయింద్రుఁడు తనవజ్రాయుధము వానిపై విసరెను. దానిచే వాఁ డందును నిలువఁజాలక వడిగా వాయువులోఁ జొచ్చి స్పర్శవిషయమును హరించెను. అపు డయ్యింద్రుఁడు మఱియుఁ, గోపముడర నావృత్రునిపై వజ్రాయుధము విసరుటయు, వాఁడు వధ్య

మానుఁడగుచు, నాకసమంటి శబ్దవిషయము నాక్రమించెను. అపుడాకసము వృత్రభూతమై శబ్దము హృతముగుట కోపక, మఱియు నాశతక్రతుఁడు, వజ్రాయుధము వైచుటయు, వాఁ డప్పీడకును సహింపక యాయింద్రునందే ప్రవేశించుటయు, నాయింద్రుఁడు మోహవశుఁడై యుండెను. అపుడు వసిష్ఠుఁ డాయింద్రుని, రథంతర సామముచే మోహవిముక్తునిఁ గావించెను. అంత నాయింద్రుఁడు తెలివిగలిగి, శరీరాంతర్గతుఁడై యున్నవృత్రుని వజ్రప్రహారముచేఁ బ్రహతుఁ గావించెను. ఈధర్మరహస్యము నింద్రుఁడు మహర్షులకుఁ దెలుపుచుండ నేను వింటిని. అది మఱియు మహర్షులును వ్యక్తముగా నాకెఱిఁగించిరి." అని తెలిపి వాసుదేవుఁడు మఱియు నిట్లనియె.

### వ్యాధిద్వైవిధ్యమును దత్పరిహారమును దెల్పుట

"ఓయుధిష్ఠిరా! వ్యాధి రెండువిధములు అది మానసము, శారీరము ననఁబరఁగుచుండును. అవి పరస్పరసంబంధము గలిగి, యొకదాని నొకటి విడువకయే యుండును. శరీరమున జనించినవ్యాధి శారీర మనఁబడును. మనసున జనించినవ్యాధి మానస మనఁబడును. ఓరాజా! కఫవాతపైత్యములు శరీరజములగు గుణములు. ఆగుణములు సమముగా నుండుటయే స్వాస్థ్య మనబడుచున్నది. వానిలో నేదే నొకటి యుద్రేకించినపుడు చికిత్సచేయఁబడును. మఱియు, హర్షముచే శోకమును, శోకముచే హర్షమును బాధింపఁబడుచుండును. ఒకపుడొకఁడు దుఃఖనిమగ్నుఁడైయుండియు సుఖమును స్మరించును. వేఱొకఁడు సుఖముగా నుండియు, దుఃఖమును స్మరింప నెంచును. కావున నీవు దుఃఖమునకు వగవఁదగదు. సుఖమునకు సంతసింపఁదగదు. ఓకౌంతేయా! దైవమే బలవత్తరమైనది. ఒకపుడు నీవు వానిచే నాకర్షింపఁబడుదువేని యది నీస్వభావము. నాఁడు నీవును భీమాదులును గాంచుచుండఁగా, నేకవసనయు రజస్వలయు నైనద్రౌపదిని వారు సభ కీడ్చికొనివచ్చుటను నీవు స్మరింపరాదుగదా! అటులే మీరు పురము విడిచి యరణ్యము చేరుటయుఁ, జర్మములను గట్టుకొనుటయు, నరణ్యవాసము చేయుటయును స్మరింపఁదగదు గదా! మఱియు నజ్ఞాతవాసమునఁ గీచకవధము, యాజ్ఞసేనికిఁ గలిగినకష్టమును స్మరింప

రాదుగదా! కావున దుఃఖములను స్మరించుట తగదు. నీకు ద్రోణ భీష్ములతో యుద్ధము సంభవించెను గాదే! ఇపుడు నీవు నీమానసముతో యుద్ధము చేయవలసివచ్చెను. అటులగుట నిపు డీయుద్ధము నారంభింపుము. ఈయుద్ధమునకు సాయకములచేఁ బనిలేదు. భృత్యుల యవసరము లేదు. బంధువులసాహాయ్యమక్కఱ లేదు. నీవునీయొకయాత్మతోఁ బోరాడవలసినపని నీకిపుడు తటస్థించెను. ఈయుద్ధమున నీవు జయమందవేని చెప్పరానియవస్థ నొందుదువు. నా యీయుక్తివిశేషము నెఱిఁగితివేని కృతకృత్యుఁడ వగుదువు. ఈ నాతెలిపినబుద్ధిని గ్రహించి, భూతముల గతాగతుల నెఱిఁగి, పితృపైతామహమై వచ్చుచున్న రాజ్యమును యథోచితముగాఁ బాలింపుము" అని తెలిపి యతఁడు మఱియు నిట్లనియె.

### శ్రీకృష్ణుఁడు ధర్మజు నూఱడించుట

"ఓయుధిష్ఠిరా! బాహ్యద్రవ్యమును విడినవాని కెన్నఁడును సిద్ధిగలుగ నేరదు. శారీరద్రవ్యమును విడిచినను నొకపుడు సిద్ధిగలుగ వచ్చును; కలుగకపోవచ్చును. బాహ్యద్రవ్యమును బరిత్యజించి కేవల శారీరద్రవ్యమును బూనియున్నవానికిఁ గలుగుధర్మము, ధర్మముగాదు. సుఖము సుఖమును గాదు. అవి నీశత్రుల కగుఁగాక. బాహ్యమగు రాజ్యాదిత్యాగముచేఁ ద్యాగివి కాఁజాలవు. శారీరమగుకామాదికమును బరిత్యజించినను మోక్షము గలుగునో గలుగదో? కావున శుష్కవైరాగ్యమువలదు. 'మమ' యనెడిద్వ్యక్షరమే మృత్యువు. 'న మమ' అనెడి త్ర్యక్షరమే శాశ్వతబ్రహ్మము. అటులగుట నీబ్రహ్మ మృత్యువులు రెండును నీయాత్మయందేయున్నవి. అయ్యవి యదృశ్యములగుచు నిస్సంశయముగా భూతములను బోరాడించుచుండును. తత్వమునకు వినాశాభావము నియతమైనదియెగదా! భూతములశరీరములను ఛేదించికొని పోవునంతమాత్ర మది హింస కెటులగును? స్థావరజంగమములుగల సకలపృథివిని బొందియు, నెవ్వఁడొక్కమమత్వమును విడుచునో, వానికి దానితోఁ బనియేమి? ఓధర్మజా! అటులు గాక, వనవాసియై వన్యములతో జీవించుచుండియు, నెవ్వనికి ద్రవ్యములందు మమత్వముండునో, వాఁడు మృత్యుముఖ మగ్నుఁడు గాక తప్పదు గదా! ఇఁక

బాహ్యాంతరశత్రువులస్వభావ మెట్టిదో పరికింపుము. ఎవ్వఁడు కడచిన దానిని గనుఁగొనఁడో, వాఁడెట్టిమహాభయమునుండియు విముక్తుఁ డగుచున్నాఁడు. కామాసక్తుఁ డగువాని నెవ్వరును బ్రశంసింపరు. అయినను నెల్లవారిప్రవృత్తియుఁ గామవిరహితమై యుండదు. సకల కామములును, మానసాంగభూతములు వానిని బండితుఁడగువాఁడే యాలోచించి పరిహరించికొనుచున్నాఁడు. ఎన్నేనిజన్మములందలి యభ్యాసపాటవమునుబట్టి, సారమార్గమగు యోగమును జింతించి కామాదుల నడంచుచున్నాఁడు. దానము, వేదాధ్యయనము, తపము మున్నగు వైదికకర్మములు కామ్యములు. వ్రతము, యజ్ఞము, నియమములు, ధ్యానయోగములును, నిష్కామముగా నొనర్చినవాఁడే విద్వాంసుఁడు. ఎవ్వఁ డెద్దాని ధర్మముగా నభిలషించునో, యదియే వానికి ధర్మజనకమగుచున్నది. ఎల్లవారికిని నయమే ధర్మము. దానికి నియమమే మూలము. ఈవిషయమునఁ బ్రాచీనులు తెలిపిన కామగీతలు గలవు. వాని నిపుడు కీర్తించెదను వినుము.

'నన్నే ప్రాణియు నుపాయములేక జయింప వలనుపడదు. తనప్రహారణబలము తెలిసికొని యెవ్వఁడు నన్ను వధింపఁ బ్రయత్నించునో, వాని యాప్రహారణమందు మఱియు నేను బ్రాదుర్భవించుచుండుదును. మఱియు నెవఁడేని వివిధదక్షిణలుగలయజ్ఞములచే నన్నోడింప సమకట్టినను, జంగమములందు ధర్మాత్మునట్లు నేను మఱియును బ్రాదుర్భవించుచుందును. వేదాంతసాధనములగు వేదములచే నెవ్వఁడేని నన్ను జయింపనెంచినను, స్థావరములందు, భూతాత్మునట్లు నేను మఱియు జనించుచున్నాఁడను. సత్యపరాక్రముఁడై యెవ్వఁడేని నన్ను హింసింప నెంచినను, నేను వానిభావమునై ప్రవర్తింతును. వాఁడు నన్నపుడు తెలియకుండును. సంశితవ్రతుఁడై యెవ్వఁడు నన్నుఁ దనతపముచే హింసింప నెంచునో, వానితపమున నే నేకీభవించుచున్నాఁడను. మఱియు నెవఁడు పండితుఁడై మోక్షమార్గమూని నన్ను హింసింప నెంచునో, మోక్షరతియగు నవ్వానియెదుట నాట్యము చేయుదును. వానిని బరిహసింతును. నేను సకలభూతములకు నవధ్యుఁడను. నేనొకండనే సనాతనుఁడను' అని కామాధిదేవత పలికెనఁట.

ఓధర్మజా! కావున నీవును వివిధదక్షిణలుగల యాగములచే నక్కాముని ధర్మమున నిలుపుము. అతఁడాధర్మమందే నీకు సహాయుఁడగును. దక్షిణలుగలయశ్వమేధయాగముచే విధ్యుక్తముగా దేవతల నారాధింపుము. ఆప్తదక్షిణలుగలిగి సమృద్ధములైన మఱికొన్నిఁగల యాగవిశేషములచే నింద్రాదుల యజింపుము. నిహతులైన బంధువులను దలంచికొని మఱిమఱియు శోకింపకుము. ఈరణరంగమున నెవ్వరెవ్వరు హతులైరో, వారు మఱి నీకనులకుఁ గానరారు గదా! కావున నీవిపుడు సమృద్ధములగు మహాయాగము లొనర్చి లోకమున సత్కీర్తి వడయుము. పిదప నుత్తమగతి నొందఁగలుగుదువు." అని తెలిపెనని చెప్పి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

## ధర్మజుఁడు హస్తినాపురిఁ బ్రవేశించుట

ఓజనమేజయా! హతబంధువును రాజర్షియునగు నయ్యుధిష్ఠిరుఁడు, తపోధనులగుమునులు బహువిధములగుసదుక్తులచే నూఱడింప, నటులే భగవానుఁడగు శ్రీకృష్ణుఁడును, కృష్ణద్వైపాయనుఁడును, నారదదేవస్థానులును బోధింపఁ గొంత శాంతుఁడై భీమార్జున నకులసహదేవులును, ద్రౌపదియు, శాస్త్రజ్ఞులగు మఱికొందఱు బ్రాహ్మణులును శోకోపశమనముగాఁ బలుకఁ బరితాపము విడిచి, యపుడు దేవతలను బ్రాహ్మణులను నారాధించెను. మఱియు బంధువులకందఱకును బ్రేతకృత్యములొనర్చి పిదప నయ్యుధిష్ఠిరుఁడు ధర్మయుక్తముగా, బ్రశాంతచిత్తముతో నిజరాజ్యమునొంది చతుస్సముద్రముద్రితమగు తద్భూవలయమును బాలించువాఁడై యపుడు వ్యాసనారదులను, మఱియుఁగలవారిని గనుఁగొని, "ఓమునిపుంగవులారా! వృద్ధులగు మీరు నన్ను దుఃఖసాగరమునుండి తరింపఁజేసితిరి. నాకిఁక నిందించుకేని పరితపింపవలసినదిలేదు. నేను దేవతలను యజించుటకై మహత్తరమగుధనమునైతము ప్రాప్తించెను. ఇపుడు మిమ్ముఁ బురస్కరించుకొని యాగమునుగూడఁ జేయఁగలుగుదుము. ఓపితామహా! నీచే రక్షితులమై రహస్యముగా నాహిమవంతమునకుఁ బోవలసియున్నది. ఓద్విజోత్తమా! ఆప్రదేశము మిక్కిలి యాశ్చర్యకరమని వినుచున్నాఁడను. అదియే భగవానుఁడగు నారదుఁడును దేవస్థానుఁడును జిత్రము

శుభప్రదమునగు బహుభాషితములతోఁ దెలిపియున్నవారు. భాగ్యహీనుఁడగు మానవునకు మీయట్టిపూజ్యులును, సాధుసమ్మతులు మిత్త్రులు నగువారు, వ్యసనములందు లభింతురా?" అని పలికెను. అంత నమ్మహర్షు లాయుధిష్ఠిరునియుఁ, గృష్ణార్జునులయు సెలవునొందిఁ వారెల్ల నరయుచుండఁగనే యంతర్ధానమునొందిరి. పిమ్మట నాధర్మసుతుఁ డచ్చోటనే కూరుచుండెను. అంతఁ గొంతకాలము గడచెను. పిదప భీష్మునకును గర్ణాదులగు కురూత్తములకును శౌచకృత్యములొనర్చి బ్రాహ్మణులకు గొప్పగొప్పదానములు చేయఁబడెను. అటులు వారి కౌర్ధ్వదైహికములొనర్చి ధృతరాష్ట్రుని మున్నిడికొని ప్రజ్ఞాదృష్టి యగు నాతని నూఱడించుచు హస్తినాపురము చొచ్చి యాధర్మజుఁడు, తనతమ్ములతోఁ గూడి పుడమినెల్లఁ బాలింపఁదొడంగెను. అని తెలుప విని జనమేజయుఁడు మఱియు నావైశంపాయను నిట్లు ప్రశ్నించెను.

కరిపురి కృష్ణార్జునులు విహరించుట

ఓవైశంపాయనా! పాండవేయులచే రాష్ట్రము జయింపఁబడి ప్రశాంతమై యుండునంత నవ్వాసుదేవధనంజయు లేమిచేసిరి?

అది విని వైశంపాయనుఁడు ఓజనమేజయా! అటులు రాజ్యము జయింపఁబడినయనంతర మారమహాధీశార్జును లమందానందభరితులై స్వర్గమున దేవేశ్వరులట్లు సంతోషముతో విచిత్రములగువనములందును, సరోవరములందును, గిరిసానువులందును, బుణ్యతీర్థములందును, బల్వలములందును, నదులందును విహరించిరి. వారు సంతుష్టాంతరంగులై యశ్వినీదేవతలు నందనవనమందువలె నింద్రప్రస్థమునఁ జరించుచు, నొకపుడు రమ్యమగుసభాభవనముఁ బ్రవేశించి యమరేశ్వరులట్లు విహరించుచు, వేఱొకపుడు చిత్రములగు యుద్ధకథలను దాము పడినక్లేశములను జెప్పికొనుచుఁ జరింపసాగిరి. మఱియొకప్పు డప్పురాణమహర్షులగు వాసుదేవార్జునులు మహర్షులయు దేవతలయు వంశములను దెలుపుకొనుచు నుండిరి. అపు డానిశ్చయజ్ఞుఁడగు కేశవుఁ డాపార్థునకుఁ జిత్రములును, జిత్రార్థపదనిశ్చయములునగు కథ లనేకముగఁ జెప్పి జ్ఞాతిపుత్రశోకాభితప్తుఁడైన యప్పార్థుని పరితాపము నడంచుచువచ్చెను. విధానజ్ఞుఁడును మహాతపుఁడునగు నవ్వాసుదేవుఁ

డటు లాయర్జునుని విధ్యుక్తములగు సదుక్తులచే నూఱడించి తనభాగమును దింపికొని, విశ్రాంతితీసికొనినవాఁ డయ్యెను. అనంతర మొకపుడు గోవిందుఁ డయ్యర్జునుఁ గాంచి, మృదూక్తులచే స్నేహయుక్తముగా నోదార్చుచు, "ఓసవ్యసాచీ! నీబాహుబలము నాధారముగాఁ గొని యుధిష్ఠిరుఁ డీధరావలయమునెల్ల జయించి సంపాదించి, మనభీమసేననకులసహదేవులసహాయమున నిస్సపత్నముగా ననుభవించుచున్నాఁడు. ఓధర్మజ్ఞా! క్షత్రియధర్మానుసారముగా నీరాజ్యము నిష్కంటకముగాఁ బ్రాప్తమైనది. ఆసుయోధనుఁడు, యుద్ధమున క్షత్రియధర్మమునుబట్టియే నిహతుఁడయ్యెను. అధర్మపరులును, లుబ్ధులును, నప్రియవాదులును, దురాత్ములునగు ధార్తరాష్ట్రులు సబాంధవముగాఁ బరిమార్పంబడిరి. ఓకురూద్వహా! నీచే రక్షితుఁడగుచుఁ బ్రశాంతమైన నిఖిలధరావలయమునకుఁ బతియై యీధర్మసుతుఁ డనుభవించుచున్నాఁడు గాదే? ఓపాండవా! అరణ్యములందును నీతోఁ గూడి క్రీడించువాఁడనుగదా! ఓయమిత్రకర్శనా! ఇపుడు కుంతియు నింతటిపరివారమును గలుగ మనము సంతసింపవలసినసమయము గాకుండునా? ఓయీ! మన యీయుధిష్ఠిరుఁడును, మహాబలుఁడగు భీముఁడును, మాద్రీతనయులును నెందు వసింతురో యందు నాకెంతయుఁ బ్రీతిగలుగును. మఱియు స్వర్గతుల్యములై రమణీయములగుచుఁ బవిత్రములైన సుఖప్రదేశములందు నీతోఁగూడి క్రీడింపఁగా నెంతయేని కాలము గడచెను. ఎన్నినాళులనుండియో యావసుదేవుని మిగిలినయాదవులను గనుఁగొనలేదుగదా! కావున నేనిపుడు ద్వారవతీపురికిఁ బోవలయును. ఓపురుషవ్యాఘ్రా! నీవును నిఁక నయ్యుధిష్ఠిరుఁడును నాప్రయాణమునకు సమ్మతింతురుగాక. ఆయాసమయములందు బహువిధముల నయ్యుధిష్ఠిరునకు నేనును భీష్ముఁడును వలసినదెల్లఁ దెలిపితిమి. యుధిష్ఠిరుఁడు ప్రాజ్ఞుఁడయ్యు మే మాతని శాసించితిమి. మహాత్ముఁడగునతఁడు మావచన మాచరించెను. ధర్మజ్ఞుఁడును కృతజ్ఞుఁడును, సత్యవాదియు నగు నాధర్మజునందు సత్యము, ధర్మము, ఉత్తమబుద్ధి, స్థిరస్థితియును గలదు. ఓయర్జునా! నీకిష్టమగునేని మహాత్ముఁడగు నాధర్మజునికడ కేఁగి నాప్రయాణమును సంబంధించినవచన మాతని కెఱిఁగింపుము. నాప్రాణము పోయినను సరియగాని నేనాతని కప్రి

యము సేయనొల్లను. ఓమహాబాహూ! అతఁ డిష్టపడఁడేని నేను ద్వారవతి కెట్లు పోఁగలను? ఓపార్థా! నీయెడఁగల ప్రీతిచే నీహితము గోరియే యిటులు తెలుపుచున్నాఁడను. ఇందేమియు నసత్యము లేదు. ఓయర్జునా! నేనిందు నివసించుటకుఁ దగు ప్రయోజనమును ముగిసినది. ఆసుయోధనుఁడు సైన్యానుచరసమేతముగా సమసెను గాదే! పృథివియు ధీమంతుఁడగు మనయుధిష్ఠిరునకు వశమైనది. సముద్రవేష్టితమై, సశైలకాననమై బహువిధరత్నవ్యాప్తమైన యీభూభాగమును ధర్మజ్ఞుఁడగు ధర్మజుఁడు పరిపాలించుఁగాక. మహాత్ములగు మునులును, సిద్ధులును, వందులును నీధర్మజుని సతతమును సన్నుతింప నితఁడు విరాజిల్లెడిని. కావున నీవిపుడు నన్నుఁ దోడికొని కురువర్ధనుఁడగు యుధిష్ఠిరు సందర్శించి నాప్రయాణమునకు సెలవిప్పింపవలయును. ఓపార్థా! నా యీశరీరము, నాధనము, మఱియు నాగృహమునఁగలదంతయు నయ్యుధిష్ఠిరున కర్పింపఁబడవలసినదిగాఁ దెలియుము. మహామతియగు నక్కురుపతి నాకు మాన్యుఁడును, ప్రియుఁడును నైనవాఁడు సుమీ! ఓనృపాత్మజా! నేనిఁక నిందుండుటకు నీవుదక్క వేఱొక్కకారణము లేదు గదా! పూజ్యుఁడును, సువృత్తుఁడునగు యుధిష్ఠిరునిశాసనమునఁ బుడమియెల్ల నుండుట నిశ్చయము గదా!" అని యమితవిక్రముఁడగు జనార్దనుఁడు పలుక విని యప్పార్థుఁ డించుక దుఃఖమొదవ నిట్లు ప్రశ్నించెనని తెలుప విని జనమేజయుఁ డిట్లనియె.

## అనుగీత

### శ్రీకృష్ణుఁ డర్జునునకు హిత ముపదేశించుట

ఓవైశంపాయనా! మహాత్ములగువాసుదేవార్జును లిరువురు సభయందుండఁగా, వారు తెలిపికొన్న కథలవిధ మెట్టిదో వివరింపుము.

అది విని వైశంపాయనుఁడు ఓజనమేజయా! అటు లప్పార్థుఁడు రాజ్యమువడసినపిమ్మటఁ గృష్ణసహితముగా దివ్యమగుతత్సభను సంతుష్టాంతరంగుఁడై ప్రవేశించెను. అందు స్వర్గతుల్యమగు నొకసుఖప్రదేశమునుజేరి యాసభావిభవము నారసి, వాసుదేవునితో "ఓదేవా! సంగ్రామారంభమున నీమాహాత్మ్యమును, నీయైశ్వర్యరూపమును నెఱిఁగింపఁబడినవి. ఓకేశవా! మఱియు నపుడు సౌహార్దమున నీవు సకల

మును నాకుఁ దెలిపితివి అయినను భ్రష్టమానసుఁడనగు నేనద్దానిని మఱచితిని. అపుడు నీవు తెలిపిన యాయర్థములు తెలియ నాకు మఱియుఁ గౌతూహల మొదవెడిని. ఓమాధవా! నీవిపుడు త్వరగనే ద్వారకకుఁ బోవలయు నను చున్నాఁడవు గాదే? కావున నా కావిధ మెఱిఁగింపుము." అని ప్రార్థించెను.

ఓజనమేజయా! అప్పార్థునివచన మాలించి యాశ్రీకృష్ణుఁ డతనిఁ గౌఁగిలించికొని, "ఓధనంజయా! మున్ను నీకు రహస్యమగు విషయ మెఱిఁగించితిని. సనాతనుని దెలిపితిని. స్వరూపియగుధర్మ మును బోధించితిని. సకలశాశ్వతలోకములస్థితి తెలిపితిని వానినెల్ల బుద్ధిహీనుఁడవై గ్రహింపలేకుండుట నాకెంతయు నప్రియముగా నున్నది. ఇపుడు మఱియు నా యీవచనముచే నీకది జ్ఞప్తికి రావచ్చును. ఓపాండవా! నిశ్చయముగా నీవు శ్రద్ధారహితుఁడవు, బుద్ధిహీనుఁడవు నగుచున్నాఁడవు. ఓధనంజయా! దానినెల్ల మరలఁ దెలుప శక్యమగునా? బ్రహ్మపదవేదనవిషయకమగుధర్మము పర్యాప్త మైనది. దానిని మరల సంపూర్ణముగాఁ దెలుప నాకిపుడు శక్యము గాదు. నాఁడు యోగయుక్తుఁడనై పరబ్రహ్మవిధమంతయుఁ దెలిపితిని. అయినను దద్విషయమున నొకపురాతనేతిహాసము గలదు. దాని నెఱిఁ గించెదను. బుద్ధి తెచ్చికొని దానిని విందువేని యుత్తమగతి నందఁ గలవు. నా తెలుపునదంతయు శ్రద్ధాళుఁడవై వినుము. ఓవైరి సూదనా! ఒకపు డొకబ్రాహ్మణుఁడు స్వర్గమునుండి వెడలి బ్రహ్మ లోకమునుండిమీఁదుగా నాకడకు వచ్చెను. ఆతనిని నేను బూజించి యొకవిషయమును బ్రశ్నింపఁగా, నతఁ డిట్లు తెలిపెను. దానిని శ్రద్ధతో వినుము.

బ్రాహ్మణుఁడు:— 'ఓకృష్ణా! ఏయది మోహచ్ఛేదనమగు చున్నదో, యట్టిమోక్షవిషయమును భూతముల ననుగ్రహించునట్టి యుద్దేశముతో నన్నుఁ బ్రశ్నించితివి. ఓమధుసూదనా! తద్విషయ మున నాశక్తికొలఁదిగఁ దెలిపెదను. జాగరూకుఁడవై వినుము. ధర్మవేత్తయుఁ దపోధనుఁడునగు కాశ్యపుఁడను నొకబ్రాహ్మణుఁడు గలఁడు. అతఁ డొకపుడు ధర్మజ్ఞుఁడగు నొకద్విజుని సమీపించెను. ఆద్విజుఁడు గతాగతజ్ఞుఁడును, విజ్ఞానసాగరుఁడును, లోకతత్త్వార్థ

వేత్తయు, సుఖదుఃఖజ్ఞుఁడును, జననమరణతత్త్వజ్ఞుఁడును, బుణ్యపాపపరిజ్ఞాతయు, నుచ్చనీచభేదమెఱిఁగినవాఁడును, గర్మానుసారముగా దేహులకగుగతి తెలిసినవాఁడును నై ముక్తునివలె సిద్ధుఁడై చరించుచుఁ బ్రశాంతుఁడును సంయతేంద్రియుఁడు నై వెలయుచు, బ్రాహ్మలక్ష్మితోఁ దేజరిలుచునుండెను. ఆబ్రాహ్మణుఁ డంతర్ధానగతిజ్ఞుఁడగుట దెలిసికొని యాకాశ్యపుఁ, డపు డంతర్హితులై యున్న సిద్ధులతోఁ గూడి పోవుచున్న యాద్విజునివిధము నెఱిఁగి వెంబడించెను. ఆద్విజుఁడు సిద్ధులతో రహస్యముగా సంభాషించుచు, గాలియట్టు లెవ్వరికిని జిక్కక స్వేచ్ఛగాఁ బోవుచుండఁగఁ గాశ్యపుఁడు ధర్మకాముఁడై యాద్విజునిపాదములు పట్టుకొని, యథాన్యాయముగాఁ జేరి, యాతని యద్భుతచరిత్రమును గాంచి, విస్మితుఁడగుచు నాతనికి వలయుపరిచర్యలు సేయుచు సంతసింపఁజేసెను. అటు లాకాశ్యపుఁ డాసిద్ధుని గురుబుద్ధితో, మనఃపూర్వకముగాఁ గొలిచి సంతసింపఁజేయ, శ్రుతచారిత్రసంపన్నుఁ డగువానిసద్భక్తి కతఁడు ప్రసన్నుఁడై తనశిష్యునిఁగా భావించి, యొకటి తెలిపెను. ఓజనార్దనా! అది యుత్తమసిద్ధి నాశ్రయించియున్నది. దానిని వినుము. అపు డాసిద్ధుఁడు 'శిష్యా! కేవలము పుణ్యజనకములగు వివిధకర్మములచే మానవులు దేవలోకసంస్థితికై యుత్తమగతి నొందుచుందురు. ఎందును నత్యంతసుఖస్థితి లేదు. ఎందును శాశ్వతస్థితియును లేదు. దుఃఖలబ్ధమగు మహత్తరస్థానమునుండియు మఱిమఱియు భ్రంశమగుచుండును ఓయీ! నాకుఁ బాపసేవనమువలనఁ బెక్కుకష్టములు ప్రాప్తించినవి. మఱియుఁ గామమన్యుపరీతుఁడనై తృష్ణాపీడితుఁడనై యెన్నియేని జననములను మరణములను బొందితిని పలువిధములగు నాహారముల భుజించితిని. నానావిధములగు స్తనములఁ ద్రావితిని. పెక్కురుతల్లులను జూచితిని. అటులే యనేకుల జనకులు నాచేఁ జూడఁబడిరి. విచిత్రములగు సుఖదుఃఖము లెన్నియే ననుభవించితిని. మఱియు నాకు మిత్రులతోఁ జెలిమియు, శత్రులతో సంపర్కము లెంతయేని సంభవించెను. ఎంతయేని శ్రమపడి సంపాదించిన ధనమునకు నాశము సంభవించెను. అటులే రాజునుండియు, స్వజనమునుండియు, నవమానములును గష్టములును గలిగెను. ఎంతయు దారుణములగు శారీరమానసవేదన

లును సంభవించెను. అటులే వధబంధాదులగు దారుణకష్టములు సైతము గలిగినవి. యమమందిరమున నరకగామినై యాతనల ననుభవించితిని. అటులే ముదిమియు, రోగములును, వ్యసనములును నన్నుఁ బీడించెను. లోకమునఁగల సుఖదుఃఖాదులన్నియు నాచే ననుభవింపఁబడియెను. అటులు కొంతకాలమైనపిమ్మట నొకపుడు నిర్వేదము గలుగ వానియెడ ననాదరము చూపి, యెంతయు దుఃఖార్తుఁడనగుట లోకతంత్రమును బరిత్యజించితిని. లోకమున నిదియెల్ల ననుభవించి పిమ్మట నీమార్గమును బూని, యాత్మప్రసాదముచే సిద్ధిపడసితిని. నే నిఁక నీలోకములకు రాను. వీనిని వీక్షింపను. ఆత్మసిద్ధి గలిగినది మొదలుగ, మఱియుఁ బ్రజాసృష్టి యారంభమగునంతకును శుభగతులఁ బడయుదును. ఉత్తమసిద్ధివిధ మిట్టిది. పిమ్మటఁ బరతరమగు బ్రహ్మపదము నొందెదను. ఇందు సందియము లేదు. ఓయీ! మఱి నే నీమర్త్యలోకమును జేరను. ఓమహాప్రాజ్ఞా! నేను నీయెడ నెంతయుఁ బ్రీతుఁడ నైతిని. నీకు నేఁజేయవలసినదేమో తెలుపుము. నీవు దేనిని గోరి యిందులకువచ్చితివో దానికిఁ దగుకాల మిపుడు వచ్చెను. నీవిపు డెందుల కరుదెంచితివో నే నెఱుఁగుదును. నే నిపుడే పోవఁ దలంచియున్నాఁడను. కావుననే నిన్నిటులు ప్రేరించితిని. ఓవిచక్షణా! నీచారిత్రమున కెంతయు సంతసించితిని. శుభమార్గమును బ్రశ్నింపుము. నీకు వలసినదాని నెఱిఁగించెదను. నీబుద్ధికి సంతసించి గౌరవించుచున్నాఁడను. నీవు మేధావివగుటనే గదా! నన్నుఁ దెలిసికొనఁ గలిగితివి.' అని పలికె" నని తెలిపి వాసుదేవుఁ డిట్లనియె.

## సిద్ధకాశ్యపసంవాదము

"ఓయర్జునా! పిమ్మట నాకాశ్యపుఁ డాసిద్ధునిపాదములు పట్టుకొని తెలుప శక్యముగాని ప్రశ్నములు కొన్ని ప్రశ్నించెను. వాని కాతఁడు ధర్మముల నెఱిఁగించెను. వాని నెఱిఁగించెదను వినుము.

కాశ్యపుఁడు:—ఓసిద్ధవర్యా! ఈశరీర మెట్లు భ్రంశమగును? మఱియు నెటు లుపపన్నమగును? మఱియుఁ గష్టతరమగు సంసారమునఁ జరించుచు ముక్తుఁడగు-టెట్లు? ఆత్మ ప్రకృతిమోక్షపురస్సరముగాఁ దచ్ఛరీరము నెట్లు విడుచును? ఒకశరీరమును విడిచి యాత్మ వేఱొక

శరీరము నెటు లొందుచున్నది? జీవుఁడు స్వకృతములగు శుభాశుభ కర్మముల నెటు లనుభవించును? విదేహుఁడైన జీవున కెందుఁ గర్మము తటస్థించును?

ఓపార్థా! అక్కాశ్యపుని ప్రశ్నములన్నియు విని యాసిద్ధుఁడు వాని కెల్లఁ బ్రత్యుత్తర మొసంగువాఁడై క్రమముగా నిట్లు తెలిపెను. వాని నెఱిఁగించెదను వినుము.

సిద్ధుఁడు:—ఓకాశ్యపా! ఆయుఃకీర్తికరములగు కృత్యములను మానవుఁ డొనర్చి వేఱొకశరీరమును బరిగ్రహించినపుడు వాని ననుభవించి యవి క్షీణించినపిదప దేహమును విడుచును. ఆయుఃక్షయ కర్మపరీతాత్ముఁడగుచు విపరీతకర్మముల నాచరించును. వినాశము తటస్థించినపుడు బుద్ధి విపరీతమగుచుండును. అనాత్మజ్ఞుఁడగువాఁడు తన సత్త్వబలకాలములను దెలిసికొనలేక స్వవిరుద్ధములగుపదార్థముల నధికముగా సేవించును. మానవుఁడు తన కతికష్టకరములగువానినెల్ల సేవించినను, నధికముగా భుజించినను, నేమియు భుజింపకున్నను, దుష్టాన్నములను మాంసమును భుజించినను, పాన మొనర్చినను, బరస్పరవిరోధము గల గురుపదార్థభోజన మొనర్చినను, జీర్ణముగాకుండఁ బగలు భుజించినను, నధికములగు వ్యాయామసంభోగములు చేసినను నాయువు క్షీణించును. కర్మమునందలి పట్టుదలచేఁ గలుగువేగమును నిలుపవలయును. అటులే రసాభియుక్తములగు నాహారమును, దివానిద్రను సేవింపరాదు. విపరీతబుద్ధియగువాఁడు నిషిద్ధములగువానినే సేవించుచుండును. అకాలభోజనము, అపక్వభోజనము దోషముల నుద్రేకింపఁజేయును. దోషప్రకోపమువలన రోగము జనించి ప్రాణాంతక మగుచుండును. ఆరోగబాధ సహింపలేక యుద్బంధనాదులకుఁ బ్రయత్నించును. అట్టిప్రాణికిఁ బైఁదెలిపినకారణములచే శరీరము నశించుచుండును. ఇఁక జీవితమునుగూర్చి తెలిపెదను గ్రహింపుము. శరీరమునఁగల యూష్మము తీవ్రవాయుప్రేరితమై ప్రకోపించి శరీరమును వ్యాపించి ప్రాణములనెల్ల నిరోధించును. అటులు బలవత్తరమగునూష్మము శరీరమునఁ బ్రకోపించి యాయాజీవస్థానములను భేదించును. పిమ్మట జీవుఁడు వేదన గలిగి వెంటనే శరీరమునుండి తొలఁగుచున్నాఁడు. అటులు జీవస్థానములు భిన్నములు కాఁగా, వేదనాపరీతాత్ముఁడై

జంతువుశరీరమును బరిత్యజించుచున్నాఁడు. ఓద్విజోత్తమా! ఇటులు సకలజంతువులును సంతతమును జననమరణపీడనొందుచు శరీరములను విడుచుచుఁ గానవచ్చుచుండును. జీవుఁడు గర్భస్థదేహప్రవేశమందును, గర్భోపసర్పణమందును గలకష్టములను మఱిమఱియు ననుభవించుచుండును. మఱియు భిన్నసంధినై, పిదపఁ బంచభూతసంభవమున కనుకూలముగా నుదకక్లేదమొందును. అటులు పంచభూతములందును, ప్రాణాపానములందును వ్యవస్థితమైన వాయువూర్ధ్వగతమై కష్టముగా శరీరమును బరిత్యజింప, మానవుఁడు నిరూష్మఁడును, నిరుచ్ఛ్వాసుఁడును, నిఃశ్రీకుఁడును, గతచేతనుఁడు నగుచుఁ, జేష్ట విడిచి మృతుఁడనఁబడుచున్నాఁడు. శరీరధారి యేయింద్రియములచే నింద్రియార్థములను దెలిసికొనుచుండెనో, వానిచే నాహారసంభవములగు ప్రాణములను దెలిసికొనలేకున్నాఁడు. ఎవ్వఁ డాశరీరమున నుండునో వాఁడే సనాతనుఁడగుజీవుఁడు. అటులే, సంఘములో నొకొ్కకచో నేదేది కలియుచుండునో యదియే జీవస్థానమని శాస్త్రముచుబట్టి తెలియుము. మఱియు నామర్మములు భిన్నములుకాఁగా, వానినుండి వెడలి యాజీవుఁడు హృదయము నావేశించి వడిగా సత్వమును నిరోధించును. పిమ్మట జంతువు సచేతనుఁడై యేమియుఁ దెలియకుండును. మర్మస్థానములు సంవృతములుకాఁగా, దమముచే సంవృతజ్ఞానుఁడై జీవుఁ డధిష్ఠానములేక వాయువుచేఁ గదల్పఁబడుచు నమ్మహోచ్ఛ్వాసము నెంతయు దారుణముగా నెగిచి పైకి వెడలుచు నచేతనమగు శరీరమును దిగఁద్రోయుచుండును. అటులు జీవుఁడు నిజకర్మములతోఁ గూడి కాయమునుండి వెడలి, వెనుకటిపుణ్యపాపములచేఁ జిహ్నితుఁడై యుపపన్నుఁడగుచుండును. జ్ఞానసంపన్నులును, శాస్త్రవేత్తలును నగుబ్రాహ్మణులు, కృతపుణ్యుఁడగు నితరుని, వానిలక్షణములనుబట్టి తెలిసికొనుచున్నారు. అంధకారమందును, మెఱయుచున్న మెఱుఁగుడుఁబురువును గన్నుగలవారు గాంచునట్లు, జ్ఞానదృష్టిగలసిద్ధులు జీవుని విధమును దెలిసికొనుచున్నారు. మఱియు వారు దివ్యచక్షువుచే, జీవుఁడు శరీరమునుండి జాఱుటను, యోనిప్రవిష్టుఁ డగుచుండుటను దెలిసికొందురు. శాస్త్రమునుబట్టి జీవుని వివిధములగు జీవస్థానములును దెలియఁబడుచున్నవి. జంతువులన్నియు నిందుండుటచే నిది కర్మభూమి.

అటులగుట సకలప్రాణులును శుభాశుభకర్మము లొనర్చి నిజకర్మానుసారముగా, బలువిధములగుతత్ఫలము లనుభవించుచుందురు. అశుభకర్మము లొనర్చినవా రిందే నిజకర్మానుసారమగు నిరయమును బొందుదురు. అవాగ్గతియగు నిదియే కష్టకరమైనది. ఇందే గదా మానవులు పరితపింతురు. కావున నెంతయు దుర్లభమగు మోక్షమును గోరి యాత్మను రక్షించుకొనవలయును. ప్రాణు లూర్ధ్వముగాఁ బోయి, యేయేస్థానములం దుందురో, యాయాస్థానములఁ దెలిపెదను వినుము. దానిని విని నైష్ఠికబుద్ధిని, గర్మనిశ్చయమును దెలిసికొనుము. ఆలోకములన్నియుఁ దారారూపములు. సూర్యచంద్రమండలము లాలోకములందు నిజకాంతులతో వెలుఁగుచుండును. పుణ్యకర్ములగువారి కవియే లోకములు. అందుండువారు తమసుకృతకర్మములు నశించినతోడనే మఱియుఁ బుడమిఁ బడుదురు. అందును నుత్తమమధ్యమాధమము లనియెడివిశేషము గలదు. దీప్తతరమగులక్ష్మిని గాంచినను నందును సంతోషము లేదు. ఎల్లగతులవిధ మిట్టిదని వ్యక్తముగా వివరించితినిగదా! ఇక గర్భోపపత్తి నెఱిఁగించెదను. జాగరూకుఁడవై విను'మని యిట్లనియె.

## జీవగర్భప్రవేశకథనము

'ఓ కాశ్యపా! శుభాశుభకర్మముల కిందు నాశము లేదు. వాని నాయాక్షేత్రములం దాయావిధముగా జీవుఁ డనుభవించుచుండును. పుడమిఁ బొడమినవృక్ష మెట్లు బహుఫల మొసంగునో యటులే పరిశుద్ధచిత్తముతోఁ జేసిన విపులపుణ్యమునైతము ఫలించును. అటులే పాపచిత్తముతో నొనర్చినపాపఫలమును ననుభూతమగుచుండును. ఆత్మ మనసును బురస్కరించుకొనియే కర్మములందుఁ బ్రవర్తించుచుండును. కర్మసమావిష్టుఁడును, గామమనుష్యసమావృతుఁడు నగుచు జీవుఁ డెట్లు గర్భమును బ్రవేశించునో, యందులకు సమాధాన మొసంగెదను వినుము. శోణితసంసృష్టమగుశుక్రము స్త్రీగర్భాశయగతమై కర్మానుసారముగా, శుభక్షేత్రమునో, యశుభక్షేత్రమునో పొందుచుండును. జీవుఁడు కాయమును బొందియు, సూక్ష్మతవలనను, నవ్యక్తభావమువలనను నెందును సక్తుఁడు గాక యుండును. కావున

నతఁడు శాశ్వతబ్రహ్మ మనఁబడును. ఆబ్రహ్మమే సకలభూతములకును బీజము, దానిచే జంతువులు జీవనము గలవగుచున్నవి. ఆజీవుఁడే సకలభూతముల గర్భముల నావేశించి యందుండును. పిదపఁ దద్గర్భము, చేతనాన్వితమై యంగములు కదలుచుండును. ఏదేని లోహమును గరఁగిపోసిన నది యెట్లు విగ్రహరూపమును దాల్చునో, యటులే గర్భమున జీవప్రవేశము నగునని తెలియుము. అగ్ని లోహపిండమునుండి యెట్లు తాపమును గలిగించునో, యటులే గర్భమున జీవోపపాదనమగునని తెలియుము. దీప మెట్లు వెలుఁగుచు గృహమును బ్రకాశింపఁజేయునో, యటులే జీవుఁడు శరీరములను బ్రకాశింపఁ జేయుచున్నాఁడు. తొలుతటిశరీరమున శుభాశుభరూపమగు నేయే కర్మము చేయఁబడునో యదియెల్ల దప్పక యనుభవింపఁబడుచుండును. పిదపఁ దచ్ఛరీరము నశించును. మఱియు వేఱొకశరీరము పొందఁబడు చుండును. ఇటులు మోక్షయోగజనకమగుధర్మము తెలియఁబడునంతకును జరగుచుండును. దేనిచే మానవునకు సుఖమగునో, యట్టిధర్మము నెఱిఁగించెదను వినుము. పెక్కుజన్మములం దావృత్తి నొందుచున్న ధర్మాచరణముచే సుఖి యగుచున్నాఁడు. దానము, బ్రహ్మచర్యము, యథోక్తవ్రతాచరణము, దమము, ప్రశాంతి, భూతదయ, సంయమము, అక్రౌర్యము, పరధనాదానవర్జనము, మనసుచేనైన భూతకోటి కపకారము చేయమియు, మాతృపితృసేవయు, దేవాతాతిథిపూజనము, గురుశుశ్రూషయు, జాలి, శౌచము, ఇంద్రియనిగ్రహము, శుభమార్గ ప్రవర్తనమును సజ్జనులవ్రతముగాఁ దెలుపఁబడుచున్నవి. ఏయది ప్రజలను శాశ్వతముగాఁ బాలింపఁగలదో, యట్టిధర్మము సద్వృత్తాచరణముచే నగును. సజ్జనులయెడ నిట్టివిధము చూడనగును. వారి యందే యిది స్థిరమై యుండును. సజ్జనాచరితమై సదాచారమునఁ బ్రతిష్ఠమైనదియే ధర్మము. సదాచారము ననుసరించి చేయఁబడినదియే సనాతనధర్మము. ఆధర్మము నాశ్రయించినవాఁడు దుర్గతికి దూరవర్తియై యుండునని తెలియుము. అటులగుటనే, ధర్మములనుండి తొలఁగు చున్నలోకము నియమింపఁబడుచున్నది. యోగియై ముక్తుఁడగువాఁడు పైఁదెలిపినధర్మములను మీఱి విశిష్టుఁ డనఁబడుచున్నాఁడు. ధర్మమార్గము ననుసరించి వర్తించినవానికి శుభములగుటయెగాక, కొంత

కాలమున కట్టివాఁడు సంసారమును సయితము తరించుచున్నాఁడు. ఇటులు పూర్వకృతకర్మము ననుసరించియే జంతువు ప్రవర్తించు చుండును. ఆకర్మమే కారణమగుట నిట్టివికారములు ప్రాప్తించు చున్నవి. ముందుగా నెవనిచే శరీరగ్రహణము గల్పింపఁబడియెనో యనియెడిసంశయమునుగూడఁ దెలిపెదను వినుము. సకలలోకపితా మహుఁడగు పరమేష్ఠి ముందుగాఁ దాను శరీరధారణము చేసి పిదప జంగమస్థావరాత్మకమగు లోకత్రయమును సృజించెను. అతఁడు శరీర ధారులకుఁ బ్రకృతియగు ప్రధానమును గల్పించెను. ఆ ప్రకృతియే యీసర్వమును వ్యాపించి పరమముగాఁ దెలుపఁబడుచున్నది. తద్వ్యాప్తమగునదియే క్షర మనఁబడుచున్నది. తద్భిన్నమగునదియే యమృతము నక్షరము ననఁబడుచున్నది. సకలభూతములను బరమ పూర్వుఁడగు ప్రజాపతియే సృజించెనని పురాణశ్రుతివలనఁ దెలియు చున్నది. అప్పితామహుఁడు, భూతసంఘమునకుఁ గాలపరిమాణమును, భూతములందుఁ బరివృత్త్యావృత్తులను గల్పించెను. ఇందొకటి గలదు. నాపూర్వజన్మమున నేనొకమేధావి నెఱుఁగుదును. అతఁడు సుఖ దుఃఖము లనిత్యములనియు, శరీర మపవిత్రసంఘాతమై వినాశయుక్త మైనదనియు, సుఖకరమని తలంపఁదగినదెల్ల దుఃఖకరమనియుఁ దలంచు చుండెడివాఁడు. అట్టివాఁడే ఘోరమై దుస్తరమైన సంసారసాగరమును దరింపఁగలఁడు. స్వభావజ్ఞుఁడు, జరామరణరోగసమావిష్టుఁడగుటఁ జేతనావంతములగు భూతములందెల్లఁ జైతన్యము సమమై యుండునని తలంచును. పిదపఁ బరమపద మన్వేషించుచు నిర్విణ్ణుఁ డగుచున్నాఁడు. శాశ్వతుండు, నవ్యయుఁడునగు నమ్మేధావి యుత్తమజ్ఞానోపదేశమును దెలిపెదను వినుమని యిట్లనియె.

## సిద్ధుఁడు కాశ్యపున కొనర్చినజ్ఞానోపదేశము

'ఓశిష్యా! ఎవ్వఁ డేకాంతమునఁ గూరుచుండి, యేమియుఁ జింతిం పక, పూర్వాపూర్వకర్మములను బరిత్యజించి నిరారంభుఁడై, ద్రోహ రహితుఁడును, సర్వసహుఁడును, శమసక్తుఁడును, జితేంద్రియుఁడు నై యపేతభయమన్యుకాముఁడై ప్రవర్తిల్లునో, వాఁడు ముక్తుఁ డగు చున్నాఁడు. మఱియు సకలభూతములఁ దన్నువలె భావించుచు నియ

తుఁడును, శుచియు, మానవర్జితుఁడును, నహంకారశూన్యుఁడు నై యుండునో, వాఁడన్నిటివలన ముక్తుఁ డగుచున్నాఁడు. అటులే జననమరణములును, సుఖదుఃఖములు, లాభాలాభములును, ప్రియాప్రియములును నెవ్వనికి సమమై యుండునో, వాఁడు ముక్తుఁ డనఁబడుచున్నాఁడు. ఎవ్వనిని గోరక, యెవ్వనిని నిరసింపక వీతరాగుఁడు, నిర్ద్వంద్వుఁడునై యెవ్వఁడు ప్రవర్తిల్లునో, వాఁడు ముక్తుఁ డగుచున్నాఁడు. పుత్రామిత్రబంధువిరహితుఁ డై, పరిత్యక్తధర్మార్థకాముఁడై, యేవాంఛయు లేనివాఁడు ముక్తుఁ డనఁబడుచున్నాఁడు. ధర్మియు, నధర్మియుఁ గాక పూర్వోపచితమును బోఁగొట్టుకొనుచు, క్షీణేంద్రియుఁడును, శాంతాత్ముఁడును, నిర్ద్వంద్వుఁడు నై వర్తిల్లువాఁడు ముక్తుఁడగును. మఱియు, నే కోరికయుఁ గర్మమును లేక, ప్రపంచ మస్థిరముగాఁ గనువాఁడే ముక్తుఁడు. అట్టివాఁడే శరీర మస్వస్థమనియు, నవశమనియు, జన్మమృత్యుజరాన్వితమనియు, నిత్యము వైరాగ్యము గలిగి, యచిరకాలములో శరీరబంధనిర్మోక్షమును జేసికొనుచున్నాఁడు. శబ్దాదివిషయవర్జితముగను పరిగ్రహశూన్యముగను, నెవ్వఁ డాత్మను గనుఁగొనునో, వాఁడు ముక్తుఁడగును. శారీరమానసములగు సకలసంకల్పములను బుద్ధిచేఁ బరిత్యజించి, యెవ్వఁ డాత్మను, బంచభూతగుణహీనముగను, మూర్తిరహితముగను, నిర్లిప్తముగను, గుణరహితముగను, గుణభోక్తగను దలంచునో, వాఁడు క్రమక్రమముగా నిరింధనమగునగ్నియట్లు నిర్వాణ మొందుచున్నాఁడు. మఱియు సకలసంస్కారహీనుఁడై నిర్ద్వంద్వుఁడును, నిష్పరిగ్రహుఁడును నగుచుఁ, దపముచే నెవ్వఁ డింద్రియగ్రామము నడంచునో, వాఁడు ముక్తుఁడగును. అటులు సర్వసంస్కారవిముక్తుఁడై శాంతుఁడైనవాఁడే యచలము, నిత్యము, నక్షరము, సనాతనమునగు బ్రహ్మము నొందుచున్నాఁడు. యోగు లెద్దాని నెఱిఁగి, యాత్మసిద్ధిని గనుఁగొందురో, యట్టిసర్వోత్తమమగు యోగశాస్త్రమును దెలిపెదను వినుము. ఏ యోగభావనలచే నాత్మ నాత్మయందుఁ దెలిసికొనఁగునో యట్టిమార్గమును దెలిసికొనుము. ఇంద్రియమ్ముల నుపసంహరించి మనస్సు నాత్మను జేర్పవలెను. ముందుగాఁ దీవ్రతప మొనర్చి మోక్షయోగము నాచరింపవలయును. తపస్వియు, దంభాహంకారవర్జితుఁడును, దృష్టసంకల్పుఁడునై,

విప్రుఁడు మనసుచే నాత్మయం దాత్మను జేర్చుచున్నాఁడు. ఆత్మ నాత్మ యందుఁ గూర్పఁగలుగునేని, యతఁ డేకాంతశీలుఁడై యాత్మ నాత్మ యందుఁ గనుఁగొనఁగల్గుచున్నాఁడు. మఱియు నాత్మజ్ఞుఁడును, విజితేంద్రియుఁడును, సతతసంయతుఁడు నగుయోగి, యాత్మ నాత్మయందుఁ గూర్చి చూడఁ గల్గుచున్నాఁడు. మానవుఁడు తానొకవ్యక్తిని స్వప్నమునఁ గాంచి యెటులు గుర్తించునో, యటులే యోగి యాత్మను గనుఁగొనఁగల్గుచున్నాఁడు. తృణరాశినుండి యొక ముండ్లదుబ్బును దీసి చూపించునట్లుగా, యోగి దేహమునుండి యాత్మను వేఱుపఱచి చూచుచున్నాఁడు. దేహధారి యెవ్వఁ డాత్మను గనుఁగొనుచున్నాఁడో యట్టివాని కీశ్వరుఁ డెవ్వఁడును లేఁడు. త్రిలోకాధిపతియగు ప్రభువైనను నాతనికిఁ బ్రభువు గానేరఁడు. అట్టివాఁడు తనయిచ్చవచ్చిన తనువుల ధరించుచుండును. మఱియు జరామరణములు లేక, శోక హర్షములకు లోనుగాక స్వతంత్రుఁడై దేవతలకును దేవత్వమును గల్గించుచుఁ, దుదకు నశాశ్వతమగు దేహమును బరిత్యజించి యవ్యయ మగు బ్రహ్మము నొందుచున్నాఁడు. లోకములు నశించుచున్నను వానికి భయములేదు. భూతములన్నియుఁ గ్లేశ మొందుచున్నపుడును వాఁడు క్లేశమొందఁడు. శాంతమానసుఁడును, నిస్పృహుఁడునునగు యోగి, సంగస్నేహసముద్భవములగు ఘోరదుఃఖశోకములచేఁ జలింపఁ జేయఁబడఁడు. మఱియు నెట్టిశస్త్రములును యోగిని బాధింపఁజాలవు. ఆతనికి మృత్యువు గలుగదు. యోగానందమును మించినసుఖ మేదియును లేదు. యోగి లెస్సగా నాత్మయం దాత్మనుగూర్చి ప్రకృష్టస్థితి నొందుచున్నాఁడు. జరాదుఃఖరహితుఁడై సుఖముగా నిద్రించును. మఱియు నీమానుషదేహమును విడిచి యిచ్చవచ్చినదేహము నతఁ డొందుచుండును. లెస్సగా యోగము నాశ్రయించి యాత్మను దర్శించువాఁడు సాక్షాత్తుగా వచ్చినయింద్రునేని లక్ష్యపెట్టఁడు. ఏకాంతశీలుఁ డగువాఁడు యోగము నెటులొందుచున్నాఁడో తెలిపెదను వినుము. వేదాంతశ్రవణపూర్వకమగు నుపదేశమును లెస్సగాఁ జింతించి తానే దేహమున నివసించియుండెనో యందు మనసును జలింపనీక నిలిపి, మఱియుఁ దద్దేహమున, మూలాధారాదిచక్రములం దొకదానియందు బాహ్యాభ్యంతరముగా మనసు నుంచి, తన్ను సర్వాత్మకునిఁగా

నెపుడు కనుఁగొనఁ గల్గునో, యప్పుడు బాహ్యాభ్యంతరములలో నెందును నేదియుఁ గానరాక వాసనాశూన్యమగుముక్తి గల్గుచున్నది. మఱియు నింద్రియములనెల్ల నియమించి నిశ్శబ్దముగానున్న ప్రదేశమునఁ గూరుచుండి యేకాగ్రచిత్తుఁడై బాహ్యాభ్యంతరములఁ దన్నే ధ్యానింపవలయును. ఆహారశుద్ధ్యాదులవిషయమున దంతములును, దాలువు, జిహ్వామూలాధోభాగము, దానిక్రిందిభాగము, హృదయగతమగుబ్రహ్మము, నాడీమార్గమును, యోగప్రాప్తిసాధనములుగాఁ దెలుపఁబడుచున్నవి.'

ఓమధుసూదనా! ఇటు లాబ్రాహ్మణుఁడు తెలుప విని మేధావి యగుశిష్యుఁడు మఱియు నాతనితో 'మహనీయా! తెలుప నలవిగాని యిమ్మోక్షధర్మమును బ్రశ్నించెదను. దాని నా కెఱిఁగింపవలయును. ప్రాణులు మఱిమఱియు భుజించునాహారము, కడుపున నెట్లు విపరిణామ మొందును? అది రసత్వ మెటు లొందును? రక్త మెట్లగును? అది యెటులు స్త్రీగర్భమున, మేదోమాంసములుగను, నెమ్ముకలుగను, స్నాయువులుగను నేర్పడును? ప్రాణుల యవయవము లెటు లేర్పడును? ప్రాణి వర్ధమాన మగుచున్నకొలఁది, నది వృద్ధినొందు టెట్లు? మలము వృద్ధినొందుటెట్లు? నిరోధకములగుమలములు వేఱువేఱుగా నిర్గమించుటెట్లు? జీవుఁడు నిశ్వాసోచ్ఛ్వాసము లొనర్చు టెట్లు? ఆ యాత్మ శరీరమున నెందు నివసించియుండును? జీవుఁడు నాడీమార్గములమూలమునఁ గళేబరము నెటులు వహించును? నాడీమార్గము లెట్టివర్ణముగలవి? వానిచే నతఁ డెట్టిశరీరము నొందును? ఓమహాత్మా! వీనినెల్ల నాకు యథార్థముగా నెఱిఁగింపుము.' అని ప్రశ్నించెను.

ఓమాధవా! అతఁ డిటులు నన్నుఁ బ్రశ్నించుటయు, నాయెఱిఁగినవిధముగా నాతనికిఁ దెలుపువాఁడనై 'ఓయీ! లోకమున మానవుఁ డొకకొట్టులోఁ దాసుంచినవస్తువు నెటుల వెదకుకొనునో, యటులే, యోగి, తనశరీరమున మనసు నిలిపి, నిశ్చలములగునింద్రియముల మూలమున, నిష్ప్రమాదముగా, నాత్మను వెదకవలయును. అటులు నిరతమును బ్రయత్నించినవాఁడు ప్రీతుఁడై, యచిరకాలమున బ్రహ్మమును గనుఁగొనఁగల్గును. దానిని గాంచినవానికిఁ బ్రధాన మెఱుఁగఁబడును. ఈయాత్మ, మనోదీపముచేఁ గాననగునుగాని, దృష్టి చేతను

మఱియుఁగల యింద్రియములచేతను దెలియఁబడదు. అయ్యది యెల్లె డలఁ బాణిపాదములు గలిగియు, నలువైపుల నక్షిశిరోముఖములు గలిగియు, నంతటను గర్ణములు గలిగియు లోకములనెల్ల నావరించి యుండును. జీవుఁడు తనకాత్మభూతమగు శరీరమునుండి వెడలుచున్న పరమాత్మను, ముందెపేషికాన్యాయముగాఁ గనుఁగొనును. జీవుఁడు దేహమున, స్వరూపమగుమనసును నిగ్రహించుచుఁ, గేవలబ్రహ్మమును గాంచఁగల్గును. ఇటులొనర్చి మోక్షమందును. ఈరహస్యము నెఱిఁ గించితినిగదా! ఇఁక నేఁ బోయెదను. నీవును యథాసుఖముగాఁ బొమ్ము.' అని తెలిపితిని. ఓకృష్ణా! పిమ్మట శిష్యుఁడగు నాబ్రాహ్మణుఁడు ప్రీతుఁడై వెడలిపోయెను ' అని యమ్మహర్షి తెలిపెను.

ఓయర్జునా! మోక్షధర్మాశ్రయుఁడగు నాద్విజోత్తముఁ డటులు పలికి యందే యంతర్ధానమొందెను. ఓపార్థా! ఈవిషయము, నాఁడు రథస్థుఁడవై యున్నపుడు నావలన, నేకాగ్రచిత్తుఁడవై వింటివిగాదే? వ్యగ్రమానసుఁడగువాని కిది తెలియుట దుర్ఘటమని నానిశ్చయము. అజ్ఞుఁడగువాఁడు దీనిని దెలియఁజాలఁడు. ఆత్మదర్శనరూపమగు ఆదేవ రహస్యము విశుద్ధాంతరాత్మతోఁ దెలుపఁబడినది. మానవుఁ డెవ్వఁ డును దీనిని వినియుండలేదు. నీవుదక్కఁ దక్కినమానవుఁ డిది విన నర్హుఁడు కాఁజాలఁడు. ఇది యిపుడు వ్యగ్రమగునంతరాత్మతోఁ దెలియఁదగినదిగాదు. ఓకౌంతేయా! కర్మాచరణశీలురగువారిచేతనే దేవలోక మావరింపఁబడినది. మర్త్యరూపనివర్తనము దేవతల కిష్టముగాదు. దేహమును విడిచినపిమ్మట, దేనినొంది యమృతత్వ మొందనగునో, యట్టిసనాతనమగుబ్రహ్మమే పరమగతి. ఓపార్థా! నా యీతెలిపినధర్మ మెఱుంగుదురేని, పాపయోనులును, బరమగతి నొందుదురు. అటులే స్త్రీలును, వైశ్యులును, శూద్రులును బరమగతి పడయుచున్నారు. ఓయర్జునా! బ్రాహ్మణులును బహుశ్రుతులగుక్షత్రి యులును దీనిని దెలియుదురేని పరమగతి నొందుదురనుటలో వింతయే మున్నది? నిత్యము నిజధర్మనిరతులై బ్రహ్మలోకపరాయణులగుబ్రాహ్మణ క్షత్రియులు తప్పక యుత్తమగతి నొందుచున్నారు. హేతుయుక్త ముగా నిది తెలుపఁబడినది. , మఱియు దీనిని సాధించువిధమును, సిద్ధిని, ఫలమును, మోక్షమును దెలిపితిని. ఓయర్జునా! దీనిని మించినసుఖ

మెయ్యదియు లేదు. బుద్ధిమంతుఁడును, శ్రద్ధాళువుఁ, బరాక్రమనిధియు నై, యెవ్వఁడు పైఁదెలిపినయుపాయములచే లోకసారమగు ధనాదికమును నిస్సారముగా నెంచి పరిత్యజించునో, వాఁడు వడిగా నుత్తమగతి నొందుచున్నాఁడు. చెప్పవలసిన దింతకుఁ దక్క వేఱొక్కటేమియును లేదు. ఆఱునెలలు వరుసగా యోగ మభ్యసించిన వాని కద్దాన సిద్ధి గలుగుచున్నది." అని తెలిపి మఱియు నవ్వాసుదేవుఁ డిట్లనియె.

## బ్రాహ్మణదంపతులసంవాదము

"ఓయర్జునా! నీవడిగినవిషయమున కొకయుదాహరణముగాఁ బురాతనేతిహాస మొకటి గలదు. అయ్యది బ్రాహ్మణదంపతులకు జరగినసంవాదము. ఒకప్పుడు జ్ఞానవిజ్ఞానపారగుఁడును, నిర్జనప్రదేశాసీనుఁడును, భర్తయునగు బ్రాహ్మణుని బ్రాహ్మణి సమీపించి, 'ఓనాథా! నీవేమి మంచిపనులను జేయవు; కూర్చుండుదువు; పేదవాఁడవు; విచక్షణుఁడవు గావు. ఇట్టి నిన్ను భర్తఁగాఁ బడసి యాశ్రయించియున్న నాకేమి లోకము గలుగునో తెలుపుము. పతికృతములగులోకములను భార్యలు పడయుదురని నావినికి. అట్టిస్థితిలో నిన్ను భర్తగా నాశ్రయించిన నాకెట్టిగతి గల్గునో తెలియకున్నది!' అని ప్రశ్నించెను.

అది విని, శాంతచిత్తుఁడగు నాబ్రాహ్మణుఁ డామెను గాంచి నగుచు, 'ఓసుందరీ! నీవన్నమాటలకు నాకేమియుఁ గోపము లేదు. గ్రాహ్యము, దృశ్యము, సత్యము ననఁదగు నేయేకర్మము గానవచ్చుచున్నదో, దానిని గర్మపరులగువారు కర్మము కర్మమని యెంచి యొనర్పఁగడంగుదురు. జ్ఞానశూన్యులై వారాయాసమునొంది మోహమునసే మునుఁగుచున్నారు. ఈలోకమునఁ గర్మములేకుంట, యొక నిమేషమైనఁ గానరాదు. జనించినది మొదలుగా వేఱొకశరీర మొందు నంతకును, మనోవాక్కర్మములచే భూతములు, శుభాశుభకర్మములం దేదేని చేయుచునే యుండును. సోమాజ్యాదులగు దృశ్యద్రవ్యములు గల యాగమార్గములు దుర్జనులచే హింసింపఁబడుచుండుట దెలిసి, వానినుండి విరతుఁడనై యాత్మచే నాత్మయందున్న యవిముక్త వస్తువును గాంచితిని. బ్రహ్మ మెందుండునో, మఱియుఁ బింగళతోఁ

గూఢ నిఢానాడి యెందుఁ గానవచ్చునో, బుద్ధిప్రేరకమగువాయు వెందు నిత్యము చరించునో, బ్రహ్మాదులగు యోగు లెం దా బ్రహ్మమును సేవింతురో, యట్టి భ్రూఘ్రాణమధ్యస్థమగు నవిముక్తస్థానమును జితేంద్రియులును, శాంతాత్ములును, సువ్రతులునగు విద్వాంసులు సేవింతురు. ఆ బ్రహ్మము ఘ్రాణముచే నాఘ్రాణింపఁబడదు. నాలుకచే నాస్వాదింపఁబడదు. స్పర్శముచేఁ దెలియఁబడదు. మనసుచే మాత్రము తెలియఁబడును. మఱియు నది చక్షువునకు దుస్సహమై వినికికి దూరమై, శబ్దస్పర్శరూపరసగంధముల చిహ్నము లేక యుండును. దానినుండియే సృష్ట్యాదులు ప్రవర్తిల్లుచున్నవి. మఱియుఁ బ్రాణాపానవ్యానోదానసమానములు, దానినుండియే ప్రవర్తిల్లును. అదియే సృష్టియగును. అయ్యవి దానియందుఁ బ్రవేశించును. అదియే లయమనఁబడును. నాభిమండలస్థమగు సమానము సకలదేహవ్యాపియగు వ్యానము ననియెడి వీనియందుఁ బ్రాణాపానములు చరించును. అపానసహితమై ప్రాణము భ్రూఘ్రాణమధ్యమున లీనమగుచుండ సమానవ్యానములును నడఁగి యుండును. ఆయపానప్రాణముల నడుమ నుదానము వ్యాపించియుండును. అట్టియుదానమున శయనించియున్న పురుషునిఁ బ్రాణాపానములు, విడువకుండును. ప్రాణములుదానాధీనములగుట నది యుదానమని చెప్పఁబడుచున్నది. బ్రహ్మవాదులు, ప్రాణజయాఖ్యమగుతపమును బరాత్మప్రాపకముగా నిశ్చయించుచున్నారు. అన్యోన్యభక్షకములును, దేహచారులు నగు వానిలో నడుమదగుచున్న సమానమనెడిదానికి స్థానమగు నాభిమండలమున నగ్ని యేడువిధములుగాఁ బ్రకాశించుచుండును. త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణమనోబుద్ధులని యేడును నయ్యగ్నికేడువిధములగు జిహ్వలై వెలయుచుండును. ఆయేడగ్నిజ్వాలలందును, ఘ్రేయ, దృశ్య, పేయ, స్పృశ్య, శ్రవ్య, మంతవ్య బోద్ధవ్యము లనియెడిసమిధలను హోమముచేయుచుండును. ఆహోమక్రియయందు ఘ్రాతయు, భక్షయితయు, ద్రష్టయు, స్ప్రష్టయు, శ్రోతయు, మంతయు, బోద్ధయు, ఋత్విజులగుచున్నారు. బ్రహ్మయోనులగు నయ్యగ్నులందు ఘ్రాణశ్రోత్రాదులగుహోతలు ఘ్రేయాదులగుహవిస్సులను హోమముచేసి, పృథివ్యప్తేజోవాయ్వాకాశములను మనోబుద్ధులను

జనింపఁజేయుచున్నవి. హవిర్భూతగుణములగు ఘ్రేయాదివిషయము లగ్నిజగుణమై గంధాదిజ్ఞానరూపధీవృత్తిని బ్రవేశించి, సంస్కార రూపమున మనసునందుండి తమకు యోనులగు ఘ్రాణాదులందు జనించుచుండును. భూతభావనమగు ప్రళయమున మున్ను దృష్టమగు రూపాదికము చిత్తగతమైయుండి, మఱియు జాగరావస్థయం దుత్పన్న మగుచుండును. దానినుండియే శబ్దస్పర్శరూపరసగంధములును, మనో బుద్ధులును జనించును. ఇదియే యాయేడును జనించువిధమని తెలుపు చున్నారు. ఈవిధముగనే ప్రాచీనులు వేదమునుండి గ్రహించిరి.' అని తెలిపి మఱియు నిట్లనియె.

## బ్రాహ్మణగీత

'ఓసుందరీ! మఱియొకపురాతనేతిహాసము గలదు. హోతలు పదుగురనియెడివిధానము గలదు. దాని నెఱిఁగించెదను. త్వక్చక్షుః శ్రోత్ర జిహ్వాఘ్రాణములను, వాక్పాణిపాదపాయూపస్థలను దశహోత లని చెప్పుచున్నారు. శబ్దస్పర్శరూపరసగంధములను, వాక్యక్రియా గతులను, రేతోమూత్రపురీషత్యాగములను బదిహవిస్సులఁగాఁ దెలుపుదురు. దిక్కులు, వాయువు, సూర్యుఁడు, చంద్రుఁడు, పృథివి, అగ్ని, విష్ణువు, ఇంద్రుఁడు, ప్రజాపతి, మిత్రుఁడును, దశాగ్నులుగాఁ దెలుపఁబడుచున్నారు. హోతలగుదశేంద్రియములు శబ్దాదులగువిషయ ములను దిగాదులగు నగ్నులందు హోమము చేయవలయును. క్షేత్ర జ్ఞున కాయతనమై, హృదయము గార్హపత్య మనఁదగి శరీరమును భరించుచున్నది. దానినుండి మనసు వచ్చుచున్నది. ఆమనస్సే యాహవ నీయము దానియందు హవిస్సు ప్రక్షేపింపఁబడుచున్నది. ఆహవి స్తైజము జాఠరతేజమునుబొంది వాగ్రూపమునఁ బరిణమించును. అటు లగుట, వేదము ముందుగా జనించెను. దానిని మనసు పర్యవేక్షణ మొనర్చుచున్నది. నీలపీతాదిరహితమగురూపము మనసు ననుసరించు చున్నది.' అని తెలుప విని యాబ్రాహ్మణి మఱియు నాబ్రాహ్మణుని గాంచి 'ఓమహనీయా! వాక్కు ముందుగా జనించు టెట్లు? పిమ్మట మనసు గలుగుటెట్లు? మనసుచేఁ జింతింపఁబడిన పిమ్మటనేగదా! వచన ముత్పన్నమగును,మఱియు ప్రాణము చిత్తము నాశ్రయించి యుండియు,

సుషుప్తియందు ద్రిక్తమై విషయముల నేల పొందకుండును? దానికపుడు బాధకమైన దేది?' అని ప్రశ్నించెను. అది విని యాబ్రాహ్మణుఁడు 'ఓసుందరీ! ఆప్రాణగతి కపాన మధిపతియై దానిని దనకు వశముచేసికొనును. ప్రాణగతియే మనోగతి యనఁబడుచున్నది. అటు లపానవశమై ప్రాణము మనోలయమగుచుండును. ఓనారీమణీ! నీవు వాక్కును మనస్సును సంబంధించి యొక ప్రశ్న మొనర్చితివి. కావున నా రెండిటికి జరిగినసంవాదమే నీకుత్తరముగాఁ దెలిపెదను. మనోవాక్కులు రెండును జీవునికడ కేఁగి, 'ఓజీవుఁడా! మాయిరువురలో నెవ్వఁ డుత్తముఁడు? ఈవిషయము తెలిపి మాసంశయమును దొలఁగింపుము.' అని ప్రశ్నించుటయు, జీవుఁడు, మనస్సే యుత్తమమని తెలిపెను. అంత నా సరస్వతి 'దేవా! నేను నీకుఁ గోర్కులఁ దీర్చుదానఁ గదా! నన్నేల యిట్లు పలికెదు?' అని తెలుప విని, యతఁడు 'ఓవాగ్దేవీ! నాకు రెండు మనస్సులు గలవు. అందు స్థావర మొకటి. జంగమ మొకటి. బాహ్యేంద్రియగ్రాహ్యమగుస్థావరము నాకడనుండును. అతీంద్రియమగు జంగమము నీయధీనమై యుండును. నీకడనున్న మంత్రవర్ణస్వరాదికమే జంగమమనస్సు. దానిబట్టి దానికంటె నీవును నధికవనఁదగియున్నదానవు. మఱియు నొకటి వినుము. నీవు నాకుఁ గోర్కులొసంగునట్టి విధ మెఱిఁగించితివి. అటులగుట నేనుచ్ఛ్వాసమాత్రము గలిగినట్టుండి పలికెదనుగాదే? మనోవృత్తివిశేషములగు ప్రాణాపానముల నడుమనేగదా వాక్కుండును! ప్రాణసహాయము లేనిచో హెచ్చులేక, క్షీణత్వ మొందుదువుగాదే?' అని పలికెను. పిమ్మట వాక్కు పరమేష్ఠిని జేరి నన్ననుగ్రహింపుమని ప్రార్థించునంతలోఁ బ్రాణము వాక్కునకు బలము గలిగించునదై ప్రాదుర్భవించెను. ఉచ్ఛ్వాసమాత్రమున వాక్కు హెచ్చుగా నుండదు. మఱియు వాక్కు ఘోషిణియు, నిర్ఘోషయు నని రెండువిధములు. వానిలో ఘోషిణికంటె నిర్ఘోషయే గొప్పది. ఘోషిణికిఁ బ్రాణసహాయ ముండవలయును. నిర్ఘోషయన్నో హంసమంత్రరూపయై యెల్లయవస్థలందుఁండును. అటులగుటనే యది గొప్పది. ఘోషిణియు నుత్తమమైనదియే. అది యుత్తమరసప్రదయై కామధేనువట్లు సకలార్థములను గలిగించును. మఱియు నుపనిషద్రూపమై మోక్షమును సైతము గలిగించును. దివ్యాదివ్యప్రభావముచే

భారతి, కామధేను వనఁదగియున్నది. ఓసుందరీ! ఈమనోవాక్కుల యనంతరము తెలిసితివా?' అని పలికెను. అది విని బ్రాహ్మణి, మఱియు నాతనితో 'ఓమహాత్మా! వాక్యము లుత్పన్నములు గాకమునుపు వచో వివక్ష గలుగ సరస్వతి యెట్లు వెడలును?' అని ప్రశ్నించుటయు, నా బ్రాహ్మణుఁ డామెతో 'ఓనారీమణీ! వక్తకు వివక్ష గలుగునపుడు, బాహ్యవాయువును బీల్చుకొన నది నాభిస్థానమునఁ బ్రాణాపానముల గ్రంథిలో నపానముతోఁ గలిసి యందించుక యభిహతిఁబొంది మీఁదికి వెడలి యందు శిరఃస్థానమున నభిఘాతము గలుగ వ్యానముతోఁ గూడి యంతటను వ్యాపించును.' అంతట సమానమునొంది పైకి వెడలును. ఇదియే సరస్వతి వెడలినవిధము. కావున స్థావరమగుట మనసు గొప్పది. జంగమమగుట వాక్కు గొప్పది' అని తెలిపి మఱియు నా బ్రాహ్మణుం డిట్లనియె.

'ఓసుందరీ! సప్తహోతలవిధాన మెట్టిదో తెలిపెదను వినుము. త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణములును, మనోబుద్ధులును సప్తహోత లనఁబడును. అయ్యవి యొకయధిష్ఠానము నాశ్రయించియుఁ, బరస్పరముఁ దెలిపికొనఁజాలవు. ఈసప్తహోతృత్వము, స్వభావమునుబట్టి తెలియుము' అని తెలుప విని యాబ్రాహ్మణి 'ఓమహనీయా! అయ్యవి యొకసూక్ష్మావకాశమున నుండియుఁ బరస్పరము తెలిసికొనకుండుట కేమిహేతువు? అది యెట్టిదో తెలుపుము' అని యడిగెను. అది విని యతఁడు, 'ఓనారీమణీ! వినుము. గుణములను దెలియకుండుటయే యవిజ్ఞానము. గుణములను దెలియుటయే అభిజ్ఞత. ఈసప్తహోతలును బరస్పరగుణములను దెలియఁజాలవు. త్వక్చక్షుశ్శ్రోత్రములును, మనోబుద్ధులును, గంధమును దెలియఁజాలవు. దాని నొకఘ్రాణమే తెలిసికొనును. అటులే త్వక్చక్షుశ్శ్రోత్రఘ్రాణములును, మనోబుద్ధులును రసమును గ్రహింపలేవు. జిహ్వ యొక్కటియే దానిని గ్రహించును. అటులే చక్షువుదక్కఁ దక్కినవి రూపమును గ్రహింపఁజాలవు. ఆచక్షు వొక్కటియే రూపమును గ్రహించును. అటులే స్పర్శమును ద్వక్కు దక్కఁ దక్కినవి తెలియఁజాలవు. శబ్దమును శ్రోత్రముతక్కఁ దక్కినవి తెలియఁజాలవు. మనస్సు సంకల్పమును తెలిసికొనును. ఆసంకల్పమును దక్కినవేవియుఁ దెలియఁజాలవు. నిష్ఠ యనుదానినిబుద్ధి

మాత్రము తెలిసికొనును. తక్కినవాని కానిష్ట తెలియదు. ఈవిషయమున నింద్రియములకును, మనస్సునకును సంవాదము జరిగెను. దానిం దెలిపెదను వినుము. మనస్సు తక్కినయింద్రియముల నుద్దేశించి, 'ఓయీ! మీలో ఘ్రాణము నాసహాయము లేక గంధమును గ్రహింపలేదు. అటులే, జిహ్వ రసమును, చక్షువు రూపమును, త్వక్కు స్పర్శమును, శ్రోత్రము శబ్దమును నాసహాయము లేక గ్రహింపఁ జాలవు సకలభూతములలో నేను సనాతనుఁడును, నుత్తముఁడనుగాఁ దెలియవలయును. జ్వాలాశూన్యములగు నగ్నులట్లును, శూన్యాగారములట్లును, నింద్రియములు నేను లేనిచో భాసిల్లఁ జాలవు. తక్కిన యింద్రియములు ప్రయత్నించుచున్నను నాసహాయము లేనిచో సకలజంతువులును శుష్కార్ద్రకాష్ఠములట్లు గుణార్థములను దెలియ లేవు' అని పలికెను. అది విని యింద్రియములు, మనసు నుద్దేశించి 'ఓమానసమా! నీవు తలంచినది తథ్యము కాకపోదు. కాని మేము లేక మాయర్థముల నీ వనుభవింపఁ గల్గుదువా? అటులేని నీమాట నిజము కావచ్చును. మేమడఁగియున్నతఱి నీవు భోగము లనుభవింపఁ గల్గుదువేని నీవు తలంచినది నిజము గావచ్చును. మఱియు మేము పనిచేయనపుడు, గంధాదులున్నను, నీవు సంకల్పమాత్రమున యథార్థముగా భోగము లనుభవింపఁగల్గుదువా? మాయర్థములందు నీకు సిద్ధిగలదేని, ఘ్రాణసహాయమున రూపమును గ్రహింతువా? చక్షువుచే రసము నాకర్షింపఁగలవా! శ్రోత్రముచే గంధమును గ్రహింతువా? జిహ్వచే స్పర్శమును స్వీకరింపఁగలవా? త్వక్కుచే శబ్దమును దెలియుదువా? లేక బుద్ధిసహాయమున స్పర్శమును గుఱుతు వెట్టఁగలవా? బలహీనులమగు మానియమము లుత్తమములై యొరుల కధీనములుగావు. ఒకరనుభవింపనిభోగము లనుభవింపుము. అంతియగాని మే మనుభవించిన పిమ్మట నెంగిలిసుఖము లనుభవించుట నీకుఁ దగదు. లోకమున శిష్యుఁ డెట్లు వేదార్థములను దెలియ గురు ననుసరించుచు, దానిని గ్రహించునో, యటులే గురుస్థానీయులమై మేము విషయములను జూపఁగా, వానిని నీవు నీవిగా నభిమానమును జూపుచున్నావు. అల్పచిత్రములగుజంతువులు వైమనస్య మొందియున్న తఱి మావిషయమునఁ గార్యము చేయఁబడినపుడే వానికిఁ బ్రాణ

ధారణమగుచున్నది. పెక్కుసంకల్పములచే స్వప్నమందు విషయములఁ గాంచియుఁ, బ్రాణికి మాసహాయము లేకుండుటచే నిజమగు ననుభవము గలుగదుగదా! ఆఁకలిచేఁ బీడ గల్గినపుడు, ప్రాణి విషయములకుఁ బ్రయత్నించియు, ద్వారశూన్యమగుగృహముఁ జొచ్చి మరల నట్టులు, మాసహాయము లేమి వాని ననుభవింపలేక మరలును. ప్రజ్వలితాగ్నియు దారుక్షయమున శాంతించినట్లు, ప్రాణక్షయమున శరీరి శాంతించును. మఱియు మాసహాయము లేక తపఃప్రాప్తియుఁ గలుగదు. అది లేనిచో, నీకు సంతోష మెట్లు గల్గెడిని?' అని పలికె'నని తెలిపి బ్రాహ్మణుఁడు మఱియు నిట్లనియె.

'ఓపతివ్రతాశిరోమణీ! నీవడిగిన విషయమున నొకయితిహాసము గల దది యాకర్ణింపుము. దానికి సంబంధించిన పంచహోతలవిధానము వినుము. ప్రాణాపానవ్యానోదానసమానము లనియెడి యైదును బంచహోత లనఁబడును. వీనినే పరమభావమునుగాఁ బండితులు తెలుపుచున్నారు.' అని తెలుపుటయు, నామె యాతనితో 'మహనీయా! స్వభావమునుబట్టి సప్తహోతలనియే నాపూర్వనిశ్చయము. పంచహోతలు పరభావ మొందునట్టివిధ మెట్టిదో నాకుఁ దెలుపు'మని ప్రశ్నించెను. అంత నతఁ డామెతో 'ఓసుందరీ! ప్రాణసంభృతమై యపానము జనించును. అపానసంభృతమై వ్యానము ప్రవర్తిల్లుచున్నది. వ్యానసంభృతమై యుదానము ప్రవర్తిల్లుచున్నది. ఉదానసంభృతమై సమానము జనించుచున్నది. అవి మున్నొకపుడు పితామహునికడ కరిగి, 'ఓదేవా! మాలో నెవ్వరుత్తములో నీవు తెలిపిన, నాచొప్పున మేము శ్రేష్ఠులమగుదుము.' అని యడిగెను. అది విని యాపరమేష్ఠి, 'ఓవాయువులారా! ప్రాణులశరీరమున మీలో నేది యడఁగినఁ దక్కినవెల్లఁ బ్రళయ మొందునో, యదియే యుత్తమమైనదగుచున్నది. అటులే యేది ప్రవర్తిల్లఁగాఁ దక్కినవి చరించునో, యదియే శ్రేష్ఠమైనది. నాయీ వచనము వినఁబడియెనా? ఇఁక మీరు పోవచ్చును.' అని పలుకుటయు, వానిలోఁ బ్రాణము 'ఓదేవా! మానవునిశరీరమున నేనడఁగియుండఁగాఁ, దక్కినవెల్లఁ బ్రళయమందును. నేను బ్రవర్తిల్లునపుడే తక్కినవి చరించును. కావున నేనే యుత్తముఁడను. ఇదె నే నడంగెదను చూడుఁడు' అని పలికెను.

ఓనారీమణీ! ఆప్రాణ మటు లడఁగి, మఱియుఁ జరించెను. పిదప సమానోదానములు రెండును, బ్రాణము నుద్దేశించి, 'ఓయీ! మావలె నీవు సకలమును వ్యాపించియుందువా? కావున నీవు మాకంటె శ్రేష్ఠుఁడవు గావు. అపాన మొక్కటియే నీకు వశమై యుండును.' అని పలికెను. అంత ప్రాణము మఱియుఁ జరించుటయుఁ, బిమ్మట నపానము తక్కినవానితో 'ఓయీ! వాయువులారా! నేనడఁగియుండఁ దక్కిన మీరెల్లఁ బ్రాణులశరీరమునఁ బ్రళయమందుదురుగాదే! నేను జరింపఁగా మీరు చరింతురు. కావున నేనే శ్రేష్ఠుఁడను. నే నడఁగెదను జూడుఁడు.' అని పలికెను. అటులు పలుకుచున్న యపానము నుద్దేశించి, వ్యానోదానములు రెండును, నపానముతో 'ఓయీ! నీవు శ్రేష్ఠుఁడవు గావు నీకు ప్రాణము మాత్రము వశమైనది' అని పలికెను. అంత నపానము చరించెను. పిమ్మట వ్యానము 'ఓయీ! నేనందఱిలో నుత్తముఁడను ఇందులకు నిమిత్తము వినుఁడు. నేనడఁగియుండితినేని, ప్రాణుల శరీరమునఁ దక్కినవెల్ల నడఁగియుండవలసినదియే! నేను జరించునపుడే తక్కినవి చరించును. చూడుఁడు. నేనడంగెదను.' అని పలికెను. అంత నటు లది ప్రలీనమై మఱియుఁ జరించెను. పిదప నావ్యానము నారసి, ప్రాణాపానసమానోదానములు 'ఓవ్యానమా! నీవు మాకంటె శ్రేష్ఠుఁడవు గావు. సమాన మొక్కటియే నీకు వశమైనది.' అని పలికెను. పిమ్మట వ్యానము చరించెను. అపుడు సమానము 'ఓయీ! నే నన్నిటిలో శ్రేష్ఠుఁడను. అందులకు నిమిత్తము వినుఁడు. నేనడఁగియున్నచోఁ దక్కిన వడంగును. నేను జరించినఁ దక్కినవి చరించును. కావున నేనే యుత్తముఁడను. చూడుఁడు. అడంగెదను.' అని పలికెను. పిదప సమాన మటులడఁగి, మఱియుఁ జరింప నుదానము 'ఓయీ! నేనే మీలో నుత్తముఁడను. నేనడఁగిన మీ రడఁగుదురు. నేను జరించిన మీరు చరింతురు. చూడుఁడు, నే నడఁగెదను.' అని పలికి, యది మఱియుఁ జరించెను. పిమ్మటఁ బ్రాణాపానసమానవ్యానములు దానితో 'ఓయుదానా! నీవుత్తముఁడవుగావు వ్యాన మొక్కటియే నీకు వశమైనది.' అని పలికెను ఓసుందరీ! పిమ్మట వానినెల్లఁ గాంచి యాపరమేష్ఠి 'ఓవాయువులారా! మీరెల్లరును నొకవిధముగా నుత్తములు, వేఱొకవిధముగా నుత్తములుగారు. మఱియుఁ బరస్పరా

పేక్షగలవారై యున్నవారు. అందఱును స్వవిషయముల నుత్తములే. అందఱకు నందఱతో సంబంధముగలదు' అని పలికి, మఱియు వానితో 'మీలో నొక్కొక్కటి విశేషముపుబట్టి స్థిరము అస్థిరము, నగుచుందురు. నాయాత్మ యొకటియే బహువిధముల నుపచయమందును. మీరు పరస్పరము సౌహృదము గలిగి వర్తింపుఁడు. పొండు. మీకు క్షేమమగుఁగాక.' అని తెలిపెనని పలికి బ్రాహ్మణుఁడు మఱియు నిట్లనియె.

## బ్రాహ్మణప్రబోధము

'ఓసతీ! నీవడిగిన యీవిషయమునఁ బురాతనేతిహాస మొకటి గలదు. అయ్యది నారదునకును దేవమతునకును జరగినసంవాద రూపము. దానిం దెలిపెదను వినుము.

దేవమతుఁడు:—ఓనారదా! జంతువు జనించునపుడు ప్రాణాపాన వ్యానోదానసమానములలో నెయ్యది తొలుతఁ బ్రవర్తిల్లును?

నారదుఁడు:—'దేనిచే జంతువు సృజింపఁబడుచుండునో, దానికంటె వేఱొకటి దానిని ముందుగాఁ జేరుచుండును. అదియే ప్రాణద్వంద్వ మనఁబడును. అయ్యవి తిర్యగూర్ధ్వాధోభాగములకుఁ బోవుచుండును.

దేవమ:—దేనిచే జంతువు సృజింపఁబడును? ఏది దానిని ముందుగాఁ జేరును? ఆప్రాణద్వంద్వమేది? తిర్యగూర్ధ్వాధోగతమగు టెట్లు?

నార:—సంకల్పమువల్లను శబ్దమునుండియు, రసమునుండియు, రూపమునుండియు హర్షము జనించుచున్నది. మఱియు శోణితసంసృష్ట మగుశుక్రమునుండి ముందుగాఁ బ్రాణము ప్రవర్తిల్లుచున్నది. ఆప్రాణముచే శుక్రము వికృతము కాఁగా, దానినుండి యపానము ప్రవర్తిల్లును. అది శుక్రమునుండియు,రసమునుండియు జనించును. ఉదానుని రూపము హర్షము. అది కార్యకారణముల నడుమ నుండును. శుక్రము కామమునుండి జనించును. శుక్రమువలన రజము జనించును. సమానవ్యానజనితములైన శుక్రశోణితములు సామాన్యములు. ప్రాణాపానము లొకద్వంద్వము. అది క్రిందికి మీఁదకును బోవుచుండును. సమానవ్యానము లొకద్వంద్వము. అగ్నియే సకలదేవతల

స్వరూపమని దేవశాసనము. ఆదేవునిజ్ఞానము బుద్ధిసమన్వితమై ప్రవర్తిల్లును. ఆదేవునిఘామమే యజ్ఞానము. ఆతనిభస్మమే రజము. ఏదేవుని యందు హవిస్సు ప్రక్షేపింపఁబడుచున్నదో, దానినుండియే సకలము జనించుచున్నది. సత్వమువలన సమానవ్యానము లగుచున్నవని వేదవేత్తలు తెలుపుదురు. ప్రాణాపానములే ఘృతభాగములు. వాని నడుమ నగ్నిదేవుఁడైన యుదానుఁ డుండును. అదియే యుదానుని యుత్తమరూపమని జ్ఞానులు తెలియుదురు. మఱియుఁ గొన్నిద్వంద్వములును గలవు. వాని నెఱిఁగించెదను వినుము. అహోరాత్రము లొకద్వంద్వము. వానినడుమ హుతాశనుం డుండుననియు, నదియే యుదానునిరూపమనియు జ్ఞానులు తెలుపుదురు. సదసత్తులు రెండు నొకద్వంద్వము. వానినడుమ హుతాశనుఁ డుండును. ఇది యుదానుని రూపమని బ్రహ్మవేత్తలు తెలుపుదురు. దాని నూర్ధ్వముగా సమానము, వ్యానము నుండును. ఆదియు హేతువుగాఁ గర్మ విస్తరిల్లుచున్నది. వ్యానసమానములు, సనాతనమగు బ్రహ్మము నొకటియే. ఇదియే యుదానునిపరమరూపమని బ్రహ్మవేత్తలు తెలుపుదురు.' అని తెలిపి బ్రాహ్మణుఁడు మఱియు నిట్లనియె.

## బ్రాహ్మణగీత

'ఓసుందరి! మఱియు నొకపురాతనేతిహాసము గలదు. అది చాతుర్హోత్రవిధానము. దానినెల్ల నుపదేశించెదను వినుము. ఇది పరమరహస్యము, నద్భుతము నైనయది. కరణము, కర్మ, కర్త, మోక్షము అనునవి చతుర్హోతలు. వానిచే జగమెల్ల నావరింపఁబడియెను హేతువులసాధనమును వినుము. త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణములును, మనోబుద్ధులు, అనియెడియేడును గుణహేతువులు. శబ్దస్పర్శరూపరసగంధములు, మంతవ్యబోద్ధవ్యములు, అనునేడును గర్మహేతువులు. ఘ్రాత, భక్షయిత, ద్రష్ట, వక్త, శ్రోత, మంత, బోద్ధ, అనునేడును గర్తృహేతువులు. గుణవంతములగుఘ్రాత్రాదులు శుభాశుభములగు గంధాదుల ననుభవించును. ఈయేడును మోక్షహేతువు లగుచున్నవి. నేను నిర్గుణుఁడను, ననంతము లేనివాఁడను నై వెలయుదును. వివేకసంపన్ను లగువారిగుణములు తమతమస్థానముల

నతిక్రమింపక దేవతాభూతములై శబ్దాదివిషయముల ననుభవించుచుండును. వివేకహీనుఁడు విషయముల ననుభవించుచుఁ దనవిగా భావించును. తనకుఁగా భావించుకొనినది మమత్వముచేఁ జెడుచున్నది. అట్టివాఁ డొనర్చునది యభక్ష్యభక్షణము, మద్యపానము నై వానిని జెఱుచును. వాఁడావిషయమును జెఱచి తానును జెడుచున్నాఁడు. శ్రోత్రాదులకు విషయములగువానిని హవిస్సులఁగాఁజేసి వ్రేల్చినచో, నాత్మజ్ఞానాగ్ని వెలయును. పావకుఁడు శరీరాంతర్గతుఁడై వెలయుచున్నాఁడు. జ్ఞానాగ్నిప్రదీపకమగు యోగయజ్ఞ మారంభించితిని. అందులకుఁ గావలసినపరికరములలోఁ బ్రాణము తోత్రము. అపానము శస్త్రము. ఆయాగము సర్వత్యాగదక్షిణగలది. అహంకారము, మనస్సు, బుద్ధియు నందు బ్రహ్మగా నుండును. ఋతమే ప్రశాస్త. అందపవర్గము ఫలము. నారాయణుఁడే యజ్ఞేశ్వరుఁడు' అని తెలిపి మఱియు నా బ్రాహ్మణుఁ డిట్లనియె.

## బ్రాహ్మణోపదేశము

'ఓసుందరీ! శాసకుఁ డొక్కఁడేగాని రెండవవాఁడు లేఁడు. అతఁ డెవ్వఁడందువేని హృచ్ఛయుఁడే యగుచున్నాఁడు. అతని ననుసరించియే పలుకుచున్నాఁడను. అతనిచే నియుక్తుఁడనై నీరు పల్లమునకుఁ బోవునట్టు లాతనియాజ్ఞానుసారముగఁ బ్రవర్తించుచున్నాఁడను. గురుఁ డొక్కఁడేగాని రెండవవాఁడు లేఁడు. అతఁడు హృచ్ఛయుఁడే. అతని ననుసరించియే పలుకుచున్నాఁడను. అతనిచేతనే లోకద్విష్టములగు పన్నగములన్నియు ననుశిష్టము లయ్యెను. బంధు వొక్కఁడే, అతఁడు హృచ్ఛయుఁడే. అతని ననుసరించుచునే పలుకుచున్నాఁడను. ఆతనియాజ్ఞవట్టియే సప్తర్షులును వెలుఁగుచున్నారు. శ్రోత యొక్కఁడేగాని వేఱొకఁడు లేఁడు. అతఁడు హృచ్ఛయుఁడే. అతని ననుసరించియే పలుకుచున్నాఁడను. ఆగురు నొద్ద శుశ్రూష చేసియే యింద్రుఁడు సర్వలోకామరత్వ మొందెను. అతఁ డొకఁడే ద్వేష్టగాని, మఱియొకఁడు లేఁడు. అతఁడు హృచ్ఛయుఁడే. అతని ననుసరించియే పలుకుచున్నాఁడను. అతనిచేతనే లోకద్విష్టులగు పన్నగులందఱును శాసింపఁబడిరి. ఇందుల కొకపురాతనేతి

హాసము గలదు. అయ్యది పరమేష్ఠియొద్దఁ బన్నగాసురదేవర్షులకు జరగినసందర్భము. ఒకపుడు దేవతలును మహర్షులును బన్నగులు నసురులును బరమేష్ఠిని సమీపించి, తమకు శ్రేయమగుమార్గము దెలుపుమని ప్రార్థించిరి. అటులు శ్రేయమును గోరి ప్రశ్నించుటయు, 'ఓమిత్యేకాక్షరం బ్రహ్మ' అనువచన ముచ్చరించెను. అది విని వారెల్లరును దమతమదిశలకు వెడలిరి. అపు డాతనియుచ్చారణ సమయమునఁ గలిగినముఖోష్ఠలననిమీలనములఁ గాంచి, పన్నగులు దంశనమే యాతనియుపదేశవిషయమని గ్రహించి, దంశనప్రవృత్తులైరి. అసురులు పరమేష్ఠి యోష్ఠముల కదలికను గాంచి, జపమనుకొని తత్సూచకమగుదంభ మూనిరి. దేవత లాయుచ్చారణమునందలి 'ఓమ్' అనునది యంగీకారమును దెలుపునదగుట, దానమున నది యగునని యెంచి, దానము సేయుటయే శ్రేయముగాఁ బరమేష్ఠి తెలిపెనని, దానినే వారవలంబించిరి. మహర్షులు పరమేష్ఠి యోష్ఠప్రవృత్త్యుపసంహారములఁ గాంచి,సకలప్రవృత్త్యుపసంహారమగు దమమే శ్రేయమని దానినివారవలంబించిరి. వారికి శాస్త్ర మొకఁడే. ఒకశబ్దముచే సంస్కరింపఁబడిరి. అయినను, నాపన్నగాసురదేవర్షులు నానావిధములుగాఁ బ్రయత్నించిరి. చెప్పఁబడినదానిని వినువాఁ డితఁడే. ఇతఁడే గ్రహించుచున్నాఁడు. దానిని మరలఁ బ్రశ్నించువారికిఁ దెలుపువాఁడు నితఁడే. కావున నితనిమించిన గురుఁ డొకఁడు లేఁడు. అతనియనుమతినొందియే కర్మము ప్రవర్తిల్లుచున్నది. గురుఁడును, బోద్ధయు, శ్రోతయు, ద్వేష్టయు నతఁడే. అతఁడే పాపునితోఁ జరించుచుఁ, బాపచారియగుచున్నాఁడు. శుభునితోఁ జరించుచు, శుభచారి యగుచున్నాఁడు. ఎవ్వఁ డింద్రియలోలుపుఁడై కామునితోఁ జరిచునో, వాఁడు కామచారి యగుచున్నాఁడు. ఎవ్వఁ డింద్రియజయరతుఁడై బ్రహ్మమునఁ బ్రవర్తించునో వాఁడు బ్రహ్మచారి యనఁబడును. వ్రతములను గర్మములను విడిచి కేవలము బ్రహ్మనిష్ఠాగరిష్ఠుఁడై లోకమునఁ జరించుచు బ్రహ్మభూతుఁడైనవాఁడును బ్రహ్మచారి యగుచున్నాఁడు. వానికి బ్రహ్మమే సమిధలు; బ్రహ్మమే యగ్ని; బ్రహ్మమే జలములు. బ్రహ్మమే వానికి గురుఁడు. వాఁడు బ్రహ్మమందే నిలుకడగలిగియుండును. ఇదియే సూక్ష్మమగుబ్రహ్మచర్యమని పండితులు

తెలియుచున్నారు. క్షేత్రజ్ఞునిచేఁ జూపఁబడినవారై దానిని దెలిసి కొని పొందుచున్నారు.' అని తెలిపి మఱియు నిట్లనియె.

'ఓనారీమణీ! సంకల్పమనియెడి దంశమశకములును, శోకహర్షము లనియెడి హిమాతపములును, మోహమనియెడి యంధకారమును, లోభవ్యాధులనెడి సరీసృపములును, విషయములనెడి దూరమార్గ మును, గామక్రోధములనియెడి నిరోధకులును గలిగి, ప్రవేశింప నలవి గాని దుర్గమస్థలమును దాఁటి, మహత్తరమగు వనమును బ్రవేశించి తిని. అని తెలుప విని యాబ్రాహ్మణి 'ఓమహానీయా! ఆవన మెం దున్నది? అందుఁగలవృక్షము లెవ్వి? నదు లెవ్వి? పర్వతము లెవ్వి? ఆవన మెంతదూరమున నున్నది?' అని ప్రశ్నించెను.

అంత నాబ్రాహ్మణుఁడు 'ఓపతివ్రతామణీ! దానికిఁ బృథగ్భావ మనునది లేదు. దానిని మించినసుఖమును లేదు. విషయాదిపదార్థము గల దనుటయు నందులేదు. దానిని మించినదుఃఖతారక మగునదియు లేదు. దానికంటెఁ బొట్టియు, దానికంటెఁ బొడవైనదియు లేదు. దానికంటె సూక్ష్మమైనదియు, సుఖప్రదమైనదియు మఱియొకటి లేదు. అందుఁ బ్రవేశించిన ద్విజగణమునకు శోకహర్షములు రెండును గలుగవు. మఱియు నాద్విజగణమువలన నొరులకును, నొరులవలన దానికిని భయమొందవలసిన పనిలేదు. ఆమహావనమున నేడుమహావృక్ష ములును, నేఁడుఫలములును గలవు. మఱియు నేడ్వురతిథులు నందు వసింతురు. మఱియు నాశ్రమము లేడును, సమాధు లేడును, దీక్ష లేడును గలవు. అదియే యాయరణ్యము స్వరూపము. అందు దివ్య ములై యైదువర్ణములుగల పుష్పములను, ఫలములను సృజించువృక్ష ములు కొన్ని వ్యాపించి యున్నవి. మఱికొన్నివృక్షములు వర్ణద్వ యముగలిగి, సుగంధబంధురములై వెలయుపుష్పములను, ఫలములను సృజించుచు విరాజిల్లుచున్నయవి. మఱియుఁ గొన్నివృక్షములు మంచి వాసనగల యేకవర్ణపుష్పములను జనింపఁజేయుచు, నావనమును వ్యాపించియుండును. మఱియు నవ్యక్తవర్ణములగు పెక్కుపుష్ప ములను ఫలములను సృజించుచు, మహావృక్షములు రెండు తద్వన మును వ్యాపించియుండును. మఱియు నందొకవహ్నియు, సుప్రసన్నభావ ములును, నైదుసమిధలును గలవు. దీక్షాగుణములు గలయావృక్షము

లేడుఫలములను ఫలించును. అందుఁ గలమహర్షు లతిథులై, ఫలాశ గలిగి యాతిథ్యమును బ్రతిగ్రహించుచుందురు. అటు లయ్యతిథు లర్చితులై యందం దడఁగియుండుదురు. మఱియొకవనము గలదు. అందు మోక్షఫలము గలదియు, శాంతిచ్ఛాయాసమన్వితమైనదియు నగు నొకప్రజ్ఞావృక్షము గలదు. అయ్యది జ్ఞానాశ్రయమును, దృప్తిజలమును, క్షేత్రజ్ఞభాస్కరము నై వెలయును. అమ్మహావృక్షమును జేరినవారికి భయమనునది గలుగదు. దాని కేవైపు చూచినను నంతము గానరాదు. మఱియు నం దవాఙ్ముఖులై, జ్యోతిర్మయులై యేడ్వురుస్త్రీలు నివసించుచుందురు. వారు ప్రజలకొఱకు సకలరసముల నాకర్షించుచు, నందే కానవచ్చి, యందే యడంగుచుందురు. మఱియుఁ దేజస్వులు సిద్ధులు నైనయేడ్వురుమహర్షు లుందురు. ఆసప్తర్షుల తేజములు భాస్కరు ననువర్తించుచుండును. మఱియుఁ బర్వతములును, నదులును గలవు. ఆనదులు బ్రహ్మసంభవమగునుదకమును బ్రవహించుచుండును. మిక్కిలి రహస్యమగుయజ్ఞవేదికయం దానదులు గలియుచుండును. కృశాశులు, సువ్రతులు, తపోదగ్ధకిల్బిషులు నగువారు, స్వాత్మతృప్తులై దానినుండి వెడలి పితామహునిఁ జేరి, యాత్మయం దాత్మనుగూర్చి యుపాసించుచుందురు. విద్యారణ్యవేత్తలగు వారు శమ మొకయరణ్యముగా భావించి చెప్పుదురు. ఇదియే పుణ్యారణ్యము. ఇది క్షేత్రజ్ఞుఁడు చూపఁ దెలిసికొని ప్రవేశింపవలయును.' అని తెలిపి బ్రాహ్మణుఁడు మఱియు నిట్లనియె.

'ఓనారిమణీ! నేను గంధముల నాఘ్రాణింపను. రసముల రుచి చూడను. రూపమును గనుఁగొనను; స్పృశింపను. శబ్దములను వినను. సంకల్పమును బొందను. స్వభావమే యిష్టార్థములను గోరుచుండును. అదియే యనిష్టములను ద్వేషించును. స్వభావమువలనఁ బుట్టుచున్న కామద్వేషములను, ప్రాణాపానములు దేహములను బ్రవేశపెట్టును. వానిని మఱికొన్నిటిని భూతాత్ముని, యోగులు శరీరమునఁ గనుఁగొందురు. నే నాదేహమందు నివసించుచుండియుఁ, గామక్రోధముల తోడను, జరామృత్యువులతోడను సంబంధము లేక యుందును. అటులు కామములను గోరనట్టియు, ద్విష్టములను ద్వేషింపనట్టియు నాకుఁ బద్మములందు జలబిందువుల కట్లు స్వభావములసంబంధము

కలుగదు. నిత్యుఁడగువానికి సత్యకామములే యగుచుండును. కర్మములు ప్రవర్తిల్లుచున్నను, నట్టివానికి ఘ్రాత్రాదులకు స్వాభావఘాతమగుభోగజాలము, సూర్యకిరణసమూహ మాకసమున కట్టులు సక్తము గానేరదు. ఓసుందరీ! ఇందొకపురాతనేతిహాసము గలదు. అయ్యది యధ్వర్యుయతిసంవాదము. దాని నెఱింగించెదను వినుము. ఒకప్పు డొకయతి, యొకయాగమునఁ బశువు హింసింపఁబడుచుండుట గాంచి, యధ్వర్యునితో 'ఓయీ! ఇది హింస గాదే?' యని నిందించి పలికెను. అది విని యాయధ్వర్యుఁడు, యతిని గాంచి, 'ఓయతీ! ఇం దీభాగమునకు నాశము లేదు. ఈ మేఁక శ్రేయమునే పొందును. అని శ్రుతి చెప్పుచున్నది. ఈపశువు మేనఁ గలపృథివీభాగము పుడమిని గలియును. జలభాగము జలములఁ జేరును. తేజోభాగము సూర్యుని సంక్రమించును. శ్రోత్రము దిక్కులఁ బట్టును. దీనిప్రాణము దివము నాశ్రయించును. శాస్త్రమార్గమునఁ బ్రవర్తించునట్టి నాకు దోషమన నెట్టిది? అని తెలిపెను. అంత నయ్యతి, యతనితో 'ఓయీ! ప్రాణవియోగమున నీమేఁకకు శ్రేయము గలదందువేని, యీమేఁకకై యాగము చేయఁబడుచున్న దనవలయునుగదా! దీనివలన నీకుఁ గలప్రయోజన మేమి? మఱియొకటి వినుము. ఈహింసచే నీభాగమునకు శ్రేయము గలదేని, యీహింస నీతండ్రికో, నీతల్లికో, నీభ్రాతకో, లేక నీమిత్రునకో గలిగించి యాశ్రేయమును వారిలో నొకని కేల కూర్పఁగూడదు? వారును దీని కంగీకరింపవచ్చును. కావున వారిని గలిసి యాలోచించి యిప్పని యొనర్పుము. మఱియొకటి గలదు. ఈమేఁకప్రాణములు తమయోనులందుఁ గలియును గదా! ఇఁక మిగిలినది నిశ్చేష్టమగు కేవలశరీరమని నానిశ్చయము. అటులు నిశ్చేతనమై కట్టియనాఁదగు తచ్ఛరీరమే, హింసాపరులగువారి మతమునఁ బశువనఁ దగియుండును. సకలధర్మములలో నహింసయే పరమధర్మమని పెద్దలశాసనము గదా! మీరొనర్పుపని హింసాకరము గాకుండెనేని, యది కర్తవ్యమని యూహించుచున్నారము. ఎట్టి భూతములకేని హింస చేయకుండుట మాకిష్టపడును. మేము ప్రత్యక్షమును సాధింతుముగాని, పరోక్షమును విశ్వసింపము' అని తెలిపెను. అది విని యధ్వర్యుఁడు 'ఓయతీ! నీవు భూమికిఁగల గంధగుణము నను

భవించుచున్నాఁడవు. జలమునకుఁగల రసముల నాస్వాదించుచున్నాఁడవు. జ్యోతులరూపమును జూచుచున్నాఁడవు. వాయుజములగు గుణములను స్పృశించుచున్నాఁడవు. ఆకాశజములగుశబ్దములను వినుచున్నాఁడవు. ఈభూతములనెల్లఁ బ్రాణవంతములుగాఁ దలంతువా? ప్రాణాదానమునుండి నీవు మరలితివా? నీవును హింసయందే ప్రవర్తించుచున్నాఁడవు. హింసలేనిచేష్టయే లేదు. నీ విందేమి తలంతువు?' అని పలికెను. అంత నయ్యతి, యతనిఁ గాంచి, 'ఓయీ! ఆత్మకు క్షరము, అక్షరము అని ద్వైధీభావము గలదు. అందు అక్షరము సద్భావము, క్షరము స్వభావము నై యుండును. ప్రాణములు, జిహ్వ, మనస్సు, సత్వము, సద్భావము, రజస్సు, అను వీనిచే విముక్తుఁడై నిర్ద్వంద్వుఁడై నిష్కాముఁడై సకలభూతసముఁడై నిర్మముఁడై జితాత్ముఁడై సకలత్యాగి యగువానికి దేనినుండియు భయము గలుగదు.' అని తెలిపెను. అంత నయ్యధ్వర్యుఁ డాయతితో 'ఓయీ! సజ్జనుల తోడనే సహవాసము చేయఁదగినదిగదా! నీమతమును విని నామతి ప్రతిభ నొందుచున్నది. నిన్నొకభగవానునిఁగా భావించి పలుకుచున్నాఁడను. మంత్రవిహితమగువ్రతమును జేయుటలో నాయపరాధమేమున్నది?' అని పలికెను.

'ఓసుందరీ! అందుల కాయతి మాఱుపలుక కూరకుండెను. అధ్వర్యుఁడును మోహము వీడి మహామఖమునఁ బ్రవర్తించెను. సుసూక్ష్మమగుమోక్షవిధ మిట్టిదిగా బ్రాహ్మణులు తెలియుదురు. ఈవిధము క్షేత్రజ్ఞునిచేఁ దెలిసికొని యాచరింతురు.' అని తెలిపి మఱియు నిట్లనియె.

## సముద్రకార్తవీర్యసంవాదము

'ఓనారీమణీ! ఇందుల కొకయుదాహరణముగా నొకపురాతనేతిహాసము గలదు. అది కార్తవీర్యునకు సముద్రమునకు జరిగిన సంవాదము. కార్తవీర్యార్జునుఁ డనియెడి యొకరాజు వేయిబాహువులతో వెలయుచుఁ, జతుస్సముద్రముద్రితమగు భూవలయమునెల్ల నొకవిల్లు పూని జయించెను. అతఁ డొకపుడు బలగర్వితుఁడై సముద్రప్రాంతమునఁ జరించుచు, సముద్రునిపై శరశతము గురిసెనఁట.

అపుడు సముద్రుఁడా కార్తవీర్యునిఁ జేరి నమస్కరించి చేతులమోడ్పుతోడనే 'ఓవీరాగ్రణీ! నాపై నారాచములఁ బ్రయోగింపకుము. నీయెడ నేనొనర్చినయపరాధమేమి? ఓరాజోత్తమా! నీచే విడువఁబడినసాయకశతములచే నన్నాశ్రయించుకొనియున్న భూతము లనేకము వధింపఁబడుచున్నవి. వానికి నభయ మొసంగవలయును.' అని ప్రార్థించెను. అది విని యాకార్తవీర్యార్జునుఁడు 'ఓజలనిధీ! యుద్ధమున నాకు సరియగుశరాసనధరుఁడు ధరణిఁగలఁడా? నన్ను సంగ్రామమున మార్కొనఁగల్గువాని నొక్కని నాకెఱిఁగింపుము.' అని పలికెను. అందుల కాసముద్రుఁడు 'ఓరాజా! జమదగ్ని యనుమహర్షిని నీవెఱిఁగియుందువు గదా! అతనిసుతుఁడు నీకు సంగ్రామాతిథ్యము నొసంగఁదగినవాఁడు.' అని తెలిపెను. అది విని యారాజు కోపావేశపరవశుఁడై వడిగా వెడలి, యప్పరశురామాశ్రమమును జేరి, తన పరివారముతోఁగూడ నాతనికిఁ బ్రతికూలములగు పనులొనర్చి యమ్మహాత్మున కాయాసము గలిగించెను. అటులగుట నమితతేజుఁడగు నారాముని తేజము ప్రజ్వలించి, శత్రుసైన్యములను దహించుచుండ, నతఁడు పరశువు పట్టికొని బాహుసహస్రవిరాజితుఁడగు నాకార్తవీర్యుని పెక్కుకొమ్మలుగల వృక్షమునట్లు నఱికెను. అంత నాకార్తవీర్యుఁడు హతుఁడై పతితుఁడగుటయు, నతనిబంధువులు కుపితులై యాయుధములఁ బూని, యాపరశురామునిఁ బరివేష్టించిరి. అపు డారాముఁడును ధనుష్పాణియై రథ మధిరోహించి వడిగా వందలకొలంది బాణములఁ బఱపుచు నారాజసైన్యమును బీడించెను. పిదప గొందఱు క్షత్త్రియులు పరశురామభయార్దితులై సింహపీడితములగు మృగములట్లు గిరిదుర్గముల నాశ్రయించిరి. వారటులు గిరిదుర్గముల నాశ్రయించుటచే, బ్రాహ్మణులదర్శనము లభింపమి వారిప్రజలు నిజకర్మానుష్ఠానశూన్యులై శూద్రత్వమొందిరి. అటులు వారు ద్రవిడాభీరులు, పుండ్రులు, శబరులు నై వృషలత్వ మొంది క్షత్త్రధర్మరహితులైరి. అనంతరము హతనాయకలగు క్షత్త్రియాంగనలయందు ద్విజులచే మఱిమఱియు నుత్పాదితమగుచున్న క్షత్త్రకులము నాపరశురాముఁడు ఛేదించుచువచ్చెను. అటు లిరువదొక్కమాఱు లారాముఁడు వధించుచురాఁగా, నశరీరవాణి మధుర

ముగా నాతనితో 'ఓరామా ! రామా! ఇఁక నీకృత్యమునుండి మరలుము. ఇందేమిగుణము గలదని తలంచుచున్నాఁడవు? ఈక్షత్త్రబంధువుల కిట్లు ప్రాణవియోగ మేల చేసెదు?' అని పలికెను. అటులే యాతని పితామహులగు ఋచీకప్రముఖులును, 'ఓమహాత్మా! ఇఁక నీకృత్యమునుండి మరలుము.' అని తెలిపిరి. అపుడతఁడు తనతండ్రి నొకక్షత్త్రియుఁడు వధించుటచేఁ గలిగినకోపము నాపికొనలేక, యమ్మహర్షులను గాంచి, 'ఓమహానీయులారా ! మీరు నన్నీకృత్యము నుండి నివారింపఁదగదు.' అని పలికెను. పిదపఁ బితరులు రామునితో 'ఓరామా ! నీవిటులు క్షత్త్రబంధులను వధించుట తగదు. నీవు బ్రాహ్మణుఁడవయ్యును క్షత్త్రియులను జంపుట యుక్తముకాదు.' అని తెలిపి మఱియు నిట్లనిరి.

## అలర్కేంద్రియసంవాదము

'ఓరామా! మే మొకపురాతనేతిహాస మెఱింగింతుము. దానిని విని, యాచొప్పునట్టి వర్తింపుము. మున్నొకయలర్కుఁ డనుమహాతపస్వి రాజర్షి యుండెను. అతఁడు ధర్మజ్ఞుఁడును, సత్యవాదియు, మహాత్ముఁడును, దృఢవ్రతుఁడు నై తనధనువుచే సముద్రముద్రితమగు భూవలయమునెల్ల జయించి, దుష్కరకృత్యమొనర్చి తుదకు బ్రహ్మచింతాపరుఁడై, యొకవృక్షమూలమునఁ గూరుచుండియుండ నాతని కొకయాలోచన గలిగెను. అపుడతఁడు 'నామనమునకు బలమధికమయ్యెను. దాని నిఁక జయించినఁగాని, నాకు జయము సిద్ధించినట్టిది కాదు. బాహ్యశత్రులు గాక, తక్కినశత్రు లిపుడు నన్నుఁ జుట్టికొని యున్నవారు. ఇంతకుమున్న నామనసు చపలకర్మముగాని మానవులపైఁ బ్రవర్తిల్లెను. ఇపుడు మనసుపైఁ దీక్ష్ణాగ్రములగుసాయకముల బఱపెదను.' అని నిశ్చయించెను.

మనస్సు:—ఓయలర్కా! నీ యీబాణములు నన్ను జయింపలేవు. వీనివలన నీమర్మస్థలమే నొప్పిచెందెడిని. నీవే భిన్నమర్ముఁడవయ్యెదవు. ఏబాణములచే నన్ను జయింపఁగలుగుదువో, యట్టి వేఱొకబాణములను వెదకికొనుము' అని తెలుప నతఁడు కొంత చింతించి పిమ్మట నిట్లు పలికెను.

అలర్కుఁడు:—నాఘ్రాణము పెక్కుగంధములను మూర్కొని, మఱియు వానినే కోరుచుండును. కావున నేనిపుడు నాతీవ్రములగు సాయకము లాఘ్రాణముపైఁ బ్రయోగించెదను.

ఘ్రాణము:—'ఓయలర్కా! నీ యీసాయకములు నన్నేమియుఁ జేయఁజాలవు. అయ్యవి నీమర్మమునే భేదింప, నీవే భిన్నమర్ముఁడ వగుదువు. వేనిచే నన్నడంపఁగలవో యట్టిశరముల సంగ్రహింప సమకట్టుము.' అని తెలుప, నతఁడు కొంతవడిఁ జింతించి మఱియు నిట్లనియె.

అలర్కుఁడు:—ఈ నాజిహ్వ రుచిగలరసముల ననుభవించి మఱియు వానినే యాశించుచుండును. కావున జిహ్వపై శితాగ్రములగు శరశతముల సంధించెదను.

జిహ్వ:—'ఓయీ! నీ యీకోలలు నన్నుఁ దూలింపఁజాలవు. అవి నీమర్మమునే భేదించును. దానిచే నీవే భిన్నమర్ముఁడ వౌదువు. వేఱుసాయకముల వెదకికొనుము.' అని పలుక నతఁ డించుక చింతించి యిట్లు పలికెను.

అలర్కుఁడు:—ఆహా! ఈ నాత్వక్కు వివిధములగు సుఖస్పర్శముల ననుభవించినకొలఁదిని వానినే కోరుచుండును. కావున నిఁకఁ గఠినములగు కంకపత్రములచే దీనిని భేదించెదను.

త్వక్కు:—'ఓయలర్కా! నీ యీసాయకములు నన్ను సమయింపఁజాలవు. వానిచే నీమర్మమే భిన్నమై నీవే భిన్నమర్ముఁడ వయ్యెదు. కావున నన్ను భిన్నముగావింపఁ దగుశరములఁ బరికించి కొనుము' అని పలుక విని యించుక చింతించి యతఁ డిట్లనియె.

అలర్కుఁడు:—నా యీశ్రోత్రము వివిధశబ్దముల వినియు, మఱియు వానినే కోరుచుండును. అటులగుట నిపుడు శ్రోత్రమును నాతీవ్రసాయకములచేఁ గొట్టఁ బ్రయత్నించెదను.

శ్రోత్రము:—'ఓయీ ! నీ యీబాణములు నన్ను సాధింపఁ జాలవు. దీనిచే నీమర్మమే భిన్నమై నీవే జీవితమును విడువవలసి వచ్చును. కావున నన్ను సాధింపఁగలుగుసాయకాంతరముల సంగ్రహించుకొనుము' అని తెలుప నతఁడు కొంత చింతించి యిట్లు పలికెను.

అలర్కుఁడు:—నా యీచక్షువు పెక్కుసారులు రూపమును బరికించియు, మఱియు దానినే చూడఁగోరును. కావున నాతీవ్ర సాయకములచే సాధించెదను.

చక్షువు:—'ఓయలర్కా! నీ వీసాయకములచే నన్ను జయింపఁ జాలవు. అయ్యవి నిన్ను భిన్నమర్మునిఁ గావించి నీకే హానివాటిల్లఁ జేసెడిని కావున నన్ను నిగ్రహింపఁదగు వేఱువిశిఖముల వెదకి కొనుము' అని తెలుప నతఁ డించుక చూచి యిట్లనియె.

అలర్కుఁడు:—ఈబుద్ధినిష్ఠ బహువిధముగా నున్నది. ఇది ప్రజ్ఞతో నుండును. కావున బుద్ధిని గుఱిచేసి తీవ్రసాయకములఁ బ్రయోగించెదను.

బుద్ధి:—'ఓయీ! ఈ నీబాణములు నాకు హాని గలిగింపలేవు. ఈ నీప్రహారముచే నీవే భిన్నమర్మునఁడవై చెడుదువు. కావున నన్ను జయింపఁదగు సాయకాంతరముల సంగ్రహింపు'మని తెలుపుటయు నతఁ డేమియుఁ జేయలేకుండెను.

ఓబ్రాహ్మణీ! అంత నయ్యలర్కుఁడు దుష్కరమై ఘోరమైన తపమూని యాచరించియు, నయ్యేడిటిని జయింపఁజాలుసాయకము సంపాదింపలేకుండెను. అటులగుట నయ్యలర్కుఁడు మఱియు నిశ్చల మానసుఁడై చిరకాల మాలోచించి చూడఁగా నాతనికి వానిని జయింప యోగమును మించిన దొక్కటి గానరాకుండెను. అంత నతఁడు మనస్సు నేకాగ్రముగా నొనర్చి నిశ్చలుఁడై యోగ మాశ్ర యించి, యొకబాణముచేతనే యింద్రియములను జయించెను. అతఁ డట్లు యోగముచే నాత్మ నాశ్రయించి యుత్తమగతి నొందెను. అందుల కారాజర్షి విస్మితుఁడై యీగాథ నెఱిఁగించెను. వినుము 'ఆహా! నేనెంత బాహ్యప్రయత్న మొనర్చి యెంతకష్ట మొందితిని? భోగతృష్ణాసమాయుక్తులకుగు మాచే రాజ్యము సేవింపఁబడియెను. పిదప నా కెఱుక గలిగెను. ఈయోగమునఁ గల్గుసుఖమును మించిన సుఖము వేఱొకటి లేదు.' అని.

ఓరామా! నీవు దీని నంగీకరింపుము. క్షత్త్రియుల నిఁక వధింప కుము.' అని పితరులు తెలుప విని యప్పరశురాముఁడును ఘోర

మగుతపోవిధి నాశ్రయించి, యనన్యదుర్లభమగు సిద్ధిని బొందెను'. అని తెలిపి బ్రాహ్మణుడు మఱియు నిట్లనియె

### గుణకథనము

'ఓ బ్రాహ్మణీ! మఱియు నొకటి తెలిపెదను వినుము. మూడువు వైరులును గుణములనుబట్టి తొమ్మండ్రుగాఁ దెలుపఁబడుదురు. ప్రహర్షము, ప్రీతి, ఆనందము అనియెడిమూఁడును సాత్త్వికగుణములు. తృష్ణ, క్రోధము, అసూయాభినివేశము అనియెడిమూఁడును రాజసగుణములు. శ్రమము, మాంద్యము, మోహము అను నీమూఁడును దామసగుణములు. ధైర్యశాలియగు యతిఁ డుత్సాహముడర మున్నుగాఁ దనసాయకసంఘములచే వీనిని ఛేదించి, పిదప శాంతాత్ముఁడును, జితేంద్రియుఁడు నై తక్కినవానిని జయింప నుత్సహించును. ఈవిషయమునఁ గల్పవేత్తలగువారు కొన్నిగాథలను దెలుపుచున్నారు. మున్ను శాంతిపరుఁడగు నంబరీషుఁ డొకగాథను దెలిపెను. ఉద్రిక్తములగు దోషములవిధము తెలియఁబడినతోడనే యతఁ డిది తెలిపెను. మహాయశుఁడగు నంబరీషుఁడు రాజ్యమును బరిగ్రహించి, పిదపఁ దనదోషములను నిగ్రహించి, సాధువులగువారి నాదరించుచు గొప్పసిద్ధి వడసి, యీగాథను బఠించెను. 'నాచే దోషములన్నియు జయింపఁబడినవి. సకలశత్రువులును నిహతులైరి కాని యొకగొప్పదోషము గలదు. అది వధింపఁదగినదియే. అయినను నది నాచే హతము గాలేదు. దేనిప్రేరణచే జంతువు తృష్ణారాహిత్య మొందలేక, దప్పిగొన్నప్రాణి నిమ్నస్థలములకుఁ బరువిడునట్లు నీచకార్యములకుఁ బరువులిడునో, దేనిచే మానవుఁ డెట్టికార్యము చేయుటకును వెనుదీయఁడో, యట్టి లోభమును వాఁడిగలకత్తులచే ఖండింపుఁడు. ఖండింపుఁడు. లోభమువల్లనే తృష్ణ జనించుచున్నది. తన్మూలమునఁ జింత పొడమును. అట్టి లోభగుణముగలవాఁడు రాజసగుణముల నధికముగా నొందును. అవి యలవడినతోడనే తామసగుణము లధికముగాఁ జేరును. అట్టి గుణములచే సంహతదేహబంధనుఁడై మఱిమఱియు జనించును. కర్మమొనర్చుటకే తలంచును. ఆజన్మము నశింపగనే విశీర్ణదేహుఁడై మృతినొంది మఱియు జన్మించుచుండును. కావున నాలోభగుణమును జక్కఁగాఁ

దెలిసికొని, ధైర్యముచే దానిని నిగ్రహించి రాజ్యమును గోరవల యును. ఇదియే గొప్పరాజ్యము. దీనిని మించినరాజ్య మొక్కటి లేదు. ఆత్మయే రాజు' అని లోభమును ఛేదించుచు రాజ్యమును బరిగ్రహించిన యంబరీషునిగీతమును వింటివిగదా!' అని తెలిపి మఱియు నాబ్రాహ్మణుఁ డిట్లనియె.

## బ్రాహ్మణజనకసంవాదము

'ఓబ్రాహ్మణీ ! ఈవిషయమున నొకపురాతనేతిహాసము గలదు. అయ్యది యొకబ్రాహ్మణునకును జనకునకును జరిగినసంవాదము. దానిం దెలిపెద నాకర్ణింపుము. ఒకప్పుడు జనకుఁ డొకయపరాధమును జేసి క్షీణగతికైయున్న యొకబ్రాహ్మణునిఁ గాంచి, 'ఓబ్రాహ్మణా! నీవు నా దేశమున నుండఁదగదు' అని శాసించువాఁడై పలికెను. అది విని యాబ్రాహ్మణుఁడు జనకునిఁ గని, 'ఓరాజా ! నీవశముననున్న విషయ మెంతయో తెలుపుము. అటు లెఱింగింతువేని నేను నీవిషయమును విడిచి వేఱొకరాజుదేశమున నివసింపఁ బోయెదను. శాస్త్రము నతిక్రమింపక నీసెలవుచొప్పున వర్తించెదను' అని పలుకుటయు, నాజనక మహారాజు మఱిమఱియు వేఁడినిట్టూర్పులు నిగుడ్చుచు, మాఱుమాట లేక యూరకుండి యేదో ధ్యానించుచుండెను. అమితతేజుఁడగునాతఁ డటులు ధ్యానించుచుఁ గూరుచుండ, సూర్యుని గ్రహామట్టు లాజనకుని మోహ మావేశించెను. అటు లతఁడు కొంతవడి మోహావిష్టుఁడై యుంచుక యూఱడిల్లి పిమ్మట రెండుగడియలు గడవ నాబ్రాహ్మణునిఁ గాంచి, 'ఓ ద్విజుఁడా ! నాకు రాజ్యము పితృపైతామహముగాఁ బ్రాప్తించి, దేశము వశమైయున్నను విషయ మెద్దియో తెలియలేదు. పృథివినెల్లఁ బరిశీలించితిని. అందును నావిషయము నాకుఁ దెలియ లేదు. మిథిల వెదకఁబడియెను. అందును నాకుఁ దెలియలేదు. నా ప్రజయుఁ బరిశీలింపఁబడియెను. అందును నావిషయము గానరాలేదు. అపుడు నాకు మోహము గలిగెను. అమ్మూర్ఛతీరినతోడనే మఱియు మతిగలుగ నప్పటికి నావిషయ మేదియు నాకగపడలేదు. సకలవిషయము నాదిగాదు. దేహము నాదిగాదు. పృథివియు నాదిగాదు. అయ్యవి నా కెట్టివియో యన్యులకు నట్టివ యని యూహించెదను. కావున నీవుత్సాహముకొలఁదిగా నుండవచ్చును; నీయిచ్చవచ్చినట్లు భుజింపవచ్చును,

ఇఁక నిన్ను నే నేమియు ననను' అని తెలిపెను. అది విని యా బ్రాహ్మణుఁడు 'ఓజనకరాజా! నీకు రాజ్యము పితృపైతామహమై ప్రాప్తించి జనపదము వశమైయుండఁగా, నీవేమిగతి నూని దీనిపై మమత విడిచితివి? సకలవిషయము నీదైయుండఁగా, నేమిబుద్ధి నాశ్రయించి దీనిని నీవిషయముగా భావింపవు?' అని యడిగెను. అందుల కాజనకుఁడు 'ఓబ్రాహ్మణోత్తమా! సకలకర్మములందును గలగ్గైహికావస్థలన్నియు నాశముగలవిగానే నెఱిఁగితిని. అటులగుట నేను దేనిని నాదిగా భావింపలేదు. 'ఇది యెవ్వనిది? ఈధన మెవ్వనిది? అవి యెవ్వనివినిగావు.' అని వేదవచనము గలదు. అటులగుట బుద్ధిచేఁ దెలిసికొని యేదియు నాదిగాదని తలంచుచున్నాఁడను. ఇట్టిబుద్ధి నాశ్రయించియే మమతను బరిత్యజించితిని. నేనెట్టిబుద్ధిని బూని సకలవిషయములందును మమత పరిత్యజించితినో వినుము. ఘ్రాణగతములగు గంధములను సైతము నావని నే కోరుటలేదు. అటులగుట భూమియెల్ల జయింపఁబడి నా వశముగ నిత్యము విడువకున్నది. రసములు నానాలుకపైఁ జరించుచున్నను, వానిని నాకుఁగా భావింపను. అటులగుట నుదకములు జయింపఁబడి నాకు వశమయ్యెను. రూపము నాకనులకు గోచరమైనను దానిని నాత్మార్థ ముపయోగింపను. అటులగుట నాకుఁ దేజము వశమైనది. నామేనఁ దాఁకినస్పర్శములనేని యాత్మార్థమని భావింపను. అటులగుట వాయువు నాకు వశమై యున్నది. అటులే శ్రోత్రగతములైనను శబ్దములను నాత్మార్థముగాఁ దలంపను. అటులగుట శబ్దములన్నియు నాకు వశమై యున్నయవి. మనస్సంకల్పము లెవ్వియు నావిగా భావింపను. అటులగుట మనసు జయింపఁబడియెను. నాయారంభములెల్లఁ బితృదేవతలకును, దేవతలకును, నతిథులకును మఱియుఁ గలభూతములకును జరపఁబడుచున్నవి.' అని పలికెను. పిమ్మట నా బ్రాహ్మణుఁడు నవ్వి జనకునితో 'ఓరాజా! ఈ నీమనోధర్మమును దెలిసికొనవచ్చినయమునిఁగా నన్నుఁ దెలిసికొనుము. బ్రహ్మలాభహేతుకమై, దుర్వారమై, నివృత్తిరహితమైన సత్వనేమి నిరుద్ధచక్రమునకీవొక్కఁడవే ప్రవర్తకుఁడవు.' అని పలికెనని తెలిపి మఱియు నా బ్రాహ్మణుఁ డిట్లనియె.

### బ్రాహ్మణోపదేశము

'ఓపతివ్రతా! నీవు నిజబుద్ధినిబట్టి నన్నెట్టులు భయపెట్టుచున్న దానవో, యట్టులు నే నీలోకమునఁ బ్రవర్తింపలేదు. నేను విప్రుఁడను, ముక్తుఁడను, వనేచరుఁడను, గృహస్థధర్ముఁడను, వ్రతనిష్ఠుఁడను నగుచున్నాఁడను. నీవు శుభాశుభములఁగూర్చి నన్నుఁ దలంచుచున్నట్టు లేను బ్రవర్తింపలేదు. లోకగతమగుదానినెల్ల నేను వ్యాపించియుంటిని. లోకమునఁగల జంగమస్థావరముల కన్నిటికిని, దారువుల కగ్ని యట్టులు, నన్నంతకరునిఁగాఁ దెలియుము. పుడమియందును, త్రివిష్టపమందును గలరాజ్యము నా యీబుద్ధియే. ఇదియే సాధనము. బ్రహ్మవేత్తలు దేని ననుసరించి పోవుదురో, యది యొక్కటియే బ్రాహ్మణులకు మార్గము. బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, యత్యాశ్రమము అనియెడి వేఱువేఱుచిహ్నములచే నిట్టి బుద్ధియే సేవింపఁబడుచున్నది. నానాలింగాశ్రమస్థులగు నెవ్వరిబుద్ధి శమప్రధానమై ప్రవర్తిల్లునో, వారు సరిత్తులు సాగరమునట్టు లేకభావ మొందుచున్నారు. ఈమార్గము బుద్ధిచే నొందఁబడుచుండును గాని శరీరముచే నొందఁబడదు. కర్మము లాద్యంతములు గలవి. శరీరము కర్మబంధనమై ప్రవర్తిల్లును. ఓసుందరీ! అటులగుట నాకుఁ బరలోకకృతమగుభయము లేదు. నీవును దద్భావభావనిరతవై నా యాత్మనే పొందుదువు' అని తెలుప విని యాబ్రాహ్మణి యిట్లనియె.

### బ్రాహ్మణదంపతులసంవాదము

'ఓమహనీయా! నీవు తెలిపిన దల్పాత్ములకును, నకృతాత్ములకును దెలియ వలనుపడదు. ఇది యనేకముగను, నల్పముగను, సంక్షిప్తముగను, విస్తారముగను గన్పట్టుచున్నది. కావున, నాకు సన్మతి యెట్లు గలుగునో యట్టియుపాయము నెఱిఁగింపుము. దేనివలన నిట్టిమతి గలుగుచున్నదో, యట్టికర్మమే కారణమని తలంచుచున్న దానను.'

అది విని యాబ్రాహ్మణుఁడు, 'ఓసుందరీ! బుద్ధియే యొకయరణి. దీనికి గురు వుత్తరారణి. ఇందులకుఁ దపశ్శ్రుతము లభిమథిని. దాని నుండి జ్ఞానాగ్ని జనించుచున్నది.' అని తెలిపెను.

బ్రాహ్మణి:—ఇది క్షేత్రజ్ఞసంజ్ఞగలబ్రహ్మకు చిహ్నము. దేనిచే నేది నిగ్రహింపఁబడునో, దానిలక్షణ మేది ?

బ్రాహ్మణుఁడు:—లింగశూన్యుఁడును, గుణరహితుఁడగు వీనికిఁ గారణము గానరాదు. దానిచే నతఁడు గ్రహింపఁబడునో లేదో గాని యొకయుపాయ మెఱిఁగించెదను. మంచియుపాయము లభించెను. భ్రమరములచేఁ గాంచఁబడకున్నను సురభి లభించునట్లు శ్రవణాద్యుపాయములచే నది తెలియఁబడును. కర్మబుద్ధి, బుద్ధిగాకుండుటను నిది జ్ఞానచిహ్నముల నాశ్రయించియున్నది. మోక్షమార్గములం దిది కర్తవ్యము, ఇది కాదు, అని యుపదేశింపఁబడదు. మాయావిద్యాదిరూపములును, శబ్దాదులునగు నవ్యక్తవ్యక్తాంశములను వందలకొలందిగా శక్యమగునంతకుఁ గల్పించుకొనవలయును. అటులు నానార్థయుక్తములును, ప్రత్యక్షహేతుకములు నగువానిని గల్పించుకొని పిదప దేనికంటె భిన్నమైన దొండు లేకుండెనో యట్టిదానిని దెలియ నభ్యసింపనగును.' అని తెలిపె"నని చెప్పి వాసుదేవుఁడు "పార్థా! ఆబ్రాహ్మణికి బ్రహ్మమును మించినవస్తువు లేదని తెలియఁగనే, జీవపరమాత్మైకబుద్ధి జనించెను. క్షేత్రజ్ఞునిఁ దెలిసికొనిమ్మటఁ దత్పరవస్తువు తెలియఁబడుచున్నది." అని తెలిపెను. అది విని యప్పార్థుఁడు "వాసుదేవా! ఎవ్వరిట్టిసిద్ధి నొందిరో యట్టి బ్రాహ్మణదంపతు లెక్కడ? నా కెఱిఁగింపుము." అని యడిగెను. అది విని యాభగవానుఁడు "అర్జునా! నామనము నే బ్రాహ్మణునిఁగను, బుద్ధిని బ్రాహ్మణిఁగను దెలియుము. క్షేత్రజ్ఞవాచ్యుఁడను నేనే యని తెలియుము." అని తెలుప విని యర్జును డిట్లనియె.

## గురుశిష్యసంవాదము

"ఓవాసుదేవా! తెలియఁదగిన యేపరమబ్రహ్మముగలదో, దాని విధము నాకెఱిఁగింపుము. నీయనుగ్రహముచే, సూక్ష్మునియందు నాబుద్ధి ప్రసరించుచున్నది."

అది విని యాభగవానుఁడు "ఓయర్జునా! నీవడిగిన యర్థమున కుదాహరణముగా నొకపురాతనేతిహాసము గలదు. మోక్షసంయుక్తమగు, నది గురుశిష్యులకు జరగినసంవాదము. దాని నెఱిఁగించెద వినుము. శంసితవ్రతుఁడు, నాచార్యుఁడు, నగుబ్రాహ్మణుఁ డొక్కఁ డొకప్పుడు గూరుచుండియుండఁగా, శిష్యుఁ డొకఁ డాతని సమీపించి, 'ఓదేవా! శ్రేయ మెద్దియో తెలుపుము. నిశ్శ్రేయస

పరాయణుఁడనై నేను నిన్నాశ్రయించితిని. నిన్ను యాచించి నమ్రుఁడనై పలుకుచున్నాఁడను. న న్ననుగ్రహింపుము,' అని ప్రార్థించెను. ఓపార్థా! అటులు పలుకుచున్న శిష్యునిఁ గాంచి, గురువు 'ఓవత్సా! నీ కేయేవిషయమున సంశయము గలదో యదియెల్లఁ దెలిపెదను.' అని తెలిపెను. ఓయర్జునా? గురుభక్తిగల యాశిష్యుఁడు ప్రాంజలియై యేమి ప్రశ్నించెనో తెలిపెద వినుము.

శిష్యుఁడు:—'నే నెందలివాఁడను? నీ వెచ్చటివాఁడవు? ఏది పరమై సత్యమైనదో దాని నెఱిఁగింపుము. మఱియు జంగమస్థావరములగుభూతము లెచ్చోటినుండి జనించినవి? భూతములు దేనిచే జీవించుచున్నవి? వానియాయువు పర్యవసాన మెట్టిది? సత్యమన నెట్టిది? తపమన నెట్టిది? సజ్జనులచే నెన్నఁబడినగుణము లెవ్వి? ఏమార్గములు శుభప్రదములు? సుఖమన నెట్టిది? దుష్కృతమన నెట్టిది? ఓమహానీయా! నా యీప్రశ్నములకు యథార్థముగా సమాధాన మెఱిఁగింపుము. నీవు దక్కఁ దక్కినవా రెవ్వరు నీప్రశ్నముల కుత్తర మొసంగలేరు. ఓధర్మజ్ఞా! నా కీవిషయములను వినఁ గుతూహల మెంతయుఁ బొడముచున్నది. నీవు మోక్షధర్మార్థకుశలుఁడవని ప్రఖ్యాతినొందితివి. సకల సంశయసంఛేత్తవగుట నీవే యీ నాసందియమును దీర్పుము. మేము సంసారభీరువులమై ముక్తిగోరుచున్నవారము' అని ప్రశ్నించెను.

ఓయర్జునా! భక్తిశాలియు, గుణవంతుఁడును, శాంతుఁడు, దాంతుఁడు, ఛాయాభూతుఁడును, యతియు, బ్రహ్మచారియు నైయాశిష్యుఁడట్లు విధ్యుక్తముగాఁ బ్రశ్నించుటయు,ధృతవ్రతుఁడగు నయ్యాచార్యుఁడు, సకలప్రశ్నములకును సదుత్తర మొసంగువాఁడై 'ఓయీ!ఋషిప్రవరసేవితమై తత్త్వభూతార్థభావన మగునిది, వేదవిద్య నాశ్రయించి బ్రహ్మచేఁ దెలుపఁబడినది. బ్రహ్మవిషయజ్ఞాన ముత్తమము. అటులే ఫలాభిసంధిరహితమగుతపము నుత్తమమే యగుచున్నది. ఎవ్వఁడు నిశ్చయముగా నిరాబాధమగుజ్ఞానయాథార్థ్యమును, సకలభూతాంతర్గతమగు నాత్మనుగాఁ దెలిసికొనునో, వాఁడు సర్వగతి యనఁ బరఁగుచున్నాఁడు. ఎవ్వఁడు చిజ్జడములకు లోలీభావమును, వానిపృథక్త్వమును, నటులే జీవేశ్వరులయేకత్వమును, వ్యావహారికమగు నానాత్వ

మును దెలిసికొనునో, వాఁడు దుఃఖవిముక్తుఁ డగుచున్నాఁడు. ఎవ్వఁడించుకయుఁ గోరక, యేమియుఁ దలంపక యుండునో, యట్టివాఁ డీలోకముననే బ్రహ్మభూయమున కగుచున్నాఁడు. అటులే ప్రధాన గుణతత్త్వజ్ఞుఁడును, సకలభూతవిధానవేత్తయు, నిర్మముఁడును, నిరహంకారుఁడును నై యెవఁడు ప్రవర్తిల్లునో, వాఁడు ముక్తుఁడగుటలో సందియము లేదు. మఱియు నొకటి వినుము. అవ్యక్తమనెడి బీజమునుండి ప్రభవమై, బుద్ధియె స్కంధముగా మహాహంకారమె శాఖలై వెలయ నింద్రియాంకురములె కోటరములుగా, విశేషప్రతిశాఖలొప్పారి సంతతము, పర్ణములు, పుష్పములు, ఫలములు గలిగి సకల భూతములకు జీవనాధారమై బ్రహ్మబీజమగు మహావృక్షము విధము తెలియవలయును. ఈతత్త్వములను దెలిసికొని జ్ఞానాసిచే నఱికి, యమరత్వమొందినవాఁడు జననమరణములకు లోనుగానేరఁడు. భూతభవ్యభవిష్యాదియు, ధర్మకామార్థనిశ్చయకరమును సిద్ధసంఘపరిజ్ఞాతమైనదియు సనాతనమునగు పురాకల్పము నెఱిఁగించెదను. అదియు నీకుత్తమపదము. దానిని దెలిసికొని సిద్ధిఁబడసినవారు ప్రాజ్ఞులగుచున్నారు. మున్నొకపుడు మహర్షులకు జిజ్ఞాస గలిగెను. అపుడు ప్రజాపతి భరద్వాజులును, గౌతముఁడు, భార్గవుఁడు, వసిష్ఠుఁడు, కాశ్యప విశ్వామిత్రులు, నత్రియుఁ బెక్కుకర్మములచే బహుమార్గములఁ బరిభ్రమించి, పరిశ్రాంతులై వృద్ధుఁడగు నాంగిరసమహర్షిని బురస్కరించుకొని, వీతకల్మషుఁడగు పితామహుని దర్శింపఁబోయిరి. అంత నప్పరమేష్ఠి, వారికి దర్శన మొసంగెను. అపుడు వారాతనికిఁ బ్రణమిల్లి యతఁడు సుఖాసీనుఁడై యుండఁగా, సవినయముగాఁ దమకు శ్రేయమెయ్యది యని ప్రశ్నించువారై 'ఓమహనీయా! కర్మము నెట్లు లెస్సగాఁ జేయవలయును? కిల్బిషమునుండి ముక్తుఁ డగుటెట్లు? మామార్గము లెట్లు శుభప్రదములగును? రెండుకర్మమార్గము లెవ్వి? అవి దక్షిణోత్తరము లగుటెట్లు? భూతముల ప్రభవాప్యయములవిధ మెట్టిది?' అని ప్రశ్నించిరి. అపుడు వారి కప్పితామహుఁడు తెలిపిన విధము నీకు నే నిపు డెఱిఁగించెదను వినుము.

బ్రహ్మ:—'సత్యమునుండి జంగమస్థావరభూతములు జనించెను. అయ్యవి కర్మముచే జీవించుచున్నవని తెలియుఁడు. అయ్యవి బ్రహ్మ

ధ్యానభ్రష్టములై కర్మముచే బ్రవర్తిల్లుచుండును. బ్రహ్మమే గుణసం యుక్తమై పంచలక్షణమగును. బ్రహ్మమునకే సత్యము,తపము,ప్రజాపతి యనెడి నామములు ప్రవర్తిల్లుచున్నవి. బ్రహ్మమునుండియే భూతములు ప్రభవించును. ఈజగము బ్రహ్మమే. కావున బ్రహ్మాశ్రయులే విప్రులు. నిత్యయోగపరాయణులై యతీతక్రోధసంతాపులై వారు ధర్మసేతువు లనఁబడుదురు. అన్యోన్యనియతులును, బ్రాజ్ఞులును, ధర్మసేతుప్రవర్త కులును, శాశ్వతులును, లోకభావనులునగు వారిని దెలిపెదను. ధర్మార్థకామమోక్షములను గూర్చిన నాల్గువిద్యలును బ్రతివర్ణముఁ బ్రత్యాశ్రమముఁ గుఱించి వేఱువేఱుగా నుండును. నిత్యము నేక రూపమునగు ధర్మము నాలుగుపాదములుగా నుండునని తెలుపుదురు. ఓద్విజులారా! క్షేమంకరమగుమార్గమును మీకు కెఱిఁగించెదను. మున్ను విద్వాంసులగువారు నియతముగా బ్రహ్మభూయమున కరిగెడివారు. వారు నడిచినమార్గమే నాచే నిపు డెఱిఁగింపఁబడును. ఉత్తమమై దుర్విదమగునద్దానిని దెలిసికొనుఁడు. బ్రహ్మచర్యాశ్ర మము తొలుతటిది. రెండవది గార్హస్థ్యము. తరువాతిది వాన ప్రస్థము. పిమ్మటిదగునాల్గవది యధ్యాత్మపదమని తెలియుఁడు. జ్యోతియు, నాకసము, ఆదిత్యుఁడు, వాయువు, ఇంద్రుఁడు మున్నగువిశ్వమును జూచునంతకును నధ్యాత్మము లభింపదు. కావున ముందుగా దాని కుపాయము దెలిపెదను, తెలియుఁడు. ఫలమూలానిలముల భుజిం చుచు మునులై వనమున వసించుమూఁడగు ద్విజాతులకును వాన ప్రస్థము విధ్యుక్తమగుచున్నది. సకలవర్ణములవారికిని గార్హస్థ్యము విధింపఁబడుచున్నది. శ్రద్ధారూపధర్మమే ధర్మమని పండితులు తెలుపు చున్నారు. ఇట్టివే దేవయానములగు మార్గములని తెలుపఁబడినవి. వీనిని దెలియుఁడు. ధర్మసేతువులగు నీమార్గములు సజ్జనులచే నాశ్ర యింపఁబడినవి. వీనిలో నొక్కొకదానిని వేఱువేఱుగా నాశ్రయించిన వాఁడు కాలక్రమమునఁ జిత్తశుద్ధి వడసి భూతములప్రభవాప్యయ ములఁ దెలిసికొనఁగల్గుచున్నాఁడు. ఇఁక నాకు బుద్ధిగోచరములై భాగ ములుగా నేర్పడినతత్త్వములను యుక్తిపురస్సరముగాఁ దెలిపెదను. మహత్తు, అవ్యక్తము, అహంకారము, పదునొకొండింద్రియములు, పంచభూతములు, వానివిశేషగుణములగుశబ్దాదులు అనువానిచే

సనాతనసృష్టి యగుచున్నది. తత్త్వము లిరువదినాలుగుగాఁ దెలుపఁ బడుచున్నవి. సకలతత్త్వముల ప్రభవాప్యయముల నెవ్వఁడు తెలిసికొనునో, వాఁడు సకలభూతములందును మోహమునొందనివాఁ డగుచున్నాఁడు ఈతత్త్వములను, గుణములను, నఖిలదేవతలను నెవ్వఁడు తెలిసికొనునో, వాఁడు నిష్కల్మషుఁడై బంధవిముక్తినొంది సర్వాత్మతారూపసుఖ మొందఁగలుగుచున్నాఁడు.' అని తెలిపి యప్పరమేష్ఠి మఱియు నిట్లనియె.

### పరమేష్ఠియుపదేశప్రకారము

'ఓమహర్షులారా! సామ్యము గలిగి యుద్రిక్తముగాని, గుణత్రయమే యవ్యక్తము. అయ్యది సకలకార్యవ్యాపియు, నాశరహితమైనదియు, స్థిరమైనదియు నై వెలయును. అదియే యుద్రిక్తమైనపుడు, పంచభూతములై నవద్వారపురమగును. పంచేంద్రియములు, తన్మాత్రలు, మనస్సును గలిసినపదునొకొండును బుద్ధిస్వామికములుగా నొకపురమునఁబడును. చిత్తమున నేయవి మూఁడుప్రవాహములై ప్రసరించుచుండునో, యట్టి ప్రనాడులు మూఁడును గుణాత్మకములై ప్రవర్తిల్లుచుండును. సత్త్వము, రజము, తమము అనియెడుగుణములు మూఁడుగాఁ దెలుపఁబడుచున్నవి. అవి పరస్పరసంబంధముఁగలవియు నై వెలయుచు నొకదానికొకటి జీవికరమై యుండును. మఱియు నవి యన్యోన్యాశ్రయములు, నన్యోన్యానువర్తనములు, నన్యోన్యవ్యతిషక్తములు నై వెలయును. పంచభూతములును త్రిగుణాత్మకములై యొప్పును. సత్త్వము తమోమిథునము, రజము సత్త్వమిథునము, సత్త్వము రజోమిథునము, తమము సత్త్వమిథునము. ఎందుఁ దమము తిరోహితము చేయఁబడునో యందు రజము ప్రవర్తిల్లుచుండును. రజ మెచ్చట దిరోహితము గావింపఁబడునో, యచ్చోట సత్త్వము ప్రవర్తిల్లుచుండును. తమము నైశాత్మకమని తెలియవలయును. తమ మధర్మలక్షణమై పాపకర్మములందుఁ బ్రవర్తిల్లఁజేయును. రజస్సు ప్రకృత్యాత్మకమై సకలభూతోత్పత్తిలక్షణమై ప్రవర్తిల్లును. సకలభూతప్రకాశమైన ధర్మజ్ఞానము శ్రద్ధయు సాత్త్వికరూపములు. తత్త్వహేతువులచే నీనిగుణములను సమాసవ్యాసరూపముగఁ దెలిపెదను వినుఁడు.

సంమోహము, అజ్ఞానము, త్యాగశూన్యత, కర్మనిర్ణయాభావము, నిద్రా స్తంభ భయ లోభములు, సుకృతదూషణము, స్మృతిరాహిత్యము, విపాకశూన్యత, నాస్తిక్యము, భిన్నవృత్తి, నిర్విశేషత్వము, అంధత్వము, నీచగుణప్రవృత్తి, యకృతమునఁ గృతబుద్ధి చేయుటయు, జ్ఞానము లేకుండియు జ్ఞానమున్నదనుకొనుటయు, మైత్రి లేకుండుటయు, అశ్రద్ధయు, మూఢభావన, యనార్జవము, అజ్ఞత, గురుత్వము, స్త్రైణ్యము, ఇంద్రియనిగ్రహరాహిత్యము, నీచగతి, మున్నగునవి తామసగుణములని చెప్పఁబడుచున్నవి. మఱియు విధిదూరములై లోకమునఁ బ్రవర్తిల్లుచు నందందు నియమింపఁబడునవియుఁ దామసము లనఁబడుచున్నవి. మఱియు నిత్యమును బరివాదమొనర్చుటయు, దేవబ్రాహ్మణనిందయు, నత్యాగము, అభిమానము, మోహము, మన్యువు, అక్షమ, భూతమాత్సర్యము అనునవి తామసవృత్తము లనఁబడును. మఱియు వృథారంభములును, వృథాదానములును, వృథాభక్షణము అనునవియుఁ దామసవృత్తములే యగుచున్నవి. అతివాదము, అశాంతి, మాత్సర్యము, అభిమానము, శ్రద్ధారాహిత్యము అనునవియుఁ దామసవృత్తములే యనఁబడును. లోకమున నిట్టిధర్మములు గలపాపకర్ములు, భిన్నమర్యాదులై ప్రవర్తిల్లుచుందురు. వారును దామసు లనఁబడుదురు. పాపకర్ములగునట్టివారికి నియతముగా సంభవించుయోనుల నెఱిఁగించెదను. అవాఙ్నిరయభావులును, దిర్యగ్నిరయగతులునగు నట్టిపాపులు స్థావరభూతములును, బశువులును, వాహనములును నగుదురు. మఱియుఁ గ్రవ్యాదములగు దందశూకములు, కృమికీటకములు, విహంగములు, సర్పములు, చతుష్పదములు నగుదురు. మానవులలో నున్మత్తులు, బధిరులు, మూగలు, పాపరోగులునై తమోమగ్నులై దుర్వృత్తులై నిజకర్మకృతలక్షణులై యధోగమనార్హులగుదురు. ఇఁక నట్టితామసు లుత్తమగతి నొందువిధమును వారికిఁ బుణ్యావిర్భావమగువిధమును వారు పుణ్యకర్ములై పుణ్యలోకముల నొందువిధమును దెలిపెదను. తిర్యక్స్థావరాదియోనిప్రాప్తులగు తామసులు స్వకర్మనిరతులును శుభాకాంక్షులునగు బ్రాహ్మణుల యగ్నిహోత్రాదికర్మములలో హింసింపఁబడి, తత్సంస్కారముచే నాయజ్వల లోకముల నొందుదురు. అటులు సంస్కరింపఁబడినపశ్వాదులు స్వర్గ

మున దేవతలతో సుఖమొందునని వేదము చెప్పుచున్నది. 'తిర్యక్స్థావరాదియోనిగతములగుభూతము లుత్తమకర్మములందు హింసింపఁబడి పునరావృత్తిధర్ములైన మానవులుగా జనించును. పాపయోనిప్రాప్తులగు చండాలమూకప్రభృతులు క్రమక్రమముగా నుత్తరోత్తరవర్ణముల నుద్భవింతురు.' అని శ్రుతియభిప్రాయము. కామమూలం దాసక్తియే మహామోహ మనఁబడుచున్నది. మహర్షులును మునులును దేవతలునుగూడ సుఖాభిలాషులై మోహమగ్ను లగుచున్నారు.తమోమోహమే మహామోహము. తామిస్రము క్రోధ మనఁబడుచున్నది. తామిస్రాంధతామిస్రశబ్దములు మరణక్రోధములను దెలుపును. ఓవిప్రులారా! వర్ణమునుబట్టియు, గుణమునుబట్టియు, యోనినిబట్టియుఁ దత్త్వమునుబట్టియుఁ దమోగుణమువిధమంతయు యథావిధిగాఁ దెలిపితిని. ఈతమస్సుతత్త్వము నెవఁడు తెలియఁగలఁడు? ఎవఁడు దీనిని లెస్సగాఁ జూచును? అతత్త్వమునఁ దత్త్వబుద్ధి యెవ్వనికగునో, వాఁడే తామసుఁడు. తమోగుణములు బహువిధములుగా నున్నవిధము దెలుపఁబడియెను. ఏమానవుఁ డీతామసగుణములతత్త్వమును దెలియునో, వాఁ డీగుణములచే విముక్తినొందును' అని తెలిపి మఱియు నప్పరమేష్ఠి యిట్లనియె.

## రజోగుణనిరూపణము

'ఓప్రాజ్ఞులారా! రజోగుణము నిఁక యథార్థముగాఁ దెలిపెదను. మఱియు రజోగుణవంతుఁడగు రాజసునివిధము నిరూపించెదను. తెలిసికొనుఁడు. సంతాపము, రూపము, ఆయాసము, సుఖదుఃఖములు, శీతాతపములు, ఐశ్వర్యము, సంధివిగ్రహములు, హేతువాదము, అప్రీతి, సహనము, బలము, శౌర్యము, మదము, రోషము, వ్యాయామము, కలహము, ఈర్ష్య, ఈప్స, పైశున్యము, యుద్ధము, మమత, పరిపాలనము, వధబంధపరిక్లేశములు, క్రయ, విక్రయములు, నికృంతనభేదనచ్ఛేదనోత్సాహములు, శత్రువర్మావకర్తనము, ఉగ్రత, దారుణకృత్యము, ఆక్రోశము, పరచ్ఛిద్రానుశాసనము, లోకచింత, అనుచింత మాత్సర్యము, సర్వాధిపత్యవాంఛ, మృషావాదము, మృషాదానము, వికల్పము, పరిభాషణము, నిందాస్తుతిప్రశంసలు,

ప్రతాపము, ప్రధర్షణము, పరిచర్య అనుశుశ్రూష, సేవ, తృష్ణ, వ్యపాశ్రమము, వ్యూహ, నయ, ప్రమాద, పరివాద, పరిగ్రహములు, స్త్రీ, పురుష, గృహ, ద్రవ్య, భూతములకు, మఱిమఱియు వేఱువేఱు సంస్కారములు చేయుటయందుఁ బ్రవర్తించుచుండుటయుఁ, బరితాపము, అవిశ్వాసము, వ్రతములు, నియమములు, ఫలప్రదములగు కర్మములు, వివిధములగుపౌర్తములు, స్వాహాకార, స్వధాకార, నమస్కార, వషట్కారములు, యజనయాజనాధ్యయనాధ్యాపనములు, దాన ప్రతిగ్రహములు, ప్రాయశ్చిత్తములు, శుభవాంఛ, 'అది కావలెను, ఇదికావలెను' అనెడికోర్కియు, స్నేహము, అభిద్రోహము, మాయ, శాఠ్యము, అభిమానము, చౌర్యము, హింస, జుగుప్సా సంతాప ప్రజాగరములు, దంభము, దర్పము, రాగము, భక్తి ప్రీతి ప్రమోదనములు, ద్యూతము, జనవాదము, సంబంధము, స్త్రీకృత సంబంధములు, నృత్యగీతవాదిత్ర ప్రసంగములు, రాజసగుణములుగాఁ గీర్తింపఁబడుచున్నవి. భూతభవ్యభవిష్యభావనులై ధర్మార్థకామనిరతులై, కామవృత్తులై, సకలకామసమృద్ధితో సంతసించువారు రాజసులనఁబడుదురు. వీరు స్వర్గముకంటెఁ గ్రిందిదియు, భూమికంటెఁ బైదియునగు గతి నొందుదురు. మఱియు నట్టివా రీలోకమున మాటికిని బుట్టుచు సంతసించుచుందురు. రాజసులు జన్మాంతరసౌఖ్యమును, నిహసౌఖ్యమును గోరుచుందురు. వారు దానప్రతిగ్రహములను, దర్పణహోమములను గావించుచుందురు. ఓవిప్రులారా! బహువిధములగు రజోగుణములవిధమును, రాజసులవృత్తమును, దెలిపితిని. ఎవ్వఁ డీగుణములఁ దెలియునో, వాఁడు రాజసగుణవిముక్తుఁ డగుచున్నాఁడు' అని తెలిపి మఱియు నప్పరమేష్ఠి యిట్లు తెలిపెను.

## సత్వగుణనిరూపణము

'ఓమహర్షులారా! సకలభూతహితము సజ్జనధర్మమై యనిందితమై యుత్తమమై యూఁడవదగుసత్వగుణమువిధ మెఱిఁగించెదను. వినుఁడు. ఆనందము, ప్రీతి, ఉన్నతి, ప్రకాశత, సుఖము, కార్పణ్యములేమి, నిర్భయత్వము, సంతోషము, శ్రద్ధ, శాంతము, ధైర్యము, అహింస, సమత సత్యము, ఋజుబుద్ధి, అక్రోధము, అసూయారాహిత్యము, శౌచము,

దాక్ష్యము, పరాక్రమము, శాస్త్రీయజ్ఞాన వృత్త సేవా శ్రమము లందు వైయర్థ్యబుద్ధియు సత్వగుణములు. ఇట్టిగుణముల నాశ్రయించి వర్తించువాఁడు దేహత్యాగానంతర మత్యంతసుఖమందుచున్నాఁడు. మమత, అహంకారము, కోర్కియు లేకుండుటయు, సర్వసమత్వము అనునవియే సనాతనములగు సజ్జనులధర్మము. విశ్వాసము, బిడియము, తితిక్ష, త్యాగము, శౌచము, అమాంద్యము, అక్రౌర్యము, అసంమోహము, భూతదయ, అపైశున్యము, హర్షము, తుష్టియు, విస్మయము, వినయము, సాధువృత్తము, శాంతికర్మబుద్ధియు, శుభబుద్ధియుఁ, దాక్షిణ్యము, ఉపేక్ష, బ్రహ్మచర్యము, పరిత్యాగము, నిర్మమత, నిష్కామత, ధర్మనిత్యత, దాన యజ్ఞ వ్రతాధ్యయనములందు వైయర్థ్యబుద్ధియుఁ, దపోధర్మ ప్రతిగ్రహవైయర్థ్యబుద్ధియు సాత్వికధర్మములు సత్వాశ్రయులై లోకమునఁ గొంద ఱిట్టివృత్తము గలిగి సాధుదర్శులై, బ్రహ్మజ్ఞానసంపన్నులై, సకలశోకపాపవిముక్తులై శరీరత్యాగానంతరమున దివమునొంది, సత్యత్వమును మనోనిగ్రహత్వము నొందుదురు. వీరూర్ధ్వగతులై దేవతలగుచున్నారు. ప్రకృతిచే వికారము గలిగి స్వర్గతులై తామేమి కోరుదురో, యదియెల్ల నొందఁగలుగుచున్నారు. ఓద్విజోత్తములారా! ఇదియే సాత్వికవృత్తము. దీనిని దెలిసినవాఁడు సకలమనోరథములఁ బడయును. సత్వగుణములను, దక్షినగుణములను, వానివృత్తమును నెవఁడు తెలిసికొనునో, వాఁడు గుణములకు వశుఁడుగాక గుణఫలము లనుభవించును' అని తెలిపి పరమేష్ఠి మఱియు నిట్లనియె.

### గుణములపరస్పరసంబంధము

'ఓమహర్షులారా! మున్నుగా నవ్యక్తమునుండి మహత్తు జనించెను. అయ్యది సకలగుణకార్యములలోఁ దొలుతటిదై ప్రథమసృష్టి యనఁబడుచున్నది. ఆమహత్తు, మతి, విష్ణువు, జిష్ణువు, శంభువు, బుద్ధి, ప్రజ్ఞ, ఉపలబ్ధి, ఖ్యాతి, ధృతి, స్మృతి మున్నగుశబ్దములచేఁ జెప్పఁబడుచున్నది. దానిని దెలియుచు బ్రాహ్మణుఁడు, ప్రమోహమునకు దూరుఁ డగుచున్నాఁడు. అయ్యది యెల్లెడలఁ బాణిపాదములుగలదియు, నెల్లయెడ నేత్రశిరోముఖములు గలదియు, నంతటను గర్ణ

ములుగలదియు నై లోకమునఁగల యెల్లదానిని వ్యాపించియుండును. మహాప్రభావుఁడగు పురుషుఁడు సర్వప్రాణిహృద్గతుఁడై వెలయు చుండును. ఆమహత్తునందే యతీతానాగతవర్తమానలోకములున్నవి. సద్భావనిరతులును, ధ్యానశీలురును, నిత్యయోగులును, సత్యసంధులును, జితేంద్రియులును, లోభరహితులును, జితమన్యువులు నై యెవ్వరు ప్రవర్తింతురో, మఱియు నిర్మములు, నిరహంకారులు, ప్రసన్నచిత్తులు నై వర్తింతురో, యట్టివారందఱును విముక్తులై మహత్త్వము నొందు చున్నారు. మహదాత్మ నెఱిఁగినవాఁడుత్తమగతి నొందును. మహత్తు నుండి యహంకారము, దానినుండి పంచభూతములును జనించును. అవ్వి పృథివ్యప్తేజోవాయ్వాకాశము లనఁబరఁగుచుండును. వాని గుణములగుశబ్దాదులు నిమిత్తములగుచుండఁగా, నెట్టిభూతములును వానియందు మోహావిష్టములై ప్రవేశించును. దేహాకారమొందిన మహాభూతమును నశించినపిమ్మట, దైనందిన ప్రళయము సంభవించి నపుడును నెల్లప్రాణులకును మహత్తగభయము సంభవించును. అప్పు డప్పరమపురుషుఁ డొక్కఁడే మోహమొందకుండును. ప్రథమసర్గమున స్వయంభువు, విష్ణువు, నగునతఁడే ప్రభువు. గుహాశయుఁడు, పరమ ప్రభువు, పురాణపురుషుఁడు, విశ్వరూపుఁడు, హిరణ్మయుఁడు నగు నాతనివిధ మెవ్వఁ డెఱుఁగునో, యట్టివాఁడు బుద్ధికతీతుఁడై వెలయు చుండును.' అని తెలిపి యప్పరమేష్ఠి మఱియు నిట్లనియె.

## అహంకారస్వరూపనిరూపణము

'ఓవిప్రులారా! మున్నుగా మహత్తు జనించెనుగదా! అది యహంభావమున మూఁడురూపున నహంకార మనఁబడును. అది ద్వితీయసృష్టి. భూతాదియగు నహంకారుఁడు వైకారికుఁ డనఁబడును. రజోవికారమగు పురుషుఁడు ప్రజాసృష్టినిమిత్తభూతుఁడై ప్రజాపతి యనఁబడుచున్నాఁడు. ఇంద్రియములకును మనస్సునకుఁ బ్రభవమై యాదేవుఁడు త్రిలోకకర్త యగుచున్నాఁడు. అతఁడు 'నేను' అను అహంభావముగలుగుట నహంకారుఁ డనఁబడును. అధ్యాత్మజ్ఞానతృప్తు లును, భావితాత్ములును, స్వాధ్యాయక్రతుసిద్ధులు నగువారి కనిరుద్ధ మను పేరు గలలోకము గమ్యస్థాన మగుచున్నది. త్రిగుణమయుఁడగు

నహంకారునిచే శబ్దాదుల ననుభవింపఁ గోరుపురుషునకు భ శ్రీ నయ్యహంకారుఁడా గుణములను గలిగించుచుండును. యగు నావైకారికుఁడే యీసకలజగమును గలిగించి ప్ర దానిని రంజింపఁజేయుచుండును.' అని తెలిపి మఱియు నవ్వరమేష్ఠి యిట్లనియె

## పంచభూతప్రకారకథనము

ఓమహర్షులారా! అయ్యహంకారమునుండియే, పంచభూతము లగు పృథివ్యప్తేజోవాయ్వాకాశములు జనించెను. వానిగుణములగు శబ్దాదులు హేతువులగుచుండఁగా, సిద్ధులగు యోగులుసైతము వాని యందు మోహమందుచుందురు. దేహాకారము వహించినభూత ములు నశించినయనంతరమునను, దైనందినప్రళయమునందును, సకల ప్రాణులకును మహత్తరమగు నారకభయ మొదవుచుండును. ఏ భూతము దేనినుండి జనించునో, యవియెల్లఁ బ్రతిలోమముగా లయమొందుచుండును. అనులోమముగా జనించుచుండును. పిమ్మట స్థావరజంగమాత్మకమగు భూతకోటియెల్లఁ బ్రళయమొందును. అప్పుడును సూక్ష్మభూతములు వినాశమొందవు. శబ్దస్పర్శరూపరసగంధ ములును, దద్గ్రహణరూపక్రియలును నిత్యకారణములగుట నశింపవు. అనిత్యభూతములు, ప్రజాలోభసంభూతములును, నిర్విశేషములు, నకించనములు, మాంసశోణితసంఘాతములు, పరస్పరోపజీవులునగు స్థూలశరీరములు దీనములు, కృపణజీవులునై ప్రవర్తిల్లుచుండును. ప్రాణాపానవ్యానోదానసమానములనియెడివాయువులైదును నంత రాత్మయందు నియతములై యుండును. ఈయైదును వాఙ్మనోబుద్ధు లునుగూడ, నీజగము 'అష్టాత్మక' మనఁదగియున్నది. ఎవ్వని త్వక్చక్షు శ్శ్రోత్రజిహ్వాఘ్రాణములు నియతములై యుండునో, యెవ్వనిమనసు విశుద్ధమై ప్రవర్తిల్లునో, యెవ్వనిబుద్ధి వ్యభిచరింపకుండునో, యెవ్వని వాక్కు సత్యము దప్పకుండునో, యీయెనిమిది యగ్నులు నెవ్వని దహింపకుండునో యట్టివిద్వాంసుఁడు, శ్రేయస్కరమగు బ్రహ్మము నొందుచున్నాఁడు. వానికంటె నధిక మెద్దియు లేదు ఓబ్రాహ్మణోత్త ములారా! పదునొకొండింద్రియములును నహంకారమునుండియే జనించెను. వానివిధ మెఱిఁగించెదను వినుఁడు. త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వా

ఘ్రాణములును, వాక్పాణిపాదపాయూపస్థలును, మనస్సును గలుపఁగాఁ బదునొకొండింద్రియములగుచున్నవి. ముందుగా వీనిని జయించినచోఁ బిదప బ్రహ్మము ప్రకాశించును. అప్పుడునొకొండింద్రియములలోఁ ద్వగాదులు బుద్ధీంద్రియములును, వాగాదులు కర్మేంద్రియములునాఁ బరఁగుచుండును. ఉభయవిధములగు నింద్రియములందును మనస్సు కలిసియుండును. వీనితోఁగూడి బుద్ధి పండ్రెండవదగుచున్నది. ఇవియే యథాక్రమముగాఁ బదునొకొండింద్రియములని తెలుపఁబడుచున్నవి. ఇఁక నింద్రియములవిధమంతయు నెఱిఁగించెదను. ఆకాశము తొలుతటిభూతము. దానియింద్రియము శ్రోత్రము. ఆకాశగుణము శబ్దము. తదింద్రియానుగ్రాహకదేవతలు దిగాదులు. ఇంద్రియము లధ్యాత్మమనియు, భూతగుణములగుశబ్దాదు లధిభూతమనియు, దిగాదు లధిదైవతమనియుఁ దెలుపఁబడుచున్నవి. రెండవభూతము మారుతము. దానియధ్యాత్మము త్వక్కు. స్పర్శ మధిభూతము. అందు విద్యుత్తు అధిదైవతము. మూఁడవభూతము జ్యోతి. దానియధ్యాత్మ చక్షువు. అందు రూప మధిభూతము. అందు సూర్యుఁ డధిదైవతము. నాల్గవభూతము జలము. జిహ్వ దానియధ్యాత్మము. అందు రస మధిభూతము. సోముఁ డందధిదైవతము. పృథివి యైదవభూతము. దానియధ్యాత్మము ఘ్రాణము. అందు గంధ మధిభూతము. వాయు వందధిదైవతము. పంచభూతములందును, నధ్యాత్మాధిభూతాధిదైవతములవిధి తెలుపఁబడినది. ఇఁక వివిధములగుకర్మేంద్రియములవిధము దెలిపెదను. తత్వదర్శులగుబ్రాహ్మణులు పాదము లధ్యాత్మమనియు, గంతవ్య మధిభూతమనియు, నందు విష్ణు వధిదైవతమనియుఁ దెలుపుదురు. అటులే యవాగ్గతియు, నపానమగుపాయు వధ్యాత్మము. అందు విసర్గ మధిభూతము. మిత్రుఁ డధిదైవతము. సకలభూతప్రజననమగు నుపస్థ యధ్యాత్మము. అందు శుక్ర మధిభూతము ప్రజాపతి యధిదైవతము. హస్తము లధ్యాత్మమని యధ్యాత్మవేత్తలు తెలుపుదురు. అందుఁ గర్మము లధిభూతము. శక్రుఁ డం దధిదైవతము. వాక్కు అధ్యాత్మము. వక్తవ్య మధిభూతము. అందు వహ్ని యధిదైవతము. పంచభూతాత్మచారక మగుమనస్సు అధ్యాత్మము. సంకల్ప మధిభూతము. అందుఁ జందురుఁ డధిదైవతము. సర్వసంసారతారకమగు నహంకారము

అధ్యాత్మము. అభిమాన మధిభూతము. అందు రుద్రుఁ డధిదైవతము. ఇంద్రియము లాటిఁటిని విచారించునట్టిబుద్ధి యధ్యాత్మము. మంతవ్య మధిభూతము. అందు బ్రహ్మ యధిదైవతము. భూతములకు మూఁడు స్థానములేగాని నాల్గవదిలేదు. 'స్థలము, జలము, ఆకాశము' అను మూఁడేస్థానములు. భూతములజన్మము నాల్గువిధములు. 'అండజములు, ఉద్భిజ్జములు, స్వేదజములు, జరాయుజములు' అనువిధముగా భూత గ్రామమునకు జన్మము చూడఁబడుచున్నది. అనుత్కృష్టములగు భూతము లాకసమునఁ జరించును. అవియును, సకలసరీసృపములును, నండజములని తెలియవలయును క్రిములు మున్నగునవి. స్వేదజ ములు. రెండవదగు నీస్వేదజోత్పత్తి నీచమనఁబడుచున్నది. కాల క్రమమున భూమిని భేదించి కొన్ని జనించును. ఓబ్రాహ్మణులారా! దానినే యుద్భిజ్జములందురు. మఱియుఁ గొన్ని ద్విపాదములును, గొన్ని బహుపాదములునై తిర్యగ్గతులుగలిగి వెలయుచుండును.ఓసత్తము లారా! జరాయుజములు కొన్నివికృతములును గలవు. సనాతనమగు బ్రహ్మయోని ద్వివిధమై వెలయును. తపము, కర్మము, పుణ్యము అను నది పండితులమార్గము. ముఖమున, నిజ్య, దానము అనువిధముగాఁ గర్మము వివిధమై యుండును. జాతుఁడగువాని కధ్యయనము పుణ్య మని వృద్ధులశాసనము. ఓవిప్రోత్తములారా! ఇది విధ్యుక్తముగా నెవఁడు తెలిసికొనునో, వాఁడు యోగి యగుచున్నాఁడు. మఱియు వాఁడు సకలపాపవిముక్తుఁడు నగునని తెలియుఁడు. ఈయధ్యాత్మవిధిని దెలిపితినిగాదే! ఓధర్మజ్ఞులారా! దీనిజ్ఞానము జ్ఞానులకే ప్రాప్తమైనది. ఇంద్రియములను, నింద్రియార్థములను, బంచమహాభూతములను మనస్సుచే సంధించి నిలుపవలయును జ్ఞానయుక్తబుద్ధులకు మనస్సు క్షీణమగుచుండఁగా సంసారసుఖ మిష్టముగాకుండును. ఇఁక సూక్ష్మ భావకరియు శివప్రదయునగు వృత్తిని దెలిపెదను. అయ్యది బ్రాహ్మ ణాదులందు మృదువుగను, దారుణయోగవిధిగను జేయవలసినదగు చున్నది. శౌర్యాదిగుణములు దేనికి గుణములు గాకుండునోయట్టియు, సంగరహితమైనట్టియు నేకాంతస్థితిగలట్టియు, సకలభేదశూన్యమై నట్టియు, నీవృత్తమును బ్రహ్మమయమై సుకరమగు నేకపదమునుగాఁ దెలుపుచున్నారు.వివేకియగువాఁడు,కూర్మము తనయవయవములట్లులు

సకలకామముల నుపసంహరించి, యెవ్వఁడు రజోగుణరహితుఁడగునో, వాఁడు సర్వతోముక్తుఁడై సుఖి యగుచున్నాఁడు. కాలముల నాత్మయందు నియమించి సమాహితుఁడై యాసలువీడి, సకలభూతసౌహృదము వెలయ మైత్రితో వర్తించువాఁడు బ్రహ్మమగుచున్నాఁడు. విషయములనుఁ గోరునట్టి సకలేంద్రియముల నిరోధముచేతను, నిర్జనప్రదేశస్థితిచేతను, యోగి యథార్థాత్మజ్ఞానము ప్రజ్వరిల్లును. ఇంధనములచే నగ్ని ప్రదీప్తమై పెద్దవెలుతురుగలిగి ప్రకాశించునట్లుగా నింద్రియనిరోధముచే నాత్మ ప్రకాశించును. నిర్మలచిత్తుఁడై యెపుడు తనహృదయమందు భూతముల నంతర్ముఖుఁడై గాంచునో, యపుడే తాను స్వయంజ్యోతియై సూక్ష్మముకంటె సూక్ష్మమై సర్వోత్తమమగు వస్తువును బొందుచున్నాఁడు. కృష్ణగౌరాదిరూప మగ్నియు, రక్తాది ద్రవము పయస్సును, స్పర్శనము వాయువు, మాంసాస్థ్యాదికము భూమియు, ఘోరమగు శ్రవణ మాకాశమునుగాఁగా, రోగశోకసమాయుక్తమై పంచేంద్రియగోళసమన్వితమై, పంచభూతసమావృతమై నవద్వారసహితమై, జీవేశ్వరులు దైవతములుగా వెలయుచు, రజోవంతమును, సందర్శనీయమును నై, సుఖదుఃఖమోహోత్పాదకమైన కఫవాతపిత్తమయమై సంసర్గాభిరతమైన యీశరీరము మూఢమైన దగుట నిశ్చయము. దుస్సమాధేయమై సత్యసమాశ్రితమైనయీబాల్యాద్యవస్థాపన్నమగు శరీరమే కాలచక్రమై ప్రవర్తిల్లుచున్నది. మఱియు నిదియే ఘోరమగుసాగరమునాఁదగి యగాధమై మోహసంజ్ఞితమై వెలయుచున్నది. ఈసాగరరూపమగు జగమే సృష్టిసంహారబోధనములకు హేతువగుచున్నది. ఇంద్రియనిరోధముచే శరీరమును విడుచుచు, దుస్త్యజములగు కామక్రోధభయలోభద్రోహానృతములను బరిత్యజించుచున్నాఁడు. లోకమున నెవ్వనిచేఁ ద్రిగుణములును బంచధాతువులును జయింపఁబడునో, వాని నాకసమున నంతరహితమగు నుత్తమస్థానము లభించుచున్నది. మఱియుఁ బంచేంద్రియములె మహాకూలముగా, మనోవేగమె మహోదకముగా, మోహమె మహాహ్రదముగా వెలయు సంసారనదిని దాఁటి, కామక్రోధములను జయించినచో, సర్వదోషవిముక్తుఁడై పరమస్థానమును బడయఁగల్గుచున్నాఁడు. మనస్సును హృదయపుండరీకమున సంధించి శరీరమ్ము

నందలియాత్మను దెలిసికొనవలయును. సర్వవస్తుసాక్షాత్కారముచే సర్వవేత్తయై శరీరగతమగు నాత్మను దెలిసికొనఁ గలుగుచున్నాఁడు. అట్టివాఁడు దీపమునుండి దీపశతమునయి స్వశరీరములను ధ్రువముగాఁ గనుఁగొనఁగల్గును. అతఁడే విష్ణువు, మిత్రుఁడు, వరుణుఁడు, అగ్నియుఁ, బ్రజాపతియు, ధాతయు, విధాతయు, సర్వతోముఖుఁడును, ప్రభువునై వెలయును. ఆమ్మహాత్ముఁడే సకలభూతహృదయుమై ప్రకాశించును. ఆతనినే విప్రసంగములును, సురాసురులును, యక్షులును, పిశాచులును, పితరులును, గరుడులును, రక్షోగణములును, భూతగణములును, మహర్షులును నిత్యమును సన్నుతించుచుందురు' అని తెలిపి పరమేష్ఠి మఱియు నిట్లనిరి.

### అహింసాదిధర్మప్రతిపాదనము

'ఓమహర్షులారా! మానవులలో రాజన్యుఁడగు క్షత్రియుఁడు, రజోగుణప్రధానుఁడు. వాహనములలోఁ గుంజరమును, నరణ్యవాసులలో సింహమును, పశువులలో గొఱ్ఱెయును, బిలవాసులలోఁ బాము, గోవులలో వృషభమునురజోగుణప్రధానములు. న్యగ్రోధము, జంబువు, పిప్పలము, శాల్మలి, శింశుపావృక్షము, మేషశృంగము, కీచకవేణువులును వృక్షజాతిలో రాజు లనఁదగియున్నవి. అందు సందియము లేదు. మఱియు హిమవంతము, పారియాత్రము, సహ్య వింధ్య త్రికూటములు, శ్వేతము, నీలము, భాస, కోష్ఠవత్పర్వతములును, గురుస్కంధము, మహేంద్రము, మాల్యవంతము, అనియెడికొండలు పర్వతరాజములు. గణములకు మరుత్తులు, గ్రహములకు సూర్యుఁడును, నక్షత్రములకుఁ జంద్రుఁడును నధిపతులు. అటులే పితరులకు యముఁడును, నదులకు సముద్రుఁడును, జలములకు వరుణుఁడును, దేవతల కింద్రుఁడును నధిపతులుగాఁ దెలుపఁబడుచున్నారు. అగ్ని భూతపతి. బ్రాహ్మణులకు బృహస్పతియు, నోషధులకు సోముఁడును, బలవంతులకు విష్ణువును బతు లనఁబడుచున్నారు. రూపములకుఁ ద్వష్టయును, ప్రాణులకు శివుఁడును నధిపతులు. దీక్షితులకు యజ్ఞమును, దేవతల కింద్రుఁడును నధిపతులు. దిక్కులకు నుత్తరదిక్కును, సోముఁడును నధిపతులు. సర్వరత్నములకును గుబేరుఁ డధిపతి. దేవతలకుఁ బురందరుఁ

డధీశ్వరుఁడు. భూతాధిపుఁడు, సృష్టికర్తయునగు ప్రజాపతి ప్రజల కధీశుఁడు. సకలభూతములకును బ్రహ్మమయుఁడనగు నేనధిపతిని. విష్ణుఁడనగు నాకంటెఁ బరతరమగుభూత మొకటి లేదని తెలియుము. మానవాదులగునందఱపై నీశ్వరత్వము హరినగు నాది యని తెలియుము. స్త్రీజనమున కెల్ల మహాదేవియు మాహేశ్వరియునగు పార్వతి యధీశ్వరి. ఆమెయే స్త్రీలకెల్ల నుత్తమదేవతయై శుభదాయిని యని తెలియుము. ప్రీతి సుఖము గోరుస్త్రీలకు ధనవతులగు నప్సరస లధీశలు. రాజులు ధర్మకాములు. బ్రాహ్మణులు ధర్మసేతువులు. కావున, రాజులు ద్విజాతులరక్షణమునందుఁ బ్రయత్నము గలిగి యుండవలయును. ఏరాజన్యుల దేశమునందలి బ్రాహ్మణులు పరితపింతురో యట్టిరాజులు, నిజగుణహీను లనఁబడుటయేగాక, మృతినొందినయనంతరమును నపమార్గగాము లగుచున్నారు. ఎవ్వరిదేశమునందలి సజ్జనులు రక్షితులగుదురో, యట్టిక్షత్త్రియు లిహపరసుఖముల నందఁగలుగుచున్నారు. ఓ బ్రాహ్మణోత్తములారా! ఇఁక నియతమగు ధర్మలక్షణము నెఱిఁగించెదను వినుఁడు. అహింసయే పరమధర్మము. హింసయే యధర్మలక్షణము. దేవతలు ప్రకాశలక్షణులును, మానవులు కర్మలక్షణులు నై వెలయుచుందురు. ఆకాశము శబ్దలక్షణము. వాయువు స్పర్శలక్షణము. రూపము జ్యోతిర్లక్షణము. ఉదకములు రసలక్షణములు. సకలభూతధారిణియగు పృథివి గంధలక్షణయై వెలయుచున్నది. స్వరవ్యంజనసంస్కారములు గలభారతి శబ్దలక్షణయై వెలయుచున్నది. సంకల్పమే మనోలక్షణము. నిశ్చయకృత్యమే బుద్ధిలక్షణము. మనసుచేఁ జింతింపఁబడినదానినే బుద్ధి నిశ్చయించునుగదా! నిశ్చయముచేతనే బుద్ధి యూహింపఁబడుచున్నది. అందు సందియములేదు. ధ్యానము మనోలక్షణము. అవ్యక్తము పురుషలక్షణము. యోగము ప్రవృత్తిలక్షణము. జ్ఞానము సన్న్యాసలక్షణము. కావున జ్ఞానపురస్సరముగా బుద్ధిమంతుఁడు సన్న్యసింపవలెను. జ్ఞానసంయుక్తుఁడగు సన్న్యాసి యుత్తమగతి నొందును. మఱియు నట్టివాఁడు ద్వంద్వాతీతుఁడును, దమోమృత్యుజరాతిగుఁడు నై నిత్యసుఖపాత్రుఁ డగుచున్నాఁడు. ఓ బ్రాహ్మణోత్తములారా! ధర్మలక్షణయుక్తమగు మార్గమును దెలిపితిని. ఇఁక నే దేవతయనుగ్రహముచే నెట్టిసాధనముచే నేయేగుణము గ్రహింపనగునో, దాని

నెఱింగించెదను వినుము. పార్థివమగు గంధగుణము ఘ్రాణముచే గ్రహింపఁబడును. ఘ్రాణస్థమగు వాయువు గంధజ్ఞానమునెడ ననుగ్రాహకమగుచుండును. జలగుణమగు రసము నిత్యము జిహ్వచే గ్రహింపబడుచుండును. జిహ్వయందున్న సోముఁడు రసజ్ఞానమునెడఁ జెప్పఁబడుచున్నాఁడు. జ్యోతిర్గుణమగురూపము చక్షువుచే గ్రహింపఁబడుచున్నది. ఆచక్షువునందున్న యాదిత్యుఁడు రూపజ్ఞానమునెడ విధింపఁబడుచున్నాఁడు. వాయుగుణమగుస్పర్శము త్వక్కుచే గ్రహింపఁబడుచున్నది. త్వక్స్థాయియగు వాయువు స్పర్శజ్ఞానమునెడ విధింపఁబడుచున్నది. ఆకాశగుణమగు శబ్దము శ్రోత్రముచే గ్రహింపఁబడుచున్నది. శ్రోత్రస్థములగు దిక్కులు శబ్దజ్ఞానమునెడఁ జెప్పఁబడుచున్నవి. మనోధర్మమగుచింత ప్రజ్ఞచేఁ దెలియఁబడుచున్నది. హృద్గతమగు చేతనధాతువు మనోజ్ఞానముచే గ్రహింపఁబడుచున్నది. బుద్ధి యధ్యవసాయముచేతను, మహత్తు జ్ఞానముచేతను గ్రహింపఁబడుచున్నవి. నిశ్చయించి గ్రహించుటనుబట్టి యవ్యక్తము వ్యక్తమగును. నిర్గుణాత్మకుఁడు, నిత్యుఁడు నగు క్షేత్రజ్ఞుఁడు లింగగ్రాహ్యుఁడు గానేరఁడు. కావున నిర్లింగుఁడగు క్షేత్రజ్ఞుఁడు కేవలము జ్ఞానలక్షణుఁ డగుచున్నాఁడు. గుణప్రభవప్రలయమగు నవ్యక్తము క్షేత్రముగా నుద్దిష్టమగుచున్నది. ఓమహార్షులారా! నే నగ్రాహ్యుఁడనై యన్నిటిని జూచుచున్నాఁడను. అన్నిటిని దెలిసికొనుచున్నాఁడను. అన్నిటిని వినుచున్నాఁడను. క్షేత్రమును దెలియువాఁడగుటచేఁ బురుషుఁడు క్షేత్రజ్ఞుఁ డనఁబడుచున్నాఁడు. ఆదిమధ్యావసానములు గలట్టియు, నచేతనమై సృజ్యమానమగుచున్న యాత్మను మఱిమఱియు సృజ్యమానములగు గుణములు తెలిసికొనఁజాలవు. గుణభూతములగు భోగ్యములకంటె బరుఁడగునాత్ముని గుణములలో నొక్కటియుఁ బొందఁజాలదు. క్షేత్రజ్ఞుఁడుమాత్ర మాపరమునిఁ బొందఁగల్గును. కావున ధర్మవేత్త గుణములను, సత్త్వమును బరిత్యజించి క్షేత్రజ్ఞునిఁ బ్రవేశించుచున్నాఁడు. అతఁడు నిర్ద్వంద్వుఁడును, నమస్కారరహితుఁడును, నిస్స్వాహాకారుఁడును, నచలుఁడును, ననికేతనుఁడును, బరుఁడును, విభుఁడు నై వెలయును.' అని తెలిపి పరమేష్ఠి మఱియు నిట్లనియె.

—జ్ఞానమే శ్రేయస్సాధనమని తెల్పుట—

'ఓమహర్షులారా! ఆదిమధ్యాంతములు గలిగి కర్మసాధ్యమై నానాలక్షణసంయుక్తమగు దానివిధమంతయుఁ దెలిపెదను. మొదటిది పగలు. పిదప రాత్రి. మాసములు శుక్లాదిపక్షములు. శ్రవణాదులు నక్షత్రములు. శిశిరాదులు ఋతువులు. గంధములకు భూమియు, రసములకు జలమూలును, రూపముల కాదిత్యుఁడును, స్పర్శములకు వాయువు, శబ్దమున కాకాశమును మూలములు. ఇదియే భూతకృత మగుగుణము. ఇఁకభూతములకాదియైనదియును త్తమమైనదియునెద్దియో దాని నెఱిఁగించెదను. జ్యోతుల కాదిత్యుఁడు మొదటివాఁడు. అగ్ని భూతముల కాదిగాఁ దెలుపఁబడును. సకలవిద్యలకును సావిత్రి మొదటిది. దేవతలకుఁ బ్రజాపతి మొదటివాఁడు. సకలవేదములకు నోంకారము మొదటిది. వాయువులలోఁ బ్రాణము మొదటిది. లోక మున జపింపఁదగినదంతయు సావిత్రి యనఁబడుచున్నది. ఛందస్సులకు గాయత్రి మొదటిది. ప్రజలకు సృష్టికాలము మొదటిది. చతుష్పా జ్జంతువులలో గోవులు మొదటివి. మానవులలో ద్విజన్ములు మొదటి వారు. పక్షులలో శ్యేన ముత్తమమైనది. యజ్ఞాదులలో దేవతాదుల నుద్దేశించి హుతమొనర్చిన దుత్తమము. ఓద్విజోత్తములారా! సకలసరీ సృపములలో వాసుకి యుత్తమమైనది. యుగములలోఁ గృతయుగము మొదటిది. అందు సందియము లేదు. సర్వరత్నములలో హిరణ్యమును, నెల్లయోషధులలో యవలును నుత్తమములు. సకలభక్ష్యభోజ్యము లలో నన్నము పరమోత్తమమైనదిగాఁ దెలుపఁబడుచున్నది. ద్రవము లలోను బానీయములలోను జలము లుత్తమములైనవి. సకలస్థావర భూతములలో బ్రహ్మక్షేత్రము, సదాపవిత్రమునగు రావిచెట్టు ప్రథమ గణ్య మనఁబడుచున్నది. సర్వప్రజాపతులలో నేను మొదటివాఁడను. ఇందు సందియము లేదు. అచింత్యాత్ముఁడు స్వయంభువునగు విష్ణువు నాకు మూలము. పర్వతములలో మహామేరువు మొదటి దనఁబడు చున్నది. దశదిశలందును దూర్పుదెస మొదటిది. అటులే నదులన్ని టిలో గంగానది మొదటిదిగాఁ బరిగణింపఁబడుచున్నది. సకలజలా శయములందును సాగర ముత్తమమైనది. దేవదానవులందును, బిశా చోరగరక్షస్సులందును, యక్షకిన్నరమానవులందును రుద్రుఁడుత్తముఁడు.

సకలవిశ్వమునకును బ్రహ్మమయుఁడును, మహాత్ముఁడునగు విష్ణువు మొదటివాఁడు. మూఁడులోకములందును నాతనిమించినభూత మొక్కటియు లేదు. సకలాశ్రమములలో గార్హస్థ్య ముత్తమము. అవ్యక్తము సకలలోకములకుఁ దొలుతటిది. అదియే సకలమునకు నంతకరమైనది. పవర్గ స్తమయాంతములును, శాత్రు లుదయాంతములు నై వెలయును. అటులే సుఖాంతము దుఃఖము, దుఃఖాంతము సుఖము నై యుండునని తెలియుఁడు. సకలదృశ్యసమూహములును క్షయాంత ములు. సమృద్ధులన్నియుఁ బతనాంతములు. అటులే సంయోగములు వియోగాంతములును, జీవితము మరణాంతము నగుచున్నవి. చేయఁ బడినదంతయు నంతమొందునదియే. పుట్టినదెల్ల మరణించుట ధ్రువము. ఈలోకమున స్థావరజంగమములన్నియు నశాశ్వతములు. యాగ ములు, దానములు, తపము, అధ్యయనము, వ్రతములు, నియమములు మున్నగునవి సమస్తమును వినాశాంతమె యగుచున్నది. జ్ఞానమునకు నాశము లేదు. కావున శుద్ధమగు జ్ఞానముచే జితేంద్రియుఁడును, ప్రశాంతాత్ముఁడునై నిర్మముఁడు, నిరహంకారుఁడు నగుచు, సకల పాపవిముక్తుఁ డగుచున్నాఁడు.' అని తెలిపి పరమేష్ఠి మఱియు నిట్లనియె.

## గృహస్థధర్మమె శ్రేయస్సాధకమని తెలుపుట

'ఓమహర్షులారా! ఇఁకఁ గాలచక్రవిధ మెఱిఁగించెదను వినుఁడు. అయ్యది బుద్ధియే యుపాదేయాంశముగాఁగలదియు, మనస్స్తంభ ముచే ధరింపఁబడినదియు, నింద్రియగ్రామబంధనముగలదియుఁ, బంచ మహాభూతసమూహాత్మకమైనదియుఁ, గాంతావరణముగలదియు, జరా శోకసమావేశముగలదియు, వ్యాధివ్యసనసంభవముగలదియు నై వెల యుచు, దేశకాలములను విచారించునదియై గమనస్వేదాదినిమిత్త మైనదై యహోరాత్రములను బ్రవర్తింపఁజేయునదియై, శీతోష్ణపరి వేషమై, సుఖదుఃఖసంధియై, క్షుత్పిపాసలె చీలలుగా వెలయుచు మేఘ సంతాపసంబంధముగలదియై, నిమేషోన్మేషవ్యాకులమై, ఘోరమోహ జాలకీర్ణమై, సదాగతిగలదై, జడమై, మాసార్ధమాసపరిగణితమగుచు మనుష్యపశ్వాకృతులు గలిగి, సకలలోకసంచారియై, తమోగుణముచే నైన కర్మజ్ఞాననిరోధమై మాలిన్యనిమిత్తమగు పదార్థముగాఁ గన్పట్ట

వెలయుచు, రజోవేగమును బ్రవర్తిల్లఁజేయునదియై, మహాహంకారముచే దీప్తమగుచు, గుణసంజాతవర్తనమై, యిష్టములు లభింపమిచేఁ గలిగినపరితాపమై, బంధరజ్జువుగా వెలయుచు శోకమృత్యుదుఃఖములె జీవనముగా నొప్పుచుఁ, గ్రియాకారణసంయుక్తమై రాగముచే విస్తరిల్లునదియునై లోభతృష్ణలె నిమ్నోన్నతదేశములుగా వెలయుచు, విచిత్రాజ్ఞానసంభవమై, భయమోహపరివృతమై, భూతసమ్మోహకారకమై యొప్పుచుండును. మఱియు నది ప్రీత్యానందములను గలిగించును. కామక్రోధములను బరిగ్రహించును. అయ్యది మహదాదివిశేషాంతమై దేనికిని జిక్కక యుత్పత్తిలయనిమిత్తమై మనోజవమును, మనఃకాంతమునై ప్రవర్తిల్లుచుండును. మానావమానాదిసంయుక్తమై యచేతనమగు నీకాలచక్రమే జగమునకు సృష్టిస్థితిసంహారములను గలిగించును. కాలచక్రప్రవృత్తినివృత్తులతత్త్వము నేమానవుఁడు తెలిసికొనునో, వానికి భూతములయెడ మోహముగలుగదు. మఱియు నట్టివాఁడు సర్వసంస్కారవిముక్తుఁడై, సకలద్వంద్వవివర్జితుఁడై, సర్వపాపపరిత్యక్తుఁడై పరమగతిని బొందుచున్నాఁడు. బ్రహ్మచారి, గృహస్థు, వానప్రస్థుఁడు, యతి అని నలువురు. వీరియాశ్రమములును నాలుగై వెలయుచున్నవి. ఆనాల్గిటిలో గార్హస్థ్యము తక్కినవానికి మూలమై యున్నది. ఈలోకమున విధినిషేధశాస్త్రముగా నేయది వెలయుచుండునో, దానిని సమగ్రముగా గ్రహించుట శ్రేయస్కరము. అదియె సనాతనపద్ధతి. ముందుగా నుపనయనాదిసంస్కారసంస్కృతుఁడై బ్రహ్మచర్యవ్రతము పూర్ణముగావించి, స్వోచితముగా సమావర్తన మాచరించి, తత్త్వవేత్తయై స్వదారనిరతి గలిగి, శిష్టాచారసంపన్నుఁడై యింద్రియముల జయించి, శ్రద్ధాళుఁడై పంచమహాయజ్ఞముల నొనర్పవలయును. మఱియు దేవతాతిథిశేషమును భుజించుచు, వేదోక్తకర్మనిరతుఁడై యిజ్యాప్రదానము లొనర్చుచు, యథాశక్తిగను, యథాసుఖముగను, సత్కర్మాచరణశీలుఁడై పాణిపాదచాపల్యము విడిచి, నేత్రచాపల్యములేక మౌనియై ప్రవర్తించుటయె శిష్టసమ్మతము. నిత్యయజ్ఞోపవీతియు, శుక్లవసనుఁడును, శుచివ్రతుఁడును, నియమదాననియతుఁడునై శిష్టులఁగూడి ప్రవర్తింపవలయును. మఱియు శిశ్నోదరముల జయించి, మైత్రుఁడై, శిష్టాచారసమన్వితుఁడై సోదక

మగుకమండలువును, వైణవయష్టిని ధరింపవలయును. తానధ్యయన మొనర్చి యితరులచే నధ్యయనము చేయింపవలయును. అటులే యజనయాజనదానప్రతిగ్రహము లొనర్పవలయును. అందు బ్రాహ్మణునకు జీవికకై మూఁడుకర్మము లేర్పడియెను. అవియేవి యంటివేని వినుఁడు. యాజనము, అధ్యాపనము, పరిశుద్ధునుండి ప్రతిగ్రహమును బ్రాహ్మణునకు జీవికలు. మిగిలినమూఁడుకర్మములును, నాతనికి ధర్మమును గలిగించునవి. ధర్మవేత్తయగువాఁడు దానాధ్యయనయజనములనియెడి మూఁడుకర్మములందును బ్రమాదపడరాదు. మఱియు దాంతుఁడును, మైత్రుఁడును, క్షమాయుక్తుఁడును, సర్వభూతసముఁడును, మానియు నై వెనుక దెలిపినసదాచారములను దప్పక చేయుచు శుచియై గార్హస్థ్యమూని, సంశితవ్రతుఁడైనచో స్వర్గమును జయింపఁ గలుగును.' అని తెలిపి యప్పరమేష్ఠి మఱియు నిట్లనియె.

### ఆశ్రమములే శ్రేయస్కరములని తెలుపుట

'ఓమహర్షులారా! నా యీతెలిపినమార్గమును బట్టి యథావిధిగా, నధ్యయనమొనర్చి, యథాశక్తిగా బ్రహ్మచర్యము గావించి, స్వధర్మనిరతుఁడై సకలేంద్రియముల జయించి, గురుని ప్రియహితములయెడ వెనుదీయక, సత్యధర్మపరుఁడును, శుచియునై గుర్వాజ్ఞనొంది దేయతఁడు నిర్దేశించినయన్నము నేవగింపక భుజింపవలయును. అటులాతని సెలవుచొప్పున హవిష్యభైక్ష్యములను భుజించుచు, స్థానాసనవిహారము లొనర్చుచు, రెండుకాలములందును నగ్ని నారాధించుచుండవలయును. మఱియు శుచియు, సమాహితుఁడు నై, బిల్వపలాశదండములలో నెద్దానినేని సంతతము ధరింపవలయును. మఱియు, క్షౌమ, కార్పాసిక, మృగాజినములలో నెద్దానినేని, కాషాయరక్తముగా నొనర్చి ధరించుట ద్విజున కుచితము. మౌంజీమేఖలను ధరించి జటియు, నిత్యోదకుఁడును, యజ్ఞోపవీతియు, స్వాధ్యాయియు, లోభరహితుఁడును, నియతవ్రతుఁడును, నై పవిత్రోదకములచే నిత్యము దైవతర్పణముచేయుచు, నియతచిత్తుఁడైన బ్రహ్మచారి ప్రశంసింపఁబడుచున్నాఁడు. ఇటులే వానప్రస్థుఁడును జితేంద్రియుఁడై యెల్లలోకములను జయింపఁగలుగును. మఱియు నట్టివాఁ డెన్నఁడును జననములకు లోనుగాక యుత్తమస్థానము నాశ్రయించి వెలయును.

అతఁడు సర్వసంస్కారసంస్కృతుఁడై బ్రహ్మచర్యమును దప్పక, గ్రామము నుండి వెడలి యరణ్యములందు నివసింపవలయును. మఱియుఁ జర్మమునుగాని, వల్కలమునుగాని ధరించి సాయంప్రాతఃకాలములందు స్నానమొనర్చుచుండవలయును. నిత్యము నరణ్యమునందే చరించుచు, మఱి గ్రామమును బ్రవేశింపరాదు. మఱియు నతఁడు కాలోచితముగా, నతిథుల నర్చించుచు, వారికిఁ బ్రతిశ్రయ మొసంగవలయును. ఫలపత్రమూలములతోడను, శ్యామాకాహారముతోడను జీవనము చేయుచుఁ, దాను స్వీకరించుజలముగాని, వాయువుగాని, వన్యమైనదియే గావలయు ననునిశ్చయముతో వ్రతము నాశ్రయింపవలయును. జాగ్రత్తదప్పక దీక్షాక్రమముగనే భోజన మొనర్పవలయును. మూలఫలభిక్షలచేఁ, దనయింటికివచ్చినయతిథి నారాధించుచుండవలయును. దేవతలకు, నతిథులకును, ముందు సమర్పించియే, మౌనవ్రతమూని తాను భుజింపవలయును. మఱియు నసూయారహితుఁడై, లఘ్వాశియు, దేవతాశ్రయుఁడును, దాంతుఁడును, మైత్రుఁడును, క్షమాయుక్తుఁడును నై, గడ్డము, మీసమును, కేశములు పెంచికొని, స్వాధ్యాయశీలుఁడును, సత్యధర్మపరాయణుఁడు నై హోమముచేయుచుఁ బవిత్రదేహుఁడై దక్షుఁడును, నిత్యవనవాసియు, సమాహితుఁడు నగుచు వర్తింపవలయును. ఇటులు ప్రవర్తిల్లుచు జితేంద్రియుఁడైన వానప్రస్థుఁడు స్వర్గమును జయించును. అటులే, బ్రహ్మచారియు, గృహస్థుఁడును జరించి స్వర్గమును జయింపఁగలరు. మోక్షము నొందగోరువాఁడుత్తమవృత్తినాశ్రయింపవలయును. వానివిధము తెలిపెదను వినుఁడు. అతఁడు సకలభూతముల కభయ మొసంగుచు, నైష్కర్మ్యము నాశ్రయింపవలయును. సకలభూతసుఖకరుఁడై మైత్రుఁడై సర్వేంద్రియ నియమముగలిగి, మౌనమూని యయాచితముగను, నసంక్లృప్తముగను, నప్రయత్నముగను బ్రాప్తమైనదానినే యాహారముగఁ జేయువాఁడై విధూమము, భుక్తవర్జనమునగు ప్రాహ్ణసమయమున భైక్ష్యమును సంగ్రహింపవలయును. అటులు చరించునపుడు భైక్ష్యము లభించిన సంతసించుటయు, లభింపకుండినఁ జింతించుటయు నాతనికిఁ దగదు. భిక్ష నధికముగా నతఁడు భిక్షింపరాదు. కేవలము ప్రాణయాత్రకుఁ జాలినంత భైక్ష్యమునే పరిగ్రహింపవలయును. అటులు శరీరయాత్రను

మాత్రము గోరుచు సమాధినిష్ఠుఁడై కాలమున భిక్షకుఁ జరింపవలయును. సాధారణలాభము నపేక్షింపరాదు. అధికగౌరవము లభించునపుడు భుజింపరాదు. అట్టి పూజాలాభమున కతఁ డేవగించుకొనవలయును. తాను భుజించునాహారములు తిక్తములేగాని, కటుకములేగాని, కషాయములేగాని, వానిరుచిభేదమును బరిగణింపరాదు. మధురరసముల నపేక్షింపరాదు. కేవలము ప్రాణధారణమై శరీరయాత్ర గడచునట్లుగనే భుజింపవలయును. మోక్షవేత్త యొకరికి నిరోధము లేనివృత్తినే యాశ్రయింపవలయును. భిక్షసేయుచు వివిధాన్నములను గోరఁదగదు. ధర్మమును విమర్శింపక వివిక్తదేశమున రజోగుణరహితుఁడై చరింపవలయును. శూన్యాగారములును, వనమ్యములు, వృక్షమూలములు, నదీతీరములు నాతనికిఁ బ్రతిశ్రయములుగా నుండవలయును. కొండగుహాలలోనైన నుండవచ్చును. ఒక్కొక్క గ్రామమున నొక్కొక్కరాత్రియే నివసింపవలయును. గ్రీష్మవర్షాకాలములయందు మాత్ర మొక్కచోటనే వసింపవలయును. తనత్రోవ సూర్యనిర్దిష్టమగుచుండఁ గీటుమట్టులు పుడమిఁ జరింపవలయును. భూతకోటిపై దయగలిగి తదుపకారకముగనే పుడమిని జరింపవలయును. ధనసంపాదనము సేయరాదు. ఇతరులతో స్నేహము గలిగి నివసింపఁగూడదు. పవిత్రోదకములతోడనే తనకార్యమును నిర్వర్తించుకొనుచుండవలయును. అహింసయు, బ్రహ్మచర్యము, సత్యము, ఆర్జవము, అక్రోధము, అసూయారాహిత్యము, దమము, పైశున్యరాహిత్యము అనియెడి యెనిమిదిటిని వ్రతముగాఁ బూనవలయును. పాపము, శఠము, వక్రమును గానివృత్తినే యతఁడు నిత్యము నాశ్రయింపవలయును. తనకు లభించిన గ్రాసమును వాంఛాశూన్యముగా మానముతోడనే భుజింపవలయును. అదియుఁ గేవలము ప్రాణయాత్రికముగా జరపుకొనవలయును. ధర్మలబ్ధమైనదానినే భుజింపవలయునుగాని, కోర్కగలిగి భుజింపరాదు. గ్రాసవాసములకు వలసినంతదక్కఁ దక్కినది పరిగ్రహింపరాదు. తాను దినునంతదానినే, గ్రహింపవలయునుగాని యధికము దీసికొనరాదు . తానొకరినుండి ప్రతిగ్రహించుటయు నొకరికిచ్చుటయు నాతనికిఁ దగదు. పరధనములను స్వీకరించుటయు, నొకరిచేఁ గోరఁబడక గ్రహించుటయుఁ దగదు. ఏదే నొక

వస్తువు ననుభవించినను మఱియు దాని నపేక్షింపరాదు. మఱియు మృత్తుగాని, జలములుగాని, ఫలములుగాని, పత్రములుగాని, పుష్పములుగాని, గూఢములుగాకుండఁగనే గ్రహింపవలయును. శిల్పములచే జీవింపరాదు. హిరణ్యమును గోరఁదగదు. అటులే యొకరితో ద్వేషించుటయు, నొకరికి హిత ముపదేశించుటయుఁ దగదు. సంబంధరహితుఁడై వర్తింపవలయును. శ్రద్ధాపూతములగువానినే భుజింపవలయును. నిమిత్తములను వర్జింపవలయును. వృత్తిరహితుఁడును, నసక్తుఁడును, సర్వభూతసమ్మతుఁడును నై యుండవలయును. ఆశీర్యుక్తములు, హింసాయుక్తములు, లోకసంగ్రహాకృత్యములు నగువానిని జేయుటయుఁ జేయించుటయు నాతనికిఁ దగదు. సకలభావములను నతిక్రమించి, తేలికగా సన్న్యసింపవలెను. జంగమస్థావరములగు సకలభూతములందును సముఁడై వర్తింపవలయును. మోక్షవేత్త యొకనికి భయము గలిగించుటగాని, యొకనివలన భయమొందుటగాని తగదు. అతఁ డెల్లభూతములకు నమ్మఁదగి యుండవలయును. కడచినదానికి వగచుటయుఁ, గాఁబోవుదానిఁ గోరుటయు నాతని కనుచితము. అటులే వర్తమానమును నయిత ముపేక్షింపవలయును. అతడు కాలాకాంక్షియై సమాహితమానసుఁడై వర్తింపవలయును. చిత్తముచేఁగాని, చూపుచేఁగాని, మాటచేఁగాని యొకనిని దూషింపరాదు. ప్రత్యక్షముగాఁగాని, పరోక్షముగాఁగాని దుష్టకృత్య మేదియుఁ జేయరాదు. మఱియు నతఁడు, తాఁబేలు తనయవయవములట్టు లింద్రియముల నుపసంహరించి, క్షీణేంద్రియమనోబుద్ధియై, నిరీహుఁడై సర్వతత్త్వవేత్తయు, నిర్ద్వంద్వుఁడును, నిర్నమస్కారుఁడును, నిస్స్వాహాకారుఁడును, నిర్మముఁడును, నిరాశ్రయుఁడును, నిరహంకారుఁడును, యోగక్షేమవాంఛారహితుఁడును, నాత్మజ్ఞుఁడును నై యేకోర్కెయు లేక, యేగుణమునకును లోనుగాక, శాంతుఁడు, నిరాసక్తుఁడు, నాత్మసంగియుఁ, దత్త్వజ్ఞుఁడును నై ముక్తినొందుచున్నాఁడు. అందు సందియము లేదు. పాదోదరపాణిపృష్ఠశిరశ్శూన్యమును, గుణకర్మరహితమునై కేవలమూ విమలము, ధ్రువమునై వెలయుచు, శబ్దస్పర్శరూపరసగంధములు లేనిదై, యనుగమింపఁదగి దేనితోడను సంబంధము లేక, మాంసాదిరహితమై నిశ్చింత్యము, నవ్యయము, దివ్యము, గుహాస్థము,

సకలభూతస్థాయియునగు నాత్మ నెవ్వరు తెలియుదురో, వా రమృతులగుచున్నారు. ఆయాత్మయందు బుద్ధియు, నింద్రియములు, పంచమహాభూతములు, వేదములు, యజ్ఞములు, లోకములు, తపము, వ్రతములు మున్నగున వేవియు సమీపింపఁజాలవు. లింగగ్రహణరహితమగు తత్ప్రాప్తి జ్ఞానవంతులకే యగును. కావున లింగధర్మజ్ఞుఁడు గాక, ధర్మతత్త్వము నుపచరింపవలయును. మూఢుఁడు గాకుండియు, మూఢరూపముతో ధర్మమును దూషింపక ప్రవర్తింపవలయును. ఇతరులు తన్నెట్టు లవమానబుద్ధితోఁ గనుఁగొందురో, యట్టివృత్తముతో ధర్మము నాచరించుచు సదాచారమును నిందింపక వర్తింపవలయును. ఇట్టివృత్తముగలవాఁడే శ్రేష్ఠుఁ డనఁబడుచున్నాఁడు. ఇంద్రియములు, నింద్రియార్థములు, బంచమహాభూతములు, మనోబుద్ధులు, నహంకారము, నవ్యక్తము, పురుషుఁడు అనువానిని బరిగణించి తత్త్వనిశ్చయ మొనర్చినచో, సర్వబంధవిముక్తుఁడై స్వర్గము నొందుచున్నాఁడు. తత్త్వవేత్త తనమరణకాలమున నా యీ తెలిపినవిధముగాఁ దత్త్వవిధము పరిగణించి, యేకాంతము నాశ్రయించి, నిరాశ్రయుఁడై ధ్యానించినచో ముక్తుఁడగుచున్నాఁడు. సర్వసంగవిముక్తుఁడైనవాఁడు వాయు వాకాశమునట్టులు, క్షీణకోశుఁడును, నిరాతంకుఁడు నై పరమును బొందును.' అని తెలిపి పరమేష్ఠి మఱియు నిట్లనియె.

### సన్న్యాసమె పురుషార్థసాధనమని తెలుపుట

'ఓమహర్షులారా! నిశ్చితవాదులగు పెద్దలు, సన్న్యాసమే తపమని దెలుపుదురు. బ్రహ్మయోనిస్థులగు బ్రాహ్మణులు జ్ఞానమే బ్రహ్మపద సాధనమని తెలుపుచున్నారు. వేదవిద్యావ్యపాశ్రయమై యతిదూరాత్మకమగు బ్రహ్మము, నిర్ద్వంద్వము, నిర్గుణము, నిత్యము, అచింత్యగుణము, ఉత్తమము నై వెలయుటచే, బండితులు, తపముచేతను, జ్ఞానముచేతను నిద్దానిని గనుఁగొనుచున్నారు. మఱియు నిర్ణిక్తమనస్కులును, బవిత్రులును, రజోతీతులును, నిర్మలులునై వారు తపముచేతనే పరమోత్తమమగు క్షేమమార్గమును గాంచఁగల్గుచున్నారు. ధర్మసాధకమగు నాచారమే తపఃప్రదీపమని పెద్దలు తెలుపుదురు.

జ్ఞానమే యుత్తమమని తెలియవలయును. సన్న్యాసమగుతప ముత్తమము. ఎవ్వఁడు తత్త్వనిశ్చయమునుబట్టి, జ్ఞానము నిరాధారమనియు, సకలభూతస్థమనియు, నాత్మరూపమనియుఁ దెలిసికొనునో, వాఁడు సర్వగతియని చెప్పఁబడుచున్నాఁడు. మఱియు నెవఁడు, సహవాసమును, వివాసమును, నేకత్వనానాత్వములను దెలియునో, వాఁడు దుఃఖవిముక్తుఁ డగుచున్నాఁడు. ఎవ్వఁ డేకాంచమేనియుఁ గోరకయు, నవమానింపకయుఁ బ్రవర్తించునో, వాఁ డీలోకమందుండియే బ్రహ్మమగుచున్నాఁడు. మఱియు గుణతత్త్వజ్ఞుఁడును, సర్వభూతప్రధానవేత్తయు, నిర్మముఁడు, నిరహంకారుఁడును నగుచు ముక్తినొందుటలో సందియము లేదు. నిర్ద్వంద్వుఁడును, నిర్నమస్కారుఁడును, నిస్స్వధాకారుఁడును నై నిర్ద్వంద్వము నిత్యము నిర్గుణమునగు పరమవస్తువును బ్రశమముచేతనే పొందఁగలుగుచున్నాఁడు. గుణమయమైన శుభాశుభకర్మమును బరిత్యజించినవాఁడు సత్యానృతములను విడిచి ముక్తుఁడగుచున్నాఁడు. అందు సందియము లేదు. అవ్యక్తయోనిప్రభవమై, బుద్ధిస్కంధమయమై మహాహంకారవిటపమై, యింద్రియాంకురకోటరమై, మహాభూతవిశాలమై శాఖలను విస్తరిల్లఁజేయుచు, నిత్యపత్రపుష్పమై శుభాశుభఫలములుగలిగి సకలభూతములకు జీవనాధారమై సనాతనమై సంసారవృక్షము వెలయుచుండును. దానిని దత్త్వజ్ఞానాసిచే ఛేదించియు, భేదించియు, సంసర్గమయపులు, మృత్యుజన్మజరోదయములునగు పాశములను ద్రెంపికొని, నిర్మముఁడు, నిరహంకారుఁడును నైనవాఁడు ముక్తుఁడగుచున్నాఁడు. అందు సందియము లేదు. అచేతనములు నిత్యములు, పరస్పరమిత్రములునగు రెండుపక్షులు గలవు. వానికంటెఁ బరుఁడగు నొక్కఁడు గలఁడు. అతఁడే చేతనావంతుఁడుగాఁ దెలుపఁబడుచున్నాఁడు. అచేతనునట్టు లహంధీగమ్యుఁడైనజీవుఁడు, దేహాద్యుపాధివిముక్తుఁడై బుద్ధికంటెఁ బరమగువస్తువును జైతన్యముగలదానినిగా నొనర్చుచుండును. అతఁడే యంతరాత్మ. అతఁడే క్షేత్రజ్ఞుఁడు. ఈవిధ మెఱిఁగి గుణాతిగుఁడైనవాఁడు సకలపాపవిముక్తుఁ డగుచున్నాఁడు.' అని తెలిపి పరమేష్ఠి మఱియు నిట్లనియె.

మోక్షధర్మకథనము

'ఓమహర్షులారా! కొందఱు సంసారవృక్షమును బ్రహ్మమయముగను, గొంద ఱద్దానిని వనముగను, గొంద ఱవ్యక్తముగను, మఱి కొంద ఱనామయుఁడగు పరునిఁగను బలుకుదురు. ఇదియంతయు నవ్యక్తమునుండియే యగుచున్నది. మరణకాలమున నాత్మానుసంధాన మొనర్చి, యుచ్ఛ్వాసమాత్రమేని సముఁడైయున్నచో, మోక్షమున కగును. ఒకనిమేషమే, నాత్మ నాత్మయందుఁ గూర్చినచో, నాత్మప్రసాదము గలిగి, పండితుల కర్హమగు నవ్యయపదప్రాప్తి సంభవించును. యమనియమాదులు తర్కవైరాగ్యములతోఁ బదియును, మైత్రీకరుణాముదితోపేక్షలతో బండ్రెండు నై వెలయును. అట్టి యమనియమాదులచే మఱిమఱియుఁ బ్రాణములను నియమించి, యవ్యక్తముకంటె బరునిఁ గనుఁగొనవలెను. ఇటులొనర్చి ప్రసన్నాత్ముఁడగువాఁడు కోరినదెల్ల సిద్ధించును. అవ్యక్తమును బొంది సత్త్వముత్కృష్టతరమై పురుషమాత్రాకారమై వెలయును. అపుడే యమృతత్వమగుచున్నది. సత్వమును మించిన దొక్కటి లేదని బ్రహ్మవేత్తలు ప్రశంసించుచున్నారు. సత్వసంశ్రయుఁడగు పురుషు నూహించి తెలిసికొనుచున్నారము. ఓబ్రాహ్మణోత్తములారా! వేఱొకవిధముగాఁ బురుషునిఁ దెలిసికొన శక్యము గాదు. క్షమ, ధృతి, అహింస, సమత, సత్యము, ఋజుత్వము, జ్ఞానము, త్యాగము, సన్న్యాసము అనునవి సాత్వికవృత్తిగాఁ దెలియఁబడుచున్నవి. దీనినిబట్టియే తార్కికులు తత్వముకంటెఁ బురుషుఁ డభిన్నుఁడని యూహించుచున్నారు. ఇందు శంక లేదు. జ్ఞానపరినిష్ఠితులగు పండితులుకొందఱు, సత్వక్షేత్రజ్ఞుల భిన్నత నూహించి, పురుషునికంటె సత్వము భిన్నమని తెలుపుదురు. వారిమతమునఁ బృథగ్భావము సహజమని తెలియవలయును. అటులగుటఁ బండితులమతమున నేకత్వనానాత్వములు సత్వమునకును బురుషునకును వెలయుచున్నవి. మశకోదుంబరములకుఁ బృథక్త్వమును, నైక్యమును గానవచ్చుచున్నదిగాదే? మత్స్యోదకములకువలె వానికి సంబంధము గలదనియుఁ, బద్మపత్రజలములకుఁ బోలె వానికి సంబంధ మున్నదనియు, వారియభిప్రాయము.' అని తెలిపెనని చెప్పి గురువు మఱియు నిట్లనియె.

'ఓయీ! అప్పరమేష్ఠి యిట్లు తెలుప విని యక్షహర్షులు, మఱియు సంశయాకులితమానసులై యిట్లు ప్రశ్నించిరి.

ఋషులు మరలఁ బరమేష్ఠిని తత్త్వముఁ బ్రశ్నించుట

'ఓమహానీయా! ధర్మములలో నేయది ముఖ్యముగాఁ జేయఁ దగినదియో తెలుపుము. ధర్మగతి వివిధమై వ్యాహతముగాఁ గాన వచ్చుచున్నది. దేహనాశానంతరమును నాత్మయుండునని కొందఱ మతము. అది సంశయమని కొందఱు తెలుపుదురు. అందు సంశయ మేమియు లేదని కొందఱు తెలుపుచున్నారు. ఆత్మ యనిత్యమని తార్కికులు తెలుపుదురు. ప్రవాహరూపనిత్యత, దానికిఁ గలదని మీమాంసకులు చెప్పుదురు. ఆత్మపదార్థమే లేదని శూన్యవాదులును, కలదని సౌగతులును తెలుపుదురు. ఏకరూపమయ్యు రెండువిధ ములుగా నది యుండునని యోగాచారులును, భిన్నము నభిన్నమునై వ్యామిశ్రమని యుడులోములును దెలుపుదురు. బ్రాహ్మణులును, బ్రహ్మ జ్ఞులును, దత్త్వవేత్తలునగు కొందఱు బ్రహ్మ మొక్కటియే యని తెలుపుదురు. అసాధారణకర్మములే కారణములని మఱికొందఱు మీమాంసకు లనియెదరు. కారణములకు బహుత్వమున్నదని పరమా ణువాదులు తెలుపుదురు. దేశకాలములె నిమిత్తములని జ్యోతిశ్శాస్త్ర లును, స్వప్నరాజ్యమువలెఁ జిద్విలాసమాత్రముగాని మఱియొకటి లేదని మఱికొందఱును దెలుపుదురు. అటులే కొందఱు జటాజినధరులై యుందురు. మఱికొందఱు ముండులై యుండుదురు. నైష్ఠికబ్రహ్మచర్య మును గొందఱును, గార్హస్థ్యమును మఱికొందఱును శ్రేయస్సాధన ముగాఁ దలంతురు. దేవతాతిథిశేషము నాహారముగఁజేయవలయునని కొందఱును, నిరశనవ్రతముత్తమమని కొందఱును గోరుచుందురు. కర్మ మునుగొందఱును, శాంతిని గొందఱును బ్రశంసింతురు. మఱికొందఱు మోక్షమును, వేఱొకకొందఱు భిన్నభిన్నములగు యోగములను గౌరవింతురు. ధనములు శ్రేయస్సాధనమని కొందఱును, నిర్ధనత్వమే యుత్తమగతి నిమిత్తమని మఱికొందఱును దెలుపుదురు. ధ్యానాదిక మొనర్పవలయునని కొందఱును, నది యొనర్చినను ఫలము లేదని కొందఱును దెలుపుదురు. అహింసానిరతులు కొందఱును, హింసా

పరాయణులు కొందఱును నైయుందురు. యశఃపుణ్యములచే శ్రేయ మగునని కొందఱును, వానిచేఁ గాదని కొందఱును దెలుపుదురు. సద్భావనిరతులు కొందఱును, సంశయితాత్మలు కొందఱు నై యుందురు. ధ్యానము దుఃఖనివర్తకమని కొందఱును, సుఖనిమిత్తమని మఱికొందఱును దెలుపుదురు. యజ్ఞమే యుత్తమమని కొందఱును, దానము శ్రేష్ఠమని మఱికొందఱును దెలుపుదురు. తపమును గొంద ఱును, స్వాధ్యాయమును గొందఱును బ్రశంసింతురు. జ్ఞానమును గొందఱు సన్న్యాససాధ్యమనియును, స్వభావసాధ్యమని మఱికొంద ఱును దెలుపుదురు. అన్నియు నుత్తమమని కొందఱును, నేవియుఁ గావని మఱికొందఱును దెలుపుదురు. ఇట్లు ధర్మము బహువిధము లుగా బోధితమై కన్పట్టుచుండ, మేము మూఢులమై నిశ్చయ మెఱుంగ కున్నారము. ఇదియే శ్రేయస్కరము, ఇదియే శ్రేయః ప్రదము, అని జనము తలంచుచున్నది. ఎవ్వని కేధర్మ మిష్టమగునో, దానినే యాతఁడు గౌరవించుచున్నాఁడు. అటులగుట మాప్రజ్ఞ విహతమై చిత్తము పలు విధములఁ బరుగిడుచున్నది. ఓమహనీయా! శ్రేయ మెట్టిదో మాకు వినిపింపఁ గోరుచున్నారము. వీనికంటె మించినరహస్య మెద్దియో దానిని మా కెఱిఁగింపుము. సర్వక్షేత్రజ్ఞులకు సంబంధము గలుగు టలో నిమిత్తమేమి ?' అని ప్రశ్నించుటయు, నతఁడు యాథాతథ్య ముగా వారికి శ్రేయోమార్గ మెఱిఁగించువాఁడై యిట్లు తెలిపెను.

### పరమేష్ఠి శ్రేయ మెఱిఁగించుట

'ఓమహర్షులారా ! మీరు నన్నడిగినవిషయమును గూర్చి గురు శిష్యులకు జరిగినసంవాదము గలదు. దాని నెఱిఁగించెదను వినుఁడు. దానినెల్ల విందురేని లెస్సగా మీసంశయము దీఱెడిని. సకలభూతము లకును హింస యొనర్పకుండుటయే కర్తవ్యమని నాయభిప్రాయము. అయ్యది యుద్వేగము గలిగింపని దగుట నుత్తమమై ధర్మలక్షణమగు చున్నది. నిశ్చయవేత్తలగుపెద్దలు జ్ఞానమే శ్రేయస్కరమని తెలుపు చున్నారు. కావునఁ బరిశుద్ధమగుజ్ఞానముచే సకల కిల్బిషవిముక్తుఁ డగు చున్నాఁడు. ఎవ్వరు లోభమోహాసమాయుక్తులై హింసాపరులను, నాస్తికవృత్తులును నగుచుందురో, వారు నిరయగాము లగు

చున్నారు. ఎవ్వరు ఫలకాములై కర్మము లొనర్తురో, వారు తత్కర్మానుసారముగా నాయాలోకముల మఱిమఱియు జనించుచు సంతసించుచుందురు. ఎవ్వరు శ్రద్ధాయుక్తులై, వివేకులై, ఫలకామనాశూన్యముగాఁ గర్మము లొనర్తురో, వారే సాధుమార్గదర్శు లనఁబడుచున్నారు. ఓమహర్షులారా! ఇఁక సత్త్వక్షేత్రజ్ఞులకు సంయోగవిప్రయోగములవిధ మెట్టిదో యెఱిఁగించెదను వినుఁడు. విషయవిషయిత్వసంబంధ మొకటి గలదుగాదే? అందు సత్త్వము విషయము. పురుషుఁడు విషయి. మశకోదుంబరముల కట్లు నా యీ తెలిపినసంబంధము పూర్వకల్పమునఁ దెలుపఁబడియెను. అచేతనమగు సత్త్వము నిత్యము భుజ్యమానమగుచుండుట తెలియఁజాలదు. పురుషుఁ డన్ననో భోజ్యభోక్తృభావద్వయమును దెలిసికొనఁగలఁడు. సత్త్వమును నిత్యమనియు, ద్వంద్వసమాయుక్తమనియును దెలుపుదురు. క్షేత్రజ్ఞుఁడు, నిర్ద్వంద్వుఁడును, నిష్కళుఁడును, నిర్గుణాత్మకుఁడును, నిత్యుఁడునగుచున్నాఁడని తెలుపుదురు. పురుషుఁడు స్వకీయసత్తాస్ఫూర్తిని సత్త్వమునకు సమర్పించి, సత్త్వసంజ్ఞానుగతుఁడై యంతటను బ్రవర్తించుచుండును. పద్మపత్రము జలమునట్లు పురుషుఁడు సత్త్వసంబంధము గలిగి తద్ధర్మముల ననుభవించుచుండును. వివేకియగుపురుషుఁడు సకలగుణములతో సంబంధము గలిగియుఁ, బద్మపత్రసంస్థితమగు జలబిందువట్లు సక్తుఁడు గాక యుండును. ఇటులే పురుషుఁడు సత్త్వసంయుక్తుఁడు గాక ప్రవర్తించును. అందు సందియము లేదు పురుషుఁడు సత్త్వమును గలిసి సత్త్వమాత్రమగు నిశ్చయము. కర్తకును ద్రవ్యమునకును గలసంబంధమే సత్త్వక్షేత్రజ్ఞుల కగుచున్నది. దీపసహాయముచే నొక్కఁడు చీకటిలోఁ బోవునట్లు విద్యాహ్వాయమగు సత్త్వపరిణామవిశేషముచేఁ బరము నొందఁ గలుగుచున్నాఁడు. తైలము, వత్తియుఁ గలంతకాలమే దీపము ప్రకాశించును. ఆగుణద్రవ్యములు రెండును క్షీణించినతోడనే జ్యోతియు నంతర్ధానమగును. అటులే చరమవృత్తిరూపమగు సత్త్వగుణ మభివ్యక్తమై తన్నును బురుషుని నభివ్యక్తమొనర్చును. ఓమహర్షులారా! ఈవిషయమును దెలిసికొనుఁడు. మఱియుఁ దెలిపెదను వినుఁడు. దుర్బుద్ధియగువాఁడు వేయియుపాయములచేనైన బుద్ధిని బొందఁజాలఁడు, బుద్ధిమంతుఁడు నాలవపాలున్నను

సుఖముగా బ్రతుకఁగలఁడు. ఇటులే ధర్మసంసాధన ముపాయముగాఁ దెలిసికొనవలయును. ఉపాయజ్ఞుఁడగు బుద్ధిశాలియే యధికసుఖ మొందుచున్నాఁడు. త్రోవఁబోవుమానవుఁడు దారిబత్తెముపట్టికొనక వెడలి శ్రమమొందుటయెగాక యాత్రోవనడుమ నెట్లు నశించునో, యటులే యుపాయరహితుఁడు నశించును. మఱియు నటులే జ్ఞాన సాధనములగు కర్మములను సరిగా జరపునపుడే ఫలమగును. దీర్ఘమార్గ మును గాలినడకతోఁ గడచినట్టులుగాఁ దత్త్వదర్శనశూన్యుఁడు నిజా దృష్టపూర్వముగా నుత్తమగతి నొందఁగలుగును. గుఱ్ఱములు గల రథముతో నెట్లు దీర్ఘమార్గమునేని, వడిగాఁ గడవఁగల్గునో, యటులే బుద్ధిమంతుఁడు శాస్త్రమునుబట్టి వడిగా నుత్తమగతి నొందును. పొడవైనపర్వతమెక్కి యెట్లు భూతలసంబంధము లేక యుండునో, పరమపదమందినవాఁడు శాస్త్రము నట్లే యుపేక్షింపకుండవచ్చును గాదే? రథికుఁడు రథమార్గమున్నంతవఱకు రథముతోఁ బోవును. అది మఱి క్షీణింపఁగానే, యారథమును విడిచిపోవునుగాదే! అటులే మేధావి, యోగవిధానవేత్తయై, చిత్తశుద్ధిగలిగిన పిదప విధిశాస్త్ర ములను బరిత్యజించి, హంసపరమ హంసాద్యాశ్రమములకుఁ బోఁగలు గును. మహాఘోరమగుపారావారము నోడవిడిచి ప్రవేశించి, బాహు వులతోఁగడచుటకుఁ గోరునేని, మోహవశుఁడై యతఁడు మరణ మునే గోరినవాఁడగును. ప్రాజ్ఞుఁడు విభాగజ్ఞుఁడై యోడనెక్కి యనాయాసముగా సముద్రమును గడవఁగలుగును. కాని యోడచే స్థలములుగాని, రథముచే సముద్రమునుగాని దరింప వలనుపడదు గదా! అటులే కర్మాధికారి యోగమును, యోగాధికారి కర్మమును జేయరాదు. ఇటులే కర్మఫలమునైతము చిత్రముగను వివిధముగను నుండును. గృహస్థునకు శ్లాఘ్యమైనధర్మము పరివ్రాజకునకుఁ బాతిత్య హేతువు. మునులు, శబ్దస్పర్శరూపరసగంధములులేనిదియే, ప్రధాన మని తమబుద్ధిని దలంచుచున్నారు. ప్రధానమే యవ్యక్తము. దాని గుణము మహత్తత్త్వము. మహత్తత్త్వగుణ మహంకారము. అహంకార సంభూతము లగునవి పంచభూతములు. వానిగుణములు శబ్దాదులు. అందాకాశగుణము శబ్దము. వాయుగుణము స్పర్శము. అగ్నిగుణము రూపము. జలగుణము రసము. భూమిగుణము గంధము. అవ్యక్త

ముందుఁ గారణత్వమును గార్యరూపమును గలదు. అటులే మహత్తును, బీజధర్మమును బ్రసవాత్మకము నగుచున్నది. అహంకారము నైతము బీజధర్మము ప్రసవాత్మకమునై వెలయుచుండును. పంచమహాభూతములును బీజప్రసవధర్మములుగలవియే యగుచున్నవి. పంచభూతవిశేషములగు శబ్దాదులును బీజప్రసవధర్మాశ్రితములై యుండును. వానికి వ్యావర్తకమగునది, చిత్తము యగుచున్నది. వానిలో నాకస మొకశబ్దగుణముమాత్రము గలిగియుండును. వాయువునకు శబ్దస్పర్శంబులును, నగ్నికి శబ్దస్పర్శరూపంబులును, జలములకు శబ్దస్పర్శరూపరసంబులును, భూమికి శబ్దస్పర్శరూపరసగంధంబులును గుణంబులై యుండును. ఆభూమి చరాచరసంకులమును, సర్వభూతకరియు, శుభాశుభనిదర్శనియు నగుచున్నది. శబ్దస్పర్శరూపరసగంధములైదును భూమిగుణములు. నిత్యమగుపార్థివగుణము గంధము. ఆగంధము బహువిధముగా నుండును. వానిని విస్తరించి తెలిపెదను. 'ఇష్టగంధము అనిష్టగంధము' అని రెండువిధములు. మఱియు మధురము, కటువు,అమ్లము, నిర్హారి,సంహతము, స్నిగ్ధము,రూక్షము, విశదము అను విధమై మొత్తము పదివిధములుగ నుండును. ఇదియే పార్థివగంధము. ఇటులే శబ్దస్పర్శరూపరసములు జలగుణములు. రసజ్ఞానమునుగూర్చి తెలిపెదను. రసము బహువిధములు.మధురము, అమ్లము, కటువు, తిక్తము, కషాయము, లవణము అని యాఱువిధములై జలమయమై వెలయును. అటులే జ్యోతిర్గుణమగురూపమును ననేకభంగులై యొప్పుచుండును. శుక్లము, కృష్ణము, రక్తము, నీలము, పీతము, అరుణము, హ్రస్వము, దీర్ఘము, కృశము, స్థూలము, చతురస్రము, వృత్తము అని పండ్రెండు విధములుగా నుండును. మఱియు వాయుగుణమగుస్పర్శమును, బహువిధములై యుండును. రూక్షము, శీతము, ఉష్ణము, స్నిగ్ధము, విశదము, కఠినము, చిక్కణము, శ్లక్ష్ణము, పిచ్ఛిలము, దారుణము, మృదువు అనువిధముగాఁ బండ్రెండుభంగులై వెలయుచుండును. ఆకాశగుణమగు శబ్దమునైతము బహువిధములుగా నుండును. షడ్జము, ఋషభము, గాంధారము, మధ్యమము, పంచమము, నిషాదము, ధైవతము, ఇష్టము, అనిష్టము, సంహతము అని యది పదివిధములు గలదిగాఁ జూపట్టుచున్నది. ఆకాశ ముత్తమభూతము. దానికంటెఁ

పరమైన దహంకారము. అయ్యహంకారముకంటెఁ బరమైనది బుద్ధి. దానిని మించిన దాత్మ. దానికంటెఁ బరమైనది వ్యక్తము. ఆయవ్యక్తముకంటెఁ బరుఁడు పురుషుఁడు. భూతముల పరాపరస్థితి నెఱిఁగి, సకలకర్మవిధిజ్ఞుఁడై సకలభూతాత్మభూతుఁడైనవాఁ డవ్యయుఁడగు పరమాత్ముని బొందఁగలుగుచున్నాఁడు." అని తెలిపి యప్పరమేష్ఠి మఱియు నిట్లనియె.

భూతసృష్టివిధమెఱిఁగించుట

ఓమహాత్ములారా! మనస్సే పంచభూతములకు నీశ్వరుఁడు. మఱియు వానిసృష్టిసంహారములకును మనసే యీశ్వరుఁడు. కుండలాదులకుఁ గనకమట్టులు భూతములకు మనసే స్వరూపము. మహాభూతములకు మనసే, కులాలస్థానీయమై యధిష్ఠాత యనఁబడుచున్నది. మనస్సునకు బుద్ధి యీశ్వరుఁడు. అదియే క్షేత్రజ్ఞుఁ డనఁబడుచున్నది. మనస్సింద్రియములను, సారథి యశ్వములనుబోలెఁ బ్రేరించును. ఇంద్రియములను మనస్సును, బుద్ధిక్షేత్రజ్ఞునందుఁ గూర్చుచుండును. ఇంద్రియము లనియెడియశ్వములు పూన్చినబుద్ధిసారథికమగు శరీరరథము నధిష్ఠించి యాభూతాత్ముఁ డెల్లయెడల జరించుచుండును. అదియ యింద్రియాశ్వసంయుక్తమై మనస్సారథికమై నిత్యము బుద్ధిప్రతోదమైనచో నంతర్ముఖమై మహత్తరమగు బ్రహ్మమయరథ మగుచున్నది. ఎవ్వఁడు వివేకియై బ్రహ్మమయరథవిధ మిట్టిదని తెలియునో, వాఁడు సకలభూతములందును మోహావశుఁడుగాక సుఖించును. అవ్యక్తాదిగుణాంతమై స్థావరజంగమాత్మకమై సూర్యచంద్రప్రభాలోకముగలిగి, గ్రహనక్షత్రమండితమై నదీపర్వతాలంకృతమై బహువిధజలభూషితమై సకలభూతజీవనాధారమై సర్వప్రాణిగతియై యవ్యక్తాద్యాత్మకమై బ్రహ్మవన మనఁబడు నీయాత్మలోకమునఁ జేతనుఁడు చరించుచుండును. ఇఁకఁ బై దెలిపిన నీలోకముననే నేత్రనిమీలనమాత్రమున జంగమస్థావరములు లీనమగును. పిదప గుణశక్తిచే శ్రోత్రాదులగునింద్రియములడంగును. పిమ్మటఁ బంచభూతములును నడఁగును. మఱియు దేవగంధర్వపిశాచాసురరాక్షసమానవాదులుగల సకలమును స్వభావముచేతనే జనించునుగాని యాగాదిక్రియచేఁ గాని, బ్రహ్మాదికారణముచేఁగాని జనింపదు. 'ఓవిప్రులారా! ఈమరీచిప్రభృతులగు విశ్వ

స్రష్టలును భూతప్రళయమున నడఁగి మఱిమఱియు జనించుచుందురు. తరంగములు సాగరమున జనించి యందే యడఁగునట్టులు, ప్రపంచమెల్లఁ బంచమహాభూతములందే జనించి యందే యడఁగుచుండును. విశ్వస్రష్టలగుస్థూలభూతములకంటె సూక్ష్మభూతములు పరమైనవి. వానికంటెను ముక్తుఁడు పరమగతినొందుచున్నాఁడు. ప్రభువగు ప్రజాపతి దీనినంతయు మనసుచే సృజించెను. అటులే మహర్షులు తమతపముచే దేవతలను బడసిరి. ఫలమూలాహారముగల తపముత్తమమైనది. దానిచే వారుసిద్ధులై సమాధిచేఁ ద్రైలోక్యమును గనిపెట్టుచున్నారు. మఱియుఁ దపముచేతనే చికిత్సలను, నౌషధములను' సకలవిద్యలును సిద్ధించుచున్నవి. అన్నిటికినిదపమే మొదటిసాధనము. దుర్లభమగునింద్రపదముగాని, దురామ్నాయమగు వేదాదికముగాని, పొందశక్యముగాని వహ్ని మొదలగునవిగాని, మఱియునెట్టివేనిగాని తపస్సాధ్యములుగాక తప్పదు. దానికి సాధ్యముగాని వేవియు నుండఁజాలవు. సురాపాయి, బ్రహ్మహంత, సువర్ణస్తేయి, భ్రూణహంత, గురుతల్పగుఁడు అనియెడి పంచమహాపాపులును దపముచేఁబాపవిముక్తులగుచున్నారు. మానవులు, పశువులు, మృగములు, పక్షులు, దేవతలు, పితృదేవతలును, మఱియుఁగల జంగమస్థావరభూతములు తపఃపరాయణములగుచునే సిద్ధినొందఁగలుగుచున్నవి. మహామాయులగు దేవతలును దపముచేతనే స్వర్గము నొందిరి. ఎవ్వరు జాగరూకులై ఫలాపేక్షతో నహంకారసమాయుక్తులై యుత్తమకర్మము లాచరింతురో, వారు ప్రజాపతిలోకమును బొందుచున్నారు. ఎవ్వరు పరిశుద్ధమగుధ్యానయోగముచే నిర్మములును, నిరహంకారులును, మహాత్ములునై వర్తింతురో, వారుత్తమలోకమును బొందుచున్నారు. మఱియు నట్టిధ్యానపరులు ప్రసన్నమతులై యాత్మవేత్తలై సుఖోపచయమగు నవ్యక్తమును బ్రవేశించుచున్నారు. ధ్యానయోగమును సమీపించి మృతినొందిన వారు నిరహంకారులును, నిర్మములునై యవ్యక్తమును బ్రవేశించి యుత్తమలోకము నొందుదురు. అవ్యక్తమునుండియే జనించి యవ్యక్తమున లీనుఁడైనయోగి తమోరజోగుణవిముక్తుఁడై కేవలసత్త్వము నొంది సకలపాపవిముక్తుఁడై కారణత్వ మాశ్రయించి, సకలమును సృజించును. ఎవ్వఁడు క్షేత్రజ్ఞు నీశ్వరునిఁగాఁ దెలిసికొనునో,

వాఁడే వేదవేత్త యనఁబడుచున్నాఁడు. మనోహేతుకముగా సమ్యగ్జ్ఞానమునొంది, ముని సంయతుఁడై వర్తించెనేని, తాను దేనియందు జిత్తముంచునో, తన్మయుఁడగుచు సనాతనుఁడగుచున్నాఁడు. అవ్యక్తము మొదలు శబ్దాలవఱకునుగలవన్నియు, నవిద్యాశబ్దవాచ్యములగుచున్నవి. ఇదియే గుణలక్షణమని తెలియుఁడు. "మమ" యనెడి యక్షరద్వయమే మృత్యువు. "నమమ" యనియెడి యక్షరత్రయమే శాశ్వతబ్రహ్మము. మందబుద్ధులగు కొందఱుమానవులు కర్మమునే ప్రశంసించుచున్నారు. వృద్ధులగుమహాత్ములు, కర్మము నంతఁగాఁ బ్రశంసింపరు. కర్మముచేతనే షోడశాత్మకుఁడు మూర్తిమంతుఁడై జనించుచున్నాఁడు. ఆపురుషుని విద్యగ్రసించుచుండుట నదియే, యమృతాశులగువారి కుపాదేయమై యున్నది. కావున నెవ్వరు వివేకులై కర్మములం దాసక్తినొందకుందురో వారే యుత్తములు. పురుషుఁడు విద్యామయుఁడుగాని, కర్మమయుఁడు గానేరఁడు. ఎవ్వఁడిట్లు పురుషుని నమృతాత్ముఁడు, నిత్యుఁడు, అగ్రాహ్యుఁడు, శాశ్వతుఁడు, అక్షరుఁడు, వశ్యాత్ముఁడు, అసంశ్లిష్టుఁడును నై యుండునని తెలియునో వాఁ డమృతుఁడగుచున్నాఁడు. ఆత్మ నెవ్వఁ డగ్రాహ్యముగను, ననాదిగను, నకృతముగను, నమృతాశనముగను, నవిచారిగను దెలిసికొనునో వాఁ డగ్రాహ్యుఁడు నమృతుఁడు నగుచున్నాఁడు. సకలసంస్కారములచే సంస్కరించికొని, యాత్మ నాత్మయందు నియమించినవాఁడు, పునర్జన్మరహితమగుశుభము నొందుచున్నాఁడు. సత్వప్రసాదముగలిగినచో, శాంతినొందును. బహిస్సంజ్ఞాశూన్యముగాఁ జిత్త మంతఃప్రచారము గల్గియుండుటయే ప్రసాద మనఁబడును. జ్ఞానపరినిష్ఠితులగుముక్తుల కిదియే మార్గము. వారు భూతభవిష్యద్వర్తమానజాతములగు ప్రవృత్తులనన్నిటిని దెలిసికొనుచుందురు. విరక్తులగువారి కిదియే గతి. ఇదియే సనాతనధర్మము, జ్ఞానుల కిదియే యుత్తమప్రాప్తి, ఇదియే యనిందితవృత్తము. సకలభూతములందును సమతగలిగి నిస్పృహుఁడు, నిష్కాముఁడు నై వర్తించినవాని కీగతి తెలియనగుచున్నది. 'ఓమహర్షిసత్తములారా! ఇదియెల్ల మీకెఱింగించితినిగదా! ఈమార్గము నవలంబింపుఁడు. సిద్ధినొందుఁడు." అని పరమేష్ఠి తెలిపినవిధ మెఱింగించి గురువు మఱియు నిట్లు తెలిపెను.

"ఓయీ! పూజ్యుఁడగుపరమేష్ఠి యిట్లు తెలుప విని యమ్మునులు, పరమానందభరితులై తమలోకమును జేరికొనిరి. ఓయీ! మహాభాగా! నా యీ తెలిపిన బ్రహ్మవచనముల ద్రోవఁబట్టి వర్తింతువేని సిద్ధినొందఁగలవు. అని గురుశిష్యసంవాదమును దెలిపి వాసుదేవుఁడు మఱియు నప్పార్థునితో 'ఓయర్జునా! అటు లాగురుఁడు తెలిపిన ధర్మమార్గమును విని, తద్విధముగాఁ బ్రవర్తించి శిష్యుఁడు ముక్తినొందెను. ఓకురుకులోద్వహా! గురూక్తి ననుసరించి కృతకృత్యుఁడైన యాతనికిఁ బునరావృత్తిరహితమగు నుత్తమసుఖము సంప్రాప్తించెను." అని తెలిపెను.

అది విని యప్పార్థుఁడు 'ఓకృష్ణా! ఆబ్రాహ్మణుఁ డెవ్వఁడు? ఆశిష్యుఁ డెవ్వఁడు? అది విన నాకెంతయుఁ గుతూహలమయ్యెడిని. వినిపింపుము' అని యడుగుటయు నవ్వాసుదేవుఁడు 'ఓయర్జునా! నేనే యాగురుఁడను. నాకు బోధనీయమగు నామనమే శిష్యుఁడు. నీప్రీతికై యీరహస్యమును నీకెఱిఁగించితిని. ఓధనంజయా! నా యీ తెలిపినధర్మము నాచరించితివేని, సకలపాపవినిర్ముక్తుఁడవై కేవలముక్తి నొందఁగలవు. నాఁడు యుద్ధము సమీపించినపుడుగూడ నీవిషయమే తెలిపితిని. కావున నీవిద్దానిని జిత్తమందిడుము ఓభరతశ్రేష్ఠా! ప్రభుఁడగు నాతండ్రినివిడిచి చిరకాలమైనను నే నాతనిఁ గాంచలేదు. కావున నోపార్థా! నీవిష్టపడుదువేని, నే నాతనిఁ జూడఁదలంచుచున్నాఁడను.' అని తెలిపెను.

ఓజనమేజయా! అది విని యాధనంజయుఁడు "ఓదేవా! మన మిరువురము నిపుడు హస్తినాపురికిఁ బోవుదము. అటు లందులకేఁగి ధర్మాత్ముఁడగు యుధిష్ఠిరునిఁ గలిసి, యాతని కెఱిఁగించి నీవు నిజనగరమునకుఁ బోవచ్చును." అని తెలిపెనని చెప్పి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

## శ్రీకృష్ణుని ప్రయాణము

ఓజనమేజయా! అటులు పలికినపార్థుని ప్రార్థన నాలించి సమ్మతించి, యమ్మహార్థమునకే యమ్మహాత్ముఁడగు కృష్ణుఁడు తన సారథియగు దారుకునిఁ దేరు సన్నద్ధముసేయుమనుటయు, నతఁడు

సిద్ధమైయున్నదని తెలిపెను. అప్పు డప్పార్థుఁడును దనయాత్రకై తగిన సన్నాహము గావింపవలయునని సైనికుల కానతిచ్చుటయు, వారును నన్నియు సన్నద్ధములే యని సమాధానము చెప్పిరి. పిమ్మట నమ్మహాత్ము లగు వాసుదేవార్జునులు వెడలి, చిత్రకథలఁ దెలుపుకొనుచు ప్రీతు లగుచు నుండిరి. అపు డమ్మహాతేజుఁడగు ధనంజయుఁడు రథస్థుఁడై యున్న వాసుదేవు నారసి, 'ఓదేవా! నీమహానుగ్రహముచే రాజు యుధిష్ఠిరుఁడు రాజ్యము వడసెను. శత్రువులందఱును సమసిరి. రాజ్యము నిష్కంటకమయ్యెను. ఓమధుసూదనా! నీచేఁ బాండవులు నాథవంతులైరి. నీవ యోడగాఁ గౌరవసాగరమును దరింపఁగలిగి తిమి. ఓవిశ్వకర్తా! విశ్వస్తుతా! విశ్వాత్మా! నీకు నమస్కారము. నీచే నేను వివేకినైతినని తలంచుచున్నాఁడను. ఓమధుసూదనా! భూతా త్ముఁడు, నీతేజమునుండియే సంభవించెను. సృష్టిస్థితిలయరూపమగు క్రీడ నీలోకవిలాసము. ఈభూమ్యంతరిక్షములు నీమాయ. దృశ్యమానమగు నీజంగమస్థావర ప్రపంచమెల్ల నీయందలిదియే. నీవే నలువిధములగు భూతసమూహమును సృజించుచున్నాఁడవు. ఓమధుసూదనా! ఆటులే పృథివ్యంతరిక్షములును, స్వర్గమును భవత్కల్పితముల యనఁదగి యున్నవి. వెన్నెల నీనగవు. ఋతువులు నీయింద్రియములు. సతత సంచరిష్ణువగు వాయువు నీప్రాణము. నీక్రోధము సనాతనమృత్యువు. ఓమహామతీ! నీయనుగ్రహమున లక్ష్మి నివసించుచున్నది. రతియుఁ, దుష్టియు, ధృతియు, క్షాంతియు, మతియుఁ, గాంతియుఁ, జరాచర మును, యుగాంతనిధనము మున్నగువానియెడ నీవే చెప్పంబడు చున్నాఁడవు. ఎంతకాలమునకేని నీగుణములఁ బొగడఁదగువాఁడను గాను. ఓనలినేక్షణా! నీవ యాత్మవు. పరమాత్మవును నీవ. నీకు నమ స్కారము. ఓమహాత్మా! మున్నా దేవలనారదులవలనను, వ్యాసగాంగే యులవలనను నీమహత్త్వమును దెలిసికొంటిని. సకలమును నీయందే యున్నది. నీవే జనేశ్వరుఁడవు. ఓయనఘా!. అనుగ్రహపూర్వకముగా నీవు నాకెఱిఁగించినవిధముగా, సకలమును నాచరించువాఁడను. నాకుఁ బ్రియమొనర్చువాఁడవై మిక్కిలి యద్భుతమగు నీకృత్యము నొనర్చి తివి. పాపుఁడును, ధృతరాష్ట్రసుతుఁడునగునక్కౌరవ్యుఁడు నశించు టయు, నాచే వానిసైన్యము జయింపఁబడుటయు, నీమూలమున జరగి

నదిగాదే? నీవట్టి యద్భుతకృత్యము నొనర్పఁగా, మాకు జయము గలిగెను. నీబుద్ధిపరాక్రమములచే దుర్యోధను జయింపఁగలిగితిమి. కర్ణునివధించుట కుపాయము నీవు చూపించినదిగాదే? అటులే పాపుఁడగు సైంధవునియు, భూరిశ్రవసునియు, వధమున కుపాయ మెఱిఁగించితివిగాదే? ప్రసన్నుఁడవై నీవు నాకిపుడు తెలిపినవిధముగాఁ బ్రవర్తించెదను. ఇందు సందియములేదు. ధర్మాత్ముఁడగు యుధిష్ఠిరు నిపుడు కలిసికొనినపిమ్మట నీవు నీనివాసమునకుఁ బోవునట్లు లొనర్చెదను. ఓప్రభూ! నీవు ద్వారకకు వెడలుట నాకు సమ్మతమే. ఓజనార్దనా! మా మామయగువసుదేవు నచిరకాలమునఁ జూచెదుగాక. మఱియు బలదేవుఁడు మున్నగుయాదవోత్తములను నీవు చూడవలసియేయున్నది.' అని వారు పరస్పరసంభాషణ మొనర్చుకొనుచు హస్తినాపురిని సమీపించి, సంప్రహృష్టులగుచు వారిరువురుఁ, బ్రజాకులమైయున్న యద్దానిని బ్రవేశించిరి. అటులు వారు పురప్రవేశ మొనర్చి యింద్రభవనతుల్యమైన ధృతరాష్ట్రమందిరముఁ జొచ్చి జనేశ్వరుఁడగు నాధృతరాష్ట్రునిఁ గాంచి, యాతని చేరువనున్న విదుర యుధిష్ఠిరుల నారసి, మఱియు భీమసేనుని, నకులసహదేవులను, ధృతరాష్ట్రుని సేవించుచున్నయుయుత్సుని, మహాప్రాజ్ఞయగు గాంధారిని, గుంతిని, ద్రౌపదిని, సుభద్ర మున్నగుభరతకాంతలను గాంచిరి. మఱియు నందు గాంధారీపరిచారికలు కొందఱు వారికిఁ గానవచ్చిరి. పిమ్మట, శత్రుంజయులగువారిరువురును ధృతరాష్ట్రుని సమీపించి, నిజనామధేయనివేదనపురస్సరముగా, నాతనిపాదములఁ బట్టికొనిరి. అటులే గాంధారియుఁ, గుంతియు, యుధిష్ఠిరునియు, భీమునియుఁ జరణములకు నమస్కరించిరి. పిదప విదురునిఁ గౌఁగిలించి, యనామయ మడిగి, యనంతరము, వారందఱితోపాటుగా నామువుసలితేని నుపాసించుచుండ, రాత్రియగుటయు, నాధృతరాష్ట్రుఁడు యుధిష్ఠిరాదులగు కౌరవులకును జనార్దనునకును, వారివారి నివాసములకుఁబో సెలవొసంగెను. వారును వేర్వేఱ నాతనికడ సెలవుగొని తమతమనివాసములకు వెడలిరి. శ్రీకృష్ణభగవానుఁ డప్పార్థునిమందిరమునకుఁబోయి, యాతనిచేఁ బూజితుఁడై, ధనంజయునితోఁగూడ సకలభోగపురస్సరముగా నిదురించెను. ఆరేయి గడచుటయు, నామఱునటిదినము, పూర్వాహ్ణ

క్రియల నిర్వర్తించి యుధిష్ఠిరమందిరమునకు వెడలిరి. అపు డయ్యుధిష్ఠిరుఁడు మంత్రులతోఁగూడి కొలువుదీర్చియుండెను. పరమపూజ్యులైయున్న యాతనిమందిరము నవ్వాసుదేవార్జును లటులు ప్రవేశించి, యశ్వినీదేవత లాయింద్రు నట్టులాతని దర్శించి, యాతనిచేతను ననుజ్ఞాతులై యాసనములఁ గూర్చుండిరి. పిమ్మట నమ్మేధావియగు యుధిష్ఠిరుఁడు వారి నారసి "ఓయదుకురుకులోద్వహులారా! వాసుదేవార్జునులారా! వీరులారా! మీరేమో చెప్పఁదలంచియున్నట్టు లగపడుచున్నారు. అదేద్దియో తెలుపుఁడు. మీకు వలయుదానినెల్ల సమకూర్చువాఁడను. జాలము వలదు. ఆలోచింపవలసినది లేదు." అని పలుకుటయు, నప్పార్థుఁడు, యుధిష్ఠిరు నారసి, సవినయముగా లేచి, "ఓయన్నా! ప్రతాపనిధియగు మనవాసుదేవుఁడువచ్చి యిచ్చటఁ జిరకాల ముండెనుగాదే? కావునఁ దమయానతి వడసి వసుదేవుని దర్శింపఁబోవఁ గోరుచున్నవాఁడు. ఇతఁ డిపుడు ద్వారకకుఁ బోవలసియున్నది." అని విన్నవించెను. అదివిని యయ్యుధిష్ఠిరుఁడు "ఓకేశవా! పుండరీకాక్షా! నీకు శుభమగుఁగాక. మామామయగు శూరసేనుని దర్శింప ద్వారవతికిపుడే వెడలుము. ఓమహాబాహూ! నీప్రయాణము నాకు సమ్మతము. పూజ్యుఁడగువసుదేవుఁడును దేవకియు నిన్నుఁ జూడ వాంఛించియుందురు. నీవు వడిగా వెడలి మామయగువసుదేవుని, బలరాముని, నామనవిగా గౌరవింపుము. నన్నును, మాభీముని, బార్థనకులసహదేవులను మఱవక స్మరించుచుండవలయుఁజుమీ! నీ వాయాదవులను నీతండ్రిని దర్శించి, నాయొనర్చుహయమేధమునకు రావలయును. వివిధములగు రత్నములను దీసికొనిపొమ్ము. మఱియు నీకు వలయుమనోజ్ఞమగునది యెల్లఁ దీసికొనిపోవచ్చును. ఓకేశవా! నా యీవసుంధరావలయమెల్ల నీయనుగ్రహముచే లభించినదిగాదే? మఱియు మమ్ము మార్కొనినవైరివీరులెల్ల నీయనుగ్రహముచేఁగాదే! పరాజితులగుట?" అని ధర్మజుఁడు పలుకుటయుఁ, బురుషోత్తముఁడగు వాసుదేవుఁ డాతనితో "ఓధర్మరాజా! ఈరత్నములును, నీధనము, సమస్తవసుంధరయు నీయదియ. ఓమహాభుజా! మఱియు నాయింటఁగలద్రవిణమునకు సైతము నీవ యధీశుఁడవు." అని తెలిపెను. అంత నాధర్మజుఁడును వాసుదేవునిఁ బూజించెను. పిదప నవ్వాసుదేవుఁడు కుంతికిఁ బ్రణమిల్లి

యామెచే నభినందితుండై, విదురాదుల గౌరవము లంగీకరించుచు, నా చతుర్భుజుండు హస్తినాపురమునుండి, దివ్యరథ మధిరోహించి ప్రయాణమై, యుధిష్ఠిరుని సెలవునొంది, సుభద్ర నారథముపైం గూరుచుండం బెట్టుకొనియెను. సుభద్రయుం దనయ త్తయానతినొంది రథ మధిరోహించుటయుం, బౌరజనావృతుండై యతండు వెడలెను. సాత్యకితోం గూడం బార్థుండును, నకులసహదేవులును నాతని ననుసరించిరి. విదురుండు నాతనిం గొంతవఱకు వెంబడించెను. పిమ్మట నామహనీయుండు వారికెల్ల సెలవొసంగి మరల్చి, సాత్యకిదారుకులతో వడిగా రథమును బోనిమ్మని ప్రేరించెను. అటులు ప్రోత్సహించి యాసాత్యకితోంగూడ నమ్మహనీయుండు, శత్రుగణములను వధించినయింద్రుండు స్వర్గమును జేరినట్లు ద్వారక నతండు ప్రవేశింపంబోయెను. అని తెలిపి మఱియు వైశంపాయనుం డిట్లనియె.

### కృష్ణోదంకులసంవాదము

ఓజనమేజయా! అటులు ద్వారకకు వెడలిన యవ్వాసుదేవుని ననుసరించివచ్చినవారందఱును గౌంగిలించికొని మరలిరని తెలిపితిని గదా! అపుడు పార్థుండు మఱిమఱియు నమ్మహాత్ముని గాఢాలింగనము గావించి, యాతనిరథము తనదృష్టికి గోచరించునంతవఱకును జూచుచు, నాగోవిందునియెడ నిలిపినదృష్టి నతికష్టముగా మరలించెను. శ్రీకృష్ణభగవానుండును నటులే యాపార్థునుండి దృష్టిమరల్పంజాలక యెట్టెటో మరలించి వెడలెను. ఆతని ప్రయాణమున సంభవించిననిమిత్తములను దెలిపెదను వినుము. అవి మిక్కిలి యద్భుతములైనవి. గాలి కడు వడిగా నాతనిరథము ముందుభాగమున వీచెను. దానివలన నాతని మార్గము కంటకిరజశ్శర్కరాశూన్యమై స్వచ్ఛముగా నుండెను. మఱియు నింద్రుండు, సుగంధియు, శుచియునగు జలము నాతని త్రోవలో ముందుగా వర్షించుచుం బోయెను. ఆశార్ఙ్గధారి కెదుటం బుష్పవర్షములు గురిసెను. అమ్మహాబాహుం డటులు వెడలి, యమితతేజుండును మునివర్యుండునగు నుదంకుని దర్శించి, సర్వలోకవిశ్రుతుండును, సిద్ధతాపసుండునగు నాతనిం బూజించి, యాతనిచేం బూజితుండై యాతనికుశలమును బ్రశ్నించెను. అంత నయ్యుదంకుండు మాధవు

నాదరించి "ఓకృష్ణా! నీవు కురుపాండవులయావాసమునకుఁ బోయితివి గదా! వారికి స్థిరమగుసోదరస్నేహము గల్గించితివిగాదే? ఓకేశవా! అవ్వీరులకు సంధిచేసి వచ్చియున్నవాఁడవని తలంచెదను. ఓవృష్ణిపుం గవా! వారందఱును నీకు బంధువులును బ్రియులుఁనుగదా! నీమూల మున నప్పాండవధార్తరాష్ట్రులు సంధిచేసికొని లోకమున నిఁక సుఖ ముగా విహరింతురు. ఆరాజులకెల్ల వారిరాష్ట్రమున సుఖముగాఁ గాలము గడచుచున్నదా? నీవు నాథుఁడవై వారిని శమింపఁజేయుదు వనునమ్మిక నాకెంతయును గలదు. ఆ నావిశ్వాసము సఫలమైనదా? నా కదియ చాలును." అని పలికెను.

అది విని యాభగవానుఁడు "ఓమునీంద్రా! నే నాధార్తరాష్ట్రుల కడ కరిగి సంధికై యెంతయేని యత్నమొనర్చితిని కాని, వారు నా మాట సమ్మతింపమి, సంధిసేయ వలనుపడదయ్యెను. అటులగుట వారు నపుత్రబాంధవముగా సమసిరి. బుద్ధిచేఁగాని, బలముచేఁగాని దైవము నతిక్రమింప నేవారికిని దరముగాదుగదా! ఓయనఘా! నీకావిషయ మెల్లఁ దెలియనిదిగాదు. ఆసుయోధనాదులు భీష్మవిదురాదులమగు మే మెల్ల నెంతచెప్పినను వినరైరి. అటులగుట నొకరినొకరు మార్కొని యమమందిరమునొందిరి. హతమిత్రులును, హతాత్మజులు నయ్యుఁ, బాండవు లేవురుమాత్రము మిగిలిరి. సపుత్రబాంధవముగా ధార్త రాష్ట్రులందఱును మ్రందిరి." అని తెలిపెను.

అటులు తెలిపిన యవ్వాసుదేవునివచనములు తనచెవులఁ బడిన తోడనే యమ్ముని కోపవివశుఁడై కన్నులెఱ్ఱచేసి, "కృష్ణా! నీవు నివా రింప శక్తుఁడవయ్యు నుపేక్షించి వారిని రక్షింపవైతివి. వారు నీకు సంబంధులును బ్రియులునయ్యు, నీచే నిటులు రక్షింపఁబడమి నాకెం తయు నసమ్మతము. కావున నిన్నిపుడు నేను దప్పక శపింతును. వారి యుద్రేక మడంచి, నీవు వారినేల వారింపవైతివి? ఓమధుసూదనా! అటు లగుట నాకుఁ గోపమొదవెను. నిన్ను శపించెదను. నీవు శక్తుఁడవయ్యు మిథ్యాచారుఁడవై, యటులొనర్చుటలో సందియము లేదు. నీయుపేక్ష వలననే వారు యమక్షయమునొందిరి." అని పలికెను.

అంత నవ్వాసుదేవుఁ డాయుదంకునితో "ఓభృగునందనా! నే నాచరిత్రమును విస్తరించి తెలిపెదను వినుము. అది విని శాంతివహిం

ప్రము. నీవు తపస్వివి గాదే? ఓభార్గవా! నా తెలిపినయథార్థ్యముసు ంచుచేని శపింపక శాంతింతువు. నన్నెవ్వఁడును నల్పతపముచే నభి భవింప సమర్థుఁడుగాఁడు. ఓతపోనిధీ! నీతపము నశించుట నాకిష్టము గాదు. నీతప మెంతయు దీప్తమైనది. నీతపమునకుఁ బెద్దలగువారంద ఱును సంతసించుచున్నారు. ఓద్విజోత్తమా! నీకౌమారమును బ్రహ్మ చర్యమును నే నెఱుంగుదును. కష్టముగా నార్జించినతపము చెఱుచు కొందువా! నా కది యిష్టము లేదు." అని తెలుప విని యుదంకుఁ డిట్లనియె.

## ఉదంకునకు కృష్ణుఁడు నిజమహత్త్వమును దెల్పుట

"ఓకృష్ణా! అనిందితమగు నయ్యథార్థ్యవిధ మెట్టిదో నాకెఱిఁ గింపుము. అది విని నీకు శ్రేయమేనిఁ గూర్తును. లేదా శాపమే నొసంగు దును."

అది విని యవ్వాసుదేవుఁడు "ఓమునివర్యా! వినుము సత్త్వరజ స్తమములనియెడిభావములు మదాశ్రయములని తెలియుము. అటులే రుద్రులును, వసువులును, నావలనఁ బ్రభవమొందిరని గ్రహింపుము. నాయందు సకలభూతములును గలవు. సకలభూతములందును నేనుండు వాఁడను. నీ వీవిషయమును దెలిసికొని సందియమందకుము. ఓద్విజో త్తమా! అటులే దైత్యులు, యక్షరాక్షసగంధర్వులు, నాగులు, నప్స రసలు నానుండి జనించిరని తెలియుము. సదసత్తులును, వ్యక్తావ్యక్త ములును, క్షరాక్షరములును మున్నగునవియెల్ల మదాత్మకములని భావింపుము. ఓమునివర్యా! నాలుగాశ్రమములకును గలధర్మములును, మఱియుఁగల వైదికవిధులన్నియును మదాత్మకములే యని గ్రహిం పుము. శశశృంగాదికమును, ఘటాదికమును, నవ్యక్తము ననియెడి మూఁడును, దేవదేవుఁడను సనాతనుఁడనగు నాకంటె భిన్నములు గావు. ఓభృగూద్వహా! ఓంకారప్రముఖములగు వేదములను నన్నుఁగాఁ దెలియుము. యాగమునఁ ద్రిదశులకుఁ బ్రీతికరమగు, యూప, చరు, హోమాదులును, హవ్యము, హోతయు నేన యని తెలియుము. అటులే యధ్వర్యుఁడు, కల్పము, పరమసంస్కృతమగుహవిస్సు నేన యని తెలియుము. ఉద్గాత మహాధ్వరములందు ఘోషములచే నన్నే

సంస్తుతించును. ఓబ్రాహ్మణోత్తమా! ప్రాయశ్చిత్తములందు, శాంతి మంగళవాచకులును, విశ్వకర్ముఁడనగు నన్నే నిత్యము సన్నుతింతురు. ఓద్విజోత్తమా! ధర్ముఁడు నా మొదటిపుత్త్రుఁడని తెలియుము. సర్వభూతదయాత్మకుఁడగు మానసుఁడును నాకట్టివాఁడని యెఱుఁగుము. అట్టి ధర్మమందున్నట్టియు, మరలినట్టియు మానవులచే సంసారమునఁ జరించుచు బహువిధయోనులందుఁ బ్రవర్తించుచుందురు. ఓ భార్గవా! ఆయాలోకములందుఁ ధర్మమును సంరక్షించుటకును, దానిని నిలుపుటకును నే నాయారూపములతోడను వేషములతోడను వెలయుచుందుదును. నేనే విష్ణుఁడను. బ్రహ్మను నేనే. ఇంద్రుఁడను నేనే. ఉత్పత్తిలయకారకుఁడ నేన. ప్రతియుగమందును, నధర్మమునఁ బ్రవర్తించు నెల్లవారికిని, ధర్మసేతువు నేనై వర్తిల్లుచుందును. మఱియుఁ బ్రజాహితము గోరి, నే నాయాయోనులందుఁ బ్రవేశించి ధర్మము నిలుపుచుందును. ఓభృగునందనా! నేనెపుడు దేవయోనియందుఁ బ్రవర్తింతునో, యపుడ దేవుఁడనై సకలము నాచరింతును. ఎపుడు గంధర్వయోనియందు జనింతునో, యపుడు గంధర్వునట్లు సకలమును నాచరించువాఁడను. మఱియు నాగ, యక్ష, రాక్షసుల యోనులందు జనించుతఱి, నాయారీతులఁ జరింతును. మానవత్వమొంది నేనిపుడతికృపణముగా యాచించితిని. అయినను, వారు మోహావిష్టమానసులై నామాట మన్నింపరైరి. మఱియు వారికెంతయు భయము సైతము గలిగించితిని. ఎంతయేనిఁ గుపితుఁడనై యెన్నివిధములనో తెలిపితిని. కాని, వా రధర్మయుక్తులగుటను, గాలధర్మచోదితులగుటను, ధర్మనిహతులై స్వర్గతులైరి. అందు సందియములేదు. ఓద్విజోత్తమా! లోకములందుఁ బాండవులు ఖ్యాతినివహించిరి. నీవు నన్నుఁ బ్రశ్నించుట నిదియెల్ల నీకెఱిఁగించితిని." అని తెలుప విని యుదంకుఁడు మఱియు నిట్లనియె.

### కృష్ణుఁ డుదంకునకు వరమొసంగుట

"ఓజనార్దనా! నీవు జగత్కర్తవగుట నే నెఱుంగుదును. ఇది యెల్ల నీయనుగ్రహముచే నైనదియే. అందు సందియములేదు. నా చిత్తముసైతము సుప్రసన్నమై త్వద్భావగతమైనది. మఱియు నేనడిగిన

శాపమునుండియు నామనసు మరలినది. ఓజనార్దనా! నన్ను నీవే మే, ననుగ్రహింపఁదలంతువేని దానికిఁ బాత్రుఁడఁగావలయునని యూహించుచున్నాఁడను. నీయైశ్వర్యరూపమును నాకుఁ జూపుము.” అని కోరెను.

ఓజనమేజయా! అది విని యవ్వాసుదేవుఁడు ప్రీతుఁడై మున్ను ధనంజయున కెట్టిరూపము చూపెనో యద్దాని నుదంకునకును గానిపించెను. అంత నమ్ముని శాశ్వతము, వైష్ణవమునగు నాతనిరూపము గాంచెను. అయ్యది మహాభుజమై సహస్రసూర్యతుల్యమై, దీప్తిగలిగి పావకసన్నిభమై, సకలాకాశము నావరించి సర్వతోముఖమై వెలయుచుండెను. విష్ణునిదగు నప్పరమాద్భుతరూపము నటులు గాంచి, యావిప్రుఁడు విస్మయంపడుచు, “ఓవిశ్వకర్తా! నీకు నమస్కారము. ఓవిశ్వాత్మా! విశ్వసంభవా! నీపాదములచేఁ బుడమియు, శిరముచే నాకసమును వ్యాప్తము లయినవి. భూమ్యాకాశమధ్యభాగము నీజఠరముచే వ్యాప్తమై యున్నది. నీభుజములచే దిక్కు లావరింపఁబడియున్నవి. ఓయచ్యుతా! ఈప్రపంచమెల్ల నీవై యున్నవాఁడవు. అక్షయ్యము, నుత్తమమునగు నీయీరూపము నుపసంహరింపుము. ఇఁక శాశ్వతమగురూపముతోనున్న నిన్నుఁ జూడఁగోరుచున్నాఁడను.” అని కోరెను. ఓజనమేజయా! అటులు పలికిన యమ్మునియెడఁ బ్రసన్నుఁడై యాగోవిందుఁడు “ఓమునీంద్రా! నీవిందు సందియమందకుము. నా యీరూపమును దర్శించుట నీకవశ్యకర్తవ్యము.” అని తెలుపుటయు, నయ్యుదంకుఁడు, “ఓప్రభూ! ఇది నాకవశ్యకర్తవ్యమని దలంతువే నది యమోఘముగుఁగాక. కావున నాకొకవర మొసంగుము. నిర్జలమగు నీప్రదేశమున జలము దుర్లభమైయున్నది. దాని నిందు సమకూర్పుము.” అని ప్రార్థించెను. పిమ్మట నమ్మహనీయుఁడు తన తేజము నుపసంహరించి యాయుదంకునితో “ఓయీ! నీకుదకము వలసినపుడు నన్ను స్మరించుకొనుము” అని పలికి యతఁడు ద్వారకకుఁ బోయెను. పిదప నొకపు డుదంకుఁడు దప్పిగలుగ జలాభిలాషియై యామరుస్థలమునఁ దిరిగి తిరిగి యాహరిని స్మరించెను. పిదప నాధీమంతున కొకపురుషుఁడు గానవచ్చెను. ఆపురుషుఁడు దిగంబరుఁడును, మలదిగ్ధాంగుఁడునై, కుక్కలగుంపు తన్నుఁ బరివేష్టించియుండ నందా

యుదంకునకుఁ గానవచ్చెను. అతఁడొకచండాలుఁడునా భయంకరుఁడై కత్తియుఁ గార్ముకము బాణము పట్టుకొనియుండెను. వాని క్రిందిభాగమున నియ్యుదంకునకు వారిపూరము గానిపించెను. అపుడామాతంగుఁడేమియో స్మరించి నగుచు నయ్యుదంకునితో "ఓయీ! ఇటు రమ్ము భృగూద్వహా! ఇదె నానుండి నీరు వచ్చుచున్నది పరిగ్రహింపుము. మిక్కిలి డప్పిగొనియున్న నిన్నుఁ గాంచిన నాకెంతయు జాలి గలుగుచున్నది" అని పలికెను. అది వినియు నయ్యుదంకుఁడు వానియుదకమునకు సమ్మతింపకుండుటయెగాక, పరుషవచనములచే వరమిచ్చినహరిని దూషించెను. అపుడామాతంగుఁడు మఱిమఱియు నయ్యుదంకుని జలపానమొనర్పుమని పలికెను. కాని యామహాని, జలము గ్రోలుట మాని, సక్రోధుఁడై మానసము గలఁతనొందఁ దన నిశ్చయమును మరల్చుకొనలేక, యామాతంగునిమాటఁ బ్రత్యాఖ్యానమొనర్చెను. అంత నమ్మాతంగుఁడు తనకుక్కలతోఁ గూడ నందే యంతర్హితుఁడయ్యెను. అది యయ్యుదంకుఁ డారసి సిగ్గువడి, వైరిఘాతియగు శ్రీకృష్ణుఁడు తన్నటులు మోసపుచ్చెనని తలంచి యుండెను. అంత నాత్రోవనే శంఖచక్రగదాధరుఁ డరుదెంచెను. అతనిఁ గాంచి మహాబుద్ధియగు నుదంకుఁడు "దేవా! నీవట్టియుదక మొసంగఁదగునా? విప్రముఖ్యులు మాతంగునుండి ప్రవహించిన యుదకమును ద్రావుదురా?" అని పలుకుటయు, నాజనార్దనుఁడు మృదుమధురముగా నాతని నోదార్చుచు, "ఓయుదంకా! ఎట్టిరూపము ధరించిన నేమి? నీ కీయఁదగినజలమే నీ కీయఁబడినది. నీ వద్దానిని దెలియఁజాలవైతివి. నేను నీకై వజ్రపాణియగు నప్పురందరు నంపితిని. నే నాతనితో 'ఇంద్రా! నీ వాయుదంకునకు జలరూపమున, నమృత మొసంగు'మని కోరుటయు, నతఁడు నాతో 'ఓవాసుదేవా! అమర్త్యుల కర్హమగునమృతమును మర్త్యుల కెట్టులొసంగవచ్చును? మఱియే దేనిఁ గావలసిన నొసంగువాఁడను' అని పలికెను. ఓభృగునందనా! అతఁ డట్లు పలికినను నే నంతతో నుపేక్షింపక, నీకమృతమీయక తప్పదని కోరితిని. అంత నాయింద్రుఁడు నాకుఁ బ్రసన్నుఁడై మఱియు నాతో 'కృష్ణా! నే నాతని కమృతమీయక తప్పదందువేని నేనొక మాతంగ రూపమూని, మహాత్ముఁడగు నాభార్గవున కమృత మొసంగెదను,

అందుల కతఁడు సమ్మతించి ప్రతిగ్రహించునేని యిదె యాతనికడ కేఁగెదను. ఒకప్పు డతఁడు నన్నుఁ దిరస్కరించెనా? నే నాతని కమృత మొసంగను.' అని పలికి యట్టినిశ్చయముతో నతఁ డామాతంగరూపముతో వచ్చి నీకమృతము నొసంగఁబోయి నీచేఁ బ్రత్యాఖ్యాతుఁ డయ్యెను. నీవు తప్పుచేసితివి. పోనిమ్ము. కడచినదానితోఁ బనియేమి? మఱియు నీకభీష్టమగుదానిని నాశక్తికొలఁది నొసంగెదను. దుర్ధరమగు నీజలాభిలాషమును దీర్చెదను. నీకెపుడు సలిలవాంఛగలుగునో, యపుడే మరుదేశమున జలపూర్ణములగు మేఘము లుద్భవించి నీకు వలసినయుదకముల నొసంగును. ఆమేఘము లుదంకనామమున ఖ్యాతి వహించెడిని." అని తెలిపెను. అది విని యావిప్రుఁడు ప్రీతుఁడయ్యెను. ఓజనమేజయా! ఇప్పటికిని మరుదేశములం దుదంకమేఘములే వర్షించుచుండును. అని తెలుప విని జనమేజయుఁ డవ్వైశంపాయనుతో నిట్టులనియెను.

### వైశంపాయనుఁ డుదంకునిచరిత్రము జనమేజయున కెఱిఁగించుట

ఓవైశంపాయనా! ప్రభవిష్ణుఁడగు విష్ణునకే యుదంకుఁడు శాప మిడఁ దలంచెనుగదా! మహామనుఁడగు నాతఁ డొనర్చిన తపఃక్రమ మెట్టిది?

అది విని యవ్వైశంపాయనుఁడు, ఓజనమేజయా! ఆయుదంకుఁడు గొప్పతపస్వి. తేజస్వియగు నతఁ డెంతయు గురునియెడ భక్తి గలవాఁడు. అతఁడు గురునిఁ దప్ప వేఱొక్కనిఁ బూజించియెఱుఁగఁడు. ఆతని గాంచినఋషిపుత్రుల కందఱకు, నుదంకునిగురుభక్తి గలుగవలయునని మనోరథముండెడిది. ఓజమేజయా! ఆయుదంకుని చరిత్ర మెఱిఁగించెదను వినుము. గౌతమునకుఁ బలువురుశిష్యు లుండిరి. వారిలో నుదంకుఁ డొకఁడు. తనశిష్యులందఱిలో గౌతమున కుదంకునెడ నధికస్నేహగౌరవములు గలవు. ఉదంకుని దమశౌచములును సత్కార్యాచరణమును, నుపచారజ్ఞతయు నాగౌతమునకుఁ బ్రీతిని గలిగించినవయ్యెను. పిదప నొకపు డాగౌతముఁడు తనవేవురుశిష్యులకు ననుజ్ఞయొసఁగి పంపెను. కాని పరమ ప్రీతిచే నుదంకునకు మాత్రము సెలవొసఁగఁడయ్యెను. అటులు కొంతకాలమగుటయు

నమ్మహామునికి ముదిమివచ్చెను. కాని యతఁడు తనకు గురునెడఁ గల భక్తిచేఁ దనముదిమి సైతము తెలిసికొనకుండెను. ఇటులుండి యొకనాఁ డతఁడు, గురునకు సమిధలు దెచ్చుటకై యడవి కరిగి, గొప్పకట్టెల మోపు మోసికొనివచ్చి తద్భారాతిశయమునఁ బరిశ్రాంతుఁడై పుడమిఁ బడవైచెను. అతఁ డెంతయు నాఁకలిగొని యొంటలు తెలియక మోపు పడవైచునపు డాతని, వెండితీఁగవంటిదగు నొకజడ, యాకట్టియల మోపులోఁ జిక్కుకొనియెను. అటులగుట నతఁ డాకాష్ఠభారము తోడనే పుడమిఁ బడియెను. ఓజనమేజయా! పిమ్మట నమ్మహాత్ముఁ డమ్మోపుబరువుచే నలఁగి, క్షుధావిష్టుఁడగుటయుఁ, దనవయోవస్థ యాతని కెంతయు దుఃఖముగలిగింప రోదన మొనర్పసాగెను. పిమ్మటఁ బద్మముఖియగు నాతనిగురుపుత్రిక, యాతని యశ్రుధారలు పుడమిఁ బడకుండఁ జేతులతోఁ బట్టుకొనియెను. తనతండ్రి నియోగముచే, ధర్మజ్ఞయగునామె తలను వంచికొని యటు లాతనియశ్రుధారలు పట్టుకొని, తోడనే వానిచే దగ్ధములై యామె హస్తములు సహింప లేమిని, గ్రిందికి వదలెను. వాని నాపుడమియు ధరింపఁజాలనిదయ్యెను. అంత నయ్యుదంకునిఁ గాంచి, యాగౌతముఁడు "ఓయన్నా! నీవేమి యిట్లు ఖిన్నుఁడవై యున్నాఁడవు? నీచిత్తమున కిట్టి పరితాప మేల కలిగెను? ఓవిప్రమహర్షీ! సంశయమందక యందలియథార్థ మెద్దియో తెలుపుము" అని యడిగెను. అంత నయ్యుదంకుఁడు "ఓగురువర్యా! భవద్గతమానసుఁడనగుట నీకుఁ బ్రియము గూర్చువాఁడనై వర్తిలుచు నీయెడన భక్తిగలిగి, నీభావమునే యనుసరించుచుండఁగనే నన్నీ ముదిమి యాక్రమించెను. అదియును నాకుఁ దెలియదయ్యెను. సుఖమును దెలియ లేదు. నూఱేండ్లు నిండినను నా కనుజ్ఞ యొసంగవైతివి. నాకంటె వెనుకవచ్చినశిష్యులుసైతము నీయనుజ్ఞవడసి వెడలిపోయిరి. నాపై నీకు దయగలుగదయ్యెను" అని తెలిపెను. అది విని యాగౌతముఁడు "ఓశిష్యవర్యా! నీవొనర్చుశుశ్రూషనుబట్టియు, నీపై నాకుఁగల ప్రీతినిబట్టియు నెంతేని కాలముగడచినను నాకది తెలియదయ్యెను. ఓ విప్రోత్తమా! నీకిపుడు సెలవుగొనఁ బ్రీతిపుట్టెనేని నేనందుల కంగీకరించుచున్నాఁడను. వెడలిపోవచ్చును. జాలముసేయనక్కఱలేదు" అని చెప్పెను. అంత నయ్యుదంకుఁడు "ఓగురూత్తమా! నేను నీకు గురుదక్షిణగా

నొసంగఁదగినదేదియో తెలిపితేని, దానిఁ దెచ్చి యొసఁగి, పిమ్మటఁ బోయెదను. అపుడు నీవు నాకనుజ్ఞ యొసఁగెదుగాక" అని పలికెను అంత నాగౌతముఁడు "శిష్యా! గురువులకు దక్షిణయే పరితోషకరమని పండితులు తెలుపుదురు. నీయాచారమున కెంతయు సంతసించితిని. సందియము లేదు. నేనిట్లు సంతసించెదనని తెలియుము. నీవు పదునాఱువత్సరముల ప్రాయమువాఁడ వగుదేని నాకన్నియకు భర్తగాఁ దగియుందువు. అటులగుట నీకట్టివయసు నొసఁగి నాకన్నియనుసైతము నీకుఁ బత్నిగా సమర్పింతును. ఈనాకన్నియదక్కఁ దక్కినకాంత లెవ్వరును నీతేజమును సహింపఁజాలరు. కావున నీవు యువకుఁడవై యశస్వినియగు నాయీకన్నియను బ్రతిగ్రహింపుము" అని గురు వానతి యొసంగెను. అంత నయ్యుదంకుఁడు, గురుపత్నియనుజ్ఞ వడయువాఁడై వెడలి "తల్లీ! గురుదక్షిణగా నీకు నేనేమి యొసంగవలసియున్నది? ఆనతిమ్ము. నా ప్రాణములచేఁగాని, ధనముచేఁగాని నీప్రియహితములఁ దీర్పఁ గోరుచున్నాఁడను. ఈలోకమున దుర్లభమై యద్భుతమై వస్తువులలో నుత్తమమైన దేదియేని దెచ్చి నీకు సమర్పించుకొనియెదను. నాతపమునకు సాధ్యముగాని దేదియు లేదని నమ్ముము" అని పలికిన విని యహల్య యిట్లనియె. "ఓవిప్రోత్తమా! నిత్యము నీవుసేయు నమూల్యమగుభక్తి కెంతయు మెచ్చుకొంటిని. అది చాలును. నీకు శుభమగుఁగాక. నీయిచ్చవచ్చినట్లు పోవచ్చును" అని తెలిపెను. ఓజనమేజయా! అది విని యాయుదంకుఁడు, మఱియు నాగురుపత్ని నారసి, "ఓతల్లీ! నీవటు లనవలదు. నీకుఁ బ్రియమెద్దియో యానతిమ్ము" అని కోరెను. అంత నయ్యహల్య యాతనితో "ఓద్విజోత్తమా! అటులేని యొకటి వినుము. సౌదాసునిపత్ని ధరించిన దివ్యములగుమణికుండలములు దెచ్చి గురుదక్షిణగా మాకు సమర్పింపుము. నీకు శుభమగుఁగాక. నీకు సుకృతమగును" అని తెలుప విని వల్లెయని యతఁడు గురుపత్నికిఁ బ్రియమొనర్ప వెడలి పురుషాదుఁడగు సౌదాసుని సమీపించెను. అంత నాగౌతముఁడు భార్యను జూచి, "ఉదంకుఁడు గానరాఁడేమి?" అని ప్రశ్నించుటయు నామె "ఉదంకుఁడు కుండలములఁ దెచ్చుటకై వెడలె" నని తెలిపెను. అది విని యతఁడు, "నీవుచేసినకృత్య ముచితముగా లేదు. ఆసౌదాసుఁ డిపుడు శప్తుఁడై యుండుటచే బ్రాహ్మణుని వధించును.

ఏల వానికడకుఁ బంచితివి?" అని పలికెను. అంత నయ్యహల్యయు "ఓమహాత్మా! నా కావిషయము తెలియదు. అటులగుట నేనిట్లు నియోగించితిని. అయినను నీయనుగ్రహమున్నచో నాతనికి భయమేల కలిగెడిని?" అని తెలిపెను అంత నతఁ డటులే యగుఁగాక యని పలికెను.

ఉదంకుఁడును నటులు వెడలి యాసౌదాసుఁడున్న శూన్యారణ్యమును బ్రవేశించి యారాజును దర్శించెను, అని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

## ఉదంకచరిత్రము

ఓజనమేజయా! ఆయుదంకుఁ డయ్యరణ్యముఁ జేరుటయు, ఘోరదర్శనుఁడగు సౌదాసుఁడు గానవచ్చెను. ఆ రాజు మీసములు గడ్డములు బలియ, మానవరక్తసిక్తాంగుఁడై యుండెను. ఆతనిఁ గాంచి యవ్విప్రుఁడు జడియక నిలిచియుండెను. అపు డాసౌదాసుఁ డాయుదంకునిఁ గాంచి, యెదుర్కొని మహాతేజుఁడై యమునియట్లు వెఱపు గొలుపుచు, "ఓయీ! సుముఖా! ఆఱవకాలమున నాసమీపమును జేరితివి. ఓద్విజోత్తమా! ఆహారమునకై వెదకుచున్న నాకు లభించితివి" అని పలికెను.

ఉదంకుఁడు:—ఓరాజా! గురుదక్షిణకై చరించుచు నిందులకు వచ్చినవానిఁగా నన్నుఁ దెలియుము. గురునిప్రయోజనమున కుపక్రమించియున్నవానిని హింసింపరాదని పెద్దలు తెలుపుదురుగాదే?

సౌదా:—ఓద్విజవర్యా! నీవిపు డాఱవకాలమున వచ్చితివి. ఆహార మిపుడు నియతము గదా! ఆఁకలిచేఁ బీడితుఁడనై యున్న నేను నిన్నిపుడు విడుచుటెట్లు?

ఉదంకుఁడు:—ఓమహారాజా! నీమాట కావచ్చును. ఇందుల కొకసమయము చేసెదను. నేను నాగురునికార్యము నిర్వర్తించి మరల నీకడకు వచ్చి నీకు వశుఁడనయ్యెదను. నే నీకార్యమొనర్తునని గురుని కడఁ బ్రతినయొనర్చితిని. అక్కార్యము నీయధీనమై యుండుటకు నిన్ను యాచింపవచ్చితిని. నీవు నిత్యము విప్రముఖ్యులకు రత్నములు మున్నగువాని నొసంగువాఁడవుగాదే? ఓరాజోత్తమా! నీవు దాతవు.

నే నుత్తమపాత్రమను. సత్పాత్రదానము లభించెనని తెలియుము. నీయధీనమైయున్న గురుకార్యమును నిర్వర్తించి, నాచేసినశపథము చొప్పున మరల వచ్చెదను. నీకు వశుఁడనయ్యెదను. నిజముగాఁ బ్రతిన బట్టుచున్నాఁడను. ఇందు విచారింపఁ బనిలేదు. నేను మున్నెన్నఁడును ననృతము పలుకలేదు. విలాసమునకైన నసత్యమాడలేదు." అని తెలిపెను.

సౌదా:—ఓయీ! నీగురుని కార్యము నాయధీనమై యుండెనేని, యది యైనదియగాఁ దలంపుము. నే నీవిషయమున దాతను గావలసియుంటినా! ఇపుడే తెలుపుము.

ఉదంకుఁడు:—ఓపురుషవర్యా! నీవిపుడు నాకు దాతవుగా వలయు. నేను నిన్ను మణికుండలముల యాచింప వచ్చితిని.

సౌదా:—ఓవిప్రోత్తమా! నాపత్ని మణికుండలములు నీకుచితములుగావు. ఓసువ్రతా! మఱి యేదేనిఁ గోరికొనుము, తప్పకిచ్చెదను.

ఉదంకుఁడు:—"ఓరాజా! నీకు మేము ప్రమాణపాత్రులమేని యిట్టివ్యపదేశము సేయకుము. ఆమణికుండలములే నాకు దయసేయుము. నీసత్యము నిలుపుకొనుము. అని పలికెను.

ఓజనమేజయా! అపుడా సౌదాసుఁ డాయుదంకునిఁ గాంచి మఱియు నాతనితో "ఓద్విజోత్తమా! నీవు నాభార్యవద్దకేఁగి, నామాటగా మణికుండలములఁ గోరుము. శుచివ్రతయగునామె నామాట మన్నించి తప్పక నీకామణికుండలము లొసంగును. అందు సంశయము లేదు.

ఉదంకుఁడు:—ఓనరేశ్వరా! నీపత్ని యెక్కడనుండునో? నేను జూడ నెట్లు వీలుపడును? ఆమె చెంగటికి నీవు స్వయముగా నేల రాఁదగదు?

సౌదా:—"ఓబ్రాహ్మణోత్తమా! ఇపుడామె నీకొక వననిర్ఝరమునఁ గానవచ్చును. ఇది పగటి యాఱవకాలమగుట నే నామె నిపుడు చూడ వీలులేదు." అని తెలిపెను.

ఓజనమేజయా! అది విని యాయుదంకుఁడు వెడలి, సౌదాసపత్నియగు మదయంతిని గాంచి తనప్రయోజన మామె కెఱిఁగించెను. ఓభరతకులోత్తమా! ఆయుదంకునివచనము సౌదాసునిదిగాఁ దెలిసి

కొని, విశాలాక్షియగు నామదయంతి, యాయుదంకునిఁ గాంచి "ఓవిప్రోత్తమా! నీ వసత్యమాడలే దనుచున్నాఁడవు. నీమాట నిజమేని, నామగనినుండి యేదే నొకయభిజ్ఞానము తెమ్ము. ఈ నాదివ్యమణికుండలములను, దేవతలును, యక్షులును, మహర్షులును, నానాయుపాయములచే నపహరించువారై యవకాశములను గనిపెట్టుచున్నవారు. వీనిని బుడమియందుంచుచు రేని పన్నగు లపహరింతురు. ఎంగిలి సోకిన యక్షు లపహరింతురు. నిద్రచే నొకచో మఱచిన సురలు దొంగిలింతురు. ఓద్విజోత్తమా! ఈ నా తెలిపిన యవకాశములందు వారివారిచే నివి యపహరింపఁబడును. దేవరాక్షసపన్నగులనుండి ప్రమాదపడకుండఁ ధరింపఁబడవలయును. ఇవి రాత్రియుఁ బగలును సువర్ణము నొసంగుచుండును. మఱియు రాత్రి నక్షత్రములయుఁ దారలయుఁ గాంతి నాకర్షించి వెలుఁగుచుండును. వీనిని ధరించినవానికి క్షుత్పిపాసలనుండి భయము గలుగదు. అటులే విషాగ్నులనుండియుఁ, గ్రూరమృగములనుండియు, నొకప్పుడును భయము సంభవింపదు. ఇవి కుఱుచవాఁడు ధరింపవలసె నేని గుఱుచవి యగును. ఇంతయేల! ఎట్టివాఁడు ధరించినను వాని కనురూపములై సరిపడుచుండును. పరమపూజితములగు నా యీకుండలములవిధ మిట్టిదని తెలియుము. ఇవి ముల్లోకములందును బ్రసిద్ధి వడసినవి. కావున వీనికై యొకయభిజ్ఞానము తెమ్ము." అని పలికెనని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

ఓజనమేజయా! అంత నయ్యుదంకుఁ డాసౌదాసునిఁ జేరి, మదయంతి తెలిపినవిధ మెఱిఁగించి యభిజ్ఞాన మొకటి యిమ్మని కోరుటయు, నయ్యిక్ష్వాకువంశ్యుఁడగు సౌదాసుఁ డాగురుభక్తున కొక శ్లోకరూపమగు నభిజ్ఞాన మొసంగువాఁడై "ఈగతి క్షేమంకరము గాదు, వేఱొకటి యుత్తమగతి లేదు. నా యీయభిప్రాయమును దెలిసికొని మణికుండలము లీతని కొసంగుము." అని పలికెను. ఇదియే యాతఁ డొసఁగిన యభిజ్ఞానము. దీని నాయుదంకుఁ డామదయంతితోఁ దెలిపెను. అది విని యామె, యామహాత్మునకుఁ దనమణికుండలము లొసంగెను. అంత నయ్యుదంకుఁ డామణికుండలములు తీసికొని యాసౌదాసునితో "ఓరాజా! నీవిచ్చినరహస్యవచనమేమో వినఁగోరు

చున్నాఁడ"నని యడిగెను. అది విని యాసౌదాసుఁడు "ఓద్విజవర్యా! వినుము. ప్రజాస్వభావమునుబట్టి క్షత్రియులు బ్రాహ్మణులను బూజించు చుందురు. విప్రులనుండి పెక్కుదోషములు పుట్టుచున్నవి. నేను విప్రులకు నమస్కరింతును, విప్రులనుండియే నాకిట్టిదోషము గలిగెను. మదయంతీద్వితీయుఁడనగు నాకింతకు మించినగతి లేదు. స్వర్గ ద్వారమును జేరుటకును, నందు నిలుచుటకును నిది దక్క వేఱొక్క గతి గానరాదు. ద్విజాతి విరోధ మొందినరా జెట్టివాఁడైనను, లోకమున నుండుటకును, మరణించి సుఖమొందుటకును సమర్థుఁడు గాఁజాలఁడు. ఇక్కతమున నాకిష్టములైనవైనను నాయీమణికుండలముల నీకొసంగితిని. నీవిపుడేమి శపథ మొనర్చితివో యద్దానిని సఫలము గావించుకొనుము." అని తెలిపెను. అది విని యుదంకుఁడు, "ఓరాజా! నీవు చెప్పినట్టులు నాశపథమును సఫలమొనర్చికొని పిదపఁ దప్పక నీకు వశుఁడనయ్యెదను కాని, నిన్నొకటి ప్రశ్నించువాఁడనై మరలితిని." అని పలికెను. అది విని యాసౌదాసుఁడు "ఓబ్రాహ్మణోత్తమా! నీయిచ్ఛవచ్చినట్టు లడుగవచ్చును. అందులకుఁ బ్రతివచన మొసంగు చున్నాఁడను. నీసంశయ మేదియో, దానిని దొలఁగించెదను. ఇందు నీవు శంకింపవలదు." అని పలికెను. అంత నయ్యుదంకుఁడు "ఓరాజా! ధర్మనైపుణవేత్తలు విప్రుని నియతవచనునిఁగాఁ దెలుపుదురు. ఎవ్వఁడు మిత్రులయెడ విషమముగా వర్తించునో, వాఁడు దొంగ యనఁబడు చున్నాఁడు. ఓపార్థివా! నీవు నాకిపుడు మిత్రుఁడవైతివి. ఓపురుష వర్యా! నీవు నాయెడ సంమతమగుబుద్ధి నిలుపుము. నేను నీవలన నర్థము సంపాదించితిని. నీవు మానవాదకుఁడవు. అటులగుట మఱియు నీయాహారమునకై నేను వచ్చుట దగునా? కాదా?" అని యడిగెను. అందుల కాసౌదాసుఁడు, "ఓవిప్రవర్యా! నీవన్నది యుచితమందువే నిందుఁ గొంచెము తెలుపవలసియున్నది. నీవు నాసమీపమున కెట్లును రాఁదగదు. ఓభృగూద్వహా! ఇటు లేని నీకు శ్రేయమయ్యెడిని. అయా అవకాలమున నీవిందులకు వచ్చితివేని నీకు మరణము సంభవింపక తప్పదు. అందు సందియము లేదు." అని తెలిపెను.

ఓజనమేజయా! బుద్ధిమంతుఁడగు నాసౌదాసునివచనములు విని, యాతనియనుజ్ఞ వడసి, యాయుదంకుఁడు, గురుపత్నియగు నహాల్య

కడకు బయలువెడలి యాదివ్యమణికుండలములచే గురుపత్నిని సంత సింపఁజేయువాఁడై, కడువడిగా నాగౌతముని యాశ్రమమునకు మరలి, యామదయంతి చెప్పినచొప్పునఁ దత్కుండలములరక్షణమున జాగరూకుఁడై కృష్ణాజినమునఁగట్టి పోవుచుండెను. అంతఁ గొంతవడి కాతని కెంతయు డప్పి గలుగుటయు, ఫలభారసమన్వితమైన యొక బిల్వవృక్షమును జూచి యతఁ డద్దాని నధిరోహించి, దానికొమ్మ యందుఁ దనకృష్ణాజినమును దగిల్చి, కొన్ని మారేడుపండ్లు క్రిందికి బడఁద్రోయుచువచ్చెను. అటు లతఁ డాబిల్వఫలములందే దృష్టినిలిపి వానిని బడఁద్రోయుచుండుటచే నయ్యవి యాకృష్ణాజినమునకుఁ దగిలి నవి. మణికుండలములుగట్టిన యాకృష్ణాజినమున కవి మఱిమఱియుఁ దగులుటయుఁ దత్ప్రహారములచే, నయ్యజినబంధము శిథిలమై, సకుండలముగా నది యాచెట్టునుండి పుడమిఁ బడియెను. అయ్యజిన మటులు శిథిలబంధమై ధర నొఱఁగుటయు నమ్మణికుండలము లందుఁ గల యొకభుజగముకంటఁ బడవలసివచ్చెను. అంత నైరావతకుల సంభూతమగు నాసర్పము వడిగా నమ్మణికుండలముల నోటఁ గఱచికొని యచ్చేరువనున్న పుట్టఁజొచ్చెను. అటు లాకుండలము లాభుజంగమ ముచే నపహరింపఁబడుట యారసి, యాయుదంకుఁడు సోద్వేగుఁడై యాచెట్టునుండి క్రిందఁబడి దుఃఖితుఁడగుచుఁ గోపమెంతయుఁ గలుగ నొకదండకాష్ఠముఁ గొని యావల్మీకమును ద్రవ్వుచుండ నాతనికి ముప్పదైదుదినములు గడచెను. ఆబ్రాహ్మణోత్తముఁడు, క్రోధామర్ష సంతప్తుఁడై యెంతయుఁ ద్రవ్వుచుండెను. ఆతనివడిగల దండకాష్ఠప్రహారముల కోరువఁజాలక ధారుణి యెంతయు నాకులమై వడఁకసాగెను. అతఁ డప్పుడు నాగలోకమునకు మార్గమును జేయుద నను నిశ్చయ ముతోఁ బుడమిఁ ద్రవ్వుచుండ, సదశ్వయుక్తమగురథ మధిరోహించి, యందులకు మహాతేజుఁడగువజ్రపాణి యరుదెంచి యాయుదంకునిఁ గాంచెను.

ఓజనమేజయా! ఆయింద్రుఁ డొకబ్రాహ్మణరూపమున వచ్చి యాయుదంకునిదుఃఖమునకుఁ దానును దుఃఖించుచు "ఓబ్రాహ్మణోత్తమా! నీకిప్పని శక్యముగాదు. ఇచ్చోటికి నాగలోకము వేయి యోజనములదూరమున నున్నది. ఇక్కార్యము దండకాష్ఠసాధ్యము

గాదని నానిశ్చయము" అని తెలిపెను. అది విని యుదంకుఁడు, "ఓ విప్రవర్యా! నేను నాగలోకమునకుఁబోయి, కుండలములను దేఁజాలనేని, నీవు చూచుచుండఁగనే ప్రాణములఁ బరిత్యజించెదను." అని తన యభిప్రాయ మెఱిఁగించెను. ఓజనమేజయా! ఎపు డాయుదంకు నిశ్చయము దప్పింప వలనుపడకుండెనో, యపుడే యాయింద్రుఁ డాదండకాష్ఠమునఁ దనవజ్రాయుధమును గూర్చెను. అటులగుట నాయుదంకుఁడు వజ్రసారమయమగు తనదండకాష్ఠముచేఁ బుడమిఁ ద్రవ్వినాగలోకమునకు మార్గమును గావించెను. ఓరాజా! అటులు త్రోవచేసి యమ్ముని నాగలోకమును జొచ్చి యోజనసహస్రపరిమితమైయున్న యద్దాని నతఁడు గాంచెను. అయ్యది దివ్యప్రాకారవలయితమై, మణిముక్తాలంకృతమై సువర్ణకుంభములతో నలరుచుండెను. అందు స్ఫటికమయములగు సోపానములుగలబావులును, విమలోదకములగు నదులును నలరుచుండెను. మఱియు నం దాయుదంకునకు, నానాపక్షిసమాకులములగు పెక్కువృక్షములు గానవచ్చెను. ఆభృగువర్యుఁ డాలోకమునకుఁగలద్వారమును జూచెను. ఆద్వార మైదుయోజనములు వెడలుపు, నూఱుయోజనములు పొడవును గలిగి యొప్పుచుండెను. అట్టి నాగలోకము నాయుదంకుఁడు గాంచి దీనుఁడై కుండలాహరణవిషయమున నైరాశ్య మొందియుండ, శ్వేతవాలము కృష్ణవర్ణము నగుచు, నందున్న యొకయశ్వ మాతనికిఁ గానవచ్చెను. కౌరవ్యముఁ, దామ్రాస్యనేత్రమునగు నయ్యశ్వము తేజముచేఁ బ్రజ్వరిల్లుచు, నాతనితో "ఓయీ! నా యీయపానప్రదేశము నూదుము. అటులేని నీకుండలములఁ బడయఁగవు. ఐరావతసుతుఁడు నీకుండలము లీలోకమునకుఁ దెచ్చెను. నా యీచెప్పినచొప్పున కించుకే నేవగింపకుము. నీవు మున్నాగౌతమునియాశ్రమమున నన్నుఁ బూజించితివి. అటులగుట నీకుఁ బ్రసన్నహృదయుఁడనై యిటు లుపదేశింప వచ్చితిని." అని తెలిపెను. అది విని యాయుదంకుఁడు "ఓయశ్వోత్తమా! నాయుపాధ్యాయు నాశ్రమమున నిన్నుఁ గాంచుట నాకుఁ దెలియదు. నేను నీకపుడేమి యుపచార మొనర్చితినో విన గోరుచున్నవాఁడ" నని పలుకుటయు, నయ్యశ్వమయ్యుదంకు నారసి "ఓయీ! నేను నీగురునకు గురుఁడనైన యగ్నిదేవుఁడను. గురునినిమిత్తముగా నీవు

నన్ను బహువిధముల నారాధించితివి. పరమపవిత్రుఁడవై నీవు నన్నటు లారాధించుటంబట్టి నీకు నేను శ్రేయముగూర్చువాఁడనై యిటు లుపదేశించితిని. జాలముసేయక నాని యోగ మొసగింపుము." అని పలికెను. అంత నయ్యుదంకుఁ డాచిత్రభానుఁడు చెప్పినచొప్పు ననువర్తించుటయు, నయ్యగ్ని ప్రీతియుక్తుఁడై యానాగలోకమును దహించువాఁడై ప్రజ్వలించెను. పిమ్మట నయ్యశ్వరూపియగు నగ్ని రోమకూపములనుండి గొప్పధూమము వెడలి నాగలోకమునకు భయ మొదవించెను. అటు లాధూమము మఱిమఱియు వర్ధిల్లుచు నానాగ లోక మగపడకుండఁ గప్పుటయు, నయ్యైరావతావాసమున హాహా కారములు జనింపసాగెను. అపుడు వాసుకి మున్నగునాగులకుఁ బీడ గల్గునట్లు వారియాలయములన్నియు ధూమావృతములయ్యెను. అపు డాగృహములన్నియు, మంచుచేఁ గప్పఁబడిన వనపర్వతములట్లు లెం తయుఁ గానవచ్చెను. వారు పొగ దగిలి కన్నులెఱ్ఱవాఱ, వహ్ని తేజోభితప్తులై మహాత్ముఁడగు నుదంకుని సమీపించి యాతని నిశ్చ యము నడిగి, యాతని యభిప్రాయమును దెలిసికొని, సంభ్రాంతనయను లగుచు నమితతేజుఁడగు నమ్మహర్షిని విధ్యుక్తముగాఁ బూజించి యంద ఱును జేతులు మొగిడ్చి యాబాలవృద్ధముగాఁ దలలు వాంచి నమస్క రించి యతఁడు ప్రసన్నుఁడగునట్లుగా నన్నుతించిరి. మఱియు నటులు వారు సన్నుతించి యర్ఘ్యపాద్యము లర్పించి యమ్మణికుండలము లాత నికి సమర్పించిరి. అంత నయ్యుదంకుఁ డట్లు వారిచే సత్కృతుఁడై యాయగ్ని దేవునకుఁ బ్రదక్షిణనమస్కారములు గావించి తనగురు నాశ్రమమునకు వడిగా వెడలి యాగురుపత్ని కామణికుండలముల సమర్పించెను. ఓజనమేజయా! అటు లతఁడు సమర్పించి వాసుకిప్రభృతు లగునాగులతో జరగినవిధమంతయు విన్నవించెను. ఓరాజా! ఆయు దంకుఁ డిట్లు ముల్లోకములను బరిభ్రమించి యాదివ్యకుండలములు సంపాదించెను. ఓజనమేజయా! ఆయుదంకుఁ డెట్టితపముగలవాఁడ వని నీవు నన్నడిగితివిగాదే! అతఁ డిట్టిప్రభావము గలవాఁడు. అని తెలుప విని జనమేజయుఁ డిట్లనియె.

### కృష్ణుఁడు రైవతకమును బ్రవేశించుట

ఓ వైశంపాయనా! ఆ గోవిందుఁ డుదంకునకు వర మొసఁగి యెప్పటిచొప్పున పయనమయ్యెనని తెలిపితివి పిమ్మట నమ్మహనీయుఁ డేమి యొనర్చెను?

అది విని వైశంపాయనుఁడు ఓ జనమేజయా! శ్రీకృష్ణుఁ డట్టు లాయుదంకునకు వరమిచ్చి సాత్యకితోఁ గూడఁ గడువడిగల గుఱ్ఱములచే ద్వారకను జేరువాఁడై సరిత్తులను, సరోవరములను, వనములను, బర్వతములను గడచికడచి మనోజ్ఞమగు ద్వారకను సమీపించి, యచ్చో రైవతకమహోత్సవము జరుగుచుండఁ, నా కృష్ణసాత్యకు లిరువురును నందుల కరిగిరి. అప్పర్వతము విచిత్రతములును, నానారూపములు నగు, రత్నమయకోశములచే సావృతమై, సుత్తమములగు సువర్ణమాలికలతోడను బూవులతోడను నలంకృతమై యటులే విలువగల వస్త్రములతోడను గల్పవృక్షములతోడను నలరుచు, సువర్ణమయములగు దీపవృక్షములతో శోభిల్లుచు, గుహానిర్ఝరప్రదేశములందును బగలుగాఁ జూపట్టెను. మఱియు నామహాశైలమున ఘంటలుగల మహాపతాకము లెత్తఁబడియుండెను. మఱియు నెల్లెడల స్త్రీపురుషులసంఘోషఘోషితమై ప్రకృష్టగీతములుగలదట్టులై చూపట్టుచుండెను. అయ్యది మునులతోఁగూడిన మేరువట్టులుండెను. మఱియు నందు మత్తులైన స్త్రీపురుషుల గానవిశేషములచప్పు డుప్పతిల్లి యుప్పరము ముట్టుచుండెను. మఱియు మత్తులయుఁ, బ్రమత్తులయు, సమ్మత్తులయు సింహనాదములచే సంకులమై కిలకిలారావశబ్దపూరితమై యప్పర్వత మతిమనోహరముగాఁ జూపట్టుచుండెను. అందొకచో, భక్ష్యభోజ్యవిహారస్థానములును, వేఱొకచో వస్త్రమాల్యోత్కరములును, మఱియొకచో వీణావేణుమృదంగవాద్యములును, నింకొకచో సురామైరేయమిశ్రితములగు భక్ష్యభోజ్యములును, వెలయుచుండెను. అందొక్కొకచో దీనాంధకృపణులకు వలసినవెల్ల నొసంగఁబడుచుండెను. అమ్మహాగిరియందలి యుత్సవము పరమకల్యాణముగాఁ జూపట్టుచుండెను. ఆవృష్టివీరుల యా రైవతకోత్సవవిహార మెంతయు మనోజ్ఞమైయుండెను. గొప్పభవనములతోఁ గూడిన యప్పర్వతము దేవలోకమట్టు లలరుచుండెను. అటులా రైవతకము వెలయుచు శ్రీకృష్ణునిసాన్నిధ్యము

తనకు లభించుట నింద్రలోకమునా మఱియు విరాజిల్లెను. అంత నతఁడిందుఁగలయందఱచే నభినందితుఁడై దివ్యమగు తనభవనమునఁ బ్రవేశింపవచ్చెను. సాత్యకియు నాతని వెంబడించి పోయెను. అతఁడు చిరకాలప్రవాస మొనర్చుటను మహానందముతోఁ బ్రవేశించువాఁడై, దుర్ఘటములగు కృత్యములొనర్చి, దానవులను వధించివచ్చినయింద్రునట్లు సకలజనపూజాభాజనుఁడై యుండ నాజనార్దనుని భోజవృష్ణ్యంధకాదులగు యాదవులందఱు నెదురుకొనిరి. దేవత లింద్రునట్లు తన్నెదుర్కొనవచ్చిన యాదవులనెల్ల బలువిధముల నాదరించి యతఁడు వారి కుశల మడిగి, పిమ్మటఁ దలిదండ్రులకు నమస్కరించెను. వారును నామహాభుజునిఁ గౌఁగిలించికొని గౌరవించిరి. అంత నావాసుదేవుఁడు, యాదవులందఱును దన్నుఁ బరివేష్టింపఁ గొంతతడవు విశ్రమించి, పాదశౌచ మొనర్చికొని, పిమ్మటఁ దండ్రితో సమ్మహాసమరవిధమంతయుఁ దెలిపెను. అని పలికి మఱియు నిట్లనియె.

### కృష్ణుఁడు వసుదేవునకు యుద్ధవిధ మెఱిఁగించుట

ఓజనమేజయా! అపుడు వసుదేవుఁడు, సంగ్రామవిధమును వినఁగోరి, "ఓపుత్రకా! సంగ్రామమును బరమాద్భుతముగా వింటిని. అందు వీరులందఱును గర్జిలుచుండ, వారివిధము ప్రత్యక్షముగాఁ జూచియున్నవాఁడవు. కావున నందలియథార్థమునెల్ల నాకెఱిఁగింపుము. మహాత్ములగు పాండవులయుద్ధ మెట్టులయ్యెను? భీష్మద్రోణకర్ణకృపశల్యాదు లెట్లు పోరాడిరి? కృతాస్త్రులగు మఱియుఁగల క్షత్రియులు నానాదేశములనుండి వచ్చిరి గదా! వారితో -నెట్లు పోరాటములు జరగెను?"

ఓజనమేజయా! తండ్రి తన్నిట్లు ప్రశ్నించుటయు, నప్పుండరీకాక్షుఁడు, తల్లియు వినుచుండఁగాఁ గురువీరులసంగ్రామవిధ మెట్లు జరగినదియు నిట్లు తెలిపెను.

"మహాత్ములగుక్షత్రియు లాసంగ్రామమునఁ జేసినపను లత్యద్భుతములు. అవి యమేయములగుట, శతాబ్దములకేని వానిని వివరింప వలనుపడదు. అయినను నందు ముఖ్యవిషయములఁ గొన్నిటి సంగ్రహించి తెలిపెదను వినుఁడు. కౌరవ్యుఁడగుభీష్ముఁడు, దేవతల

కింద్రునట్లు, పదునొకొండక్షౌహిణులకు సేనానాయకుఁడై యుండఁ బాండవసైన్యములందు శిఖండి, యేడక్షౌహిణులకు నాయకుఁడుగా నుండెను. అట్టిశిఖండిని సవ్యసాచి రక్షించుచు వచ్చెను. ఆమహాత్ములకుఁ బదిదినములు యుద్ధమయ్యెను. అప్పటి యక్కురుపాండవ యుద్ధము గగురుపాటొదవించెను. అప్పు డమ్మహాహవమున నటులు పోరాడుచున్న యాగాంగేయుని, సవ్యసాచి సహాయుఁడై శిఖండి బహుబాణములచే భగ్నపరాక్రమునిఁ గావించెను. పిమ్మట నమ్ముని శరతల్పగతుఁడై కాలమును గడపుచు, దక్షిణాయన మతిక్రమించు నంతకును నఁదుండి, యుత్తరాయణము రాఁగనే, శరీరత్యాగ మొనరించెను. అతనితరువాత నస్త్రవిద్వరుఁడగుద్రోణుఁడు, దైత్యసైన్యమునకు శుక్రునట్టులు సేనాపతియై, నశింపఁగా మిగిలిన తొమ్మిదియక్షౌహిణులంగూడి కర్ణాదులు సహాయులుగా, సమరమునకుఁ దొడంగుటయుఁ, బాండవులకు మహాస్త్రవేత్తయగుధృష్టద్యుమ్నుఁడు సేనానాయకుఁడై, మిత్రునిచే రక్షితుఁడగువరుణునట్లు భీమరక్షితుఁడగుచు, సమరమునకు సన్నద్ధుఁడయ్యెను. అతఁడు తనతండ్రికి గలిగినయవమానమును దలంచుచు సేనాపరివృతుఁడై యాద్రోణునిసమీపించియుద్ధమునసద్భుతకృత్య మొనర్చెను. ఆద్రోణధృష్టద్యుమ్నుల యుద్ధమందే, నానాదేశములనుండివచ్చిన భూపాలకులందఱును, నించుమించుగాఁ బంచత్వమొందిరి. వారియుద్ధము పరమదారుణమై యైదుదినములు జరగెను. పిమ్మట ద్రోణుఁడలసి ధృష్టద్యుమ్నునకు వశుఁడై ప్రాణత్యాగ మొనర్చెను. అనంతరము కర్ణుఁ డాసుయోధనుసైన్యమునకు సేనాపతియై మిగిలిన యైదక్షౌహిణులను నడుపుచుండఁ, బాండవసైన్యములలో మిగిలిన మూఁడక్షౌహిణులను బార్థుఁడు గడపుచుండ, నానాఁటికి సైన్యములన్నియు హతవీరప్రాయములై యుండెను. పిమ్మటఁ బావకునిఁ జేరిన పతంగమట్టు లారాధేయుఁ డయ్యర్జునుఁ దాఁకి, రెండవదినమున బంచత్వమొందెను. అటు లాసూతసుతుఁడు హతుఁడయినతోడనే కౌరవులు నిరుత్సాహులై నిస్తేజులై, మిగిలినమూఁడక్షౌహిణులకును శల్యుని సైన్యాధిపతినిగాఁ భావించి యాతనిదండఁ జేరియుండిరి. హతవాహనభూయిష్ఠములగు పాండవసైన్యములును యుధిష్ఠిరు నాశ్రయింప, మిగిలినయొకయక్షౌహిణియు, నతనిచే నడుపఁబడుచు

వచ్చెను. అంత నయ్యుధిష్ఠిరుఁ డశ్వత్థామని మార్కొని యాయుద్ధవివరమున దుష్కరకృత్యమొనర్చి యాతనిఁ బరిమార్చెను. శల్యుఁడు హతుఁడైనపిమ్మట, సహదేవుఁడు శకునిఁ దలపడి, కలహకారకుఁడగు నాతనిఁ బొలియించెను. తనమాట మడిసినతోడనే దుర్యోధనుఁడు దుఃఖాక్రాంతమానసుఁడై, తనసైన్యములన్నియు హతములగుట నేమియుఁ జేయునదిలేక గదాహస్తుఁడై యొకమడుఁగుఁ జొచ్చుటయుఁ, బ్రతాపసిధియగు భీముఁడు వానిని వెంబడించి, ద్వైపాయనహ్రదమందున్న యాసుయోధనునిఁ గాంచఁగలిగెను. అపుడు పాండవు లేవురును హతశిష్టమగుసైన్యముతో నాసుయోధనుఁ జుట్టికొని, సలిలప్రవిష్టుఁడై యున్న యాతని వాగ్బాణములచే నొప్పించుటయు, నతఁ డాహ్రదమునుండి గదాపాణియై కదలి కదనమునకు సన్నద్ధుఁడయ్యెను. పిమ్మట భీముఁడు విక్రమాన్వితుఁడై భూపతులు చూచుచుండఁగనే మహాసంగ్రామమొనర్చి, యాసుయోధను వధించెను. పిమ్మటఁ బాండవసైన్యమెల్ల శిబిరమున నిద్రించియుండ, నారేయి ధృష్టద్యుమ్నుఁడు తనతండ్రిని వధించినవిధము స్మరించి సహింపఁజాలక ద్రౌణియెల్ల వారిని వధించుటయు, నేనును సాత్యకియుఁ బాండవు లేవురునుదక్కఁ దక్కిన పాండవపుత్త్రమిత్త్రసైన్యములన్నియు సమసెను. అనంతరము కృపకృతవర్మలును ద్రోణపుత్త్రుఁడును యుద్ధమున ముక్తులైరి. పాండవుల నాశ్రయించుటచే యుయుత్సుఁడును ముక్తుఁడయ్యెను. అటులు కౌరవేంద్రుఁడగు సుయోధనుఁడు సానుబంధముగ సమయుటయు, విదురసంజయులు యుధిష్ఠిరుని సమీపించిరి. ఓ ప్రభూ! ఇటులు పదునెనిమిదిదినములు యుద్ధము జరిగెను. ఆయుద్ధమునఁ బృథివీపతులందఱును నిధనమొంది స్వర్గతులైరి." అని తెలిపెను.

ఓజనమేజయా! గగురుపాటొదవించునట్టి యీకథ నయ్యాదవులు విని, దుఃఖశోకపరిక్లిష్టులైరి. అని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

### వసుదేవుఁ డభిమన్యుమృతికి దుఃఖించుట

ఓజనమేజయా! అప్పు డప్రతాపశాలియగువాసుదేవుఁ డమ్మహాభారతయుద్ధకథను దెలుపుచును, దనతండ్రితోఁ దత్కథామధ్యమున

నభిమన్యునివధమువిధము తెలుపక మెల్లఁగా దాఁచెను. మహామతి యగుటఁ దత్కథాంశ మావసుదేవున కప్రియమని తలంచి కాఁబోలు విడిచియుండును. తనదౌహిత్రునివధము వినినచో, వసుదేవునకు దుఃఖశోకసంతాపములు తప్పక గలుగునని మహామతియగు నతఁ డూహించియుండవచ్చును. కాని, యటు లక్కథ నతిక్రమించి పోవుచున్న యన్నతో "కృష్ణా! అభిమన్యువధమువిధము తెలుపక విడిచితివే!" అని పలుకుచునే సుభద్ర నేలఁ గూలెను. అటులు పుడమిఁబడిన యాసుభద్రను వసుదేవుఁడు చూచి, దుఃఖమూర్ఛితుఁడై తానును ధరణి కొరగెను. పిమ్మటఁ గొంతవడికిలేచి యవ్వసుదేవుఁడు దౌహిత్ర వధ శోకసమాకులమానసుఁడై కృష్ణునిఁ గాంచి "ఓపుండరీకాక్షా! నీవు సత్యవచనుఁడవని బుడమిని బ్రసిద్ధివడసినవాఁడవు గదా! ఇపుడు నా దౌహిత్రునివధము నేల తెలుపవైతివి! నీమేనల్లునిమరణవృత్తమును జరగినవిధముగాఁ దెలుపుము. కన్నులసొంపుచే నిన్నుఁబోలిన యా నాచిన్నమనుమఁ డెట్లు రణరంగమున మడిసెను? అయ్యయో! కృష్ణా! కాలమురాకుండియు బలాత్కారముగా మానవులకు దుర్మరణము సంభవించెను. ఇంత దుఃఖము గలిగియు, నాహృదయము నూఱువ్రయ్యలు గాకున్నయది. అక్కటా! అక్కుమారుఁడు సంగ్రామ విషయమునఁ దల్లియగు సుభద్ర కేమి చెప్పెను? నాకుఁ బ్రియుఁడగు నచ్చపలాక్షుఁడు నాతో నేమియేనిఁ జెప్పుమనియెనా? యుద్ధరంగమున, నతఁడు మరలి, శత్రులచే హతుఁడు గాలేదుగదా? యుద్ధరంగమున వాని ముఖము వికృతముగాఁ జేయఁబడలేదుగదా? ఓకృష్ణా! మహాతేజుఁ డగువాఁడు నాయెదుట బాలభావముచే శ్లాఘించుకొనువానివలె నుండియుఁ, దనవినయమునుమాత్రము చూపింపకపోలేదు. ద్రోణకర్ణ కృపాదులచే నాబాలుఁడు వంచితుఁడై ధరణిఁ బడియుండలేదుగదా? అదియెల్ల నా కెఱిఁగింపుము. ఓకేశవా! ఆ నాదౌహిత్రుఁడు నిత్యము, భీష్మద్రోణులను, బలశాలియగుకర్ణుని యుద్ధమున స్పర్థతోఁ జూచుచుండెడివాఁడు." అని యడుగుచుఁ బలువిధముల నేడ్చుచున్న తండ్రిని గాంచి, గోవిందుఁడును దుఃఖితుఁడై "ఓతండ్రీ! శోకింపకుము. సంగ్రామరంగమున వానిముఖము వికృతము గాలేదు. దుస్తరుఁడగు నతఁడు యుద్ధమున వెనుకంజవేయలేదు. వేలకొలఁది క్షత్రియ

వీరుల నతఁడు వధించి, తుదకు దుశ్శాసనపుత్త్రునకు వశుఁడై ద్రోణకర్ణులచే
వధింపఁబడియెను. వానితో నొక్కఁడు యుద్ధము చేసెనేని, యెవ్వఁ
డును జయింపలేఁడనుట యేల? ఆవజ్రాయుధధారియు నాతనిఁ దా
నొక్కఁడు నోరువఁజాలఁడు. అయ్యయ్యో! ఆనాఁడు మనపార్థుఁడు సంశ
ప్తకులచే సంగ్రామమునకు సమాహూతుఁడై వెడలఁగా, నపుడు ద్రోణా
దులు కుపితులై యయ్యభిమన్యునిఁ జుట్టుకొనిరి. ఓనాయనా! అంతట
మనయభిమన్యుఁ డెంతయేని వైరివధ మొనర్చి, దుశ్శాసన పుత్త్రున కగ్గమై
స్వర్గమును దనకగ్గముగా నొనర్చికొనియెను. తండ్రీ! శోకింపకుము. కృత
బుద్ధులగువారు వ్యసన మొందియుఁ బరితాప మొందరు. ద్రోణకర్ణాదులగు
వీరులు మహేంద్రప్రతాపులయ్యు, వారి నాతఁ డెదుర్కొని నివారించి
వారిచే మరణ మొందెనుగదా! అట్టియతఁడు వీరస్వర్గము నొంద
కుండునా? కావున నాతనికై శోకింపకుము. అంత నవ్వీరుఁడు హతుఁడై
క్షితిపైఁబడ నీసుతయగు సుభద్ర దుఃఖార్తయై యాతనిఁ జేరి,
యాఁడులకుముకిపిట్టయట్లు లెంతయు నేడ్చుచు, ద్రౌపదినిఁ గూడి పరిత
పించెను. అపు డామె 'ద్రౌపదీ! మనయర్భకు లేరి? వారినెల్లఁ జూడ
వలయును.' అని పలుకుచు మఱియు నేడ్వసాగెను. ఆమెవచన మాలించి
కురుకాంతలందఱును, దమభుజము లామెపై వైచి, పరమార్తలై
మొఱలువెట్టఁజొచ్చిరి. పిమ్మట మనసుభద్ర యుత్తరను గాంచి 'అమ్మా!
నీమగఁ డెందులకుఁ బోయెనే? నాకాతనిరాక వడిగా నెఱిఁగింపుము.
ఓవిరాటపుత్త్రీ! వాఁడు నిత్యమును నాతోఁ జెప్పి నామాట విని భవ
నమునుండి వెడలుచుండెడివాఁడుగదా! ఇపుడెందులకేఁగెను? వడిగా నేల
రాకున్నవాఁడు? ఓయభిమన్యుసుతా! మహారథులగు నీమామలు నీకై
పరితపించుచున్నారు. ఈరణరంగమునకు యుద్ధాభిలాషతో వచ్చిన
నీకు వారు కుశలమును బలికిరిగాదే! సంగ్రామవధము నాకుఁ దెలుప
వేటికి? ఇట్లు మొఱవెట్టుచున్న నాతో మాటలాడవేమి?' అని పలువిధ
ములఁ బరితపించెను. ఆసుభద్ర పరివేదనము విని, కుంతి యెంతయు
దుఃఖితయై, మెల్లఁగా, నాసుభద్రతో, 'భద్రా! నీవన్నయటులు నాచిన్ని
మనుమఁడు వాసుదేవసాత్యకులకును, దండ్రికిని నల్లారుముద్దుబిడ్డఁడై
పెరిఁగెను. ఇపుడు కాలవశముగాఁ గాలధర్మ మొందెను. మర్త్యధర్మ
మిట్టిదని తెలియుము. ఓయదునందనీ! పరితపింపకుము. దుర్ధర్షుఁడగు నీ

తనయుఁడు పరమగతిని బడసినవాఁడు. నీవును మహాత్ములగు క్షత్రి యోత్తమకులమున జనించినదానవు గదా! ఓపద్మాక్షీ! అటులగుట నీవు శోకింపవచ్చునా? గర్భిణి యైయున్న నీచిన్నికోడలి నుత్తరనైనఁ జూడవలదా? కొలఁదికాలముననే యీమె, యాతనికిఁ బేరుగాఁ దన యునిఁ గనును.' అని యూఱడించెను. పిదప నాతనికై శోకమువిడిచి యాకుంతి ధర్మజుని, భీముని నకులసహదేవులను, నభిమన్యుని శ్రాద్ధకృత్యము దీర్ప నియోగించుటయు, వారటులొనర్చి బ్రాహ్మణులకుఁ గోదానము లొనర్చిరి. ఓయదూద్వహా! పిమ్మట, మనకుంతి యుత్త రను గాంచి, 'ఓ విరాటపుత్రీ! ఇఁక నీవిందు సంతాప మొందినఁ బనిలేదు. నీవు నీభర్తకై నీ గర్భమందున్న శిశువును రక్షింపవలసియున్నది.' అని పలికి కుంతియచ్చోటు విడిచిపోయెను. ఆమె సెలవుపొంది యీ మనసుభద్ర నిందులకుఁ దోడ్కొనివచ్చితిని. ఓతండ్రీ! నీదౌహిత్రుఁ డిట్లు మృతినొందెను. సంతాపమును విడువుము. శోకమునకుఁ జిత్త మునఁ దావొసంగకుము," అని తెలిపెనని చెప్పి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

వ్యాసుఁ డశ్వమేధమును యుధిష్ఠిరునకు నియోగించుట

ఓజనమేజయా! అంత నవ్వసుదేవుఁడా వాసుదేవువచన మాలించి, శోకమువిడిచి, దౌహిత్రునకు శ్రాద్ధకృత్య మొనరించెను. అటులే వాసుదేవుఁడును దనమేనల్లునకు, సుగతిదాయకమగు నౌర్ధ్వదైహిక మొనర్చి, యాఱులక్షల యుత్తమబ్రాహ్మణులకు, విధ్యుక్తముగా సకల గుణాన్వితమగు భోజ్యసమూహ మర్పించి తృప్తులఁ గావించెను. మఱియు వారికి వలయువస్త్రములను ధనములను సమృద్ధిగా సమర్పించెను. అదియెల్ల వారికి నద్భుతావహమై యుండెను. మఱియు నతఁ డాయౌర్ధ్వదైహికమున సువర్ణగోవస్త్రదానము లొనర్చి బ్రాహ్మణుల వలన వృద్ధిప్రదాయకములగు నాశీర్వాదములు వడసెను. పిమ్మట వాసుదేవబలరామసాత్యకులు, కృతాభిమన్యుశ్రాద్ధకృత్యులై, మిగులఁ బరితపించుచు శాంతివహింపఁజాలకుండిరి. అటులే యచ్చటఁ బాండవ వీరులును హస్తినాపురమున, నభిమన్యుమరణమునకై దుఃఖించుచు శాంతినొందఁజాలకుండిరి. ఓరాజా! ఉత్తర పెక్కుదినములు పతి

దుఃఖార్తయగుచు భుజింపకుండెను. అదియెల్ల వారికిని మిగుల దుఃఖకరముగా నుండెను. అంత నయ్యుత్తరకు గర్భము వృద్ధినొందుచుండ, నద్విషయము దివ్యదృష్టిచేఁ దెలిసికొని వ్యాసుఁ డంతఃపురకువచ్చి, విశాలాక్షియగుకుంతిని, నుత్తరను గాంచి, 'కుంతీ! మహాతేజుఁడగు గర్భస్థశిశు వీయుత్తరకు శోకమును దొలఁగింపఁగలఁడు. ఓయశస్వినీ! నీకు మహాతేజుఁడగు పుత్త్రుఁ డుదయించును. అయ్యది వాసుదేవుని ప్రభావమునుండియు, నామాటనుబట్టియుఁ దప్పక జరగును. పాండవుల యంతమున, నితఁడు పుడమిని బాలింపఁగలఁడు' అని పలికి, ధనంజయునిఁ గాంచి 'ఓపార్థా! నీకు మహాభాగుఁడును మహాత్ముఁడగు పౌత్త్రుఁ డుదయించును. అతఁడు చతుస్సముద్రముద్రితమగు భూవలయము నెల్లఁ బాలించును. కావున, నీవిఁక శోకము విడువుము. నాయీ వచనమును శంకింపఁ బనిలేదు. అది సత్యమని నమ్ముము. మఱియు వృష్ణివీరుఁడగు కృష్ణుఁ డేమేమి మున్ను తెలిపెనో, యదియెల్లఁ గాఁగలదు. అందు సందియమంద నక్కఱలేదు. నీతనయుఁ డాత్మనిర్జితములై యక్షయములైన విబుధలోకముల నందును. కావున నభిమన్యు నెడ నీవుగాని, తక్కినవారుగాని శోకింపవలసినదిలేదు' అని వ్యాసుఁడు, యుధిష్ఠిరుఁడు వినుచుండఁగనే తెలిపెను. అప్పితామహునివచనములు విని, యప్పార్థుఁడు, దుఃఖము పరిత్యజించి, యించుక యుత్సాహము గలిగినట్టులు గాన్పించెను. ఓధర్మజ్ఞా! ఆయుత్తరగర్భమున నీతండ్రియు, శుక్లపక్షచంద్రునట్లు వర్ధిలుచుండెను. పిమ్మట వ్యాసుఁడు యుధిష్ఠిరు నశ్వమేధయాగ మొనర్పుమని ప్రేరించి యంతర్హితుఁ డయ్యెను. మేధావియగు ధర్మజుఁడును, నావ్యాసుని వచనము లాలించి, ధనసంపాదనవిషయమునఁ బయనముగావింప నిశ్చయించెను." అని వైశంపాయనుఁడు తెలుప విని, జనమేజయుఁడు మఱియు నిట్లనియె.

### యుధిష్ఠిరాదులు ధనమునకై హిమగిరికి వెడలుట

ఓవైశంపాయనా! మహాత్ముఁడగు వ్యాసుఁడు తెలిపినవచనములు విని, యశ్వమేధయాగమునకై యుధిష్ఠిరుఁ డేమిచేసెను? మరుత్తుఁడు పుడమినుంచిన రత్నచయము నాతఁ డెట్లు సంగ్రహించెను? అదియెల్ల నాకెఱిఁగింపుము.

అది విని వైశంపాయనుఁడు "జనమేజయా! ఆద్వైపాయను సద్వచన మాలించి యాధర్మజుఁడు, తనతమ్ముల నెల్ల రావించి, కాలానుకూలముగాఁ బ్రసంగించువాఁడై, 'ఓభీమార్జుననకులసహదేవులారా! మహాత్ముఁడగు వ్యాసుఁడు మనపైగల సౌహార్దముచే నేమి చెప్పెనో యది మీరు వింటిరిగదా! ధీమంతుఁడగు నతఁడు కురురాజులహితము గోరి తెలిపియున్నవాఁడు. తపోవృద్ధుఁడును, మహాత్ముఁడును, మిత్రశ్రేయోభిలాషియు, గురుఁడును, ధర్మశీలుఁడును, నద్భుతకర్ముఁడునగు నతఁడు తెలిపినది వ్యర్థముగాదు. అటులే భీష్మవాసుదేవులును దెలిపియున్నవారు. దాని నిపుడు సంస్మరించి తరింపఁగోరుచున్నవాఁడను. ఇపుడును, నిఁకముందును నది మనయెల్లరకును హితముగదా! బ్రహ్మవాదియగు నతనివచనమును శుభములను బంధించియుండును. ఇఁక నిప్పుడమియెల్ల క్షీణరత్నమై యున్నది. ఓవీరులారా! వ్యాసమహర్షియే, మరుత్తునిధనమునుగూర్చి తెలిపియున్నవాఁడు. అది మీకు సమ్మతమా! యుక్తమేని యాలోచింపుఁడు. ఆమరుత్తునిధనము మన మందఱము తేవలయునని నాయభిప్రాయము. ఓభీమా! నీమతమేమి?' అని యతఁడు పలికినతోడనే, భీముఁడు ప్రాంజలియై 'ఓమహాబాహూ! నీవు తెలిపినది నాకెంతయు సమ్మతమైయున్నది. వ్యాసుఁడు తెలిపిన విత్తమును దెచ్చుటలో నాకేమియు విప్రతిపత్తి లేదు. కావున నిక్కార్యమున నమ్మరుత్తునిధనముఁ దప్పక సంపాదింతము. అది జరగినదనియే నానిశ్చయము. మనమెల్లఁ బోయి, మహాత్ముఁడగు గిరీశునిఁ బ్రసన్నునిఁ గావించి, తదనుగ్రహమునఁ దద్ధనముఁ గొందము. ఆవిత్తమును సంపాదించుటలో నాదేవేశునిఁ, దదనుచరులను బ్రసన్నులఁగావింపక తే వలను పడదు. ఆవృషభధ్వజుఁడు ప్రసన్నుఁడగునేని తద్విత్తమును రక్షించు రౌద్రదర్శనులగు కిన్నరులును మనకు వశులగుదురు.' అని భీముఁడు తెలిపెను. అది విని యుధిష్ఠిరుఁ డెంతయుఁ బ్రీతుఁడై యాతని మెచ్చుకొనియెను. అర్జునాదులును, నది యుక్తమని పలికిరి. అంత నప్పాండవులందఱును రత్నాహరణనిశ్చయులై, మంచిశుభముహూర్తమునఁ దమసేనల కాజ్ఞాపించిరి. బ్రాహ్మణుల స్వస్తివాచనములువడసి, ముందుగనే సురోత్తముఁడగు నమ్మహాదేవుని నారాధించి, పాయసమోదకాదులను, మాంసాపూపములను సమర్పించి, యమ్మహాత్మునిఁ బ్రసన్నుఁగావించికొని సంతు

ష్టాంతరంగులై వెడలిరి. వారటులు ప్రయాణముచేయునపుడు బ్రాహ్మణోత్తములు సంతుష్టాత్ములై యాశీర్వాదము లొసర్చిరి. పౌరులు మంగళాచారములుగావించిరి. అపు డప్పాండవు లగ్నిహోత్రునితోఁగూడ బ్రాహ్మణులకుఁ బ్రదక్షిణనమస్కారములుచేసి, పుత్రశోకపీడితుఁడై యున్న ధృతరాష్ట్రుని సెలవుపడసి, గాంధారికుంతీదేవులయానతి నొంది, ధృతరాష్ట్రపుత్రుఁడగు యుయుత్సుని మూలస్థానమునకు రక్షకునిఁగా నుంచి, పౌరబ్రాహ్మణసంపూజ్యమానులగుచుఁ బ్రయాణము సాగించిరి.” అని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

### పాండవులు సువర్ణము సంపాదించుట

“ఓజనమేజయా! పాండవు లట్లు సోత్సాహముగా వెడలి, తమ తమమహారథఘోషములచే దెసలఁ బ్రతిధ్వనింపఁజేయుచుఁ, బుడమి వడఁక, సూతవందిమాగధుల సన్నుతులనొందుచు, నిజరశ్ములచే సూర్యునట్లు తమసైన్యములుమాత్రము తమ్ముఁ బరివేష్టింపఁ బోవుచుండిరి. వారిలో యుధిష్ఠిరుఁడు శ్వేతాతపత్రశోభితుఁడై, పౌర్ణమి నాఁటిచందురునందము వహించియుండెను. త్రోవలోఁ బ్రహృష్టులై, ప్రజలొసఁగు జయాశీర్వాదముల నతఁడు ప్రతిగ్రహించుచు వచ్చెను. ఆతని ననుసరించి వెడలినసైనికుల హాలహాలాశబ్దము మిన్నుముట్టుచుండెను. అప్పు డప్పాండవాగ్రజుఁడు, నదులను, సరోవరములను, వనములను, నుద్యానములను, గడచిగడచి యాహిమవత్పర్వతమును సమీపించి, మరుత్తుఁడుంచినద్రవ్య మెందు వెలయుచుండెనో, యచ్చో నతఁడు తనసైనికులతో విడిదిగావించికొనియుండెను. వారు విడిన ప్రదేశము సమతలమై శుభప్రదముగా నుండెను. అపుడు తపోవిద్యాదమాన్వితులగు బ్రాహ్మణులను, వేదవేదాంగపారగుఁ డగు ధౌమ్యుని నందులకువచ్చినవ్యాసుని ముందుంచుకొని, రాజులును మఱికొందఱు బ్రాహ్మణులును బరివేష్టించియుండ శాంతివిధిని గావించిరి. పిమ్మట మధ్యభాగమున రాజునకును, నలువంకల నమాత్యులకును, షట్పథమును, నవఖండమునగు నివేశనము నిర్మింపఁబడియెను. పిదప నయ్యుధిష్ఠిరుఁడు మత్తవారణేంద్రములకును నివేశన మేర్పఱచి, బ్రాహ్మణులతో ‘ఓవిప్రోత్తములారా! మంచి తిథినక్షత్రములు గలశుభ

ముహూర్తమున మనయీ కార్యమునకుఁ గావలసినకృత్య మేదియో యది యొనర్పుఁడు. ఇందే యాలస్యముచేసి కాలక్షేపముసేయుట మనకుఁ దగదని నిశ్చయించికొని యిఁక నేమిచేయవలసియున్నదో, దానిని వడిగా నిర్వర్తింపుఁడు.' అని తెలిపెను. అది విని, పురోహితునితోఁగూడ బ్రాహ్మణులెల్లరును, నయ్యుధిష్ఠిరుని హితముగోరి, 'ఓరాజా! నేఁడే మంచినక్షత్రముగల శుభముహూర్తము గలదు. అటులగుట నుత్తమక్రియలయెడ నేఁడే ప్రయత్నింతము. మీరిపుడు జలమాత్రాహారులై యుపవాసము లొనర్పవలయును.' అని తెలిపిరి. అంత నప్పాండవు లాద్విజోత్తములవచనములచొప్పున, నుపవాసవిధి యొనర్చి యారేయిఁ, గుశాస్తరణములందుఁ గూరుచుండి, యాగములందుఁ బ్రజ్వలితములగు నగ్నులట్లు వెలయఁజొచ్చిరి. పిదప బ్రాహ్మణులసద్వచనములు వినుచుండఁగా, వారి కారేయి గడచెను. అనంతరము ప్రాతఃకాలమగుటయు బ్రాహ్మణు లాయుధిష్ఠిరుఁ గాంచి యిట్లు తెలిపిరి" అని చెప్పి మఱియు నిట్లనియె.

### యుధిష్ఠిరుఁడు ధనసంగ్రహముసేయుట

"ఓజనమేజయా! అటు లాబ్రాహ్మణు లయ్యుధిష్ఠిరునితో, 'ఓరాజా! మహాత్ముఁడగు త్రినేత్రున కిపు డుపహారమొనర్చి, పిదప మనప్రయోజనము సాధింప యత్నింతము.'

అది విని యుధిష్ఠిరుఁ డాగిరీశున కుపహారము విధ్యుక్తముగా సమర్పించువాఁడై, యగ్ని నాజ్యముచేఁ దృప్తిపఱచి, మంత్రసిద్ధమగు చరువును గావించి, పురోహితు ననుమతివడసి, మంత్రపూతములగు పూవులనుబట్టికొని, మోదకపాయసమాంసాదులచే బలిని సమర్పించెను. పిమ్మటఁ బూవులతోడను, లాజలతోడను, గిరీశున కర్పింపఁగా మిగిలినయుపహారము నాతనికింకరులకు సమర్పించి, మఱియు యక్షేంద్రుఁడగు కుబేరునకును, మణిభద్రునకును, నింకను భూతపతులగు యక్షులకును గృసరమాంసములతోడను, దిలసంయుతములగు నివాపములతోడను నన్నమును గుంభములు గాఁబోసి, ధౌమ్యుఁడు సమర్పించెను. అంత నయ్యుధిష్ఠిరుఁడు బ్రాహ్మణులకు వేలకొలఁది గోవులనిచ్చి నక్తంచరులకును, భూతములకును బలులొసంగ నాజ్ఞ

వెట్టెను. అపు డాదేవదేవునిస్థాన మెంతయు ధూపగంధపుష్పాదులచే నావృతమై యుండెను. అటు లతఁడు రుద్రునియుఁ బ్రమథగణ ములయుఁ బూజను గావించి, వ్యాసుని మున్నిడికొని రత్ననిధినిఁ జేరి, ధనాధ్యక్షునిఁ బూజించి, నమస్కరించి, విచిత్రములగుపుష్పాపూప కృసరములతో శంఖాదినిధులను, నిధిపాలురను నారాధించి, బ్రాహ్మ ణోత్తముల స్వస్తిపుణ్యాహఘోషములు వెలయఁ, బ్రీతియుక్తుఁడై యతఁ డాధనమును ద్రవ్వించెను. అందు మనోహరములై బహువిధ ములై కరకములతోఁగూడినపాత్రములును, భృంగారములు, కటాహ ములు, కలశములు, వర్ధమానకములు, విచిత్రములగు పెక్కుభాజన ములు వేలకొలఁదిగాఁ గానిపించెను. అపు డాధర్మాత్ముఁడు వానిని బైకుద్ధరించెను. ఆధనములకు రక్షకములుగాఁ గరపుటములనెడి పాత్రము లమర్పఁబడియెను. ఉష్ట్రాదులపై వానిని దూఁచెడిపాత్ర విశేషము కట్టఁబడియెను. ఆధనములను మోయుటకు లొట్టియ లఱు వదిశతసహస్రములును, వానికి ద్విగుణముగా గుఱ్ఱములును, శత సహస్ర వారణములును, నటులే శకటములును, రథములును, నాఁడేన్గు లును నందులకుఁ దెప్పింపఁబడియుండెను. ఇఁకఁ దద్ధనములవహింప నున్న ఖరములకును మానవులకును గొలదియే లేకుండెను. వానియం దెల్ల నయుధిష్ఠిరుఁ డాధనములనుంచి, మఱియు మహాదేవు నారా ధించి హస్తినాపురమునకుఁ బయలువెడలి, వ్యాసునిసెలవుగొని, ధౌమ్యుని ముందుంచుకొని రెండుక్రోసులదూరమున కొకమాఱుగా నిలుపుచు నడువసాగెను. ఆసైన్యము పత్తనాభిముఖమైపోవుచుఁ, దత్కురూద్వహులకు సంతసముగలుగ, నతికష్టముగ ద్రవ్యభార ములను వహించుచుండెను." అని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

## పరీక్షిత్తుజననవిధము

"జనమేజయా! అంతలో నాహస్తిపురికి, యాదవులఁగూడి వాసుదేవుఁడు పోవ నిశ్చయించి, తాను మున్ను తనపురికిఁ బయనమై పోవునపుడు ధర్మజునితోఁ జెప్పినమాట స్మరించి, హయమేధమునకు సమయమగుటయుఁ, బ్రద్యుమ్నసాత్యకులతోఁగూడి పయనమయ్యెను.

ఆతనివెంట సాంబ చారుదేష్ణ గద కృతవర్మలును, సుభద్రాసహితుఁడై బలదేవుఁడును వెడలిరి. వారెల్లఁ గుంతిని, ద్రౌపదిని, నుత్తరను గాంచి, యోదార్చువారై హస్తిపురి కరుదెంచిరి. అటులు వారెల్ల వచ్చుటఁ దెలిసి ధృతరాష్ట్రుఁడు, యథాన్యాయముగా విదురసహాయుఁడై యెదుర్కొని తెచ్చెను. విదురునిచే బూజితుఁడై, వాసుదేవుఁడందే యుయుత్సునింట నుండెను. అక్కరిపురమున, నావృష్ణివీరులు నివసించియున్నయపుడే, నీతండ్రియగు పరీక్షిత్తు జనించెను. ఓజనమేజయా! అతఁడు గర్భస్థుఁడయ్యు బ్రహ్మాస్త్రావపీడితుఁడగుట, హర్షశోకవివర్ధనుఁడై, శవమువలె నిశ్చేష్టుఁడై యుండెను. హర్షపూరితులైన జనుల సింహనాదధ్వని దిక్కుల ముట్టి వెంటనే చల్లారెను. అపుడు వాసుదేవుఁడు వడివడిగా వెడలి, యంతిపురమునకు సాత్యకితోఁ బ్రవేశించి, వ్యాకులమానసుఁడై వడిగాఁ దనకై వచ్చు తనమేనయత్తను గాంచెను. ఆమె వాసుదేవునితో, 'కృష్ణా! వడిగా రమ్ము' అని మఱిమఱియుఁ బలుకుచుండెను. ఆమెవెనుక సుభద్రయు, ద్రౌపదియు, మఱియుఁ గలబంధుకాంతలును, సకరుణముగా నేడ్చుచుండిరి. అపుడక్కుంతి, బాష్పగద్గదకంఠియై యవ్వాసుదేవుని సమీపించి 'కృష్ణా! మహాబాహూ! నీవలన దేవకి మంచిసంతానము గలదయ్యెనుగదా! నీవ మాకు గతివి. నీవే స్థితినిమిత్తభూతుఁడవు. మా యీకులమెల్ల నీయధీనమై యున్నయది. ఓయదుప్రవీరా! ఈ నీమేనయల్లునికొడుకు మఱున్నాయశ్వత్థామ, బ్రహ్మాస్త్రప్రయోగము సేయ, నద్దాన హతుఁడై, మృతుఁడై జనించెను. వీనిని నీవ జీవింపఁజేయవలయును. ఓకేశవా! ఆయిషీకాస్త్రప్రయోగసమయమున, నీ వీశిశువు మృతజాతుఁడైనను బునర్జీవితునిఁ జేయుదునని ప్రతినయొనర్చితివిగాదే? ఇదె వీఁడు మృతజాతుఁడై జనించెను. చూడుము. ఓమాధవా! నన్నును, నియ్యుత్తరా సుభద్రాద్రౌపదులను, యుధిష్ఠిరభీమార్జుననకులసహదేవులను నీవ గదా రక్షించువాఁడవు. నేనును బాండవులును మాప్రాణములను వీని యందే పెట్టికొనియున్నవారము. ఓయాదవోత్తమా! పాండురాజునకును నామామకును బిండోదకాదు లుండవలదే? నీయట్టివాఁడును, నీకుఁ బ్రియుఁడునగు నభిమన్యునకును వీనిబ్రదుకుచే భద్రమయ్యెడిని. ఓజనార్దనా! మృతుఁడైన వీనిని బ్రతికించి ప్రియమొన

ర్పుము. ఓకృష్ణా! మున్నొకపుడు తనతో నభిమన్యుఁడు తెలిపిన విధము నుత్తరయుఁ దెలుపుచున్నది. అభిమన్యుఁ డొకపు డీమెతో ‘ఓవైరాటీ! నామామనుబోలినవాఁడును, నాతని కధీనుఁడైనవాఁడును నై నీకుఁ బుత్త్రుఁడగును. వాఁడు వృష్ణ్యంధకకులముఁ జేరి ధనుర్వేదమును గ్రహించును. మఱియు వానికి విచిత్రాస్త్రములును నీతి శాస్త్రమును వారివలననే సంగ్రహింపఁబడియెడును.’ అని ప్రీతిపూర్వకముగాఁ దెలిపెనఁట. ఓమధుసూదనా! మేమెల్ల నిన్ను సవినయముగా యాచించుచున్నారము. వీనిని మావంశమున కుద్ధారకునిఁగను నుత్తముగను శుభప్రదుఁగను నొనర్పుము.’ అని యక్కుంతి చేతులెత్తి దుఃఖార్తయగుచుఁ బలికెను. ద్రౌపది మున్నగువారందఱును బుడమిఁ బడి దొరలుచుఁ గన్నీళులేఱులుగాఁ బ్రవహించుచుండ ‘అయ్యయో! వాసుదేవుని మేనల్లునకు మృతపుత్త్రుఁడు జనించెను’ అని మొఱలిడిరి. అంతఁ బుడమిఁబడియున్న కుంతినిబట్టికొని, యాశ్రీకృష్ణుఁ డూఱడించెను” అని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నట్లనియె.

## సుభద్ర కృష్ణునిఁ బ్రార్థించుట

“ఓజనమేజయా! అంతఁ గొంతవడికిఁ గుంతి మెల్లగా లేచెను. పిమ్మట సుభద్ర తనయన్నయగు వాసుదేవునిఁ గాంచి, దుఃఖార్తయై మొఱవెట్టుచు, ‘ఓపుండరీకాక్షా! నీ వాపార్థునిపౌత్త్రునిం గనుఁగొనుము. అయ్యయో! అపుడు కౌరవులెల్ల నశింప, ద్రోణపుత్త్రునిచే భీమునికై ప్రయోగింపఁబడిన యిషీకాస్త్రముచే గతాసుఁడై, క్షీణించి యున్న యీచిన్నిశిశువు నరయుము. అపుడు ద్రౌణిప్రయుక్తమగు నయ్యస్త్ర ముత్తరయందును, నాయందును విజయునందును ఫలించి నట్టిదయ్యెను. మఱియు నిపుడు సపుత్త్రకముగా నాపుత్త్రుఁ డగపడమి నయ్యస్త్రము నాహృదయమును వ్రయ్యలుచేసి, నాయందే యున్న దని తలంపుము. అక్కటా! అయ్యుధిష్ఠిరుఁ డీయభిమన్యుపుత్త్రమృత వార్త వినిన నెట్లు పరితపించునో? భీముఁ డేమని పలవించునో? విజయుఁ డెట్లు విలపించునో? నకులసహదేవు లెట్టి యార్తివహింతురో? ఓవాసుదేవా! పాండవు లాయశ్వత్థామచే వంచితులై రనవచ్చును. ఓకృష్ణా! ఆసోదరు లేవ్వరకును నభిమన్యుఁ డెంతయుఁ బ్రియుఁడగుట

సందియము లేదుగదే! ద్రోణపుత్త్రాస్త్రనిర్జితులగు వారి తనయుత్పత్తి విధము వినిన నేమివగతురో? ఓజనార్దనా! వారిదుఃఖముకంటె నీకుఁ బరితపింపఁదగిన దేది? అభిమన్యుసుతుఁడు మృతుఁడగుట నీకు మాత్రము దుఃఖనిమిత్తము గాకుండు టెట్లు? ఓయన్నా! ఇదె నే నిపుడు నీకుఁ దలవంచి మ్రొక్కి బ్రతిమాలుచున్నదానను. అదె నీయత్త కుంతియు, ద్రౌపదియు నెట్లు పరితపించుచున్నవారో చూడుము. ఓమాధవా! ద్రోణసుతుఁడు పాండవుల గర్భములను జెఱుచునపుడు నీవు కుపితుఁడవై 'ఓరీ! బ్రహ్మబంధూ! నరాధమా! నీవేమో దురూహచేసితివిగాని, యక్కిరీటపౌత్త్రుని జీవింపఁజేసెదను. నిన్ను విఫలమనోరథుఁ గావించెదను.' అని పలికితివిగాదే? ఆనీవచనమును నేను వినియు, నీసామర్థ్య మెఱిఁగియు, నిన్నిటులు ప్రార్థించుచున్నదానను. అభిమన్యుతనయుఁడు జీవించుఁ గాక. నీవపుడు ప్రతినయొనర్చియు నీశుభవచనమును సఫలముగావింపవేని, నేను జీవింపనని నమ్ముము. ఓవీరా! వృష్ణిశార్దూలా! ఈయభిమన్యుసుతుఁడు జీవింపఁడేని నేను బ్రతుకఁజాలను. నీవు జీవించియుండ, నీతఁడు జీవింపఁడేని నీవలన నాకైన దేమి? ఓమహాత్మా! మృతుఁడగు నియ్యభిమన్యుసుతుని బ్రతికింపుము. ఓకేశవా! ధర్మాత్మా! సత్యవచనా! సత్యవిక్రమా! నీవు ఘనుఁడవై దయారసము వర్షించుచు నీశిశుసస్యమును జీవింపఁజేయుము. నీసద్వచనమును సత్యమును జేయఁదగియున్నవాఁడవు. నీవు తలంతువేని, యీశిశువు నేగాదు, మృతములైన ముల్లోకములను జీవింపఁజేయఁగల్గుదువు. నీమేనల్లుఁడగు నభిమన్యునకుఁ బుత్త్రుఁడైన యీమృతశిశువును బ్రదికించుట యద్భుతమా? ఓకృష్ణా! నీప్రభావము నేనెఱుంగుదును. కావుననే యిటులు నిన్ను యాచించుచున్నదానను. పాండవుల కిపు డీపరమానుగ్రహము సూపుము. ఓయన్నా! నీకు నేను జెలియలననిగాని, హతసుతననిగాని, ప్రపన్ననై యుంటిననిగాని తలంచి దయసేయఁదగియున్నదానవు." అని మొఱపెట్టెనని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

## ఉత్తర శ్రీకృష్ణుని పుత్రభిక్ష వేఁడుట

ఓజనమేజయా! సుభద్ర యిట్లు ప్రార్థించుటయు నవ్వాసుదేవుఁడు దుఃఖమూర్ఛితుఁడై లేచి, "అటులే జీవింపఁజేసెదను." అని గట్టిగాఁ బలికి యచ్చటిజనమును సంతసింపఁజేసెను. ఆతనివచనముచే నందలివారందఱును, సలిలప్రాప్తిచే ఘర్మార్తులట్లు పరమానంద మొందిరి. పిమ్మట నమ్మహాత్ముఁడు నీతండ్రి జనించినమందిరము వడిగాఁ జొచ్చెను. ఆమందిరము సితపుష్పమాల్యములచే నలంకరింపఁబడి యుండెను. యథావిధిగా నామందిరమున నెల్లదెసలఁ బూర్ణజల కుంభము లుంపఁబడియుండెను. మఱియుఁ దిందుకాలాతములతోడను, ఘృతముతోడను, సర్షపములతోడను విమలములగువస్త్రములతోడను, నగ్నులతోడను నది నిండియుండెను. పరిచర్యకై ముదుసలికాంత లాగృహము నావరించి యుండిరి. మఱియు దక్షులును, నిపుణులును, బండితులునగు వైద్యు లెల్లెడలఁ గూరుచుండిరి. అందా వాసుదేవున కెల్లయెడలఁ బిశాచరక్షోనివారకములగునవి గానవచ్చెను. నిపుణులగువా రపుడు వలయుద్రవ్యముల నెల్ల నందుంచిరి. ఓజనమేజయా! అటులున్న నీతండ్రిజన్మగృహమును గాంచి, యవ్వాసుదేవుఁ డెంతయు సంతసించి, మేలుమేలని పొగడెను. వికసితముఖుఁడై యక్కమలాక్షుఁ డటులు పలుకుచుండఁగా, ద్రౌపది వడిగా నుత్తరను జేరి "ఓభద్రా! అదె నీమగని మామయగు మధుసూదనుఁ డరుదెంచెను. పురాణమహర్షియు, నచింత్యరూపుఁడును, నపరాజితుఁడునగు నతఁడు నిన్ను సమీపించుచున్నాఁడు." అని తెలిపెను. అది విని యాయుత్తర కన్నీళులను, బాష్పకలితవచనములను నాపికొని, నడుము బిగించుకొని యావాసుదేవుని దేవునిఁగా భావించి యాతని సమీపించి, పరితపించుచున్న హృదయము నించుక నిలిపికొనుచు గోవిందునిఁ గాంచి, యతిదీనముగా "ఓపుండరీకాక్షా! పుత్రహీనులమగు మమ్మిరువుర నరయుము. ఓజనార్దనా! ఇపుడు నన్నును నీమేనల్లుని హాతులఁగాఁ దలంపుము. ఓవార్ష్ణేయా! ఓవీరాగ్రణీ! ఇదె తలవంచి మ్రొక్కి నిన్ను బ్రతిమాలుచున్నదానను. ద్రోణపుత్రాస్త్రదగ్ధుఁడైన యీనాతనయుని బ్రతికింపుము. ఓపుండరీకాక్షా! నీవుగాని, ధర్మజుఁడు

గాని, భీముఁడుగాని, 'బ్రహ్మాస్త్రము శిశుమాతనే వధించుఁగాక' యని పలికియుందురేని, నేనే నాశమొంది యుండుదును. అటులేని యిట్టి దురవస్థ సంభవింపకుండునేమో? దుర్బుద్ధియగు నా ద్రోణసుతుఁడు గర్భస్థుఁడగు బాలుని బ్రహ్మాస్త్రముచే హింసించెను. వానికి దీనిచేఁ గలిగిన ఫలమేమో ? ఓగోవిందా ! శత్రుమారకుఁడవగు నిన్నిదె తలవంచి మ్రొక్కి ప్రతిమాలుకొనుచున్నదానను. ఓదేవా ! ఈ పౌత్రుని జీవింపఁజేయవేని ప్రాణములను బరిత్యజింతును. ఓకేశవా ! ఈ నాతన యునెడ నా కేయేమనోరథము లుండెనో, యవియెల్ల ద్రోణసుతునిచే హతములయ్యెనుగదా ! నే నిఁక నెట్లు జీవింపఁగలను ? ఓజనార్దనా! నా యీకొమరుని తొడపై నిడికొని, మహాహర్షముతో నీకు నమస్కరింపవలయునను కోర్కి నాకుండెడిది. అది యిపుడు వ్యర్థమయ్యెను. ఓపురుషోత్తమా ! ఆచపలాక్షుఁడగు నీమేనల్లునితనయుఁడు మృతుఁడగుట, నాహృదయగతములగు కోర్కులన్నియు విఫలములైనవి. ఓమధుసూదనా ! ఆచపలాక్షుఁడు నీకెంతయుఁ బ్రియుఁడు గాదే? అతని సుతుఁ డిట్లు బ్రహ్మాస్త్రహతుఁడగుట నరయుము. వీఁడు తనతండ్రి వలెఁ బాండవలక్ష్మిని బరిత్యజించి యమమందిరము నొందుటనుబట్టి, కృతఘ్నుఁడును, నృశంసుఁడును నగుననక తప్పదు. ఓకేశవా ! రణరంగమున నీమేనల్లుఁడు హతుఁడయినతోడనే 'ఓవీరా ! నీతో ననుగమించెద'నని ప్రతినగాఁ బలికియుఁ, గ్రౌర్యమునఁ దర జీవితప్రియనై యటులొనర్పలేనయితిని. ఇపుడు నే నాతనికడ కేఁగితినా ! అతఁ డేమనునో?" అని విలపించె నని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

### కృష్ణుఁడు పరీక్షిత్తుని బ్రతికించుట

ఓజనమేజయా ! అవ్విరాటపుత్రి, యతిదీనయై పిచ్చిపట్టినది వలెఁ గరుణముగా విలపించుచుఁ, బుత్రప్రేమ పరవశయై యొడలు తెలియక పుడమిఁ బడియెను. అటులు హతసుతయై క్షితినొరఁగిన యాయుత్తరను గాంచి, కుంతి మిగులఁ గుందుచు విలపించెను. అపుడు భరతకాంతలందఱు నొక్కుమ్మడి వెక్కివెక్కి యేడ్వసాగిరి. ఓరాజేంద్రా ! రెండుగడియలకాల మప్పాండవశిబిర మెంతయు నార్తారావపూరితమై చూడ వీలులేనట్టి దయ్యెను. ఓజనమేజయా !

ఆయుత్తర, యట్లు రెండుగడియలసేపు పుడమిఁబడి, పుత్రశోకాభి పీడితయగుటఁ జైతన్యములేనియట్టిదిగానుండి, కొంతవడికిఁ దెలివొంది తనమృతసుతునిఁ దొడపై నిడికొని యిట్లు విలపింపసాగెను.

ఓపుత్రకా! నీవు ధర్మజ్ఞుఁడగు క్షత్రియోత్తమునకు సుతుఁడ వయ్యు ధర్మమును దెలియకున్నవాఁడవు. నీవు ధర్మజ్ఞుఁడవేని యీ వృష్ణివీరుఁడగు వాసుదేవునకు నమస్కరింపకుందువా? ఓకుమారా! నీవు నీతండ్రికడ కేఁగి, యాతనితో నామాటగా, 'ఓవీరా! ప్రాణులకుఁ గాలము ప్రాప్తింపకున్నను దుర్మరణము సంభవించుచుండును' అని తెలుపుము. ఓరీ! నీవును నీతండ్రియు లేకుండుటను, నేను మరణింప వలసినదే! అయినను దరిద్రనై యమంగళనై జీవించియున్నదానను. ఓమహాభుజా! ఇఁక నాజీవనమున కేమి ప్రయోజనము! నాయనా! నీపెద్దతాతయగు ధర్మజు ననుజ్ఞవడసి, ఘోరమగువిషమేని త్రావెదను. మంటలోనేని చొచ్చెదను. పతిపుత్రవిహీననైన నాహృదయము వేయివ్రయ్యలుగాదేని, యేదే నొకదుర్మరణము నొందక తప్పను. తండ్రీ! లెమ్ము. ఇదె నీప్రపితామహియగు కుంతీదేవి దుఃఖార్తయై దొరలుచున్నది. ఈమెనైనఁ జూడరాదే? మఱియు నార్తయై దీనయై శోకసాగరనిమగ్నయై యున్న యార్యయగు ద్రౌపదిని, దీనయైన సుభద్రను జూడరాదే? వ్యాధప్రహతయగు మృగాంగనయట్లు దుఃఖితనైయున్న నన్నేనిఁ గనుఁగొనరాదా! ఓయన్నా! లెమ్ము. పుండరీకపలాశాక్షుఁడగు నీలోకనాథునివదనము గనుఁగొనుము" అని

ఓజనమేజయా! ఇటులు విలపించుచు మరలఁ బుడమిఁబడి దొరలుచున్న యయ్యుత్తరం గాంచి, యందలి కాంతలందఱును లేవనెత్తిరి. అంత నామె మరల కొంచెము ధైర్యముపూని ప్రాంజలియై, యప్పుండరీకాక్షుని పాదములకుఁ జేరువఁగాఁ బుడమిఁబడి నమస్కరించెను. అంత నప్పురుషోత్తముఁ డావైరాటి విపులమగువిలాపము లాలించి, యుపస్పర్శనమొనర్చి బ్రహ్మాస్త్రము నుపసంహరించి, యా శిశువు జీవించుటకుఁ బ్రతినచేయువాఁడై విశుద్ధాత్ముఁడగుచు సకల జగమునకుఁ దెల్లముగా నిట్లు పలికెను.

"ఓయుత్తరా! నే ననృతము పలుకనివాఁడనేని, యిది సత్యమగుఁగాక. ఇదె సకలభూతములును గాంచుచుండఁగా నీబాలుని

బ్రతికించెదను. నే నొకపుడును, స్వైరాలాపములందేని యనృతము పలుకనివాఁడనేని, యుద్ధమునుండి మరలనివాఁడనేని, యీబాలుఁడు బ్రతుకుఁగాక. మఱియు నాకు ధర్మమే ప్రియమేని, బ్రాహ్మణులయెడ భక్తిగలవాఁడనేని, మృతజాతుఁడగు నియ్యభిమన్యుసుతుఁడు బ్రతుకుఁగాక. నేనొకపుడును విజయునందు విరోధమెఱుంగనివాఁడనేని, యీశిశువు జీవించుఁగాక. సత్యధర్మములు రెండును నాయందు స్థిరములేని, నామేనల్లునికొడుకు బ్రతుకుఁగాక, కంసుఁడును కేశియు నాచే ధర్మముగా హతులగుట సత్యమేని, యీబాలుఁడు జీవించుఁగాక" అని.

ఓజనమేజయా! అటులు పలికి యవ్వాసుదేవుఁడు, పద్మసన్నిభమై, పద్మసంభవభవాద్యర్చితమైన తనపాదముచే నాబాలుని స్పృశించెను. అటు లతఁడా బాలుని యాపాదతలమస్తకముగా ముట్టికొనినంతమాత్రముననే, వానికి మెల్లగాఁ జైతన్యమొదవెను. అనంతరము వాఁడు మెల్లమెల్లగాఁ గదలసాగెను. అని తెలిపి మఱియు నవైశంపాయనుఁ డిట్లనియె.

యుధిష్ఠిరాదులు ధనముగొని హస్తిపురికి వచ్చుట.

ఓజనమేజయా! ఆశ్రీకృష్ణుఁ డటులు బ్రహ్మాస్త్రము నుపసంహరించినతోడనే, నీతండ్రి తేజముచేఁ దజ్జన్మగృహము మిగుల విరాజిల్లెను. పిమ్మట రక్షస్సులన్నియుఁ నేమియుఁ జేయఁజాలక యాబాలుని మందిరము విడిచిపోయెను. అంతరిక్షమున "కేశవా! మేలుమేలు" అనుశబ్ద ముప్పతిల్లెను. ప్రకాశమానమగు నయ్యస్త్రమును బితామహుని జేరెను. ఓనరేశ్వరా! నీతండ్రికిఁ బ్రాణము లెప్పటిచొప్పున వచ్చెను. అంత నతఁడు యథాశక్తిగను, యథోత్సాహముగను నటునిటు కదలఁజొచ్చెను. ఓభరతసత్తమా! అపు డందున్నసుందరు లందఱును, నమందానందమందసాగిరి. గోవిందునిశాసనముచే బ్రాహ్మణులాబాలునకు శుభమును గోరిరి. తీరమును జేరువారి కొడలభించునట్టు లానందముగలుగ, భరతకాంతలందఱు నాజనార్దనునిఁ బలువిధములఁ బ్రశంసించిరి. అపుడు కుంతికిని, ద్రౌపదికిని, సుభద్రకును, నుత్తరకును గలిగినసంతోషమునకు మేరలేకుండెను. అపు డా జనార్ద

సుని మల్లులు, నటులు, గ్రంథికులు, సౌఖ్యశాయికులు, సూతమాగధ సంఘములవారును సన్నుతింపసాగిరి. మహాజనమెల్లఁ గురువంశస్తవములుగల యాశీర్వాదముల సాగించెను. అంత నవ్విరాటసుతయుఁ గాలానుకూలముగా లేచి, సంతుష్టయై తనపుత్రునితోఁగూడ నవ్వాసుదేవునకు వందనమాచరించెను. అంత నమ్మహాత్ముఁ డమ్ముదితయెడ ముదితుఁడై పెక్కురత్నము లొసంగి, మఱియు నీతండ్రికిఁ దగు నామముగూర్చువాఁడై యాలోచించి "వంశము పరిక్షీణము కాఁగా నయ్యభిమన్యునకు జనించినవాఁడగుట వీనికి 'పరీక్షిత్తు' అనునామ ముచిత"మని పలికెను. ఓజనాధిపా! నీతండ్రియును, సకలలోకసంతోషముతోఁగూడ యథాకాలముగా వృద్ధినొందుచుండెను. ఓవీరా! నీతండ్రి యొకనెలవాఁడగునప్పటికి, బహువిధమగురత్నధనమును సంగ్రహించికొని పాండవు లరుదెంచిరి. వారును హస్తిపురమును సమీపించిరని విని యాదవులందఱును, వారి నెదుర్కొనఁబోయిరి. పురము పుష్పమాలికలచే నలంకరింపఁబడియెను. మఱియు విచిత్రములగుపతాకలును, వివిధములగు ధ్వజములును నెత్తఁబడియెను. ఓరాజా! పౌరులు తమతమగృహముల నలంకరించికొనియుండిరి. దేవాలయములందు వివిధములగుపూజలు గావింపఁబడియెను. పాండుపుత్రులహితము సేయువాఁడగుట విదురుఁ డప్పుడు సందేశింప రాజమార్గములన్నియుఁ బుష్పములచే నలంకరింపఁబడియెను. అప్పు డప్పురము సముద్రగంభీరస్వనమై విరాజిల్లెను. నర్తకు లొక్కొకచో నాట్యము సేయుచుండిరి. ఒక్కొకచో గాయకులు పాడుచుండిరి. కుబేరు నావాసమట్లు లానగర మెంతయు మనోహరముగా నుండెను. మఱియు నందందు వందులును, స్త్రీలతోఁగూడఁ బ్రజలును వివిక్తదేశముల నలంకరించి నిలువఁబడియుండిరి. గాలిచే నెల్లెడలఁ బతాకలు గదలుచుండెను. అపు డవి దక్షిణోత్తరకురువులను జూపించునవినా వెలయుచుండెను. రాజోద్యోగులగుపురుషు లపు డెల్లెడలఁ దచ్ఛుభవార్త చాటించిరి. సకలశాస్త్రవిహారమును, రత్నాభరణాలక్షితమై వెలయుచుండెను. అని తెలిపి మఱియు నిట్లనియె.

యుధిష్ఠిరుఁ డశ్వమేధదీక్షఁ బూనుట

ఓజనమేజయా! పాండవు లటులు మరలి నిజనగరమును సమీపించుట విని, వాసుదేవుఁడు మంత్రులతోడను, మిత్రులతోడను వారి నెదుర్కొన వెడలెను. అంత నప్పాండవులు యాదవులును గలిసి హాస్తినగరిఁ బ్రవేశించుతఱి, వారి గొప్పసైన్యములచప్పుడులు భూమ్యాకాశముల నావరించెను. వారు తమధనసంచయముల మున్నిడికొని పురప్రవేశ మొనర్చిరి. అంత నప్పాండవు లెంతయు సంతుష్టాంతరంగులై మంత్రులతోడను, మిత్రులతోడను జనాధిపుఁడగు ధృతరాష్ట్రునకు నిజనామకీర్తనపురస్సరముగా వందనము లాచరించి, పిదప గాంధారికి మ్రొక్కి కుంతికి నమస్కరించి, విదురు నాదరించి, యుయుత్సునిఁ గలిసి, వారెల్లరును దమ్ము గౌరవింప నెంతయు విరాజిల్లిరి. ఆసమయ మత్యాశ్చర్యమును విచిత్రమునై గన్పట్టెను. ఓజనమేజయా! అపుడు, నీతండ్రి జననమును వారు విని, కృష్ణుని మహోపకారమున కలరుచుఁ బూజార్హుఁడగు నా దేవకీనందను నభినందించిరి. పిమ్మటఁ గొంతకాలమున కందులకు వ్యాసుఁ డరుదెంచెను. అప్పు డప్పాండవులందఱును నాతని యథాన్యాయముగాఁ బూజించిరి. యాదవులును నాతని సేవించిరి. అపుడు నానావిధములగు ప్రసంగములు జరగుచుండా ధర్మజుఁడు వ్యాసునుద్దేశించి "ఓమహామునీ! నీయనుగ్రహముచే రత్నధనము సంపాదింపఁబడియెను. వాజిమేధ మహాక్రతువునం దీధన ముపయోగింపఁగోరుచున్నాఁడను. అందుల కీవానతీయవలయును. మేమెల్ల నీకును మహాత్ముఁడగు శ్రీకృష్ణునకును నధీనులమైనవారముగాదే?" అని పలికెను. అది విని యావ్యాసభగవానుఁడు "ఓధర్మరాజా! నేనెందులకు సమ్మతించుచున్నాఁడను. ఇఁక జేయఁదగుపని యొనర్పుము. విధ్యుక్తముగా సదక్షిణాకమగు నశ్వమేధయాగ మొనర్పుము. ఓరాజా! ఆవాజిమేధము సకలపాపవిమోచనకారి. ఆయాగ మొనర్చుదేని సకలపాపవిముక్తుఁడ వగుటలో సందియము లేదు." అని పలుకుటయు, ధర్మాత్ముఁడగు నయ్యుధిష్ఠిరుఁడు, వాజిమేధయాగారంభమును జేయఁ బ్రయత్నించెను. అటులు నిశ్చయించి, యతఁడు వ్యాసునను జ్ఞవడసి, వాసుదేవునిఁ జేరి వచోదక్షుఁడై "ఓదేవా! దేవకీదేవి, నీవలననే సుప్రజయయ్యెను గాదే?

ఓమహాబాహూ! నిన్నేమి ప్రార్థించితినో, యదియెల్లఁ గావించితివి. ఓయదునందనా! భవత్ప్రభావసంపాదితములగు భోగముల ననుభవించువారము. పరాక్రమముచేతను బుద్ధిచేతను నీవే యీభూవలయమును జయించితివి. నాకశ్వమేధదీక్ష నిప్పింపుము. నీవే మాకుఁ బరమగురుఁడవు. ఓదాశార్హా! నీ విష్టముగలవాఁడవేని, నేను బాపవిముక్తుఁడ నగుదును. నీవ మాకు యజ్ఞమును, గురుఁడవును, ధర్మబోధకుఁడవునై యున్నవాఁడవు. నీవ ప్రజాపతివి. ఇంతయేల! సకలభూతములకును నీవ గతివని నానిశ్చయము" అని పలుకుటయుఁ గృష్ణుఁడు "ఓయుధిష్ఠిరా! నీవ దీనిని జేయఁదగినవాఁడవు. నీవే సకలభూతములకును గతివగుదని నానిశ్చయము. కురువీరులలో నిపుడు ధర్మముచే వెలయువాఁడ వీవగదా! ఓయీ! మేమెల్ల నిన్నుఁబట్టి చూడ నప్రధానులము. నీవ మాకు గురుఁడవని నానిశ్చయము. నాసమ్మతినొంది నీ వీయాగ మొనర్పుము. ఇది నీచేఁ జేయఁదగినది. నే నీకార్యమున నేమిచేయవలయునో నియోగింపుము దానిని దప్పక చేయుదునని యిదె ప్రతినసేయుచున్నాఁడను. నీయొనర్చిన యాగముచే, భీమార్జుననకులసహదేవులును యాగము చేసినవారగుచున్నారు." అని పలికెనని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

## వ్యాసుఁ డశ్వమేధవిధాన మెఱిఁగించుట

ఓజనమేజయా! కృష్ణుఁ డిట్లు తెల్పుటయు, నయ్యుధిష్ఠిరుఁడు, వ్యాసుని రావించి "దేవా! నీవ హయమేధకాల మెఱిఁగింపఁదగువాఁడవు. ఈక్రతువు నీయధీనమై యున్నది. నన్ను నీవ దీక్షాయుక్తుఁ గావింపవలయును." అని పలుక విని యావ్యాసుఁడు "యుధిష్ఠిరా! నేనును, పైలుఁడును, యాజ్ఞవల్క్యుఁడును, యథాకాలముగ నివ్విధానము నొనరించుటలో సందియము లేదు. నీ వీచైత్రపౌర్ణమియందు దీక్షఁబూనవలసియున్నది. ఓపురుషోత్తమా! యజ్ఞసంభారము లన్నియు సంగ్రహింపఁబడుఁగాక. ఓరాజా! నీయాగమున మేధ్యమగునశ్వమును, నశ్వవిద్యావిదులగు సూతులును, దద్విద్యావేత్తలగు బ్రాహ్మణులును బరీక్షింపవలయును. అట్లు పరీక్షింపఁబడిన యశ్వమును యథాశాస్త్రముగాఁ బుడమిఁ జరింప విడువుము. ఓపార్థివోత్తమా! అయ్యది

కీర్తి వర్ధిలఁజేయుచు నీ పేరితో సాగరాంబరయగు పృథివినెల్లఁ బరిభ్రమింపవలయును” అని తెలిపెను.

అంత నప్పాండవాగ్రజుఁడు, వాసుదేవునివచనములను వల్లెయని బ్రహ్మవాదియగు వ్యాసుఁడు చెప్పినవొప్పున సకలమును సంగ్రహించెను. ఓరాజేంద్రా! అటులు సంభారములనెల్ల సంగ్రహించి తద్విషయము నాకృష్ణద్వైపాయనునకు విన్నవింపఁగా, నప్పాండవాగ్రజునితో, నావ్యాసభగవానుఁడు “ఓరాజా! నీదీక్షవిషయమున యథాయోగముగను, యథాకాలముగను మేము సిద్ధపడియున్నవారము. ఒకసువర్ణమయమగుఖడ్గము, సువర్ణమయమగుకుశముష్టియు, నింకను నిందులకుఁగావలసినదియు సమకూర్పఁబడుఁగాక. అదియెల్ల సువర్ణమయమై యుండవలయును. ఇఁకఁ బుడమిఁ జరింప నశ్వము పరిత్యజింపఁబడుఁగాక. దానిని యథాశాస్త్రముగను, యథావిధిగను రక్షింపవలయును.” అని తెలిపెను. అది విని యాధర్మజుఁడు “ఓమహామునీ! ఈయాగీయాశ్వ మెట్లు విడువఁబడినఁ బుడమిఁ జరించునో, తద్విధియెల్ల విధింపఁబడుఁగాక. కామచారియై పుడమిని జరించుచున్న తురగము నెవ్వఁడు పరిపాలింపవలయునో, యది యానతిమ్ము.” అని యడుగుటయు, నతఁడు “యుధిష్ఠిరా! సకలధనుర్ధరోత్తముఁ డగునర్జునుఁ డందులకుఁ దగినవాఁడు. జయశీలుఁడును, సహనశీలుఁడును, ధైర్యవంతుఁడును నగునతఁడే యీయశ్వమును బాలింపఁదగినవాఁడు. నివాతకవచాంతకుఁడగు నతఁడు పుడమినెల్ల జయింపఁదగినవాఁడు సుమీ! అతనియందు దివ్యాస్త్రములు గలవు. అతనిమేను దివ్యమైనది. అతని విల్లు దివ్యమైనది. మఱియు నాతనియమ్ములపొదులును దివ్యములే. కావున నతఁడే దీని ననుసరింపఁదగినవాఁడు. ఓయుధిష్ఠిరా! మఱియు నతఁడు, ధర్మార్థకుశలుఁడును, సకలవిద్యావిశారదుఁడును నగుట, నయ్యశ్వమును యథాశాస్త్రముగాఁ జరింపఁజేయఁగలవాఁడు. మహాబాహుఁడును, రాజపుత్రుఁడును, రాజీవలోచనుఁడును, శ్యామవర్ణుఁడును, నభిమన్యుజనకుఁడును, వీరుఁడునగు మనయర్జునుఁడే యీయశ్వము వెంటఁ బోవఁదగినవాఁడు. భీమసేనుఁడు తేజస్వియు, నమితవిక్రముఁడు నగుట రాజ్యమును రక్షింపఁజాలియున్నవాఁడు, అతనికి నకు

లుఁడు తోడుపడును. సహదేవుఁడు విధ్యుక్తముగాఁ గుటుంబతంత్రము సమకూర్చును." అని తెలిపెను.

అంత నయ్యుధిష్ఠిరుఁడు, "అర్జునా! ఇటు రమ్ము. ఓవీరాగ్రణీ! నీ వీయశ్వమును బరిపాలింపుము. దీనిని రక్షింప నీవుదక్క వేఱొక్కఁడు సమర్థుఁడు గాఁడు. ఓమహాబాహూ! ఎవ్వరేని క్షత్త్రియపుంగవులు నిన్ను మాఱ్కొందురేని వారితో వైరములేకుండ వర్తించి మరల వలయును. నా యీయాగవిధమునెల్ల వారి కెఱిఁగింపవలయును. వారిని రమ్మని పిలువవలయును." అని తెలిపెను.

ఓజనమేజయా! ఆయుధిష్ఠిరుఁ డిట్లు భ్రాతయగుసవ్యసాచితోఁ బలికి, భీముని నకులునిఁ బురరక్షకులఁగా నియమించి, సహదేవునిఁ గుటుంబతంత్రము నిర్వర్తింప నియోగించెను. అదియెల్ల మహీపతియగు ధృతరాష్ట్రున కతఁడు నివేదించెను.' అని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

## అర్జునుఁ డశ్వమును వెంబడించుట

ఓజనమేజయా! పిమ్మట దీక్షాకాలము ప్రాప్తించుటయు, మహాత్ములగు ఋత్విజులందఱును, విధ్యుక్తముగా నశ్వమేధయాగమునకై యప్పార్థివుని దీక్షితునిఁ గావించిరి అటు లయ్యుధిష్ఠిరుఁడు దీక్షితుఁడై పశుబంధములనుగావించి, యాజకులతోఁగూడి మహాతేజుఁడై మిక్కిలి విరాజిల్లెను. అమేయతేజుఁడగు వ్యాసుఁడు విధ్యుక్తముగా, నయ్యశ్వమేధయాగమునకై స్వయముగా నశ్వము విడువఁబంచెను. ఓజనమేజయా! ఆధర్మరాజు దీక్షితుఁడై, హేమమాలియు సువర్ణకంఠుఁడునై ప్రదీప్తపావకునట్లు లలరుచుఁ గృష్ణాజినము ధరించి దండము కేలఁగొని, క్షౌమవసనుఁడై మఱియు నధ్వరమున వెలయు ప్రజాపతియట్లు లెంతయు విరాజిల్లెను. ఓరాజా! ఆతనియాజకులు తుల్యవేషులై వెలయఁజొచ్చిరి. అర్జునుఁడును బ్రజ్వలత్పావకునట్లు లొప్పుచు నయ్యశ్వమును వెంబడించెను. అప్పుడు కొందఱు "అర్జునా! నీకు శుభమగుఁగాక. నిర్విఘ్నముగాఁ బోయి, వడిగాఁ రమ్ము." అని పలికిరి. మఱికొందఱు, "ఈయర్జునుఁడు, సమ్మర్దమునఁ గానరాకుండును. ఈతని ధనువునైతము దృష్టిగోచరము గాకుండును. మఱియు నిది భీమా

రావమై గాండీవమును ప్రసిద్ధివడసెనుగాదే?" అని పలికిరి. ఓరాజా! అంత సయ్యాగ్గనుఁడు ధర్మరాజానుజ్ఞవడసి, గాండీవమును గదల్చుచు, గోధాంగుళిత్రాణములను ధరించి, సోత్సాహుండై యాగుఱ్ఱమును వెంబడించెను. ఆబాలవృద్ధముగా నప్పురమంతయును, నటులు వెడలుచున్న ధనంజయునిఁ జూడఁ గుతూహలముగలిగి వెడలెను. అటులాహయమును, హయహారియగు హరిహయతనయునిఁ జూడఁగోరి వెడలినపౌరుల పరస్పరసమ్మర్దముచే నావిరి జనించెను. మఱియు నక్కౌంతేయునిఁ గనుఁగొను మనుజుల నినాదము దెసల నిండిన దయ్యెను. అపుడు కొందఱు "అదె దీప్తిమంతమై యక్కౌంతేయు నశ్వము పోవుచున్నది. దానిని మహాబాహుండగు పార్థుఁడు, తనయుత్తమ ధనువు ద్రిప్పుచు ననుసరించుచున్నవాఁడు చూడుఁడు." అని పలికిరి. మఱికొందఱు "అర్జునా! నీకు శుభమగుఁగాక. నిర్విఘ్నముగా వెడలి రమ్ము" అని పలుకసాగిరి. మఱికొందఱు "ఇతఁడు సుఖముగాఁ బోఁగల్గును. ఇతనిత్రోవనిర్భయముగా నుండును. మరలివచ్చిన యీతని మరలఁ గనుఁగొందుము. తప్పక నితఁ డిపుడే వచ్చును" అని పలికిరి. ఓజనమేజయా! ఇటులు పురుషులును స్త్రీలును మఱిమఱియు మధురముగాఁ బలుకుచుండ, వెడలిన యావివ్వచ్చునితో, యజ్ఞకర్మకుశలుఁడగు యాజ్ఞవల్క్యశిష్యుఁ డొకఁ డయ్యశ్వశాంతికర్మమునకుఁగా బయలువెడలెను. ధర్మజునిశాసనముచే, వేదపారగులగు బ్రాహ్మణులును, మఱికొందఱు క్షత్త్రియులును మహాత్ముఁడగు పార్థు ననుసరించిరి. పాండవు లస్త్రతేజముచే జయించినపుడమినెల్ల నయ్యశ్వ మిచ్చవచ్చినట్టులు వర్తించెను. ఓజనమేజయా! అపు డాతనిప్రయాణమున జరగిన మహాత్తరవిచిత్రయుద్ధములనెల్లఁ దెలిపెదను. ఓరాజా! ఆ యశ్వము పుడమికిఁ బ్రదక్షిణము చేయునదై ముందుగా నుత్తరమునకు వెడలెను. అది యాదేసనున్న రాజులరాష్ట్రములను ద్రొక్కుచునడువ, మహారథుఁడగు శ్వేతాశ్వుఁడును, దాని ననుసరించెను. అపు డాపార్థునకు క్షత్త్రియులతో జరగినయుద్ధములకు లెక్కలేదు. అటులు యుద్ధమొనర్చినవారందఱును హతబాంధవులై నశించిరి. ఓరాజా! కిరాతులును, యవనులును, ధనుర్ధరులై యనేకు లెదుర్కొనిరి. అటులే మున్నతనిచే నిరాకృతులైన మ్లేచ్ఛులును బెక్కురు మాఱుకొనిరి

ప్రహృష్టభటవాహనులై యారక్షత్త్రియులును యుద్ధగర్వితులై యప్పార్థుని సమీపించిరి. ఓరాజా! ఇటు లప్పార్థునకు, నానాదేశాగతులగు పార్థివులతో నందందు యుద్ధములు జరగెను. మఱియు నాయశ్వమునుగూర్చి జరగినగొప్పయుద్ధములను దెలిపెదను వినుము" అని తెలిపి యవైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

### అర్జునుని దిగ్విజయయాత్రావిధము

ఓజనమేజయా! మున్నాకిరీటిపై వైరము వహించియున్న త్రిగర్తులతో నాతనికి యుద్ధము జరగెను. అప్పుడు హతులైనవారి సుతులును, మనుమలును, నిపు డర్జునునియాగీయాశ్వము వచ్చెనని తెలిసికొని, యాదేశమువారందఱును రా, యుద్ధసన్నద్ధులై చుట్టుకొని రథులును బద్ధతూణీరులునగుచు నయ్యజ్ఞాశ్వమును బట్టికొన యత్నించిరి. అప్పు డప్పార్థుఁడు వారియుద్దేశ మెఱిఁగి తొలుతఁ దనయన్న చెప్పినచొప్పున మంచిమాటలచే నివారించెను. కాని వారు దాని నాదరింపక శరప్రయోగముసేయుటయుఁ, దమోరజోగ్రస్తులగువారి నెల్ల నక్కిరీటి నివారించి, పిమ్మట నగుచు వారితో, "ఓధర్మానభిజ్ఞులారా! మరలుఁడు. మీకు శ్రేయోజీవితములు వలయునేని మరలి పొండు." అని తెలిపెను. ఓరాజా! అవ్వీరుఁడు వెడలునపుడు యుధిష్ఠిరుఁ డాతనితో "అర్జునా! హతబాంధవులై మిగిలియున్న పార్థివులను వధింపక నివారించి రమ్మని పలికెనుగాదే? అది చిత్తమందిడి యతఁడు త్రిగర్తులను మరలిపొండని తెలిపెను. గాని వారు మరలరైరి. అపుడతఁడు త్రిగర్తప్రభుఁడగు సూర్యవర్మని శరజాలముచే జయించి పరిహసించెను. అంత నతఁడు తనవారితోఁగూడి, రథఘోషములచే దెసలు పిక్కటిల్ల నప్పార్థుని మఱియు నెదుర్కొనెను. సూర్యవర్మ, తనయస్త్రకౌశలముచూపుచు నతపర్వములగు శరశతము లప్పార్థునిపైఁ బఱగింప, మఱియుఁగల యాతనియనుచరులును, మహేష్వాసులై ధనంజయవధాభిలాషతో శరవర్షములను వర్షించిరి. అంత నప్పార్థుఁడు గాండీవజ్యానిర్ముక్తములగు శరపరంపరలచే వారినెల్ల ఖండించుటయుఁ బుడమింబడిరి. అంత నాసూర్యవర్మతమ్ముఁడగు కేతుధర్ముఁడు, తేజస్వియై దనయన్నకై యశస్వియగు నయ్యర్జునుతో యుద్ధముచేయవచ్చెను.

అటులువచ్చిన కేతుధర్మ నాగని, యారణరసికాగ్రగణ్యుఁడు నిజశిత సాయకములచేఁ బ్రహరించుటయు, వాఁడు పుడమిఁబడియెను. పిదప మహారథుఁడగు ధృతవర్మ వడిగావచ్చి యవ్వివ్యచ్చుని శరశతములచే నొప్పించెను. వానిశరలాఘవమును జూచి, యాసవ్యసాచి, యద్భుతావిష్టుఁడై తలయూచి సంతోషించెను. ధృతవర్మ బాలుఁడయ్యు, వాని శరసంధానమును శరప్రయోగమును గ్రహింపరానివయ్యెను. అటులగుట నాధనంజయుఁ డాధృతవర్మను గౌరవించి, వానిని రెండు గడియలుమాత్రము సంతోషపెట్టువాఁడై యూరకుండెను. అమిత తేజుఁడగు నప్పార్థునిచే నటులు వాఁ డుపేక్షితుఁడై యుండుట నాతనిపై దీప్తమగు నొకశరము ప్రయోగించెను. అయ్యది ధనంజయునిచేతికిఁ దగిలి నొప్పింప నతఁడు గాండీవము విడిచి మూర్ఛితుఁడై పుడమిఁబడియెను. ఆసవ్యసాచి హస్తమునుండి పడిన గాండీవము పృథివిఁబడు నింద్రచాపమునా విరాజిల్లెను. ఓరాజా! దివ్యమగు నమ్మహాధను వట్లు పుడమిఁ బడుటయు నాధృతవర్మ చప్పడుప్పతిలు నట్లుగా హాసమొనరించెను. పిమ్మట నప్పార్థుఁడు కోపావేశపరవశుఁడై చేతిరక్తమును దుడిచికొని ధనువు నాకర్షించి శరవర్షము గురిసెను. అంతట మిన్నుముట్టునట్టుగా హాలహలాశబ్ద ముప్పతిల్లెను. అప్పుడు నానావిధములగుభూతములును బ్రశంసించుచుండఁగాఁ గుపితుఁడై ప్రళయకాలయముఁడునాఁ జూపట్టు నాజిష్ణునిఁ ద్రిగర్తయోధులందఱును జుట్టుకొని యాధృతవర్మని రక్షించువారై యుండిరి. అంత నాధనంజయుఁడు మఱియుఁ గుపితుఁడై వారిలోఁ బదునెనమండ్రను యోధులగువారిని వధించెను. మహేంద్రవజ్రసన్నిభములగు నాయస సాయకములచే నటులు హతులైనయాయోధుల నారసి, మఱియు నుత్సాహముతో నాయర్జునుఁడు సర్పతుల్యములగు సాయకములచేఁ గొట్టుచు, నట్టహాసమొనర్చుచు విక్రమించెను. ఆత్రిగర్తమహారథులందఱును నిరుత్సాహులై యాధనంజయు శరార్చులకోపలేక నలుదెసలకుఁ బాఱఁజొచ్చిరి. మఱియు వారాతనికి భీతులై "ఓపార్థా! నీకు మేమెల్ల సేవకులమై వశులమైతిమి. నమ్రులమైన మమ్ము ప్రేష్యులఁగా భావించి, యేదే నానతిమ్ము. నీకుఁ బ్రియమగునకార్యమును శిరసావహించి యొనర్తుము" అని పలికిరి. అది విని యతఁడు "ఓరాజా

లాశా! నాశాసనము ప్రతిగ్రహించి మీజీవితమును రక్షించుకొనుఁడు." అని పలికెనని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

## వజ్రదత్తయుద్ధము

ఓజనమేజయా! పిమ్మట నాహయోత్తమము ప్రాగ్జ్యోతిషముసు సమీపించుటయు, నచట రణకోవిదుఁడగు భగదత్తపుత్త్రుఁడు నిరోధించువాఁడై వెడలెను. అతఁడు వజ్రదత్తుఁడు. ఆరాజు నగరమునుండి వెడలి, తనదేశమునఁ జరించుచునయ్యశ్వమును ప్రతిరోధించుటయు, నప్పార్థుఁడు గాండీవమును ద్రిప్పుచు నాతనిఁ దాఁకి, నిజధనుర్విముక్తములగు సాయకములచే వానిని బీడించెను. అంత నావజ్రదత్తుఁడు హయమునువిడిచి పార్థునిపైఁ బడఁదలంచి, మరలఁ బురముఁ జొచ్చి కవచధారియై, యొకగజోత్తమము నారోహించి, యుద్ధకాంక్షతో శ్వేతచ్ఛత్త్రమును జామరములును వెలయ వెడలి, పాండవమహారథుఁడగుపార్థుని యుద్ధమునకుఁ బిలిచెను. ఓరాజా! వాఁడటులు వారణాధిరూఢుఁడై వెడలి, కోపమడర నాశ్వేతాశ్వునిపైఁ దనమత్తగజమును బురికొలిపెను. పరగజనివారణమును, మదమును స్రవించునదియును, శాస్త్రయుక్తముగఁ గల్పింపఁబడినదియును, యుద్ధగర్వముగలదియునగు తనవారణము నావజ్రదత్తుఁ డట్లు పురికొలుపుటయు, నది యాకసముపైకెగురుచున్నదియుఁ బోలెఁ గానవచ్చెను. అటులు తనపైకివచ్చు నామత్తగజము నావివ్వచ్చుఁడు గాంచి, కుపితుఁడై తాను భూమియందుండియే యుద్ధము చేయఁదొడంగెను. అంత నావజ్రదత్తుఁడు కుపితుఁడై, యాధనంజయుపై నగ్నితుల్యములై శలభములట్లు వేగము గలతోమరములను బ్రయోగించుటయు, నయ్యర్జునుఁడు క్రుద్ధుఁడై సువర్ణపుంఖములగు నారాచములను గొన్నిటి నాభగదత్తాత్మజుపైఁ బ్రయోగించెను. అంత నమ్మహాతేజుఁడగు వజ్రదత్తుఁడు పార్థసాయకభృశాహతుఁడై పుడమిఁబడియు, స్మృతి తప్పక జాగరూకుఁడై, తనకింకను విజయాభిలాష విడువమి నవ్విజయునిపైఁ దనవారణమును బురికొలిపెను. అంత నయ్యర్జునుఁ డామత్తగజముపై విషసర్పతుల్యములును, నగ్నిసన్నిభములునగు సాయకములను గోపమడరఁ బ్రయోగించుట, నదియెంతయుఁ బ్రహతమై రక్తము స్రవింప, గైరికాది

ధాతువులుగల పర్వతమట్లు చూపట్టెను. అని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

### వజ్రదత్తు నర్జునుఁ డోడించుట

ఓజనమేజయా! ఆవాసవివజ్రదత్తులకు మూఁడు రాత్రు లావిధముగా యుద్ధమయ్యెను. వారియుద్ధము వృత్రవాసవులయుద్ధమును దలపించెను. నాల్గవదినమున నావజ్రదత్తుఁడు మహాబలుఁడై యట్టహాసమొనర్చుచు "ఓయర్జునా! అర్జునా! నిలునిలుము. నిన్నుఁ బ్రాణములతో విడుచునది లేదు. నిన్నుఁ జంపి నాపితృదేవతలకుఁ దర్పణవిధి నాచరించెదను. తండ్రికిఁ బ్రియుఁడును, వృద్ధుఁడునగు నాతండ్రి భగదత్తుఁడు నీచే హతుఁడయ్యెను. ముదుసలియగుట నాతని వధించితివి. పిన్నవగునన్ను మార్కొని యుద్ధముసేయుము."అని పలికి కుపితుఁడై, వాఁడు తనవారణము నాపార్థునిపై మరలఁ బురికొలిపెను. అంత నానాగేంద్రము మింటి కెగురుచున్నదినా వెడలి యక్కవ్వాడిపైఁబడి, తొండముచే జలబిందువులఁ జల్లుచు, శైలమును జేరిన నీలమేఘమునాఁ జూపట్టెను. అటు లది చోదితమై మేఘమట్లు మఱిమఱియు గర్జిలుచు, నాట్యముచేయునట్టులు గాన్పించుచు, నమ్మహారథుని మార్కొన, దాని నారసి యాగ్రహాగ్రస్తుఁడై గాండీవహస్తుఁడైన యర్జునుఁడు, తన యప్పటికార్యమునకు విఘ్నమును, బూర్వవైరమును స్మరించి, వేలను సాగరమట్టు లావారణము నాతఁడు నివారించెను. అంత నమ్మత్తగజమావిజయునిచే నివారితమై, శరపరంపరాంకితాంగమగుట ముండ్లపందినాఁ జూపట్టెను. అంత నాభగదత్తపుత్రుఁడు తనగజము నివారితమగుటకుఁ గనలి, యర్జునుపైఁ దీవ్రసాయకములఁ బఱపుటయు, నప్పార్థుఁడు తనబాణములచె వానినెల్ల నివారించెను. అది యెంతయు నద్భుతము గావించెను. అంత మఱియు నాప్రాగ్జ్యోతిషాధిపతి కుపితుఁడై, పెద్దపర్వతమునాఁదగు తననాగేంద్రమును వివ్వచ్చునిపైఁ బురికొలుపుటయు, నతఁ డగ్నిసన్నిభమగు నొకనారాచము నావారణముపైఁ బ్రయోగించెను. దానిచే నాదాని యెంతయు నభిహతమై, వజ్రప్రహూతమగు పర్వతమట్లు నేలఁగూలెను. అది పుడమిఁ బడినతోడనే, భూగతుఁడైయున్న యావజ్రదత్తునిఁ జూచి "ఓరాజా! భయపడకు"మని పలికి "ఓయీ! నే నీయశ్వముతో వెడలునపుడు,

మహాతేజుఁడగు మాయన్న యుధిష్ఠిరుఁడు, నాతో 'ధనంజయా! రాజుల నెవ్వరిని జంపవలదు. వారిని జయించినఁజాలును. యోధులగు వారిని వధింపకుము. మఱియు సందఱను మనయశ్వమేధమునకు మిత్రులతోఁగూడ రమ్మని పిలువుము' అని యుపదేశించెను. అటు లగుట నిన్నిపుడు నేను జంపను. లెమ్ము నీకు భయములేదు. సుఖముగాఁ బొమ్ము. ఈచైత్రపౌర్ణమిని ధీమంతుఁడగుయుధిష్ఠిరుఁ డశ్వమేధమొనర్చును. కావున నీవందులకు రమ్ము." అని తెలిపెను. అంత నావజ్రదత్తుఁడు పార్థునివచనములకు సమ్మతించి వెడలిపోయెను. అని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

### సింధుదేశములమీఁదుగా నర్జునుఁడు వెడలుట

ఓజనమేజయా! పిమ్మటఁ బార్థునకు సైంధవులతో యుద్ధము జరిగెను. మున్ను చావఁగా మిగిలినసింధుదేశపురాజు లావిజయుఁడు తమదేశమునకు వచ్చుటఁ దెలిసి, సహింపనివారై యాతని నెదుర్కొని, యాతనిగుఱ్ఱమును బట్టుకొని, నిర్భయులై యాహయమునకుఁ జేరువగానున్న పార్థునిఁ జుట్టుకొని, మున్ను వారు పరాభూతులగుట నిపుడు జయాభిలాషులై, తమనామగోత్రములను, వివిధములగు తమకృత్యములను బొగడికొనుచు, శరవర్షమున నాతని ముంచిరి. మఱియు వారటు లాతనిఁ జుట్టుకొని, వారణాప్రతివారణములగు శరవ్రాతములఁజిమ్ముచు, జయముభిలషించుచుఁ, దాము రథస్థులై పదాతియగు నాతనితోఁ బోరాడఁదొడంగిరి. నివాతకవచాంతకుఁడును, సంశప్తకహంతయు, సైంధవఘాతియునగు నప్పార్థుఁడు వారిశరప్రహారములు వడి కొంతవడి యుపేక్షించుటయు, మఱియు వారు, సైంధవునివధము స్మరించుచుఁ, బర్జన్యునట్లు శరములఁ గురిపించిరి. ఆశరపరంపరలనడుమ నక్కవ్వడి, మేఘమధ్యమున విరాజిలు భాస్కరునట్లు ప్రకాశించెను. మఱియు నాశరాసనధరోత్తముఁ డాసైంధవులశరపరంపరలనడుమ నెంతయుఁ బంజరాంతరసంచారియగు శకుంతమునాఁ జూపట్టెను. అటు లాకౌంతేయుఁడు శరదీపితుఁడగుటయు, హాహాకారములు జగమున జనించెను. సూర్యుఁడు నిష్ప్రకాశుఁడయ్యెను. మఱియు గాలి గగురుపాటొదవునట్లుగా వీవసాగెను. రాహువు సూర్యచంద్రుల

నొక్కమాఱుగనే గ్రసింపఁదొడంగెను. మఱియు నుల్కాపాతములు సూర్యునకుఁ దగిలి యందందుఁ బడఁజొచ్చెను. మహాగిరియగు కైలాసమునకుఁ గంపమొదవెను. అప్పుడు మహర్షులును, దేవర్షులును భయమొదవ దుఃఖశోకపీడితులై, దీర్ఘోష్ణనిశ్శ్వాసముల విడువసాగిరి. మఱియు నాకసమునుండి యిందుమండలము తెగిపడియెను. దెసలన్నియు వ్యత్యస్తములై ధూమవ్యాప్తములయ్యెను. మేఘములు గాడిదరంగుగలిగి, మెఱుపులు, ధనుస్సులు వెలయ, నాకసము నిండి, మాంసమును రక్తమును వర్షింపసాగెను. ఓజనమేజయా! అప్పార్థుఁడు, సింధువీరశరచ్ఛన్నుఁడై నపు డిట్టివై మిగుల నద్భుతమయ్యెను. మఱియు నయ్యర్జునుఁ డట్లు వైరిశరపీడితుఁడై కరమునుండి గాండీవము, నావాపమును జాఱెను. అటులు గాండీవము జాఱ, నతఁడు మూర్ఛవడుటయు, వారు మఱియు శరజాలము గురియసాగిరి. అతఁ డట్లు గతసత్త్వుఁడై మూర్ఛవడుటఁ దెలిసి, దేవతలందఱును జడిసి, శాంతివిధులఁ జేయువారైరి. మఱియు దేవర్షులును, బ్రహ్మర్షులును, సప్తర్షులును ధీమంతుఁడగు పార్థునివిజయమునుగూర్చి జపమొనర్చిరి. ఓపార్థివా! అప్పార్థుఁ డట్లు దేవతలచేఁ దేజమొందింపఁబడి, యారణరంగమునఁ బరమాస్త్రవేత్తయై కొండవలెఁ జలింపకుండెను. ఓజనమేజయా! పిమ్మటఁ దన గాండీవము నతఁ డాకర్షించుటయు, మఱిమఱియు దానియారావము, యంత్రధ్వనియట్టు లొదవసాగెను. అపు డతఁ డాగాండీవమునుండి శరధారలు వెలువడ వారిని బీడించుటయు, వా రాతనిశరసహస్రముచే, శలభములచేఁ గప్పఁబడినపాదపములట్లు గానరాకుండిరి. అపు డందుఁ గొంద ఱాధనుశ్శబ్దమునకు జడిసి పరువులిడసాగిరి. మఱికొందఱు కన్నీళులు గాలువలుగా నేడ్వసాగిరి. అటు లాపార్థుఁడు సైంధవుల నడుమ నగ్నిచక్రమట్లు చరించుచు, శరజాలముచేఁ బీడించుచుఁ రా, నాతనిబాణజాల మింద్రజాలమునాఁ దగియుండెను. అతఁడు వజ్రధారియగు నింద్రునట్లు శరవర్షములచే శత్రుసైన్యమునెల్లఁ జీల్చు శరత్కాలదివాకరునట్లు విరాజిల్లెను. అని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

### అర్జునుఁడు సైంధవులను జయించుట

ఓజనమేజయా! శూరుఁడగు నాపార్థుఁడు, గాండీవముపూని యుద్ధసన్నద్ధుఁడై హిమవత్పర్వతమట్లు చలింపక నిలిచియుండ నాసైంధవయోధులందఱును మరల నాతనిఁ దలపడి, కుపితులై శరవర్షము గురిసిరి. అటులు మఱియుఁ దలపడిన యాసైంధవులఁ గాంచి, యాకిరీటి పరిహసించుచు, మృదువచనములతో "ఓవీరులారా! మీశక్తికొలఁది యుద్ధము చేయుఁడు. జయమునకు యత్నింపుఁడు. కాని మీకిపుడు గొప్పభయ మాసన్నమైనది. మీసకలకార్యములను నిర్వర్తించికొనుఁడు. ఇదె మీశరవాగురను నివారించి, మీయెల్లరతోఁ బోరాడ నడుఁకట్టియున్నవాఁడను. యుద్ధాభిలాషులై నిలువుఁడు. మీగర్వము నడంచెదను" అని పలికి యాగాండీవధారి కుపితుఁడగుచునుండియుఁ, దనయన్నయగు యుధిష్ఠిరునిమాట జ్ఞప్తికిఁ దెచ్చుకొని "ఆహా! ఆధర్మజుఁడు నాతో విజిగీషులై వచ్చినను క్షత్త్రియులను వధింపవలదనియు, జయించి విడువవలయుననియుఁ, దెలిపెనుగదా! మహాత్ముఁడును ధర్మజ్ఞుఁడునగు నాతనిశుభవచనము, నసత్యమెట్లు గావించువాఁడను? అటులగుట రాజాజ్ఞనుబట్టి యీరాజులను వధింపరాదు." అని చింతించి, యుద్ధదుర్మదులైయున్న యాసింధుదేశవిభులతో "ఓక్షత్త్రియులారా! మీకొక మంచిమాటఁ దెలిపెదను. వినుఁడు. మీరిటులు సంసిద్ధులైయున్నను మిమ్ము నేను హింసింపను. సంగ్రామమున నెవఁడు 'పరాజితుఁడనైతి'నని పలుకునో, వానికిఁ బ్రాణహాని గలిగింపను. నా యీవచనము విని మీహితమును గూర్చుకొనుఁడు. అటులొనర్పరేని, కష్టదశకుఁ బాలై నాచేఁ బీడింపఁబడుదురు." అని తెలిపి వారితో యుద్ధమొనర్పసాగెను. అంత వారు విజిగీషులై తన్నెదుర్కొనుటయు, నతఁడును గుపితుఁడై మార్కొనియెను. అపు డాసైంధవవీరులు, నతపర్వములగుసాయకములు లక్షలకొలందిగా నాగాండీవధరునిపైఁ బ్రయోగించుటయుఁ, గ్రూరములై విషసర్పతుల్యములు నాఁదగి తనపైకివచ్చు వైరులసాయకముల నాధనంజయుఁడు తనతీవ్రనారాచములచే ఖండించెను. అప్పార్థుఁడు, శిలాశితములగు తమకంకపత్త్రముల నడుమనే ఖండించుటయు, వారు సైంధవవధమును స్మరించికొని కుపితులై ప్రాసములను, శక్తులను బ్రయోగించిరి. కాని, వారి

సంకల్పము నాకిరీటి విఫలమొనర్చుచు నడుమనే వానినెల్ల ఖండించి వైచెను. పిమ్మట మఱియు జయాభిలాషులై తనపైకి వచ్చుచున్న యోధులతలల నప్పార్థుఁడు, నతపర్వములగు భల్లములచేఁ బడఁద్రోసెను. వారిలోఁ గొందఱు పరువులిడుచు, మఱియు మూర్కొనుచు, మఱియు మరలుచు నుంట నవ్వీరులందుఁ బూర్ణసాగరరవమునాఁదగు శబ్దముప్పతిల్లఁజొచ్చెను. అమేయతేజుఁడగు నప్పార్థునిచే వారటులు వధ్యమానులగుచు, యథాశక్తిగను, యథోత్సాహముగను, యుద్ధము చేయుచుఁ, దీవ్రసాయకములచే నిశ్చేతనులగుచుఁ, గ్లాంతవాహనసైనికులగుచు నుండిరి. అపుడు వారందఱును బరిశ్రాంతులగుటఁ దెలిసి, ధృతరాష్ట్రపుత్త్రియగు దుశ్శల తనకు మనుమఁడును, సురథునిపుత్త్రుఁడు నగుబాలు నొకరథముపైఁ గూర్చుండఁబెట్టికొని వెడలి, యప్పార్థుని శాంతింపఁజేయునదియై యాయోధులను సమీపించి, ధనంజయునిఁ జేరి యార్తస్వరముగా రోదనమొనర్చుటయు, నతఁ డామెను గాంచి తనధనువు విడిచి, సగౌరవముగాఁ, దనకుఁ జెల్లెలగు నాదుశ్శల నాదరించి, "నేనిపు డేమిచేయవలయు"నని యడిగెను. అది విని యామె పార్థునిఁ గాంచి, "ఓయన్నా! వీఁడు నీమేనల్లుఁడగు సురథునికొడుకు. నీకు నమస్కరించుచున్నాఁడు చూడుము." అని పలికెను. అది విని యర్జునుఁడు, వానితండ్రి నడిగి, వాఁడెందున్నాఁడని ప్రశ్నించెను. అంత నాదుశ్శల "ఓయర్జునా! వాఁడు పితృశోకాభితప్తుఁడై దుఃఖమాపికొనలేక మరణమొందెను. అది యెట్టిదో వినుము. మున్ను నీచేఁ దన తండ్రి హతుఁడగుట వినియు, నిపు డిందులకు నీవు హయము ననుసరించి వచ్చుటఁ దెలిసియు, భీతిలి తండ్రివధమునకుఁ బరితపించుచుఁ బ్రాణములను విడిచెను. బీభత్సుఁడనుపేరు వానిచెవిఁ బడినవెంటనే వానికి మరణము సంభవించెను. వాఁడటులు పుడమిఁబడినతోడనే, వాని తనయుఁడగు నీబాలునిఁ దీసికొని, నిన్ను శరణుపొందుదాననై యిటులు నీసన్నిధి కరుదెంచితిని." అని పలికి, మిక్కిలి దీనుఁడై యున్న యాబాలు నతనిచెంగట విడిచి, యార్తస్వరముతో మొగము వంచికొని, "అన్నా! నీతోఁబుట్టువును, నీమేనల్లునిపుత్త్రునిఁ గాంచుము. ఓధర్మజ్ఞా! నీవు మమ్ము దయచూడఁదగియున్నాఁడవు. ఆసైంధవుఁడును సుయోధనుఁడును నీకుఁ గావించినయపకారమును మఱచి, నీయభిమన్యుతనయుఁ

డగు పరీక్షిత్తుఁగా వీనిని భావింపుము. వీఁడు సురథునకుఁ గలిగిన నాపౌత్త్రుఁడు. ఓపురుషవరేణ్యా! అటులగుట వీనిని దీసికొని నీసన్నిధికి వచ్చితిని. మఱియు నీసకలసైంధవయోధులను క్షమింపవేఁడుచున్నదానను. ఓమహాబాహూ! ఆమందుని తనయుఁడగు నీబాలునిపై ననుగ్రహము చూపఁదగుదువు. వీఁడిదె నిన్ను బ్రతిమాలుచుఁ దలవంచి మ్రొక్కి యాచించుచున్నాఁడు. కావున నిఁక శాంతివహింపుము. ఓపార్థా! బాలుఁడును, హతబంధుఁడును, నేమియుఁ దెలియనివాఁడును నగుట వీనియెడఁ బ్రసన్నుఁడవగుము. వెనుకటివిధముఁ దలంచి కోపము సేయకుము. అనార్యుఁడును, క్రూరుఁడునునగు వీనిపితామహునివిధము మఱచిపొమ్ము. అతఁ డపరాధిగాని, వీఁడు గాఁడుగదా! వీని ననుగ్రహింపుము." అని యతిదీనయై యాదుశ్శల పలుక విని యాధనంజయుఁడు, గాంధారిని ధృతరాష్ట్రుని స్మరించి, దుఃఖార్తుఁడై క్షత్త్రియధర్మమును నిందించుచు మృతులయినబందుగులం దలంచి పరితపించుచు నెమ్మదిగా మాటాడి, వారియెడ ననుగ్రహము చూపి, మఱియుఁ దనసోదరిని గౌఁగిలించుకొని నిజగృహమునకుఁ బొమ్మని పంపెను. అంత నాదుశ్శలయు మహారణమునుండి యాయోధులను మరలించి, పార్థునిఁ బూజించి యింటికి మరలెను. ఓజనమేజయా! ఇటులాధనంజయుఁ డాసైంధవవీరులను జయించి, స్వేచ్ఛాసంచారమునఁ బోవుచున్న తనగుఱ్ఱము నెప్పటిచొప్పున వెంబడించుచు వెడలెను. అతఁడపుడు మృగానుసారియగు పినాకధారి ననుకరించి యుండెను. అంత నయ్యశ్వము యథేచ్ఛగా నాయాదేశములఁ గ్రమముగాఁ జరించుచుఁ బార్థునికృత్యమును వర్ధిలఁజేయుచు, మణిపురాధీశునిదేశమును సమీపించుటయు నయ్యర్జునుఁడును నందుల కేఁగెను. అని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

### అర్జునపరాజయము

ఓజనమేజయా! అమ్మణిపురాధీశుఁడగు బభ్రువాహనుఁడు తన తండ్రి నిజదేశమున కరుదెంచుట విని, సవినయముగా బ్రాహ్మణాదుల మున్నిడికొని పార్థుని దర్శింప వెడలెను. అటు లమ్మణిపురాధీశుఁడు తన్నుఁ గాంచుట, క్షత్త్రధర్మమునుబట్టి యప్పార్థునకు సమ్మతము

గాకుండెను. అటులగుట నతఁడు తనతనయునిఁ గాంచి యించుక
కోపమొదవ నాబభ్రువాహనునితో "ఓయీ! క్షత్రియధర్మమునకు
వెలియగు నివ్విధి నీకుఁ దగియుండలేదు. యుధిష్ఠిరునశ్వము నాచే
రక్షింపఁబడుచు నిందులకు వచ్చెనుగాదే? నీ యీదేశమునకు వచ్చిన
యీ యాగీయాశ్వమునుగూర్చి యుద్ధముచేయఁ దలంపలేదా?
పుత్రకా! క్షత్రధర్మబహిష్కృతుఁడవై దుర్బుద్ధివైన నీ యీకృత్యము
నిందాస్పదము గాక తప్పదు. యుద్ధమునకు వచ్చిననన్నుఁ బ్రియవచన
ములచే నాదరింపఁదగునా? ఇట్టి నీవిహమున జీవించిన పరమప్రయో
జన మేమి గలదు? ఇందులకు యుద్ధముచేయవచ్చిన నన్ను నీవా
యాఁడుదానివలెఁ బ్రియవచనములతో మన్నింప వచ్చితివి. ఓదుర్మతీ!
నేను న్యస్తశస్త్రుఁడనై యిందులకు వచ్చియుందునా? నీవిటులు చేయుట
యుక్తమనవచ్చును!" అని పలికెను. పన్నగాత్మజయగు నులూచి,
యవ్వార్త విని, నిజభర్తృకృతతిరస్కారము నోర్వఁజాలక, పుడమి
భేదించికొనివచ్చి, భర్తయగుపార్థునిచేఁ దర్జింపఁబడుచు నధోముఖుఁడై
విమర్శించుచున్న పుత్రుఁడగు బభ్రువాహనునిఁ జూచి, ధర్మవిశారద
యగుట ధర్మయుక్తముగా నాతనితో "ఓపుత్రకా! నేను నీతల్లిని.
పన్నగాత్మజనగు నులూచిఁగా నన్నుఁ దెలియుము. నాయీవచనము
పట్టి వర్తింపుము. యుద్ధదుర్మదుఁడై వచ్చిన కురుశ్రేష్ఠుఁడగు నీతండ్రితో
యుద్ధముచేయుము. ఇటులేని యితఁడు నీయెడఁ బ్రీతుఁడగును.
అందు సందియ మొందకుము." అని తెలుపుటయు, నాబభ్రువాహనుఁడు
తనతల్లిచేఁ గోపితుఁడై, మహత్తరతేజమడర యుద్ధమున బుద్ధిపెట్టి
కాంచనకవచము దొడిగి, భానుమంతమగు శిరస్త్రాణము ధరించి, తూణీర
శతసంకులమైయున్న నిజరథము నధిరోహించెను. ఆరథము సకలోప
కరణములు గలిగి, మనోజవములగు గుఱ్ఱములచేఁ బూన్పఁబడి,
హేమభాండపరిష్కృతమై యుండెను. దానిపైఁ బరమార్చితమై
హిరణ్మయమై యున్నతమై సింహధ్వజ మెత్తఁబడియుండెను. అపు
డాబభ్రువాహనుఁడు తద్రథముతో నాపార్థునిఁ జేరి యాతనిచే
రక్షితమగుచున్న యాగీయాశ్వమును హయశిక్షావిశారదులగు
వారిచేఁ బట్టించెను. అటులు పట్టుకొనఁబడిన నిజాశ్వమును జూచి,
యాసవ్యసాచి, సంతోషముతోఁ దలయూఁచి, తాను భూమియం

దండియే రథస్థుఁడై యున్న తనయుని నివారించెను. అటులు తలపడి వీరుఁడగునాతనిపైఁ దీవ్రములై విషసర్పములు వాఁదగు సాయకములచేఁ బీడించెను. ఓరాజా! సోత్సాహులై సన్నద్ధులైన యాతండ్రికొడుకులకు నిరుపమానమగు యుద్ధము జరిగెను. అది దేవదానవుల యుద్ధమును దలపించెను. అపు డాబభ్రువాహనుఁ డానతపర్వమగు నొకసాయకముచే నర్జునుని జత్రుదేశమునఁ గొట్టి పరిహసించెను. ఆసాయకము పార్థుని భేదించి పుంఖముతోఁ గూడఁ బుట్టలోఁ జొచ్చిన పామువలెఁ బుడమిఁజొచ్చెను. ఆప్రహారమున నర్జునుఁ డెంతయుఁ బీడితుఁడై, తనయుత్తమధనువు నాధారముగఁ జేసికొని, దివ్యతేజము మాత్రము మిగుల నించుక మూర్ఛవడి, కొంతవడికిఁ దెలివొంది పుత్త్రునిఁ బ్రశంసించుచు, "కుమారా! మహాబాహూ! మేలు మేలు. వత్సా! చిత్రాంగదాత్మజా! నీకుఁదగు నీయద్భుతకృత్యమును జూచి సంతసించితిని. ఇదె నీపై బాణములు విడుచుచున్నాఁడను. యుద్ధబుద్ధివై నిలువుము." అని పలికి శరవర్షమును గురిసెను. గాండీవనిర్ముక్తములై వజ్రాశనితుల్యములగు నప్పార్థసాయకముల నాబభ్రువాహనుఁడు నిజభల్లముచే రెండుమూఁడు ఖండములుగా ఖండించెను. అంత నప్పార్థుఁడు దివ్యసాయకములచే హేమపరిష్కృతమై సువర్ణతాలతుల్యమైన తనయునిధ్వజమును రథమునుండి పుడమికిఁ బడఁద్రోసి మఱియు వడిగలిగి గొప్పమేనులుగల వానిరథాశ్వములను జంపి పరిహసించెను. అంత నాబభ్రువాహనుఁడు రథము డిగి కుపితుఁడై తాను బదాతియగుచుఁ దండ్రితో యుద్ధమొనర్పఁదొడంగెను. అప్పు డప్పాండవముఖ్యుఁడు పుత్త్రుని నవక్రవిక్రమమున కుప్పొంగుచు, నాతని నెంతయుఁ బీడించెను. అపు డాబభ్రువాహనుఁడు నా యుద్ధమునకుఁ దనతండ్రి యంతగా నభిముఖుఁడు గాకుండుట యెంచి, విషసర్పములునాఁదగు నారాచములచే మఱియు నాతని నొప్పించెను. అతఁడు బాలుఁడగుటచేఁ దెలియక తనతండ్రిహృదయమున సుపుంఖమగు నొకతీవ్రసాయకమునట్లు చొనుపుటయు నది మర్మమును భేదించెను. ఆకొమరుని వ్రేటుచే నక్కిరీటి యెంతయు నొచ్చి మోహపరవశుఁడై పుడమిఁ బడియెను. కౌరవధురంధరుఁడగు నాధనంజయుఁ డట్లు పుడమిఁ బడుటయు, నాచిత్రాంగదాత్మజుఁడు

దండ్రి మోహమును జూడఁజాలక తానును మూర్ఛాపరవశుఁ
డయ్యెను. అతఁ డంతకుమున్నే తనతండ్రి ప్రేటులు పడినవాఁడగుటను,
దండ్రి మూర్ఛవచ్చుటను దాను నాసంగ్రామరంగమునఁ బడుటయు,
నతనితల్లియగు చిత్రాంగద పడియున్న భర్తృపుత్రులను గాంచి, భయ
పీడితయై రణరంగమునకు వచ్చి వణఁకుచు, సంతప్తమానసయై
యేడ్చుచు నుండెను.' అని తెలిపి వైశంపాయనుఁడు మఱియు
ని ట్లనియె.

### అర్జునుఁడు పునరుజ్జీవితుఁ డగుట

'ఓజనమేజయా! ఆచిత్రాంగద యటులు బహువిధములఁ బల
వించి పలవించి దుఃఖసంతప్తయై మూర్ఛిలి పుడమిఁబడి, కొంతవడికిఁ
దెలిసి, పన్నగపుత్రియగు నులూపిని గాంచి, 'ఓయక్కా! రణరంగ
మునఁ బడియున్న భర్తను జూచితే? నీవలన నాపుత్రుని బాణముచే
భర్త పుడమిఁబడియెనుగాదే? అదియెల్ల నెందులకు? ఈయపగాధ
మంతయు, నీకొంతేయునిదే. ఎవరిదైననేమి? ఇదె నేను నిన్ను
యాచించుచున్నదానను. ధనంజయుని బ్రదికింపుము. ఓయార్యా!
నీవు ధర్మజ్ఞవును, త్రిలోకవిదితవునుగదా! పుత్రునిచే భర్త నిటులు
చంపించియుఁ బరితపింపవేమి? ఓపన్నగాత్మజా! నాసుతుఁడు హతుఁ
డగుటకు నేను బరితపింపలేదు. పతినిగూర్చియే పరితపించుచున్న
దానను.' అని యయ్యులూపితోఁ బలికి, భర్తను సమీపించి
ఓప్రాణనాథా! కురుముఖ్యునకుఁ బ్రియముఖ్యుఁడవు. లెమ్ము. ఓమహా
బాహూ! ఇదె నీయశ్వము నాచే విడిపింపఁబడినది. ఇఁక నీ వాయుధి
ష్ఠిరునియాగీయాశ్వము ననుసరింపవలసి యున్నదిగాదే? ఇటులేల
యింకను నిద్రించియున్నవాఁడవు? ఓకురునందనా! నాప్రాణములు
నీయధీనములై యున్నవిగాదే? నీవొకరికిఁ బ్రాణము లొసంగువాఁడ
వయ్యు నీప్రాణములు విడిచెదేటికి? ఓయులూపీ! ఇటులు క్షితిని
బతితుఁడై యున్న పతిని భద్రముగాఁ బరికింపుము. పుత్రునిఁ బ్రోత్స
హించి భర్తను జంపించియుఁ బరితపింపవేమి? నా యీబాలుఁడు
మృత్యువశగతుఁడై పుడమిఁబడినను బడుఁగాక. లోహితాక్షుఁడును
గుడాకేశుఁడునగు విజయుఁడు జీవించుఁగాక. మానవులు బహు
భార్యలై యుండుట తప్పువచ్చెనా! మనకందఱకు నితఁడు గావలసిన

వాఁడుగాదే? ఇట్టి దుర్బుద్ధి నీకుఁ దగదు. మన కీతనితో విధాత, శాశ్వతము, నవ్యయమునగు సఖ్యముఁ గల్పించెను. సఖ్యము స్థిరమైనదిగాఁ దెలియుము. నీవు నాపుత్రునిచే నాయీపతిని బరిమార్పించితివి కావున నీవిపు డితని సజీవునిఁగాఁ జేయవేని, నాజీవితమును బరిత్యజించెదను. దేవీ! నేను బతిపుత్రవిహీననై యుండవలసివచ్చెనా? నీవు చూచుచుండఁగనే ప్రాణముల విడిచెదను. సందియమేమియు లేదు.' అని పలికి తనసవతియగు నులూపి చూచుచుండఁగాఁ బ్రాయోపవేశ మొనర్చునదై యూరకుండెను.

ఓజనమేజయా! ఆచిత్రాంగద యటులు విలపించి విరక్తయై పతిపాదములుపట్టుకొని దీనయై పుత్రునిఁ దలంచుచుఁ గూరుచుండెను. పిమ్మట నాబభ్రువాహనుఁడు తెలివొంది, యారణాంగణమునఁ దల్లిని గాంచి, 'అయ్యయ్యో! నాకింతకంటె దుఃఖమేమిగలదు? సుఖముగాఁ బెరిగిన నాతల్లి వీరుఁడై పుడమిఁబడియున్న పతినిబట్టికొని యేడ్చుచున్నదిగదా! మఱియు నెందఱనేని వైరుల వధించి సకలశస్త్రభృద్వరుఁడైన తనపతి నాచే హతుఁడై దుర్మరణ మొందియుండుటను గాంచుచున్నది. వ్యూఢోరస్కుఁడును, మహాబాహుఁడునగు తనభర్త హతుఁడగుట గాంచుచుండియు నీమెహృదయము వ్రయ్యలు గాకున్నది! ఆహా! ఏమి దృఢమైనది? కాలము ప్రాప్తింపకున్నను మానవుఁడు మరణించుట దుర్లభము. అక్కటా! ఇట్టిపట్టునను, నేనును నాతల్లియు జీవితములఁ బరిత్యజింపకుండుట నింద్యము గాదే? పుత్రుఁడనగు నేను గాంచుచుండ నిక్కురువీరుని కాంచనకవచ మపవిద్ధమగుట, నెంతయు శోచనీయమైయున్నది. ఓబ్రాహ్మణులారా! పుత్రుఁడనగు నాచేఁ బడఁద్రోయఁబడి వీరశయనమున శయనించియున్నవీరుఁడగు నాతండ్రిని గనుఁగొనుఁడు. కురుముఖ్యుని హయము ననుసరించిన బ్రాహ్మణులారా! రణరంగమున నాచే హతుఁడైన యీతని కేమి శాంతిచేయుచున్నారో తెలుపుఁడు. నాకిందుఁ జేయఁదగినప్రాయశ్చిత్త మెద్దియో తెలుపుఁడు. క్రూరుఁడను పాపుఁడను బితృహంతనగు నాకుఁ బ్రాయశ్చిత్త మెట్టిది? తండ్రిని జంపినపాపుఁడు పండ్రెండువత్సరములు వరుసగా, నాతనిచర్మమునుగట్టికొని యాతని

శిరఃకపాలమున భుజించుట ప్రాయశ్చిత్తముగు నేమో? తండ్రిని వధిం
చినవాని కంతకంటె వేఱుగు ప్రాయశ్చిత్త మేమియుండును? ఓపన్నగ
రాజపుత్రీ! నాచే నిహతుఁడైన నీభర్తను బరికింపరాదే? సమరమున
నర్జునుఁ బడఁగొట్టి నీకుఁ బ్రియమొనర్చితినిగాదే? ఇఁక నేను దండ్రి
గలలోకమున కేఁగెదను. ఓశుభదాయినీ! నే నీదేహముచే జీవమును
ధరింపఁజాలను. ఓమాపినతల్లీ! నేనును నాతండ్రియగు గాండివధరుఁ
డును మృతులము కాఁగా, నీవు ప్రీతినొందుదువుగాక. నిజముగా
నాయాత్మను హింసించుకొనుచున్నాఁడను." అని పలికి యాబభ్రు
వాహనుఁడు, దుఃఖశోకసమాకులుఁడై యుపస్పృశ్య మొనర్చి యిట్లు
పలికెను.

"జంగమస్థావరములగు సకలభూతములారా! వినుఁడు. ఓపన్న
గాత్మజా! తల్లీ! ఇదె సత్యముగాఁ దెలుపుచున్నాను. నరసత్తముఁడైన
నాతండ్రి విజయుఁ డిపుడు జీవించి లేవఁడేని, యీరణరంగముననే,
నా కళేబరమును శోషిల్లఁజేసికొనుచున్నాఁడను. తండ్రిని జంపిన నాకుఁ
బ్రాయశ్చిత్త మొకప్పుడును లేదుగదా! గురువధపీడితుఁడనై తప్పక
నరకమున నివసింతును. వీరుఁడగు క్షత్త్రియునిఁ జంపినవానిపాపము
గోశతముచేఁ దొలగుచున్నది. కాని యిటులు తండ్రిని జంపిన నాకు
నిష్కృతి యెట్టిది? పాండుపుత్త్రుఁడగు ధనంజయుఁ డొక్కఁడే మహా
తేజుఁడు. అదియుఁగాక నాకితఁడు తండ్రి. ఇట్టివానిని వధించిన నాకు
నిష్కృతి యెట్లు?

ఓజనమేజయా! ధనంజయతనయుఁడగు నాబభ్రువాహనుఁ
డిట్లు పలికి యుపస్పృశ్య మొనర్చి ప్రాయోపవిష్టుఁడై యూరకుండెను.
ఓరాజా! అపుడా మణిపూరేశ్వరుఁ డట్లు ప్రాయోపవిష్టుఁడై, తల్లితోఁ
గూడఁ బితృశోకసమావిష్టుఁడై యుండునంత, నయులూపి సంజీవన
మను మణిని దలంచెను. పన్నగపరాయణమగు నమ్మణియు నామెను
సమీపించెను. అంత నానాగరాజనందన సైనికులు సంతసింప 'ఓ
పుత్త్రకా! నీవిఁక లెమ్ము. ఈవిజయుఁడు నీచే జయింపఁబడలేదు. ఇతఁ
డెల్లవారికి నజేయుఁడు. ఇంతయేల! ఇంద్రాదిదేవతలును నీతని
నోడింపఁజాలరు. మోహిని యనుమాయ నాచేఁ బ్రదర్శింపఁబడియెను.
యశస్వియగు నీతండ్రికిఁ బ్రియమొనర్చుటకై యిటులొనర్చితిని.

ఓకౌరవాత్మజా! రణరంగమున యుద్ధముచేయుచుండ నీబల మెట్టు లుండునో తెలియఁగోరి యీతఁ డిందులకు వచ్చెను ఓపుత్రకా! అటు లగుటనే నిన్ను యుద్ధమునకుఁ బ్రేరించితిని. ఓవత్సా! నీ కిందుఁ బాప మించుకే నగునని శంకింపకుము. పురాణమహర్షియగు నితఁడు, శాశ్వతుఁడు నక్షరుఁడు నైనవాఁడు. ఓకుమారా! సంగ్రామమున శక్రుఁడైన నీతని జయింపఁజాలఁడు. ఓరాజపుత్రా! ఇదె దివ్యమణి యొకటి నాచేఁ దేఁబడినది మఱిమఱియు మృతులగుపన్నగులను నిత్య మిదియే జీవింపఁజేయుచుండును. అటులగుట నీ విమ్మణి నీతనియురముపై నుంచుము. అటులొనర్తువేని యప్పుడే జీవించిన నీతండ్రిని జూడఁగల్గుదువు." అని తెలుపుటయు, నతఁ డమ్మణి నయ్యర్జునురమున నుంచెను. అమ్మహాతేజుఁ డగునతఁ డట్లు పితృభక్తిచే నమ్మణి నుంచుటయు, నప్పార్థుఁడు వెంటనే యుజ్జీవితుఁడయ్యెను. చిరకాలసుప్తునట్టు లతఁడు మృష్టలోహితలోచనుఁడై లేచుటయు, మనస్వియగు నమ్మహాత్ముని స్వస్థచిత్తునిఁగాఁ జూచి యాబభ్రువాహనుఁ డతనికి నమస్కరించెను. పురుషవ్యాఘ్రుఁడగు నతఁడు లేచి ముఖవికాసముగలిగియుండ నింద్రుఁడు పుష్పవర్షమును గురిసెను. మ్రోగింపఁబడకుండియు దేవదుందుభులు మేఘనిస్స్వనములై మొఱయసాగెను. ఆకాశమున మేలు మేలనియెడి శబ్దములు వినవచ్చెను. అంత నమ్మహాబాహుఁ డటులు లేచి, సేదదేఱి తనయుఁడగు బభ్రువాహనునిఁ గౌఁగిలించికొని, ముద్దుపెట్టుకొనియెను. మఱియు నప్పార్థున కాచేరువనే చిత్రాంగద గానవచ్చెను. ఆమె శోక పీడితయై యులూపితోఁగూడఁ జూపట్టుటయు, నాధనంజయుఁ డామెను గాంచి "ఆహా! ఏమి? ఇదియెల్ల శోకవిస్మయహర్షపూరితమై గానవచ్చుచున్నదే" అని తలంచి, "ఓపుత్రకా! నీ వెఱుఁగుదేని తెలుపుము. నీతల్లి యీరణరంగమున కేలవచ్చినది? మఱియు నీనాగరాజపుత్రియగు నులూపియు నిందుల కేలవచ్చెను? నాయానతిపై నీవు నాతో యుద్ధముచేయుట మాత్రము నాకుఁ దెలియును. కాని యీస్త్రీలీరణరంగమునకు రానిమిత్తమేమో తెలియఁగోరుచున్నవాఁడను." అని యడిగెను. అంత నాబభ్రువాహనుఁడు తండ్రికి నమస్కరించి, "మహాత్మా! ఆవిషయ మీయులూపి

నడిగి తెలిసికొనుఁడు" అని పలికెనని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

## అర్జునుఁ డశ్వమును వెంబడించుట

ఓజనమేజయా! అపు డర్జునుఁ డయ్యులూపిం జూచి, "ఓకౌరవ్య కులనందినీ! నీవిందుల కేల వచ్చితివి? ఈచిత్రాంగద యేల వచ్చినది? ఓభుజగరాజపుత్రీ! ఈరాజునకు నేనుమునుగూర్పఁ దలంచి వచ్చితివా? లేక నాకు శుభము సేయవచ్చితివా? ఓచపలాపాంగీ! నీకేమియు నప్రియము గాలేదు గదా! నేనుగాని, యీబభ్రువాహనుఁడుగాని తెలియక యేమేని చేయలేదుగదా! లేక చిత్రవాహనునిపుత్రియగు నీచిత్రాంగధ యేమే నపరాధమొనర్చెనా?" అని ప్రశ్నించెను.

అది విని యయ్యులూపి నగుచు, "నాథా! నీవుగాని, యీ బభ్రువాహనుఁడుగాని యపరాధ మొనర్పలేదు. వీనితల్లియుఁ దప్పు సేయలేదు. మఱియు నామె నాయెడ భృత్యయై ప్రవర్తిల్లెను. ఇది యెల్ల నేఁ జేసినచేష్టయే. దానిం దెలిపెదను వినుము. నాపైఁ గోపింపకుము. ఇదె నీకు నమస్కరించుచున్నదానను. ఓప్రభూ! నీసంతోషము నకై యిటు లొనర్చితిని. ఓధనంజయా! జరగినవిధ మెఱిఁగించెదను వినుము. ఓపార్థా! నీవామహాభారతయుద్ధమున నధర్మముగా నాశాంతనవు నంతమొందించితివి గాదే? దాని కిది నిష్కృతిగాఁ జేయఁబడి యెను. అతఁడు యుద్ధము విడిచియుండఁగా నీ వాశిఖండినిగూర్చుకొని వధించితివిగాదే? అటులగుడ నీవు దానికి శాంతిచేసికొనక జీవితమును విడిచితివేని, తత్పాపముచేఁ దప్పక నరకమునఁ బడుదువు. అందుల కిది శాంతి యనికొమ్ము. పుత్రునివలన నీపాపము తొలఁగి స్వర్గము లభించెను. ఓవసుధాధిపా! ఈవిషయము మున్నాగంగయు వసువులు నొకచో నుండుతఱి, వసువులు తెలుపఁగా వింటిని. వసువు లొకపుడు గంగాతీరమును జేరి యందు స్నానమొనర్చి ఘోరముగు భీష్ముని మరణవార్త దెలుపువారై "ఓభామినీ! సంగ్రామరంగమున భీష్ముఁడు యుద్ధము మాని యుండగా సవ్యసాచి యాతనిఁ బ్రహరించెను. అటులగుట మే మాధనంజయుని శపింపనున్నవారము" అని పలుకుటయు, నామే "అటులే గానిం"డని తెలిపెను. నేను నాలోకము నకుఁబోయి వ్యథితమానసనై యావిషయమును దండ్రి కెఱిఁగించితిని.

అతఁడది విని యెంతయుఁ జింతనొందెను. ఓయర్జునా! అపుడు నాతండ్రి వసువులకడ కేఁగి నీకుఁగా, వారిని యాచించి, మఱిమఱియుఁ బ్రసన్నులఁగావించుటయు, వారు "ఓయీ! అప్పార్థునిపుత్త్రుఁడగు మణిపూరుఁడు, రణరంగమున మెల్లగా నాతనిఁ బడఁద్రోయును. ఓనాగేంద్రా! అటులొనర్పఁబడెనేని పార్థుఁడు ముక్తశాపుఁడగును. నీవింకఁబొమ్ము" అని వసువులు పలికిరని నాతండ్రి నాకెఱింగించెను. అది విని నేను నిన్నాశాపమునుండి విముక్తునిఁగావింప నిట్టులొనర్చితిని. నిన్ను సమరమున నా దేవరాజేని జయింపఁజాలఁడు. తానే పుత్త్రుఁడగునని తెలుపఁబడునుగాదే? అట్టి నీపుత్త్రునిచే నీవోడితివి. నీవెట్లు తలంతువోగాని, నావలన దోషములేదని నాయభిప్రాయము" అని యులూపి తెలిపెను. అది విని యావిజయుఁడు ప్రసన్నాత్ముఁడై "ఓదేవీ! నీవొనర్చినదెల్ల నాకు మిగులఁ బ్రియము" అని పలికి మఱియు మణిపూరునితోఁ జిత్రాంగదయు, నులూపియు వినుచుండఁగా, "ఓపుత్త్రకా! ఈరాఁబోవు చైత్రపౌర్ణమిని యుధిష్ఠిరుఁ డశ్వమేధయాగమొనర్చును. కావున నీవు నీ తల్లులను దోడ్కొని, సహామాత్యుఁడవై రావలయును" అని యాహ్వానించెను. తనతండ్రివచనము నాలించి యాబాలవీరుఁడు, పార్థునిఁ జూచి, కనుల నీరు ద్రిప్పికొనుచు, "నాయనా! ధర్మజ్ఞా! నీ యానతి శిరసావహించి నేను దప్పక యా హయమేధమునకు బ్రాహ్మణులతో వచ్చెదను. కాని, నాయెడ ననుగ్రహము చూపి, నీపత్నులతోఁగూడి నాయీమణిపురమునకు రమ్ము. ఇందు విచారింపఁబనిలేదు. అటులువచ్చి యీ నీభవనమున నొక రాత్రియుఁ గడపి మరల నెప్పటి చొప్పున నీయశ్వము ననుగమింతువుగాక" అని ప్రార్థించుటయుఁ బుత్త్రునిఁగాంచి యక్కపికేతనుఁడు చిఱునగవు వెలయ, నాబభ్రువాహనునితో "ఓమహాబాహూ! నేను దీక్షఁబూని చరించుచున్నవాఁడననుట నీకుఁ దెలిసినదియగాదే? ఓపృథునేత్రా! అటులగుట నేనిపుడు నీపురమునకు రావలనుపడదు. ఈయాగీయాశ్వము, దానియిచ్ఛవచ్చినవిధముగాఁ జరించుచున్నది. దాని ననుసరింపవలయును, నీకు శుభమగుఁగాక. నేనిందుండఁదగదు, పోయెదను" అని పలికి యాతనిచే విధ్యుక్తముగాఁ బూజితుఁడై, భార్యలతోఁ జెప్పి ధనంజయుఁ డెప్పటిచొప్పున వెడలెను. అని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

## అర్జునుఁడు మాగధులనోడించుట

ఓజనమేజయా! ఆయాఁగియాశ్వ మట్లు సముద్రమువఱకుఁగల భూమిలోఁ జరించి, హస్తిపురి కభిముఖమై మరలుటయు, నప్పార్థుఁడును దానిని వెంబడించెను. అయ్యశ్వము స్వేచ్ఛగాఁజరించుచు రాజగృహమనియెడిపురమును సమీపించెను. తత్పురాధీశుఁడును, సహదేవుని తనయుఁడునగు మేఘసంధి తనపుర మాహయము సమీపించుట విని క్షత్రధర్మమును బూని, వీరుఁడై విజయుని యుద్ధమున కాహ్వానించి, పురమునుండి వెడలి, రథ ధనుశ్శరాదిసాముగ్రులఁగూర్చికొని, మహాతేజుఁడై పదాతియైన ధనంజయునిఁ జేరి, బాలుఁడగుట నించుక పరుషముగా "ఓయర్జునా! ఈయశ్వమును, స్త్రీలనడుమను ద్రిప్పునట్లు లిందుఁ ద్రిప్పుచున్నాఁడవు. నీ యీయశ్వమును గట్టుచున్నాఁడను. దీనిని విడిపించికొన యత్నింపుము. మున్ను నాపెద్దలచే యుద్ధమున నీవు వినయ మొందింపఁబడలేదు. నేను నీ కాతిథ్య మొసంగుచున్నాను. ముందుగా నీవు ప్రహరింపుము. పిదప నేను బ్రహరించుచున్న వాఁడను" అని పలుక విని యప్పార్థుఁడు పరిహాసించుచు "ఓయీ! నాకు విఘ్న మాచరించినవానిని నివారింతునని నేను వ్రతము పూనియున్న వాఁడను. నాజ్యేష్ఠభ్రాత తెలిపినవిషయము నీకును దెలిసియుండవచ్చును. నీవు నీశక్తికొలఁదిఁ బ్రహరింపుము. నాకుఁ గోపము లేదు" అని తెలిపెను. అది విని యామగధరాజు మున్నుగాఁ బార్థునిఁ బ్రహరించువాఁడై యింద్రుఁడు వర్షించినట్లుగా శరసహస్రముల వర్షింపఁదొడంగుటయు శూరుఁడగుగాండివధారి, గాండివనిర్ముక్తములగు సాయకములచే, సయత్నములగు మగధుసాయకములను వ్యర్థములుగా నొనర్చెను. అటులొనర్చి, యాధనంజయుఁడు దీప్తముఖములై జ్వలితములై పన్నగములఁ బోలిన బాణములను బ్రయోగించి, వానిధ్వజమును, బతాకదండములను. రథయంత్రమును, హయములను గప్పెను. ఇంతయేల! వానిశరీరమందును సారథియందును దక్కఁ దక్కిన రథాంగములనెల్లఁ గప్పి వానినిమాత్రము నొప్పింపకుండెను. అద్దానిని వాఁడు తనపరాక్రమముగాఁ దలంచుచు మఱియు శరప్రయోగ మొనర్చెను. అంత నకౌంతేయుఁడామాగధునిచే నెంతయుఁ బ్రహ

తుఁడై వసంతసమయమునఁ బుష్పించినమోదుగుచెట్టునాఁ జూపట్టెను. వాఁడయ్యర్జునుచే వధింపఁబడకుండుటను మఱియు నెదుర్కొని ప్రహరింపసాగెను. అంత నక్కుంతీనందనుఁడు కుపితుఁడై దృఢముగా ధను వాకర్షించి తీవ్రసాయకములచే వానిగుఱ్ఱములను వధించి, సారథి తలఁ దెగనేసెను. మఱియు నావిజయుఁ డొకక్షురప్రముచే వానివిల్లు విఱిచి హస్తావాపమును గొట్టి, ధ్వజపతాకలను బుడమిఁ బడఁద్రోసెను. అంత నామాగధుఁడు పీడితుఁడై ధనుస్సారథిహయవిహీనుఁడగుట నొకగదను బూని, కడువడి నక్కవ్వడిపై మార్కొనియెను. అటులు వచ్చుచున్నయామాగధుని సువర్ణాలంకృతమగుగదను గ్రద్దఱెక్కలు గల పెక్కుసాయకములచే ఖండించెను. అపుడు వానిగద శకలములై విశీర్ణమణిబంధనమై పుడమిఁ బడియెను. అటులు విరథుఁడై విధనుష్కుఁడై గదారహితుఁడైయున్న యామాగధు నప్పార్థుఁడు ప్రహరింప నొల్లఁడయ్యెను. పిదప విమనస్కుఁడై క్షత్రధర్మమునుమాత్ర మాశ్రయించియున్న యామాగధునితోఁ బ్రియపూర్వకముగా నప్పార్థుఁడు "ఓరాజా! నీక్షత్రధర్మము సంపూర్ణముగాఁ బ్రదర్శింపఁబడియెను గదా! ఇఁకఁ బోవచ్చును. ఓపార్థివా! నీవు బాలుఁడవయ్యు నద్భుతముగా సమరకృత్యమును జూపితివి. మాయుధిష్ఠిరునాజ్ఞయన్నను రాజుల నెవ్వరిని వధింపరాదనిగదా! నీవు నాయెడ రణరంగమునఁ దప్పుచేసి నను, నిన్నుఁ జంపను"అని పలుక విని యమ్మాగధుఁడు మనసు మరలించి కొని "ఓయర్జునా! నీవు తెలిపినది నిజము" అని ప్రాంజలియై యాతని గౌరవించి, "ఓపార్థా! నేనోడితిని. ఇఁక నీతో యుద్ధముచేయ నుత్సహింపను. మఱియు నేను నీకొనర్పవలసిన దేమేని గలదా? తెలుపుము. అది నిర్వర్తింతును" అని పలుకుటయు, నయ్యర్జునుఁ డాతనివెఱపుడిపి, "ఓయీ! ఈచైత్రపౌర్ణమిని, యుధిష్ఠిరుఁ డశ్వమేధయాగమొనర్చును. నీవందులకు రావలయును"అని పలికెను. ఆమాగధుఁ డందులకు సమ్మతించి యప్పార్థునిఁ బూజించెను. పిమ్మట నమ్మహాశ్వ మెప్పటియట్ల చరించుచు, సముద్రతీరముననున్న యంగదేశములను, బుండ్రములను గోసలములను, ద్రొక్కుచుండ నతఁడు మ్లేచ్ఛసైన్యములను బెక్కిటి వధించుచుఁ జరించెనని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

### అర్జునుఁ డశ్వమును వెంబడించుట

ఓజనమేజయా! అప్పార్థుఁ డట్లు లమ్మాగధునిచేఁ బూజితుఁడై దక్షిణదిశ నాశ్రయించి యాహయమును జరింపఁజేసెను. అంత నయ్యశ్వము, కామచారియగుచు మరలి, శుక్తియనియెడి చేదిదేశమును సమీపించెను. అందు శిశుపాలపుత్రుఁడగు శరభుఁ డర్చింప వాని పూజలుగొని యాదేశమునుండి తురగానుసారియై వెడలి, కాశి, కోసల, కిరాత, తంగణములను బ్రవేశించి, యచ్చో వారిచ్చునర్చనలఁ బరిగ్రహించి మఱియు నచ్చోటు విడిచి దశార్ణములకుఁ బోయెను. అందుఁ బార్థునకుఁ జిత్రాంగదునితో ఘోరమగుయుద్ధము జరగెను. అందును, నాధనంజయుఁడు వానిని వశునిఁగా నొనర్చుకొని నిషాదపతియగు నేకలవ్యుని దేశమును బ్రవేశించెను. అంత నాయేకలవ్యుఁడు యుద్ధసన్నద్ధుఁడై నిషాదులతోఁ గూడి గగురుపాటొదవించునట్లుగా యుద్ధమొనర్చెను. అప్పు డప్పార్థుఁడు, సమరపరాజయమొందక, యాగవిఘాతకుఁడై వచ్చినయాయేకలవ్యుని జయించి, వానిచేఁ బూజింపఁబడి, దక్షిణసముద్రమును జేరి చరింపసాగెను. అందును ద్రవిడులు, నాంధ్రులును, నౌధ్రులు, మాహిషకులు, కొల్లగిరేయులును యుద్ధమునకురా, వారితో యుద్ధ మప్పార్థునకు సంభవించెను. అంత నతఁడు మిక్కిలి తీవ్రముగాని రణకృత్యముచే వారిని జయించి, తురంగమానుసారియై సురాష్ట్రదేశములకు వెడలెను. అటులు వెడలి గోకర్ణమును జేరి, ప్రభాసమునొంది, పిమ్మట రమ్యమగు ద్వారవతికిఁ బోయి చరింపసాగెను. అందు యాదవకుమారులు కొందఱు పార్థుని మార్కొనిరి. వారిలో నుగ్రసేనుఁ డయ్యాదవుల నివారించి, మేనమామయగు వాసుదేవునితోఁ గూడఁ బురము వెడలి యక్కిరీటిని గలిసికొని, విధ్యుక్తముగను, బ్రీతిపురస్సరముగను బూజించిరి. అంత నయ్యర్జునుఁడు వారిసెలవుగొని, యాహయము వెడలినమార్గము వట్టి, పశ్చిమసముద్రదేశమును జేరికొనియెను. పిమ్మట నాహయము గాంధారదేశమును జేరుటయు నక్కౌంతేయుఁడును దాని ననుసరించి, యందుఁ దన్నెదుర్కొనిన శకునిపుత్రుఁడగు గాంధారరాజుతో గొప్పయుద్ధ మొనర్చెను. అని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

### గాంధారులయుద్ధము

ఓజనమేజయా! గాంధారవీరుఁడును మహారథుఁడునగు శకుని తనయుఁ డప్పార్థుని ససైన్యముగా మార్కొనియెను ఆతనియోధులు గజాశ్వరథపదాతిపరివృతులై పతాకాధ్వజాదులు వెలయ, మున్ను తమదేశనాథుఁడగు శకునివధమును స్మరించి కుపితులగుచు, ధనువులు ద్రిప్పుచు నటు లెదుర్కొనుటయు, వారి నారసి యాధనంజయుఁడు, ధర్మజుఁడు తెలిపినవచనము నెఱింగించెను. కాని వారందులకు సమ్మతింపరైరి. అపు డతఁడు తెలిపిన మంచిమాటలకుఁ గోపమొదవి వారు తదశ్వమును బట్టికొనుటయు నతఁడు కోపోద్దీపితుఁడై దీప్తాగ్రములగు సాయకములచే వారితలలఁ దెగనేసెను. గాండీవనిర్ముక్తములగు తీవ్రక్షురములచే ననాయాసముగా నప్పార్థుఁడు వారిని ఖండించుచుండ వారు జడిసి, ససంభ్రములై యాగుఱ్ఱమును విడిచి మరలుటయు, నపు డాశకునిపుత్త్రుఁడు పార్థుని నిరోధించెను. క్షత్త్రధర్మపరుఁడై యటులు యుద్ధముచేయనున్న యాగాంధారరాజనందను నారసి యక్కుంతీనందనుఁడు "ఓయీ! మాయన్నయానతిచే, నేను రాజులను వధింపరాదు కావున నీవు నాతోఁ బోరాడవలదు. నీకుఁ బరాజయమును వలదు" అని పలికెను. అప్పార్థునిపలుకు లాదరింపక, యజ్ఞానమోహితుఁడై శక్రసమవిక్రముఁడగు నయ్యర్జునునిఁ దలపడుటయు, నతఁ డాశకునితనయు తలపాగ నొకయర్ధచంద్రసాయకముచేఁ దెగనేసి, సైంధవవధమును దలపించుటయు, నద్దానికి గాంధారులందఱును విస్మయమందిరి. రాజులను జంపరాదని యటు లప్పార్థుఁ డానతిచ్చెనని వారూహించిరి. అపు డాశకునినందనుఁడు పలాయనపరాయణుఁడై క్షుద్రమృగములునా జడియుచున్న యయోధులఁ గూడి వెడలిపోయెను. వారటులు మరలి పోవుచుండఁగా నందుండియే, యాయోధులలోఁ గొందఱభుజములను గొందఱతలలను ఖండించెను. పార్థచోదితములై గాండీవనిర్ముక్తములగుసాయకములచే వారు సంభ్రాంతనరనాగాశ్వులై మఱియుఁ బరువులిడిపోయిరి. వారిని మఱియు నయ్యర్జునుఁడు వధించుచుండుటయు, మంత్రివృద్ధపురస్సరయై యాగాంధారరాజజనని, యప్పార్థు సమీపించి ప్రార్థించి, యుద్ధమునుండి తనతనయుని మరలించెను. అపు డయ్యర్జునుఁ డామెయెడఁ బ్రసన్నుఁడై యాశకునితన

యనితో సప్రియముగా, "ఓయీ! నీవిట్టిబుద్ధిపెట్టుకొనుట నాకు సమ్మతముగాదు. మాతల్లి గాంధారిని, మాతండ్రి ధృతరాష్ట్రునిఁ దలంచి, నిన్నును నీవారిని బ్రాణములతోఁ బరిత్యజించితిని. ఇఁకను నీవిట్టి బుద్ధి పెట్టికొనియుందువేని వైరము శాంతింపదు. కావున నీబుద్ధిని ద్రిప్పికొనుము. ఈచైత్రపౌర్ణమిని జరగు మాయన్న యశ్వమేధమునకు రమ్ము" అని వాని నాహ్వానించెనని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

### యుధిష్ఠిరుఁ డశ్వమేధ మారంభించుట

జనమేజయా! అప్పార్థుఁ డట్లు పలికి, స్వేచ్ఛాసంచారియై చరించునాహయమును వెంబడించి, దానితో హస్తిపురికి మరలుటయుఁ, దద్వార్త యుధిష్ఠిరుఁడు చారులమూలమున విని యర్జునుఁడు క్షేమముగా మరలుచుండుటకు సంతుష్టాంతరంగుఁడై, గాంధార దేశమందును, దక్షిణదేశములందును, నతఁడు వెలయించిన విక్రమవిశేషముల కలరుచు, నంతలో వచ్చిన మాఘమాసద్వాదశిని బుష్యమిని, దనతమ్ములనెల్ల రావించి, వారితో, నేమిమో తెలుపువాఁడై "ఓభీమసేనా! నీతమ్ముఁడగు పార్థుఁ డశ్వముతో వచ్చుచున్నవాఁడని వేగులవారివలన వినవచ్చెడిని. యాగకాలమునకును మిక్కిలి తడవులేదు గదా! అశ్వ మెల్లయెడఁ దిరిగివచ్చుచున్నది. ఇదె మాఘశుద్ధపౌర్ణమి వచ్చెను. ఇఁక మనయాగమున కొకమాసమవధి గానవచ్చెడిని. కావున నీవు వాజిమేధసిద్ధికై తెలిసినబ్రాహ్మణోత్తములఁ బంపి యాగీయప్రదేశమును గనిపెట్టివచ్చునట్లు లోనర్పవలయుఁగాదే!" అని తెలుపుటయు నతఁడు తనయన్నయానతి సకలమును సమకూర్చి, గుణగరిష్ఠుఁడగు గుడాకేశునిరాక కెంతయు నుప్పొంగుచు, యాగకర్మకుశలులగు బ్రాహ్మణులను మున్నిడికొని, వెడలి యొకపవిత్రదేశమునఁ, బ్రతోళీఘట్టితమును సాలసహితము నగుయజ్ఞనాటకమును దయారుచేయించెను. దానికి వందలకొలఁది ప్రాకారములు, మణిమయకుట్టిమములును, వెలయింపఁబడెను. అయ్యది హేమరత్నవిభూషితమై, విధ్యుక్తముగా నలరుచుండెను. మఱియా నందు సువర్ణస్తంభములును, తోరణసహస్రములును, నానాదేశముల

నుండి వచ్చినరాజలోకమునకు వలయునంతఃపురములను, నందందు యథావిధిగాఁ గల్పింపఁబడియెను. ఇంకను నానాదేశములనుండియు వచ్చినబ్రాహ్మణోత్తములకును దగుగృహములను, యథావిధిగా సమకూర్పఁబడియెను. అటు లొనర్పఁబడినపిదప, భీముఁడు రాజులనెల్ల రావించువాఁడై, ధర్మజునానతిని దూతలను బంపెను. అయ్యుధిష్ఠిరునిప్రీతికై క్షత్త్రియులందఱును నందుల కరుదెంచిరి. వారు పెక్కురత్నములను, గుఱ్ఱములను, నాయుధములను, స్త్రీలను గానుకలుగాఁ దెచ్చి సమర్పించుచు, శిబిరములయందుఁ బ్రవేశించుచుండుటయు, నపుడు సాగరఘోషమునా, మిన్నుముట్టుచప్పుడు లుప్పతిల్లఁజొచ్చెను. అటు లరుదెంచిన యాధరాధీశుల కాయుధిష్ఠిరుఁడు, వలయునన్నపానములను, సమానుషములగు శయ్యాదులను సమకూర్ప నాజ్ఞాపించెను. మఱియు వారివాహనములకుఁ దగుశాలలును, శాలీక్షుగోరసాదులును గల్పింపఁబడునట్టు లాజ్ఞ వెట్టెను. అటులే యాతని యమ్మహాయాగమునకు బ్రహ్మవాదులగు ననేకులును, నాదేశములఁగల బ్రాహ్మణులును జనుదెంచిరి. వారినెల్ల నక్కౌరవాధినాథుఁడు గౌరవపురస్సరముగా నెదుర్కొని దెచ్చి, వారు బసలలో నివసించునంతకును వెంబడించి దంభరహితుఁడై యాదరించెను. పిమ్మటఁ బనివాండ్రును శిల్పులును యజ్ఞసాధనములనెల్లఁ గల్పించి, తద్విషయ మాయుధిష్ఠిరునకు విన్నవించిరి. అది విని యాధర్మజుఁడు తనభ్రాతలతోఁగూడ సంతుష్టాంతరంగుఁడై యాగము నారంభించెను. అటులు యజ్ఞమారంభమగుటయు, వక్తలును, హేతువాదులు నగుకొందఱు పరస్పరజయేచ్ఛలతోఁ, బలువిధముల వాదించుకొనసాగిరి. అందుల కరుదెంచిన రాజులందఱును నాయశ్వమేధమును గాంచి, యందు భీముని యేర్పాటుల నమ్మహేంద్రునివిధానము లట్టివిగా భావించి మెచ్చికొనిరి. మఱియు సువర్ణమయములగు తోరణములను, శయ్యాసనవిహారములును, జనసంచయములును, ఘటములు, పాత్రములు, కటాహములు, కలశములు, వర్ధమానకములు మున్నగునవి వారికి మెప్పగొలిపెను. ఆచూపరులగుభూపతుల కందొక్కటియు సువర్ణమయము గానిది గానరాదయ్యెను. మఱియు శాస్త్రోక్తములై, దారుమయములై, సువర్ణభూషితములైన యూపములును వారికిఁ గానవచ్చెను. ఆక్షత్త్రియు,

లచోఁ బుడమిఁగలట్టియుఁ, జలమునఁగలట్టియుఁ బశువులన్నియుఁ గానరా, నత్యద్భుతమందిరి. ఆయజ్ఞవాటమున, నొకచో గోవులును, వేఱొకచో నెనుములును, మఱియొకచో వృద్ధస్త్రీలును, నింకొకచో, జలజంతువులును, నారణ్యకములును, బక్షులును, మనోజ్ఞములై గానరా, భూనాథు లాశ్చర్యముతోఁ గాంచిరి. ఆప్రదేశమునఁ బుడమినిగలజరాయు జాండజస్వేదజోద్భిజ్జములన్నియు, బర్వతానూప జాతములగు భూతములును వారు చూచి యానందించిరి. ఆయాగ స్థానము పశుగోధన ధాన్యపరిపూర్ణమై, యందుల కరుదెంచిన రాజ బృందమున కమందానందాద్భుతము లొదవించెను. సమృద్ధిగలబహు విధమగు మృష్టాన్నమును భుజించుబ్రాహ్మణులయు, వైశ్యులయు సమూహ మెంతయు మనోజ్ఞమై యుండెను. లక్ష భూసురులు భుజించిన తోడనే మేఘనిర్ఘోషము గలదుందుభిధ్వానముమఱిమఱియుఁ గావింపఁ బడుచు వచ్చెను. ధీమంతుఁడగు నయ్యుధిష్ఠిరునియాగ మిటు లారం భింపఁబడుటయు, నన్నరాశులు పర్వతములు నాఁదగి చూపట్టెను పెరుఁగు లేఱులై ప్రవహించెను. జను, లందు నేతులను హ్రదము లుగాఁ జూచిరి ఓజనమేజయా! జంబూద్వీపమునఁగల జనమంతయు, నమ్మహామఖమునకు వచ్చి యొక్కచోఁ గానవచ్చెను. మఱియు నందు లకు వేలకొలంది మానవులు బహువిధములగుధనములఁ బట్టికొని వచ్చిరి. అయ్యాగకాలమున, యుధిష్ఠిరానుచరులు పుష్పమాలికాలం కృతులును, మృష్టమణికుండలభూషితులునై బ్రాహ్మణాదులగు ద్విజా తులకు భోజ్యములగు వివిధాన్నపానములను వడ్డింప నారంభించిరి. అని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

### కృష్ణుఁ డర్జునసందేశ మెఱిఁగించుట

ఓజనమేజయా! అటులు తనయాగమునకు వచ్చిన వేదవేత్త లను, పృథ్వీపతులగురాజులను గాంచి, యాధర్మజుఁడు, భీమునితో "ఓతమ్ముఁడా! ఇందుల కరుదెంచినరాజనందనుల నందఱఁ గాంచితి గాదే? పూజార్హులగువారికిఁ దగుగౌరవము లొనర్పుము" అని తెలుపు టయు, నతఁడు నకులసహదేవులసహాయమున నన్నియానతినెల్ల నిర్వ ర్తించెను. అంతట, నాయాగమునకు యాదవులును, సాత్యకియుఁ,

ప్రద్యుమ్నుఁడును, సాంబుఁడును, గదుఁడును, నిశఠకృతవర్మలునురా, గోవిందుఁడు బలదేవుని మున్నిడికొని యరుదెంచెను. వారి కమ్మహారథుఁడగు భీముఁడు తగుగౌరవములు గావించెను. వారును, దమతమకుఁదగు రత్నమయవేశ్మములఁ బ్రవేశించిరి. పిదప శ్రీకృష్ణుఁడు, ధర్మజుని సమీపించి, కొంతప్రసంగమొనర్చి, పిమ్మట నర్జునుఁడు, పెక్కుసంగ్రామములఁ బీడింపఁబడినవిధ మాయుధిష్ఠిరున కెఱిఁగించెను. అంత నక్కౌంతేయుఁ డమ్మాధవు నారసి, యర్జునుఁగూర్చి మఱిమఱియుఁ బ్రశ్నించుచురా, నాభగవానుఁ డందుల కుత్తరమిచ్చువాఁడై "ఓయుధిష్ఠిరా! ద్వారకావాసియగు నాయాప్తుఁ డొకఁ డప్పార్థునియుద్ధవిధమును, నీకయ్యర్జునుఁ డంపినసందేశవిధమును దెలిపెను." అని పలికెను. అది విని ధర్మజుఁడు "ఓమహానీయా! మాయర్జునుఁ డిందులకుఁ గుశలముగా వచ్చుచున్నవాఁడా? అతఁడు నాకేమి సందేశమంపెనో తెలియఁగోరుచున్నవాఁడను." అని యడిగెను. అది విని యదుపతియగు నాశ్రీకృష్ణుఁడు, ధర్మజునితో "ఓమహారాజా! నీతమ్మునివచన మిది వినుము.

"రాజులందఱు నందులకు వచ్చెదరు. వారినెల్లఁ దగువిధముగా నాదరింపవలయును. అది మనకుఁ గర్తవ్యముగదా! ఇదియ నామనవిగా నాయన్నకు విన్నవింపుము. మఱియు నవకాశమునుబట్టి వారినెల్ల నాదరింపవలయునుగాదే! దేవా! అందులకు నీవును సమ్మతింపవలయును. మఱియు రాజులకు ద్వేషము సంభవించెనా? ప్రజలకు నాశము తప్పదు. కావున వారి నాదరింపవలెను." అని తెలిపి మఱియు నొకటి తెలిపెనఁట, వినుము. 'మణిపూరపతియు, నాకుఁ దనయుఁడును బ్రియుఁడునగు బభ్రువాహనుఁ డందుల కరుదెంచును. అతఁడు మీకు భక్తుఁడు ననురక్తుఁడు నగుట నాదరణీయుఁడు" అని తెలిపెను. ఇదియే యాతనిసందేశము" అని చెప్పెను. అది విని యాధర్మజుఁ డమ్మాట కెంతయు నలరి యవ్వాసుదేవునితో నిట్లనియె. అని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

## బభ్రువాహనుఁడు యజ్ఞమున కరుదెంచుట

ఓజనమేజయా! అవ్వాసుదేవువచనము లాలించి, యాధర్మజుఁడు "కృష్ణా! మంచిమాట వినిపించితివి. నీవేమి తెలుపుచుండువో

యదియెల్ల నమృతరసోపమమై పవిత్రమై మనోహరము గుచుండును. క్షత్రియవీరులతో నప్పార్థునకుఁ బెక్కుయుద్ధములు జరగెను. వాని నెల్ల నేను వినియున్నవాఁడను. కాని, యతఁడు నిత్యమును సుఖవివర్జితుఁడై శ్రమపడుచునే యున్నవాఁడు. ధీమంతుఁడగు నావిజయుఁ డిట్లు పీడపడుచుండుటకు నామన మెంతయుఁ జింతిల్లుచున్నది. ఓజనార్దనా! అప్పార్థుని బ్రదిమి నిత్యమును గష్టములపాలగుచునే యున్నదని నేను సంతతము చింతించుచునే యున్నవాఁడను. సకలశుభలక్షణ సమన్వితమగు నాతని మేన నేమి యశుభలక్షణ మున్నదో గాని, యతఁ డెల్లపుడును దుఃఖములనే యనుభవించుచున్నవాఁడు. ఆతని యవయవములందు నింద్యమేమియు నాకుఁ గానరాలేదు. కాని సుఖభోగిమాత్ర మతఁడు గాలేదు. కారణమేమిరో తెలుప వినఁగోరుచున్నవాఁడను."

అది విని యమ్మాధవుఁడు కొంతవడి ధ్యానించి, సదుత్తర మొసంగువాఁడై "యుధిష్ఠిరా! మనపార్థుని మేన మఱియేమి యవయవలోపమును గానరాదుగాని, యప్పురుషసింహుని శరీరపరిమాణమును బట్టి చిఱుదొడ లెక్కుడై యున్నయవి కావున నతఁ డెపుడును మార్గములందుఁ బోవుచుండుటయు, నలజడికిఁ బాలగుచుండుటయు సంభవించుచుండవచ్చును. కాని యంతకుమించిన యంగవైలక్షణ్య మాతనియందేమియుఁ గానరాదు." అని తెలుపుటయు నతఁడు "కృష్ణా! నీవన్నది నిజముగావచ్చు"నని పలికెను. అప్పు డప్పాంచాలి, శ్రీకృష్ణు నొకవిధముగాఁ గాంచుటయు, నతఁ డామె కప్పార్థునియెడఁ గల ప్రణయమును దెలిసికొనియె. అట్టియెడ భీమాదులును, నందలి యాజకులును, విచిత్రమగుశుభకథను విని సంతసంపడిరి. అటులు వా రాతనికథలతోఁ గాలముపుచ్చుచుండఁగనే మహాత్ముఁడగు నావిజయుని యొద్దనుండి యొక వేగువచ్చి యాధర్మజునకు నమస్కరించి యవ్విజయుని రాక మనవిచేసెను. అది విని యతఁడు హర్షబాష్పాకులితనేత్రుఁడై యట్లు ప్రియము దెలిపిన యాచారునకుఁ బసదన మొసంగి పరమానంద భరితుఁడై యుండెను. అమ్మఱునాఁడు కౌరవోత్తముఁడగు గాండీవి వచ్చునట్టి కోలాహల మొదవెను. పిమ్మట నమ్మహాశ్వ మురుదెంచునప్పటి ధూళులు గానవచ్చెను. అప్పుడప్పురిఁగలవారు హర్ష మొదవ నర్జునున

కానందముగా, "ఓపార్థా! నీవు కుశలుఁడవై వచ్చితివా? ఆహా! యుధిష్ఠిరుఁడు ధన్యుఁడు." అని కొందఱు పలికిరి. పుడమినెల్ల యాగీయాశ్వమును ద్రిప్పి రాజులనెల్ల జయించివచ్చుట, యివ్విధ్వాచ్ఛునకుఁ దక్కఁ దక్కినవారి కెవ్వరి కగును? సగరుఁడు మున్నగుమహాత్ము లెందఱో గతించిరి. కాని, వారెవ్వరు నిట్టియద్భుతకర్మ మొనర్చుట వినియుండలేదు. రాబోవురాజోత్తము లేని యిట్టియద్భుతకృత్య మొనర్పలేరు." అని కొందఱనిరి. "ఓకురుకులోత్తమా! నీవెవ్వరికిని సాధ్యముగానికార్యమును సాధించితివి." అని కొందఱు సన్నుతించిరి. ఓజనమేజయా! ఇటులు వారెల్ల శ్రుతిసుఖావహముగాఁ బలుకుచుండ వినుచు, ధర్మాత్ముఁడగు నయ్యర్జునుఁ డాయాగప్రదేశమును బ్రవేశించెను. పిమ్మట శ్రీకృష్ణుఁడు కలిసిరా, యుధిష్ఠిరుఁడు ధృతరాష్ట్రుని మున్నిడికొని యప్పార్థు నెదుర్కొనిరి. అప్పార్థుఁడు ధృతరాష్ట్రునకు మ్రొక్కి, ధర్మజునకును వందనమాచరించి, భీమాదుల నాదరించి, కృష్ణునిఁ గౌఁగిలించుకొని, వారిమన్ననలు వడసి, సాగరముఁ దరింప నెంచినవాఁడు తీరమును జేరునట్టియానందముతో విశ్రమించెను. అంతలో నందుల కాపార్థునినందనుఁడగు బభ్రువాహనుఁడు తనతల్లులతో వచ్చి యందుఁగల కురువృద్ధులకు మఱియుఁగలవారికిని నమస్కరించి, వారిచే నభినందితుఁడై పితామహియగు కుంతిభవనమును బ్రవేశించెను. అని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

## యుధిష్ఠిరుఁ డశ్వమేధ మొనర్చుట

ఓజనమేజయా! అటు లాబభ్రువాహనుఁ డప్పాండవనివేశమును బ్రవేశించి, ప్రియవచనములచేఁ బితామహియగు కుంతికి సంతస మొదవించుచుండెను. అంతఁ గౌరవ్యాత్మజయగు నులూపియుఁ జిత్రాంగదయుఁ గుంతిని సవినయముగా సమీపించిరి. మఱియు సుభద్ర మున్నగు కురుకాంతలును వారిని గలిసిరి. పిదప నాకుంతీనందనుఁడు వారిరువురకును రత్నములను గానుకగా నొసంగెను. ద్రౌపదియు, సుభద్రయు, మఱియుఁగల యాదవకాంతలును జిత్రాంగదను నులూపిని, బాగ్ధప్రీతికరముగా నెంతయు గౌరవింప, మహార్హశయనాసనలై వారు విశ్రమించి యుండిరి. మహాతేజుఁడగు నాబభ్రువాహనుఁడు, యథావిధిగా ధృతరాష్ట్రునిఁ జేరి, పిదప భీమాదులకు

పాండవులను యుధిష్ఠిరుని సమీపించి సవినయముగా వారికందఱకు నమస్కరించెను. వారెల్ల నాతని సప్రేమముగా గౌరవించి యథార్హముగా ధనాదులచే నాదరించిరి. అటులే యతఁడు, ప్రద్యుమ్నునట్లు లాగోవిందుని సవినయముగా సమీపించుటయు, నాతని కా వాసుదేవుఁడు గొప్పవిలువగలట్టియు, హేమాలంకృతమైనట్టియు, దివ్యహయసమన్వితమైనట్టియు నుత్తమమగు నొకరథము నొసంగును. మఱియు ధర్మజభీమార్జుననకులసహదేవులును, వేఱువేఱుగా నర్ఘ్యమానములచే సత్కరించిరి. పిమ్మట మూఁడవనాఁడు వ్యాసమహర్షి యాధర్మజునిఁ జేరి "ఓయుధిష్ఠిరా! ఇది మొదలు యాగమునకుఁ దగు సమయమైయున్నది. యాజకులును నిదియె మంచిముహూర్తమని తెలుపుచున్నవారు. ఓరాజా! క్రతుదక్షిణయు నధికముగాఁ గల్పింపఁబడుఁగాక. నీవును నధికధనవంతుఁడును బహుసువర్ణశాలివినై వెలయుచున్నాఁడవుగదా ! కావున నీ వీమఖమునఁ ద్రిగుణముగా దక్షిణఁగూర్చుము. దీనిఫలముసైతము మూఁడుయాగములఫలము సమకూర్చెడిని. నీవు మూఁడశ్వమేధముల నొనర్చినవాఁడ వగుదువు. అటులు బహుదక్షిణలుగా నీయాగమొనర్తువేని, జ్ఞాతివధకృతమగు పాపము నెల్లఁ బాపికొందువు. ఇది పరమపవిత్రమైనదియు, నుత్తమమైనదియు నై వెలయుచుంట, నిందవభృథస్నానముచే నఖిలదోషనివారణమయ్యెడిని." అని తెలిపెను.

అమేయబుద్ధియగు నావ్యాసభగవానుఁ డిట్లు తెలుప విని యాధర్మజుఁడు వాజిమేధదీక్షలోఁ బ్రవేశించెను. అటులు దీక్షఁబూని యామహాబాహుఁ డయ్యాగమును బహ్వన్నదక్షిణముగను, సకల కామప్రదముగ నారంభించుటయు, నందు వేదవేత్తలు కొందఱు యాజకు లాయాగకర్మము లొనర్పసాగిరి. వారు వేదోక్తవిధులనెల్ల శిక్షాపురస్సరముగా నెఱిఁగినవారగుటఁ బరిక్రమించుచు, వానిలో నెందును దొసఁగురానీక ప్రవర్తించిరి. అటులు వారొనర్పుచుఁ గల్పోక్తముగను, యుక్తముగను, ధర్మాఖ్యమగు ప్రవర్గ్యమును, నభిషవమును గావించిరి. అటు లాద్విజసత్తములు సోమలత నభిషవించి, శాస్త్రానుసారముగాఁ గ్రమముదప్పక సవనముల నాచరించిరి. ఆయాగమున నొకకృపణుఁడుగాని, దరిద్రుఁడుగాని, క్షుధితుఁడుగాని, దుఃఖి

తుఁడుగాని, ప్రాకృతుఁడుగాని లేఁడని తెలుపవచ్చును. ఎల్లవారికిని భోజనము లొసంగఁబడుచు వచ్చెను. రాజశాసనమువట్టి భీముఁ డెల్ల పనుల నిర్వహించుచుండెను. నిపుణులగుయాజకులు యాగశాలా ప్రదేశమున సకలకార్యములఁ జేయుచు వచ్చిరి. ధీమంతుఁడగు నాయుధిష్ఠిరుసదస్యుఁడు షడంగవేత్తయై యుండెను. అతని సదస్యుఁ డనువాఁడు వ్రతహీనుఁడుగాని, యనుపాధ్యాయుఁడుగాని, వాద నిపుణుఁడు గానివాఁడుగాని, లేఁడు. అక్కురుపతియాగమున నున్న త ములైన యూపములు, బిల్వమయము లాఱును, బిల్వసమితములైన ఖాదిరములును, నన్నియే పలాశమయములును, దేవదారుమయములు రెండును, శ్లేష్మాతకమగున దొక్కటియుఁగా యాజకులు కల్పించిరి. ఓ రాజా! మఱియు నందు శోభకై సువర్ణమయములగు యూపములు మఱికొన్ని యమర్చబడియుండెను అవియెల్ల వస్త్రాలంకృతములై వెలయుచుండెను. చయనమనియెడి స్థండిలరచనకుఁగా నన్నియు సువర్ణమయేష్టికలు కల్పింపబడియెను. అందలి స్థండిలరచన, దక్షప్రజా పతి యాగమునందలి రచననుబోలి వెలయఁజొచ్చెను. చతుశ్చిత్యము, నష్టాదశకరాత్మకము, సువర్ణపక్షము త్రికోణమునై యాస్థండిలము గరుడాకారముగాఁ గల్పింపబడియెను. పిమ్మటఁ బండితులచే విధ్యుక్త ముగా నియుక్తములై పశువు లచ్చోఁ నిలుపఁబడియెను. ఆయగ్ని చయనకర్మమున నేయేదేవత కేయేపశుపక్ష్యాదులు విధ్యుక్తములో యవియెల్ల నందుఁ దెప్పింపఁబడియుండెను. మూఁడువందలపశువులు యూపమునఁ గట్టబడియెను. ఆయాగ మెంతయు దేవర్షి సంకులమై విరాజిల్లుచుండ గంధర్వు లొకచో గానముచేయుచుండిరి. అచ్చర లొకచో నాడుచుండిరి. కిన్నరకింపురుషాదులు గుంపులుగాఁ గూడి యుండిరి. యాగస్థండిలరచనానిపుణులును, సర్వశాస్త్రప్రణేతలు నగు వ్యాసశిష్యు లాసభను సదస్యులై విరాజిల్లుచుండిరి. మహాతేజులగు తుంబురునారదులు నందు వెలయుచుండ, విశ్వావసువు చిత్రసేనుఁడు మున్నగు గానకోవిదులు గానమొనర్చుచుండిరి. గంధర్వగానవిశారదు లును, నృత్యనిపుణులు నగువారుకొందఱు, యాగకర్మవిశ్రాంతి సమ యముల సభ్యుల కానందమొదవించుచుండిరి. అని తెలిపి వైశంపాయ నుఁడు మఱియు నిట్లనియె.

—అశ్వమేధసమాప్తి—

ఓజనమేజయా! అపుడు బ్రాహ్మణోత్తములు విధ్యుక్తముగా, మనోజ్ఞములగుపశువుల నాలంభనమొనర్చి పిదప నయ్యాగ్నేయాశ్వము నాలంభించిరి. అటులయ్యాజకులు విధ్యుక్తముగా నయ్యశ్వము హింసించి, మంత్రద్రవ్యశ్రద్ధలతోఁ గూడియున్నయాద్రుపద రాజపుత్రి నాధర్మజుని చెంతఁ గూరుచుండఁబెట్టి, యాహాయవపను దీసి, విధ్యుక్తముగా జాగరూకులై హోమమొనర్చిరి. అపు డవ్వహ ధూమగంధమును యుధిష్ఠిరుఁడును, నాతనిసోదరులును, సకల పాపాపనోదకముగా, శాస్త్రవిధిని దప్పక యాఘ్రాణించిరి. ఓజనమేజయా! మఱియు నయ్యశ్వము నవయవములన్నియు, నందలిపదు నార్వురగుఋత్విజులును హోమమొనర్చిరి. ఇట్టు లమ్మహాతేజుఁడగు యుధిష్ఠిరుని యాగమును వ్యాసుఁడు శిష్యులతోఁ గూడ బ్రవర్తిల్లఁ జేసి, యాతనికి వృద్ధికరముగా నాశీర్వదించెను. అంత నాధర్మజుఁడు, యథావిధిగా బ్రాహ్మణులకు నిష్కసహస్రకోటులనొసంగి, యావ్యాసునకుఁ దనవసుంధర నొసంగెను. ఓరాజా! అసాత్యవతేయుఁ డావసుంధరను బరిగ్రహించి, భరతశ్రేష్ఠుఁడగు యుధిష్ఠిరునితో "ఓధర్మజా! నీవొసంగిన యీవసుంధర నీకే విడిచితిని. దీనికి నిష్క్రియముగా నాకు ధనమొసంగుము. బ్రాహ్మణులు ధనార్థులుగదా!" అని తెలిపెను. అదివిని యుధిష్ఠిరుఁడు, తనతమ్ములతోఁగూడ నమ్మహాసభామధ్యమున విప్రుల నుద్దేశించి, "ఓబ్రాహ్మణోత్తములారా! ఈయశ్వమేధమహాయజ్ఞమునఁ బృథివియే దక్షిణగాఁ జెప్పఁబడియెనుగదా? అర్జునునిచే జయింపఁబడిన యిప్పుడమిని ఋత్విజుల కర్పించితిని. నేనిఁక వనమునకుఁ బోయెదను. ఓఋత్విజులారా! మీ రిప్పుడమిని విభజించుకొనుఁడు. చాతుర్హోత్రప్రమాణముగా నీవసుంధరను నాల్గుభాగములొనర్చికొనుఁడు. బ్రాహ్మణధనమగు నిద్దానిని నేను బ్రతిగ్రహింపనొల్లను. నా యీవచనము నాకును నాసోదరులకును సమ్మతమై నిత్యమైనది" అని పలికినతోడనే, భీమాదులును, ద్రౌపదియు, నందఱ లంగీకారమును దెలిపిరి. అది వినినవారెల్లరకు మేనులు గగుర్పొడువకపోలేదు, ఓరాజా! అపు డంతరిక్షమున మేలుమేలనియెడిశబ్ద ముద

యించెను. అటులే బ్రాహ్మణుల స్తుతిధ్వనులును వెడలెను. మఱియు, నా ద్వైపాయనుఁ డయ్యుధిష్ఠిరుని మఱియు నారసి, గౌరవపురస్సరముగ విప్రులు వినుచుండ, "ఓమహారాజా! నీవు నాకీభూవలయ మొసంగితివి. నేను నీకు మరలఁ బ్రతిదానము సేయుచున్నవాఁడను. ఈబ్రాహ్మణులకు హిరణ్యమొసంగుము. పుడమి నీవుంచుకొమ్ము" అని తెలిపెను. అది విని యావాసుదేవుఁడు ధర్మజు నారసి, "ఓయుధిష్ఠిరా! వ్యాసభగవానునానతి యనతిక్రమణీయము. నీవద్దానిని శిరసా వహింపవలయు"నని తెలిపెను. అందుల కాయుధిష్ఠిరుఁడు తమ్ములతోఁగూడ సంతసంబడి, తద్యాగమునకుఁ గోట్లకొలఁదిగా, మూఁడురెట్లు ధనము దక్షిణగా నొసంగెను. ఓజనమేజయా! అతఁడొనర్చినట్లెవ్వారును, నీలోకమునఁ జేయఁజాలరు. మున్నామరుత్తుఁ డొనర్చెను. పిమ్మట ధర్మజుఁ డొనర్చెను. వారికి వారే సాటి యనవలయును. అంత నావ్యాసుఁ డాయుధిష్ఠిరునివలన రత్నమయధనమును దక్షిణగాఁ బ్రతిగ్రహించి, నాల్గుభాగములుగాఁ జేసి ఋత్విజుల కొసంగెను. అటు లయ్యుధిష్ఠిరుఁడు భూమికి నిష్క్రయముగా హిరణ్యమిచ్చి నిర్ధూతపాపుఁడును, స్వర్గజేతయునై భ్రాతలతోఁగూడ మోదమానమానసుఁడై యుండెను. ఋత్విజులును, ధర్మజుఁ డొసంగిన యమేయమగు సువర్ణసమూహమును, బ్రాహ్మణులకు యథోత్సాహముగను యథాసుఖముగను బంచిపెట్టిరి. మఱియు నాయాగవాటమునఁ గలహిరణ్యమును, విభూషణములను, తోరణములను, యూపములను, ఘటములను, నిటికలను, నయ్యుధిష్ఠిరుననుజ్ఞ వడసి బ్రాహ్మణులు పంచుకొనిరి అటులు బ్రాహ్మణులు తీసికొనఁగా, మిగిలిన ధనమును క్షత్రియులును, వైశ్యులును, శూద్రులును దీసికొనిరి. మఱియు శిష్టములగుధనములను మ్లేచ్ఛులు మున్నగువారు తీసికొనిరి. అనంతరము, బ్రాహ్మణులందఱును సంతుష్టాంతరంగులై తమతమనివాసములకుఁ బోయిరి. ధర్మజుఁ డొసంగినధనములచేఁ గలిగిన వారిసంతోషమునకు మేరలేదు. ధర్మజుఁడు తనకొసంగినధనమును వ్యాసభగవానుఁడు సగౌరవముగాఁ గుంతి కొసంగెను. ఆమె, తనమామ యొసంగిన మహాహిరణ్యమును గొని పరమానందభరితయై తద్ధనముచే మహత్తరపుణ్యము నార్జించెను. అంత నాయుధిష్ఠిరుఁడు తద్యాగావభృథమునొంది కలుషరహితుఁడై,

తనసోదరులు తన్ను సంభావింపఁ, ద్రిదశులతోడి యింద్రునట్టు లెంతయు విరాజిల్లెను. పాండవులును సకలక్షత్రియులతోఁ గూడి తారాగణములతోఁ గూడిన గ్రహములట్టు లెంతయు శోభిల్లిరి. పిమ్మట రాజులకుఁగా రత్నములును, గజాశ్వాలంకారములును, స్త్రీసువర్ణవస్త్రాదులు నొసంగఁబడుటయు, వానినెల్ల నప్పార్థుఁ డప్పార్థివమండలమున కొసంగుచుఁ, గుబేరునట్లు చూపట్టెను. మఱియు, నవ్వీరుఁడును రాజకుమారుఁడునగు బభ్రువాహనునిఁ దెప్పించి యాతనికి విపులమగువిత్తముల నిచ్చి యింటికిఁ బంపించెను. మఱియు, బాలకుఁడగుదుశ్శలమనుమనిఁ బిలిచి, దమకుఁజెలియలగుదుశ్శలప్రీతికై, వాని తండ్రిరాజ్యమున వాని నిలుప నాజ్ఞాపించెను. అటులే తక్కుంగల రాజులను సైతము యుధిష్ఠిరుఁడు మంచియేర్పాటులతోఁ బూజించి వారివారినివాసములకుఁ బంపించెను. ఓజనమేజయా! పిమ్మట నమ్మహాత్ములగు గోవిందబలరాములను, మఱియుఁగల యాదవవీరులను, ప్రద్యుమ్నాదికుమారులను, యథావిధిగాఁ బూజించి, తనసోదరులతోఁ గూడ వారిని గొంతవఱకు వెంబడించి పంపించెను. ధీమంతుఁడగు నయ్యుధిష్ఠిరునియాగ మిట్లు బహ్వన్నధనరత్నసమన్వితమును, సురామైరేయసాగరమునై నేతిలేఱులు వాఱ, నన్నరాసులు కొండలుగా నెంతయు నొప్పారెను. మఱియు నెల్లరసము లేఱులై, కర్దమము గావించెను. అయ్యాగకాలమున నెల్లవేళలను, వండఁబడుభక్ష్యాదులకును దినఁబడుపదార్థములకును, వధింపఁబడుపశువులకును నంతము గానరాకుండెను. అచ్చోటు మృదంగశంఖనాదపూరితమై, మనోజ్ఞమై, మదప్రమాదప్రీతియుతయువతీజనసమన్వితమై యొప్పారెను. రేవవలును, నిచ్చవచ్చినటులు "వడ్డింపఁబడుఁగాక, భుజింపఁబడుఁగాక" అను నారావములతో జనము సంకులముగా, నది గొప్పమహోత్సవతుల్యమై గానవచ్చెను. నానాదేశములనుండి వచ్చినవారందఱును, "యుధిష్ఠిరుఁడు, ధనధారలను వర్షించి, యిచ్చవచ్చినరత్నాదుల నొసంగి, కలుషరహితుఁడయ్యెను" అని తెలుపుకొనుచుఁ బోయిరి. అని తెలుప విని జనమేజయుఁడు మఱియు నిట్లు ప్రశ్నించెను.

## నకులాఖ్యానము

ఓవైశంపాయనా! ధీమంతుఁడగు నాపితామహుఁడు యుధిష్ఠి

రుఁడు మహాయాగ మొనర్చెనుగదా! అప్పు డొదవినయాశ్చర్య మేదే నున్నచో నది నాకెఱిఁగింపుము.

అది విని వైశంపాయనుఁడు "జనమేజయా! మీపితామహుని యాగము పూర్ణమైనపిమ్మట నొకమహాశ్చర్య మొదవెను. దాని నెఱిఁగించెదను. వినుము. ఆయాగమున, బ్రాహ్మణులును, జ్ఞాతిసంబంధ బాంధవులును, దీనులు, నంధులు, కృపణులు దృప్తులగుచుండ, మహాత్తరదాన మెల్లకడల నుద్ఘోషింపఁబడుచుండ, నయ్యుధిష్ఠిరుతలపైఁ బుష్పవర్షములు పడుచునుండ, సువర్ణపార్శ్వములు, లీననేత్రములును గలిగిన యొకనకులము, వజ్రాశనిసమమగు నొకనాద మొనర్చెను. అటులు, మృగపక్ష్యాదులకు వెఱపుగొలుపు నమ్మహానాద మొనరించి, యది తన బిలమందుండియే మానుషవచనములతో "ఓక్షత్త్రియులారా! ఈహయమేధము, కురుక్షేత్రనివాసియు, నుంఛవృత్తియు, వదాన్యుఁడునగు నొకముని యొనర్చిన సక్తుప్రస్థదానఫలము నొసంగఁజాలదు. వాని యజ్ఞమున కిది తుల్యముగాదు." అని పలికెను. ఆనకులమాడినమాట కందలి బ్రాహ్మణులందఱును విస్మయభరితులై దానిని సమీపించి "ఓనకులమా! సాధుసమావేశముగల యీయాగమునకు నీవెచ్చటినుండి వచ్చితివి? నీకుఁ గలఫల మెట్టిది? నీశ్రుత మెట్టిది? నీయుత్తమత్వ మెట్టిది? నిన్ను మే మెట్లు తెలిసికొనఁగలము? నీవగదా! ఈయాగము నిందించుచున్నాఁడవు. యాగీయములగు వివిధకర్మములచే నెందును నాగమలోపముగలుగనీక యిది చేయఁబడినది. ఇందు న్యాయము తప్పక చేయఁదగినదెల్లఁ జేయఁబడియెను. పూజార్హులగువా రిందు విధ్యుక్తముగాఁ బూజింపఁబడిరి. అగ్ని మంత్రాహుతియుతముగా, హుత మొనర్పఁబడియెను అసూయారహితముగా, దానముచేయఁదగినదెల్ల నీయఁబడినది. యుధిష్ఠిరుఁ డొనర్చినబహువిధదానములచే బ్రాహ్మణులు సంతుష్టులైరి. సుయుద్ధముచే క్షత్త్రియులును, శ్రాద్ధములచేఁ బితామహులును, గౌరవముచే వైశ్యులును, గోద్యులచే నుత్తమకాంతలును దృప్తినొందింపఁబడిరి. అటులే కనికరముచే శూద్రులును, దానశేషములచేఁ దక్కినమాన్యులును సంతసింపఁజేయఁబడిరి. మా యుధిష్ఠిరుని శుచిత్వమునకు జ్ఞాతిసంబంధబంధువులందఱును సంతుష్టులైరి. దేవతలు, పవిత్రములగు హవిస్సులచేతను, శరణాగతులు రక్ష

ణములచేతను దృప్తులై రిగదా! నీవిట్లేల నిందించితివి? ఇందలిసత్య మేదియో తెలుపుము. నీవిందుఁ జూచినదియు, విన్నదియు నేది గలదో యది మాకోర్కెపైఁ దెలుపుము. నీవు దివ్యరూపమును వహించి యున్నదానవు. నీమాట మాకు నమ్మఁదగియున్నది. నీవును బ్రాహ్మణులతోఁ గలిసివచ్చితివి. అటులగుట నీవీ విషయము నెఱిఁగింపుము.' అని యడిగిరి. అది విని యానకులము నగుచు, "ఓబ్రాహ్మణోత్తము లారా! నా యీవచన మనృతముగాదు. గర్వముచేఁ బలుక లేదు. సక్తుప్రస్థదానమున కిది తుల్యముగాదని నా తెలిపినవచనమును మీరు విన్నదియెగదా! ఇది నేను దప్పక చెప్పఁదగినదియే. జాగరూకులై నాయథార్థవచనమును వినుఁడు. అద్భుతమగు నీయుత్తమవృత్తము నాచేఁజూడఁబడినదియు ననుభవింపఁ బడినదియు నగుట మీరిద్దానిని నమ్మవలయును. ఉంఛవృత్తియు, వదాన్యుఁడు, కురుక్షేత్రనివాసియు నగునమ్ముని, దానును దనపుత్రుఁడును, దనభార్యయుఁ, గోడలుఁ గూడ స్వర్గము నొందెను. అతఁడే నా యీశరీరమును సగము కాంచనమయముగా నొనర్చెను. అతఁ డొనర్చిన యుత్తమదానమునకైనఫల మెఱిఁగించెదను. న్యాయలబ్ధమగుధనము విప్రులకు దానము చేయఁబడెనే నది మహత్తరఫల మిచ్చుచున్నది. ఓబ్రాహ్మణోత్తములారా! ధర్మజ్ఞు లనేకు లావరింప ధర్మక్షేత్రమగుకురుక్షేత్రమున నొకబ్రాహ్మణుఁడు, కపోతమట్టులు జీవనమున కుంఛవృత్తి నాశ్రయించి, భార్యయుఁ, బుత్రుఁడును, గోడలును దన్ననుసరించి యుండ, శుక్లవృత్తుఁడును, ధర్మాత్ముఁడును, నియతేంద్రియుఁడు నై యాఱవకాలమున, భార్యాదులతో భుజించుచుఁ బ్రవర్తించెను. ఒక్కొకపుడుతక్కినవారు భుజించినను నతని కాయాఱవకాలమందును నాహారము లేకుండెడిది. అతఁడు కపోతధర్మి యగుట దారుణమగు కఱవు సంభవించునపు డతనికి సంగ్రహ మేమియు లేదని తెలిసికొనుఁడు. ఓబ్రాహ్మణులారా! ఓషధులన్నియు క్షీణించునపు డతఁడు ద్రవ్యహీనుఁడై యుండవలసివచ్చెడిది. అటులగుట నాతని కాయాయాఱవకాలములందును భోజనము లభింపదయ్యెను. అట్టితఱి వారందఱును, నాఁకలిచేఁ బీడితులై శుక్లపక్షమున మధ్యందిన మార్తాండుఁడు తపించుచుండ నుంఛవృత్తికై వెడలిరి. అపు డాబ్రాహ్మ

ఋుఁడు, క్షుధార్తుఁడు నాతపార్తుఁడునై యుంఛము నెందును బడయక శ్రమాకులుఁడై, తనపరిజనముతోఁ గూడ నాఁటియాఱవ కాలమును నతికష్టముపైఁ గడపెను. అనంతరము వా రాయాఱవకాలము గడచు నప్పటి కొకయవప్రస్థము నార్జించి, సక్తువులఁగాఁ జేసికొని, నిర్వర్తితాహ్నికులై యథావిధిగా నగ్నిహోత్రక్రియ నాచరించి, యాసక్తువుల నొక్కొక్కకుడవముగాఁ బంచికొనిరి. అంతలో వారియాశ్రమమున కొకబ్రాహ్మణుఁ డతిథియై వచ్చెను. అపుడు వారట్లు తమభోజన సమయమునకు వచ్చిన యావిప్రునిఁ గాంచి సంతుష్టాంతరంగులై యాతనికి నమస్కరించి కుశలమడిగి, పరిశుద్ధాంతరాత్ములును దాంతులును, శ్రద్ధాదమసమన్వితులును, నసూయారహితులును, శాంతులును, సాధువులును, నిర్మత్సరులు నై మానమదక్రోధములఁ బరిత్యజించి, తమసమాన బ్రహ్మచర్యమును గోత్రమును దెలిపికొనుచు, క్షుధాపీడితుఁడై యున్న యాయతిథిని దమకుటీరమునకుఁ దీసికొనిపోయిరి. అటులు వా రాతని లోనికిఁ దోడ్కొని చని, 'ఓమహాత్మా! నీకిదె యర్ఘ్యము. ఇదె పాద్యము. ఈదర్భాసనముపైఁ గూరుచుండుము. ఓయనఘా! మేము నియమముగా నార్జించిన యీసక్తువులు మిగులఁ బవిత్రములైనవి" అని మనవిచేసిరి. అంత నాయుంఛవృత్తియగు మునివరేణ్యుఁడు దనసక్తుభాగ మాతనికిఁ జూపి "ఓమహనీయా! ఇదె నేను నీకొసంగితిని. పరిగ్రహింపుము" అని తెలిపెను. అది విని యాయతిథి యాసక్తుకుడవమును బ్రతిగ్రహించి భుజించెనుగాని, దానిచే నాతనికిఁ దృప్తియొదవదయ్యెను. అటులు తృప్తిలేక యాఁకలిగొనియున్న యాయతిథి నాయుంఛవృత్తి పరికించి "ఆహా! ఈయాహారమీయాతనికిఁ జాలదయ్యెనుగదా! ఇతఁ డెట్లు తుష్టుఁడగును?" అని చింతించెను. అంత నాతనికాంత యదంతయుఁ దిలకించి "ఓకాంతా! ఈనాభాగ మీయతిథి కర్పింపుము. దీనిని భుజించి యితఁడు తుష్టుఁడై యథేచ్ఛగా వెడలుఁగాక." అని పలికెను. అటులు పలుకు నాలలనామణి నారసి, యాద్విజోత్తముఁడు తనభార్యను, క్షుధాపీడితనుగాఁ దెలిసికొని దానిసక్తువుల నొసంగ నంగీకరింపఁడయ్యెను. ఓజనమేజయా! వివేకముగలయమ్ముని, తన యనుభవముచుబట్టి వృద్ధయగు నామెను క్షుధార్తనుగాఁ గుర్తెఱిఁగి, తపస్వినియు, శ్రాంతయు,

గ్లానయును, నెమ్మికలు గానవచ్చునదియు నై వణఁకుచున్న యామెను గాంచి, "ఓశోభనాంగీ! మృగములకును, గీటపతంగములకును గూడ స్త్రీలు రక్షణీయులును, పోషింపఁదగినవారునై యుందురుగదా! అటులగుట నీవును నాకు రక్షణీయవు. ఇటులు పలుకవచ్చునా? భార్యకు భర్త యనుకంపనీయుఁడై పోషింపఁబడి రక్షితుఁడగునేని వాఁడు తనదీప్తమగుకీర్తినుండి భ్రష్టుఁడై యుత్తమలోకదూరుఁ డగుచున్నాఁడు. ధర్మకామార్థకార్యములును, శుశ్రూషయు, సంతతియు భార్యయధీనమై యుండును. అటులే గృహస్థునకుఁ దనయొక్కయుఁ బితరులయొక్కయు ధర్మము భార్యకు వశమై యుండునుగదా! ఎవ్వఁడు భార్యారక్షణమునెడ నసమర్థుఁడై యుండునో, వాఁ డపయశము పాలగుటయేగాక, నరకమునకుఁ బోవుచున్నాఁడు. మఱియు వానికిఁ గలకీర్తి నశించును. వాని కుత్తమలోకములును గలుగనేరవు." అని తెలిపెను.

అది విని యామె, యామౌని నారసి, "ఓమహామునీ! మన యిరువురకును ధర్మార్థములు సమముగా నాచరింపఁదగినవి గాదే! కావున నా యీసక్తుప్రస్థచతుర్థాంశమును గ్రహింపుము. నాయెడ ననుగ్రహింపుము. సత్యము, రతియు, ధర్మము, గుణార్జితమగుస్వర్గము, కాంక్షితము మున్నగునవియెల్ల స్త్రీలకు మగనియధీనములై యుండును గదా! స్త్రీలకుఁ దల్లిఋతువును, దండ్రి బీజమును, బతియుఁ బరమ దైవతములు. భర్తయనుగ్రహమువలననే భార్యకు రతిపుత్రఫలము గలుగును. ఓనాథా! పాలనమువలనఁ బతివి, భరించుటవలన భర్తవు నగుచున్నాఁడవు. అటులే పుత్రప్రదానముచే వరదుఁడ వగుట, నీవు నాసక్తుభాగ మీయతిథి కొసంగవచ్చును. నీవును వృద్ధుఁడవు. జరాపీడితుఁడవు, క్షుధార్తుఁడవు, ఎంతయు బలములేనివాఁడవు. అదియుఁ గాక యుపవాసపరిశ్రాంతుఁడవై కృశించితివి. నీవు నీభాగము నొసంగ లేదా? నేనేల యొసంగరాదు?" అని పలికెను.

అది విని యమ్ముని యామెసక్తుభాగమును బరిగ్రహించి యతిథిని గాంచి, "ఓబ్రాహ్మణోత్తమా! మఱియు నీసక్తుభాగ మొసంగుచున్నాఁడను. బరిగ్రహింపుము." అని పలుకుటయు, నతఁడు ప్రతిగ్రహించి భుజించెను, కాని, దానివలనను నాతనికిఁ దృప్తి గలుగ

దయ్యెను. ఉంఛవృత్తియగు నమ్ముని వాని యతృప్తి నెఱిఁగి, మఱియుఁ జింతాక్రాంతుఁడై యుండెను. అంత నాతనిపుత్త్రుఁడు తండ్రిని జూచి, "ఓతండ్రీ! నాయీసక్తుభాగమును దీసికొని యీ యతిథి కొసంగుము. అదియే మంచిదని తలంచెదను. కావున నేనిందుల కంగీకరించుచున్నాఁడను. వృద్ధుఁడవగు నీవు నాచేఁ బ్రయత్నపూర్వకముగాఁ బరిపాలింపఁ దగినవాఁడవుగాదే? వృద్ధసితులఁ బాలించుటయే సజ్జనధర్మము. వృద్ధుఁడగు తండ్రిని బాలించుట పుత్త్రునకు విధింపఁబడిన ముఖ్యకార్యమని శ్రుతులు ఘోషించుచున్నవి. ప్రాణములు ధరించిన వాఁడే తపము చేయఁగల్గుచున్నాఁడు. ప్రాణులకు దేహములందుఁ బ్రాణమున్ననే పరమధర్మమగుచున్నది" అని తెలిపెను.

అది విని తండ్రి "వత్సా! నీవు వేయేండ్లవాఁడవైనను, నాదృష్టికి బాలుఁడవేగదా! పుత్త్రునిఁ గని తండ్రి వానివలనఁ గృతకృత్యుఁడగుచున్నాఁడు. ఓపుత్త్రకా! బాలుర కాఁకలి హెచ్చని నాకుఁ దెలియును. వృద్ధుఁడ నగుట నేనెట్టులో ప్రాణములను ధరింతును. నీ వీసక్తువు దిని బలవంతుఁడవుగమ్ము. జీర్ణవయస్కుఁడనగుట నన్నాఁకలి పీడింపదు. మఱియు దీర్ఘకాలము తపమొనర్చితిని. అటులగుట నాకు మరణభయమును లేదు" అని పలికెను. అది విని పుత్త్రుఁడు, "ఓతండ్రి! నీకు నేను బుత్త్రసంతానము నైతినిగాదే? తండ్రిని రక్షించువాఁడగుటనే పుత్త్రశబ్దవాచ్యుఁడని శ్రుతిచెప్పుచున్నది. తానే పుత్త్రుఁడగునని శ్రుతి తెలుపునుగదా! కావున నిన్ను నీవు రక్షించుకొనుము." అని బదులు చెప్పెను. అంత నమ్ముని తనతనయునిఁ గనుగొని, "వత్సా! రూపముచేతను, శీలముచేతను, దమముచేతను, నీవు నన్నుఁ బోలినవాఁడవు. పెక్కువిధములఁ బరీక్షించితిని. కావున, నీసక్తువులను బరిగ్రహింతును." అని వానిని నైతము దీసికొని ప్రీతుఁడై, నగుచు నాబ్రాహ్మణున కొసంగెను. ఆయతిథి వానిని నైతము భుజించియుఁ దృప్తినొందఁడయ్యెను. అదిచూచి యాయుంఛవృత్తిముని సిగ్గుపడి చింతిలుచుండ, నాతనికోడ లది గనిపెట్టి యాతనికిఁ బ్రియమొనర్చునదై తనసక్తువును దెచ్చి మామతో "ఓమహాత్మా! నీసంతానమువలననేగదా! నాకు సంతానమయ్యెడిని? కావున నీవు నాయీసక్తువును గ్రహించి యీయతిథి కొసంగుము. నీయనుగ్రహ

ముచే నాకక్షయలోకము లయ్యెడిని. నీపౌత్రునిచేఁగదా! నాకు శోకరహితములగు లోకములు సిద్ధించెడిని. పుత్రుఁడు పితరులఋణము నుండి తరింపఁజేయువాఁడని వినుచున్నారముగదా! పుత్రపౌత్రుల మూలముననే యుత్తమలోకములు తప్పక సిద్ధింపవలయును." అని తెలిపెను.

ఆముని, తనకోడలివచనములు విని యామె నారసి, "ఓసువ్రతాచారా! నీవు మిక్కిలి యెండవేఁడిమికి వడలినయొడలిచే వివర్ణవై క్షుధానివశచేతనవై కృశవై గానవచ్చుచున్నదానవుగదా! ఇట్టి నీవలన, ధర్మవిఘాతకుఁడనై సక్తువు నెట్లు పరిగ్రహించువాఁడను? ఓకళ్యాణీ! నీవిట్లు పలుకఁదగదు. షష్ఠకాలవ్రతనియతవై శౌచశీలతపోన్వితవై నిరాహారవై కృచ్ఛ్రవృత్తివగుచున్న నిన్ను నేనెట్లు చూడఁగలను? నారివి, మఱియు బాలికవు, అందును క్షుధార్తవు. ఇట్టి నీవు నాచే రక్షింపఁదగిన దానవు గాదే? ఓబాంధవనందినీ! ఉపవాసముచే మిగుల నలసియున్న దానవు. కావున నేను నీసక్తువులఁ బరిగ్రహింపను." అని తెలిపెను. అది విని యమ్మునికోడలు, మఱియు నాతనితో "ఓమహాత్మా! పూజ్యుఁడగు నాభర్తకును బూజ్యుఁడవు దైవతదైవతమువంటివాఁడవు. దేవాదిదేవుఁడవు. కావున, నాయీసక్తువును గ్రహించి నన్ననుగ్రహింపుము. నాదేహము ప్రాణములు ధర్మమును గురుశుశ్రూషకేగదా వినియుక్తములు గావలయును. ఓవిప్రోత్తమా! నీయనుగ్రహముచే నే నుత్తమలోకముల నొందుదానను. నేను బాలింపఁదగుదాననని గాని, దృఢభక్తిగలదాననని గాని, రక్షింపఁదగినదాననని గాని, తలంచి నాయీసక్తువులఁ బరిగ్రహింపుము." అని ప్రార్థించెను. అంత నమ్ముని యది విని, "ఓకళ్యాణీ! నీవు నిత్యము నిట్టిశీలముచేతనే సాధ్వివై వర్తిల్లుచున్న దానవు మఱియు ధర్మవ్రతనియతవై గురువృత్తి నాశ్రయింపఁజూచుచున్నదానవు. కావున నీవొసంగు సక్తువులఁ బరిగ్రహించెదను." అని పలికి వానిని దీసికొని యాయతిథికి సమర్పించెను. ఆబ్రాహ్మణుఁడు వానిని బరిగ్రహించి పరితుష్టుఁడై ప్రీతివెలయ నాతనితో "ఓతాపసవరేణ్యా! నీవు పురుషరూపమును బూనినధర్మదేవతవే గాని వేఱొండు గాదు. న్యాయోపాత్తమైన విత్తముచే ధర్మయుక్తముగా నీవొనర్చిన యీదానమునకే నెంతయు సంతసిల్లితిని. ఆహా! నీ యీదానము,

స్వర్గవాసులచే స్వర్గమునఁ జూడఁబడుచున్నది. అదె చూడుము. ఆకసమునుండి కుసుమవృష్టి యెట్లు గురియుచున్నదో, నీదానమునకు విస్మయంపడి దేవర్షులును, దేవతలును, గంధర్వులును, దేవదూతలును నెట్లు తిలకించుచున్నవారో చూడుము! మఱియు బ్రహ్మర్షులును, విమానగాములై నీదర్శనము గోరుచున్నవారు. పితృలోకగతులగు నీపితరులెల్ల నీచే సుతృప్తులైరి. నీవు పరమపుణ్యశాలివగుట స్వర్గమునకుఁ బొమ్ము. ఓసువ్రతా! నీవు పరమశ్రద్ధతోఁ దపమొనర్చుచున్నవాఁడవు. కావుననే నీదానమునకు దేవత, లమితానందమందిరి. అతికష్టకాలమందును, నీవిట్లు పరిశుద్ధాంతరాత్మతో మాయెల్లసక్తువును దానమొనర్చితివి. అటులగుట నీ యీకర్మముచే స్వర్గము జయింపఁబడియెను. ఆఁకలియనునది ప్రజ్ఞను బాడుచేయును. ధర్మబుద్ధిని ధ్వంసమొనర్చును. ఆఁకలిచేఁ బీడితుఁడైనవాఁడు జ్ఞానముచెడి, ధైర్యహీనుఁడగును. కావున నెవ్వఁ డాఁకలిని జయించునో, వాఁడు స్వర్గమును జయించుట నిశ్చయము. ఎపుడు దానముచేయుటయం దిష్టముండునో, యపుడు ధర్మము చెడదు. నీవు కళత్రస్నేహమును, బుత్రప్రేమను బరికింపక, ధర్మమే యుత్తమమని యెంచితివి. ఆశ పరిత్యజించితివి. మానవులకు ద్రవ్యప్రాప్తి ముఖ్యము. అంతకంటెఁ బాత్రదాన ముత్తమమైనది. దానికంటెను గాల ముత్తమమైనది. శ్రద్ధ యంతకంటెను బరతరమైనది. స్వర్గమార్గము మఱియు సూక్ష్మమై యుండును. అది యవివేకులకుఁ గానఁబడదు. స్వర్గార్గళము, లోభబీజమును, రాగగుప్తమును, దురాసదమునై యుండును. అద్దానిని జితక్రోధులును, జితేంద్రియులు నగువారు తెలిసికొందురు. మఱియు దాతలకును, దపోయుక్తులకును స్వర్గమార్గము తెలియనగును. వేయిగలవాఁ డొకశతమును, శతము గలవాఁ డొక పదియు, నదియులేనివాఁ డుదకమును శక్తికొలఁదిగా దానమొనర్చిన, నయ్యవి తుల్యఫలములగుచున్నవి. ఓబ్రాహ్మణోత్తమా! రంతిదేవుఁ డొకప్పుడు దరిద్రుఁడై, పరిశుద్ధమానసముతో నుదకములు మాత్రము దానమొనరించి స్వర్గమునొందెను. న్యాయలబ్ధములును, శ్రద్ధాపూతములునగు ద్రవ్యములచే నొనర్చినసద్దానమున కగుఫలము మహాదానములచేనైనను గలుగనేరదు. నృగచక్రవర్తి, విప్రులకు వేలకొలఁది గోదానము లొనర్చియుఁ, బరునిదగు నొకగోవును దాన

యొనర్చి నరకము నొందెను. సువ్రతుఁడు నుశీనరపుత్రుఁడగు శిబి
నిజమాంసమును దానమొనరించి, పుణ్యకీర్తులలోకములొంది, స్వర్గమున
సంతుష్టుఁడై యుండెను. స్వార్జితధనముచే శక్తికొలఁదిఁ జేసినదానమున
కగుపుణ్యము విభవదానముచేఁ గలుగనేరదు. న్యాయసంచితములగు
వానిని దానమొనర్చినఁ గలుగుఫలము, వివిధములగు యాగములచే
నైనను గలుగఁబోదు. క్రోధమువలన దానఫలము చెడును. లోభము
వలన స్వర్గము లభింపదు. న్యాయవృత్తిగల తపోనిష్ఠుఁడైనవాఁడు దాన
మొనర్చిన, స్వర్గము నొందఁగల్గుచున్నాఁడు. బహుదక్షిణలుగల రాజ
సూయములకును, నట్టియశ్వమేధములకును నీవొనర్చినదానమున కగు
ఫలము గలుగనేరదు. ఓయనఘా ! సక్తుప్రస్థదానముచే నీవు బ్రహ్మ
లోకమును జయించితివి. ఓవిప్రవర్యా ! నీవు రజస్తమోరహితుఁడ
వగుట బ్రహ్మలోకమునకుఁ బొమ్ము. ఓద్విజోత్తమా ! మీయెల్లరకుఁ
దగుదివ్యయాన మదె వచ్చియున్నది. దాని నధిష్ఠింపుఁడు. ఓబ్రాహ్మ
ణోత్తమా ! నన్ను ధర్మునిగాఁ దెలియుము. నీ వీదేహమును బాధించు
కొని లోకమున శాశ్వతకీర్తిని బడసితివి. కావున నీభార్యయుఁ
బుత్రుఁడును గోడలును గలిసి రా స్వర్గమునకుఁ బొమ్ము." అని యా
ధర్ముఁడు పలుకుటయు, నాయుంఛవృత్తిముని దారపుత్రస్నుషాసహి
తుఁడై స్వర్గమునకుఁ బోయెను. అతఁడు తనవారితో నటులు స్వర్గము
నకు వెడలినవెంటనే, నేను నాబిలమునుండి పైకివెడలి, యాసక్తుగంధ
సంపర్కముచేతను, నందలినీటఁదడియుటచేతను, నచ్చోటి దివ్యపుష్ప
సమ్మర్దమువలనను, దానలవసంపర్కముచేతను, నాశిరము సువర్ణమయ
ముగాఁ జేయఁబడియెను. సత్యసంధుఁడగు నతనిసక్తు దానము సంబంధ
ముచేతనే, నామేను సగము సువర్ణమయముగాఁ జేయఁబడియెను.
ధీమంతుఁడగు నాతనితపముచే నైనవిపులఫల మెట్టిదో గనుఁగొనుఁడు.
ఇదె నాపార్శ్వమెల్ల సువర్ణమయమయ్యెను. నేను తపోవనములకు
యజ్ఞములకును బోవుచు, మఱిమఱియుఁ గాంచి సంతసించుచుందును.
ధీమంతుఁడగు నిక్కురుపతి యాగముచేయుట విని యిందుల కరు
దెంచితిని. మిక్కిలి యాశపడి వచ్చితిని. కాని, నాతక్కినసగము మేను
సువర్ణమయముగాఁ జేయఁబడలేదు. ఓబ్రాహ్మణోత్తములారా ! అటు
లగుటనే యాసక్తుప్రస్థదానమున కీయాగము సరియగునా ? అని

సందియముండి యట్లు పలికితిని. ఆసక్తుప్రస్థలవసంపర్కముచే నా మేను సగము సువర్ణమయము గావింపఁబడియెను. ఈయాగ మావిషయమునుబట్టి సరికాదని నా యభిప్రాయమును దెలిపితిని." అని పలికి యంతర్హితమయ్యెను. అది విని యాబ్రాహ్మణులును దమతమయిండ్లకుఁ బోయిరి.

ఓజనమేజయా! అమ్మహావాజిమేధమున, నీయాశ్చర్య మొదవెను. ఇదియెల్లఁ దెలిపితిని గదా! కాని యాగవిషయమున నీవు విస్మయమంద వలసినది లేదు. మహర్షికోటిసహస్రములు తపముచే స్వర్గమునొందెను. సకలభూతాహింసయు, సంతోషము, సుశీలము, ఋజుబుద్ధి, తపము, దమము, సత్యము, దానమును, స్వర్గకారణము లగుచున్నవి. అని తెలుప విని జనమేజయుఁడు మఱియు నిట్లనియె.

### ఇంద్రమహర్షి సంవాదకథనము

ఓమునివర్యా! క్షత్త్రియులు యాగము లభిలషించి చేయుదురు. మహర్షులు తపమొనర్తురు. విప్రులు శాంతిపరులై శమదమము లుత్తమమందురు. యజ్ఞఫలమును దక్కినవి గలిగింపఁజాలవని నాయభిప్రాయము. ఇందు సందియముండదనియు నెంచెదను. ఓమహర్షివర్యా! రాజులనేకులు యాగములొనర్చి, యిహమునఁ గీర్తిఁబడసి, పరమున స్వర్గమునొందిరి. భూరిదక్షిణలుగల యాగములచేతనే మహాతేజుఁడై యింద్రుఁడు దేవతలకు రాజై స్వర్గాధిపత్యమునొందెను. మాతాత యుధిష్ఠిరుఁడును భీమార్జుననకులసహదేవపురస్సరముగా, యాగమొనర్చుటను, విక్రమసమృద్ధులచే నింద్రుఁడునాఁ దగియుండెను గదా! ఆ నకుల మతనిక్రతువును నిందింపనేటికి? మహాత్ముఁడగు నాతని యశ్వమేధయాగము మహత్తరమైనదిగాదే?

అది విని యవ్వైశంపాయనుఁడు "ఓజనమేజయా! ఈయశ్వమేధయాగవిధి యెట్టియుత్తమమైనదియో తెలిపెదను వినుము. మున్నింద్రుఁడు యాగముచేయుచుండఁగా మహర్షు లిట్లు పలికిరి. వినుము.

మున్నొకప్పు డింద్రుఁడు యాగ మారంభింప, ఋత్విజులందఱును గర్మవ్యగ్రులగుచుండ యాగము సాగుచుండెను. గుణసమన్వితముగ నగ్నిహోత్రమున హోమము గావింపఁబడుచుండెను. దేవతలందఱును బిలువఁబడుచుండిరి. మహర్షులందఱు నందు వెలయుచుండిరి.

వేదవేత్తలగువిప్రులు సుస్వరులై యవిచ్ఛిన్నముగా మంత్రముల నుడువుచుండిరి. అంతఁ బశ్వాలంభసమయ మగుటయుఁ, బశువు లందులకుఁ దేఁబడియెను. వాని నారసి మహర్షులు, దయావిష్టులై దీనములై యున్న వానివధమును దొలఁగింప, శక్రునిఁ జేరి "ఓయీ! ఈయాగవిధి మంచిదిగాఁ గన్పట్టలేదు. గొప్పధర్మమును జేయఁ గోరు నీకిది యొకయవివేకమని తలంచెదము. ఓపురందరా! యాగమునఁ బశువధము విధ్యుక్తము గాదు. ఇట్టి యారంభము ధర్మోపఘాతకముగాఁ గానవచ్చుచున్నది. ఈయాగము ధర్మజనకముగాదు. హింస ధర్మముగాదు గదా! యాగము చేయఁగోరినవా రాగమముచేఁ జేయుదురుగాక! విధ్యుక్తమగుయాగముచే నీకు మహాధర్మమయ్యెడిని. మఱియు నోయింద్రా! మూఁడువత్సరములనుండియు నిలువయున్న బీజములు యజ్ఞసాధనములు. అట్టివానిచే నొనర్చినయాగమే మహాఫలజనకమగుచున్నది." అని పలికిరి. అంత నాయింద్రుఁడు, తత్త్వదర్శులగు నమ్మహర్షులవచనములను గర్వముచే లక్ష్యము సేయక మోహావశుఁడై యుండెను. ఆయాగమున నమ్మహర్షులందఱకును, "జంగమములతోడనా? స్థావరములతోడనా? యాగము సేయవలయు" నను గొప్పవివాదము జరిగెను. అపుడు తత్త్వదర్శులగు మహర్షులు వివాదఖిన్నులై యాశక్రునితో సంధిగావించుకొనువారై యందులకు వచ్చియున్న యుపరిచరవసువు నారసి, యాగములవిషయమున నాగమ మెట్టిదియో తెలుప వేఁడిరి. అతఁడు పశువులతో యాగము చేయుట ముఖ్యమనియు, బీజములచేఁగాని, రసములచేఁగాని యాగము చేయుట రెండవపక్షమనియుఁ దెలిపెను. కాని యతఁడు వివాదమునందలి బలాబలములను విచారింపక, వితథముగా సమాధాన మొసంగుటచే నధోలోకమునకుఁ బోయెను. కావున సంశయమొదవినపుడు బహుజ్ఞుఁడైనను నొక్కఁడు ధర్మమును నిర్ణయింపరాదు. అటులు తెలుపఁదగువాఁ డొక్కపరమేష్ఠియే. ఓజనమేజయా! హింసకుఁడై యపవిత్రబుద్ధియగు పాపుఁడొనర్చినదానము లనేకములైనను, వాని నెవ్వరును లక్ష్యముసేయరు. అధర్మప్రవృత్తుఁడగు నట్టివాని దానముచేఁ గీర్తిగాని, పరసుఖముగాని గలుగనేరదు. ఎవ్వఁడేని వివేకహీనుఁడై, మిక్కిలి యన్యాయముగా నార్జించిన ద్రవ్యముచే

ధర్మాభిలాషియై యాగముచేసినను, వాఁడు ధర్మఫలమొందనేరఁడు. హింసాకరధర్మ మొనర్చువాఁడు పాపాత్ముఁడును, బురుషాధముఁడునై, లోకవిశ్వాసకారణముగా దానము విప్రులకుఁ జేయును. వానిధర్మము ధర్మము గానేరదు. విప్రుఁడు పాపకర్మముచే ధనము నార్జించి నిరంకుశుఁడై, లోభమోహావశుఁడగుచుఁ బ్రవర్తిల్లి, తుదకుఁ గలుషగతి నొందుచున్నాఁడు. లోభమోహావశుఁడై యెవ్వఁడు ద్రవ్యమును సంపాదింప నెంచునో, వాఁడు భూతముల కుద్వేగముగలిగించువాఁడగుచున్నాఁడు. మఱియు నటులు ధనము సంపాదించినవాఁడు దానముగాని, యాగముగాని యొనర్చినను, ఫలము నొందనేరఁడు. వాఁడు మరణించియుఁ, బాపమునే యనుభవించును. తపోధనులగువారుంఛలబ్ధములగు మూలఫలశాకములం దేదే నొకటిగాని, యుదకమునుగాని, తమవిభవమునుబట్టి దానముచేసి, ధార్మికులై స్వర్గము నొందుచున్నారు. దానము, భూతదయ, బ్రహ్మచర్యము, సత్యము, కనికరము, ధైర్యము, శాంతము, ధర్మజనకము లగుచున్నవి. ఇవియే సనాతనధర్మమునకు మూలము. విశ్వామిత్రుఁడు, అసితుఁడు, జనకుఁడు, సింధుద్వీపుఁడు మున్నగువారును, మఱికొందఱు క్షత్రియులును బరమసిద్ధిఁబడసిరి. న్యాయలబ్ధములగుద్రవ్యముల దానముచేసియు, సత్యము పలికియుఁ దపోధనులగుబ్రాహ్మణులును, క్షత్రియులును, వైశ్యులును, శూద్రులును బరిశుద్ధులై స్వర్గము నొందుచున్నారు. అని తెలుప విని జనమేజయుఁడు మఱియు నిట్లనియె.

## నకులాఖ్యానము

ఓవైశంపాయనా! న్యాయోపార్తద్రవ్యదానముచే స్వర్గము గలుగునని తెలుపుచున్నాఁడవు. దానివిధమంతయు వివరించి తెలుపుము. ఉంఛవృత్తియగునమ్ముని చేసినసక్తుదానఫలము మహత్తరమంటివి. అదెయ నిశ్చయమేని సకలయాగములను జేయ సంకల్పమెవ్వరికిఁ గల్గెడిని?

అది విని యతఁ డోజనమేజయా! నీవడిగిన యాయర్థమును వివరించు పురాతనేతిహాస మొకటి తెలిపెదను. మున్నొకప్పు డగస్త్యుఁడు, ద్వాదశవార్షికమగు మహాయాగ మారంభించి, సర్వభూతహితాభిలాషియై దీక్షలోఁ బ్రవేశించెను. అమ్మహాత్ముని మహాసత్త్ర

మున నగ్నితుల్యులగుహోతలు కర్మప్రవర్తకులై యుండిరి. మఱియు నందులకు మూలఫలాహారులును, నశ్మకుట్టులును, మరీచిపాయులును, బరిష్పృష్టికులు, వైధసికులు, నప్రక్షాళనులు, యతులు, భిక్షుకులును వచ్చిరి. వారందఱును బ్రత్యక్షధర్మలును, జితేంద్రియులును, జితక్రోధులును, దమనిధులును హింసాదంభవివర్జితులును, శుద్ధవర్తనులునై యింద్రియములచే బాధింపఁబడనివారుగా నుండిరి. అట్టి మహర్షిసమావేశమున నగస్త్యుఁడు తనశక్తికొలదిగా సార్జించిన ధనముచే యాగముఁ జేయఁ బ్రయత్నించుటయు, నందు జరగవలసిన దంతయు జరుగుచువచ్చెను. అటులే యనేకులు మునివరు లాసమయమునఁ గ్రతువులొనర్చిరి. ఆయగస్త్యుని యాగ మటులు సాగుటయు నక్కాలమున నింద్రుఁడు వర్షింపఁడయ్యెను. ఆయాగమునడుమ భావితాత్ములగుమునులలో "ఆహా! ఈయగస్త్యుఁడు యజమానుఁడై నిర్మత్సరముగా నన్నము వెట్టుచున్నను, బర్జన్యుఁడేమొకో వర్షింపకుండెను. ఇఁక నన్నపానములు లభించుటెట్లు? ఇమ్ముని ద్వాదశవార్షికయాగము మహాత్తరమైనది. ఈపండ్రెండువత్సరములలోఁ బర్జన్యుఁడు వర్షమును గలిగింపఁడు కాఁబోలును? ఓయీ! ఈవిషయమున మీరాలోచించి యీయగస్త్యు ననుగ్రహింపుఁడు" అనుప్రసంగము గలిగెను. అప్పుడగస్త్యుఁ డదివిని, యమ్మునులను బ్రసన్నులఁగావించి "ఓయీ! ద్వాదశవర్షములును, వాసవుఁడు వర్షింపఁడేని, నేను జింతాయాగముచేసెదను. అది సనాతనవిధియై యున్నది. మఱియు నప్పటికిని వర్షము గురియకుండెనేని స్పర్శయజ్ఞ మొనర్చెదను. అదియు సనాతనవిధియే. అప్పటికిని వర్షములు లేకుండెనా మఱియు నతివ్రతములగు యాగములు మఱికొన్నిటిని గావించెదను. బహువర్షసమాచితమగు నాయీ యాగము బీజప్రధానమైనది. దీనికి విఘ్నము గలుగదు. ఈ నాబీజయాగము వ్యర్థము కాఁజాలదు. ఆయింద్రుఁడు వర్షించునా! మేలు. అటులతఁడు బుద్ధిపూర్వకముగా నాకోరికను దీర్పఁడేని, నేనే యింద్రుఁడనై ప్రజలను జీవింపఁజేసెదను. నాసంకల్పమువలననే యాహారజాత మెల్లఁ గలిగెడిని. మఱియు విశేషమును జేయగల్గుదును. ఇంకను నీలోకమునఁ గలస్వర్ణమును ధనమును నిందులకు రాఁగలదు. దివ్యాప్సరోసంఘమును, గంధర్వులును, గిన్నరులును, విశ్వా

వసువు మున్నగువారును నాయాగము నుపాసింతురుగాక. అదియుఁగాక యుత్తరకురుదేశములు ఫలవత్తరములై యున్నయవి. వానినుండి మనకు వలయువసుబీజాదులువచ్చును. స్వర్గము స్వర్గసదులును ధర్మమును తమంత వచ్చితీరవలయును" అని పలికెను. అతఁ డిట్లు పలుకఁగనే, యమ్ముని తపోబలముచే నంతయు సిద్ధించెను. దీప్తాగ్నిసమానుఁడై యతితేజుఁడగు నాయగస్త్యునకు సిద్ధింపనిదేది? అది చూచి మునులు సంతుష్టాంతరంగులై, తపోబలము నపుడు గనిపెట్టి, విస్మయమొదవ నాతనితో, "ఓమహామునీ! నీమాటకు మేమెంతయు సంతసించితిమి. కాని మేము తపోవ్యయమున కంగీకరింపము. మేము తపోయజ్ఞములచేతనే తుష్టులగుదుము. యజ్ఞమును, దీక్షను, హోమములను, మఱి యుఁగలకృత్యమును, దపోవ్యయమొనర్పకయే వెదకికొందుము. మఱియు మేము న్యాయోపార్జితాహారులమై, నిజకర్మాభిరతిగలిగి, బ్రహ్మచర్యముఁ బూని వేదములను బ్రార్థించుచుందుము. న్యాయముగా గృహములనుండి వెడలితిమి. ధర్మనిష్ఠములగు వేదమార్గముల ననుసరించి తప మొనర్చుకొందుము. హింసావివర్జితమగు నీబుద్ధి యెంతయు మాకు సమ్మతము. నీవు యాగములం దిట్టి యహింసనే తెలుపుచుండుము. ఓద్విజోత్తమా! అటులేని మేము మిగులఁ బ్రీతుల మగుదుము ఈసత్రము సమాప్తమైనతోడనే నీ యానతినొంది పోవుదుము." అని వారు పలికిరి. అమ్మహర్షు లటులు పలుకుచుండఁగనే, పురందరుఁ డయ్యగస్త్యుని తపోబలమును గాంచి వర్షించెను. ఓజనమేజయా! అటు లాయింద్రుఁ డాయాగము సమాప్తినొందునంతకును వర్షించుచువచ్చెను. అటులగుట నయ్యగస్త్యుఁ డింద్రు నెడఁ బ్రసన్నుఁ డయ్యెను. ఆయాగము సమాప్తమయినతోడనే, యగస్త్యుఁ డమ్మునులకు సెలవొసఁగి సగౌరవముగా వారి నంపెను. అని తెలుప విని జనమేజయుఁడు మఱియు నవైశంపాయనుతో ఓమునివర్యా! సువర్ణమయమగుశిరముతో నకులరూపమూని, మానుషవచనములతోఁ బలికినవాఁ డెవ్వఁడు? నాకెఱిఁగింపుము. అని పలికెను.

అది విని యమ్ముని, జనమేజయా! నీవు మున్నిప్రశ్న మొనరింపను లేదు. నేను దెలుపను లేను. ఆనకుల మెవ్వఁడో, దానికి మనుష్యవచన మెట్టులబ్బెనో, తెలిపెదను వినుము. మున్నొకప్పుడు

జమదగ్ని శ్రాద్ధమొనర్ప సంకల్పించియుండెను. అంత నాతనిహోమధేనువువచ్చి తనంతటఁదాఁ బాలొసంగెను. ఆక్షీరము నమ్మహర్షి దృఢము పవిత్రమునై క్రొత్తదగు నొకపాత్రమున నుంచెను. అపుడు, క్రోధస్వరూపమూని ధర్ముఁడు, తత్పాత్రమును బ్రవేశించి, దానినిఁగూల్చి యాతనికి విప్రియమొనర్చిన నతఁడేమి చేయునో, యని పరీక్షింపనెంచి, యాక్షీరమును నేలఁ గలిపెను. దాని నెఱిఁగి యమ్ముని, యించుకేని కోపింపక శాంతుఁడై యుండెను అపు డాధర్ముఁడు పరాజితుఁడై యాతనితో "ఓమునీంద్రా! భృగువు లతికోపనులని లోకాపవాదము గలదు. అది యిపు డనృతమయ్యెను. నీకు నేనోడితిని. శాంతిధనుఁడవై మహాత్ముఁడవగు నీకిపుడు నేను వశుఁడనైతిని. నీవలన భయమొందుచున్నవాఁడను. నన్ననుగ్రహింపుము." అని ప్రార్థించి పలికెను. అది విని యాజమదగ్ని "ఓక్రోధమా! నీవు నాచేఁ బ్రత్యక్షముగాఁ జూడఁబడితివి. ఇఁక నీవు పరితాపము పరిత్యజించి పొమ్ము. నీవలన నాకేమియు నపకారము జరగలేదు. నాకుఁ గోపమును లేదు. నేనెవ్వరికిఁగా నీక్షీరములను సంకల్పించియుంచితినో, యట్టిమహాభాగులకీవిషయము నెఱిఁగింపుము పొమ్ము" అని పలికెను. అది విని యాక్రోధమూర్తి యచ్చోటు విడిచిపోయెను. పిమ్మటఁ బితరు లాజమదగ్నిని నకులముగా శపించిరి. అతఁ డట్టులు శప్తుఁడై తనశాపమున కంతము గలిగింపుఁడని వారిని బ్రార్థించెను. వారా ప్రార్థనకుఁ బ్రసన్నులై "ఓయీ! నీవు ధర్మమును నిందించుచు, శాపాంతము నొందుదు" వని తెలిపిరి. అంత నానకులరూపియగుముని ప్రతియాగప్రదేశములందును ధర్మారణ్యములందును దిరుగుచు, ధర్మమును నిందించుచు, నాధర్మజుని యాగీయదేశమును సమీపించి, సక్తుప్రస్థప్రసంగముచే ధర్మజుని యాగము నధిక్షేపించెను. అంత నాతనికి శాపవిముక్తి గలిగెను. తత్క్రోధమూర్తినొందినధర్ముఁడే యుధిష్ఠిరుఁడు. అమ్మహాత్మునియాగమునఁ గలయద్భుత మిది. అపుడే మే మెల్లఁ జూచుచుండఁగనే యానకుల మంతర్హితమయ్యెను. అని తెలుప విని జనమేజయుఁడు మఱియు నిట్లనియె.

ఆశ్వమేధికపర్వము

సమాప్తము.

శ్రీ ర స్తు.

# శ్రీమదాంధ్ర

# వచనమహాభారతము

## ఆశ్రమవాసికపర్వము.

శ్లో. "నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్,
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయేత్."

"ఓ వైశంపాయనా! మహాత్ములగు నాపితామహులు పాండవులు రాజ్యము వడసినపిమ్మట నమ్మహాత్ముఁడగు ధృతరాష్ట్రునెడ నెట్లు ప్రవర్తిల్లిరి? అక్కటా! ఆరాజు హతామాత్యుఁడు, హతపుత్రుఁడునై యాశ్రయములేక యైశ్వర్యము చెడ నెట్టులుండెను? యశస్విని యగుగాంధారి యెట్టులుండెను? అటులు మాపితామహులు రాజ్యము వడసి యెంతకాలము పాలించిరి? అదియెల్ల నాకెఱిఁగింపుము."

అది విని వైశంపాయనుఁడు, "ఓజనమేజయా! మహాత్ములగు పాండవులు వైరులను వధించి, ప్రాప్తరాజ్యులై యాధృతరాష్ట్రునిఁ బురస్కరించికొని రాజ్యమును బాలింపఁదొడంగిరి. ఓకురూత్తమా! విదురసంజయులును, యుయుత్సుఁడును, నాయాంబికేయుని సమీపించియుండిరి. పాండవులు పనులనెల్ల నయ్యృధిష్ఠిరు నడిగియే చేయుచుండెడివారు. అటు లాతనినెలవు వడసి పదునైదువత్సరములు పాలించిరి. ఆవీరు లెల్లపుడును, నయ్యాంబికేయుని సేవించుచు నాతనిపాదములకు మ్రొక్కుచు ధర్మరాజు సమ్మతిని గొని ప్రవర్తించెడివారు.

భోజపుత్త్రియగుకుంతి, యాగాంధారి ననువర్తించి ప్రవర్తింపసాగెను. అటులే ద్రౌపదియు, సుభద్రయు, మఱియుఁ గలపాండవస్త్రీలును, నాకుంతీగాంధారులను సమముగాఁ గాంచి ప్రవర్తించుచుండెడివారు. ధర్మజుఁడు రాజార్హములగు శయనములను, వస్త్రములను, నాభరణములను, మఱియు మహార్హములగు భక్ష్యభోజ్యములను ధృతరాష్ట్రునకు సమర్పించుచు వచ్చెను. అటులే కుంతియు గాంధారియెడఁ బూజ్యభావము గలిగి వర్తించెను. హతపుత్త్రుఁడై యున్న యాయాంబికేయు నావిదురసంజయయుయుత్సులును, ద్రోణునకు భావయగుకృపుఁడును ననుసరించుచుఁ బ్రవర్తింపసాగిరి. భగవానుఁడగు వ్యాసుఁడు నిత్యమును సమీపించి, దేవర్షులయుఁ, బితరులయు, రక్షస్సులయుఁ గథలను దెలుపుచు నుండెడివాఁడు. ధర్మయుక్తములును వ్యవహారాన్వితములునగు కార్యములను, విదురుఁ డాధృతరాష్ట్రు ననుజ్ఞవడసి చేయించుచు నుండెడివాఁడు. సామంతులనుండి యుధిష్ఠిరునకు జరగవలసిన పెక్కుకార్యములు విదురుని వినయమువలన సులభముగాఁ బొందఁబడుచుండెడివి. మఱియు నాసమయమునఁ గారాగృహవాసులను వధ్యులను నతఁడే విడుచుచుండెడివాఁడు. ఏవిషయమునను యుధిష్ఠిరుఁ డాయాంబికేయునిమాట కెదురు వలుకకుండెడివాఁడు. మఱియు నయ్యుధిష్ఠిరుఁడు, ధృతరాష్ట్రునకు విహారయాత్రాదులందు వలయుకోర్కులన్నియుఁ దీర్చుచుండెడివాఁడు. ఆరాళికులు, సూపకారులు, రాగఖాండవికులును నెప్పటిచొప్పున ధృతరాష్ట్రుని సమీపించి స్వవిషయముల మనవిచేసికొనుచుండెడివారు. మహార్హములగు వస్త్రములను, వివిధములగు మాల్యములను ధృతరాష్ట్రునకుఁ బాండవులు యథాన్యాయముగా సమర్పించుచుండెడివారు. మఱియు మైరేయమత్స్యమాంసములును బానకములును మధువులును, జిత్రములగు భక్ష్యవికారములు నాతని కప్పాండవులు సమర్పించుచుండెడివారు. మఱికొందఱు భూపాలకులును, నాధృతరాష్ట్రునిఁ జేరి సేవించుచుండెడివారు. కుంతియు, ద్రౌపదియు, సుభద్రయు, నులూపియుఁ, జిత్రాంగదయు మఱియుఁ గలభరతకాంతలును, గాంధారిని సమీపించి సేవించుచుండెడివారు. ఆగాంధారీధృతరాష్ట్రు లెట్లు పుత్త్రవియోగదుఃఖమును దలంపకుందురో యటుల

పాండవులు ప్రవర్తిల్లిరి. తమయన్నయానతిచొప్పునఁ దక్కినవారెల్ల రను ధృతరాష్ట్రునెడ విశేషవినయమెలయఁ బ్రవర్తించుచుండెడివారు గాని, భీముఁడు మాత్రము దుర్యోధనమూలకమగు ధృతరాష్ట్రుని దుర్వృత్తమును దలంచి, యది యొకహృదయశల్యముగా భావించు చుండెడివాఁడు." అని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

"ఓజనమేజయా! ఇటు లాయాంబికేయుఁ డప్పాండవులచేఁ బూజితుఁడగుచు వెనుకటివలెనే మహర్షులచే గౌరవింపఁబడుచు, బ్రాహ్మణోత్తముల కగ్రహారముల నొసంగెను. అటు లతఁ డొసర్చిన దానముల కెల్ల నయ్యుధిష్ఠిరుఁ డంగీకరించుచు వచ్చెను. మఱియు నయ్యుధిష్ఠిరుఁడు కనికరము వెలయఁ దనతమ్ములను మంత్రులను గాంచి, 'ఓయీ! నేనును మీరును నీయాంబికేయుని మన్నింపవలసియున్నది. మీ రాతనియాజ్ఞ ననువర్తింపుఁడు. అతఁడు నాకెంతయుఁ బ్రియుఁడు సుఁడీ! నా కీవిషయమున విరుద్ధముగా వర్తించువాఁడు, వైరియు, శిక్షార్హుఁడు నగుచున్నాఁడు' అని తెలిపెను అంత నాయాంబి కేయుఁడు తనపుత్త్రుల శ్రాద్ధకర్మమున, దినములు జరగుచుండఁగా, నర్హులగు బ్రాహ్మణులకు వివిధముగా విత్తముల నొసంగెను. ధర్మజ భీమార్జుననకులసహదేవు లేవురును నాధృతరాష్ట్రుఁడు సేయుదానము లకు సమ్మతించిరి. పుత్త్రపౌత్త్రమరణపీడితుఁడును, వృద్ధుఁడునునగు నాధృతరాష్ట్రుఁడు, తమవలనఁగలిగిన శోకముచే మరణింపక యెట్లు జీవించునో యనియే వారు చింతించుచువచ్చిరి. మఱియు, నాధృత రాష్ట్రునకుఁ బుత్త్రులున్న నెట్టిసుఖము గలుగునో యెట్టిభోగము లను భవింపఁబడునో యవియెల్ల నతఁ డనుభవింపవలయునని వారుద్దే శించుచువచ్చిరి. అటులగుటనే వారేవురుసోదరులును, నాధృతరాష్ట్ర నానతి మీఱక ప్రవర్తింపసాగిరి. శిష్యులు గురుని సేవించునట్లు తన యెడఁ గడువినయముగలిగి వర్తించు నప్పాండుపుత్త్రుల నాధృత రాష్ట్రుఁడు శిష్యులనుబోలెఁ బ్రవర్తిల్లఁజేయుచువచ్చెను. గాంధా రియుఁ దనతనయులకు వివిధములగు శ్రాద్ధకర్మములచే, ఋణము తీర్చు నదై బ్రాహ్మణులకు బహువిధములగు కామముల నీడేర్ప నారంభిం చెను. ఇట్లు ధర్మవంతులలో నుత్తముఁడగు ధర్మజుఁడు తనసోదరు లతోఁగూడ నయ్యాంబికేయు నారాధించెను. ఓజనమేజయా! ఆ

ధృతరాష్ట్రుఁడు ధర్మజునెడ నించుకేనప్రియమును గాంచమి, నాతని యందును, నాతనిసోదరులందును మిగులఁ బ్రియముగలిగియుండెను. సుబలపుత్రియగు గాంధారియుఁ, బుత్రశోకమును బరిత్యజించి యప్పాండవులందుఁ దనయులందుఁ బోలె నెంతయుఁ బ్రీతిగలిగియుండెను. విక్రమశాలియగు నయ్యుధిష్ఠిరుఁ డావైచిత్రవీర్యునెడఁ బ్రియములనేగాని యప్రియ మొకపుడును జేయుట లేదనుట యతిశయోక్తి గాదు. ఏయేవ్రతమున నాధృతరాష్ట్రుఁడుగాని, గాంధారిగాని కొంచెముగాని, గొప్పదిగాని కార్యము నుద్దేశించిన నద్దాని నాయుధిష్ఠిరుఁడు సగౌరవముగాఁ జేయుచు వచ్చెను. అటులగుట నాధర్మజుని సద్వృత్తమునకు సంతుష్టుఁడై, మందబుద్ధియగు తననందనుని స్మరించి పరితాపమెఱుఁగఁడయ్యెను. ఆయంబికాతనయుఁడు ప్రతిప్రాతఃకాలమందును లేచి జపముచేసికొని, పాండుపుత్రులకు సమరమునఁ బరాభవము గలుగ కుండవలయుననియే కోరుచువచ్చెడివాఁడు. మఱియు బ్రాహ్మణులచే స్వస్తి చెప్పించి యగ్ని నాహుతుల నారాధించి పాండుపుత్రులఁ బరమాయుర్వృద్ధిగలవారినిగాఁ గోరుచుండెడివాఁడు. పాండుపుత్రు లావిచిత్రవీర్యపుత్రునకు, నిజపుత్రులకంటె నధికముగు బ్రీతికిఁ బాత్రులగుచు వచ్చిరి. మఱియు నయ్యుధిష్ఠిరుఁడు, బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రుల కెంతయుఁ బ్రియుఁడై ప్రవర్తిల్లెను. నాఁడు సుయోధనాదులు తమకొనర్చిన యపకారము నించుకేనతఁడు తన మనమునందుంచక ధృతరాష్ట్రుననువర్తించుచుండెను. ఎవ్వఁడేని మానవుఁడయ్యంబికాతనయునెడ నప్రియ మాచరించినచో, వాఁ డాయుధిష్ఠిరునకు ద్వేష్యుఁ డగుచువచ్చెను. ఆయుధిష్ఠిరునివలని భయముచేఁ బ్రజలలో నెవఁడును ధృతరాష్ట్రునిఁగాని, సుయోధనుఁగాని, పాపకర్ముఁడని పలుక నిచ్ఛగింపఁడయ్యెను. ఓరాజా! అయ్యజాతశత్రుని ధైర్యమునకును, బ్రవృత్తికిని, నాధృతరాష్ట్రగాంధారీవిదురు లెంతయు సంతసమందుచు వచ్చిరిగాని, యాభీమునిచరిత్రము వారికిఁ దృప్తికరముగా నుండెడిదిగాదు. అంత నాభీముఁడును ధర్మజుని నిశ్చయము తెలిసికొని, ధృతరాష్ట్రునెడ దుర్మనస్కుఁడగుచు, మనసు తృప్తికొనలేకుండియు, ధర్మజు ననువర్తించుచుండెడివాఁడు." అని తెలిపివైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

## ధృతరాష్ట్రుఁడు వనమునకుఁ బోవ నెంచుట

"ఓజనమేజయా! ఆకౌరవరాష్ట్రమునందలి ప్రజలు భక్తివిషయమున యుధిష్ఠిరధృతరాష్ట్రుల నొక్కరీతిగాఁ బరికించుచుండెడివారు. ధృతరాష్ట్రుఁ డెప్పుడు దుర్మతియగు సుయోధనుని స్మరించెడివాఁడో, యప్పుడెల్ల భీమునిఁ గోపముతోఁ దలంచుచుండెడివాఁడు. అటులే భీముఁడును, నాధృతరాష్ట్రుని దుష్టునిఁగా భావించుచుండెడివాఁడు. అటులగుటనే భీముఁ డాయాంబికేయునకు రహస్యముగా, నప్రియములాచరించుచు, వంచకులగు సేవకులమూలమున, నాతని యాజ్ఞకుఁ బ్రతిబంధము గల్గించుచుండెడివాఁడు. మఱియు నాతని దురాలోచనను, మఱికొన్ని దుర్వృత్తములను స్మరించుచుఁ, దనమిత్రులమధ్యమున భుజములు చఱచి, "ఓస్నేహితులారా! గాంధారీధృతరాష్ట్రులయు, దుర్యోధనునియుఁ, గర్ణదుశ్శాసనులయుఁ జరిత్రము నాకెంతయుఁ గోప మొదవించుచున్నది. ఈయంధరాజుపుత్రు లెల్లరును, బరిఘమనఁదగు నాయీబాహువునకే బలిగా నొనర్పబడిరిసుఁడీ! ఈ నా రెండుభుజములనడుమఁబడిన యాధార్తరాష్ట్రు లొకగడియసేపేని బ్రతికిరా! ఈ నాబాహువులు పరిఘములు సుఁడీ! చందనార్హములైన యీనాభుజముల సహాయముననే సుయోధనుని సుతబాంధవసహితముగా సమయించితిని." అని సంరంభమడరఁ బలుకుచుండెడివాఁడు. ఓజనమేజయా! ఇవియు నిట్టివి మఱికొన్నియు, నాభీమునివచనములాధృతరాష్ట్రునకు హృదయశల్యములై నిర్వేదమును గల్గించెను. బుద్ధిమతియుఁ, గాలవిశేషజ్ఞయు, సకలధర్మములు దెలిసినదియునగు గాంధారి, యాభీముని యప్రియము లపుడపుడు చెవిని బడుటయు, నప్పటికిఁ బదునైదేండ్లు గడవ నిర్వేదమొందెను. ఆవృద్ధదంపతులటులు నిర్విణ్ణులగుచుండుటయు, భీముఁ డట్లు పలుకుచుండుటయు, నయ్యుధిష్ఠిరునకుఁ దెలియకుండెను. పార్థుఁడును నకులసహదేవులును, గుంతియు, ద్రౌపదియు నాధర్మజు ననువర్తించుచువచ్చిరి. మఱియు నావృద్ధునిచిత్తము నొవ్వకుండ నించుకే నప్రియము వలుకక వర్తించుచుండెడివారు. పిమ్మట నొకపుడు ధృతరాష్ట్రుఁడు తనమిత్రులతో సమ్మానపురస్సరముగా, "ఓహితులారా! ఇక్కురుక్షయ మెటులయ్యెనో యదియెల్ల మీకుఁ దెలిసినదియే. అవివేకముచే దానినెల్ల

నంగీకరించుట నాదొకతప్పు కాకపోదు. నేను బుద్ధిహీనుఁడనై దుర్మతియు, జ్ఞాతిభయవర్ధనుఁడునగు సుయోధనునకుఁ బట్టముగట్టితిని. అర్థవత్తరమగు వాసుదేవునివచన మాలింపనైతిని. పాపుఁడగువాఁడు సామాత్యముగా వధింపఁబడుఁగాక యని యతఁడు పలుక నేనంగీకరింపనైతిని. పండితులగు విదురుఁడును భీష్మద్రోణులును గృపుఁడును హితము తెలిపినను, బుత్రస్నేహతిరస్కృతుఁడనై వారిమాటలు విననైతిని. అటులే మహాత్ముఁడగు వ్యాసభగవానుఁడును, సంజయుఁడును, గాంధారియు, నెన్నియేనిమాఱులు తెలిపినను విననైతినిగదా యని యిపుడు పరితపించుచున్నాఁడను. మహాత్ములగు పాండునందనులు గుణవంతులైయున్నను వారికిఁ బితృపితామహులనుండియు వచ్చుచు వెలయుచున్న రాజ్యము నొసంగనైతిని. సకలక్షత్రియవినాశమును దెలిసికొని వాసుదేవుఁ డిదియే మేలని తలంచెను. శల్యభూతములై నావలన జరగిన యీయప్రియములన్నియు హృదయమునుండి తొలఁగకున్నయవి. మఱియు నిప్పుడునైదవవత్సరమున నిర్వేదము గలుగ దుర్మతినగు నేను నాపాపమును దొలఁగించుకొన నియమము పూనితిని. నియతముగాఁ జతుర్థకాలముననను, నొక్కొకప్పు డెనిమిదవకాలముననను, నాఁకలి తీఱుటకుమాత్రము భుజించువాఁడను. ఈవిషయము గాంధారికిఁ దెలియును. పరిజన మాయుధిష్ఠిరుని భయముచే, నన్నాహారము పరిగ్రహింపుమని ప్రార్థింతురు. అది తెలిసి యుధిష్ఠిరుఁడును బరితపించుచున్నవాఁడు. చర్మను గప్పికొని, జపనిష్ఠగలిగి దర్భలయందే శయనించుచున్నవాఁడను. యుద్ధమునఁ దనతనయులు నూర్వురును మడియుటను గాంధారియు నియమవ్యపదేశముచేఁ గృశించుచున్నయది. ఇదియెల్ల క్షత్రియధర్మమని నేనిందులకుఁ బరితపింపలేదు." అని పలికెను.

ఓజనమేజయా! అయ్యాంబికేయుఁ డట్లు పలికి, యుధిష్ఠిరునితో "ఓపుత్రకా! నీకు భద్రమగుఁగాక. నాదొకమాట గలదు. దాని నెఱిఁగించెదను వినుము. నీవు నన్ను లెస్సగాఁ బరిపాలింప నేను సుఖముగా నుంటిని. మహాదానము లెన్నియేని చేసితిని. నా పుత్రులకు మఱిమఱియు శ్రాద్ధములు నిర్వర్తించితిని. ఓకుమారా! అధికముగాఁ బ్రకృష్టసుకృతము నైతము నాచే నార్జింపఁబడియెను.

హతపుత్త్రయగు గాంధారియు, నించుక ధైర్యముగొని నావైపు చూచుచున్నయది. ద్రౌపది కపకర్తలును, నీయైశ్వర్యములు, నపహరించినవారు నగు క్రూరులు నాకుమారులు, నిజక్షత్త్రియధర్మ మూని యుద్ధహతులై గతించిరి. వారును యుద్ధముఖులుగాక హతులగుట, ధనుర్ధరులకగు నుత్తమలోకములకుఁ బోయిరి. వారికిఁక నావలనఁ గలుగునదేమియు లేదు. ఇఁక నాకు హితముగూర్చునట్టి సుకృతము సంపాదించుకొనఁ దగియున్నది. కావున నాకును నీతల్లియగు గాంధారికిని ననుజ్ఞయొసంగుము. నీవు ధర్మతత్పరుఁడవును, ధర్మజ్ఞులలోఁ దొలుతటివాఁడవును, రాజవును నగుట, నిట్లు పలుకుచున్నవాఁడను. నీవు సమ్మతింతువే, నిఁక వనము నాశ్రయించువాఁడను. చీరవల్కలధారినై గాంధారిఁగూడి, వానప్రస్థ మాశ్రయించెదను. అందుండియే నీశ్రేయమును గోరి యాశీర్వదించుచుండుదును. ఓనాయనా! మనవంశమున జనించినవారికెల్ల నిది యుచితమెగదా! ఓరాజా! వార్ధకమునఁ బుత్త్రులపై రాజ్యభారముంచి వనమునకుఁ బోవుట కర్తవ్యాంశముగాదె? అవ్వనమున నేను వాయుభక్షుఁడనై గాని, నిరాహారుఁడనై గాని చరించుచు, నీ గాంధారితోఁగూడఁ దప మొనర్చికొనియెదను. తత్తపఃఫలపాత్త్రుఁడవు నీవగదా! దేశమునఁగల సత్కర్మములఫలాంశములకు రాజులెగదా భాజనులు. అటులే యితరులదుష్కర్మఫలమును వారి నాశ్రయించెడిని. అటులగుట నీశ్రేయమునకై నేఁ దప మొనర్చుకొనుచు వనమందుండుదును" అని తెలిపెను.

అది విని యుధిష్ఠిరుఁడు, తనముదుసలితండ్రి నారసి "ఓరాజా! నీవిటులు దుఃఖితుఁడవై యుండ, నాకీరాజ్యము సంతోషదాయకము గానేరదు. మిక్కిలి దుర్బుద్ధినై ప్రమాదపడి రాజ్యమును బాలింపనున్న నాజన్మ మెందులకు? దుఃఖార్తుఁడవై యుపవాసకార్శ్యమూని జితాహారుఁడవై క్షితిని శయనించు నిన్ను, నేనును నాసోదరులును నుపేక్షింతుమేని నిందాపాత్త్రులము గాకుందుమే? అక్కటా! గూఢబుద్ధివైన నీచే, మూఢబుద్ధినై నేను వంచితుఁడనైతిని. మున్నుగా నన్నెదియో విధమున నమ్మించి, యిట్టిదుఃఖ మొందువాఁడవా? నాకిఁక నీరాజ్యముతోఁ బనియేమి? భోగములతోఁ బ్రయోజనమేమి? యజ్ఞములచే నగు ఫలమేమి? మఖములచేనగు సుఖమేమి? ఓమహీ

పాలా! నీవు నావాఁడవై యుండియు, నిట్టిదుఃఖముల నొందుదేని నా రాజ్యము, నాయాత్మయుఁ బీడితములై నట్టివిగాఁ దెలిసికొనుచున్నాఁడను. ఓనరేశ్వరా! నీ యీవచనముచే నేను దుఃఖితుఁడనైతిని. మాకు నీవ తండ్రివి; నీవతల్లివి; నీవ గురుఁడవు. నీవిందు వసింపవేని మేమెట్టు లిందుండఁగలము? ఓనృపోత్తమా! ఈయుయుత్సుఁడు నీ కౌరసపుత్త్రుఁడుగదా! నేను నీకితరుఁడ నందువా? వీని కీరాజ్యమొసఁగుము. నేనే వనమునకుఁబోయెదను. నీవే రాజ్యము నీయుయుత్సునిఁబెట్టుకొని పాలింపుము. అపకీర్తిదగ్ధుఁడనై యున్న నన్ను మఱియు దహింపకుము. నీవే యీరాజ్యమునకు రాజవుగానిఁ నేనుగాను. రాజ్యవిషయమున నేను నీతరువాతివాఁడను. నాకుఁ బూజ్యుఁడవు ధర్మజ్ఞుఁడవు నగు నీవు వనమున కేఁగుదునన్న నేనెట్లు సమ్మతింతును? ఓయనఘా! సుయోధనునెడ నాకించుకేని కోపములేదు. అదియటులగు భవితవ్యముగాని వేఱొండుగాదు. మేమును దక్కినవారును నవివేకులమై యటులొనర్చితిమి. నీకు సుయోధనాదు లెటులో, యటులే మేమును నీకుఁ దనయులమెగదా! మాకు గాంధారియుఁ గుంతియు సమానలే యని నాయభిప్రాయము. ఓరాజేంద్రా! అట్టి నీవు నన్నిటులు పరిత్యజించి పోవుదేని, నిన్ననుసరించియే, నేనును వచ్చెదను. నాపై నొట్టు పెట్టుకొని చెప్పుచున్నాఁడను. చతుస్సముద్రముద్రితమగునిమ్మహీవలయము, బహుధనసంపూర్ణమయ్యు, నీవులేనిచో నాకది రుచింపదు ఇదియెల్ల నీయదియ ఇదె నీకుఁ దలవంచి మ్రొక్కుచున్నాఁడను. అనుగ్రహింపుము. ఓరాజేంద్రా! నీకు మేమధీనులమై యున్నవారము. నీవిఁక మనస్తాపము విడువుము. భవితవ్య మీవిట్టులొందితివని తలంచెదను. ఓతండ్రీ! నిన్ను నే సేవించుచు, నీమనస్తాపము దొలఁగించెదను" అని తెలిపెను.

అది విని యాధృతరాష్ట్రుఁడు, "ఓయుధిష్ఠిరా! తపశ్చరణమున నాకెంతయు సక్తిగలదు. మఱియు మనవంశమువారికి వననివాసమును నుచితము. ఓపుత్త్రకా! నేనిందుఁ జిరకాలముంటిని. నీవు నన్నుఁ జిరకాలము సేవించితివి. వృద్ధుఁడనగుట నావనవాసమునకు నీవు సమ్మతింపవచ్చును." అని పలికెను.

"ఓజనమేజయా! ఇటు లాధృతరాష్ట్రుఁడయ్యుధిష్ఠిరుతోఁ బలికి, కృతాంజలియై వడఁకుచు, నున్నవాతనితో, "ఓకుమారా! మహాత్ముఁడగుసంజయుని, మహారథుఁడగుకృపుని, నావెంట రా సమ్మతింపుము. నాచిత్తము పరితపించుచున్నది. మొంగము శోషిల్లుచున్నది. ముదుసలి నగుటను బలుమఱు మాటాడుటను నోరు నొచ్చుచున్నది." అని పలికి వృద్ధుఁడగు నాతఁడు, గతాసువట్టులు, చెంతనున్న గాంధారిపై నొరగెను. అటులు నిశ్చేతనునిమాడ్కిఁ బడిన కురువృద్ధు నారసి యాధర్మజుఁ డెంతయు సంతాపమొంది, "అక్కటా! ఏవాఁడు వేయియేనుగుల బలము కలిమి వెలయునని పలుకుదురో, యట్టి యీయాంబికేయుఁ డొకకాంత నాధారముగఁ జేసికొని గతాసువట్లు పడియున్నవాఁడు గదా! భీమసేను నాయసవిగ్రహ మెవ్వనిచేఁ బిండి గావింపఁ బడియెనో, యట్టిబలశాలి, యొకయబలయగు సుబలాత్మజ నాశ్రయించియున్నవాఁడు. ధర్మహీనుఁడనగు నేనెందులకు? ఛీ! నాబుద్ధి యేమిబుద్ధి? నాచదు వెందులకు? నామూలముననగదా! ఇతఁ డిట్టు లనుచితముగాఁ బుడమిఁబడియెను. ఇఁక నాతండ్రి యెట్టులుండునో యటులే, నేనును నిరాహారుఁడనై యుండెదను. ఈగాంధారియు, నీరాజును భుజింపరేని, నేనును భుజింపను" అని నిశ్చయించికొనియెను.

ఓజనమేజయా! పిమ్మట నయ్యుధిష్ఠిరుఁడు చల్లఁదనముగల తన పాణితలముచే నాధృతరాష్ట్రునివక్షమును ముఖమును దడవి తుడిచెను. అటులు, రత్నౌషధిసమన్వితమును, సుగంధబంధురమును, బవిత్రము నగు పాణితలముస్పర్శముచే నాయాంబికేయునకుఁ జైతన్యము గలుగ "ఓవత్సా! యుధిష్ఠిరా! మఱియు నీశీతలహస్తములచే స్పృశింపుము. నాయనా! కౌఁగిలింపుము. ఓరాజీవలోచనా! నీపాణిస్పర్శముచే జీవము గలిగినట్టులయ్యెడిని? ఓతండ్రీ! నీతలను మూర్కొనఁ గోరుచున్నవాఁడను. నీపాణిస్పర్శము నాకెంతయు సంతసముగలిగించెడిని. ఇది యెనిమిదవకాలమగుట నా కాహారసమయము. ఓకురుశార్దూలా! నేనిపుడు కదలనైనఁజాలకున్నాఁడను. మఱిమఱియు నిన్ను సమ్మతికై కోరి యలసి యిట్లు నష్టచేష్టుఁడనైతిని. మఱియు నమృతరసతుల్యమగు నీహస్తస్పర్శముచే నుజ్జీవితుఁడనైతినని తలంచుచున్నాఁడను" అని పలికెను.

ఓజనమేజయా! తనపెదతండ్రి యిట్లు పలుకుటయుఁ, బ్రేమ పెచ్చుపెరుగ నాధర్మజుఁడు మెల్లగ నాతనిమేనెల్లఁ దడవుచువచ్చెను. పిమ్మట నాధృతరాష్ట్రుఁడు ప్రాణములు తెప్పిరిల, బాహులతో నాతనిఁ బట్టికొని, మూర్ధాఘ్రాణ మొనర్చెను అపుడు విదురుఁడు మున్నగువా రెంతయు దుఃఖితులై యేడ్వసాగిరి. అటులు పరమదుఃఖపరులై యుధిష్ఠిరునితోఁ బలుకలేకుండిరి. ధర్మజ్ఞయగుగాంధారి, యెంతయు ధైర్యము తెచ్చికొని దుఃఖము నాపికొనుచు ధృతరాష్ట్రునితో "నాథా! నీవిటు లుండరా"దని పలికెను. మఱియును గుంతి మున్నగు కాంతలందఱును, సంతప్తహృదయలై కనుల నీళులు చిప్పిల నాగాంధారిని జుట్టుకొని యుండిరి. పిమ్మట నాధృతరాష్ట్రుఁడు మఱియు నయ్యుధిష్ఠిరునితో "ఓధర్మరాజా! తపశ్చరణమునకు సమ్మతింపుము. నామన మెంతయు ఖిన్నమగుచున్నది. మఱిమఱియు నిటులు మాటలాడించి నాకుఁ గ్లేశము గలిగింపకుము" అని పలికెను. అటు లాకురురాజు పలుక నందుఁగల యెల్లవారిలో గొప్పయార్తనాదము జనించెను. అటు లగుట కనర్హుఁడును, వివర్ణుఁడును, గృశుఁడును, నుపవాసపరిశ్రాంతుఁడు, నెమ్ముకలుమాత్రము మిగిలినదేహముగలవాఁడునగు తండ్రిని, మహాప్రభునిఁ గౌఁగిలించికొని, ధర్మజుఁడు శోకాతిరేకముచేఁ బొడము కన్నీళులు గాల్వలుగట్ట నాతనితో "ఓనాయనా! నీప్రియమునెడ నాకుఁగలకోరికి, నాజీవితముపైఁగాని, రాజ్యముపైఁగాని లేదు. నేను నీకనుగ్రాహ్యుఁడనగు ప్రియుఁడనేని, మున్నుగా నీయాహారము గొనుము. పిమ్మట నేమేని యాలోచింపవచ్చును." అని పలుకుటయు, మహాతేజుఁడగు ధృతరాష్ట్రుఁడు, ధర్మజు నారసి, "ఓపుత్త్రకా! నీవు నావనవాసమునకు సమ్మతింతువేని భుజించెదను." అని పలుకుచుండఁగనే యందులకు వ్యాసభగవానుఁ డరుదెంచి యిట్లు తెలిపెను.

### ధృతరాష్ట్రునివనవాసమును వ్యాసుఁడు సమ్మతించి పలుకుట

"ఓయుధిష్ఠిరా! మహాతేజుఁడగు నీధృతరాష్ట్రుఁ డేమి పలికెనో, యద్దాని కీవు సమ్మతింపుము. ఈనృపతి వృద్ధుఁడు. మఱియు హతసుతుఁడై యున్నవాఁడు. ఇట్టి కష్టములకుఁ బాలై యితఁ డిందుఁ జరింపఁజాలఁడని నాయభిప్రాయము. ప్రాజ్ఞయు, మహాభాగయునగు గాంధా

రియు దుఃఖము నాపికొని, ధైర్య మెట్లెట్టులో తెచ్చుకొనుచున్నది. నేనొకమాట తెలిపెదను. నీవిద్దాని నాదరింపుము. ఈధృతరాష్ట్రున కనుజ్ఞ నిమ్ము. ఇతఁ డిట్టులుండి వ్యర్థముగా గృహమున మరణింపనేటికి ? ఇతఁడు పురాణ రాజర్షులగతిని బూనుఁగాక. ఉత్తమ రాజర్షులకుఁ దమ వార్ధకమున వనవాసమగదా శ్రేయస్కరము " అని తెలిపెను. అద్భుత కర్ముఁడగు వ్యాసుఁ డిట్లు పలుక విని మహాతేజుఁడగు నయ్యుధిష్ఠిరుఁ డాతనితో "ఓమహనీయా! నీవ మాకు మాన్యుఁడవు. నీవ మాకు గురుఁడవు. భగవానుఁడవగు నీవ మారాజ్యమునకును మావంశము నకును బరాయణమవు. నే నీతనికిఁ బుత్త్రుఁడను. ఇతఁడు నాకుఁ దండ్రియు, గురుఁడును, రాజునై యుండుట నీతనియానతి ననువర్తింప వలయును." అని పలికెను. అట్లితఁడు తెలుపుటయు, వేదవేత్తయగు నావ్యాసభగవానుఁడు మఱియు నాతనితో "ఓయుధిష్ఠిరా! నీవన్నది నిజము. వృద్ధుఁడగు నీరాజు పరమప్రమాణముగాఁ బరికింపఁదగిన వాఁడు. ఈతనిమతము నాకు సమ్మతమైనది. నీవును దీని ననుమతింతువే నితఁ డిద్దాని నొనర్చును. ఇందులకు విఘ్న మొనర్పకుము. ఓయుధి ష్ఠిరా! రాజర్షుల కిది పరమధర్మము. క్షత్త్రియుఁడు సమరముననేని మడియవలయు. విధ్యుక్తముగా వనముననేని మృతినొందనలయును. నీతండ్రియగు పాండురాజు, శిష్యుఁడు గురువునట్లు లెంతయుఁ బ్రీతి మెయి నీతని సేవించినవాఁడు. రత్నపర్వతములట్టులు వెలయుచుఁ, దగుదక్షిణలతోఁ బెక్కుయాగము లీతనిచే యజింపఁబడియెను. భూమి యనుభవింపఁబడియెను. ప్రజలు పాలింపఁబడిరి. నీవు వనవాసా జ్ఞాతవాసములలో నుండునపుడు, పుత్త్రులపైనుంచి విపులమగు రాజ్యము నెల్ల నితఁడు పదుమూఁడేండ్లు పాలించెను. వివిధమగువిత్తము నొసం గెను. ఓయనఘా! నీవును నీతనికి గురుశుశ్రూషచేసి నీభృత్యులచేఁ గూడ నెట్టిలోపము గలుగకుండఁ జేయుంచితివి. యశస్వినియగు గాంధారియు నారాధింపఁబడియెను. ఇతఁడు తపోవిధి నొనర్పఁదగు సమయమగుట నీతనియుద్దేశమును సమ్మతింపుము. ఓయుధిష్ఠిరా! ఈ విషయమున నీతని కించుకేని కోపము లేదు." అని పలికెను.

ఓజనమేజయా! ఇటులు తెలిపి యావ్యాసభగవానుఁ డందుల కా యుధిష్ఠిరుని సమ్మతింపఁజేసి, యాతనిచే "తథాస్తు" అనిపించి

కొని వెడలుటయు, నాధర్మజుఁడును, వృద్ధుఁడగుతండ్రి కానతుఁడై మెల్లమెల్లగా, "ఓతండ్రీ! భగవానుఁడగువ్యాసుఁడు నీయభిమతము నేమి తెలిపెనో, మఱియు విదురకృపు లేమి తెలిపిరో, యద్దాని నేనంగీకరించెదను. దానికి సంజయయుయుత్సులును సమ్మతింతురు. వీరెల్లరును మావంశము హితముగోరువారును మాకు మాన్యులు నగుచున్నారు. ఓతండ్రీ! అయినను నిన్నొకటికోరి మ్రొక్కుచున్నాఁడను. మున్నుగా నాహారము తీసికొనుము, పిదప వనమునకు వెడలుదువుగాక" అని పలికెనని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

## ధృతరాష్ట్రునివనయనమునకు యుధిష్ఠిరుఁ డొప్పుకొనుట

"ఓజనమేజయా! అనంతర మాయాంబికేయుఁ డాయుధిష్ఠిరుని సమ్మతిపడసి, గాంధారితోఁగూడ నిజభవనమునకు వెడలెను. ధీమంతుఁడగు నాధృతరాష్ట్రుఁడు మందబలుఁడగుచు, నతికష్టముగా నడుగులిడుచు నమ్మహీపాలుఁడు ముసలియేనుఁగట్టులు పోవుచుండ విదుర సంజయులును గృపుఁడును నాతని వెంబడించి వెడలిరి. ఓజనమేజయా! అపు డాధృతరాష్ట్రుఁడు మున్నుగా బ్రాహ్మణుల నారాధించి, పిదపఁ దాను భుజించెను. ధర్మజ్ఞయగు గాంధారియుఁ గోండలు కాంతలు తన్ను గౌరవింపఁ గుంతితోఁగూడ నాహారము దీసికొనియెను. పిమ్మట విదురాదులును బాండవులును భుజించి, కృతాహారుఁడై యున్న యావృద్ధభూపతిని సమీపించిరి. అపు డాధృతరాష్ట్రుఁడు యుధిష్ఠిరుని సమీపించి, తనకేల నాతని వీపు నిమురుచు, రహస్యముగా "ఓధర్మజా! అష్టాంగమై ధర్మపురస్కృతమగు రాజ్యమున నెల్లవిధముల నెట్టి ప్రమాదము గలుగకుండ నెల్లపుడు వర్తింపవలయు. శక్యమగునంతవఱకు రాజ్యమును ధర్మముగనే పాలింపవలయును. నీవు విద్వాంసుఁడవగుట నద్దానిని దెలిసికొనుము. ఓయుధిష్ఠిరా! విద్యావృద్ధులను సేవింపుము. వారేమి తెలుపుదురో యద్దాని నాలోచింపక చేయుచుండుము. ఓరాజా! నీవు ప్రాతఃకాలముననలేచి యథావిధిగా వారిని బూజించి, కార్యకాలము సమీపించునపు డద్దానిని వారి కెఱిఁగించుచుండవలయును. ఓరాజా! కార్యహితము నపేక్షించు నీచే వారు సమ్మానితులై నీకు హిత ముపదేశింతురు. ఇంద్రియములనెల్ల గుఱ్ఱము

లనుబోలె శిక్షించి నీవశ మొనర్చుకొనవలయుఁజనమా! అటులు శిక్షితములై యార్జించినద్రవ్యమట్లు నీహితమును గూర్చెడిని. వంచనాశూన్యులును, పితృపితామహులనుండి వచ్చుచుండెడివారును బరిశుద్ధమానసులును, దాంతులు, పవిత్రులు కర్మకుశలులు నగువారిని మంత్రులగాఁజేసి రాజ్యమును బాలింపుము. వైరులకుఁ దెలియకుండ నీచారులను జరింపఁజేయుము. వారు పరీక్షితులును, స్వరాష్ట్రప్రతివాసులునై యుండవలయును. నీపురము దృఢప్రాకారతోరణమై మిగుల గుప్తమై, యట్టాట్టాలకసంకులమై నలుదెసల నాలుత్రోవలు గలిగి యుండవలయును. దానిద్వారములన్నియుఁ బర్యాప్తములును, విశాలములై యెల్లయెడల విభాగముగలిగి, బహువిధములగు యత్నములచే రక్షితములగుచు నుండవలయును. కులశీలములనుబట్టి నీకుఁ దెలిసినవారే నీకు భోజనాదులందు రక్షకులై యుండవలయును. విహారాహారకాలములయందును. మాల్యశయ్యాసనములయెడను, స్త్రీలు, వృద్ధులు నాప్తులు నగువారిచే రక్షింపఁబడవలయును. ఓయుధిష్ఠిరా! సుశీలురును, సద్వంశజులును, విద్వాంసులు నగువారు స్త్రీలకు రక్షకులై యుండవలయును. విద్యావిశారదులగు బ్రాహ్మణులును మంత్రులనుగాఁ జేసికొనవలయును. మఱియు వారు వినీతులును, కులీనులును, ధర్మార్థకుశలులును, ఋజుబుద్ధులును నై యుండవలయును. అట్టివారితోడనే యాలోచింపవలయును. పెక్కురఁగూడి మిక్కిలి యాలోచింపరాదు. రహస్యమగుమంత్రగృహమును బ్రవేశించి, యందఱితోఁగూడియు, నొక్కొక్కరిని గలిసియుఁ జింతింపవలయును. అరణ్యమందుఁగాని, శలాకారహితమగు గృహమందుఁగాని, మంత్రమును జింతింపవలయును. రాత్రి మంత్రము చేయరాదు. మంత్రగృహమున, వానరములు, మనుష్యులపరిచయముగల శుకాదిపక్షులును, జడులు, పంగులు, నుండరాదు. రాజులమంత్రము చెడినప్పుడు గలుగుదోషములను సరిపెట్టుట కెట్లును వీలుపడదని నాయభిప్రాయము. మంత్రభేదమువలనఁ గలుగుదోషములను మంత్రమండలమునఁ దెలుపుచుండవలయును. అది చెడకుండుటవలనఁ గల్గుగుణములను మఱిమఱియుఁ దెలుపుచుండవలయును. అటులే పౌరజానపదుల శౌచాశౌచముల నెంతయుఁ దెలిసికొనుచుండవలయును. వ్యవహారమాప్తులగువారిచే

నిత్యము నధిష్ఠింపఁబడియుండవలయును. హితులు, తుష్టులు నగువారే చారులై యుండుట మేలు. శిక్షార్హులగువారిని దోషపరిమాణమును బట్టి దండించుచుండవలయును. నీయుద్యోగులు న్యాయముగా రాజ్యతంత్రముల నడుపుచుండవలయును. నీసేవకులలో, లంచము గోరువారును, బరదారాబలత్కారబుద్ధులును, నుగ్రదండకరులును, ననృతవాదులును, దయారహితులును, లుబ్ధులును, దొంగలును, సాహసప్రియులును, సభావిహారభేదకులును, వర్ణదూషకులును నుందురేని, వారిని దేశకాలములను బట్టి, హిరణ్యముచేఁగాని, వధచేసిగాని శిక్షింపవలయును. నీకెవ్వరు ప్రియమొనర్తురో, వారిని బ్రాతఃకాలముననే చూడుము. పిమ్మట నలంకరించికొని భుజింపవలయును. పిమ్మట యోధులతో నుత్సాహకరముగా సంభాషించుచుఁ గనుఁగొనవలయును. దూతలనుండియుఁ, జారులనుండియు నీకు దోషము సంభవించుచుండును. నీకార్యార్థనిర్ణయము నిత్యము నపరరాత్రమునంతముఁ గావింపఁబడుచుండవలయును. మధ్యాహ్నము మధ్యరాత్రమును నీకు విశ్రాంతిసమయములు తక్కిన కాలములన్నియు గార్యమున కుపకరించునవియే. అటులే యుక్తకాలమున నలంకృతుఁడై భూరిదక్షిణలు గలిగి రాజు ప్రవర్తింపవలయును. కార్యములు చక్రమువలెఁ దిరిగి వచ్చుచుండునుగదా! న్యాయము దప్పక, కోశసంగ్రమునుగూర్చి యత్న మొనర్పవలయును. వివిధవైపరీత్యమును విడుచుకొనుచుండవలయును. ఇతర రాజమండలములకుఁ బోవుచు వచ్చుచారులవలన వైరులను దెలిసికొని, యాప్తులగువారిమూలమున వారిని వధించుచుండవలయును. పిదప నట్టిభృత్యులకోర్కులఁ దీర్పవలయును. యుక్తులు, నయుక్తులునగు నధికారులచేఁ బనులఁ జేయించుకొనుచుండవలయును. నీసేనానాయకుఁడు దృఢవ్రతుఁడై యుండవలయును మఱియు నతఁడు, శూరుఁడును, క్లేశములకోర్చువాఁడును, హితుఁడును, భక్తుఁడును గావలయును. కృత్యములకుఁదగు నీజనపదములన్నియు గోరాసభాదియుక్తములై యుండవలయును. ఓయుధిష్ఠిరా! తమయందును నితరులందును గలలోపములను నిత్యము గనిపట్టుచుండవలయును. నిజదేశజాతులగుపురుషులు తమతమకర్మములందు విక్రమించి వచ్చినపుడు వారి ననుగ్రహింపవలయును. వివేకియగువాఁడు గుణార్థుల గుణమును

దెలిసికొని వారిని స్థిరముగా నిలుపవలయును" అని యుపదేశించిఁ మఱియు నిట్లనియె.

—— ధృతరాష్ట్రుఁడు రాజధర్మముల నుపదేశించుట ——

"ఓధర్మజా! శత్రులయొక్కయు, దనయొక్కయు, నుదాసీనులయొక్కయు, మధ్యస్థులయొక్కయు మండలములవిధము తెలిసికొనుచుండవలయును. మఱియు మిత్రమండలములను దెలిసికొనుచుండవలయును. అటులే వారియమాత్యులయు, దుర్గములయు, జనపదములయు, వివిధములగు సైన్యములయు విధము నెఱుంగవలయు. ఆమండలములు పండ్రెండువిధములు. మఱియు వీనిలో విశేషములు గలవు. ఓయుధిష్ఠిరా! సంధివిగ్రహాదిషాడ్గుణ్యమును, వృద్ధిక్షయస్థానములను దెలిసికొనుచుండవలయును. ఓకౌంతేయా! నిజపక్షబలమును వైరిపక్షక్షీణత్వమును బరికించి శత్రుని జయింపవలెను. ఎపుడు వైరులు బలవంతులుగను, స్వపక్షము బలహీనముగను నుండునో యపుడు శత్రులతో సంధిని గావింపవలయును. ఎపుడు యుద్ధసామగ్రులుగలిగి సమర్థుఁడై యుండునో యపుడు రాజు యుద్ధయానము గావింపవలయు. అటులు యానముగావించి యొకచో నిలిచి, విచారించి విరోధి బలిష్ఠుఁడైనచో నల్పఫలభూమి నొసఁగి వానితో సంధింపవలయును. వైరియే సారహీనుఁడైనచో వానివలనఁ గుప్యభూయిష్ఠమగు హిరణ్యమును దీసికొని సంధి నేయవలయును. సంధివిషయమున వెడలినవానిపుత్రునిఁ గోరి, దనయొద్దనుంచుకొనవలయును. అటులు సేయఁడేని యాపదల పాలుగాక తప్పదు ఒకపు డాపద సంభవించినను దానిని దప్పింపఁ బ్రయత్నింపవలయును. రాజు తనప్రజలను, దీనులగుజడాంధాదులను జక్కగాఁ బరిశీలింపవలయును. మఱియు రాజు క్రమముగా మహాబలుఁడై యొక్కమా టెంతయేని ప్రయత్న మొనరించి, నిజరాజ్యరక్షణ మొనర్చికొనుచు, వైరిని గలదకుండఁ జేసి పీడించి కోశభంగ మొనర్చి జయ మొందవలయును. వృద్ధినిగోరి పుడమిని జయింపఁదలంచినవాఁడు తన్నుఁ జేరినవారిని హింసింపరాదు. గణములను భేదించుటలో నుపాయమును మంత్రులతోఁ గూడి యాలోచింపవలయును. బలవంతుఁడగువాఁ డెల్లప్పుడును, సజ్జనుల సంగ్రహించుచు, దుర్జనుల

నిగ్రహించుచు, బలహీనులను దండెత్తి వధింపరాదు. బలవంతుఁడు దుర్బలునిపై వెడలినపుడు, వాఁడు వైతసవృత్తినాశ్రయింపవలయును. అటు లా దుర్బలుఁడు వినయమూని సామాద్యుపాయములచే బలవంతుని మరలింపవలయును. బలహీనుఁడైన రాజు యుద్ధమునకుఁ జాలఁడేని మంత్రులతోఁగూడఁ దమకుఁ బ్రియ మొనర్చువారి నాశ్రయింపఁ బోవలయును.” అని తెలిపి మఱియు నిట్లనియె.

## ధృతరాష్ట్రుని నీతి కథనము

“ఓయుధిష్ఠిరా! బలవంతునితో సంధియు దుర్బలునితో విరోధము నొనర్పవలయును. స్థిరచిత్తుఁడై తనబలాబలములను దెలిసికొని శత్రునిసమీపించుటయు విడుచుటయు నొనర్పవలయును. వైరిని సమీపించునప్పటికి వాఁడు తుష్టపుష్టసైన్యములుగలవాఁడని తోఁచినచో, వానిని విడిచి వేఱొకనిపైఁ బోవలయును. శత్రువుసమృద్ధముగానున్న యపుడు వానిని సమీపించి వానికి వ్యసనభేదనము లొనర్పవలయును. మఱియు వానికి వెఱపుగొలిపి, వానిని బీడించి బలక్షయము గావింపవలయును. వైరిపై దండెత్తఁ దలంచినరాజు, తనయొక్కయు వైరియొక్కయు శక్తిని బరిశీలించి, ప్రభుమంత్రోత్సాహసంపన్నుఁడై వెడలవలయును. వైరి ప్రబలుఁడేని ప్రయాణముసేయరాదు. మఱియు రాజగువాఁడు మూలబలమును, మిత్రబలమును, నాటవికబలమును, భృతకబలమును, శ్రేణీబలమును సంపాదింపవలయును. అట్టిసైన్యములలో మూలబలమిత్రబలము లుత్తమములైనవి. శ్రేణీభృతకబలములు రెండును దుల్యములు. అటులే యాచారబలములును బరస్పరము తుల్యములై యుండవలయును. రాజుల కాపదలు బహువిధములుగా వచ్చుచుండును. వానిని సంక్షేపించి తెలిపెదను వినుము. ఆయాపదల వికల్పములును బెక్కులై యుండును. వానిని సామాద్యుపాయములచే నివర్తింపఁజేసి కొనుచుండవలయును. మఱియు దేశకాలములను బట్టియు, నిజగుణములనుబట్టియు, సైన్యములనుబట్టియు యుద్ధయాత్రను జేయుచుండవలయును. అటులే తనవృద్ధిసమయమును గాంచి, బలిష్ఠుఁడై హృష్టపుష్టసైన్యుఁడై శత్రులపై దండెత్తవలయును. రాజు వైరుల నాశముసేడఁ, దూణపాషాణములును, హయరథప్రవా

హములును, ధ్వజద్రుమములును, భటసర్పములునుగల బహుకర్దమ నదిని బ్రవహింపఁజేయవలయును. యుద్ధసమయములందు శకట, పద్మ, వజ్రవ్యూహములను బన్నుచుండవలయును. శుక్రనీతిశాస్త్రమునఁ దెలుపఁబడినవిధముగా, నిజబలము దెలిసికొని, శత్రుబలమును గదల్ప వలయును. తనదేశమందుఁగాని, పరదేశమందుఁగాని యుద్ధముచేయ వచ్చును. నిజసైన్యమును బ్రసన్నముగా నొనర్చుచు నందు బలవంతులను నిలుపుచుండవలయును. నిజవిషయమును దెలిసికొని సామాద్యుపాయముల నారంభింపవలయును. ఓయుధిష్ఠిరా! ఎల్లవిధములను శరీరమును గాపాడుకొనవలయును. తాను మృతినొందినపిమ్మట నొందఁదగు శ్రేయము నాచరించుకొనవలయును. ఇటులు ప్రవర్తించినమహారాజు ప్రజలను బాలించి సుఖపడి స్వర్గమునొందుచున్నాఁడు. ఓరాజా! నీవును నుభయలోకప్రాప్తికై నాచెప్పినచొప్పున వర్తింపుము. ఈవిషయమును నీ వాభీష్మునివలనను, విదురునివలనను, శ్రీకృష్ణభగవానునివలనను వినియున్నాఁడవు. అయినను నీయెడఁగలప్రీతిచే నేనును జెప్పవలసి చెప్పితిని. నా తెలిపినవిధముగా న్యాయమనుసరించి వర్తింపుము. అటులు ప్రజలకుఁ బ్రియమొనర్చుచుఁ బాలింతువేని స్వర్గసౌఖ్యమందుదువు. పృథివీపతి యశ్వమేధయాగమే నొనర్పవలయును; ధర్మయుక్తముగాఁ బ్రజలనేని పాలింపవలయును. ఆరెండును సమఫలములై వెలయుచున్నవి." అని తెలుప విని యుధిష్ఠిరుఁ డిట్లనియె.

### యుధిష్ఠిరధృతరాష్ట్రసంభాషణము

"ఓనాయనా! నీయానతిచొప్పున వర్తించెదను. మఱియు నన్నుశాసింపుము ఆభీష్ముఁడు స్వర్గతుఁడయ్యెనుగదా! శ్రీకృష్ణుఁడు ద్వారకకుఁబోయెను. ఇఁక నీవును విదురసంజయులునుదక్క వేఱొక్క రెవ్వరు నాకు హిత ముపదేశించువారు? నాహితముగోరి నీవేమేమి తెలిపితివో, యదియెల్లఁ గావించువాఁడను. నీవు సంశయమొందక సుఖివై యుండుము."

ధీమంతుఁడగు నాధర్మజుఁ డిట్లు తెలుప విని ధృతరాష్ట్రుఁడు తన వనవాసప్రయాణమున కాతనిసమ్మతిని గోరువాఁడై "ఓపుత్రకా! ఇఁక నేఁబోవచ్చునుగదా! నీవు విశ్రమింపుము. నాకును మిక్కిలి శ్రమముగా

నున్నది." అని తెలిపి గాంధారితోఁగూడ నిజభవనమును బ్రవేశించెను. పిమ్మట నాసనగతుఁడై యున్న యాధృతరాష్ట్రునితోఁ గాలజ్ఞయు, ధర్మచారిణియునగు గాంధారి, "ఓమహాత్మా! నీ వావ్యాసభగవానునిచే ననుజ్ఞాతుఁడవైతివిగదా! యుధిష్ఠిరుఁడునైతము సమ్మతించెనుగాదే? ఇఁక నరణ్యమున కెప్పుడు పోయెదము?" అని ప్రశ్నించెను. అది విని యాధృతరాష్ట్రుఁడు, "ఓదేవీ! వ్యాసుఁడు మనకు సెలవిచ్చెను. ఇఁక ధర్మజునితో మఱియుఁ జెప్పి యాతని సమ్మతింపఁజేసి యచిరకాలమున వనమునకుఁ బోయెదను. దుర్ద్యూతక్రీడాపరులగు నాతనయుల ప్రేతకార్యమునకుఁగాఁదలఁచినధన మెల్ల దానముచేయుటకై సకలమంత్రుల పరముగా నాయింటనే యుంచి, పోయెదను." అని తెలిపెను.

ఓజనమేజయా! అధృతరాష్ట్రుఁ డిట్లు పలికి ధర్మజునకుఁ దన మనోనిశ్చయ మొకసేవకునిచే నెఱింగింప, నపు డాయుధిష్ఠిరుఁ డాధృతరాష్ట్రునకు వలయునవి యెల్ల సమకూర్ప నియమించెను. తద్వార్త యించుక ప్రకటితమగుడు, నాహాస్తిపురిఁగల బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులందఱును వచ్చియుండిరి. పిమ్మట నమ్మహీపతి యంతఃపురము నుండి వెడలి యందుఁ జేరియున్న వారినెల్ల నాగసి, మఱియు నానాదేశములనుండి వచ్చిన బ్రాహ్మణులను గాంచి "ఓయీ! మీరును నిక్కౌరవులును గలిసిమెలసి చిరకాలమునుండి స్నేహము వెలయ వర్తిల్లుచున్నారు. నేఁటి కొకటి మీకుఁ దెలుపుచున్నవాఁడను. మీరద్దానిని జింతింపక చేయవలయును. గాంధారితోఁగూడ నేనిపు డరణ్యమునకుఁ బోవఁదలంచియున్నవాఁడను. నా యీప్రయాణమునకు వ్యాసమహర్షియును, మాయుధిష్ఠిరుఁడును సమ్మతించిరి. మీరును నిందులకుఁ జింతింపక సమ్మతింతురని నమ్ముచున్నాఁడను. మనకుఁ బరస్పరముగల ప్రీతి శాశ్వతమైనదిగాదే? ఇతరదేశములందుఁ బ్రజలకును బ్రభువులకును నిట్టిప్రీతి పరస్పరముగల్గియుండదని నానిశ్చయము. ఓమహాజనులారా! వార్ధకముచేతను బుత్త్రవియోగముచేతను మిగుల నలసియున్న వాఁడను. ఓయనఘులారా! మఱియు నీగాంధారితో నుపవాసకృశుఁడనై యుంటిని. ఈరాజ్యము యుధిష్ఠిరునివశ మొనర్చి సుఖించెదను. ఈధర్మజునిప్రభుత్వ మాసుయోధనుప్రభుత్వముకంటె నుత్తమమని నానమ్మకము. ఓమహాభాగులారా! నేను వృద్ధుఁడను; అంధుఁడను.

అదియుఁగాక హతసుతుఁడను. నాకిఁక వనవాసముఁ దక్క వేఱొక్క గతియేది? కావున నా కానతిండు.” అని తెలిపెను. అది విని యక్కురు జాంగలదేశమువారందఱును, గద్గదకంఠస్వరములతో రోదనము సేయసాగిరి. అటు లేడ్చుచు నేమియు పలుకనున్న వారినెల్ల నారసి, మఱియు వారితో నతఁ డిట్లనియె.

ధృతరాష్ట్రుఁడు ప్రజలను దన ప్రయాణమునకు సమ్మతింపఁజేయుట

“ఓ ప్రజలారా! మున్ను శంతనుచక్రవర్తి యివ్వసుంధరనెల్లఁ బాలించెను. అటులే భీష్ముఁడును విచిత్రవీర్యుఁడు నిద్దానిని బాలించిరి. మఱియు మాతమ్ముఁడు పాండురాజు మిమ్ము నెమ్మిమైఁ బాలించుటలో సందియ మేమియు లేదుగదా! అతఁడు మీయెడఁ బ్రీతిగలిగి ప్రవర్తించెనుగాదే? నేనును మీకుఁ గొంతవఱకు శుశ్రూష యొనర్చితిని. అది యెటులుండెనో తెలియదు. అందుఁ దప్పుగలదేని క్షమింపుఁడు. మఱియు మాసుయోధనుఁడును, నీరాజ్యమును నిష్కంటకముగా ననుభవించెనుగాదే! వానిపాలనమున నేమే నపరాధము సేయలేదు గదా! దుర్బుద్ధియు నహంకారియు నగు వానిమూలమున క్షత్రియులకు గొప్పసమ్మర్దము జరిగెను. తద్విషయమున నాతప్పు గలిగినను గలుగవచ్చును. అది మీచిత్తముల నుంపకుఁడు. ఇదె మీకంజలి ఘటించుచున్నవాఁడను వృద్ధుఁడను, హతసుతుఁడను, దుఃఖితుఁడను నై యున్నాఁడను. మీపూర్వరాజులకుఁ బుత్త్రుఁడననియేనిఁ దలంపుఁడు. ఈగాంధారియు, వృద్ధయై హతపుత్త్రయై తపస్విని యై మిమ్ము గోరుచున్నయది. వృద్ధులమగు మేమిరువురమును దుఃఖితులమై యుండుట దెలిసి మాకనుజ్ఞ యొసంగుఁడు. ఇదె శరణమందుచున్నారము. కుంతీపుత్త్రుఁడగు నియ్యుధిష్ఠిరుఁ డిపుడు కౌరవాధీశుఁడు. కావున మీ రెల్ల నీతని సమవిషమావస్థలందు సరిగా నరయుచుండవలయును. ఈతనికి నలువురుసోదరులు మంత్రులై యున్నవారు. సకల ధర్మార్థవేత్తలగు వీరు లోకపాలతుల్యులు. భగవానుఁడగు పరమేష్ఠి వలె నియ్యుధిష్ఠిరుఁడు మహాతేజుఁడై మిమ్ముఁ బాలింపఁగలఁడు. ఇది తప్పక చెప్పవలసిన విషయమని చెప్పుచున్నాఁడను. ఓ ప్రజలారా! ఈ యుధిష్ఠిరుని మీయందఱకు న్యాసముగా నర్పించితిని. ఈవీరునకు

మీరును న్యాసముగా నాచే నొసఁగఁబడితిరి. నాయాతనయులుగాని, నావాఁడు మఱియెవఁడేనిఁగాని, యేదే నపరాధ మొనర్చినను మన్నించి యనుజ్ఞ యొసంగుఁడు. మీరేమేని యొనర్చినను నాకుఁ గోపమేమియుఁ గలుగదు. గురుభక్తులగు మీకిదె చేతులు మోడ్చుచున్నాఁడను. నేనును మాగాంధారియును, నస్థిరబుద్ధులును, లుబ్ధులును, గామచారులునగు నాకొమారులతప్పిదమును క్షమింప వేఁడుచున్నారము." అని పలుక విని పౌరులును, జానపదులును గన్నీళులు కాలువలుగా నొకరినొకరు చూచికొనసాగిరి." అని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

## పౌరులు ధృతరాష్ట్రుని ప్రయాణము సమ్మతించుట

"ఓజనమేజయా! ముసలిరాజిటులు పలుక విని పౌరులును జానపదులును జైతన్యము తప్పి యూరకుండిరి. అటులూరకున్న పౌరుల నారసి, యాధృతరాష్ట్రుఁడు మఱియు వారితో "ఓపౌరజానపదులారా! నేను వృద్ధుఁడను; హతపుత్రుఁడను; నాధర్మపత్నితోఁగూడఁ బరితపించుచున్నవాఁడను. మిగుల దీనుఁడనై యున్నవాఁడను. నా తండ్రియగు వ్యాసుఁడు నాకు సెలవొసంగెను. నావనవాసమున కీయుధిష్ఠిరుఁడును నెట్టకేలకు సమ్మతించెను. ఓయనఘులారా! మఱిమఱియు మీకిదె మ్రొక్కుచున్నవాఁడను. కావున గాంధారికిని నాకును వనవాసమున కనుజ్ఞయొసంగుఁడు." అని కోరెను. ఓజనమేజయా! అతిదీనములగు నాధృతరాష్ట్రునివచనము లాలించి, కురుజాంగలులగునందఱును గలిసి రోదనము సేయుచు, నుత్తరీయములతోఁ గొందఱును, హస్తములతోఁ గొందఱును మొగములఁ గప్పికొనిరి. అపుడు వారాధృతరాష్ట్రుని ప్రవాసమువలనఁ గలుగుదుఃఖముచే శూన్యహృదయులై తలిదండ్రులవియోగమునకుఁ బోలె నెంతయు సంతప్తులై యేడ్చిరి. అటులు కొంతవడి యేడ్చి నష్టచేతనులైనట్లుండియు నించుక ధైర్యముగొని, యాతని వియోగమువలనఁ గలుగుదుఃఖము నోర్చువారై యొకరితోనొకరు తమతమయభిప్రాయములను దెలుపుకొనుచు, వారందఱును గలిసి యొకబ్రాహ్మణుని దమనిశ్చయము నెఱిఁగింప నియోగించిరి. అతఁడు వేదవేదాంగవేత్తయు, నర్థవిశారదుఁడు నగుట

నేర్పు వెలయ, నాసభ్యులకు సంతసమగునట్లుగాఁ బ్రగల్భోక్తులతో "ఓరాజా! ఈజనమంతయుఁ దమయభిప్రాయము నాయందుంచుటను, వారిపక్షమున నేను గొంత మనవిచేయుచున్నాఁడను. దానిని దెలియుము. మఱియు నీవిపు డేమి తెలిపితివో యదియెల్ల నిక్కువము. ఇం దనృత మేమియు లేదు. మాకు నీవెంతయు మిత్త్రుఁడ వనఁదగి ప్రవర్తిల్లితివి. ఒకపుడును నీవంశపురాజులవలన నించుకేని మైత్త్రీలోపము గలుగలేదు. మీరందఱును మమ్ముఁ దండ్రులట్టులును భ్రాతలట్టులును బాలించితిరి. ఓరాజా! ఆసుయోధనుఁడును మాకేమియు నయుక్తమాచరింపలేదు. కాని ధర్మాత్ముఁడగు సాత్యవతేయుఁ డిది యుచితమని తెలుపుటచే నీ వాచరింపఁదగినదియే. అతఁడు మాకును బరమగురుఁడు. కాని నీవియోగము మాకెంతయు దుఃఖాస్పదమై యున్నయది. నీగుణగణములచేఁ దృప్తులమైయున్న మేము నిన్నువిడిచి చిరకాలమువఱకును సంతాపమొందక మానము. మహాశంతనుఁడును జిత్త్రాంగదుఁడును బరిపాలించిరి. భీష్ముని సాహాయ్యముచే నీతండ్రియగువిచిత్త్రవీర్యుఁడును బాలించెను. నీవు పరీక్షించుచుండఁ బాండురాజును మమ్ముఁ బరిపాలించెను. సుయోధనుఁడును మమ్ము సరిగనే పరిపాలించెను. ఓరాజా! నీతనయుఁడు, మాకించుకేని నష్టము చేయలేదు. ఆతనియెడ మేమందఱమును బుత్త్రభావముతోఁ బ్రవర్తించితిమి. ధీమంతుఁడగు కుంతీపుత్త్రుఁడు మమ్ము వేలకొలఁదివత్సరములు సుఖముగాఁ బాలించుఁగాక. మహాత్ముఁడగు నితఁడు, పుణ్యకర్ములును, బురాణరాజర్షులునగు, కురు, సంవరణులయు, భరతునియు సద్వృత్తము ననుసరించును. ఇఁక నిందుఁ జెప్పఁదగినది కొంచెమేనియు లేదు. నీపాలనమున సుఖితులమై యుండితిమి. నీపుత్త్రుఁడును మాయెడ సూక్ష్మమే నపచారము నేయలేదని చెప్పఁగలము. యుద్ధమునుబట్టి నీ వా సుయోధనునెడ నేమో పలికితివి. కాని దానినిగుఱించియు మేము తప్పులేదని చెప్పుచున్నారము. ఓరాజా! నీవుగాని, సుయోధనుఁడుగాని, కర్ణ సౌబలులుగాని, కురుక్షయమునకుఁ గారకులుగారు. అదియెల్ల దైవకృతము. దైవము నతిక్రమింప నేరికిని దరముగాదుగదా! పురుషకారము దైవము నెన్నఁడును దప్పింపఁజాలదు. ఓమహారాజా! ఆరణరంగమునఁ బదునెనిమిదక్షౌహిణులు చేరుటేమి? పదునెనిమిదిదినములలో నశించు

లేమి? అది దైవకృతము కాక వేఱేమగును? భీష్మద్రోణకృపకర్ణులుగాని, పాండవులుగాని, సాత్యకిధృష్టద్యుమ్నులుగాని, కురుక్షయ మొనర్ప లేదు. కేవలము దైవబలముచే నదియెల్ల సంభవించెను. ఏవానికిని యుద్ధమరణము శ్రేయము. మఱియు క్షత్రియునకు విశేషించి యది శ్రేయస్కరము. క్షత్రబంధు వెపుడేని సమయమువచ్చినపుడు యుద్ధమున మరణింపవలయును. విద్యాబాహుబలాఢ్యులైన యాపృథ్వీపతులందఱును, తమగజరథాశ్వాదులచేఁ బుడమి నడఁగఁ ద్రొక్కి తుదికిఁ బొడవడంగిరి. మహాత్ములగు నాక్షత్రియులవధమునకు నీ సుతుఁడు నిమిత్తముగాఁడు. అటులే నీవుగాని, నీసేవకులుగాని, కర్ణసౌబలులుగాని, నాశహేతువులుగారని మానిశ్చయము. వేలకొలఁదిగాఁ గురుశ్రేష్ఠులగు రాజులు మడియుటలో దైవమే నిమిత్తమని తెలియుము. ఇదిగాక వేఱొకటి యేమి తెలుపఁగలవు? ఈసకలరాజ్యమునకును నీవ ప్రభుఁడవు. నీవ గురుఁడవు. నీతనయుఁడును ధర్మాత్ముఁడనియే మేమంగీకరించుచున్నారము. ఓనరాధిపా! అతఁడు, ససహాయుఁడై వీరలోకముల నొందుఁగాక. బ్రాహ్మణులమగు మాచే ననుజ్ఞాతుఁడై స్వర్గమున సుఖమనుభవించుఁగాక. నీవును ధర్మస్థితిని బుణ్యమును బొందఁగలవు. సమగ్రముగా ధర్మమును దెలిసికొనుచున్నాఁడవు. ఇఁక సువ్రతుఁడవగుము. స్వర్గమును నైతము పాలింప సమర్థులగుపాండవుల నిఁక నీవు పరిశీలించుటయు వ్యర్థము. వారు సమవిషమములఁ దెలిసికొని ప్రవర్తింపఁగలరు. సుశీలురగుపాండవులు ప్రజలను లెస్సగాఁ బాలింతురు. మఱియుఁ బూర్వులొసంగిన బ్రాహ్మణమాన్యములను, బారిబర్హములను వారు సంరక్షింతురుగాని తీసికొనువారు గారు. ఈయుధిష్ఠిరుఁ డావైశ్రవణునట్టులెంతయు మహోదారుఁడును, దాంతుఁడును, మృదువర్తనుఁడును నుత్తమ సచివుఁడు నైనవాఁడు. మఱియు నితఁడు మమ్మును, దయగలిగి మైత్రితో నరయుచు, శుచియు, ఋజుబుద్ధియునై పాలించును. ఈధర్మజునిసహవాసముచే భీమార్జునాదులును, మాకు విప్రియమెన్నఁడును జేయరని మానిశ్చయము. ఆభీమాదులు సజ్జనులయెడ మార్దవమును, క్రూరులయెడఁ దీవ్రతను జూపునట్టి విక్రమవంతులై పౌరులహితమునే గోరుచుందురు. [illegible] కుంతిగాని, ద్రౌపదిగాని,

యులూపిగాని, సుభద్రగాని ప్రతికూలముగాఁ బ్రవర్తింపరు. మఱియుఁ పౌరులును, జానపదులును, యుధిష్ఠిరునిచే వృద్ధిపొందింపఁబడిన తమకుఁ గలస్నేహమును వెనుకఁబెట్టరు. మహారథులగు కౌంతేయులు, తమ ప్రజలలోఁ గొందఱు ధర్మరహితులున్నను, వారిని ధర్మపరాయణులై పాలింతురు. ఓరాజా! నీవిఁక నీయుధిష్ఠిరునిమూలమున, మనోదుఃఖమును విడిచి, ధర్మకార్యము లొనరింపుము. నీకిదె మేము నమస్కరించుచున్నారము" అని తెలిపెను.

ఓజనమేజయా! ఆబ్రాహ్మణునివచనము ధర్మయుక్తమనియు, గుణవత్తరమనియుఁ దలంచి, యందలివారందఱును, మేలు మేలని సన్నుతించిరి. ధృతరాష్ట్రుఁడును, నావిప్రునిమాట విని, మఱిమఱియు గౌరవించుచుఁ, బ్రజల నొక్కొకరినే సెలవిచ్చి పంపెను. అటులు వారి నాదరించి, వారిచేఁ బూజితుఁడై యాధృతరాష్ట్రుఁడు, గాంధారితోఁ గూడ, నిజభవనమును బ్రవేశించెను. ఓజనమేజయా! నాఁడు తెల్లవాఱఁగనే యతఁ డేమిచేసెనో, తెలిపెదను వినుము." అని చెప్పి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

### ధృతరాష్ట్రునభిప్రాయమును భీముఁ డంగీకరింపకుండుట

"ఓజనమేజయా! నాఁటిరేయి ముగియుటయు, నాధృతరాష్ట్రుఁడు విదురుని యుధిష్ఠిరుని మందిరమున కంపించెను. అతఁ డారాజాజ్ఞ ననుసరించి, యాధర్మజుని సమీపించి, "ఓధర్మజా! ధృతరాష్ట్రమహారాజు వనవాసము నిశ్చయించెను. అతఁ డీకార్తికమాసమునఁ బోవుట నిశ్చయము. కావున నిన్నతఁడు కొంతధనము గోరుచున్నవాఁడు. అతఁడు భీష్మసోమదత్తబాహ్లీకులకును బుత్త్రులకును ద్రోణునకును, మఱియు సైంధవునకును మిత్త్రులకును శ్రాద్ధ మొనర్పవలసియున్నదఁట! దానికిగా నిన్ను ధనమిమ్మని కోరెను." అని తెలిపెను. అది విని యుధిష్ఠిరుఁడును, నర్జునుఁడును సంతుష్టాంతరంగులై యాతనివచన మాదరించిరి. దృఢక్రోధుఁడగు భీముఁడుమాత్ర మందులకు సమ్మతింపఁడయ్యెను. అపు డావిదురుఁడు, మున్నాసుయోధనుఁ డొనర్చినకృత్యమును స్మరించి భీమునియభిప్రాయమును దెలిసికొని యూరకుండెను. అపు డర్జునుఁడు భీమునకు నమస్కరించి "ఓమహనీయా! వృద్ధుఁడగుతండ్రి ధృత

రాష్ట్రుఁడు వనవాసము సేయ దీక్షగలిగియున్నవాఁడు. అతఁడు తన మిత్రులు మున్నగువారికి శ్రాద్ధకర్మములఁజేయ నెంచి, నీచే నిర్జింపఁ బడినవిత్తమును గోరుచున్నవాఁడు. అతఁడు చేయుకార్యము భీష్మాదులకుఁగాదే? కావున నీవును సమ్మతింపవలయును. ఇపు డాధృతరాష్ట్రుఁడు దైవవశముగా నిటులు యాచించుచున్నవాఁడు. మున్ను మనమాతని యాచించినవారముగాదే! ఆహా! కాలవిపర్యయ మెట్టిదో గనుఁ గొనుము. ఈనరాధిపుఁడు సకలభూవలయమునకును భర్తయై పాలించి, తుదకుఁ దనవారెల్ల నశింప వనమునకుఁ బోవనున్నవాఁడు. ఈదానము దక్క వేఱొక్కవిధముగా నీ వాతని దర్శింప నక్కఱలేదు. ఇటు లొనర్పవేని నీకెంతయు నపకీర్తి గలుగకమానదు. వలసెనేని మన యన్నగారి నడిగి తెలిసికొమ్ము. నీవును నిందులకు సమ్మతించి యొసంగ వలయుఁగాని, మఱియొకరీతిఁ దలంపరాదు'' అని పలుకుటయు, నాతని నాధర్మజుఁడు పూజించెను. అంత నాభీముఁడు, సక్రోధుఁడై "ఓయర్జునా! మన మాభీష్మునిప్రేతకార్యమునకుఁగా నీయవచ్చును. అటులే సోమదత్తునకును, భూరిశ్రవసునకును, బాహ్లికునకును, మహాత్ముఁడగు ద్రోణునకును, మఱియుఁ గలవారికి నొసంగుదము. కర్ణునకుఁ గుంతి యొసంగును. ధృతరాష్ట్రుఁడు శ్రాద్ధకర్మము లొనర్పవలసినది లేదు. నా యభిప్రాయ మిది. మాశత్రువులు సంతసింపకుందురుగాక. సుయోధనాదులందఱును గడుకష్టముల నొందుదురుగాక. కులపాంసనులై వారె గదా ఇప్పుడమినెల్ల పాడుచేసిరి! ఓయర్జునా! పండ్రెండువత్సరముల వనవాసకష్టము లెట్లు మఱచితివి? ద్రౌపదీశోకవర్ధనమగు నజ్ఞాతవాస కష్టమును మఱచితెట్లు? ఈధృతరాష్ట్రునకపుడు, మనపై వలయుస్నేహ మెందులకుఁబోయెనో? నాఁడు నీవు కృష్ణాజినోపసంవీతుఁడవై యాభరణములన్నియుఁ బరిత్యజించి, పాంచాలపుత్రితో ధృతరాష్ట్రుని సమీపించితివిగదా! అపుడు భీష్మద్రోణు లేమైరి? సోమదత్తుఁ డేమయ్యెను? పదుమూఁడువత్సరములు క్రమముగా, వనమున వన్యములతో జీవింప లేదా? అపుడు నీపెద్దతండ్రి నిన్నుఁ గొమరునిఁగా భావించెనా? ఇక్కులపాంసనునివిధము మఱచితివిగాఁబోలును? దుర్బుద్ధియగునితఁడు, ద్యూతకాలమున విదురునితో 'ఓయీ! మనవారికి జయముగలిగెనా' అని ప్రశ్నించెనుగాదే?'' అని పలికెను. అది విని యుధిష్ఠిరుఁడు, భీముఁ

మందలించుచు, "ఓవృకోదరా ! ఊరకుండుము" అని పలుకుటయు నంత నప్పార్థుఁ డిట్లనియె.

### ధర్మజుఁడు తనధనము నిత్తునని తెలుపుట

"ఓవృకోదరా! నీవు నాకు జ్యేష్ఠుఁడవగుటఁ బూజ్యుఁడవు. కావున నింతకంటె నెక్కువగాఁ బలుకఁజాలను. రాజర్షియగు ధృతరాష్ట్రుఁ డెన్నివిధములఁ గాంచినను బూజార్హుఁడు. సజ్జనులగు మానవులు మేరమీఱక ప్రవర్తించుచు, నొరులొనరించినయపరాధములను స్మరింపక, వారుచేసిన మంచిపనులనే స్మరించుచుందురు."

మహాత్ముఁడగు నప్పార్థునివచన మాలించి యుధిష్ఠిరుఁ డవ్విదురు నారసి, "ఓప్రాజ్ఞా! నీవు నావచనముగా నాధృతరాష్ట్రున కిటు లెఱిఁగింపుము. అతఁడు తనపుత్రులశ్రాద్ధవిధుల కేమి కోరునో, దానినెల్ల నాసొంతధనమునుండి తీసియిచ్చెదను ఈవిషయమున భీముఁడు పరితపింప నక్కఱలేదు." అని తెలిపెను అంత నయ్యర్జునుఁడు తనయింటనుండి ధనము తీసికొనవచ్చునని పలికెను. అటులు పలికిన విని యుధిష్ఠిరుఁ డర్జునుమతమును మెచ్చుకొనియెను. అపుడు భీముఁ డా ధనంజయునిఁ గోపసూచకముగాఁ జూచెను. పిమ్మట ధర్మజుఁడు మఱియు విదురు నుద్దేశించి "ఓప్రాజ్ఞా! మాభీమునిమూలమున ధృతరాష్ట్రుఁడు కోపింపవలదు. అతఁడు వనవాసకాలమున శీతవాతాతపాదులచేఁ గడుక్లేశమందెను. అరణ్యమున బహువిధముగ దుఃఖముల నందుట యందఱకుఁ దెలిసినదియే. మఱియు నా యీవచనము విన్నవింపుము. ఆతని కేమేమి కావలయునో, యదియెల్ల నించుకేని సందియమందక నాయింటినుండి తీసికొనవచ్చును. ఈమావృకోదరుఁడు కోపముచే నేమిపలికెనో, యద్దాని నతఁడు చిత్తమున నుంచుకొనరాదు అని తెలుపుము. బ్రాహ్మణుల కతఁ డిచ్చువచ్చినట్లు వ్యయము సేసికొనవచ్చును. తన్మూలమున నతఁడు తనపుత్రులయు మిత్రులయు ఋణము తీర్చికొనవచ్చును. నా యీశరీర మాతనియధీనమునియు, నాధనములన్నియు నాతనివనియును దెలుపుము. అందు సందియము లేదని చెప్పుము." అని పలికె నని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

విదురుఁడు ధృతరాష్ట్రునకు ధర్మజునుద్దేశ మెఱిఁగించుట

"ఓజనమేజయా! ఆ యుధిష్ఠిరుఁ డిట్లు తెలుప విని విదురుఁడు ధృతరాష్ట్రునియొద్ద కేఁగి, "ఓరాజా! నీవు తెలిపినవిధ మెల్లఁ దొలుత నుండియుఁ దెలుపఁగా, నతఁ డది విని యెంతయుఁ బ్రశంసించెను. అట్లే యర్జునుఁడును దనయింటఁ గలధనములను దీసికొమ్మనుటయె గాక, తనప్రాణములనుసైతము నీవిగా భావింపు మనియెను. ధర్మజుఁడును దనధనప్రాణముల నీకర్పింతునని విన్నవించుకొనియెను. భీముఁడు మాత్రము బహుళములగు తమ వెనుకటిదుఃఖముల నెల్లఁ దలంచి, నిట్టూర్పులిడుచు, నెట్టకేల కెట్టెటో సమ్మతించెను. ధర్మశీలుఁడగు పార్థుఁ డావృకోదరుని సాధుమార్గమునఁ బెట్టఁగా నతఁడును నీమాటను మన్నించెను. మఱియు ధర్మజుఁడు, 'మా భీముఁడు వెనుకటి వైరమును దలఁచి, చేసినయపరాధమును మన్నింపుమని తెలుపు'మనియెను. మఱియు నతఁడు తలఁచుగా క్షత్రియధర్మ మిట్టులే యుండు ననియును, నటులగుట క్షత్రియధర్మనిరతుఁడగు భీముఁడిట్లు పలికెననియు, నతఁ డొనర్చినదానికిఁగా నేనును నర్జునుఁడును నిన్నుఁ గోపింపమికిఁ బ్రార్థించుచున్నారమనియునుఁ బలికెను. నీవే తనసకలమునకును బ్రభుఁడవని చెప్పెను. 'ఓపార్థివోత్తమా! కావున నీవేమేమి విప్రుల కీయఁ దలంచితివో యదియెల్ల నీ వీయవచ్చును. ఈ రాజ్యము మాయీప్రాణములు నీవిగా భావింపుము. నీపుత్త్రుల కుత్తరక్రియల కిచ్చోటినుండి రత్నములను గోవులను దాసీదాసాదులను దీసికొని బ్రాహ్మణుల కీయవచ్చును. బ్రాహ్మణాగ్రహారములను జేయవచ్చునని తెలిపెను. మఱియు దీనులు, నంధులు, కృపణులు మున్నగువారికి వలయునన్నపానాదులను గల్పింపవచ్చునని యతఁడు నా కానతివెట్టెను. ఓరాజా! ఇది యాధర్మజుఁడు నర్జునుఁడును భీముఁడును సమ్మతించి పలికినవిధము. ఇఁక నీవేమి చెప్పెదవు? ఏమి చేసెదవు?" అని విదురుఁడు పలుకుటయు, నాతనివచనములకు సంతసించి కార్తికమున మహాదానము లొనరింప నాధృతరాష్ట్రుఁడు నిశ్చయించుకొనియెను" అని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

### ధృతరాష్ట్రుఁడు దానములు సేయుట

ఓజనమేజయా! విదురుఁ డిట్టు తెలుప విని యాధృతరాష్ట్రభూపతి సంతసిల్లి, యాధర్మజార్జునులను మెచ్చికొనుచు, సభిరూపులగు బ్రాహ్మణోత్తములను, మహర్షిసత్తములను రావించి, భీష్మునిఁ దన పుత్త్రులను, మఱియుఁగలమిత్త్రులను దలంచి బహువిధములగుదానములు సేయువాఁడై, యన్నపానములను, యానవాహనాచ్ఛాదనములను, సువర్ణమణిరత్నములను, దాసీదాసాదులను, గంబళములను, గ్రామములను, క్షేత్రములను, నలంకృతములగు గజాశ్వాదులను, గన్యకలను, మఱిమఱియు నుద్దేశించుచు నొసంగ నారంభించెను. అపు డతఁడు, భీష్మద్రోణసోమదత్తబాహ్లికులను, సుయోధనాదులగు పుత్త్రులను, జయద్రథుఁడు మున్నగువారిని వేఱువేఱుగాఁ దలంచి తలంచి, బహుదక్షిణలుగల శ్రాద్ధయజ్ఞము నొనర్చెను. ఆయుధిష్ఠిరు ననుమతిపైఁ గొందఱు గణకులును లేఖకులును, 'ఓరాజా! వీరి కేమీయఁదలంచితివి. ఇదె సర్వము సన్నద్ధముగావించి యున్నవారము. సెలవిమ్ము.' అని పలుకుచు నతనిమాట వినినతోడనే యొసంగుచువచ్చిరి. అక్కుంతీపుత్త్రు నాజ్ఞయైనతోడనే, నూఱియఁదగియుండ, వేయి పదులనొసంగుచు, వేయియొసంగుఁడన్న నయుతసంఖ్యగా నొసంగుచు వచ్చిరి. ఓజనమేజయా! ఇటు లారాజాంబుదము, వసుధారలనువర్షించి, సస్యములనుబోలె బ్రాహ్మణులను దృప్తులఁగావించెను. పిమ్మట నతఁడు సర్వవర్ణములవారిని, నన్నపానరసప్రవాహములచే, సంతృప్తులఁజేసెను. ధృతరాష్ట్రప్లవసముద్ధతమైన యమ్మహాహేముజలసముద్రము, వస్త్రరత్నధనప్రవాహములుగలదియు, మృదంగనినాదపూరితమును గవాశ్వమకరావర్తమునునై, నానారత్నమహాకరమై గ్రామాగ్రహారద్వీపములు గలిగి, యెంతయు వెలయఁజొచ్చెను. ఇటు లతఁడు పుత్త్రులకును, బౌత్త్రులకును, దండ్రులకును, నౌర్ధ్వదైహికము గావించి, యెపు డతఁడు తానొనర్చిన పెక్కుదానములచే నలసటచెందెనో, యపు డాకృత్యమునుండి మరలెను. ఓజనమేజయా! ఆధృతరాష్ట్రుఁ డటులు దానమహాయజ్ఞ మాచరించి, పుత్త్రపౌత్త్రాదులఋణము తీర్చికొనిన వాఁడయ్యెను." అని తెలిపి మఱియు వైశంపాయనుఁ డిట్లనియె.

### ధృతరాష్ట్రుఁడు వనవాసమునకు వెడలుట

ఓజనమేజయా! ఆమఱునాఁ డాయాంబికేయుఁడు, వనవాసనిరతుఁడై వీరులగుపాండవులను బిలిచి, గాంధారితోఁగూడ వారి నాదరించి, వేదపారగులగుబ్రాహ్మణులచేఁ గార్తికేష్టిని గావించి, తన యగ్నిహోత్రములు ముందునడువ, వల్కలాజినములు ధరించి, వధూజనపరివృతుఁడై యింటినుండి వెడలెను. అపుడు కౌరవపాండవుల కాంతలును, మఱికొందఱు స్త్రీలును, నాతని ననుసరించిరి. వారిచప్పుడులు మెండై యుప్పతిల్లెను. అపు డాధృతరాష్ట్రుఁడు, తాను విడుచునట్టి గృహమును, లాజలతోడను, బూవులతోడను బూజించి, భృత్యవర్గము నారాధించి, పిమ్మట గృహద్వారమును గడవఁదలంచెను. అంత నయ్యుధిష్ఠిరుఁడు సబాష్పకంఠస్వరుఁడై వడఁకుచుఁ జేతులు మొగిడ్చి బిగ్గరగా మొఱవెట్టుచు, 'తండ్రీ! ఎందులకేఁగెదు?' అని పలుకుచుఁ బుడమిఁబడియెను. అటులే యర్జునుఁడును దీవ్రదుఃఖార్తుఁడై మఱిమఱియు నిట్టూర్పులిడుచుఁ, దనపెద్దయన్నను గాంచి 'ఓయుధిష్ఠిరా! ఇట్లు తగునా?' యని పలుకుచు, దైన్యముదర నాతనిఁబట్టికొని పరితపింపసాగెను. పిమ్మట వృకోదరుఁడును, నకులసహదేవులును, విదురసంజయులును, బార్థుఁడును, యుయుత్సుఁడును, గౌతమధౌమ్యులును, సబాష్పకంఠస్వరులై యాధృతరాష్ట్రు ననుసరించిరి. కుంతియు, గాంధారి నేఁ గాంచుచుఁ దనస్కంధముపై హస్తము నుంచిన యామెను నడిపించుచు వెడలెను. ధృతరాష్ట్రుఁ డాగాంధారి స్కంధమునఁ జేయుంచి నడువసాగెను. అటులే ద్రౌపదియు, సుభద్రయు, పసిబాలుఁడు గలయుత్తరయుఁ, జిత్రాంగదయు, మఱియుఁ గలకౌరవకాంతలును వెడలిరి. ఆఁడులకుమికులట్లు మొఱలిడుచున్నవారినాదములు మిన్నుముట్టుచువచ్చెను. పిమ్మట నప్పురిఁగలబ్రాహ్మణులయు, క్షత్త్రియులయు, వైశ్యులయు, శూద్రులయు స్త్రీలెల్ల వెడలిరి. ఆధృతరాష్ట్రునిప్రయాణమున హస్తిపురిఁగల పౌరవర్గమంతయు సంతప్తమై యుండెను. నాఁడు, పాండవులు ద్యూతమున నోడి యడవికేఁ బోవునప్పటిదుస్థితియుఁ గానవచ్చెను. మున్నొకపుడును సూర్యచంద్రులనేనిఁ జూడకున్నట్టి రాజకాంతలందఱును, నాధృతరాష్ట్రుని వనవాసప్రయాణదివసమున నెల్లవారికిని గానరా, రాజమార్గమును

ప్రవేశించి నడువసాగిరి" అని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

### ధృతరాష్ట్రవియోగమునకుఁ బాండవులు దుఃఖించుట

"ఓజనమేజయా! పిమ్మట, నప్పురిఁ గలహర్మ్యములందును, ప్రాసాదములందును, వీథులందును, స్త్రీపురుషులగొప్పచప్పుడు లుప్పతిల్లెను. నరనారీసంకులమైయున్న యారాజమార్గమున, వడఁకుచుఁ జేతులు మొగిడ్చి యుధిష్ఠిరుఁడు ముందుగా నడువసాగెను. వారు సింహద్వారమునుండియే వెడలిరి. ఆధృతరాష్ట్రుఁడు తన్ను వెంబడించిన జనసమూహమును మరలించుచువచ్చెను. ఆతనితోఁ బోవుటకు సంజయవిదురు లిరువురును నంగీకరింపఁబడిరి. యుయుత్సునిఁ గృపుని మరలి పొమ్మని ధృతరాష్ట్రుఁడు సెలవిచ్చెను. పిదప యుధిష్ఠిరుఁడు దక్కఁ దక్కినవారందఱును మరలిరి. పిమ్మట యుధిష్ఠిరుఁడు సాంతఃపురముగా ధృతరాష్ట్రుననుజ్ఞ వడసి మరలువాఁడై తనతల్లితో "అమ్మా! నీనిమ్మహారాజు ననుసరింప నక్కఱలేదు. నే ననుసరించి పోయెదను. ఇవ్వధూజనముఁగూడి నీవు మరలిపొమ్ము. తపోనిశ్చయముగల ధృతరాష్ట్రమహారాజు, వనమునకు వెడలుఁగాక." అని పలికెను. అది విని యాకుంతి, బాష్పవ్యాకులలోచనయై గాంధారిని బట్టుకొని వెడలునదై యుధిష్ఠిరునిఁ గాంచి "ఓకుమారా! సహదేవునిపై నీవెన్నఁడును గోపింపరాదుసుమీ! వానియెడ జాగరూకుఁడవై యుండవలయును. ఈసహదేవుఁడు నీయందును, నాయందును మిగుల ననురక్తిగలిగినవాఁడు. సంగ్రామవీరుఁడగు కర్ణునిమాత్రము మఱవకుము. వాఁడు బుద్ధిహీనుఁడై సమరమున సమసెను. ఓపుత్రకా! మందబుద్ధినగు నామానసమెంతయు నయోమయ మనఁదగినదని చెప్పవచ్చును. వాఁడు నాకంటఁబడనపుడును నాగుండియలు ప్రీలకున్నవి. ఇందులకు నేనేమిసేయఁగలను? నేను వానివిధ మెవ్వరికిని దెలుపకుండుట నాదోషము. ఓపుత్రకా! వాని నుద్దేశించి దానమొనర్పుము. నీవును నీతమ్ములును వానియుత్తమగతివిధము చింతించుచుండవలయును. మఱియొకటి వినుము. ద్రౌపదిప్రియ మెన్నఁడును మఱ రాదుసుమీ! అటులే భీమార్జునులును నకులసహదేవులును నా సరిగాఁ బరిపాలింపవలయును. ఆమె మనవంశభారమును వహిఁ

సుమీ! నేను నాయత్తమామలనఁదగు నీగాంధారీధృతరాష్ట్రులను సేవించుచు నరణ్యమున నివసింతును. తాపసినై ప్రవర్తింతును." అని తెలిపెను. ఓజనమేజయా! నీతల్లి యిటులు పలుకుటయు, నయ్యుధిష్ఠిరుఁడు తమ్మునితోఁగూడఁ జింతాక్రాంతుఁడై యేమియు బలుక కూరకుండి, కొంతవడి కించుక ధైర్యముగొని, రెండుగడియలసే పేమో ధ్యానించి, మఱియు దైన్యమొదవ నామెతో "తల్లీ! నీ కీప్రయత్నమేటికి! నీవిటులు పలుకరాదు. నేనిందులకు సమ్మతింపను. నామాట మన్నింపుము. నీవు పోవలదు. ఓతల్లీ! నీవు మున్ను మాకుత్సాహకరముగాఁ దెలుపుచుండెడిదానవు. మమ్ము విడువరాదు. రాజులనెల్ల వధించితిని. ఈరాజ్యమును సంపాదించితిని. నీవు కడుప్రజ్ఞగలదానవని వాసుదేవుఁడు దెలిపెడుగాదే! అట్టి నీబుద్ధి యెందుఁబోయెను? నీవు మున్ను క్షత్త్రధర్మానుసారముగాఁ బలికియు నిపు డద్దానిని విడువఁదగునా! మమ్మును నీరాజ్యమును నెట్లు విడిచెదు? ఇదె కీర్తిశాలినియగు నీకోడలు. దుర్గమారణ్యములం దీవెట్లు నివసింపఁగలవు? అనుగ్రహింపుము." అని పలికెను.

అంత నాకుంతి, బాష్పకలితములగు నయ్యుధిష్ఠిరువచనము లాలించుచు, వనమునకు వెడలుటయు నపుడు భీముఁడు, "తల్లి! తనయులు సంపాదించినరాజ్యమును నీవనుభవింపవలసియుండఁగా, నీకిట్టి బుద్ధిగలిగ నేటికి? ఇట్టియుద్దేశముగల నీవు మాచే నీపృథివీక్షయ మేల చేయించితివి? మమ్ము విడిచి వనమున కేల పోవలసివచ్చెను? మేము బాలురమైయుండఁగా నడవినుండి మమ్మేల తీసికొనివచ్చితివి! ఈమాద్రీసుతుల నేల తీసికొనిరావలయును? వీరు దుఃఖార్తులై యున్నవారు గదా! వీరి నెట్లు విడిచెదు? తల్లీ! ప్రసన్నవగుము. వనమున కేఁగవలదు. సహజబలార్జితమగు యుధిష్ఠిరు రాజ్యసంపద ననుభవింపుము." అని పలికెను. కాని యాకుంతి, వనవాసనిశ్చయమును వీడక, కొడుకులేడ్చుచుండఁగనే వెడలెను. అపుడు విషణ్ణవదనయై ద్రౌపదియు, నత్తగారి ననుసరించి, సుభద్రవెంటరా వెడలెను. అపు డాకుంతి, యుధిష్ఠిరాదులందఱును నేడ్చుచుండఁగా, వారిని జూచుచు, గాంధారీధృతరాష్ట్రులఁగూడి వెడలెను. పిమ్మట నంతఃపురజనముతోఁగూడఁ బాండవు

లాకుంతి ననుసరించి వెడలుటయు, నామె కనుల నీళులఁ గార్చుచుఁ దనయులతో నిట్లనియె.

## కుంతి పాండవుల నూఱడించుట

"ఓవృకోదరాదితనయులారా! చింతింపకుఁడు. మీరన్నది నిజము. నేను మిమ్ము మున్ను ప్రోత్సహించుట సత్యము ద్యూతమున నపహృతరాజ్యులై సుఖభ్రష్టులై జ్ఞాతులచేఁ దిరస్కృతులై యున్న మిమ్ముఁ బ్రోత్సహించినమాట సత్యము. పాండువంశము నశింప రాదనియు, మీయశము నశింపరాదనియు, నేను మిమ్ముఁ బ్రోత్సహించితిని. మీరింద్రతుల్యులును, దేవతుల్యపరాక్రములు నగుట, వైరుల మొగములఁ జూచుచు నుండరాదని యిటులొనర్చితిని. ఓయుధిష్ఠిరా! ధనుర్ధరోత్తముఁడవై వాసవతుల్యుఁడవగు నీవు మరల వనమున దుఃఖింపఁదగదని యిటు లుత్సాహపఱచితిని. వేయియేనుఁగులబలముగల వాఁడును, ఖ్యాతవిక్రమపౌరుషుఁడునునగు, నీభీముఁ డవమానపీడితుఁడు గాఁగూడదని నేనట్లు ప్రోత్సహించితిని భీమసేనునకుఁ దమ్ముఁడును, వాసవసన్నిభుఁడునునగు, నీవిజయుఁడు క్షీణదశనొందరాదని నేనటులొనర్చితిని. గురుభక్తులగు నీనకులసహదేవు లటు లాఁకలిచేఁ బీడితులగుటఁ గోప మాపికొనఁజాలక యటులు పలికితిని. శ్యామాంగియు, దీర్ఘలోచనయునగు నీద్రౌపది యిట్లు సభలోఁ బీడింపఁదగినదా యని నేను మిమ్మటులు ప్రోత్సహించితిని. ఓభీమా! మీరెల్ల నరయుచుండఁగాఁ, గదళీస్తంభమట్లు గదలుచు, రజస్వలయై, ద్యూతమునఁ బరాజితయైయుండ నట్టితఱి మూర్ఖుఁడై యాదుశ్శాసనుఁ డీమెను దాసియట్లు దలఁచి పీడించెను. అపుడే మనవంశమెల్లఁ బరాభవింపఁబడియెనని నిశ్చయించితిని. అపుడు నామామ మున్నగువారందఱును విషణ్ణులై యూరకుండిరి. మఱియు హతబుద్ధియైపాపుఁడైనయా దుశ్శాసనుఁడు తలపట్టియీడ్వ నెవ్వరేని దిక్కుగుదురా? అని యాఁడు లకుముకియట్టు లాద్రౌపది యేడ్వలేదే? అపుడే నాకుఁ గోపముచే వివేకముచెడ, నెటులేని మీకుఁ దేజముగలిగింప నట్లు ప్రోత్సాహకరముగా మాటలాడితిని. ఓపుత్త్రులారా! నేనపుడు మీతో 'మీ కిపుడు చేయఁదగినదుత్సాహము. ఉత్సాహము' అని పలుకుట కివియు

కారణములు. పాండురాజువలన నేనిట్టిపుత్త్రులఁబడసియు నీరాజవంశ మిట్లు నశించుటయా ? అనురోషముచే మిమ్ముఁ బ్రోత్సహించితిని. దేని వలన క్షత్త్రవంశము నశింపకుండునో, యట్టి నామాటవలనఁ బుత్త్రలును, పౌత్త్రులును సుకృతకరములగుపుణ్యలోకముల నందఁగలిగిరి. నేనింతకుమున్నే విపులమగు నాభర్తరాజ్య మనుభవించితిని. మహాదానము లొనర్చితిని. యాగములు చేయఁబడినవి. నేను నాకై యొక ఫలము నపేక్షించి యావాసుదేవు నటులు ప్రోత్సహింపలేదు. మిమ్ముఁ బాలించుటకుఁగా నట్టిప్రోత్సాహకరములగువచనములు తెలిపితిని. ఓకుమారులారా ! మీరు జయించినరాజ్యముఫలము గోరలేదు. తప మొనర్చి తత్సుకృతముచేఁ బతిలోకములఁ బడయఁగోరుచున్న దానను. మఱియు వనవాసులై యత్తమామ లనఁదగువీరిశుశ్రూష చేయుచుఁ దపముచే నాశరీరమును కృశింపఁజేసికొనఁ దలఁచియున్న దానను. ఓయుధిష్ఠిరా ! కావున భీమాదులగు నీసోదరులఁగూడి ధర్మమున బుద్ధి నిలుపుము. నీమనసు మహత్తరమై వెలయుఁగాక" అని తెలిపె"నని చెప్పి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

### పాండవులు ద్రౌపదితో హస్తిపురికి మరలుట

"ఓజనమేజయా ! పాండవులు తమతల్లివచనము లాలించి సిగ్గువడి, ద్రౌపదితోఁగూడ నిజపత్తనమునకు మరలిరి. పిమ్మట నటు లడవికిఁ బోవుచున్న కుంతిని గాంచి యేడ్చుచున్నయంతఃపురజనము రోదనములచే గొప్పశబ్ద ముప్పతిల్లెను. అపుడు పాండవు లాధృతరాష్ట్రునకుఁ బ్రదక్షిణ నమస్కార మొనర్చి, కుంతికి నమస్కరించి, యామెను మరలింపఁజాలమి దుఃఖితు లగుచు మరలిరి. అనంతర మాయాంబికేయుఁడు గాంధారిని విదురునిఁ బట్టికొని "ఓప్రాజ్ఞా ! ఈదేవి యుధిష్ఠిరునితల్లి హస్తిపురికి మరలుఁగాక. ఇపు డీయుధిష్ఠిరుఁ డన్న దెల్ల సత్యముగదా! మహాఫలమగు పుత్త్రులయైశ్వర్యమును విడిచి, పుత్త్రులను విడిచి, దుర్గమారణ్యము నెవ్వతె ప్రవేశించును ? రాజ్యమందుండియే తపఃఫలము నీమె యనుభవింపవచ్చును. దానవ్రతాదులచేఁ గలుగు ఫలము మహత్తరమైనది. నామాట విని యటు లీమె యొనర్పవచ్చును. ఓగాంధారీ ! ఈమె శుశ్రూష కెంతయు నేను సంతసించితిని. కావున నీ వీమె

కనుజ్ఞయొసఁగి మరలింపుము." అని తెలిపెను. అటు లాధృతరాష్ట్రుఁడు
పలుకుటయు నాగాంధారి కుంతి నుద్దేశించి, తనభర్తృవచనములను,
దనయుద్దేశమును విశేషించి తెలిపెను. కాని, వనవాసవిషయమున
నిశ్చయబుద్ధియై ధర్మనిరతయై పతివ్రతయైనకుంతిని మరలింప వశము
గాకుండెను. ఆమె ప్రయత్నమును, నామెస్థితిని గాంచియుఁ, బాండ
వులు మరలుట నారసియుఁ, గురుకాంతలందఱును రోదనముసేయ
సాగిరి. అప్పాండవులును, స్త్రీలును మరలినతోడనే, మహాప్రాజ్ఞుఁడగు
ధృతరాష్ట్రుఁడు వనమునకు వెడలెను. పిమ్మటఁ బాండవులును దుఃఖా
ర్తులై దైన్యమొదవ స్త్రీలతోఁగూడ యానము లధిరోహించి హస్తి
పురముఁ బ్రవేశించిరి. అప్పు డప్పురము సంతోషరహితమై యుత్స
వము గడచినదివోలె, వెలవెలవోవుచుండెను. అక్కరిపురిఁగలవారు,
బాలురుమొదలుగా వృద్ధులవఱకు నిరుత్సాహులై యుండిరి. పాండ
వులును జింతాక్రాంతులై, కుంతీవియోగముచే. ధేనువును విడిచిన
వత్సములట్లు పరితపింపసాగిరి. నాఁటిపగ లాధృతరాష్ట్రుఁడు కడు
దూరము గడచి, గంగాతీరమున నొకచో నివసించెను. అచ్చో వేద
పారగులగుబ్రాహ్మణులు యథావిధిగా నగ్నులను బ్రాదుర్భవింపఁజేసిరి.
ఆగంగాతీరతపోవనమున నావృద్ధనృపతి బ్రాహ్మణులచే నావిష్కృ
తాగ్నులై సత్కర్మముల నాచరింప మొదలిడెను. అతఁ డటు లగ్ని నుపా
సించి, సంధ్యాసమయభాస్కరు నారాధించెను. పిమ్మట విదురసంజయు
లాధృతరాష్ట్రునకై దర్భలతో శయ్య నొకటి కల్పించి, దాని కనతి
దూరముగనే గాంధారికిఁ వేఱొకశయనమును గల్పించిరి. ఆగాంధా
రికిఁ జేరువగా, నొకచోఁ గుంతి కుశాస్తరణముపై శయనించెను.
వారియానతి వడసి, విదురాదులును, నొకచోఁ గూరుచుండిరి.
యాజకులగు ద్విజులును నొకచో నివసించిరి. బ్రాహ్మణులవేదాధ్యయన
ములతోడను బ్రజ్వలితాగ్నులతోడను, వారి కారాత్రి ప్రీతికరమై
గడచెను. నాఁటిరేయి గడవఁ బూర్వాహ్ణక్రియలెల్ల గావించి
విధ్యుక్తముగా నగ్ని నారాధించి, పిమ్మట మరల యథాక్రమముగా,
నుదఙ్ముఖులై కూరుచుండి యుపవాసనిష్ఠమైయుఁ దపముసేయ నారం
భించిరి. కాని వారి కామొదటిదినము మాత్రము, పౌరులయు జాన

పదులయు శోకములచే దుఃఖితులగుచుండఁ గొంతవఱకుఁ గష్టతరముగాఁ గడచెను." అని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

"ఓజనమేజయా! ఆధృతరాష్ట్రుఁడు విదురునిమతము ననుసరించి పుణ్యజనోచితమై పవిత్రమగుగంగాతీరమున నివాసము నేర్పరచుకొనియెను. అందు వనవాసులగు బ్రాహ్మణు లందఱు నాతని సమీపించియుండిరి. మఱియు క్షత్త్రియులును, వైశ్యులును, శూద్రులును నాతనిఁ బరివేష్టించియుండిరి. ఆయాంబికేయుఁడు వారినెల్లఁ గథలచే సంతసింపఁజేసి శిష్యులతోఁగూడ విధ్యుక్తముగా వారిని బూజించి పంపెను. మఱియు సాయంకాలమున గంగానది నాధృతరాష్ట్రుఁడు సమీపించి, విధ్యుక్తముగా శౌచము నాచరించెను. గాంధారియు నాతని ననుసరించియే యుండెను. మఱియుఁగలవారును నమ్మహానదిలో స్నానమొనర్చి సకలవిధక్రియల నాచరించిరి. శౌచమొనరించియున్న యావృద్ధుని గాంధారిని కుంతిదేవి తన్నదీతీరమును జేర్చెను. రాజయాజకు లత్తీరమున నొకవేదీపరిస్తరమొనర్చిరి. సత్యప్రతిజ్ఞుఁడగు నాధృతరాష్ట్రుఁ డందగ్ని నారాధించెను. పిమ్మట, నాభాగిరథీతీరమునుండి యావృద్ధనృపతి నావిదురాదులు కురుక్షేత్రమును జేర్చిరి. అటు లతఁడు కురుక్షేత్రమును జేరి యందొకయాశ్రమమున వసించి, మనీషియగు శతయూపుఁడను రాజర్షిని సమీపించెను. కేకయులలో నుత్తముఁడగు నాశతయూపమహారాజు తనరాజ్యమును దనయున కొసఁగి వనము నాశ్రయించియుండుట, నాతనిఁగూడి ధృతరాష్ట్రుఁడును గొంతకాలముండి పిదప వారిరువురును వ్యాసాశ్రమమును జేరిరి. శతయూపునిదగువ్యాసాశ్రమమున దీక్షవహించి యతఁడు వ్యాసానుమతిపై విధ్యుక్తమగు నారణ్యకవ్రతము నాచరింపఁ దొడంగెను. ఆధృతరాష్ట్రుఁ డిట్లు తపశ్చరణపరుఁడై యాత్మ నాత్మయందు సంధించియుండఁ గాంధారియు నొకవల్కలము ధరించి వ్రతనిష్ఠగలిగియుండెను. కుంతియు నామె ననుసరించి వ్రతచారిణియై యుండెను. ఓజనమేజయా! మనోవాక్కర్మములను దృష్టిని నియమించి, యింద్రియముల నడంచి, చర్మము నెమ్ములుమాత్రము గానరా మాంసహీనమైన మేనితో, జటాజినవల్కలసంవృతుఁడగుచు మోహమును బరిత్యజించి మహర్షివలె నాధృతరాష్ట్రుఁ డెంతయుఁ దీవ్రతప

మొనర్చెను. ధర్మార్థవేత్తయు, సుత్తమబుద్ధియునగు విదురుఁడును, సంజయుఁడును నాయాంబికేయుని సేవించుచువచ్చిరి." అని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

—— నారదాదులు ధృతరాష్ట్రునిఁ గాంచవచ్చుట ——

"ఓజనమేజయా! పిమ్మట నాయాంబికేయు నారయువారై నారదపర్వతులును, దేవలుఁడును, శిష్యులతోఁగూడ వ్యాసమహర్షియు, మఱికొందఱు సిద్ధమునులును వచ్చిరి. వృద్ధుఁడును బరమధార్మికుఁడు నగు శతయూపుఁడును నందులకు వచ్చియుండెను. వారికెల్ల నాకుంతీదేవి విధ్యుక్తపూజ లర్పించుటయు, వా రామెపూజల కెంతయు సంతసించిరి. అమ్మహర్షులందఱును, నమ్మహాత్ముఁడగు ధృతరాష్ట్రమహారాజునకుఁ బ్రీతికరముగా ధర్మయుక్తములగుకథలతోఁ గాలక్షేపము సేయసాగిరి. అపు డాకథాసందర్భమున దేవర్షియగు నారదుఁడు, సకలమును బ్రత్యక్షముగాఁ దెలియువాఁడగుట నొకకథ నిట్లు దెలిపెను.

ఓయీ! కేకయదేశాధీశుఁడును, శతయూపునకుఁ బితామహుఁడునగు సహస్రచిత్యుఁ డనియెడిరాజు నిర్భయుఁడై రాజ్యమేలి, తుదకుఁ దనపెద్దకొడుకునందు రాజ్యభారముంచి వనవాసము సేయ నెంచి యొకయరణ్యమునఁ జేరి యందు సంపూర్ణముగాఁ దప మొనర్చి యింద్రునిసదనమును జేరెను. తపోదగ్ధకిల్బిషుఁ డగునా భూపతి నాయింద్రునాస్థానమున నెన్నిసారులో చూచితిని. అటులే భగదత్తుని తాతయగు శైలాలయుఁడును దనతపోబలముచే బలసూదను నిలయమున నివసించుచుండెను. అటులే వాసవతుల్యుఁడగు వృషధ్రుఁడును దప మొనర్చియే స్వర్గమును జేరికొనియెను. మఱియు నియ్యరణ్యముననే మాంధాతపుత్రుఁడగు పురుకుత్సుఁడు మహత్తర సిద్ధివడసి యుత్తమగతి నొందెను. పరమధార్మికుఁడగు శశలోముఁడును నియ్యరణ్యమునందే తప మొనర్చి స్వర్గతుఁడయ్యెను. నా తెలిపిన రాజర్షులందఱును నిమ్మహారణ్యమునఁ దప మొనర్చియే యుత్తమగతిఁ గాంచగలిగిరి. ఓధృతరాష్ట్రా! నీవును నావ్యాసమహర్షి యనుగ్రహముచే నిత్తపోవనమును బ్రవేశించితివి. కావునఁ బొందరాని యుత్తమ గతిని బొందఁగలుగుదువు. ఓరాజోత్తమా! నీతపము ముగిసినపిమ్మట గాంధారియు నీవును నమ్మహాత్ములట్లు స్వర్గసుఖము లనుభవింతురు. నీ

తమ్ముఁడగు పాండుభూపతి యాయింద్రుని చేరువనుండి, నిన్ను నిత్యము స్మరించుచుండును. ఓమహారాజా ! అతఁడు నీకెంతయు శ్రేయమును గూర్పఁగలఁడు. నిన్నును నీగాంధారిని భక్తిమెయి సేవించుటచే, నిప్పాండుపత్నియు భర్తృసాలోక్యము నొందెడిని. ఓరాజా! ఇది యెల్ల నాదివ్యదృష్టిచేఁ దెలిసికొంటిని. విదురుఁడు ధర్మమూర్తియగుట నాధర్మజునందుఁ బ్రవేశించును ఈసంజయుఁడు స్వర్గము నొందును." అని.

ఓజనమేజయా ! ఆనారదునివచనము లాలించి యాధృతరాష్ట్రుఁడును గాంధారియుఁ బరమానందమందిరి. ఆనారదుఁ డాధృతరాష్ట్రునిచే నెంతయు గౌరవింపఁబడియెను. పిమ్మట నందున్న బ్రాహ్మణులందఱును, సంతుష్టాంతరంగులై యానారదుని సన్నుతించిరి. ఓజనమేజయా ! పిమ్మట నందున్న రాజర్షియగు శతయూపుఁడు నారదు నాగని, "ఓమహర్షివర్యా ! నీవీధృతరాష్ట్రునకును, నీసమస్తజనమునకును, నాకును దపమునెడ శ్రద్ధ నెచ్చునట్లుగాఁ బలికితివి. నిన్నొకటి యడుగ నాకు వేడుక వొడముచున్నయది. ఓదేవర్షివర్యా ! ఈధృతరాష్ట్రునిగుఱించి నీవొకటి తెలుపవలయును. దివ్యదృష్టివగు నీకు సకలవృత్తాంతమును దెలియునుగాదే ! ఓవిప్రవర్యా ! యోగనిష్ఠఁబూని, నీవు మానవుల వివిధగతిఁ దెలిసికొనువాఁడవు. నీవిపుడు మనుజాధీశుల మహేంద్రసాలోక్యము నెఱిఁగించితివిగదా ! ఈధృతరాష్ట్రునకగులోకము లెవ్వియో తెలుపవైతివి. ఈతనికగు నుత్తమస్థానమును సైతము నెఱిఁగింపుము. ఎప్పు డెట్టిస్థాన మీతని కగునో నీనుండియే తెలియవలసియున్నది." అని ప్రశ్నించెను.

అది విని యానారదుఁ డప్ప్రశ్న మాసభయందున్నవారికెల్లఁ దెలియఁదగినదిగా నెఱిఁగి, దివ్యదృష్టియగుటఁ దద్విషయముఁ దెలుపువాఁడై "ఓయీ ! నే నాయింద్రసభకుఁ బోయి, యాయింద్రుని నందున్న పాండుభూపతినిఁ జూచితిని. అపు డం దీధృతరాష్ట్రునికథ ప్రసక్తమయ్యెను. ఈతఁ డిట్లు దుష్కరతప మొనర్చెను గాదే! ఆయింద్రుఁడు స్వయముగాఁ దెలుపుచుండ వింటిని. పరమాయువుగ నీతని కిఁక మూఁడువత్సరములు మిగిలియున్నవని తెలియవలయును. పిమ్మట నితఁడు గాంధారితోఁగూడ, రాజరాజాధిసత్కృతమగు కుబే

రుసిభవనమునకుఁ బోవును. మఱియు నితఁడు కామగమనముగల విమాన మధిరోహించి దివ్యాభరణభూషితుఁడై తపోదగ్ధకిల్బిషుఁడై ఋషిపుత్త్రుఁ డనఁదగి దేవగంధర్వరక్షస్సులలోకములందు సంచరింపఁ గలఁడు. ఈధర్మాత్మునకు స్వేచ్ఛావిహారమగును. ఓశతయూపమహా రాజా! నీవు నన్నుఁ బ్రశ్నించితివిగానఁ దెలిపితిని. ఈదేవరహస్య మెంతయు మహత్తరమైనది. ఓమహర్షులారా! మీరందఱును వేద ఘనులును దగ్ధకిల్బిషులు నైనవారు. కావున మీ కీవిధ మెఱిఁగించి తిని." అని తెలిపెను. ఓజనమేజయా! వా రానారదుని మధురవచన ములను విని సంతసించిరి. ఆధృతరాష్ట్రుఁడును బరమానందమందెను. పిమ్మట నమ్మహర్షులందఱును, యథేచ్ఛగా వెడలిపోయిరి" అని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

### ధృతరాష్ట్రునివియోగమునకుఁ బాండవులు దుఃఖించుట

"ఓజనమేజయా! ఆయాంబికేయుఁ డటు లరణ్యమునకుఁ బోయిననాఁటినుండియు దుఃఖార్తులై, పాండవులు పరితపింపసాగిరి. మఱియు వారికి మాతృవియోగము దుఃఖకరమయ్యెను. ఆధృత రాష్ట్రునికై పౌరవర్గమంతయుఁ బరితపించెను. అప్పురిఁ గలబ్రాహ్మణు లాయాంబికేయునికథలను జెప్పికొనుచు "అక్కటా! ఆవృద్ధభూపతి నిర్జనవనమున నెట్లు వసించుచున్నవాఁడో? ఆహా! మహాభాగయగు కుంతియు గాంధారియు నెట్టికష్టములు పడుచున్న వారో? సుఖ మను భవింపఁదగిన యారాజర్షి సుఖరహితుఁడై, మహత్తరమగునవ్వనమున నెట్టిదురవస్థఁ బడయున్న వాఁడో! అయ్యయో! అతఁడు హతసుతుఁ డును, నంధుఁడును గాదే! తనతయులను గనుఁగొనక కుంతి యెంత చింతించుచున్నదోగదా! ఆహా! ఆమె యాత్మజుల రాజ్యసంపదను బరి త్యజించి యెట్లు పోఁగలిగెనో? భ్రాతృశుశ్రూషాపరుఁడగు విదురుఁ డేమియవస్థలో నున్నవాఁడో? ఆసంజయుఁడు భూపతిసేవాపరుఁడై తత్పిండము నపేక్షించుచు నెటు లుండెనో?" అని పలువిధములఁ బలుకఁజొచ్చిరి. ఇంతయేల! అప్పురిఁగలబాలకులును వృద్ధులును జింతా శోకహతులైరి. మఱియు నందఱివారందఱును నందందుఁ గూడి పర స్పరమును గథలుగాఁ జెప్పికొనసాగిరి. అటులే పాండవులును, నెం

తయు దుఃఖాక్రాంతులై వృద్ధయగుతల్లికై దుఃఖించుచుఁ దత్పత్తనమున నుండ నిచ్ఛగింపరైరి. అటులే వృద్ధుఁడును, హతసుతుఁడు నై యున్న తండ్రిని, మహాభాగయగుగాంధారిని, మహామతియగు విదురునిఁ దలంచి చింతింపసాగిరి. అటులగుట వారికి రాజ్యమందును, దారలయందును వేదాధ్యయనమందును ప్రీతియొదవదయ్యెను. ఆనరాధీశునిఁ దలంచికొనినకొలఁదిని వారికి నిర్వేదము గలుగఁ దొడంగెను. ఘోరమగుజ్ఞాతివధమును, బాలుఁడగునభిమన్యుని వినాశమును, మహాబాహుఁడగు కర్ణునిమరణమును, మఱియు ద్రౌపదేయులయు మిత్రులయు వధమును స్మరించునపుడెల్ల, వారిమనము ఉద్వేగమొందుచువచ్చెను. మఱియు వీరులెల్ల నశింప, రత్నశూన్యమై నిస్సారమైన పుడమిని స్మరించుచున్న యిప్పాండవులకు శాంతియొదవకుండెను. హతసుతలైన ద్రౌపదియు, సుభద్రయు నించుకేని సంతోషములేక సంతప్తచిత్తలై యుండిరి. ఉత్తరకుఁ దనయుఁడును నీకుఁ దండ్రియు నగు పరీక్షిత్తు నారసియే, యిప్పాండవు లెటులో ప్రాణములు ధరింపఁగలిగిరి.'' అని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

## పాండవులు వనప్రయాణము సేయుట

“జనమేజయా! మాతృభక్తులగు నప్పాండవులు తల్లిని స్మరించుచు నెంతయుఁ బరితాప మొదవ నెప్పటిచొప్పున రాజకార్యతత్పరులుగాక శోకపూరితులై యుండిరి. ఎవ్వరేని వారితోఁ బ్రసంగించినను బ్రత్యుత్తర మీయకుండిరి. వీరులును, దురాధర్షులును, గాంభీర్యసాగరులునయ్యు శోకోపహతవివేకులై నష్టచేష్టులట్లులైరి. అపుడు వారికిఁ దమతల్లి తలంపునకు రాఁగా నామె యావృద్ధదంపతుల నెట్లు సేవింపఁగలుగుచుండెనో యని చింతయొదవుచుండెడిది. మఱియు వారు ధృతరాష్ట్రునిఁ దలంచికొని, “అయ్యయో! అమ్మహీపాలుఁడు హతపుత్రుఁడై నిరాశ్రయుఁడై క్రూరమృగభూయిష్ఠమగు వనమున గాంధారితోఁగూడ నొక్కరుఁడును నెట్లు వసించుచున్నవాఁడో? మహాభాగయగుగాంధారి హతబాంధవయై యంధుఁడును వృద్ధుఁడునగు భర్తనావిజనారణ్యమున నెట్లు ననుసరించి చరించుచున్నదోగదా! అటులు వారనుకొనుచుండఁగనే యాధృతరాష్ట్రునిఁ జూడవలయునని యొడి

యుత్సాహ మెంతయు వారికి దృఢమై యంకురించెను. అపుడు సహదేవుఁడు యుధిష్ఠిరునకు నమస్కరించి "ఓయగ్రజా! నీవిపుడడవికిఁ బోవనున్నట్టులు నాకెంతయుఁ దోఁచుచున్నయది. నీయెడఁగల గౌరవముచే నీవిషయమును నీకుఁ దెలుప వెఱచుచున్నవాఁడను. నామనోరథ మిప్పటికి సంప్రాప్తించినది. తపస్వినియై కాలముగడుపుచున్న నా తల్లిని గాంచవలయుననియే నాకోరిక. అక్కటా! ఆమె జడలుగలిగి, వృద్ధయై దర్భలు మేనఁ గ్రుచ్చికొన నెట్టియిక్కట్టు లందుచుండెనో? ఆమె ప్రాసాదములందును, హర్మ్యములందును బెరిగి, మిగుల సుఖము లనుభవించెనుగదా! ఎంతయు శ్రాంతయై చింతలఁజివుకుచున్న కుంతి నెపుడు చూడఁగలిగెడినో? మర్త్యులవిధ మొక్కరీతిగా నుండదుగదా! రాజపుత్రియగు కుంతయేమి? సుఖహీనయై వనమున వసించుటేమి?" అని పలికెను.

అది విని యుత్తమాంగనయగు ద్రౌపది, యుధిష్ఠిరునిఁ బూజించి సంతసించి, "ఓమహనీయా! మాయత్త యిప్పటికి జీవించియుండునా? ఆమె నెపుడు చూతునోగదా! నేను బ్రదికియున్నందుల కదియే నాకు సంతోషప్రదము. నీకు ధర్మమందే మతి ప్రవర్తించునేని, నీవు మాకుఁ బాలకుఁడవగుట మాకీశ్రేయము గూర్పఁదగువాఁడవు. ఓరాజా! ఆకుంతీదేవిని గాంధారిధృతరాష్ట్రులను దర్శింపఁగోరు నీవధూజనము, పాదాగ్రస్థితమై యున్నదని తెలియుము." అని తెలుపుటయు నయ్యుధిష్ఠిరుఁ డాద్రౌపదివచనము లాలించి, సేనానాయకుల రావించి, వారితో "ఓనాయకులారా! మాసైన్యమును రథకుంజరసమన్వితముగా నడిపింపుఁడు. వనవాసియైయున్న యాధృతరాష్ట్రమహీపతి నరయువలయు." అని తెలిపి, మఱియుఁ గాంతాజనాధ్యక్షులఁ బిలిపించి, "ఓయీ! వేలకొలఁదిగా, సర్వవిధములగు శిబికలును సమకట్టింపుఁడు. శకటములును బణవములును, గోశమును వెడలుఁగాక. శిల్పులును గోశపాలకులును గురుక్షేత్రాశ్రమమును గుఱించి వెడలవలయును. ఆధృతరాష్ట్రభూపతిని జూచువేడ్కఁ బౌరులలో నెవ్వరికేని గల్గునేని, నిరావరణముగా వెడలుఁగాక. పాచకులు, పౌరోగవులును, మఱియుఁగల సకలమహాజనమును నాయాంబికేయునిఁ జూడ వెడలవచ్చును. మాకు వలయు వివిధభక్ష్యభోజ్య

ములును బద్ధంతో బయలుదేఱవలయును. ఆలస్యముచేయక ఱేపే ప్రయాణమని, చాటింపవలయును. మఱియుఁ ద్రోవలో నందందు గృహములు వెంటనే నిర్మితములగునట్లొనర్పుఁడు." అని యాజ్ఞాపించి, యామఱునాఁడు స్త్రీలతోడను వృద్ధులతోడను గూడ ప్రయాణమై యమ్మహాజనము నణఁకువగా నిలుపుచు నైదుదినములవఱకును బురము వెలుపలనుండి పిమ్మట వనమునకుఁ బోవఁగడంగెను." అని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

## యుధిష్ఠిరుఁడు వనమున కేఁగుట

"జనమేజయా! అప్పుడాయుధిష్ఠిరుఁడు తనసైన్యమును లోకపాలతుల్యులగు నర్జునప్రముఖులు రక్షించునట్లుగా నియమించెను. గుఱ్ఱములను గట్టుఁడనియెడి రౌతులశబ్ద ముప్పతిల్లెను. కొందఱు రథములతో వెడలిరి. మఱికొందఱు కడువడిగల గుఱ్ఱములపైఁ గూరుచుండి ప్రయాణము సాగించిరి. వేఱొక కొందఱేనుగులతోడను, మఱికొందఱొంటెలతోడను వెడలిరి. ఇంకొక కొందఱు తీవ్రప్రాసయోధులై కాలినడకతోఁ బ్రయాణమొనర్చిరి. పౌరులును, జానపదులును బహువిధములగు యానములతో నాధృతరాష్ట్రు నారయ వెడలిరి. ధర్మజు ననుమతిపైఁ గృపాచార్యుఁడు సైన్యమునకు నాయకుఁడై యాశ్రమమునకు వెడలెను. పిమ్మట యుధిష్ఠిరుఁడును, బ్రాహ్మణులు తన్నుఁ బరివేష్టింప, సూతవందిమాగధులు బహువిధములఁ బ్రస్తుతింప, శ్వేతచ్ఛత్రము శిరమున కలంకారముగా, గొప్పరథసైన్యముతో వెడలెను. కొండలునాఁదగు గొప్ప యేనుగులఁ గూడి భీముఁడు ప్రయాణము సాగించెను. ఆయేనుగులపై యంత్రాయుధము లమర్పఁబడియుండెను. నకులసహదేవులు సన్నద్ధకవచధ్వజులును, సుసంవృతులునై గుఱ్ఱముల నధిష్ఠించి కడువడిగా వెడలిరి. అర్జునుఁడును సూర్యతేజముగలరథ మధిరోహించి, ధర్మజుని వెంబడిన వెడలెను. ఆతనిరథము దివ్యములగు శ్వేతాశ్వయుక్తమై శోభిలుచుండెను. స్త్రీజనాధ్యక్షరక్షితలై ద్రౌపది మున్నగుస్త్రీలు శిబికారూఢలై యందందు ధనము నొసంగుచు వెడలిరి. అప్పుడప్పాండవసైన్యము, రథగజాశ్వసమృద్ధమై వీణావేణు వినాదితమై

విలసిల్లెను. రమ్యములగు నదీతీరములందును, సరస్సుల చేరువను, నివసించుచుఁ గ్రమముగాఁ బ్రయాణము సాగించిరి. యుధిష్ఠిరు నానతిచే, యుయుత్సుఁడును, బురోహితుఁడగు ధౌమ్యుఁడును బురమును రక్షించుచుండిరి. అనంతర మాధర్మజుఁడు కురుక్షేత్రము నందలి యాశ్రమము సమీపించి, శతయూపధృతరాష్ట్రు లున్నవనమును జేరికొనియెను. అటులే తక్కినజనము సైతము తద్వనమును మహానాదపూరితముగాఁ జేసె ప్రవేశించెను." అని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

## యుధిష్ఠిరాదులు ధృతరాష్ట్రునాశ్రమముఁ జొచ్చుట

"ఓజనమేజయా! అంత నప్పాండవు లాశ్రమమునకు దూరముండియే, కాలినడకతోఁ బోవువారై రథములు డిగి, సవినయముగా సమీపింపసాగిరి. మఱియుఁగల సకలయోధులును రాష్ట్రజనులును, కురుకాంతలును గాలినడకతోడనే యాశ్రమమును సమీపించువారైరి. ఆధృతరాష్ట్రు నాశ్రమము, మృగగణాకీర్ణమై కదళీవనశోభితమై నిర్జనమగుట నిర్మలముగా నుండెను. పిమ్మట నందులకుఁ బాండవులు వచ్చిరని తెలిసి, నియతవ్రతులగు కొందఱు తాపసులు వారి నారయఁ జనుదెంచిరి. అప్పు డప్పాండవు లత్తాపసులను గాంచి "ఓమహానీయులారా! మా పెదతండ్రియగు కురువంశభూషణుఁడు ధృతరాష్ట్రుఁ డెందున్నవాఁడు?" అని కనుల నీరు వెట్టుచుఁ బ్రశ్నించిరి. అపు డాతాపసు లాపాండవులతో "ఓ రాజవర్యులారా! ఆధృతరాష్ట్రుఁడు యమునానదికి స్నానము చేయుటకును, ఋష్యోదక కుంభమును దెచ్చుటకును వెడలినవాఁడు." అని తెలిపిరి. అంత నప్పాండవు లాతాపసులు తెలిపినమార్గమునుబట్టి, వడిగా వెడలి, పోవుచుండ వారికి దూరమందే యాధృతరాష్ట్రాదులు గానవచ్చిరి. అంత నుయ్యుధిష్ఠిరాదులు ధృతరాష్ట్రదర్శనలాలసులై వడిగా నడువ సాగిరి. అపుడు సహదేవుఁడు కుంతిని గాంచునభిలాషతో వడిగా నందులకుఁ బరువెత్తెను. అతఁ డటులు త్వరగాఁబోయి తల్లిపాదములను బట్టుకొని బిగ్గరగా నేడ్చుటయు, నామెయు బాష్పకలుషముఖియై తన ప్రియపుత్రుఁడగు నాసహదేవుని, లేవఁదీసి, బాహుమధ్యమునఁ

జేర్చి, సహదేవుఁడు వచ్చెనని గాంధారి కెఱిఁగించెను. పిమ్మట నామెకు యుధిష్ఠిరభీమార్జునులును, నకులుఁడును గానవచ్చిరి. అప్పుడామె వారి నారసి, గాంధారీధృతరాష్ట్రులకు ముందుగానుండి వారిని దీసికొనివచ్చుచుఁ దనపుత్రులను సమీపించెను. అప్పుడాయాంబికేయుఁడు వారిస్వరములనుబట్టియు, స్పర్శమునుబట్టియుఁ దెలిసికొని చేరఁదీసెను. అంత నప్పాండవులు కనుల నీరుపెట్టుచు, గాంధారీసహితుఁడగు నతనిని దల్లిని సమీపించి నడుచుచు, వారు పట్టుకొన్న జలకలశములను దామందికొని, కుంతి తమ్మోదార్చుచుండఁగాఁ గొంతవడి కించుకధైర్యము దెచ్చికొనిరి. అనంతర మక్కురుకాంతలును, పౌరులును, జానపదులు నాయాంబికేయునిఁ జూచిరి. పిమ్మట నయ్యుధిష్ఠిరుఁ డందులకు వచ్చినవారినందఱను, నామగోత్రపురస్సరముగా నాధృతరాష్ట్రున కెఱిఁగించుటయు నతఁడు వారినెల్ల గౌరవించెను. అటులు వారందఱును, దన్నుఁ బరివేష్టింప నాధృతరాష్ట్రుఁడు, తా నాహాస్తిపురమునఁ దనయింటనున్న యట్టులు తలంచికొనియెను. పిమ్మట ద్రౌపది మున్నగువారందఱును నాయాంబికేయునకు నమస్కరించిరి. అటులే గాంధారికిఁ గుంతికిని నమస్కరించి నిలుచుటయు, వారు నావధూజనము నాదరించిరి. పిమ్మటఁ, దారాగణములచే సమాకీర్ణమగు నాకసమట్టు లెంతయు వెలయు నయ్యాశ్రమమును వారు సమీపించిరి.'' అని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

## సంజయుఁడు పాండవులను మునులకు వేర్వేఱ నిరూపించి తెల్పుట

"ఓజనమేజయా! అప్పుడాయాంబికేయుఁడు మనోహరాకారులగు నప్పాండవులను గాంధారీకుంతులను గూడి తనయాశ్రమముఁ బ్రవేశించి, నానాప్రదేశములనుండి వచ్చినతాపసులు తన్నుఁ బరివేష్టింప నానందభరితుఁడై యుండెను. అంత నప్పాండవులను జూడ వచ్చినతాపసులు, యుధిష్ఠిరాదులను వేర్వేఱఁ దెలియువారై ప్రశ్నించిరి. అపుడు సంజయుఁడు వారి నుద్దేశించి, "ఓతాపసులారా! వీరినెల్ల నెఱిఁగించెదను వినుఁడు. బంగారుచాయగలమేనితో వెలయుచుఁ సింగపుఁగొదమనా గంభీరస్వరుఁడై తామ్రాయతనేత్రుఁడగు

నితఁడే యుధిష్ఠిరుఁడు. మత్తగజేంద్రగామియుఁ, బ్రతప్తసువర్ణపరి శుద్ధవర్ణుఁడు, నాయతాంసుఁడును, దీర్ఘబాహుఁడు నగునితఁడె వృకో దరుఁడు. చూడుఁడు. అదె చూచితిరా! ఆభీముని ప్రక్కనే మహాధను ర్ధరుఁడును, శ్యామవర్ణుఁడును, యువకుఁడు నై యూథనాథుఁడు నాఁదగిన యీయర్జునుఁడు వెలయుచున్నవాఁడు. విష్ణుమహేంద్ర తుల్యులై, యువకులై యాకుంతిచేరువనున్న వారే నకులసహదేవులు. బలశీలరూపములచే వారు నిరుపమాను లనవచ్చునుగదా! పద్మ దళాయతాక్షియై మధ్యమవయసు ప్రారంభముగా నీలోత్పలవర్ణయై పురదేవతయో, మూర్తీభవించినలక్ష్మియో యన్నటు లున్న యామెయే ద్రౌపది. ఆమెప్రక్కను బంగారుచాయమేనితో మూర్తీభవించిన గౌరినా వెలయుచు, నిరుపమానుఁడగు చక్రాయుధునిసోదరి సుభద్ర యున్నది. సువర్ణకాంతిగల యామె యర్జునునిభార్య యులూపి; భుజగరాజకన్య. మధూకపుష్పసమవర్ణయైన యామె రాజపుత్రియగు చిత్రాంగద. ఎవ్వఁడు కృష్ణునితో స్పర్ధసేయుచుండునో, యట్టిరాజ చమూపతికి సోదరియై, భీమునకు భార్యయైన దానల్లఁగలువచాయది. ఇయ్యది జరాసంధునకుఁ బుత్రియైన సహదేవునిభార్య. ఇందీవర శ్యామాంగియుఁ, బద్మనేత్రయునగు నామె నకులునిభార్య. మెఱుఁగు బంగారుకాంతిగలిగిన యామెయే విరాటపుత్రియు, నభిమన్యు మాతయు నగునుత్తర. వారె శుక్లోత్తరీయలును, సీమంతశిరోరుహలు నై హతపుత్రనాథలైన ధృతరాష్ట్రుని కోడండ్రు చూడుఁడు. బ్రాహ్మణు లగుమీరు ఋజుబుద్ధిగలిగి యడుగుటను గ్రమముగాఁ దెలిపితిని. వీరందఱును రాజకాంతలు." అని తెలిపెను. ఓజనమేజయా! పిమ్మటఁ దాపసులందఱును జనినయనంతర మాయాంబికేయుఁడు తనవారి సేమము నిట్లు క్రమముగాఁ బ్రశ్నించెను."

**ధృతరాష్ట్రుఁడు ధర్మజాదులసేమము నడుగుట**

"ఓయుధిష్ఠిరా! నీవును, నీసోదరులును, పౌరులును, జానపదు లును సేమముగా నున్నవారా? మఱియు నిన్ననుసరించి జీవించువా రందఱును గుశలులై యున్నవారా? ఓనృపోత్తమా! నీమంత్రు లును, భృత్యులును, గురువులును సేమముగా నున్న వారా? మఱియు

నీదేశమందున్న వారు సుఖితులా? వెనుకటి రాజర్షులత్రోవనే పోవు
చున్నవాఁడవా? న్యాయార్జితమగుధనముచే నీకోశాగారము పూరింపఁ
బడుచుండెనా? మిత్రామిత్రమధ్యస్థులయెడఁ దత్తదనుకూలముగాఁ
బ్రవర్తించుచున్నవాఁడవా? బ్రాహ్మణుల నగ్రహారములచే ననుకూల
ముగాఁ గనుఁగొనుచున్నవాఁడవా? నీస్వభావముచేఁ బ్రజలు పరి
తుష్టులగుచున్నవారా! శ్రద్ధాళుఁడవై పితృదేవతారాధన మొనర్చు
చున్నాఁడవా? అధ్యయనవేత్తల కన్నపానములచేఁ దృప్తిఁగల్గించు
చున్నాఁడవా? నీపాలనమందలివిప్రులు స్వకర్మనిరతులై నయమార్గ
మునఁ బ్రవర్తించుచున్నారా? అటులే క్షత్రియులును, వైశ్యులును,
శూద్రులును నుత్తమగృహస్థులై యున్నవారా? స్త్రీలును, బాలురును,
వృద్ధులును నీవిషయమునఁ బరితపింపలేదుగదా? నీప్రజలు యాచింప
నక్కఱలేక సుఖముగా జీవించుచున్నారా? నీగృహమునఁ గుల
కాంతలు గౌరవింపఁబడుచున్నారా? రాజవగు నిన్నాశ్రయించి రాజర్షి
వంశ ముత్కర్షవహించుచున్నదా?" అని ప్రశ్నించెను.

ఓజనమేజయా! అటులు పలుకుచున్న యాధృతరాష్ట్రు నారసి,
న్యాయవేత్తయగు యుధిష్ఠిరుఁ డయ్యాంబికేయునకు సదుత్తర
మొసఁగి, పిమ్మట "ఓమహారాజా! నీశాంతియును, దమమును విఘ్న
మొందక వర్ధిలుచున్నవా? మాతల్లి తమకు శ్రమమునకు శుశ్రూష
చేయుచున్నదా? ఆమె వనవాసము సఫలమగునా? మా పెదతల్లి
యగు గాంధారి, ఘోరతపమువిషయమున శీతవాతాధ్వకర్శితయై
దుఃఖింపలేదు గదా? మఱియు నీమె క్షత్రధర్మపరాయణులై
మహావీర్యనిధులగు తనసుతులు హతులగుటకు శోకింపలేదు
గదా? తత్తనయులనాశమునకు నిమిత్తభూతులమైన మమ్మెల్ల
పుడును నామె వేఱొకవిధముగాఁ దలంపలేదుగదా? ఓరాజా!
ఆవిదురుఁ డెక్కడ నున్నవాఁడు? ఇందు మాకుఁ గానరాలే
దేమి? సంజయుఁడు కుశలియై తపమున నున్నవాఁడా?" అని యడి
గెను. ఓజనమేజయా! ఇటు లాయుధిష్ఠిరుఁడు ప్రశ్నించుటయు
నయ్యాంబికేయుఁడు, "ఓధర్మజా! విదురుఁడు కుశలియై ఘోరతప
మాశ్రయించి, వాయుభక్షుఁడై యాహారమువిడిచి నాడులు గానరాఁ
గృశించి, దిగంబరుఁడును, మలదిగ్ధాంగుఁడును, నై యీయరణ్య

ములో నపుడపుడు గానవచ్చుచున్నవాఁడని బ్రాహ్మణులు తెలుపు
చున్నవారు." అని తెలుపుచుండఁగనే, వనధూళి ధూసరితాంగుఁ
డగుచు, నించుక దూరమందు వారి కాతఁడు గానవచ్చెను. అతఁ
డాశ్రమమునకు మరలివచ్చుచుండ నారసి, యుధిష్ఠిరుఁ డొక్క
రుఁడును నాతని ననుసరించి వెడలెను. ఆవిదురుఁ డాయుధిష్ఠిరునకు
నందొకచోఁ గనఁబడుచు నొక్కచోఁ గానరాక ఘోరారణ్యమును
బ్రవేశించుచుండ, ధర్మజుఁడు 'ఓప్రాజ్ఞా! విదురా! నీకుఁ బ్రియుఁడ
నగు యుధిష్ఠిరుఁడ నిదే నిన్ను దర్శింప వచ్చుచున్నాఁడను' అని
బిగ్గరగాఁ బలుకుచు నాతని నతిప్రయత్నముతో సమీపించువాఁడై
పరువెత్తెను. అంత నాబుద్ధిమత్తరుఁడగు విదురుఁడు, నిర్జనప్రదేశమున
నిలిచియుండెను. అపు డాయుధిష్ఠిరుఁ డాకృతిమాత్రముచేఁ దెలియఁ
దగి, క్షీణప్రాయుఁడై యున్న యావిదురునిఁ దెలిసికొని 'ఓమహాత్మా!
నేను యుధిష్ఠిరుఁడను' అని పలుకుచు నాతనియెదుట నిలువఁబడి
యెను. అపు డతఁడు రెప్పపాటులేక యుధిష్ఠిరు నరసి యరసి, తన
దృష్టి నాతనిదృష్టియందు నిలిపి, గాత్రము లాధర్మజగాత్రములందుఁ
గలిపి, ప్రాణములందుఁ బ్రాణములఁ బ్రవేశపెట్టి యింద్రియముల
నాధర్మజునింద్రియములందుఁ గూర్చి యోగబలముచేఁ గ్రమముగా
నతఁడు తనమే నాధర్మజునిమేనఁ బ్రవేశపెట్టెను. అటు లావిదురుఁడు
యుధిష్ఠిరునిఁ బ్రవేశించి తత్తేజముచేఁ బ్రజ్వలించుచుండెను. అంతఁ
గొంతవడి కావిదురునిశరీరము స్తబ్ధలోచనమై యొకచెట్టును జేరి నిశ్చే
ష్టమై యుండుట యాధర్మజునకుఁ గానవచ్చెను. అపు డాయుధిష్ఠి
రుఁడు తన్ను వెనుకటికంటె బలవంతునిఁగను బహుగుణశాలిఁగను
దలంచి, యోగధర్ముఁడును మహాతేజుఁడు నగుట, మున్ను వ్యాసు
నిచేఁ దెలుపఁబడిన తనపూర్వవృత్తమునెల్ల స్మరించి, పిమ్మట నావిదు
రునికళేబరమునకు సంస్కారముసేయువాఁడై యందులకు సన్నద్ధపడు
టయు, నపు డశరీరవాణి 'ఓయుధిష్ఠిరా! విదురసంజ్ఞగలయీకళేబర
మును దహింపఁదగదు. యతులకళేబరము దహింపఁబడకుండుటయే
సనాతనధర్మము, వైకర్తనలోకము లితని కగును. ఇతఁడు యతిధర్మ
మూని గతించుట నితనియెడఁ బరితాపమొందవలసినది లేదు.' అని
తెలిపెను. అది విని యాయుధిష్ఠిరుఁడు తత్కృత్యమునుండి మరలి,

ధృతరాష్ట్రునాశ్రమము చేరి యాతనితోఁ దద్విషయమెల్లఁ దెలిపెను. అందుల కందలి ప్రజలును, ధృతరాష్ట్రుఁడును, భీమసేనాదులును మిగుల విస్మయమందిరి. అనంతర మాయాంబికేయుఁడు సంతసించి, యుధిష్ఠిరునితో 'ఓపుత్రా! నాకుఁగల యీ జలమూల ఫలముల ననుభవింపుము. ఏమానవుఁ డేయన్నము భుజించునో, దానినే యతఁ డతిథికిఁ బెట్టును.' అని పలుకుటయు నాధర్మజుఁడు, సమ్మతించి, తమ్ములతోఁ గూడ నాధృతరాష్ట్రదత్తములగు ఫలమూలాదులను భుజించెను. అటులు భుజంచి వారందఱు నారాతిరినైత మటులే ఫలమూలజలాశనులై యావృక్షమూలముల నివసించి''రని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

## వ్యాసుఁడు పాండవులకడ కరుదెంచుట

"ఓజనమేజయా! అనంతర మాపవిత్రకర్ములగువారి కాయాశ్రమమున శుభనక్షత్రసంపన్నమై యారాతిరి గడచెను. అప్పాండవులారాతిరి, ధర్మలక్షణములైన కథాప్రసంగములు సేయుచు, విచిత్రసంచారులగుచుఁ, దల్లికి నలుగెలంకులఁ బరుండి నిద్రించి, వేఁకువ యగుటయు మహార్హములగు తచ్ఛయనములు విడిచి, మఱునాఁడును నాధృతరాష్ట్రుఁడు తీసికొన్నయాహారమునే యప్పాండవులును భుజించి మఱియు నారాతిరి గడపిరి. యమ్మఱునాఁడు పౌర్వాహ్ణికక్రియలొనర్చి పిదప యుధిష్ఠిరుఁడు దనతమ్ములతోఁగూడఁ దదాశ్రమప్రదేశమును జూడ వెడలెను. ధృతరాష్ట్రుననుజ్ఞవడసి యంతఃపురజనమును భృత్యవర్గమును సపురోహితముగా వెడలి యాయాప్రదేశములఁ జూడ సాగెను. ఆప్రదేశమున నొకచో మండుచున్న యగ్నులుగల వేదికలు గానవచ్చెను. అందుఁ గృతస్నానులై మునులు హోమమొనర్చుచుండిరి. ఆజ్యధూమములును, వానేయపుష్పములును దత్ప్రదేశము నలంకరించుచుండెను. కొన్ని చోటుల మృగములు గుంపులుగాఁ గూడి యించుకేని భయములేక తదాశ్రమము నాశ్రయించి యుండెను. అటులే పక్షులును దత్ప్రదేశమును నిశ్శంకముగా నాశ్రయించికొని యుండెను. ఒక్కచో నెమిళుల కేకారావములు, దాత్యూహముల కూజితములును, శ్రుతిసుఖకరములైన కోకిలలకుహూనినాదములును

వినవచ్చుచుండెను. వేఱొకచో ద్విజఘోషము లలంకరించుచువచ్చెను. మఱియొకచో ఫలమూలాహారము లెంతయు వెలయుచుండెను. పిమ్మట నయ్యుధిష్ఠిరుఁడు తాపసులకై తెప్పించిన కాంచనకలశములను, రాగి పాత్రములను, జర్మములను, కంబళములను, స్రుక్స్రువములను, స్థాలీ, కమండలుపిఠరములను, లోహభాజనములును, వివిధములగు పాత్రవిశేషములను గోరినవారికెల్ల నొసంగుచువచ్చెను. అటు లతఁడయ్యాశ్రమమెల్లఁ దిరిగివచ్చి, యాహ్నికకృత్యములను దీర్చికొని, శాంతుఁడై గాంధారితో నొకచోఁ గూరుచున్న యాంబికేయుని, వారి కించుకదూరముగాఁ గూరుచున్నకుంతిని గాంచెను. అక్కుంతి యచ్చో శిష్యునట్లు ప్రణతయై శిష్టాచారసమన్వితయై కూరుచుండెను. అపుడు యుధిష్ఠిరుఁడు ధృతరాష్ట్రునిఁ జేరి తనపేరు దెలిపికొనుచుఁ, దన్నతఁడు కూరుచుండుమని నియోగింప, నొకదర్భాసనముపైఁ గూరుచుండెను. పిమ్మట భీమసేనాదులగుపాండవులును వచ్చి నమస్కరించి, యాతనిసెలవుగొని యాప్రక్కలఁ గూరుచుండిరి. వారందఱు నటులు తన్నుఁ బరివేష్టింప, నయ్యాంబికేయుఁ డెంతయు దీప్తమగుబ్రాహ్మ్యలక్ష్మితో వెలయుచు, దేవతలతోఁ గూడియున్న బృహస్పతియట్లు లెంతయు విరాజిల్లెను. అటు లందఱును గూరుచుండ, నందులకు మహర్షు లరుదెంచిరి. మఱియు శతయూపుఁడు మున్నగుకురుక్షేత్రవాసులును నచ్చోటికి వచ్చిరి. దేవర్షి సేవితుఁడై శిష్యులు తన్ను సేవింప నావ్యాసభగవానుఁడును నందులకు విచ్చేసెను. అపుడు ధృతరాష్ట్రుఁడును, యుధిష్ఠిరుఁడును, భీమాదులును నాతని నెదుర్కొని నమస్కరించి శతయూపాదులతో నావ్యాసునిఁ దోడ్తెచ్చిరి. వ్యాసమహర్షి ధృతరాష్ట్రునిఁ గూరుచుండుమని నివేదించెను. పిమ్మటఁ గృష్ణాజినోత్తరమగు దర్భాసనముపై వ్యాసుఁడు కూరుచుండెను. అనంతరము బ్రాహ్మణులందఱును వ్యాసానుజ్ఞాతులై యాయాయాసనము లందుఁ గూరుచుండిరి.” అని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

### వ్యాసుఁడు ధృతరాష్ట్రుని కుశలమడుగుట

“ఓజనమేజయా ! మహాత్ములగుపాండవులు గూరుచుండఁగా, నావ్యాసమహర్షి ‘ఓయాంబికేయా ! నీతపము నిర్విఘ్నముగా జరగు

చుండెనా ? ఓనరాధిపా ! వనవాసము నెడ నీమనము ప్రీతినొందు చున్నదా ? పుత్రనాశనిమిత్తమగుశోకము నీచిత్తమును పీడింప లేదుగదా ! నీజ్ఞానము నిర్మలమైయున్నదా ? నీబుద్ధిని నిశ్చలమొనర్చి కొని యారణ్యకవిధి నాచరించుచున్నవాఁడవా? నీపత్నియగుగాంధారి శోకతిరస్కృత గాలేదుగదా! మహాప్రజ్ఞయు, బుద్ధిమతియు, ధర్మార్థ తత్త్వజ్ఞయు, నాగమవిధిజ్ఞయు నగు నీమె దుఃఖమునకుఁ బాలుగాలేదు గదా ? ఓరాజా ! అహంకారము లేక, కుంతి నీకు శుశ్రూష గావించు చున్నదా ? ఈమె నిజనందనులఁ బరిత్యజించి గురుశుశ్రూషాపరయై యరణ్యమును ప్రవేశించెను గాదే ? మహాత్ముఁడగు ధర్మపుత్రుఁడును, భీమార్జుననకులసహదేవులును, నీయెడఁ బ్రియముగా వర్తించుచున్న వారుగదా ? వీరి నారసి యానందించుచున్నవాఁడవా ? నీచిత్తము నిర్మలముగా నున్నదా ? మఱియుఁ బరిశుద్ధభావుఁడవై తెలియఁదగిన దానిని దెలిసితివా? ఓమహారాజా! అద్వేషము, అక్రోధము, సత్యము, అను నిమ్మూఁడును బరమోత్తమములు లైనవిగదా ! వాని నాశ్రయించి యున్నవాఁడవా? వనవాసముచే నీమోహము నశించెనా ? వన్యాహా రము నీకు వశపడియున్నదా? ఉపవాసవిధి వశమైయున్నదా? మహాత్ముఁ డగువిదురుఁడు యోగవిధి నాశ్రయించి, యుధిష్ఠిరునిఁ బ్రవేశించిన విధము తెలిసెనా ? మాండవ్యునిశాపముచే నాధర్మదేవతయే విదురుఁ డయ్యెనుగదా ! మహాబుద్ధియు, మహాత్ముఁడును, మహాయోగియు నగు నవ్విదురుఁడు మహామహుఁడుగదా ! దేవగురుఁడగు బృహస్పతిగాని, యసురగురుఁడగు శుక్రుఁడుగాని బుద్ధిచే నాతని కీడుగాఁజాలరు. సనా తనుఁడగుధర్ముని, మాండవ్యమహర్షి తనతపోబలము నెల్ల వెచ్చించి శపిం చెను. అపుడతఁడు బ్రహ్మనియోగమునుబట్టియు, నిజబలమునుబట్టియు, నానిమిత్తముగను, విచిత్రవీర్యక్షేత్రమున మహామతియై జనించెను. ఓమహారాజా ! సనాతనుఁడగు నాధర్మదేవతయే నీకు భ్రాతయయ్యెను. ధారణమనోధ్యానములఁబట్టి యతఁడు ధర్మదేవతయని పండితులు తెలియుచున్నారు. సత్య, దమ, శమాహింసలు, దానము మున్నగు వానిచే నతఁడు సనాతనుఁ డనఁబడుచున్నాఁడు. అతఁడు తనయోగ బలముచేఁ గురురాజగు యుధిష్ఠిరుఁడయ్యెను. పృథివ్యప్తేజోవాయ్వా కాశములట్లు లంతటను ధర్మము నిండియుండెను. అధర్మదేవతయే విదు

రుఁడు. ఆవిదురుఁడే యీయుధిష్ఠిరుఁడు. అట్టి యితఁడు నీకుఁ బ్రేష్యు
నట్టులు చరించుచున్నవాఁడుగదా? బుద్ధిమత్తరుఁడగు నీభ్రాత యీతని
మేనఁ బ్రవిష్టుఁడయ్యెను. అటులగుట కాతనియోగబలము నిమిత్త
మయ్యెను. ఓధృతరాష్ట్రా! అచిరకాలమున నిన్నును శ్రేయమొందించు
వాఁడను. ఓపుత్రకా! నీకుఁగలసంశయములనెల్లఁ దీర్చువాఁడనై
వచ్చితినని తెలియుము. పూర్వపుమహర్షులును జేయలేనియుత్తమతప
మునకు ఫలభూతమైన యొకయాశ్చర్యమును నీకుఁ గానిపించెదను.
ఓ మహీపాలా! నావలన నేమి గోరెదో యెఱిఁగింపుము. నీవేమి
యడిగెదో? ఏమి వినఁగోరెదో? ఏమి చూడఁ దలంచెదో? తెలుపుము.
దానినెల్లఁ దీర్చువాఁడను." అని పలికెనని తెలుప విని జనమేజయుఁ
డిట్లనియె.

## ధృతరాష్ట్రుఁడు తనపుత్రులను గాంచుట

"ఓవైశంపాయనా! ఆధృతరాష్ట్రమహీపతి, గాంధారియుఁ,
గుంతియు వెంటరా, వనవాసమొనర్పఁగాఁ విదురుఁడు ధర్మరాజుతో
నైక్యముచెందఁగాఁ, బాండవు లాయాశ్రమప్రదేశముల నివసింపఁగా,
వ్యాసుఁ డేమో యాశ్చర్యమును జూపెదనని, తెలిపెనుగదా! అది
యెట్టిదో నా కెఱిఁగింపుము. మఱియు నయ్యుధిష్ఠిరుఁ డవ్వనమున
నెంతకాలము వసించెను? అప్పాండవు లెట్టియాహారములు గొనుచు
నిజసైన్యములతోఁ గూడి యందుండిరి? వారియంతఃపురజనమును నం
దుండెనా? నా కెఱిఁగింపుము."

అది విని వైశంపాయనుఁడు జనమేజయుం జూచి "ఓయీ!
అపు డాపాండవు లాధృతరాష్ట్రుననుజ్ఞ వడసి, వివిధములగునన్న
పానము లనుభవించుచునొకనెల యాయాశ్రమమందే సైన్యములతోఁ
గూడి విహరించుచువచ్చిరి. పిమ్మట నందులకు వ్యాసుఁ డరుదెంచెను.
ఆధృతరాష్ట్రునిసన్నిధిని వారందఱును కథలతోఁ గాలముపుచ్చుచుం
డఁగా, నందులకు నారదపర్వతులును, దేవలుఁడును, విశ్వావసుఁడును,
దుంబురుఁడును, జిత్రసేనుఁడును నరుదెంచిరి. అపు డాధృతరాష్ట్రు
ననుజ్ఞవడసి యుధిష్ఠిరుఁడు వారిని విధ్యుక్తముగాఁ బూజించెను.
ఆధర్మజుని పూజలందికొని యమ్మహామునులు పవిత్రములగు దర్భాస
నములపైఁ గూరుచుండిరి. వారటు లాసనోపవిష్టులయినపిదప ధృత

రాష్ట్రుఁడును బాండవపరివృతుఁడై కూడుచుండెను. గాంధారియుఁ, గుంతియు, ద్రౌపదియు, సుభద్రయు, మఱియుఁగలకాంతలును సందుఁ గూరుచుండిరి. పురాణమహర్షులయు దేవాసురలయుఁ గథలు, దివ్యములు ధర్మిష్ఠములునై యపుడు ప్రవర్తిల్లసాగెను. తత్కథాంతమునఁ బ్రజ్ఞాదృష్టియుఁ బ్రభువునగు ధృతరాష్ట్రునిఁ గాంచి యావ్యాసుఁడు ప్రీతివెలయ, 'ఓరాజా! నీహృదయమున నేమి తలంచియున్నవాఁడవో తెలిసికొంటిని. నీవు నిజపుత్రకృతమగుశోకముచే దగ్ధుఁడవగుచున్నవాఁడవు. నిత్యము గాంధారికిని నా యీతెలిపినదుఃఖమే నాఁటికొని యుండును. అటులే కుంతికిని ద్రౌపదికిని గర్ణునియు, నుపపాండవులయు వినాశముచేనైనదుఃఖము పీడాకరమగుచున్నది. సుభద్రయు నభిమన్యునిమృతికిఁ బరితపించుచుంట నాకుఁ దెలియును. మీయందఱ పరితాపమును నేనెఱిఁగియే యిందుల కరుదెంచితిని. నీకుఁ గలసంశయమును నైతము తీర్ప వచ్చితిని. వీరె దేవగంధర్వాదులు. వీరె మహర్షులు. నేను జిరకాలమునుండియు సంపాదించిన తపోబలమును వీరందఱును గనుఁగొందురుగాక. ఓమహారాజా! నీకేమి కావలయునో యొసంగుచున్నాఁడను. నీకు వరమొసంగ సిద్ధపడి యున్నవాఁడను. నాతపఃఫల మిదె చూడుము.' అని తెలిపెను.

ఓజనమేజయా! అమేయబుద్ధియగు నావ్యాసుఁ డిట్లు తెలుప విని రెండుగడియలకాల మాలోచించి, యాధృతరాష్ట్రుఁడు, 'ఓమహాత్మా! నీవు నన్ననుగ్రహించితివి. నాజీవితము సఫలమయ్యెను. సజ్జనులగుమీతో నాకిపుడు, సమాగమము సంభవించినది. ఓతపోధనులారా! బ్రహ్మకల్పులగు మీయందఱదర్శనమును గలుగుటచే, నాయిష్టగతి గలిగెననియే నిశ్చయించుకొనుచున్నాను. నీదర్శనమువలననే నేను బావనుఁడనగుట నిశ్చయము. ఓయనఘులారా! నాకుఁ బరలోకము నుండియు భయములేదు. కాని, దుర్బుద్ధియు మందుఁడునగు దుర్యోధనుని యపనయముల కెంతయు నాచిత్తము పరితపించుచున్నది. పాపరహితులగుపాండవుల నప్పాపబుద్ధియగు సుయోధనుఁ డెంతయు నవమానపఱచెనుగాదే! నాతనయులమూలముననే, పదాతిగజాశ్వసహితముగాఁ బృథివియెల్ల నశింపఁజేయఁబడియెను. మఱియు మహాత్ములగు నానాదేశాధీశులును మడిసిరి. క్షత్త్రియులనేకులు నాపుత్రునికిఁగాఁ

బ్రాణములు గోల్పోయిరి. అయ్యయో! యువకులగువారందఱును దమతండ్రులను భార్యలను మనఃప్రియములగు ప్రాణములను బరిత్యజించి యమమందిరము నందిరిగదా! ఓమహామునీ! మిత్రకార్యము నకుఁగా గతించినవారి కెట్టిగతి గలుగునో? అటులే రణనిహతులైన నాపుత్రులకును బౌత్రులకును నేమిగతి గలుగునో? ఇమ్మహాబలము నెల్లఁ జంపించినందులకు నామన మెంతయుఁ బరితపించుచున్నది. అక్కటా! వృద్ధుఁడగు శాంతనవుఁడును ద్విజోత్తముఁడగు ద్రోణుఁడును, మహాత్ముఁడగు నాపుత్రునిమూలమున హతులైరి. అవివేకియుఁ బాపుఁడునగు నాతనయుఁడే రాజ్యాభిలాషియై దీప్తమైనకులము నెల్లఁ గూలిచినవాఁడయ్యెను. రేపవలు నిదియెల్లఁ దలంచుచున్న నాచిత్తము దుఃఖశోకసమాహతమై శాంతినపొందకున్నది. ఓనాయనా! ఇటులు పరితపించుచున్న నాకు శాంతి యెట్లొదవెడిని?' అని తెలిపెను.

ఓజనమేజయా! ఆయాంబికేయుని పలువిధములగుపరిదేవనవచనము లాలించినగాంధారికిఁ బ్రాతవడిన దుఃఖమెల్లఁ గ్రొత్తదయ్యెను. ఆమె శోకింపఁగనే కుంతియు, ద్రౌపదియు, సుభద్రయు, మఱియుఁగల కురుకాంతలును, ధృతరాష్ట్రుఁడును శోకింపసాగిరి. పుత్రశోకవశయై గాంధారి బద్ధనయనయై యుండుట మెల్లగా లేచి చేతులు మొగిడ్చి వ్యాసునితో 'ఓమహాత్మా! మునివర్యా! మాసుతులు హతులైన పిమ్మటఁ బదునాఱువత్సరములు గతించెను. ఇన్నినాళులును నీతనయుఁడగు నితఁడు శాంతిలేక శోకించుచునే యున్నవాఁడు. ఇతఁడు ప్రతిదినమును, హతసుతదుఃఖావిష్టుఁడగుచు, నిట్టూర్పులువుచ్చుచునే యెచ్చోటనైనను నివసించుచున్నవాఁడు. నీవు నీతపోబలమునుబట్టి మఱికొన్నిలోకములను సకలమును సృజింప సమర్థుఁడవగుచున్నాఁడవు. లోకాంతరగతులగు సుతుల నితనికిఁ జూపను శక్తిగలవాఁడవు. మాకోడండ్రయం దందఱిలోఁ బ్రియయగు నీద్రౌపది, సుతుఁడును జ్ఞాతులును హతులగుట నెంతయుఁ జింతపడుచున్నది. అటులే కృష్ణసోదరియగుసుభద్రయు, నభిమన్యునికై పరితపించుచున్నయది. ఇదె యాభూరిశ్రవుని భార్యయు, భర్తృవ్యసనశోకార్తయై మిగుల దుఃఖించుచున్నది. మఱియు నామె మామయగు బాహ్లీకుఁడును బుత్రుఁడగుసోమదత్తుఁడును మృతినొందిరిగాదే? సంగ్రామరంగమున మరలక

హతమైనసుతశతమును దలంచి నీసుతుఁడు పలవించుచున్నవాఁడు. వారిభార్యలు నూర్వురును దుఃఖార్తలై మఱిమఱియు మాయిరువుర శోకమును వర్ధిలఁజేయుచున్నవారు. మహాత్ములును, శూరులును, మహారథులునగు నామామలు సోమదత్తప్రభృతులు పొందినగతి యెట్టిదో తెలియదుగదా! నీయనుగ్రహముచే నితఁడు దుఃఖరహితుఁ డయ్యెను. అటులే నేనును మాకుంతియు నెట్లు వీతశోకులమగుదుమో, యటులొనర్ప వేఁడుచున్నదానను.' అని పలికెను. అటులాగాంధారి పలికినతోడనే, వ్రతకృశవదనయై యున్నకుంతియు నాదిత్యతుల్యుఁడై ప్రచ్ఛన్నజాతుఁడైన పుత్రునిఁ గర్ణునిఁ దలంచెను. అపుడు దూరశ్రవణదర్శనుఁడగు నావ్యాసుఁడు పాండవమాతయగు కుంతి దుఃఖితయైయుంటఁ దెలిసికొని 'దేవీ! నీచిత్తమునఁ గలదేమో తెలుపుము.' అని ప్రశ్నించెను. అది విని యాకుంతి తలవంచి సిగ్గుగదురఁ బురాతనచరిత్రమును వివరించునదై యిట్లు పలికెను." అని తెలిపి మఱియు వైశంపాయనుఁ డిట్లనియె.

### కుంతి కర్ణునిజన్మ మెఱిఁగించుట

"ఓజనమేజయా! ఆకుంతి తనమామయగు వ్యాసు నుద్దేశించి, 'ఓమహానీయా! నీవు మాకు మామవును మఱియు దైవతములలో దైవతమవు దేవాదిదేవుఁడవు నగుటలో సందియము లేదు. కావున సత్యమొకటి తెలిపెదను. వినుము. మున్నొకపుడు తపస్వియుఁ బరమకోపనుఁడును విప్రవర్యుఁడునగు దుర్వాసుఁడు మాతండ్రియింటికి భిక్షుకై వచ్చియుండ, నాతనికి సంతసము గల్గునట్లుగాఁ బ్రవర్తించితిని. శౌచముచేతను, నపరాధక్షమార్పణములచేతను, బరిశుద్ధచిత్తముచేతను నాతని మెప్పించితిని. అతఁ డెంతకోపపడువాఁడైనను నాతనియొద్ద శాంతముగా మెలంగితిని. అటులగుట నతఁ డెంతయు సంతసంపడి 'ఓరాజపుత్రీ! నీకు వలసినవరము గోరికొమ్ము' అని పలికెను. అపుడు నేనందులకు సమ్మతింపనేని శపించునేమో యని వెఱచి, యటులే వరమిమ్మని వేఁడితిని. అపుడతఁడు మఱియు నన్నుఁ గాంచి 'ఓభద్రా! నీవు ధర్మజననివయ్యెదవు. నీవు పిలుతువేని దేవతలు నీకు వశులై వర్తిల్లుదురు.' అని తెలిపి యంతర్హితుఁడయ్యెను. అందులకు నే

నాశ్చర్యపరవశనైతిని. సర్వావస్థలందును నదియే నాస్మృతిపథమునఁ బ్రవర్తిల్లుచుండెను. అంత నే నొకపుడు హర్మ్యమునఁ గూరుచుండి, యపుడే యుదయించుచున్న భాస్కరునిఁ గాంచి, యమ్మహర్షి వచనము నాకుఁ దలంపునకురా నాదివాకరునిఁ గోరుచు, నందలిదోష మెట్టిదో బాలభావముచే నెఱుఁగక, యాతని నాహ్వానించితిని. అంత నాసహస్రాంశుఁడగు సూర్యభగవానుఁడు నన్ను సమీపించువాఁడై, తన దేహము రెండువిధములుగా నొనర్చి, యొకట గగనము నలంకరించుచు, వేఱొకట నాప్రాసాదమును జేరి, వెఱపుచే వణఁకుచున్న నన్నుఁ దిలకించి, 'ఓకుంతీ! నన్నాహ్వానించివి. కావున నావలన వరము గోరికొమ్ము.' అని పలికెను. అంత నే నాతనియెదుటఁ దలవంచికొని 'దేవా! నీవు వెడలిపొమ్ము' అని పలుకుటయు, నతఁడు మఱియు నాతో 'ఓసీ! నన్ను వ్యర్థముగాఁ బిలుచుట నీకుఁ దగనిపని. నాచెప్పిన చొప్పున వర్తింపవేని నిన్నును నీకు వరమొసంగిన యావిప్రుని నశింపఁజేయువాఁడను.' అని పలికెను. అది విని, యుపకారియగు నావిప్రుని, శాపమునుండి నివారించుదాననై 'దేవా! నీవు తప్పదందువేని, నీయట్టిపట్టి యొకఁడు గల్గునట్లు ప్రసాదింపుము.' అని కోరితిని. అంత నతఁడు తనతేజము నాయెడఁ బ్రవేశపెట్టి, 'దేవీ! నీకుఁ బుత్రుఁడుదయించు'నని తెలిపి యెప్పటిచొప్పున నాకసము చేరెను. పిమ్మట నేను నాభవనమధ్యమునసుండి నావృత్తాంతమును దండ్రికిఁ దెలియనీక, రహస్యముగాఁ బుట్టినబాలుఁడై యున్న కర్ణుని జలమున విడిచితిని. పిమ్మట నమ్మునివచనముచేత నే, యాదేవు ననుగ్రహమూలమునఁ గన్యాత్వము చెడకయుండితిని. మూఢనైన నేను పుత్రుని సులక్షణము తెలిసియు నుపేక్షించితిని. అదియే నాచిత్తమును దహించుచున్నది. ఇది నీకుఁ దెలియనిదిగాదు. ఇది పాపమో పుణ్యమో గాని నీకెఱిఁగించితిని. ఓమహానీయా! వానిని జూడఁ గోరుచున్నదానను. ఈ నాపరితాపమును దలఁగింపఁదగుదువు. ఈరాజు హృదయగతమగునదియు నీకుఁ దెలియనిదిగాదు. అటులగుట నితఁడును సద్గాని నొందుఁగాక' అని తెలిపెను. అది విని వేదవేత్తయగు నావ్యాసమహర్షి, 'దేవీ! నీవు తెలిపిన దెల్లనిజము. ఇందు నీతప్పేమియును లేదు. నీకప్పటికిఁ గన్యాత్వభంగమును గలుగలేదు. విభుత్వముగల దేవతలు

తమమూర్తుల నీయందుంచిరి. సజ్జనులగు దేవతలు సంకల్పమువలననే జనింపఁజేయఁగల్గుదురు. వారు వచనముచేఁగాని, చూచుటచేఁగాని, స్పర్శముచేఁగాని, సంతోషించుటచేఁగాని, సంకల్పముచేఁగాని వలసిన కోర్కెల సృజింపఁ గలుగుదురు. మానవధర్మమునఁ బ్రవర్తించు నీ కిందు మోహమేమియు నున్నట్లు గానరాదు. ఓకుంతీ! నావచనములు వింటివిగదా! ఇఁక నీమనస్తాపము పరిత్యజింపుము. బలవంతులగువారి దంతయుఁ బథ్యమె. అంతయు శుచియె. అంతయు ధర్మమె. అంతయుఁ గర్తవ్యమె. కావున నీవొనర్చినదానిలో దోషమేమియును లేదు' అని తెలిపి వ్యాసుఁడు మఱియు నిట్లనియె.

### వ్యాసుఁడు ధృతరాష్ట్రాదులవిధ మెఱిఁగించుట

'ఓగాంధారీ! నీవు నీపుత్రులను నీభ్రాతలను జూడఁగలవు. రాత్రి నిద్రించి మేలుకన్నవారినిబోలె నీబందుగుల నందఱఁ గనుఁ గొందువు. అటులే యిక్కుంతి కర్ణుని, సుభద్ర యభిమన్యునిఁ జూడఁ గలదు. ద్రౌపది తనపుత్రులను దండ్రిని భ్రాతలను గాంచఁగలదు. ఈ ప్రయత్న మింతకుమున్నే నాకుఁగలదు. దానిని, నీవును గుంతియు నుద్బోధము గావించితిరి. మహాత్ములగు వారికై శోకింపఁబనిలేదు. వారు క్షత్రియధర్మపరులై మరణమందిరి అది సురకార్యమగుట యవశ్యమై జరగెను. దేవతలయంశములే వారుగాఁ బుడమి నవతరించుటను దెలియుఁడు. గంధర్వులు,నప్సరసలు, పిశాచ, గుహ్యక, రాక్షసులును, బుణ్యజనులు, సిద్ధులు, దేవర్షులును, దేవతలును, దానవులును, బుడమి నవతరించి, కురుక్షేత్రమున రణరంగమున హతులైరి. ధృతరాష్ట్రుఁడనియెడి గంధర్వరాజు మానవుఁడై యీధృతరాష్ట్రుఁడుగా నుదయించెను. మరుద్గణములో నుత్తముఁడగు నొకఁ డిప్పాండురాజుగాఁ బ్రభవించెను. ధర్మునియంశములే విదురుఁడుగను నీయుధిష్ఠిరుఁడుగను నుద్భవించె నని తెలియుము. కలి దుర్యోధనుఁ డయ్యెను. ద్వాపరము శకుని యయ్యెను. ఓగాంధారీ! దుశ్శాసనాదులు రాక్షసులని తెలియుము. వాయ్వంశమున భీముఁడును, మహర్షి యగునరునియంశమున నీధనంజయుఁడును జనించిరని తెలియుము. నారాయణుఁడే వాసుదేవుఁడు. నకులసహదేవు లశ్వినీదేవతలు, సూర్యుఁడు తనదేహమును రెండు

విధములుగాఁ జేసి యందొకటఁ గర్ణుఁడయ్యెనని తలంపుఁడు. మహారథులార్వురు గలిసి యెవ్వని వధింపఁగలిగిరో, యట్టిపాండవదాయాదుఁడగు నభిమన్యుఁడు సోముఁడని తెలియుము. ఆసోముఁడు యోగబలముచే రెండుమూర్తులై యందొకట నభిమన్యుఁడయ్యెను. ద్రౌపదియు, ధృష్టద్యుమ్నుఁడును, నగ్నిదేవునియంశములని తెలియుము. శిఖండి రాక్షసాంశసంభూతుఁడు. అటులే ద్రోణుఁడు బృహస్పతి యంశమునుండియు, నశ్వత్థామ శంకరునంశమునుండియు జనించిరి. గాంగేయుఁడగుభీష్ముఁడు వసువులలో నొకఁడే మానవత్వ మొందఁగా జనించెనని తెలియుము. ఓగాంధారీ! దేవత లిట్లు మానవత్వ మొంది, తమకుఁ దగుకర్మ మొనర్చి మరల స్వర్గ మొందిరి. పరలోకకృతమగు భయముచే మీకుఁగలిగిన చిరదుఃఖమును దొలఁగించెదను. మీరందఱును భాగీరథీనదికి బయలువెడలుఁడు. రణరంగమున మడిసినయాయోధుల నెల్ల నందుఁ గాంచఁగలరు.' అని తెలిపెను. ఓజనమేజయా! ఆవ్యాసభగవానునివచన మాలించి, యందలివారందఱును, గొప్పసింహనాదములతో గంగానది కభిముఖులై వెడలిరి. ధృతరాష్ట్రుఁడును, బాండవులును, మంత్రులును వెంటరా భాగీరథికి బయలువెడలెను. ఆతనివెంబడిని మునులును గంధర్వాదులును వెడలిరి. అటు లమ్మహాజనసముద్రము వెడలి క్రమముగా భాగీరథిని జేరి యచ్చో సంతసమెలయ సుఖముగా నివసించెను. పరిచారకులతోడను బాండవులతోడను గూడి, ధృతరాష్ట్రుఁడును, స్త్రీవృద్ధపురస్సరముగా నొకమంచిప్రదేశమున నివసించెను. నాఁటినిశను బ్రతీక్షించుచున్న యాధృతరాష్ట్రాదుల కాపగ లొకవర్షశతమువోలెఁ గడచెను. వారు మృతులైనయోధులను జూడఁగోరి త్వరపడుచుండిరి. అంత నాభాస్కరభగవానుఁ డస్తాద్రిగతుఁ డయ్యెను. వారందఱును స్నానమొనరించి నిశాకృత్యము లాచరించిరి." అని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

## ధృతరాష్ట్రాదులు మృతులను గాంచుట

"ఓజనమేజయా! నాఁడు నిశాసమయమగుటయు, వారందఱును గృతస్నానాదికృత్యులై వ్యాసమహర్షిని సమీపించిరి. ధర్మాత్ముఁడగు ధృతరాష్ట్రుఁడును బాండవులతోఁగూడి, శుచియు, నేకాగ్ర

చిత్తుఁడు నై మహర్షులు తన్నుఁ బరివేష్టింపఁ గూరుచుండెను. అటులే గాంధారియుఁ దక్కినకాంతాజనముతోఁ గూరుచుండెను. పౌరులును జానపదులును గూరుచుండిరి. పిమ్మట మహాతేజుఁడగు నావ్యాసభగవానుఁడు పవిత్రమగు భాగీరథీజలముల మునిఁగి, పాండవులయోధులను, కౌరవులయోధులను, మఱియుఁగల నానాదేశపురాజులను రమ్మని పిలిచెను. అపు డాజలసమీపమున నొకసంకులారావ ముద్భవించెను. అప్పు డెప్పటిచొప్పునఁ గురుపాండవసేనలన్నియు నొక్కచో గూడియుండుట గానన య్యెను. అనంతరము భీష్మద్రోణప్రభృతులగు వారందఱును వేలకొలఁదిగా సైన్యములతో నాగంగాజలమునుండి వెడలిరి. సైనికులతో విరాటద్రుపదులును, ద్రౌపదేయులును, నభిమన్యుఁడును, రాక్షసుఁడగు ఘటోత్కచుఁడును, కర్ణదుర్యోధనులును, శకునియు, మహాబలులగు దుశ్శాసనాదిధార్తరాష్ట్రులును, భగదత్తజరాసంధపుత్ర, జలసంధులును, భూరిశ్రవుఁడును, శలుఁడును, శల్యుఁడును. సోదరసహితముగా వృషసేనుఁడును, లక్ష్మణుఁడును, ధృష్టద్యుమ్నపుత్రుఁడును, శిఖండిపుత్రులును, ధృష్టకేతుఁడును, వృషకుఁడును, రాక్షసుఁడగు నలాయుధుఁడును, బాహ్లీకసోమదత్తచేకితానులును,మఱియుఁగలయనేకులును, ప్రదీప్తదేహులై యాగంగాజలమునుండి వెలువడిరి. మున్నాయుద్ధకాలమున, నేయేవీరున కేయేవేషమో, యేయేధ్వజమో, యేయేవాహనమో వానివానితోడనే గానవచ్చిరి. వారందఱును దివ్యాంబరధరులు. అందఱును గుండలాలంకృతులు. మఱియు నందఱును, నిరహంకారులును, నిర్వైరులును, క్రోధమత్సరరహితులును నై గానవచ్చిరి. వారిని వందులును, గంధర్వులును, సన్నుతించుచుండిరి. దివ్యమాల్యాంబరధరులగువారి నప్సరోగణములావరించియుండిరి. అపుడు వ్యాసమహర్షి ప్రీతుఁడై ధృతరాష్ట్రునకుఁ దనతపోబలముచే దివ్యదృష్టి నొసంగెను. గాంధారియు దివ్యజ్ఞానము గలిగి తనపుత్రులను, రణనిహతులైన తక్కినయోధులను జూచెను. అయ్యది యత్యద్భుతమై, యచింత్యమై, గగురుపాటొదవించునదయ్యెను. అందలిజనమెల్ల నయ్యద్భుతము నారసి విస్మితులైరి. సకలనరనారిసంతోషదాయకమును నాశ్చర్యకరమునగు నయ్యది చిత్రపటగతమట్టులు వారికిఁ గానన య్యెను. ధృతరాష్ట్రుఁడు తనదివ్యదృష్టిచే

వారినెల్ల నరయుచు నమ్మహర్షి యనుగ్రహమున కెంతయు నలరుచుండెను." అని తెలిపి మఱియు నవ్వైశంపాయనుం డిట్లనియె.

### మృతయోధు లొకరినొకరు గలియుట

"ఓజనమేజయా! పిమ్మట నాభారతయోధులందఱును, క్రోధమాత్సర్యరహితులై, నిష్కల్మషులై పరస్పరము గలిసికొని, బ్రహ్మర్షివిహితమగు పరమవిధి నాశ్రయించి సంతుష్టాంతరంగులై దేవలోకమున నమరులట్లులు వెలయఁజొచ్చిరి. అటులు బ్రతికివచ్చిన మృతులతోఁ బుత్రులు తలిదండ్రులతోడను, భార్యలు భర్తలతోడను గలిసిరి. అటులే తమ్ముఁ డన్నను, మిత్రుఁడు మిత్రునిఁ గలిసికొనిరి. పాండవులు మహేష్వాసుఁడగు కర్ణుని, నభిమన్యుని, ద్రౌపదేయులను గలిసికొని పరమానందభరితులైరి. అటు లప్పాండవులు కర్ణునిఁ గూడి మైత్రి వెలయఁ బ్రవర్తిలుచుండిరి. మఱియు యోధులందఱును గలిసిరి. ఓజనమేజయా! అమ్మునియనుగ్రహమున నమ్మనుజపతులందఱును బరస్పరసౌహార్దము వెలయఁ గూడికొని, యారాత్రియెల్ల సుఖవిహారమొనర్చుచు స్వర్గసౌఖ్య మనుభవింపసాగిరి. వారి కపుడు భయముగాని, దుఃఖముగాని యేమియు లేకుండెను. నాఁటిరాత్రి యాగంగాతీరమునకు వచ్చినవారందఱును, దండ్రులతోఁగలిసినవారును భ్రాతలగూడినవారును, భర్తలను సమీపించినవారును నై పరమానందమొందిరి. స్త్రీలు భర్తలఁగూడి దుఃఖము పరిత్యజించిరి. వారటు లాయొకరాత్రియుఁ బరస్పరసంభాషణాలింగనాది సౌఖ్య మనుభవించుటయుఁ, బిమ్మట నమ్ముని యమ్మృతుల నెప్పటిచొప్పున వారిని వారిలోకములకు విడిచెను. ఓజనమేజయా! అందఱివారు చూచుచుండఁగనే యమ్మృతయోధులందఱును నంతర్హితులైరి. వారు మున్నే గంగాజలమునుండి వెడలిరో యందే రథధ్వజాదులతోఁ బ్రవేశించి, కొందఱు దేవలోకమును, మఱికొందఱు బ్రహ్మలోకమును, నింకొకకొందఱు వరుణలోకమును, దక్కినకొందఱు కుబేరలోకమును జేరిరి. కొందఱు వైవస్వతలోకమునకుఁ బోయిరి. మఱికొందఱు రాక్షసపిశాచలోకములఁ జేరిరి. కొంద ఱుత్తరకురులోకములకుఁ బోయిరి. వారందఱు నటులు వెడలఁగా నమ్మహర్షి యొక

వేదవ్యాసుఁడు, కురువంశ్యులహితముగోరి, హతభర్తృకలగు క్షత్త్రియ కాంతలతో 'ఓయుత్తమాంగనలారా! మీలో నెవ్వరెవ్వరు తమ భర్తలలోకములనొందఁగోరెదరో, వారందఱును వడిగా నీజాహ్నవీ జలములఁ బ్రవేశింతురుగాక' అని పలికెను. అది విని యాయుత్త మాంగనలు శ్రద్ధగదురఁ దమమామయగు ధృతరాష్ట్రునికడ సెలవు గొని పావనమగు గంగాజలములఁ బ్రవేశించి, మానవదేహములఁ బరి త్యజించి భర్తలఁగూడి యుత్తమలోకములను బయలువెడలిరి. క్రమ ముగా నొక్కొక్కరును, పావనగంగాజలములఁ జొచ్చి ముక్తలై భర్తృలోకములకు వెడలి దివ్యరూపసంపన్నలును, దివ్యాభరణభూ షితలును, దివ్యమాల్యాంబరధరలును నై భర్తలఁ జేరిరి. ఆమృత యోధులును శీలగుణసంపన్నులై విమానములపైఁ గూర్చుచుండి తమ తమస్థానములకుఁ బోయిరి. ఆటు లావ్యాసమహర్షి ప్రభావముచే నర దేవులపునరాగమనవార్త విని నానాదేశవాసులును సంతోషము నొందిరి. ఈనా తెలిపిన ప్రియసమాగమకథ నెవరు విందురో వారిహ పరములందును శ్రేయమందుదురు. ఎవ్వఁ డీయిష్టబాంధవసమాగమ కథను వినిపించునో వాఁ డీలోకమున నుత్తమయశము గాంచి పర లోకసౌఖ్యములఁ బడయును. స్వాధ్యాయనిరతులకును, దపోనిష్ఠుల కును, సాధ్వాచారులకును, దాంతులకును, శాంతులకును, హింసావృత వర్జితులకును నగునుత్తమలోకము లీయాశ్చర్యకథను వినినవారి కగు"నని వైశంపాయనుఁడు తెలుప విని జనమేజయుం డిట్లనియె.

## వైశంపాయనుఁడు భూతనిత్యత తెల్పుట

"ఓవైశంపాయనా! నాపితామహుల యాగమనమును గమన మును దెలిపితివిగదా! మృతులై పరిత్యక్తదేహులైనవారిరూపముల మరల నెట్లు గానవగును?"

సూతుఁడు:—మునులారా! అది విని యావైశంపాయనుఁడు "ఓజనమేజయా! సకలకర్మములకును నాశము లేదనుట నిశ్చయము. శరీరములును, నాకారములును గర్మమునుబట్టి గలుగుచుండును. భూ తాధిపతి నాశ్రయించుచుండుటనుబట్టి భూతములు నిత్యము లనఁ బడును. వినాశకాలమున వియోగ మొందునట్టి యాభూతములఁ

తోడ నిత్యసంవాసము సంభవింపదు. ఆకారరహితముగ నొనర్పఁబడిన కర్మము, తత్ఫలము, దేహము ననియెడి మూఁడిటిని గూడ క్షేత్రజ్ఞుఁడు సుఖదుఃఖముల ననుభవించుచుండును. ఆ క్షేత్రజ్ఞునకు నాశము లేదనుట నిశ్చయము. కర్మము నశించునంతకును భూతములకు స్వరూపముండును. క్షీణకర్ముఁడగు మానవుఁడు రూపాంతరమును దలఁగించుకొనుచున్నాఁడు. భూతేంద్రియాదు లేకత్వమొంది, దేహము నాశ్రయించును. అవియే పృథగ్భావము నెఱిఁగిన యోగుల యెడ నిత్యములగుచున్నవి. అశ్వసంజ్ఞపన, విషయమున నశ్వమేధమున నొకశ్రుతి గలదు. అందు శరీరులప్రాణములు, లోకాంతరగతము లయ్యు నిత్యములని తెలుపఁబడియెను. ఓపార్థివా! నీవు వినఁదలంతు వేని, నేనొకహిత మెఱిఁగించెదను వినుము. యజ్ఞసంస్తరమున, దేవయానములగుమార్గములు చెప్పఁబడినవి. నీ వొనర్చిన యుత్తమ యాగమునుబట్టి దేవతలు నీకు హితులై యున్నవారు. ఆ దేవతలు ప్రాణులలోకముల నొందించుటలోను, బొందింపకుండుటలోను సమర్థులు. అట్టియుత్తమయాగము లొనర్చినవా రుత్తమగతి నొందుచున్నారు. అట్టివారు నిత్యులు తక్కటివారు నిత్యులు కాఁజాలరు. పాంచభౌతికమగు దేహవర్గము నిత్యము. తద్ద్రష్టయగుపురుషుఁడు నిత్యుఁడు. నిత్యములగు నట్టివి నశించెనని యెవ్వఁడు పరితపించునో వాఁడు మూఢుఁ డనఁబడును. పుత్రమిత్రాదియోగమునెడ దోషము కనిపెట్టినవాఁడు సంయోగమునే విడువవలయును. సంగరహితమగు దానియెడ సంగమున నెట్టిది? వియోగముగలిగినపుడు దుఃఖము గలుగక తప్పదు. కావున నట్టిసక్తియే విడువవలయును. అట్టియుత్తమ బుద్ధి వహించినవాఁడు మోహవిముక్తుఁడగును. తొలుతఁ గానరానిదియే కనఁబడి, మరల నదర్శన మొందుచున్నది. అట్టిముక్తుని నే నెఱుఁగను. నన్నతఁడెఱుఁగఁడు. అట్టిముక్తత యేల సంపాదింపరాదందువేని దానికి వైరాగ్య ముండవలయునుగాదే? ఏయేశరీరముచే నేమేమిచేయునో, దానిచేఁ దత్ఫలమందుచున్నాఁడు. శరీరధారి మానసముచే మానసమును, శరీరమును బొందుచున్నాఁడు." అని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

జనమేజయుఁడు తండ్రిని దర్శించుట

"ఓజనమేజయా! తనపుత్రు లగపడమిని శోకించుచున్న ధృతరాష్ట్రుఁడు వారి నావ్యాసభగవానుగ్రహముచేఁ గాంచి సంతసించెను. ఓయీ! పిమ్మట రాజధర్మవేత్తయగు నతఁడు బ్రహ్మోపనిషద్వేత్తయై శుద్ధనిశ్చయ మొందెను. మహాప్రాజ్ఞుఁడగు విదురుఁడును దపోబలముచే సిద్ధిపడసెను. వ్యాసునను గ్రహముచే ధృతరాష్ట్రుఁడును బూర్ణకాముఁ డయ్యెను." అని తెలిపెను. అది విని జనమేజయుఁడు "ఓయీ! వరదుఁడగు వ్యాసుఁడు నాకును, నిజరూపవయోవేషములు గలుగునట్లు నాతండ్రిని జూపెనా? నీచెప్పినదెల్ల నమ్మెదను. నే నద్దానఁ గృతార్థుఁడనై కృతనిశ్చయుఁడనై ప్రియము నందెదను. అమ్మహర్షి యనుగ్రహముచే నామనోరథము నైతము పూర్ణమగుఁగాక." అని పలికెను. ఆజనమేజయుఁ డట్లు పలుకఁగనే వ్యాసమహర్షి యనుగ్రహము చూపి యాతనికిఁ దండ్రియగు పరీక్షిత్తు నిజరూపవయోవేషములతో వచ్చునట్లు లొనర్చెను. అటు లగపడిన శోభాశాలియగు పరీక్షిత్తు నారసి, మఱియు మహాత్ముఁడగు శమీకుని నతనిపుత్రుఁడగు శృంగిని, మఱియు నాతనిమంత్రులను గాంచి జనమేజయుఁడు సంతసించెను. పిమ్మట నతఁ డవభృథ మొనర్చి, బ్రాహ్మణోత్తముఁడైన యాస్తీకునిఁ గాంచి, 'ఓయీ! మహర్షివర్యా! ఈయాగము బహువిధాశ్చర్యకరమని నాయభిప్రాయము.' నాతండ్రి యిందుల కరుదెంచెనుగాదే?" అని పలికెను. ఓశౌనకాదిమహర్షులారా! ఆయాస్తీకుఁడు జనమేజయునితో "ఓరాజా! పురాణతపోనిధియగు నాద్వైపాయనమహర్షి యెవ్వనియాగమున నధ్యక్షుఁడై ప్రవర్తిల్లునో, వాఁడు లోకద్వయమును, జయించినవాఁ డగుచున్నాఁడు. నీవలన విచిత్రమగు నాఖ్యానము విననయ్యెను. సర్పములన్నియు భస్మమై నీతండ్రిపదవి ననుసరించెను. ఒక్క తక్షకుఁ డెట్టులో మిగిలెను. మహర్షులందఱును బూజింపఁబడిరి. మహాత్ముఁడగు నీతండ్రి యుత్తమగతి గలిగెను. పాపవినాశకమగు నియ్యితిహాసము వినుటచే గొప్పధర్మము లభించెను. మహాజనదర్శనముచే హృదయగ్రంథికి విముక్తిగలిగెను. ఎవ్వరు ధర్మపక్షస్థాపకులగుదురో, మఱియు నెవరు సద్వృత్తనిరతులై యుందురో, యెవ్వరిదర్శనముచేఁ బాపవిముక్తియగునో, యట్టివారికి

నమస్కారము'' అని తెలిపెను. ఓ రుహార్షులారా! బ్రాహ్మణోత్తముండగు నయ్యాస్తీకునివచనములు విని, యాజనమేజయుం డయ్యాస్తీకుని బూజించి, పిదప నెప్పటిచొప్పున, వారివనవాసకథావశేషవిధ మెట్టిదో తెలుపుమని వైశంపాయనుని మఱియుం బ్రశ్నించెను.

యుధిష్ఠిరాదులు హస్తిపురికి మరలుట

"ఓవైశంపాయనా! ఆయాంబికేయుం డట్లు పుత్రపౌత్రాదులను గాంచినపిమ్మట నేమిచేసెను? ధర్మజుం డేమి యొనర్చెను?"

అది విని యావైశంపాయనుఁడు, "ఓజనమేజయా! ఆశ్చర్యకరముగు నిజపుత్రదర్శన మొనర్చి, యాధృతరాష్ట్రుఁడు శోకరహితుండై తనయాశ్రమముం జేరికొనియెను. అటులే తక్కటిజనమును మహార్షులును దమతమస్థానములం జేరికొనిరి. మహాత్ములగుపాండవులును, గొలఁదిసైన్యములతోడను, దారాదులగు పరిజనములతోడను గూడి యాధృతరాష్ట్రుని సమీపించిరి. మఱియు నావ్యాసభగవానుఁడు ధృతరాష్ట్రునితో 'ఓమహాబాహూ! ధృతరాష్ట్రా! జ్ఞానవృద్ధులును, బుణ్యకర్ములునగు మహర్షులయు, వేదవేదాంగవేత్తలగు వృద్ధాభిజనము యొక్కయుం జరిత్రములు, ధర్మజ్ఞులగువారివలన వినియున్నాఁడవు గదా! ఇఁక నీవు శోకింపం బనిలేదు. పండితుఁడగువాఁడు దైవకృతమునకుం బరితపింపఁడు. దేవదర్శనుఁడగు నారదునివలన దేవరహస్యమును నీవు వినియున్నాఁడవుగదా! నీవారెల్లరును క్షత్రియధర్మము ననుసరించి, శస్త్రపూతమగు నుత్తమగతి నొందిరి. వారు, నీవిపుడు చూచినట్లుగనే స్వేచ్ఛావిహారులై ప్రవర్తిల్లుచున్నవారు. ఇదే యీ యుధిష్ఠిరుఁడు నిన్ననుసరించియున్నవాఁడు. ఆతనితోపాటుగా భీమాదులును గాలతోజనమును నిందే నిన్ననుసరించియున్నవారు. ఈధర్మజునకు సెలవొసంగి పంపుము. ఇతఁడు నిజరాజ్యమును బాలించుకొనుం గాక. ఈయుధిష్ఠిరాదు లిచ్చోటికి వచ్చినపిమ్మట నొకమాస మతిక్రమించెనుగదా! రాజ్యము నిత్యప్రయత్నరక్షణీయము. దానికనేకులు వైరులుందురనుట నీకుం దెలియనిదిగాదు.' అని తెలిపెను. అమేయతేజుఁడగు వ్యాసమహర్షి యిట్లు పలుకుటయు, నాయాంబికేయుఁడు ధర్మజుని రావించి 'ఓయజాతశత్రూ! నీకు సేమమగుఁగాక.

నీవును, నీసోదరులును వినుఁడు. ఓమహీపాలా! నీయాదరణముచే మమ్ము శోకమేమియు బాధింపలేదు. ఓపుత్రకా! నేనెప్పటివలె హాస్తిపురమున నీతోఁ గలిసియున్నట్టు లుండువాఁడను. నీవలన నాకుఁ బుత్రఫలము లభించినది. నీయెడ నాకెంతయుఁ బ్రీతిగలదు. నీపై నాకేమియుఁ గోపము లేదు. నీవు జాగుసేయక పురమునకుఁ బొమ్ము. నీవిచ్చోటనుందువేని నిన్నుఁ జూచుచున్న నాకుఁ దపము జరగనేరదు. తపోయుక్తమగుశరీరమును జూచికొనియే మనసు నిలుపఁబడియెను. ఈ నీతల్లులును, నాతో సరిగా వ్రతమూని మిగులఁ గృశించియున్నవారు. వీరును నెంతేనికాలము జీవింపరు. లోకాంతరగతులైన సుయోధనాదులు గానవచ్చిరిగదా! అదియెల్ల వ్యాసుని తపఃప్రభావమువలనను, నీసమాగమమువలనను గలిగెను. నేను బ్రతికినందులకుఁ బ్రయోజనమేమో సంభవించినది. కావున నిఁక నీవంగీకరింతువేను, నుగ్రతప మొనర్చువాఁడను. నీయందే, నాకీర్తియుఁ, బిండము, వంశమును నిలుపఁబడియున్నవి. నాయనా! నేఁడుగాని, రేపుగాని నీవు పోవలయుఁజుమీ! జాగు వలదు. రాజనీతి విధమంతయు నీకుఁ దెలిపితినిగదా! నేను జెప్పవలసినదేమియు లేదు.' అని తెలిపెను.

ఓజనమేజయా! ఇటు లతఁడు పలుకుటయు, నయ్యుధిష్ఠిరుఁడు, 'ఓమహారాజా! ధర్మజ్ఞా! నేఁ జేసిన యపరాధమేమి? నన్నుఁ బరిత్యజింపనగునా? నీయానతిచొప్పున నాతమ్ములును, సేవకులును హాస్తిపురికిఁ బోవుదురుగాక. నేను నాతల్లులతోపాటుగ నిన్ననుసరించి వర్తించెదను.' అని తెలుపుటయు, నతనిఁ గాంచి గాంధారి 'ఓపుత్రకా! నీకిది తగదు. నావచన మాలింపుము. కురువంశభారమెల్ల నీపై నున్నది. మనపితరులపిండములను నీవగదా ప్రవర్తిల్లఁ జేయువాఁడవు. నాయనా! నీవొనర్చినసపర్యలు మాకుఁ దృప్తిని గలిగించెను. ఇఁక నీవు పోవచ్చును. నీవు నీతండ్రి చెప్పినవచనముల్లంఘింపకుము.' అని పలికెను. ఓజనమేజయా! గాంధారి యిట్లు తెలుపుట విని, స్నేహబాష్పాకులలోచనయైయున్న కుంతిని గాంచి, యామెకనుల నీరుతుడుచుచు, 'తల్లీ! ఈగాంధారియు, నీవృద్ధభూపతియు నన్నుఁ బొమ్మనుచున్నవారు. కాని నిన్ను విడిచి నేనెట్లు పోఁగలను? ఓధర్మచారిణీ! నీతపమును జెఱుపఁజాలను, తపమును

మించిన దొకటిలేదుగదా! దానిచే మహత్త్వ మొందఁబడునుగాదే? వెనుకటివలె నాకును రాజ్యాభిలాష లేదు. సర్వవిధములను నాచిత్త ముత్తమతపమునందే యనురక్తమై ప్రవర్తిల్లుచున్నది. శూన్యమైయున్న యిప్పుడీమి నాకు రుచింపలేదు. బంధుగులందఱును మ్రందిరిగదా! నాకు మునుపటివలె బలములేదు. పాంచాలురును క్షీణులై కథామాత్రావశేషితులైరి. వారికిఁ గులకర్త యెవ్వఁడును గానరాలేదు. వారినెల్ల నా ద్రోణుఁడు బూడిదపాలుసేసెనుగాదే? చావఁగా మిగిలిన వారి నా ద్రోణసుతుఁడు వధించెను. అటులే చేదివంశపువారును, మాత్స్యులును నశించిరిగదా! వాసుదేవు ననుగ్రహముచే యాదవులు మాత్రము మిగిలిరి. నేనిఁక ధర్మమునకు జీవింపవలయునుగాని, ప్రయోజనమునకుఁగాదు. మమ్ము శుభదృష్టితోఁ జూడుము. నీదర్శనము దుర్లభమగునుగదా!' అని పలికెను. అది విని సహదేవుఁడు, కనుల నీరు వెడల ధర్మజు నారసి, 'ఓయన్నా! నేను నాతల్లిని బరిత్యజించి పోఁజాలను. నీవు వడిగా వెడలిపొమ్ము. నేనిచ్చోఁ దపమొనర్చికొనుచు నుండువాఁడను. నేను నా మేను దపముచేఁ గృశింపఁజేసికొనియెదను. ఈధృతరాష్ట్రునియు, నీకుంతీగాంధారులయుఁ బాదసేవ సేయుచు నుండెదను' అని పలికెను. అంత నాకుంతి, మహాభుజుఁడగు సహదేవునిఁ గవుంగిలించుకొని, 'పుత్రా! నీకిది తగదు. నీవు నామాట వినుము. పొమ్ము మీకు శుభప్రాప్తులగుఁగాక. పుత్రులారా! స్వస్థచిత్తుల రగుఁడు. మీరిచ్చో నుండుదురేని మాతపమునకు విఘ్నమగును మీయెడఁగల స్నేహముచే నాతపము చెడియెడు. కావున మీరు హస్తిపురికిఁ బొండు మిగిలిన దొకగొప్పగాదు.' అని తెలిపెను. ఓజనమేజయా! ఇట్లు పలుకుచున్న కుంతిమాటల నుల్లంఘింపజాలక, యప్పాండవులు, హస్తిపురికి వెడల నుద్యమించిరి. అపుడు యుధిష్ఠిరుఁడు 'ఓరాజా! మీశుభవచనము లంగీకరించి రాజ్యమునకుఁ బోయెదను. నాకును నాతమ్ములకును ననుజ్ఞ దయసేయుము.' అని మనవి చేసెను. అంత నా రాజర్షియగు ధృతరాష్ట్రుఁడు ధర్మజునిమాటను మన్నించి సెలవొసంగి, భీము నోదార్చి, పార్థునిఁ గౌఁగిలించుకొని, నకులసహదేవుల నాదరించి సెలవొసంగెను. వారు గాంధారికి నమస్కరించి, యామె యనుజ్ఞగొని, కుంతియుఁ దమ్ము మూర్ధాఘ్రాణ మొనర్చి

యాలింగనమొనర్చి విడువఁ బ్రదక్షిణమొనర్చి, మఱిమఱియు వారినే పరికించుచు మరలిరి. ద్రౌపది మున్నగు కౌరవకాంతలు న్యాయము తప్పక మామగారికి నమస్కరించి, యత్తమామల సెలవుగొనిరి. గాంధారియుఁ గుంతియు వారిని గవుంగలించికొని, కర్తవ్యమును సందేశించి విడువ, భర్తలతో వెడలిరి. పిమ్మట, రథములను గట్టుఁడనెడి సారథులచప్పుడులు గొప్పగా నుప్పతిల్లెను. ఒంటెలఅఱపులును, గుఱ్ఱముల హేషాధ్వనులును వినవచ్చెను. అపు డయ్యుధిష్ఠిరుఁడు, రాజకాంతలును, సైనికులును వెంటరా బంధుపరివృతుఁడై హస్తిపురాభిముఖుఁడయ్యెను." అని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

### కార్చిచ్చు ధృతరాష్ట్రాదులను దహించుట

ఓజనమేజయా! పాండవు లటు లిచ్చమెయి వెడలి హస్తిపురిఁ జేరినపిమ్మట, దేవర్షియగు నారదుఁడు యుధిష్ఠిరుని సమీపించుటయు, నాతని నాధర్మజుఁడు గౌరవించి యతఁడు కూరుచున్న పిదప, నమ్మహర్షితో 'ఓమునీంద్రా! చిరకాలమునుండియు మీదర్శనము లభింపలేదు. మీకు మేమమేగదా! తాము వచ్చుట మాకు శుభమే. తామెచ్చటనుండి విచ్చేయుచున్నవారు? నేను దమకొనర్పఁదగు కార్యమేమి? నీవగదా మాకుఁ బరమగతి. బ్రాహ్మణోత్తమా! నీవచ్చినవిధ మెఱింగింపుము' అని ప్రశ్నించెను. అది విని యానారదుఁడు 'ఓయుధిష్ఠిరా! నిన్నుఁజూచి యెంతయేని కాలమయ్యెనుగాదే అటులగుటఁ దపోవనమునుండియే వచ్చితిని. గంగయుఁ దక్కినతీర్థములును నాచేఁ జూడఁబడినవి.' అని తెలుపుటయు నయ్యుధిష్ఠిరుఁడు 'ఓమునివర్యా! గంగాతీరనివాసులగు పురుషులు కొందఱు నాతో మహాత్ముఁడగు ధృతరాష్ట్రుఁడు పరమతపోనిష్ఠుఁడై యున్నవాఁడనియు, మే మాతనిఁ జూచితిమనియుఁ దెలిపిరి. మీ రాతనిఁ జూచితిరా? కుశలియై యున్నవాఁడా? గాంధారియుఁ గుంతియు, సంజయుఁడును నెటులున్నవారు? నాతండ్రియగు ధృతరాష్ట్రుఁ డెటులున్నవాఁడు? నీవాతనిఁ జూచితేని తెలుపు'మని యడిగెను? అది విని యాదేవర్షి 'ఓమహారాజా! స్థిరచిత్తుఁడవై జరగినవృత్తమును యథార్థముగాఁ దెలిపెదను వినుము. ఆతపోవనమున నేను గన్నులారఁ గాంచినవిధ మిది.

ఓకురునందనా! మీ రేవురును సపరివారముగా మరలినపిమ్మటఁ గురు
క్షేత్రమునుండి నీతండ్రి గంగాద్వారమునకుఁ గుంతీగాంధారులఁ
గూడి వెడలెను. సంజయుఁడును నయ్యాంబికేయునియాజకులును
నగ్నిహోత్రములతో వెడలిరి. అచ్చో నీతండ్రి తీవ్రతపముఁ బూని,
వాయుభక్షకుఁడగుచు, మౌనమూని యందలిమునులందఱును, సందడి
మెయి సన్నుతింప, నెమ్ముకలుమాత్రము మిగిలినమేనితోఁ బ్రవర్తించు
చుండ, నాఱుమాసము లట్లు గతించెను. గాంధారియు జలాహార
ముతోఁ గాలము గడపుచువచ్చెను. కుంతి మాసోపవాసవ్రత మాచ
రించుచుండెను. సంజయుఁ డాఱవకాలమున మాత్రము భుజించు నియ
మము గలిగియుండెను. యాజకులు విధ్యుక్తముగా నగ్నిహోత్రములు
వ్రేల్చుచువచ్చిరి. ఆధృతరాష్ట్రుఁడు తన్నుఁ గనిపెట్టుచున్న వారిని గని
పెట్టనివారినిగూడ లక్ష్యముసేయక వనములందుఁ బరిభ్రమింపసాగెను.
ఆసంజయుఁడును గాంధారియుఁ గుంతియు నాతని వెంబడించిరి. సమ
విషమస్థలములందు సంజయుఁ డాధృతరాష్ట్రుని నడుపుచుండెను.
గాంధారికిఁ గుంతి నేత్రమై ప్రవర్తిల్లెను. పిమ్మట నొకపుడు ధృత
రాష్ట్రుఁడు గంగానదిని జేరి యందు మునిఁగి యాశ్రమాభిముఖుఁడై
వెడలునంత నొకగొప్పగాలి యుద్భవించి మహత్తరమగు దవాగ్ని
విజృంభించెను. దానిచేఁ దద్వనమంతయు దహింపఁబడసాగెను.
అందలిమృగయూథములును సర్పములును దగ్ధములగుచుండ వరాహ
ములు జలాశయముల నాశ్రయింపసాగెను. అటులాయటవి దగ్ధమై
గొప్పయాపద సంభవింపఁగా, నాయాంబికేయుఁడు నిరాహారుఁడై
చేష్టలుదక్కి మందబలుఁడై నడువఁజాలఁడయ్యెను. కుంతీ గాంధారు
లును గృశించియుండిరి. పిదప నాధృతరాష్ట్రుఁడు దవాగ్ని తన్ను సమీ
పించుట తెలిసి సంజయునితో 'ఓయీ! సంజయా! ఈయడవిలో నగ్ని
యెచ్చో నుండదో యందులకుఁ బొమ్ము. మే మీయగ్నిఁబడి యుత్తమ
గతి నొందువారము' అని పలికెను. అది విని యాసంజయుఁ డుద్వేగ

ముగఁదురఁగా 'ఓరాజా! నీకీ వృథాగ్నిచే మరణమగుటకే నిష్టపడను. ఈయగ్నిని దప్పించుకొనునుపాయ మేమియుఁ గానరాకున్న యది. ఇఁకఁ జేయఁదగుకార్యము నీవే తెలుపుము.' అని పలికెను. అంత నప్పార్థివుఁడు 'ఓసంజయా! ఇచ్ఛాపూర్వకముగా గృహమునుండి వెడలినవారి కీయగ్నిదాహ మనిష్టము కాదు. వాయుజలాగ్నులలో నెద్దానిచేనైనఁ దాపసులు మృతినొందవచ్చును. సంజయా! జాగు సేయక నీవు వెడలిపొమ్ము.'అని పలికి మనస్సమాధిగలిగించికొని కుంతీగాంధారులతోఁగూడఁ బ్రాఙ్ముఖుఁడై కూరుచుండెను. అంత నాసంజయుఁడు వారికిఁ బ్రదక్షిణమొనర్చి 'ఓరాజా! నీయాత్మను యోగనిష్ఠముగ నొనర్పుము.' అని తెలుపుటయు, నతఁ డమ్మాట నాదరించి యింద్రియముల నిరోధించి, కట్టెవలె నిశ్చేష్టుఁడై యుండెను. అటులే కుంతియు గాంధారియుఁ గదలఁజాలక ధృతరాష్ట్రునితోఁ గూడదవాగ్ని నడుమఁ బ్రవేశించిరి. ఆసంజయుఁ డాదావాగ్నిని దప్పించుకొని వెడలెను. అతఁడు గంగాతీరమునఁ దాపసులఁ గూడి నాకుఁ గానవచ్చెను. ఆసంజయునిమూలముననే యందలిమునుల కీవిషయము తెలిసెను. అంతే నాసంజయుఁడు హిమవన్నగమునకుఁ బోయెను. ఓయుధిష్ఠిరా! ఇటు లాధృతరాష్ట్రుఁడు మృతినొందెను. నీతల్లియగు కుంతియును, గాంధారియును,నిటులే మరణించిరి. దైవవశముగా వెడలిపోవుచున్న నాకు వారికళేబరము లిట్టులై కానవచ్చెను. అంతట నత్తపోవనవాసులగు మహర్షు లందులకువచ్చి తద్వార్తవిని వారియుత్తమగతులకు సంతసించిరి. ఓధర్మరాజా! అందే నే నీవార్త వింటిని. వారిటులు వనాగ్నిదగ్ధులైరి. అగ్నిసంయోగమొందిన యాధృతరాష్ట్రగాంధారీకుంతీదేవులవిషయమున నీవు శోకింపఁజనదు.' అని తెలిపెను.

జనమేజయా! మహాత్ములగుపాండవు లాధృతరాష్ట్రుని నిర్యాణవార్త విని మిగులఁ బరితపించిరి. అంత నతఃపురజనములో నెంతయు నార్తనాదములు జనించెను. ఓమహారాజా! వారిగతి పౌరులకును

దుఃఖకరమయ్యెను. యుధిష్ఠిరుఁ డప్పుడు 'అయ్యో! నాబ్రతుకేటికి? ఆహా! నాతల్లి మరణించెనుగదా!' అని చేతులు మీఁదికెత్తి మొత్తి వెట్టెను. పిమ్మట భీమసేనాదులగు తక్కినపాండవులును నేడ్వసాగిరి. అంతఃపురమం దెంతయు నార్తారావ ముద్భవించెను. 'అయ్యయ్యో! కుంతి యిట్టులయ్యెనా? హతసుతుఁడగు ధృతరాష్ట్రుఁడు గతించెనా? గాంధారి కిట్టిగతి గలిగెనా?' అని బహువిధములుగాఁ బలవించిరి. అంతఁ గొంతపడి కాశబ్దము చల్లారుటయు, ధర్మజుఁడు ధైర్యముదెచ్చి కొని, యిట్లు పలికెను."

### యుధిష్ఠిరువిలాపము

'అయ్యయ్యో! మహాత్ముఁడగు నాధృతరాష్ట్రుఁ డుగ్రతపమునఁ బ్రవర్తిల్లియు, మేమెల్ల బంధుగులమై యుండఁగా, నిట్టిగతికిఁ బాలు పడియెనా? మానవుల కెప్పటి కెట్టిగతియగునో తెలియుట కష్టము. విచిత్రవీర్యపుత్త్రుఁడేమి? వనాగ్నిపాలగు టేమి? అక్కటా! శ్రీమంతు లగు నూర్వురుపుత్త్రులు మృతులైరి. నాగాయుతబలుఁడగు నయ్యాంబి కేయుఁడు వనాగ్నిదగ్ధుఁడయ్యెను. ఆహా! మున్నెవ్వఁ డుత్తమకాంతల తాలవృంతముల శీతలవాయువులచే సేవింపఁబడుచువచ్చెనో, యట్టి వాఁ డిప్పుడు దావాగ్నిదగ్ధుఁడుగా, గ్రద్దలు తెక్కలచే వీచెడియవస్థ సంభవించెనా? మున్ను వందిమాగధులచే మేలుకొలుపఁబడుచుండెడి పుడమితేఁ డిప్పుడు పుడమిఁబడి, పాపకర్ముఁడనగు నామూలమున నిట్టి దురవస్థ నొందింపఁబడియెనుగదా! హతసుతయై పతివ్రతానుశీలయై ప్రవర్తించి భర్తృలోకమందినగాంధారికై నేనంతగాఁ బరితపింపను గాని, బహుసమృద్ధిగలపుత్త్రులయైశ్వర్యమును జూచికొని సంతసింప వలసినకుంతి, వనవాస మభిలషించి యిట్టిగతినొందుటకుఁ గుందు వాఁడను. ఛీ! ఛీ! మా కీరాజ్యమేటికి? ఈబలమేటికి? ఈపరా క్రమమేల? మా యీక్షత్త్రధర్మమేటికి? మృతులము గావలసి యుండియు జీవించుచున్నవారము. ఓమహర్షివర్యా! కాలగతి మిక్కిలి

సూక్ష్మముగా నుండును. కానిచోఁ గుంతి కొడుకుల రాజ్యమును విడిచి వనవాస మభిలషించునా? యుధిష్ఠిరభీమార్జునులను గన్నతల్లి కేమి? ఇట్టివనాగ్నిదాహ మేమి? అక్కటా! ఎంతదిక్కులేనిదయ్యెను? అక్కటా! మాసవ్యసాచి, ఖాండవవనమున నగ్ని నారాధించుట యెల్ల వ్యర్థమయ్యెను గదా! ఉపకారమును మఱచినవహ్నిదేవుఁడు కృతఘ్నుఁడని నానిశ్చయము. లేనిచో సవ్యసాచిమాతయగు కుంతి నతఁడు దహించునా? తాను బ్రాహ్మణవేషమున వచ్చి భిక్షపెట్టుమని యాచించి పిదప నాయగ్నిదేవుఁడు ఖాండవమును దహించెనుగాదే? ఛీ! ఏమి యగ్ని? విశ్రుతమగు పార్థునిసత్యసంధత యేటికి? ఓనారద మునీంద్రా! మఱియొకకష్టము నాకగపడుచున్నది. తపస్వియై రాజర్షియైన యకౌరవునకు ధృతరాష్ట్రున కన్యాయముగా నగ్నిసమాయోగము సంభవించెను. అతఁ డిప్పుడమి నెల్లఁ బాలించెను. మంత్రపూతములగు నగ్ను లాతని కామహావనముననే గలవు. అటులుండఁగా నతని కిట్టిమరణ మేటికి? అయ్యయో! నాతండ్రి వ్యర్థముగా నగ్నిపాలయ్యెనుగదా! అక్కటా! నాడులు గానంబడఁ గృశించి, వడఁకుచు నవ్వనమున నెంత పరితపించెనో కదా! అమ్మహాభయమున నన్నుఁ దలంచి 'తండ్రీ! ధర్మరాజా! రమ్ము' అని యెంత పలవించెనో? 'ఓ భీమా! నన్నీ భయమునుండి తప్పింపరాదా? అని పలికెను గాఁబోలును! ఆదవాగ్ని నాతల్లి నెల్లెడలఁ జుట్టుకొనియెను గాఁబోలును! ఆమెకుఁ బుత్రులలో సహదేవుఁ డెంతయుఁ బ్రియుఁడుగదా! అట్టి సహదేవుఁడే నామె నాయగ్నినుండి విడిపింపఁజాలఁడయ్యెను.' అని పలువిధములఁ బలవింపసాగెను. అది విని వారందఱు నొకరినొకరు పట్టికొని యేడ్వఁజొచ్చిరి. యుగక్షయమునఁ బ్రాణులట్లు పాండవు లెంతయు దుఃఖార్తులైరి. ఆమహాత్ము లటు లేడ్చుచుండఁ దత్ప్రాసాదములఁ బ్రతిధ్వనులు జనించెను. అంత నారదుఁ డిట్లనియె.

### ధృతరాష్ట్రాదులకు యుధిష్ఠిరుఁడు శ్రాద్ధమొనర్చుట

'ఓధర్మజా! ఆధృతరాష్ట్రుఁడు వృథాగ్నిచే దగ్ధుఁడు గాలేదు. ఆతని కపు డెట్లు జరిగెనో తద్విధమెల్లఁ దెలిపెదను. వినుము. ధీశాలి

మగు నతఁడు వాయుభక్షకుఁడై వనముఁ జొచ్చి, యిష్టియొనర్చి యగ్నులను విడిచెనఁట. పిమ్మట నాతనియాజకు లాయగ్నులను నా ధృతరాష్ట్రునిఁ దన్నిర్జనారణ్యమున విడిచి వెడలిపోయిరఁట. ఆయగ్నియే యావనమునంటుకొని ప్రజ్వరిల్లించెనఁట. ఈవిషయమెల్లఁ దాపసులు తెలిపిరి. ఇదియెల్ల గంగాతీరమునజరిగెను. అతఁడు తనయగ్నిచేతనే దగ్ధుఁడయ్యెను. ఓయనఘా! ఇది స్పష్టముగా మునులు తెలిపినవిషయము. అటు లతఁడు నిజాగ్నియుక్తుఁడై యుత్తమగతి నొందెను. కావున నాతనికై పరితపింపవలదు. ఓజనాధిపా! గురుశుశ్రూషచే నీజననియు మహోత్తరసిద్ధిపడసెను. ఇందు సందియము లేదు. ఇఁక, వారికి జలక్రియల నాచరింపుము. నీవును నీసోదరులును, గలిసి యాకృత్యము నిర్వర్తింప వలసియున్నది.' అని తెలిపెను.

ఓజనమేజయా! పిమ్మట నయ్యుధిష్ఠిరుఁడు, సోదరులతోడను, భార్యాదిపరిజనముతోడను, నేకవసనుఁడై గంగానదికి వెడలెను. పౌరులును జానపదులును నాతని వెంబడించి వెడలిరి. అటులు వారంద అును, గంగానదిని జేరి, యందు మునిఁగి, యుయుత్సుని మున్నుగా నిడికొని యాధృతరాష్ట్రునకు జలక్రియలు గావించిరి. అటులే గాంధా రికిని గుంతికిని నామగోత్రములఁ బలుకుచు, విధ్యుక్తముగా శౌచ క్రియ నిర్వర్తించుచు, వారు పురబహిర్భాగముననె నివసించియుండిరి. పిమ్మట నయ్యుధిష్ఠిరుఁ డాధృతరాష్ట్రాదులు దగ్ధులైనచోటికిఁ దగు శాస్త్రజ్ఞుల నంపి, యందుఁ జేయఁదగినకృత్యములు జరగునట్లు శాసిం చెను. అటు లతఁ డొనర్చుచు, ద్వాదశాహమున విధ్యుక్తముగా దక్షిణలతో శ్రాద్ధక్రియలు నిర్వర్తించి, మఱియు ధృతరాష్ట్రు నుద్దే శించి, సువర్ణ, రజత, గో, శయ్యా, మహాధనదానము లొనర్చి, గాంధా రికిని, గుంతికిని వేలువేలుగా నామసంకీర్తనము లొనర్చుచు నుత్తమ దానములుచేసెను. తత్కాలమున నెవ్వఁ డేమేమి గోరెనో, యెంతెంత కోరెనో, యదియెల్ల వానికి లభించెను. యానశయనభోజన ధన

రత్నాచ్ఛాదనాదిదానములను, భోగములను, దాసీదాసాదులను, దానములుగా నొనర్చెను. అటులతఁడు వారికి శ్రాద్ధక్రియలు చేసి, మరల హస్తిపురిఁ బ్రవేశించెను. రాజునానతినిబట్టి గంగాద్వారమునకు వెడలినపురుషులును, వివిధములగుగంధమాల్యాదులచే యథావిధిగాఁ, గురువంశ్యుల నారాధించి వచ్చి, తద్విషయ మాతని కెఱిఁగించిరి. అంత, నారదుఁడును, ధర్మాత్ముఁడగుయుధిష్ఠిరుని నూఱడించి, తానువచ్చినత్రోవనే వెడలెను. ఓజనమేజయా! ఇటులా ధృతరాష్ట్రునకుఁ బత్తనమునఁ బదునైదేండ్లును, వనమున మూఁడేండ్లును గడచెను. హతసుతుఁడగు ధృతరాష్ట్రునకును, జ్ఞాతిసంబంధి భ్రాతృమిత్రులకును, బహువిధములగుదానము లొనర్చి, యెంతయుఁ జింతగదుర, నెట్టటో రాజ్యమును నిర్వహించుచువచ్చెను." అని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

ఆ శ్ర మ వా సి క ప ర్వ ము

స మా ప్త ము.

శ్రీరస్తు.

# శ్రీమదాంధ్ర వచనమహాభారతము

## మౌసలపర్వము.

శ్లో. "నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమం,
దేవీం సరస్వతీం వ్యాస్తతో జయముదీరయేత్."

### ముసలోత్పత్తి

"ఓజనమేజయా! అయ్యుధిష్ఠిరుఁడు రాజ్యము పాలించుచుండఁగా ముప్పదియాఱుసంవత్సరము లతిక్రమించెను. పిమ్మట నాతనికిఁ గొన్ని విపరీతనిమిత్తములు గానవచ్చెను. పిడుగులతో గాలులు విసరఁదొడంగెను. గులకఱాలవర్షములు గురియ నారంభించెను. పక్షులపసవ్యముగ మండలాకారములై చరింపసాగెను. మహానదులు ప్రతికూలముగాఁ బ్రవహించెను. దిక్కుల మంచు లానరించెను. నిప్పులవర్షములతో నుల్కలు మింటినుండి పడఁజొచ్చెను. ఓరాజా! సూర్యమండలము ధూళులచేఁ గప్పఁబడియెను. మఱియు నుదయకాలమునఁ గిరణశూన్యముగఁ గానవచ్చెను. మొండెములు చూపట్టెను. దారుణములై చంద్రసూర్యులపరివేషములు గానవచ్చెను. మఱియుఁ జంద్రసూర్యులందు మూఁడురంగులు చూపట్టెను ఇయ్యవియేగాక మఱియు, భయసూచకములగు పెక్కుసుత్పాతములు, హృదయోద్వేగకారణములై జనింపసాగెను. పిమ్మటఁ గొన్నినాళులు గడవ, ముసలముమూలమున యాదవులలోఁ బోరాటము గలిగి, వాసుదేవబలరాములు దక్కఁ దక్కినయాదవులందఱును నశించిరని విని యాధర్మజుఁడు, తమ్ములను రావించి 'ఓసోదరులారా! మన మిపుడేమి

చేయవలసియున్నది? బ్రహ్మదండబలాత్కృతులై యాదవులు పరస్పరమును గలహించి నశించిరి.' అని తెలిపెను. అందులకుఁ బాండవులందఱును జింతాక్రాంతులై, వాసుదేవునినిధనము సముద్రశోషణామువంటిదనియు, నాతనివినాశము నమ్మఁదగనిదనియుఁ దలంచిరి. కాని వారి కామాసలవ్యసన మెంతయుఁ జింతానిమిత్తమయ్యెను." అని తెలుపుటయు జనమేజయుఁడు "ఓమహర్షివర్యా! అంధకులును వృష్ణులును, నెటులు నశించిరి? అవ్వాసుదేవుఁడు చూచుచుండఁగా, మహారథులగునాభోజులు నశించుట చిత్రముగా నున్నదిగాదే?" అని యడిగెను. అంత నవైశంపాయనుఁడు, "ఓరాజా! ఆధర్మజుని ముప్పదియాఱవరాజ్యవత్సరమున వృష్ణులలో నొకగొప్పతప్పు సంభవించెను. వారు కాలచోదితులై ముసలములచేఁ గొట్టుకొని చచ్చిరి." అని తెలిపెను. అది విని జనమేజయుఁడు, "ఓవైశంపాయనా! అవృష్ణ్యంధకుల నెవఁడు శపించెను? అవ్వీరు లెట్లు గతించిరి? భోజు లెట్లు నశించిరి? వివరింపుము." అని యడిగెను. అంత నవైశంపాయనుఁడు "ఓజనమేజయా! ఒకపుడు, విశ్వామిత్రుఁడు, కణ్వుఁడు, తపోధనుఁడగు నారదుఁడును ద్వారకకు రాఁగా, సారణప్రభృతులగుయాదవవీరులు వారి నారసి, సాంబునకు స్త్రీవేషము వేసి యాతనిమున్నిడికొని యమ్మహర్షులను సమీపించి 'ఓమహర్షులారా! ఇక్కాంత, పుత్రకాముఁడగు నొకయమితతేజునిభార్య, మీరు మహర్షులగుట మీకన్నియు వ్యక్తముగాఁ దెలియును. ఈగర్భిణి కేమిబిడ్డ జనించునో తెలుపుఁడు.' అని ప్రశ్నించిరి. రానున్నయాపద వారి కట్టిబుద్ధి గలిగించెను. దైవసంకల్పము నెవ్వరును దప్పింపరాదుగదా! వారటులు వంచించి యడుగుటయు నమ్మును లందుల కెట్టియుత్తర మొసంగిరి. దానిం దెలిపెద నాకర్ణింపుము. ఆమ్మహర్షులు, 'ఓయాదవులారా! వాసుదేవదాయాదుఁడగు నీసాంబుఁడు, వృష్ణ్యంధకవినాశకరమై ఘోరమైన యాయసముసల మొకటి ప్రసవించును. రామజనార్దనులు దప్పఁ, దక్కినదుర్వృత్తులగు మీరందఱును, నాముసలము మూలముననే సకలకులవినాశకులగుదురు. శ్రీమంతుఁడగు బలరాముఁడు దేహమును విడిచి సముద్రమును జేరును. మహాత్ముఁడగుకృష్ణుఁడు పుడమిపైఁ బరుండియుండ నాతని నొకజరుఁడను కైవర్తుఁడు

ఛేదించును' అని పలికిరి. ఓజనమేజయా! ఆసారణాదు లటులు వంచనగాఁ బలుకుటయుఁ, గుపితులై యమ్మును లొకరినొకరుచూచుకొని క్రోధతామ్రాక్షులై యుండిరి. ఓరాజా! పిమ్మట నమ్మును లటులు శపించి, వాసుదేవునిసమీపమునకుఁ బోయిరి. అనంతరమవ్వార్త నవ్వాసుదేవుఁడు విని, యాదవులభవితవ్యత యట్టిదిగాఁ దెలిసి, తప్పక మునులవచనమగునని పలికి, యంతఃపురమునఁ బ్రవేశించెను. కాని కృతాంతు నన్యథాకరింప నతఁడు తలంపఁడయ్యెను. ఆమఱునాఁడే సాంబున కొకముసల ముత్పన్నమయ్యెను. అయ్యది వృష్ణ్యంధకవినాశకరమగు కింకరప్రతిమనాఁ జూపట్టెను. శాపజనితమగు నాఘోరముసలమువిధము నయ్యాదవాధీశునకుఁ దెలియ, నతఁడద్దానిని జూర్ణముగాఁ జేయ నియోగించి, తచ్చూర్ణమును సాగరమునఁ గలుప నాజ్ఞాపించెను. తత్పురాధీశుఁడగు నాహుకునివచనముచే నప్పత్తనమున, 'జనులారా! ప్రభులగు రామజనార్దనులయానతి చొప్పున, నగరవాసు లెవ్వరును సురాసవపాన మొనర్పరాదు. సకల వృష్ణ్యంధకవంశ్యులును నట్టినియమము గలిగియుండవలయును. ఎవ్వఁడేనట్లు పాన మొనర్చెనా! వానిని జీవముతో శూలారోహణము చేయింపక తప్పదు. వానికేగాక వానిబంధువులకును నట్టిశిక్ష యగును.' అని చాటంబడియెను. అంత నారాముని శాసనమునకు వెఱచి యందఱివారందఱును నొకనియమ మొనర్చికొనియుండిరి." అని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

## ద్వారకలో దుర్నిమిత్తములు గనఁబడుట

"ఓజనమేజయా! అటు లావృష్ణ్యంధకు లెంతయుఁ బ్రయత్నించి జాగరూకులై యుండుతఱి, వారియిండ్లలో నిత్యము కాలుఁడు చరింప నారంభించెను. కరాళుఁడును, వికటుఁడును, ముండుఁడును, గృష్ణపింగళుఁడు నగుచు, నతఁడు వారియిండ్లలో నొక్కొకపుడు గానవచ్చుచుండెను. ఆయాదవు లాతని, శరశతసహస్రములచేఁ బ్రహరించువారైరి. కాని సకలభూతవినాశకరుఁడగు నతనిని వారు జయింపఁజాలరైరి. నానాఁటి కావీటను దారుణములగు మహావాతములు సంభవించెను. వీథులనిండ నెలుకలు వృద్ధినొంది చరింపసాగెను. పగిలిన

మట్టిపాత్రములే యెల్లెడలఁ గానవచ్చెను. వృష్ణ్యంధకవినాశసూచకములై, మఱియుఁ బెక్కుదుర్నిమిత్తములు జనించి, చూచువారికి గగుర్పాటొదవించెను. రాత్రి నిదురించువారి కేశములును నఖములును నెలుకలచే భక్షింపఁబడుచుండెను. అయ్యాదవుల యిండ్లలో నున్న శారికలు 'చీచీ కూచీ' యని యఱవఁజొచ్చెను. అట్టిధ్వనులు రేవగలు విరామములేక వినవచ్చుచుండెను. గుడ్లగూబలధ్వనులను సారసము లనుకరింపసాగెను. నక్కలయఱపులను మేఁక లనుకరించుచు వచ్చెను. పాండురములును రక్తపాదములు నగుచుఁ, గపోతవిహంగములు కాలచోదితములై, వృష్ణ్యంధకులగృహములందుఁ జరింపఁజొచ్చెను. గోవులందు ఖరములును, నశ్వతరులందుఁ గరభములును జనించుచు వచ్చెను. అటులే కుక్కలకు బిడాలములును, ముంగిసలకు మూషికములును నుద్భవింపసాగెను. యాదవులు పాపములొనర్చుచుండియుఁ లజ్జనొందకుండిరి. అటులే వారు బ్రాహ్మణులపయిని, దేవతలపయిని పితృదేవతలపయిని ద్వేషింపసాగిరి. రామజనార్దనులు దక్కఁ దక్కినయాదవులందఱును గురువుల నధిక్షేపింప మొదలిడిరి. భార్యలు భర్తలను, భర్తలు భార్యలను, దుర్భాషలాడఁజొచ్చిరి. ప్రజ్వలితాగ్నులు వామభాగముగాఁ బరివర్తింపసాగెను. వానిజ్వాలలు నీలలోహితమంజిష్ఠవర్ణములై గానవచ్చుచుండెను. అప్పురమున నిత్యము, నుదయాస్తమయములందు మొండెము లావరించి మానవులకుఁ గానరాఁదొడంగెను. సిద్ధములగు మహానసములందును, సంస్కరింపఁబడి భుజింపఁబడుపదార్థమునందును, వేలకొలందిని బురువులు గానరాఁదొడంగెను. అటులే పుణ్యాహము చెప్పఁబడునపుడును, మహాత్ములు జపము సేయునపుడును బురువులు మెదలఁజొచ్చెను. కొందఱు పరువులు వెట్టుచుంట వినవచ్చుటయెగాని యెవ్వఁడు గానరాకుండెను. గ్రహములచే హన్యమానములగుచున్న యొకరినక్షత్రముల నొకరు చూచుటయెగాని, తమతమజన్మనక్షత్రములఁ గాంచఁజాలకుండిరి. యాదవులగృహములందు ధ్వనిచేయుచున్న పాంచజన్యముచుట్టును దారుణముగా రాసభములు మొఱఁగసాగెను. ఇటులు సంప్రాప్తమైన కాలవిపర్యాసమును గాంచి, యావాసుదేవుఁ డయ్యాదవులతో, ఓయీ! భారతయుద్ధారంభమున నిట్టి విపరీతములు సంభవించెను. ఇపుడు

వినాక్షయమునకు నట్టివి గానవచ్చెడిని.' అని పలికి, కాలమును బరిశీలించుచు, ధర్మరాజురాజ్యము ముప్పదియాఱువత్సరములు గడచుట గణించి, 'అక్కటా! నాఁడు గాంధారి, పుత్రబంధుమరణశోకసంతప్తయై యేమి పలికెనో, యదియెల్ల సంభవించెను. మఱియు యుధిష్ఠిరుఁ డేమి పలికెనో, యది సంభవించెను. సైన్యములు వ్యూహములుగా నేర్పడి నపుడు గలిగినయుత్పాతములను గాంచి యుధిష్ఠిరుఁడు, మహోత్పాతములకుఁ బ్రజాక్షయమె ఫలమని పలికెను గాదే?' అని పలికి దానిని సత్యముగఁ జేయువాఁడై, తీర్థయాత్రకై భృత్యుల కాజ్ఞాపించెను. కేశవునాజ్ఞచే, సముద్రప్రాంతమునకుఁ దీర్ఘయాత్ర చేయవలసియున్నదని పురమునఁ జాటఁబడియెను." అని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

### యాదవులు పరస్పరహతులగుట

"ఓజనమేజయా! ఆద్వారకాపురమున రాత్రులందుఁ గాళికాదేవి తెల్లనిదంతములతో నిత్యము, నిదురించు స్త్రీనొక్కతెను హరించుచుఁ బరువిడుచుండును. మఱియు నగ్నిహోత్రగృహములందును, వాస్తుమధ్యములందును, గృహములందును నిదురించునట్టి వృష్ణ్యంధకులను భయంకరములగు గ్రద్దలు భక్షించుచువచ్చెను. భయంకరులగురక్కసు లప్పురమందలి యలంకారములను, ఛత్రధ్వజకవచాదులను హరించుచుండుట గానవచ్చెను. అగ్నిదత్తమై, యయోమయమై వజ్రనాభమై, దివ్యమైన కృష్ణునిచక్రము, యాదవులు గనుఁగొనుచుండఁగనే తత్పుర మాక్రమించెను దారుకుండు చూచుచుండఁగనే యాదిత్యసమవర్ణమగు దివ్యరథమును వహించి, యశ్వములు మనోజవములై, సాగరోపరిభాగమునఁ బరువులువెట్టెను. ఆబలరామజనార్దనుల తాలసుపర్ణములనియెడి ధ్వజముల నప్సరస లపహరించిరి. యాదవులు తీర్థయాత్రకు వెడలవలయునని దేవతలు పలుకసాగిరి. అది విని మహారథులగువృష్ణ్యంధకులు తీర్థయాత్రకు నిజాంతఃపురజనముతోఁగూడ వెడల నిశ్చయించిరి. పిమ్మట వారికి వలయు భక్ష్యభోజ్యపేయములును, నానావిధములైన పెక్కుమద్యమాంసములును, దయారుచేయఁబడియెను. అనంతరము వారిసైనికులు నగరము వెలుపలికి వెడలిరి,

గజరథాశ్వాదులును వెడలెను. అటులు వెడలి, తమతమయిచ్ఛవచ్చి నట్టులు నివాసము లేర్పఱచుకొని, ప్రభాసమున నివసించిరి. అటులు వారందఱును నాసముద్రప్రాంతమున నివసించియుండుట తెలిసికొని యుపాయవేత్తయగు నుద్ధవుఁడు, వీరులగు నయ్యాదవులను బిలిచి, సాగరము చేరువకుఁ దీసికొనిపోయెను. యాదవులవినాశ మెఱిఁగిన వాఁడగుట నమ్మహాత్ముఁడగు వాసుదేవుఁ డటులు వెడలినయుద్ధవునకుఁ గృతాంజలియై నమస్కరించి విడిచెనుగాని, వారిని నివారింపఁ దలంపఁ డయ్యెను. పిమ్మటఁ గాలచోదితులై యావృష్ణ్యంధకులగుమహారథులు తేజముచే రోదసీకుహరము నింపుచు, నాయుద్ధవునివెంట వెడలిరి. బ్రాహ్మణులనిమిత్తముగా సిద్ధపఱుపఁబడినయన్నమును వారు వానరములకొసంగిరి. అనంతరము తూర్యశతాకీర్ణమై, నటనర్తకసంకులమై, మహాపాన మా ప్రభాసమునఁ బ్రారంభింపఁబడియెను. కృష్ణునిసమీపముననే రాముఁడు కృతవర్మనితోఁ గూడి సురాపానమొనర్చెను. అటులే యుయుధానుఁడును, బభ్రువు, గదుఁడును ద్రావిరి. అంత నాసభామధ్యమునఁ బానమత్తుఁడై యుయుధానుఁడు, కృతవర్మనితో సపరిహాసముగను, సావమానముగను 'ఓయీ' కృతవర్ముఁడా! మృతులట్లు నిదురించియున్నవారిని వధించితివిగదా! అద్దానిని క్షత్రియుఁ డన్నవాఁ డెన్నఁడును జేయఁడు. యాదవు లద్దానిని సహింపరు.' అని పలికెను. ఆసాత్యకివచనములు ప్రద్యుమ్నుఁడు సమ్మతించి, కృతవర్మ నవమానించెను. అందుల కాకృతవర్ముఁ డెంతయుఁ గుపితుఁడై, సావమానముగా నెడమచేత నిర్దేశించుచు 'ఓరీ! సాత్యకీ! బాహువుదెగి ప్రాయోపవిష్టుఁడైయున్న భూరిశ్రవునిఁ గ్రూరుఁడవై వధింపలేదా? నీవేమి వీరుఁడవు?' అని పలికెను. అది విని, వైరివీరమారకుఁడగు నవ్వాసుదేవుఁడు రోసముగదుర నాకృతవర్మనిఁ దీవ్రదృష్టితో వంకరగాఁ జూచెను. అపుడు సాత్యకి కుపితుఁడై 'ఓయన్నా! ఇన్నీచుని తమ్ముఁడగు శతధన్వుఁడు, శమంతకమణికై సత్రాజిత్తుని వధించెను గాదె?' అని తత్కథను వినిపించెను. అది విని సత్యభామ కుపితయై యేడ్చుచు, జనార్దనునకుఁ గోపముగలుగునట్టుగాఁ బలుకుచు నాతని తొడపైఁబడియెను. అనంతరము సాత్యకి మఱియుఁ గుపితుఁడై లేచి, కృతవర్మనిఁ జూచి, సత్యభామతో, 'సాధ్వీ! వీని నిదె యాద్రాపదేయు

లయు, ధృష్టద్యుమ్నశిఖండులయు మార్గమునఁ బంపించెదను ఇదె శపథముచేసి చెప్పుచున్నాను. దురాత్ముఁడగు వీఁడె యాద్రోణసుతుని సహాయమున, నిద్రించియున్నవారి నెల్ల వధించెను. ఓరాజపుత్త్రీ! ఈదురాత్ము నాయుర్యశములు సమాప్తములయ్యెనని తలంపుము.' అని పలికి వాసుదేవు చెంతనుండి లేచి కత్తిపట్టికొని పరువిడి యాకృతవర్మని తల దెగనేసెను. అటులే మఱికొందఱను జంపనున్న యాసాత్యకిని నివారించువాఁడై, వాసుదేవుఁడు పరువిడెను. అంత నాకృతవర్మని సంబంధులగు భోజులందఱు నేకీభవించి, కాలప్రేరితులై యాసాత్యకిని జుట్టుకొనిరి. అటులు సాత్యకిపైఁగవిసిన భోజవీరులను గాంచి కుపితుఁడయ్యు, నావాసుదేవుఁడు కాలవిపర్యాసమును గనుఁగొనుచు, శాంతమువహించి యూరకుండెను. అపు డాయాదవవీరులు కాలచోదితులై పానమదావేశముచే నొడలు తెలియక, తాము ద్రావిన యుచ్ఛిష్టపాత్రములచే నాసాత్యకిని గొట్టిరి. అటు లాసాత్యకి కొట్టువడుటఁ గాంచి యోరువఁజాలక, ప్రద్యుమ్నుఁడు కుపితుఁడై యాసాత్యకిని విడిపించువాఁడై భోజులఁ దలపడియెను. సాత్యకి యంధకుల మార్కొనియెను. బాహుబలశాలులగు నాసాత్యకి ప్రద్యుమ్నులు విక్రమించుచుండియు, భోజులసంఖ్య హెచ్చగుటఁ గృష్ణుఁడు చూచుచుండఁగనే యిరువురును హతులైరి. వారటులు హతులగుటఁగాంచి యవ్వాసుదేవుఁడు కుపితుఁడై, పిడికెడుతృణవిశేషములను గ్రహించెను. అవియే యొకయయోమయమగు ఘోరముసలముగా, దానిచేఁ బ్రముఖులగువారి నెల్ల నవ్వాసుదేవుఁడు ప్రహరించెను. పిమ్మటఁ దత్తృణవిశేషముష్టియే పెక్కుముసలములుగా, వానిచే భోజాంధకశైనేయవృష్ణివంశ్యులందఱును, బరస్పరముఁ బ్రహరించుకొనిరి. కాలచోదితులై, వారు ముసలములుగాఁ బరిణమించిన యాతృణకణములచేఁ గొట్టుకొనిరి. ఓరాజా! అపుడు వారు పట్టికొన్న తృణవిశేషము ముసలమగుచుఁ గానఁబడియెను. ఆతుంగయే బ్రహ్మదండములయ్యెనని తెలియుము. వారు మఱిమఱియు గ్రహించి, యొకరిపై నొకరు ప్రక్షేపించుకొనుచున్న తృణములన్నియు వజ్రములై చూపట్టుచుండెను. వానిచే నాయాదవులందఱును, దండ్రి కొమరుని, బుత్త్రుఁడు తండ్రిని, బరస్పరము ప్రహరించుకొనుచు, మత్తులై మొత్తుకొనుచు, నగ్నిలోఁ

బడుమిడుతలట్లు పుడమింబడుచుండిరి. చంపంబడుచున్న యొక్కనికిని దప్పించుకొని పాఱిపోఁ దలంపు గలుగదయ్యెను. అప్పుడు కాలవిపర్యాసమును గనుంగొనుచు, నవ్వాసుదేవుఁ డొకముసలమును బట్టికొని, సాంబచారుదేష్ణప్రద్యుమ్నానిరుద్ధులు మరణింపఁగాఁ జూచి, గదుఁడు పడుట గనుంగొని మిగులఁ గోప మొదవ, నప్పటికి మిగిలిన వారినెల్ల నిశ్శేషము గావించెను. అటులు వధించుచున్న యావాసుదేవునిఁ గాంచి, బభ్రుదారుకులు, 'ఓవాసుదేవా! నీచే నెల్లవారును నిహతులైరి. కావున నిఁక మన మాబలరామునిత్రోవఁబట్టి యాతని వెదకఁబోవుదము.' అని పలికి" రని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

## శ్రీకృష్ణనిర్యాణము

"ఓజనమేజయా! పిమ్మట నవ్వాసుదేవుఁడు, బభ్రుదారుకులఁ గూడి, బలరాముఁడు వెడలినత్రోవఁబట్టి వెదకుచు, నొకవృక్షముచేరువను జింతిలుచున్న యనంతపరాక్రముఁడగు నాతనిఁ గాంచి యాతని సమీపించిరి. అంత నవ్వాసుదేవుఁడు, దారుకుతో "ఓయీ! నీవు వడిగా హస్తిపురికిఁ బోయి, యీయాదవులవధమువిధమెల్లఁ బార్థున కెఱిఁగింపుము. బ్రాహ్మణశాపమువలన మృతులైనయాదవులవిధము వినినతోడనే యప్పార్థుఁ డిటకుఁ దప్పక వచ్చును.' అని తెలిపెను. అది విని వాఁడు వడిగలరథముతోఁ గురుదేశమును సమీపించెను. అటులు వాఁడరిగినతోడనే యవ్వాసుదేవుఁడు తనచేరువనున్న బభ్రునిఁ గాంచి 'ఓయీ! నీవు మాస్త్రీలను రక్షింపఁబోవలయును. తడవైనచోఁ దస్కరులు వారిని, విత్తలోభముచే హింసింతురేమో!' అని పలికెను. అటు లావాసుదేవుఁడు శాసింప, నాబభ్రుఁడు మదాతురుఁడును, జ్ఞాతివధపీడితుఁడునై వెడలియు, నాచేరువనే కొంతవడి విశ్రమించియుండ నొకలుబ్ధకుని కూటయుక్తమగు నొకముసలముపడి, బ్రాహ్మణశాపదగ్ధుఁడగుట నతఁడు మృతినొందెను. అటులు హతుఁడైన బభ్రునిఁ గాంచి యీకృష్ణుఁడు, తనయన్నయగుబలరామునితో 'ఓయన్నా! నేను మనకాంతాజనమును వడిగాఁ బురముఁజేర్చి వచ్చెదను. అంతదనుక నీవిందే నిలిచియుండుము.' అని తెలిపి యాజనార్దనుఁడు ద్వారవతిని జేరి, తండ్రితో 'ఓమహనీయా! నీవికాంతలను గాపాడుచుండుము.

ధనంజయునిరాకకై ప్రతీక్షించుచు బలరాముఁడు వనప్రాంతమున నున్నవాఁడు. నే నాతనికడ కేఁగవలయును. ఆతని నేను గలిసెదను. కురురాజులనిధనమునకుఁ బూర్వమే యాదవులకును నిధనము సంభవించునని యెఱుఁగుదును. యాదవశూన్యమైన యిప్పురమును జూచుటకును బ్రవేశించుటకును నాచిత్త మొల్లకున్నయది. కావున నేనా రామునితోఁగూడ వనముఁజేరి తప మొనర్చికొనియెదను.' అని పలికి యాతనిపాదములపై వ్రాలి వడిగా వెడలిపోయెను. అంతఃపురమునందును, బురమందును, స్త్రీలయు, బాలురయు నారావము మెండై జనించెను. అటులు మొత్తులువెట్టుచున్న యక్కాంతాజనమురోదనాలాపము లాలించి, యవ్వాసుదేవుఁడు మరలి వారితో 'ఓనారీమణులారా! సవ్యసాచి యిప్పురమునకు వచ్చి మీ యీదుఃఖము నివర్తింపఁ జేయును.' అని తెలిపి యతఁ డారామునికడ కేఁగెను. అతఁ డెవ్వరును లేనిస్థలమునఁ గూరుచుండియుండెను. యోగయుక్తుఁడై యున్న యారాముని మొగమునుండి వెడలి యాడుచునొక శ్వేతనాగమాకృష్ణునకుఁ గానవచ్చెను. అంత నారాముఁడు నిజశరీరమును బరిత్యజించి, సహస్రశీర్షుఁడును బర్వతాభోగదేహుఁడును రక్తాననుఁడును నై సముద్రమును బ్రవేశింప వెడలుటయు, వరుణుఁ డాతని నెదుర్కొనియెను. మఱియు, దివ్యనాగములును, బుణ్యనదులును, గర్కోటకవాసుకితక్షకులును, బృథుశ్రవుఁడును, వరుణుఁడును, గుంజరుఁడును, మిశ్రీశంఖుఁడు, కుముదుఁడు, పుండరీకుఁడు, మహాత్ముఁడగుధృతరాష్ట్రుఁడును, హ్రాదుఁడును, గ్రాథుఁడు, శితికంఠుఁడును, నికేతువు, చక్రమందాతిషండులును, దుర్ముఖుఁడు, నంబరీషుఁడును, జలాధిదేవతయగు వారుణరాజు నారాము నెదుర్కొని గౌరవించిరి. అటులు తోడ్తెచ్చి యర్ఘ్యపాద్యాదివిధులచే శుద్ధబుద్ధియగు నాసంకర్షణునిఁ బూజించిరి. అటులు తనయన్నయగు బలరాముఁడు వెడలిపోఁగా, దివ్యదృష్టియగు వాసుదేవుఁ డెల్లగతులను దెలిసికొని, శూన్యవనమునఁ బరిభ్రమించుచుఁ, దుద కొకచో నతఁ డేమేమో చింతించుచుఁ బరుండెను. అపు డాతనికి గాంధారి మున్నుపలికినవాక్యములు స్మృతిపథమునకు రాఁ, గొంత చింతించి, దుర్వాసునిపాయసోచ్ఛిష్ట లేపనవిధమును జ్ఞప్తికిఁ దెచ్చికొని, కురువినాశమును, వృష్ణ్యంధకవినాశమును దలంచి

చింతించుచు, సంక్రమణకాలమును నిరీక్షించి పిమ్మట నింద్రియనిరోధ మొనర్చెను. లోకత్రయరక్షణమును, నాత్రేయునివాక్యపరిపాలనము, దేహవిముక్తిని దలంచి, యతఁ డటులు నిరుద్ధేంద్రియ వాఙ్మానసుఁడై యోగవిధి నాశ్రయించి శయనించెను. పిమ్మట జరుఁడనుబోయ యొకఁడు తత్ప్రదేశమునకు వేఁటకుఁగా వచ్చి, యోగియై శయనించి యున్న యాకృష్ణునిఁ గాంచి, యొకమృగమని తలంచి యొకసాయక ముచే నాతనిపాదతలమునఁ గొట్టెను. అంత నాశ్రీకృష్ణుఁడు, యోగ యుక్తుఁడును, పీతాంబరుఁడును ననేకబాహుఁడు నై గానరా, నాబోయ, తన్నుఁ దప్పుచేసినవానిఁగాఁ దలంచికొని, శంకితాత్ముఁ డగుచు నాభగవానునిపాదములు పట్టుకొనియెను. అపు డమ్మహాత్ముఁడు చింతిల్లుచున్న యావేఁటకాని నూఱడించుచుఁ, దనతేజముచే భూమ్యాకాశముల వ్యాపించి యూర్ధ్వముగా వెడలెను. అటులు వెడలి యాకసము నంటివచ్చుచున్న యమ్మహాత్ముని, వాసవుఁడును నశ్వినీ దేవతలును, రుద్రులు, నాదిత్యులు, వసువులు, విశ్వేదేవులు, గంధర్వులు, సిద్ధులు, మునులును, నప్సరసలును నెదుర్కొనిరి. అనంతర ముగ్రతేజుఁ డును, ప్రభవుఁడును, నవ్యయుఁడును, యోగాచార్యుఁడునగు నారాయణుఁడు నిజతేజముచే భూమ్యాకాశముల వ్యాపించి యవ్య యమగు తనస్థానమును ప్రవేశించెను. పిమ్మట దేవతలును, మహర్షు లును, గంధర్వాదులును, నాతని నభినందించిరి. మును లు ఋక్కులచే నాతని సన్నుతించిరి. ఇంద్రుఁడును మహానంద మొందెను." అని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

అర్జునుఁడు ద్వారకకు వచ్చుట

"ఓజనమేజయా! అవ్వాసుదేవుఁ డంపినదారుకుఁడు, కురుదేశ ములకుఁ బోయి, మహారథులగుపాండవులను గాంచి, యాదవులు పర స్పరము ప్రహరించికొని మౌసలమరణ మొందిరని తెలుప విని వారెం తయు సంతప్తులై త్రస్తమానసులైరి. పిమ్మట నర్జునుఁడు, కేశవప్రియ సఖుఁడగుటఁ దనసోదరులతోఁ జెప్పి, మేనమామను గాంచువాఁడై యాదారుకునితో వెడలి, గతభర్తృకయగు కాంతవలె శోభాహీనమై యున్న యప్పురముఁ జేరి, మున్ను సకలలోకనాథుఁడు నాథుఁడయ్యు

నిపు డనాథలై యున్న కాంతలను గనుఁగొనియెను. అపుడు వారెల్లఁ దము కప్పార్థుఁడే యప్పటికి దిక్కని తలంచి దుఃఖమాపికొనలేక యేడ్వసాగిరి. వాసుదేవుని వనితలగు నప్పదునాఱువేలకాంతలరోదన నాదములపుడు మిన్నుముట్టెను. అటులు మొఱపెట్టుచున్న యక్కాంత లను గాంచి, యగ్గాండీవి, బాష్పాకులలోచనుఁడై పతిపుత్రహీనలై యున్న వారిని జూడ సమర్థుఁడుగాకుండెను. అప్పా డప్పురము భయంకరమై వైతరణివోలెఁ గానరా, శిశిరపద్మినివలె శోభాహీనమైన యద్దానిని నందున్న యవ్వాసుదేవునికాంతలను గాంచి యప్పార్థుఁడు కనులనీరువెట్టుచుఁ బుడమిఁబడియెను. పిమ్మట సాత్రాజితియు, రుక్మి ణియు, నాధనంజయునకు మ్రొక్కి కొంతవడి యేడ్చి పిమ్మట నతని నొకకాంచనపీఠముపైఁ గూరుచుండఁబెట్టి మఱుమాటలాడక యూర కుండిరి. అనంతర మయ్యర్జునుఁ డాగోవిందునిఁ బొగడి, యాతని చరిత్రలను దెలిపి యూఱడించి మామను జూడఁబోయెను." అని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

అర్జునుఁడు వసుదేవునిఁ గాంచుట

"ఓజనమేజయా! పుత్రశోకసంతప్తుఁడై శయనించియున్న మహా త్ముఁడగు నానకదుందుభి నాయర్జునుఁడు చూచి యశ్రుపరిపూర్ణాక్షుఁడై మిగుల శోకించుచు, నాతనిపాదములను బట్టికొనియెను. అంత నవ్వసు దేవుఁ డప్పార్థునిమూర్ధాఘ్రాణ మొనర్పఁగోరియు, మహోన్నతుఁడగుట వలనుపడమిఁ గౌఁగిలించికొని, తనపుత్రులఁ బేరుపేరఁ దలంచి యేడ్చుచు వివశుఁడై, భార్యలను, బుత్రులను, బౌత్రులను, దౌహి త్రులను, మిత్రులను స్మరించుచు, వగచుచు 'ఓయర్జునా! ఎవ్వారు దైత్యులను, భూపాలురను వందలకొలందిగా జయించెనో, యట్టి నాతనయులలో నొకఁడును గానరాకున్నవాఁడు. దుర్మృతి వినియు జీవించుచున్నవాఁడను. అర్జునా! నీశిష్యులగు సాత్యకియుఁ, బ్రద్యు మ్నుఁడును నీకుఁ బరమప్రియులు గదా! వారితప్పునుబట్టియే యాదవు లందఱును నశించిరి సుమీ! వృష్ణివీరులలో నతిరథు లఁగా నెవ్వరిఁ దెలుపుచు నీవు గర్వించెడివాఁడవో, యట్టికృష్ణ

ప్రియులు వృష్ణినాశమునకు మూలమైరి. ఓధనంజయా! నే నాసాత్య కినిఁ, గృతవర్మని, నక్రూరుఁడగు ప్రద్యుమ్నుని నిందింపఁజాలను. మునుల శాపమే దీనికి మూలము. జగత్ప్రభుఁడగు నెవ్వఁ డాకంసునిఁ, గేశిని, బలగర్వితుఁడగుశిశుపాలుని నేలపాలుగావించెనో, నిషాదసుతుఁడగు నేకలవ్యునిఁ, గాళింగునిఁ, మాగధులను, గాంధారులను, గాశి రాజును, మరుభూమివాసులగు రాజులను, బ్రాచ్యులను, దాక్షిణాత్యు లను, బార్వతీయరాజులను నెవఁడు జయించెనో, యట్టిమధుసూదనుఁ డన్యాయముగా యాదవుల నుపేక్షించెను. నీవును, నారదుఁడును, మఱియుఁ గలమహర్షులును, సనాతనుఁడు, ననఘుఁడునగు గోవిందుని దేవునిఁగాఁ దెలియుదురు. ఆయధోక్షజుఁడు తనజ్ఞాతులక్షయమును దెలిసియు నుపేక్షించెను. ఆనాపుత్త్రుఁడగు శ్రీకృష్ణుఁడు, గాంధా రియు, మహర్షులయు వచనము, నన్యథాకరింపఁ దలంపకుండుట నిశ్చ యము. జగత్ప్రభుఁడగునతఁడు, నీప్రత్యక్షముననే, నీపౌత్త్రుఁడగు పరీక్షిత్తును బ్రతికింపలేదా! నీమిత్త్రుఁడగు కృష్ణుఁడు సమర్థుఁడయ్యుఁ దనజ్ఞాతులను రక్షింపఁ దలంపఁడయ్యెను. ఓధనంజయా! అతఁడు పుత్త్రులును, భ్రాతలును, పౌత్త్రులును, మిత్త్రులును హతులై క్షితిని బడుట గాంచి, నాతో 'నాయనా! మన యీవంశమునకు నాశము సంభవించెను. ఇఁక మనద్వారవతి కర్జునుఁడు వచ్చును. ఆతని కీయాద వులవినాశ మెఱిఁగింపుము. మహాతేజుఁడగు నతఁ డీయాదవుల నాశము వినినచోఁ, దప్పక వడిగా నిందుల కరుదెంచును. నేనె యాయర్జు నుఁడు. ఆయర్జునుఁడే నేను. అతఁ డేమి తెలుపునో యది నీవొన ర్చుము. అప్పాండవుఁడు, స్త్రీలకును బాలకులకును నప్పటి కుచితమగు విధాన మేర్పఱచును. అదియెల్ల నతనికిఁ దెలియును. నీకు నూర్ధ్వ దైహికమునైత మొనర్చెడివాఁడు. అతఁ డటులొనర్చి యిప్పురము విడిచి వెడలినతోడనే సముద్ర మీద్వారవతిని ముంచును. నేనిఁక నొకపవిత్త్రదేశమున నియమమూని, బలరామునితోఁగూడఁ గాలము నిరీక్షించియుండెదను.' అని తెలిపి, యచింత్యపరాక్రముఁడగు నతఁడు నన్నువిడిచి యెందులకో పోయెను. నాఁటినుండియు, నేను మహాత్ము

లగు తత్సోదరులనిరువురను దలంచుచు, ఘోరమగుజ్ఞాతివధమునకుఁ జింతించుచు, దుఃఖపీడితుఁడనై యాహారము మాని జీవించుచున్నవాఁడను. ఇఁక భుజింపను. జీవింపను. నీవు దైవవశముగా నిపు డిందులకు వచ్చితివి. ఓపాండవా! కృష్ణుఁ డేమిచెప్పెనో యదియెల్ల నిర్వర్తింపుము. ఓపార్థా! ఈరాజ్యము, నీస్త్రీలు, నీరత్నములు, నా యీ యిష్టములగు ప్రాణములు మున్నగువానినెల్లఁ బరిత్యజించి పోయెదను.' అని తెలిపె"నని పలికి, మఱియు వైశంపాయనుం డిట్లనియె.

### వసుదేవుఁడు పరమపదమందుట

"ఓజనమేజయా! తనమేనమామయగు వసుదేవుఁ డిటులు తెలుపుటయు, నాయర్జునుఁడు చింతాక్రాంతుఁడై, దైన్యముడర వసుదేవునితో 'మామా! వృష్ణిప్రవీరులును, బభ్రువులును లేనియిప్పుడ మిని జూడనొల్లను. ఓమహనీయా! నేనును నాసోదరులు నలువురును, బాంచాలియును నేకమనస్కులము. అతనిఁ గలిసి యాలోచించుటకుఁ దగుసమయమగుట నిశ్చయము. వారినిగూడి నిశ్చయించి యీస్త్రీలను, బాలకులను, వృద్ధులను దీసికొని యింద్రప్రస్థమునకుఁ బోయెదను.' అని తెలిపి దారుకు నారసి, 'ఓయీ! వృష్ణివీరులమంత్రులను జూడఁ గోరుచున్నాఁడను. జాలము వలదు' అని పలికి, యతఁడు ధర్మిష్ఠమగు యాదవసభను బ్రవేశించెను. మహారథులగుయాదవులకై శోకించుచు నాసనగతుఁడై యున్న యప్పార్థునిచెంతకు మంత్రులందఱును, బందితులగుబ్రాహ్మణులును వచ్చి సేవించిరి. దీనమానసులై యున్నవారినెల్ల నారసి, యప్పార్థుఁడును దైన్యముడర, 'ఓయీ! మంత్రిపురోహితులారా! ఈవృష్ణ్యంధకులజనమునెల్ల నేనింద్రప్రస్థమునకుఁ దీసికొని పోయెదను. ఇప్పురమునంతను సాగరము ముంచివేయును. కావున యానములను సిద్ధపఱుపుఁడు. ఇందలిరత్నములను సంగ్రహింపుఁడు. మీకుఁ బాలకుఁడగు నీవజ్రు నింద్రప్రస్థపురమున నుంచెదను. నేఁటి కేడవదినమున సూర్యుఁ డుదయించుచుండఁగా, సాగర మీపత్తనమును ముంచును. కావున మనమందఱము పైకి వెడలి యందు

వసింపవలయును. సన్నద్ధులరగుఁడు. జాలమువలదు' అని తెలిపెను. అప్పార్థుఁ డిట్లు పలుకుటయు, వారందఱును, దమజీవనమునకై యుత్సుకతవెలయ, సకలము సన్నద్ధము గావించిరి. అప్పార్థుఁ డారాత్రి యావాసుదేవునింటనే వసించి, యధికశోకావిష్టుండై యుండెను. ఆ మఱునాఁడు ప్రతాపనిధియగు వసుదేవుఁడు యోగనిష్ఠుఁడై యుత్తమ గతి నొందెను. అనంతర మావసుదేవునింట మొఱవెట్టుచున్న కాంతల రోదనారావములు దారుణముగా వినవచ్చెను. అపుడా యాదవ కాంతలందఱును, జుట్టులు విరియఁబోసికొని, మాలికాలంకారాదులఁ బరిత్యజించి గుండియలవియ మోదికొనుచు జాలిగలుగునట్లుగా నేడ్వ సాగిరి. అంత నా దేవకియు, భద్రయు, రోహిణియు, మదిరయు భర్తననుగమించిరి. పిమ్మట నప్పార్థుఁ డావసుదేవుని, బహుమూల్యముగల మానవయానముచేఁ బురబహిర్భాగమునకు నిష్క్రమింపఁజేసెను. అపుడు శోకసమాహతులై ద్వారకావాసులగువారును, జానపదులును, నావసుదేవు ననుసరించి వెడలిరి. ఆకళేబరమునకు ముందుగా నాతనియాశ్వమేధికచ్ఛత్రమును, బ్రదీప్తములగునగ్నులును, నాతనియాజకులును వెడలిరి. అటులే యాతనిభార్యలు స్వాలంకృతలై యాతనిమార్గము ననుసరించి బయలుదేఱిరి. వారిని వందలకొలందివధువులు పరివేష్టించి వెడలిరి. మహాత్ముఁడగు నావసుదేవుఁడు జీవించియున్నకాలమున నాతని కేప్రదేశము ప్రియమో యాప్రదేశమునవే సంకల్పించి యాతనికిఁ బితృమేధము చేసిరి. అటు లాప్రదేశమున, వీరుఁడును, జితాగ్నిగతుఁడును, శూరసుతుఁడు నగు నవ్వసుదేవుని భార్యలగు దేవక్యాదులు నలువురును, నాతని ననుగమించిరి. అంత నానలువురుభార్యలతోఁ గూడియున్న యావసుదేవు దేహము చందనకాష్ఠములతోడను, పలువిధములగు గంధములతోడను వహింపఁ జేయఁబడియెను. పిమ్మట నగ్ని ప్రదీప్తమగుటయు, నందొకశబ్దము ప్రాదుర్భవించెను. మఱియు సామగానములనాదమును, మానవుల రోదననాదమును విజృంభించెను. పిమ్మట వజ్రుఁడు మున్నగువృష్ణ్యంధక కుమారులందఱును, స్త్రీలును మహాత్ముఁడగు వసుదేవునకు జల

క్రియలొనర్చిరి. ఓజనమేజయా! పూర్ణధర్ముఁడగు నప్పార్థుఁడు, తత్కాలోచితధర్మ మొనర్చి, యెచ్చో యాదవులు వినాశమందిరో యందుల కరిగెను. అటు లరిగి యాయుద్ధరంగమునఁ బతితులై యున్న వారినెల్లఁ గాంచి యెంతయు దుఃఖితుఁడై యప్పటికిఁ దగుకృత్యము నొనర్చెను. అప్పార్థుఁ డపుడు యథాప్రధానముగా వారికి నిర్వర్తింపఁదగుసకలక్రియలను నిర్వర్తించెను. ఓరాజా! యాదవులందఱును, ముష్టించుతుంగలవలన జనించినముసలములచేఁ గొట్టికొని మరణించిరని తెలిపితినిగాదే! అనంతర మప్పార్థుఁడు బలరామకృష్ణుల కళేబరముల నాప్తపురుషులచే వెదకించి దహనసంస్కారమును జేయించెను. అదియైనపిదప వారికిఁ బ్రేతకృత్యముల నిర్వర్తించి, యేడవదివసమున రథమధిరోహించి హస్తిపురికిఁ బయనమయ్యెను. అశ్వవృషభఖరోష్ట్రాదులు పూన్చినరథములు బయలువెడలెను. అయాదవకాంతలు శోకపీడితలై రోదనమొనర్చుచు, మహాత్ముఁడగు నాధనంజయు ననుసరించి వెడలిరి. అంధకులయు, వృష్ణులయు, భృత్యులును, రౌతులును బయలువెడలిరి. మఱియు వీరహీనమైయున్న వృద్ధబాలజనము నప్పౌరులు పార్థునిశాసనముచేఁ బరివేష్టించి నడువసాగిరి. కొండలవంటియేనుగులనెక్కి కొందఱు వెడలిరి. వానికిఁ బాదరక్షకులుగఁ గొందఱు నడువసాగిరి. యాదవకుమారుల నప్పౌరులగు బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులు వెంబడించిరి. ఆ వాసుదేవు నంతఃపురజనము పదునాఱువేలును, కృష్ణునిపౌత్రుఁడగు వజ్రుని మున్నిడికొని వెడలిరి. అటులే యంధకవృష్ణికాంతలు వేలకొలఁదిగా, సనాథలై వారితో వెడలిరి. సాగరమునాఁదగు నయాదవచక్రము నప్పార్థుఁ డట్లు తీసికొని వెడలినవెంటనే మకరాలయమగుసాగర మారత్నసంపూర్ణమగు ద్వారవతి నొక్కమాఱుగా ముంచివైచెను. అప్పార్థుఁ డేయేప్రదేశమును విడిచిపోవుచుండెనో యదియెల్ల సాగరము ముంచుచువచ్చెను. ద్వారకావాసులగువారందుల కాశ్చర్యపడి 'ఆహా! ఏమి యీదైవవైచిత్రి.' అని పలుకుచు వడివడిగా నడిచిపోవుచు రమ్యములగు కాననములు, పర్వతములు;

నదులు మున్నగుచోట్లలఁ గొంతవడిఁ దమ్ము పార్థుఁడు నిలుపుచుండ బంచనదము చేరిరి. ధీమంతుఁడును, నతిసమృద్ధిశాలియునగు నతఁడు గోపశుధాన్యాఢ్యమగు నొక ప్రదేశమున నివసించెను. ఓజనమేజయా! అటు లప్పార్థుఁ డొక్కఁడును, ననాథలగు నయ్యాదవకాంతలను దీసికొనిపోవుచుండఁ, ద్రోవలో లోభహతమానసులై కొందఱు దొంగలు కలిసికొని, 'ఓరీ! ఇప్పార్థుఁ డొక్కఁడే, వీరశూన్యమై వృద్ధబాలసహితమైయున్న జనమును దోడ్కొని మనల నతిక్రమించి పోవుచున్నాఁడు. యోధులందఱును గతించిరిగదా! మనము వీరి నాక్రమించి దోచికొందము' అని యాలోచించి, కఱ్ఱలుపట్టుకొని వేలకొలఁదిగా వెడలి, యాయాదవకాంతలపై ఱాలరువ్వుచు నెదుర్కొనిరి. ఓరాజా! కాలపర్యాయచోదితులై యాతస్కరులు గొప్పసింహనాదములు చేయుచు, సామాన్యులను భయపెట్టుచు, యాజనమును వధించువారై మార్కొనుటయు, నప్పార్థుఁడు వారివైపు మరలి, వారి నారసి 'ఓరీ! దుష్టులారా! మరలుఁడు. బ్రదుకఁ దలఁచితిరేని నిలువకుఁడు. ఇదె మిమ్ము నాశరపరంపరపాలు గావించెదను. పిమ్మట మీరు శోకింపవలసివచ్చును' అని పలుకుటయు, వారాతనిమాట లక్ష్యము సేయక మూఢులై, మఱిమఱియు వారింపఁబడుచుండియు, మరలక మార్కొనిరి. అనంతరమప్పార్థుఁడు మహత్తరము దివ్యము నగు తనగాండివము నెక్కుపెట్టువాఁడై యెంతయేని యత్నించి, బహుశ్రమముచే నెక్కిడి, యాసమ్మర్దమునఁ దనయస్త్రములను దలంచెను. కాని యతని కవి సాన్నిధ్య మొసఁగవయ్యెను. అంత నతఁ డావికారమును దలంచి, తనదివ్యాస్త్రముల వినాశమునకు సిగ్గుపడుచునుండెను. గజాశ్వరథయోధులగు నాయాదవసైనికులును, దమజనమును మరలించుకొనఁజాలరైరి. స్త్రీజనబాహుళ్యమునుబట్టి యప్పార్థుఁ డెంత యత్నించినను, సమర్థుఁడై వారి నాపఁజాలఁడయ్యెను. ఆయాదవ యోధులు చూచుచుండఁగా, నాతస్కరు లక్కాంతాజనమును గామపీడితులై యాకర్షింపసాగిరి. అంత నయ్యర్జునుఁడు వృష్ణిభృత్యులు తోడుగా, నాదస్యులను గాండివనిర్ముక్తములగు శరపరంపరలచే

పీడించెను. అంత నొకక్షణములో, వారు మున్నధికసంఖ్యాకులయ్యు, క్షీణసంఖ్యులై నశించిరి. అపు డాపార్థునిసాయకములు క్షయమందినయ్యు, నతఁడు దుఃఖశోకసమాహతుఁడై, తనధనురగ్రముచేతను వారిని బ్రహరింప నారంభించెను. ఓజనమేజయా! కొందఱు మ్లేచ్ఛు లాపార్థుఁడు చూచుచుండగనే వృష్ణ్యంధకస్త్రీలను నలువైపులకుఁ దీసికొనిపోసాగిరి. ధనంజయుఁ డపుడు దైవమును జిత్తమునఁ దలంచుచు, దుఃఖశోకావిష్టుఁడై నిట్టూర్పులిడుచు, దనయస్త్రనాశమునకును, బాహుబలవీర్యవినాశమునకును, ధనువు వశపడకుండుటకును, శరములు క్షయమగుటకును, జింతాక్రాంతుఁడై వంతనొందుచు, మరల యప్పటి తనస్థితి బాగులేదని తలంచుచు, నప్పటికి మిగిలిన కాంతాజనమును, దస్యు లపహరించిపోఁగా మిగిలినరత్నచయమును దీసికొని కురుక్షేత్రమును బ్రవేశించి, యుధిష్ఠిరుననుమతిని వారి నందందు నిలిపెను. కృతవర్మతనయుఁడగు యాదవకుమారుని వానితల్లిని, మార్తికావతమున నుంచెను. పిమ్మట బాలురు వృద్ధులు స్త్రీలు మున్నగువారి నింద్రప్రస్థమున నుంచెను. సాత్యకిపుత్రుని సరస్వతియందుంచెను. మఱియు వజ్రు నింద్రప్రస్థమున రాజుగా నిలిపి, వారినూపురకును రథగజతురగాదుల విభజించియిచ్చి, యక్రూరునిభార్యలను వజ్రున కప్పగించెను. కాని యతఁ డెంత నివారించినను నిలువక వారు వేఱొకచోటికిఁ బోయిరి. రుక్మిణియు, గాంధారియు, శిబిపుత్రియు, హైమవతియు, జాంబవతియు నగ్నిని బ్రవేశించిరి. సత్యభామ మున్నగుమఱికొందఱు కృష్ణభార్యలు తపోనిష్ఠమెయి నడవిఁ బ్రవేశించిరి. వారటులు వనముఁజొచ్చి ఫలమూలాద్యాహారలై, హరిధ్యానైకతత్పరలై చరించుచు, హిమవంతమును దాఁటి కలాపగ్రామమును బ్రవేశించిరి. మఱియు ద్వారకా వాసులగువారిని వజ్రున కయ్యర్జునుఁ డప్పగించి, బాష్పపిహితలోచనుఁడై, యాశ్రమమున నాసీనుఁడై యున్న వ్యాసభగవానుని దర్శించెను." అని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె:

వ్యాసుఁ డర్జునునకు హిత ముపదేశించుట

"ఓజనమేజయా! సత్యవాదియగు సాత్యవతేయునాశ్రమమునకుఁ బోయి, యాపార్థుఁ డమ్మహాత్ముని సమీపించి 'మహామునీ! నే నర్జునుఁడ నిదె నమస్కరించుచున్న వాఁడను.' అని విన్నవింప, నతఁడు 'పార్థా! నీకు సేమమెగదా! ఇందుఁ గూరుచుండుము.' అని పలికి, యస్వస్థమానసుఁడై మఱిమఱియు నిట్టూర్పులిడుచున్న పార్థునిఁ జూచి, 'ఓయీ! నీవేమి యిట్లు ఖిన్నుఁడవై యున్నవాఁడవు? నిన్నెవ్వరుగాని, నఖ, కేశ, వస్త్రాంచల, కుంభముఖోదకములచేఁ దడిపిరా? రజస్వలయై యున్న కాంతను శుద్ధిగాక మున్నె గలసితివా? బ్రాహ్మణుని వధించితివా? లేక యుద్ధమునఁ బరాజితుఁడవైతివా? సిరిచెడిన వానియట్టులు గనఁబడుచున్నాఁడవేమి? నీవొకప్పుఁడును నొరుల కోడుట వినలేదు. ఇదియేమి? నేను వినఁదగినదేని వడిగా వినిపింపుము' అని ప్రశ్నించెను. అంత నయ్యర్జునుఁడు 'ఓమహామునీ! నాదుఃఖమునకు నిమిత్తము వినుము. నీలమేఘవర్ణుఁడును బంకజనేత్రుఁడునగు నాశ్రీకృష్ణుఁడు బలరామునితోఁగూడఁ బరమపదము నొందెనుగదా! బ్రాహ్మణశాపమువలన వృష్ణివీరులకు మౌసలమరణము గలిగెను. అయ్యది ప్రభాసమునఁ బ్రవర్తిల్లెను, సింహదర్పులును, మహాబలులును, మహాత్ములును, శూరులునగు భోజవృష్ణ్యంధకాదులు పరస్పరము ప్రహరించికొని యంతమందిరి. పరిఘబాహువులగు నయ్యాదవులు గదాపరిఘప్రహారసహులయ్యుఁ దుంగలచేఁ ద్రుంగించికొనిరి. కాలవిపర్యాస మెట్టులున్నదో చూచితివా? బాహుబలధనులు పంచశతసహస్రములు పరలోకగతులైరి. అక్కటా! వారిలోవారు కొట్టుకొని చచ్చిరి. అమితతేజులగు వారిదుర్మరణము దలంచినకొలఁదిని శోకము హెచ్చుచున్నది. ఆయాదవులును శ్రీకృష్ణుఁడును వినాశమొందుట పర్వతచాలనమును, సాగరశోషణమును బోలి యద్భుత మొదవించుచున్నది. మిన్ను విఱిగిపడుటను, నగ్ని చల్లనగుటను నమ్మవచ్చునుగాని, శార్ఙ్గధన్వునివినాశము నమ్మఁదగియుండలేదుగదా! ఈ లోకమునఁ గృష్ణుఁడు లేనిజీవితము నాకేటికి? తపోధనా! ఇదియుఁగాక మఱియొక గొప్పకష్టము నాకు సంభవించెను. అద్దాని నెఱిఁగించెద.

వినుము. మాటికిఁ దలంచినకొలఁదిని, నది నాగుండియల నవియఁ జేయుచున్నయది. ఓబ్రాహ్మణోత్తమా! నేను జూచుచుండఁగాఁ, దస్కరులు యాదవకాంతల నపహరించిరి. నేను ధను వెక్కిడియు వారిని మరలింపఁజాలనైతిని. నావెనుకటి భుజవీర్యమును క్షీణించెను. ఓ మహామునీ! వివిధములగు నాయస్త్రములన్నియు నష్టములయ్యెను. ఒక క్షణములోనే నాసాయకములన్నియు సంక్షయమొందెను. ఆహా! ఆశ్యామలాంగుఁడు—ఆశంఖచక్రగదాధరుఁడు—ఆచతుర్భుజుఁడు—ఆపీతవసనుఁడు—ఆపద్మదళాక్షుఁడు—ఆయప్రమేయరూపుఁడు కానరాఁడయ్యెనుగదా! అక్కటా! మహాద్యుతియగు నెవ్వఁడు నాతేరి నొగలపైఁ గూరుచుండి వైరివారములఁ దనచూపులచే దహించుచున్నటు లిప్పటికిని గనులఁగట్టినట్టు లుండెనో, యట్టిమహనీయుఁడు గానరాఁడుగదా! అతఁడు ముందుగాఁ దనతేజముచే శత్రుసైన్యములను దహించినపిమ్మట, దగ్ధప్రాయులైనవారినే, నేను నాగాండీవప్రయుక్తసాయకములచే సమయఁజేయుచువచ్చినవాఁడను. ఓమహాత్మా! నేనాతనిఁ జూడక జీవింపఁజాలను. నాచిత్తము వివశమగుచున్నది. శాంతి గలుగకున్నయది. వీరుఁడగు జనార్దనుఁడు లేని బ్రదు కేటికి? అతఁడు గతించుట వినిన నాకు దిక్కు లగపడకున్నవి. ఓసచ్చరిత్రా! జ్ఞాతులును, బరాక్రమమును, జెడి శూన్యప్రాయుఁడనై యిటునటు తిరుగుచున్న నాకు శ్రేయమెద్దియో తెలుపుము.' అని పలికెను. అంత నావ్యాసభగవానుఁడు 'ఓపార్థా! వృష్ణ్యంధకమహారథులు బ్రాహ్మణశాపదగ్ధులై నశించిరి. వారికై వగవఁబనిలేదు. అది కానుండుట నట్టులైనది. మహాత్ములకేని దైవమును దప్పించుకొనరాదుగదా! సమర్థుఁడయ్యు శ్రీకృష్ణుఁ డద్దానిని మరలింప నుపేక్షించెను. స్థావరజంగమాత్మకమగు త్రైలోక్యమును నాగోవిందుఁడు వేఱొకవిధముగాఁ జేయ సమర్థుఁడైనను మహాత్ములగు బ్రాహ్మణులశాపము నెట్లు తప్పింపఁగలఁడు? ఎవ్వఁడు నీయెడఁగల ప్రేమచే నీతేరి నొగలఁ గూరుచుండెనో, యట్టిచక్రగదాధరుఁడు, మహాచతుర్భుజుఁడు, పురాణపురుషుఁడు, వాసుదేవుఁడు, భూభారమును దీర్ప నవతరించి, యప్పని దీర్చి మరలఁ దనస్థానము నొందెను. మహాభుజుఁడవగు నీవును దేవతలకును సాధ్యముగాని మహత్తరకృత్యమును భీమనకులసహదేవులసహాయముచే జరపితివి. ఓకురుపుంగవా!

మీరు కృతార్థులై తిరనియే నానిశ్చయము. మీకును నుత్తమగతికిఁ బోవఁ గాలము ప్రాప్తించెను. అదియే మీకు శ్రేయస్కరమగు మార్గము. ఇటులే యొకపుడు బుద్ధియుఁ బ్రతిపత్తియుఁ, దేజము నగుచుండును. కాలము మాఱినపు డన్నియు మాఱుచుండును. ఓధనంజయా! ఈసకలజగము కాలమూలమై యున్నది. మఱియుఁ గాలమే యన్నిటిని సమకూర్చుచుండును. అదియే బలవత్తరమై వేఱొకపుడు దుర్బలమగుచుండును అయ్యది యొకపుడు ప్రభువై మఱియొకపుడు పరులయాజ్ఞకు లోనగుచుండును. నీయస్త్రములు కృతకృత్యములై వచ్చినత్రోవనే పోయినవి మరల వానికిఁ గాలము వచ్చునపుడవి నిన్నుఁ జేరును. ముఖ్యగతి నొందుటకు మీకును గాలము ప్రాప్తించెనని తెలిపితినిగదా! ఓభరతసత్తమా! నేనిపుడు తెలిపినదియే మీకు శ్రేయము అని నానిశ్చయము.' అని పలికెను. ఓజనమేజయా! అమిత తేజుఁడగువ్యాసునివచన మాలించి యప్పార్థుఁడు హాస్తిపురికిఁ బోయి యుధిష్ఠిరుని సమీపించి జరగినవృష్ణివీరులవిధమంతయు వివరించి తెలిపెను." అని పలుక విని జనమేజయుం డిట్లనియె.

మౌ స ల ప ర్వ ము

స మా ప్త ము.

శ్రీరస్తు.

# శ్రీమదాంధ్ర

# వచనమహాభారతము

## మహాప్రస్థానికపర్వము.

శ్లో. "నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమం,
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయముదీరయేత్."

"ఓవైశంపాయనా! అటులు వృష్ణ్యంధకులును, గృష్ణుఁడును, మౌసలనిధన మొందుట విని పాండవు లేమి చేసిరి?"

అది విని యవైశంపాయనుఁడు "ఓజనమేజయా! ఆయాదవులకదనవిధమును నిధనమును విని యాధర్మజుఁడు మహాప్రస్థానమున మతినిడి, సవ్యసాచిం జూచి, 'ఓతమ్ముఁడా! సకలప్రాణులను గాలము తుదముట్టించుచుండును. నీవును గాలపాశబద్ధుఁడ వౌదువనియే నా నిశ్చయము' అని పలుకుటయు, నప్పార్థుఁడు 'అన్నా! తప్పదు. కాలమే. కాలమే అన్నిటికి నిమిత్తము' అని యాయుధిష్ఠిరువచనమును సమ్మతించెను. ఆయర్జునునియభిప్రాయ మెఱింగి భీమనకులసహదేవులును నందుల కంగీకరించిరి. అటులు వారందఱు నేకమనస్కులైనతఱి యుధిష్ఠిరుఁడు ధర్మవాంఛచేఁ బ్రవ్రజనము చేయువాఁడై యుయుత్సుని రావించి, యాతనికి రాజ్య మొసఁగి, నిజరాజ్యమునఁ బరీక్షిత్తును పట్టాభిషిక్తునిఁ గావించి దుఃఖార్తుఁడై సుభద్రను గాంచి, 'ఓవసుదేవపుత్త్రీ! నీపుత్త్రుని పుత్త్రుఁడగు పరీక్షిత్తు కురురాజ్యమునకు రాజగును. యదువులలో మిగిలినవజ్రుఁడు రాజుగాఁ జేయఁబడియెను. హాస్తిపురికిఁ బరీక్షిత్తు రాజుగా, వజ్రుఁ డింద్రప్రస్థమునకు రాజగును. ఆవజ్రుఁడు నీకు రక్షణీయుఁడు. నీ వధర్మమునఁ జిత్తము నిలుపకుము.' అని తెలిపి

ధీమంతుఁడగు వాసుదేవునకును, వృద్ధుఁడగు మామకును, రామాదులకును, దనసోదరులతోఁగూడ నుదకక్రియలు నిర్వర్తించి, విధ్యుక్తముగా శ్రాద్ధవిధులఁ దీర్చి, తపోధనులగు ద్వైపాయన నారద, మార్కండేయ, భారద్వాజ, హారి, యాజ్ఞవల్క్యుల నుద్దేశించి, రుచికరమగు భోజ్యమును భుజింపఁజేసి, హరి నుద్దేశించి, రత్నములను, వస్త్రములను, రథములను, గ్రామములను దానమొనర్చి మఱియు వేలకొలఁదిగా గుఱ్ఱములను, స్త్రీలను బ్రాహ్మణోత్తముల కొసఁగి, గురుఁడగు కృపు నారాధించి, పరీక్షిత్తును పౌరపురస్కృతముగా నాతనికి శిష్యునిఁగా నప్పగించి, పిమ్మట మంత్రులనెల్ల రావించి, వారికిఁ దన మనోభీప్సితమెల్ల నెఱిఁగించెను. ఆతనిమాటలు విని వారు, మిగుల నుద్వేగము గదురుమానసములతో నందులకు సమ్మతింపక 'రాజోత్తమా! ఇటులొనర్ప నెంచుట పాడిగాదు' అని పలికిరి. కాని కాలవిపర్యాసవేత్తయగునతఁడు వారివచనముచొప్పున ప్రవర్తింపనొల్లక పౌరజానపదజనము నెట్టెటో సమ్మతింపఁజేసి, తానును సోదరులును మహాప్రస్థానమును జేయుటకు నిశ్చయించెను. అంత నక్కురుపతియగు యుధిష్ఠిరుఁడు, తనయలంకారములనెల్లఁ దీసి యుంటనుంచి, వల్కలములను ధరించెను. అనంతరము భీమార్జుననకులసహదేవులును, ద్రౌపదియు, వల్కలములను ధరించిరి. వారటులు వల్కలములఁ బూని, విధ్యుక్తముగా నైష్ఠికేష్టింజేసి, తమసకలాగ్నులను జలములందు విడిచి, ప్రయాణమయిరి. అటులు పయనమైనవారి నారసి, పౌరకాంతలందఱు నేడ్వసాగిరి. మున్ను ద్యూతమున నోడినపుడు వెడలినస్థితి యెల్ల వారికిని దలంపునకు వచ్చెను. యుధిష్ఠిరునభిప్రాయమునుబట్టియు, యాదవక్షయమునుబట్టియు భీమాదుల కాప్రయాణము సంతోషమే గలిగించెను. ఓజనమేజయా! ఆయేవురుసోదరులును, ద్రౌపదియు శునకమొకటియునుగా నప్పురమునుండి యేడువ్యక్తులు మహాప్రస్థానమునకు వెడలెను. వారి నంతఃపురకాంతలును బౌరులును ననుగమించువారై వెడలి కొంతదూరమువఱకు వచ్చిరిగాని, యందొక్కఁడును వారిని నివర్తింపఁ జేయఁజాలఁడయ్యెను. పిమ్మటఁ బురవాసులందఱును మరలిరి. కృపుఁడు మున్నగువారు యుయుత్సునిఁ బరివేష్టించి వెడలిరి. భుజగపుత్రియగు నలూపి గంగానదిని బ్రవేశించెను. చిత్రాంగద,

మణిలూరపురమునకుఁ బోయెను. తక్కిన రాజపత్నులు పరీక్షిత్తు నను సరించియుండిరి. మహాత్ములగు పాండవులును, ద్రౌపదియును నుపవాస నిష్ఠమెయిఁ బ్రాఙ్ముఖులై వెడలిరి. అటులు వెడలి వారు యోగనిష్ఠు లును, త్యాగధర్ములును, నగుచుఁ బెక్కు దేశములను, నదులను, సము ద్రములను నతిక్రమించుచుఁ బోసాగిరి. ముందుగా యుధిష్ఠిరుఁడును, నతని వెనుక భీముఁడును, బిమ్మట నర్జునుఁడును, దరువాత నకులసహ దేవులును, యథాక్రమముగా నడుచుచుండ, వారివెనుక శ్యామయుఁ, బద్మదళాక్షియునగు ద్రౌపది నడుచుచుండెను. ఆమె వెనుక నొకశున కము నడువసాగెను. వారు క్రమముగాఁ బోయిపోయి లౌహిత్య మనెడిసముద్రమును సమీపించిరి. ధనంజయుఁడు దివ్యమగు గాండీవ మును విడువక పట్టుకొనెను. అటులే యతఁడు తనయక్షయమహేషు ధులను బట్టికొనియే నడువసాగెను. అపు డాత్రోవలో నెదుట వారికిఁ గొండవలె మహోన్నతమై సాక్షాత్పురుషవిగ్రహముతో మార్గము నావరించియున్న యగ్ని గానవచ్చెను. అటులు గానవచ్చిన యాయగ్ని దేవుఁడు వారితో 'ఓవీరులారా! పాండవులారా! నన్నగ్ని దేవునిఁగాఁ దెలియుఁడు. ఓయుధిష్ఠిరా! ఓభీమసేనా! ఓయర్జునా! ఓనకులసహదేవులారా! నామాట వినుఁడు. నేనగ్నిదేవుఁడను. నేనే ఖాండవవనమును దహించితిని. నారాయణార్జునులప్రభావముచే నే నావనమును దహింపఁగలిగితిని. మీభ్రాతయగు ఫాల్గునుఁడు పరమా యుధమగు గాండీవమును బరిత్యజించి వెడలుఁగాక. దీనిచే నీతనికిఁ బ్రయోజనములేదు. మహాత్ముఁడగు శ్రీకృష్ణు చేతిచక్రమును బోయెను. అది కాలాంతరమున నాతనిహస్తమును జేరును. అటులే యీతని గాండీవమునైత మిపుడు వరుణున కర్పింపవలయు. ఇయ్యది దేవకార్య మునకుఁగా, వరుణునుండి సంపాదింపఁబడియెనుగాన, వానికే యీ యుత్తమధను వర్పింపఁబడుగాక.' అని తెలిపెను. అది విని యుధిష్ఠి రాదు లప్పార్థు నందులకుఁ బ్రేరించిరి. అతఁ డాగాండీవమును సము ద్రమునఁ బడవైచెను. అటులే యక్షయ్యములగు నమ్ములపొదులను, నుదధిఁ బడవైచునంత, నయ్యగ్ని దేవుఁ డంతర్హితుఁడయ్యెను. పిమ్మట నప్పాండవులు, దక్షిణాభిముఖులై వెడలి యుప్పుసంద్రము నుత్తర తీరమునుబట్టి నడిచి నడిచి దక్షిణపశ్చిమదిశకుఁబోయి యచ్చోటనుండి

పశ్చిమదిశకుఁ బోయిరి. సాగరపరిప్లుతమగుద్వారక వారికి గానవచ్చెను. ఆదెసనుండి మరలి యుత్తరదిశనుబట్టి బోవుచు యోగధర్మపరులై భూప్రదక్షిణము జేయుతలంపునఁ బోసాగిరి.'' అని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

## ద్రౌపది మొదలగువారు గతజీవులై పడుట

"ఓజనమేజయా! వారటు లుత్తరదిశనుబట్టి చనుచునుండ యోగయుక్తులగువారికి మహత్తరమగుహిమవద్గిరి గానవచ్చెను. దానినిగడచి చనుచున్న వారికి వాలుకార్ణవము గానవచ్చెను. పిమ్మటఁ బర్వతోత్తమమగు మేరుగిరిని గాంచిరి. అటులు వారు యోగధర్ములై యెల్లదెసలఁ జరించుచుండఁగా, నపుడు యోగభ్రష్టయైన ద్రౌపది పుడమిఁ బడియెను. అటులు పడినయామెను గాంచి మహాబలుఁడగు భీముఁడు ధర్మజునితో 'ఓయన్నా! పతివ్రతయగు నీరాజపుత్త్రి యధర్మమేమియుఁ జేయలేదుగదా! ఇటు లిమె పడుటకుఁ గారణమేమో తెలుపుము' అని యడిగెను. అది విని యుధిష్ఠిరుఁడు, 'ఓతమ్ముఁడా! నీవడుగుటఁ దెలిపెదను వినుము. ఈపాంచాలికి పార్థునిపై బక్షపాతము గలదు. ఆతని యం దధిక ప్రీతి గలుగుట నిపు డాఫలము సంభవించెను.' అని తెలిపెను.

ఓజనమేజయా! అటులు పలికి యతఁడు సమాహితుఁడై యామెను గాంచకయే పోవుచుండెను. అంతఁ గొంతవడికి వివేకియగు సహదేవుఁడు పుడమిఁబడియెను. అంత నాభీముఁ డది చూచి 'అన్నా! ఇతఁ డహంకార మించుకయు లేక మనలనెల్ల సేవించెనుగదా! అట్టి యీమాద్రీతనయుఁ డేల పడియెను?' అని యడుగుటయు, నతఁడు 'ఓయీ! ఇతఁడు తనకీడగుప్రాజ్ఞుఁ డెవ్వఁడు లేఁడని తలంచెడివాఁడు. ఆదోషముచే నితఁ డిట్లు పడియెను.' అని తెలిపెను. ఓజనమేజయా! అతఁ డిట్లు పలికి యాసహదేవునిఁ బరిత్యజించి, మిగిలినసోదరులును శునకమును వెంటరా వెడలిపోవుచుండెను. అటులు ద్రౌపదియు, సహదేవుఁడును బడుటఁ గాంచి దుఃఖితుఁడై నకులుఁడు పుడమిఁ బడియెను. మనోహరాకారుఁడగు నకులుఁడును బుడమిఁబడఁ గాంచి, భీముఁడు యుధిష్ఠిరు నారసి, 'ఓయన్నా! ఈనకులుఁ డక్షతధర్ముఁడై ప్రవర్తిల్లెను

గదా ! నిరుపమానరూపుఁడగు నితఁ డిట్లు పడుటకు నిమిత్తమేమి?' అని ప్రశ్నించుటయు నయ్యుధిష్ఠిరుఁడు, 'ఓభీమసేనా ! ఇతఁడు తన సాటిరూపముగలవాఁడు లేఁడనియుఁ దానే యెల్లవారికంటె నెక్కుడు చక్కఁదనముగలవాఁడననియు విఱ్ఱవీఁగుచుండెడివాఁడు. అటులగుట నిట్లితఁడు పడియెను.' నీవిఁక పడిగా రమ్ము. ఓవీరా ! ఎవ్వని కేదివిహితమోయది యతఁ డనుభవింపక తప్పదు గదా!' అని పలికి వెడలి పోసాగెను. అటులు పడినతమ్ములను ద్రౌపదిని గాంచి, యర్జునుఁడు, పరితపించుచుఁ బుడమిఁ బడుటయు, దురాధర్షుఁడును నింద్రతేజుఁడు నగునతనిపతనము గాంచి, భీముఁడు 'అగ్రజా ! మహాత్ముఁడగునితఁడు సాధారణసంభాషణమందును నసృతమాడుట యెఱుఁగఁడు గదా ! వీని కిట్టివికారము గలిగెనేమి? ఇతఁడు పడ నిమిత్తమేమి?' అని ప్రశ్నించెను. అందుల కయ్యుధిష్ఠిరుఁ డుత్తరమిచ్చువాఁడై 'భీమా ! ఇతఁడు శత్రులనెల్ల నొకదినముననే వధింతు ననునభిమానముగలిగి యటులొనర్పలేక పోయినవాఁడు. అటులగుట నితఁడు పడిపోయెను. మఱియు నితఁడు సకలధనుర్ధరుల నవమానబుద్ధితోఁ జూచెడివాఁడు. అటులు చూడఁదగదుగదా !' అని పలికెను. ఓజనమేజయా ! ఇట్లు పలికి యతఁడు వెడలిపోవుచుండ భీముఁడు పుడమిఁబడుచు, 'ఓయుధిష్ఠిరా ! నీకుఁ బ్రియుఁడనగునే నిదె పడుచున్నాఁడను. చూడుము. నేనేల పడవలయునో నిమిత్త మెఱిఁగింపుము.' అని యడుగుటయు, నతఁడు 'ఓయీ ! నీవతిభోజనుఁడవై పరముగాంచక బహుబలము గలవాఁడనని గర్వించుచుండెడివాఁడవుగాదే. అటులగుటఁ బుడమిఁ బడుచున్నాఁడవు.' అని పలికి యాతనిఁ జూడకయే వెడలిపోసాగెను. ఓజనమేజయా! నేను బలుమాఱులు దేనిని గీర్తించితినో, యట్టిశునక మొక్కటియే యుధిష్ఠిరు ననుసరించి వెడలి నడుచుచుండెను." అని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

## యుధిష్ఠిరస్వర్గారోహణము

"ఓజనమేజయా! పిమ్మట నింద్రుఁడు నిజరథధ్వానముచే దెసలఁ బ్రతిధ్వనులు జనింప, వచ్చి యుధిష్ఠిరా ! ఈరథ మధిరోహింపుము' అని పలుకుటయు, నతఁడు పుడమిఁబడినతమ్ములను దలఁచి శోకసంతప్తుఁ

డగుచు 'ఓసహస్రాక్షా! ఈనాసోదరు లిటులు పడిరిగదా! వారు నాతో వత్తురుగాక. ఓసురేశ్వరా! సోదరులను విడిచి స్వర్గమును వాంఛించువాఁడనుగాను. ఓపురందరా! సుకుమారియు, రాజకుమారియు, సుఖార్హయునగు నీద్రౌపదిసైతము మాతో రావలయును. దీని కీవంగీకరింపుము.' అని పలికెను. అది విని యింద్రుఁడు 'ఓయుధిష్ఠిరా! నీకంటె ముందుగా స్వర్గతులైయున్న నీసోదరులను ద్రౌపదిని నీవందుఁ గాంచఁగలవు. శోకింపకుము. వారు మానవదేహమునువిడిచి స్వర్గమును బొందిరి. నీవు నిజశరీరముతో స్వర్గము నొందఁగలవాఁడవు.' అని తెలిపెను. అంత నయ్యుధిష్ఠిరుఁడు, 'దేవా! ఈశ్వానము, కాలత్రయమందును నాయెడ భక్తిగలిగి నిత్యము నన్ను విడువక ప్రవర్తించుచున్నయది. భూతదయగల నాబుద్ధిచే, దీనినిగూడ స్వర్గము నొందింపవలయును.' అని ప్రార్థించెను. అంత నాయింద్రుఁడు 'ఓదేవా! నీవు నాయట్టివాఁడవై యమర్త్యత్వమును, సకలసంపదను, మహత్తరసిద్ధిని బొందితివి. స్వర్గసుఖములన్నియు నీకు సంప్రాప్తించెను. కావున నీవిఁక దీనిని విడువుము. ఇందుఁ గ్రౌర్యమేమియును లేదు." అని తెలిపెను.

యుధిష్ఠిరుఁడు:—ఓసహస్రాక్షా! ఆర్యుఁ డెన్నఁడును, ననార్యకృత్య మొనర్పఁజాలఁడు. ఓయార్యా! ఇది నాకుఁ జేయఁదగనిపని. దేనికై యాసపడి భక్తజనమును బరిత్యజింపవలయునో, యట్టిసిరియు నాకపేక్షితముగాదు.

ఇంద్రుఁడు:—ఓరాజా! శునకముగలవారికి స్వర్గమునఁ జోటు లేదు. క్రోధవశులనియెడి దేవత లశుచులగువారి యిష్టాపూర్తఫలమును హరించుచున్నారు. అది యాలోచించుకొని పనిచేయుము. ఈ శునకమును విడువుము ఇందుఁ దప్పేమియు లేదు.

యుధిష్ఠిరుఁడు:—ఓవాసవా! భక్తత్యాగమునుబోలినపాపమే లేదు. అయ్యది బ్రహ్మహత్యకంటెఁ బ్రబలమైనది. ఓమహేంద్రా! నేను నిజసుఖమును గోరి దీనిని విడువనొల్లను. మఱియు భీతుని, భక్తుని, నీకంటెవేఱొకఁడు లేఁడని యార్తుఁడై వచ్చినవానిని, రక్షణహీనునిఁ, బ్రాణముగోరువానిని నేను విడువఁజాలను. తుదకుఁ బ్రాణత్యాగమే నొనరింతునుగాని, యట్టిపని చేయను, ఇది నాకొక వ్రతము.

ఇంద్రుఁడు:—ఓధర్మరాజా! నేనింతకుమున్ను తెలిపిన క్రోధవశులనియెడివారు, శునకముచేఁ జూడఁబడినట్టియుఁ, దెఱవఁబడినట్టియు, హుతమును, దానమును, నిష్టాపూర్తమును హరింతురు. కావున నీశునకమును విడువుము. శునకమును విడిచితివా! దేవలోకమొందఁగలవు. ఓవీరా! నీభ్రాతలను నీకుఁ బ్రియయగు ద్రౌపదిని బరిత్యజించి నీసత్కర్మముచే దేవలోకమొందితివి. ఈశ్వానమును విడువవేని, నీవు సర్వత్యాగముచేసినవాఁడ వెట్టులగుదువు? ఏమి యిట్లు మోహమందుచున్నాఁడవు?

యుధిష్ఠిరుఁడు:—ఓదేవా! మృతులైనమానవులతో సంధివిగ్రహము లొనర్పవలసినదిలేదని లోకులయభిప్రాయము. వారిని నేను జీవింపఁజేయఁజాలనుగదా! కావున వారిని బరిత్యజించితిని. జీవించియున్నవారి నెట్లు విడుచువాఁడను? శరణాగతుని శత్రున కప్పగించుటయు, స్త్రీలను వధించుటయు, బ్రాహ్మణులధనముల నపహరించుటయు, మిత్రులకు ద్రోహమొనర్చుటయు ననియెడినాల్గును భక్తపరిత్యాగమును దుల్యములగునని నాయభిప్రాయము.

ఓజనమేజయా! ఆధర్మజునివచనము లాలించి భగవానుఁడగు ధర్ముఁడు, ప్రీతివెలయ యుధిష్ఠిరు నారసి, మృదుమధురోక్తులతో 'ఓరాజా! నీవు చరిత్రమునుబట్టియు, బుద్ధినిబట్టియు, సకలభూతదయనుబట్టియుఁ దండ్రిని బోలినవాఁడవు. ఓపుత్రకా! నీవు ద్వైతవనమున నుండఁగా నిన్నుఁ బరీక్షించితిని. అపుడు జలమునకై నీభ్రాతలు వెడలి హతులైనపుడు, సోదరులగుభీమార్జునులఁ బరిత్యజించి, తల్లి వేఱని తలంపక నకులుని బ్రతికింప నెంచితివిగాదే? ఇపు డిట్లు శునకము భక్తిగలిగియుండెనని యింద్రరథమే నవేక్షింపవైతివి. కావున స్వర్గమందును నీకుఁ దుల్యుఁడగువాఁ డొక్కఁడును లేఁడని నాయభిప్రాయము. ఓయుధిష్ఠిరా! అటులగుట నిజశరీరముతో నీవక్షయలోకము లందఁగలవు. ఉత్తమమగుదివ్యగతిని బొందితివి.' అని తెలిపెను,

ఓజనమేజయా! అనంతర మాధర్ముఁడును నింద్రుఁడును మరుత్తులును, నశ్వినీదేవతలును, దేవతలును, దేవర్షులును, నప్పాండవోత్తముని రథమునఁ గూరుచుండఁబెట్టికొని, తమతమవిమానములతోఁ

గాముగమునురై వెడలిరి. అంత నాధర్మజుండు రథమధిరోహించి, తన తేజముచే భూమ్యాకాశముల వెలయించుచు, వడిగా నూర్ధ్వలోకములకుం బోసాగెను. అంతట సకలలోకవేత్తయు, దేవగణమధ్యస్థుండు నగు నారదుండు 'ఆహా! ఎందఱో రాజర్షులియూర్ధ్వ లోకములకు వచ్చిరి కాని, యీధర్మజుండు వారినెల్లం దనకీర్తిచేం గప్పి వెలయుచున్నవాండు. యశస్తేజోవృత్తసంపదలచే లోకముల నాక్రమించి, స్వశరీరస్వర్గసుఖము సంపాదించెను. ఇట్టివాం డితండుతప్ప వేఱొకండు లేండని నానిశ్చయము' అని పలికెను. నారదవచన మాలించి యాధర్మజుండు దేవతలను, స్వపక్షులగుపార్థివులను శావించి, 'ఓమహాత్ములారా! సుఖమెగాని, దుఃఖమెగాని నాసోదరులస్థానమే నాకుం గావలయును. ఇతరస్థానముల నేనభిలషింపను' అని తెలిపెను. అది విని యాపురందరుండు భూతదయావిష్టుండగు యుధిష్ఠిరు నారసి, 'ఓరాజేంద్రా! నీయుత్తమకర్మములచే మహత్తరస్థానము నీకు లభించియుండంగా, మానుష్యకమగుస్నేహము నిప్పటికిని బరిత్యజింపకున్నాండ వేమి? నీయట్టివాండు లోకములో లేండనుసంతటి కపముసిద్ధిని బడసితివి. నీభ్రాతలుత్తమస్థానమును బొందలేదు. అటులైనను మానుషభావము నిన్ను విడువకున్నది. ఇదె! ఈస్వర్గమును జూడుము. ఈదేవర్షులను గనుంగొనుము. ఈదేవతలను బరికింపుము ఈసిద్ధుల నరయుము' అని తెలుపుటయు, నయ్యుధిష్ఠిరుం డర్థయుక్తములగు సూక్తులు వెలయ "ఓస్వర్గాధిపా! నాసోదరులను విడిచి యుండజాలను. నాతమ్ము లెందుండిరో, యందులకే పోయెదను. మఱియు, బుద్ధిసత్త్వగుణాన్వితయైన ద్రౌపదియుం బుత్త్రులును నెచ్చోనున్నవారో యచ్చోటికే పోయెదను' అని పలికె" నని తెలుపుటయు జనమేజయుం డిట్లనియె.

మహాప్రస్థానికపర్వము
సమాప్తము

---

శ్రీ ర స్తు.

# శ్రీమదాంధ్ర

# వచనమహాభారతము

## స్వర్గారోహణపర్వము.

---

శ్లో. "నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్,
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయముదీరయేత్."

"ఓవైశంపాయనా! నాపూర్వపితామహులగు పాండవులును, ధార్తరాష్ట్రులును, త్రివిష్టపము నొందిరి గదా! వారిలో నెవ్వరెవ్వరి కేయేస్థానములు గల్గెను? అదియెల్ల విన నా కెంతయుఁ గుతూహల మయ్యెడిని. అద్భుతకర్ముఁడగు వ్యాసమహర్షివలన నీవు సర్వవేత్తవని నే నెఱుఁగుదును.

అది విని వైశంపాయనుఁడు "ఓజనమేజయా! నీప్రపితామహులగు యుధిష్ఠిరాదులు త్రివిష్టపమగుస్వర్గమునొంది యేయే స్థానములొందిరో యెఱిఁగించెదను వినుము. ఆధర్మరాజు స్వర్గమున కటులేఁగి, శోభాశాలియై యుత్తమాసనాసీనుఁడై యున్న సుయోధనునిఁ గాంచి, వీరలక్ష్మీవిరాజితుఁడగుచు, నాదిత్యుఁడునా వెలయుచు నతఁడు పుణ్యకర్ములగు దేవతలచేఁ బరివేష్టితుఁడై ప్రకాశించుచుండుట కెంతయు నద్భుతంపడుచు నోరువఁజాలక, యచ్చోటినుండి వడిగా మరలెను. అటులు మరలి 'ఓయీ! నే నాసుయోధనునిఁగూడి స్వర్గలోకసుఖము లనుభవింపఁ గోరను. లుబ్ధుఁడగు నాసుయోధను నే నభిలషింపను. అక్కటా! వానిమూలముననే గదా బంధుగులును, మిత్రులును మాచే వధింపఁబడిరి. వానివలననే మేము వనవాసక్లేశము లందితిమి. ధర్మచారిణియగుపాంచాలి సభామధ్యమునఁ బెద్దలు కనుచుండఁగా,

బలాత్కరింపఁబడి, వానిచేఁగదా పరిభవింపఁబడియెను? ఓ దేవతలారా! సుయోధనుఁ జూడ నాకించుకే నిష్టములేదు. అచ్చోట నాసోదరులున్నను, నేనందులకుఁ బోనొల్లను' అని పలికెను. అది విని నారదుఁడు నగుచు, 'ఓ రాజేంద్రా! ఇట్లు తగదు. స్వర్గమున వెనుకటివిరోధములును నశించుచున్నవి. ఓ యుధిష్ఠిరా! నీవిట్లు పలుకరాదు ఆ సుయోధనుగుఱించి నేనొకటి తెలిపెదను వినుము. ఓ రాజా! ఆసుయోధనుని దేవతలును, స్వర్గవాసులగు నుత్తమరాజర్షులును బూజించుచున్నవారు. అతఁడు తనదేహమును యుద్ధాగ్నిలో వ్రేల్చి వీరలోకగతినొందెను. దేవతుల్యులగుమీరందఱును నీతనిచే హింసింపఁబడితిరి గదా! అటులయ్యు నితఁడు క్షత్రియధర్మముచే నిట్టి యుత్తమస్థానమొందెను. ఎవ్వఁడు తనకు మహాభయము ప్రాప్తించినను జడియకుండెనో యట్టిధీరుఁడగు సుయోధనుఁ డుత్తమపదమొందెను. ఓ యుధిష్ఠిరా! ఆద్యూతమునందు జరిగినవిధ మిప్పుడు తలంపకుము. ద్రౌపదీపరాభవమునుగుఱించి చింతింపకుము. మఱియు నతఁడు మీకొనర్చిన క్లేశములను స్మరింపకుము న్యాయముగా రమ్ము. ఈ సుయోధనుఁ జూడుము. స్వర్గమునకు వచ్చియు వైరమును స్మరింపవచ్చునా?' అని నారదుఁడు తెలుపుటయు, నయ్యుధిష్ఠిరుఁడు, తనభ్రాతలను సుయోధనుని నుద్దేశించి 'ఓ నారదా! అధర్మజ్ఞుఁడును, పాపుఁడును, మిత్రద్రోహియు, నగుసుయోధనునకు సనాతనములగు వీరలోకములు సంభవించెను. వానిమూలమున బృథివియెల్ల నశించెను. ఎన్నియేని ప్రాణులు పరిమార్పఁబడియెను. వీనివైరమును దీర్చికొన మే మెంతయేని దుఃఖమునకుఁ బాలుపడితిమిగదా! ఇఁక మహాత్ములును మహావ్రతులును, సత్యప్రతిజ్ఞులును వీరులునగు నాతమ్ముల కెట్టిలోకములు సంభవించెనో చూడఁగోరుచున్నాఁడను. మఱియు మహాత్ముఁడును, సత్యసంగరుఁడును కుంతీపుత్త్రుఁడునగు కర్ణుఁడును, ధృష్టద్యుమ్నుఁడును, సాత్యకియు, ధృష్టద్యుమ్నునితనయులును, మఱియు శస్త్రవధము నొందినపార్థివులును, నెందున్నవారో నాకుఁ జూపుము. విరాటద్రుపదులును, ధృష్టకేతుప్రభృతులగువీరులును, శిఖండియు, ద్రౌపదేయులు, నభిమన్యుఁడును నెందున్నవారో చూడఁ గోరుచున్నాఁడను.' అని యడిగి యాధర్మజుఁడు మఱియు నిట్లనియె.

### యుధిష్ఠిరుఁడు నరకమును గాంచుట

'ఓనారదమునీంద్రా! దేవతలారా! అమితపరాక్రముఁ డగు కర్ణుఁ డీస్వర్గమునఁ గానరాకున్నవాఁడేమి? మఱియు మహాత్ములగు యుధామన్యూత్తమౌజసు లగపడరేమి? వారిరువురును రణవహ్నియందుఁ దమశరీరములను వ్రేల్చిరి గాదే! మఱియు నాకై యుద్ధమునఁ బ్రాణములు పరిత్యజించినరాజపుత్రులును, రాజులును నెందున్నవారు? పురుషోత్తములగువారిచే నీస్వర్గము జయింపఁబడియెనుగాదే? వారీలోకములో నెందుందురో యందే నే నివసింపఁగోరుచున్నాఁడను. లేక, వారిచే నీయక్షయలోక మొందఁబడలేదా? ఆనాభ్రాతలు లేనిచోట సుఖమనుభవించువాఁడనుగాను. ఓసురలారా! మాతల్లి, మృతులయినవారికి జలక్రియ యొనర్చునపుడు కర్ణునివిధము దెలిపెను. నాఁటఁగోలె నాతనికై పరితపించుచునే యున్నవాఁడను. నాతల్లిపాదములను బోలినపాదములు గలయాతనిరూపము నాకెంతయుఁ జిత్తమునకు మఱపురాకున్నయది. మాతో నాతఁడు కలిసియుండెనేని మమ్మా యింద్రుఁడేని జయింపఁగలుగునా? అట్టికర్ణునిఁ జూడఁగోరుచున్నాఁడను. ఆతని నేనెఱుఁగమి, నాసవ్యసాచిచేఁ జంపించితిని. అయ్యయో! అతఁడెందున్నవాఁడు? నాప్రాణములకంటెఁ బ్రియుఁడై భీమవిక్రముఁడైన భీముని, నింద్రసన్నిభుఁడగు నర్జునుని, నకులసహదేవులను, ధర్మచారిణి యగు ద్రౌపదిని జూడఁగోరుచున్నాఁడను. నే నీచోట వసింపఁజాలను. నిజము చెప్పుచున్నాఁడను. ఓసురోత్తములారా! తమ్ములు లేనిస్వర్గసుఖము నాకేటికి? నాకెందు స్వర్గసుఖమో, యదియే స్వర్గముగాని యిది స్వర్గముగానేరదు' అని పలికెను.

అది విని దేవతలు "ఓరాజా! వారున్నచోటికే, నీకుఁ బ్రియమేని పదము. జాలము వలదు. మాయింద్రునానతినిబట్టి నీకుఁ బ్రియముగుమార్గముననే వర్తించువారము' అని తెలిపిరి. ఓజనమేజయా! ఇట్లు పలికి యాదేవత లొకదూతను రావించి 'ఓరీ! ఈయుధిష్ఠిరునకు మిత్రులగువారి నెల్లఁ జూపుము.' అని నియోగించుటయు, నాదేవదూత యాధర్మజునిఁ దోడ్కొని, భీమాదు లున్నచోటికి వెడలెను. దేవదూత ముందుగా నడుచుచుండ, ధర్మజుఁడు వెనుకఁ బోసాగెను. వారిమార్గము పాపకర్ములగువారిచే సేవింపఁబడి, క్లేశకరమై దుర్గమమై

యుండెను. చీకటులచే నావృతమై, కేశశైవలశాద్వలమై పాపకర్ములతోఁగూడి, మాంసశోణితకర్దమమై ఘోరమైయున్న యాత్రోవనెందుఁ గాంచినను, గంటకములు, మక్షికలు, మశకములు నావరించియుండెను. ఎందుఁజూచినను శవములు ప్రోవులు ప్రోవులుగా నుండెను. మఱియు నెమ్ముకలు, కేశములు, క్రిములు, కీటకములు, నిండి, ప్రదీప్తజ్వాలనావృతమై భయము గొలుపుచుండెను. ఇనుపముక్కులు గల కాకులు, గ్రద్దలు, సూచీముఖములు, వింధ్యశైలములు నాఁదగు ప్రేతములు, బాహువులు తొడలు హస్తములు తెగి, మేదోరుధిరయుక్తములైన కళేబరము లందందుఁ బడియుండెను. కుణపదుర్గంధమై గగురుపాటొదవించు నమ్మార్గమునుబట్టి పోవుచు నాధర్మజుఁ డెంతయు వంతగదురఁ, జింతిలుచు, నాత్రోవలో నుష్ణోదకమై ప్రవేశింపరాని యొకనదిని జూచెను. మఱియు నొకచోఁ దీవ్రములగుకత్తులతోఁగూడియున్న యసిపత్రవన మొకటి యాతనికిఁ గానవచ్చెను. మఱియుఁదప్తమైనచిట్టిసుకనేలయును, నినుపఱాలును, మఱఁగుచున్న తైలలోహకుంభములును జూపట్టెఁ దన్మార్గమునఁ దీక్ష్ణకంటకమై స్పృశింపరాని కృత్రిమశాల్మలి యొకటి గానవచ్చెను. పాపాత్ము లనుభవించుచున్న తీవ్రతరములగుబాధల నయ్యుధిష్ఠిరుఁడు గాంచి, యాదేవదూతతో 'ఓయీ! ఇటు లింక మే మెంతదూరము పోవలయును? నాతమ్ములెందున్నవారు? అది నాకెఱిఁగింపుము. దేవతలప్రదేశములలో నిదియేది?' అని యడుగుటయు నాదేవదూత, యాతనివచనము విని, మరలి 'ఓయుధిష్ఠిరా! నీవింతవఱకే రాఁదగినత్రోవ కావున నీవిటనుండి మరలవలయు. మాదేవతలయానతి యిట్టిది. " ఓరాజేంద్రా! నీకలసట గలిగెను గాఁబోలు? లేదా పోదము రమ్ము' అని తెలిపెను. అది విని యాధర్మజుఁడు, నిర్వేదమొందుచు, నచ్చోటి దుర్గంధమునకు మూర్ఛితుఁడై, కొంతవడికి దెప్పిఱిల్లి, మరలి, శోకావిష్టుఁడైయుండ నాతని కచ్చోఁ గొందఱ దీనవచనములు వినవచ్చెను. 'ఓధర్మరాజా! రాజర్షీ! ఓపాండవోత్తమా! మాపై ననుగ్రహము సూపి రెండుగడియలకాలము నిలువుము. నీవిందులకు విచ్చేయుటచేఁబవిత్రవాయువులు వీవసాగెను. దానివలన సుఖము గలుగుచున్నది. ఓకౌంతేయా! నిన్నుఁ జూచుటను మాకింకను సుఖము గలుగును.

రెండుగడియ లిచ్చోట నిలువుము. నీవిందు నిలుచుటను మాకుఁ దీవ్ర వేదన లగపడకున్నవి.' అని బహువిధములగు దీనాలాపములు విన వచ్చెను. అట్టిదీనాలాపము లచ్చోట విని 'ఆహా! ఎంతకష్టము' అని యతఁ డచ్చోట నిలిచెను. మఱియు దుఃఖితులై క్లేశపడుచు మఱి మఱియు నెదుట వెనుకటివచనములే వినుచు వారి నుద్దేశించి, 'ఓయీ! మీ రెవరు? మీరిందు నిలువ నిమిత్తమేమి?' అని ప్రశ్నించెను. అంత నానరకగతులందఱును 'ఓ ప్రభూ! నేను కర్ణుఁడను. నేను భీమసేనుఁడను. నే నర్జునుఁడను. నేను నకులుఁడను. నేను సహదేవుఁడను. నేను ధృష్టద్యుమ్నుఁడను. నేను ద్రౌపదిని' అని మొఱవెట్టిరి. ఆప్రదేశమున కుచితములగు నమ్మాట లాలించి దైవ నిర్ణయ మిట్టిదై యుండెనా యని కొంతతడవు చింతించి, 'ఆహా! మహాత్ములగు వీరొనర్చినపాపమేమి? కర్ణుఁ డేమిగావించెను? ద్రౌపదేయు లేమిచేసిరి? పాంచాలియొనర్చినపాపమేమి? దారుణమగు నీదుర్గంధప్రదేశమున వీరిటులుండవలసివచ్చెనా? పుణ్యాత్ములగు వీరొనర్చినదుష్కృత మేదియో తెలియకున్నయది. ధృతరాష్ట్రపుత్త్రుఁడగు సుయోధనుఁ డేమిసుకృత మొనర్చెనో? పాపాత్ములగు తనతోడివారితో నెల్లసుఖము ననుభవించుచున్నవాఁడు; మహేంద్రునివలెఁ బరమపూజితుఁడై వెలయుచున్నవాఁడు. ఇటులు నరకగతులై యున్న వీరి కెద్దాన నిట్టి వికారముగలిగెను? సర్వధర్మవేత్తలును, శూరులును, సత్యపరాయణులును, క్షత్త్రధర్మపరులును, భూరిదక్షిణులగు యజ్వలును నై వెలసిన వారుగదా! ఆహా! ఏమియిది? నేను నిద్రించితినా? మేలుకొంటినా? కదలుచున్నవాఁడనా? చైతన్యమే లేదా? ఏమి యీచిత్తవికారము? నాకుఁ బిచ్చిపట్టెనా?' అని బహువిధములఁ జింతించెను. అటు లతఁడు శోకసమావిష్టుఁడై యింద్రియములన్నియు వ్యాకులతనొందఁ దీవ్రమగు కోపముఁ దెచ్చికొని, దేవతలను, ధర్మమును దూషించెను. మఱియు నతఁడు తీవ్రగంధసంతప్తుఁడై దేవదూత నారసి, 'ఓయీ! నీ వెవ్వారికి దూతవై యున్నవాఁడవో యందులకుఁ బొమ్ము. నేను వారి కడకు రానని తెలుపుము. నే నిచ్చోటనే యుందునని తెలుపుము. పరితప్తులై యున్న వీరు నాయాశ్రయమునుబట్టి సుఖితులై యున్నవారు. ఈనాసోదరులను విడిచి రాను.' అని తెలిపెను. అది విని యాదేవ

దూత, యింద్రుని కడకు వెడలి, ధర్మరాజునభిప్రాయ మెఱింగించెను." అని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

### యుధిష్ఠిరుఁడు శరీరమును విడుచుట

"ఓజనమేజయా! అయ్యుధిష్ఠిరుఁ డట్లు రెండుగడియలకాల మచ్చో నుండఁగా, నింద్రాదిదేవతలందఱు సంపాల కరుదెంచిరి. ధర్ముఁడు సైతము మూర్తిభవించి యాయుధిష్ఠిరునిఁ జూడవచ్చెను. పవిత్రకర్ములై భాసురదేహులగు నా దేవత లటులు రాఁగా, నచ్చోటి తమమెల్లఁ దొలఁగిపోవఁ, బాపకర్ములకుఁ దీవ్రబాధ లడఁగిపోయెను. కూటశాల్మలితోఁగూడ వైతరణీనదియుఁ గానరాకుండెను. మఱియు భయంకరములగు లోహకుంభములును, దప్తశిలలును నదృశ్యము లయ్యెను. మఱియు నందుఁగల వికృతశరీరములన్నియు నడఁగి పోయెను. మఱియు సుఖస్పర్శములై వాయువులు వీవసాగెను. సుగంధములు వ్యాపించెను. ఇంద్రుఁడు, మరుత్తులు, వసువులు, నశ్వినీదేవతలును, రుద్రులు, సాధ్యులు, నాదిత్యులు, మఱియుఁ గలదేవతలు నందులకు వచ్చిరి. సిద్ధులును, బ్రహ్మర్షులును వచ్చిరి. అంత నప్పరమశోభాశాలియగు నింద్రుఁడు యుధిష్ఠిరు నారసి సప్రియముగా 'ఓధర్మజా! మహాబాహూ! నీచరిత్రమునకు దేవతలు సంతసించిరి. ఓమానవోత్తమా! ఇఁక నిదిచాలును. రమ్ము రమ్ము. సిద్ధి వడసితివి. ఓమహాబాహూ! నీకక్షయలోకములు గలిగెను. మఱియు నీసోదరులకును, మిత్రులకును నిత్యమైన యుత్తమగతి గలుగును. నీవు కోపింపకుము. నామాట వినుము. ఓరాజా! రాజులెల్లరును నరకమును జూడక తప్పదు. శుభాశుభములు రెండిటికిని రెండువిధములుగా ననుభవము గలదు. ఎవ్వఁడు తనపుణ్యపాపములలో ముందుగా సుకృత మనుభవించునో వాఁడు పిమ్మటఁ బాప మనుభవింపక తప్పదు. ముందుగా నరక మనుభవించినవాఁడు పిదపఁ బుణ్య మనుభవించును. వారిలో నెక్కుడు పుణ్యమొనర్చినవాఁడు ముందుగా నరక మనుభవించును. కావుననే నీశ్రేయమును గోరు నేను నీకీనరకలోకమును ముందుగాఁ జూపితిని. ఓరాజా! నీవు ద్రోణునెడ వ్యాజోక్తి పలికితివిగాదే? నీయట్లులే భీముఁడును, నర్జునుఁడును, నకులసహదేవులును, ద్రౌపదియు నించుక వ్యాజముచే నరకగతులైరి. వారు పాపవిముక్తులైరి. కావున

నీకు రమ్ము. మఱియు నీపక్షమువారందఱును, స్వర్గమును బ్రవేశించియున్నవారు. రమ్ము. వారి నరయుము. సకలశస్త్రవిదుత్తముఁడై మహేష్వాసుఁడైన కర్ణుఁడును బరమసిద్ధి నొందెను. నీవు వానికై గదా పరితపించుచున్నాఁడవు. వానిని జూతువు గాక. రమ్ము. అతఁ డిపుడు స్వర్గస్థానము నలంకరించియున్నవాఁడు. శోకము పరిత్యజింపుము. వడిగా రమ్ము. అందు నీతమ్ములును మఱియుఁగల నీపక్షపుఁ బార్థివులును గానవత్తురు. వారివారిస్థానముల నలంకరించియున్నారు. వారి నారసి నీమానసజ్వరమును దలఁగించికొమ్ము. ఇంతవఱకును గొంతకష్ట మనుభవించితివి. ఇఁక శోకమువిడిచి నాతోఁగూడ నిందు విహరింపుము. నీవార్జించినపుణ్యకర్మములకును, దానములకును దగుఫల మనుభవింపుము. ఓపార్థివా! ఇపుడు దేవగంధర్వాదులును, దివ్యాప్సరసలును, శ్వేతాంబరాదిభూషణభూషితలై శుభప్రదముగా సేవింతురుగాక. మఱియు రాజసూయజితములును, నతిశోభనములు నగులోకములందు, తపఃఫల మనుభవింపుము. ఓయుధిష్ఠిరా! నీకు రాజలోకమునకగు లోకముల కన్నిటికంటె నుత్తమమగులోకము సంభవించియున్నది. ఓపార్థా! నీవు హరిశ్చంద్రతుల్యుఁడవై విహరింతువుగాక. మాంధాతయు, రాజర్షియగు భగీరథుఁడును, దుష్యంతపుత్త్రుఁడగుభరతుఁడును విహరించునట్టిస్థానముల నీవు విహరింతువుగాక. త్రిలోకపావనియగు నాకాశగంగను గాంచితివా? ఇదె దీనియందు మునుఁగుము. పిదప నిచ్చోటినుండి వెడలుదువుగాక. నీ వీయుత్తమనదియందు స్నానమొనర్తువేని మానవభావమునుండి మరలుదువు, మఱియు శోకవైరాయాసాదులు తొలఁగిపోవును.' అని తెలిపెను.

ఓజనమేజయా! కౌరవేంద్రుఁడగు నయ్యుధిష్ఠిరునితో నాదేవేంద్రుఁడిట్లు పలుక విని, మూర్తీభవించినధర్ముఁడు తనతనయుఁడగు నాపాండవోత్తమునితో, 'ఓయీ! మహాప్రాజ్ఞ! పుత్త్రకా! నీయెడ నేనెంతయుఁ బ్రీతుండనైతిని. నీకుఁగల ధర్మభక్తియు, నీసత్యవచనము, నీశాంతము, నీదమమును, నాచిత్తమునను మెచ్చుగొలిపెను. ఇంతకుమున్ను రెండుమాఱులు నీధర్మబుద్ధిని బరీక్షించితిని. ఇది మూఁడవమాఱు. ఓపార్థా! ఏనిమిత్తమునుబట్టి నీస్వభావమునుండి నిన్నుఁ జలింపఁజేయ వలనుపడదు. మున్నొకపుడు ద్వైతవనమున నిన్నుఁ బ్రశ్నించి పరీక్షించితిని.

మఱియు నీసోదరులును, ద్రౌపదియుఁ, బుడమిఁబడ, శునకరూపధారినై పరీక్షించితిని. మూఁడవది యిది. భ్రాతలకుఁగా నీవు స్వస్థానము నధివసింపనొల్లవైతివి. దీనివలన నీమనశ్శుద్ధి తేటతెల్లమైనది. ఓపార్థా! నిజముగా నీసోదరులు నరకార్హులుగారు. అయినను నీ దేవేంద్రుఁడు నిజమాయాబలముచే నిట్టినరకము కల్పించెను. రాజు లెవ్వరును నరకమును జూడఁదగరు. అయినను రెండుగడియలు నీవిట్టి యధికదుఃఖమునకుఁ బాలుపడవలసివచ్చెను. మఱియు భీమార్జునులుగాని, నకులసహదేవులుగాని, కర్ణుఁడుగాని, నరకార్హులుగారు. ఓయుధిష్ఠిరా! రాజపుత్త్రియగు ద్రౌపదియు నరకమునకుఁ దగినదిగాదు. ఓభరతశ్రేష్ఠా! రమ్ము. రమ్ము. త్రిలోకగామినియగు గంగను గనుఁగొమ్ము.' అని పలికెను. ఓజనమేజయా! నీ ప్రపితామహుఁడగు నా ధర్మరాజు, పూర్వపితామహునితో, ధర్ముఁ డిట్లు పలుకుటయు, నాయుధిష్ఠిరుఁడు దేవతలతోఁగూడి మహర్షిసంస్తుతయుఁ బవిత్రయునగు దేవనదిని బ్రవేశించి మహర్షులు తన్ను సన్నుతింప వెడలి, శూరులగు పాండవధార్తరాష్ట్రు లున్న చోటికిఁ బోయెను" అని తెలిపి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

## స్వర్గగతులగు కృష్ణాదులను యుధిష్ఠిరుఁడు గాంచుట

"ఓజనమేజయా! ఆయుధిష్ఠిరుఁడు, తన్ను దేవతలును, మరుద్గణములును, మహర్షులును సన్నుతింపఁ దనతమ్ములు మున్నగువారున్న కడకు వెడలి, బ్రాహ్మతనువుతోఁ గూడియున్న గోవిందునిఁ గాంచెను. అతఁడు దృష్టపూర్వమగురూప మించుకగలిగియే యుండెను. మఱియు నిజతనువుచే దేదీప్యమానుఁడగుచుఁ, బురుషవిగ్రహములైన దివ్యాస్త్రములు తన్నుగొలువ వీరుఁడగు నర్జునుఁడు సేవింప వెలయుచున్న యమ్మధుసూదను నాయుధిష్ఠిరుఁడు గాంచెను. వారిరువురును నా ధర్మజు నారసి, సగౌరవముగా సమీపించిరి. వేఱొకచోట ద్వాదశాదిత్యతుల్యుఁడై వెలయుచున్న కర్ణుఁడు గానవచ్చెను. ఇంకొకచోట మరుద్గణపరివృతుఁడై వెనుకటిరూపముతో భీముఁడు గానవచ్చెను. అతఁడు మూర్తీభవించియున్న వాయుదేవునిపార్శ్వమునఁ బరమశోభాన్వితుఁడై యుత్తమసిద్ధి వడసియుండెను. అటులే, నిజతేజముచే

వెలయుచున్న నకులసహదేవు లాయుధిష్ఠిరునకుఁ గానవచ్చిరి. వారశ్వినీదేవతలస్థానమున నుండిరి. మఱియు రవితుల్యమై వెలయు తేజముచే స్వర్గము నాక్రమించి కమలోత్పలమాలికాభూషితయై ద్రౌపదియుఁ గానవచ్చెను. వారివిషయమెల్లఁ బ్రశ్నింపఁ దలంచియున్న యాధర్మజానితో భగవానుఁడగు నింద్రుఁడు 'ఓయుధిష్ఠిరా! ఈద్రౌపది శ్రీదేవి. నీకై మానుషరూపమొంది, యయోనిజయై వెలసెను. సకలలోకమనోజ్ఞరూపయును బవిత్రగంధయునగు నీమెను, మీకుఁగా సమ్మహాదేవుఁడు సృజించెను. ఈమె ద్రుపదునింటఁబుట్టి, మీకడ జీవించెను. ఓరాజా! అమేయతేజులై ద్రౌపదికి మీవలనఁగలిగిన యీయేవురును పావకప్రభగలగంధర్వులు. గంధర్వరాజగు ధృతరాష్ట్రునిఁ గనుఁగొనుము. ఇక్కర్ణుని గనుఁగొంటివా! ఇతఁడు నీయన్న. ఇతఁడు నీతల్లియగు కుంతికి సూర్యునివలన జనించినవాఁడు. ఆదిత్యతుల్యుఁడై వెలయుచుండెను. చూడుము. సాధ్యులు, దేవతలు, విశ్వేదేవులు, మరుత్తులు తమ్ముఁగూడి వెలయు, వారెవృష్ణ్యంధకమహారథులు వెలయుచున్నవారు. చూడుము వారె సాత్యకియు, మహాబలులగు భోజులును వెలయుచున్నవారు. చూచితివా? సోమునితోఁ గూడియున్న యాయభిమన్యునిఁ గాంచితివా? అతఁడు చంద్రప్రభతో వెలయుచున్నవాఁడు. ఓధర్మజా! నీతండ్రియగు పాండురాజు కుంతీమాద్రులఁ గూడి వెలయుచుఁ బ్రతిదినమును విమానముతో నాచెంత కరుదెంచుచుండును. వసువులతోఁ గూడియున్న యాభీష్మునిఁ గాంచితివా? అదె చూడుము. బృహస్పతిపార్శ్వమున ద్రోణుఁడు వెలయుచున్నవాఁడు. ఓపార్థా! మఱియుఁగల నీయోధులును, యక్షరాక్షసగంధర్వాదులతోఁగూడి విహరించుచున్నవారు. మఱికొందఱు గుహ్యకులఁగూడి చరించుచున్నవారు. పవిత్రములగువచోబుద్ధికర్మములచేఁ దనువులు విడిచి స్వర్గము నలంకరించియున్న వీరినెల్లఁ గనుఁగొనుము.' అని పలికె"నని తెలుప విని జనమేజయుం డిట్లనియె.

### భారతమహిమప్రశంస

"ఓవైశంపాయనా! మహాత్ములగుభీష్మద్రోణులును, ధృతరాష్ట్రుఁడును, విరాటద్రుపదులును, శంఖుఁడు, నుత్తరుఁడు, ధృష్టకేతువు,

జయత్సేనుఁడు, సత్యజిత్తు, సుయోధనసుతులును, శకునియుఁ, గర్ణపుత్త్రులు, సైంధవుఁడును, ఘటోత్కచాదులును, మఱియుఁ దీప్తమూర్తులగు క్షత్త్రియవీరులును నెంతకాలము స్వర్గమున నున్నవారో తెలుపుము. ఓబ్రాహ్మణోత్తమా! వారిస్వర్గమునఁ గొంతకాలము మాత్రమ యుందురా? లేక స్థిరముగా నేకాలమును నివసింతురా? నిజసుకృతానుభవమైనపిమ్మట వారికిఁ గలిగినగతి యెట్టిది? అదియెల్ల నాకెఱిగింపుము." అని ప్రశ్నించెను. ఓశౌనకాదిమహర్షులారా! ఇటు లాజనమేజయుఁడు ప్రశ్నించుటయు, వ్యాసాభ్యనుజ్ఞాతుఁడై యావైశంపాయనుఁడు జనమేజయునితో నిట్లు తెలిపెను.

"ఓరాజా! ఎల్లవారును, నిజకర్మానుభవానంతరమున నెందుల కేఁగిరో, యాదేవరహస్య మెఱిఁగించెదను వినుము. ఈవిషయమునుఁ బురాణమునియు, దివ్యదర్శనుఁడును, మహావ్రతుఁడునగు వ్యాసుఁడు కొంత తెలిపెను. అగాధబుద్ధియు, సర్వకర్మగతిజ్ఞుఁడును, సర్వజ్ఞుఁడు నగునమ్మహర్షి వచనవిధ మీది వినుము. భీష్ముఁడు నిజకర్మఫలము ముగిసిన పిదప, నిజతనువుఁ బ్రవేశించి మహాద్యుతిగ్రాయి వసువులలోఁ జేరెను. ద్రోణుఁ డాంగిరసులలో నుత్తముఁడగు బృహస్పతిని బ్రవేశించెను. కృతవర్ముఁడు మరుద్గణములలోఁ జేరెను. ప్రద్యుమ్నుఁడు సనత్కుమారునిఁ జేరెను. ధృతరాష్ట్రుఁడు, దుర్గాసదములగు కుబేరలోకములనొంది గాంధారీసహితముగా, ధృతరాష్ట్రునిఁ గలిసెను. భార్యలతోఁగూడఁ బాండురాజు మహేంద్రసదనమును బ్రవేశించెను. విరాటద్రుపదులును, ధృష్టకేతువు, నిశఠుఁడు, అక్రూరుఁడు, సాంబుఁడు, భానువు, కంపుఁడు, విదూరథుఁడు, భూరిశ్రవుఁడు, శలుఁడు, భూరి, కంసుఁడు, ఉగ్రసేనుఁడు, వసుదేవుఁడు, ఉత్తరుఁడు, శంఖుఁడు, విశ్వేదేవులలోఁ జేరిరి. అర్జునపుత్త్రుఁడగు నభిమన్యుఁడు మున్ను వర్చుఁడనువేరితో సోమపుత్త్రుఁడయ్యెనుగాదే? అతఁడు నిజసుకృతానుభవానంతరమున సోమునిఁ గలిసెను. కర్ణుఁడు సూర్యునిఁ గలిసెను. శకుని ద్వాపరుని, ధృష్టద్యుమ్నుఁ డగ్నిదేవునిఁ గలిసిరి. ధృతరాష్ట్రసుతులందఱును రక్కసులఁ గలిసిరి. ధర్మజుఁడును, విదురుఁడును ధర్మునే కలిసిరి. పితామహునానతి నెవ్వఁడు పుడమివహించునో, యట్టియనంతుని, బలరాముఁడు గలిసెను. వాసుదేవుఁడు నిజసుకృతానుభవమైనపిమ్మట

నారాయణునిఁ గలిసెను. ఓజనమేజయా! వాసుదేవపత్నులు పదు
నాఱువేవురును సరస్వతిని మునింగిరని మున్ను తెలిపితిని గాదే? వా
రచ్చో శరీరములు విడిచి యప్సరసలై వాసుదేవుని సమీపించిరి.
మఱియు నారణరంగమున మడిసిన మహారథులందఱును, ఘటోత్క
చాదులును, దేవతలను, యక్షులను జేరిరి. దుర్యోధనసహాయులు
రాక్షసులుగాఁ బరిగణింపఁబడి నీచలోకములనొంది రక్కసులను
గలిసిరి. ఉత్తములగువారందఱును గుబేరమహేంద్రవరుణాదిలోక
ముల నొందిరి. ఇదియెల్ల వివరించి నీకుఁ దెలిపితినిగదా! కౌరవుల యుఁ
బాండవులయు చరిత్రము వింటివిగదా!" అని తెలిపెను.

ఓశౌనకాదిమహర్షులారా! అది విని యాజనమేజయుఁడు,
విస్మయావిష్టుఁడై వెలయుచు, యాగవిశేషాసక్తుఁడై ప్రవర్తిల్లెను.
యాజకులాయాకర్మవిశేషముల సమాప్తినొందించిరి. సర్పములకు
విముక్తిగలిగించి, యాస్తికుఁడు సంతోషముతో వెడలిపోయెను.
పిమ్మట బ్రాహ్మణులకెల్ల సంతుష్టిగా దక్షిణ లొసంగఁబడియెను. వారా
తనిచేఁ బూజితులై తమతమస్థానములకుఁ బోయిరి. ఆజనమేజయుఁడును
నటులు బ్రాహ్మణుల ననిపి, తక్షశిలనుండి హస్తిపురిఁ బ్రవేశించెను.
వైశంపాయనోక్తమగు కథాంశమెల్ల మీకు నేను దెలిపితినిగదా!
ఆజనమేజయుని సర్పయాగకాలమున నిది తెలుపఁబడినది. పరమపవిత్ర
మై యుత్తమమగు నియ్యితిహాసము కృష్ణద్వైపాయనమునిచేఁ జెప్ప
బడియెను. సర్వజ్ఞుఁడును విధిజ్ఞుఁడును ధర్మవేత్తయు, నతీంద్రియుఁడు,
శుచియుఁ దపోభావితాత్ముఁడు, సాంఖ్యయోగవేత్తయునగు నతఁడు
బహుతంత్రపరిశుద్ధమగు దివ్యదృష్టిచేఁ దెలిసికొని, లోకమున, మహా
త్ములగుపాండవులకీర్తిని బ్రకటించువాఁడై, మఱియుఁగల క్షత్రియుల
తేజము లోకమునకుఁ దెలియ, నీయితిహాసమును రచియించెను. వివేకి
యగు నెవ్వఁ డిద్దానిని బ్రతిపర్వమందును వినిపించునో, వాఁడు
పాపములఁ దొలఁగించుకొని స్వర్గజేతయై బ్రహ్మత్వసిద్ధి నొందును.
మఱియు నెవ్వఁడు జాగరూకుఁడై పంచమవేదమనఁదగు నిద్దాని
వినునో, వాని బ్రహ్మహత్యాదిపాపములు కోటియైనను నశించును.
మఱియు నెవఁడు బ్రాహ్మణులసన్నిధిని శ్రాద్ధకాలమున దీనిని వినిపిం
చునో, వానిపితరుల కక్షయ్యములగు నన్నపానములగును. ఈమహా

భారతమును బఠించినవాఁడు మనసుచేఁగాని, తక్కినయింద్రియములచేఁగాని, యేనాఁడుచేసినపాప మానాఁడే తొలఁగించుకొనఁగలుగుచున్నాఁడు. స్త్రీగణములఁ గలిసి రాత్రి చేసినపాప మిమ్మహాభారతాఖ్యానశ్రవణముచేఁ బ్రాతఃకాలముననే తొలఁగును. మహత్త్వము గలిగి, భారముగలదగుట నిది మహాభారత మనఁబడుచున్నది. దీని నిరుక్తమును దెలిసినవాఁడు పాపవిముక్తుఁ డగును. ధర్మార్థకామమోక్షము లనియెడి చతుర్విధపురుషార్థములు నిందుఁ దెలుపఁబడియున్నవి. ఇందు లేని దెందును లేదు. జయమను పేరుగలదీనిని, మోక్షాపేక్షియగువాఁడు తప్పక వినవలయును. బ్రాహ్మణుఁడు, క్షత్రియుఁడును, గర్భిణి యగుకాంతయు నిద్దాని వినవలయును. ఇది వినినవాఁడు స్వర్గముఁగోరునా? అది లభించును. జయముఁగోరునా? అది లభించును. గర్భిణి సుపుత్త్రునిఁ గాంచును. లేక బహుభాగ్యశాలినియగు కన్నియనేని గనును. నిత్యసిద్ధుఁడును మోక్షరూపియునగు వ్యాసభగవానుఁడీభారతసందర్భమును ధర్మబుద్ధితో రచియించెను. ఈభారతసంహిత యఱువదిలక్షల గ్రంథము. అందు ముప్పదిలక్షలు దేవలోకమందుఁ గలవు. పితృలోకమునఁ బదునైదులక్షలును, యక్షలోకమునఁ బదునాల్గులక్షల గ్రంథమును, మానుషలోకమున నొకలక్షయుఁ బలుకఁబడియున్నది. నారదుఁడు దేవతల కిద్దానిం దెలిపెను. అసితుఁ డగు దేవలుఁడు పితృదేవతలకుఁ దెలిపెను. యక్షులకు శుకుఁడు తెలిపెను. మర్త్యులకు వైశంపాయనుఁడు తెలిపెను. వేదసమ్మితము, మహార్థము, పవిత్రము, వ్యాసప్రోక్తమునగు నియ్యితిహాసమును, బ్రాహ్మణుని ముందుంచుకొని యెవ్వఁడు పఠించునో, యామానవుఁడు సకలమనోరథములను, సత్కీర్తిని బడసి పిదపఁ బరమసిద్ధి నొందుచున్నాఁడు. ఇందు సందియము లేదు. పరమపవిత్రమగు భారతసంహితలో నొకపాదమేని పరమశ్రద్ధతో నధ్యయన మొనర్చినవాఁడును, వినిపించినవాఁడును బరమసిద్ధిఁబడయుచున్నారు. పవిత్రమైన యీభారతసంహిత నావ్యాసభగవానుఁడు తనపుత్త్రుఁడగు శుకునకుఁ జెప్పెను. లోకమునఁ బ్రాణులు మాతాపితృసహస్రములను బుత్త్రదారశతములను, సంసారములం దనుభవించుచుఁ బోవుచున్నారు. పోఁగలరు. ప్రతిదినమును, వేలకొలఁది హర్షస్థానములును, వందలకొలంది భయస్థానములును,

మూర్ధము నావేశించుచుండునుగాని, పండితులీ జేర నేరవు. నేను జేతులు మీఁదికెత్తి బిగ్గరగాఁ జెప్పుచున్నాఁడను. కాని నామాట యెవ్వఁడును వినఁడు. అట్టిశక్తి ధర్మముకంటె నర్థకామము లుత్తమములని యేల సేవింపఁడు? కామమునకై గాని, భయముచేఁగాని, లోభము వలనఁగాని ధర్మమును బరిత్యజింపరాదు. ఇంతయేల! జీవితమునకేని ధర్మమును విడువరాదు. ధర్మము నిత్యము సుఖదుఃఖము లనిత్యములు. జీవుఁడు నిత్యుఁడు. ఈజీవునికి హేతువగునది యనిత్యము. ఈ భారత సావిత్రి నెవ్వఁడు ప్రాతఃకాలమునఁ బఠించునో, వాఁడు భారతము నెల్లఁ జదివినఫలమొంది పరమసిద్ధిఁ బడయుచున్నాఁడు. భగవానుఁ డగుసముద్రుఁడును, భాగ్యశాలియగు హిమవంతుఁడును నెట్లు రత్ననిధులో యటులే యీభారతమును రత్ననిధియని తెలియఁబడు చున్నది. ఎవ్వఁడు జాగరూకుఁడై యీభారతాఖ్యానమును బఠించునో, వాఁడు పరమసిద్ధినొందుటలో సందియము లేదు. కృష్ణద్వైపాయనోష్ఠపుటమునుండి స్రవించి, యప్రమేయమై పాపహరమై శుభప్రదమై పవిత్రమైన యీభారతసంహితను బఠించినవానికిఁ దీర్థస్నానములచేఁ బనిలేదు.” అని తెలిపెను.

భారతశ్రవణవిధ్యుపదేశము

“ఓవైశంపాయనా! పండితులు భారతము నెట్లు వినవలయును? అందుఁగల ఫలమేమి? తద్విషయమున నేయేదేవతల నారాధింపవలయును? ఏయేపర్వము సమాప్తమైన నెట్టిదాన మొసర్పవలయును? అధ్యయనము చేయువాఁ డెట్టివాఁడై యుండవలయు? అది యెల్ల నాకుఁ జెలుపుము.”

అది విని యావైశంపాయనుఁడు “ఓజనమేజయా! భారతపఠన విధానమును, దత్ఫలమును దెలిపెదను వినుము. ఓరాజేంద్రా! సర్వగతులగు దేవతలు క్రీడార్థమై పుడమికి డిగ్గి, యుక్కార్యము నిర్వర్తించి మఱలను స్వర్గమునకుఁ బోయిరి. తద్విధ మెఱిఁగించెదను. వినుము. దేవతలు మహర్షులు పుడమిని జనించిరి. అటులే రుద్రులును, సాధ్యులును, విశ్వేదేవులు, నాదిత్యులు, నశ్వినీదేవతలు, లోకపాలురు, గుహ్యకులు, విద్యాధరులు, గంధర్వులు, సిద్ధులు, ధర్ముఁడు, స్వయం

ఘువు, కాత్యాయనముని, నప్సరసలును జనించిరి. కొండలు, నదులు, సముద్రములు, గ్రహములు, సంవత్సరములు, అయనములు, ఋతువులు, స్థావరజంగమాత్మకమగు ప్రపంచమంతయు నీభారతమునం జూడఁబడుచున్నవి. దాని ప్రతిష్ఠను వినినవాఁడు వెంటనే ఘోరపాతకమునుండి యైనను విముక్తుఁడగుచున్నాఁడు. శుచియు నియతాత్ముఁడునై యీయితిహాసమును బూర్తిగాఁ జదివి పిదప శ్రద్ధమెయి దానములను బ్రాహ్మణులకు శక్తికొలఁదిగాఁ జేయవలయును. వాని నెఱిఁగించెదను. వివిధములగు రత్నములను, గోవులను, నలంకరింపఁబడిన కన్నియలను బహువిధములగు యానములను, విచిత్రములగు భవనములను, భూమిని, వస్త్రములను, సువర్ణమును, వాహనములను, గజాశ్వాదులను, శయనములను, శిబికలను, స్యందనములను దానమొనర్పవలయును. ఇంత యేల? తనయింటఁగల కొంచెముగాని, యధికముగాని బ్రాహ్మణులకు దానమొనర్పవలయును. మఱియుఁ బరిశుద్ధమానసుఁడును, బుణ్యకథాశ్రవణపరుఁడును, సందేహరహితుఁడును, సత్యార్జవరతుఁడును, దాంతుఁడును, శుచియు, శ్రద్ధావంతుఁడును, శాంతుఁడునునై యిద్దానిని విని సిద్ధినొందుచున్నాఁడు. మఱియొకటి వినుము. శుచియు, శీలాచారసమన్వితుఁడును, శుభ్రవసనుఁడును, జితేంద్రియుఁడు, సర్వశాస్త్రజ్ఞుఁడును, నసూయారహితుఁడును, శ్రద్ధాశాలియు, సురూపుఁడు, సత్యవాదియు, దానమానగృహీతుఁడు నైనవానిచే దీనిని జదివింపవలయును. విలంబముగాకుండఁగను, మృదువుగను, నద్భుతముగను, శాంతముగను, నర్థయుక్తముగను, స్పష్టాక్షరపదముగను, స్వరభావసమన్వితముగను, వాచకుఁడు జాగరూకుఁడై చదువవలయును. "నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమం, దేవీం సరస్వతీం చైవ తతో జయముదీరయేత్" అను శ్లోకమును ముందుగా వాచకునివలన విని, పిమ్మట నియమస్థుఁడై శుచిగా వినినవాఁడు తత్ఫలము నొందును భారతము చదివించి వినినపిమ్మట బ్రాహ్మణులను సంతర్పణాదులచే సంతుష్టులఁ గావింపవలయును. అటులొనర్చినవాఁ డగ్నిష్టోమయాగఫల మొందుచున్నాఁడు. అట్టివానికై దేవత లప్సరసలతోఁగూడ విమానము దెచ్చి స్వర్గమునకుఁ దీసికొనిపోవుదురు. అటులు రెండవమాఱొనర్చినవాఁ డతిరాత్ర ఫలమునొంది, సకలరత్న

మయమగు దివ్యవిమానము నధిరోహించును. అటులు విమానమెక్కి దివ్యమాల్యాంబరధరుఁడును, దివ్యగంధవిభూషితుఁడును, దివ్యాంగదధారియు నై నిత్యము దేవలోకమున వెలయుచుండును. అటులు మూఁడవమా ఉపవాసమును, పారణమును, సంతర్పణాదులును నొనర్చినవాఁడు ద్వాదశాహఫలమొంది, దేవతుల్యుఁడై పెక్కువేల వత్సరములు స్వర్గమున నివసించును. నాల్గవపారణముచే వాజపేయ ఫలమును, బంచమపారణమునఁ దద్ద్విగుణఫలమును నగుచున్నవి. మఱియు నట్టివాఁ డుదయాదిత్యతేజముగలిగి ప్రజ్వలించుచున్న విమాన మధిరోహించి విబుధులతోఁ గూడ స్వర్గమునకుఁ బోవును. అటులు పోయి యాయింద్రభవనమున వేలకొలఁదిగా వత్సరములు నివసించి సంతసించుచుండును. ఆఱవపారణమందును, నేడవపారణమందును ద్విగుణత్రిగుణఫలమొంది కైలాసశిఖరాకారమై వైడూర్యమణివేదికమై మణివిద్రుమభూషితమై కామగమనముగలిగి యప్సరోగణపరివృతమైన విమానమెక్కి రెండవభాస్కరుఁడునా సకలలోకము లందును జరించును. ఎనిమిదవపారణమునకు రాజసూయఫలము నొంది, చంద్రోదయనిభమై మనోజ్ఞమైన విమానము నెక్కి యుత్తమ కాంతాజనోత్సంగముల నిద్రించిలేచునట్టిసుఖ మనుభవించును. తొమ్మిదవపారణమున వాజిమేధఫలమగును. తత్ఫలముచే సువర్ణస్తంభములును, కనకనిర్వ్యూహములును, వైడూర్యవేదికలును, సువర్ణగవాక్షములునుగలిగి యప్సరస్సంఘములు గంధర్వులును సేవించునట్టి విమానమెక్కి పరమశోభావిలసితుఁడగుచు దివ్యమాల్య, దివ్యచందనభూషితుఁడై దేవతలలో నొకఁడై స్వర్గమున సంతసించును. పదియవపారణముచేసి, బ్రాహ్మణులకు నమస్కరించినవానికిఁ గింకిణీజాలనిర్ఘోషమై పతాకాధ్వజశోభితమై రత్నవేదికలుగలిగి, వైడూర్యమణితోరణమై సువర్ణజాలపరిక్షిప్తమై ప్రవాళమయవలభులచే నలంకృతమై గంధర్వులగానములును, నచ్చరలనాట్యములును వెలయ, నలరారు విమాన మధిరోహించి సుఖము లనుభవించును. మఱియు నట్టివాఁ

డగ్నివర్ణముగలకిరీటమును బెట్టికొని, దివ్యచందనము పూసికొని దివ్యమాల్యములు ధరించి, దేవభాగసమన్వితుఁడై దేవలోకములందుఁ జరించుచుండును. అటులు దేవతలతోఁగూడి పెక్కువేలవత్సరములు స్వర్గముల మహత్తరుఁడై గంధర్వులఁ గూడి విహరించి, పురందరపురమున సంతసించుచుండును. అటులు దివ్యవిమానమున దేవనారీగణపరివృతుఁడైయుండి పిమ్మట సూర్యభవనమునను, చంద్రభవనమునను, కైలాసమునను, విష్ణులోకమునను విహరించును. నా చెప్పినవిషయములందు సందియము లేదు. దీనివిషయమున శ్రద్ధగలిగియుండవలయునని మాగురుఁ డానతిచ్చెను. భారతశ్రోత తాను మనసుచే నేమేమి వాచకున కీయఁదలంచుకొనునో, దానినెల్ల నొసంగవలయును. హస్త్యశ్వరథాదియానముల నీయవలయును. మఱియుఁ గటకములు, కుండలములు, బ్రహ్మసూత్రము, సాలువలు, సుగంధములు నొసఁగి యాతని దేవునివలెఁ బూజించినవాఁడు విష్ణులోక మందుచున్నాఁడు. మఱియుఁ బఠనకాలమున నీయఁదగుదానములను వినుము. ప్రతిపర్వమును ముగిసినపిమ్మట దానములు సేయుచుండవలయును. మఱియు క్షత్త్రియుల దేశ, జాతి, సత్య, మాహాత్మ్య, ధర్మవృత్తులను దెలిసికొని, ముందుగా బ్రాహ్మణులకు స్వస్తిపలికి, పిమ్మట భారతాధ్యయనము ముగిసినపిదప బ్రాహ్మణులను బూజింపవలయును. భారతపఠనారంభమున వస్త్రగంధసమన్వితముగా, మధుపాయసాదులచే బ్రాహ్మణులకుఁ దృప్తిగావించి, పిదప సర్పిర్మూలఫలములచే బ్రాహ్మణుల భుజింపఁజేయవలయును. మఱియు గుడౌదనము, మోదకములు, అపూపములును వారికిఁ బెట్టవలయును. సభాపర్వారంభమున బ్రాహ్మణులకు హవిష్యముచేఁ దృప్తిచేయవలయును. ఆరణ్యకపర్వారంభమున మూలఫలముల నొసంగవలయును. అరణీపర్వపఠనమున ధాన్యమాలాదుల నొసంగవలయును. విరాటపర్వారంభమున వివిధములగు వస్త్రములను, నుద్యోగపర్వముసమయమున, సకలగుణాన్వితభోజనమును, గంధమాల్యాలంకారములును నొసంగవలయును. భీష్మపర్వమున నుత్తమ

యానములను, సకలగుణోపేతమగు నన్నమును నొసంగవలయును. ద్రోణపర్వము పఠించుతఱిఁ బరమపూజ్యమగు భోజనమును, శయ్యలను నొసంగవలయును. అటులే కర్ణపర్వపఠనకాలమున సార్వకామిక భోజనమును బ్రాహ్మణులకుఁ బెట్టించి పూజింపవలయును. శల్యపర్వప్రారంభమున గుడౌదనములతోఁ గూడిన మోదకములను, నన్నములను నొసఁగి బ్రాహ్మణులను బూజింపవలయును. అటులే గదాపర్వమున ముద్గమిశ్రాహార మిడవలయును. స్త్రీపర్వపఠనమున రత్నదానముచే బ్రాహ్మణులఁ దృప్తిపఱుపవలయును. ఐషీకపర్వపఠనసమయమున ఘృతౌదన మొసంగవలయును. శాంతిపర్వము చదువునపుడు హవిష్యముచే ద్విజులకుఁ దృప్తిసేయవలయును. అటులే యనుశాసనాశ్వమేధికాశ్రమవాసపర్వములు పఠించుతఱి, బ్రాహ్మణులకు హవిష్యమును బెట్టి తృప్తినొందింపవలయును. మౌసలపర్వపఠనమున సార్వగుణికమగు గంధమాల్యానులేపనసత్కారాదులచే బ్రాహ్మణుల నాదరింపవలయును. మహాప్రస్థానికపర్వ స్వర్గారోహణపర్వపఠనసమయముల బ్రాహ్మణుల హవిష్యముచేఁ దృప్తినొందించి హరివంశము సమాప్తినొందించునపుడు వేయిమంది బ్రాహ్మణులకు భోజనము పెట్టవలయును. మఱియు సువర్ణనిష్కసంయుక్తమగు గోవు నొక బ్రాహ్మణునకు దానము సేయవలయును. హరివంశపర్వముసమయమునఁ బాయసభోజన మిడవలయును. ప్రతిపారణమందును విధ్యుక్తముగా దానాదు లొనర్పవలయును. సకలపర్వములను సమాప్తినొందించి, మహాభారతసంహితల నొకశుభప్రదేశమున నుంచి, శుక్లవస్త్రాలంకృతుఁడును, శుచియుఁ, బుష్పాలంకృతుఁడును నై మహాగ్రంథములను గంధమాల్యాదులచే వేఱువేఱుగా నొక్కొకసంహితను బూజింపవలయును. అటులు నియతుఁడై సంహితల నెల్లఁ బూజించి, వివిధములగు భక్ష్యభోజ్యపేయాదులచే బ్రాహ్మణులఁ దృప్తిపఱిచి, సువర్ణమును దక్షిణగా వారి కొసఁగవలయును. అపుడు సకలదేవతలను, నరనారాయణులను గీర్తింపవలయును. పిదప గంధమాల్యాదులచే విప్రుల నలంకరించి బహువిధ

దానములచే వారిని గౌరవింపవలయును. అటులు ప్రతిపర్వమున నొసర్చినవాని కలిరాత్రయాగఫలము గలుగుచున్నది. పిమ్మట వాచకుఁడు, సర్వశ్లోకపరిసమాప్తముగా భవిష్యభారతమును వినిపింపవలయును. బ్రాహ్మణులందఱును భుజించినపిమ్మట వారికి దక్షిణలొసంగి, వాచకుని భుజింపఁజేసి యలంకరింపఁజేసి సంతుష్టునిఁ గావింపవలయును. అతఁడు సంతుష్టుఁడగునేని యధికశుభములగును. బ్రాహ్మణులు తుష్టులగుదురేని దేవతలు ప్రసన్నులగుదురు. కావున బ్రాహ్మణులకు వలయువాని నొసంగవలయును. ఇదియే యీయితిహాసపఠనవిధానము. నీవు నన్నుఁ బ్రశ్నించితివి. అటులగుటు శ్రద్ధాళుఁడవు గమ్ము. భారతశ్రవణమందును, సుహవానుసారణములందును, ప్రయత్నము గలిగినవాఁడు శ్రేయముఁ బొందును. భారతమునే నిత్యము వినవలయును. దానినే కీర్తింపవలయును. ఎవ్వనిభవనమున భారతము పఠింపఁబడునో వానికి జయము హస్తగతమని తెలియుఁడు. అయ్యది పరమపవిత్రమైనది. అందు వివిధములగు కథలు గలవు. అది దేవతలచేఁగూడ సేవింపఁబడుచున్నది. అది పరమపదము నొసఁగును. ఓభరతోత్తమా! భారతము సకలశాస్త్రములలో నుత్తమమైనది. దానివలన ముక్తి గలుగును. ఇందలి తత్త్వ మెఱిఁగించుచున్నాఁడను. మహాభారతమును, భూమిని, గోవును, సరస్వతిని, బ్రాహ్మణులను, నారాయణునిఁ గీర్తించినవానికి హాని వాటిల్లనేరదు. వేదమందును, రామాయణమందును, భారతమందును, నాదిమధ్యాంతములందు హరి సన్నుతింపఁబడుచున్నాఁడు. ఏ యీభారతమున దివ్యములగు విష్ణుకథలును, సనాతనములగు శ్రుత్యర్థములును, దెలుపఁబడుచున్నవో, యట్టిదానిని బరమపదముఁగోరువాఁడు వినవలయును. ఇది పరమపవిత్రమైనది. ఇది ధర్మదర్శకము. కావున సకలసుగుణసమన్వితమగు నీభారతేతిహాసమును శ్రేయముఁగోరువాఁడు తప్పక పఠింపవలయును. అటులొనర్చినవాని కాయిక - వాచిక - మానసికములగు పాపములు, సూర్యోదయమునఁ జీకటులట్లు తొలఁగిపోవును. అష్టాదశపురాణములను వినిన నెట్టి

ఫలముగల్గునో, తత్ఫలమంతయు దీనిని బఠించుటవలనఁ గలుగుచున్నది. అందు సందియము లేదు. దీనిని వినిన స్త్రీలును బురుషులును వైష్ణవ పదము నొందుచున్నారు. పుత్త్రులను గోరుస్త్రీలు విష్ణునియశము దెలుపునట్టిదీనిని వినవలయును. అటులు విని, చదివినవానికి, యథా శక్తిగానైదునిష్కములసువర్ణమునే నొసంగవలయును. మఱియు సువర్ణశృంగములుగలిగి, వత్సముతోఁగూడి వస్త్రసంవృతమైన యొక కపిలగోవును బ్రాహ్మణుఁడగు నా వాచకున కర్పింపవలయును. వాచకునిహస్తముల కలంకారమును బెట్టవలయును. అటులే కర్ణాభరణములను ధనమును నొసంగవలయును. ఓరాజా! మఱియు నాతనికి భూదానము సేయవలయును. భూదానమున కీడగుదానమున భూతభవిష్యములలో లేదు. ఎవ్వఁడు నిత్యము నీభారతమును నధ్యయన శ్రవణముల నొనర్చునో, వాఁడు సకలపాపవిముక్తుఁడై వైష్ణవపద మొందుచున్నాఁడు. మఱియు నట్టివానిపితరులు తరించుచున్నారు. అట్టివాఁడు తాను తరించుటేగాక, తనదారపుత్త్రాదులను సైతము తరింపఁజేయుచున్నాఁడు. ఇందులకు హోమమును జేయవలయును. ఇదియెల్ల నీకెఱిఁగించితిని." అని తెలిపెను.

స్వర్గారోహణపర్వము

సమాప్తము.



శ్లో. కాయేన వాచా మనసేంద్రియైర్వా
బుద్ధ్యాత్మనా వా ప్రకృతే స్స్వభావాత్,
కరోమి యద్యత్సకలం పరస్మై
నారాయణాయేతి సమర్పయామి.
అభ్రశ్యామః పింగజటాబద్ధకలాపః
ప్రాంశు ర్దండీ కృష్ణమృగత్వక్పరిధానః,
సర్వాన్ లోకాన్ పావయమానః కవిముఖ్యః
పారాశర్యః పర్వసు రూపం వివృణోతు
నారాయణం పద్మభువం వసిష్ఠం
శక్తిం చ తత్పుత్రపరాశరం చ,
వ్యాసం శుకం గౌడపదం మహాన్తం
గోవిందయోగీంద్రమథాస్య శిష్యమ్.
శ్రీశంకరాచార్యమథాస్యపద్మ
పాదం చ హస్తామలకం చ శిష్యం,
తం త్రోటకం వార్తికకార మన్యా
నస్మద్గురూన్ సంతత మానతోఽస్మి.
యదక్షరపదభ్రష్టం మాత్రాహీనం చ యద్భవేత్,
తత్సర్వం క్షమ్యతాం దేవ నారాయణ నమోఽస్తు తే.

శ్రీమహాభారతగ్రంథము సమాప్తము.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

శ్రీకృష్ణార్పణమస్తు.

చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—1950.

# వచనగ్రంథములు

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| ఆంధ్రవచనభాగవతము, ద్వాదశస్కంధములు, ఒకేసంపుటము | 9 | 0 |
| డిటో మూఁడుసంపుటములు ... | 10 | 8 |
| ఆంధ్రవచనభారతము, ఆదిసభాపర్వములు ... | 5 | 0 |
| ,, ఆరణ్యపర్వము ... | 5 | 0 |
| ,, విరాటోద్యోగపర్వములు ... | 5 | 8 |
| ,, భీష్మద్రోణపర్వములు ... | 7 | 8 |
| ,, కర్ణశల్యసౌప్తిక స్త్రీపర్వములు ... | 5 | 8 |
| ,, శాంతిపర్వము ... | 7 | 8 |
| ,, ఆనుశాసనికము మొదలు స్వర్గారోహణపర్వమువఱకుగలసంపుటము | 7 | 8 |
| ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహము ... | 3 | 0 |
| అరేబియన్ నైట్సుకథలు ... | 2 | 0 |
| తిలకుగారిసెక్యూరిటీకేసు, ఉపన్యాసములు ... | 0 | 14 |
| భారతరమణీమణులు, ప్రథమభాగము ... | 1 | 4 |
| డిటో రెండవభాగము ... | 0 | 10 |
| డిటో మూఁడవభాగము ... | 0 | 8 |
| యజుర్వేదకథాసంగ్రహము ... | 0 | 8 |
| నీతిచంద్రిక, చిన్నయసూరిగారిది ... | 0 | 10 |
| డిటో టీకతో ... | 1 | 4 |
| పంచతంత్రము, వచనము, సులభశైలి ... | 0 | 12 |
| నీతిరత్నాకరము ... | 0 | 8 |
| సంగ్రహరామాయణము ... | 1 | 8 |
| భోజునికథలు ... | 1 | 0 |
| భోజకాళిదాసకథలు, I భాగము ... | 1 | 0 |
| డిటో II భాగము ... | 1 | 0 |
| తెనాలిరామలింగనికథలు, జీవితము ... | 0 | 6 |
| డిటో A. S. P. అయ్యరుగారిది ... | 0 | 8 |
| సంస్కృతనాటకకథలు 1. 2 - భా. ... | 2 | 0 |
| రాజశేఖరుఁడు—గోపాలుఁడు ... | 0 | 12 |
| విక్రమార్కునికథలు ... | 0 | 12 |
| చార్ దర్వేషుకథలు ... | 1 | 0 |
| బేతాళునికథలు ... | 0 | 12 |
| వైద్యులకథలు ... | 0 | 4 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| వీరాంగనలు ... | 0 | 12 |
| పరమానందశిష్యులకథలు ... | 0 | 4 |
| నలుగురుమంత్రులకథలు ... | 0 | 6 |
| అయిదుగురుదొంగలకథలు ... | 0 | 8 |
| రేచుక్కపగటిచుక్కకథ ... | 0 | 4 |
| సత్యసేనవిజయము ... | 0 | 6 |
| ఋషులచరిత్ర ... | 0 | 8 |
| పురాణగాథలు I ... | 1 | 0 |
| ,, II ... | 1 | 0 |
| బాజీరాయనిచరిత్ర ... | 1 | 4 |
| రఘువంశకథ ... | 0 | 8 |
| విక్రమార్కచరిత్ర, భా. రామమూర్తిశాస్త్రి ... | 1 | 4 |
| ఈసబునీతికథలు 2-వ భాగము ... | 0 | 12 |
| పంజాబుఅల్లరి ... | 0 | 8 |
| మర్యాదరామన్నకథలు ... | 0 | 3 |
| మైరావణచరిత్ర, చక్కనికూర్పు ... | 0 | 2 |
| అనంతసాగరము, బుక్కరాయసముద్రచరిత్ర ... | 1 | 0 |
| శకుంతల చరిత్ర ... | 0 | 8 |
| నల ,, ... | 0 | 8 |
| సావిత్రి ,, ... | 0 | 6 |
| హరిశ్చంద్ర ,, ... | 0 | 8 |

**సాక్షి, పానుగంటి లక్ష్మీనరసింహారావుగారిది:—**

| | | | | | |
|---|---|---|---|---|---|
| మొదటిభాగము | 3 | 0 | నాల్గవభాగము | 3 | 0 |
| రెండవభాగము | 2 | 8 | అయిదవభాగము | 2 | 0 |
| మూడవభాగము | 2 | 8 | ఆఱవభాగము | 2 | 8 |

## విశ్వభారతీ గ్రంథమాల ప్రచురణములు

| | | |
|---|---|---|
| కథాగుచ్ఛము III భాగము ప్రథమఖండము ... | 0 | 12 |
| ,, III ,, ద్వితీయఖండము ... | 0 | 12 |
| ,, IV ,, ... | 2 | 0 |
| పడవమునక 1, 2 భాగములు ... | 5 | 0 |
| ,, విడిగా 1 భాగము ... | 2 | 8 |
| ,, 2 భాగము ... | 2 | 8 |
| స్టైల్ మాండ్ మేజస్ట్రేటు ... | 1 | 0 |

గృహప్రవేశము - పోస్టాఫీసు - ఇంటా బయట - ప్రాయశ్చిత్తము అచ్చగుచున్నది.

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.